# వానమామలై వరదాచార్యుల వారి

# కృతులు - అనుశీలనము



కాకతీయ విశ్వవిద్యాలయము వారి
డాక్టరేటు పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము



## డా|| అందె వేంకటరాజము
ఎం.ఏ., పిహెచ్.డి.

ఆంధ్రోపన్యాసకుడు
ప్రభుత్వ డిగ్రీ కళాశాల కోరుట్ల

# VANAMAMALAI VARADACHARYULA WARI KRITULU – ANUSEELANAMU

(A Critical Study on Vanamamalai Varadacharya's Works)

By

Dr. ANDE VENKATA RAJAM, M.A., Ph.D.

Lecturer in Telugu, Govt. Degree College

Koratla - 505 326, Dist. Karimnagar A. P.

---

వానమామలై వరదాచార్యుల వారి కృతులు-అనుశీలనము

—డా॥ అందె వేంకటరాజము, ఎం.ఏ., పి.హెచ్.డి.

ప్రథమ ముద్రణము : వేయి ప్రతులు
ఫిబ్రవరి 1986



ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ఆర్థిక సహాయముతో ప్రకటితము

ప్రచురణ :

మహేశ్వరీ గ్రంథమండలి, కోరుట్ల

ప్రథమ కుసుమము

వెల రూ. 100/-

ముఖచిత్రాలంకృతి : శ్రీ అలిశెట్టి మహారాజు

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్

హైదర్‌గూడ, హైదరాబాదు

ప్రతులకు :

మహేశ్వరీ గ్రంథమండలి

2-3-11, మార్కండేయ మందిరము వద్ద

కోరుట్ల-505 326, జిల్లా : కరీంనగర్, ఆంధ్రప్రదేశ్

# సమర్పణము

సింగిరెడ్డి వంశపయ
స్సింధు పూర్ణకళానిధీ !
నారాయణరెడ్డి! మహో
న్నత కవితా కలిత సుధీ !

భాగ్యనగర మధ్యమ్మున
యోగ్యమగు వివేకనగర
మందు త్రివేణీ పావన
మందిరమున వరలు ఋషీ !

నిస్తుల ప్రతిభా తేజము
నిత్య సత్య చైతన్యము
నిరత కవిత్వోపాసన
విరాజిల్లు యోగీంద్రా !

సొగసైనది తను వంతకు
సొగసైనది పలుకు మిగుల
సొగసైనది మన సన్నిట
సొగసైనది భవత్కవిత.

ఉత్తమ విద్యా బోధన
ఉత్కృష్ట కవిత్వ రచన
ఉన్నత పరిపాలనమ్ము
ఉదాత్త వ్యక్తిత్వ మహో!

దివ్యకావ్య సృష్టి సలిపి
దిగంతాల యశము నిలిపి

పద్మశ్రీ కళాపూర్ణ
వరబిరుదము లందినారు.

ఆధునికాంధ్ర కవిత్వా మ
హాంభోధి మథించి మించి
సంప్రదాయ ప్రయోగముల
సారసుధలు పంచినారు.

శ్రవణపేయ గేయగతుల
సత్కావ్యమ్ములనె కాదు
క్రమ వచన కవిత మహా
కావ్యము వెలయించినారు.

నవ్యసాహితీ క్షేత్రము
నందనముగ తీర్చిదిద్ది
విశిష్ట కృతి కల్పకముల
విశ్వంభర వెలసినారు.

పోతన శ్రీనాథుల వడ
పోతగ జాల్వారు కవిత
రమణీయోజ్జ్వల వైదు
ష్యమునకు ప్రతి శశియు సవిత.

మానవతా వేదమ్మును
మమతాంచిత నాదమ్మును
మనోజ్ఞ గీతామృతముల
మహి వెదజల్లెను మహాత్మ!

నా సాహిత్యారామము
భాసురముగ వర్ధిల్లగ
కరుణా దోహదము నొసగి
గతియై పతియై యుంటిరి.

నా జీవన యాత్రలోన
నా నా విధముల దయతో
చేయూత నొసగి గమ్యము
చేరగ తోడై కంటిరి.

మాన్యులు మహనీయులు సా
మాన్యుడనగు నాపై కడు
వాత్సల్యామృత ధారలు
వర్షించుట నే ధన్యుడ.

ఒక్క మహాకవి కృతులను
చక్కగ అనుశీలించిన
గ్రంథము వేరొక్క మహా
కవి కొసగుట నా భాగ్యము.

గురువరేణ్య! మహాకవీ!
పరమభక్తి నర్పించెద
ఉపాయనముగా ఈ కృతి
కృపతో స్వీకరించుడి!

'పద్మశ్రీ' 'కళాప్రపూర్ణ'
ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డి
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
ఉపాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయము

హైదరాబాదు,
తేది : 13-2-1986

# స్వీకృతి

'మనసు వెన్న తనువు వెన్న మాట తీరు వెన్న' అని అన్నాను వరదన్న గురించి అప్పుడెప్పుడో. ఇది ఆయన వ్యక్తిత్వానికి కట్టిన అంచనా. మరి కవిగా ఆయన మందారగిరి. మాధురీఝరి. ప్రసాద గుణావధి. ప్రౌఢాక్షర నిధి.

'అభినవపోతన' బిరుదుకు సార్థకం ఆయన వ్యక్తిత్వం; కవితా మూర్తిత్వం'

పద్యవిద్యలో పారదర్శిగా వున్న ఆ కావ్యర్షి పాటలో కూడా అంచులు మీటడం ప్రశంసనీయం.

''అభినవ పోతన''కు అక్షర శిష్యుడు, ప్రౌఢసాహితీ మార్గప్రవర్తకుడు, మూర్తీభూత సౌజన్యుడు డా॥ అందె వెంకటరాజం ఆ మహాకవి రచనలపై సమగ్ర పరిశోధన చేసి డాక్టరేటు పట్టం అందుకున్నాడు.

ఆ పరిశోధన ఫలితార్థమే ఈ బృహత్ గ్రంథం. వెంకటరాజం అనుశీలన పరిశోధన ప్రవృత్తులకు తార్కాణ మిది.

చిరకాలంగా నన్ను అభిమానిస్తున్న డా॥ వెంకటరాజం ఈ గ్రంథాన్ని నాకు అంకితం చేస్తానన్నపుడు ఆర్ద్రహృదయంతో అంగీకరించాను. కారణం ? పరిశోధితులు, పరిశోధకులు ఇద్దరూ నా మనసు ముట్టిన వారే గనక. అందె అందించిన ఈ కృతికి ఇదే నా హార్దిక స్వీకృతి.

సి. నారాయణ రెడ్డి

కృతిస్వీకర్త



ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గారు,

ఎం.ఏ.,పిహెచ్.డి.,డి.లిట్,

ఉపాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయము

ఆచార్య డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి కాకతీయవిశ్వవిద్యాలయము,
ఎం.ఏ., పి హెచ్.డి వరంగల్
ఆంధ్రశాఖాధ్యక్షులు తేది : 8-2-1986

ఈ శతాబ్దం ఉత్తరార్థంలో మహాప్రబంధరచనా పాటవం గలిగిన విద్వత్కవులలో శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు మొదటి ఇద్దరు ముగ్గురులో ఒకరు. తెలుగులో అభినవ కవిత్వం పుట్టిన తరువాత పుట్టిన ఆచార్యులవారు ఉభయ తారకంగా అభినవ ప్రబంధ నిర్మాతయై దేశకాలముల ననుసరించి తమ యునికిని సార్థకం చేసుకొన్నారు. ఆయన పోతన చరిత్ర ముద్రణకెక్కి మార్కెట్టులోకి రాకముందు చాలా కాలం అది మౌఖిక ప్రచారంలో వుంది. అప్పటి నుండే వరదాచార్యుల వారికి అభినవ పోతన అని బిరుదు వచ్చింది. ఆ విధంగా ఆయన కవిత సుప్రతిష్ఠితమైంది. ఆ మహాకవి కృతులన్నింటిని గూర్చి శ్రీ అందె వెంకటరాజం గారు మా విశ్వవిద్యాలయంలో చేసిన పరిశోధన ఫలమే ఈ గ్రంథం. 1982 లోనే వెంకటరాజం గారికి పి హెచ్.డి. పట్టం లభించింది. వానమామలై వరదాచార్యుల వారి జీవిత విశేషాలను కృతులకు సంబంధించిన సమాచారమును అందించటంతో పాటు వెంకటరాజం గారు వరదాచార్యులవారి కవితా శక్తిని, కల్పనా పాటవమును వస్తు శిల్పమును, లోతులు తరచి సునిశితంగా పరిశీలించి ఈ గ్రంథం వ్రాశారు. ఈ పుస్తకంలో రస నిర్వహణమని ఒక ప్రకరణమున్నది. అది వెంకటరాజంగారి పోతన కావ్యము నందలి భక్తి శ్రద్ధలకును, అలంకార శాస్త్రమునందలి సమన్వయ ప్రావీణ్యమునకును నిదర్శనంగా వుంది. పోతన కావ్యమునందు శాంతము అంగి రసమని నిరూపించిన ఘట్టము నిజంగా చెప్పదగింది. పోతన కావ్య ప్రబంధమును వరదాచార్యుల వారి ఆత్మ చారిత్రక ప్రబంధముగా కూడా వెంకటరాజం గారు చూపించారు. వరదాచార్యుల వారి యందు వెంకటరాజం గారికి ఉన్న భక్తి తాత్పర్యముల కీ గ్రంథము సాక్షి భూతంగా వుంది. కవి ఋణం తీర్చటానికి వెంకటరాజం గారు చేసిన ప్రయత్నం అభినందింపదగింది.

కేతవరపు రామకోటిశాస్త్రి

ఆచార్య డా॥ మాదిరాజు రంగారావు

ఎమ్.ఏ., పిహెచ్.డి.

వరంగల్

తెలుగుశాఖ

కాకతీయ విశ్వవిద్యాలయము

తేది : 15-2-1988

ఈ పరిశోధనా సిద్ధాంత గ్రంథం మహాకవి వానమామలై వరదాచార్యుల వారి కృతుల పరిశీలనం. ఈనాడు ఎంతో వైవిధ్యంతో ప్రవర్తిల్లుతూ ఉన్న తెలుగు సాహిత్య ప్రపంచంలో ఒక మహా సంప్రదాయ పార్శ్వానికి చెందింది. ఆచార్యుల వారి కవిత్వం గురించి డా॥ అందె వేంకటరాజం చేసిన పరిశోధనా స్వరూపం ప్రధానంగా స్థూలమైన అవగాహనతోను సమయోచితంగా సూక్ష్మమైన వివేచనతోను రూపొందింది. పరిశోధకు డెన్నుకున్న క్షేత్రపరిధివల్ల ఈ హద్దులు తప్పని సరియైనవి. అక్కడక్కడ కవితో రచయితకుగల ఆత్మీయతవల్ల అనుబంధ బాంధుర్యంతో తాదాత్మ్య స్నిగ్ధంగా ఆవిష్కృతమైంది. ఒక దివ్యమైన లక్ష్యంతో ఉత్తమ సాధనా మార్గంలో ఒక తపనతో అన్వేషణతో ప్రయాణించిన ఈ మహాసాహితీ పథికుని కృతులపై వెలువడిన ఈ సమాలోచనా గ్రంథం సహృదయ లోకానికి సమాదరణీయ మౌతుందని భావిస్తున్నాను.

మాదిరాజు రంగారావు

ఆచార్య డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
ఎం. ఏ., పిహెచ్. డి.
ఆంధ్రశాఖాధ్యక్షులు
హైదరాబాదు విశ్వవిద్యాలయము

తేది : 20-2-86

# శుభాశంస

ఒక మహాకావ్యమును చదువుట యొక యెత్తు; ఒక మహాకవి జీవితమును పరిశీలించుట మఱియొక యెత్తు. కవి యొక్క భౌతిక జీవితము అతడు బ్రదికిన బ్రదుకు; అతడు సాహిత్యమునందు జీవించిన జీవితము అనుభవసారము; తర తరముల కందించెడి అమృతపూరము. భౌతికమైన కవిజీవితము అనుభవసారమయి కళాకృతి నందుటయే సాహిత్య సృష్టి. అట్టి సృష్టి ఆకవి వైయక్తిక జీవ చేతనను మాత్రమే కాక, అతని బ్రతుకున కందుబాటులో నున్న సామాజిక చేతనను కూడ సమన్వయించుకొని అక్షర జగత్తునందు ప్రవహించును. కవి రచించిన కృతి వ్యక్తిగత కళాభివ్యక్తిగా ఎంత భాసించునో, సమాజ వ్యక్తిత్వ సాత్త్విక ప్రతిఫలనాభి వ్యక్తిగా అంత రాణించును. అట్లగుటచే ఒక కవి రచించిన కృతులను అనుశీలించునెడ ఆ రచయితనే కాక ఆ రచయిత జీవించిన సామాజిక చైతన్య పరిధిని గూడ పరిశీలించుచుండుట గమనింపదగిన యంశము. ఒక రచయిత తాను జీవించిన సమకాలీన సమాజ ప్రవృత్తి కంతటికిని ప్రతినిధిగా సాహిత్యమునందు ప్రతిఫలింపక పోవచ్చును; కాని, అతడు దర్శించిన సామాజికానుభూతి మాత్రము కళాభివ్యక్తిగా అతని రచనలయందు కానవచ్చును. అందువలన ఒక కవి రచనలను గురించి పరిశోధించు గ్రంథములందు కవి తనయందు ప్రతిఫలించుకొనిన గతమును, వర్తమానమును, తాను భవిష్యత్తున కందించిన జీవితానుభవ ప్రతిపత్తిని వివేచించుట సహజము. మిత్రులు డా॥ అందె వేంకటరాజముగారు రచించిన 'వానమామలై వరదాచార్యులవారి కృతులు - అనుశీలనము' - అను సిద్ధాంత వ్యాసమునందట్టి విమర్శన విధానమును గాంచి సంతసించితిని.

వరదాచార్యులవారికి అత్యంత సన్నిహితులు శ్రీ అందె వేంకటరాజముగారు ఆచార్యులవారిని గురువుగాను, దైవతుల్యులుగాను భావించి భక్తి ప్రపత్తులను ఘండించుకొనినవారు. అట్టివారు ఆచార్యుల వారి సాహిత్యమును అభిమానమునకు

లోనుగాక నిర్లిప్తముగా విమర్శింపగలరా? యని యనుమానము కలుగుట సహజము భక్తి కలుగుచోట పారవశ్య మేర్పడును, పారాయణ ప్రవృత్తి ప్రబలును, సంకీర్తన భావము సమృద్ధ మగును అని యనుమానించుటకు వీలుకలదు. కాని, అందె వారు సిద్ధాంత గ్రంథమునం దనుసరించిన అనుశీలన విధానము నరసినచో వారికి భక్తియెంత కలదో నిగ్రహ శక్తి యంత కలదని స్పష్టమైనది. వరదాచార్యులవారి కృతులలోని గుణముల నెంత నిబ్బరముగా చెప్పినారో దోషములను కూడ నంతటి నిర్భయముగా చెప్పినారు అందెవారు సమత్వమునందు అందెవైచినచేయి అనిపించుకొనినారు.

డా॥ వేంకటరాజముగారు ఆచార్యులవారి కృతులను అనుశీలించుట తమ సిద్ధాంతవ్యాస ప్రవృత్తిగా నిర్ణయించుకొనినారు. అనుశీలించుట యనగా ఆయా కావ్య ప్రక్రియా శీలము ననుసరించి యేర్పడు విలువలను వివేచించుట, ఆయా ప్రక్రియ నాశ్రయించి కవి పఠిత కందింప దలచుకొనిన అనుభవ విశేషమును నిర్ణయించుట, దాని కాక కళాస్వరూపము నందించుటలో కవి ప్రదర్శించిన కళామార్గముల కౌశలములను నిరూపించుటకు ప్రమాణములను రూపొందించుట, వానిని సమన్వయించి కళాఖండమునకు కవి ప్రతిభ కల్పించిన రుచిగౌరవమును అనుభవైకవేద్యముగా, సప్రమాణముగా వివరించుట-అనెడి విమర్శ ప్రస్థానము. నిజమునకు విమర్శ వర్ణనము చేయగలదు; విశ్లేషణ మొనరింపగలదు; వివేచన గావించగలదు. సమన్వయము సాధింపగలదు; వీని నన్నింటిని సంఘటిత పరిచికొని అనుశీలనము చేయగలదు. విమర్శకుగల ఈ పంచలక్షణములను ప్రవచింప బూనెడి పద్ధతియే అనుశీలనము. డా॥ అందె వేంకటరాజము గారీ సిద్ధాంత వ్యాసమునం దీ పంచకోశ విశిష్టమైన విమర్శ ప్రస్థానమును సాగించినారు. అనుశీలనము పరిశోధనమా? అను ప్రశ్న సాహితీ జగత్తునందు లేకపోలేదు. అది విమర్శయగును గాని, పరిశోధనము కాదని కొందఱి మతము. అందు కొంత సత్యము లేకపోలేదు. సాహిత్యమునందు నిజమైన పరిశోధనమనగా సాహిత్య సిద్ధాంత దర్శనము దానిని ప్రతిపాదించు సిద్ధాంత గ్రంథము పరిశోధన నిబంధన మనబడునుకాని, ఆధునికులలో అనుశీలనాత్మకమైన విమర్శనమునుగూడా సాహితీ జగత్తునందు పరిశోధనముగా పరిగణించు పరిపాటి ప్రపంచ మంతటను వ్యాపించియున్నది. అనుశీలనలో సిద్ధాంతమును కావ్యార్థములకు సంవదించెడి ప్రవృత్తికిని కావ్యకళకు అనుభవ ప్రమాణములతో విలువ కట్టెడి పద్ధతికిని ప్రాచుర్యము కలదు. డా॥ అందె వేంకటరాజముగా రా పద్ధతిని ఈ సిద్ధాంత గ్రంథమునం దనుసరించి యొక విధముగా

విమర్శనమునకును, పరిశోధనమునకును సమన్వయ మార్గమును సాధించినారని చెప్పవచ్చును.

విమర్శ గ్రంథముల స్వభావములను వివేచించు నప్పుడు నాకు ప్రసిద్ధములైన అయిదు వైఖరులు గోచరించును. కొన్ని గ్రంథములు చదువునప్పుడు సముద్ర తరంగములు మనోగోచరము లగును. విమర్శకుని ప్రతిపాదనమునందు ఆతని ప్రతిభాజన్యములైన ప్రమాణముల నుండి ప్రసరించు యనుశీలనము పుంఖానుపుంఖముగా ప్రసరించు వైఖరియందు ప్రత్యక్షమగును. కొన్ని విమర్శలు చదువునప్పుడు జలపాతమును చూచిన యుత్సాహము కలుగును. అద్భుతమైన విమర్శకుని మేధ కావ్యార్థముల నన్వయించుటలో అపూర్వ పద్ధతులను వెలార్చు వైఖరి అందు గోచరమగును. కొన్ని విమర్శలు చదువునప్పుడు వర్షకాల జీవనదీ ప్రవాహ వేగము అనుభూయమానమగును. సమృద్ధములైన వ్యుత్పత్తి విశేషములచే కార్యకారణ సంబద్ధములైన కావ్య కథార్థములను విమర్శకుడు వివేచించెడి ఆలోచనధార అట్టి రచనలో పొంగిపొరలు చుండును. కొన్ని విమర్శ గ్రంథములను చదువునప్పుడు శరత్కాల జీవతరంగిణి జ్ఞాపకమువచ్చును. ఒడుదుడుకులు లేని ప్రసన్న భావము సముచితమైన వ్యుత్పత్తి గౌరవము కుంటువడని ప్రవాహ శీలము, విజ్ఞతతో కూడిన విశ్లేషణము, సాధువైన సమన్వయము, నాతి విపులమైన వ్యాఖ్యానము మొదలైన గుణము లీ విమర్శ వైఖరికి సహజ లక్షణములు. మరి కొన్ని విమర్శలు చదివినచో దిగుడు బావులలో జలకమాడినట్లు అనుభవము కలుగును. ఇవి సమీక్షాత్మకమైన రచనలు, డా॥ అందెవేంకటరాజముగారి రచనము శరత్కాల స్రోతస్విని; వారి విమర్శనము సహృదయ ప్రహ్లాదిని.

వానమామలై వరదాచార్యులవారి పేరు తలచుకొనిన చాలును వారి పోతన చరిత్రము మనోరంగమున ప్రత్యక్షమగును. ఆయనను తెలుగువారు 'అభినవ పోతన' యని మక్కువతో పిలుచుకొనెడి మమకారము హృదయమునకు మధురమైన యొక రుచిని అందించును. ఈ గ్రంథము చదివినచో వరదాచార్యుల వారు పోతన చరిత్రము వ్రాయుచు పడినపాట్లు మనకు తెలియును. భక్తి మార్గమున పయనించువానికి భగవంతుడెన్ని పరీక్షలు పెట్టునో భక్తవిజయము చదివి తెలిసికొనవలసిన పనిలేదు- వరదన్న జీవితము చదివినచో చాలును అని స్ఫురింపక మానదు. వాగీశ్వరీ మహామంత్ర మా మహితాత్ముని వాక్కున కదలించిన ద్రాక్షా

పాకమును, శ్రీరామ తారకమంత్ర మా పుణ్యాత్ముని చిత్తమున కల్పించిన రస మాధుర్యమును, క్షయవ్యాధి ఆ కవీంద్రుని శ్వాసకోశమును పట్టి పీడించిన రాక్షస వైఖరిని, మృత్యుంజయుడై కావ్యకళాపూర్ణత్వమును సాధించిన విజయయానమును వాగీశ్వరీదేవి తనను పీడిపోవుచున్నప్పుడా కవి గళము చేసిన విషాదగీతమును విని నచో వరదన్న ఒకపోతన్న, వరదన్న ఒక గోపన్న యనిపించును. వరదాచార్యుల జీవితచరిత్ర అందెవారి కలమునబడి ఒక సస్వరగీతిగా సాగినది. వరదాచార్యులవారి కృతులలో జాలువారిన ఆయన వ్యక్తిత్వము కలదు. దానిని మననము చేసికొనినకాని వారి కావ్యకళానుభూతి కరతలామలకము కాదు. కవి వ్యక్తిత్వము జీవిత మధనమునుండి తీసిన నవనీతము. దానిని తెలిసినకాని, ఆ కవి కావ్యజీవితములోని లోతులు తెలియవు. మాథ్యూఆర్నాల్డ్ అన్నట్లు– "Literature, the literary product is for me indistinguishable from the whole organization of the man. I can enjoy the work itself but I find it difficult to judge the work without taking into account the man himself"–అని మనముకూడ భావించెదము. డా॥ వేంకటరాజము గారు కవి జీవిత వృత్తమును మొదట వివరించుటయేకాక, కావ్యములలో ఆ జీవిత మెట్లు ప్రతిఫలించినదో, సమకాలీన సామాజిక పరిస్థితుల కా కవి యెట్లు స్పందించి తన కృతులలో స్రవించినాడో వివరించి ఆధునికమైన కవికాల కావ్య సమన్వయ విమర్శ పద్ధతులకు అనుశీలన మార్గములను చూపించినారు.

వరదాచార్యులవారి కృతులలో ప్రమాణములందును, పరిమాణమునందును పోతన చరితము గొప్పది. అది ఆతని కావ్యకళా సర్వస్వము; జీవనసార సర్వస్వము; శిల్పవైభవ సర్వస్వము. ఆ కవి రచించిన కృతులను అనుశీలించిన ఈ సిద్ధాంతవ్యాసము అయిదు ప్రకరణములుగా విభజింపబడిన, పదకొండు వందల పుటలు పైబడిన గ్రంథము. అందు పోతన చరిత్రమునకు రెండు ప్రకరణములు, ఏడు వందల యేబది పుటలకు పైబడిన గ్రంథభాగము వెచ్చింపబడినది. ఆ గ్రంథమునందలి కవితా విశేషములను వర్ణించు చతుర్థ ప్రకరణము అత్యంత విస్తృతమైనది, చాల విలువైనది. వరదాచార్యులవారి కృతులలో 'వైశాలిని' నాటకము కడురమ్యమైనది. 'అభినవకాళిదాస' బిరుదమును దెచ్చిన గొప్పరచన. శ్రవ్య దృశ్యకావ్య ప్రక్రియలలో ఇవి వరదాచార్యులవారిని సాహితీ క్షేత్రమునందు అమృతమూర్తిగా నిలుపగలిగినవి. ఆ గ్రంథములందలి విశేషములను తెలియు

టకు ఈ సిద్ధాంతవ్యాసము విజ్ఞానసర్వస్వము. మహాకావ్యములనుగురించి లోతైన పరిశోధన చేసిన వేంకట రాజముగారు కవిగారి లఘుకృతులను గురించియు తగినంత లక్ష్యముంచి అనుశీలనము గావించిరి. శాస్త్రబద్ధమైన పద్ధతి ముఖ్యముగాని కావ్యముయొక్క నికివి కాదు ముఖ్యము—అనునది అందె వారి ఆశయముగా కానవచ్చుచున్నది.

ఈ సిద్ధాంత వ్యాసరచనమునందు పాటించిన పరిశోధన ప్రమాణ నియమావళి, ప్రశంసింపదగినవి. మచ్చునకు కొన్ని యంశములు పేర్కొనుట అప్రస్తుతము కాదు.

1. ఎన్నుకొనిన అంశమునకు సంబంధించిన విషయములను, విశేషములను స్వల్పాంశములను సైతము విడువకుండ సేకరించుట.
2. సేకరించిన విషయములను విజ్ఞతతో వివేచించి, ఆ యా అధ్యాయములందు సముచిత ప్రదేశములలో సమన్వయించి సార్థక్యమును సాధించుట.
3. సాహిత్యమునకును, సమకాలీన సామాజిక పరిస్థితులకును గల పరస్పర ప్రభావమును సప్రమాణముగా నిరూపించుట.
4. కవి రచించిన కృతియందలి యే సాహిత్యాంశము నైనను వివరింపదలచి నపుడు, పూర్వకవు లాయా యంశములందు పాటించిన ప్రమాణములను, చేసిన ప్రయోగములను, సాధించిన విలువలను పేర్కొని తులనాత్మకముగా ననుశీలించుట.
5. ఆచార్యులవారి కవితావ్యక్తిత్వమును చిత్రించునప్పుడు సత్యనిష్ఠను ప్రకటించుట.
6. వరదాచార్యులవారి కృతులను సమీక్షించిన విమర్శకుల అభిప్రాయములను సేకరించి, ప్రామాణికములైన వానిని కావ్యానుశీలనములో విలువలను నిర్దేశించుటకు వినియోగించుకొనుట.
7. గుణములతో పాటు దోషములను సైతము నిర్భయముగా చెప్పుట.
8. ఫలితాంశము లన్నింటికి ప్రమాణములను చూపించుట.

ఇట్టివి పరిశోధనలో నుత్తమ ప్రమాణములను పాటించు రచనల కుండెడి లక్షణములు. అందె వారు అన్నింట నుత్తములు.

డా॥ అందె వేంకటరాజముగారు ఋజువర్తనులు, సాహితీ బంధువులు, పరిశ్రమశీలురు, మంచిని గౌరవించెడి మంచివారు, కళకు సహకార మందించెడి సహృదయులు, విశేషించి కవులు, విమర్శకులు, సాహిత్యసంస్థా నిర్వహణ దక్షులు. ఇన్ని గుణములతోపాటు ఈ సిద్ధాంత గ్రంథరచనముచే ఉత్తమ పరిశోధకులైనారు. వీరి గ్రంథము చదివినచో వరదాచార్యులవారిని గురించి తెలియదగిన యంశములలో నేదియు మిగులలేదను విశ్వాసము పఠితకు కలుగును. అది ఈ రచనయొక్క చారితార్థ్యము.

కవితలువ్రాసి ఆలోచనామృతమునందించు కళాపూర్ణుడు కవి. విమర్శలు వ్రాసి ఆలోచింపదగిన దెంతయో కలదని సూచించెడి జ్ఞానభాస్కరుడు పరిశోధకుడు. ఆ కవి 'అభినవపోతన' ఈ పరిశోధకుడు 'అభినవ మల్లన'! ఆయనకు అభివాదములు; ఈయనకు అభినందనలు!

జి. వి. సుబ్రహ్మణ్యం.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
ఎం.ఏ., పిహెచ్.డి.
రీడరు, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు
తేది : 12-2-86

# అభినందనం

సత్యగవేషణ పండితుని వ్యక్తిత్వానికి సమగ్రతను సమకూరుస్తుంది. అతని పాండిత్యానికి ప్రయోజనం చేకూరుస్తుంది. పాండిత్యమంటే చదివింది మాత్రమే తిరిగి చెప్పడం కాదు. ఉత్తమ వ్యక్తికి పాండిత్యం సాధనం మాత్రమే. ఇతరుల అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకుని పబ్బం గడుపుకోవడం పాండిత్యం అనిపించుకోదు. పాండిత్యం వివిధ రూపాల్లో-వివిధ దీధితులతో ప్రకాశిస్తుంది. అజ్ఞాన తిమిరాలను తరుముతుంది. ప్రకృతి రహస్యాలను అన్వేషించి నూత్న విష్కృతికి వీలుకల్పించడం పాండిత్యమే. ప్రతిభాస్వరూపాన్ని కట్టెదుట నిలబెట్టి సహృదయుని హృదయసీమలో కవికి స్థానం కల్పిస్తాడు. కవికీ, సహృదయునికీ మధ్య సుమసేతువుగా తన పాండిత్యాన్ని ప్రయోగిస్తాడు. శేముషీ సంపన్నమైన వ్యాఖ్యానం పాండిత్యమే. కావ్యతత్త్వ పరిశీలనం పాండిత్యమే. కవి కృతులను అనేక దృక్కోణాలతో సమీక్షించి, కవి విశిష్టతలనూ, ప్రత్యేకతలనూ, అపూర్వ కల్పనా సామర్థ్యాలనూ, పదప్రయోగ కౌశలాన్నీ, రసనిర్వహణ పద్ధతినీ, ఇతివృత్త కల్పననూ శాస్త్రీయ విధానాలతో పరిశోధించడం కూడా పాండిత్యమే. కవి సమగ్ర వ్యక్తిత్వాన్నీ, కావ్యం సమ్యగవగాహననూ, సమకాలిక సాహిత్య ప్రపంచం కవికి చెందవలసిన ప్రాముఖ్యాన్నీ విద్వల్లోకానికీ, పఠితృకదంబానికీ, తెలుపగలిగే ప్రక్రియ పరిశోధన ఒక్కటే.

పరిశోధన సత్యగవేషణా దృక్పథానికి ప్రతీక. నిరంతర పరిశ్రమకు ఫలితం. బహుగ్రంథ పఠనంవల్లనూ, ఆయా శాస్త్రాలలో నిష్ణాతులైన విద్వాంసులతో చర్చలవల్లనూ సేకరించిన సామగ్రిని తర్కసంగతంగా అమర్చుకోవడం

వల్లనూ, కవి బ్రతికిన దేశకాల పరిస్థితుల కనుగుణంగా కావ్యగతాంశాలను అన్వయించుకోవడంలోనూ, పరిశోధకుడు ప్రదర్శించే శ్రద్ధాసక్తులవల్ల ఇది సాధ్య మవుతుంది.

'అభినవ పోతన' బిరుదాంచితులు శ్రీ వానమామలై వరదాచార్యులవారి కృతులను గూర్చి విశేషించి, ఆయన వ్రాసిన 'పోతన చరిత్రము'ను గూర్చి మిత్రులు డా॥ అందె వేంకటరాజముగారు పరిశోధనచేసి, సిద్ధాంత వ్యాసాన్ని రచించి కాకతీయ విశ్వవిద్యాలయానికి సమర్పించి పి.హెచ్.డి. పట్టాను సంపాదించినారు. వేంకటరాజంగారు విద్వత్కవులు. అష్టావధాన కళాపారీణులు. సంస్కృతాంధ్ర భాషలలో చక్కని అభినివేశాన్ని గడించినవారు. హిందీ, ఇంగ్లీషు భాషలతో తగినంత పరిచయం ఉంది ఆయనకు. జ్యోతిర్వేదంలోనూ, వాస్తు శాస్త్రంలోనూ మంచి పాండిత్యం ఉన్నది. తాను రచయిత. అంతటితో తృప్తి పొందక కరీంనగర్ మండలంలో విశేషించి కోరుట్ల ప్రాంతంలో రచయితలనూ, కళాకారులను సమీకరిస్తూ, ప్రోత్సహిస్తూ సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తూ సహృదయ సమాజాన్ని విస్తృతపరచడంలో అహరహం కృషిచేస్తున్న ఉదార హృదయుడు. కవితాసంకలనాలను ప్రచురించి విజ్ఞుల మన్ననలను పొందినాడు. వానమామలై వరదాచార్యులీయనకు కవిత్వంపట్ల ఆసక్తిని కలిగించి మంచి కవిగా తీర్చిదిద్దినారు. మృదూక్తికి, మృదుస్వభావానికి మారుపేరు అందె వేంకటరాజం. ఆయనతో నాకున్న స్నేహమే నన్నీ నాలుగు మాటలు వ్రాసే అవకాశం కల్పించింది.

ఆచార్యులవారి ముద్రితాముద్రిత గ్రంథాల నన్నింటినీ సంపాదించి, ఆయనతో ప్రత్యక్షంగా చర్చించి, సాహితీవేత్తలూ, పత్రికల సమీక్షలూ ఆయన సాహితిని గూర్చి ప్రకటించిన అభిప్రాయాలను సమకూర్చుకొని, ఎనలేని వ్యయ ప్రయాసలకోర్చి ఈ పరిశోధనా వ్యాసంగాన్ని నిర్వహించి కృతకృత్యుడైనాడు వేంకటరాజము. ఈ పరిశోధనకు పూనుకున్నప్పటినుంచీ పలుమార్లు ఆయన తాను చేస్తున్న కృషిని గూర్చి ప్రస్తావిస్తూ ఉండేవాడు. నడుమ నడుమ ఆయనకు అనారోగ్యం అవరోధం కలిగిస్తూ ఉండేది. అయినా పరిశోధనాసక్తి, గురుభక్తి ఆయనను ముందుకు నడిపినవి. పరిశోధకులుగా ఉన్న ఆచార్య మాదిరాజు రంగా రావుగారి సముచిత సలహాలను పాటిస్తూ, స్వీయమైన ప్రతిభావైదుష్యాలను

ఉపయోగించుకుంటూ, ఆర్ద్రహృదయం ఉన్న కవిగా ఆచార్యులవారి కావ్య గంగలో మునకలులేస్తూ వేంకటరాజం సుదీర్ఘమైన సిద్ధాంత వ్యాసాన్ని రచించి సాఫల్యాన్ని సిద్ధింపజేసుకున్నారు.

ఈ సిద్ధాంతవ్యాసంలో తెలంగాణంలో విజృంభించిన జాతీయోద్యమం, ఒదిగి ఒదిగి పీచిన సాహితీవీచికలు ఈ వ్యాసంలో అనుభవానికి రావడం ఒక విశేషం.

ఆచార్యులవారి 'కవితాతత్త్వము' 'సాంప్రదాయికత-నవ్యత' అనే ప్రకరణాలలో వేంకటరాజంగారు తమ మౌలికతను విడమరచి చెప్పే అధ్యాపన లక్షణాన్నీ, పరిశీలనాదక్షతను ప్రదర్శించినారు.

మొత్తం వ్యాసంలో పాఠకులకు వేంకటరాజంగారు అవలంబించిన సులభమైన, స్పష్టమైన, చిన్నచిన్న వాక్యాల్లో శైలి ఆయన ఎంత సిద్ధహస్తుడైన అధ్యాపకుడో, ఆయన శిష్యుల భాగధేయ మెంతటిదో తెలుపగలుగుతున్నది.

ఆచార్యులవారనేక ప్రక్రియల్లో సాహిత్యసృష్టి చేసిన ప్రజ్ఞామూర్తులు. ఆయన ప్రక్రియలను గూర్చి విశ్లేషిస్తున్నప్పుడు వేంకటరాజంగారు సాహిత్య శాస్త్రానికి సంబంధించి ఎన్నో గహనమైన విషయాలను చాలా సరళంగా వివరించడానికి ప్రయత్నించి పండితుల ప్రశంసలకూ, విద్యార్థుల కృతజ్ఞతలకూ పాత్రులు కాగలిగినారు.

ఆచార్యులవారి ఖండకావ్యాల్లో అభివర్ణితులైన స్వాతంత్ర్య సమరయోధులు, వాఙ్మయ మహోద్యమాధినేతలు ఎందరో! కవితా ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తున్న సందర్భంలో ఆ మహానాయకులను శ్లాఘించిన కవితలనే ఉదాహరణాలుగా ఏరుకోవడంలో వేంకటరాజంగారు తమ గుండెలో పదిలపరచుకున్న దేశహితానురక్తిని భంగ్యంతరంగా ప్రకటించుకున్నారు.

వానమామలై వరదాచార్యులు ఎంత సాహితీసుగతులో అంత సౌహిత్తీ మహితులు. పూర్వకవుల నారాధించి, 'వర్తమాన కవులకు శుభంబుపలికి' భావి కవులను సంభావించిన బమ్మెరపోతన్న వలెనే వరదన్న నిన్నటి, నేటి, రేపటి

కవులకు ప్రీతిపాత్రులు. ఆయన అనేక శాస్త్రాలలో పాండిత్యం సంపాదించినవారు. సంస్కృతాంధ్ర హిందీ మరాఠీ భాషలలో నిష్ణాతులు. జీవితంలో చాలాకాలం నిరామయంగా ఉండలేకపోయినా, ఆరోగ్యప్రదమైన భరతావని అవతరణంకోసం, ఆరోగ్యకరమైన సాహిత్య సంస్కృతులకోసం నిరంతరం కళాతపస్సు చేసిన ధన్య జీవులు. దైవభక్తి, దేశభక్తి, సంస్కరణాభిలాష, వీనులకు విందుచేసే పద సంయోజనం, మనస్సును ఆకట్టుకునే అర్థప్రతిపాదనం, రమణీయ కల్పన ఆయన కవితాలక్షణాలు,

నాకు పూజనీయులు, ఆత్మీయులూ అయిన వరదాచార్యులవారి కృతులను గూర్చి పరిశోధన చేసిన వేంకటరాజంగారికి నా అభినందన పరంపరలు. అంతటి సత్కవిని గూర్చిన పరామర్శ శతధా అదర్శపాత్రం. సత్కవులను గూర్చి పరిశోధన నిరంతరంగా సాగడమే సజీవసంస్కృతికి నిదర్శనం.

ఇరివెంటి కృష్ణమూర్తి

# ప్రస్తావన

ఇది శ్రీవానమామలై వరదాచార్యుల వారి కృతులపై పి. హెచ్.డి. పట్టము కొరకు కాకతీయ విశ్వ విద్యాలయమునకు సమర్పించిన పరిశోధన గ్రంథము. ఈ విషయము 1973 లో ఉస్మానియా విశ్వ విద్యాలయములో రిజిస్టరు చేయించుకొని 1974 జనవరిలో డా॥ మాది రాజు రంగారావుగారి పర్యవేక్షణలో పరిశోధన కృషి కుపక్రమించితిని. కాల క్రమమున వరంగలు స్నాతకోత్తర విద్యా కేంద్రము కాకతీయ విశ్వవిద్యాలయముగా రూపొందినపుడు నా పరిశోధన వ్యవహారమును ఉస్మానియా నుండి కాకతీయకు మార్చిరి. పరిశోధింప వలసిన గ్రంథములనేకముగా నుండుట వల్లను, పోతన చరిత్ర మహాకావ్య పరిశీలనమున కధిక కాలము పట్టినందువల్లను ఐదు సంవత్సరాల వ్యవధిలో పూర్తి చేయలేక ఎనిమిదేండ్లకు 1982 లో సమర్పించ గలిగితిని.

మద్గురుదేవులు మహాకవి 'అభినవపోతన' శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారి పోతన చరిత్రముపై పరిశోధన చేయవలెనను తలంపు నాకు చిరకాలము నుండి యుండెను. ఈ విషయము అప్పటి ఉస్మానియా విశ్వ విద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు పూజ్య గురుపాదులు ఆచార్య బిరుదురాజు రామరాజుగారికి విన్నవింపగా వారు దయతో ఆచార్యుల వారి మొత్తము కృతులపై పరిశోధన చేయుమని ఆదేశించి ఆశీర్వదించి అనుమతి ఇప్పించిరి.

ఇది 'వానమామలై వరదాచార్యుల వారి కృతులు - అనుశీలనము' అన్న శీర్షికతో రచింపబడినను ఇందు ఆచార్యుల వారి గ్రంథము లన్నియు చర్చింపబడలేదు. పరిశోధనకు ప్రవేశము పొందిన నాటికి ముద్రితములై యున్న కృతులు మణిమాల, ఆహ్వానము, జయధ్వజము, పోతన చరిత్రము, విప్రలబ్ధయను ఐదు మాత్రమే గ్రహింపబడినవి. ఈ ఐదిటిలోను ఆచార్యులవారి జీవితకృతియగు పోతన చరిత్ర మహాకావ్యము పరిశీలనము ప్రధానమై గ్రంథమున ముప్పాతిక భాగ మావరించినది.

ఐదు ప్రకరణములుగా రచింపబడిన యీ గ్రంథమున ప్రథమ ప్రకరణములో ఆచార్యుల వారి జీవిత సంగ్రహము - వ్యక్తిత్వము, వారి ముద్రితాముద్రిత కృతుల సంక్షిప్త పరిచయముల్లేఖింపబడినది. ద్వితీయ ప్రకరణములో వారి ఖండ కావ్య సంపుటములగు మణిమాల, ఆహ్వానము, జయధ్వజము - అనువానిపై చర్చ జరిగి అందలి వస్తు భావరచనల వైశిష్ట్యము ప్రదర్శింపబడినది. ఈ రచనలలో ప్రధానముగా ప్రతిబింబించు జీవకారుణ్యము, మానవతా వాదము, ధర్మచింత, సమాజోద్ధరణకాంక్ష, దేశభక్తి, జాతీయత నిరూపింపబడినవి మరియు 'జయ ధ్వజము' ఉత్తమ జాతీయ కావ్యముగా అనుశీలింపబడినది. తృతీయ చతుర్థ ప్రకరణములు పోతన చరిత్రమున కుద్దిష్టమైనవి. తృతీయ ప్రకరణమున మహాకావ్యముగా ఉత్తమ ప్రబంధముగా ఒక ఆంధ్ర మహాకవి జీవిత చరిత్రమును చిత్రించిన ప్రథమ మహాకావ్యముగా, సదాశయముతో సమకాలీన సమంజసేతివృత్తముతో వెలయింపబడిన కృతి రత్నముగా పోతన చరిత్రము విశిష్టత వెల్లడి చేయబడినది. చతుర్థ ప్రకరణము పదునెనిమిది వ్యాసములతో సుదీర్ఘమై మకుటాయమానమై యున్నది. ఇందు పోతన చరిత్రములోని కావ్యాంగములగు వస్తువు, రసము, పాత్రలు, వర్ణనలు మున్నగు సర్వ విషయములు సవివరముగా చర్చింపబడి వానిలోని యంద చందములను ఔదాత్త్యమును, ఉజ్జ్వలమైన ఉత్కృష్టమైన కవితా వైభవమును పరిశీలించుట జరిగి పురాతనాధునాతన సత్కావ్య సౌందర్యముల నెల్ల ప్రతిఫలింప జేయుచు సాంప్రదాయికతా నవ్యతా సమన్వయ శోభావిరాజితమై, పోతనగారి మహోన్నత గుణశీలములను దివ్యముగా తేజరిల్లజేయుచు ఆనందోప దేశములను సమముగా ప్రసాదించుచున్న తన్మహా కావ్యప్రాశస్త్యము నిరూపింప బడినది. ఐదవ ప్రకరణములో గేయకావ్యమగు విప్రలబ్ధ అనుశీలింపబడినది. అది అచ్చమైన దేశికావ్యమై పల్లీయ ప్రకృతి వర్ణనకు కర్షక జీవన చిత్రణమునకు, స్వచ్ఛంద ప్రణయకలిత శృంగార పోషణకు, మత సామరస్య మానవతా ప్రబోధమునకు నిధానమైన దాని విశిష్టత విశదీకరింపబడినది.

ఈ గ్రంథ రచన నెప్పటికప్పుడు పరిశీలించుచు అమూల్యాభిప్రాయము లొసగి చక్కని మార్గదర్శనము చేసి వెన్నుదట్టి నడిపించిన పూజ్యులు డా॥ మాపిరాజు రంగారావుగారికి కృతజ్ఞతాభివందనములు. అనేక సందర్భములలో సంశయనివృత్తి చేసి సదుపదేశాత్మకమైన వాత్సల్యామృతము వర్షించి ఈ పరి శోధన కృషి ఫలవంతమగునట్లు చేసిన గురుదేవులు శ్రీ వరదాచార్యుల వారికి నమోవాకములు.

పరిశోధన గ్రంథ రచనకు దయతో అనుమతించి ప్రోత్సహించిన ఉస్మానియా కాకతీయ విశ్వవిద్యాలయముల వారికి, గురుపాదులు ఆచార్య బి. రామరాజు గారికి గురువర్యులు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారికి అప్పటి ఉస్మానియా డీన్ ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారికి, అప్పటి తెలుగు రీడరు గురుపాదులు డా॥ పల్లా దుర్గయ్యగారికి, కాకతీయ విశ్వవిద్యాలయము డీన్ ఆచార్య బి. కేశవరావుగారికి, ఆంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య డా॥ కేతపరపు రామకోటి శాస్త్రిగారికి, పూర్వపు డీనులు ఆంగ్ల శాఖాధ్యక్షులు ఆచార్య డా॥ సత్యనారాయణ సింగుగారికి, ఆంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ గారికి, ఆచార్య ఎస్. లక్ష్మణమూర్తిగారికి కృతజ్ఞతాభివందనములు. పరిశోధన కృషికి అమూల్యాభిప్రాయము లొసగుచు ప్రోత్సహించిన గురువరేణ్యులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి, మాన్యులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతాంజలులు. ఈ సిద్ధాంత గ్రంథ రచనలో ఉపయుక్తములయిన గ్రంథముల రచయితలకు కృతజ్ఞతా నమోవాకములు.

ఈ పరిశోధన కృషిలో మొదటి నుండి తుదివరకు బాసటగా నిల్చి శుద్ధ ప్రతులు సిద్ధము చేయుటలో విశేషముగా శ్రమించిన ఆత్మీయులు సుకవి వర్యులు శ్రీశ్రీ గాదె శంకరకవి గారికి, అనేక విధముల అండగా నిల్చిన కవిమిత్రులు శ్రీ వొటారికారి చిన్నరాజన్న గారికి, శ్రీ బైరి నరసయ్యగారికి, విశ్వవిద్యాలయమునకు సమర్పించుటకు వ్రాతప్రతి సిద్ధము చేయుటలో పరిశ్రమించిన మిత్రులు శ్రీయుతులు రుద్ర భూమయ్య, ఎక్కలదేవి సత్యయ్య, మచ్చ ఈశ్వరయ్య ప్రభృతులకు కృతజ్ఞతలు.

గ్రంథరచనాకాలములో కాకతీయలో దయతో ఆదరించి ప్రోత్సహించిన పూర్వపు ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ జాఫర్ నిజాంగారికి, ప్రస్తుత ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ టి వాసుదేవుగారికి మరియు పట్టమునకు గ్రంథప్రతులు సమర్పించుటలో మిక్కిలి సహకరించిన పరీక్షల కంట్రోలరు డా॥ పి. వెంకటరెడ్డిగారికి, మిత్రులు రీడరు డా॥ వి. లక్ష్మీపతిగారికి కృతజ్ఞతలు.

పరిశోధన గ్రంథము పట్టమునకు యోగ్యమైనదని దయతో నిర్ణయించిన పరీక్షకులు ఆచార్య బి రామరాజుగారికి, డా॥ కె. గోపాలకృష్ణరావు గారికి, పట్టప్రదానముతోపాటు సాహిత్య లోకమున కందించుటకు గ్రంథప్రచురణకనుమతి నొసగిన కాకతీయ విశ్వవిద్యాలయము వారికి నమస్సులు.

ఈ గ్రంథమును గురువరేణ్యులు మహాకవి మూర్ధన్యులు ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి భక్తితో అంకితము చేసితిని. నా అభ్యర్థన మన్నించి దయతో స్వీకరించిన రెడ్డిగారికి కృతజ్ఞతాభివందనములు.

గ్రంథమునకు దయతో అమూల్యాభిప్రాయము లొసగి ఆశీర్వదించిన పూజ్యులు ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగారికి, ఆచార్య మాదిరాజు రంగా రావుగారికి, ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యంగారికి, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి కృతజ్ఞతాంజలులు.

ఈ గ్రంథ ప్రచురణమునకు దయతో పరమ సహృదయతతో ద్రవ్య సహాయము చేసిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల సంచాలకులు గారికి, తదితర సంస్థలకు దాతలకు, ద్రవ్యసహాయము చేయించిన పుణ్యమూర్తు లకు హార్దిక కృతజ్ఞతానమోవాకములు.

గ్రంథ ముద్రణ విషయము దయతో సంపూర్ణ భారము వహించి విజయ వంతముగా నిర్వహించిన మిత్రులు తెలుగు విశ్వవిద్యాలయ సాహిత్య విభాగము మేనేజర్లు శ్రీ పాండురంగయ్యగారికి, శ్రీ మామిడి దేవేందరుగారికి నితాంత కృత జ్ఞతలు. గ్రంథమును చక్కగా సకాలమున ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్టు ప్రింటర్సు యజమాని శ్రీ శ్రీనివాసుగారికి, ప్రూఫులు చక్కగా దిద్దిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారికి కృతజ్ఞతలు. గ్రంథ ముఖచిత్రమును ముద్దుగా అలంకరించిన ప్రముఖ చిత్రకారులు ఆత్మీయులు శ్రీ అలిశెట్టి మహారాజు జగిత్యాలగారికి నమస్సులు.

గ్రంథ ముద్రణ కాలములో బహువిధముల సహకరించిన నా మేనల్లుడు శ్రీ మిట్టపల్లి లింబగిరి, మెట్టుపల్లి ఖాది ప్రతిష్ఠాన వస్త్రాగారము (హైద్రాబాదు) మేనేజరుగారికి కృతజ్ఞతలు.

యథాశక్తి యథావకాశము ఆచార్యులవారి కృతులను పరిశోధించి గ్రంథము రచించుటకు కృషి చేసితిని. సహృదయ విద్వద్వరేణ్యులగు పెద్దల ఆమోదము వడసినచో నా కృషి చరితార్థమైనదని భావింతును.

కోరుట్ల
25-2-1986

ఇట్లు
విధేయుడు
అందె వేంకటరాజము

# మహేశ్వరీ గ్రంథమండలి
# ప్రకాశక విజ్ఞప్తి

సహృదయ సాహితీ బంధువులారా !

విన్నవించున దేమనగా నేను 33 సంవత్సరముల నుండి యథాశక్తి గ్రంథ రచన సాహిత్యసేవ చేయుచున్నాను. గురువరేణ్యులైన "అభినవ పోతన" డా॥ వానమామలై వరదాచార్యులవారి, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయో పాధ్యక్షులు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి వంటి మహాకవి శిరోమణుల శిక్షణలో కవితాభ్యాసముచేసి ఇంతవరకు నవోదయము, మణిమంజూష, భువన విజయము, భారతరాణి అను కృతులను రచించి ప్రచురించి యుంటిని, ఇందు నవోదయము 1961 లో దాతల ద్రవ్యసహాయమున ప్రచురించి తర్వాతి మూడు గ్రంథములు 1971 లో "కావ్యముద్రణ సమితి" అని ఆత్మీయులగు సహృదయు లతో ఒక సంస్థ ఏర్పరచి తద్వారా లాటరీ నిర్వహించి ఆ ద్రవ్యముతో ముద్రిం చితిని. కష్ట నిష్ఠురముల గతానుభవమును దృష్టియందుంచుకొని స్వీయరచనల ప్రచురణార్థ మొక సుస్థిరమైన వ్యవస్థ నభిలషించి తేది : 5-4-1985 న 'మహేశ్వరీ గ్రంథమండలి' స్థాపించితిని.

గ్రంథమండలి ప్రథమ కుసుమముగా ఈ పరిశోధనగ్రంథము ప్రచురింప బూనితిని సుమారు 50 వేల రూపాయల అంచనా వేయబడినది. వాగీశ్వరీ సమా రాధన తత్పరుడనైన నేను ఆర్థికముగా అశక్తుడనగుటచేత సంస్థలనుండి దాతల నుండి విరాళములు సేకరించుట కుద్యమించితిని. ఒక సంవత్సరకాలము సాగిన ఈ మహాకార్యము గురించి వివరించిన ఒక గ్రంథమగును ఐనను ప్రస్తుతాంశముగా సంగ్రహముగా మనవి చేయుదును. గ్రంథము ముద్రణకు ద్రవ్య సహాయము నర్థించగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖా సంచాలకులు గారు ఐదువేల రూపాయలు దయతో మంజూరుచేసినది ముద్రణకు నాంది యయ్యెను.

ప్రప్రథమమున విషయము విన్నవించగనే అభినందించి ఆత్మీయులు సుకవివర్యులు శ్రీ గజెల్లి శివరాజము ఊటుపల్లిగారు శుభహస్తముతో విరాళమిచ్చిరి. పిమ్మట మిత్రులు భారతీయ తెలుగు ప్రజాసమితి అధ్యక్షులు శ్రీ మానాల గంగారాముగారు పరమ సహృదయతతో బొంబాయి కాహ్వానించి సన్మానసభ ఏర్పాటు చేసి భూరి విరాళమిచ్చి రు 2500/- ద్రవ్య మిప్పించిరి. వారికి తోడుగా మిత్రులు శ్రీ జాస పురుషోత్తముగారు కృషిచేసిరి. ఆ పిదప కోరుట్లలో అప్పులు శ్రీయుతులు రేగుంట సాయన్న రుద్రభూమన్న వుశకోల శంకరయ్య అల్లె వెంకట రాజము, పోతని భూమయ్య, ఎక్కలదేవి సాయన్న, భీమనాతి గంగారాము, వాసం భూమానందము, కడకుంట్ల గంగారాము, తిరుమల రాజగంగారాము, రుద్ర మాణిక్యముగారు, రుద్ర మాణిక్యముగారి భూమయ్యగారలు విరాళము లిచ్చి కోరుట్లలో తదితర ప్రాంతములలో ఇప్పించిరి. కోరుట్ల చేనేత సహకార సంఘము వారు దయతో వేయిపదారులిచ్చిరి. ఒకానొక విషాదదశలో నన్నూరడించి ధైర్యము చెప్పి పూనుకొని కోరుట్లలో చందాలిప్పించిన ఎక్కలదేవి సాయన్నను రేగుంట సాయన్నను మరువలేను.

మెట్టుపల్లిలో మాజీ శాసనసభ్యులు మార్కండేయ దేవస్థానము కమిటి అధ్యక్షులు మహాకార్యదక్షులు శ్రీ గంగుల భూమయ్యగారు దయతో ఏడువేల రూపాయల భూరిద్రవ్య మిప్పించి గ్రంథముద్రణ తప్పక నెరవేరునన్న ధైర్యము విశ్వాసము కలిగించిరి. మెట్టుపల్లి ఖాది గ్రామోద్యోగ ప్రతిష్ఠానమువారు దయతో మూడువేల ద్రవ్యమిచ్చిరి. దీనిని మంజూరు చేసినవారు సదస్యమంత్రి మాజీ శాసనసభ్యులు శ్రీ సిహెచ్. విజయరంగారావుగారు. ప్రోత్సహించినవారు సంస్థ ఉపాధ్యక్షులు శ్రీ డి. హనుమంతరావుగారు. ఈ విషయము సహకరించినవారు శ్రీ నారాయణ మేనేజరుగారు.

కరీంనగర్ జిల్లా పౌరసరఫరాల అధికారిగా ఉండిన శ్రీ పనకంటి వామన రావుగారు దయతో పలువురు దాతలనుండి సేకరించి 2320/- రూపాయలిచ్చిరి. మరియు కరీంనగరులో యువనాయకులు శ్రీ స్వర్గం మల్లేశముగారు వేయి రూపాయలిప్పించిరి శ్రీ కల్లెడ సోమయ్యగారు తోడ్పడిరి. పెద్దపల్లిలో శ్రీ గంట నారాయణ న్యాయవాదులు శ్రీ సి. వి. జయవీరరాజు ఆంధ్రోపన్యాసకులుగారలు విరాళములిప్పించిరి. శ్రీ రుద్రమాణిక్యంగారు తోడ్పడిరి. మాన్యులు సహృదయ

వరేణ్యులగు శ్రీ చిట్నేని విద్యాసాగరరావుగారు తమ కల్లూరు గ్రామములో వేయి రూపాయలిప్పించిరి. వావిలాల ఖాదీ గ్రామోద్యోగ ప్రతిష్ఠానమునుండి సదన్య మంత్రి మాన్యశ్రీ లక్ష్మీకాంతరావుగారు వేయి రూపాయలు మంజూరుచేసిరి. ఈ విషయము మేనేజరు శ్రీ రాజయ్యగారు సహకరించిరి.

బోధన్‌లో ప్రభుత్వ న్యాయవాదులు సమాజ సేవా పరాయణులు, నా పూర్వ విద్యార్థి శ్రీ సేర్ల పండరిగారు భూరివిరాళ మిచ్చుటయేకాక బోధన్ బాన్సువాడ తాలూకాలలో ఆరువేల రూపాయ లిప్పించిరి. వారికితోడుగా ఉండి ఆత్మీయులు సుకవి సుధాకరులు శ్రీ మామిండ్ల రామగౌడుగారు మిక్కిలి కృషి చేసిరి.

నిజామాబాదులో మాజీ శాసన సభ్యులు శ్రీ కదకుంట్ల గంగారాముగారు ఒకమారు, శ్రీ బోగ గంగారాము చౌటిపల్లి గారొకమారు భూరివిరాళము లిప్పించిరి. ఈ విషయము శ్రీయుతులు ఆల్లె వెంకటరాజము, పోతని భూమయ్య, డా॥ కోట దేవేందర్‌గారలు సహకరించిరి.

కమ్మరిపల్లిలో పూర్వ విద్యార్థి సహృదయలలాముడు శ్రీ జొన్నల చిన్న భూమన్న సేటు, మేడిపల్లి పదమరలో మిత్రులు సుకవివర్యులు నటశేఖరులు శ్రీ సుద్దాల అశోకుగారు, మెట్పల్లిలో తదితర గ్రామాలలో మిత్రులు, కవితాగానాభి నయ విశారదులు శ్రీ డి. వి. మురళీమోహనాచార్యులు గారు, మిత్రులు సహృదయ కవివర్యులు శ్రీ వాసాల శౌరిగారు మిక్కిలి తోడ్పడిరి. ఆత్మకూరులో శ్రీ గంగుల లక్ష్మయ్యగారు, శ్రీ ఆయిటి గంగాధర్ సర్పంచ్ జెగ్గాసాగర్‌గారు సహకరించిరి.

పూనా కార్పొరేషన్ మాజీ డిప్యూటి మేయరు, అఖిల భారత పద్మశాలి ధర్మశాల పండరిపురము అధ్యక్షులు మా బావగారు శ్రీ మిట్టపల్లి మల్లయ్యగారు భూరిద్రవ్య మిచ్చుటయేకాక పూనాలో, సోలాపురములో విరాళము లిప్పించిరి. ఈ విషయము సోలాపురములో శ్రీ బేతి గోపాలరావుగారు, శ్రీ దేవులపల్లి పెంటయ్యగారు శ్రీ మద్దదత్తారాంగారు తోడ్పడిరి.

ఇంకను కోరుట్ల పరిసర గ్రామాలలో పూర్వ విద్యార్థులు శ్రీయుతులు మఠ్జి శంకరయ్య, కవివర్యులు పోతవేని గంగారాము, ఆర్. భూమయ్య, చిలుక

మజ్జి జనార్దన్‌గారలు విరాళములు సేకరించి తోడ్పడిరి. ఇంకను స్వహస్త పర హస్తములతో ద్రవ్యసహాయ మొనర్చిన సహృదయు లెందరో కలరు.

గ్రంథ ముద్రణార్థము సహాయ మర్థించగా కొందరు మెచ్చక ఆదరించక పోయినను అనేకులు దయతో సహృదయతతో అభినందించి సహకార మందించి నారు. ఇంతకు శక్తికి మించిన ఈ మహాకార్యము శ్రీసర్వమంగళాదేవీ కటాక్షము, గురువర్యులు శ్రీ వరదాచార్యులవారి ఆశీర్బలము, ఆచార్య సి. నారాయణ రెడ్డిగారి ఆశీర్వాదానుగ్రహములు, పెద్దల మిత్రుల ఆదరాభిమానములు, పుణ్య పురుషులైన దాతల సహకారము తోడై విఘ్న పరంపరల నధిగమించి విజయ వంతమైనది.

గ్రంథమండలికి సేకరించిన ఈ ద్రవ్యము ఈ గ్రంథ ముద్రణకు సరి పోగా కొంత మిగిలియున్నది. అట్టి ద్రవ్యమును అచిర భవిష్యత్తులోనే ప్రచు రించనున్న మూడు గ్రంథములకు సద్వినియోగము చేయగలనని మనవి చేయు చున్నాను.

నాయందు దయదలచి ద్రవ్య మిచ్చి ఇప్పించి ప్రోత్సహించి సహకరించిన సహృదయవరేణ్యు లందరికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాను.

ఇట్లు

కోరుట్ల
25-2-1986

అందె వేంకటరాజము
వ్యవస్థాపకుడు
మహేశ్వరీ గ్రంథ మండలి.

# రచయిత పరిచయము

## డా॥ అందె వేంకటరాజము

జననము : క్రీ.శ. 1933 - శ్రీముఖ - ఆశ్వయుజము

జన్మ స్థలము : కోరుట్ల, కరీంనగరము జిల్లా

జననీ జనకులు : శ్రీమతి భూదేవి, శ్రీ లింబయ్య

విద్యార్హతలు : ఎం. ఏ., పి. హెచ్. డి.

ఉద్యోగము : తెలుగు లెక్చరరు
ప్రభుత్వ డిగ్రీ కళాశాల కోరుట్ల

రచనలు : ముద్రితములు :
నవోదయము (ఖండకావ్య సంపుటి)
మణిమంజూష ,,
భారత రాణి (నాటికల సంపుటి)
భువన విజయము (నాటిక)
వానమామలై వరదాచార్యుల వారి
కృతులు - అనుశీలనము (సిద్ధాంత గ్రంథము)

అముద్రితములు :
మాధవ వర్మ (నాటకము)
కవితా సంపుటి
అవధాన కవితా మంజరి
ఈశ్వర శతకము
కళా తపస్విని (కావ్యము)
దేశభక్తి (నాటకము)
వ్యాసావళి
భజన గీతములు

అభిమాన కవులు : నన్నయ, పోతన, పెద్దన, చేమకూర వేంకటకవి, శ్రీ వానమామలై వరదాచార్యులు, ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డి, దాశరథి, జాషువా

అభిరుచులు : కవితా రచన, సాహిత్య పఠనము, వేదాంతము

బిరుదములు : మధురకవి, కవిసుధాకర, కవిశిరోమణి, అవధానయువకేసరి.

ఇతరాంశములు : అష్టావధాని, గృహవాస్తు విద్యా విశారదుడు, భారతీ సాహిత్య సమితి అధ్యక్షుడు, మహేశ్వరీ గ్రంథ మండలి వ్యవస్థాపకుడు

# విషయానుక్రమణిక

# శ్రీ వానమామలై వరదాచార్యుల వారి జీవిత సంగ్రహము–వ్యక్తిత్వము

## ప్రవేశిక :

శ్రీ వానమామలై వరదాచార్యులవారి కృతుల అనుశీలనము కావింప బూనిన యీ సందర్భమున వారి జీవిత విశేషములను వ్యక్తిత్వమును ముందుగా తెలిసికొనుట యుక్తము. ఒక సుకవి కావ్యములను చదివి యందలి యుదాత్త కవిత్వామృత రసాస్వాదనము చేయునెడ తత్కవివరేణ్యుని జీవిత విశేషములను తెలియ కుతూహలము కలుగుట సహజము. మరియు కృతులను పరిశీలించుటలో ఆ కవి జీవితము, అతని వ్యక్తిత్వము తోడ్పడగలవు. ఆ కృతులపై అతని వ్యక్తిత్వము, సంస్కారము ప్రభావము చూపుననుటలో విప్రతిపత్తి యుండదు. కవిచిత్తవృత్తి ననుసరించి కావ్యనిర్వహణము రసపోషణము జరుగును. ఆనందవర్ధనుడు

> "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
> యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే...."[1]

అని వచించినది యథార్థము.

కవుల జీవిత విశేషము లెరుగుటకు వారు కావ్యావతారికలలో, ఆశ్వాసాంత గద్యములలో తమ్మగూర్చి చెప్పికొన్న విషయము లుపకరించును. మరియు వారినిగూర్చి సమకాలికులు తదనంతర కవిపండితులు ప్రస్తుతించిన అంశములును తోడ్పడును. ఇట్టియెడ వర్తమాన కవులగు వరదాచార్యులవారి జీవిత విశేషాదులు తమ కావ్యావతారికలో తెలుసుకొన్న యంశములచేతనే కాక

1. ధ్వన్యాలోకవృత్తి : 497

సమకాలిక కవిపండిత ప్రస్తావన ప్రశంసలవల్లను వారితో సన్నిహిత పరిచయ మువల్లను తెలియు నవకాశము కలదు. మద్గురువరేణ్యులగు ఆచార్యుల వారితో నాకు చిరకాల పరిచయానుబంధము లుండుటచేత మరింత లెస్సగా వారి జీవిత విశేషములను సంగ్రహముగా మనవి చేయుదును.

## జీవిత సంగ్రహము :

## జన్మస్థలము :

సిరిసంపదల కాకరమై వరవిద్యలకు నికేతనమై మహోజ్జ్వల చరిత్ర ప్రశస్తి వడసియున్న ఓరుగల్లు పట్టణమునకు సమీపమునగల మడికొండ గ్రామము వరదాచార్యులవారి జన్మస్థలము. ఈ మడికొండకే మణిగిరి యని ముదిగొండయని నామాంతరములున్నవి. ఇది చరిత్ర ప్రసిద్ధిగాంచిన పురాతన స్థలము. ఈ గ్రామము విద్యా విజ్ఞానములకు నిలయమై కళలకు కాణాచియై విరాజిల్లు చున్నది.

ఈ యూరిలో పూర్వమునుండియు 'పింగళి' వంశీయులగు నియోగి బ్రాహ్మణులు ప్రభువులై పాలించుచుండిరి. వారీ గ్రామపు దేశముఖులు. ప్రస్తుత మా వంశవిభూషణులైవరలు మహోదార సౌజన్యమూర్తులు శ్రీ వేంకటేశ్వరరావు గారు. ఈ గ్రామపు రెడ్డి ప్రభువు కీ.శే. తాటిరెడ్డి గోపాలరెడ్డిగారు మహాసంస్కృత విద్వాంసులై సంస్కృతమున ధారాళముగా మాట్లాడగలిగెడివారు. కవి పండిత పోషకులు. సుప్రసిద్ధ విద్వత్కవివరేణ్యులగు కొప్పరపు కవులు మున్నగువా రెందరెందరో మడికొండకువచ్చి వీరిచేత సన్మానములు వడసిరి. ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవులగు శ్రీపాద కృష్ణమూర్తిగారు కుముద్వతీ కల్యాణకావ్యము రచించి రెడ్డిగారికి కృతియొసగి సత్కృతి గాంచిరి. నేటికి వందయేబది వత్సరము లకు పూర్వమీ మడికొండలో వెలసిన నియోగి బ్రాహ్మణుడు మోతుకూరి పండరి నాథ కవి 'అధ్యాత్మ రామాయణము' అను ఆంధ్రమహా కావ్యమును దాదాపు పది వేల పద్యములతో రచించెను. ఆ కావ్యము నిటీవల తద్వంశీయులు ఆంధ్రోపన్యాస కులు అగు శ్రీ మోతుకూరి హనుమంతరావుగారు పరిష్కరించి ప్రచురించిరి. పండరినాథ కవి రచించిన ఏకాదశ సహస్రశ్లోక విలసితమగు 'రామకథా కల్పలత' యను గీర్వాణ రామాయణము మొన్నటివరకు జీర్ణదశలోనుండి తెలుగువారి దుర

దృష్టవశమున నశించిపోయినది. నిజామురాష్ట్ర ప్రథమ శతావధాని యని పేరువడసిన వీరవల్లి నృసింహాచార్యులీ గ్రామస్థులే. వర్తమాన కాలమున సుప్రసిద్ధ కవిపండిత శిరోరత్నములై ప్రకాశించుచున్న శ్రీయుతులు ఆచార్య డా॥ బిరుదురాజు రామరాజు గారు, డా॥ పల్లా దుర్గయ్యగారు, ప్రజాకవి కాళోజి నారాయణరావుగారు, అనుముల కృష్ణమూర్తి కవిగారు, మోతుకూరి వేంకట నరసింహారావుగారు మడికొండ వాస్తవ్యులే. ఇట్లు కవిపండిత కళాకార మణులకు గనియై మణిగిరియను నన్వర్థ నామమున విరాజిల్లుచున్న యీ గ్రామమున వరదాచార్యులవారు శ్రీమతి సీతాంబ శ్రీమాన్ బక్కయ్యశాస్త్రిగారను పుణ్యదంపతులకు శ్రీపరీధావి సంవత్సర శ్రావణ బహుళైకాదశినాడు క్రీ.శ. 16-8-1912 న జన్మించిరి.

## వంశ ప్రశస్తి:

ఆచార్యుల వారిది భక్తి జ్ఞాన విజ్ఞాన విశిష్టమైన పండితవంశము. వీరు భరద్వాజ గోత్రులు, ఆపస్తంబ సూత్రులు. 'వానమామలై'యను గృహనామము వీరికి గ్రామనామము బట్టి వచ్చినది కాదు. వీరి పూర్వికులలో నొకరగు నారాయణప్పగారి కాలమున ఈ పేరు వచ్చినది. అంతకుముందు వీరు వాసాలమఱ్ఱివారు. నారాయణప్పగారు మొదట వైదికబ్రాహ్మణులే. ఆ కాలమున ద్రావిడదేశమందలి 'వానమామలై' శ్రీ రామానుజగురు పీఠాధిపతులగు స్వాములవారితో వీరు సప్త వాసరములు శాస్త్రవాదము చేసి విశిష్టాద్వైతము స్వీకరించి శ్రీవైష్ణవులైరి. అప్పటి నుండి వీరు వానమామలైవారైనారు.

ఆచార్యులవారు పోతన చరిత్రము కావ్యావతారికలో తమ పండిత వంశ పరిచయము చేయుచు

> "తొల్లి నారాయణప్ప సుతుండు సింగ
> రార్యుఁ డతని సూనుఁడు లక్ష్మణార్యుఁడు.... "[1]

అని యిత్యాదిగా వ్రాసిన పద్యముల వలన దిగువ రీతిగా వంశవృక్షము వెలసినట్లు తెలియుచున్నది.

1. పోతన చరిత్రము: పీఠిక-'పండితవంశ పరిచయము' 77వ పద్యము.




వరదాచార్యులవారి ప్రపితామహుడగు లక్ష్మణార్యుడు లోకోత్తరముగ రామాయణార్థ ప్రవచనము చేయుటచేత 'అపరవాల్మీకి' యని కీర్తింపబడెను. వీరి పితామహుడు వెంకయశాస్త్రిగారు తర్కవ్యాకరణములలో నుద్దండపండితులు. వారణాసిలో పేరుమోసిన పండితులను వాగ్వివాదమున నోడించిన దిట్ట. వీరి శిష్యు డారుట్ల జగ్గయ సంస్కృతమున జగదీశచంపూ ప్రబంధము రచించెను. వీరి యన్వయమున నేడు తరాలవరకు వీరింటనే నివాసము చేసెద నని సరస్వతీ దేవి సెలవిచ్చినట్లు జనశ్రుతి కలదు.

ఆచార్యులవారి జనకులగు శ్రీ బక్కయశాస్త్రిగారికి తల్లిదండ్రులు పెట్టిన పేరు లక్ష్మీనరసింహాచార్యులు. తమ తల్లికి ఎందరో పుట్టుచు పోవుచుండిన పిదప చివరకు వీరు కలిగిరి. బక్కపలుచని దేహముతోనున్న వీరిని చూచి అందరును 'బక్కవాడు బక్కవాడు' అని పిలుచుచుండుటచేత 'బక్కయ్య' యను పేరే స్థిరపడినది. వీరు పదునెనిమిది సంవత్సరముల ప్రాయము వరకు ఆటపాటలలో మునిగితేలి యప్పుడు విద్యాభ్యాసము మొదలిడి మూడునాలుగేండ్లలో గొప్ప

పండితులైన వైన మచ్చెరువు గొల్పును. బక్కయ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్ర ద్రవిడ సాహిత్యములలో పారంగతులు. జ్యోతిర్వేదాంతశాస్త్ర విద్వద్వరేణ్యులు. పులిజూద మను ఆటలో సాటిలేని మేటి. మహాపౌరాణికులై నితాంత మధుర మంజుల గాత్రముతో మైలు దూరము వినబడునంతటి ఉచ్చైస్స్వరముతో పండిత పామర జనరంజకముగా మహాచతురముగా వాల్మీకి రామాయణమును పురాణ పద్ధతిలో ప్రవచించెడివారు. నాడు 'బ్రతికి బక్కయశాస్త్రి పురాణము వినవలె, చచ్చి స్వర్గము పోవలె' నను నానుడి వరంగలు జిల్లాలో వ్యాపించిన దనగా శాస్త్రిగారి పౌరాణిక ప్రశస్తి విశదము కాగలదు. శాస్త్రిగారు పొందిన సన్మానము లకు లెక్కలేదు. పది తడవలైనను వేయినూటపదార్ల ఘన సన్మానము లందిరి. బక్కయ్యశాస్త్రిగారు కొన్ని మంగళారతులు రచించియుండిరి.

ఆచార్యులవారి మాతృదేవి శ్రీమతి సీతాంబ సీతాదేవి వలె మహా సాధ్వియై రెండవ యనసూయ యను వినుతి గాంచెను. ఆమె పేదసాదుల నాదరించిన పుణ్యాత్మురాలు, భక్తురాలు, ధన్యజనని.

వరదాచార్యులవారి తాతముత్తాతల యభిజనము ప్రస్తుత మాచార్యులవారు నివసించుచున్న ఆదిలాబాదు మండలాంతర్గతమగు చెన్నూరే. మడికొండ ప్రభువులు తౌటిరెడ్డి గోపాలరెడ్డిగారు బక్కయ్య శాస్త్రిగారి ప్రశస్తి విని వారి నాహ్వానించి సకల సౌకర్యములు సమకూర్చి పోషింపగా శాస్త్రిగారు మడికొండ లోనే స్థిరనివాస మేర్పరచుకొనిరి.

బక్కయ్యశాస్త్రిగారికి తొమ్మండుగురు బిడ్డలు కలిగిరి. అందు నలుగురు కొడుకులు ఇద్దరు కూతుండ్రు మిగిలిరి. మన ఆచార్యులవారందరిలో కనిష్ఠులు. జ్యేష్ఠులగు శ్రీ వేంకటాచార్యులవారు పుంభావ సరస్వతి. బహుశాస్త్ర భాషా సాగరముల నాపోశనము పట్టిన యగస్త్యులు. గీర్వాణాంధ్ర ద్రావిడములలో తలస్పర్శి యగు వైదుష్యము గడించిరి. ఉరుదూ, ఆంగ్లము, గణితశాస్త్రము స్వయం కృషి వలన సాధించిరి. నిరంతర మెందరో విద్యార్థులకు విద్యాదానము చేయుచుండిన గురూత్తములు. వీరివద్ద ప్రైవేటు చదివి అప్పటి ఉస్మానియా మెట్రిక్‌లో నెందరో యుత్తీర్ణులైన వారున్నారు. వీరు రచనాచణులై జ్ఞానేశ్వరీ భగవద్గీతకు వచనానువాదమును, వ్యాస భగవద్గీతకు శుద్ధాంధ్ర పద్యానువాదమును

కావించిరి. భండార్కర్ సంస్కృత వ్యాకరణము రెండు భాగముల నాంధ్రీకరించి యుండిరి. కాని ఆ వ్రాతప్రతు లిపు డలభ్యములు. వీరు పరమ సాత్త్విక నిరాడంబర జీవనులు. బమ్మకు బొమ్మగట్టిన యుద్దండ పండితమండల మండ నాయమాను లయ్యు వీరు నివురు గప్పిన నిప్పు చొప్పున శాంతులై యొప్పు చుందురు. గాంధేయులు. ఎక్కడికి రారు పోరు. వీరి నివాసమే యొక గురు కులముగా విలసిల్లెడిది. వరదాచార్యులవారికి తొలుత శాస్త్ర సాహిత్యములు బోధించిన గురువులు వీరే. వీరు చిరకాలము నుండి హుజూరాబాదు తాలూకలోని గట్ల నరసింగాపురములో నివసించుచున్నారు. గట్ల నరసింగాపురపు జమీందారు గుండవరపు జగన్నాథరావుగారి యాస్థాన పండితులుగా ఉన్నారు. ప్రస్తుతము వీరి వయస్సు 92 సంవత్సరములు.

ద్వితీయ సోదరులగు శ్రీ లక్ష్మణాచార్యులవారు తర్క శాస్త్రమున నుద్దండులు. వాదప్రియులు. అనేక శాస్త్రములలో భాషలలో పండితులే కాక అనేక రచనలు చేసిన సత్కవి లలాములు. వీరి రచనలలో భక్తితత్త్వము, విరహప్రేమ మున్నగు ఖండకావ్యములు, సతీ అనసూయ, తిక్కన చరిత్రము అను మహా కావ్యములు ఆంధ్ర కృతులు. ఆముక్తమాల్యద, రామాశ్వమేధము, పతి సంజీవిని యను నాటకములు, 'సంస్కృతిః' యను నవల, 'లౌకికీ శిక్షా' యను 500 సూత్రముల సూత్ర గ్రంథము మరియు ననేక స్తోత్ర గ్రంథములు సంస్కృత రచనలు. 'రామాయణ్ కే భక్త్' అనునది వీరి హిందీ కావ్యము. తమిళము నందును కొన్ని రచనలు చేసిరి. వీరి రచన లన్నిటిలో ఒక తెలుగు ఖండ కావ్యములు మాత్రమే ప్రచురింపబడినవి. బహుముఖ పాండిత్య విభాసితులగు వీరు గంటలకొలది మత వేదాంతాది విషయములపై మహా సమర్థముగా నుపన్య సించు చుండెడివారు. వీరు మహారాష్ట్ర చాందా జిల్లాలోని ఆహిరీ రాజావారి సంస్థానమున చిరకాల మాస్థాన విద్వాంసులుగా నుండిరి. ఆ కాలముననే వీరు కోయబాసకు లిపి సారస్వతములను సృష్టించిరి. ఈ ఘనకార్యము గిడుగు రామమూర్తి పంతులుగారు శబర భాషకు చేసినంతటిది. కాని ప్రచారాభావము వలన ప్రశస్తి గాంచలేదు. ఆహిరీ సంస్థానావాసానంతరము కరీంనగరము జిల్లాలోని పెద్దపల్లి సంస్కృత పాఠశాలలో ప్రధానాధ్యాపక పదవి నలంకరించి కొంతకాలము పనిచేసిరి. వీరు పదునెనిమిది సంవత్సరముల క్రిందట పరమ పదించిరి

తృతీయాగ్రజులగు శ్రీ జగన్నాథాచార్యులవారును అన్నలవలెనే సంస్కృతాంధ్ర ద్రావిడభాషా విశారదులు. ఉరుదూ ఆంగ్ల భాషలు కూడ నేర్చిరి. వీరు సంస్కృతాంధ్రములలో ఉదాత్త కవిత్వము చెప్పిరి. వరదాచార్యులవారు వీరు చిన్ననాడొక కంచములో తిని ఒక మంచములో పరుండినారు. ఇరువురు బహిః ప్రాణములవలె మెలగుచు బాల్యమున పెద్దన్నగారివద్ద విద్యాభ్యాసము కావించిరి. జగన్నాథాచార్యులవారు మెట్రిక్యులేషన్ వరకు చదివి యుత్తీర్ణులైరి. వీరు కరీం నగర మండలములోని హుజూరాబాదు తాలూకాకు చెందిన పోతారెడ్డిపేటలో స్థిర నివాస మేర్పరచుకొని వ్యవసాయము, పురాణకథా కాలక్షేపములు వృత్తిగా జీవించుచున్నారు. వ్యవసాయములో చిరకాలము రైతులతో గ్రామీణులతో సన్నిహిత సంబంధ ముండుటచేత తద్వృత్తికి చెందినవియు తత్ర్పాంత మాండలికములును నగు వందలకొలది పదములను సేకరించిరి. మధుర మనోజ్ఞ గాత్రముతో మహా చతురతతో ప్రవచించెడి వీరి హరికథలు వినువారిది భాగ్యము. వీరు రెండు వేల పద్యాలతో లక్ష్మీరాముడను హాలిక నాయికా నాయక పాత్రలతో రామాయణ గాథ ధ్వనించునట్లు 'రైతురామాయణము' అను మహా కావ్యమును కడురమ్యముగా రచించిరి. వారు సేకరించిన మాండలిక పదము లిందు పొందుపరచబడినవి. ఈ సత్కావ్యము చిరకాలానంతర మిటీవలనే ప్రచురింపబడినది. వీరు 'కార్పాసలక్ష్మి' యను నాటక మొకటి రచించి యుండిరి. కాని యది చిరకాలము వెలుగు చూడక పడియుండి లుప్తమై పోయినది. వీరు ఆండాళు తాయారు రచించిన 'తిరుప్పావై' యను తమిళ కావ్యమును 'శ్రీవ్రతగీతి' యను పేరున ఆంధ్రీకరించి 1971 లో ప్రచురించిరి. వీరు కొంత కాలము కరీంనగరములోని యొక ట్యుటోరియల్ కళాశాలలో ఆంధ్రపండితులుగా పని చేసియుండిరి.

ఆచార్యులవారి యిద్దరు సోదరీమణులలో నొకరు జ్యేష్ఠులగు వేంకటాచార్యులవారి తర్వాతి యామె కృష్ణమ్మ. ఆమె కవియు శతావధానియునగు మేనబావ శ్రీ తిరువరంగం పాపయ్యశాస్త్రిగారి ధర్మపత్ని. ఆమె ఇటీవల పదునెనిమిది నెలల క్రింద పరమపదించినది. రెండవ ఆమె అండమ్మ. ఈమె శ్రీ లక్ష్మణాచార్యులవారి తర్వాతిది. జూలపల్లి వాస్తవ్యులగు శ్రీ మామిడాల రంగాచార్యులవారి ధర్మపత్ని. ఈమె కవయిత్రి, పౌరాణికురాలు, విదుషీమణి.

## బాల్యము, విద్యాభ్యాసము :

ఏవంవిధ ప్రశస్తి గాంచిన పండిత వంశమున నుద్భవించిన వరదాచార్యుల వారికి సహజముగనే పితృపితామహుల భ్రాతృవరేణ్యుల గుణగణములు, విద్యా విజ్ఞానములు సంప్రాప్తించినవి. సోదరులందరిలో చిన్నయైనను కవితాకళలో మిన్నయైరి.

ఆచార్యులవారికి బాల్యమున బడి చదువు సరిగా అబ్బలేదు. రవీంద్ర కవీంద్రునికి గూడ బడి చదువు గిట్టని విషయము లోకవిదితము. మోటు పద్ధతితో బోధించు నాటి బడిచదువన్న ఆచార్యులవారికి వైముఖ్య మేర్పడినది. చదువు సాగలేదు కాని ఆటపాటలలో వివిధ వినోదములలో సాటి పిల్లలలో మేటి యని పించుకొనిరి. బాల్యమిత్రులైన శ్రీయుతులు పల్లా దుర్గయ్య కాళోజి నారాయణ రావుగారలతోను అన్న జగన్నాథాచార్యుల వారితోను కలిసి యథేచ్ఛముగా విహరించెడివారు. కొంతకాలమీ రీతిగా గడవగా అన్నల ప్రోత్సాహ బలాత్కార ములవల్ల చివర కెట్లో మడికొండబడిలో నాల్గవ తరగతి వరకు చదివిరి. పిమ్మట మంథెనలో వారి బావగారి యింటిలో నుండి 5,6 తరగతులు చదివిరి. తదుపరి గట్ల నరసింగాపురములో పెద్దన్న గారి వద్ద ప్రైవేటు చదివి యప్పటి మిడిల్ పరీక్షయం దుత్తీర్ణులైరి. కాని ఆ యోగ్యతా పత్రమెక్కడనో పడవేసికొనిరి. శ్రీ వేంకటాచార్యులవారు వరదాచార్యులవారికి బడి చదువే కాక సంస్కృతాంధ్ర ములును తర్క-వ్యాకరణ వేదాంత శాస్త్రములును బోధించిరి. అందువల్లనే కవి గారు వారిని పోతన చరిత్రములో తమ గురువుగా నభివర్ణించినారు.

బాల్యమున పాఠశాల కెగనామము పెట్టి తిరుగుచున్న రోజులలో ఒక విచిత్రఘటన జరిగినది. ఇంటిపనులు పంటపనులు జోరుగా చేసెడివారే కాని చదివెడివారు కాదు. నాయనగారు అన్నలు 'పండిత వంశమున ప్రబుద్ధుడవు పుట్టితివిరా'యని చీవాట్లు పెట్టెడివారు. ఇది యిట్లుండ నొకనాడు లాంతరుబుగ్గ తుడుచుచుండ చేయిజారి ముక్కలాయెను. అది చూచి మండిపడి వారు చాల తూలనాడిరి. దాని కాచార్యులవారికి తీరని వెత రగిలి అభిమానము దెబ్బతిని, ఎట్లయినను విద్యలు నేర్చి లోపము తీర్చి పెద్దల మెప్పు పొందవలెనను పట్టుదల హెచ్చి మంథెనకు తమ మేనబావ శ్రీ తిరువరంగము గోపాలాచార్యులవారి వద్దకు

వెళ్ళిరి. బావగారు వారి ఖేదము నరసియో దార్చి అనుగ్రహముతో జన్మ తారక మగు శ్రీ వాగీశ్వరీ మహా మంత్రోపదేశము కావించిరి. అప్పటికాచార్యులవారి ప్రాయము 13 సంవత్సరములు.

## శ్రీ వాగీశ్వరీ మహా మంత్రోపాసన :

మడికొండ సమీపమున గల 'మెట్టుగుట్ట'యను కొండపయి ఆచార్యులవారు వాగీశ్వరీ మహా మంత్రము నుపాసించిరి. మెట్టుగుట్టపై ఈశ్వరాలయము, రామాలయము ప్రక్కప్రక్కన గలవు. అచట రామగుండము, పాలగుండము, జీడిగుండము అను మూడు గుండము లున్నవి. కొండపై ప్రతి సంవత్సరము శివరాత్రికిని శ్రీరామనవమికిని జాతరలు సాగుచుండును. ఆచార్యులవారా కొండమీది గుడిలో గుండములో గుహలో గురూపదిష్ట మార్గమున వాగీశ్వరీ మహా మంత్రమును దీక్షతో ఎనుబది దినము లుపాసించి సిద్ధిపొందిరి. వాగీశ్వరీదేవి ప్రత్యక్షమై కనుల కరుణామృత మొలుక ఆచార్యులవారి నాశీర్వదించినది. వారి జన్మము ధన్యమైనది.

## శ్రీరామ తారక మంత్రోపాసన :

ఆచార్యులవారికి వాగీశ్వరీ మహా మంత్రోపాసనకు పూర్వమే ఎనిమిదేండ్ల ప్రాయమున వారి బాల్యగురువు లగు శ్రీ కాళోజి రంగారావుగారు శ్రీరామ తారక మంత్రోపదేశము కావించియుండిరి. ఆ మంత్రోపాసనవల్ల వారి జీవితములో బహు భంగుల శ్రీరామచంద్రుని సాక్షాత్కారానుగ్రహభాగ్యము లభించి చరితార్థులైరి. రంగారావుగారు రామతారక ముపదేశించుటయే కాక తులసీ రామాయణమును పలుమారులు పారాయణము చేసి వినిపించుచు బాల్యముననే ఆచార్యులవారి హృదయ క్షేత్రమున రామభక్తి బీజమును నాటిరి. అది యంకురించి నానాటికి ప్రవృద్ధమై వారిని మహారామభక్తునిగా తీర్చిదిద్దినది.

బుద్ధి జాడ్యాపహారిణి యగు భారతీదేవీ కటాక్ష భాగ్యము ప్రాప్తించిన నాటి నుండి విద్యావిజ్ఞానములపై విశేషాభిరుచి యేర్పడి సంస్కృతాంధ్ర సాహిత్యములు శాస్త్రము లధ్యయనము చేయదొడగి అచిరకాలముననే మహావిద్వాంసులైరి. ఆ

## బాల్యము, విద్యాభ్యాసము :

ఏవంవిధ ప్రశస్తి గాంచిన పండిత వంశమున నుద్భవించిన వరదాచార్యుల వారికి సహజముగనే పితృపితామహుల భ్రాతృవరేణ్యుల గుణగణములు, విద్యా విజ్ఞానములు సంప్రాప్తించినవి. సోదరులందరిలో చిన్నయైనను కవితాకళలో మిన్నయైరి.

ఆచార్యులవారికి బాల్యమున బడి చదువు సరిగా అబ్బలేదు. రవీంద్ర కవీంద్రునికి గూడ బడి చదువు గిట్టని విషయము లోకవిదితము. మోటు పద్ధతితో బోధించు నాటి బడిచదువన్న ఆచార్యులవారికి వైముఖ్య మేర్పడినది. చదువు సాగలేదు కాని ఆటపాటలలో వివిధ వినోదములలో సాటి పిల్లలలో మేటి యని పించుకొనిరి. బాల్యమిత్రులైన శ్రీయుతులు పల్లా దుర్గయ్య కాళోజి నారాయణ రావుగారలతోను అన్న జగన్నాథాచార్యుల వారితోను కలిసి యథేచ్ఛముగా విహరించెడివారు. కొంతకాలమీ రీతిగా గడవగా అన్నల ప్రోత్సాహ బలాత్కార ములవల్ల చివర కెట్లో మడికొండబడిలో నాల్గవ తరగతి వరకు చదివిరి. పిమ్మట మంథెనలో వారి బావగారి యింటిలో నుండి 5,6 తరగతులు చదివిరి. తదుపరి గట్ల నరసింగాపురములో పెద్దన్నగారి వద్ద ప్రైవేటు చదివి యప్పటి మిడిల్ పరీక్షయందు త్తీర్ణులైరి. కాని ఆ యోగ్యతా పత్రమెక్కడనో పడవేసికొనిరి. శ్రీ వేంకటాచార్యులవారు వరదాచార్యులవారికి బడి చదువే కాక సంస్కృతాంధ్ర ములును తర్క-వ్యాకరణ వేదాంత శాస్త్రములును బోధించిరి. అందువల్లనే కవి గారు వారిని పోతన చరిత్రములో తమ గురువుగా నభివర్ణించినారు.

బాల్యమున పాఠశాల కెగనామము పెట్టి తిరుగుచున్న రోజులలో ఒక విచిత్రఘటన జరిగినది. ఇంటిపనులు పంటపనులు జోరుగా చేసెడివారే కాని చదివెడివారు కాదు. నాయనగారు అన్నలు 'పండిత వంశమున ప్రబుద్ధుడవు పుట్టితివిరా'యని చీవాట్లు పెట్టెడివారు. ఇది యిట్లుండ నొకనాడు లాంతరుబుగ్గ తుడుచుచుండ చేయిజారి ముక్కలాయెను. అది చూచి మండిపడి వారు చాల తూలనాడిరి. దాని కాచార్యులవారికి తీరని వెత రగిలి అభిమానము దెబ్బతిని, ఎట్లయినను విద్యలు నేర్చి లోపము తీర్చి పెద్దల మెప్పు పొందవలెనను పట్టుదల హెచ్చి మంథెనకు తమ మేనబావ శ్రీ తిరువరంగము గోపాలాచార్యులవారి వద్దకు

వెళ్ళిరి. బావగారు వారి ఖేదము నరసియోదార్చి అనుగ్రహముతో జన్మ తారక మగు శ్రీ వాగీశ్వరీ మహా మంత్రోపదేశము కావించిరి. అప్పటికాచార్యులవారి ప్రాయము 13 సంవత్సరములు.

## శ్రీ వాగీశ్వరీ మహా మంత్రోపాసన :

మడికొండ సమీపమున గల 'మెట్టుగుట్ట'యను కొండపయి ఆచార్యులవారు వాగీశ్వరీ మహా మంత్రము నుపాసించిరి. మెట్టుగుట్టపై ఈశ్వరాలయము, రామాలయము ప్రక్క-ప్రక్కన గలవు. అచట రామగుండము, పాలగుండము, జీడి గుండము అను మూడు గుండము లున్నవి. కొండపై ప్రతి సంవత్సరము శివ రాత్రికిని శ్రీరామనవమికిని జాతరలు సాగుచుండును. ఆచార్యులవారా కొండమీది గుడిలో గుండములో గుహలో గురూపదిష్ట మార్గమున వాగీశ్వరీ మహా మంత్ర మును దీక్షతో ఎనుబది దినము లుపాసించి సిద్ధిపొందిరి. వాగీశ్వరీదేవి ప్రత్యక్షమై కనుల కరుణామృత మొలుక ఆచార్యులవారి నాశీర్వదించినది. వారి జన్మము ధన్యమైనది.

## శ్రీరామ తారక మంత్రోపాసన :

ఆచార్యులవారికి వాగీశ్వరీ మహా మంత్రోపాసనకు పూర్వమే ఎనిమిదేండ్ల ప్రాయమున వారి బాల్యగురువు లగు శ్రీ కాళోజి రంగారావుగారు శ్రీరామ తారక మంత్రోపదేశము కావించియుండిరి. ఆ మంత్రోపాసనవల్ల వారి జీవితములో బహు భంగుల శ్రీరామచంద్రుని సాక్షాత్కారానుగ్రహభాగ్యము లభించి చరితార్థులైరి. రంగారావుగారు రామతారక ముపదేశించుటయే కాక తులసీ రామాయణమును పలుమారులు పారాయణము చేసి వినిపించుచు బాల్యముననే ఆచార్యులవారి హృదయ క్షేత్రమున రామభక్తి బీజమును నాటిరి. అవి యంకురించి నానాటికి ప్రవృద్ధమై వారిని మహారామభక్తునిగా తీర్చిదిద్దినది.

బుద్ధి జాడ్యాపహారిణి యగు భారతీదేవీ కటాక్ష భాగ్యము ప్రాప్తించిన నాటి నుండి విద్యావిజ్ఞానములపై విశేషాభిరుచి యేర్పడి సంస్కృతాంధ్ర సాహిత్యములు శాస్త్రము లధ్యయనము చేయదొడగి అచిరకాలముననే మహావిద్వాంసులైరి. ఆ

రోజులలో సంస్కృతాంధ్ర పంచ కావ్యములు, శాకుంతలాది నాటకములు, పురాతనాధునాతన కావ్యములు క్షుణ్ణముగా పఠించి ఆయా కవుల కవితా రీతులను చక్కగా నవగాహన చేసికొనిరి. తండ్రిగారి వద్ద మాఘము చదివిరి. అన్నల సన్నిధిలో విశేషముగా పాండిత్యము సంపాదించుచునే స్వయం కృషిచేత సభాష్యముగా ప్రస్థానత్రయము, వేదాంత గ్రంథములు మున్నగునవి పఠించి కూలంకష వైదుష్యము గడించిరి. ద్రావిడము హింది ఉరుదూలలో చక్కని పాండిత్యము, ఆంగ్లమున సముచిత పరిచయము సంపాదించిరి. ఇట్లు స్వయం కృషితో పాండిత్యము సాధించిరి కనుకనే పోతన చరిత్రము గద్యములో తమ్ము గూర్చి 'సహజ పాండిత్యభాస' యని వ్రాసికొనిరి.

ఆచార్యుల వారికి బాల్యముననే కవిత్వము సంగీతము చిత్రలేఖనము అభినయము మొదలగు లలితకళలలో నభిరుచి యుండెను. లోకోత్తర మధుర మంజుల గాత్రము వీరికి తండ్రి ఆస్తిగా సంక్రమించినది. తొలుత నాయనగారి వద్దనే సంగీతాభ్యాసము ప్రారంభించిరి. తరువాత వారి మామ శ్రీ కొదుమగుళ్ళ జగన్నాథాచార్యులవారు సంగీతకళా రహస్యముల నెరిగించిరి. ఆ రోజులలో క్రొత్తగా వచ్చిన కపిలవాయి రామనాథశాస్త్రి, నిడిముక్కల సుబ్బారావు మొదలగు వారి గ్రామోఫోన్ రికార్డు పాటలు విని వరదాచార్యులవారు జగన్నాథాచార్యుల వారు సంగీతమును పెంపు చేసికొనిరి. తబలా హార్మోనియము కంజీరా చెక్కలు తంబూరా వాద్యములను వరదాచార్యులవారు స్వయముగా కష్టపడి నేర్చుకొనిరి. సినిమాలు లేని ఆ కాలమున మైలవరం కంపనివంటి ప్రసిద్ధ నాటక సమాజములు దేశసంచారము చేయుచు నాటకములు ప్రదర్శించుచుండ చూచిన ఆచార్యులవారెంతో ఉత్తేజితులై తమ మిత్రులతో కలిసి గయోపాఖ్యానము, నరకాసురవధ మున్నగు అనేక నాటకములు వేసి మేటి పాత్రలు ధరించి నిపుణముగా నభినయించెడివారు.

## కవితా ప్రాదుర్భావము :

వాగీశ్వరీ మహామంత్ర సిద్ధివలన ఆచార్యులవారికి కూలంకషమైన వైదుష్యము సమకూడుటతో పాటు లోకోత్తరమైన కవితాకళ యబ్బినది. ఆ తొలి రోజులలో ప్రకృతి దృశ్యములను మానవ సమాజ స్థితిగతులను పరిశీలించుచు ఆనందాతిరేకముతో కవితల్లు ప్రారంభించిరి. అప్పటికే అన్న జగన్నాథాచార్యుల

వారు పద్యములు వ్రాయుచుండిరి. వారి పద్యాలు చూచి వరదాచార్యులవారు తామును పద్యములు వ్రాయనుత్సహించి ప్రప్రథమమున 'రామ ! నీ దయరాదుగా యేమిసేతు' నన్న భక్తి గీతమును అప్రయత్నముగా వ్రాసి యన్నలకు చూపించిరి. వారెంతో సంతోషించి కవితలు వ్రాయ ప్రోత్సహించిరి. తదాదిగా మహోత్సాహముతో నెన్నో ఖండకావ్యములు రచింప దొడగిరి. ఆ కాలమున మడికొండలోని ప్రతాపరుద్రాంధ్ర గ్రంథాలయమున అన్న వేంకటాచార్యులవారు నిర్వహించు కవితల పోటీలలో పాల్గొని వరదాచార్యులవారందు నెగ్గుచు బహుమతులు పొందెడివారు. తమ బాల్యమున మడికొండకు శ్రీపాద కృష్ణమూర్తిగారు, కొప్పరపు కవులు, మల్లాది రామకృష్ణచయనులు మున్నగు కవిపండిత వరేణ్యులు వచ్చి తరచుగా కావించుచుండెడి శాస్త్రసాహిత్య గోష్ఠులు కావ్యగానములు ఆచార్యులవారి సాహితీ వికాసమునకు రచనా కృషికి ఎంతో దోహదము చేసినవి.

ప్రాథమిక దశలో ఆచార్యులవారు కొన్ని మంగళారతులు రచించిరి. పిమ్మట 'దాగుడుమూతలు' అను శీర్షికతో నాలుగువందల పాదములుగల గీతమాలిక కూర్చిరి. అందు బాలకృష్ణుడు గోపికలతో దాగుడుమూతలాడిన విషయము వేదాంతార్థ గర్భితముగా పసందుగా పొందుపరచిరి. బాల్యముననే ఇంతటి ప్రశస్త రచన చేసిన యాచార్యులవారికి మహోజ్జ్వల భవిష్యత్తు కలదని గురుజనులు మిత్రులు మిక్కిలి కొనియాడిరి.

## పురాణ హరికథాది కాలక్షేపము :

ఆ కాలమున ఆచార్యులవారి అన్నలు వేర్వేరు ప్రాంతములకు వెడలి నివాసము లేర్పరచుకొనిరి. ఆచార్యులవారు మడికొండలో పరిసర గ్రామాలలో పురాణ ప్రవచనములు, హరికథా కాలక్షేపములు, కావ్యగానములు, వేదాంతోపన్యాసములు చేయమొదలిడిరి. మొట్టమొదట తమ 14వ యేట ఆచార్య డా॥ బి. రామరాజుగారి పెదనాయనగారును వారి పెంపుడు తండ్రియు నగు రాఘవరాజుగారి యింట భాగవత పురాణము దశమస్కంధము నెంతో చక్కగా ప్రవచనము చేసి మెప్పుగాంచి సాలువు నవరసు సత్కారము నంది యింటికి రాగా వారి యమ్మగారు నితాంత సంతోష స్వాంతలైరి.

## గార్హస్థ్య జీవితము :

ఆచార్యులవారికి 18వ యేట చెన్నూరు వాస్తవ్యులగు శ్రీ కొదుమగుళ్ల జగన్నాథాచార్యులవారి పుత్రికారత్నము శ్రీమతి వైదేహి గారితో వివాహము జరిగెను. మామ జగన్నాథాచార్యులవారు సుప్రసిద్ధ హరిదాస వరేణ్యులై 'హరిదాస కేసరి' యను బిరుదు వహించిరి. సంస్కృతాంధ్ర ద్రవిడ హిందీ మహారాష్ట్ర భాషలలో పండితులు. ఉభయవేదాంతములలో తర్కవ్యాకరణాదులలో నిష్ణాతులు. సంగీతము, చిత్రలేఖనము మొదలగు కళలలో చతురులు. వీరు కాగితముతో పువ్వులు తీగలు అక్షరములు దేవతాది చిత్రములు రమ్యముగా కత్తిరించుటలో సాటిలేనివారు. వీరి కాగితపు కత్తిరింపు చిత్రములు కొన్ని ఢిల్లీలో ప్రదర్శింపబడి గణుతికెక్కినవి. వీరి యీ కళకు మెచ్చి సెంట్రల్ రైల్వేవారు అప్పటి నైజాము రాష్ట్రపుమంత్రి శ్రీ మొహిదీ నవాజ్ జంగ్‌గారి అధ్యక్షతలో గొప్ప సన్మానము చేసిరి. వీరు మధుర మనోజ్ఞ గాత్రముతో సంగీతకళానైపుణ్యముతో హరికథలు చెప్పుచు ఆంధ్రదేశమంతట విజయయాత్రచేసిరి. వీరికి ఆంధ్రదేశ మెల్లెడల శిష్యులు గలరు. వీరు తపస్సుచేసి యోగమభ్యసించి బ్రహ్మజ్ఞులయిన రాజయోగీంద్రులు. నిరతనిష్ఠాగరిష్ఠ జీవనులు. వీరి సతీమణి శ్రీమతి సుభద్రాంబ యొరుల మనసు నొప్పించి యెరుగని పరమసాధ్వి. సతత పతిసేవా పరాయణయై నిత్యాన్నదానశీల యైన పుణ్యాత్మురాలు. ఇట్టి పావన వంశమున జన్మించిన వైదేహిగారు సకల సద్గుణమణి గణ విరాజిత. మహాసాధ్వీమతల్లి. ఈ యమ్మ వరదాచార్యులవారి విద్యాకళా విభవమునకును విశిష్ట వ్యక్తిత్వమునకును అలరి వారిని స్వయముగా వరించి చేపట్టినది.

మామ జగన్నాథాచార్యులవారు వరదాచార్యులవారికి సంగీత కళారహస్యము లెరిగించిరి. తండ్రివెనుక తండ్రియై యనేకసౌకర్యములు సమకూర్చి ఆపత్సంపద లలో తోడై వారు సుకవితా సామ్రాజ్య మేలుటలో అమూల్య సహకారమందజేసిరి. జగన్నాథాచార్యులవారు పూర్ణపురుషాయుషజీవులై 1972లో పరమపదించినారు.

వరదాచార్యులవారు వివాహానంతరము కొన్నేండ్లు మడికొండలో గడపి తమ 25వయేట చెన్నూరుకు వచ్చి అచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొనిరి. ఆచార్యుల వారి దాంపత్య మనన్యమైనది. వాగర్థములవలె యలరారు వారి యన్యోన్యత

స్తోత్రపాత్ర మైనది. వారు పావన గార్హస్థ్య జీవనము సాగించుచు పురుషార్థ త్రయము సాధించుచుండిరి.

చెన్నూరుకు చేరువగల భీమవరములో సుప్రసిద్ధులగు జమీందారులు శ్రీ నరహరి నరసింహారెడ్డిగారు మహోదారులు మంచివారని పేరుగాంచి యుండిరి. బక్కయ్యశాస్త్రిగారు చెన్నూరులో నున్నంతకాలము శ్రీరెడ్డిగారి యాస్థాన విద్వాంసులుగా నుండిరి. వరదాచార్యులవారు చెన్నూరుకు వచ్చినప్పటి నుండి వారిని నరసింహారెడ్డిగారు, ఆ పిదప వారి కుమారులు శ్రీ రాజరెడ్డిగారు తమ వంశ విద్వాంసులుగా గౌరవించి పోషించుచున్నారు. ఆచార్యులవారు నరసింహారెడ్డిగారి కూతుండ్రకు రెండేండ్లు చదువు చెప్పిరి. పిదప మందమర్రిలో ప్రైవేటు టీచరుగా కొన్నాళ్ళు పని చేసిరి. కాని అంతలోనే భయంకరజ్వర పీడితులగుటచే అధ్యాపకత్వమునకు స్వస్తి చెప్పి పురాణ ప్రవచనాదులతోనే కాలము గడప దొడగిరి.

1941లో వారి జనకులు బక్కయ్య శాస్త్రిగారు పరమపదించిరి. అంతకు కొంతకాలము పూర్వమే వారి యమ్మగారు గతించియుండిరి.

ఆచార్యులవారికి సంతానము కలుగలేదు. వారు తమ అన్న జగన్నాథా చార్యుల వారి కుమారుడు చి॥ రవీంద్రాచార్యుని శైశవముననే దత్తత తీసికొని కడు మమకారముతో పెంచుకొనిరి. రవీంద్రాచార్యునికి శ్రీమతి వైదేహిగారి అన్నయగు శ్రీ పార్థసారథిగారి కూతురు చి॥ల॥సౌ॥ నందకుమారితో వివాహము జరిగెను. వారికి సత్యప్రసాదిని యను కూతురు, సత్యప్రసాద్ అను కొడుకు కలిగిరి. రవీంద్రాచార్యులు ప్రస్తుతము హైదరాబాదులో లోకకర్మశాఖలో సూపర్ వైజరుగా పని చేయుచున్నారు.

## కావ్య రచన :

పురాణ హరికథా కాలక్షేపములు కావించుచు ప్రత్యేక శ్రద్ధాభినివేశములతో అధిక కాలము కావ్యరచనలో వినియోగింపబూనిరి. 'దాగుడు మూతలు' తర్వాత దేశమాతను గూర్చిన 'మాతృప్రేమ' అను ద్విపద మాలికను రచించిరి. పిదప 'వైశాలినీ పరిణయము' అను పౌరాణిక నాటకమును రచించిరి. ఆ కాలముననే

వారపుడపుడు సంతరించిన ఖండకావ్యములను 'మణిమాల' యనుపేరున సంపుటిని 1945లో ప్రచురించిరి. ఇదే వీరి ప్రప్రథమ ప్రచురిత గ్రంథము. మణిమాల ప్రచురణకు పూర్వ మోరుగంటిలో వీరికి కావ్యగానసభ యేర్పాటై వేయినూట పదార్ల ఘన సన్మానము జరిగెను. ఇందలి కవిత చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి విశ్వనాథ సత్యనారాయణ గారల స్తోత్రములకు పాత్రమైనది.

తెలంగాణమున సుప్రసిద్ధులైన ఆధునిక కవి పండితులు సాహితీ పరులు స్వర్గీయులు సురవరం ప్రతాపరెడ్డిగారు, బూర్గుల రామకృష్ణారావు గారు, వట్టికోట ఆళ్వారు స్వామిగారు మరియు శ్రీయుతులు పి. వి. నరసింహారావుగారు, దేవులపల్లి రామానుజరావుగారు, ఆచార్య బి. రామరాజుగారు, డా॥ పల్లా దుర్గయ్యగారు, డా॥ దాశరథిగారు, ఆచార్య సి. నారాయణరెడ్డిగారు మొదలగువారు ఆచార్యుల వారి సన్నిహిత మిత్రమండలిలోని వారు. అందరును వీరిని ఆప్యాయముగా 'వరదన్న' అని పిలుతురు.

మణిమాల ప్రచురణకు పూర్వము కొంత కాలము నుండియే యొక చక్కని మహాకావ్యము వ్రాయవలెనని ఆచార్యులవా రాలోచించుచుండిరి. మహాకవియు మహాభక్తుడును మహోత్కృష్ట చరిత్రుడును అగు బమ్మెర పోతన జీవిత చరిత్రము గ్రహించి 'పోతన చరిత్రము' అను మహాకావ్యమును శ్రీరామచంద్రుని కంకితముగా రచించుట కుపక్రమించిరి.

అవి నిజాం ప్రభువు క్రూర నిరంకుశ పరిపాలన సాగించుచున్న రోజులు. రజాకార్ల భీషణ దౌర్జన్యములు పెచ్చు పెరిగి దుర్భర మగుచుండెను. నైజాము నకు వ్యతిరేకముగా హైదరాబాదు రాష్ట్ర విముక్తికి ప్రజాసంగ్రామము తీవ్రమగుచుండెను. దేశభక్తి ప్రేరితులై యెందరెందరో ఆ యుద్యమములో పాల్గొనుచుండిరి. ఆచార్యులవారును అట్టి యుద్యమములో పాల్గొని ప్రజలకు ప్రబోధము చేయుచుండిరి. పురాణములు హరికథలు భజనలు జరుగు సందర్భాలలో నిజాము మతపక్షపాత దౌష్ట్యములను నిరసించునవియు దేశభక్తి భావములను పెంపొందించునవియు నగు గేయములను వ్రాసి పాడి ప్రజలలో చైతన్యము కలిగించుచుండిరి. ఈ వ్యవహారము తెలిసిన నిజాంప్రభుత్వము ఆచార్యులవారిని నిర్బంధించి తాత్కాలికముగా విడుదల చేసెను. ఆ సమయములో పరిస్థితి ఘోరముగా నుండుటచే

తమ కిష్టము లేకున్నను ఆప్తుల యొత్తిడి చేత వారు 1947లో సకుటుంబముగా గోదావరిదాటి మహారాష్ట్రములోని 'సిరివంచ'యను గ్రామముచేరి యందు రెండేండ్లు నివసించిరి. అక్కడ పోతన చరిత్ర రచన కొంత సాగెను. ఆ రోజులలో గాంధి మహాత్ముడు హత్యచేయబడిన హృదయ విదారకవార్త విని దిగ్భ్రమచెంది నితాంత సంతాపముతో కరుణరసభరితములును, గాంధిగారి మహత్తర వ్యక్తిత్వమును దేశ సేవను వివరించునవియును అగు ముప్పదియారు గేయములను రచించిరి. ఇవి తర్వాత ప్రచురించిన 'ఆహ్వానము' ఖండకావ్యసంపుటిలో చేర్పబడినవి. నిజాముపై పోలీసుచర్య జరిగి హైదరాబాదు రాష్ట్రము విముక్తమైన పిదప ఆచార్యులవారు చెన్నూరుకు తిరిగి వచ్చిరి.

తమకు స్వంత గృహము లేనందున 1949లో ఆచార్యులవారు ముప్పది వేల రూపాయలతో చక్కని భవనము తమ యిష్టానుసారముగ నిర్మించుకొనిరి. స్వీయ ద్రవ్యము, దాతల సహాయము పోగా ఆరువేల రూపాయల ఋణమయ్యెను. శాంతిసౌఖ్యములతో జీవితము సాగింపవలసిన సమయమున కష్టాలు మొదలయ్యెను. ఆ కాలమున శ్రీమతి వైదేహిగారి కొకమారు భయంకరమైన జబ్బు వచ్చి కొన్నాళ్ళకు స్వాస్థ్యము సమకూడెను. ఒకనాటి రాత్రి శ్రీ సత్యదేవు డాచార్యుల వారికి స్వప్నములో సాక్షాత్కరించి సకల దుఃఖహరమును శ్రేయస్కరమునునగు తన వ్రతమాచరించుమని ఆనతిచ్చి ఆశీర్వదించెను. నాటి నుండి ఆచార్య దంపతులు ప్రతిమాసము పూర్ణిమనాడు భక్తితో సత్యదేవుని వ్రత మాచరించుచున్నారు.

## క్షయవ్యాధి పీడ-ఆరోగ్యప్రాప్తి :

తదేక దీక్షతో నొకవైపు మహాకావ్య రచన చేయుచునే మరొక వైపు ఋణ విముక్తికై నిర్విరామ కృషి కావించుచుండిరి. రేయింబవళ్లు అలయక సొలయక పురాణ హరికథా కాలక్షేపములు గీతాప్రవచనములు కావ్యగానములు చేయుచు పదునెనిమిది మాసములలో ఋణవిముక్తినందిరి. కాని విరామమెరుగని పరిశ్రమలో శరీరము చాల చిక్కిపోయెను. అప్పుడు పోతన చరిత్రములో చతుర్థాశ్వాసరచన సాగుచుండెను. అందు భోగినీ నాట్యఘట్టము నచంచల దీక్షతో వ్రాయుచుండిరి. ఒకసారి యోగసమాధివంటి తన్మయావస్థలో పడి లేవకుండ ఇరువదిమూడు గంటలసేపు ఏక ధాటిగా భోగినీ నృత్యఘట్ట మపూర్వముగా రచించి ముగించిరి.

ఇంకను నిట్టి రచనా నిష్ఠలో నిద్రాహారములు సరిగా లేక యెన్నిరాత్రులు పగళ్లు గడచెనో యెన్నరాదు. బక్కపలుచని బలహీన దేహము, నిరంతర జీవనోపాధి పరిశ్రమ, ఆహారనిద్రాదుల భంగము, అశ్రాంత నవభావనాధ్వ సంచారము-ఇవన్నియు కొన్నాళ్లకు వారిప్రాణము మీదికి తెచ్చినవి. శరీరము క్రమముగా చిక్కి శల్యావశిష్టమైనది. అన్నహితము తప్పి సన్నముగా జ్వరము, ఊపిరిసల్పని దగ్గు మొదలయినవి. వైద్యపరీక్ష చేయించగా క్షయవ్యాధి యని తెలిసినది. పిడుగు వంటి విషయము తెలిసి ఆచార్యదంపతులు తీరని వెతతో కుమిలి పోయిరి. బంధు మిత్రులు కంట తడిపెట్టిరి. మహారాజులకు సోకవలసిన రాజయక్ష్మము మహాకవికి సోకినది.

వ్యాధికి కొన్ని నెలలవరకు దేశీయవైద్య చికిత్స జరిగెను. అందువల్ల ఆరోగ్యము కలుగక పోవుటయేకాక వ్యాధి నానాటికి ప్రబలినది. వ్యాధిపీడితులయ్యు మహాకావ్యరచన మరికొంత సాగించిరి. సరియైనచికిత్స, పుష్టికరమైన ఆహారము, తగిన విశ్రాంతి లేనందున వ్యాధి ముదిరి దురదృష్టవశమున అసాధ్యదశకు వచ్చినది. వైద్యులు పెదవి విరిచి చికిత్సమానిరి. క్షయ ఆసుపత్రి కెక్కడికైన వెడలుద మన్నను చేతిలో చిల్లిగవ్వ లేకుండెను. తమ వలన ననేక సహాయములు పొందినవారెవరు వారి చాయలకు రాలేదు. బంధు మిత్రులు సహకరించ లేదు. వారి కష్టాలు చూడలేక సాయము చేయలేక అప్పులు వగచిరి. బట్టకు పొట్టకు గతి మాలిన ఆ మహాకవి దైన్యము చూడరానిది. జేనెడు బట్ట మొలకు చుట్టుకొని దుర్భరదీనావస్థలో అలమటించుచు సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణునికి మనసార మ్రొక్కుకొని ఆ దయామయునిపై భారము వైచియుండిరి. మరునాడొక పుణ్య పురుషుడు చేరవచ్చి యోదార్చి ధరించుటకొక వస్త్రమిచ్చి జయమగునని ధైర్యము చెప్పి వెడలిపోయెను.

ఆచార్యులవారు చివరకు విధిలేక గృహమును తాకట్టుపెట్టి ఐదువేల రూపాయలు తీసికొని చికిత్సకోసము బయలుదేరిరి. శ్రీమతి వైదేహిగారు తమ తల్లి దండ్రులు కొడుకు వెంటరాగా అయ్యగారిని తోడ్కొని హైదరాబాదుకు వెళ్ళిరి. అక్కడ సరియైన చికిత్స లభించనందున మైసూరుకు వెడలి అక్కడి ఆరోగ్య కేంద్రములో ఆచార్యులవారిని చేర్పించిరి. అది భారతదేశములో పేరు గాంచిన గొప్ప క్షయ వైద్యశాల.

ఆచార్యులవారికి చికిత్స మొదలిడి వైద్యులు శక్తిమంతములైన ఔషధము లెన్ని యిచ్చినను గుణము కన్పడలేదు. వ్యాధి ముదిరి రెండు శ్వాసకోశములును చెడిపోయి యున్నందున శస్త్రచికిత్స చేయవలసివచ్చినది. ఒకసారి కాదు రెండు సారులు కాదు పదిసారులు శస్త్రచికిత్సలు జరిగినవి. ఆపరేషను చేసిన ప్రతిసారి మృత్యుదేవత కబళింపబూనినదో యన ఊపిరితిత్తులు క్రుళ్ళిపోయెడివి. అధిక సమయము తీసికొని చేయవలసిన శస్త్రచికిత్సలు కావున ఆపరేషను పూర్తికాక మునుపే తొలుత ఇచ్చిన మత్తుమందు ప్రభావము పోవుటచే కత్తికోతలచేత దుర్భర మర్మచ్ఛేదక వేదనల పాలై ఆపరచినట్లరచెడివారు. పురాకృత కర్మవశమున మహా దారుణ నరకయాతన లిహమునందే యనుభవించి విముక్తులైరి.

ఆచార్యులవారి దురవస్థ చూడలేక మైసూరు మహారాణి వేయి రూపాయ లిచ్చి యాదుకొన్నది. మహారాజుగారు ప్రత్యేక శ్రద్ధతో మహాకవికి చికిత్స చేసి బ్రతికించవలెనని వైద్యులను హెచ్చరించిరి. మిత్రులు కాళోజి, దాశరథి, నారాయణ రెడ్డి గారలు పలుమారులు లేఖలు వ్రాయుచు ఆచార్యులవారికి ధైర్యము కలిగించుచు ఏడువేల రూపాయలు విరాళము ప్రోగుచేసి పంపించి యెంతో తోడ్పడిరి.

చికిత్సాకాలమున వైదేహిగారు, ఆచార్యులవారి అత్తమామలు రాత్రింబవళ్లు పడరాని పాట్లు పడుచు వారి కుపచారము లొనర్చిరి. వైదేహిగారు నిరంతర చింతతో సేవించుచు పతిని పసిబిడ్డవలె చూచుకొనిరి. తొమ్మిదవసారి చేసిన ఆపరేషనైన విజయవంతమగునని అందరాశించిరి. కాని యదియు విఫలమగుట చేత పరిస్థితి పూర్తిగా విషమించినదని డాక్టర్లు ఆశ వదలుకొని అయ్యగారు బ్రతుకరని ఇంటికి తీసికొని పొండని కచ్చితముగా చెప్పివైచిరి. అది విని వైదేహిగారు కంటికి మంటికి ఏకధారగా ఏడ్చిరి. జీవితేశ్వరుడు బ్రతుకలేనపుడు తాము జీవించుట వ్యర్థమని తలచి తామును తమ తల్లిగారును కావేరిలో బడి ప్రాణత్యాగమొనర్చుటకు పోయిరి. జగన్నాథాచార్యులవారు శోకము నణచుకొని వారికి ధైర్యము చెప్పి వారించిరి. చేతగల డబ్బంతయు అయిపోవుటచేత మూడు రోజులు వారుపవాస ముండిరి. పరాకాష్ఠకు చెందిన ఆ ఘోర దుర్దశ తెలిసి

యప్పటి హైదరాబాదు ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు మిగుల వగచి యొక వేయి రూపాయలు సాయముగా పంపించిరి.

అయ్యగారికి ప్రత్యేక శ్రద్ధతో చికిత్స చేయుచున్న ప్రధాన వైద్యునివద్దకు వైదేహిగారు వెళ్ళి దురంత దుఃఖమున విలపించుచు పతిని బ్రతికించుమని బతి మాలిరి. ఆమె శోకమునకు డాక్టరుగారి హృదయము ద్రవించి పోయినది. దైవము మీద భారముపైచి కడసారి ప్రయత్నింతునని వారి నోదార్చి కొన్ని విలువైన మందులిచ్చి పంపిరి. ఆచార్యులవారికి చికిత్సా కాలమున దురదృష్టవశమున కామెర్లు, రక్తగ్రహణి అదనముగా సోకుటచే పరిస్థితి మహాక్లిష్టమై యుండెను.

వైదేహిగారు మరల ఐదు దినము లుపవసించి సత్యదేవు ననన్యభక్తితో పూజించి పతిని బతికించుమని బహువిధముల ప్రార్థించినారు. డాక్టరుగారు తమ ప్రజ్ఞనెల్ల వినియోగించి పదవసారి ఆపరేషను చేసినారు. వారు పడినపాట్లు ఫలించి అది విజయవంతమైనది. దైవానుగ్రహమువల్ల వైదేహిగారి వ్రతము ఫలించి అయ్యగారు బ్రతికినారు. అపర సావిత్రియయి యమునితో పోరాడి భర్తప్రాణా లడిగి తెచ్చుకొన్నారు. అత్తమామల శ్రమలు మిత్రుల శుభాకాంక్షలు సాహాయ్య ములు చరితార్థములై బ్రతికి బయటబడినారు. ఒక ఊపిరితిత్తి మాత్రము పూర్తిగా చెడి కత్తికోతలకు మిక్కిలి గురియగుటచేత నాశనమయి ముడుచుకొని పోయినది. అశేషాంధ్ర జనుల యదృష్టమువలన కవిగారిట్లు పునరుజ్జీవితులైరి.

ఆరోగ్య కేంద్రమున ఆచార్యులవారు మూడు సంవత్సరములుండిరి. వ్యాధి శయ్యపై నుండి నిరంతరము పరమేశ్వరుని ధ్యానించుచుండెడివారు. తాము ప్రారంభించి మూడు వంతులు నిర్వహించిన పోతన చరిత్ర రచనకు ఘోరనిరోధ మేర్పడెననియు త్వరగా ఆరోగ్యము సమకూడి మహాకావ్య రచన పూర్తిచేసి జన్మ ధన్యము చేసికొనుట యెట్లో యనియు నితాంతము సంతాపము నందెడివారు. పదవ ఆపరేషను ఫలవంతమై కొన్ని నెలలకు సంపూర్ణ స్వాస్థ్యము సమకూడగనే 1953 లో హైదరాబాదుకు వచ్చిరి.

డెబ్బదియైదు పౌనులకు చిక్కిన అస్థిపంజరముతో చికిత్సకు వెళ్ళిన ఆచార్యులవారు నూటయేబది పౌనుల స్థూలశరీరముతో తిరిగివచ్చినారు. రూపము

గుర్తుపట్టరానంత మారినది. సంపూర్ణారోగ్యవంతులైనను పూర్వపు చురుకుదనము చాకచక్యము శాశ్వతముగా అంతరించిపోయినవి. గాత్రమాధుర్యములోను నొకింత మార్పు వచ్చినది. వ్యాధిలో దీర్ఘకాలము ఔషధసేవనముచేసి అనేక శస్త్రచికిత్సలకు గురియై స్తబ్ధులై పడియుండుటచేత జ్ఞాపకశక్తి చాలవరకు దెబ్బతిన్నది.

హైదరాబాదుకు వచ్చిన పిదప తెలంగాణ రచయితల సంఘ సభలు జరుగుచుండగా మిత్రులను కలిసికొనుటకు వారచటికిపోయిరి. అప్పుడా సంఘమునకు దాశరథిగా రధ్యక్షులుగా, సి. నారాయణరెడ్డిగారు కార్యదర్శిగా ఉండిరి. వారాచార్యులవారిని తొలుత గుర్తించలేదు. పిమ్మట గుర్తించి పరమానందము చెంది వేదిక నలంకరింపజేసి అభినందన సుమనోంజలుల ముంచెత్తిరి. అంతకు కొంత కాలము పూర్వము రచయితల సంఘమువారు ఆచార్యులవా రారోగ్యకేంద్రములో పరమపదించిరన్న వదంతి విని సంతాపసభ కూడ చేసికొనియుండిరి. అట్టి ఆప్తుల కాచార్యులవారి దర్శనము వలన కలిగిన యానందమున కవధి లేకుండెను. 'వరదన్నా! నాకు జీవితములో ఆనందాన్నిచ్చిన వార్తలు రెండే రెండున్నాయి. అవి అసంభవ మనుకొన్నాను. ఒకటి నిజాంపై పోలీసు చర్య, రెండవది నీవు జబ్బు నయమై బ్రతకడం' అని దాశరథిగారు పొంగిపోయినారు. వరదాచార్యులవారి కవితాపాండిత్య వైభవమును భక్తిజ్ఞానాదులను ప్రస్తుతించి తెలంగాణ రచయితల సంఘమువారు 'అభినవ పోతన' అను అన్వర్థబిరుదము నొసగి సన్మానించిరి.

నగరమున నుండిన అయ్యగారికి జీవనోపాధి సమస్య జటిలమై పోయినది. చెన్నూరుకు వెళ్ళి, స్వగృహము పరాధీనమై యుండుటచేత, అచట అత్తవారింటిలో కొన్నాళ్ళుండి మరల హైదరాబాదుకు వచ్చి చేరిరి. ఏకశ్వాసకోశము గల ఆచార్యుల వారిని పూర్వమువలె సంగీత మాలపించరాదు, అధికశ్రమ చేయరాదని వైద్యులు హెచ్చరించియుండుటవల్ల వారు హరికథా పురాణ కాలక్షేపములు చేయజాలనివారై అష్టకష్టాలు పడుచు దినములు వెళ్ళబుచ్చుచుండిరి. అట్టి దుస్స్థితిలో ఆచార్య కుటుంబమును శ్రీ పి. వి. నరసింహారావుగారు చేరదీసి యొక సంవత్సరము పోషించిరి. తెలంగాణ రచయితల సంఘమువారు 'వరదాచార్య నిధి' యనుపేర నుమారు రెండువేల రూపాయలు ప్రోగుచేసి యొసగి తోడ్పడిరి.

## అధ్యాపకత్వము :

ఆచార్యుల వారికి శాశ్వతముగా జీవనోపాధి కల్పించదలచి బూర్గుల రామకృష్ణారావుగారు దయతో వారికి ఉద్యోగ మిప్పించిరి. అయ్యగారిది డిగ్రీలు లేని పాండిత్యము. ఉద్యోగానికి వలయు వయస్సుగాని పట్టాగాని లేకున్నను వారి నిరుపమ ప్రతిభా పాండిత్యములను సాహిత్యసేవను పరిగణించి ఆ కాలమున నిజామాబాదు జిల్లా దోమకొండలో నుండిన జనతా కళాశాలలో సాంస్కృతిక కార్యక్రమ నిర్వాహకులుగా ప్రత్యేకమైన యుత్తర్వుద్వారా ఉద్యోగ మొసగి మహోపకార మొనర్చిరి.

ఆచార్యులవారు దోమకొండ జనతా కళాశాలలో తేదీ: 16-11-1954 నాడు చేరిరి. అచటి వయోజనులగు విద్యార్థులకు మన రాజ్యాంగము, పంచవర్ష ప్రణాళికలు, సంస్కృతి, ప్రభుత్వము చేపట్టిన ప్రజాహిత కార్యములు మొదలగునవి బోధింపబడెడివి. ఈ విషయములపై బుర్రకథలు నాటికలు పాటలు వ్రాసి విద్యార్థులకు నేర్పి వారిచేత ఆడించుట పాడించుట ఆచార్యులవారి విధి. ఒక వంక ఈ ప్రచార సాహిత్యము సృష్టించుచునే వేరొకవంక మహాకావ్య రచన సాగించెడివారు. ఆచార్యులవారి జానపద సాహిత్యము గ్రామీణులలో చక్కని విజ్ఞాన వికాసములను సంస్కృతి సభ్యతలను పెంపొందింపజేసినది.

జనతా కళాశాలలో చేరిన కొన్నాళ్లకు ఉద్యోగ మన్నపు డొక విద్యా ప్రమాణ పత్రమున్న బాగని ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వారి విశారద పరీక్ష యిచ్చి సర్వ ప్రథములుగా కృతార్థులైరి. చిత్రమేమనగా వారి మణిమాలయే అప్పుడు విశారదకు పాఠ్యముగా నుండుటచేత తమ కావ్యమే చదివి పరీక్ష యీయవలసి వచ్చినది తర్వాత డిప్. ఓ. ఎల్. పరీక్ష యెంద రెంత ప్రోత్సహించినను దిక్కుమాలిన పరీక్షలని యీయలేదు. పిదప చిత్తమెల్ల మహా కావ్య రచనపై నుంచి నిర్విరామ కృషి చేసి 1956 లో దానిని ముగించిరి. దోమకొండలో నున్న కాలమునందే తామపుడు వ్రాసిన పద్యగేయ కవితలను కూర్చి 'ఆహ్వానము' అను సంపుటిగా ప్రచురించిరి.

ఆచార్యులవా రత్యంతమైన ఆర్థిక సంక్షోభమునకు గురియైరి. ఆరోగ్య సంరక్షణకు చక్కని పోషకాహారము సేవించుచు తమకు లభించు స్వల్ప వేతన ద్రవ్యములో కొంత మిగిల్చి చెల్లించుచు కొన్ని యేండ్లలో ఋణవిముక్తులై స్వగృహమును స్వాధీనము చేసికొనిరి. వారి కపుడపుడు జరుగు సన్మానాల డబ్బు తోడనే సంసార నిర్వహణ చేయుచు అతి కష్టముగా అక్కడ కాలము గడపిరి. అప్పటి ఆ మహాకవి దైన్యము చూచినవారి కన్నులు చెమ్మగిల్లెడివి. ఇట్లు దోమకొండలో సుమారేడు సంవత్సరములు గడపి చెన్నూరుకు బదిలీ చేయించుకొని అచటి ఉన్నత పాఠశాలలో తేదీ : 1-10-1961 నాడు తెలుగు పండితులుగా చేరిరి.

చెన్నూరులో అధ్యాపకత్వము నెరపుచు గృహ విషయములు చక్కబెట్టు కొనుచు పోతన చరిత్ర రచనకు మెరుగులు దిద్దుకొనుచు ఆ మహాకావ్య ప్రచుర ణార్థము కృషి చేయుచుండిరి. చెన్నూరులో అశేష విద్యార్థుల సోదరాధ్యాపకుల పౌరుల మన్ననలకు పాత్రులగుచు ఉత్తమాధ్యాపకత్వము నిర్వహించి 30-7-1972 న ఉద్యోగ విరమణ చేసిరి.

## పోతన చరిత్ర ప్రచురణము :

ఆచార్యులవారు పోతన చరిత్రము రచన కెంతకాలము కష్టాలుపడిరో అంత కాలము దాని ప్రచురణమునకును కష్టాలు పడిరి. మహాకావ్య ప్రచురణ గాథను విపులీకరించిన అదొక కావ్యమగును. తొలుత 1956లో దేశోద్ధారక గ్రంథమాలా వ్యవస్థాపకులు ఆచార్యుల వారి ఆప్తులునగు శ్రీ వట్టికోట ఆళ్వార్‌స్వామిగారు తమ గ్రంథమాల పక్షమున పోతన చరిత్రమును ప్రచురింపబూని ఆయాప్రాంతములు పర్యటించి ఎనిమిదివేల రూపాయల విరాళములు ప్రోగుచేసిరి. అప్పటి అజంతా ప్రింటర్సులో ముద్రణమొదలై నాలుగాశ్వాసములు ముగిసెను. అంతలో ఆళ్వార్ స్వామిగారు గుండె జబ్బుతో హఠాత్తుగా మరణించిరి. ఆచార్యులవారు ఖిన్నులై ముద్రణాలయములో అడుగగా ఆళ్వార్‌స్వామిగారు సగము డబ్బే చెల్లించినందున తక్కిన డబ్బు కట్టనిదే అర్ధముద్రితప్రతు లీయమని ప్రెస్ యజమానులు ఖండిత ముగా చెప్పివైచిరి. ముద్రణార్థము విరాళములు ప్రోగు చేయుదమన్నను కావ్య ముద్రణ పేరిట తత్పూర్వమే వట్టికోటవారు సేకరించిరి కనుక అది సాధ్యపడలేదు.

ఆ దుస్థితిలో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్యగారు ప్రేమాభిమానములతో కావ్యముద్రణార్థము పదునెనిమిది వేల రూపాయలు మంజూరు చేసిరి. కారణాంతరాలచేత ఆ భూరి ద్రవ్యమును పొందుటలో జాప్యమగుటవల్ల తర్వాత ఏర్పడిన ప్రభుత్వమాగ్రాంటును త్రోసిపుచ్చినది. ఆ కొన్నాళ్ళకే అజంతా ప్రింటర్సు వారు మూడు లక్షల రూపాయల పన్ను కట్టనందున ప్రభుత్వమా ప్రెస్సును స్వాధీనపరచుకొన్నది. చిరకాల మరక్షితముగా పడియుండుటచేత ప్రెస్సులో కావ్యప్రతులు వేయి కొంత చెదలు పురుగుల కాహుతియై పోయినవి. తర్వాత మహాకావ్యము క్రొత్తగా శ్రీరామా పవర్ ప్రెస్సులో ముద్రణయైన పిదప ఈ అర్ధముద్రితప్రతుల నాచార్యులవారతి కష్టము మీద ప్రభుత్వమునుండి పొందగలిగిరి.

మహాకావ్యము వెలుగులోనికి రాలేకపోయెనని ఆచార్యులవారి మిత్రులు అభిమానులు సాహితీపరులు చెన్నూరు, కోరుట్ల, భువనగిరి, మంచిర్యాల, యాదగిరి మున్నగు ప్రాంతాలలో సుమారెనిమిదివేల రూపాయల విరాళములు సేకరించి సమర్పించిరి. ఆ డబ్బుతో దైవముమీద భారమువేసి అయ్యగారు శ్రీరామా పవర్ ప్రెస్సులో ముద్రించుట కుద్యుక్తులైరి. మొత్తము కావ్యముద్రణకు ఇరువదివేల రూపాయలు కావలసియుండెను. కావ్యముద్రణకు సాహిత్య సంస్థలు తోడ్పడలేదు. పైగా కొందరు పెద్ద మనుష్యులు విఘ్నకారకులై యుండిరి. అట్టి పరిస్థితిలో రాష్ట్ర ప్రభుత్వము దయతో విద్యాశాఖనుండి పదివేల రూపాయలిచ్చెను. ఈ భూరినిధి లభ్యమగుటలో అప్పటి ఆర్థిక పారిశ్రామిక శాఖామాత్యులు గౌ॥ డా॥ మర్రి చెన్నారెడ్డిగారు, అప్పటి రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తులు శ్రీ పింగళి జగన్మోహన రెడ్డిగారు మిక్కిలి సహకరించిరి.

మహాకావ్యము సర్వాంగ సుందరముగా 1966 లో ముద్రణకాగానే నాటి సాహిత్య అకాడమి కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఆంధ్ర సారస్వత పరిషద్భవనములో తేది: 14-4-1967 న ఆ కావ్యావిష్కరణోత్సవము ఘనముగా జరిపించిరి. ఈ మహాకావ్యమునకు 1968 లో రాష్ట్ర సాహిత్య అకాడమి బహుమతి లభించినది.

మహాకావ్య ప్రచురణానంతరము చెన్నూరులో అధ్యాపకత్వము నెరపుచున్న రోజులలోనే నిరంతర కావ్యరచనా నిమగ్నులై తెలుగుదేశమున సుప్రసిద్ధ

క్షేత్రములలో వెలసియున్న దైవతములపై భక్తితో ఐదు శతకములు 'స్తవరాజ పంచశతి' యను పేరున రచించిరి. మహాకావ్యానంతరము భక్తితో వ్రాసిన 'శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము' ప్రచురించిరి. పిమ్మట శ్రీ వేంకటేశ్వర కరావలంబము, భజ యతిరాజ స్తోత్రము మున్నగు లఘుకావ్యము లనేకము రచించిరి. ఆ కాలముననే 'విప్రలబ్ధ' యను గేయకావ్యమొకటి రచించి 1970 లో ప్రచురించిరి.

అజంతా ప్రెస్సులో ప్రతులు చిక్కుకొనిపోయిన రోజులలో ఆచార్యుల వారి కాయాసము మనోవేదన మిక్కుటమై దురదృష్టవశాత్తున రక్తపుపోటు వ్యాధి సంభవించినది.అది చాలకాలము వారిని పీడించుచునేయుండెను. ఒక కావ్య ముద్రణార్థము సుకవి యింతకాల మిన్నియిడుముల పాలగుట జాతి దౌర్భాగ్యమనక తప్పదు. అమూల్యమైన దశాబ్దము కావ్య ప్రచురణలంపటలో వ్యయముకాకున్న ఆచార్యుల వారింకెంత దివ్య కావ్యసృష్టి చేసెడివారో.

## శాసన మండలి సభ్యత్వము :

అధ్యాపకులుగా పదునెనిమిది సంవత్సరములు ప్రభుత్వోద్యోగము చేసిన ఆచార్యులవారు 15 వ ఆగస్టు 1972 నా డుద్యోగవిరమణ చేయవలసియుండెను. అంతలో అప్పటి ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగా రాచార్యులవారి ప్రతిభా పాండిత్యములను మహత్తర సాహిత్య రచనాకృషిని గుర్తించి విధాన పరిషత్సభ్యులుగా వారిని నియమించి ఆదరించిరి. తదాదిగా వారు 1978 వరకు ఆ పదవిలో నుండి ప్రశాంత జీవనము సాగించుచు శాసనమండలిలో తమ బాధ్యతలను యథాశక్తి నిర్వహించుచు ప్రజాసేవ గావించుచు నవ్యకావ్య రచనా వ్యాసంగ నిమగ్నులై కాలము గడపిరి.

## షష్టిపూర్తి సన్మాన మహోత్సవము:

తేది : 15-8-1971 నాటికి ఆచార్యులవారికి షష్ట్యబ్ద పూర్తియైనది. ఆ సందర్భమున వారు స్వగృహమునందు ధర్మపత్నీ సమేతముగా శాస్త్రోక్తముగా మూడు రోజులు ఘనముగా షష్టిపూర్తి మహోత్సవము జరుపుకొనిరి.

కవి సమ్మేళనము, సాహిత్యగోష్ఠి, సంగీత కార్యక్రమము మున్నగు సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహింపబడినవి. చెన్నూరు ప్రజ లభినందన సభ జరిపి వారికి సువర్ణాభిషేకము జరిపి సన్మానించిరి.

షష్టి పూర్తి శుభావసరమును పురస్కరించుకొని కోరుట్లలో భారతీ సాహిత్య సమితి వారు ఆచార్యుల వారికి రాష్ట్ర స్థాయిలో సన్మాన మహోత్సవము 1973 మార్చి 25, 26 తేదులలో మహావైభవముగా జరిపిరి. అందు వారికి గండపెండేరము, స్వర్ణకంకణము, రత్నాభిషేకము, నిధి సమర్పణము కావించిరి. 'అభినవ పోతన' యను పేర షష్టిపూర్తి సన్మాన సంచిక ప్రచురింపబడెను. వారి సాహిత్యముపై గోష్ఠి నిర్వహింపబడెను. ఆ సభలకు అప్పటి ముఖ్యమంత్రి గౌ॥ పి. వి. నరసింహారావు, ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని, ఆచార్య డా॥ బి. రామరాజు, ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారలు మున్నగు ప్రముఖులు, సుప్రసిద్ధ కవి పండితులనేకులు విచ్చేసిరి.

## ఇతర రచనలు :

ఆచార్యులవారు మణిమాల రచనాకాలముననే రచించిన వైశాలిని నాటకము నెన్నో మార్పులు చేర్పులు కూర్పులు చేసి పెంచి మహా నాటకముగా సంతరించి 1975 లో ప్రచురించిరి. మరియు మహారాష్ట్ర భాషలో శ్రీ గజానన దిగంబర మాడ్గూళ్కర్ మహాకవి రచించిన గీతరామాయణమును సుప్రసిద్ధ హిందుస్తానీ గాయక శిరోమణులగు శ్రీ ధోండుశాస్త్రిగారి విజ్ఞప్తిచేత ఆచార్యులవా రాంధ్రాను వాదము చేసిరి. అదియు 1975 లో ప్రచురితమైనది. వైశాలిని ప్రచురణకు పూర్వమే సికిందరాబాదు, హైదరాబాదు జంటనగరాల సంస్థ యగు 'యువభారతి' వారు పోతన చరిత్ర భోగినీ నృత్య ఘట్టములోని పద్య గీతములకు కర్తయగు ఆచార్యుల వారిచేతనే వ్యాఖ్యానము వ్రాయించి 'భోగినీ లాస్యం' అన్న పేరుతో 1974 లో ప్రచురించిరి. పిమ్మట ఆచార్యులవారు తులసీదాస విరచితమైన 'శ్రీహనుమాన్ చాలీసా'ను ఆంధ్రీకరించి 1977 లో ప్రచురించిరి. ఆ రోజుల లోనే 'కూలిపోయే కొమ్మ' అను వచన కవితల సంపుటిని వెలువరించిరి. ఏడు వందల పద్యములలో సుభాషితములు రచించి 'సూక్తి వైజయంతి' యను పేరుతో 1978 లో ప్రచురించిరి. ఇంకను 'మానవులంతా మనవాళ్ళే' యను నవల

మరియు అనేకములైన వ్యాసములు, రేడియో నాటికలు మున్నగునవి రచించినారు. ఇవి యన్నియు అముద్రితములు.

## అభిమాన కవులు :

ఆచార్యులవారికి పూర్వాధునిక సరస సత్కవీంద్రు లందరును అభిమానులే. ఐనను వారికి సంస్కృత కవులలో వాల్మీకి, కాళిదాసు, భవభూతి, ఆంధ్ర కవులలో పోతన, పెద్దన, రామరాజభూషణుడు, పింగళి సూరన, చేమకూర వేంకటకవి, విశ్వనాథ సత్యనారాయణ, అన్యకవులలో తులసీదాసు, సూరదాసు, రవీంద్రుడు, షేక్స్పియర్, వర్డ్స్వర్తు మిక్కిలి అభిమాన కవులు.

## ఇతర కార్యకలాపములు :

చెన్నూరుకు బదిలీయై వచ్చిన పిదప ఆచార్యులవారు పద్యముతో పాటు సేద్యమును నడపించిరి. ప్రభుత్వమువారు దాతలు ఇచ్చిన భూములను సముచితముగా సంస్కరించి వ్యవసాయము సాగించు చున్నారు. పోతనగారివలెనే అభినవ పోతనగారును హాలికులగుట విశేషము.

ఆచార్యులవారు చెన్నూరులో ఒక వేదపాఠశాల స్థాపించి దాని కధ్యక్షులై చాలకాలము నిర్వహించిరి. ఆ యూరిలో గల జగన్నాయకుల గుడి కమిటి కధ్యక్షులై తదభ్యున్నతికి కృషిచేసిరి. చెన్నూరులో 'సాహిత్య గౌతమి' అను నొక సాహిత్య సంస్థ స్థాపించి కొంతకాలము నడిపిరి.

## విశిష్టసేవలు, సత్కారములు :

నిరంతర సత్కావ్య రచనా నిర్మగ్నులై వాగీశ్వరీ సమారాధనము సమాజ సేవ కావించుచుండు ఆచార్యులవారికి తెలుగుదేశమందంతట అసంఖ్యాకముగా కావ్యగానసభ లేర్పాటై ఘనసన్మానములు జరిగినవి. ఇన్ని సన్మానములు జరిగిన ఆంధ్రకవి మరొకరు లేరేమో యనిపించును. పలుమారు లాకాశవాణిలో ప్రసంగములు కావ్యగానములుచేసి మెప్పుగాంచిరి. అయ్యగారి వాత్సల్యామృత ప్లావితులై యెందరో శిష్యులై సత్కవితా శిక్షణ పొంది కృతార్థులై యున్నారు

ఆచార్యులవారి మహోత్కృష్టకవిత్వ పాండిత్యముల కలరి అనేక సంస్థల వారు సార్థక బిరుదము లొసగి సత్కరించిరి. శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు 'కవివతంస' యనియు, నిజామాంధ్ర వైష్ణవసంఘమువారు 'కవిశిరోవతంస' యనియు, పూర్వపు ముఖ్యామాత్యులు గౌ॥ పి. వి. నరసింహారావుగారు 'ఉత్ప్రేక్షా కవి చక్రవర్తి' యనియు డోర్నకల్ పౌరులు 'మహాకవిశిరోమణి' యనియు, తెలంగాణ రచయితల సంఘమువారు 'అభినవ పోతన' యనియు సమర్థ బిరుదములు ప్రసాదించి వినుతించిరి. 'వైశాలిని' మహానాటకరచనచేత వారికి 'అభినవ కాళిదాసు' అను బిరుదము, ఆనాటకావిష్కరణ సభలో కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయములో పండితులచేత ఈయబడెను.

రాష్ట్ర సాహిత్య అకాడమి ఆచార్యులవారి ప్రశస్త సాహిత్య కృషిని గుర్తించి తేది : 31-1-1971 నాడు విశిష్ట సభ్యత్వము నొసగి గౌరవించినది. ఇటీవల తేది : 18-2-1976 నాడు కాశీ విశ్వవిద్యాలయము వీరికి డి. లిట్, వాచస్పతి యను గౌరవ పట్టములిచ్చి సన్మానించినది. తమ గురువరేణ్యులైన శ్రీ మదాచార్యులవారికి ఈ గ్రంథకర్త అందె వేంకటరాజము భక్తితో తన తొలి కృతి 'నవోదయము' 1961 లో అంకిత మొసగెను. ఆచార్యులవారి మరొక శిష్యులు శ్రీ మామిండ్ల రామగౌడుగారు తమ కవిగౌడప్ప శతకమును కృతియిచ్చిరి. వేరొక శిష్యులగు శ్రీ రావికంటి వసునందన్‌గారు తమ 'భారతము' కావ్యము నంకితమిచ్చిరి. అయ్యగారి అగ్రజులు మహాకవి శ్రీ జగన్నాథాచార్యులవారు 'శ్రీ వ్రతగీతి' ని అయ్యగారి సతీమణి తమ మరదలు శ్రీమతి వైదేహిగారికి కృతి యిచ్చిరి.

ఆచార్యులవారనేక సంస్థలకు గౌరవ సభ్యులుగా హితచరులుగానుండి అమూల్యాభిప్రాయ సహకారములతో వాని సమున్నతికి కృషి చేయుచున్నారు. అనేకుల కావ్యములను పరిష్కరించి విశిష్టమైన పీఠికలు, అభిప్రాయములు రచించినారు.

శ్రీ సుధీర్ ఫడ్కే అను మహారాష్ట్ర గాయకులు 1987 లో గీత రామాయణ రజతోత్సవములు నిర్వహించి ఆ కావ్యము నన్యభాషలలో ననువదించిన కవుల నాహ్వానించి బొంబాయిలో పూనాలో సన్మానములు చేసిరి. ఆచార్యుల

వారా యుత్సవములకు వెళ్ళి యుపన్యాసములొసగి సన్మానితులైరి. ఆ కార్య క్రమము టి.వి. లో ప్రసారమైనది.

ఇటీవల దుర్ముఖి-ఉగాది (1981 ఏప్రిల్ 5) నాడు ఆంధ్రప్రదేశ ప్రభుత్వము రాష్ట్రములోని ప్రముఖ కవులకు చేసిన ఘనసన్మానములో ఆచార్యుల వారు పాల్గొనియుండిరి.

ఆచార్యులవారు శాసనమండలి పదవీ విరమణానంతరము ప్రశాంతముగా జీవితము గడపుచు కావ్యరచనా ప్రచురణములతో పాటు భక్తి వేదాంతముల ప్రచారము చేయుచు ఆశ్రయించిన వారికి విశిష్టాద్వైతోపదేశముతో సమాశ్రయణము కావించుచు బోధగురువులై విరాజిల్లుచున్నారు. ఈ విధముగా వారికి సాహిత్య శిష్యులే కాక ఆధ్యాత్మిక శిష్యులును వందల కొలదిగా ఉండి తమ జీవితములను ధన్యము చేసికొనుచున్నారు.

ఆచార్యుల వారికి క్షయవ్యాధి సోకి నివారణయై ఆరోగ్యవంతులైన పిదప 1960 లో రక్తపు పోటు వ్యాధి వచ్చి చికిత్సా పథ్యముల వలన నుపశమించి యుండెనని వెనుక తెలిపితిని. ఆరోగ్య విషయము వారెంత జాగరూకులై ప్రవర్తించినను పురాకృత కర్మవశమున స్వాస్థ్యమునకు భంగము కలుగుచునే వచ్చినది. 1980 వేసవిలో గీతరామాయణ రజతోత్సవాలకు మహారాష్ట్ర యాత్ర చేసిన సందర్భమున గుండెపోటు వచ్చినది. దీర్ఘకాల చికిత్సానంతరము నయమైనను అపుడపుడు గుండెలో నొప్పి వచ్చి యవస్థ పడుచుందురు. ఇది యిట్లుండ 1980 నవంబరులో కరీంనగరులో జరిగిన ఆంధ్రప్రదేశ రజతోత్సవ సభలో పాల్గొని తిరిగి వెడలుచుండ దురదృష్టవశాత్తున వ్యాను ప్రమాదము జరిగి కంటె ఎముక పగులు చూపి ఎంత చికిత్స చేయించినను పూర్తిగా నెమ్మదించక మధ్య మధ్య బాధించుచునే యున్నది. ఈ యనారోగ్యము, ఇతరములైన యీతి బాధలెన్ని యున్నను శ్రీమన్నారాయణునిపై భారము వైచి సహనముతో సమధికోత్సాహముతో సాహిత్యాధ్యాత్మిక క్షేత్రములయందు యథాశక్తి కృషి చేయుచున్నారు.

ఆచార్యుల వారి జీవితమే యొక మహాకావ్యము. వారు జీవితములో అనేక సుఖ దుఃఖములను కష్టనిష్ఠురముల ననుభవించినారు. సుఖముల కంటె దుఃఖ

సర్వవిధముల అభినవపోతన బిరుదును సార్థక మొనర్చుకొన్న మనీషులు, మహనీయులు. వారి విశిష్ట వ్యక్తిత్వము కవిపండితలోకమునకును, జనులందరికిని ఆదర్శమై అలరారుచున్నది.[1]

## ఆచార్యులవారి ముఖ్య జీవిత విశేషములు :

జననము : శ్రీ పరీధాని సంవత్సర శ్రావణ బహుళ-ఏకాదశి (16-8-1912 క్రీ.శ.)

జన్మస్థలము : మడికొండ, వరంగల్లు జిల్లా.

నివాస స్థలము : చెన్నూరు, ఆదిలాబాదు జిల్లా.

జననీ జనకులు : శ్రీమతి సీతాంబ, శ్రీ బక్కయ్యశాస్త్రి

విద్యార్హతలు : సహజ పాండిత్య భాసులు. సంస్కృతాంధ్రములలో విద్వాంసులు. ఉరుదూ, హింది, ద్రావిడము, ఆంగ్లము, మరాఠి భాషలలో సముచిత పరిజ్ఞానము కలదు. సాహిత్యము, సంగీతము, వేదాంతము, జ్యోతిషము, యోగము మున్నగు విద్యలలో విశారదులు.

## ముఖ్య ఘట్టములు :

8 వ యేట శ్రీరామ తారకమంత్రోపదేశము.

13వ యేట శ్రీ వాగీశ్వరీ మహామంత్రోపదేశము, వాగీశ్వరీదేవీ సాక్షాత్కారము, కవితా రచనా ప్రారంభము.

14 వ యేట హరికథా పురాణ కాలక్షేపములు, కావ్యగానములు, వేదాంతోపన్యాసములు ప్రారంభము.

20 వ యేట శ్రీమతి వైదేహిగారితో వివాహము.

25 వ యేట చెన్నూరు నివాసము ప్రారంభము

1944 నుండి 56 వరకు పోతన చరిత్రము రచన.

1945 లో 'మణిమాల' ప్రచురణము

---

1. ఆచార్యులవారి జీవిత విశేషములకు, వ్యక్తిత్వమునకు అనుబంధము-1, 2 చూడవలెను.

1949 లో గృహనిర్మాణము.

1949 నుండి 53 వరకు క్షయవ్యాధి-మైసూరు ఆరోగ్య కేంద్రములో చికిత్స, ఆరోగ్యప్రాప్తి.

16-11-1954 నుండి 30-9-1961 వరకు దోమకొండ (నిజామాబాదు జిల్లా) జనతా కళాశాలలో సాంస్కృతిక కార్యక్రమ నిర్వాహకులుగా ఉద్యోగము.

1957 లో 'ఆహ్వానము' ప్రచురణము.

1-10-1961 నుండి 30-6-1971 వరకు చెన్నూరు ఉన్నత పాఠశాలలో ఆంధ్రాధ్యాపకత్వము.

1966 లో 'జయధ్వజం' ప్రచురణము.

14-4-1967 నాడు పోతన చరిత్రము-ఆవిష్కరణోత్సవము.

1968 లో పోతన చరిత్రమునకు రాష్ట్ర సాహిత్య అకాడమి బహుమతి ప్రదానము.

1970 లో 'విప్రలబ్ధ' ప్రచురణము.

31-1-1971 నాడు రాష్ట్ర సాహిత్య అకాడమి విశిష్ట సభ్యత్వ ప్రదానము.

15-8-1971 కి షష్ట్యబ్ది పూర్తి.

1-7-1972 నాడు విధాన పరిషత్సభ్యులుగా నియామకము.

25, 26 మార్చి 1973 కోరుట్లలో షష్టిపూర్తి సన్మాన మహోత్సవము.

1975 లో 'వైశాలిని' నాటక ప్రచురణము.

1975 లో 'గీత రామాయణము' ప్రచురణము.

18-2-1976 నాడు కాశీ విశ్వవిద్యాలయము వారి డి. లిట్., 'వాచస్పతి' గౌరవ పట్టముల ప్రదానము.

1977 దీపావళికి 'కూలిపోయే కొమ్మ' ప్రచురణము.

1978 శ్రీరామ నవమికి 'సూక్తి వైజయంతి' ప్రచురణము.

1980 శ్రీరామనవమి సందర్భమున మహారాష్ట్ర పర్యటన, గీత రామాయణ సంస్థవారి సన్మానములు.

# ఆచార్యులవారి కృతులు—
# సంక్షిప్త పరిచయము

## ప్రస్తావన :

మహాకవి శ్రీ వరదాచార్యులవారి జీవిత సంగ్రహము తెలిపిన పిమ్మట వారు రచించిన కృతుల పరిచయము చేయుట యవసరము. పదుమూడవయేట కవితా రచన ప్రారంభించిన ఆచార్యులవారు ముఖ్యముగా ఏబది సంవత్సరముల సుదీర్ఘకాలములో సుమారేబది కృతులు రచించినారు. ఈ గ్రంథములలో పద్య కావ్యములు, గేయకావ్యములు, వచనకవితలు, ఖండకావ్యములు, మహాకావ్యము, నాటకము, నాటికలు, నవల, శతకములు, బుఱ్ఱకథలు, వ్యాసములు మున్నగు ననేక ప్రక్రియలు కలవు. వేయేల ఒక్క కథానిక తప్ప తక్కిన ప్రక్రియలన్నిట కృతులు రచించి నారనుట యుక్తము. ఇందులో కొన్ని బృహద్గ్రంథములు కాగా మరికొన్ని లఘుకృతులై యున్నవి. ఈ రచన లన్నియు విషయవైవిధ్య విలసిత ములై యున్నవి. ఈ రచనలలో ఒకవంతు మాత్రము ముద్రితమై తక్కిన రెండు వంతుల గ్రంథము లముద్రితములుగనే యున్నవి. ఈ కృతులన్నిటిలో చాలవరకు స్వతంత్రములు కాగా కొన్ని అనూదిత గ్రంథములును కలవు. రచింప బడిన ముద్రితాముద్రితకృతుల పరిచయము సంగ్రహముగా చేయుదును.

## ముద్రిత కృతులు :1

### మణిమాల :

ఆచార్యులవారి ముద్రిత కృతులలో మొట్టమొదటిది మణిమాల ఇది ఖండ కావ్యసంపుటి. ఇందు 59 కవితలు కలవు. 1932 నుండి 1942 వరకు రచింప బడిన ఈ కవితలకు కూర్చి 1945 లో ప్రచురించినారు. ఈ కావ్యము కవిగారి పెద్దన్న శ్రీ వేంకటాచార్యులవారి పోషకులు హుజూరాబాదు తాలుకా

1. ముద్రిత కృతుల గురించిన పండితాభిప్రాయములకు అనుబంధము–3 చూడవలెను.

లోని గట్లనరసింగాపురము జమీందారు శ్రీ గుండవరపు జగన్నాథరావుగారి కంకిత మీయబడినది. ఇందలి కవితలు నవ్య కవితా శోభితములై యున్నవి. ఇది వస్తువైవిధ్య భాసురమైయున్నది. కురువృద్ధుడు, ఆంధ్రప్రశస్తి, కర్మచంద్రుడు - గంధి, రవికవి స్మృతి, శ్రీరాముడు వంటి ఉదాత్త వస్తువులతో పాటు నవ్య కవితానురూపముగా దుక్కిబక్క, పరిగపిల్ల, పాకివాడు, పాదరక్ష, తృణము, ఎండుగడ్డి, వేరు వంటి అతి సామాన్య వస్తువులును గ్రహింపబడి కమనీయముగా వర్ణింపబడినవి. కవితలలో జాతీయత, దేశభక్తి, గాంధేయ సిద్ధాంతము, సంఘ సంస్కరణము, దీనజనోద్ధరణము ప్రధానముగా బోధింపబడినవి.

ఇందలి కవితలలో చాలవరకు పద్యములు కాగా కొన్ని గేయములును కలవు. ప్రథమ దశా రచనయైనను ఇందలి భాషాభావములు, అలంకారాదులు, రస నిర్వాహణము ప్రశస్తములై భవిష్యన్మహాకవిని దర్శింపజేయుచున్నవి. మణిమాల కవితలకు ముగ్ధులై 'కవి సమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు చక్కని పీఠిక వ్రాసి యభినందించిరి. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఈ కావ్యమున కభిప్రాయము వ్రాయుచు 'ఆంధ్ర కవివతంస' యని వినుతించిరి. కాటూరి వేంకటేశ్వర రావుగారు, అడవి బాపిరాజుగారు ప్రశంసించుచు అభిప్రాయము లొసగిరి. మణిమాల కొన్ని సంవత్సరములు ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి విశారద పరీక్షకు పాఠ్యముగా నుండెను.

## ఆహ్వానము :

ఇది 66 కవితల సంపుటి. పోతన చరిత్రము రచించుచునే 1947 నుండి 1957 వరకు దశాబ్దకాలములో అప్పుడప్పుడు వ్రాసిన కవితలను సంకలనము చేసి 195 లో ప్రచురించుట జరిగినది దీని నాచార్యులవారి ఆప్తమిత్రులును స్వాతంత్ర్య సమరయోధులును అగు శ్రీ పట్టికోట ఆళ్వారుస్వామిగారు తమ దేశోద్ధారక గ్రంథమాల 28 వ ప్రచురణగా వెలువరించిరి. ఆచార్యులవారు దీనిని తమ బాల్యగురువులు మడికొండ వాస్తవ్యులునైన శ్రీ కాళోజి రంగారావుగారికి వారి సతీమణి శ్రీమతి రామబాయమ్మగారికి భక్తితో అంకిత మొసగిరి.

ఇందు ఏ నాలుగైదో పద్యకవితలు తప్ప తక్కిన వెల్ల గేయములే. జాతిపిత మహాత్ముడు హత్య చేయబడిన ఘోరవార్తవిని శోక సంతప్తులై వ్రాసిన

36 గేయములు సంపుటిలో ప్రధానమైనవి. పండ్రెండు గేయములతో రాజిల్లు 'రైతురాజు' గేయనాటిక మరొక ప్రముఖ రచన. తక్కిన కవితలు వివిధ వస్తు సంకలితములై యున్నవి. బాపూజి గురించిన గేయములలో అతని దారుణహత్యకు అత్యంత సంతాపము తెల్పుచు వ్రాసిన గేయములు కొన్ని, అతని మహావిశిష్ట వ్యక్తిత్వమును తెలుపు గేయములు కొన్ని కూర్పబడినవి. రైతురాజు గేయనాటిక ఆచార్యులవారు దోమకొండలో నున్నప్పుడు 1958 లో జవాహర్‌లాల్ నెహ్రూ గారు నిజామాబాదుకు భారతసేవక సమాజమువారి ఉత్సవాలలో పాల్గొనుటకు వచ్చిన సందర్భమున రచించి వారి యెదుట శిష్యులచేత ప్రదర్శింపజేసి మన్నన లందిరి. తక్కిన కవితలలో పంచశీల, బుద్ధగీతి, నవంబరు 1 వ తేది, పతాక వందనం, వల్లభభాయి స్మృతి, ప్రతాపప్రశంస వంటి చరిత్రాత్మక వస్తువులు మరికొన్ని సామాజిక వస్తువులు ప్రాధాన్యము వహించియున్నవి. ఇట్లిందలి కవిత లన్నియు దేశభక్తిని, జాతీయతను, సామాజికాభ్యుదయమును ప్రబోధించునవియై ఆచార్యుల వారికి జాతీయకవిగా ప్రశస్తి కూర్చినవి. ఈ సంపుటిలోని 'ఆహ్వానము' అను గేయము మానవాళిని వసుధైక కుటుంబముగా శాంతి సహ జీవనముల ప్రవర్తింపజేయు మహాత్ములను సిద్ధము చేయుటకు ముందునకు రావల సినదని జనుల కాహ్వానము చేయుచు ప్రబోధాత్మకముగా రచింపబడి ఆ గేయము పేరే సంపుటికి పెట్టబడినది.

## జయ ధ్వజము :

ఇది గేయకవితా సంపుటి. ఇందు 31 గేయములు కలవు. 1965 లో పాకిస్తాన్ భారతదేశాంతర్గతమగు కాశ్మీరుపై దురాక్రమణ చేసినప్పుడు కవిగారి గుండెలో ప్రచండముగా ఉప్పొంగిన దేశభక్తి, జాతీయత ఈ కవితలుగా ప్రవ హించినవి. ఇది 1966 లో ప్రచురింపబడి అప్పటి ఆర్థిక శాఖామాత్యులు గౌ॥ డా॥ మర్రి చెన్నారెడ్డి గారికి కృతి యీయబడినది.

1965 లో పాకిస్తాన్ చేసిన దురాక్రమణనే కాక 1962 లో చైనా చేసిన దురాక్రమణను ఖండించుచు ప్రగాఢ దేశాభిమానమును భారతీయులలో రగుల్కొ ల్పుచు ఆ దురాక్రమణదారులను పారద్రోలి జయధ్వజమెత్తవలెనని ప్రజలకు వీరయోధులకు ప్రబోధము చేయుటకీ గేయములు రచింపబడినవి. మరియు మత

మనగా పరులను ద్వేషించుట కాదనియు తాము జీవించుచు నితరులను జీవింప నిచ్చుటయే మత పరమార్థమనియు మత సామరస్యము మిక్కిలి చక్కగా నుపదేశింపబడినది. ఇట్లే కావ్యమునందలి గేయములన్నియు ప్రశస్త దేశభక్తి గీతములై ఆచార్యులవారి జాతీయకవితకు జయధ్వజమెత్తినవి.

## పోతన చరిత్రము :

మహాకవియు మహాభక్త శిఖామణియునగు బమ్మెరపోతన గాథ మహాకావ్యముగా బంధురప్రబంధ రచనాభిశోభితముగా రచింపబడినది పోతన చరిత్రము. మణిమాల ప్రచురణకు పూర్వమే దీని రచన ప్రారంభమై పండ్రెండు సంవత్సరముల వరకు సాగి దాదాపు దశాబ్దకాలము మెరుగులు దిద్దుటలోను ముద్రణ ప్రయత్నములోను గడచి 1966 తో ప్రచురింపబడినది. ఇది ద్వాదశాశ్వాస విరాజితమై దాదాపు నాలుగువేల పద్యగద్యములలో విస్తరించి యున్నది దీనిని కవిగారు తమ ఇష్టదైవమగు శ్రీరామచంద్రునికి భక్తితో అంకితము చేసినారు.

ఇందు మొదటి పది యాశ్వాసములు పోతనకథకు చెందినవై చివరి రెండాశ్వాసము లనుబంధముగా కూర్చబడి అందు రామచరితము, మోహిన్యవతారగాథ, వరాహావతారకథ, నృసింహావతారకథ, గజేంద్రమోక్షణము, కృష్ణావతార కథ, రుక్మిణీ కల్యాణమను ప్రసిద్ధ భాగవతగాథ లేడు పోతన చేత భక్తిగానానివేదనము చేయబడినట్లు రచింపబడినవి. సుప్రసిద్ధమగు పోతన కథను చారిత్రకాధారములను కొన్నిటిని గ్రహించి, అనుశ్రుతిగా వినవచ్చుచున్న కథలను జోడించి సముచితముగా కొన్ని కల్పనలుచేసి ప్రశస్తమైన యితివృత్తముతో భాసురముగా రచింపబడిన మహాకావ్యమిది.

ఈ కావ్యమున శాంత మంగియై భక్తి శృంగార వీర కరుణాదు లంగములుగా పోషింపబడి యిహ పర సాధకములగు చతుర్విధ పురుషార్థములు ప్రబోధింపబడి మోక్షము ప్రధానముగా నుపదేశింపబడినది. భక్తి జ్ఞాన వైరాగ్యములు, ఇతర ధార్మిక లౌకిక నీతులు, ఉత్తమ కవ్యాదర్శములు అనేకముగా ప్రబోధింపబడి ఆనందము-ఉపదేశము సమముగా అందింపబడి యుత్కృష్టమై యొప్పారుచున్నది.

పోతన చరిత్రమున రసము, ఔచిత్యము, నాటకీయత, ఆలంకారికత, ధ్వని, భావసంపద, వర్ణనలు, ఉపదేశము మున్నగు కావ్యాంగము లన్నియును సలక్షణముగా లోకోత్తరముగా నిర్వహింపబడినవి. పరమయోగ్యమైన భాషా చ్ఛందో విశేషములచేత వెలుగొందు చున్నది. ఇందు సాంప్రదాయికత, నవ్యత సమ్యక్సమ్మేళనము గాంచి రచన మహావిశిష్టమై విరాజిల్లుచున్నది. ఇది పురాతనాధు నాతన మహాకవుల సుందర కవితా రీతులను తనలో విలసిల్ల జేసికొని వెలసిన మహోత్కృష్టకావ్యము. ఇందలి భోగినీ నృత్యఘట్టమొక యపూర్వ కళాఖండము.

ఆచార్యులవారి ద్వాదశ వర్ష తపఃఫలమగు ఈ మహాకావ్యము వారి జీవిత కృతియై అభినవ పోతన బిరుదాంచితులను చేసి శాశ్వత యశోవిరాజితులను కావించినది. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, డా॥ పల్లా దుర్గయ్యగారు దీనికి విపుల పీఠికలు రచించియు కవిపండిత విమర్శకాగ్రేసరు లెందరో అమూల్యాభి ప్రాయము లొసగియు ముక్తకంఠముతో కొనియాడిన విషయమే దీని ప్రశస్తిని వేనోళ్ల చాటుచున్నది. దీనికి 1968లో రాష్ట్రసాహిత్య అకాడమి బహుమతి లభించినది. ఇందలి శ్రీనాథ పోతనల వనవర్ణనల భాగము కొంతకాలము ఇంటర్మీడి యట్ ఐచ్ఛికాంధ్రమునకు పాఠ్యముగా నుండెను. శ్రీ మహాభాగవతమువలె పోతన చరిత్రము సర్వాంధ్రులకు పఠనీయ గ్రంథము

## శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము :

ఇది అనువాద గ్రంథము. స్కాందపురాణ రేవాఖండమున సుప్రసిద్ధ మైన సత్యనారాయణ వ్రతకథ కిది ఆంధ్రానువాదము. ఆచార్య దంపతులు తమ ఇలువేల్పగు శ్రీ సత్యదేవుని వ్రతము ప్రతిపూర్ణిమనాడు భక్తితో ఆచరింతురు. అట్టి దేవుని వ్రతకథ తెలుగువారి కుపయుక్తముగా నుండునటుల సరళసుందర శైలిలో ఆచార్యులవారు తెలిగించినారు. ఇది 1967లో ప్రచురింపబడినది.

ఇందు సవిస్తరమైన వ్రతపూజా విధానము మూలమునుండి యథాతథముగా గ్రహించి మొదట కూర్పబడినది పిదప ఐదధ్యాయముల వ్రతకథ 174 పద్య ములలో సంగ్రహముగా సుబోధకముగా రచింపబడి ప్రతి అధ్యాయాంతమున సులభవచనములో తాత్పర్యముగా ఆ కథయే వ్రాయబడినది. కథాంతమున పునః పూజా, నైవేద్యం, ఉద్వాసనం మూలమునుండి చేర్పబడినవి చివరకు లక్ష్మ్య

ష్టోత్తర శతనామావళి, శ్రీవిష్ణ్వష్టోత్తర శతనామావళి, శ్రీవిష్ణు సహస్రనామావళి చేర్పబడి చిట్టచివర శ్రీ సత్యదేవమంగళారతి రచింపబడి యున్నది. ఈ మంగళారతిలోని యెనిమిది చరణాలలో వ్రతకథ గ్రథనము చేయబడుట విశేషము. ఇది భక్తులకు వ్రతాసక్తు లందరికి మహోపయోగకరమైన గ్రంథము.

## విప్రలబ్ధ :

ఇదియొక గేయ కథాకావ్యము. పోతన చరిత్రము తర్వాత రచించిన ఈ కృతి 1970 లో ప్రచురింపబడినది. దీనిని కవిగారు తమ పోషకులును చెన్నూరు తాలూకా భీమవరము జమీందారులును అగు శ్రీ నరహరి రాజిరెడ్డిగారికి ప్రేమతో కృతి యిచ్చినారు.

నిజాం ప్రభుత్వపు చివరి రోజులలో చెలరేగిన మతకల్లోలములచేత సంక్షుభితమానసులై ఆచార్యులవారీ కావ్యమును రచించిరి. ఇది 54 గేయములతో చక్కగా నిర్వహింపబడి యున్నది. ఇందు లక్ష్మిరాములను కర్షక దంపతుల స్వచ్ఛంద ప్రణయేతివృత్తము సహజ రమణీయముగా వర్ణింపబడినది. పుట్టింటిలో పతివియోగపరితప్తయై విప్రలబ్ధయైన నాయిక తదీయ విప్రలంభమున కోర్వలేక భర్తను గలియ నెంచు గోదావరిని దాట సాహసించి యందులో కొట్టుకొనిపోయి యొక విప్రునిచేత రక్షింపబడి లభించినందువల్లను విప్రలబ్ధయైనది. ఇట్లు కావ్యనామము సార్థకమై యొప్పుచున్నది.

ఈ కావ్యమున కర్షక దంపతుల ప్రణయ జీవితమే కాక కర్షక జీవిత చిత్రణము, గ్రామీణ ప్రకృతి వర్ణనము మధురమంజులముగా చేయబడినవి. ఇందు మతసామరస్య మానవతా వాదము, జాతీయత, గ్రామీణాభ్యుదయము చక్కగా ప్రబోధింపబడినవి. ఇది వస్తువుచేత భావములచేత భాషాచ్ఛందో విషయములచేత అచ్చమైన దేశి కావ్యమై విరాజిల్లుచున్నది. ఇందలి గేయములు విడిగా పాడుకొనుటకును నాటికగా ఆడుకొనుటకును మిక్కిలి యుపయుక్తములై యొప్పారు చున్నవి.

## స్తోత్ర రత్నావళి :

ఇది అనూదిత స్తోత్రముల సంపుటి. 1974 (ప్రమాదీచ మాఘము) లో ప్రచురింపబడినది. ఇందు వరుసగా శ్రీ వేంకటేశ సుప్రభాతము, శ్రీ వేంకటేశ

మంగళాశాసనము, శ్రీ వేంకటేశ కరావలంబ స్తోత్రము, శ్రీ భజయతిరాజ స్తోత్రము, శ్రీ భజగోవింద స్తోత్రము, శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రము- అను ఆరు స్తోత్రములు కూర్పబడినవి. ఇందు శ్రీ వేంకటేశకరావలంబ స్తోత్రము మాత్రము కవిగారి స్వతంత్ర రచన. తక్కినవెల్ల సంస్కృత సాహిత్యమున ప్రశస్తిగాంచిన స్తోత్రముల ఆంధ్రానువాదములు.

ఇందలి స్తోత్రములు స్వతంత్ర రచనవలె శోభిల్లుచు ఆచార్యులవారి సంస్కృత భాషా వైదుష్యమును ఆంధ్రీకరణ చణత్వమును ప్రస్ఫుటీకరించుచున్నవి. ఇక స్వతంత్ర రచన యగు శ్రీ వేంకటేశ కరావలంబ స్తోత్రము భక్తి ప్రపత్తులకు నిధానమై ఆదిశంకరుల శ్రీ లక్ష్మీనృసింహకరావలంబ స్తోత్రమువలె ప్రశస్తమై యింపు నింపుచున్నది. ఇది 'వే కరావలంబనమీవె వేంకటేశ !' అను మకుటముతో నలువది తేటగీతులలో రచింపబడి చివరకు ఫలశ్రుతి కూర్పబడినది.

ఈ కృతి ఆదిలాబాదు మండలాంతర్గతమగు మందమఱ్ఱి భూస్వాములు మహోదార హృదయులగు శ్రీ కలకుంట మాధవరావుగారి సతీమణి శ్రీమతి రమణమ్మ దొరసానిగారికి ఆమె పరమపదించిన సందర్భమున అంకితమీయబడినది. పతివ్రతాశిరోమణియు మహా భక్తురాలును సుగుణమణి విరాజితయు దీనజనమందారయు నగు రమణమ్మగారికి భక్తికృతి యంకితమగుట అత్యంతౌచితీ విలసితమైనది.

ప్రపన్న పారాయణ యోగ్యము కాగలదనియు, సంస్కృతము తెలియని భక్తుల కుపకరించుననియు ఈ స్తోత్ర రత్నావళి నాచార్యులవారు రచించి మహోపకార మొనర్చిరి.

## భోగినీ లాస్యం :

ఇది పోతన చరిత్రములోని భోగినీ నృత్య ఘట్టమును సవ్యాఖ్యానముగా ప్రచురించిన గ్రంథము. భోగినీ నృత్యమును వర్ణించిన ఆచార్యులవారి చేతనే దానికి వ్యాఖ్య వ్రాయించి జంటనగరాల సాహితీ సంస్థ యువభారతివారు ఆనంద- ఉగాది (24-3-1974) నాడు ప్రచురించినారు. కవిచేతనే వ్యాఖ్య రచింపజేయుట అంత సముచితము కాకున్నను ఆ నృత్యములోని శాస్త్రీయతను సాంప్రదాయికతను

కవితాత్మను అన్యులకంటె కర్తయగు ఆచార్యులవారే లెస్సగా వివరింతురన్న సదుద్దేశముతో యువభారతివారిట్లు వ్రాయించి ప్రచురించి ఆంధ్ర పాఠక లోకము నకు మహోపకారము చేసినారు.

నాట్యఘట్టములోని సుమారెనుబది పద్యగేయముల కాచార్యులవారు చక్కని వ్యాఖ్యానము సంతరించినారు. దీని ప్రతులు వేల సంఖ్యలో విక్రయమై పండిత పామర జనాహ్లాదము కూర్చుటయే ఈ రచన ప్రచురణల విశిష్టతను విశదము చేయుచున్నది.

## వైశాలిని :

ఇది సలక్షణమైన సాంప్రదాయికమైన పౌరాణిక మహానాటకము. ఇందలి కథ మార్కండేయపురాణము నందలి యష్టమాశ్వాసము లోనిది. కరంధముని పుత్రుడు అవీక్షితుడు విశాలరాజు పుత్రిక వైశాలినిని వివాహమాడి మరుత్తును గనుట యిందలి ప్రధానవస్తువు. మార్కండేయ పురాణములోని ప్రఖ్యాతకథను గ్రహించి యనల్పకల్పన శిల్పాభిరామముగా రచించుట వలన నిది మిశ్రకథా నాటకమగు చున్నది. వస్తురచనా స్వభావము ననుసరించి యిది పౌరాణిక స్వతంత్రనాటకము.

ఇది సర్వలక్షణోపేతమగు తొమ్మిది యంకముల మహానాటకము. ఇందలి నాయకుడు ధీరోదాత్తుడు. నాయిక ముగ్ధ, సాధ్వీలలామ. శృంగార మంగి. వీర కరుణాద్భుత రౌద్రహాస్యము లంగములు. పౌరాణిక వృత్తాంతము నాధునిక జీవిత ప్రతిబింబముగా మలచి సాంప్రదాయికతలో నవ్యత మేళవించి రచన చేసిన కౌశలము శ్లాఘాపాత్రమైనది.

నాటకమునందు సంవిధానచాతురి, సన్నివేశకల్పనము, రసపోషణ, పాత్రపోషణ, సంభాషణాచాతుర్యము, లోకోత్తరభావ సంపద్విరాజితమైన కవితా సౌందర్యము కడుంగడు ప్రశస్తములై యున్నవి. ఇది శ్రేయోరాజ్యస్థాపనము పరమప్రయోజనముగా రచింపబడి యిందు పాతివ్రత్యము, మాతాపితృభక్తి, గురుభక్తి, శరణాగత రక్షణము, ఆర్తత్రాణపరాయణత్వము మున్నగువాని ప్రబోధము కావింపబడి అనేక ధార్మిక లౌకిక నీతులుపదేశింప బడియున్నవి. ఇది

మరుత్సంభవముతో శుభాంత మగుటచేత మోదాంతనాటకము. ఈనాటక రచనపై ఆంధ్రనాటకములకంటె సంస్కృతనాటకములు ముఖ్యముగా శాకుంతలము ఉత్తర రామచరిత్ర మధిక ప్రభావముద్ర వైచినవి. ఈ నాటకము గుణము చేతనే కాక పరిమాణము చేతను చాలపెద్దది 9 అంకములతో 221పుటలలో వ్యాపించి వచన సంభాషణలతో పాటు 250 పద్యాలతో మహాప్రౌఢమై బంధురమై భ్రాజిల్లుచున్నది.

ఆచార్యులవారీ నాటకమును తొలుత మణిమాలా కవితలల్లు ప్రాథమిక దశలోనే రచించి 'వైశాలినీ పరిణయము' అని నామకరణము చేసిరి. మరల చిర కాలానంతరము పోతన చరిత్ర ప్రచురణ తర్వాత ఎన్నోమార్పులు చేర్పులు కూర్పులు కావించి సర్వాంగసుందరముగా తీర్చిదిద్ది 'వైశాలిని' యనుపేరుతో 1975లో ప్రచురించిరి. ఇట్టిది 'నాటకాంతం హి సాహిత్యమ్' 'కావ్యేషు నాటకం రమ్యం' అన్న ఆభాణకములకు పాత్రమై యలరారుచున్నది. ఆచార్యులవారు పోతన చరిత్రము చేత మహాకావ్యరచనలో ఎంత చతురిమ ప్రదర్శించిరో వైశాలిని వల్ల మహానాటక రచనలో నంత చతురిమ ప్రదర్శించినారు. డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారు, 'శిరోమణి' కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు మున్నగు విద్వద్వరేణ్యులు విపులపీఠికలతో విశిష్టాభిప్రాయ ములతో దీని రచనా వైభవమును బహుధా ప్రశంసించిరి. ఈ నాటకరచన వలన కవిగారు 'అభినవ కాళిదాసు' బిరుదాంచితులైనారు.

ప్రౌఢమైన యీ యుత్తమ నాటకము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ములో ఎం. ఏ. కు పాఠ్యముగా నిర్ణయింపబడియున్నది. ఈ నాటకము నాచార్యుల వారు 'శీలవతి గాథ నొండు రచించి నాకు అంకిత మొనర్పరే యని యడిగికొనిన' తమ ధర్మపత్ని శ్రీమతి వైదేహిగారి కంకితము చేసినారు.

## గీత రామాయణము :

ఇది యనువాద కావ్యము. మహాకవి శ్రీ గజానన దిగంబర మాడ్గూళ్కరు గారు మహారాష్ట్రమున రచించిన గీతరామాయణమునకిది యాంధ్రానువాదము. భక్తిరస భరితములు మనోహరములగు ఇందలి గీతములను సుప్రసిద్ధ గాయకులగు సుధీర్‌ఫడ్కేగారు లోకోత్తరమగు సంగీతమును కూర్చి గానము చేయుటచేత ఇది మహారాష్ట్రములో మిక్కిలి వ్యాప్తిగాంచి యున్నది. దీనిని మధురమంజుల

గాత్రముతో తరచు గానము చేయు మహాగాయకులు నిజామాబాదు జిల్లా కుస్తాపుర వాస్తవ్యులు శ్రీ ధోండుశాస్త్రిగారు ఇది తెలుగులో వ్రాయబడినచో చాల ఉపయోగ కరముగా ఉండునని భావించి తమ మిత్రులగు వరదాచార్యులవారిని కోరగా వారీ విధముగా రామచరితము రచించు భాగ్యమబ్బెనని ఆంధ్రీకరించిరి. దీని నాంధ్రీక రించిన బాగుగా నుండునని చెన్నూరు వాస్తవ్యులు, బహుభాషావేత్తలు, ఆచార్యుల వారి మిత్రులు శ్రీ మహంకాళి దత్తాత్రేయ పండితులును భావించి ఆచార్యులవారిని ప్రోత్సహించి వారికి మరాఠి భాషలో విశేష పరిచయము లేనందున తాము భాషా విషయమున సహకరింపగా వారు తెనిగించిరి. ఇది యితర భారతీయ భాషలలోను అనువదింపబడినది.

ఈ రామాయణమున ఉత్తరకాండము కలుపుకొని సప్తకాండములలో 56 గీతములు కలవు. వీనిని కుశలవులు శ్రీరాముని సమక్షమున గానము చేసినట్లు వర్ణింపబడినవి. ఈ కృతి ఆంధ్రీకరణము గూర్చి సహకరించిన దత్తాత్రేయులు గారు "ఆచార్యులవారు వీలైనంతవరకు మూలమున కే మాత్రము వ్యతిరేకము కాకుండ మూలములోని ఛందస్సును అంత్యప్రాసాది నియమములను మరియు తెలుగులోని యతిప్రాస నియమములను జతపరచి ప్రయాసపడి సరళసుందరముగా రచించినారు."[1] అని వ్రాయుటచేత ఆచార్యులవారు మూలాతిరిక్తము కాకుండ ఎడనెడ రవంత స్వేచ్ఛను పాటించి స్వతంత్ర కావ్యమో యన సరళసుందరముగా ననువదించినట్లు తెలియును. దీనికి ధోండుశాస్త్రిగారు రమణీయమైన సంగీతము కల్పించి పాడిరి. అనేక గాయకులును పాడుచున్నారు. హైదరాబాదు ఆకాశవాణిలో కూడ ఇది ప్రసారమైనది.

దూద్‌గామ, నిర్మల వాస్తవ్యులగు శ్రీ నరాల వెంకయ్యశ్రేష్ఠిగారి ద్రవ్య సహాయమున ఇది 1975 లో ప్రచురింపబడినది. దీని నాచార్యులవారు తమ యిష్ట దైవమగు శ్రీరామచంద్రుని కంకితము చేసినారు.

1. గీతరామాయణము : 'ముందుమాట' పుట 2.

## శ్రీ హనుమాన్ చాలీసా :

ఇదియు ననువాద గ్రంథము. తులసీ దాసకృతమగు హిందీ హనుమాన్ చాలీసా సుప్రసిద్ధమైనది. భక్తులు రామాయణమును వలెనే హనుమాన్ చాలీసాను భక్తితో నిత్యపారాయణము చేయుచుందురు. దీని నాచార్యులవారు సరళసుందర శైలిలో మూలమునకుగల ఛందస్సులోనే యనువదించి శ్రీ నరాల వెంకయ్యశ్రేష్ఠి గారి కంకితమిచ్చిరి. ఆచార్యులవారి కావ్యములను ముద్రించు శ్రీరామా పవర్ ప్రెస్ యజమానులు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారు స్వంత ద్రవ్యముతో 1977 లో దీనిని ముద్రించి యిచ్చినారు. ఆచార్యులవారు గ్రంథాంతమున హనుమన్మంగళారతి యొకటి రచించి చేర్చినారు. ఇందు సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారు వేసిన ఆంజనేయుని చరిత్రమునకు చెందిన 14 చిత్రములు ప్రచురింపబడి కృతిని సుందరతర మొనర్చినవి.

## కూలిపోయే కొమ్మ :

ఇది వచనకవితా సంపుటి. ఇది అప్పటి ఆరోగ్యశాఖామాత్యులు మాన్య శ్రీ కోదాటి రాజమల్లుగారికి ప్రేమతో అంకిత మీయబడినది. ఈ కావ్యము 1977 లో ప్రచురింపబడినది.

ఇందు 34 వచనకవితలున్నవి. నా పరిచయం, సత్యం శివం సుందరం, కూలిపోయే కొమ్మ కొత్త యిగురెట్టింది, మానవతావృక్షం వంటి శీర్షికలు కృతి నలంకరించి యున్నవి. ఇవన్నియు 'విశ్వశ్రేయః కావ్య'మ్మను ఆర్యోక్తి ననుసరించి నేటి సామాజిక స్థితిగతులకు దర్పణము పట్టి అభ్యుదయాకాంక్షతో కూర్పబడినవి. పీడిత తాడిత దీనజనాభ్యుదయము, సంఘసంస్కరణము, సమత, మమత, శాంతి, మానవతవంటి సామాజికాభ్యున్నతి నాకాంక్షించు భావధారలిందు పొంగి పొరలు చున్నవి.

అనేక ప్రక్రియలలో రచనలు చేసిన ఆచార్యులవారి కృతిలో వచన కవితలు వ్రాసి యిందులోను తమ చతురత కనబరచినారు. ఆధునిక ప్రక్రియ యగు దీనిని చేపట్టుట వారి విశాల సాహిత్యదృష్టికి నవ్యతకు నిదర్శనము. ఇది వస్తు భావరచనలచేతను, వ్యావహారిక భాషచేతను, ప్రక్రియచేతను అచ్చమైన

నవ్యకవిత. ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు, కుందుర్తిగారు దీనిని కొని యాడుచు చక్కని యభిప్రాయము లొసగియున్నారు.

## సూక్తి వైజయంతి :

ఇది సుభాషిత సప్తశతి. అప్పటి గౌ॥ ఆం.ప్ర. ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి గారి కంకితమీయబడినది. 1978 లో ప్రచురింపబడినది.

680 పద్యాలలో ప్రచురించిన యిందలి సూక్తులు చతుర్విధ పురుషార్థ ముల నుపదేశించుచున్నవి- ధర్మార్థ కామములకు చెందిన సూక్తులు ప్రథమభాగము- త్రివర్గకాండముగను, మోక్షమునకు చెందిన సూక్తులు రెండవ భాగము- అపవర్గ కాండముగను విభక్తము చేయబడి కూర్పబడియున్నవి. మొదటి భాగమున సూక్తి మహిమ, దైవప్రార్థన, ధర్మమహిమ, అర్థమహిమ, కామ మహిమ మున్నగు పదునేడు శీర్షికలతో సుభాషితములు రచింపబడినవి. రెండవభాగము ఈశ్వరుడు, భక్తిజ్ఞాన వైరాగ్యములు, దైవేచ్ఛ, భక్తిమహిమ, మోక్షమహిమ, ప్రపత్తిమహిమ యను ఆరు శీర్షికలతో నలరారుచున్నది. ప్రథమ ద్వితీయ భాగము లలో క్రమముగా ఐహికనీతి, ఆముష్మికనీతి లోకోత్తరముగా ప్రబోధింపబడి యున్నవి.

ఇది వస్తు భావరచనా స్వభావము ననుసరించి శతకవాఙ్మయమునకు చెందుచున్నది. కాగా ఆంధ్రశతకపద్ధతి కాక సంస్కృతపద్ధతి ననుసరించి యున్నది. ముఖ్యముగా సుభాషితములను సాయించుటలో సూక్తుల వర్గీకరణములో భర్తృహరి సుభాషిత త్రిశతిని పురుడించుచున్నది. ఇందులోని పద్యములన్నియు ఆటవెలదులు తేటగీతులు కందములు మాత్రమే. ఈ చిన్న పద్యములు తేట తెల్లముగా నీతులు బోధించుటకెంతో యుపయుక్తముగా నుండును. ఈ విషయ మున ఇందలి నీతులు సుమతి వేమన పద్యములను స్మరణకు దార్చును. ఇందే కచ్ఛందోనియమము లేకపోవుట మకుటము కూర్పకపోవుట సంస్కృత శతక పద్ధతి ననుసరించినదే.

ఆచార్యుల వారిందలి పద్యములలో సుమారు వంద పద్యములను తమ పూర్వకృతులనుండి గ్రహించి చేర్చినారు. తక్కినవెల్లను నూతనముగా

రచించినవి. ఈ సూక్తులు, ఇందలి భావములు అపారమైన లోకానుభవము వలన నన్య ప్రతిభవలన వెలసినవే కాని పూర్వగ్రంథానుకరణములు కావు. దీనినే ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు ''ఈ సూక్తులు పురారచనలనుండి పుణికి పుచ్చుకొన్నవి కావు. నిత్యానుభవాల కొలిమిలో కాగిన కనకశలాకలు. అందుకే వీటికి అంత మేలిమి"[1] అని కొనియాడిరి. ప్రతి పద్యమునందును సోపమానముగా దృష్టాంతార్థాంతరన్యాసములతో నలకరించి సూక్తులను హృదయంగమముగా ప్రబోధించిన నైపుణ్య మగణ్యము. దీనికి మహాకవి శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యుల వారు విపులపీఠిక సవరించి సవిస్తరముగా నిందలి వైశిష్ట్యమును విశదీకరించిరి.

మానవులెల్ల శిరసావహింపదగిన మహితసూక్తి ముక్తాఫలములను వెదజల్లిన వరదాచార్యులవారీ కృతిచేత మహోన్నత యశోవైజయంతిక నెగురవేసినారు.

## అముద్రిత కృతులు:[2]

### స్తవరాజ పంచశతి:

ఇది ఐదుశతకముల సంపుటి. తెలుగునాట సుప్రసిద్ధ పుణ్యక్షేత్రములందు వెలసిన దైవతముల మీద భక్తితో చెప్పిన శతకములివి. వీనిని స్తవరాజములని కవిగారు పేర్కొనిరి. ఇవి 1. శ్రీవేంకటేశ్వర స్తవరాజము. 2. శ్రీరామ స్తవరాజము, 3. శ్రీనృసింహ స్తవరాజము, 4. శ్రీ వాగీశ్వరీ స్తవరాజము, 5. శ్రీ మల్లికార్జున స్తవరాజము. ఇవి క్రమముగా తిరుపతి, భద్రాచలము, సింహాచలము, వాసర, శ్రీశైలము అను మహాక్షేత్రములలో భక్తజనమందారములై యావద్భారతదేశ ప్రఖ్యాతిగాంచిన దైవతములను గురించి వినుతింపబడినవి. భక్తి జ్ఞాన వైరాగ్యములు, క్షేత్రమాహాత్మ్యములు, ధార్మికనీతులు ఇందు ప్రముఖ

1. సూక్తివైజయంతి : 'అభినందన'
2. వీనిని పరిచయము చేయుటలో ఆచార్యులవారి సహకారమేకాక శ్రీ మామిండ్ల రామగౌడుగారు 'అభినవ పోతన'లో రచించిన 'అముద్రిత గ్రంథపరిచయము' ఉపకరించినది.

ముగా ప్రతిపాదింపబడి భక్తులకు సాహిత్యానురక్తులందరికి పఠనీయములై యున్నవి.

చిరకాలము క్రిందట విరచింపబడిన ఈ పంచశతి ప్రస్తుతము ముద్రణలో నున్నది. దీని ప్రచురణకు తిరుపతి దేవస్థానమువారేడువేల రూపాయల నిధి సమర్పించినట్లిటీవలనే తెలియవచ్చినది. ఇది గౌ॥ భారత విదేశాంగశాఖా మాత్య వర్యులు, ఆచార్యులవారి కాప్తులు అగు శ్రీ పి. వి. నరసింహారావుగారి కంకితము చేయబడినది.

## ఖండ కావ్యములు:

ఆచార్యులవారు చాలకాలమునుండి ఆయా విషయములపై రచించుచువచ్చిన ఖండకవిత లనేకముగా గలవు. ఇందు ముఖ్యముగా దేశచరిత్రాత్మక సంఘటనలపై సామాజిక స్థితిగతులపై సందర్భోచితముగా నిర్వహింపబడిన యుత్సవములు మున్నగువానిపై సుప్రసిద్ధ కవిపండిత వరేణ్యులపై ఇట్లే అనేక విషయములపై రచించిన కవితలు కలవు. వీని నన్నిటిని గూర్చి ఒకటి లేక రెండుసంపుటములుగా ప్రచురింపవలెనని యాచార్యుల వారికి కలదు.

## గేయ కవితలు:

'స్వాతంత్ర్య రథం' అను పేరున అనేక గేయకవితలు దేశభక్తి ప్రబోధాత్మకముగా రచించినారు.

## నాటికలు:

ఆచార్యులవారనేక నాటికలు రచించియున్నారు. ముఖ్యముగా 1954 నుండి 1960 వరకు దోమకొండ జనతా కళాశాలలో సాంస్కృతికాధ్యాపకులుగానున్న కాలమున వీనిని రచించి విద్యార్థులచేత ప్రదర్శింపజేసిరి. అవి యివి: 1. రాజ్యశ్రీ, 2. సత్యమేవ జయతే, 3. నాగార్జున సాగరము, 4. జానపద భారతము, 5. గ్రామ సుధార్, 6. స్వతంత్ర భారతము, 7. ఆజాద్ గోవా, 8. సంక్రాంతి, 9. పగటి దొంగలు, 10. స్నేహశక్తి, 11. ఎవడు పెద్ద.

ఈ నాటికలలో దేశభక్తి, జాతీయత, గ్రామీణాభ్యుదయము, సంఘసంస్కరణము, సదాచారము ప్రశస్తముగా ప్రబోధింపబడినవి. ఈ నాటికల రచన మిక్కిలి విశిష్టమై అనేక స్థలములలో ప్రదర్శింపబడి రక్తికట్టినవి.

## నృత్య నాటికలు:

ఆడుచు పాడుచు అభినయించుట కుపయుక్తములగు నృత్యనాటికలు నాల్గిటిని ఆచార్యులవారు రచించిరి, అవి: 1. రైతురాజు, 2. వయోజనవిద్య 3. పెద్దల చదువు, 4. స్వాతంత్ర్య జ్యోతి.

ఈ నాటికలును కవిగారు దోమకొండలో నున్నప్పుడే వ్రాయబడి వేయబడినవి. వీనిలో గ్రామీణ ప్రగతి, సమాజోద్ధరణ, విద్య, దేశభక్తి ప్రబోధింపబడినవి. ఇందులో మొదటి నాటిక 'రైతురాజు' ఆహ్వానము ఖండకావ్యసంపుటిలో ప్రచురింపబడి తర్వాత విప్రలబ్ధలో కొన్ని మార్పులతో కూర్పబడినది.

## ఆకాశవాణి నాటికలు :

ఆచార్యులవా రాకాశవాణి హైదరాబాదు వారి విజ్ఞప్తిపై మూడు రేడియో నాటికలు రచించిరి. అవి 1. మోహినీ భస్మాసుర. 2. మహిషాసుర మర్దని. 3. పోతన.

ఈ నాటికలలో వచనములు గేయములుకూడ కలవు. ఇవి ఆకాశవాణిలో పలుమారులు ప్రసారమై పండితపామరులకు శ్రోతల నందరి మిక్కిలి ఆకర్షించినవి;

## మానవులంతా మనవాళ్లే :

ఇది 300 పుటల నవల విప్రలబ్ధలోని కథను గ్రహించి అనేకానేకములైన మార్పులు చేర్పులతో విస్తరింపజేసి ఇటీవల రచించినది.

## బుఱ్ఱ కథలు :

జానపదములగు బుఱ్ఱకథలను సైతము రమణీయ రసభావోదంచితముగా రచించినారాచార్యులవారు. ఇవియును దోమకొండలో నున్నప్పుడే వ్రాయబడి చెప్ప

బడినవి. 1. రైతుబిడ్డ. 2. బుద్ధచరిత్రము 3. ప్రజాసేవ. 4. ఎవడు రాజు. 5. మనదే జయం. 6. చైనాయుద్ధం. 7. సమాజ సుధార్.

ఇందులో చివరిది హిందీలో రచింపబడినది. వారు హిందీలో విడిగా కొన్ని పాటలు కూడ రచించిరి. ఈ బుఱ్ఱకథలన్నియు దేశభక్తిని, సమాజాభ్యుదయమును, మానవతను ప్రబోధించుచున్నవి.

## హరికథలు :

తొలిప్రాయమున కొంతకాల మగ్రజులగు జగన్నాథాచార్యుల వారితోకలిసి హరికథలు చెప్పిన ఆచార్యులవారు భీమ మానస రక్తి, తులసీ రామాయణము అను రెండు హరికథలు రచించియుండిరి. ఇందు తులసీ రామాయణమును ఇద్దరన్న దమ్ములగు జంటకవులు 'జగదీశ వరద కవులు' అన్న పేరుతో రచించిరి.

## దాగుడు మూతలు :

ఇది వరదాచార్యులవారి ప్రథమ రచన. వాగీశ్వరీ కరుణా కటాక్షమునకు పాత్రులైన తొలినాళ్ళలో తమ పదునైదవ యేట కవితారచనాభ్యాసార్థము 'దాగుడు మూతలు' అన్న శీర్షికతో 400 పాదములుగల తేటగీతి మాలిక రచించి అన్నలను అందరిని ఆశ్చర్య చకితులను కావించిరి. బాలకృష్ణుడు గోపికలతో ఆడిన దాగుడు మూతలు వేదాంతార్థము ధ్వనించునట్లు సరళసుందరముగా రచించిరి. ఈ రచనకు ముందాచార్యులవారు కొన్ని మంగళారతులు రచించిరి. అవియే వారి ప్రప్రథమ రచనలు.

## మాతృప్రేమ :

ఇదియు ఆచార్యులవారి ప్రథమదశా రచనయే. దాగుడుమూతలు రచించిన పిదప దేశమాతను గూర్చిన 'మాతృప్రేమ' యను దేశభక్తి ప్రబోధాత్మక రచన ద్విపదమాలికలో రచించిరి.

## వ్యాస వాణి :

ఆచార్యుల వారప్పుడప్పుడు వ్రాసిన వ్యాసములను రెండు సంపుటములుగా సంకలనము చేసి యుంచినారు. ఈ వ్యాసములలో జిజ్ఞాస-తదవసరము, గణపతి-

అధిక్షేపము, గణపతి-సమర్థనము, ప్రేమ-దానిస్వరూపము, ముమ్మూర్తులు-బ్రహ్మ, హరిహరులు, అనసూయ-అధిక్షేపము తత్సమర్థనము, చరితార్థులు-ఆదర్శములు, అతిబాల్య వివాహములు-వైధవ్యములు, వాగర్థములు-సంగీత సాహిత్యములు, దశావతారములు, భాగవతానువాద చాతురి, కావ్యకళ, ఆధునిక కవిత-పూర్వసాహిత్యము, భారతము-కవిత్రయము, కవిత్వతత్త్వము ఆలంకారికుల దృష్టిలో—మున్నగు వ్యాసము లిందు పొందుపరచబడి యున్నవి. ఇవి సాహిత్యము, కళలు, వేదాంతము, పౌరాణికము, సామాజికము మొదలగు అనేక విషయములతో విలసిల్లి ఆచార్యులవారి బహుముఖ విజ్ఞానమును విచారధారను సరళ మనోహర శైలిలో వ్యక్తముచేయు చున్నవి. వీనిలో చిరకాలము క్రిందట వ్రాయబడిన వ్యాసములలో కొన్ని దురదృష్టవశమున లేకుండపోయినవి.

## భాగవత వ్యాసములు:

ఇటీవల కొందరి కోరికమేరకు శ్రీ మహాభాగవతము మీద మూడు వ్యాసములు రచించిరి. అవి: 1. భాగవతములో భక్తిప్రాధాన్యము-నవవిధభక్తులలో శ్రవణభక్తి ప్రాధాన్యము. 2. పోతనగారి భాగవత రచనావిధానము. 3. గోపికల మధురభక్తి. ఈ మూడు వ్యాసములేకాక మరికొన్ని వ్యాసములు భాగవతము మీద వ్రాయు నవకాశము కలదని ఆచార్యులవారు తెలిపిరి.

## శ్రీ మార్కండేయ సుప్రభాతము:

ఇది కోరుట్లలో వెలసియున్న శ్రీ మార్కండేయస్వామిపై రచింపబడిన ఆంధ్ర సుప్రభాతము. 1972లో కోరుట్ల పద్మశాలి కులోన్నతి సంఘాధ్యక్షులు శ్రీ ఎక్కలదేవి లక్ష్మణగారు విజ్ఞప్తిచేయగా ఆచార్యులవారు వ్రాసియిచ్చిరి. ఇది 21 తేటగీతులలో భక్తిభావబంధురముగా రచింపబడినది. ఇది విడిగా ముద్రింపబడలేదు కాని కోరుట్ల పద్మశాలి సంఘ రజతోత్సవ సంచికలో 1976లో ప్రచురింపబడి యున్నది. ఈ సుప్రభాతము కోరుట్ల మార్కండేయస్వామి దేవాలయములో గానము చేయబడుచున్నది.

## గీతములు

ఆచార్యులవారు ఏబదివరకు గీతములు తెలుగులో హిందీలో రచించినారు. ఇవి దైవభక్తిని దేశభక్తిని జాతీయతను సంఘసంస్కారమును ప్రబోధించుచు వివిధ రాగతాళములలో గానము చేయుటకు మిగుల యోగ్యములై యున్నవి.

## శాకిర్ గీతాంజలి

ఇది యనువాదగ్రంథము. చెన్నూరు ఉన్నత పాఠశాలలో ఆచార్యులవారు అధ్యాపకులుగా ఉన్నప్పుడు 'శాకిర్' అను ఉరుదూకవి ప్రధానోపాధ్యాయుడుగా వచ్చెను. అతని కవితలకు ముగ్ధులై యతనికోరికపై ఆచార్యులవారు వానిని 'శాకిర్ గీతాంజలి' పేరున నాంధ్రీకరించిరి.

## ఇతర కృతులు

ఆచార్యులవారు పైనతెలిపిన కావ్యనాటికాదులే కాక మరెన్నియో రచనలు వివిధాంశములకు చెందినవి విరచించి యున్నారు. వానిని సంక్షిప్తముగా పేర్కొందును.

### 1. అలంకారశాస్త్రము

ఇది పద్యఫణితిలో అలంకారశాస్త్ర విశేషములను తేటతెల్లముగా వివరించుచు వ్రాసిన గ్రంథము.

### 2. గీతోపన్యాసములు

ఇది భగవద్గీతాప్రశస్తిని తెలుపు ఉపన్యాసముల సంపుటి.

### 3. దేశభక్తి

ఇది దేశభక్తిని బోధించుచు ద్విపదలో వ్రాయబడిన లఘుకృతి.

### 4. నరహరి నరసింహారెడ్డి జీవితచరిత్రము

ఇది ఆచార్యులవారి పోషకులగు భీమవరము జమీందారు శ్రీ నరహరి నరసింహారెడ్డిగారి జీవితచరిత్రము మాన్యులు వదాన్యులు తమకనేక విధాల సహాయము చేసినవారగు శ్రీ రెడ్డిగారికి కృతజ్ఞతతో వారి చరిత్ర వ్రాసిరి.

## 5. పోతన

ఇది గద్యములో వ్రాసిన బాలసాహిత్యగ్రంథము. దీనిని ఇటీవలనే తిరుపతి దేవస్థానమువారు ప్రచురించినారని తెలిసినది.

ఇవియే కాక 'తుపాకి రాముడు' 'కోయదొర' వంటి ఏకపాత్రాభినయములు, 'బాధకంటె బోధమేలు' 'గొల్ల సుద్దులు' వంటి ప్రహసనములు కొన్ని రచించిరి. మరియు విద్యాశాఖ డైరెక్టరువారి ఆదేశానుసారముగా ప్రాథమిక పాఠశాలల విద్యార్థుల కుపయుక్తముగా కొన్ని పాఠ్యగ్రంథములును ఆచార్యులవారు రచించి యిచ్చిరి. అందు ముఖ్యమైనది నాలుగవ వాచకము. ఇంకను ఆయా కావ్యాదులకు పత్రికలకు వ్రాసియిచ్చిన పీఠికలు అభిప్రాయములు లెక్కకు మిక్కిలిగా కలవు.

ఆచార్యులవారు సంపుట కవి (Volume Poet) గా ప్రసిద్ధి గాంచినారు. కావ్యరచనయే జీవిత పరమావధిగాగల ఆచార్యులవారి కృతులు, తొలుత మనవి చేసినట్లు, కొన్నియే ప్రచురింపబడి యెన్నియో అముద్రితములుగనే యుండినవి. అవి యెల్ల ప్రచురింపబడినచో ఆంధ్ర సాహిత్యమెంతో సుసంపన్నము కాగలదు. ఆ సుదినము కోసము నిరీక్షింతము.

# ఖండకావ్య ప్రక్రియ — ఆధునిక యుగములో ఖండకావ్యములు

ఆధునికాంధ్ర సాహిత్యమున వెలసిన యనేక ప్రక్రియలలో ఖండకావ్య ప్రక్రియ విశిష్టమైనది. నవ్యకవితా జగత్తులో విరాడ్రూపముతో పరివ్యాప్తమై యగ్రగణ్య ప్రక్రియగా ప్రశస్తి వహించినది. పాశ్చాత్య విజ్ఞాన ఫలితముగను వారి నవ్యసాహిత్య పరిచయమువల్లను ఇరువదవ శతాబ్ది ప్రారంభములో మన సాహిత్య క్షేత్రమునందీ ప్రక్రియ అంకురించి వికసించినది. కాగా, ఈ ఖండకావ్య ప్రక్రియ మన సాహిత్యమునకు కేవలము క్రొత్త కాదు. మన ప్రాచీన లాక్షణికులు ఖండకావ్యమును గురించి చర్చించినారు. లక్ష్యములగు ఖండకావ్యములును మనకు గలవు.

## ప్రాచీన సంస్కృత లాక్షణికుల లక్షణములు ;

క్రీ.శ. 600-680 ప్రాంతమునకు చెందిన భామహుడు.

"సర్గబన్ధోఽభినేయార్థం తథైవాఖ్యాయికా కథే
అనిబద్ధఞ్చ కావ్యాది తత్పునః పఞ్చధోచ్యతే"[1]

అని కావ్యభేదములను తెలుపుచు కావ్యమును 1. సర్గబంధము. 2. అభినేయార్థము. 3. ఆఖ్యాయిక. 4. కథ. 5. అనిబద్ధము- అని యైదు విధములుగా విభజించెను. ఇందు సర్గబంధ మనగా నానారస భావములతో సర్గ- ఆశ్వాస- బద్ధమైన సుదీర్ఘ కథతో విలసిల్లు మహాకావ్యము. దీనినే నిబద్ధ కావ్యమనియు వ్యవహరింతురు. అభినేయార్థమనగా రూపకము. వాస్తవముగా జరిగిన కథను చెప్పెడిది ఆఖ్యాయిక. కల్పితేతి వృత్తము గలది కథ. ఈ రెండును గద్యకావ్య భేదములు. ఇక అనిబద్ధ మనగా పరస్పర సంబంధము లేని కథలుగాని శ్లోకములుగాని కల కావ్యము. ఇందనుస్యూతమగు నొక కథ లేక భావతీవ్రతతో చెప్పబడిన శ్లోకముకాని శ్లోక

1. కావ్యాలంకారము : ప్రథమ పరిచ్ఛేదము, 18 వ శ్లోకము.

సముదాయముకాని యుండును. ముక్తకాదు లిందు చేరును. పై భేదములలో సర్గబంధ మనగా మహాకావ్యమనియు, అనిబద్ధ మనగా ముక్తక రచన యనియు తెలుచున్నది. ఆచార్య దండియు కావ్యభేదములను వివరించుచు సర్గబంధమును ముక్తకాదులను పేర్కొనెను.[1]

ఎనిమిదవ శతాబ్దము వాడగు వామనుడు 'నాఽనిబద్ధంచ కాన్త్యేక తేజః పరమాణువత్'[2] అని పేర్కొనుటచేత ప్రాచీను లనిబద్ధ కావ్యములకు విలువ నిచ్చినట్లు కన్పడదు. కాని 14 వ శతాబ్దివాడగు విద్యానాథుడు కావ్య విశేషములను తెల్పుచు 'అసర్గబంధ మపి యదుపకావ్య ముదీర్యతే' 'అసర్గబంధః సూర్య శతకాదిః'[3] అని యనిబద్ధ కావ్యమును ఉపకావ్యముగా పేర్కొని సూర్యశతకాదులట్టివని వాని యునికిని స్థిరపరచెను.

ఇక మొట్టమొదట ఖండకావ్యమును ప్రస్తావించి దానికి కావ్యగౌరవమును ప్రసాదించిన యాలంకారికుడు విశ్వనాథుడు. ఇతడు విద్యానాథుని కించుక తర్వాతివాడు. ఈయన శ్రవ్యకావ్య నిరూపణము చేయుచు 'ఖండకావ్యం భవేత్ కావ్యస్యైకదేశానుసారి చ'[4] అని లక్షణముచెప్పి 'యథా మేఘదూతాదిః' అని యుదాహరించెను. 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మనిన రసలోలుపుడగుటచేత ఖండకావ్య విశిష్టతను గుర్తించిన విషయము స్తోత్రపాత్రము. ఈ రీతిగా పూర్వ లాక్షిణికులు అనిబద్ధ కావ్యజాతిలోనిదగు ఖండకావ్యమును పేర్కొని కొంతకు గొంత విలువ నిచ్చియుండిరి.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~

1. "ముక్తకం కులకం కోశః సంఘాత ఇతి తాదృశః
సర్గబంధాంగ రూపత్వా దనుక్తః పద్యవిస్తరః, సర్గబంధో మహాకావ్యం..."
—కావ్యాదర్శము : 1-13
2. కావ్యాలంకారసూత్రవృత్తి : ప్రథమాధికరణము, తృతీయాధ్యాయము 29 వ సూత్రము.
3. ప్రతాపరుద్రీయము : కావ్యప్రకరణము - కావ్యవిశేషములు.
4. సాహిత్య దర్పణము : 6-566.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~

## నవ్యుల ఖండకావ్య నిర్వచనములు :

లాక్షణికులు సూత్రీకరించిన లక్షణముల ననుసరించి ఖండకావ్యము కావ్యములోని యేకదేశము-అనగా నందలి లక్షణములలోని కొన్ని లక్షణములు గల చిన్నకావ్యమని తెలియుచున్నది. దీనినే

''మహాకావ్యములలో నేకదేశములైన రసవత్సంఘటనలను గాని నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయాదులలో నేదైన నొకటిగాని తీసికొని రసభావ బంధురములైన రమణీయ రచనలు చేయవచ్చు. అట్టివానికే ఖండకావ్యములని పేరు"[1] అని ఇంద్రగంటివారు విశదీకరించిరి.

''కావ్యలక్షణములన్నీ లేకపోయినా స్వయంసంపూర్ణమై పూర్వాపర నిరాకాంక్షమై పరిసమాప్తార్థకమై రసపర్యవసాయి కాగలిగిన కావ్యైకదేశము ఖండకావ్యము"[2] అని సంపత్ రాఘవాచార్యులుగారును,

''ఇంతకు ఖండకావ్యమనగా చిన్నకథ, కొన్ని పాత్రలు, పరిమిత పద్యములుండి ఆశ్వాసవిభక్తము కాని రచన కావచ్చును. లేక ఒక పద్యమో కొన్ని పద్యములో ఉన్న రచన కావచ్చును"[3] అని ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డి గారును స్పష్టపరచిరి.

పై లక్షణములను సమన్వయించి పరిశీలించిన ఋగ్వేదములోని ఉష స్సూక్తములు[4], మేఘ సందేశము, ఋతు సంహారము మున్నగునవి ఖండ

1. 'మేఘసందేశము మహాకావ్యమట' వ్యాసము : భారతి, నవంబరు 1939.
2. తెలుగు విజ్ఞాన సర్వస్వము 4 వ సంపుటము : 'ఖండకావ్యము-భావకవిత్వము' వ్యాసము.
3. అధునికాంధ్ర కవిత్వము : నవ్యకవిత్వ లక్షణములు -'ఖండకావ్య ప్రక్రియ' పుటలు 176,177.
4. "మహేనో అద్య బోధ యోషో రాయే దివిత్మతీ। యథా చిన్నో అబోధయః సత్యశ్రవసి వాయ్యే సుజాతే అశ్వసూనృతే" ఉషస్సూక్తము - ఋగ్వేదము. 5-79-1.

ఎట్లు ప్రాతర్వేళ దినమును కలిగించి అందరిని మేల్కొల్పునో అట్లే విద్యాయుక్తస్త్రీ తన సంతానమును అవిద్యాసదృశమైన వర్తమాన నిద్రనుండి లేపి విద్యను ప్రాపింపజేయును.)

కావ్యములే. గాథాసప్తశతిలోని శ్లోకములు వేనికవే స్వయంపూర్ణములై యున్నందున నవి ముక్తకజాతికి చెందును. విద్యానాథుడు సూర్యశతకాదుల నసర్గబంధములని పేర్కొన్నందున అమరుక శతకము మొదలుకొని సంస్కృతాంధ్రములలోని శతకములన్నియు ముక్తకములుగానే పరిగణింపబడును. నవీనులు ముక్తకాదులను కూడ ఖండకావ్యములుగానే భావించుచుండుటచేత అనిబద్ధ కావ్యములగు శతకములను ఖండకావ్యములుగా పేర్కొనవచ్చును.[1] పూర్వకవుల చాటు పద్యములును ఈ కోవలోనికే వచ్చును.

"మహాకావ్యములనుండి రసపద్ఘట్టములు కాని, ఒక ఏకవిషయమును గురించి వ్రాసిన కొన్ని పద్యములు కాని విడిగా తీసినచో అవి ఖండకావ్యము లగును."[2] అని వివరింపబడుట చేత పూర్వమహాకావ్యములనేకముల నుండి యనేక ఖండకావ్యములను వేరు చేయ వచ్చును. కావ్యములలోని ఋతువర్ణనలు, నగరార్ణవ శైలాది వర్ణనలును ఈ శ్రేణిలో చేరును.

మహాభారతములోని ఉదంకోపాఖ్యానము, దేవయాని కథ, తపతి సంవరణోపాఖ్యానము, కిరాతార్జునీయము, నలోపాఖ్యానము, అగస్త్యాదుల కథలు, ధర్మవ్యాధుని కథ, సావిత్ర్యుపాఖ్యానము, కీచక వధ, విదుర నీతులు, శ్రీకృష్ణ రాయబారము మున్నగు ఘట్టములను, భాగవతములోని ధ్రువోపాఖ్యానము, ప్రహ్లాద చరిత్రము, గజేంద్ర మోక్షణకథ, వామన చరిత్రము, కుచేలోపాఖ్యానము, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, భ్రమరగీతలు, గోపికా గీతలు మొదలగు భాగములను, రామాయణములోని ఋశ్యశృంగ వృత్తాంతము, విశ్వామిత్ర చరిత్రము, సీతా కల్యాణము, సీతాపహరణము, వాలివధ, హనుమత్సందేశము, కాలనేమి వృత్తాంతము, సీతాపరిత్యాగము ప్రభృతి ఘట్టములను, ప్రబంధాదులలోని ప్రవరుని

---

1. "నవ్యకవిత్వంలో ఖండకావ్య మన్న పదము పై అర్థములోనే నియతము కాలేదు. ఆధునికార్థములో ముక్తకము, కులకము, పర్యాయబంధము వంటి కావ్యభేదాలు కూడా గతార్థము లవుతున్నవి. నాతి దీర్ఘములై ఏక విషయకములైన పద్యరచనలను ఆధునికులు ఖండకావ్యాలుగా పరిగణిస్తున్నారు.

—తెలుగు విజ్ఞాన సర్వస్వము—4వ సంపుటము, 'ఖండకావ్యము-భావకవిత్వము' వ్యాసము.

2. రత్నాపణ సమీక్ష : ఆంధ్రవారపత్రిక, 5వ జనవరి 1938.

హిమాచలయాత్ర, వరూధినీ ప్రవరాఖ్యుల సంవాదము, గిరికా వసుమహారాజుల ప్రణయము, సత్యభామా సాంత్వనము, ఖాండిక్య కేశిధ్వజ సంవాదము, మాల దాసరికథ, తిన్నని శివభక్తి, నత్కీరుని కథ, శివభక్తురాండ్రగు వేశ్యాపుత్రికల కథ, నలుని రాయబారము, నిగమశర్మోపాఖ్యానము, సుశీలోపాఖ్యానము, సుగాత్రీ శాలీనుల కథ, శుచిముఖీ దౌత్యము మున్నగు ననేక రసవద్ఘట్టములను వేరుచేసిన నవి చక్కని ఖండకావ్యములై యొప్పారగలవు.

ఆయా కావ్యాలలో గోచరించు వర్ణనాంశములు కవులచేత ముందుగా విడిగా ఖండకావ్యములుగా రచింపబడి తర్వాత వారిచేత సంతరింపబడిన మహాకావ్యములలో సందర్భానుసారముగా చేర్పబడిన వను పండితాభిప్రాయము కలదు.[1]

ఈ రీతిగా పూర్వము నుండియు ఖండకావ్య ప్రస్తావన, తదీయలక్షణము, తల్లక్ష్యములగు ఖండకావ్యములు మనకుండగా ఈ ప్రక్రియ మనకు సహజమైనది కాదనియు ఆంగ్లసాహిత్యము నుండి యిది మనకు సంక్రమించిన దనియు భావించుట కలదు.[2]

ఖండకావ్యప్రక్రియ మన కాంగ్లసారస్వతము నుండియే దిగుమతి యైనదను మాట పూర్వము నేను మనవి చేసినట్లు కేవలము సత్యముకాదు కాని వారి సారస్వతము నధ్యయనముచేసి ప్రేరణపొంది మనవారును ఖండకావ్యములను పుష్క-

1. "భారత భాగవతాది గ్రంథాలలో ఆయా చోట్లలో ఉన్న వర్ణనలూ, ప్రబంధాలలో అక్కడక్కడ కొందరు విమర్శకులచేత అప్రస్తుతాలని అనబడే వర్ణనాంశాలు కూడా ఖండకావ్యాలని మనము తలచ వచ్చును. ఆయాకవులు ఈ వర్ణనలను గ్రంథరచనా కాలమునందే వ్రాయకపోవచ్చుననీ, తమకు ఊహాపరంపర వచ్చి నప్పుడు తత్తత్కాలాలలో వ్రాసియుండి గ్రంథరచనా కాలములో వానిని ఆయా సందర్భాలలో దూర్చియుందు రని కొందరు సాహిత్యవేత్త లభిప్రాయ పడుచున్నారు.''

—నవ్యాంధ్ర సాహిత్యవీథులు: ద్వితీయభాగము 5, నవ్యసాహిత్య ప్రక్రియలు-ఖండకావ్యము.

2. "కథలకేం ఖండకావ్యాలకేం పాశ్చాత్యుల వరవడి"—విశ్వనాథ సత్యనారాయణ 'జయంతి' లో

లముగా వ్రాసి యీ ప్రక్రియను వివిధముఖములలో బహుళవ్యాప్తిలోనికి తెచ్చి రను మాట వాస్తవము.

## ఖండకావ్య ప్రక్రియావ్యాప్తికి హేతువులు

మన ప్రాచీనులు ఖండకావ్యమును పేర్కొన్నను వామనుని వంటి లాక్ష ణికుడు 'నాఽనిబద్ధంచ కాస్త్యేక తేజః పరమాణువత్' అని యనిబద్ధ - ముక్తక- రచనను పరమాణువువలె కాంతిలో నొకకిరణమని చెప్పుటచేత నాటి లాక్షణికులు పండితులు దానికి విలువనీయలేదని తెలియుచున్నది. అందువల్లనే మేఘదూతాది ఖండకావ్యములు క్వాచిత్కముగా నున్నను, ముక్తక శ్రేణిలోనివగు శతకాదు లున్నను ప్రాజ్ఞులు వానికి కావ్యగౌరవమిచ్చి యాదరించలేదు. వేలకొలది పద్యములు వ్రాసి విశిష్ట సాహిత్యసృష్టి చేసిన వేమనను మహాకవిగా నిన్నమొన్నటి వరకు సన్నుతింపలేకపోవుటయే దీనికి తార్కాణ. ఈ యనాదరమునకు మరొక కారణము కూడ గోచరించును. ఉపాహారముల వంటి ఖండకావ్యములతో ప్రాచీనులు తృప్తి పడలేదు. షడ్రసోపేత సంపూర్ణ భోజనము వంటి నానారసభావ బంధురములైన మహాకావ్యములనే తనివితీర సేవించిరి. కవులిదే దృక్పథముతో మహాకావ్యములనే విరచించి కృతార్థులైరి కాని లఘుకావ్యములు వ్రాసి తనివి చెందలేదు.

పాశ్చాత్య విజ్ఞానఫలితముగా సమాజములో ఎంతో మార్పు వచ్చి, వారి నాగరకతా సంపర్కమువల్ల జనజీవన పద్ధతిలో మున్నెన్నడులేని వేడి వాడి పుట్టినది. యంత్రయుగము కారణముగను ప్రజలు త్వరజీవనమున కలవడిరి. ఈ స్థితిగతు లితరరంగములను వలెనే సాహిత్యరంగమును ప్రభావితము చేసినవి. బహు కార్యభారమగ్నులును బహుళసమస్యా సంక్షుభిత మానసులును అగు సాహితీ పరులకు మహాకావ్యములను పఠించు తీరిక ఓపిక లేకుండపోయినవి. సూక్ష్మములో మోక్షమన్నట్లు అల్పకాలముననే అనల్ప కవితా రసాస్వాదనచేసి తృప్తిపడ గడంగిరి. కవులకును పూర్వకవులవలె మహాకావ్యములు వ్రాయుట కనువుకాని కాలము వచ్చినది. వారి కావ్యములకుమెచ్చి అగ్రహారాదులిచ్చి పోషించు ప్రభువులు లేరైరి. కనుక తీరికసమయములో ఆత్మానందమునకు కవులు కవితలు వ్రాయ వలసిన వారైరి. మరియును వారు వ్రాసెడి మహాకావ్యములను ప్రచురించుటకు పత్రికల కవకాశము లేకపోయెను. ఈ కారణములెల్ల ఖండకావ్య రచనకు దారి

తీసినవి. ఇట్టి పరిస్థితిలో తెలుగుకవుల కాంగ్లసాహిత్యములోని రసవత్ ఖండకావ్యములతో పరిచయమేర్పడి తత్పఠనమువల్ల ముగ్ధులై ప్రభావితులై తాము ను ఖండకావ్యములు విరివిగా విరచింప మొదలిడిరి. ఈ విధముగా మన కాంగ్లసారస్వతము ఖండకావ్యరచనకు తత్ప్రక్రియా ప్రచురతకు ఒరవడిపెట్టినది.

గురజాడవారి ముత్యాలసరములలోని 'దేశభక్తి' 'పూర్ణమ్మకథ' 'లవణరాజు కల' 'కన్యక' మున్నగునవి, రాయప్రోలువారి 'తృణకంకణము' 'స్నేహలతాదేవి' మొదలగునవి తొలిదశలో ఆవిర్భవించిన ఉత్తమ ఖండకావ్యములు.

ఖండకావ్యము యొక్క లక్షణము చర్చించిన మీదట సమ్యగవగాహనకై దాని స్వరూప స్వభావములను సంగ్రహముగా మనవి చేయుదును.

## ఖండకావ్య స్వరూపము

ఖండకావ్య స్వరూపము ప్రధానముగా దాని పరిమాణము, వస్తువు, భావము అనువానిచేత వ్యక్తమగును.

## పరిమాణము

మహాకావ్యములలో ఒక విపులమైన కథ అంగప్రత్యంగములతో ఆశ్వాస విభక్తమైయుండును. అంగాంగిరసములతో ననేక సన్నివేశములతో సుదీర్ఘ వర్ణనలతో కొన్నివందల పద్యాలతో కావ్యము విస్తరించి యుండును. ఖండకావ్యము కావ్యమునందేకదేశమని చెప్పబడుటచేత ఒక చిన్నకథ, కొన్నిపాత్రలు, ఒక కొన్నిపద్యాలు గల ఆశ్వాస విభక్తముకాని చిన్నకావ్యము. అనిబద్ధకావ్యజాతిలోనిది కనుక కథలేని యొక పద్యముకాని కొన్నిపద్యములుకాని యున్న స్వల్ప రచనయు కావచ్చును.ఖండకావ్యశ్రేణిలో పూర్వము ముక్తకములు రచింపబడినట్లే నేడు 'మినీ కవితలు' అని ఒక్కొక్క పద్యముతోగాని నాలుగుపంక్తుల గేయముతోగాని వ్రాయబడుచున్నవి.

## వస్తువు

స్వల్ప పరిమాణముగల ఖండకావ్యములో మహాకావ్యమునందువలె సుదీర్ఘమైన యితివృత్తమునకుగాని బహుళ సన్నివేశములకుగాని అవకాశములేదు కావున

నేదేని చిన్న కథనుగాని, కథలోని యొక సన్నివేశమునుగాని, కథలేని యొకానొక విషయమునుగాని వస్తువుగా తీసికొని రచన చేయుట జరుగును. ప్రకృతిలోని సుందర దృశ్యములను, విలక్షణ వస్తువులను, సమాజములోని ఘటనలను చూచి నప్పుడు కాని వానిగూర్చి విన్నప్పుడు కాని లేదా అట్టివి హృదయ దర్పణములో నలవోకగా మెరసినప్పుడు కాని పెల్లుబుకు భావముల కక్షరసౌధము నిర్మించు టలో ఖండకావ్య మేర్పడును.

ధనంజయుడు దశరూపక గ్రంథోపసంహారమున

"రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచం-
ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే"[1]

అని వివరించెను. రమ్యమైనదైనను రోతగొల్పునదైనను ఉత్తమమైనదైనను అధమమైనదైనను వస్తువెట్టిదైనను లోకమున కవిచే భావ్యమానమై రసస్ఫూర్తిని కలిగింపనిది లేదని దీని సారాంశము. ఆంగ్లసాహిత్యమున సైతమిదే యభిప్రాయము కలదు.

"Poetry turns all things to loveliness." "It exalts the beauty of that which is most beautiful and it adds beauty to that which is deformed." అని షెల్లీ మహాకవి యుల్లేఖించెను. ఏతదను సారముగానే శ్రీశ్రీ

"కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్లా
హీనంగా చూడకు దేన్నీ
కవితామయమేనోయ్ అన్నీ !"[2]

---

1. దశరూపకము : చతుర్థ ప్రకాశము, 86 వ శ్లోకము.
2. మహాప్రస్థానం : 'ఋక్కులు'

అని వ్రాయుట జరిగినది. ఎట్టి వస్తువైనను కవిచేతిలోబడి పరుసవేదిచేత ఇనుము బంగారమగునట్లు చక్కని కవితగా- కావ్యముగా- రూపొందగలదు. కావుననే నవ్యకవులు కనపడ్డ వస్తువునెల్ల గ్రహించి కమ్మని ఖండకావ్యాలుగా మలచినారు. బిచ్చగత్తె, గడ్డిపరకలు, శ్మశానవాటి, గిజిగాడు, పరిగపిల్ల, పెంటపేలిక వంటి అతి సామాన్య వస్తువులు మొదలుకొని భీష్ముడు, కుంతీకుమారి, ఆంధ్రభోజుడు, అజంతా సుందరి, భరతమాత వంటి యుదాత్త వస్తువుల వరకన్నియు ఖండ కావ్యములై శోభిల్లినవి.

## భావము :

మహాకావ్యములలో కవిభావన బాహ్యమౌ కావ్యకథా విషయోపాధికమై నాయికా నాయకాది పాత్రల నాశ్రయించి యుండును.అందు కవి యనుభూతి యితి వృత్తానుసారముగా నన్యాపదేశముగా సముచిత పరిణామము చెందును. ఖండ కావ్యమునందట్లు కాక కవిభావన ఆంతర విషయోపాధికమై సాధారణముగా ఆత్మాశ్రయమై యుండును. అతని యనుభూతి యన్యారోపితము కాక హృదయ జన్యమై తీవ్రముగా సముద్గత మగును. వస్తుభావ రచనలలో భావమునకే యిందు ప్రాధాన్యముండును. ఒకానొక సన్నివేశము చూచినపుడు కాని విన్నపుడు కాని హృదయములో నొక విశిష్టమైన స్పందన కలిగి యిది వాగ్రూపము దాల్చి ఖండ కావ్యముగా పరిణమించుచుండును.

## నవ్యకవిత్వ లక్షణములు[1] :

నవ్య కవిత్వ లక్షణములలో నొకటిగా పేర్కొనబడిన ఖండకావ్య రచనా విశిష్టతను పరిశీలించునపుడు నవ్యకవిత్వ లక్షణము లేవియో ప్రస్తావించుట యవసరము. ఆధునిక ఖండకావ్యములలో సంప్రదాయ కవిత కొన్నిటనున్నను ప్రాయికముగా నవ్య కవితయే తరచుగా జాల్వారి యున్నందువల్లను నవ్య కవిత్వ లక్షణములను స్థూలముగా తడవెదను.

1. ఈ విషయము వ్రాయుటలో ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి 'ఆధునికాంధ్ర కవిత్వము' లోని వ్యాసము లుపకరించినవి

## 1. వస్తు నవ్యత :

పూర్వ కావ్యములలో నూటికి తొంబది తొమ్మిది ప్రఖ్యాతములు మిశ్రములు నగు నితివృత్తములతో నిండియున్నవి. కల్పిత కావ్యములను ప్రాచీనులంతగా గౌరవింపలేదు. కళాపూర్ణోదయమువంటి కల్పిత ప్రబంధములను దృష్టియందుంచుకొని 'కేవల కల్పనా కథలు కృత్రిమరత్నములు'[1] అని రామరాజభూషణుడు నిరాదరణము చేసెను.

ప్రాచీన కావ్యములలోని పాత్రలు సాధారణముగా దివ్యులు, దివ్యాదివ్యులే. అదివ్యులు (మర్త్యులు) ఉన్నను నగ్రవర్ణమునకు చెందినవారే. రామాయణమున గుహుడు శబరి వంటి గిరిజన పాత్రలు, భాగవతమున గొల్లల యుదంతము మున్నగునవి యున్నను నవి పరిమిత ప్రయోజనము కలవియు భక్తిరస పర్యవసన్నములైనవియునై యున్నవి. మరియు ప్రాచీన కావ్యములలో చతుర్విధ నాయకులుండి యగ్రవర్ణములతో ముడిపెట్టబడిరి. శూద్రులకు తప్ప తక్కిన వర్ణముల వారికి నాయకులగుట కర్హత కల్గింపబడెను. నవ్యకవిత్వమున సాంఘికమైన యితివృత్తముతో వర్ణప్రసక్తి లేకుండ సామాన్యుని నాయకునిచేసి కావ్యములు వ్రాయబడినవి. ఇందు నాయికా నాయకులకు గుణమే ప్రధానము కాని కులము కాదని తేల్చివేయబడినవి. 'లవణరాజు కల' 'ఎంకిపాటలు' 'గబ్బిలము' 'కృషీవలుడు' మున్నగునవి యనేకములు నవ్యకవితకు మచ్చు తునుకలు.

ప్రాచీన కావ్యములలో ముఖ్యముగా ప్రబంధములలో స్త్రీ సౌందర్యవర్ణన మతివేలమై యున్నది. సాంప్రదాయికమైన స్త్రీ వర్ణనలో పడి కవులు సంయమనమును సభ్యతను కోల్పోయి కచ కుచాద్యంగములను విడువక నఖశిఖపర్యంతము బాహాటముగా వర్ణించిరి. నవ్య కవిత్వమున నివి పరిహరింపబడి మగువల యవయవ వర్ణనకంటె సభ్యమైన ముఖనేత్రాది వర్ణన, దానికంటె వారి మనస్తత్త్వ వర్ణనమే ప్రధానముగా చేయబడుచున్నది.

---

1. వసుచరిత్రము : 1-19.

## 2. భావ ప్రాధాన్యము ;

ప్రాచీన కావ్యములలో భారతాదులు వస్తు ప్రధానమైనవి. ప్రబంధములలో వస్తువు సన్నగిల్లి దీర్ఘ వర్ణనలు తావు చేసికొన్నవి. వస్తు భావ రచనలలో కవిత్వమునకు ప్రధానమైన భావము పూర్వ కావ్యములలో సాధారణముగా కొరవడినది. గతానుగతికముగా నగరార్ణవ శైలర్తు వనాదులను వర్ణించుట, అందు నిసర్గ రమణీయ భావములను గాక కృత్రిమముగా నతిశయోక్తులతో కవిసమయములతో మేధాగత కల్పనలతో ఊహలతో రీతి ప్రాధాన్యముతో ప్రాయికముగా పూర్వకావ్యములు రచింపబడినవి. నవ్య కావ్యములలో నిట్టి వర్ణనలకు చోటీయక భావమునకే యగ్ర తాంబూల మీయబడినది. అనుభూతి విలసితమైన ఆర్ద్రమైన భావములే యిందు పసందుగా విందొసంగుచుండును. ఈ విషయమున భావ కవితా శాఖలు నవ్య కవిత్వ వటమున బహుభంగుల విస్తరిల్లియున్నవి.

## 3. శైలీ సారళ్యము :

పూర్వ ప్రబంధములు దీర్ఘసమాసాన్విత జటిలశైలితో మారుమూల పదములతో గహనసంచారము చేయుచుండును. సంస్కృత పద బహుళమైన ఆ కృతులలో అచ్చమైన తెలుగు నుడికారము కరవైపోయినది. ప్రబంధయుగము చివరి దశలో గర్భబంధ చిత్రకవిత్వములు పెచ్చుమీరినవి. ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములు పుట్టినవి. శ్లేష యమకాది కృత్రిమ శబ్దార్థాలంకార భారముతో కవితాకన్య భావ శూన్యయై వెలవెల పోయినది. ఈ దుస్థితిని కందుకూరి వీరేశలింగము పంతులు గారు తమ 'సరస్వతీ నారద సంవాదము'లో వ్యక్తము చేసి నిరసించి యుండిరి.

నవ్య కవిత్వమున తత్సమ పదబాహుళ్యము, సమాస జాటిల్యము, వ్యర్థ పదాడంబరము విడనాడి గర్భచిత్రాది కవిత్వములను త్రోసిపుచ్చి భావ ప్రధానమైన రచనలు సంస్కృతాంధ్ర సరళపద సమ్యక్సమ్మేళనముతో శైలీ సారళ్యముతో కావింపబడినవి. గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, జాషువా మున్నగు ప్రముఖ కవులీ నవ్యకవితకు రాచబాటలు వేసిరి.

## 4. పదప్రయోగ నవ్యత ;

నవ్య కవిత్వములో పదప్రయోగ విషయమునను నవ్యత గోచరించును. పూర్వ కావ్యములలో ప్రయుక్తమై వ్యవహారభ్రష్టములైన పదములను నవ్యులు

పూర్తిగా వదలివేసిరి. 'కంపు' అను పదమున్నది దీనికి సువాసన యను నర్థము కలదు. ఈ యర్థమున 'పువ్వుల కంపు' అని తిక్కన ప్రయోగించెను. దీనికి మధ్యయుగ కవిప్రయోగమును కానవచ్చును. 'పణ్యారంపుఁ బుణ్యాంపుఁ గంపుల'1 యని కృష్ణదేవరాయలు ప్రయోగించెను. ఈ పదము కాల క్రమమున నర్థవిపరిణామము చెంది 'దుర్గంధము' అను దురర్థము నిచ్చుచున్నది. కావున నవ్యకవులిట్టి పదములను పరిత్యజించిరి.

ప్రాచీన కావ్యములలో తరచుగా గనబడు 'ఇమ్మగ, మానుగ, ఒనరన్, అలరన్, ధారుణి' వంటి పాదపూరణ శబ్దములను నవ్యులు విడిచిపెట్టిరి. వీరు వ్యర్థ పదములను దొరలనీయక బాగుగా వాడుకలోనున్న పదముల ప్రయోగ ముతో ప్రసాద గుణభాసురముగా రచనలు కావించిరి.

ఆధునిక కావ్యములలో శిష్టవ్యవహారములోని పదములను వాడుట మరొక నవ్యలక్షణము. పూర్వము శ్రీకాళహస్తీశ్వర శతకాదులలో అంతా, చేసీ మున్నగు వ్యావహారిక పదప్రయోగములున్నను బహుస్వల్పము. ఆధునిక యుగములో గిడుగువారి వ్యావహారిక భాషావాదము, గురజాడవారి సాహసిక వ్యావహారిక ప్రయోగము నవ్యులకు మార్గదర్శకములైనవి. జన వ్యవహారములోని పదములు కావ్యప్రయోగార్హత గాంచుట గొప్పమార్పు.

## 5. ఆత్మాశ్రయ కవితారీతి ;

పాశ్చాత్య విమర్శకులు కవిత్వమును వస్త్వాశ్రయ కవిత్వము (Objective Poetry), ఆత్మాశ్రయ కవిత్వము (Subjective Poetry) అని రెండు విధములుగా విభజించిరి. ఈ విభాగము మన సాహిత్యములో ఆంగ్ల సంప్ర దాయము ననుసరించి వచ్చినది. మన ప్రాచీన కావ్యములలో నించుమించు వస్త్వాశ్రయ కవితారీతియే యంతట నెలకొనియున్నది. వస్త్వాశ్రయ కవితా రీతిలో కవి కావ్యములోని నాయికా నాయకులద్వారా తదితర పాత్రలద్వారా తన యభిప్రాయములను వ్యక్తముచేయును. ఇందు కవి తన వ్యక్తిత్వమును మరచి, తన యనుభూతులను అభిరుచులను అణచుకొని కావ్యగత పాత్రల భావములలో

1. ఆముక్తమాల్యద : 1-73

చేష్టలలో లీనమై కథాముఖమున తన భావములను ప్రకటించును. ఆత్మాశ్రయ కవితారీతిలో కథ యుండదు. నాయికా నాయకులుండరు. ఇందు కవియే యాలంబన విభావమై సుఖదుఃఖాదుల నన్నిటిని స్వయముగా ననుభూతి పొంది తద్భావములను సూటిగా కవితలో వ్యక్తము చేయును. దీనినే డబ్ల్యు. హెచ్. హడ్సన్ మహాశయుడిట్లు వివరించెను.

"In which the poet goes down into himself and finds his inspiration and his subjects in his own experiences, thoughts and feelings."[1]

మన పూర్వ కావ్యములలో శతకములు మాత్రము ఆత్మాశ్రయ కవితా రీతితో నొప్పారుచున్నవి. ఐనను నవి సాధారణముగా భక్తిభావముతో నిండి పారమార్థిక ప్రయోజనము కలవి కావున జీవితములోని సమస్తానుభూతుల నవి స్పృశింపలేవు. సుఖదుఃఖములను శుభాశుభ సంఘటనలను ఆశానిరాశలను అనేకానేక జీవితానుభవములను మనోభావములను అవి వ్యక్తము చేయజాలవు. నీతి శృంగార శతకములున్నను నట్టివానిలో కవి తన మనసులోని యభిప్రాయముల నేకరువు పెట్టినట్లు చెప్పివేయుటయే కాని బాగుగా నూహించి భావబంధురముగా సంతరింపలేదు. ఇట్లు శతకములలోని కవితకు నవ్యుల యాత్మాశ్రయ కవితకు కొంత భేదమున్నది. శతకములలో ఆత్మాశ్రయ కవిత్వమున్నను ప్రాచీనులు వాని నుత్తమకావ్యములుగా పరిగణింప లేదు.

పూర్వము కవిత్వమనగా కథతోగూడిన కావ్యమే. కథ లేనిది, అంగ ప్రత్యంగములతో నిండుగా నితివృత్తము సాగనిది కావ్యమే కాదు. కావున ముక్తక జాతిలో చేరిన శతకములను గౌరవింపక శతక కవులను ప్రథమశ్రేణికవులలో చేర్చక యుండిరి.[2]

1. An Introduction to the study of Literature : Page 96
2. నవయుగ వైతాళికుడగు కందుకూరి వీరేశలింగము పంతులుగారు సైతము శతక కవులను పరిగణింపలేదు. వారి 'తెలుగు కవుల చరిత్ర'లో నొక్క శతక కవిని గూర్చి యైనను వ్రాయలేదు. బహుజనపల్లి వారు ప్రామాణికమైన తమ శబ్దరత్నాకరములో నొక్క శతకకవి ప్రయోగమైనను నుదాహరింపలేదు.

ఆత్మాశ్రయ కవిత్వములో కథను సాగదీసి పూరించవలెనను ప్రయత్న ముండదు. అవసరమున్నను లేకున్నను వర్ణనలు చొప్పించవలెనను నవస్థ యుండదు. ఇందులో చెప్పినదంతయు నసలైన కవితయై భాసిల్లుచుండును. ఇట్టి ఆత్మాశ్రయ కవితను గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి మున్నగు నవ్యకవి వరేణ్యులు లోకోత్తరముగా వెలయించిరి.

## 6. దేశికవితా రచన :

సంగీత సాహిత్యములలో మనకున్న మార్గ దేశి విభాగములలో నన్నయ నుండి చిన్నయ వరకు దాదాపు మార్గకవితయే విస్తరించియున్నది. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రములో పేర్కొన్న వెన్నెల తుమ్మెద గొబ్బి పదములు మున్నగు దేశిరచనలు ఆదికవి నన్నయగారి ప్రబలమైన మార్గ కవితా ధాటికి నిల్వలేక యణగారి పోయినవి. దేశిరచనయు పదకవితలో చేరినదియనగు ద్విపదలో రంగనాథరామాయణము బసవపురాణము మొదలగు కావ్యములు వెలసినను వానిని ప్రాచీనులు వృత్తకావ్యశ్రేణిలో నిల్పి గౌరవింపలేదు. పైగా 'ద్విపదకావ్యంబు ముదిలంజ దిడ్డిగంత' యనియు 'ముదివిటులు విధవలంజలు పదకవితలు మారుబాస బాపనవారల్' అనియు నీసడించి యుండిరి. ప్రబంధము లలో కొన్నిట దేశికవితలగు రగడలు పుష్పాపచయ ఘట్టముల వసంతర్తు వర్ణనల రచింపబడి యున్నను నవి ఛందస్సుమార్పు కోసము వ్రాయబడినవే కాని పెద్దగా కావ్యరచనకు కాదు. దక్షిణాంధ్రయుగములో యక్షగానాదులలో దేశిరచన సాగినను అందలి కవితాగుణమును సంగీతము డిందుపరచినది.

నవ్యకవితలో దేశిరచన యొక ముఖ్య లక్షణము. మాత్రాచ్ఛందస్సులోని వగు నవవిధ రగడలు దేశిరచనలు. నవ్యులీ రగడలను గ్రహించి చక్కని గేయములను కావ్యములను రచించిరి. గురజాడ అప్పారావు తొలుదొలుత నిట్టి దేశిరచనలు మహాప్రశస్తముగా కావించి మార్గదర్శకు డాయెను.

## 7. ప్రక్రియా బాహుళ్యము :

పూర్వము కవులు గణిత వైద్యాది శాస్త్రములను ఛందోవ్యాకరణాది లక్షణ గ్రంథములను పద్యములలోనే వ్రాసిరి భారతాది పూర్వ కావ్యములలో, ప్రబంధ

ములలో జ్యోతిష వేదాంతాద్యనేక శాస్త్ర విషయములను సందర్భానుసారముగా రచనాబద్ధ మొనర్చిరి. నవ్యులట్లుగాక కవితాగుణ మున్న విషయములనే పద్య గేయ రూపములో వెలయించిరి. మరియు భావకవితోద్యానమున మున్నెన్నడులేని బహువిధ కవితాలతలను ప్రోది చేసిరి. ప్రకృతి కవిత్వము, ప్రణయ కవిత్వము, పల్లీజన కవిత్వము, దేశభక్తి కవిత్వము, దైవభక్తి కవిత్వము, సంఘసంస్కార కవిత్వము, స్మృతిగీతములు, బాలగేయములు-ఇత్యాది బహుళ ప్రక్రియా కవితలను నవ్యకవిత్వమున విస్తరింపజేసిరి. ఇట్లు బహువిధముల నవ్యతతో ఆధునిక కవిత వెలసి ఖండకావ్యముల ద్వారా సాహితీపరుల కుపాదేయమై యొప్పారు చున్నది.

## ఖండకావ్య విశిష్టత, తత్ప్రయోజనములు

నవ్యకవిత్వములో అగ్రగణ్యప్రక్రియగా విలసిల్లిన ఖండకావ్యముయొక్క లక్షణము దాని నవ్యత చర్చించిన పిమ్మట దాని విశిష్టత, ప్రయోజనము నెట్టివో గమనింపవలసియున్నది.

ఖండకావ్యము కవితారచనకు నితాంతమనుకూలముగా నుండి కవులకెంతో అందుబాటులోనున్న ప్రక్రియ. "కవి గుండెను చీల్చుకొని వెలికుబికివచ్చు భావ ధారలకు ఖండకావ్యమునకు మించిన వాహిక లేదు."[1] అని నారాయణరెడ్డిగారన్న మాట సారభూతమైనది. కవి తాను పొందిన యనుభూతిని, మదిలో చెలరేగు భావములను చక్కగా చిక్కగా వెలిపుచ్చుటకు ఖండకావ్యము మిక్కిలి యుపయోగించును. హృదయోద్గతార్ద్రభావములను కవి తీవ్రముగా వ్యక్తము చేయుటకును, సహృదయములు ఝుటితిస్ఫూర్తినంది కరగిపోవుటకును ఖండకావ్యము సులభతర సాధనమై యున్నది. ముఖ్యముగా ఆధునిక యాంత్రిక యుగమున త్వరజీవనమున కలవాటుపడిన నేటి సాహితీపరుల కత్యంతాగత్యమై యొప్పుచున్నది. ప్రచార సాధనములగు పత్రికలకు, ఆకాశవాణికి ప్రచురణ ప్రసారములకు ఖండకావ్యములు మిగుల ననుకూలములై యున్నవి.

1. ఆధునికాంధ్ర కవిత్వము : 'నవ్యకవిత్వోదయము' పుట 176.

ఖండకావ్యముల ద్వారా నవ్యకవిత్వ ప్రక్రియలన్నిటిని రచించుటకు చక్కని యనువేర్పడినది. ఆధునిక ఖండకావ్యములలో సంప్రదాయ కవితతోపాటు నవ్య కవిత్వోద్యమములగు భావకవిత, తదీయశాఖలగు ప్రణయకవిత ప్రకృతికవితాదులు అభ్యుదయకవిత, అధివాస్తవిక కవితలన్నియు ఖండకావ్య ప్రక్రియాద్వారమున, రచింపబడినవి. ఛందస్సహితములైన పద్యములు గేయములు, ఛందోరహితములైన వచనకవితలు-అన్నియు ఖండకావ్యమున లెస్సగా నొదిగిపోవుచున్నవి. విషయ నిర్వహణ భేదమననుసరించి ఖండకావ్యములకు వర్ణనాత్మకములు, కథనాత్మక ములు, తాత్త్వికములు, ప్రచారాత్మకములు, భావగీతములు మున్నగు తెగలు నిర్ణయింపవచ్చును.

ఆధునిక యుగమునను సాంప్రదాయికములగు మహాకావ్యములు శ్రీమద్రా మాయణ కల్పవృక్షము, శివభారతము, ఆంధ్రపురాణము, పోతన చరిత్రమువంటివి వెలువడినవి. ఐనను ఈనాటి సాహితీ లోకమున ఖండకావ్యములే బహుళ సేవ్యములై యలరారుచున్నవి.

ఖండకావ్యముల నాధునికులు కవితాభ్యాసమునకు వ్రాయుదురనియు పూర్వ కవులిట్లే యభ్యాసమునకు తొలుత శతకములు వ్రాసెడి వారనియు భావించుట కలదు. ఇందులో కొంత సత్యమున్నను పూర్తిగా నొప్పదగినదికాదు. ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకమును రచనానుభవము జీవితానుభవము పండిన చరమ దశలో వ్రాసినట్టిది. అమరుకము, భర్తృహరి త్రిశతివంటి సంస్కృత శతకములు, వృషాధిపశతకము, సుమతి భాస్కర వేమన శతకములు విశ్వనాథవారి విశ్వేశ్వర శతకము మున్నగు ఆంధ్రశతకము లభ్యాసదశలో వ్రాసినవనునది అర్థములేనిమాట. నవ్యకవిత్వోద్యమకారులగు గురజాడ రాయప్రోలు శ్రీశ్రీలు, విశ్వనాథ జాషువా వానమామలై దాశరథి నారాయణరెడ్డి ప్రభృతి కవివరేణ్యులు రచించిన ఖండ కావ్యము లభ్యాసార్థము వ్రాసినవికావు. వీరందరు పరిణతమైన నవ్యకవితలు భవ్య ఖండకావ్యముల ద్వారా వెలార్చిరి. కావున ఖండకావ్యములు అభ్యాసదశలోనేకాక యనుభవము గడించిన పరిపక్వదశలోను రచింపబడినవని స్పష్టమగుచున్నది.

ఇట్టి ప్రశస్తివహించిన ఖండకావ్య ప్రక్రియను చేపట్టి నవ్యాంధ్రసాహిత్య క్షేత్రమును నందన వనము గావించిన ఆధునిక కవీంద్రులెందరో కలరు. వారిలో

కొందరు ప్రముఖుల ఖండకావ్యములను దిఙ్మాత్రముగా తడవి యీ వ్యాసమును ముగింతును.

## ఆధునిక ఖండకావ్యములు :

నవ్యకవిత్వమునకు యుగకర్తయైన మహాకవి గురజాడ అప్పారావుగారే తొలుదొలుత ఖండకావ్యములు రచించిరి. వారు 'ముత్యాలసరములు' అను ఖండ కావ్య సంపుటిని 1910లో ప్రచురించిరి. వ్యావహారిక భాషా ప్రయోగము, దేశి స్వరూపము, వస్తునవ్యత, సంఘసంస్కారదృష్టి, భావవిప్లవము మున్నగువానితో నవ్యకవితాగాన మొనర్చి నిద్రాణమై యున్న ఆంధ్రసాహిత్యలోకమును మేలు కొలిపిరి. పూర్వము లాక్షణికులు పేర్కొనిన వృషభగతి రగడకు ముత్యాల సర మించు మించు సరిపోవుచున్నది. ముత్యాలసరములలో 'దేశభక్తి', 'పూర్ణమ్మ' 'కన్యక' మున్నగు కవితలు మహాప్రశస్తి వహించి చిరయశస్సు కలిగించినవి. వీరి కాలము నాటికి ప్రతిభాశూన్యమైన చిత్రగతులతో గతానుగతికమైన సాంప్రదా యికతతో ఆంధ్రకవిత పతనోన్ముఖమై విసుగు ఏవగింపు కలిగించుచుండ వీరి నవ్యకవితారుణోదయము చేత ఆంధ్ర సారస్వతేయ ప్రపంచము నూతనోత్తేజము మహోల్లాసము పొందినది. గురజాడవారి నవ్యకవితలచేత ప్రభావితులై రాయ ప్రోలు, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీవంటి సుప్రసిద్ధ కవిపుంగవు లనేకులు ప్రశస్త ఖండ కావ్యములు వెలార్చిరి..

గురజాడ తర్వాత వారివలెనే నవ్యకవిత్వమునకు మరొక యుగకర్తయని గణుతి కెక్కిన మహాకవి రాయప్రోలు సుబ్బారావుగారు. వీరు భావకవిత్వోద్య మమునకు పితామహులు. వీరి ఖండకావ్యములలో 'లలిత', 'తృణ కంకణము' 'కష్టకమల' 'స్నేహలతాదేవి' మున్నగునవి మిక్కిలి పేరుగాంచినవి. ఇవి కథా కావ్యములు. ఈ ఖండకృతులలో అమలిన శృంగారము పోషింపబడిన ప్రణయ కవిత జాలువారినది. ఈ నవ్యకావ్యములలో ఛందస్సు సాంప్రదాయికమైనది. వృత్తములు, జాత్యుపజాతులు వాడిరి. వీరి యితరరచనలగు 'ఆంధ్రావళి', 'జడ కుచ్చులు', 'వనమాల'యను ఖండకావ్యములలో మాత్ర మనేక దేశిచ్ఛందస్సులను ప్రయోగించిరి. వీరి కృతులలో భావకవితా శాఖలగు ప్రణయకవిత్వము, దేశభక్తి కవిత్వము, ప్రకృతికవిత్వము మున్నగునవి శోభిల్లి కృష్ణశాస్త్రి, అబ్బూరి.

వేదుల, తల్లావఝుల శివశంకరశాస్త్రి మున్నగు ప్రముఖ కవివరేణ్యులెందరో భావ కవితా ఖండములు వెలార్చుటకు మార్గదర్శకములైనవి.

భావకవిత్వమును పరిపుష్టము చేసినవారిలో అగ్రగణ్యులు దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు. వీరి కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి మిగుల ప్రసిద్ధిగాంచినవి. ఇట్లే అబ్బూరివారి మల్లికాంబ, ఊహాగానము, వేదులవారి దీపావళి, ఆరాధన, నాయని వారి సౌభద్రుని ప్రణయయాత్ర, మల్లవరపువారి మధుకీల, కల్యాణకింకిణి, పింగళి కాటూర్ల సంక్రాంతి, తొలకరి, బసవరాజుగారి గీతాలు, నండూరివారి యెంకిపాటలు, తల్లావఝులవారి హృదయేశ్వరి, దువ్వూరిగారి కడపటి వీడ్కోలు, కృషీవలుడు, తుమ్మలవారి రాష్ట్రగానము, ఆత్మార్పణము, పరిగపంట, బాపిరాజు గారి తొలకరి, హారతి- ప్రశస్తి వహించిన మనోజ్ఞ ఖండకావ్యములు.

ఖండకావ్యరచనలో గణనీయమైన కృషి చేసినవారిలో విశ్వనాథ సత్యనారాయణగారు, గుఱ్ఱం జాషువాగారు, శ్రీశ్రీగారు మహాప్రశస్తిగాంచిన మహాకవులు. విశ్వనాథవారి ఖండకావ్యములలో ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము, గిరికుమారుని ప్రేమగీతాలు, కిన్నెరసాని పాటలు, కోకిలమ్మపెండ్లి మిక్కిలి గణుతి కెక్కినవి. ఇందు ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుష మాంధ్రజాతి తరతరాల మహోన్నత్యము నుగ్గడించి ఆంధ్రదేశాభిమానమును పెల్లుబుక జేయునవి. గిరి కుమారుని ప్రేమగీతాలు భావకవితా గీతాలై వన్నెకెక్కినవి. కిన్నెరసాని పాటలు మంజులభావ సంపదకు మధురశయ్యకు తావలమైనవి. విశ్వనాథవారి ఖండకృతు లలో సాంప్రదాయికత నవ్యత సమపాళ్లలో విలసిల్లు చుండును. తరచుగా ప్రౌఢమై జటిలమై సాగు వీరిశైలి కిన్నెరసాని పాటలలో అత్యంత సారళ్యము సంతరించుకొన్నది.

జాషువాగారి ఖండకావ్యము లేడుసంపుటములుగా ప్రచురింపబడినవి. అత్యంత సరళసుందరమైన శైలి వీరి కవితలకు ప్రత్యేకత నాపాదించి జనప్రీతిని మిక్కిలి చూరగొన్నవి. వీరి 'గబ్బిలము' హరిజనుల దుస్థితిని తెలుపుచు తదు ద్ధరణకై తపన పడినది. ఇది నవ్యసాహిత్యమున మేఘ సందేశము స్థానము నాక్ర మించినది. అతి సామాన్యమైన గిజిగాడు, సాలీడు, శ్మశానము వంటి వస్తువులు మొదలుకొని భరతమాత. భీష్ముడు, తాజమహాలు, క్రీస్తు, తిక్కయజ్వ, సుభాసు

బోసు వంటి యుదాత్తవస్తువుల వరకు గ్రహించి మనోజ్ఞభావ బంధురములగు ఖండకావ్యములను రచించిరి. వీరి 'ఫిరదౌసి' 'తాజమహలు' మిగుల ప్రశస్తి గాంచినవి.

నవ్య కవిత్వములో అభ్యుదయ కవితోద్యమకారులైన శ్రీశ్రీ మార్క్సు సిద్ధాంత ప్రవర్తకులై సామ్యవాదమును కాంక్షించి తీవ్రమైన భావములతో ఖండ కావ్యముల నతినవ్య ధోరణిలో రచించిరి. వీరి ఖండకావ్య సంపుటి 'మహా ప్రస్థానము' మహాప్రశస్తి వహించి ఆంధ్రకవితారంగమున సంచలనాత్మక చైతన్య కాంతిరేఖలను ప్రసరింపజేసినది.వీరభ్యుదయ కవితకేకాక అధివాస్తవిక కవితకును బాటలు వేసినారు. ఖడ్గసృష్టి, మహాసంకల్పం, మేమే, ప్రాసక్రీడలు, విమరుక్కులు వీరి యితర ఖండకావ్య సంపుటములు. వీరి యభ్యుదయ కవితామార్గమున పయనించి విశిష్టకృతులు రచించినవారు శిష్ట్లా, పఠాభి, శ్రీరంగం నారాయణబాబు, ఆరుద్ర, అనిశెట్టి, గజ్జల మల్లారెడ్డి మొదలగువారు.

పురాతనాధునాతన కవితారీతుల సమ్మేళనముతో సమన్వయ ధోరణితో కవివరేణ్యులెందరో కళాఖండములగు ఖండకావ్యములను రచించినారు. అట్టివారిలో వానమామలై వరదాచార్యులు, వానమామలై జగన్నాథాచార్యులు, కాళోజి, దాశరథి నారాయణరెడ్డి, ఉత్పల సత్యనారాయణాచార్యులు, నాయనికృష్ణ కుమారి, బోయి భీమన్న, గుంటూరి శేషేంద్రశర్మ, బాలగంగాధర తిలక్, కుందుర్తి, సోమసుందర్, మావిరాజు రంగారావు, బాపురెడ్డి, సుప్రసన్న, పేర్వారం జగన్నాథం, వేముగంటి నరసింహాచార్యులు మున్నగువారు ప్రముఖులు. ఇంకను ప్రతిభావంతులైన యనేకానేక కవివర్యులు నిరంతరము ఖండకావ్య రచన చేయుచు ఆంధ్రభారతి కభినవాలంకారములు కైసేయుచున్నారు.

# మణిమాల

## ప్రస్తావన :

శ్రీ వరదాచార్యులవారు పోతన చరిత్రము వంటి మహాకావ్యమును రచించి సారస్వతలోకమున మహాప్రశస్తి వహించియున్నారు. అట్టి పోతన చరిత్ర రచనకు పూర్వము వారనేక ఖండకావ్యములను రచించి సాహితీ రంగమును సుసంపన్నము గావించిరి. వారి ఖండకావ్యములు 'మణిమాల', 'ఆహ్వానము', 'జయధ్వజము' అను మూడు సంపుటములుగా వెలువడినవి.

ఆచార్యులవారి మానసమునుండి పదుమూడవయేట చిన్న సెలయూటగా జాలువారిన కవిత నానాటికి పెంపుగాంచి మహాస్రవంతియై సాహిత్య క్షేత్రమున బహువిధకావ్య సస్యములను ఫలింపజేసినది. వారి కవితాంగన మంగళారతులతో రంగప్రవేశము చేసి దాగుడుమూతలతో దోబూచులాడి తారుణ్యదశ నధిగమించి ముగ్ధయై ప్రౌఢయై రసభావ చమత్కృతులతో మృదుమధుర పదగతులతో రసిక జన మనోరంజనముగా నాట్యము చేసినది.

ఆచార్యులవారి రచనాజీవితములోని తొలిదశలో నుద్భవించిన ఖండ కావ్యముల సంపుటియే మణిమాల. వారి రచనలలో ప్రకటితమైన ప్రథమ గ్రంథ మిదియే. మణిమాలలో గ్రుచ్చబడిన కావ్యమణులు క్రీ.శ. 1932-1942 మధ్య నొక దశాబ్దకాలములో నిర్మింపబడినవి. సంఘజీవియగు కవి రచనలపై సమకాలీన పరిస్థితుల ప్రభావముద్ర యుండుట సహజము. కనుక సంగ్రహముగా ఆ కాలము నందలి సాంఘికాది స్థితిగతుల పరామర్శ కావింతును.

## మణిమాల రచనాకాలము :

### సాంఘిక రాజకీయాది పరిస్థితులు :

అవి భారతదేశ స్వాతంత్ర్యము కొరకు గాంధిమహాత్ముని నాయ కత్వమున తీవ్రమైన పోరాటము సాగుచున్న రోజులు. 1931 లో గాంధి

ఇర్విన్ సంధి జరిగినందున ఉద్యమము నిల్పివేయబడెను. పిమ్మట లండనులో జరిగిన రెండవతూరి రౌండ్ టేబుల్ సమావేశమునకు గాంధి వెళ్ళి, బ్రిటిషువారు తాము చేసికొన్న సంధి షరతులకు విరుద్ధముగా ప్రవర్తించినందున రిక్త హస్తాలతో తిరిగివచ్చి శాసనోల్లంఘనముతో కూడిన స్వాతంత్ర్య సంగ్రామమును మరల ముమ్మరముగా ప్రారంభించెను. పిదప కొంతకాలమునకు 1935 వ సంవత్సరపు చట్టము ననుసరించి యేర్పడిన పరిపాలన విధానములో కాంగ్రెసు నాయకులు పాల్గొని 1937 లో జరిగిన యెన్నికలలో ఘనవిజయము గాంచి కొన్ని రాష్ట్రములలో మంత్రులై కాంగ్రెసు ప్రభుత్వములు స్థాపించి పౌరహక్కుల విషయములో గణనీయ ఫలితములు సాధించిరి. అంతలో 1939 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామము మొదలయ్యెను. ఆ సంగ్రామ ఫలితముగా విపరీత పరిస్థితులేర్పడి భారత దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము ప్రకటింపవలసినదిగా కోరిన కాంగ్రెసు నాయకుల కోరికను బ్రిటిషువారు నెరవేర్పనందున మహాత్ముడు పెద్ద యెత్తున సత్యాగ్రహము చేయదలచి 1942 లో 'క్విట్టిండియా' నినాదమును లేవదీసెను. యావద్భారత ప్రజలందు పాల్గొనుటకు సంసిద్ధులైరి. అది గ్రహించి బ్రిటిషువారు గాంధిని తదితర దేశనాయకులందరిని జైళ్ళలో నిర్బంధించిరి. దీనిచేత రెచ్చిపోయిన ప్రజలు ఘోరముగా తిరుగబడి విధ్వంసకాండ జరిపి బ్రిటిషవారిచేత చెప్పరాని హింసలకు గురియైరి. పెల్లుబుకునట్టి ప్రజావాహిని నాపుట అసాధ్యమని గ్రహించినందునను, ద్వితీయ ప్రపంచయుద్ధమున ననేక కష్టనష్టములను పొంది బలము తగ్గినందునను బ్రిటిషువారు తుదకు విధిలేక భారతదేశమునకు స్వాతంత్ర్య మిచ్చుటకు సంసిద్ధులైరి.

సత్యాగ్రహాస్త్రముతో స్వాతంత్ర్య సమరము సాగించుచున్న కాలముననే మహాత్ముడు దేశసౌభాగ్యమునకు జాతిప్రయోజనములకు అనేక నిర్మాణ కార్యక్రమములు చేపట్టి నడపెను. రాట్నము వడకుట, ఖద్దరు ధరించుట, హరిజనోద్ధరణము, హిందూమహమ్మదీయ సఖ్యము మున్నగువానిని మహోద్యమములుగా దేశ వ్యాప్తముగా సాగించెను.

దేశస్వాతంత్ర్యోద్యమమునకు గాంధి సారథ్యము వహించి నిర్వహించుచున్న కాలమునందే అంతర్జాతీయముగా ప్రబలుచున్న మార్క్సువాద సామ్యవాదము చేత

ప్రభావితులై కొందరు గాంధిగారి శాంత్యహింసాత్మకమైన తత్త్వమును మెచ్చక ఉద్రిక్తులగుచుండిరి. 1926 నుండియే కాంగ్రెసులో ఈ రకమైన వామపక్షీయులు, అతివాదులు బలపడసాగిరి. దేశమునం దంతట కర్షక కార్మిక సంఘములు, యువ జన సంఘములు స్థాపించబడి వర్గసంఘర్షణ సిద్ధాంతము నవలంబించి పనిచేయ సాగినవి. 1934 వరకు కాంగ్రెసులోని వామపక్షీయులు కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించిరి, 1936లో లక్నోలో జరిగిన కాంగ్రెసుమహాసభలో సామ్యవాద వర్గము ప్రబలమైనది. దానికి నెహ్రూ నాయకత్వము వహించి అధ్యక్షోపన్యాసము చేసెను. ఆ సభలో అనేక విప్లవాత్మక విధానములకు తీర్మానములు చేయబడెను. ఈ విధముగా దేశమున నొకవైపు గాంధిగారి సత్యాగ్రహ సంగ్రామము సాగు చుండ వేరొకవైపు నుండి సామ్యవాద ప్రభంజనము తీవ్రముగా వీవదొడగినది.

యావద్భారతమున నిట్లుండగా మన తెలుగునాట పరిస్థితి కొంత భిన్నముగా నుండెను. బ్రిటిషు పరిపాలనలోని ఆంధ్రసోదరులు తదితర ప్రాంతీయులకు తీసి పోని విధముగా స్వాతంత్ర్య సమరమున తీవ్రముగా పోరాడిరి. కాని నిజాము పరిపాలనలోని తెలంగాణప్రజలు స్వరాజ్యోద్యమమున కనుస్పందన పొందుచు కొంతవరకు పరోక్షముగను పత్యక్షముగను పాల్గొనుట జరిగినది. ఈ ప్రాంత స్థితిగతులు భిన్నముగా నుండుటయే దీనికి కారణము.

[1]'నైజాము' అని పిలువబడునప్పటి హైదరాబాదు రాష్ట్రము ఆసఫ్‌జాహి వంశప్రభువుల పరిపాలనలో 225 సంవత్సరములు సాగెను. ముస్లిం నవాబుల కాలములో రాజభాష, బోధనభాష ఉరుదే యగుటవల్ల ప్రాంతీయభాష లణగారి పోయినవి. ముఖ్యముగా తెలంగాణలోని ఆంధ్రభాషాపద్మిని కవి దుర్దినములు. తెలంగాణ ఆంధ్రులు తౌరక్యాంధ్రులని పిలువబడిరి. 'తెలంగీ బేఢంగీ' (తెలుగు వికారమైనది) అని అవహేళన చేయబడినది. తెలుగు వారి వేషభాషా సంస్కృతులు క్షీణించెను.

1. ఈ విషయములు వ్రాయుటలో శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి 'తెలంగాణలో జాతీయోద్యమాలు', శ్రీ రావి నారాయణరెడ్డిగారి "వీర తెలంగాణ-నా అనుభవాలు, జ్ఞాపకాలు" ఉపకరించినవి.

1911 లో ఆసఫ్ జాహి సప్తమ ప్రభువు అంత్య ప్రభువునైన నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ పరిపాలించుచున్న రోజులలో రాష్ట్రాభివృద్ధికి కృషి జరిగినను ప్రజాపరిస్థితి దుర్భరముగా నుండెను. నవాబుకు లోబడియుండి సంస్థానాధీశులు, జాగీర్దారులు, మక్తేదారులు, దేశముఖులు, దేశపాండ్యాలు పాలించుచుండెడివారు. వారి ఆంతరంగిక పరిపాలన వారికే వదలివేయబడెను. ఇట్టి జాగీరులు రాష్ట్రములో ఇరువదారు వందలుండెడివని లెక్కల వలన తేలినది. వారు స్వార్థులై భోగలాలసులై ప్రజలమీద పన్ను లెన్నో వేసి పీడించుచు క్రూర నిరంకుశ పరిపాలన సాగించెడివారు. జాగీర్దారులు భూస్వాములు పెత్తందారు లందరును ఘోరముగా వెట్టిచాకిరి చేయించుకొనువారు. ఆ రోజులలో రైతులు పన్నుల భారము మున్నగువానిచేత మరింత క్రుంగిపోయిరి. ఆనాడు ప్రవేశపెట్టబడిన ధాన్యపు లెవీ రైతును దుర్భర దుస్థితి కూపములో త్రోసి వేసినది. నిజాం మత దురభిమాన పరిపాలన వల్ల తెలుగు వారగు హిందువులకు ఉద్యోగాది విషయములలో చాల అన్యాయము జరుగుచుండెను.

తెలంగాణములో ఆంధ్రజాతికి ఆంధ్రభాషకు పట్టిన దుర్గతికి వగచి పెద్దలు జాతి చైతన్యమునకు భాషా సాహిత్య వికాసమునకు ఆంధ్రోద్యమము ప్రారంభించిరి. హైదరాబాదు నగరములో 1901 లో కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారి ప్రోత్సాహముతో ప్రప్రథమ గ్రంథాలయము శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయము తెలుగువారి భాగ్యోదయముగా స్థాపించబడెను. ఇంకను హనుమకొండ మొదలగు చోట్ల అనేక గ్రంథాలయములు వెలసెను. ఉరుదూ భాషా ప్రభంజనములో మినుకు మినుకు మనుచున్న ఆంధ్ర భాషా దీపమును నాటి గద్వాల వనపర్తి, ఆత్మకూరు, అమరచింత మున్నగు సంస్థానా ధీశ్వరులు కాపాడి చమురు వోసి వెలిగింప జేసిరి.

గ్రంథాలయోద్యమము తెలంగాణ ప్రాంతమును చైతన్యవంతము చేయుచున్న రోజులలో 1921 లో సుప్రసిద్ధ మహారాష్ట్ర పండితుడైన కార్వే అధ్యక్షతను జరిగిన సంఘ సంస్కరణ సభలో న్యాయవాదిగా నున్న ఆలంపల్లి వెంకట రామారావుగారు తమ ప్రసంగమును తెలుగులో ప్రారంభించగా సభ్యులు హేళన చేసిన దుర్ఘటనతో మనవారికి పౌరుషోద్రేకములు విజృంభించి ఆంధ్ర జనసంఘమును స్థాపించి గట్టి కృషి చేయ నారంభించిరి. శ్రీయుతులు

డా॥ బూర్గుల రామకృష్ణారావు, మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, సురవరం ప్రతాపరెడ్డి మొదలగు ప్రముఖులు ప్రధాన పాత్ర వహించిరి. పిమ్మట ఆంధ్ర మహాసభ అవతరించి తెలంగాణములో అనేక స్థలములలో సభలు జరిపి ఆంధ్ర ప్రజలకు భాషకు మహాభ్యుదయమును సాధించుచుండెను. గోలకొండ వంటి పత్రికలు, కొమర్రాజుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి విజ్ఞాన వికాసమున కెంతో దోహదము చేసెను. ఆంధ్ర భాషా సంస్కృతుల ప్రగతికి కృషి చేయుచున్న ఆంధ్ర మహాసభలో కాలక్రమమున రాజకీయములు ప్రవేశించినవి. బాధ్యతాయుత ప్రభుత్వమే నిజాం రాష్ట్రాంధ్రుల ఆదర్శమను తీర్మాన మామోదింపబడినది. ఆంధ్ర మహాసభ సభ్యులలో చాలమంది జాతీయ భావాలు, కాంగ్రెసు భావాలు కలిగి యుండిరి.

ఇది యిట్లుండ అంతర్జాతీయముగా జాతీయముగా బలపడుచున్న కమ్యూ నిజం చేత ప్రేరితులై నిజాం రాష్ట్రములోని నాయకులు కొందరట్టి సిద్ధాంతముతో అభ్యుదయ భావములతో కృషి చేయ నారంభించిరి. 1942 లో ఓరుగల్లు సమీపము నందలి ధర్మవరమున జరిగిన ఆంధ్ర మహాసభలో చీలికలు వచ్చి జాతీయ పక్షము, కమ్యూనిస్టు పక్షమని రెండు వర్గములుగా సభ చీలిపోయెను. కమ్యూనిస్టు పక్షమునకు రావి నారాయణరెడ్డిగారు నాయకత్వము వహించిరి. తరువాత ఆంధ్ర మహాసభ, 1938 లో ఏర్పడి సాగుచున్న స్టేటు కాంగ్రెసులో లీనమై పోయెను.

భారతదేశములో 1937 లో కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడిన రోజులలో తత్ప్రభావము హైదరాబాదు రాజకీయముల మీదపడి ఇక్కడివారు హైదరాబాదులో స్టేటు కాంగ్రెసు సంస్థాపించుకొనదలచి అందుకు నిజాం అనుమతించనందున సత్యాగ్రహము చేసి ఎందరో జైళ్ళకు వెళ్ళిరి. స్టేటు కాంగ్రెసు నిషేధించబడెను. దేశములోని 'వందేమాతరం' ఉద్యమ ప్రభావితులై యీ రాష్ట్రమువారును తదుద్యమము మహోత్సాహముతో సాగించిరి. ఆర్యసమాజము, హిందూ మహాసభ రాష్ట్రములో పౌరహక్కుల సాధన కోసము, మత స్వాతంత్ర్యము కోసము ఆ కాలములో పోరాటము సాగించినవి.

ఆంధ్రమహాసభవారు, కమ్యూనిస్టు పార్టీవారు తెలంగాణలో ఆంధ్రభాషా సంస్కృతుల వికాసము, సాంఘిక చైతన్యము, పౌరహక్కుల సాధన, నిజాం

నిరంకుశ ప్రభుత్వమునకు, జాగిర్దారుల భూస్వాముల దౌర్జన్యములకు ప్రతిఘటన, రైతు సంక్షేమము, వెట్టిచాకిరి నిర్మూలన్నము మునగు అభ్యుదయ కార్యకలాపము లతో మహాకృషి కావించినారు. అందు కమ్యూనిస్టు పార్టీ తెలంగాణలోని ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకముగా తీవ్రమైన పోరాటము సాగించినది. అదే క్రమముగా సాయుధ సమరముగా విజృంభించినది.

## ఆంధ్ర సాహిత్య స్థితిగతులు :

నైజాములోని తెలుగుజాతి తెలుగుభాష దుస్థితిని వెనుక కొంత వివరించి తిని. తెలంగాణమున పూర్వము నుండియు సారస్వత జ్యోతి మహోజ్జ్వలముగా ప్రకాశించినది. పాల్కురికి సోమన, పిల్లలమర్రి భాస్కరాదులు, బమ్మెర పోతన, పొన్నికంటి తెలగన, సారంగు తమ్మయ, అద్దంకి గంగాధరకవి, పరశురామ పంతుల లింగమూర్తి మున్నగు మహాకవులచేత ప్రశస్తి వహించిన దీ ప్రాంతము. అట్టి తేనె మాగాణమగు తెలంగాణమున ఆసఫ్‌జాహీ ప్రభువుల కాలమున రెండు శతాబ్దముల కాలము ఉరుదూ ఫారసీ భాషలు అధికారము చలాయించుటచేత ఆంధ్రభాషా సాహిత్యము లణగారి పోయినవి. ఆ దుస్థితిని శ్రీ దేవులపల్లి రామా నుజరావుగారిట్లు వివరించిరి:

"హైదరాబాదు రాష్ట్రము స్వదేశ సంస్థానాలలోనే కాక, వెనుకబడియున్న స్వదేశ సంస్థానాలలో గూడ మొదటిదిగా నుండెను. ఆనాడు ఇక్కడి పరిపాలకులు ప్రజల భాషల యెడ నే మాత్రము సానుభూతి కలిగియుండలేదు. అంతేకాదు వారీ భాషల అభివృద్ధిని వ్యతిరేకించి వాని యభివృద్ధిని సర్వవిధముల నిరోధించిరి. తత్ఫలితముగా తెలుగు సరస్వతికి కొంత కాలము అజ్ఞాతవాసము తప్పలేదు. రాజనరేంద్రుని నుండి రఘునాథరాయలు వరకు రాజాస్థానములలో ముత్యాలశాల లందు దీనారటంకాలు తీర్థమాడిన ఆంధ్రశారద ఉర్దూ, ఫార్సీ, అరబ్బీ బీబీల వెనుక నెట్టివేయబడి తబ్బిబ్బు చెందినది."[1]

ఇట్టి దుర్దశలో తెలంగాణమున గ్రంథాలయోద్యమము, పత్రికావ్యాప్తి, విజ్ఞాన చంద్రికా గ్రంథమాలవంటి సంస్థల స్థాపనము, ఆంధ్రోద్యమము తెలుగు

1. తెలంగాణలో జాతీయోద్యమాలు : పుటలు 61, 62.

భాషా సారస్వతములకు మహాచైతన్యమును నూతన వికాసమును సంతరింప జేసినవి. కొమర్రాజు, మాడపాటి, సురవరం వంటి మహనీయుల రచన లిక్కడి రచయితలకెంతో ఉత్సాహోత్తేజనములను ప్రసాదించినవి.

బ్రిటిషు పరిపాలనలోని ఆంధ్రులకీ దురవస్థ లేకుండెను. బ్రిటిషువారు రాజకీయ కార్యకలాపములకే ఆంక్షలు విధించిరి కాని భాషా సారస్వత వ్యవహార ములను నిషేధించలేదు. పైగా ప్రోత్సహించి యుండిరి. బ్రౌనుదొర వంటివారక్కడ ఆంధ్ర సాహిత్యమునకు మహోపకారము చేసిరి. బ్రిటిషు పాలనలోని తెలుగు వారిపై ఆంగ్లభాషా ప్రభావముకంటె నైజాము తెలుగువారిపై ఉరుదూ ప్రభావము భిన్నమైనది. అపరిమిత వాఙ్మయము కలిగి అంతర్జాతీయ భాషయై వెలసిన ఆంగ్ల భాషా ప్రభావము విశిష్టమైనది. పరిమిత వాఙ్మయముతో బహుప్రాంత ప్రచలితము కాని ఉరుదూ ప్రభావము పరిమితమైనదే. మరియు ఆంగ్లభాషా ప్రభావము నైజాములోని తెలుగు భాషపై ఆలస్యముగా పడెను. కావున ఇక్కడి ఆంధ్రభాషా వికాసము చాలవరకు పూర్వసాహిత్య పఠనము మీదనే యాధారపడియుండెను ఆంధ్ర ప్రాంతమున వికసించిన నవ్యాంధ్ర కవిత్వ ప్రభావము కూడ తెలంగాణ మున ఆలస్యముగా పడినది.

1910లో నవతరించిన నవ్యకవిత్వములో 1930 వరకు సాగిన భావ కవితోద్యమము తెలంగాణలో అంతగా వ్యాప్తి చెందలేదు. ఆ పిదప భావకవిత్వ ముపై తిరుగుబాటుగా వచ్చిన అభ్యుదయ కవితోద్యమము మాత్రము తెలంగా ణను చాల ఊపివైచినది. దానికి ప్రబల కారణము తెలంగాణలోని రాజకీయోద్య మమే. అభ్యుదయ కవిత్వ యుగకర్తయగు శ్రీశ్రీ కవితలు మహాప్రస్థానం మొదలగునవి 1935 నుండి 1942 వరకు జ్వాల, ఉదయిని, నవశక్తి, భారతి మున్నగు పత్రికలలో ప్రచురింపబడి ఆంధ్రసాహిత్య ప్రపంచము నుఱ్ఱూత లూగించినవి. ఆ రోజులలో విశ్వకవి రవీంద్రుని రచనల ప్రభావమును తెలంగాణ కవులపై కాననగును తెలంగాణలోని ఆధునికాంధ్ర కవులలో వానమామలై సోదరులు, కాళోజిగారు, పొట్లపల్లి రామారావుగారు మున్నగు కవీంద్రులు తొలి తరమువారు. దాశరథిగారు, సి. నారాయణరెడ్డిగారు ప్రభృతి కవివరేణ్యులు మలి తరమువారు. వరదాచార్యులవారి మణిమాలా కవితలు చాలవరకు నాటి సాంఘిక రాజకీయాది పరిస్థితులచే ప్రభావితమై రచింపబడినవే.

## మణిమాల - వస్తువు :

కావ్యమునందు ప్రప్రథమమున పాఠకుల నాకర్షించునది వస్తువు. చూపరులకు మొదట దృష్టిగోచరమగు శరీరమువలె సహృదయులకు మొదట కావ్యవస్తువే సాక్షాత్కరించును. కావ్యమునకు వస్తువే శరీరము. 'ఇతి వృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితం' అని భరతుడు వచించెను. ఈ వాక్యము మహాకావ్యమును గూర్చి చెప్పబడినను ఖండకావ్యమునకును వర్తించును. పైగా వస్తు వైవిధ్యముగల ఖండకావ్య సంపుటిలోని కవితల యందలి వస్తువులు మరింత ప్రాధాన్యము వహించును. వస్తువరణములోనే కవి హృదయము ప్రస్ఫుటమగును. పిమ్మట తదీయ రచనా నిర్వహణ పరిగణ్యమగును.

మణిమాలయందలి ఖండకావ్యములు ప్రాయికముగా నవ్యకవితాశోభితమై వస్తువైవిధ్యము కలిగి యొప్పుచున్నవి. బహువిధమణులచే ప్రకాశించు మణిమాల వలెనే యీ మణిమాల వివిధ వస్తు విలసిత కవితలతో విభాసిలుట విశేషము. ఇందు 59 కవితలు కలవు. వీనిలో మొదటి రెండు కవితలు 'కృతిపతి వంశపరిచితి', 'పండితవంశ పరిచయము' అవతారికాప్రాయమైనవి. 58వ కవిత 'కలను గన్పడు నట్టి నా కన్నతండ్రి' యన్నది వరదాచార్యులవారి రెండవయన్న శ్రీ లక్ష్మణా చార్యులవారు రచించినది. కనుక సంపుటిలో మన కవిగారు వ్రాసినవి 58 కాగా అందు మొదటి రెండు కవితల నటుంచ వారి సిసలైన కవితలు 56 అని చెప్ప నొప్పును.

## కృతిపతి వంశపరిచితి :

ఇందలి ప్రథమ కవిత కృతిపతియగు గట్ల నరసింగాపురము జమీందారు శ్రీ గుండవరము జగన్నాథరావుగారిని గూర్చియు వారి వంశమును గూర్చియు రచింపబడినది. గట్ల నరసింగాపురము కరీంనగర మండలములోని హుజూరాబాదు తాలూకాకు చెందినది. వరదాచార్యులవారు వారి తోబుట్టువులు పుట్టిపెరిగిన మడి కొండకీపురము సమీపములోనిది కవిగారి జనకులు శ్రీ బక్కయ్యశాస్త్రిగారు కృతి పతి తండ్రి నరసింగరావుగారి వద్ద 'సత్కథాప్రవచనమ్మున వశిష్ఠులై' యుండిరి. వీరును వీరి కుమారుడు కృతిపతియు బక్కయ్యశాస్త్రిగారికి పలుమారులు వేలకొలది రూప్యములిచ్చి సహాయము చేసిరి. వరదాచార్యులవారి పెద్దన్న శ్రీ వేంకటాచార్యుల

వారీపురములో జగన్నాథరావుగారి యాస్థానపండితులై యచటనే స్థిరనివాసము నేర్పరచుకొనిరి. నాయనగారి ద్వారా పరిచయము పొంది పెద్దన్నగారి యునికివల్ల నచటికి రాకపోకలు చేయుటచే ఆచార్యులవారికి దొరగారితో అనుబంధము పటిష్ఠమై వారి మహోదార గుణశీలములకు ముగ్ధులై ప్రేమతో వారికే యీ గ్రంథ మంకితము చేయుట జరిగినది. గౌరవపురస్సరముగా 38 పద్యములలో రచించిన యీ వంశపరిచితిలో కృతిపతిజనకులు నరసింగరావుగారి గుణగణములు, వారి ప్రజాహిత కార్యములు బహుభంగుల వినుతింపబడినవి. అట్లే జగన్నాథరావు గారిని గురించి, వారి సతీమణి రత్నమ్మను గురించి వ్రాయుచు వారి యుదాత్త గుణ సంపదను, విశిష్ట వ్యక్తిత్వమును, ఘనకార్యములను, చక్కగా కొనియాడిరి. జగన్నాథరావు గారి తమ్ముడు శ్రీనివాసరావు గారి సంగీత సాహిత్య కళాభిజ్ఞత వినుతింపబడెను. ప్రస్తుతము హైదరాబాదులోని గాంధి వైద్యకళాశాలకు ప్రిన్సిపాలుగా ఉన్న భిషగ్వరేణ్యులు డా॥ నరసింగరావుగారు కృతిపతి పుత్రరత్నమే. ఆచార్యులవారు కృతిపతిని వర్ణించుచు.

> "అతిధనాకాంక్షతో కవులనవరతము ధనికు నింద్రుడు చంద్రుడీతండనుటలు
> సహజమే కాని స్తోత్ర మిష్టమ్ములేని ప్రభువితండు నేనుంగాను వందిజనుడ"

అని వచించి కృతిపతి యొక్క ఉత్తమనాయకలక్షణమగు నవికత్థనత్వమును, తమ ఆత్మగౌరవమును చాటుకొనిరి. మరియు "ఒక మహావ్యక్తి సద్గుణ మున్నదాని నున్నయటులు జెప్పగ విని యొప్పదనిన, మంచినే మంచి యనలేని మానవుండు దేవునిని దేవుడన వెనుదీయు నతడు" అనియు నుడువుటచేత కృతిపతిని గూర్చి చేసిన స్తవము వాస్తవమని విశదమగు చున్నది. మహోదారుడగు కృతిపతి ద్రవ్యసహాయమున నీ సంపుటి ప్రచురింప బడినది.

## పండితవంశ పరిచయము :

'పండితవంశ పరిచయము' అను రెండవ కవితలో ఆచార్యులవారు తమ పండిత వంశమును విపులముగా వర్ణించి పరిచయము చేసినారు. ఇందలి వంశ వృక్షమును తాతముత్తాతల జననీ జనకుల యగ్రజుల ప్రతిభా పాండిత్యములను గుణశీలములను ప్రశస్తిని కవిగారి జీవిత సంగ్రహవ్యాసమున వివరించితిని. నక్షత్ర సంఖ్యలో వ్రాసిన మణిమాలలోని యీ పండితవంశ పరిచయ పద్యము

లనే ఆచార్యులవారు పోతన చరిత్రములో యథాతథముగా గ్రహించి మరికొన్ని పద్యములందు చేర్చి విపులీకరించిరి.

## వస్తు వరణము :

మణిమాలా కవితలలోని వస్తువులొక ప్రత్యేకతను వైలక్షణ్యమును సంత రించుకొన్నవి. ఇందు కురువృద్ధుడు, శ్రీరాముడు, కర్మచంద్రుడు-గంధి, రవికవి స్మృతి, ఆంధ్రప్రశస్తి, శ్రీకృష్ణదేవరాయ లాంధ్రగ్రంథాలయము వంటి యుదాత్త వస్తువులు కొన్ని యున్నను ముప్పాతిక వస్తువులు సామాన్యమైనవే. అందును తృణము, పాకీవాడు, పాదరక్ష గ్రామ సూకరము, ఎండుగడ్డి వేరు, పెంటపేలిక వంటి అతిసామాన్యమైన, లోకుల దృష్టిలో నికృష్టమైన నిరర్థకమైన వస్తువులను గ్రహించి యుత్కృష్ట కవితామయములు చేసినారాచార్యులవారు. వారి విశ్వవిశాల హృదయములో నిదియది యనక సర్వము తావు చేసికొన్నది. 'ఆత్మవత్సర్వ భూతాని' యన్న సూక్తికి తావలమైన కవిగారు తమ యమృతకరములు సాచి తృణాది హీనవస్తువులను గ్రహించి వానికి కావ్యగౌరవస్థాన మొసగినారు. బీద వెట్టివాడు, పాలేరు. హరిజనుడు, వితంతుబాలిక వంటి దీనజనులను ఆర్తులను తమ చల్లని యొడిలో నుపలాలించినారు. ఏ వస్తువును చేపట్టినను వట్టివట్టిగా కాకుండ గట్టిగా భావించి రమ్య రసమూర్తులుగా మలచినారు. వారి కలమెట్టి పరుస వేదియోకాని ముట్టినదెల్ల ముత్యము పట్టినదెల్ల బంగారమైనది. 'రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచం' అన్న యాలంకారికవచన మీ కవిగారి కవితల యెడ పరమసార్థకమగుచున్నది.

ఈ గ్రంథములోని కవిత లన్నియు నించుమించు సామాజిక స్పృహగలవే. 'విశ్వశ్రేయః కావ్య' మ్మను నన్నయగారి మహావాక్య మిందలి కవితల యెడ చరితార్థమగుచున్నది. కవితామణుల నంతసూత్రమై సంతరింపజేసినదీ ధర్మ సూత్రమే. ఏతత్కవితా లతా వితాన ప్రాదుర్భావ వికాసములకు విశ్వశ్రేయస్సు బీజముకాగా జీవకారుణ్య మమృతమై ప్రవహించినది. దేశకాల స్థితిగతి ప్రభావము దోహదముచేసినది. ఇందలి కవితలు ప్ర[illegible]జనాత్మకములు, ఉపదేశాత్మకములు, ఆలోచనాత్మకము లయి యింపు నింపుచున్నవేకాని కేవల ముబుసుపోకకు రచింప బడినవి కావు.

## వస్తు వర్గీకరణము :

ఇందలి ఖండకావ్యములను కవితా ప్రక్రియ ననుసరించి యెనిమిది వర్గములుగా విభజింప వచ్చును.

1. దేశభక్తి కవిత్వము. 2. దైవభక్తి కవిత్వము. 3. ప్రకృతికవిత్వము 4. పల్లీజన కవిత్వము. 5. సంఘ సంస్కరణ కవిత్వము. 6. ప్రణయ కవిత్వము 7. స్మృతికావ్యములు. 8. ఇతరములు.

ఈ వర్గీకరణములో దేశభక్తి కవితలు తొమ్మిది. ఇందు సమరకాళిక, కర్మచంద్రుడు-గంధి, ఆంధ్రప్రశస్తి,శ్రీకృష్ణదేవరాయ లాంధ్ర గ్రంథాలయము-ఎన్నదగినవి. దైవభక్తి కవితలు మూడు మాత్రమే రచింపబడినవి. కొత్తకొండ వీరభద్రస్వామి గురించిన రెండు కవితలు,'అగోచరము' అను తాత్త్వికకవిత యీ కోవకు చెందినవి. అన్నిటికంటె అధికసంఖ్యలో సంతరింపబడినవి ప్రకృతి కవితలు. ఇవి పదునైదుకలవు. తృణము, ఘనోద్దేశ్యము, కుసుమోపదేశము, వనస్వాంతము, తేనెటీగ మున్నగునవి యీ తెగకు చెందినవి. పల్లీజన కవితలు ఆరు కూర్చబడినవి. దుక్కిటెక్క, పరిగపిల్ల, పాలేరు, కాపు ఋణము - ఇత్యాదులిందలివి. హరిజనుడు - మాలపల్లె, వితంతు బాలిక యనునవి సంఘసంస్కరణ కవితలు. మొత్తము సంపుటిలో నామమాత్రముగా వ్రాయబడిన యేకైక ప్రణయ కవిత 'ప్రియురాలు'. స్మృతికావ్యములు నాలుగు రచింపబడినవి. రవి కవి స్మృతి, రామాబాయమ్మ స్మృతి, తల్లిదండ్రుల స్మృతిగూర్చి వ్రాసినవి రెండు - ఈ వర్గమునకు చెందినవి. ఇక మిగిలిన పదారు ఖండకావ్యము లితరములు. ఇందు వీరపత్నీవిలాపము, కురువృద్ధుడు, భారతబాలుడు, శ్రీరాముడు, అడిగి లేదనిపించుటే అమ్మ నన్ను, ధనురారోపణము - అను నారు పౌరాణికములు. తక్కిన వానిలో పాకీవాడు, పసిపాపడు, మృత్యువు, హత్యావిచారము, కవిత, కపీ!, మాతృహృదయము, గంటము - కత్తి, శ్రీమంత్ ధర్మరాజ సందర్శనము, వృద్ధపితరులు-అనునవి వివిధ విషయములకు చెందినవి.

మొత్తము కవితలలో ప్రకృతి పల్లీజన కవితలు మూడవ వంతు నాక్రమించినవి. దీనివల్ల రమణీయ ప్రకృతిపైన ప్రశాంత పల్లీ జీవనముపైన ఆచార్యుల

వారికి గల నితాంతప్రేమ వ్యక్తమగుచున్నది. ఆచార్యులవారి కవితలు వ్రాయు నప్పటికి చాల వరకు గ్రామసీమలలోనే వసించి యున్నందువల్ల సహజముగనే వారికి ప్రకృతి పల్లీజన వాతావరణమునం దనురక్తి యేర్పడి తాదాత్మ్యము ప్రగాఢ మైనది. ఈ కవితల పిదప పేర్కొనదగినవి దేశభక్తి కవితలు. కవిగారికి దేశభక్తి, జాతీయతాప్రీతి యెంతగాఢమైనవో యీ కవితల వల్లనేకాక తర్వాతివగు ఆహ్వానము, జయధ్వజము ఖండకావ్యసంపుటముల వల్లను సువిదిత మగును. ఆచార్యుల వారు సహజముగనే భక్తిపరులు తత్త్వజ్ఞాన సంపన్నులైనను నిందు భక్తి కవితలు మూడిటికంటె మించలేదు. ఇతరములలో గల శ్రీరాముడు, కురువృద్ధుడు మున్నగు పౌరాణిక కథలు వారి పురాణేతిహాస ప్రవణతకు తార్కాణలు. సంఘసంస్కరణ కవితలు మూడే రచింపబడినను వస్తుభావరచనలచేత గురుతరమైనవి. ఖండకావ్యములలో చాలవరకు అన్యూనాధిక పరిమాణముగలవే యున్నవి. 'చుక్కచూపు' 'అగోచరము' 'అనుకరణము' 'గేలిసేతు' 'ప్రియురాలు' - అనునవి చిన్నవికాగా 'మృత్యువు' 'చుట్టగాల్పు' 'మఱపురాని నా తండ్రి నిన్ మఱతునెట్లు' అనునవి మరింత చిన్నవై యున్నవి.

## వస్తు వివరము :

మణిమాలలోని ఖండకావ్యముల రచనకు కవిగారికి కలిగిన ప్రేరణ ప్రధానముగా ఐదువిధములుగా గోచరించును.

1. జాతీయముగా అంతర్జాతీయముగా పెల్లుబికిన మహోద్యమములు, రాజకీయాది స్థితిగతులు.
2. సాంఘిక పరిస్థితులు
3. పురాణేతిహాస విశిష్ట సంస్కృతి.
4. ప్రకృతి.
5. సంఘటనములు.

సంపుటిలో కృతిపతివంశ పండితవంశ పరిచయముల పిదప మొదట కూర్పబడిన కవిత 'సమర కాళిక.' సాంప్రదాయికముగా ప్రాయికముగా దైవ ప్రార్థనతో ప్రారంభించవలసిన గ్రంథము యుద్ధ విషయముతో ప్రారంభించుట

గమనార్హము. భక్తులు ఆధ్యాత్మిక జీవనులగు ఆచార్యులవారు తమ సహజ ప్రవృత్తి ననుసరించి యైనను భగవత్ప్రార్థన చేయవలసి యుండెను. కాని యట్లు చేయలేదు. నవ్య కవితాశోభిత కావ్యములందు సాధారణముగా సంప్రదాయము పాటింపబడదు. ఆచార్యులవారీ నవ్యతాదృష్టిచేత నిట్లు చేసినారు. కాగా, ఇది కేవలము యుద్ధవర్ణన కవిత కాదు. 1939 లో చెలరేగి 1942 వరకు లోకభీకరమై యకాల ప్రళయము తాండవింపజేసిన ద్వితీయ ప్రపంచ యుద్ధము యొక్క బీభత్సము, తదీయ ఘోర పరిణామములకు వ్యథ చెంది అభ్యుదయకారకమగు విశ్వశాంతికి, భద్రతకు, ధర్మనిరతికి శుభాకాంక్ష యొనర్పబడినది. జగత్కల్యాణార్థము విశ్వశాంతిని కాంక్షించి రచించిన యీ కవిత తదితర కవితలన్నిటి ముఖ్యోద్దేశమునకు పతాకవలె నలరారుచున్నందున వస్తు నిర్దేశకమై యొప్పు చున్నది. ఆ రోజులలో దేశదాస్య విముక్తికై పోరాటము సాగుచు బ్రిటిషువారి పీడల కట్టుడుకుచున్నట్లు ఉడుకుచుండగా గోరుచుట్టుపై రోకటి పోటువలె అంతర్జాతీయముగా ప్రపంచ యుద్ధాగ్ని జ్వాలలు చెలరేగి దేశదేశాలను వలెనే మన దేశమును భీషణముగా తపింపజేయు చుండెను. యుద్ధమనిననే మారణ హోమము. కాగా మహా ప్రళయమునకు మారుపేరు ప్రపంచ యుద్ధము. అది చెలరేగిన విపద్దశలో సమరానల జ్వాల లారి చల్లని శాంతి నెలకొనుట యత్యా గత్యము. అది సర్వశ్రేయములకు మూలము. ఏతన్మహాభ్యుదయాకాంక్షతో వ్రాసిన యీ కవిత కావ్యాది నలంకరించుట నితాంతౌచిత్య భాసురమైనది.

'సమర కాళిక' దేశభక్తి కవితకు చెందినది. ఆచార్యులవారికి దైవభక్తి, దేశభక్తి రెండు కన్నులు. ఇందు సమర కాళికా దంష్ట్రలు చూచి ధర్మదేవత దద్దరిల్లిన విషయము. తదీయ ఘోరవిహారమునకు గురియైన నగరాలు దిబ్బలై బావురుమన్న విషయము, విమానముల బాంబుల బెడద, తదితర యంత్రాల పీడలు, క్షామదేవతా వీరవిహారము, జాతి దురహంకారులు నియంతలు యుద్ధోన్మాదులగు హిట్లరు ముసోలినుల దురంత దుర్దాంత రక్తదాహము కనులకు గట్టినట్లు వర్ణింపబడినవి. చివరకు

''జర్మనీ బాధ అడుగంటి చనెడు గాక!
మన ప్రభుత్వమ్ము తలయెత్తి మనెడు గాక !

మహిని సమరకాళిక పేరు మాయుఁగాక !
శాంతి భద్రతల్ మనుత ! విశ్వంబు నందు."

అని భరతవాక్య ప్రాయమైన శుభాకాంక్ష కావింపబడినది.

ఇక జాతీయముగా భారత స్వాతంత్ర్య సంగ్రామమునకు సారథ్యము వహించి విజయవంతముగా సాగించిన జాతిపిత మహాత్ముని గురించి వ్రాసినది 'కర్మచంద్రుడు-గంధి.' అందు గాంధిగారి మహోత్తమ గుణములు, నిరాడంబరమైన ఆదర్శ జీవనము, వారి మాహాత్మ్యము బహువిధముల కొనియాడబడినవి. ఆచార్యులవారికి గాంధిపైగల ప్రేమాభిమానము లనన్యములు. ఆయన హత్య కావింపబడినప్పు డత్యంత చింతతో వ్రాసిన ఆహ్వానము సంపుటిలోని స్మృతి గేయములే దీనికి తార్కాణ. గాంధిగారు స్వాతంత్ర్య సమరకాలముననే జాతి నిర్మాణమునకు దేశాభ్యుదయమునకు మహోద్యమములుగా నడపిన మహాకార్యముల చేత ప్రభావితులై ఆచార్యులవారు వ్రాసినవే 'రాటము', 'హిందూ మహమ్మదీయ సఖ్యము', 'రాటపు రొద', 'హరిజనుడు-మాలపల్లె' యను కవితలు. దేశభక్తి కవితలగు వీనిలో గాంధిని గూర్చినది ప్రశంసాకవిత. తక్కినవి ప్రచార కవితలు. హరిజనుని గూర్చినది సంఘ సంస్కార సంబంధియు నగును. జన్మభూమి యగు భారతదేశముపై గల నితాంతప్రేమకు మరొక నిదర్శనము 'జన్మభూమి' కవిత.

రాష్ట్ర సంబంధమైన ఆంధ్రోద్యమములలో ముఖ్యమైనది ఆంధ్ర భాషోద్యమము. దానికి గ్రంథాలయోద్యమము ప్రాణము పోసెను. తత్ ప్రభావము చేత రచించినది 'శ్రీకృష్ణదేవరాయ లాంధ్ర గ్రంథాలయము'. ఆంధ్ర జాతి చైతన్యమునకు అప్పటి దీనహీన స్థితికి వగచి గత వైభవ సంస్మరణగా సంతరించిన కవిత 'ఆంధ్ర ప్రశస్తి.' రాయప్రోలు, జాషువ, విశ్వనాథ మున్నగు వారి వలెనే వీరును ఆంధ్రుల పురా వైభవ ప్రాభవములను, ప్రతాపౌదార్యములను లెస్సగా నభివర్ణించిరి. నిజాం రాష్ట్రములో వెట్టిచాకిరి అమలులో నుండి దుర్భర దాస్య జీవనము గడుపుచుండిన బీద వెట్టివాని దుస్థితి, దైన్యము చూడలేక వ్రాసిన కవిత 'నిజాం రాష్ట్రపు బీద వెట్టివాడు.' ఇట్లు జాతీయాంతర్జాతీయోద్యమములచేత ప్రభావితులై దేశభక్తితో అనేక కవితలు వ్రాసిరి.

సాంఘిక పరిస్థితులను గాంచి అందలి దురాచారములకు చింతించి రచించిన కవితలు 'హరిజనుడు - మాలపల్లె', 'వితంతు బాలిక'. రసభావోదంచితములైన యీ కవితలు మిక్కిలి హృదయంగమములు. పురాణేతిహాస విశిష్టమైన మన సంస్కృతి, గతవైభవము స్మరించి హృదయముప్పొంగి యనేక కవితలు 'శ్రీరాముడు', 'కురువృద్ధుడు' వంటివి వ్రాసిరి. ఈ ఖండకావ్యములు భావ చమత్కృతుల చేత చక్కని కళాఖండములై భాసిల్లుచున్నవి.

ప్రకృతి పల్లీ జన కవితలు మూడవవంతు వరకు గలవని మనవి చేసితిని. ప్రకృతి రెండు విధములు. ఒకటి తరుగిరి పశుపక్ష్యాదులకు చెందినది. రెండవది మానవ సంబంధమైన ప్రకృతి. ఈ ద్వివిధ ప్రకృతి పరిశీలన చేత హృదయ స్పందన చెంది రచించిన కవితలు దాదాపు సగము వరకుండును. వస్తువర్గీకరణ ములో పేర్కొనిన ప్రకృతి కవితలు పల్లీజన కవితలే కాక ఇతరములన్న వాని లోని పాకీవాడు, పసిపాపడు, మృత్యువు, హత్యా విచారము మాతృ హృదయము, కవీ!, వృద్ధ పితరులు మున్నగునవల్ల ఈ ప్రేరణచేత రచింపబడిన కవితలలో చేరును. ఈ ప్రకృతి కవితలన్నియు ఆలోచనాత్మకములు, ఉపదేశాత్మకములే కాని కేవల వినోదాత్మకములు కానరావు. మేఘము గూర్చిన దానికి 'ఘనోద్దేశ్యము', పుష్పము గురించిన దానికి 'కుసుమోపదేశము', ప్రాతఃకాలమునకు 'తొలి వేకువ మేలుకొలుపు' ఇత్యాదిగా కవితలకు శీర్షికలు నిర్దేశించుటలోనే యీ విషయము వెల్లడి యగుచున్నది. వాని రచనా నిర్వహణము కూడ దీనినే నిరూపించును. 'కళ కళకొరకే' యనుట సరికాదన్నమాటకును, **'The purpose of the poem is to teach and delight'** అన్న ఆంగ్ల లక్షణకర్తల యభిప్రాయమునకును, 'సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే' అనిన మమ్మట లక్షణమునకును ఈ కవితలు లక్ష్యములై విరాజిల్లుచున్నవి. జగత్తులోని విశాల ప్రకృతి పరిశీలనలో కవిదృష్టి నాకర్షించని దుండదు.

"ఏది కన్నను నందె యెదియొ భాగ్యము గందు,
ఏది విన్నను నందె యెదియొ ప్రణవము విందు
ప్రతిది నా హృదయంబు పట్టి యాకర్షించి
కలము చేతన్బూని కావ్యమ్ము వ్రాయుమను."[1]

---

1. నా తొలికృతి నవోదయములో 'కవితాజనని' కవిత.

అన్నట్లు కవి ప్రత్యేకించి తొలిదశలో భావావేశమున నక్షిగోచరమైన దానినెల్ల అక్షరరమ్యాకృతి కావించుటకు పూనుకొనును.

తమ జననీ జనకుల గూర్చి మూడు కవితలు రచింపబడినవి. 'మాతృ హృదయము' కవితయు నీ భావముతోనే వ్రాయబడినది. పోతనగారికి వలెనే అభినవ పోతనగారికిని తల్లిదండ్రులమీద, విశేషించి తల్లిగారిమీద భక్తి అత్యంత మని తెలియుచున్నది. ఆచార్యులవారి నిజజీవితము కూడ దీనినే నిరూపించుచున్నది.

ఇక, ఆయా సంఘటనలవల్ల ప్రేరితులై వ్రాసిన కవితలు స్మృతి కావ్యములు మరియు ఇతర సందర్భములలోనివి. వీనిలో కొత్త కొండ వీరభద్రస్వామి గూర్చిన రెండు కవితలు, 'శ్రీమంత్ ధర్మరాజ సందర్శనము' అనునవి సందర్శన సందర్భమున రచించినవి. కొత్తకొండ గట్ల నరసింగాపురమునకు చేరువనున్న గ్రామము. అక్కడ వెలసిన దేవుడు వీరభద్రస్వామి. సంక్రాంతి పర్వదినమున అచట గొప్ప జాతర జరుగును. కృతిభర్త శ్రీ జగన్నాథరావుగారక్కడి పంచు కమిటి సభ్యులలో సర్పంచు. ఆచార్యులవారు రెండు మారులు జాతరకు వెడలి దైవదర్శనము చేసికొన్న సందర్భమున రచించిన కవితలివి. శ్రీమంత్ ధర్మరావు చాందాజిల్లాలోని ఆహిరీ సంస్థానాధీశులు. వరదాచార్యుల వారి రెండవ అన్నగారీ ధర్మరావుగారి వద్దనే ఆస్థాన పండితులుగా నుండిరి. అన్నగారి ద్వారా వారిని సందర్శించి యీ కవిత వ్రాసిరి.

స్మృతి కావ్యములలో 'రవికవి స్మృతి' 1941 లో రవీంద్ర కవీంద్రుని యస్తమయమైన సందర్భమున వ్రాసినది. విశ్వకవి రవీంద్రుని రచనల ప్రభావ మాంధ్రకవు లనేకులమీద ఉన్నట్లే ఆచార్యులవారి మీదను కలదు. అతనిపై తమకు గల గౌరవభావమునకు చిహ్నముగా ఈ కళాఖండమును సృష్టించిరి. 'రామాబాయమ్మ స్మృతి' యన్నది మడికొండలోని రామాబాయమ్మ యను భక్తురాలు పరమపదించినపుడు రచించినది. ఈమె వైష్ణవ సంప్రదాయ నియోగ కుటుంబమునకు చెందినది. మహాభక్తురాలు. కవయిత్రి కూడాను. వానమామలై సోదరులందరిని ఆత్మీయముగా ఆదరించి వారు చదువుసందెలు నేర్వజేసిన పుణ్యాత్మురాలు. వరదాచార్యులవారిచేత పలుమారులు పోతన భాగవతము చదివించి తత్ప్రభావము పడునట్లు చేసినది ఈ తల్లియే. ఈమె చేసిన యుపకారమునకు కృతజ్ఞతగా మరణానంతర మాత్మశాంతికై వ్రాసిన కవిత యిది.

ఇక మరిరెండు స్మృతికావ్యము లాచార్యులవారి తలిదండ్రులను గూర్చి వ్రాయబడినవి. అందు మొదటిదగు 'కలను గన్పడునట్టి నా కన్నతల్లి' యనునది కవిగారి యగ్రజులు లక్ష్మణాచార్యులవారు రచించినది యిందు చేర్చబడినదని వెనుక వ్రాసితిని. 1941 లో తండ్రి బక్కయ్య శాస్త్రిగారును, అంత కెనిమిది నెలల పూర్వము తల్లి సీతాంబగారును పరమపదించిరి. అమ్మగారు స్వర్గస్థులై నపుడు లక్ష్మణాచార్యులవారు చెంత లేకుండిరి. పిదప వచ్చి ఆమె యస్థులను గోదావరిలో కలుపుటకు పోవుచుండగా రాత్రి కలలో గన్పడిన తల్లిగారిని గూర్చి రచించిన కవిత యిది. నాయనగా రెనుబది సంవత్సరముల వయస్సున పరమ పదించిన సందర్భమున వరదాచార్యులవారు 'మఱపురాని నాతండ్రి నిన్ మఱతు నెట్లు?' అను కవితను వ్రాసిరి. ఈ రెండు కవితలును జననీ జనకుల గుణశీలము లను, తమపై వారెకుండిన యపార వాత్సల్యమును స్మరించుచు భక్తితో రచింప బడినవి.

ఈ విధముగా నిందలి ఖండకావ్యములు దేశమును సమాజమును దృష్టి యందుంచుకొని అభ్యుదయాకాంక్షతో ఔపదేశికతా ప్రాధాన్యముతో రచింపబడి యొప్పుచు నాటి సామాజిక స్థితిగతుల కద్దము పట్టుచున్నవి.

## రస పోషణము :

ఇందలి ఖండకావ్యములలో ప్రధానముగా జాలువారుచున్నది కరుణరసము. ఆచార్యులవారిది సుతిమెత్తని హృదయము. వారు త్రికరణశుద్ధిగా పరమ కరుణాళు వులు. 'వాడే వైష్ణవుడు దయగలవాడే వైష్ణవుడు'[1] అన్న గీతమున కుదాహరణమైన వారు. అందుకే ఎక్కడ హింస, ధ్వంసము, అన్యాయము, అక్రమము, దైన్యము, దారిద్ర్యము కనబడినను హృదయము ద్రవించి సంతప్తులై తత్ పీడానివారణాశంసతో కవితలు వ్రాసినారు. దుక్కి-బక్క, వీరపత్ని విలాపము, హత్యావిచారము, హరిజనుడు- మాలపల్లె, నిజాం రాష్ట్రపు ఓదవెట్టివాడు, వితంతు బాలిక, కలను గన్పడునట్టి నా కన్నతల్లి-యను ఖండకావ్యములు కరుణరసాత్మకములై చదువరులకు గుండె చెక్కలగునట్లున్నవి. ఇంకను సమర కాళిక, కాపుబుణము, పరిగ పిల్ల, పాకీవాడు,

1. గుజరాతికవి నరసీమెహతా వైష్ణవ గీతమునకు వరదాచార్యులవారి యనువాదము 'ఆహ్వానము' లోనిది.

పాలేరు కవితలును కరుణ రసస్విన్నములైనవే. ఈ యన్నిటిలోను దుక్కిటెద్దు, వితంతుబాలిక కరుణరసాధిదేవతలై సాక్షాత్కరింతురు.

ఇందు కరుణము తరువాత గణింపదగినది వీరరసము. కురువృద్ధుడు, భారతబాలుడు, ఆంధ్రప్రశస్తి, ధనురారోపణము-అను ఖండకావ్యములీ రసమునకు మెచ్చగు మచ్చుతునకలు. ఇవి యుద్ధవీరమునకు ప్రతీకలు కాగా ధర్మాది వీరరసోదంచితములగు కవితలును నిందు విలసిల్లుచున్నవి. శ్రీరాముడు, కర్మచంద్రుడు-గంధి, శ్రీమంత్ ధర్మరాజ సందర్శనము, అడిగి లేదనిపించుటే యమ్మ నన్ను-అను ఖండకృతులు ధర్మవీరమును, తృణము, పాదరక్ష, తేనెటీగ, ఎండుగడ్డి వేరు, పెంటపేలిక యనునవి దానవీరమును పోషించుచున్నవి. పరిగపిల్ల, పాకీవాడు, పాలేరు శాంతమున కాలవాలమై యొప్పుచున్నవి. అగోచరమను ఏకైక కవిత యద్భుతమును వెలార్చుచున్నది. భక్తి కవితలు, ప్రణయ కవితల గూర్చి వస్తు వర్గీకరణములో పేర్కొంటిని. సాహిత్య దర్పణకారుడు పేర్కొనిన వత్సల రసమునకు మాతృహృదయము, జన్మభూమి, వృద్ధ పితరులు-అనునవి నిధానములై యున్నవి. ఇట్లు మణిమాలా ఖండకావ్యములు నానారస ప్రసారములచేత సహృదయ హృదయావర్జకములై యలరారుచున్నవి.

## భావసంపద - కవితా వైభవము :

కావ్యములందు విలసిల్లు వస్తుభావరచనలలో ప్రధానమైన భావమీ ఖండకావ్యములం దంతటను మహోదాత్తమై యున్నది. జాజ్వల్యమానమైన మణిమాలా భావదీప్తి రసికజన మనస్సరోజముల కత్యంత వికాసము కలిగించును. తనివితీర ననుభవించి ధన్యులగుట కిందు కావలసినంత భావసంపద కలదు. పద్యములన్నింటను శబ్దార్థ భావసంబంధి చమత్కృతులలో నేదే నొకటి తటిల్లతవలె తళుక్కున మెఱసి హృదయములకు గిలిగింతలు పెట్టుచుండును.

ఆచార్యులవారి కవితలలో విశ్వశాంతి, దేశభక్తి, మానవతావాదము, సామ్యవాదము, కర్షక కార్మిక ప్రేమ, శ్రమగౌరవము, దీనజనోద్ధరణకాంక్ష, జీవ

కారుణ్యము, ప్రకృతి ప్రబోధము, మహాపురుషాదర్శ గుణగానము తరచుగా ప్రతిబింబించుచుండును. ఈ ధర్మముల పాదులలో నెదిగి యల్లిబిల్లిగ నల్లుకొనిన భావలతలలో మల్లెలు మొల్లలు వికసించి యుల్లముల నుల్లసిల్ల జేయుచున్నవి. అన్నిటిలోను దుక్కి-బక్కి, పాదరక్ష, పసిపాపడు, హత్యావిచారము, శ్రీరాముడు, హరిజనుడు- మాలపల్లె, మాతృహృదయము, వితంతు బాలిక మున్నగు కవిత లుత్కృష్ట మనోభావ విశిష్టములై శోభిల్లుచున్నది.

ఆచార్యులవారు భావదీప్తికై శ్లేష యమకోపమా రూపకాద్యలంకారములను రమ్యముగా కైసేసిరి. ఇందలి శ్లేషలు సహజములై రసార్ద్రములై యాహ్లాదము కల్గించును.

'సమర కాళిక' లో యుద్ధోన్మాదులగు ఘోరపాలకుల గూర్చి-

"మంది కొంపలుగూల్పు వీరందరిపుడు
దక్షులై పుట్టి రొకసారె ధరణియందు
నొక్క దక్షుకై యింతటి యుగ్రమూర్తి
వైతి శంకరా! యిప్పు డేమగుదొ చెపుమ." —పుట 15.

అని దక్షశబ్దమును రమ్యముగా శ్లేషించినారు. ఇట్లే

"పాలేరు వగుట కలుముల! యాలును నీ పట్టియయ్యె."

—'పాలేరు' పుట 28.

"వ్యూహమను పద్మశర సంప్రయోగముననె
నాయనా! నిను లాగెనా నారి రంభ." —'భారత బాలుడు' పుట 37.

"తా నాంధ్రుచేతి యందముగాంచ శిల్పమ్మ కోరి
కొండలం ద్రవ్వికొనుచు రాదె
తా నాంధ్రు బాస చందముమెచ్చి కబ్బమ్మ పదముల నీడ్గిలంబడుచు రాదె
తా నాంధ్రు కంఠనాదము విన్గానమ్మ కడురాగమున వచ్చి మెడకుం
బడదె...." —'ఆంధ్రప్రశస్తి' పుట 42.

"....నీదు నిలుఁజేరిన విత్తులంగాంచి భాగ్య మా
హా! యిట పండె నంచు నుదురంటెదు పూర్వమె కాఁపు చేతులన్
గాయలుకాసి నీదు తలకాయను బండెను నీ యదృష్టమో!"

—'కాపుఋణము' పుట 49.

"ఎండి నీర్‌నీరని గుండెబగులు తటాక మెవఁడప్పులిడ నింత యెగసియాడు
ధర కెవఁడు జీవనములన్ని ధారవోసి
యంతరించునొ సుకృతీ గతాయు వనఁగ...."

—'ఘనోద్దేశ్యము' పుట 55.

ఇత్యాదులలో ముద్ద (బోల్డ్) అక్షరములలోని పదములలో చక్కఁగా నమరిన శ్లేషలు రసికులను చొక్కించుచున్నవి.

శ్లేష తర్వాత పేర్కొనదగిన దిందు యమకము. సాధారణముగా వృత్త్యను ప్రాసా ద్యన్య శబ్దాలంకారములు కానరాని యిందలి ఖండికలలో తఱచుగా నలంక రించిన యమకము కవితకు మేలిగమకము నాపాదించినది. ఈ విషయమున నిది విజయవిలాస కావ్యమును స్మృతి కెలయించుచున్నది. మచ్చునకు కొన్నిటి నుటంకింతును.

''మా నవవిధాన విజ్ఞాన మహిమ యదియొ
మానవవిధానమునె పేరు మాపసాగె
మా రణాస్త్రమ్ములన్నని మహికి నిపుడొ
మారణాస్త్రమ్ములుగఁ దాము మారసాగె" —'సమర కాళిక'-పుట 16.

''భూతలం బంతటికిని నీ కైతల నిడ
ఘనతరాగ్రధ్వజావాప్తికై తలనిడ
నెల్లదెసలు నారవిక్రింద తెల్లవారె
తెచ్చియిడిరి నోబులుపైరిజు తెల్లవారె'' '—రవికవి స్మృతి'—పుట 51

''పుట్టెడు కౌసల్య పట్టియై హరియనన్ బుట్టెఁడు ప్రేమమ్ముబుట్టెఁబ్రజకు
నారిలాగెనొ లేదొ నారియౌరాక్షసిఁ దాటకంబట్టి వధం బొనర్చె
ఆ సుబాహువును చేపైనఁబారఁగలే దహా! స్తుబాహువుఁబట్టి హత మొనర్చె
కంటి కాచినయట్లు గనరాఁడు ప్రజకు ముక్కంటి విల్లంటి ముక్కలుపొనర్చె
మీసములు వచ్చెనో లేదొ మీ సములిల నెవరు శూరులు గలరన భువిఁబరంగె
తమ్ముమలట్టి కన్నులు తమ్ము తమ్ముమలట్లుగాంచునని యేమొ ప్రజ ప్రేమఁ
గాంచనలరె''.

—'శ్రీరాముడు' —పుట 57.

''జుట్టుపరగళమ్ముల కురిఁజుట్టుమనునె బొట్టులన్యుల రక్తంపుటొట్టు గనునె
లాగునొరులన్నప్రాణముల్ లాగు మనునె దాడి వేరొకజాతి నాదాడి సనునె?
—'హిందూమహమ్మదీయ సఖ్యము' —పుట 60.

''మనుచరిత్రమ్ముతో మను చరిత్రము నాది యాచంద్రతారార్కమని
తెలిపితో''

(ఇట్లే తక్కిన పాదముల యమకము కలదు) —'శ్రీకృష్ణదేవరాయలాంధ్ర
గ్రంథాలయము' —పుట 62.

''ఆ గజేంద్రుఁడు మోక్షమందిన కథఁబాడి యాగజేంద్రుని నెక్కి నంతపొంగు''
(ఇట్లే తర్వాతి పాదముల యమకము కలదు) —'రామాబాయమ్మస్మృతి'
—పుట 67

''మనమా యీ చంచలగతి
మనమా మోక్షమ్ముగాంతు మనుకొనుటలు కా
మన మాని రాముఁ గొల్చిన
మనమా పరమపదమందు మనమని చనితో.''
—'రామాబాయమ్మస్మృతి' —పుట 67.

"నీదు పదభక్తియుక్తులై నెగడువారి వీరభద్రాత్మకు లటంచు వెల్లడింతు
అరయ నీపదభక్తిలే నట్టివారి వీరభద్రాత్మకు లటంచు వెల్లడింతు''.
—కొత్తకొండ వీరభద్రుఁడు' —పుట 71.

"ఎవ్వఁడీ మహాదేవు విల్లెత్తఁ గలఁడొ
వాఁడె జనక జామాతయై వరలఁగలఁడు,
ఎవఁడు తానెక్కిడఁగ లేఁడొ శివధనుస్సు
జనకజా! మాత!యని యనఁజను నతండు"—'ధనురారోపణము' పు.79

పై ఉదాహరణములలో చివరి రెండిటగల యమక మొక విశిష్ట చమత్కృతిని వెలార్చుచున్నది. పదములో విరుపులో అర్థాంతరము వచ్చునట్లు చేసిన పదముల కూర్పులో ఈ చమత్కృతి కాననగును.

ఆచార్యులవారి యుపమలును విశిష్టములై కావ్యాంగనకు నవ్యశోభలు నవరించినవి.

"ఒక విద్యం బరిపూర్ణుఁడై మిగతలం దొక్కొక్క యల్పాంశ సా
ధకుఁడైనన్ శశిఁగూడి యుండు నుడుసంతానప్రక్రియన్వొల్గుఁ దా
నొకటన్ బూర్ణుఁడుగాక యన్నికళలం దొక్కింత సాధింపఁ దా
సకలోడుస్థగితాంబరంబున నమాసన్ గన్న చందంబుగున్"

—'పండితవంశ పరిచయము' పుట 11.

తమ పెద్దన్న వేంకటాచార్యులవారి ప్రతిభాపాండిత్యములగూర్చి చెప్పిన సందర్భములో వెలార్చిన యీ భావ ముపమచేత హృదయంగమ మైనది. ఒక విద్యలో పరిపూర్ణుడై తక్కినవానిలో కొంతకొంత సాధించినవాడు చంద్రునితో గూడి ప్రకాశించు చుక్కలవలె వెలుగు ననియు, ఒక్కదానిలోను పరిపూర్ణుడు కాక ఆయా కళలలో కొంతకొంత సాధించినవాడు చుక్కలతో గూడిన ఆకాశమున నమావాస్యారాత్రి శోభాహీనమైనట్లగునని చక్కగా నుపమించి చెప్పి విద్యాసాధకులకు మంచి యుపదేశము చేసినారు. ఆంగ్లమున ఈ విషయము Every thing in some thing and some thing in every thing'' అని చెప్పబడినది. ఇట్లు సాధించనివాని యెడగల 'Jack of all master of none' అన్నది ప్రసిద్ధమే కదా!

'పసిపాపడు' శీర్షికలో కూర్పబడిన యుపమలు మిగుల సొగసైనవి.

''మంచిముత్తెములు వర్షించినట్టులు పొంగు పిల్లని చిరునవ్వు జల్లు లరసి రవ్వలు నీలాలు రాలి పడ్డటు లుబ్బు పుత్రుని కల్కి చూపులను గాంచి....''
ఇట్లే,

''దొరల తెల్లగుడ్డ లవెంతొ దూరముండఁ గనె యడవి జంతువులవోలెఁ గాంచి బెదరి బానిసను దండ మని పుట్టె బాదుకొనుచు వంగి యెపుడొ చచ్చినటు తొలంగి చనరె''

—'హరిజనుడు-మాలపల్లె'-పుట 75.

"తుంగచువ్వలవలె పొంగిపోయెడి వయస్సు.''—'వితంతు బాలిక' -పుట 119

''ఎగురు తుట్టాయివలె గాలి నెగయు కురుల''—'పరిగపిల్ల' పుట 21
ఇత్యాది రమ్యోపమలు డెందములకు విందొసగు చుండును.

ఇంకను ఖండకృతులందు రూపక పరిణామార్థాంతరన్యాసాదుల మనోహర విన్యాసములు సాక్షాత్కరించును. మరియు,

"చేతికందినన్ నోరున కందదు." సమర కాళిక'-పుట 14.

''తాతకు దగ్గు నేర్పుట''-'హత్యా విచారము' పుట 43.

"పులిని గాంచిన నక్కయు మేన వాతలం దా నిడి కొన్నయట్లు"

ఘనోద్దేశ్యము-పుట 55.

''సుకృతీ గతాయుః'' - '' ''

''వచ్చునెడ నపకీర్తి చచ్చినను బోదు." - 'చుక్క చూపు' - పుట 85. మున్నగు సామెత లెడదల కామెత లిడుచున్నవి.

ఇక ఖండ కావ్యముల నందందు తళుక్కు తళుక్కున మెఱయు భావార్థచమత్కారములను పరిశీలింతము.

కవితలలో నామములకు చమత్కారార్థకల్పనము చేయుటలో ఆచార్యుల వారు ప్రదర్శించిన ప్రావీణ్యము నిరుపమానమైనది.

'రవికవి స్మృతి'లో రవీంద్ర శబ్దమునకు మిక్కిలి చక్కని సమన్వయముతో నర్థము చెప్పినారు. రవి యగుచు విశ్వరసము గ్రహించి యింద్రుడగుచు దానిని సుధగ ధర కిచ్చును గనుక రవీంద్రుడైనా డనుట కవిప్రతిభకు తార్కాణ.

శ్రీరాముని గూర్చి వ్రాసిన కవితలో నిట్టి చమత్కారము లనేకములు కలవు. లోకములో స్త్రీలను హరిమధ్య లనుట కలదు. వారు గర్భవతులైనను పేరు కల్ల యగును గాని కౌసల్య మాత్రము గర్భవతియై యట్టి పేరునకు కొట్టు తేలేదట. ఆమె గర్భవతియైనను హరిమధ్యయే యని శ్లేషించి చమత్కరించిరి. ఇట్లే యిందు వాల్మీకిని గూర్చి వ్రాయుచు,

'తలక్రిందు రామశబ్దము జపించుటనేమొ తలక్రిందుజేసె నితరకవులది....
ఎఱుకౌటనో నాకె యెఱుక యంతయునన సర్వజ్ఞురాము హస్తగతుఁజేసె
పుట్ట నుండుటొ వేరె పుట్టనుండండిట్టి కవి నాఁగ మ్రోగె నా కలపు గజ్జె....
రాము కథయౌటనో తక్కు రాజకథలు రాము నీ సాటి యను భావరాజి వెలసె.'

—'శ్రీరాముఁడు'-పుట. 56

అని శబ్దార్థ చమత్కారావహముగా రచించిరి.

కొత్తకొండ వీరభద్రుని గూర్చి వ్రాసిన కవితలో వీరభద్రశబ్దమునకు చమత్కారమైన వ్యుత్పత్తిని ప్రతిపాదించిరి.

'క్రూరశిక్షణార్థంబయి వీరతయును, భక్తరక్షణార్థంబయి భద్రతయును,
కరఁగిపోసిన యవతారపురుషుఁడంచుఁ బ్రజయెఱుంగుటకై వీరభద్రుఁడైతొ'
—'కొత్తకొండ వీరభద్రుడు'-పుట 70

అని చమత్కరించిరి. హరిజన శబ్దమునకు చేసిన యర్థకల్పన మరింత చమత్కారముగా నున్నది బ్రాహ్మణాది చతుర్వర్ణప్రజలెవ్వరును పట్టించుకొనని అంత్యజుడు హరికిఁ బట్టినవాఁడగుట హరిజనుఁ డయ్యెనని యుత్ప్రేక్షించుట చమత్కృతమేకాక అంత్యజుని దైన్యమును విశదము చేయుచున్నది.

మణిమాలలోని భావసంపదగూర్చి మొదట మనవి చేసితిని. పరమరమణీయములైన యిందలి భావములు నూతనములై రసోదంచిత చేతనములై వాగీశ్వరీ మందిర మహోన్నత కేతనములై యలరారుచున్నవి.

ఆచార్యులవారి సంబోధనలు పూజ్యభావాత్మకములై విశిష్టములైనవి. కవితలలో ఆయా వ్యక్తులను, తిర్యగ్జడములను సంబోధించిన తీరు గమనించినచో వారికి సకల భూతములందుగల ప్రేమాదరములు, ప్రత్యేకించి దీనహీన ప్రాణులయందు గల కారుణ్యము సద్భావము విశదము కాగలవు.

పరిగపిల్లను గూర్చి 'నిండునె పైడి బొజ్జ జననీ!' యనియు, 'మాదుహృదయాసనమ్మున మాత! నిన్నె యునిచికొందు' మనియు సంబోధించి సంభావించినారు. పాకీవానిని 'పాకిసమ్రాట్టు!'యని గౌరవించిరి. పాదరక్షను గూర్చి 'అఖిల జనభారమును వహింతువమ్మ!'యని సమ్మానించిరి. పాలేరు వానిని 'పల్లెపాలేరు రాయ!' 'పాలేరుబిడ్డ!'యని ముద్దుగా పలుకరించిరి. తేనెటీగను పరామర్శించుచు 'ఇంకేమిటి బ్రతుకు తల్లి!' యనియు, 'తల్లి మధుమక్షికమ్మ!'యనియు మన్ననగావించిరి గ్రామసూకరమును 'సూకరదేవ!'యని ఆదివరాహమూర్తినివలె భక్తి భావనతో సంబోధించుట ఆచార్యులవారికే చెల్లినది. ఎండుగడ్డివేరు గురించి'అమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ!'యని సంబోధించినది వారి పరమసహృదయతను వెలార్చుచున్నది. ఇట్లాచార్యులవారు సాహిత జీవితమునేకాక నిజజీవితమును కూడ మృదుమధుకాంతరంగముతో సాగించు పుణ్యులు.

కవితలలో అందందు వైష్ణవపరిభాష కానసగును. శ్రీవైష్ణవులైన ఆచార్యుల వారు విశిష్టాద్వైత సిద్ధాంతము ననుష్ఠానపూర్వకముగా సేవించు భాగవతోత్తములు. అట్టి వారి రచనలలో తదీయ సంప్రదాయము ప్రతిఫలించుట సహజమే వైష్ణవ మతమున మానవులయెడ ప్రేమ, సేవ, దాస్యభావము భగవంతునియెడ భక్తి ప్రపత్తులు ప్రధానముగా పేర్కొనబడినవి.ఆయా రచనలలోనివి కొంత పొందుపరచ బడినవి. కవితలలో దాస, దాస్యశబ్దములు తఱచు ప్రయుక్తములైనవి.

"నీ దాసజనులు తెలిసియో తెలియకో నీకు సలిపినట్టి తప్పులను పొట్ట లోపల దాచికొనఁగ ప్రార్థనముసేతు'నని వ్రాసిరి.('తేనెటీగ' పు. 103) గ్రామసూకరమును గూర్చి వర్ణించుచు పెక్కుతావుల వైష్ణవ మర్యాదను కనబరచి నారు.

"మలముఁదిను నూరబందిపై కలము తాను
పరువు లిడుటెందులకొ యట తరుగనట్టి
దాస్యధనమేమి యుండెనో దానికెఱుక." అన్నారు. (పుట 104)

"పరమేశ నిల్లాలి పరమపావనమగు తిరుమేన దుర్గంధభరితమైన
మనుజుల విష్ఠను గనలేక దానినె యాహారముగ లోనె యడఁచినావా''
అని సూకరము గురించి సదూహ కావించినారు.

"తా జగత్కుటుంబియె యిటు దాస్యమునకు నిన్నె కడపటి హద్దుగా నిలిపియుండి
నీ స్వభావమె దాలిచి నిలిచెననిన నెంత గర్వించవలయు నీ యెసకమునకు" (పుట 105)

అని సూకరముయొక్క అమూల్య దాస్య జీవనమును వినుతించిరి.

పసిపాపని వర్ణించుచు"గంజిద్రావుచు గంతలగట్టు నీవు, గ్రాసముల నేమిగొల్తువీ దాసతతికి" (పుట 29) అన్నారు. పెంటపేలికను గూర్చి వ్రాయుచు

అన్నిరసముల ననుభవమంది నీవు ప్రేమరసము కన్నను వేఱుపెద్దగుణము
సేవకన్న నుత్తమ కర్మ లేవనుచును పల్కుచే పెంటపేలికా! వర్తనమున"
(పు. 116)

అని వైష్ణవమత పరమార్థమును పెంటపేలిక సాకుతో ప్రబోధించినారు.

ఆచార్యులవారు వైష్ణవులయ్యు శివ కేశవ భేదభావము లేనివారు. అందుకే కొత్తకొండ వీరభద్రస్వామి గూర్చి రెండు కవితలు వ్రాసి యందు మొదట,

"వరద! యిది శివక్షేత్రమే న్వైష్ణవుడను నుదువుపెట్లని యనుమానపడితివేమొ ఆ మతత్రయాలోక చెట్టునంటు గొమ్మలనుచు నీ శిఖరాగ్రము నధివసించు ఘనత్రిశూలమ్మె నీ తిలకముగ నలరు నేటికీ సంశయము హరి యెచట లేడు?" (పుట 69) అని విమర్శించుకొని నివృత్త సంశయులై వర్ణించినారు. వీరి యీ యభేద భావము, మతసామరస్య మనంతరకృతులలో విస్పష్టముగా విశిష్టముగా గోచరించును.

## కావ్యోపదేశము :

ఇందలి ఖండకావ్యములలో రసభావచమత్కారాదులచేత ఆనందము కలిగించుచునే యెడనెడ చక్కని నీతులు తెలిపి ధర్మోపదేశము కావింపబడినది. ఈ సుగుణముచేత మమ్మటుడు పేర్కొనిన కావ్యప్రయోజనములలో 'సద్యః పర నిర్వృతి, కాంతాసమ్మితోపదేశము' అను రెండును ఆచార్యులవారి కాదర్శము లైనవి. ఆనందము, ఉపదేశము రెండును ప్రసాదించునదే యుత్తమ కావ్య మనియు, రెండిటిలో నేది లోపించినను అది సంసారసౌఖ్యములేని సంతానోత్పత్తి వలెనో సంతానోత్పత్తిలేని సంసారసౌఖ్యము వలెనో యసమగ్రమైనదనియు ఆచార్యులవారు తరచుగా సెలవిచ్చుచుందురు.

ఉపదేశ ప్రదత్వము ననుసరించి యిందలి కవితలను రెండు తెఱగులుగా పేర్కొనవచ్చును; 1. వస్తువర్ణనము ద్వారా వ్యంగ్యముగా ఉపదేశముచేయు కవితలు. 2. ప్రధానముగా ఉపదేశాత్మకములైన కవితలు.

మొదటి రకపు కవితలలో 'సమర కాళిక' ద్వారా విశ్వశాంతి, 'పసెగపిల్ల' ద్వారా తృప్తి, శాంతి, 'తృణము' ద్వారా త్యాగభావము, 'పాలేరు' ద్వారా ఆర్త జన పోషణము, శ్రమమూల్యము 'పాదరక్ష' ద్వారా లోకసేవాగుణము, 'తేనెటీగ' ద్వారా త్యాగబుద్ధి, 'గ్రామసూకరము' ద్వారా సేవాదాస్య భావములు ప్రబోధింప బడినవి.

ఇక రెండవరకపు కవితలలో 'కుసుమోపదేశము' న బ్రతికిన రెన్నాళ్ల నవ్వుచు గడపుట, మాతృభూమి పూజ, దానత్యాగములు, 'గంటము-కత్తి'లో దైన్యగర్వములు తగులకుండ సమబుద్ధి నుండుట, దుర్గుణాలను దూరము చేసికొనుట, కాయకష్టపు విలువ మున్నగునవి, 'చుక్క-చూపు' నందు బ్రతుకు క్షణికము కావున మూర్తి యున్నంతలోనే కీర్తి రూపమున విశ్వమంతట వెలుగవలెననియు, గర్వము పనికిరాదనియు వచ్చిన మచ్చ చచ్చినను పోదనియు చెప్పుట, 'తొలివేకువ మేలుకొలుపు' లో లోకమున రైతు ప్రాధాన్యము, దరిద్రజన సేవా ధర్మము, ఘనత కోరినవారు వేకువనే మేల్కొనవలయుననుట, 'పట్టుదల' లో పరశ్రేయస్సునకు పట్టుదలతో సాగుట, 'రాటంపురొద'లో పేదల యగచాట్లే ధనికుల భోగాలకు దోహదమగుట, 'ఎండుగడ్డి వేరు'లో కడుపుతీపి, సర్వసమత, సత్రుపన్నత, శాశ్వతత్వ తపన బోధింపబడినవి.

## నవ్యత, సాంప్రదాయికత :

ఇందలి ఖండకావ్యములు సాధారణముగా నవ్యకవితా శోభితములై యున్నవని 'మణిమాల-వస్తువు' అను నుపశీర్షికలో పేర్కొనియుంటిని. నవ్య కవిత్వ లక్షణములను 'ఖండకావ్య ప్రక్రియ' వ్యాసములో వివరించి యుంటిని. తదనుసారముగా ఇందలి ఖండకావ్యముల నవ్యతను నిరూపింతును.

*1. ఖండకావ్య ప్రక్రియ* : నవ్యకవిత్వ లక్షణములలో ఇదియొకటిదిగా పేర్కొనబడినందున నిందలివెల్ల ఖండకావ్యములే యగుటచేత నన్నియు నవ్య కవిత్వ విలసితములేయై యున్నవి.

*2. వస్తు నవ్యత* : ఇందులో వీరపత్ని విలాపము, కురువృద్ధుడు, శ్రీరాముడు మున్నగు పది పౌరాణిక కవితలు తప్ప తక్కినవెల్ల వస్తు నవ్యతతో భాసిల్లుచున్నవి. ఆ పది కవితలలోను నిర్వహణలో నవ్యత గోచరించును.

*3. భావ ప్రాధాన్యము* : ఇందలి కవితలు కృత్రిమమైన మేధాగత కల్పనలకు రీతికి ప్రాకులాడక భావ ప్రధానములుగా రచింపబడినవి.

*4. శైలీ సారళ్యము* : పూర్వ ప్రబంధములలోవలె దీర్ఘసమాస జటిల శైలిలోకాక కవితలెల్ల సరళశైలిలో విరచితములు.

*5. పదప్రయోగ నవ్యత* : కవితలలో వ్యర్థపదములు, వ్యవహార భ్రష్టములైన మారుమూల పదములు లేక ప్రసాద గుణభాసురత నెలకొని యున్నది.

*6. ఆత్మాశ్రయ కవితారీతి* : ఇందలి ఖండకావ్యములు కథలతో తదంగ ప్రత్యంగములతో సాగక కవి యనుభూతియే ప్రధానముగా సాగిన ఆత్మాశ్రయ కవితారీతిలోనివి.

*7. దేశికవితా రచన* : ఇందలి 14 గేయ కవితలు దేశికవితలు.

*8. ప్రక్రియా బాహుళ్యము* : ఇందలి కవితలు చాలవరకు ప్రకృతి కవిత్వము, పల్లీజన కవిత్వము, స్మృతి కావ్యములు మున్నగు నవ్యకవితా శాఖలలో విరాజిల్లుచున్నవి. వీనిని గూర్చి యీ వ్యాసమునందలి వస్తు వర్గీకరణ ములో విశదీకరించి యుంటిని ఈ యన్నిటిచేత మణిమాలా కవితలు నవ్యకవితా కళా విలసితమై యున్నవి

ఇందలి కవితలు నవ్యతకు నిలయమైనను సాంప్రదాయికతకు కూడ కొంత తావిచ్చినవి. ఇందలి పది పౌరాణిక కవితలు వస్తురీత్యా సాంప్రదాయికములు. మరియు 'సమర కాళిక'లో గోద్విజుల శుభముఁకోరుట, అగస్త్యభ్రాత, బ్రహ్మ కల్పము మున్నగు పదముల ప్రయోగము, 'మాయావియై....' అను పద్యమున ఇంద్రజిత్తు, హిరణ్యాక్షుడు, కుంభకర్ణుడు, రావణబ్రహ్మ మొదలగువారి యుదా హరణములిచ్చుట యిత్యాదులవల్లను, 'దుక్కిఁబక్కఁ' లో 'బ్రాహ్మణ శిఖకు....' అను పద్యమునందు 'గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు' అనుట మొదలగువానివల్లను, ఆయా కవితలలో వైష్ణవమత మర్యాదలు వెలిపుచ్చుటవల్లను, ఇంకను నిట్టివే అందందు ధర్మము సంస్కృతి మున్నగువానిని తడవినందువల్లను సాంప్రదాయి కత వ్యక్తమగుచున్నది.

ఆచార్యులవారు సాంప్రదాయికులే కాని 'ఛాదస్తులు', కలవారే మాత్రము కాదు. వారి రచనలలో సాంప్రదాయికత నవ్యత విలసిల్లి 'క్రొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెఱుంగులు' చిమ్ముచుండును. వారి పోతన చరిత్రము నవ్యగుణ విశిష్టమైన సాంప్రదాయిక కావ్యము. వారి యీ మణిమాల సాంప్రదాయికతా సూత్రమున గ్రుచ్చిన నవ్యహారము.

## శైలి :

మణిమాలా కవితలలోని శైలి సాధారణముగా సరళసుందరమై ప్రసాద మాధుర్యాది గుణశోభితమై ద్రాక్షాపాకమున చవులూరించుచున్నది. ప్రాయికముగా పద్యగేయములు ధారాశుద్ధి విలసితములై యున్నను అందందు కొంత యపరి పక్వమై పువ్వుల పొన్పులో అటనట మొగ్గలుండి యొత్తునట్లు పాఠకుని రవంత శ్రమ పెట్టుచుండును ధార సరిగా అభ్యస్తము కాని తొలిరచన యగుటయే దీనికి కారణము. ఇందలి సమాసములు నాతిదీర్ఘములై సుబోధకములై యున్నవి. 'అలతి యలతి పలుకుల కాహళ సంధించిన విధాన' నమరినది వీరి శైలి. ఈ గుణముచేత వీ రార్థిక కవి వీరి శైలి పదాడంబరమునకు కేవలరీతికి మోజుపడనిదై శబ్దమును మించిన యర్థపుష్టి కలదై యొప్పుచున్నది.

ఇందలి భాష తఱచుగా ఆచ్ఛికమై జానుతెనుగై తనరారుచున్నది.

"కసిదీర గుప్పించి గంతులువైచు లేగల కయి నాట్యరంగంబు వగుదు.."[1]

ఇత్యాది పద్యాలు జానుతెనుగునకు రమ్యశైలికిని లక్ష్యములు. అందందు నందమైన అచ్చతెలుగు పదైములును ముద్దుగొలుపు చుండును. మచ్చునకొక్క పద్యముదాహ రింతును.

"సొడసొడ వేడినెత్తురులు చుక్కలు చుక్కలు గాఁగ రాల దో
సెఁడు బడె దండపుండు మెయి చిల్లుల జల్లెడయయ్యె నింతకున్
బడలుచు, వాడి వీడ ఁది పాడియె చూడుము కాఁపుబిడ్డ! నీ
పొడిచెడి ముల్లుఁగట్టె కెటుబోయెను కన్గవ యింత గ్రుడ్డిదే" [2]

## భాషాప్రయోగ విశేషములు :

### పదబంధములు :

ఆచార్యులవారు మణిమాలా కవితలలో చక్కని పదబంధములు విశిష్టముగా ప్రయోగించి యుజ్జ్వల భావస్ఫూర్తిని కలిగించినారు. వీనివలన భాష జాతీయమై మిక్కిలి యింపునింపుచున్నది. మచ్చునకు కొన్ని దిగువ నిచ్చుచున్నాము.

1 'తృణము'–పుట 25.

2. 'దుక్కిబక్క'–పుట 17.

నిప్పులోనఁ బుట్టించితి నీటి నౌర ! — కృతిపతి వంశ పరిచితి-పుట 4.
నివురు గప్పిన నిప్పయి — పాకీవాడు-పుట 22.
ఇండ్ల గట్టెదు రాళ్ళ ముండ్లలోన — పాదరక్ష-పుట 25.
మీ పోకల్ కస్తురి గట్టు గుడ్డయయి — కురువృద్ధుడు-పుట 34
హరిః ఓమని విలువిద్య నడుగిడె నెపుడు — భారత బాలుడు-పుట 37.
రాళ్ళు రత్నమ్ములయ్యెఁ గరాన మన్ను ముట్ట బంగారమయ్యెను
— ఆంధ్రప్రశస్తి-పుట 41.
కడుపులోపలి చల్ల కదలకుండనె — గేలిసేతు-పుట 95.
దాని పేరన రామమంత్రమ్ము కవికి — తేనెటీగ-పుట 101
కడుపుఁగోఁత యింతింతని నుడువ వశమె — పుట 101
మిన్ను విఱిగి పైనఁబడిన దింకేమిటి బ్రతుకు — పుట 103
గుండె లవియగా మనసునెట్లొ రాయి చేసికొని — గ్రామసూకరము-పుట 107
కన్నుల నిప్పులు బోసికొనును — ఊరబిచ్చుక-పుట 108
కంటఁ గన్నిడి సాకి మీకండ నెదురు పెట్టితిరిమాకు-వృద్ధపితరులు-పుట 113
కడుపు చెఱువౌను కన్నీరు కాల్వలౌను — వితంతు బాలిక-పుట 118

ఇత్యాదిగా నుడికారపు సింగారము కవిత లన్నిట పుష్కలమై వన్నెల చిన్నెల చెన్ను మీరుచున్నది.

## మాండలికములు :

ఆచార్యుల వారి కవితలలో అందందు మాండలిక పదములను ప్రయోగించినారు. వారు తెలంగాణవా రగుటయు, అందును వరంగల్లు ప్రాంతమున నివసించినవా రగుటయు తన్మండలము యొక్కయు తత్పరిసర ప్రాంతముల యొక్కయు మాండలికములను వాడుట జరిగినది. కవులు సాధారణముగా తమ దేశకాల ప్రచలితము లగు మాండలికములను కావ్యములలో ప్రయోగించుట చూచుచున్నాము. రచనలో నిది సహజముగనే జరిగిపోవును. పూర్వకవులగు తిక్కన శ్రీనాథుడు పోతన మొదలగువా రిట్టి మాండలికములను ప్రయోగించిన వారే. మాండలికము లన్నియు కావ్యములలో నిఘంటువులలో చేరకున్నను, సర్వప్రాంతజన సుపరిచితములు కానందువల్ల అర్థావగాహనములో కొంత

ఇబ్బంది కల్గినను భాషావికాసమునకును తదీయ సజీవత్వమునకును తార్కాణములై వింత సొబగులను సంతరింపజేయును.[1] ఇట్టి మాండలికము లిందు కొన్ని ప్రయుక్తములైనవి. రంధి, దుక్కి బక్క, బొక్కలన్ (బొమికలను), మొస (శ్వాస), సాదుట, ఓడి (ఒడి), బుక్క (బొక్క), బాలసంతు, కాని బొట్టు (బొట్టు = అణాలో నాల్గవ భాగము), జీవగంజి, తొంబకు తొంబ, గోసరిలుచు-మున్నగునవి అటనట కాననగును.

## అన్యదేశ్యములు : వ్యావహారికములు :

మాండలికములే కాక యిందన్యదేశ్యములును వ్యావహారిక పదములును కొన్ని కవిగారు వాడినారు. తెలంగాణములో అప్పుడు రాజభాష, బోధనభాష ఉరుదే కావునను ఇచట ఉరుదూ పదములును, తదితరాంధ్ర ప్రాంతములో బ్రిటిషు వారి పరిపాలనచేత ఆంగ్ల పదములును తెలుగులో వాడుక చేయుట పరిపాటి యైనది. అంతేకాక ఆచార్యులవారు బాల్యమున ఏడవ తరగతి వరకు ఉరుదూలో చదివి తర్వాత అందులో చక్కని పరిజ్ఞానము సంపాదించి యుండిరి.[2] కావున సహజముగనే ఉరుదూ పదములు దొరిలినవి. ఈ యన్యదేశ్య పదప్రయోగము భాషా వాఙ్మయ ప్రగతికి హేతువన్నది ప్రాజ్ఞ విదితమే.[3]

ముఖ్యముగ ఫరషు, మేవాలు, గులాములు, తోపుతోటాలు, పోషాకు, దర్బారు, సలాములు, మిరాశి, ఫర్మాయిషీ, మోతి వంటి ఉరుదూ పదాలిందు కన బడును. సోఫా, ఆఫీసర్లు- అను ఆంగ్లపదాలు రెండు మాత్రము ప్రయుక్తములు.

ఇక కవితలెల్ల సలక్షణమైన గ్రాంథిక భాషలో నుండగా క్వాచిత్కముగా గేయములలో వ్యావహారిక భాష ప్రయుక్తమై కానబడును. ఈనాడు పద్యములలో

1. "మాండలికములు దేశ్యములే" — ఆంధ్రభాషానుశాసనము (మల్లాది సూర్య నారాయణశాస్త్రి) : ప్రయోగ విశేష ప్రకరణము, 77 వ సూత్రము.
2. ఆచార్యులవారు ఉరుదూ కవితలను 'షాకిర్ గీతాంజలి' అను పేర ఆంధ్రీక రించినారు.
3. "వాఙ్మయాభివృద్ధి కావశ్యకములైన యన్యదేశ్యములు వ్యవహార సిద్ధములు గ్రాహ్యములు." — ఆంధ్రభాషానుశాసనము : ప్రయోగ విశేష ప్రకరణము, 78 వ సూత్రము.

ఎవరో యొకరిద్దరు తప్ప గేయములలో తఱచుగా వ్యావహారికము కావలెననియే వాడుచున్నారు. ఆచార్యులవారు కొంతయైనను నుద్దేశపూర్వకముగనే వ్యావహారిక ప్రయోగము చేసినారనవచ్చును. వ్యావహారిక భాషావాదమున కాచార్యులవారు వ్యతిరేకులు కారనుట కివియే కాక వారి విప్రలబ్ధ గేయకావ్యమే తార్కాణము.

మానవుల్లారా, అడుగుచున్నాది, చూడకుంటేమి, నారేళఫలము మున్నగునవి యిందలి వాడుక పదములు.

## శబ్ద ప్రయోగ విశేషములు.

శబ్ద ప్రయోగ విషయములో ఆచార్యులవారికి కొన్ని ప్రత్యేకాభిరుచు లున్నట్లు గోచరమగును. అవి వారి కలవాటైయున్నవి. వానిని దిగువ నుటంకింతును.

ద్విత్వాక్షరములు గల పదములకు ద్విత్వలోపము చేసిన రూపములను వాడుట తఱచుగా కానబడును.

"అకారంబు క్రింది అకారంబునకు దుది నులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు."[1]

"అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు."[2]

అను సూత్రములచేత నవి సాధువులే యైనను ద్విత్వరహిత రూపము కవిగారి కెక్కువ మక్కువ.

కను, తలి, ముకుపచ్చలారని, బిడ-ఇత్యాదులిట్టివి. ఈ యన్నిటిలోను 'బిడ్డ'కు బదులు 'బిడ' యని వాడుట సాధారణమైపోయినది. ఎక్కడనో బిడ్డ యనుట తప్ప బిడ యనియే వాడుక చేసినారు. బిడల, కడగొట్టు బిడలు, బిడల కాళులు మొదలగునవి. 'ఎండు గడ్డి వేరు' కవితలో తొమ్మిది చోట్ల వచ్చినారు బిడలు.

పదములను వీలైన చోటులందు హలంత రూపములను వాడుక చేయుటయు కలదు. ఎండి నీర్ నీరను, నీపేర్ విన, దొండపండు బోల్ పెదవులు, నోర్

1. బాలవాక్యరణము: ప్రకీర్ణక పరిచ్ఛేదము, సూత్రము 7.
2. బాలవ్యాకరణము: ప్రకీర్ణక పరిచ్ఛేదము, సూత్రము 8.

మూసి, పర్వతాగ్రాల్, తెల్టెం జేర్ మానవులను, ఇల్‌గట్ట, ఘోరమనువార్-వంటి హలంత రూపములు ప్రయుక్తమైనవి.

## ఛందో విశేషములు :

మణిమాలాకవితలను ఛందస్సు ననుసరించి రెండు భాగములు చేయ వచ్చును. 1. పద్య కవితలు. 2. గేయ కవితలు.

సంపుటిలోని మొత్తము 59 కవితలలో 45 పద్యకవితలు 14గేయకవితలు కలవు. ఆచార్యులవారు పద్యములను గేయములను చతురముగా నడపుటలో సవ్యసాచులు. వారికీ రెండిటిపైనను మక్కువ కలదు. వారి పద్యశిల్పము పోతన చరిత్రములో మహోదాత్తముగా విలసిల్లగా వారి గేయకవిత 'ఆహ్వానము'లో మరింత, 'జయధ్వజము'లో అంతకుమించి శోభిల్లి 'విప్రలబ్ధ'లో బహుభంగుల మనోజ్ఞముగా నృత్యము చేసినది. ఇందలి ద్వివిధ కవితలలోను ఛందస్సంబంధ మైన కొన్ని వింతలు విశేషములు కన్పడును. వానిని సంగ్రహముగా పేర్కొందును.

## పద్యకవితలు :

పద్యమయములైన 45 కవితలలో 500వరకు గల పద్యములలో సగము వరకు గీతపద్యములే యుండుట గమనార్హము. ఈ గీతములలోను ఏ నాలుగో ఆటవెలదులుతప్ప తక్కినవెల్ల తేటగీతులే. 250 వృత్తకందాదులలో 90కిమించి సీసములున్నవి. కుసుమోపదేశము, తేనెటీగ మున్నగు ఆరు కవితలలో మొత్తము గీతములే కలవు. పద్యరచనలో అతిసులభమైనవి గీత సీసములే. గీతములు తేటగా ఆటగా నుండును. సీసరచనకూడ చాల సులభమైనది. ప్రథమదశలోని కవితలగుట చేత తేలికైన ఛందస్సులను వాడినారనుటయే కాక, కవితలలో ప్రయోగించిన వృత్తములును బిగువు చెడక పటిష్ఠముగా ధారాశుద్ధిశోభితముగా నున్నందున గీత సీసముల నిష్టపూర్వకముగానే వ్రాసినా రనియు భావింపవలసి యున్నది.

కొన్నియెడల పద్యములలో పాదనియతి పాటించలేదు. ఈ నియమ రాహిత్యము పాతిక పద్యములలో కానవచ్చును. అందులో సగము గీతపద్యముల లోనే దొరలినవి. గీతములు పంచపాదివి, షట్పాదివి,ఒక్కచోట అష్టపాదిది కలవు.

'కుసుమోపదేశము', 'ఎండుగడ్డివేరు' కవితలలో గీతమాలికలు ప్రయుక్తములు. నాలుగు త్రిపాదిసీసములున్నవి. ఒక త్రిపాదిసీసమునకు పంచపాదిగీతము ('తానాంధ్రుచేతి....' 'ఆంధ్ర ప్రశస్తి'-పుట 42), 'గ్రామ సూకరము' కవితలో నొక పద్యము రెండుపాదాలు ఆటవెలది మూడుపాదాలు తేటగీతి కలది. కతిపయ వృత్తములలోను నిట్టి యనియత స్థితి గోచరించును. 'కృతిపతి వంశపరిచితి'లో పంచపాది చంపకమొకటి త్రిపాది చంపకమొకటి కలవు. అట్లే 'హత్యా విచారము'లో పంచపాదిచంపకము, 'శ్రీరాముడు'లో షట్పాది చంపకము, 'కురు వృద్ధుడు' లో పంచపాది ఉత్పలమాల, 'కొత్తకొండ వీరభద్రస్వామి ౧' లో షట్పాది శార్దూలము కలవు. ఈ రీతిగా కొన్ని పద్యములలో పాదము లనియత ములుగా ప్రయోగించుటకును హేతు వాచార్యులవారు తొలిదశలో తమ భావములను కుదించి నియత పాదములలో వ్యక్తము చేయజాలక పోవుటయే. కొండలపై పెల్లు బికి క్రేళ్లుఱుకు సెలయేళ్ళవలె హృదయమునుండి చిమ్ముకొనివచ్చు భావధారల కానకట్టలువేయుట తొలినాళ్ళలో వశము కాలేదాచార్యులవారికి. అంతేకాని నియ మోల్లంఘనము కాదు వారి యాశయము.

## గేయ కవితలు :

ఇందు కూర్పబడిన 14 గేయకవితలలో సాధారణముగా గతిభేదము లేదు. గేయములన్నియు ద్విరదగతి రగడకు చెందిన ఖండగతిలో సాగినవి. కమనీయ మైన యీ గతి కవిగారికి కడుప్రియమైనది. ఇవికాక పద్య ఖండికలగు 'రవికవి స్మృతి' లో 30 పాదములు ఖండగతిలోను, 12 పాదములు హయప్రచార రగడకు చెందిన త్రిశ్రగతిలోను సాగిన గేయభాగమును, 'కుసుమోపదేశము' లో 11 పంక్తుల ఖండగతి గేయ భాగమును గలవు. గేయములలో కొన్నిట ప్రతి రెండవ పాదములో రెండేసి శూన్యమాత్రలు కలవు. ఇట్లు చివరి రెండు మాత్రలు లోపించుటచేత ద్విపద పాదమగును. ద్విపద పద్యములని భ్రమ కలుగుచున్నది. కాని అన్ని పాదములలో అట్లు లేనందున గేయములేయని నిశ్చయమగును. పాదములలో శూన్యమాత్రలుండుటచేత రాగాలాపన కనుకూలించును. 'వన స్వాంతము', 'మిత్రవిరహము' అను కవితలు గేయమాలికలై యున్నవి.

'దరనెవ్వడెఱుగు?' కవిత గానయోగ్య గీతమువలె రచింపబడినది. 'రాటంపు రొద' కవితలో మాత్రము చివరి ఎనిమిది పంక్తులు త్రిశ్రగతిలో సాగినవి.

పద్యగేయములగు నుభయ కవితలలో కొన్నిట మరొక విశేషము గోచరించును. శతకములలో మకుటమువలె కొన్ని కవితలలో మకుట పాదములు కలవు. ఇట్టిది నన్నయగారి మహాభారతము-ఉదంకుని కథలో సర్పరాజ స్తవములో '........ మాకుఁబ్రసన్నులయ్యెడున్' అను మకుటముతో మూడు పద్యములలో కాననగును. నన్నెచోడుని కుమార సంభవమునగల 'దారిద్ర్య విద్రావణా!' అను మకుటము గల పద్యములు ప్రఖ్యాతములు. ఇట్లే విజయ విలాసాపతారికా పద్యములలో 'సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక!' యను మకుటము గల సీసస ప్తకము ప్రసిద్ధము. తిరుపతి వేంకట కవుల శ్రవణానందములో 'మనమా! పద్దిక నాదు మాట వినుమా మర్యాదఁ గాపాడుమా!' అను మకుటము 12 పద్యములలోనున్నది.

భావము తీవ్రమై పునఃపునరావృత్తి చేయపలసిన యగత్యముగలపలుకును మకుటముగా గూర్చుట జరుగుచుండును. ఇట్టి మకుటములు మణిమాలలో ఎనిమిది కవితలలో గలవు. 'కుసుమోపదేశము' గేయములలో "పువ్వుకోమలిరా!" యని రెండు గేయములలో, 'ఎండుగడ్డివేరు'లో "అమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు" అని ఆరుగేయములలో, 'నిజాం రాష్ట్రపు బీదవెట్టివాడు'లో "నిజాం బీద వెట్టివాడ!" అని ఆరు పద్యములలో, 'వృద్ధపితరులు'లో "మా వృద్ధపితరులార!" యని 11 పద్యములలో, 'పెంట పేలిక'లో "పెంట పేలికా!" అని తొమ్మిది పద్యములలో, 'కలను గన్పడునట్టి నా కన్నతల్లి'లో నిదే వాక్యము 11 పద్యములలో, 'మఱపురాని నా తండ్రి! నిన్ మఱతు నెట్లు?'లో నిదే వాక్యము రెండు పద్యములలో మకుటముగా రచింపబడినవి.

ఇక 'మాతృహృదయము'లో "తమ్ముడా! వినవోయి తల్లిహృదయమ్ము" అనునది ఎనిమిది మారులును, 'రాటంపురొద'లో "రాటమా! నీవిట్లు రంయ్ రంయ్ మనుచు ఘాటుగా నేడ్వగాఁ గారణమ్మేమి?" యనునది మూడు మారులును ఆవృత్తమైనవి. ఈ రెండును గేయముల మొదట నుండుటచేత వీనిని మకుటము లనుటకంటె పాటలలోని 'పల్లవి'వలె సాగినవనుట యుక్తము.

# స్ఖాలిత్యములు

ఇందు ప్రమాదవశమున కొన్ని స్ఖాలిత్యములు దొరలినవి. 'ప్రమాదో ధీమతా మపి' అని యుండనేయున్నది. ఇట్టివి కాళిదాసాది కవులలోను గలవు. ఇందలి ప్రామాదికములు ప్రధానముగా రెండు విధములు I. వ్యాకరణసంబంధి. II. ఛందస్సంబంధి.

## I. వ్యాకరణ దోషములు :

### క. సంధిగతదోషములు

1. "దాడి జను బుద్ధి జెప్పుపాధ్యాయ వగుదువు"—'పాదరక్ష'-పుట 26. ఇది

'ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమ మగును.'[1] అను సూత్రానుసారముగా 'బుద్ధి జెప్పు నుపాధ్యాయ'అని సంధిచేయ వలసియుండెను.

2. "మహాత్ముఁడున్ గొసరు చుండీ తట్టనే తాల్పఁగన్."—'పాకీవాడు'— పుట 23.

3. "అఖిలసమత లిట్లుండని యవనిఁజాట"—'ఎండుగడ్డివేరు'- పుట 110. ఈ రెండు వాక్యములలోను
'లిడ్లాట్టుల డుజ్జున కెను ను వర్ణంబులగు.'[2]
అను సూత్రానుసారముగా ద్రుతమువచ్చి క్రమముగా
"కొసరుచుండు నీతట్టనే" యనియు, "సమతలిట్లుండునని" యనియు కావలెను.

4. "నేనెట్లు జంపుదీమీను బిల్లల"—'హత్యావిచారము'—పుట 43. ఇది 'లకారంబునకు డుఁజు వురును ముణ్ణగు.'[3]

1. బాలవ్యాకరణము : సంధిపరిచ్ఛేదము, 33వ సూత్రము
2. ,, : క్రియా ,, , 16వ ,,
3. బాల వ్యాకరణము: క్రియా పరి., 8వ సూత్రము.

ఇత్యాది సూత్రముల ననుసరించి యుత్తమ పురుషైక వచనము కావున "నేనెట్లు జంపుదు నీ మీను బిల్లల" అని క్రియకు నుకారము వచ్చును.

5. "ఏలనన కలిలో నుండియేని నీవు"–'తేనె టీగ'–పుట 103.

'ఏల' యన్నది కళాపదము. కావున ద్రుతము రాదు. 'ఏలయిన' లేదా 'ఏలన' యగును.

6. "మింట సూర్యుడు నినొక కంటఁ జూచుచు నుండె" - 'గంటము-కట్టు'-పుట 84.

'నినొక' యని సంధి పొసగదు. 'నిన్నొక' యగును, దీనికి సూత్రము 'జడ్డక్కారంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు.'[1]

## చ. ఔపవిభక్తిక దోషము :

1. "అతి చిన్న యీటనె"-'వితంతు బాలిక'-పుట 119.

'ఈడు' పద మౌపవిభక్తికము కాదు కనుక 'ఈట' అని రాదు. 'ఈడున' అనియే యనవలెను.

## ఛ. ఇతర వ్యాకరణాంశములలో క్రియాసంబంధ స్ఖాలిత్యము :

1. "కనతల్లిని బట్టులె"-'కాఁపుబుణము'-పుట 48.
ఇందు 'కనతల్లి' యనుట దోషము.

'పద్యాదుల న వర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు'[2] అను దాని ననుసరించి 'కన్నతల్లి' కావలెను. లేదా 'కనిన తల్లి' యగును.

## II. ఛందోదోషములు :

ఛందస్సంబంధదోషములు గణ యతి ప్రాసయతి భంగములై యున్నవి.

1. బాల వ్యాకరణము: ప్రకీర్ణక పరి., 9వ సూత్రము.
2. బాల వ్యాకరణము: క్రియా పరి., 51 వ సూత్రము.

## క. గణభంగములు :

1. తే.గీ. "తక్కువగ నాతనికిచ్చు దాతగనము"—'పండితవంశ పరిచయము' పుట 10.
   'తక్కువగ నాతనికి నిచ్చుదాత గనము' అన్న సరిపోవును. ఇది అచ్చు తప్పుగా తోచును.
2. తే గీ. "హరిః ఓమని విలువిద్య నడుగిడెనెపు...." - 'భారతబాలుడు' పుట. 37.
3. సీసపాదము-ఉత్తరార్ధము. "అన్న మెఱుఁగని భారతాంబసుతుల"
   —'కర్మచంద్రుడు-గంధి' పుట.46.
   'అన్న మెర్గని' యన్న సరిపోవును.
4. సీ. "ఎండి నీర్‌నీరని గుండెబగులు తటాక"–'ఘనోద్దేశ్యము' పుట. 55
   "ఎండినీర్ నీరని గుండ్రెవయ్యు తటాక" అను సవరణతో ఇదే పద్యము పోతన చరిత్రములో చేర్చుకొనబడినది.
5. తే.గీ. "నాగ నవరత్న ఖచిత స్వర్ణవలయంబు"– 'శ్రీకృష్ణ....గ్రంథాలయము' పుట. 63.
   'ఖచిత'యను చోట 'త' గురువై గణభంగమైనది.
6. సీసపాదము-ఉత్తరార్ధము. "అమృతాబ్ధియయ్యె నస్మ దాంధ్రభాష"
   — శ్రీకృష్ణ ...గ్రంథాలయము' పుట. 64.
7. తే.గీ. "నా తనువు భరత భూగర్భనాశములను"-'జన్మభూమి'-పుట.86.
8. సీ. "అనుచు మధ్యమధ్య నరుదెంచి కూనల"–'ఊరఁబిచ్చుక'-పుట.107
9. తే.గీ. "రూపనాశమునకేని నోపికఁగొని"–'ఎండుగడ్డివేరు' -పుట.111.
10. తే.గీ. "వెలయుచే నైజాంబీదవెట్టివాడ !" – 'నిజాం రాష్ట్రి బీదవెట్టివాడు' పుట. 111.

## చ. యతి భంగములు :

1. తే గీ. "జలధి దాటింప బందెగాఁ జేసియుంచ"- 'సమరకాళిక' పుట.15.
2. చ. "హో! ఊసి నొకవృద్ధజంబుక ప్రవేతకుఁ గట్టుటయా బలే బలే !"
   —'ఛిత్రంతుభాలిక' పుట. 117,

## ట. ప్రాసయతిభంగములు :

1. సీ. "భూపాల శిరములతోఁ బాటు ధనువును" - 'ధనురారోపణము' పుట. 80

2. ఖండగతిగేయము : "మాతల్లి హృదయమ్మ। తాఁదిన్న యన్నమ్మ" —'మాతృహృదయము'-పుట. 82.

3. ఖండగతిగేయము : "మట్టిలోపల లేదు। నీటిలోపల లేదు"- 'అగోచరము పుట. 87.

ఈ విధముగా మణిమాలా కవితలో కతిపయదోషము లున్నవి. దోషములు జరుగుటకు హేతువులు మూడు 1. తెలియకపోవుట వల్లను. 2. తెలిసినను రచనావేశములో ఏమరుటవల్లను. 3. తెలిసియు స్వేచ్ఛాప్రియత్వమున నుద్దేశ పూర్వకముగా ప్రయోగించుటవల్లను దోషములనబడునవి జరుగును. ఇందలి యుదాత్త కవితారచనల బట్టి ఆనాటి వరదాచార్యులవారు ప్రాజ్ఞులనియే విశద మగునుకాని తదన్యముగా భావించుట దుస్సాహసము కాగలదు. కనుక ఈ దోషములు చాలవరకు ప్రామాదికములు, కొన్ని యుద్దేశపూర్వకములని తోచుచున్నది. తొలిదశలోని యీస్ఖాలిత్యములను తొలకరివానలకు ప్రవహించు నదీ తోయములతో పోల్చవచ్చును. విశిష్టగుణ విభాసితమైన యీ సంపుటిలోని యీ కొన్నిదోషములు పరిగణ్యములు కావు.

మణిమాలా పీఠికలో 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు సెల విచ్చిన మాటల నీ సందర్భమున నుటంకింపవలసియున్నది.

"ఈ గ్రంథమునందు దోషములు గలవు. వీని యన్నిటిని దాటి కొన్ని కొన్ని చోట్ల కవియొక్క ప్రతిభ యనంతమైనది కనిపించును. గోల్డుస్మిత్ (Goldsmith) కవి వ్రాసినట్లు ఒక గ్రంథములో వందతప్పు లుండవచ్చును. గ్రంథము రసవంతముగా నుండవచ్చును. మరియొకగ్రంథములో తప్పొకటియు లేకపోవచ్చును. గ్రంథము రసహీనముగా నుండవచ్చును. ఆధునికులలో ప్రసిద్ధులైన యెంతమంది కవుల గ్రంథములలో తప్పులుండగూడదు? కాని వారి గ్రంథములు

రసవంతములు కావని యెవరనగలరు? పాఠకులలో రసజ్ఞులువేఱు, వట్టి పండితులు వేఱు. వట్టిపండితు లింత గ్రంథములో నొక తప్పుచూచి చీదరించుకొని దానివలన తమ పాండిత్య ప్రతిష్ఠ వృద్ధి చేసికొనుటకు ప్రయత్నింతురు. రసజ్ఞులు కవి ప్రతిభ గోచరించు భాగములనే యేరి దానివలన కవికి కీర్తి చేకూర్చి పెట్టుదురు."[1]

విశ్వనాథవారి యీ అమూల్యవచనములు సకల సహృదయ జనోపాదేయములు. విచారించి చూడగా కావ్యమునకు విమర్శ యవసరమే కాని రసాస్వాదనము ప్రధానమని నా యభిప్రాయము. కాగా బంగారము నొరసిచూచినట్లు కావ్యమును విమర్శించి నపుడే దాని విలువ తెలియును. విమర్శయన గుణదోషములను పరామర్శించి చెప్పుట. అదే సద్విమర్శ.

> "గుణదోషములను గన్గొని లెస్సగాఁ జెప్పి దారిఁ జూపించు నుత్తముఁడు
> సముఁడు,
> ....వికృతశిలను సుందరతర విగ్రహముగ మలచు శిల్పివరుఁడు
> సద్విమర్శకుండు,
> రమ్యశిల్పమూర్తిని రోసి రాలఁగొట్టి మంటఁగలుపు ఖలుఁడు
> దుర్విమర్శకుండు. "[2]

అని చెప్పనొప్పును కనుక సద్విమర్శ చేయుటకు యత్నించితిని.

## పండితాభిప్రాయములు :

మణిమాలను గూర్చి ప్రసిద్ధ పండితులు తమ యభిప్రాయములు ప్రకటించిరి. వానిలో కొన్నిటిని దిగువ పొందు పరచితిని.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు,

"....ప్రబంధశైలిలో రాఘవరెడ్డిగారి కవిత్వ మెంత రమ్యముగానున్నదో ముద్దైన పలుకుబడిలో ఆచార్యులవారి రచన యంత రమ్యముగా నున్నది. ఇంత

1. మణిమాల : 'పీఠిక' పుట 1.
2. మదీయ 'మణిమంజూష'లో 'సంగ్రథాన్వేషణము' కవిత.

చక్కని కవి పూజాపురస్కారములు లేక బూజుపట్టు చున్నాడని యచ్చటి (వరంగల్లు) మిత్రులకు సిఫారసు చేసితిని." [1]అని ప్రశంసించుచు వ్రాసిరి.

చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు.

"శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు నాకు మణిమాలలోని కొంత భాగమును వినిచిరి. చాల హృద్యముగ నున్నవి. ఈయన రచన వలెనే చదువుటకూడ చాల మనోహరముగా నున్నది. విని మిక్కిలి యానందించితిని. ఈయనను ఆంధ్రకవివతంసు డనవచ్చు నని నాకు తోచినది. ప్రాజ్ఞులు దీని నామోదింతురని నా విశ్వాసము."[2] అని సెలవిచ్చిరి.

కాటూరి వెంకటేశ్వరరావుగారు,

"వానమామలై వరదాచార్యులవారు 'నేనేవో పద్యాలు వ్రాశాను. మీరు వినాలి' అంటూ చల్లగా గ్రంథం విప్పారు. ఇంకేముంది? అమృతభాండం బ్రద్దలైంది. సరిక్రొత్త భావనలు, మృదుమధుర పదబంధము, ప్రసన్నత, అడుగడుగున ఉట్టిపడుతూ, హాయిహాయి యనిపించిన వారి రసవత్కవితకు చెవులప్పగించి వారివంక తెల్లబోయి చూస్తూ, ఇటువంటి కవీశ్వరులు అజ్ఞాతంగా ఇంక నెందరున్నారోయని యాశ్చర్యపడ్డాను." [3]అని యభినందించిరి. [4]

ఈ రీతిగా విమర్శకావతంసులగు పండితులు మణిమాలను ప్రశంసించినారు. ఆచార్యుల వారిచేత తొలిదశలోనే ఆంధ్రభారతీగళసీమ నలంకరింపబడిన అనర్ఘకవితా మణుల మాల మణిమాల.

1,2,3, మణిమాల : పీఠిక, పండితాభిప్రాయములు.

4. ఇతర పండితాభిప్రాయములకు అనుబంధము-8 చూడవలెను.

# ఆహ్వానము

ఆచార్యులవారి ఖండ కావ్య సంపుటములలో రెండవది 'ఆహ్వానము.' 1945లో మణిమాల ప్రచురింపబడుటకు పూర్వమే ఆచార్యులవారు పోతన చరిత్రము వ్రాయబూనిరి. ఆ మహాకావ్య రచన సాగించుచునే 1947 నుండి 1957 వరకపుడపుడు రచించిన ఖండకావ్యములను సంకలనము చేసి యీ సంపుటిగా ప్రకటించిరి. మణిమాల ప్రచురణానంతరము 12 సంవత్సరముల తర్వాత 1957లో ఆహ్వానము ప్రచురింపబడినది. మధ్య యింత దీర్ఘకాలము గడచుటకు హేతువు పోతన చరిత్ర రచనము, వారికి సోకిన ఘోర క్షయవ్యాధి. 'ఆహ్వానము' గురించి వ్రాయుటకు ముందు నాటి దేశకాల స్థితిగతులు సంగ్రహముగా వివరింతును.

## 'ఆహ్వానము' రచన కాలమునాటి రాజకీయాది స్థితిగతులు:

'ఆహ్వానము' లోని కవితలు రచింపబడిన 1947 57 దశాబ్దకాలమున దేశములో రాష్ట్రములో విప్లవాత్మకమైన పరిణామము లెన్నియో జరిగెను. అందలి ప్రధానమైనది భారత భాగ్యోదయమైన స్వాతంత్ర్యసిద్ధి. 'జన్మహక్కు' ఐన స్వాతంత్ర్యము సమకూడినను ముస్లిముల మొండి పట్టుచేతను, బ్రిటిషువారి కుతంత్రము వల్లను దేశము రెండు ముక్కలై ఇండియా పాకిస్తానని రెండు రాజ్యము లవతరించెను. పాకిస్తాను నుండి దుర్భర పీడల చేత పారి వచ్చిన లక్షలమంది కాందిశీకులకు మన దేశమున పునరావాసము కల్పించుట యొక సమస్య యయ్యెను. తర్వాత కొన్ని మాసములకే స్వరాజ్య ప్రదాత జాతిపిత గాంధి మహాత్ముడొక మతోన్మాది చేత హత్యచేయబడి యాపద్భారతజాతి శోక సాగరమున మునిగెను.

జవహర్‌లాల్ నెహ్రూ గారి ప్రధాన మంత్రిత్వమున కాంగ్రెసు ప్రభుత్వము నవభారత పునర్నిర్మాణమునకు కంకణబద్ధమయ్యెను. ఉక్కుమనిషి సర్దార్ వల్లభభాయి పటేలు ఉపప్రధానిగా నుండి అసాధారణ ప్రజ్ఞాపాటవము చేత

దేశములోని 600 సంస్థానములను భారత సమాఖ్యలో విలీనము కావించెను. రాజ్యాంగపు చట్టము నిర్మింపబడి 1950 జనవరి నుండి అమలులోనికి వచ్చెను. కేంద్ర ప్రభుత్వము దేశ సర్వతోముఖాభివృద్ధికి పంచవర్ష ప్రణాళికలు సిద్ధముచేసి నిర్వహింప దొడగెను. వ్యవసాయ ప్రగతికి బృహత్పథకములు చేపట్టుట, సంపదభివృద్ధికి భారీ పరిశ్రమలు నెలకొల్పుట జరిగెను. ఆరోగ్యము, విద్య మున్నగు అనేక రంగములలో గణనీయమైన యభివృద్ధి సాధింపబడెను. 1950లో పటేలుగారు దివంగతులైరి.

భారతదేశ మగ్రరాజ్యములలో ఏ రాజ్యకూటముతోను సంబంధము లేని అలీన వైదేశిక విధానము నవలంబించెను. అంతర్జాతీయ శాంతిభద్రతలను కాపాడుటకు 1945లో ఏర్పడిన సంయుక్త రాజ్యసమితిలో భారతదేశము సమ్యక్ పాత్ర వహించి ప్రపంచ శాంతికి మిక్కిలి కృషి చేసెను. ప్రపంచములో చెలరేగుచుండిన కొరియా యుద్ధము మొదలగు యుద్ధములను దృష్టియందుంచుకొనియు, గతములో జరిగిన రెండు ప్రపంచ యుద్ధములను స్మరించియు నెహ్రూ విశ్వశాంతి స్థాపనార్థము కొలంబో రాజ్యములతో సంప్రదించి బాండుంగు సమావేశము జరిపి 1954లో పంచశీల సూత్రములను ప్రచారము చేసి శాంతిదూత యను ప్రశస్తిగాంచెను.

ఇక్కడ హైదరాబాదు రాష్ట్రములో నిజాము పాదుషా భారత సమాఖ్యలో చేరుటకు నిరాకరించి రాష్ట్ర రక్షణకు సేనల నాయత్తము చేయుటయేకాక 'రజాకార్' అను స్వచ్ఛంద సేవాదళమును రాష్ట్ర వ్యాప్తముగా ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకుడగు ఖాసిం రజ్వీ నాయకత్వమున ఏర్పరచెను. అప్పటికే రాష్ట్రములో నిజాం నవాబు, జాగీర్దారులు మొదలగు భూస్వామ్య వర్గాలవారు నిరంకుశ పరిపాలన సాగించుచు ప్రజలను రైతులను క్రూరముగా పీడించుచుండుట చేత పరిస్థితి దుర్భరమై కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యమున 'తెలంగాణ సాయుధ పోరాటము' ప్రారంభమాయెను. రాష్ట్ర రక్షణ, కమ్యూనిస్టు ఉద్యమము నణచి వేయుట యను సాకుతో నేర్పడిన రజాకార్లు మతోన్మాదులై విజృంభించి హిందువులను ఘోర హింసలకు గురిచేసిరి. కమ్యూనిస్టులు రైతాంగము విముక్తికి వీరోచితముగా విప్లవాత్మకముగా పోరాడి కొన్ని విజయములు సాధించిరి. ఆ రోజులలోనే నిజాం ప్రభుత్వము కమ్యూనిస్టు పార్టీపై నిషేధము విధించెను.

రాష్ట్రములో రజాకార్ల ఘోరకృత్యములు భీషణ బీభత్సకాండ పరాకాష్ఠకు చేరిన మహావిపద్దశలో సర్దార్ పటేలు సాహసించి సకాలమున చొరవ తీసికొనుటచేత భారత ప్రభుత్వము 1948 సెప్టెంబరు 13 న హైదరాబాదుపై పోలీసు చర్య తీసికొన్నది. విఱ్ఱవీగిన నిజాం సైన్యాలు రజాకార్ దళములు పెద్ద ప్రతిఘటన లేకుండనే సుశిక్షితమైన శక్తిమంతమైన భారత సేనకు లొంగిపోయినవి ఐదు రోజులలో పోలీసు చర్య పూర్తియైపోయినది విముక్తమైన హైదరాబాదు సంస్థాన పాలన బాధ్యత మిలిటరీ గవర్నర్ హోదాలో జనరల్ చౌధరీ చేపట్టెను. అనంతరము 1952 లో జరిగిన సాధారణమైన ఎన్నికలలో డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు రాష్ట్రమునకు ముఖ్యమంత్రియైరి. రాజ్యాధికారము కోల్పోయిన నిజాం నవాబు 'రాజప్రముఖ్'గా నియమితుడై సంవత్సరమున కేబది లక్షల రూపాయల రాజభరణ మాతనికి నిర్ణయమాయెను.

స్వరాజ్యప్రాప్తికి పూర్వమే తెలుగువారు తమకొక ప్రత్యేక రాష్ట్ర మేర్పడిన తప్ప పూర్వ వైభవప్రాభవములను పొందజాలమని భావించి ఆంధ్ర తెలంగాణములలోని నాయకులు రెండు ప్రాంతములలోను ఆంధ్రోద్యమాల ద్వారా తీర్మానములు చేసి పోరాడసాగిరి. స్వాతంత్ర్య సిద్ధితో ఆంధ్ర రాష్ట మేర్పడునని ఆశించిరి. కాని యది నెరవేరలేదు. 1950 లో రిపబ్లిక్‌తోపాటు ఏర్పడు నన్నది కూడ నిరాశయైనది. ఈ మహాశయ సిద్ధికోసము పొట్టి శ్రీరాములుగారు 58 దినములు నిరాహారదీక్ష వహించి 1952 డిసెంబరు 15 న ఆత్మార్పణ చేసిరి. తుదకు అమరజీవి త్యాగ ఫలితముగా 1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్ర రాష్ట్రము కర్నూలు రాజధానిగా నేర్పడినది. ఆంధ్ర రాష్ట్రమునకు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రి యైరి.

ఆంధ్ర రాష్ట్రావతరణముతో తెలుగువారి చిరకాల వాంఛ నెరవేరలేదు. వారు సమగ్రాంధ్ర రాష్ట్ర ప్రాప్తికి పోరాటము సాగించిరి. తత్ఫలితముగా 1956 నవంబరు 1 న తెలుగువారి కలలపంట ఆంధ్రప్రదేశము హైదరాబాదు రాజధానిగా నవతరించెను. ఇది ఆంధ్రదేశ చరిత్రలో అతి ప్రధానమైన ఘట్టము. మన రాష్ట్రావతరణమే దేశములో భాషారాష్ట్రముల యవతరణకు నాంది యైనది. నూటయేబది సంవత్సరాలకు పూర్వము విడిపోయిన ఆంధ్ర తెలంగాణ ప్రాంతముల తెలుగువారొక్కటైనారు. హైదరాబాదు రాష్ట్రములోని మరాట్వాడా

కన్నడ జిల్లాలాయా భాషా రాష్ట్రములలో విలీనమైపోయినవి. దీనితో నిజాం ప్రభువు రాజ ప్రముఖ్ పదవి రద్దయిపోయినది. ఆంధ్ర ప్రదేశమునకు తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారైరి.

ఈ కాలములో ఆంధ్ర భాషా సాహిత్య విషయమునను గొప్ప మార్పులు జరిగెను. హైదరాబాదు రాష్ట్రము విముక్తము కాగానే తెలంగాణములో పదవ తరగతి వరకు తెలుగును బోధన భాషగా నేర్పరచిరి. విశ్వవిద్యాలయములో ఆంధ్ర భాషకు ప్రాధాన్యము హెచ్చెను. ఆంధ్ర సారస్వత పరిషత్తు అనేక విధముల తెలుగు భాషా సారస్వతముల వ్యాప్తికి విశిష్ట కృషి చేసెను. తెలంగాణ రచయితల సంఘ మేర్పడి ఆంధ్ర సాహిత్యమునకు ప్రచార ప్రాభవములను కలిగించినది. విశాలాంధ్రావతరణముతో ఈ రచయితల సంఘము రద్దయి ఆంధ్ర రచయితల సంఘముగా మారినది. ఇట్టివే మరికొన్ని సాహిత్య సంస్థలు వెలసి కృషి చేసెను. సాహిత్య కృషి ప్రశస్తతరముగా సాగుటకు కేంద్ర సాహిత్య అకాడమి ననుసరించి మన రాష్ట్రములో 1957 లో సాహిత్య అకాడమి స్థాపన జరిగెను. ఇవి స్థూలముగా నాటి రాజకీయ సారస్వతాది స్థితిగతులు.

## ఆహ్వానము - వస్తువు :

ఆహ్వాన సంపుటములోని కవితావస్తువులు దాదాపు జాతీయములైనవి సామాజికస్పృహ కలవి. ఈ రచనా కాలమునాటికి వరదాచార్యులవారు దేశమునకు జాతికి అత్యంత సన్నిహితులై జాతీయకవిగా భాసిల్లినారు. దేశములోని ఆయా సంఘటనములకు తాదాత్మ్యము చెందుచు రచనలు చేసినారు. సమాజములోని యుక్తాయుక్తముల కనుస్పందించుచు తదీయశ్రేయస్సునకు కలముపట్టినారు. ప్రాయికముగా జాతీయములైన యిందలి కవితలకు గాంధేయ దృక్పథము కేంద్రబిందువై విరాజిల్లుచున్నది జాతిపిత, స్వాతంత్ర్యప్రదాత, మహర్షి, విశ్వవిఖ్యాత మహపురుషుడైన గాంధి మహాత్ముడు యావద్భారత జాతి హృదయాధిష్ఠితుడై యున్నవాడు కావున ఆ కాలమున ఆ మహామహుని గూర్చి యతని ప్రబోధముల గూర్చి వెలువడిన రచనలు లెక్కకు మిక్కిలి కలవు ఆచార్యులవారు తదీయ భక్తిప్రేరణలచేత తామును నట్టి రచనలు చేసిరి. భావ కవితా శాఖలతో పాటు [illegible] కవితలును రచించినారు,

## గ్రంథనామ సామంజస్యము :

అరువదియారు ఖండకావ్యములు గల యీ సంపుటమునకు 'ఆహ్వానము' అను పేరు పెట్టబడినది. దీనికి ప్రధానహేతు వింద 'ఆహ్వానము' అను నొక కవితయుండుటయే. కవితా ఖండికలలో నొకదానిపేరున సంపుటము వెలయించుట యనునది సాహితీలోకమున నున్న విషయమే. కాగా గ్రంథములో నెన్నో కవిత లుండగా ఈ కవితానామమే తీసుకొనుటలోని సామంజస్యము కొంత విచారింప వలసియున్నది. 'ఆహ్వానము'న "జాతిమతాతీతులమై నీతి నియమ సహితులమై వసుధైక కుటుంబముగా వసియింతము రండోయీ" యనియు "యుద్ధభయము చంపివేయు బుద్ధుల వికసింపజేయు సిద్ధార్థుల మహాత్ముల ను సిద్ధము చేయుదము రం'డనియు నిత్యాదిగా విశ్వశాంతిని స్థాపించి విశ్వమానవ సౌభ్రాత్రముతో మత సామరస్యముతో జీవింపరండని నరసోదరుల కాహ్వానము చేయబడినది. ఇవి గాంధి గారి యాశయములు. లోక కల్యాణార్థము గాంధేయ దృక్పథమును వర్ణించు నిందలి కవితలలో నిది సూటిగా మేటిగా నున్నందున కృతి కీ నామ మిడుట సమంజ సముగా నున్నది. ఈ సామంజస్య మింతదానికే పరిమితము కాలేదు. దీనికి మరొక పరమార్థము కలదు. ఆచార్యులవారు తామంతవరకు లోకోత్తరముగా రచించి దాదాపు ముగించిన పోతన చరిత్ర మహాకావ్య రసామృతాస్వాదనమునకు రసజ్ఞుల కాహ్వానము చేయుటయు దీని ద్వారమున జరుగుచున్నది. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును గ్రంథమునకు పీఠిక వ్రాయుచు ఈ యభిప్రాయమునే వెలి బుచ్చి యుండిరి.[1] గాంధేయ దృక్పథము, సాహిత్యప్రయోజనము కూడ విశ్వ శ్రేయస్సే కనుక విశ్వ విశాల భావముతో గ్రంథమునకు గావించిన యీ నామ కరణము మిక్కిలి సమంజసమై యెసగుచున్నది.

## అంకితము :

'ఆహ్వానము' తమ బాల్య గురువులగు కీ. శే. కాళోజి రంగారావుగారికి వారి సతీమణి కీ. శే. కాళోజి రామాబాయమ్మగారి కాచార్యులవారంకితము చేసిరి.

1. "పోతన మహా కావ్య రసామృతము ఆరగించుటకై రసి కాంధ్ర లోకమునకు ఈ గ్రంథము 'ఆహ్వానము'. శ్లేషను ఇంత రమణీయముగా ఉపయోగించిన కవులు ఆధునికాంధ్ర వాఙ్మయమున లేరని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు" ఆహ్వానము : 'పీఠిక'.

ఈ కాళోజి దంపతులు ఉరుదూకవులు సహృదయ వరేణ్యులైన శ్రీ కాళోజి రామే శ్వరరావు గారి, సుప్రసిద్ధ కవులగు శ్రీ కాళోజి నారాయణరావుగారి జననీజనకులు. వీరిని గూర్చి డా॥ పల్లా దుర్గయ్యగారు "వారు ఈ కవి గురువులు మాత్రమేకాదు. వారి యిల్లొక గురుకులము. వారి యింట చదువనివారును, వానలో తడియనివారును మా మడికొండ గ్రామమున లేరు..... వారిని సేవించి చెడినవారును సేవింపక బాగు పడినవారును ఆనాటి విద్యార్థులలో లేరు."[1] అని వినుతించియుండిరి. అట్టి మహ నీయుల నాచార్యుల వారు 'పార్వతీ పరమశివ ప్రతిబింబములు తాము మానవా కృతులలో మహి నవతరించినవా'రని అంకిత గేయములో కీర్తించి అపార విజ్ఞాన నిధులును మహాపుణ్య జీవనులును నగు వారిని తల్లిదండ్రులవలె నాత్మలో తలచి భక్తితో నీ గ్రంథమును వారికి సమర్పించినారు. మణిమాలలో 'రామాబాయమ్మ స్మృతి' యను నొక కవితలో స్మరింపబడిన రామాబాయమ్మ, ఈ కాళోజి రామా బాయమ్మ ఒక్కరు కారు. ఆచార్యులవారీ యిద్దరు రామాబాయమ్మల యెడ భక్తి భావము గలవారై చిన్ననాట వారి సన్నిధిలో సుశిక్షితులై ప్రభావితులైరి.

## వస్తువర్గీకరణము :

నవ్య కవితా కలితమైన యీ సంపుటిలోని ఖండ కావ్యములను ముఖ్యముగా మూడు భాగములుగా విభజింప వచ్చును.

1. పూజ్య బాపూను గురించిన గేయములు-36
2. రైతురాజు-గేయ నాటిక
3. ఇతర కవితలు

ఇతర కవితలు 29లో దేశభక్తి కవితలు 14, ప్రణయ కవితలు 2, స్మృతి కావ్యములు 3, తదన్యములు 10 కలవు. ఈ కవితలను పరిశీలించినచో గాంధీగారిని గురించి వ్రాసిన 36 గేయములును దేశభక్తికి చెందినవి కనుక మొత్తము 50 వరకుగల దేశభక్తి కవితలు గ్రంథములో ముప్పాతిక భాగము నాక్రమించియున్నవి. తక్కిన కవితలును చాలవరకు గాంధేయ దృక్పథమునే వెలార్చుచున్నవి.

---

1. ఆహ్వానము : 'జందెపు పోచలు'

## ప్రథమ శీర్షిక - విజయగీతి :

గ్రంథాదిని 'విజయగీతి' యను ఖండకావ్యము కూర్పబడినది. ఇది భారత జనని గూర్చి వ్రాయబడిన గీతము. దేశభక్తి, జాతీయ భావములు నిండుగా గల ఈ సంపుటి కిది యాలంకారిక వచనానుసారముగా ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశములను మూడిటిని తెల్పుచుండుట విశేషము. భరతమాతకు జయాకాంక్షచేయుట చేత ఆశీస్సును, 'నమస్తే' యనుటచేత నమస్క్రియయును, భారతాంబను వర్ణించుటచేత వస్తునిర్దేశమును నిర్వహింపబడినవి.

పర పరిపాలన నుండి విముక్తిగాంచి స్వారాజ్యస్థాపన కావించుకొన్నదగుటచేత దేశమాతను గూర్చి విజయగీతి నాలపించుట నితాంతయోగ్యముగా నున్నది. ఈ విజయగీతినే 'జయగీతి' యను పేరుతో ఆచార్యులవారు తమ తర్వాతి ప్రచురణ మగు 'జయధ్వజం'లో యథాతథముగా పొందుపరచినారు.

## పూజ్య బాపూను గురించిన గేయములు :

సంపుటములోని మొత్తము కవితలలో ఈ గేయము లతిప్రధానమైనవి. అసలీ గేయములు ప్రకటించుటయే ఆచార్యులవారి ముఖ్యోద్దేశముగా తోచును.

"గాంధి మృతి గాథలను గాంధి గుణ బోధలను
సంధాన మొనరించి సత్కృతిని రచియించి
అంకితము నొనరింతు"[1]

అని ఆచార్యులవారు నుడివిన విషయము గమనింపదగినది. గ్రంథ ముఖపత్రము పైని గాంధి ముఖచిత్రము కూడ దీనిని బలపరచుచున్నది.

గాంధిమహాత్ముడు హత్య కావింపబడినాడన్న వార్త వినగనే అత్యంత వ్యథాసంతప్తమానసులై ఆపరాని శోకాపగతో పదుమూడు రోజులలో నేకధాటిగ ఈ గేయములను జాలువార్చిరి. ఆ కాలమున ఆచార్యులవారు నిజాం క్రూర పాలనలో రజాకార్ల పీడలకు తట్టుకోలేక సకుటుంబముగా హైదరాబాదు రాష్ట్రము దాటి మహారాష్ట్రములోని సిరివంచ గ్రామములో నివసించు చుండిరి.

1. ఆహ్వానము : అంకిత గేయము.

గాంధిగారి హత్యావార్తవిని దేశజను లందరు శోకసాగరమున మునిగి పోయిరి. దేశదేశముల ప్రజలు తల్లడిల్లిరి. పిడుగుపాటువంటి యతని మరణవార్త చెవిని బడగనే గుండె ఆగి మరణించినవారును ఉన్నారు. దేశీయుల హృదయాలలో నతడు దైవముగా అవతారపురుషుడుగా నిలిచినాడు. అతడు హత్యచేయబడి నప్పుడు వ్రాయబడిన సంతాపకవితలు స్మృతికావ్యము లసంఖ్యాకములు. అందు జాషువా రచించిన 'బాపూజీ' యను స్మృతికావ్యము గణనీయమైనది. అట్లే వరదాచార్యులవారి బాపూ స్మృతిగేయమాల మిక్కిలి విశిష్టమై యొప్పుచున్నది. ఈ విషయమున శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి యమూల్యాభిప్రాయము పరిశీలింతము.

"....ఈ విధముగా జాతిపిత అమృతమూర్తిని అవలోకించిన ఆంధ్ర కవులలో ఆచార్యులవారగ్రగణ్యులు. శ్రీరామకథను గానము చేసిన వాల్మీకివలె మోహనదాసుని పవిత్ర చరిత్రను వరదాచార్యులవారు కావ్యగానము గావించినారు."[1]

ఇందలి స్మృతిగేయములు 'నిజమే' యను దాని నుండి 'చంటి బిడ్డడు' అను దానివరకు ౪౭. మొత్తము గేయములలో మొదటి 27 బాపూజి హత్యకు అతని అంతిమయాత్రకు చెందినవై పరిపరివిధముల వేదన వ్యక్తము చేయబడినది. తర్వాతి తొమ్మిదిగేయములలో ఆ మహాత్ముని మహోదాత్త గుణగణములను బహుభంగుల కొనియాడుట జరిగినది. ఆ యమృతమూర్తిని పరమోదాత్తముగా సాక్షాత్కరించుకొన్న ఆచార్యులవారి యంతరంగమున కివి యద్దము పట్టుచున్నవి.

మహాత్ముడు నిహతుడైనా డన్న వార్త నమ్మశక్యముకాలేదు. మొదటి గేయములో అట్టి యనుమానమే వ్యక్తమైనది. "పత్రికలకు పిచ్చెత్తి యిటులాడెనా? రేడియో మోరలకు నేడేమి మూడిన" దనియు, "తామె పత్రిక లబద్ధమ్మలీ వార్తలని ప్రకటించు మరల రేపటి నను మనసేమొ" యనియు ఆందోళన చెందినారు. మరల 'అటుల గల్పించిన మహాత్మపైగల పీడ తేలిపోవు నటంచు తెల్పియుండవుకదా!' యని ఆశించినారు. చివరకు, ఆయన బ్రతికియుండ చని పోయినాడని యనుటకెవని నాల్కయాడగలదని సందేహించి యతడు నిహతుడైనా డన్న వార్త ధ్రువపడగనే కొంప మునిగినదని యడలినారు. దేశము, ప్రపంచము

1. ఆహ్వానము : పీఠిక.

యావత్తు దద్దరిల్లి పోయినదని సంక్షోభించినారు. ఐనను గాంధి చచ్చినట్టు లేదని పించినది. తృతీయ గేయములో దానిని వివరించినారు. "బోసినగవులతోడ కాసె కద్దరుతోడ కాళ్ల చెప్పులతోడ కన్నద్దములతోడ" అతడెటనుండియో వచ్చినటులే తోచెను. తర్వాతి గేయాలలో ఇక నీవు కనబడవనియు, నీమరణ మిట్టు లగునని యనుకొనలేదనియు, 'ఆటమ్మ బాంబులకు హడలు పుట్టించు నీ గుండెకాయ తుపాకి గుండుకెటు సందిచ్చె' ననియు 'నీదు గండాన జన్మించె నీ స్వాతంత్ర్య శిశువనుచు నే జోషి చెప్పడాయెను మాకు' అనియు ననేక విధముల పరితపించినారు. మమ్ములను సవరించి సాద మా కింకెవ్వరున్నారని దుఃఖించినారు. ఈ ఘోర మరణమ్ము దెప్పుటకు వానిచేతులెట్లాడెనో యనియు, నీవారి నెటుగాని వారలను జేసి నీ వెటుబోతి వయ్యాయనియు, పరదేశీయులు మీ బాపేడియని యడిగిన నేమని చెప్పవలెననియు, సంతపించినారు.

తర్వాతి గేయాలలో గాంధి హత్యగావింపబడిన దుర్ఘటన తలచుకొని బాపూజి ఆనాడు ప్రార్థనకు వచ్చుట, అంతలో కాలుని వంటి హంతకుడు సభలో చొచ్చి పిస్టలుగుండ్లు పేల్చుట, ఆ కాల్పులకు 'హాయ్ రామ్' అని మహాత్ముడు నేల గూలుట, జాతి ఆయనను బ్రతికించుకొనుటకు విశ్వప్రయత్నములు చేసి విఫల మగుట, సమస్తము శోకమయమగుట, అతని అంతిమయాత్ర, దహనసంస్కారము, అస్థినిమజ్జనము మున్నగు హృదయవిదారక దృశ్యము లెంతటి రాతి గుండెయైన కరగునట్లుగా వర్ణింపబడినవి.

ఇక చివరి తొమ్మిది గేయాలలో సత్యవంతుడు దేశభక్తుడు, కర్మ వీరుడు, లోకబాంధవుడు, భజనపరుడు, సర్వసముడు - అనునవి ఉదాత్తభావో దంచితములైనవి. 'లోకబాంధవుడు' అన్న గేయములో "ఏ కులమువారనక యేక మానవులమని యేకులను కదురుపై నేక మొనరిచి చూపె" ననియు, "తాకరాని తనమ్ము దగ్ధమ్ముగావింప హరిజనుల కొరకొక్క అవతారమును దాల్చె" ననియు, "గీత బైబిలు కురానుల నంద రొప్పరుగాని మన మహాత్ముని సూక్తి మహిమకంతటికి వేదమే" యనియు నతని సర్వజన ప్రేమ, లోకబంధుత్వము కొనియాడిరి. 'భజన పరుడు' అన్న గేయమున హిందూ ముస్లిముల ఐక్యతకు లయవేయుటకు ఎడవ

కుడి చేతుల నేకముగ జతపరచెననియు, "హరిజనుడుగాని భూసురవరుడుగాని యీశ్వరుని గడియారమున వరలు చక్రములెయను" ననియు, రిపులను గెల్వ శ్రీరామబాణమును శ్రీ కృష్ణచక్రమును గూర్చి చరఖా చేసి కూర్చుండెననియు ఆ మహాపురుషుని విశుద్ధ భజన పరత్వమును విశదపరచినారు. 'సర్వసముడు'లో నతడు "పాకిపని మొదలుకొని లోకపాలన వరకు నా కార్యమే యనుచు నడుము గట్టినమేటి, తననుగని యుమిసినను బ్రమసినను రవ్వంత మార్పులేని బ్రహ్మణ్యుడు, పంచమత్వము జార్జిపంచమత్వముగూడ ఒకంతె విలువకు తూచిన కోమటి, రాటంపు చక్రమును రాజ్యచక్రమును నేకరీతిగా త్రిప్పు మొనగాడు, 'పండ్లుగాని తుపాకి గుండ్లురానీ ప్రీతిస్మేరాననమ్ముతో నారగించెడు భోక్త' యని యా మహాత్ముని మహాప్రజ్ఞను, శక్తిసామర్థ్యములను, స్థితప్రజ్ఞత్వమును లెస్సగా నభివర్ణించినారు. ఈ విధముగా గాంధిమహాత్ముని గూర్చిన స్మృతికావ్యమాల యుదాత్తభావపరీమళ రసమరంద బంధురమై విలసిల్లుచున్నది

## రైతురాజు (గేయ) నాటిక

ఆహ్వానము సంపుటిలో రైతురాజు ప్రత్యేకమైనది. పద్యగేయ కవితలుగల యీ సంపుటిలో నిది నాటిక యగుటచేత విలక్షణమైనది. వస్తువు ననుసరించి యిది భావకవితా శాఖలలోని 'ప్రకృతి కవిత్వము' శాఖకు చెంది యందును పల్లి జన ప్రకృతి విలసితమై యున్నది. పల్లీజనులలో ప్రధానమైనవాడు కృషీవలుడు. తెలుగులో కృషీవలుని గూర్చి 'కృషీవలుడు' అన్న హృద్యపద్యకావ్యము వ్రాసి యిట్టి కవితాశాఖకు 1919లో నాంది పలికిన కవి దువ్వూరి రామిరెడ్డి. గంగుల శాయిరెడ్డి తెలంగాణాలోని కృషీవలుని జీవితమును చిత్రించుచు 'కాపుబిడ్డ' యను కావ్యము రచించి యుండెను. వరదాచార్యులవారి యగ్రజులు జగన్నాథాచార్యులవారు రైతు బిడ్డను రామునిగా, అతని భార్యను సీతగా భావించి 'రైతు రామాయణము' అను మహా కావ్యమును రచించిరి. వరదాచార్యులవారు గేయనాటికగా రచించి కర్షకుని కృషి జీవితమును నిసర్గరమణీయముగా చిత్రించినట్టిది మరొకటి కానబడదు. ఈ గేయనాటికను చర్చించుటకుముందు గేయనాటికా ప్రక్రియను గురించి సంగ్రహముగా నుల్లేఖింతును.

## గేయనాటికా ప్రక్రియ :[1]

గేయనాటిక, నాటిక యను రూపకజాతికి చెందినది. భరతముని మున్నగు ప్రాచీన లాక్షణికులు నాటికను పేర్కొని లక్షణము వివరించిరి. కాగా లాక్షణికులు పేర్కొన్న నాటికకు నేడు నాటికలని పిలువబడుచున్నవానికి లక్షణ సమన్వయము కానరాదు. అలంకారికులు చెప్పిన దశరూపకములలో వ్యాయోగము, అంకము, ప్రహసనము, భాణము, వీథి యను నైదురూపకము లేకాంకములు. మరియు డోంబికా భాణప్రస్థానాద్యుపరూపకములలో కొన్ని యేకాంకములు గలవు. ఈ రూపకోపరూపకము లందలి యేకాంకముల నేకాంకిక లనవచ్చును. ఇప్పటి నాటకము లనేకములు పూర్వలక్షణములకు లక్ష్యములు కానట్లే నేటి ఏకాంకికలును ఉపర్యుక్తమైన ఏకాంకములకు లక్షణసమన్వయము కలవి కావు. ఏకాంకముతో రచింపబడినవి యేకాంకికలు కాగా రెండుమూడంకములతో నొప్పునవి నాటికలని పిలువడుచుండును. ఇట్లేకాంకికకు నాటికకు కొంత భేదమున్నను ఆధునికులీ రెండింటి నేకార్థములోనే తరచుగా వాడుచున్నారు.

రచనలో కావ్యమునకును ఖండకావ్యమునకును నవలకును కథానికకును గల భేదమే నాటకమునకును నాటికకును గలదు. ఇట్టి నాటికలు పూర్వలక్షణానుసారులు కాక పాశ్చాత్య సాహిత్య పరిచయము వల్లను, నూతన ప్రయోగాకాంక్ష వల్లను ఆధునికాంధ్ర సాహిత్యమున నవ్యప్రక్రియగా అవతరించి వ్యాప్తి గాంచినవి. ఈ నాటికలు నిర్వహణ ననుసరించి గద్యనాటికలు, పద్యనాటికలు, గేయనాటికలని మువ్విధములు. పూర్వ సంస్కృతాలంకార గ్రంథములలో గేయ రూపకముల ప్రసక్తి కలదు. అభినవగుప్తుడు నాట్యశాస్త్ర వ్యాఖ్యయగు 'అభినవ భారతి'లోని 4 వ 18 వ అధ్యాయము లందు డోంబికాద్యుప రూపకములను పేర్కొని వాని నుపరూపకము లనక గేయకావ్యము లనియు, నృత్తప్రకారము లనియు, రాగ కావ్యము లనియు పేర్కొనియుండెను. ఈ యుపరూపకములు గేయాత్మకము లైనను నృత్య ప్రధానములు. హేమచంద్రుడు,

---

1. ఈ విషయము వ్రాయుటలో డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసము' శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి 'ఆంధ్ర నాటకరంగ చరిత్ర' ఉపకరించెను.

"గీతేన రంజనం ప్రాధాన్యేన విధాయ, తదుపయోగినం చాంగవ్యాపారం ప్రదర్శ్య, నృత్తేన పునశ్చిత్త గ్రహణం కుర్వతీ; నృత్తం ప్రధాన భావం, గీతంచ తదుపసర్జన భావం నయంతీ"[1]

అని పేర్కొనిన విషయము గమనార్హము. జయదేవుని గీతగోవిందము, నారాయణ తీర్థులవారి కృష్ణలీలాతరంగిణి, కూచిపూడి వారి భామాకలాపము, దక్షిణ భారతమందలి యక్షగానములును నృత్యప్రధాన రచనలే.

తెలుగులో ఆధునిక గేయ నాటికల రచన కావించిన వారిలో 'వరపరీక్ష' యను గేయ నాటికను వ్రాసిన తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు, 'చండీదాసు' అను గేయ నాటికను వ్రాసిన బాలాంత్రపు రజనీకాంతరావుగారు ప్రథమగణ్యులు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, డా॥ సి. నారాయణరెడ్డిగారు, వింజమూరి శివరామారావుగారు, బోయి భీమన్నగారు, ఆరుద్రగారు, సోమసుందర్‌గారు, కుందుర్తిగారు మున్నగు వారనేకులు గేయ నాటికా రచయితలలో పేరెన్నికగన్నవారు. వరదాచార్యులవారును 'రైతురాజు' గేయనాటికను ప్రశస్తముగా రచించి సిద్ధహస్తులనిపించుకొన్నారు. 'వయోజన విద్య,' 'పెద్దల చదువు' 'స్వాతంత్ర్యజ్యోతి' యనునవి ఆచార్యులవారి యితర గేయ నాటికలు. ఇవి యింకను వెలుగు చూడలేదు.

దృశ్య శ్రవ్య భేదము చేత ద్వివిధములైన గేయనాటికలలో 'రైతురాజు' దృశ్య గేయనాటిక.

ఆచార్యులవారు దోమకొండ జనతా కళాశాలలో ఉద్యోగించుచున్న కాలమున 1956 అక్టోబరులో అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ భారత సేవక సమాజము వారి మహోత్సవాలకు నిజామాబాదుకు విచ్చేసిన సందర్భమున అతని యెదుట ప్రదర్శించుటకు ప్రభుత్వమువారి ప్రోత్సాహమున ఈ నాటికను రచించిరి. దోమకొండ జనతా కళాశాల పక్షమున ఈ నాటికను తమ శిష్యులచేత ప్రదర్శింపజేసిరి. నేపథ్యమున నాకరీ గేయములు పాడుచుండ తదీయ భావానుగుణముగా శ్రీ ఆకుపత్ని కొండలరావుగా రభినయించి ప్రదర్శించిరి. తెలుగు తెలియకున్నను నెహ్రూగారభినయము గాంచి అర్థము చేసికొని అత్యంతానందము నందియుండిరి. తర్వాత ఈ నాటిక పలు ప్రాంతములలో ప్రదర్శింపబడి ప్రశస్తి

1. కావ్యానుశాసనము : పుట 448.

గాంచినవి. ఈ నాటికలో పంద్రెండు గేయములు కలవు. ఇందు కర్షక జీవితము యొక్క సర్వ విషయములు స్పృశింపబడినవి. ముఖ్యముగా హాలికవృత్తిలోని ఆయా సరణులు క్రమముగా నభివర్ణింపబడినవి. ఒక్కొక్క సరణికి ఒక్కొక్క గేయము రచితమై యవి తత్తద్దృశ్యములకు దర్పణము పట్టుచున్నవి. ఈ గేయము లనే ఆచార్యుల వారించుక పెంచి తర్వాతి తమ గేయకావ్యము 'విప్రలబ్ధ'లో సందర్భానుసారముగా చేర్చినారు.

ఈ నాటికతో కర్షకుని సాంస్కారిక జీవితేతివృత్తము కాక కృషివృత్తి, కర్షక ప్రవృత్తి చిత్రణమే ప్రధానముగా నుద్దిష్టమై యున్నందువల్ల ఇందులో ప్రత్యేకముగా నొక కథావస్తువు నిర్వహింపబడలేదు. మరియు నిందు కృషీవలత్వము తఱచుగా వర్ణనాత్మకమై యుండుట చేత సంవాదములు తక్కువగా నున్నవి. నాటిక చిన్నదైనను రసభావములచేత మిన్నయైనది. మట్టిని బంగారము చేయు కర్షక హలమును చూచి కవికల మార్ద్రమై కృషిజీవనమును రస సంజీవనము గావించినది.

ఇందులో మొదటి గేయము కవి, రైతును సాదరముగా నాహ్వానించినది. రైతును రాజుగా రూపించి రచించిన యీ గేయములో రాజ మర్యాదలు రైతుకు ప్రకృతిసిద్ధముగా సమకూడు విషయములు మనోజ్ఞముగా వర్ణింపబడినవి. ఇందు రైతురాజునకు రవిచంద్రులు నిత్యము నీరాజనము లిత్తురు. పవనుడు వింజామరలు వీచును. 'నవ మోహనమ్ములౌ నాగేటి వృషభములు నందీశ్వరులు గాగ నటరాజమూర్తివై ' రమ్మని యతని నాహ్వానించుట జరిగినది. అతడు తాకినంతనే భూమాతకు మైపులక లేపారు ననియు, గోమాతకు పాలచేపులు మీరు ననియు, శ్రీకాంత యతని పాణి సరసీజముల జనించు ననియు వర్ణించి నిసర్గ రమణీయ భావ మరందముల జాలువార్చినారు. "మాకు పాడిపంట లొసంగి భారతావనినేల రావోయి ఓ రైతురాజా!" అని పిల్చుటలో అతని ప్రజాపాలనము సువ్యక్తమగును.

రెండవ గేయములో రైతు తన సహచరులతో ప్రవేశించి గిత్తల దీసికొని మడిదున్ను విషయము చెప్పబడినది. దున్ని విత్తనాలు వేసి కాపు కరవైపోయిన వానల కెదురు చూచును. మూడవ గేయములో వానదేవుని రమ్మని ప్రార్థించును.

ఈ గేయము కరుణరసార్ద్రమై వఱపైన కాలములో రైతులు పడు మహావ్యథను కన్నుల గట్టించుచున్నది. ప్రార్థించునపుడు ప్రాకృత మానవునకే దయవచ్చును. దేవునికి రాదా ? వానదేవుడు కరగి నీరై ప్రవహించినాడు. వచ్చిన వర్షములకు కర్షకుడు హర్షోత్కర్షుడైన విషయము నాలుగవ గేయములో వర్ణింపబడినది. ఈ వర్షాగేయమిందలి గేయము లన్నిటిలో నుదాత్త భావ బంధురమై మకుటాయమానమై తనరారుచున్నది. ఇందలి ఛందము చందముసైత మందమైనది. వర్షాలు "వసుధారాణికి తలంబ్రాలు, పాడు కరువులకు బాణాలు, పంటచేలకు ప్రాణాలు, కాపుకన్నులకు ముత్యాలు, వరికళ్లల నోళ్ళకు చనుబాలు" అని భావించిన తీరు లోకోత్తరమైనది. 'కోడెనాగులై యుఱుకు వాగులు, క్షీరధారలై పాఱు తోగులు, మరకత మణులై లేచుపచ్చిక, మద వృషభముల విజృంభణ, మయూరముల నాట్యము, ఆరవేసిన చీరలవలె తోచు ఆవులు, నడచు నల్లని గంధ శిలలవలె మేయు గేదెలు-' సర్వప్రకృతి హృదయంగమముగా చిత్రింపబడినది. వర్షాలవల్ల రైతు పంటలు పండునట్లే తదీయ వర్ణన విన్న రసజ్ఞుల భాగ్యము పండును.

తర్వాత కాపు వరి కళ్లలను నాటు వేయుట గూర్చి గేయము కలదు. ఆ పిదప పొలము కావలి యుండి తన భార్య చద్ది కొనిరాక పోయెనని ఆకలితో నిరీక్షించిన విషయము మరొక గేయములో కలదు. భార్య కోసమెదురు తెన్నులు చూచుచు దూరము నుండి వచ్చునది తన లచ్చియేయని తలపోయును. ఆలస్యానికి కారణ మూహించును. లచ్చి పిలిచినట్లయిన జామతోటకు వెళ్ళి చూచి అది లచ్చి పిలుపుకాదు చిలుక పలుకని తెలిసి సిగ్గుపడి మరలును. కొమ్మ యెక్కి చూచి కొండ యెక్కి పిలిచి ఆకటి మంట కలమటించును. ఈ గేయములో కాపు బిడ్డ ఆకలి బాధతో పాటు అర్ధాంగి మీది వలపు కూడ వ్యక్తమైనది. అంతలో లచ్చి వచ్చి చద్దితో పాటు వలపును దెచ్చి అందించిన విషయము మరొక గేయములో వర్ణితమైనది. పిమ్మట వరి యేపుగా పెరుగుటచే భార్యను కలుపు తీయ పిలుచును. ఈ గేయము కడు రమణీయమైనది. శృంగారవతియగు సతి వీరనారియై వరికి వైరి వర్గమగు కలుపు మొక్కలను తుంగలను పెరికివేయవలెనని పతి ప్రోత్సహించిన విషయము రమ్యముగా నున్నది. "పైట నడుముకు జుట్టి చేత కొడవలి బట్టి దుష్ట శిక్షణ చేసే అష్ట భుజ కాళికవై" "మన భూమియందేమి పరదేశి ఆ స్వామి, నరికి వేసెద నన్న నారి ఝాన్సీ వగుచు" కలుపు తీయుమని ప్రేరేపించుటలో ధర్మరక్షణ, దేశరక్షణ అవశ్య కర్తవ్యములన్న నీతి ప్రబోధ మన్యాపదేశముగా గావింపబడినది,

పండిన పొలము కాపునకు కాపు రాముడు రాత్రి యక్కడనే వసించి ప్రియురాలిని తలచుకొని "ఏ జన్మలో నెవరి నెడబాపితి మొ యేమొ, ఈ చేనిలో నేను ఇంటి కాడా తాను, కన్నుల్లో తెలవారుతున్నది, మా కర్మ యింతకె నోచు కొన్నది." అని వ్యథపడిన విరహగీతిక రసార్ద్రమై హృద్యమై యున్నది. "చద్ది యన్నము తెచ్చి సరసమాడుచు లచ్చి పలుకరాని గాథ, పడరాని యొక బాధ, ఎన్నడగు వరికోతలన్నది, కొంగు కన్నీట తడిసి పోతున్నది." అని తలపో యుచు,

"అత్తమామల బెదరు ఆడు బిడ్డల యలుక
వత్త మన రాలేదు పంజరములో చిలుక
పెత్తనమ్మేది నా రాణికి, ఎంత
ప్రేముంటె యేమి దొరసానికి"

అని వలవంతనందుచు రాత్రి గడుపును.

తరువాతి గేయములలో రైతు లచ్చిని చేనికోతకు పిల్చుట, కోసిన వరి కట్టలను నూర్పిడిచేసి తూర్పార బట్టుమనుట యనునవి వర్ణింపబడినవి. చివరి గేయ ములో కాపు దంపతులు ధాన్యరాశులను బండిపై నింటికి గొనిపోవు సందర్భమున ధాన్యము నింపిన ఆ రెండెడ్ల చక్కని బండి నిండు గర్భవతివోలె వచ్చినదని మనోజ్ఞముగా వర్ణింపబడినది.

"కర్షకుని చేతి కష్టం వర్షాధినేత యిష్టం
భూజనుల దగు అదృష్టం ఈ బండితోనె స్పష్టం"
అని కర్షకుని శ్రమజల ఫల మగ్గడింప బడినది.

రైతు పొలమునకు వెళ్ళుటతో మొదలైన నాటిక ధాన్య శకటముతో నింటికి వచ్చుటతో ముగియుట సమంజసముగా నున్నది. నాటికలోని మొత్తము గేయములలో ఆద్యంత గేయములు మాత్రము కవి చెప్పినట్లున్నవి. తక్కినవి రైతు, లచ్చి పాడినవిగా వర్ణితములు. ఇంత చిన్న నాటికలో హాలిక వృత్తి జీవ నము రసభరితముగా భావహరితముగా చిత్రిత మైనది స్తోత్రపాత్రము.

## దేశభక్తి కవితలు:

సంపుటిలోని ఇతరములైన 29 కవితలలో దేశభక్తి కవితలు 14. ఈ శాఖకు చెందిన కవితలలో నొకటగు 'విజయగీతి'ని గూర్చి వెనుక చర్చించితిని. ఈ గీతి కనుబంధమో యనునట్లు రచింపబడిన కవిత 'పతాకవందనం.' కవిగారు 'విజయగీతి' లో స్వతంత్ర భారతమాతను వినుతించిరి. ఇందు మన జాతీయ పతాకను వర్ణించి నమస్కరించిరి. ఇది సంస్కృతములో రచింపబడినది. ఆచార్యులవారు సంస్కృత భాషా సారస్వతములలో విశిష్టపరిజ్ఞానము నార్జించిన విద్వద్వరేణ్యులు. పోతన చరిత్రములోను కొన్ని సంస్కృతశ్లోకములను రచించి యున్నారు. ఈ గేయములో త్రివర్ణపతాకా వైశిష్ట్యము, తదీయ ధర్మచక్ర త్రివర్ణముల పరమార్థము విశదీకరించినారు.

కవితలలో 'పంచశీల', 'ఆహ్వానము' అనునవి అంతర్జాతీయ విషయములకు చెందినవి.

## పంచశీల:

'పంచశీల' యను పదమును 1954లో ప్రప్రథమమున రాజకీయములలో ప్రవేశపెట్టిన యతడు ఇండోనీషియా అధ్యక్షుడు డా॥ సుకర్ణో. ఇండోనీషియా స్వాతంత్ర్యప్రతిపత్తి ఐదు సూత్రాల మీద ఆధారపడి యుండవలెనని ఆయన ప్రకటించెను. పిమ్మట భారత చైనాదేశములు టిబెట్టు విషయమొప్పందము చేసికొన్న తర్వాత 'పంచశీల' యను పదమున కంతర్జాతీయ ప్రాముఖ్య మేర్పడెను. ఈ ప్రాముఖ్యమునకు కారకుడు అప్పటి మన ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ. పంచశీల యొప్పందములో పొందుపరచిన ఐదు సూత్రములివి.

1. దేశస్వాతంత్ర్యము, సరిహద్దుల రక్షణ పట్ల పరస్పర గౌరవము.
2. ఒక దేశముపై మరొక దేశము దురాక్రమణకు పాల్పడకపోవుట.
3. ఒక దేశము యొక్క ఆంతరంగిక వ్యవహారములలో మరొక దేశము జోక్యము కల్పించుకొనక పోవుట.
4 పరస్పర ప్రయోజనకరముగా సమానస్థాయిలో నొక దేశముతో మరొక దేశము వ్యవహరించుట.
5. ప్రశాంత సహజీవనము.

దేశ దేశముల స్వాతంత్ర్య పరిరక్షణకు, పరస్పర స్నేహసహకారము లకు, విశ్వశాంతికి హేతువగు ఉత్తమ సూత్రములు గల యీ 'పంచశీల' బహుళ ప్రచారమందిన కాలములో ఆచార్యులవారీ కవిత వ్రాసిరి. ఇందులో పైన తెలిపిన పంచసూత్రము లభివర్ణింపబడినవి. ఇదియు నించుమించు సంస్కృత కవితయే.

'ఆహ్వానము' గురించి గ్రంథనామ సామంజస్యములో కొంత చర్చించితిని. మహాత్ముని సదాశయములగు విశ్వశాంతి, జగత్కల్యాణము, సర్వమానవ సౌభ్రాత్రము, మతసామరస్యము, వసుధైక కుటుంబ భావము మున్నగువానిని సాధించుటకు, తత్ప్రచారమునకు సోదర మానవుల నాహ్వానించుచు వ్రాసిన గేయమిది. మనకు స్వరాజ్య మేర్పడిన తొలి రోజులలో నిట్టి భావములు మిక్కిలి ప్రాధాన్యము వహించెను.

'బుద్ధగీతి' యను గేయము కూడ పై మహాశయముల నాకాంక్షించియే రచింపబడినది. ఇది 1956లో బుద్ధ జయంతి సందర్భమున వ్రాసినది. 1956 మే నెలకు-దుర్ముఖి సంవత్సర వైశాఖపూర్ణిమకు-బుద్ధుడు జన్మించి ఇరువదియైదు వందల సంవత్సరములైనవి ఈ పంచవింశతి శతాబ్ది జయంతి మహోత్సవము భారతదేశమునం దంతట మహావైభవముగా జరుపబడినది. ఆ సందర్భమున ఆచార్యులవారు హృదయ ముప్పొంగి రచించిన కవిత యిది. దాశరథిగారు 'మహాబోధి' కావ్య మా సందర్భములో రచించినదే. 'బుద్ధగీతి'లో బుద్ధుని దివ్యతేజ స్వరూపములు, అతని మహోన్నత శాంత్యహింసా సిద్ధాంతములు, బౌద్ధమత ప్రశస్తి లెస్సగా అభివర్ణింపబడినవి.

'అపూర్వ దీపావళి', 'నవంబరు 1 వ తేది' యను రెండు శీర్షికలు ఆంధ్ర ప్రదేశావతరణ శుభావసరమున రచింపబడినవి. ఆంధ్రదేశావతరణము దీపావళీ పర్వదినములలో జరిగినందున 'అపూర్వ దీపావళి' అన్న పేరుతో వ్రాయబడినది. ఇది ధ్వనిగర్భితమై ఆంధ్ర ప్రదేశ మేర్పడుటకు జరిగిన మహత్తర కృషిని దాని యేర్పాటు వల్ల కలిగిన మహాభ్యుదయమును యుక్తముగా వ్యక్తము చేయుచున్నది. 'నవంబరు 1వ తేది' యన్నది ఆంధ్రప్రదేశావతరణ దినోత్సవ శోభానందాతిశయము నుగ్గడించిన కవిత. నవంబరును నవాంబరముగా రూపించి "అదిగో! నవాంబరము, అతిలోకసుందరము" అని సుందరమైన శైలితో సురుచిర భావములతో విరచించిరా రాచార్యులవారు. 'స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రస ప్రలుబ

ధియః' అని నన్నయార్యుడు ప్రవచించిన ట్లాచార్యులవా రాంధ్రభాషావేషాభిమానులై తెలుగువారి మహాభాగ్యోదయముగా, తెలుగువారికి వాస్తవమైన స్వాతంత్ర్యముగా నవతరించిన ఆంధ్రప్రదేశమునకు మురిసి పరవశించిరి.

'రాజ ప్రముఖుడు నైజాము', 'ఎన్నాళ్ళు' అన్న రెండు కవితలు నిజాము రాజు గూర్చి రచించిన అధిక్షేప కావ్యములు. భారత ప్రభుత్వపు పోలీసుచర్య వల్ల నిజాంప్రభుత్వ మంతరించి హైదరాబాదు రాష్ట్రమున గణతంత్ర ప్రభుత్వమేర్పడిన సందర్భమున కేంద్రము నిజాము రాజు నీ రాష్ట్రమునకు రాజప్రముఖ్ గా నియమించి సంవత్సరాని కేబదిలక్షల రూపాయల చొప్పున భరణముగా నొసగెను. ఆ సందర్భమున వ్రాసినది యిందలి మొదటి కవిత. నిజాం రాజు చివరి సంవత్సరాలలో ఘోరమైన క్రూరమైన పరిపాలన మతపక్ష పాతముతో సాగించి హిందువులను దుర్భర హింసలకు గురిచేసెను. నాటి దుస్థితు లెల్ల మణిమాల వ్యాసములో వివరింపబడెను. నిజాం పాదుషా రాజ్యకాలమున చేసిన ఆ ఘోరకృత్యములను తలచుకొని కోపతాపముల పొగలు సెగలు వెళ్ళగక్కుచు ఈ కవిత వ్రాసినారాచార్యుల వారు. ఒక వ్యక్తికి చేసిన యపరాధమును మన్నింపవచ్చునుగాని జాతికి దేశమునకు చేసిన ఘాతుక చర్యలు క్షమార్హములుగావు. కావుననే సహజ శాంతస్వభావులైన ఆచార్యులవారి కివి దుస్సహములై యాగ్రహకారణములైనవి. దేశమునకు విఘాతము కలిగినపుడు వీరాగ్రహావేశపరులై కలము పట్టిన సన్నివేశములను 'జయధ్వజము' సంపుటిలో సర్వత్ర చూడవచ్చును. ఈ కవితలో నిజాము దుశ్చర్యలు గాటుగా సూటిగా గర్హింపబడినవి.

> ''నైజాహూ ! నైజామూ ! నైజము నీ కీ యాట
> పైరీజులనిచ్చే విటుగని పలచితి నిన్నను పాట."

అని మొదలిడి "పైజామా పంచాయని పక్షపాత భావములకు, ఐజన్లిస్తుంటావా ? అవి మరుస్తనంటావా ?" యనియు, "కూరెంతో కారమంత కుమ్మరించు సమత చూపి తిన్నవారి కండ్ల కెల్ల కన్నీరును దెచ్చితివే" యనియు నతని ముస్లిం పక్షపాత బుద్ధిని నిరసించినారు "రక్కసి చేష్టలు చేసిరి రజ్వో నీవో కాని. ఒక్కొక్కటి తలచుకొనిన ఒళ్ళంతా మండ్లుపేలు"నని మండిపడినారు. పోలీసుచర్యకు రెండు రోజుల ముందు హిందువుల నందరిని ఊచకోతలు కోయుటకు రజాకార్లు ఘోరపథకము వేసికొని యుండిరి. అది తెలిసి వల్లభభాయి పటేలు సకాలమున

సైన్యాలను పంపి రాష్ట్రి హైందవులను రక్షించెను. ఆ విషయము తెలుపుచు "లెక్కా పత్రంలేని కుక్కచావు చావకుండ, ఉక్కు మనిషి పటేలు దయ ఉన్నామీ ఇంతైనా" అని యూరడిల్లి "పక్కగట్టి పుండ్లు మాన బట్టలేమి మాసి పోవు, మక్కారీ చేష్టలు ఒక ప్రక్క మనసులోనున్న"వని వేదన వ్యక్తము చేసినారు. పిడికెడు రజాకార్లు హైందవ సమాజము మీదికి పులిపిల్లలై యురికి నారని చెప్పి "కడవెడు గుమ్మడికాయయు కత్తి క్రింద లోకువయ్యె"నని వగచి నారు. చివరకు గుఱ్ఱము పడవేసినను గుగ్గిళ్ళు సమర్పించునట్లు అపకారియైన నైజామును రాజప్రముఖ్ చేసి యేటేట ఏబది లక్షల ద్రవ్య మిచ్చుట యన్యాయ మని నిరసించినారు.

'ఎన్నాళ్లు' అను కవితలో నిరంకుశుడైన నిజాంనవాబు యొక్క శుష్క వాగ్దానములు, అజాగళస్తనాల వంటి అమలు జరగని చట్టాలు, ప్రాత ఫ్యూడల్ భావాలు, దోపిడి విధానము, పక్షపాత బుద్ధులు, క్రౌర్యములు మున్నగునవి గాటుగా గర్హింపబడినవి. మారిన కాలములో సాగని దొరతన మెన్నాళ్లని యధి క్షేపించుచు, "దక్క నిమ్మహి నిజాముని కన్నను, దక్కుదు ననుకొను టెన్నాళ్లు?'' అని నిజాముకీ భూమి దక్కబోదని నిష్కర్షగా చెప్పివేసినారు. ఈ చెప్పుటలో నొక చమత్కారమున్నది. దక్షిణమును ఉరుదులో 'దకన్' అందురు. ఇది వికృతి పదము. దీని రూపాంతరము 'దక్కను'. ఈ దక్కను 'నీకు దక్కను' అన్నది. దానికి తాను దక్కుదు ననుకొన్నాడు వెఱ్ఱి నవాబు. 'ముసలి నక్కకు రాచటికంబు దక్కునే?' యని వ్రాసిన దాశరథిగారి మాటలీ పట్టున జ్ఞప్తికి వచ్చును.

ఇందలి 'సూర్య చక్రము-చంద్రరేఖ' యను కవిత భారత పాకిస్తానుల గూర్చి నిగూఢముగా తత్త్వగర్భితముగా రచింపబడినది. ఇది కొంత ప్రతీక వాదకవితాచ్ఛాయలో నడచినది. ఇందు సూర్య చక్రము భారతదేశమునకును, చంద్రరేఖ పాకిస్తానునకును ప్రతీకలు. సమగ్రమై స్వయంపోషకమైన భారత దేశమును స్వయంప్రకాశమానము గల సూర్యబింబముతోను, అల్పమై అన్యాశ్రయ జీవనమై చంద్రరేఖాధ్వజ సంజ్ఞితమైన పాకిస్తానును చంద్రరేఖతోను పోల్చుట మిక్కిలి సమంజసముగా నున్నది.

"రవి యొసంగు ప్రకాశమునుగొని రాజువై సౌభ్రాత్రముంగొని
తేజు చంద్రాయుధమవై యిటు తెగనటికెనావె".

అని ధ్వనిగర్భితముగా పాకిస్తాను దౌష్ట్యము నధిక్షేపించిన విషయమే యీకవిత లోని సారాంశము. భారత దేశపు కటాక్షముతో నేర్పడిన పాకిస్తాను భారత దేశము మీదికే కత్తి దూసిన దని గర్హింపబడినది. పాకిస్తాను చేసిన ఘోరకృత్యములు నటనట శ్లేషచమత్కృతితో చక్కగా వక్కాణించుట జరిగినది. పాకిస్తాను తన చోట తానుండక కాశ్మీరును దురాక్రమణ చేసి పెంపుగాంచుటకు దుష్ట ప్రయత్నము చేసినది. దానివల్ల దాని యాటలు సాగకపోవుటయే కాక అణగారిపోవు దుర్గతి పట్టగలదని హెచ్చరించుచు సూర్య చంద్రులతో ఈ విషయము సమన్వయించి యీ విధముగా వచించినారు.

"పూర్ణశశిగా గోర వెంబడె పుట్టు నీలో నల్లమచ్చయు
ప్రతిదినమ్మట నుండి రవిముందెక్కెదవు రచ్చ
అతని సమ్ముఖ యందు వచ్చిన యంత తెలతెల బోయెదవు నీ
కళలుడుగు చినబోవు మొగమును గాంచి మెచ్చరిలన్"

మరియు పాకిస్తాను వంచనా ప్రవృత్తిని నిరసించుచు,

"చందన ప్రభ పైన లోన విషంబయిన చెడిపోదు విందుడ!
ఇట్టి వానిం జిన్నపని యని యెంతు రార్యఘనుల్
గురువనితలను జెఱచుచో పెరకొంపలను దోపించుచో
ఆ దురితకుల పక్షపాతమ్మే తుది క్షయం నిచ్చు"

అని హెచ్చరించినారు. ఇక్కడ 'ఇట్టి వానిం జిన్నపని' (చిన్నపని, జిన్నపని) అనియనుటలోని శ్లేషచమత్కృతి సహృదయైకవేద్యము.

ఇక 'ఓ రాజ!' 'సమగతి' యను రెండు కవితలు సామ్యవాద విషయకములైనవి, అభ్యుదయ కవితా విలసితములైనవి. 'ఓ రాజ!' కవితలో బడుగువారును అట్టడుగువారును నగు శ్రామికజనుల మూల్యము, ప్రాముఖ్యము వ్యక్తము చేయబడినవి.

"ఆ బీద మేఘాల అక్షిగర్భాలలో
అశ్రువులె యుండు ననుకొనకు ఓ రాజ!
అవి నన్ను కదలించ వనకు"

అని ప్రబోధించి, 'పిడుగులే కురిసెనా పెనుగొండ పిండి యగును, దాని ధాటిని సూర్యచంద్రులు కూడ చూడలేరు, ఊళ్ళు పల్లెలు జలధిలో జేరు' ననియు హెచ్చరించినారు. భూస్వాములు, ప్రభువు లీ కార్మికులను కడుహీనముగా జూతురు. దానికి,

"కాళ్ళు రెక్కలె సమ్మెగట్టెనా నీ తిండి
కాండమ్ము పని ఆట కట్టునని తెలియుమిక
కలిపి యెవ్వడు నోట బెట్టు? నిన్నుపై నిలుప నెవడు పునాది గట్టు?"

అని ప్రశ్నించి పెత్తందారుల కనులు తెరపించ యత్నించినారు.

'సమగతి' కవితలో ధనిక దరిద్ర వ్యత్యాసములు తొలగి ఎత్తు వంపు లేని బాట వంటి సమాజము నెలకొనవలెనని ఆకాంక్షించినారు.

'గ్రామోద్ధరణము' అను కవిత గ్రామోద్ధరణము ద్వారా నవభారత నిర్మాణము కావింప యువనేతలను ప్రోత్సహించుచు వ్రాయబడినది. దేశాభివృద్ధి గ్రామాభివృద్ధిపై ఆధారపడి యున్నదనియు, గ్రామస్వరాజ్యమున ప్రతి గ్రామ మొక గణరాజ్యముగా నుండవలెననియు గాంధిమహాత్ముడు ప్రబోధించి యుండెను. మన రాజ్యాంగములోని ఆదేశసూత్రములలో 40 వ సూత్రము పంచాయతీల నేర్పాటుచేసి యవి స్వపరిపాలన సంస్థలుగా పనిచేయుటకు కావలసిన యధికారములను, అవకాశములను ఈయవలసినదిగా రాష్ట్రప్రభుత్వముల నాదేశించినది. తదనుసారముగా 1947-59లలో గ్రామ పంచాయతీల యేర్పాటులో వివిధ రాష్ట్రములు శ్రద్ధ వహించెను. రామరాజ్యమునకు దారి తీయగల పై గ్రామరాజ్య స్థాపన జరిగిన సందర్భములో ఈ కవిత వ్రాసిరి. "నవయుగ ధర్మము వివరించవలె, నవజగతి నిచట నిర్మించవలె"ననియు, కుల మత ధనిక దరిద్ర భేద భావములు విడనాడవలె ననియు, 'గ్రామ సుధారే కల్పవల్లి' యనియు దేశాభ్యుదయాకాంక్షతో ప్రబోధించినారు.

'సమ్మతము' అన్న కవిత బాపూజి నిరంతర మాచరణాత్మకముగా ప్రబోధించిన మతసామరస్యము గూర్చి రచించినది. ఇందు దైవభక్తులకు దానకర్తలకు 'జనతా జనార్దనాచారమగు సకలమత పరమార్థసారము' బోధింపబడినది. 'మానవసేవయే మాధవసేవ' యన్న సూక్తి నీ కవిత చక్కగా విశదీకరించు

చున్నది. కులమత భాషావిభేదాలు కల్పించుకొని దైవ స్వరూపులయిన నరులను నానావిధముల పరిహసించుచు నేవో మందిరాలలో మసీదులలో పూజలు నమాజులు చేసిన నవి దేవుని కెక్కవని వక్కాణింపబడినది.

"నిర్మల మ్మగు మనసె నిఖిలేశు మందిరము
నిష్కామకర్మమ్మె నిరతపూజాకరము
కల్ల లెఱుగని నోరు ఘంటా నినాదమ్ము
కలుష మెఱుగని ప్రేమ తళిహ ప్రసాదమ్ము
నిత్యతృప్తి జనించు నవ్వులే ఆ
సత్య రూపార్చనకు పువ్వులు."

అని నిజమైన భగవదర్చనను ప్రవచించినారు. మరియు,

"హింస నెఱుగని మనసె హంసతూలిక పాన్పు
రహి దయాదృష్టి నీరాజనమ్మె తన్పు
మండించుచుందువా మనసు లెప్పుడు నీవు
అతని కొంపకె అగ్గి నంటించుచున్నావు,
సకల భూతగణాల హితమె-భగవాను
సన్నిధింజేర్చు సమ్మతము."

అని అహింసకంటె నఖిల భూతహితము కంటె మించిన భగవత్ప్రాప్తిమార్గము లేదని ఉపనిషద్వాణి సదృశమైన కవితను వెలార్చినారు.

## ప్రణయ కవితలు :

ఈ సంపుటియందు ప్రణయ కవితలు రెండు కలవు. 1. ఎవరో. 2. విరహాబ్ధి. ఇందు మొదటి కవితలో నొక రమణి తనను "పలుకులు నేరని వలపులతో, చిరునవ్వుల పువ్వుల జల్లులతో, కనుచూపుల తూపుల వేటలతో, వంశీరవ మోహన రాగసుధతో" ఎవరో పిల్చుచు పాడుకొన్నట్లు రచింపబడి గోపాలకృష్ణుడు గోపికను పిల్చుచున్నట్లు ధ్వనితమైనది. ఇక 'విరహాబ్ధి' యను కవితలో విరహ జలధి యొక్క పరితాపము వర్ణింపబడినది. నాయికావిరహమును సముద్రముతో రూపించి వేదన చక్కగా వర్ణితమైనది. నాయికాహృదయము

విరహ సముద్రమున బడబాగ్ని పరితాపమును పొందినది. అట్టి తాపము చంద్ర బింబమును గాంచి చల్లారినది, హృదయముప్పొంగినది "అంబరము చాటుగా నలరు మో మొకనాడు చిఱునవ్వు చిలికించి నెలవంకను లిఖించె" నని ప్రియా విరహ తాపమును గాంచి ప్రియుడు మెల్లగా నెలవంక వంటి చిఱునవ్వు చిలికించె నని చెప్పుటలో 'అంబరము చాటుగా'నని చేసిన శ్లేష చమత్కృతి ఇంపుగా నున్నది. నెలవంక చిఱునవ్వు కన్నది మొదలుగా నింతి మెల్లమెల్ల సిగ్గు విడిచి తలయెత్తి చూచి నిండు పున్నమ కాంతిలో నుప్పొంగిపోయినది. ప్రియా విరహ మును సముద్రముగా, ప్రియుని చంద్రునిగా భావించి వర్ణించిన యీ కవిత మనో హరముగా నున్నది.

ఆచార్యులవారీ రెండు కవితలు మాత్రమే ప్రణయాత్మకము లిందు పొందు పరచినారు. వారికి దేశభక్తి, దైవభక్తి-ఈ రెండే ప్రధానములు. ఇందు నామ మాత్రముగా ఈ ప్రణయ కవితలు రెండు చోటు చేసికొన్నవి.

## స్మృతి కావ్యములు :

ఇందలి స్మృతికావ్యములు మూడు. 1. వరాల భీమన్న, 2. వల్లభభాయి స్మృతి, 3. ప్రతాప ప్రశంస.

'వరాల భీమన్న' యనునది కరీంనగర్ జిల్లాలోని మంథెన వాస్తవ్యులై వెలసిన వరాల భీమన్నగారు దివంగతులైనపుడు వ్రాసిన స్మృతి కవిత. వరాల భీమన్న గూర్చి కొంత చెప్పవలసి యున్నది. మంత్రపురి (మంథెన)లో సద్వి ప్రవంశమున జన్మించిన వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఎమ్.ఎస్‌సి. (రసాయన శాస్త్రము)లో ప్రథములుగా ఉత్తీర్ణులైనారు. వరదాచార్యులవారు మంథె నలో చదువుకొన్నప్పటి నుండి వీరు మిత్రులు. మహామేధావి. వీరనేకోన్నత పదవుల లంకరించిరి. ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖలో సహాయ కార్యదర్శిగా, అప్పటి ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణారావు గారికి పి.ఏ.గా నుండిరి. వీరనేకుల కనేక విధాల సహాయము చేసిన పుణ్యపురుషులు. మంథెనలో ఉన్నత పాఠశాలా నిర్మాణమునకు వీరే కారకులు. వీరు సత్యవంతులు నీతిపరులు నిరాడంబరులై జీవించినవారు. వీరు గతించునప్పటికి యశోధనము తప్ప ప్రాకృతధన మేమియు లేదు. ప్రజలే అంత్యక్రియలు చేసిరి. వీరు కీర్తిశేషులైన పిదప వీరిపేరు చిర

స్థాయి యగుటకు ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఎం.ఎస్‌సి. (రసాయన శాస్త్రము లో ప్రథములుగా నుత్తీర్ణులైనవారి కేటేట బహూకరించుటకు మంథెన వారు భీమన్న బంగారు పతకము 'Bhimanna Gold Medal' ఏర్పాటు చేసినారు. మరియు మంథెనలో ప్రతి సంవత్సరము 'భీమన్న స్మారక టోర్న మెంట్స్' నిర్వహించుచున్నారు. అట్టి యశస్వి మహనీయుడు నైన భీమన్న మృతికి వగచి స్మృతిచిహ్నముగా ఈ కవితను కవిగారు రచించిరి.

భీమన్న 'నందనవన మందార కల్పలత నుండి రాలిన సురభిళితసూన' మనియు, 'బ్రహ్మలోక హిరణ్య భవనాగ్రసీమల నుండి భారతీ దివ్యాభరణరత్న మంజూష రాల్చిన యొక వరకళారత్న' మనియు, గోదావరి పెన్నిధాన మనియు, ఆంధ్రజనుల పుణ్యఫల మనియు నిత్యాదిగా బహుభంగుల మహోదాత్త వ్యక్తిత్వ మును వర్ణించిరి.

నామములకు చమత్కారార్థకల్పనము చేయుటలో ఆచార్యులవారి ప్రజ్ఞ విశిష్టమైనదని మణిమాలలో గమనించితిమి. ఈ సంపుటిలోను అందందీ విషయము గోచరమగును. వరాల భీమన్న 'ఆది దైవవరాల నడరి భీమాకృతి దాల్చి యంధ పుత్రులను హితమార్చుటకు ధర్మగతి బంధమోక్షము సమకూర్చుటకు దేహబల జయధ్వజ మెత్తె'నని చమత్కారముగా నర్థకల్పన చేసినారు. ఇంకను భీమన్న గారి విశిష్ట వ్యక్తిత్వము వారి యమూల్యసేవ లిందు కొనియాడబడి అతని మృతికి వెత చెందుట జరిగినది.

'వల్లభభాయి స్మృతి' కృతి సర్దారు వల్లభభాయి పటేలు తేది: 15.12-1950 నాడస్తమించిన పిడుగువంటి వార్తవిని వ్రాసిన స్మృతికావ్యము. పటేలుగారి మరణవార్త వినగానే 'మానసమందు గుండువడెను, దేహము బావు రంచు వ్రాన్పడెను, దేశము నల్గడలు కన్నీట స్నానమాడెను, మన పెత్తల యొకరు పోయిరి కదాయని ప్రజలు దుఃఖించి'రని తీవ్రవేదన వ్యక్తముచేయబడినది. పులివంటి నీవు పడిపోయిన తత్‌క్షణమె పండిత జవహరుడు హా యని యడలెను, నీపై నిల్పుకొన్న కొండంత యాశలు త్రుటిలో నీరైపోయెను, నీ కొరత మాకెట్లు తీరునని దురపిల్లి రాచార్యులవారు. పటేలు మన యీ దేశము చక్కదిద్దుటకు వచ్చిన కారణజన్ముడు. అతని వియోగము దుర్భరమైనది. ఈ విషయము తెల్పుచు,

"అదనుకు సృష్టిచేసి యిడె నా భగవానుడు నిన్ను మాకు, మా
చెదరిన యిల్లు చక్కబడజేసి ప్రపంచము తీర్చిదిద్ద న
య్యది తుది ముట్టకుండ మృతి నందితి వీవు మహాత్మ హత చే
కదలినపుండు గుండియల కారము జల్లెను నీ వియోగముల్"

అని దుఃఖించుట జరిగినది. మరియు దేశవిముక్తికి దేశసమైక్యత కంకితముగా చేసిన 'తావకీన సువిశిష్ట చరిత్ర సువర్ణ పంక్తులన్ భారత భారతి ప్రసిద్ధగతి వ్రాసికొను' ననియు, 'భారతజాతి నీ యడుగుదోయికి నెల్లవేళల దోసిలి యొగ్గు' ననియు కృతజ్ఞతతో స్మరించినారు.

జాతీయనాయకుడైన పటేలు పూర్వపు హైదరాబాదు రాష్ట్రప్రజలకు పరమాప్తుడు. అతడు సకాల సాహసిక చర్యచేత హైదరాబాదు విముక్తి కావించి ప్రజలను కాపాడిన మహాపురుషుడు. అట్టి మహామహుని ముక్తకంఠముతో వినుతించుచు పటేలుగారి ప్రాముఖ్యము నుగ్గడించుచు

"వామ దక్షిణ హస్తాలు వల్లభాయి నెప్రహు అనుచు మహాత్ముండు నిలిచిపోయె.

ఒక భుజమ్మది పడిపోయె నొంటియెద్దు జంటలేకెట్లు భారతశకట మీడ్చు?"

అని పటేలు లేక యొంటివాడైన నెహ్రూకు దేశపరిపాలనమెంత దుష్కరమోయని చింతించినారు. చివరకు పటేలుగారి ధైర్యసాహసములు, వజ్రసంకల్పము, కార్య దక్షత, దేశభక్తి మున్నగు నుదాత్తగుణముల మహావ్యక్తిత్వము బహుధా కొనియాడినారు.

మూడవ స్మృతికావ్యమగు 'ప్రతాప ప్రశంస' సురవరం ప్రతాపరెడ్డిగారి గూర్చినది. ప్రతాపరెడ్డిగారు తేది: 25-8-1953న దివంగతులైరి. వారు రచించిన మహాగ్రంథము ఆంధ్రుల సాంఘిక చరిత్ర. దీనికి కేంద్ర సాహిత్య అకాడమి బహుమతి వారి మరణానంతరము లభించినది. ఆ బహుమతిని రెడ్డిగారి పక్షమున వారి సతీమణి పద్మావతమ్మగారు స్వీకరించిరి. ఆచార్యుల వారీ కవితను కేంద్ర అకాడమి బహుమతి సాంఘిక చరిత్రకు దొరికిన పిదప వ్రాసిరి. ఈ విషయమును వారిందలి యొక పద్యమున ప్రస్తావించి ప్రస్తుతించిరి.

"అరయఁగా నాంధ్రసాంఘికచరిత గురుత తరమె గురుతింప సామాన్య
నరులకెందు
భారత ఎకాడమియె యాంధ్రభారతి నట అగ్రతాంబూల మొసఁగి
సమాదరించె."

కావున ఈ కవిత రెడ్డిగారి మరణవార్త వినగానే వ్రాసినది కాదు. కొంత కాలము తర్వాత వారిని స్మరించి స్తుతించుచు వ్రాసినది. కాగా నిది ప్రశంసా కావ్యముల జాతిలోనికి వచ్చుట కవకాశము కలదు. ఐనను మరణానంతరము వ్రాసినది కనుక స్మృతి కావ్యములలోనే చేర్చితిని.

ఇది రెడ్డిగారి నిర్యాణ సందర్భములో వ్రాసినది కాదు కావున నిందు విషాదము వ్యక్తము చేయబడలేదు. వారి ఘనకార్యముల గూర్చియు, వారి విశిష్ట వ్యక్తిత్వము గూర్చియు మాత్రమే ప్రశంసించుట జరిగినది. సురవరం ప్రతాపరెడ్డిగారి నామమునకు చమత్కారార్థ కల్పనము చేయుచు

"జన్మజన్మాల పుణ్యసంచయము పండి సురవరానుగ్రహోజ్జ్వల స్ఫూర్తినంది
తెలుఁగు వీరప్రతాప నిస్తులయశంపు విజయదుందుభి గోల్కొండ వీథి
మొరసె."

అని మహోదాత్త భావన గావించినారు. రెడ్డిగారిని గురించి చెప్పిన దిగువ పద్యము వారి ధీరస్వభావమునకు దర్పణము పట్టుచున్నది.

"అతఁడు ప్రతాపుఁడే యొకని యయ్యకు జంకెడివాఁడు గాఁడదే
కృతిని సమీక్ష చేసిన నొకేపరి యందలి మంచిచెడ్డ క
చ్చితముగ చెంపపెట్టువలెఁ జెప్పును తప్పులఁగప్పుచున్ మఖ
స్తుతుల నొనర్పఁడాతఁ డల సోముని భీముని రామునైనసున్."

కవి, కథకుడు, విమర్శకుడు, నాటకకర్త, చరిత్రకారుడు, మహావిద్వాంసుడైన రెడ్డిగారి ప్రతిభా పాండిత్యములు చక్కఁగా ఈ కవితలో వినుతింపబడినవి. "అతఁడు నడయాడు గ్రంథాలయమొ మూర్తిగొనిన విజ్ఞాన సర్వస్వమో" యని అబ్బురపడి యతనిని 'సర్వజ్ఞుడు' అని యనవచ్చునని భావించినారు. 'తెలంగాణ సీమలో కవులు పూజ్యమను అపప్రథ మాపుట కవతరించి వచ్చి తొడగొట్టి నిలిచి

సవాలు చేసినట్టి జగజెట్టియని వాస్తవస్తవము కావించినారు. రెడ్డిగారు 1934 వ సంవత్సరమున ప్రకటించిన 'గోలకొండ కవుల సంచిక' సుప్రసిద్ధమై పై వాక్యమును సమర్థించుచున్నది. ఈ స్మృతికావ్యములో సురవరంవారి యమూల్య సారస్వత కృషి, విశిష్ట వ్యక్తిత్వము చక్కగా ప్రస్తుతింపబడినది.

## ఇతర ఖండకావ్యములు :

సంపుటిలో దేశభక్తి కవితాదులు పోగా తదన్యములైన పది కవితలలో సాహిత్యాదిక విషయములలో ఆచార్యులవారు తమ యభిప్రాయములు తెలిపిన కవితలు, ప్రశంసా కవితలు, నీతిప్రబోధక కవితలు మున్నగునవి కలవు. ఇందు 'మనవి' యను కవిత విశిష్టమై విలక్షణమై యొప్పుచున్నది. ఇది కావ్యావతారికా సదృశమైన కవిత.

'పోతన చరిత్రము' మహాకావ్య రచన దాదాపు ముగించిన కాలమున వెలువడిన 'ఆహ్వానము' సంపుటిలో ఈ కవితను చేర్చుట గమనార్హము. తమ మహాకావ్యము ననేక సభలలో గానము చేసి సాహితీపరుల, విమర్శకుల బహువిధాభిప్రాయములను గ్రహించి ఆచార్యులవారీ కవిత నన్యాపదేశముగా వ్రాసిరి. కావ్యము రచించి వినుపించుటను వంటచేసి వడ్డించుటగా చెప్పి దానినే తిని తన్మయానంద మందునట్లు వ్రాసిరి. తామోపినంత రుచిగ నుండుటకు కష్టించినారు. వంట కుదుర లేదని ఎవరైన అన్నచో కోపమేల ? యనియు, తన పాకమే మంచి నలపాక మను కొననియు, ఎవరెవరి రుచులిందు ఎటువంటివో యనియు ఆత్మవిమర్శతో విశాల భావముతో విన్నవించినారు. మరి భిన్నరుచిగల వారిని తృప్తిపరచుట యెట్లన 'అవని నందర దనుప నజుని తరమేకాదు, మనవి చేతును నేను మహనీయుడను కాను.' అనియు, ఎవరైన 'తనివిబొందితి మనిన ధన్యుననుకొనెద' ననియు మనవి చేసినారు.

ఈ కవితలో ఆలంకారికుల మతభేదములను, విమర్శకుల వాదములను స్థూలముగా పరామర్శించి విమర్శించి తమ సమరస సమన్వయ భావములను వ్యక్తము చేసినా రాచార్యులవారు. కొందరి అభిప్రాయములో ఆయా రసములే శ్రేష్ఠమైనవి యిష్టమైనవి. ఆచార్యులవారు "అన్ని రసములు నాకు నానంద మొసగు నవె, అన్ని రసముల జీవనాధారమను నేను" అని తమ మహారసాత్మను వెల్లాచ్రి

నారు. కవితా విషయమున కుల మత ప్రాంతవిభేదాలు పాటించువారిని తమకు నచ్చిన ఆయా 'ఇజాల' కవితలే అసలైన కవితలని వాదించు వారిని "తావలచి నట్టి యా తరుణి రంభను వారు, తాము మునిగినది యేదేని గంగనువారు" అని వారి సంకుచిత దృష్టిని నిరసించినారు.

సదసద్వివిమర్శల యొక్కయు, తద్విమర్శకుల యొక్కయు వ్యవహారము లను పేర్కొని యసద్విమర్శకులను గాటుగా విమర్శించినారు. సద్విమర్శకులు వరిలోని తుంగను పెరికివేయువారు, తీపి విరులపై ్రవాలు తేనెటీగలు, పాలను నీటిని వేరుపరచు హంసలనియు, అసద్విమర్శకులు వరినె తుంగయటంచు నరికి వేయువారు, పుండ్లపై ్రవాలు నీగలు, మలిన నీరముగ్రోలు కాకులనియు చక్కగా నిరూపించినారు. కొందరు ముందు మురిపించి వెనుకకు వెక్కిరించు వారుందు రనియు వ్రాయుచు లోకుల నిందాస్తుతుల కొకవందనము చేసినారు. నిందాస్తుతులు మున్నగు ద్వంద్వముల కతీతులైనవారు స్థితప్రజ్ఞులు. వారే ద్రష్టలగు ఋషులు. వారే సుకవులై విలసిల్లగలరు. సుకవి లక్షణమును విన్నకోట పెద్దన చక్కగా చెప్పినాడు.

"సమయజ్ఞుఁడు సమచిత్తుఁడు
సమశబ్దార్థ ప్రయోగచతురుఁడు భావ
క్రమరసపోషణ రచనా
కమనీయ ప్రతిభుఁడిల సుకవియన బరఁగున్."[1]

ఇందితర లక్షణములతోపాటు 'సమచిత్తుడు' అన్న లక్షణము పేర్కొన బడినది. ఇది చాల ముఖ్యమైనది. సమచిత్తుడే సత్కావ్య రచనాచణుడై విరాజిల్ల గలడు. అట్టి సమచిత్తులైన ఆచార్యులవారు సుకవులై యితర కవిమహాశయుల కాదర్శజీవనులై యున్నారు.

కాగా లోకులు గావించు నిరంతర నిందాస్తుతులకు లోనుగాకుండ కవి సమచిత్తుడై యుండగలుగు టెట్లనగా దానికి తామాచరించు చక్కని మార్గమును వక్కాణించినారు. 'స్తుతి విన్నయపుడు....' అని యిత్యాదిగా వ్రాసి స్తుతికి

1. కావ్యాలంకార చూడామణి : తృతీయోల్లాసము, 79 వ పద్యము.

ంగి గర్వించక, నిందకు క్రుంగి దీనుడు కాకయుండు విశిష్టవర్తనమున కనువగు
కల జనశిరోధార్యమగు సద్వాక్య ముపదేశించినారు. చివరకు,

"మాలిన్యమును గడిగి బాలు ముద్దుల కలరు
తల్లియగు దోషజ్ఞతల్లజునికి నమస్సు"

సద్విమర్శక విద్వాంసునికి నమస్కరించి "సహృదయుండగు విమర్శక
కవర్తి నుడివెల్గులో ముందడుగు వేయుచుందును నే" నని మహోదాత్తముగా
ప విమలచిత్తము నావిష్కరించుచు వచించినారు.

ఈ రీతిగా సుకవికుండవలసిన లక్షణములు, ఈనాటి విమర్శకుల
కడలు, సద్విమర్శక లక్షణములు వివరింపబడి కవిగారి విశిష్టవ్యక్తిత్వ మీ
తాదర్పణములో కమనీయముగా ప్రతిఫలించుచున్నది.

ఇందులో 'క్షేత్రయ్య', 'కాళోజీకవి' యనునవి రెండు ప్రశంసాకవితలు.
త్రయ్య'లో క్షేత్రయ్యగారి కవితావైభవము నుగ్గడించుచు ''మధురమంజుల
సామ్రాజ్యమందు పదపదమ్మున గోపికాపద్మనయన విరహవీక్షణ పంక్తుల
సనమ్మె'' యనియు, "స్వీయవక్షోజకందుక శ్రీవహించు లలిత సంగీత
హిత్యముల కితండు స్వామియని మువ్వగోపాలు సాక్షిగాగ వాణి క్షేత్రయ్య
ముల వలచివచ్చె" ననియు నెంతో చమత్కారముగా వర్ణించినారు. వేద
ంతవీథుల వెలయు నాత్మ పరమాత్మగలియు సమైక్యలీలను సరసశృంగార
ల చాటినావని వర్ణించుచు క్షేత్రయ్య నాంధ్రజయదేవునిగా సంభావించినారు.
మారు తమ మిత్రులు శ్రీ పి. నరసింగరావుగారితో క్షేత్రయ్య గురించి
స్తావనవచ్చి తదీయపదరచనా వైశిష్ట్యప్రశంస జరిగినపు డాచార్యులవారీ కవిత
సినట్లు చెప్పినారు.

'కాళోజీకవి' కవిత ఆచార్యులవారి బాల్యమిత్రులు సుప్రసిద్ధ ప్రజాకవి
కాళోజి నారాయణరావుగారి గూర్చి రచించినది. కాళోజిగారికి నల్లగొండ
డలములోని చండూరులో సన్మానము జరిగిన సందర్భమున తత్సభలో ఈ
ంసా కవిత నాచార్యులవారు గానము చేసిరి ఆ కాలమున హైదరాబాదు
క్తికి సాగుచున్న పోరాటములో పాల్గొన్న కాళోజిగారిని తమ జన్మమండల
వరంగలుకు రాకుండ నిజాం ప్రభుత్వము నిషేధించి యుండెను.

ఇందు కాళోజిగారి స్వచ్ఛహృదయము, దీనజనోద్ధరణ తపన, జాతీయభావ ములు, కవితాశక్తి బహుళభంగుల కొనియాడ బడినవి. రాతిగుండెలను కరగించు కాళోజిగారి యార్ద్రకవితను గూర్చి వ్రాసిన యీ పద్యము హృద్యమై యొప్పు చున్నది.

> "కన్నె గులాబి మొగ్గల నిగారపు సారము లూనునట్టి నీ
> చిన్న యెడందలో నుడుకు చిచ్చుల నొచ్చుచు వెచ్చనౌచు నీ
> కన్నుల నశ్రుబిందువుల గార్చుచుఁగూర్చు కవిత్వనిర్ఝరిన్
> వెన్నల కన్న లౌను ద్రవించి స్రవించెడి రాతిగుండెలున్."

'పిచ్చుకంత లేనివాడు పీఠమెక్కి యుపన్యసించగా జూలు విచ్చిన సింగమై గర్జలు చేయును. దానికి పీనుగుకైనను నిముసములో ప్రాణము వచ్చు'నని యతని ధైర్యో త్సాహ విజృంభితోపన్యాస ధాటి నుగ్గడించినారు. కాళోజి సమాజములో వరిముల్లంత అన్యాయము జరిగినను సహించువాడు కాడు. 'నాగొడవ' కవితలలో నిట్టివేదన, సముద్ధరణ కాంక్ష తీవ్రముగా గోచరించును. అట్టి యితనిగూర్చి "దీనజన సము ద్ధరణైక దీక్షబూని లోకకల్యాణ చింతా విలోలుడైన నరుడె నారాయణుండని నీ నామరూపములె యెఱుక జెప్పు" చున్నవని యతని ప్రజాహితకాంక్ష నుదాత్తముగా వర్ణించినారు.

'లోకాభిరామాయణము' 'భాగవతము' అను రెండు కవితలు రామాయణ భాగవత గాథల పరమార్థమును దెల్పునవియై యీ లోకములో రామాయణ భాగ వతములు నిరంతరము సాగుచున్నవని చమత్కారముగా సమన్వయముగా రచింప బడినవి. రామాయణము గురించి "అనాది రామాయణ మిది, అనంతరామాయణ మిది, వినండి యిటు మనసుంచి వివిధదేశవాసులార!" యని రామాయణము సర్వ కాల సర్వదేశములకు ధర్మోపదేశ మొసగు దివ్యగాథయని ప్రవచింపబడినది. రామాయణము రామ రావణుల మధ్య జరిగిన కథయేకాక మానవ దానవుల మధ్య ధర్మాధర్మముల మధ్య జరుగు దారుణ సంగ్రామ మనియు, 'దానవపురి దగ్ధమ్మయి మానవుడే గెల్చును తుది' యనియు ధర్మానికే యంతిమ విజయ మగునన్న సత్యమును వక్కాణించినారు.

భాగవతము విశ్వకథా సంగీతమని వినుతించుచు మహాపురాణములలో వర్ణితములైన యవతారములు లోకసృష్టి విస్తరణాది పరిణామములు తెల్పునని

చక్కగా వర్ణించినారు. కేవల ధర్మమోక్షములకే పరిమితములని భావింపబడుచున్న పురాణ రామాయణ భాగవతములు దిక్కాలాద్యనవచ్ఛిన్నముగా సకల మానవుల కుపాదేయములని నిరూపించుట యిందలి ప్రత్యేకత.

'వైష్ణవగీతము' అను కవిత సుప్రసిద్ధ ఘూర్జర మహాకవి భక్త నరసీ మెహతాగారి 'వైష్ణవజనతో తేనే కహియే జో పీడా పరాయీ జాణేరే' యను గీత మునకు ఆంధ్రానుసరణము. ఈ గీతము గాంధిమహాత్ముని కత్యంతప్రియమైనది. మహాత్ముని సేవాగ్రామాశ్రమములో నిత్యము ప్రార్థన సమయములో ఈ గీత మాలపించబడెడిది. అందువల్ల సుప్రసిద్ధమై భారత జాతీయగీతములలో నొకటిగా పరిగణింపబడినది

ఈ గీతములో 'వైష్ణవుడు' అనగా భగవద్భక్తుడు. భక్తుడు కేవలము హరినామ స్మరణ చేసినచో తరింపజాలడు. దేవునికి తన నామస్మరణ చేయువారి కంటె తాను శృతిస్మృతుల ద్వారమున ప్రకటించిన యుత్తమ ధర్మముల నాచరించుచు తనయందు చిత్తము నిల్పువారే ప్రియతములు. భగవద్గీతలో ఈ విషయమే నొక్కి వక్కాణింపబడియున్నది. [1] సత్యాహింసాద్యనుష్ఠానము కంటె, జనతా జనార్దన సేవకంటె మించిన దైవసేవ లేదన్న దృఢ విశ్వాసము కలిగి, అహింసా సత్యాస్తేయాద్యేకాదశ ధర్మాచరణాత్మకమగు నేకాదశీవ్రతము[2] నాచరించు సద్భక్తుడగు మహాత్మునకి వైష్ణవ గీతమతి ప్రియమై నిత్యగేయమై ఆచరణీయమై యలరారినది.



1. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
   నిర్మమో నిరహంకారః స్సమదుఃఖ సుఖః క్షమీ
   సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
   మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్త స్స మే ప్రియః''–భగవద్గీత: భక్తియోగము శ్లో. 18, 14

1. "అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్య మసంగ్రహః
   శరీర శ్రమా స్వాద స్సర్వత్ర భయ వర్జనం
   సర్వధర్మే సమానత్వం స్వదేశీ స్పర్శ భావనా
   హ్యేకాదశ సేవా మే నమ్రత్వే వ్రతనిశ్చయే.''–సేవాగ్రామమునందలి ప్రార్థన శ్లోకము.

గాంధేయ దృక్పథము నాకాంక్షించు వరదాచార్యుల వారీ గీతము నభిమాన ముతో అంగీకరించినారు. ఇది మెహతా గీతమున కనువాదము కాక యనుసరణమై యున్నది. స్వేచ్ఛానువాదమైనను స్వతంత్ర గీతమువలె శోభిల్లుచున్నది.

"వాడే వైష్ణవుడు దయగల వాడే వైష్ణవుడు
పరుల పీడ గుర్తెరిగిన నరసోదరుడే వైష్ణవుడు"

అని ప్రారంభించి,

"నాలుక గోసిన పలుక దసత్యము
వ్రేలనైన ముట్టడు పరధనముల
అలోకించును పరసతుల మాత
వోలె, తృణ మ్మటు తృష్ణ త్యజించెడి" ॥వాడే॥

ఇత్యాదిగా సాగించి,

"నరసీమెహతా పాడిన గీతము
నరసంతతి కది అమృతోపేతము
పర వైష్ణవ సద్గుణ సంకేతము
నరనుత గాంధి మహాత్మాదీతము"

అని వివరించుచు ముగించుట జరిగినది.

ఇక లోకనీతి ప్రబోధకములైన కవితలు నాలుగు కలవు. అందు 'మోసము' అన్న కవితలో లోకములో సర్వరంగములలో వ్యాపించియున్న మోసము గురించి హృదయంగమముగా వర్ణించుట జరిగినది.

"మోసము ! మోసము ! ! మోసము ! ! ! జీవిత మంతా దానిగూర్చి అభ్యాసము"

ఈ మోసమిందుగల దందులేదను సందేహములేకుండ నెందైనను కలదని తెల్పుచు,

"దేశభక్తిలో మోసము, దేవుని గుడిలో మోసము
రామచంద్రరూపములో రావణాసురవిలాసము" అని వ్యథపడినారు.

"కుడిచేవేళల దున్నే కోడె గుంపుల ప్రవేశము
దున్నేవేళల ఆవుల దూడలలోన నివాసము"

అని మోసమెట్లు 'చెలామణి' యగుచుండునో దృష్టాంతపూర్వకముగా చెప్పినారు.

"భార్యాబిడ్డల కోసము బంధుమిత్ర తతి కోసము

జగత్తునంతను కూడా చేతుము సర్వము నాశము" అని వంచకుల ఘోర ప్రవృత్తిని వ్యక్తము చేసినారు.

'ధనము' అన్న గేయమున ధనమూల మిదం జగత్తను లోకోక్తి కవితామయము చేయబడినది. చిరకాలము దుర్భర ఋణ వ్యథా పరితప్త మానసులైన ఆచార్యులవారు ధనప్రాముఖ్యము నుగ్గడించుచు ఈ కవిత వ్రాసియుండిరి.

'కోకిలా!' యను కవితలో కోకిలను మనోజ్ఞముగా వర్ణించి తన్మూలమున నీతి బోధించుట జరిగినది. కోకిల కూత వినబడునే కాని యది కనబడదు. దాని గాంచుటకు కన్నులు నీరాజనమిడునట. "మాకందమ్ముల నుందువు మా కందమ్ముల కగపడ" వని యమక చమత్కృతి కావించినారు. కోకిల చక్కని దానను కానని కాబోలు చాటు చాటు కేగుచుండును. కవిగారది గమనించి

"గానమునకు తగురూపము గాంచనైతి నను చింతే
గానము రూపమునులేని కాకము గతిని దలంతే"

అని దానిని నూరడించినారు. మరియు "అన్ని నాకె యుండవలయు ననుకొనుటే పెనుదోషము, ఉన్నదానితో తృప్తిని నొందుటయే సంతోషము." అని హితోపదేశము కోకిలకేకాదు మానవులకును చేసినారు.

'కపాలమోక్షము' అను మరొక కవిత నేటి నవనాగరికుల పోకడలను కుండబద్దలు కొట్టినట్లు వెల్లడి చేసినది. ఇది,

"అతి విజ్ఞానులు నాగరికులు పిలనబడు మానవులము మేము
మితిమీరిన యీ స్వార్థపరతతో మీ మును దానవులము మేము"

అని వారే స్వవిషయములు చెప్పికొన్నట్టు రచింపబడినది. ఈ స్వార్థపరులలో కరుడు గట్టిన కామక్రోధాదులే ఆటం హైడ్రోజను బాంబులుగా ప్రేలుచున్నవి.

గుజ్జువు రూపుల గాడిద నడకల కులమత వర్గముల బట్టుకొని యెట్టిను జూపి చేపను లాగుట కిచ్చు దానాలు చేయుచు బ్రతుకు గడుపుటయే వీరి పురుషార్థము. వీరింకను "విందులు గుడిచే సందర్భములో బంధురూపులై బొందలోన బడువాని గాంచి రాబందురూపులై" పీకుక తినువారు. పైకి వెడ్డి మంగలవలె కన్పడుచు ఫలితాలు పొందుటలో నీర్వంక తుంగలుగా మారుదురు. అవసరపడి యొరుల దరిజేరుచు వేశ్యాప్రేమలు గురిపించి, అవసరపడి యొరులు తమ్ము చేరవచ్చిన జుట్టు బట్టి యాడింతురు. పట్టపగలు నట్టనడివీథిలో దోపిడులు హత్యలుచేసి 'ఖానూను' గ్రక్కి తప్పుకొని రాగలరు. కొట్లాడుకొని వారి వద్దకు తగవు చెప్పుమని పోయినచో పిట్ట పిట్ట పోరు పిల్లి తీర్చినట్లుండును. ఇట్టి యీ నీచాతినీచ స్వార్థపరులు,

> "వేషభాషలన్ మానవత్వమును వేయి చెక్కలుగ జేస్తాము
> భాష కొక్క దేవుని జూపించి కపాలమోక్షగతి నిస్తాము"

అని వేష భాషా భేదములతో మానవత్వమును వేయి ముక్కలు కావించుచు మత ద్వేషాలతో తలలు బ్రద్దలు కొట్టువారని వారి గుట్టుమట్టులు బట్టబయలు చేసి వారి బారిని బడకుండ వారి దారిని బడి చెడకుండ నుండుటకీ నీతికవిత రచించినారు.

ఈ విధముగా ఈ నీతికవితలు చక్కని నీతిని ధర్మమును మనోజ్ఞముగా నుపదేశించు చున్నవి.

సంపుటిలో మొదట తెలిపినట్లు, ముప్పాతిక ముప్వీసము కవితలు గాంధేయ దృక్పథము వెలార్చునట్టి జాతీయతను, దేశభక్తిని, సామాజిక వైయక్తికశీలమును ప్రబోధించునవియై యొప్పుచున్నవి.

## రస పోషణ :

'ఆహ్వానము' లోని ఖండకావ్యములను చర్చించు సందర్భమున నించు కించుక రసవిషయము ప్రస్తావించి యుంటిని. ఇతివృత్తకవితయైన కావ్యములందు వలె ఖండకావ్యములందు రసపోషణకు వీలేర్పడదు. కనుక యథావకాశముగా పోషింపబడిన రసముల గూర్చి సంగ్రహముగా నుల్లేఖింతును.

మొత్తము ఖండకావ్యముల నొక యఖండకావ్యముగా భావించి పరిశీలించిన నిందు ప్రధానముగా కానవచ్చునది ధర్మవీరము. బాపూజి స్మృతి గేయమాలలోని

చివరి తొమిది గేయాలలోను, 'రైతురాజు'లో కొన్ని గేయములు, అపూర్వ గీతావళి, నవంబరు 1 వ తేది, ఆహ్వానము, కాళోజీకవి, ప్రతాప ప్రశంస, వల్లభభాయి స్మృతిలో కొంత భాగము-ఈ మొదలగు కవితలలో ధర్మవీరము పోషింపబడినది. దేశభక్తి కవితలలో ప్రాయికముగా నేతద్రసచ్ఛాయలు గన్పట్టును. ధర్మవీరము తర్వాత గణింపదగినది కరుణము. గాంధి స్మృతిగేయాలలో మొదటి ఇరువదియేడు గేయములలో కరుణరసము జాలువారి రాతి గుండెలను సైతము కరగింపజాలి యున్నది. రైతురాజులో వానదేవుని ప్రార్థించిన గేయము, వరాల భీమన్న, వల్లభ భాయి స్మృతియను రెండు గేయములలో కొన్ని పద్యములు కరుణరస ప్రసారము గావించుచున్నవి. ఇక గాంధి స్మృతి గేయములలో సర్వసముడు, శత్రువునకును మిత్రుడు-అను గేయములలోను, బుద్ధగీతిలోను శాంతము స్వాంతోపశమనము కావించుచున్నది. రాజప్రముఖుడు నైజాం, ఎన్నాళ్ళు? అన్నకవితలలో రౌద్రము రుద్రరూపము దాల్చి విస్ఫులింగములు చెరగినది. ఇక రెండు ప్రణయ కవితల లోను, రైతురాజులోని కొన్ని గేయములలోను శృంగారము ప్రసరించినది. ఈ కొన్నిటగల శృంగారమైనను ముఖ్యముగా విప్రలంభమేయై యొప్పారుట విశేషము. ఈ రీతిగా ఖండకావ్యములలో సముచిత రసపోషణ కావింపబడి హృదయాహ్లాదము కలిగించుచున్నది.

## భావసంపద, అలంకారములు :

నవ్యకవితా విశిష్టములైన యిందలి ఖండకావ్యములలో భావ సంపద సమృద్ధిగా సరసోపభోగ్యమై విరాజిల్లుచున్నది. ఆచార్యులవారి భావుకత మిగుల ఉత్కృష్టమైనది. 'భావక్రమ రసపోషణ రచనాచణు'లగు వరదాచార్య కవీంద్రులే వస్తువును స్పృశించినను మహోదాత్త భావనాశక్తిచేత దానిని రసమయ కళా ఖండము కావించి యున్నారు. ఇట్టి భావోదంచిత కవితలలో గాంధి స్మృతి గేయ మాల. రైతురాజు గేయములు, మోసము, కోకిల, అపూర్వ దీపావళి, నవంబరు 1 వ తేది, సూర్యచక్రము-చంద్రరేఖ మున్నగునవి మహోజ్జ్వల మనోహర భావ రత్నములకు గనులై శోభిల్లుచున్నవి. ఆహ్వానములోని ఖండకృతుల వస్తు వివ రణము కావించు సందర్భములో అందందు భావమును గూర్చి తడవి యుంటిని. అట్టి భావసౌందర్యము నొకింత విస్తరించి వ్రాయుదును

ఆచార్యులవారు భావదీప్తికి మనోజ్ఞాలంకారము లనేకములను సముచితముగా సరసముగా సమకూర్చినారు. అందు ప్రధానముగా ప్రయోగించినవి రూపకము, ఉపమ. ఈ రెండిటిలోను బహుళముగా మెఱసిన భావదీపకమగు రూపకమును మచ్చునకీ దిగువ పంక్తులలో తిలకింపవచ్చును.

ప్రథమ కవిత 'విజయగీతి'లో ప్రధానముగా రూపకము కలదు.

"గంగా మహానదీ గౌతమీ కృష్ణాది రంగత్తరంగిణీ రమ్యామృతస్తనీ
శాంత్యహింసాసత్య శస్త్రాస్త్ర ధారిణీ....
నీకు మువ్వంకలును నిలిచి రత్నాకరుడు
వెలినురుగు తరగలను వింజామరల వీచు"

ఇత్యాదిగా మంజుల రూపకములు దర్శనమిచ్చుచున్నవి.

"అనృతమాడని జిహ్వయను తులసిదళముతో
శాంత్యహింసాన్విత స్వాంత పుష్పమ్ముతో"—ప్రార్థనకు వచ్చె- పుట 17
"అవివేకమను దున్న నధిరోహణ మొనర్చి"— ఎంత శనివేళ- పుట 18
"పండబారిన మేను భరతదేశమ్మోయి
ఖాది దుప్పటి దాన గంగానదమ్మోయి
తెల్లనై లోకాల నెల్ల నున్నతి గనిన
చల్లనగు నీదు తలపెల్లి హిమనగమోయి"— అమరుడవు- పుట 26.

ఈ గేయమున నిట్లే సాగిన రూపకము సావయవమై మహాత్మునిలో పవిత్ర భారత భూమిని సాక్షాత్కరింపజేయుచున్నది. ఈ కవితలోని తర్వాతి పంక్తులలో "పరశాంతగుణము నీ వజ్రాయుధంబోయి, మత సమైక్యతయె నీ మహనీయ మతమోయి" ఇత్యాదిగా గాంధిగారి మహోదాత్త గుణగణములను రూపించి వర్ణించుట జరిగినది.

బాపూజి అస్థికలను వర్ణించుచు చేసిన రూపక మా మహాత్ముని యెడ దేశమునకు గల భక్తితాత్పర్యములను విశదము చేయును.

"అదిగో బాపూజి యస్థికలు, యమునదరి
నలరు మందార కుసుమములు

నెహ్రూ పండితుడు కన్నీట దడుపుచు నెంతొ
పూజ్యభావముతోడ ప్రోది చేసిన పూలు
భరతదేశపు నదుల పావనము గావింప
మహిమాన్వితములైన మంత్రపూతాక్షతలు''– మందార కుసుమములు,
పుట-27.

ఇత్యాదిగా రూపకము సాగినది. మరియు,

"నిడుదమై గూటిలో వెడద వక్షము ప్రమిద
వెన్నపూసగ గుండె వెలిగించు విశ్వమును"-మానవుడుగా వచ్చిన మాధవుడే-పుట 30.

"అక్షరాక్షర మొక్క యశ్రుబిందువు గాగ
కన్నీటి కాల్వలై 'కాలముల్' ప్రవహింప
అఖిల వాఙ్మయము శోకాబ్ధియై యుప్పొంగి
ప్రళయమున ముంచినది బ్రహ్మాండ భాండమున"-వార్తాపత్రికల శోకము-పుట 33.

"ఆ యమాయిక దృష్టు లైంద్రజాలము చేయు
ఖదరు దారాల లోకాలకే వలవేయు
అతని వాక్సుధలు ద్వేషానలమునకు వృష్టి
ఘనకరస్పర్శ తిరుగని మరుగుమందోయి."-శత్రువునకును మిత్రుడు-పుట 41.

అను మనోజ్ఞరూపక పరంపరా ప్రయోగముతో గాంధిజీవిత వైశిష్ట్యమును కనుల గట్టించినారు.

'రైతురాజు' లోని దిగువ రూపకములు హృదయంగమములు. ఇందలి మొదటి గేయములో రైతురాజు నాహ్వానించుచు వర్ణించిన విషయము రైతురాజుకు 'రవిశశులు నిత్యనీరాజనములీయ, పవనుడు వింజామరము వేయ, నవమోహనము లౌ నాగేటి వృషభములు నందీశ్వరులుగాగ నటరాజమూర్తివై' రమ్మని రూపకము చేసిన తీరు కడుంగడు రమ్యమైనది. ఇట్లే వర్షాగేయము నందును, నాటువేయు

గేయమునందును రమ్యరూపకములు రాజిల్లుచు గ్రామసీమల రామణీయకమునకు దర్పణము పట్టుచున్నవి. ఇతర కవితలలోని ప్రసన్నని రూపకముల కొన్నిటి నుదాహరింతును.

"శ్రమజలకణ ముక్తామణి సంశోభితఫాలా!
సుమహిత నిజ కష్టార్జిత సుధాపానలోలా!"—పంచశీల—పుట 69.
ఇట్లే యీ గేయములో తరచుగా రూపకము కలదు.
"ఆ బీద మేఘాం అక్షిగర్భాలలో
ఆశ్రువులె యుండుననుకొనకు ఓ రాజ! అవి నన్ను కదలించవనకు-ఓ రాజ!"-పుట 108
"ఆర్జించిన మా నెత్తురు మీ జఠరాగ్ని హవిస్సగుటెన్నాళ్లు?"—ఎన్నాళ్లు-పుట 101.
ఇట్లే ఈ కవితలో అనేక రూపకములు కలవు.

రూపకము తర్వాత పేర్కొనదగినది ఉపమ. ఆచార్యులవారి ఉపమా ప్రయోగచాతురి మణిమాలలో వివరించి యుంటిని. అట్టి చాతుర్య మీ సంపుటి యందలి కవితలలోను నాహ్లాదకరమై విరాజిల్లుచున్నది. మచ్చునకు కొన్ని యుటంకింతును.

"నీ పూత రక్తాన నిఖిలాఘములు మావి
కడగి వైచితివేమొ గంగాజలము వోలె"—బాపూజి స్మృతి గేయమాల—పుట-13.
"చేజిక్కు రత్నమును సింధువున విసరితిమి
కోతివలె ముత్యమును గొరికి పడవేసితిమి—" ,, ,,—పుట16.
"ఖాది దుప్పటి ధవళకాంతు లీనగ మేన
రజతాద్రి నడయాడు భుజగభూషణు భాతి"— ,, ,,—పుట 17
"వెదురు చెట్టున బుట్టు విత్తన మ్మట్టు లీ
ఖలుడు భారతమాత గర్భమ్ము చెడ బుట్టె''— ,, ,,—పుట19
''వంచి విడిచిన కొమ్మ వడి మీది కెగురు నటు

కొట్టివేసిన తరువు కొమ్మల చిగుర్చునటు
నేలగొట్టిన బంతి నింగి కెగయు విధాన
అణచిన కొలది గాంధి యాశయము లెదుగునవి." ,, ,,పుట 31

''ఆరవేసిన చీరలవోలె తూరుపు గట్టున ఆవులు తోచె
నడచే నల్లని గండశిలలవలె పడమటి గట్టున గేదెలు మేసె''-రైతురాజు-వర్షావర్ణన,

"నిండు గర్భవతివోలె బండివచ్చెనండి''–రైతురాజు-ధాన్యపుబండి వర్ణన.
"వెలుగునీడల వోలె వెనుకముందులు నడచు
నిందాస్తుతుల కొక్క వందనమ్మొనరింతు''–మనవి-
రూపకోపమల పిమ్మట గణ్యమై సరసశ్లేషలు రంజింపజేయుచున్నవి.
"అంబరము చాటుగా నలరు మోమొకనాడు
చిరునవ్వు జిలికించి నెలవంకను. లిఖించె." - విరహాబ్ధి

"ముక్కోటిన్నర తెలుగుల ముక్కోటిన్నర వెలుగుల
అదిగో! మన ప్రకాశఖని, అదిగో! మన సంజీవని" - అపూర్వ దీపావళి.
ఇచట ప్రకాశఖని యన ప్రకాశంపంతులుగారు, సంజీవని యన సంజీవరెడ్డిగారు అను నర్థాంతరములు భాసిల్లుచున్నవి.

"అదిగో! నవాంబరము, అతిలోక సుందరము" - నవంబరు 1 వ తేది.
''దక్క నిమ్మహి నిజామున కన్నను
దక్కుదు ననుకొనుటెన్నాళ్ళు" - ఎన్నాళ్ళు
''.... ఇట్టివానిం జిన్నపనియని యెంతు రార్యఘనుల్
గురువనితలను జెరచుచో పెరకొంపలను దోపించుచో
ఆ దురితకుల పక్షపాతమ్మేతుది క్షయం బిచ్చు." - సూర్యచక్రము -
చంద్రరేఖ.

ఇక్కడ జిన్నయన అప్పటి పాకిస్తాను అధ్యక్షుడగు మహమ్మద్ అలి జిన్నయని యర్థాంతరము. ధ్వజరీత్యా పాకిస్తానుకు ప్రతీకమైన చంద్రుడు గురు భార్యను చెఱచుటయు, పెరకొంపలనగా లక్ష్మీసద్మములగు పద్మముల శ్రీని

హరించుటయు ప్రసిద్ధములు. ఈ పాపకృత్యములచేతనే చంద్రుడు క్షయమందెను. పాకిస్తాను పక్షపాతబుద్ధితో హిందూస్త్రీలను చెఱపట్టుట, వారి గృహములను దోచుటవంటి ఘోరకర్మములు చేసెను. తదీయదురిత ఫలముగా కాలక్రమమున కవిగారూహించినట్లే బంగ్లాదేశ్ వేరగుటచేత క్షయించిపోయెను. ఈ విషయములను శ్లేషించి చెప్పిన ఆచార్యులవారి ప్రజ్ఞ స్తవనీయము.

ఇందలి కవితలలో రమ్యోత్ప్రేక్షలును సాక్షాత్కరించుచుండును.

"పాలబోల్ ఖాదిలో తేలాడు నీమేను
క్షీరాబ్ధిలో హరికి శేషశయ్యగ జనెనొ" – గాంధి స్మృతిగేయమాల.
"వసుధాదేవిని వరించి దేవుడు, పసిడియక్షతలె పారజల్లెనో" - రైతురాజు

"అతడు నడయాడు గ్రంథాలయంబొ, మూర్తి
గొనిన విజ్ఞాన సర్వస్వ ఖనియొ కాని...." – ప్రతాప ప్రశంస.

ఇత్యాద్యుత్ప్రేక్ష లందందు కవితాంగన నలంకరించినవి.

ఇంకను కవితలలో అర్థాంతరన్యాసము, భ్రాంతిమంతము, ఉల్లేఖము, స్వభావోక్తి, లోకోక్తివంటి అర్థాలంకారములు కైసేయబడి రసికజన మనోరంజనము కావించుచున్నవి. ఇక శబ్దాలంకారములలో కావ్యరంగమున బహుభంగుల నర్తనము చేసినది అంత్యానుప్రాసము.

ప్రప్రథమ 'విజయగీతి'లో కొన్ని పాదములందు, 'రైతురాజు' లో కొన్ని గేయములందు మోసము, ధనము, కోకిలా!, పంచశీల, బుద్ధగీతి, అపూర్వ దీపావళి, నవంబరు 1 వ తేది, గ్రామోద్ధరణము, సమగతి, భాగవతము-అను గేయములలో సర్వత్ర ఈ అంత్యానుప్రాసము ప్రయుక్తమై యందములు చిందించుచున్నది. 'ప్రతాప ప్రశంస' లోని

"జయజయ ప్రతాపరెడ్డీ! వ్యయమెఱుగని వాణికొంగు బంగరు కడ్డీ!
జయ తెలుగువేల్పు గిడ్డీ! నయగుణ నతిగొనుము నీ ఋణమునకు వడ్డీ"

వంటి యొక కొన్ని పద్యములందును నీ యంత్యానుప్రాసము కలదు.

శబ్దాలంకారములలో ప్రసిద్ధ గమకముగల యమకమును మణిమాలలో పుష్కలముగా సాగించిన ఆచార్యులవారీ కవితలలో ఏలొకో ప్రయోగించలేదు.

అర్థ సౌందర్యదృష్టి కరముగ నిరవుకొన్న కవిగారికి పైపై తేజుల యమకము మీది మోజు తగ్గినదని భావింపవచ్చును. ఎక్కడనో యొందు రెండు చోట్ల నామమాత్రమునకివి కన్పడును.

"పంచమత్వము జార్జి పంచమత్వము గూడ

ఆ కోమటికర మ్మొకింతె విలువకు తూచె" గాంధి స్మృతిగేయమాల.

"మాకందమ్ముల నుందువు మా కందమ్ముల కగపడవు"—కోకిలా!

తక్కిన శబ్దాలంకారములిందు ప్రయోగింపబడలేదు. దీనికి హేతువు పైన పేర్కొన్న అర్థదృష్టియే.

## శైలీ రమ్యత :

ఇందలి శైలి నితాంత మృదుమధుర పదప్రయోగములతో మనోహరమై ప్రసాద మాధుర్య సౌకుమార్యాది గుణశోభితమై యొప్పారు చున్నది. ఆచార్యుల వారి శైలి మణిమాలలోను ఆహ్వానములోను ఒకే రీతిగా లేక మొదటి దానిలో కంటె రెండవ దానిలో నెంతో పరిణతి చెందినది. మణిమాలా శైలి వానకాలపు టేరుల వెల్లువలవలె పెల్లుగా ప్రవహించినది. ఆహ్వాన శైలి శరత్కాలనదీ జలములవలె నిర్మలమై ప్రసన్నముగా జాలువారినది. మణిమాలా రచనానంతరము నిత్యాభ్యాస క్రమమున నిందలి కవితలు వ్రాయుటయే కాక రెండు గ్రంథముల మధ్యకాలమగు పన్నెండు సంవత్సరాల సుదీర్ఘ కాలములో నిష్ఠాగరిష్ఠులై తప మాచరించినట్లు పోతన చరిత్రము విరచించి యుండిరి. వేలకొలది పద్యముల రచనలో వారి కవితా శైలి కడుంగడు జిగిబిగి సంతరించుకొన్నది.

మణిమాలలో తఱచుగా అచ్చికమై యొప్పిన భాష ఆహ్వానములో సంస్కృతాంధ్ర పద సమప్రయోగముతో నాగరికమై నిగారముల నింపు నింపుచున్నది. ఆచార్యులవారి కవితాభామిని మణిమాల నలంకరించు కొన్నప్పుడు ముగ్ధయై ముద్దులు గులికి క్రమముగా నిందు ప్రౌఢయై విలాసవతియై రసజ్ఞుల నలరింప నాహ్వానము చేయుచున్నది.

ఇందలి భాష నుడికారపు సొంపుతో జాతీయముల సొబగుతో భావదీప్తి హేతువై భాసిల్లినది. మచ్చునకు కొన్ని పదబంధముల నుటంకింతును.

ఉర్వియంతయు వడకి యుయ్యాల లూగినది — గాంధి స్మృతి గేయమాల
భారతదేశపు గుండె బ్రద్దలై పోయినది — ,,
చెవుల పిడుగులు రాల్చి చీల్చెనెద నీ వార్త — ,,
గుండెలోపల పెద్ద గుండుబడినట్లయ్యె — ,,
మాకిపుడు తల నేల బడె — ,,
గోముఖ వ్యాఘ్రమై క్రూరుడా హంతకుడు — ,,
జనము ఆసుబోయగసాగె నా బిర్ల భవన్‌దరి — ,,
పంగనామములు గురువునకిడి యిక భళాభళియను టెన్నాళ్లు? — ఎన్నాళ్లు?
మహాత్మ్మ హత్యచే కదలిన పుండు గుండియల
కారము జల్లెను నీ వియోగముల్. — వల్లభభాయి స్మృతి.

## భాషా విశేషములు :

ఇందలి కవితలలో కొన్నిట నన్యదేశ్యములు ప్రయుక్తములై యున్నవి. అవి అత్యవసరమై ఔచితీ భాసురమై యొదిగిపోయినవే కాని యదుకు పెట్టినట్లు లేవు.

ఆటం హైడ్రోజను బాంబులుగా, ప్రైజుల నిచ్చే విటుగని, పైజామా, ఐజన్లు, మక్కారీ చేష్టలు, షొయిబు రక్తాక్షరాలు కియామతున జవాబడుగు, నిజాము సర్కారాలా, హజరత్ ఓ సాహెబయా, పక్కీరు, బురఖా, దక్కను, పాక్ + అనెదు, తేడా—అనునవి యన్యదేశ్యములు. ఇందులో ఆటం హైడ్రోజను బాంబులు, ప్రైజులు, ఐజన్లు అనునవి ఆంగ్ల పదములు కాగా తక్కినవెల్ల ఉరుదూ పదములు. ఈ ఉరుదూ పదములు దాదాపు 'రాజ ప్రముఖుడు నైజాము' కవితలోనివే. ముస్లిం నవాబు గూర్చి వ్రాసిన యీ కవితలో నగత్యముగా నివి ప్రయోగింపవలసి వచ్చినవి. మరియు నివి సముచితములై స్వాభావికములై యున్నవి. తక్కిన కవితలలోని కతిపయాన్యదేశ్యములును నిట్లే సమంజసములై యున్నవి.

సంపుటిలోని గేయములలో కొన్నిట వ్యావహారిక భాష కొంత ప్రయుక్తమై యున్నది. అంతా సమము, మింటికేయ్యా, ఉరికే వాగులు, వచ్చేది, ఆపిండొ (ఆపినాడొ), పిలిచినట్లైతె, తోటకెళ్ళితిని, సిగ్గొచ్చి, నవ్వుల్లో, కాపోరిపడుచా, గాజుల్లూ, ఆడిస్తాం ఇత్యాదులు శిష్టవ్యావహారికములై గేయములకు సహజత, సౌందర్యము నాపాదించినవి. ఇట్టి పదప్రయోగము నవ్యకవితానురూపమై యొప్పారుచున్నది.

## ఛందో విశేషములు :

ఇది ప్రధానముగా గేయకావ్య సంపుటి. ఇందులో క్షేత్రయ్య, కాశోజీకవి, వల్లభభాయి స్మృతి, ప్రతాప ప్రశంస- యను నాలుగు పద్య కవితలు. తక్కిన వెల్ల గేయకవితలే. ఈ మొత్తము గేయములలో మనవి, ఎన్నాళ్ళు?, సూర్య చక్రము-చంద్రరేఖ, సమగతి, భాగవతము- అను నైదు గేయకవితలు తప్ప తక్కినవన్నియు పల్లవిగల గీతములై పాడుకొనుట కనువుగా రచింపబడినవి. ఎన్నాళ్లు? అను కవితలో ప్రతి నాలుగు పాదములకు మకుటము వలె ఎన్నాళ్ళు? అను పదము ప్రయుక్తమై యున్నది.

ఇందలి గేయముల ఛందస్సు వైవిధ్య విలసితమై యున్నది. వివిధ గతులలో రచింపబడిన యీ గేయములలో ఎక్కువగా వాడుక చేసినది ద్విరదగతి రగడకు చెందిన ఖండగతి. విజయగీతి, గాంధిస్మృతి గీతములు మొత్తము, రైతురాజులో తొలిగీతము, వానదేవుని ప్రార్థించిన గీతము మొదలగునవి, తదితర గేయములు విరహాబ్ధి, మనవి మున్నగునవి మొత్తము 48 గేయములు ఖండ గతిలో సాగినవి. ఆచార్యులవారికి ఖండగతి యెక్కువ యిష్టమన్న విషయము మణిమాలలో గమనించితిమి. ఖండగతి తర్వాత పేర్కొనదగినది హయప్రచార రగడకు చెందిన త్రిశగతి. ఈ గతిలో 'రైతురాజు'లో దున్నుటకు ప్రోత్సహించిన గీతము, నాట్లువేయు కలుపుతీయు గీతాలు మొదలగునవి, మోసము, కోకిలా!, పంచశీల, అపూర్వ దీపావళి మున్నగు గేయముల మొత్తము 13 సాగినవి. ఇక మధురగతి రగడకు చెందిన చతురశ్రగతిలో రైతురాజు గేయములలో వర్షాగీతము, లచ్చిపాట మొదలగునవి, ఇతరములైన ధనము, బుద్ధగీతి మున్నగునవి మొత్తము పది గేయములు కలవు. మరియు సూర్యచక్రము- చంద్రరేఖ, సమగతి యను రెండు కవితలు మాత్రము హరిణగతిరగడకు చెందిన మిశ్రగతి గేయములు. ఈ రెండిటిలో 'సమగతి' ఉరుదూ సారస్వతములోని 'కవ్వాలీ' మాదిరిలో సాగినది. ఈ రీతిగా వివిధ గతులలో సాగిన గేయములు విశిష్ట రచనతో విలసిల్లి ఆచార్యుల వారి గేయరచనా చణత్వమును వెల్లడి చేయుచున్నవి.

## స్ఖాలిత్యములు :

సలక్షణమై నిర్దుష్టమై శోభిల్లు ఈ గ్రంథమున నొకకొన్ని స్ఖాలిత్యములు దొరలినవి. ఇవి కొన్ని వ్యాకరణమునకు కొన్ని ఛందస్సునకు చెందినవి.

## వ్యాకరణ సంబంధి స్ఖాలిత్యములు :

1. 'బ్రతికి నవ్వింం చాత్మబంధువుం డగువాడు'- గాంధి స్మృతి గీతములు- పుట 10, ఇచట సంధిదోషమైనది.
   "ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమ మగును."[1] అను సూత్రానుసారముగా,
   ''బ్రతికి నవ్వించు నాత్మబంధువుండగువాడు'' అని నుగాగమముతో నుండవలెను.
2. "మరల జీవించెచటి మరణమనియెదు రారు.'' గాంధిస్మృతి గీతములు- పుట 22.
3. ''కోతి దిగక యుండెన్నాళ్ళు?- ఎన్నాళ్ళు?- పుట 114.
   పై రెండు వాక్యములందు నువర్ణమురాక దోషమైనది.
   "లిఙ్లాట్టుల డుఙ్జనకె నును వర్ణంబులగు"[2] అను సూత్రము ననుసరించి పై రెండిటిలో క్రమముగా 'జీవించునెచటి', 'దిగకయుండు నెన్నాళ్ళు?' అని నువర్ణము చేరిన రూపము లేర్పడును. ఈ 1, 2, 3 ఉదాహరణము లలో నుగాగమ రహితముగా సంధిచేసిన ప్రయోగములు మణిమాలలోను కానబడును. ఆచార్యుల వారికీ సంధి అలవాటువలె సాగినది.
4. ''నినుగాంచుటన్ మాదు కనతల్లి యగు భరత....''- గాంధి స్మృతి గీతములు -పుట 28.
5. "రైతే దేశమునకు కనతల్లి"- గ్రామోద్ధరణము- పుట 105.

ఈ రెండు వాక్యములలో 'కనతల్లి' యని ప్రయోగింపబడినది. మణిమా లలో 'కాపు ఋణము' కవితలో నిట్లే ప్రయుక్తమైనది. దీనిని మణిమాలా వ్యాసము- వ్యాకరణ స్ఖాలిత్యములలో పేర్కొని యుంటిని. 'కనతల్లి'సరియైనది కాదు. 'కన్నతల్లి' యని యుండవలెను. ఐనను కవిగారికి పదమిట్లే వాడుట పరిపాటియైనది.

---

1. బాలవ్యాకరణము: సంధి, 33.
2. ,, : క్రియా, 16.

దిగువ వాక్యములలో కొన్ని అసాధుపదములు దొరలినవి. ఇవి కేవలము ప్రామాదికములు.

6 "ఉపకరించు నటంచు నుదహారింపనిపైతె"—గాంధి స్మృతి గీతములు. పు. 13.

7. "ఆ యమాయికదృష్టులై ఇంద్రజాలము చేయు"— ,,

8. "సిగలోని మలె మొగ్గ"—రైతురాజు-పు. 58.

9. "స్వాతంత్ర్య భవనంపు సంకువైచె"—వల్లభభాయి స్మృతి-పు. 125.

పై వాక్యములలో ముద్దయక్షరములుంచిన పదము లసాధువులు. వానికి క్రమముగా ఉదాహరింప, ఇంద్రజాలము, మల్లె మొగ్గ, శంకువు వైచె - అనునవి సాధువులు.

## ఛందస్సంబంధి స్ఖాలిత్యములు :

### క. గణభంగములు :

గేయములలో రెండుచోట్ల మాత్రము గణభంగము జరిగినది.

1. "ఆసేతుశీతనగ హాటకావనీ
చత్వారింశత్కోటి జయఘంటికాధ్వనీ" (ఖండగతి) విజయగీతి-పు. 5.

2. "చేలాంచలాపకర్షణ, శీలాయితలీలాం" (త్రిశ్రగతి) — పతాక వందనం - పు. 80.

ఇందు మొదటి గేయములోని మొదటి పాదము చివర అచ్చు పడలేదు. 'హాటకావని జనని' యని తర్వాతి 'జయధ్వజం' సంపుటిలో అచ్చయి నది.

### చ. యతిభంగములు :

దిగువ తెలిపిన కొన్నిచోట్ల యతి భంగము జరిగినది.

1. "జీవమణులై సూర్య శశి తారకలు పూచు"—విజయగీతి-పు. 6.

2. "చేతియందున్నట్టి జవసత్త్వములె యుడిగె"— గాంధి స్మృతి గీతములు-పు. 8.

3. "చందన చితాపీఠి సింహాసనముగాగ"— గాంధి స్మృతి గేయములు— పు. 25.

4. "జనములను ముగ్ధులను జేయు బోధలగాంచి" గాంధి స్మృతి గీతములు—పు. 43.

ఈ నాలుగు పాదములలోని యతిభంగములను పరిశీలించినచో నొకవిశేషము గోచరించును. నాలుగు యతిభంగములును నొకేవిధమైనవి. యతిమైత్రిలో హల్ మైత్రికుదిరి వానిపైగల అచ్మైత్రి కుదురక యతిభంగమైనవి. ఇట్టివి పూర్వ కావ్యములందును సకృత్తుగా గన్పడును. శ్రీమదాంధ్ర భాగవతముతో నిట్టివి కొన్ని దొరలినవి.

"జాలముల నుండి ముత్యాల శాసలొలుక"[1]
"చరణంబులు నీ పదాబ్జ శావానిరతుల్"[2] మొదలైనవి

ఈ రెండు పద్య పాదములలో యతిస్థానమున 'శాస' 'శావ' పదములు క్రమముగా సేస, సేవ యను గ్రాంథిక పదములకు వ్యావహారిక రూపములు. ఈ వ్యావహారిక రూపములతో యతి కుదిరినది. లేనిచో యతిభంగము కావలసినదే. కాగా పరిష్కర్తలు వ్యావహారిక పదములను తొలగించుటకు 'సీమ లందుండి ముత్యాల సేస లొలుక' యనియు, 'చరణంబులు నీ పదాబ్జ సంస్మరణంబుల్' అనియు దిద్దినట్లు పండిత పరిశోధకులు నిర్ణయించిరి.[3] మరియు ఈ పరిశోధకులే "ఈ ఛందో దోషము లన్నియు ప్రమాదమూలకములు మహాకవులకును ప్రమాద ముండును."[4] అనియు తెలిపిరి.

పై వివరము ననుసరించి ఆహ్వాన కవితలలోని పైనాలుగు యతిభంగములు ప్రామాదికములని భావింపదగినవేకాక యివి కొంత కొంత వాడుకలో నున్నవని తోచుచున్నది. కొన్ని గ్రాంథిక పదములు ముఖ్యముగా చే, చా, జే, జా. శ, స-

1. శ్రీమహాభాగవతము : 10 ఉ. 667.
2. ,, : 11-15
3. ,, : పీఠిక-పుట 158. (సాహిత్య అకాడమి ప్రచురణము)
4. ,, : ,, ,, ,,

అను నక్షరములతో మొదలగు పదముల తొలివర్ణము మీది అ, ఆ లు ఎ, ఏ లుగా వ్యావహారికములో మార్పు చెందుట గమనింతుము. చందురుడు-చెందురుడు, శంక రుడు-శెంకరుడు ఇత్యాదులు. అటే కొన్ని పదములమీద తొలి ఎ, ఏలు అ, ఆలుగా వ్యావహారికమున మార్పు చెందుచుండును. సెలవు-శలవు, సేవ-శావ, చేత-చాత మొదలగునవి. లోక వ్యవహారమునగల యీ పదముల రూపముల ధోరణిలో బడి ఆచార్యులవారు పూర్వకవులు కొందరివలె యతిస్థానమున ప్రయోగించినారు. దీని ననుసరించి పై యతి భంగములలో

'జీవమణులై సూర్య శశితారకలు' అన్న దానిని 'జీవమణులై సూర్య శెశి తారకలు' అనియు 'చేతియందున్నట్టి జవసత్త్వములు' అన్న దానిని 'చేతి యందున్నట్టి జెవసత్త్వములు' అనియు మార్చిన యతి సరిపోవును. తక్కిన యతి భంగము లిట్లే మార్చవచ్చును. ఇంతకు నివి సాధువులని కాదు నా యభిప్రాయము. నిత్య వ్యవహారములో నున్న యీ రూపములు ప్రమాదవశమున కవితలలో దొరలి నవని చెప్పుటయే నా యుద్దేశము.

మణిమాలను, ఆహ్వానమును పోల్చిచూచినచో ఆహ్వానములో స్ఖాలిత్యము లత్యల్పములు. ప్రశస్త శైలితో పాటు ప్రామాణికత యిందలి కవితలలో పెంపు గాంచి యింపు గొలుపు చున్నది.

## విశిష్టత :

ఆహ్వానము యొక్క విశిష్టతను వస్తు వివరణములో కొంత కొంత తెలిపి యుంటిని. ఆచార్యులవారి యీ సంపుటి ప్రకటన ప్రధానోద్దేశము గాంధి స్మృతి గేయములను వెలువరించుటయే యని వ్రాసితిని. గ్రంథ ప్రశస్తి వస్తు వరణము వల్లను, భావ సంపద వల్లను, రచనారీతి వల్లను వెల్లడి యగును.

ఇందలి వస్తువులు మిక్కిలి ప్రశస్తములైనవి. అందు ప్రధానమైన గాంధి మహాత్మునిపై గేయములు సాహితీ లోకమున విశిష్ట స్థానము నలంకరించును. జాతిపిత, స్వాతంత్ర్య ప్రదాత, విశ్వవిఖ్యాత మహాపురుషుడగు మహాత్ముని జీవి తము సర్వాదర్శమైనది. ఆయన దివ్య బోధలు సకల శిరోధార్యములు. అట్టి మహనీయుని నిర్యాణ సందర్భమున స్మృతి గేయములు రచించి యతని మహో

దాత్త గుణకర్మ స్వభావములను, మహిత వ్యక్తిత్వమును మనోజ్ఞముగా వర్ణించిన మాననీయ గ్రంథ మీ ఆహ్వానము. గాంధేయ దృక్పథము వెలార్చు ననేక దేశ భక్తి కవిత లిందు పొందుపరచబడి జాతీయతను, దేశభక్తిని, ఉత్తమ సామాజిక చింతను, ఉత్కృష్ట వ్యక్తి శీలమును ప్రబోధించుచున్నవి. ఇందలి 'ఆహ్వానము' గీతము విశ్వగీతమై సత్య తపోధనులు, శాంతి ప్రియ జనులు, సకలలోక కల్యాణము జపించు మునులగు సర్వ ప్రపంచ వాసులకు 'వసుధైక కుటుంబముగా వసియింతము రండోయి' యని ఆహ్వానించుచున్నది. ఇందలి 'రైతు రాజు' గేయనాటిక నవనాగరికతకు, పట్టణ వాసమునకు, యాంత్రిక జీవనమునకు అలవడిన జనులను పాడి పంటలచేత, ప్రకృతి రామణీయకము చేత తుష్టిగా సాగు ప్రశాంత పల్లీ జీవనము వైపాకర్షించు చున్నది.

ఇందలి భావములును మహోన్నతములై గంభీరములై మనోరంజకములై యుపదేశకములై యొప్పారుచున్నవి. ఈ కవితలలోని రచనా నిర్వహణము, శైలీ ఛందములును సహృదయహృదయావర్జకములై తన రారుచున్నవి. ఈ రీతిగా వస్తు భావరచనలలో విశిష్టమైన ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయుచు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు,

"....వీరు తమ జీవితములో అధిక భాగమందు పల్లెటూళ్ళలో ప్రకృతి మాత యొడిలో ఉపలాలితులైనారు; అడు గడుగున జాతీయ భావాలచే ఉత్తేజితులైనారు. వీని యన్నింటి ప్రభావము ఆచార్యులవారి రచనలలో కనుపించుచున్నది. విశేషించి యీ గ్రంథములోని రచనల యందు సమకాలిక సమాజ విమర్శనము ప్రతి పదము నందును ప్రతిబింబిత మగుచున్నది....ఇందలి (రైతురాజు లోని) భావము, శైలి ఆచార్యుల వారి ప్రత్యేకతకు నిదర్శనము.... తెలంగాణ కవులలో అగ్రగణ్యులైన ఆచార్యుల వారికి సకలాంధ్ర కవులలో సమున్నత స్థానము కలదు. ఈ ఖండ కావ్య సంపుటికి హృదయ పూర్వకమైన సుస్వాగతము." అని కొనియాడినారు.

# జయధ్వజం

'జయధ్వజం' వరదాచార్యులవారి తృతీయ ఖండకావ్య సంపుటి. ఇది జాతీయ గీతముల సంకలనము. ఈ సంపుటిలో మొత్తము దేశభక్తి కవితలు కలవు. దేశభక్తికి మూలమైన జాతీయ భావములచేత ప్రేరితులై కవిగారి గీతములు రచించిరి, ఇవి యన్నియు అచ్చమైన జాతీయ కవితలు. వరదాచార్యుల వారసలు సిసలు జాతీయ కవులు. అందువల్లనే యింతటి మహోదాత్తమైన జాతీయ కవితలను రచింపగలిగిరి. 1965 లో పాకిస్తాను భారతదేశాంతర్గతమగు కాశ్మీరుపై దురాక్రమణ చేసిన సందర్భమున కవిగారి హృదయములో నుప్పొంగిన దేశభక్తి, జాతీయత యీ కవితలుగా జాల్వారినవి.

## జాతీయ కవి లక్షణము :

జాతీయ కవితలను గురించి చర్చించుటకు ముందు జాతీయ కవి యన నెట్టివాడో యించుక వ్రాయుదును. జాతీయ కవి సర్వ భారతదేశముపై దృష్టి కలిగియుండును. దేశ నైసర్గిక స్వరూపాంగములైన సమస్త ప్రాంతములను నదీనదములను గిరులను క్షేత్రాదుల నన్నిటిని ప్రాణప్రదముగ ప్రేమించి వర్ణించును. భారతీయాత్మ యగు పరమ విశిష్ట సంస్కృతిని త్రికరణ శుద్ధిగా అనుష్ఠించుచు కొనియాడును. దేహమునందలి యే యవయవమునకు దెబ్బ తగిలినను దేహికే నష్టమని తలంచునట్లు దేశమునందే ప్రాంతము కష్టనష్టములకు గురియైనను తాను పరితపించుచు తదీయ నివారణకు కృషి చేయుచు తత్ప్రబోధము దేశసోదరులకు కావించును. దేశములోని వివిధ ప్రాంతముల కులముల మతముల భాషల వర్గముల జనులందరు జన్మమిచ్చిన భారతమాత పుత్రులే యనియు అందరు సహోదరులే యనియు భావించి వారి సుఖదుఃఖములలో సమానముగా పాలుపంచుకొనుచు నిట్టి జాతీయ భావములను తన దివ్య కవితల ద్వారా భవ్యముగా నుద్బోధ కావించును. అతనికి దేశములోని సర్వభాషలును, తదీయ కవులు పండితులు కళాకారులు నాయకులును ఆత్మీయులే. అతనికి దేశ మాతృ సంకీర్తనము కంటె పరమార్థము వేరొకటి యుండదు. ఇట్టి విశిష్ట

విశాల జాతీయ భావములు గల జాతీయ కవి నిజముగా సుకవి, సుకృతి. ప్రపంచములో శాశ్వత యశః కౌముదులచేత విలసిల్లిన మహాకవిచంద్రు లందరును నిట్టి జాతీయ కవులే. అట్టి జాతీయ కవులలో నగ్రపీఠి నలంకరింప దగినవారు వరదాచార్యులవారు. డా॥ ముదిగొండ శివప్రసాద్‌గారు 'అభినవ పోతన' సన్మాన సంచికలోని తమ వ్యాసముతో జాతీయ కవిని గూర్చి వ్రాయుచు "ఈనాడు కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకు జ్ఞాతంగానో అజ్ఞాతంగానో ఈ జాతీయ కవితా మార్గమే దృశ్యాదృశ్యంగా అంతర్వాహినిగా ప్రవహిస్తున్నది. ఈ మార్గానికి తెలుగునాట ఎత్తిన ఒక గరుడస్తంభం శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు"[1] అని ఆచార్యులవారిని జాతీయ మహాకవిగా ప్రస్తుతించినారు. ఆచార్యులవారు జాతీయ కవిగా నెట్లు తమ కవితల నుదాత్తముగా వెలార్చిరో మున్ముందు వారి కవితలను చర్చించునపుడు నిరూపింతును.

## 'జయధ్వజం' రచనకాలమునాటి దేశరాజకీయాదిపరిస్థితులు;

1966 లో ప్రచురించిన యీ సంపుటిలోని కవితలు ప్రధానముగా మన దేశముపై పాకిస్తాను కాశ్మీరు దురాక్రమణార్థము దండయాత్ర చేసినప్పటి విషయములకు సంబంధించినవి. పాకిస్తాను దండయాత్ర 1965 సెప్టెంబరులో జరిగినది. 1965 కు ముందు భారతదేశము సాధించిన యుద్ధ విజయములు మరి కొన్ని సంఘటనలను గూర్చిన కవితలును కొన్ని యిందు చేర్చబడినవి. కనుక స్థూలముగా 1961 నుండి 1965 వరకు ఐదు సంవత్సరముల కాలములో రచింపబడిన కవితలు కావున ఆ కాలము నందలి రాజకీయాది స్థితిగతులను సంగ్రహముగా ప్రస్తావింతును.

స్వతంత్ర భారతదేశము నెహ్రూగారి నాయకత్వమున అనేక రంగము లలో గణనీయ ప్రగతి సాధించుచుండ పదునాలుగు సంవత్సరములు గడచెను. దేశనాయకుల ప్రజల పోరాటము ఫలితముగా 1947లో బ్రిటిషు పరిపాలన అంతమై సంపూర్ణ స్వాతంత్ర్యము లభించినప్పటికిని గోవా పోర్చుగీసువారి యధీనములోనే యుండెను. 15:0 లో మొట్టమొదట పోర్చుగీసు వారాక్రమించు కొన్న ప్రదేశము గోవా ఇది మహారాష్ట్రములో గోవా, డయ్యు, డామన్ అను

1. అభినవపోతన: 'జాతీయయుగాని కెత్తిన జయధ్వజం' (వ్యాసము) పుట 60,61

మూడు విడివిడి ప్రదేశములతో కూడుకొనియున్నది. గోవాలో పోర్చుగీసువారి దురంతములు పెచ్చరిల్లి యచటి ప్రజల స్వాతంత్ర్యోద్యమము తీవ్రతరము కాగా భారత ప్రభుత్వము 18వ డిసెంబరు 1961 తెల్లవారుజామున సైన్యమును పంపి ఒక్కరోజులో గోవాను స్వాధీనము చేసికొన్నది. దానితో భారత భూభాగములో ఏ విదేశ ప్రభుత్వము లేకుండపోయి భారత జననీ హృదయము సమాశ్వాసితమై తనరినది. విముక్తమైన మూడు ప్రాంతముల గోవా కేంద్రపాలిత రాష్ట్రముగా నేర్పాటు చేయబడినది.

1962లో దేశమునకు ఘోరవిపత్తు సంభవించినది. మన దేశము విశ్వ శాంతిని కాంక్షించి ప్రచారము చేసిన పంచశీలను కాలరాచి మిత్రద్రోహమునకును వెనుకాడక చైనా నియంతలు పంపిన సేనలు ఉభయదేశముల సరిహద్దునగల మెక్‌మహన్ రేఖను దాటి యకస్మాత్తుగా 1962 సెప్టెంబరు 8 న తూర్పు విభాగపు వాయవ్య ప్రాంతములో భారత భూభాగములోనికి చొచ్చుకొని వచ్చినవి. తర్వాత 1962 అక్టోబరు 20న తూర్పు పశ్చిమ సరిహద్దు విభాగములలో నీఫా, లడక్ ప్రాంతములలో దురాక్రమణ చేసినవి. ఆకస్మికమైన యీ దాడి దేశవాసులను ప్రభుత్వాధినేతలను కలవరపెట్టినది. మన సేనలు వీరోచితముగా పోరాడి చైనా సేనలను ఆక్రమిత భూభాగములనుండి తరిమివేయజాలకున్నను ఇంకను ముందుకు చొచ్చుకొని రాకుండ గట్టిగా ప్రతిఘటించినవి. అంతలో చైనా యుద్ధ విరమణ చేసి కుతంత్రముతో ఆక్రమిత భూభాగములు తనవేయని కావించిన అసంగతమైన ఒడంబడికను మన ప్రభుత్వము తిరస్కరించినది. జాతీయ నిర్మాణ కార్యక్రమములలో నిమగ్నులమై దేశరక్షణ విషయ మశ్రద్ధ చేసినందు వల్లనే చైనా దురాక్రమణ చేయగలిగినది. ఈ దురాక్రమణ కాలమున యావద్భారతీయులు సమైక్యముగా మహోత్తుంగతరంగిత దేశభక్తితో అండగా నిల్చిరి. అప్పటి మన జవానుల ధైర్యశౌర్యములు స్తవనీయములు. చైనా ఆక్రమిత భూభాగ సమస్య యీ నాటికిని అపరిష్కృతముగనే యుండిపోయినది.

భారత ప్రథమ రాష్ట్రపతి, రాజ్యాంగ పరిషదధ్యక్షుడు, ఉత్తమ దేశభక్తుడు, రాజర్షి డా॥ రాజేంద్రప్రసాదు 1963 ఫిబ్రవరి 28న పరమపదించెను. ఆ మహాపురుషుని లోటు తీరునది కాదు. రాజేంద్రుని తర్వాత, ఉపరాష్ట్రపతిగానున్న జగద్విఖ్యాత తత్త్వవేత్త డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ రాష్ట్రపతి పదవి నలంకరించెను.

1964 మే 27న నవభారత నిర్మాత, శాంతిదూత, మన తొలి ప్రధాని జవహర్‌లాల్‌నెహ్రూ దివంగతుడయ్యెను. దేశ మత్యంత క్లిష్టదశలో నున్నప్పుడు సంభవించిన నెహ్రూ నిర్యాణమువల్ల దేశవాసులు మిక్కిలి తల్లడిల్లిపోయిరి. నెహ్రూ అనంతరము 1964 జూన్ 9న లాల్ బహదూర్‌శాస్త్రి ప్రధాని పదవి నలంకరించెను. అనేక సంకట పరిస్థితులలో క్రుమ్మచున్న దేశమును దీక్షాదక్షత లతో రాజనీతి చతురతతో శాస్త్రి పాలించెను. ఆ కాలమున దేశరక్షణ, ప్రజా పోషణ అతి ప్రధాన సమస్యలై వేధించుచుండ ఈ రెండిటి పరిష్కారార్థము శాస్త్రి 'జయ జవాన్ జయ కిసాన్' అను క్రొంగ్రొత్త నినాదము ప్రతిధ్వనింప జేసి సైనికుల వలన రక్షణము, వ్యవసాయము వలన పోషణము నభివృద్ధి చేయించెను.

అంతలో మరొక యుపద్రవము దేశమునకు వచ్చిపడినది, శాస్త్రిగారి కాలముననే పాకిస్తాను మన కాశ్మీరుపై దురాక్రమణ చేసినది. పాకిస్తాను ముస్లిం మత రాజ్యముగా ఆవిర్భవించినప్పటి నుండియు భారతదేశము పట్ల ద్వేషభావ ముతో మెలగుచు కాశ్మీరును కబళించుటకు అపుడపుడు ఘర్షణ చేయుచునే యుండి శాస్త్రిగారి హయాములో కయ్యానికి కాలుద్రవ్వెను. తొలుత 1965 ఏప్రిల్ మే నెలలో రాణ ఆఫ్ కచ్ వద్ద పాకిస్తానుతో కొన్ని ఘర్షణలు జరిగినవి. ఇది చినికి చినికి జడివానకు దారితీయగలదని భావించి పాకిస్తాన్ అధ్యక్షుడు అయూబు ఖానుతో లండనులో ఒక నిర్యుద్ధసంధి చేసికొనుట జరిగినది. కాని సంధి షరతు లమలు చేయక మునుపే పాకిస్తాన్ పెద్దయెత్తున కాశ్మీరులోనికి సైన్యములు పంపి యుద్ధము ప్రారంభించినది. సహజ శాంత స్వభావుడైన శాస్త్రిగారికిది మహాగ్రహ కారణమై భారతభూమి రక్షణకై శత్రువుల దాడిని గట్టిగా త్రిప్పి కొట్టుటకు సేనల కానతిచ్చెను అవి కట్టు విడిచిన మదోన్మత్త గజ యూథములవలె విజృం భించి శత్రుచమూ సమూహముల మీదబడి చావుదెబ్బ కొట్టెను. అవి సాటిలేని శౌర్యము ప్రదర్శించి పోరాడి శత్రు సేనలను ఛిన్నాభిన్నము చేసి తరిమికొట్టి వారి స్థావరములను విమానాశ్రయములను వారి పాటన్ టాంకులను ఘోరముగా ధ్వంసము చేసి కార్గిల్, తిత్వాల్, సయాల్‌కోట, పంజాబు మున్నగు రంగము లలో వందలకొలది చదరపు మైళ్ళు పాకిస్తాను భూభాగముల నాక్రమించెను. ఇట్లు 1965 సెప్టెంబరు 4న ప్రారంభమైన యుద్ధము 22 రోజులు సాగి భద్రతా సంఘాదేశానుసారము సెప్టెంబరు 25న విరమింపబడెను.

పాకిస్తాను విదేశాంగమంత్రి జుల్ఫికార్ అలీ భుట్టో యుద్ధోన్మాదములో అయూబ్‌ఖాన్‌ను మించి యుండెను భారత దేశముతో గిల్లి కజ్జా పెట్టుకొనుటయే కాక భుట్టో ఐక్యరాజ్యసమితిలో భారతీయులను నిందించెను. యుద్ధకాలమున భారతీయులందరు కుల మత వర్గ విభేదాలు మరచి సమైక్యముగా దేశభక్తి పెల్లుబుక నిలిచి రక్షణనిధికి విరాళము లిచ్చి బహు విధముల తోడ్పడిరి. ఈ సందర్భమున పాకిస్తానును రెచ్చగొట్టి మద్దతు ప్రకటించి తోడ్పడిన చైనా అమెరికా మున్నగు దేశములను శాస్త్రిగారి దృఢనిశ్చయము, ధైర్య సాహసోపేత చర్య ఆశ్చర్య పరచినవి.

రష్యా ప్రధాని కొసిగిన్ ప్రపంచ శాంతిని దృష్టి యందిడుకొని మధ్యవర్తిత్వము వహించి భారత పాకిస్తాన్ అధినేతలను శాంతి చర్చల కాహ్వానించెను. శాస్త్రి గారవసరమైనపుడు యుద్ధమున కెంత దీక్ష బూనిరో అంతే దీక్ష శాంతి స్థాపనకు పూనిరి. 1966 జనవరి 3న శాస్త్రిగారు తాష్కెంటు చేరిరి. శాంతి చర్చలు సాగి జనవరి 10 నాడు ముగిసెను, కాశ్మీరుపై బలప్రయోగమును విడనాడుటకు అయూబ్ సమ్మతించెను ఉభయ పక్షముల సైన్యములు యుద్ధమునకు ముందటి స్థావరములకు ఉపసంహరించుకొనుటకును, ఆర్థిక వాణిజ్య దౌత్య సంబంధములను పునరుద్ధరించుటకును ఉభయ నాయకులంగీకరించిరి. 10 వ తేదీ సాయంకాలము శాస్త్రి అయూబ్‌ఖాన్‌లు కొసిగిన్ సమక్షమున ఒడంబడికపై సంతకములు చేసిరి. శాస్త్రిగారి యీ శాంతి ప్రియత్వమును దేశదేశములవారు హర్షించి శ్లాఘించిరి. కాని దురదృష్ట వశమున ఆ మోదము వెనువెంటనే ఖేదముగా మారినట్టి ఘోర దుస్సంఘటన జరిగెను. శాంతి యొడంబడికపై చేసిన సంతకము తడియారక మునుపే అదే రాత్రి గంటలు 1-32 నిమిషములకు గుండెపోటుతో శాస్త్రిగారు దివంగతులైరి. వారి హఠాన్మరణమునకు యావత్ప్రపంచము దిగ్భ్రాంతి చెందెను. భారతీయు లెల్లరు దురంత సంతాపముతో వగచిరి.

పౌరుషమునకు పట్టుదలకు శాంతికి సహనమునకు నీతికి నిజాయితికి నిలయమైన శాస్త్రిగారు మహా సామర్థ్యముతో 18 నెలలే దేశ పరిపాలన చేసి దేశమునకు గొప్ప గౌరవమును సంపాదించి పెట్టిరి.

ఈ విధముగా సంభవించిన చారిత్రాత్మక సంఘటనలు, పరిణామములు జయధ్వజములోని కవితలకు వస్తువులై విలసిల్లినవి.

## జయధ్వజం - వస్తువు :

జయధ్వజములోని వస్తువు జాతీయమైనదని మొదట మనవిచేసితిని. ఇందలి 31 శీర్షికలును దేశభక్తి కవితలేయై యొప్పారుచున్నవి. ఈ గ్రంథము స్థూలదృష్టికి వేర్వేరు కవితల సంకలనముగా తోచినప్పటికి జాతీయతా సూత్ర నిబద్ధము లగుట వల్ల నిబద్ధ కావ్య ప్రాయమై శోభిల్లుచున్నది. ఇతర ఖండ కావ్య సంపుట ములవలె నివి కలగూర గంప కాక జాతీయైక వస్తువు పర్యాప్తమై యున్నది. ఇందనుస్యూతమగు నొక కథ లేకున్నను ఐదు సంవత్సరముల దేశ చరిత్ర ఘటనలను వర్ణించుచున్నందున భావమునందేక సూత్రత భాసిల్లుచున్నది.

ఇందు ప్రధానముగా పాకిస్తాను 1965 లో కాశ్మీరుపై దండయాత్ర చేసి నప్పటి విషయమునకు చెందిన కవితలు కలవు. వీనికి తోడుగా భారత దేశము సాధించిన గోవా చైనా విజయములు, నెహ్రూ రాజేంద్ర ప్రసాదుల గూర్చిన గీత ములు మున్నగునవి కలవు. చైనా పాకిస్తాను దండయాత్రలు చేసిన కాలములలో దేశమునందనేక కవులు జాతి నుద్బోధించుచు పౌరుష పరాక్రమములను ప్రేరే పించుచు కవితలు వ్రాసియుండిరి. ఈ విషయము పైననే ప్రభుత్వము వారును 'జయభేరి' 'శంఖారావము' మున్నగు కవితా సంపుటములను ప్రచురించిరి. ఈ సందర్భమున అచ్చమైన జాతీయ మహాకవియగు వరదాచార్యులవారీ రచనలను ప్రబోధ స్థాయిలో ఉదాత్త కవితా మయముగా తీర్చిదిద్దినారు. ఇందలి కవితల యొక్క సముచితమైన కూర్పు దీనికి కావ్యత్వము నాపాదించినది. ఈ విషయము మునుముందు విశదీకరింతును. ఇందలి వస్తు వర్గీకరణము తదీయ వివరణమునకు ముందు కృతి సమర్పణము మున్నగు విషయములు చర్చింతును.

## కృతి సమర్పణము :

ఈ కృతి అప్పటి ఆర్థిక శాఖామాత్యులు డా॥ మఱ్ఱి చెన్నారెడ్డిగారికి సమ ర్పింపబడినది. 'కృతి సమర్పణము' కవితలో ఆచార్యులవారు రెడ్డిగారి గుణగణ ములు, వారి దేశసేవ, రాజనీతి చతురత చక్కగా అభివర్ణించి తమ కృతికన్య వారి నేల వరించెనో లెస్సగా సంభావించి చెప్పినారు. ఒకమారు రెడ్డిగారు చెన్నూరు లోని ఆచార్యులవారి గృహమునకు వెళ్లినప్పుడు జయధ్వజ గేయములను గానము చేసి వినిపించిరి. దానికి రెడ్డిగారు మిక్కిలి ఆనందించి యభినందించిరి. ఆచార్యుల

వారు రెడ్డిగారి రసజ్ఞత కలరి ముఖ్యముగా ఈ కృతి వారికి సమర్థాసమర్పణ కావించుట జరిగినది.

## గ్రంథ నామౌచిత్యము :

ఈ గ్రంథమునకు 'జయధ్వజం' అను పేరిడుటలో ఎంతయో ఔచిత్య మున్నది. గ్రంథాంతమున 'జయధ్వజం' అను శీర్షిక కూర్పబడినది. స్వతంత్ర భారతదేశము జయపరంపరలను సాధించి జయధ్వజ ప్రతిష్ఠ కావించి ప్రపంచములో మహాకీర్తి ప్రతిష్ఠలు స్థాపించుకొన్న విషయ మిందు వర్ణితమై యుండుటచేత దీనికీ జయధ్వజనామము మిక్కిలి పొసగి యున్నది. గ్రంథవిషయమునకే కాక ఆచార్యులవారు లోకోత్తరముగా జాతీయకవితా రచన చేసి సాహిత్య గగనమున నెగురవేసిన జయధ్వజముగను భావింప వచ్చును.

గ్రంథ ముఖపత్రము మీద భారతవీరుడు నందీశ్వరునిపై నగారా మ్రోగించుచు జయఘోషతో సాగిపోవు చున్న చిత్రము కలదు. ఈ చిత్రములో ఒక యఖండదివ్యజ్యోతి ప్రకాశించుచున్నది. ఇది భారతదేశ మహోజ్జ్వల యశస్సు నకు సంకేతము. ఇట్టి చిత్రము గ్రంథనామ వైశిష్ట్యమును మనోజ్ఞముగా శోభిల్ల జేయుచున్నది.

## కావ్యోపక్రమోపసంహారములు

సంపుటియందు మొదట కూర్చిన కవిత 'శాంతిదేవత' చివరి కవిత 'జయధ్వజం.' పాకిస్తానుతో యుద్ధముజరిగి విరమణయై తాష్కెంటులో శాంతి యొడంబడిక జరిగి మన దేశమున నెలకొన్న శాంతి విషయ మీ 'శాంతిదేవత' లో వర్ణింపబడినది. దేశమందిరమున శాస్త్రి శాంతిదేవతను ప్రతిష్ఠించినట్లే ఆచార్యుల వారు తమ కావ్యమందిరమున శాంతిదేవత నగ్రపీఠినలంకరింపజేసి యర్చించిరి. జాతియొక్క సకల శ్రేయస్సులకు మూలము శాంతి. ఆ శాంతి దేశభద్రతవల్ల సమ కూడును. దేశభద్రతకు ముప్పువచ్చినప్పుడు దురాక్రమణదారులను తరిమికొట్టి విజయము పొందినప్పుడే సుస్థిరశాంతి స్థాపన జరుగును. కనుక సర్వాభ్యుదయము లకు మూలమైన శాంతినిగూర్చి తొలుత వర్ణించుట సముచితముగానున్నది. అంతేకాక భారతమెప్పుడును శాంతినే కాంక్షించును. దేశదేశములతో స్నేహ

సంబంధములనే వాంఛించును. ఇట్లు భారతదేశ సదాశయమగు శాంతి విశిష్టతను తొలుత సుగ్గడించుట యుక్తియుక్తముగా నున్నది. కవిగారు శాంతిప్రియులగుట చేతను ఈ శీర్షిక తొలుత కూర్చబడినది. కాగా శాంతిప్రియత్వమును బలహీనతగా భావించి శత్రువులు దురాక్రమణకు తలపడినచో దెబ్బకు దెబ్బకొట్టి శత్రు విధ్వంసముచేసి దేశరక్షణ కావించుకొనవలసినదే. నాటి భారతకథ యిట్లే జరిగినది. నేటి నవభారతకథ యిట్లే జరిగినది

ఈ శాంతిదేవత 'సౌఖ్యకారిణి దుఃఖహారిణి సకల సంపత్పథ విహారిణి, విశ్వకల్యాణ పరితోషిత. ఆమె చూపులు దయకు ప్రాపులు, ఆమె నవ్వులు వేల్పు పువ్వులు, ఆమె వదనము ప్రేమసదనము, ఆమె హృదయము అమల సదయము'. అనియు, ఆమె పట్టినదెల్ల పైడియై ముట్టినదెల్ల ముత్యమై, ఆమె పదముంచిన స్థలములు అమరభువి నందనవనములై శోభిల్లగలవనియు శాంతి దేవతావైశిష్ట్యమును కొనియాడినారు.

ఇందలి చివరి కవిత 'జయధ్వజం.' శత్రుపరాస్తము కావించి జయధ్వజ మెగురవేసిన యుదంతము చివరి ఖండికలో వర్ణించుట సహృదయామోదకరముగా నున్నది. ఇందు మొదట శాంతిబీజావాపనచేయగా తుదకు జయఫలము ప్రాప్తించినది. శాంతివృక్షమునకు పట్టిన తెగుళ్ళు, ఉపద్రవములే యుద్ధములు. శాంతి జయములకు మధ్య భారతదేశము పడిన పాట్లే యిందలి కవితలు. ఈ యభినవ భారతమునకు నాయకరత్నమగు లాల్‌బహదూర్ శాస్త్రిగారిని రెండవ శీర్షికలో వర్ణించుట, పిదప భారతజననిని వినుతించుట సక్రమ నిర్వహణ.

దేశచరిత్ర ఘటనలను గురించిన కవితల నిందు కూర్చుటలో కొంతకాల విపర్యయము గోచరించును. పాకిస్తానుతో యుద్ధము ముందు వర్ణితమై తర్వాత చైనాతో యుద్ధము, గోవా విజయము వర్ణించుట చూడగా సంఘటనములు కాల క్రమానుసారముగా కాక విషయ ప్రాధాన్యానుసారముగా వర్ణింపబడినవని తెలియు చున్నది. అందుకే ముందుగా ముఖ్యమైన పాకిస్తానుతో జరిగిన యుద్ధవిషయ మభివర్ణించుట జరిగినది. ఇట్టిది చక్కని కూర్పుతో చిక్కని నేర్పుతో నిర్వహింప బడినది.

## వస్తు వర్గీకరణము :

ఈ గ్రంథమున కేవలము యుద్ధములు వర్ణింపబడలేదు. శత్రువులు దుష్ట బుద్ధితో చేసిన దురాక్రమణల యుద్ధముల పూర్వాపరములను ప్రస్తావించి దేశ రక్షణకు, శత్రు విధ్వంసమునకు పూనుకొని విజయములు గాంచవలెననియు, జాతీయతతో సమైక్యముగా జీవింపవలెననియు నిత్యాదిగా ప్రబోధము కావింప బడినది. కావున నిదొక యుత్తమ ప్రబోధ కావ్యము.

ఇందలి కవితలను విషయము ననుసరించి షడ్వర్గములుగా విభజింప వచ్చును. జాతీయ ప్రబోధ కావ్యములు ప్రాయికముగా నేతల్లక్షణ విశిష్టమయియే యుండును.

1. మాతృదేశ సంకీర్తనము. 2. నాయకప్రశంస. 3. విజయాకాంక్ష. 4. శత్రుదూషణము. 5. మహావీర సంస్మరణము - స్మృతి కావ్యములు. 6. జాతీయసమైక్యాది ప్రబోధము.

క్రమముగా ఈ కవితలను సంగ్రహముగా చర్చింతును.

## 1. మాతృదేశ సంకీర్తనము :

జాతికి ప్రప్రథమోపాస్యదైవము జన్మమిచ్చి పోషించు దేశజనని. అట్టి మాతృదేశ సంకీర్తనము జాతీయకవికి పరమపవిత్ర కార్యము. ఆచార్యులవారిందు భారతాంబను భక్తితో కీర్తించినారు. 'జయగీతి', 'వందనము'అను రెండు గీతములలో మాతృదేశ సంకీర్తనము చేయబడినది. ఇందులో 'జయగీతి' యున్నది ఆహ్వానము ఖండకావ్య సంపుటిలోని 'విజయగీతి' యను ప్రథమ కవితయే. దీని గురించి ఆ వ్యాసమున చర్చించితిని. ఇక రెండవదగు 'వందనము' భారతాంబకు జోహారు లర్పించి దివ్యకవితా కుసుమస్తబకమున నర్చించినవి. ఈ గీతమున గాంధి తిలకు నెహ్రూ మున్నగు జాతిరత్నముల గాంచిన వీరమాతయని, సకల దేశముల సత్యా హింసలు చాటి ఖ్యాతికెక్కిన శాంతిదూత యని, కాళిదాస వ్యాసాది మహాకవుల కావ్యవాహినులకు, అజంతా ఎల్లోరా శిల్పకళలకు నిలయమని భారతాంబ కీర్తింప బడినది. ఈ రెండు సంకీర్తన గీతములును చక్కని జాతీయ గీతములై యొప్పు చున్నవి.

## 2. నాయక ప్రశంస :

భారత పాకిస్తాన్ యుద్ధకాలమున నాయకమణియై భారతజాతిని నడపించి సమరమును శాంతిని సాగించుటలో సమాన సామర్థ్య మసమానముగాగల మహా పురుషుడు ప్రధాని వరేణ్యుడు లాల్ బహదూరుశాస్త్రి. అట్టి వీరనాయకోత్తముని ప్రశంస యిందు ప్రధానముగా చేయబడినది. అతని ధీరోదాత్త గుణగణములను శక్తిసామర్థ్యములను మనసార వర్ణించినా రాచార్యులవారు.

అతడు పదవి నలంకరించినప్పటి మహాక్లిష్టదశ యీ రీతిగా వర్ణింపబడినది.

"ఒకవైపు ప్రాంత భాషోన్మాదవాదంపు వికటాట్టహాసముల్ వెట్టిసేయ
ఒకవైపు భయవివర్ధక మహాక్షామమ్ము విలయతాండవమును సలుపుచుండ
ఒకవైపు చీనా మహోగ్రయుద్ధోన్మాది సారెకు కత్తులు నూరుచుండ
నికట పాక్ ప్రభువులు నిజమాతృభూభాగ కబళనార్థమ్ము నాల్కలను సాచ
నమ్మిన విదేశములు గూడ న్యాయముడిగి శత్రుపక్ష సమర్థనాచర్య బూన
మంచుకొండ గుండియలతో మాతృభూమి రక్షకై దీక్షగొనిన హర్యక్ష
మీవు "1

ఇన్ని విపత్తుల మధ్య మహాసంక్షోభము నందుచున్న మాతృభూమి రక్షణకు దీక్ష గొన్నాడు శాస్త్రి. సాధారణముగా నొకరి ధీరతకు గిరిని, శూరతకు కేసరిని ఉప మానముగా చెప్పుట కలదు. ఇక్కడ అట్టి యుపమానములే గైకొన్నను వీనికొక ప్రత్యేకత కలదు. శాస్త్రిగారి గుండె మంచుకొండవంటిదన్నారు. మంచుకొండ మన దేశమునకు పెట్టని కోట. దాని శిఖరము జాతిగౌరవ శీర్షము. అది యెవ్వరికిని వంగునది కాని లొంగునదికాని కాదు. అట్లే యొకప్పుడును బెదరునదికాని చెదరు నదికాని కాదు. సకల లోకమునకే యత్యున్నతమై భారతజాతికి గర్వహేతువైన మంచుకొండను శాస్త్రిగారి గుండె కుపమానముగా చెప్పుట మిక్కిలి యుక్తముగా నుదాత్తముగా నున్నది. అట్టి గట్టిగుండెగల శాస్త్రి సింహమై దేశరక్షణార్థము సమస్త దేశములు దద్దరిల్లునట్లు గర్జించినాడు.

---

1. జయధ్వజం : 'లాల్‌బహదూర్' పుట 5,6.

అతని హృదయములో 'అభేద్య హిమనగోన్నత సన్నుత ధైర్యసాహసము, లొకవైపున రాజిల్లగా, వేరొకవైపు 'గాంగమధురోదకదృక్కరుణామృతము' జాల్వారుననియు, భారతాంబ పుత్రులెంతకైనను సమర్థులనియు వర్ణించుట జరిగినది. 'తిలకులోని కర్మదీక్షా పరత్వము, గాంధిలోని శాంతికాముకత, జవహరుని యమోఘ సంఘసేవాసక్తి ముద్దగట్టిశాస్త్రి మూర్తియయ్యె'ననియతని విశిష్ట వ్యక్తిత్వమును లెస్సగా వ్యక్తము చేసినారు. అతనికి పెద్ద సీమ డిగ్రీలు లేవు. స్ఫురద్రూపి కాడు. ఆరోగ్యము సైతమంతే! బక్క పలుచని పిడికెడు మనిషి సకల ప్రజలను మించెననగా నది యాత్మ శక్తివల్లనే యని వక్కాణించి శాస్త్రిగారి మహనీయ గుణగణముల నుగ్గడించినారు. అతడు దేశమునకు ప్రధానియయ్యు తన తనువును దాచుకొనుట కొక్కగృహమైన నిర్మించుకోని పరమనిస్స్వార్థ జీవనుడు. నైతిక జీవనమున నతని కతడే సాటి. శాస్త్రిగారినిగూర్చి చెప్పిన చివరి పద్యము కవిగారి మెచ్చుగు కవితకు మచ్చుతునక.

> "అతడు యుధిష్ఠిరుండనగ నద్భుతశౌర్యము జూపె పోర దా
> నతడు నజాతశత్రువన నయ్యుబుతో ఘనమైత్రి జాటె దా
> నతడొక ధర్మమూర్తియన నౌ ప్రతికక్షికి గెల్చినట్టి యా
> క్షితిని వదాన్యతన్ మరల జేకొనుమంచు నొసంగె నేమనన్"[1]

ఇందు శాస్త్రిగారిని పాండవాగ్రజునితో పోల్చి సాభిప్రాయ పదప్రయోగ చమత్కృతితో వర్ణించినారు. ధర్మజుడు శాస్త్రి యిద్దరును ధర్మమూర్తులే. కాగా ధర్మజునికి లేని విశేషగుణము శాస్త్రిగారి కున్నది. గెల్చుకొన్న భూమిని ధర్మజుడు ప్రతికక్షి కీయలేదు. ఆ పని శాస్త్రిచేసి వదాన్యతలో ధర్మజుని గెల్చినాడు.

## 3. విజయాకాంక్ష :

దేశము శాంతిభద్రతలతో క్షేమముగా నున్నపుడే జాతి స్వేచ్ఛగా సుఖముగా మనుగడ సాగించుచు వైభవప్రాభవములను సకలాభ్యుదయములను పొంది ప్రపంచములో దివ్యయశస్సుతో విరాజిల్లగలుగును. దేశ సమగ్రతకు శాంతికి శత్రువులవలన గ్లాని కలిగినపుడు దేశజనులెల్ల వీరరసావతారమూర్తులై విజృం

1. జయధ్వజం: 'లాల్‌బహదూర్' పుట 8.

ఖించి విజయాకాంక్షతో విపక్షవిధ్వంసము కావించుటకు పూనుకొనుట పరిపాటి. పౌరుష పరాక్రమములుగల వీరజాతికి విజిగీష పరమలక్షణము. దేశభక్తి భావా విష్టుడైన జాతీయకవి కవితాశంఖము పూరించి జాతిజనులను మేల్కొలిపి చైతన్యవంతులను చేసి వారి హృదయములలో రగులుకొనుచున్న ప్రతాపవిజి గీషాగ్నిని మహోజ్జ్వలముగా విజృంభించునట్లు చేయును.

ఆచార్యులవారి గ్రంథములో 'జయం మనదే', 'దివ్య దీపావళి', 'మా దేశం', 'జయధ్వజం' అను కవితలలో విజయాకాంక్షను వ్యక్తము చేసినారు. మాతృ భారతీస్తవము చేయుచు జయగీతి నాలపించి ఆ జననికి వందనము చేసి జయం మనదే యని ఘంటాపథముగా దృఢవిశ్వాసముతో వచించుట యనన్య జాతీయతకు నిదర్శనము. ఈ కవితలో

"రారండోయ్ రారండోయ్ భారత రణవీరులార!
భరతభూమి రక్షణకై ప్రాణాలిడు ధీరులార!"

అని భరతభూమి రక్షణకు రణవీరులను పురికొల్పినారు. కేవల వీరసైనికులనేకాక 'నలువదారు కోట్ల జనము నడుము గట్టి ధ్వజము పట్టి, కలసిమెలసి పదం పాడి కదం ద్రొక్కి కదలి రం'డని భారతీయు లందరిని దేశరక్షణకు ప్రేరేపించినారు. నరుని ప్రేరేపించిన నారాయణునివలె ధర్మయుద్ధమునకు తమ కవితా రణభేరి మ్రోగించి యాహ్వానించినారు.

ప్రశాంత భారతావనిలో దుర్నిమిత్తములు పొడసూపి దుష్టశక్తులు దురా క్రమణకు తలపడె ననియు, తదీయ ఘోర దుశ్చర్య కాగ్రహోదగ్రమై సర్వ భారతజాతి యొక్కుమ్మడి లేచి శత్రు శిక్షణకు దేశ రక్షణకు చెలరేగెననియు చెప్పిన యీ కవిత వీరరసావేశముతో ప్రళయ ఝంఝాప్రభంజనము వలె విజృం భించినది. శత్రు దురాక్రమణకు భారతప్రజలే కాదు విజృంభించినది, వారి కుద్దీపనముగా 'హిమాలయము నిజధైర్యప్రమాణమై చేతులెత్తినది.' 'అమరఝరీ తరంగము లావేశములై తలెత్తినవి.' 'కాలయముని పాశములై వేల కోట్ల కరము లాడ నీలగళుని రోషానల నిలయములై కనులు జూడ, కలకత్తా కాళీసతి కన్ను విప్పి మేల్కొన్నది.' ఆ మహాకాళి రౌద్రము దుర్నిరీక్ష్యము.

"రక్త పిపాసాప్రదీప్త రాగవర్ణ విస్ఫారిత
కరాళ కాళీ ముఖాగ్ని గహ్వర జిహ్వా జ్వాలలు
సరోష నిశ్వసనానిల సారిత భీషణకీలలు
సరిహద్దుల కబళించెడి శత్రుమహారణ్యమ్ముల
తిరిగి తలల నెత్తనిగతి తిన్నిత్రేచె నగణ్యమ్ముల."-'జయం మనదే'పుట13.

అని కాళికా మహోజ్జృంభణము వర్ణింపబడినది. ఇక రుద్రుని విలయ తాండవ వర్ణనము వర్ణనాతీతమైనది.

చిటపట చిటపట చిట్లుచు సెగల పొగల వెలిగ్రక్కుచు
నిటాలనేత్రాగ్నులు దిక్తటాంచలమ్ముల గ్రసింప
కుటిల భ్రూకుటి నటింప కటములదర సటలు చెదర
జటాజూటములు విడివడి చెరేల్ పెరేలని యాడగ....
పశ్చిమ రక్తాంబరమున ప్రళయ తాండవము సల్పుచు
జటిలత ధూర్జటి హిమగిరితటి రౌద్రార్భటి దూకెను." 'జయం మనదే'
పుట 13,14.

ఈ కవితారణభేరికి 'పసిపిల్లలు భారతాభిమన్యులై బుసకొట్టినారు. ముసలయ్యలు వీరభీష్మమూర్తులై నడుము కట్టినారు. స్త్రీలు ఈనిన బెబ్బులులై మైదానము దూకినారు.' ప్రకృతి, స్త్రీపురుషులు, దేవతలు - సమస్తము విజృంభించి వీరవిహారము చేయగా విజయము నిశ్చయము కాక సంశయ మగునా?

విజయాకాంక్షకు చెందిన మరొక కవిత 'దివ్యదీపావళి.'
"వేయి యేండ్ల పిదపవచ్చె వెలుగు కనుల దీపావళి
వేయి యేండ్ల వెనుకవచ్చె విజయకళల రూపావళి"

అని భారతదేశ సహస్రవర్ష పరాధీనత స్మరింపబడిన దచ్చమయిన జాతీయకవిత. భారతదేశమున కెనిమిదవ శతాబ్దములో అరబ్బుల దండయాత్ర నుండి దుర్దినములు మొదలైనవి. వేయి సంవత్సరముల కాలము దాస్యాంధకారములో మ్రగ్గజేసిన పరపరిపాలన కాళరాత్రి గడచి, నరకాసురశక్తి సర్వనాశనమై కుప్పకూలి స్వారాజ్యమను 'వెలుగుకనుల దీపావళి' వచ్చెను ఇట్టి స్వాతంత్ర్య దివ్యదీపావళీ మహాపర్వదిన ప్రాశస్త్య మిందు మహోదాత్తముగా వర్ణితమైనది. ఈ వేయి సంవత్స

రముల కాలములో విదేశీయ ప్రభుత్వము లేర్పడినప్పుడెల్ల మనవారెదురు తిరిగి స్వాతంత్ర్యేచ్ఛతో విజయాకాంక్షతో పోరాడుచునే యుండిరి. అట్టి విజయేచ్ఛ బ్రిటిషువారి పరిపాలనను పరాస్తము చేయుటతో ఫలించి 'నలుబదారుకోట్ల ప్రజల నగుమొగాల దీపావళి వచ్చి విజయకళల రూపావళి నిచ్చెను.'

'మా దేశం' అను ఇంకొక కవితలో విజయకాంక్షయే కాక 'వీరభారతీ సందేశమును' వెల్లడించి విశ్వప్రజలను హెచ్చరించుట జరిగినది.

"పరదేశీయులు తొలగండీ యీ భారతదేశము మా దేశం
వినండి వినండి విశ్వప్రజలూ వీరభారతీ సందేశం"

అని ప్రారంభించి పంచశీలను పాటించుచు వంచకత్వమున మా భూమిని గొనువారికి యమసందేశమిదు ననియు, మా దేశం శాంత్యహింసలను సత్యధర్మములను సంరక్షించుచు సహజీవనమును సహకారమును బోధించుననియు, 'హిమాద్రి మొదలుగ కుమారి వరకు హిందూస్థానము మా దేశ'మనియు, 'సమస్త భాషా జాతి మత సరిత్ సంగమ జలనిధి యీ దేశ' మన దేశ విశిష్టసందేశమును ప్రపంచ జనులకు వినిపించినారు.

సామరస్యమునకును సమరమునకును సమానముగా సమర్థులమని తెల్పుటకు

"ఎవ్వడు లేడిల పగవాడు మే మెవ్వరికిని దలపము కీడు
మా జోలికి ఎవ్వడు రాబోడు మరి వచ్చిన ప్రాణంతో పోడు".

అని భారత పరమధర్మమును చాటి చెప్పినారు. భారతదేశ స్వాతంత్ర్య పరిరక్షణమే మా లక్ష్యమనియు, తదీయ రక్షణకు ప్రాణములు తృణతుచ్ఛము అనియు, చీనా గీనా యేది వచ్చినను చివరకు మేమే గెల్తుమనియు విజయాకాంక్షను వ్యక్తము చేసినారు.

చివరి కవిత 'జయధ్వజం'లో విజయాకాంక్షతోపాటు జయధ్వజము వర్ణితమైనది. శత్రుదేశముల దాడులను త్రిప్పికొట్టి జయము గాంచిన పిదప నవయువ సోదరవ్రజ మానందోత్సాహములతో భద్రగజముపై జయధ్వజమును నిలిపి జయహిందని నినదించుచు సాగిపోయినట్లే ఒవరి కవితలో వర్ణించుట యౌచితీ భాసురమై యున్నది. ఇందలి జయధ్వజము మరేదో ధ్వజముకాదు. మన త్రిపర

ధ్వజమే. మనదేశ మపజయమెఱుగక సర్వసత్తాక సార్వభౌమాధికారముతో ప్రకాశించినపుడే స్వతంత్ర భారత జాతీయపతాక నెరుగవేయ వీలున్నది. దేశము పరాధీనమగుచో ఈ జెండాయునికి కవకాశము లేదు. మన స్వాతంత్ర్యము నకు శత్రుదురాక్రమణలచేత విఘాతము కలిగినపుడు ధర్మయుద్ధము గావించి విజయముగాంచి యుత్సవము చేసికొనుచు నెగురవేయబడు మన ధ్వజము జయ ధ్వజమై విరాజిల్లును. విపత్తులు వచ్చి విజయము ప్రాప్తించినపుడే స్వతంత్రదేశ ప్రతీకయగు పతాక విలువ తెలిసి ప్రశస్తి యినుమడించును. విజయానంద మింతింతయని వచింప నలవి కాదు. అట్టి యానందమిందు సుందరముగా వ్యక్తము చేయబడినది.

మన జయధ్వజమిందు బహుభంగుల వర్ణింపబడినది. ఇది 'మన యాత్మల తేజము, భారత సురభూజము. ముప్వన్నెలతో మొయిళులలో గరుడునివలె నెగురు చుండగా వైరి భుజంగములకు భయపడవలసిన యవసరములేదు. ఈ ధ్వజము భారతీయ సమైక్యమునకు మారురూపము. ఇది నలువదారుకోట్ల ప్రజల నగవుపూల నొలుకబోయుచు పలుమతాల మన స్వేచ్ఛాభావపటము నెగురవేయును. మన యుత్సాహమే నభమున మహితగతుల నాట్యమాడును. మన సుకీర్తి చంద్రికలే మినుముట్టుచునుండె' నని మహోదాత్తముగా భావించి చెప్పినారు. ధ్వజములోని త్రివర్ణముల పరమార్థము వచించుచు,

> "మన జవాన్‌ల రక్తబలం మన కిసాన్‌ల పంటపొలం
> మన విద్యాగాంగజలం ధ్వజమెత్తె త్రివర్ణములన్"

అని యోధుల శౌర్యమే ఎరుపై, కర్షకుల పంటపొలమే పచ్చనై, విద్యాగంగాజల స్వచ్ఛతయే తెలుపయి త్రివర్ణపతాకగ రూపొందినదని చక్కగా వక్కాణించినారు. ఇందు భుజశక్తి, ధనశక్తి, విద్యాశక్తి యను త్రివిధశక్తులే మన ధ్వజముగా నేర్పడినవని భంగ్యంతరముగా చెప్పబడినది. ఈ త్రిశక్తులే జగతికి మూలము. ఈ త్రిశక్తుల మూలశక్తియే - ముగురమ్మల మూలపుటమ్మయే-జగన్మాత. ఆ జగన్మాత యధిష్ఠించినదే మన ధ్వజము. అట్టి ధ్వజమున కతిభక్తితో తలవంచి ప్రాంజలి నిడి తను ధన హృత్ప్రాణమ్ముల నర్పించుడని ప్రబోధించినారు,

"అదె మన తలపై తుఱ్ఱా అదె జాతికి జీవగఱ్ఱ
ఆచంద్రార్కము దానికె యంకిత మీజాతి కుఱ్ఱ."

అని జెండాను కొనియాడి ముగించినారు.

## 4. శత్రు దూషణము :

జాతీయతా ప్రబోధకావ్యములలో శత్రుదూషణము సహజము నని వార్యమునై యున్నది. దేశమునకు దురాక్రమణద్వారా ఘోరమైన యపకారము చేసినప్పుడు జాతి యావత్తు హృదయము కలగి కోపము చెలగి కసిదీర శత్రువును నిందించును. అగుచో దేశభక్తియుక్తుడగు జాతీయకవి యూరకుండునా? సామాన్యజనులు నోటికివచ్చినట్లు గాటుగా సూటిగా తిట్టగా కవి రసవంతముగా భావ భాస్వంతముగా తిట్టును.

ఇక్కడ పరులను దూషించుట భావ్యమా? యను ప్రశ్న యుదయించును. వ్యక్తిగతాపకారము చేసినప్పుడు శత్రువును క్షమాచిత్తముతో విడిచిపెట్టవచ్చును. 'చంపదగినయట్టి శత్రువు తనచేత జిక్కెనేని కీడు చేయరాదు' అన్న వేమన్ననీతి వర్తించును. కాని జాతికి దేశమునకు చేసిన కీడు క్షమార్హము కాదు. కావున నిచట శత్రుదూషణము భావ్యమే. ఈ దూషణమువల్ల తమ కోపతాపములు వ్యక్తము చేయుటయేకాక శత్రువుల కుట్రలు, కుతంత్రములు, దుశ్చర్యలు లోకమునకు వెల్లడిచేయుట, శత్రువులకు గట్టిగా బుద్ధిచెప్పుట జరుగును. ఈ కవితలలోని దూషణము మేర మీరనిదై విమర్శనాత్మకమై హితోపదేశకమైనదే కాని యసభ్యమైన బూతు కాదు. మరియు మన దేశముపై దాడివచ్చిన శత్రుదేశ ప్రభుత్వములను, తత్ ప్రభుత్వాధినేతలను నిందించుటే కాని తద్దేశ జనసామాన్యము నేమాత్రము కాదు. ఇట్లిచటి యీ దూషణ గేయసముదాయ ముదాత్తమైన యధిక్షేప కావ్య సంపుటమై యొప్పుచున్నది.

ఇందు 'ఖబర్దార్' మొదలుకొని 'గోవావిజయము' వరకు గల పదు నాలుగు కవితలలోను, 'ఎటు పారునా' యను కవితయందును విపులముగా యుక్తియుక్తముగా శత్రుదూషణము కావింపబడినది. వీనిలో మొదటి 12

కవితలు పాకిస్తానును, తర్వాతి 'వెడలు వెన్కకు' చైనాను, 'గోవావిజయము' బుడుతకీచులను, 'ఎటు మారునో'యన్నది బ్రిటిషువారిని, పాకిస్తానును నిందించినవి.

'ఖబర్దార్' అన్న మొదటి గేయములో
"ఖబర్దార్ పాక్ భాయి కాశ్మీరు మాదేనోయ్
పరధన వనితాచోరుల భారతము సహించదోయ్"

అని గట్టిగా హెచ్చరించుట జరిగినది. పరధన వనితా చోరులను నేటి భారతమే కాదు నాటిభారతమును సహించలేదు. 'మర్యాదను మీరకుండు మహాసముద్రమును మంచినీటి చెరువనుకొనుట హాస్యాస్పదమనియు, 'మతభేదములెన్ని యున్న మానవత్వమొకటే' యనియు, 'మతంమతం మాదొకటని మాటలు చెప్పి మసీదుపై బాంబులేయ మతమా యది మదమా!' యనియు పెక్కు తీరుల నధిక్షేపించినారాచార్యులవారు. భారతదేశముతో పాకిస్తాను తలపడుట నిదురించు సింహమును కదిపి లేపుటవంటిదనియు, కొరవితో తలను గోకికొనుట వంటిదనియు హెచ్చరించినారు. 'దుశ్శాసన సుకర్ణులను దుష్టశకునపక్షులయిన చీనాంబరులను నమ్మి, యుద్ధమునకు పూనుకోవలదనిరి.

కాశ్మీరులోని మతసోదరులపై మమతలొలుకబోయు మిషతో ఆ రాష్ట్రమును కాజేయ యత్నించిన పాకిస్తాను కుట్రను బట్టబయలు చేయుచు, "బురఖానిటు తొలగింపుము పురుషుడవా? పూబోడివ? గాలికి నెగిరే బురఖా కప్పిపుచ్చలేదు నిజ"మని యవహేళన చేసినారు. చివరకు "ఖబరుదారి జనెదవేల కడమాటలు వినవోయి" యని యభిశంసించినారు. ఇచట 'ఖబరుదారి' యన శ్మశాన మార్గము. ఈ గేయములో దుష్టమైన పాకిస్తానుకు దగినట్లు తిట్లు వినిపించబడినవి. ఇది దుర్వార విద్వేషముంచి నిందించుటలేదు. 'పాక్ భాయి'అని సంబోధించుటలోనే యిది విశదమగుచున్నది.

'ప్రబోధము' గేయములో శత్రునిందతోపాటు జాతిజనుల కైకమత్యాది ప్రబోధము కావింపబడినది ఈ విషయము ప్రబోధవర్గములో తర్వాత చర్చింతును. ఇందులో పవిత్రభారతమును రెండుగా ఖండించిన తెల్లవారి కుతంత్రము వెల్లడి చేయబడినది. పూర్వ భారత కథలోవలె అభినవ భారతకథలో ధుట్టో

దుశ్శాసనుడు అయూబు దుర్యోధనుడు, సుకర్ణుడు (సుకర్ణో) కర్ణుడు, మావుపిల్లి (మావో) శకుని-అను దుష్టచతుష్టయము దూషింపబడినది. భుట్టో దుష్టత్వ ధూర్తత్వము లాచార్యులవారి నాగ్రహపరవశులను చేసినవి.

"అబద్ధాలపుట్టో వా డతిమోసమ్ములగుట్టో
అధర్మాల కాటపట్టొ జుల్ఫెకారలీ భుట్టో"

అని బిట్టుగా తిట్టివేసినారు. అయూబు కాశ్మీరని కొంత, జునాగఢ్ సమస్యయని కొంత, పంజాబు బెంగాలు హైదరాబాదని మరికొంత కాజేయుచు ఢిల్లీకి షికారు వచ్చుటకు తలపెట్టిన దురూహము గర్హింపబడినది.

'మతోన్మాది' కవితలో భారత-పాకిస్తానులకు దాపురించిన యుద్ధము మానవతావాదికి మతోన్మాదికి, ప్రజాస్వామ్యమునకు నిరంకుశ ప్రభుత్వమునకు, సత్యానృతశక్తులకు, పరార్థ స్వార్థములకు, వేయేల మానవులకు దానవులకు సంభవించిన యుద్ధమని సమ్యగభివర్ణన చేయబడినది. ఇక అయూబు శాంతి సత్యములను వధింప కత్తిబూని వచ్చిన కసాయి. సిద్ధార్థులను మహాత్ములను సిద్ధపరచు మనవారికి యుద్ధాగ్నులు రగుల్కొలుపు పిండారి. మన సహనము సౌజన్యము బలహీనతగా భావించినాడు. 'పాకిస్తాను మన భాయి వారిమేలె మనదోయి' యని యనుకొన నా సిపాయి యపార్థము చేసికొన్నాడు. కనుక నట్టివానికి మనమెవరమో మన శౌర్యమెట్టిదో రుచి చూపవలెను. సామాద్యుపాయములు గడచినవి. దండమే మిగిలినదని చెప్పుచు 'తప్పి యలిగి యెరుగనట్టి ధర్మరాజు చెలరేగెను, అప్పులలో నారని బడబాగ్నిశిఖలు రాసాగె'ననియు, ప్రహ్లాదచరిత్రలోని భక్తి ఘట్టము ముగిసి నరసింహుని విజృంభణ మొదలయ్యెననియు హృదయంగమముగా వర్ణించినారు. భారత వీరనికాయము వైరులపై బడుట విజయుడు వీరవిహారము చేయబూనుట. అతని నెవ్వరును గెలువజాలరు హరి నడపిన రథమునకు (నవ భారతమున ధర్మస్వరూపుడైన శాస్త్రి నడపెను) అపజయము లేదని చెప్పి యుద్ధమనివార్యమనియు జయము నిశ్చయమన్న విషయము నొక్కి వక్కాణించిరి.

'పాకిస్తాన్' శీర్షికలో పాకిస్తాను పుట్టుపూర్వోత్తరములు ప్రస్తావింపబడి దుష్టముగా నేర్పడిన పాకిస్తాను దుష్టచర్యలనే కొనసాగించినదని వివరింపబడినది,

అప్పటికి 18 ఏండ్ల క్రింద ప్రభవించిన పాకిస్తాను సదయహృదయ భారతీ సౌజన్యము, తరతరాల మతమౌఢ్యపు దురితఫలము, బ్రిటను కుటిల భేద నీతి ఫలమని గర్హించుట జరిగినది. పాకిస్తానేర్పడుటతో ప్రజలకెట్టి లాభము లేకపోగా లక్షలకొలది అమాయిక ప్రాణాలు బలియైనవి. అసంఖ్యాకులు నిర్వాసితులై యేడ్చినారు. ఎందరో స్త్రీల మానభంగాలు జరిగినవి.

'దేశపు ముక్కలరెంటిన్ దేహపు ముక్కల గంటి'నని పాకిస్తానువల్ల దేశము రెండు ముక్కలగుట దేహము ముక్కలైనట్లే యని ఖిన్నులైనారాచార్యులవారు. ఈ పాకిస్తాను 'చెల్లీ! యిటనుండుమనుచు చేరదీయ, ఇల్లంతయు నాదేయని యెదురు తిరిగె'ననియు, మొదట బుట్టు చెవులకన్న పిదప వచ్చు శృంగములే పదునై భారతమాత యెదను బొడిచెననియు, విషభావములతో జనించిన పాకిస్తాను విషవృక్షమ్మెయై పెరిగి విషఫలములే యిచ్చెననియు, గజనీ మహమ్మూదు వంటి కలలు గనునదియు, వేయియేండ్లు వెనుకబడిన పాకిస్తాను గాలిమేడలలో విహరించుననియు బహువిధముల పాకిస్తాను నిందింపబడినది.

'కట్టర్ భుట్టో,' 'శునకము పని' యను రెండు కవితలు 'కట్టర్ ముస్లిం' ఐన భుట్టోను నిందించుచు వ్రాసినవి. 'కట్టర్ భుట్టో' కవితలో

"భుట్టో పాక్ కసాయీ! కట్టర్ ముస్లిం ఖాయీ!"
నడుమంత్రపు వైష్ణవులకు నామాలవి ఘనమోయీ"

అని నడుమంత్రపు వైష్ణవుల దృష్టాంత మిచ్చుటలో దుష్టులెవరైనను నింద్యులే దండ్యులే అని మొగమోటము లేకుండ చెప్పినట్లయినది. ఇంక భుట్టోయొక్క ఘోరమైన మతపక్షపాత మౌఢ్యములు, భారతదేశము పట్ల అతనికిగల దురంత ద్వేషము వివరింపబడినవి. మహమ్మదీయు డొక్కడే సుఖపడు మానవుడు, తక్కిన మానవులందరు కుక్కలనుచు మొరుగబోకు మనియు, ఇస్లామును పచ్చకామిలా కన్నులతో పరికించినావుకాని అచ్చపు ముస్లిములెవ్వరీ వాక్యము ననబోరనియు, పేరుకు పాకిస్తానని (పవిత్రదేశము) పెద్దరికము చెప్పుటయేకాని సారెకు నాపాకు (అపవిత్ర)చర్య సాగించుచుందు వనియు నిందించుట జరిగినది. భారతదేశము విధి లేక పాకిస్తాను ఏర్పాటుకు సమ్మతించుటయేకాక యేబదికోట్ల రూపాయలిచ్చి నదీ జలముల నిచ్చి బహువిధముల సహాయపడి నందులకు బేమాని (కృతఘ్నుము)యై

ప్రవర్తించినది భుట్టో బేమానితనము గూర్చి చెప్పుచు 'కుండపగిలినా పైసలు రెండే నష్టముకానీ కుక్కగుణము చక్కగనే గుర్తయ్యెను బేమానీ!' యని దూషించినా రాచార్యులవారు. అయూబు భుట్టో లహిరావణ మహిరావణులనియు, రామరాజ్యవిధానమును రవ్వంతయు మార్చలేరనియు, కూసిన కూతలను చేతలలో నిరూపించుకొనవలెననియు చెల్లని రూపాయికి గీతలెక్కువనియు నవహేళన చేసినారు.

'శునకము పని' కవితలో పాకిస్తాను, తద్విదేశాంగమంత్రి భుట్టో చేసిన నీచపుపని శునకము పని యని సహేతుకముగా నిరూపించి నిందించుట జరిగినది. ఐక్యరాజ్యసమితిలో భారతీయులు కుక్కలని భుట్టో మొరిగిన విషయము దృష్టి యందుంచుకొని యిటుల దూషించినారు కవిగారు.

"దొంగచాటు పెరయింటన్ దూరుటెగదె శునకము పని
బడిత జూపి నంతనె పరువిడుటలు గదె శునకము పని
ఎంగిలికూటికి భ్రమపడి యీ దేశమ్మను విస్తరి
ముక్కలుగా ఖండించుట కుక్కపనియె కదె భుట్టో....
కనకపుసింహాసనమున నొనరగ పట్టము గట్టిన
వెనుకటి గుణముల మానక తనరుటెగదె శునకము పని....
పెక్కుమార్లు తన్నులబడి ప్రక్కయెముక విరిగినను
బూడిదలో బండువరకు బుద్ధివచ్చినటులుండి
లిటలిట చెవులు దులుపుకొని అటునిటునుంగని పొంచుచు
తిరిగి దొంగతనము చేయ దొరకొనుగదె శునకము పని ...
శునకమెవ్వరో తెలిసెనె జుల్ఫికారలీభుట్టో
అనవలెనే వేరే యికనైన సిగ్గుదెచ్చుకొనుము."

ఇత్యాది పంక్తులవల్ల భుట్టో నీచముగా ప్రవర్తించిన తీరు విశదమగుచున్నది. చివరకు భుట్టోకు శాస్త్రికి గల వైధర్మ్యము

"ప్రతికటువుగ బుద్ధిమాలి యతివాగుట శునకము పని
అతి ధీరత రక్షనుగొని మతిచెప్పుట శాస్త్రీ పని"

అని తేటపరిచినారు,

'ఏమి చేయగలవు?' అన్న శీర్షికలో ఏ దేశము లేకమైనను మమ్మేమియు చేయజాలరనియు, మాధర్మము మా సత్యమె మాకు సహాయమనియు స్పష్టము చేయబడినది. ఇందు 'పాకిస్తాను బేగము'తో ప్రకయరహస్యము మాటాడెడి మావో, 'తెరచాటుభాగవతము చెప్పు సుకర్ణమ్మ' 'వలచి కోట్లోసగినను మావోను బలిపింతు వని తెలుగుట్టిన దొంగవలె నేడ్చు అమెరికా,' 'ఎంతో వలచి నిన్ను నేనొక యింటిదానిగా జేసితినని యందని లొట్టిపెదవుల కాసపడు ఇంగ్లీషునక్క'-సర్వ మపహాస్యము చేయబడినవి. ఇట్లు భారతదేశము పట్ల విద్వేషైక దృష్టితో పరస్పర వైరుధ్యముగల దేశములతో కూటనీతితో స్నేహము చేసి ఆ దేశముల బలము చూచుకొని యెగసిపడిన పాకిస్తాను దుశ్శీల మిందు నిశితముగా విమర్శింపబడినది. ఇట్టి పాకిస్తానును దేశజనుల మందర మేకమై ధైర్యశౌర్యములతో నవలీలగా త్రిప్పి కొట్టగల మనియు నెవ్వరును మమ్మేమియు చేయజాలరనియు హెచ్చరించుట జరిగినది. భుట్టో పరమత ద్వేషమువల్లను క్రూర నిరంకుశప్రవర్తన వల్లను పాకిస్తాను కెంతో నష్టము, అప్రతిష్ఠ తెచ్చెను. తూర్పు పాకిస్తాన్ బంగ్లాదేశ్‌గా విడిపోవుటకును కారకు డయ్యెను.

ఇక 'మతము జాతి', 'మతమంటే', 'ఏదైతేనేమి' యను మూడు కవితలు మతమును జాతిని గూర్చి చెప్పినవి. మతమనగా నేమియో, దాని పరమార్థమేమిటో, జాతిలక్షణ మేమిటో ఈ కవితలలో మహోత్కృష్టముగా మనోజ్ఞముగా వివరించినా రాచార్యులవారు. ఇవి యన్నియు నందరు నన్నిమతములవారు చదివి శిరసావ హింప వలసినవి.

'మతము జాతి' గేయములో మత మౌఢ్యముగల పాకిస్తాను మతము దేవుడనగానే మమతచూపి మసీదుపై చర్చిపై గురుద్వారాపై బాంబులు వేయును. ఇదేమి మతము? ఇదేమి దైవభక్తి? యని యసహ్యించుకొన్నారు. మతభేదము పాటించుట మానవతకు లక్షణముకాదనియు, అందర మొకే జాతివారమనియు,

"ఈ వాయువు లీ తోయము లీ కాయము లీ ప్రాయము
శ్రీభారత మాతృగర్భసింధువులో మౌక్తికములు
మన మాతలకెల్ల మాత మహాపూత భరతమాత
జన్మ మొసగె భరతమాత జాతియె మనదొకటి భ్రాత!

మాతృభూమిలో జనించు మన సోదర సంబంధము
మధ్యవచ్చు మత భాషలు మార్పజాలవీ బంధము."

అని పాకిస్తానుకు మృదుమధురముగా హితబోధ చేసినారు.

ఆచార్యులవారనన్యమానవతావాదులు, అచ్చజాతీయతావేదులు. వారి యీ విశిష్టహృదయము 'మతమంటే' యను కవితాదర్పణములో మానసతర్పణముగా ప్రతిఫలించును. మతమననేమియో యిందు హితముగా మహితముగా సత్సమ్మతముగా ప్రపచ్చింపబడినది. ఇట్టి భావములు 'ఆహ్వానము'లోని కొన్ని కవితలలోను వెలిపుచ్చబడిన విషయ మావ్యాసములో వ్రాసితిని.

"మతమంటే దేవునిపై మనిషికిగల విశ్వాసము
అతడు విశ్వరూపి యనుచు ఆత్మకు దెలిపెడికోసము........
మతలక్ష్యము పరసౌఖ్యము మానవతయె తద్భోగ్యము
జనతా జనార్దనుని పూజనమె యిహపరభాగ్యము"

అని విశ్వవిశాల భావముతో నిర్వచించినారు. దేవుడెక్కడనో కాదు, మానవ హృదయాలలోనే యున్నాడనియు, కాశిలో మక్కాలో ఈశ్వరుని యునికి కానరాదనియు,

"మందిరములు సుందరముగ మనము గట్టు బొమ్మరిండ్లు
మసీదు లిసుకయెడారుల మన మొనర్చు పిట్టగూండ్లు."

అనియు, ఖురాను వేదములు ఈశుని సందేశములే యనియు సర్వమతసారమును పిండి యిచ్చినారు. చివరకు

"అందరిలో దేవుడు గలడనుటే సన్మతసారము
హిందువు ముస్లిము వేరను టిది సైతాను విచారము."

అని బుద్ధి చెప్పినారు. ఈ పంక్తులవల్ల వరదాచార్యులవారి సర్వమతాదరణ భావము సుస్పష్టమగుచున్నది.

'ఏద్దైతేనేమి' యను కవితలో 'ఏకం సద్విప్రా బహుధా వదంతి', 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యను శ్రుతివచనముల యర్థవివరణముగా నేకత్వములో భిన్న

త్వమును, భిన్నత్వములో నేకత్వమును గ్రహింపవలెననియు తెల్పుచు మతము మానవత గూర్చి చక్కగా వక్కాణించినారు.

"ఎన్ని మతమ్ములు కానీ ఎన్ని వర్ణములు కానీ
ఎన్ని జాతులే కాని యన్ని యతడె యను జ్ఞాని....
ఏకత్వపు పునాదిపై నెసగునట్టి నానాత్వము
ఆవర్తతరంగ బుద్బుదాకృతులగు జలధిత్వము"

అని యుపమించి చెప్పినారు.

"మతములలో నిస్లామే మా మత మనియెడు దేవుడు
మనుజుల నందరిని ముసల్మానుల నేల యొనర్ప"దని భుట్టోను ప్రశ్నించారు.

అఖిల దేహధారులలో ఆకృతి రంగు నొకటి కానట్లు నానావిధ మతములు వెలయుట సహజ మనియు, ప్రకృతిలో వైవిధ్యము నైజమనియు వచించి, 'ఎన్ని జాతి మత భేదములున్నను వర్ణములున్నను నన్నిటిలో ఆత్మయు పరమాత్మయు నొకటే' యని ప్రవచించినారు. ఈ యన్నిటిలో శిఖరాయమానమై లోకోత్తరమై యుపనిషద్వాణికల్పమైన వాక్యము చెప్పినారు.

"మతవాదము లెన్నియైన మానవతావాద మొకటె
మత మనునది పూతరంగు మానవతయె పుట్టురంగు"

ఇంతకంటె మానవతావాది మరొకరుండరు. ఇన్ని చెప్పి యీ పక్షపాత బుద్ధి మానుమనియు, ఎట్టి రాజకీయ శకటమైనను ఈ విషమ పథముల గూలు ననియు హితవు చెప్పినారు.మతరాజ్యము పేరుకు రాదన్నది కవిగారి యాశయము.

'కాకిగోల' యను కవిత చమత్కారమైనది. ఇందు భారతభూమి సీతగా, కాశ్మీరము తద్వక్షోజముగా, భారతీయ ధర్మమూర్తి శ్రీరాముడుగా, పాకిస్తాన్ అధినేత కాకాసురుడుగా రూపించబడి రామాయణములోని కాకాసుర వృత్తాంతము నవభారత కథ కనుసంధింపబడినది.

"రక్తపు బంధు వనుకొనగ రాబందుగ మారితివో
వక్త్రవ్యేతరముల దిని పాకీపని చేసితివో,
ఏకాక్షి! నీకేటికి ఈ చండాలపు బుద్ధులు
పోకిరివై గరుడునితో పోటీపడెడి యీ సుద్దులు"

అని పాకిస్తాను విపరీత బుద్ధుల కసహ్యించుకొనుట జరిగినది.

'ఎవడు' అను శీర్షికలో భారతదేశ విశిష్ట సంస్కృతి నాగరికత వివరింప బడి మాకు సంస్కారము నేర్పబూనువాడెవడని గద్దించుట జరిగినది. భారతీయులు సంస్కారహీనులు, అనాగరికులని భుట్టో వాగిన మాటలపై ఈ కవిత వ్రాయవలసి వచ్చినది.

క్రీస్తుకు వేల సంవత్సరాలకు పూర్వము నిస్తుల సంస్కృతుల వెల్గు మొహంజోదారో హరప్పలు ప్రసిద్ధములనియు, సకల భాషలకు తల్లియైన సంస్కృతము, మతనదులకు పాలవెల్లియైన వేదమతము మావేయనియు, ఈ దేశమునుండి అంకె లెత్తుకొనిపోయి 'హింద్‌సే' యని మీరు పేరుపెట్టుకొన్నారనియు, ప్రస్థానత్రయము సాటి గ్రంథమొకటైన మీకు కలదా యనియు, షడ్దర్శనాదులు, రామాయణాది మహాకావ్యములు, రామకృష్ణాది మహాపురుషులు, శంకర రామానుజ ప్రభృతి తత్త్వజ్ఞులు, శిల్పాదికళలు, పురాణకాలమున నెగసిన విమానములు మున్నగువానిచేత మహోత్తమమైన సంస్కృతి మీకున్నదా? యనియు తాము గొప్ప సంస్కృతి గలవారమని విఱ్ఱవీగు వారిని ప్రశ్నించినారు. మరియు

"శిల్పములను ముక్కలుగా చెక్కుటలా సంస్కృతి యన
మందిరములు మసీదులుగ మార్చుటలా సంస్కృతి యన
ఇస్లామేతరులగాంచి హింసించుటె సంస్కృతి యన
పశుశక్తులతో విజయము బడయుటలా సంస్కృతి యన
పరధనముల నపహరించి మురియుటలా సంస్కృతి యన
పరస్త్రీల మానభంగపరచుటలా సంస్కృతి యన
మతేతరుల కాఫిరులని మృతినొసగుటె సంస్కృతి యన
ఉపకారికి నపకారము లొనరించుటె సంస్కృతి యన."

అని తత్త్వసత్య విమర్శకు వారిని గురిచేసి యిట్టివారా భారతీయులు సంస్కృతి విహీనులని ప్రేలుటయని హుంకరించినారు. చివరకు మన జాతి లక్షణము చెప్పుచు

> "ఒకరిని చిన్నయనబోము, ఒక రవమానించిన నోర్వము
> సకల దేశ మైత్రి యతిథి సత్కారము మాదు సొమ్ము
> పరుల గుణమ్ములనైనను శిరమున ధరియింతు మెందు
> వెరపించము పరులనెందు, వెరువబో మితరుల ముందు."

అని యాప్రపంచమునకు చాటిరి.

"అవతారము లెత్తు" అను కవితలో అయూబుఖాను కాశ్మీరుకొర కవతారములెత్తిన విషయము వ్యక్తము చేయబడినది. అయూబు బ్రిటనును పెండ్లి మగడనియు, చైనా దొరను నికా మగడనియు, అమెరికాను ఆషిక్ మగడనియు కాశ్మీరును కట్నముగా నిచ్చునతడే కాసమగడనియు ననుచుండునని అయూబు యొక్క రాజకీయ వ్యభిచారము నవహేళనచేయుట జరిగినది. అయూబు నాగజాతి కాయుధాలు 'సప్లయి' చేసి వేరుపడుమని రెచ్చగొట్టును. సిక్కులజాతి వేరని చిత్ర ప్రేమ యొలుకబోసి గురుద్వారపై బాంబులు విసరును. అమెరికా భారతదేశమున కాయుధాలీయవలదని మొత్తుకొనును. ఇన్ని కుతంత్రములు పన్ని భారతముపై దండెత్తిన అయూబుకు ఘోరపరాజయమే యెదురైనది. అతని నన్నూరు పాటన్ టాంకులు నడుమువిరిగి, ఎనుబది జెట్ విమానములు రెక్కలువిరిగి పడిపోయినవి. మరియు ఈ కవితలో కాశ్మీరు పాకిస్తానుకు చెందవలెనన్న అయూబు వాదమును ఖండించి యది భారత దేశాంతర్భాగమేయని గట్టిగా సమర్థించి నిర్ద్వంద్వముగా ప్రకటించినారాచార్యులవారు.

ఇంతవరకు చర్చించిన పండ్రెండు కవితలు పాకిస్తాను దూషణకు సంబంధించినవి. ఇక తక్కిన రెండు చైనాను పోర్చుగీసువారిని నిందించిన కవితలు.

'వెడలు వెన్కకు' అన్న కవితలో దురాక్రమణ చేయుచు భారతదేశ భూములలో చొరబడి వచ్చు చైనా సైన్యమును వెనుకకు వెడలిపొమ్మని హెచ్చరించుట

జరిగినవి. ఇందులో చైనా యుద్ధోన్మాదము హింసాధ్వంసక చర్యలు, బంగర్వాం ధత తీవ్రంగా గర్హింపబడినవి. చైనాను 'ఎఱ్ఱిసైన్యము జూపి యేమొ బెదిరించెదవు, కఱ్ఱపెత్తనము సాగదు ఖబర్దారింక' యనియు, 'ఎఱ్ఱజెండా జూపి ఇండియా పొగబండి నాపజూపెదవేమి దోపిడీ చేయుట' కనియు, 'కొదవళ్ళు గొడ్డండ్లగొని పండ్ల నూరుచున్ హడలెత్తజేయ నీయబ్బతరమే కా'దనియు సాభిప్రాయ పద ప్రయోగముతో నెచ్చరిక చేయబడినది.

చైనావా రాక్రమించుకొన్న హిమాలయముగూర్చి వ్రాసిన పంక్తులు మకుటాయమానములు.

"ఈ హిమాచలరాజమెల్ల మాకాణాచి
ప్రాణమిత్త్రము కాని దీని విడమో బూచి
శీతనగమిది భరతమాత మణిమకుటమ్ము
తల నిలిచియుండ నీ మలగొను టబద్ధమ్ము,
తండ్రి తాతల నుండి తరతరమ్ముల నుండి
ధాతనుండియును మాంధాతకాలమునుండి
హిమనగమ్మిది మాది ఇంటిగోడ పునాది
కొని నీవు ఇటు త్రవ్వుకొనకు నీదు సమాధి"

అని గట్టిగా హెచ్చరించినారు. మరియు హిమగిరి భారతాంబకు మల్లెపూసరము, ఋషీశ్వరులకు తపోమందిరము, భారతీయ హృదయ కమలమానస సరోవరము, మేఘసందేశ కవిత కాకరమని మిగుల రమణీయముగా వర్ణించుట జరిగినది. చివరకు 'ధరణిజను గొనజూచు నరభక్షకుని రీతి, ద్రుపద పుత్రికనీడ్చు దుశ్శాసనుని భాతి, పరుల సొమ్ముల కాసపడకు మోరి కిరాత! వారివలె నీ కొదవు వల్లకాటి విధాతి' యని యభిశంసించుట జరిగినది.

'గోవా విజయము'లో పోర్చుగీసువారి నుండి గోవాను విముక్తము చేసిన విషయము వర్ణింపబడినది. గోవాను గోవుగా భావించి గోవా! యని సంబోధించి బుడుతకీచులు పావనవత్సముల బాపి పాపాత్ములై క్షీరములు పిదుకుకొనుచున్నారని నిందించిరి. ఇది చిలకమర్తి వారు వ్రాసిన 'భరతఖండంబు చక్కని పాడి

యావు'అన్న పద్యమును పోలినదై గోవాపై బుడుతకీచుల యాగడమును వ్యక్తము చేయుచున్నది.

"అంతపాటి యాంగ్లేయులె శాంతగతుల
నవల కేగిరి బుడుతకీచయ్య మిగిలె
కొదమసింగంబు తానది బెదరిపోయె
పుట్టపై నున్న చలిచీమ కుట్టి చచ్చె."

అని యల్పులైన బుడుతకీచుల మిడిసిపాటు గేలిచేయబడినది. 'భారతవీరసింహము శాంతముగా నిదురపోవ పోర్చుగీసు చిట్టెలుకలు బలుపెక్కి నిక్కి నిస్సారతృణం బటంచు పలుసారులు జూలు మీసలు లాగుటచేత మేల్కొని విజృంభించి, 'కీచని యార్చు నా బుడతకీచును భారత సింహ మంత్రితో రాచుచు పంటి క్రిందికిని రావనుచున్ వడి సప్తకంధి వేలా చల దూర్మిమాలికల యావలి త్రోవల వైచె'నని యవలీలగా భారత సైన్యము గోవాను విముక్తి చేసిన విషయము రూపకముతో చక్కగా నిరూపించబడినది.

'ఎటు మారునో' యన్న శీర్షికలో బ్రిటిషువారి విభజించి పాలించుట యను కూటనీతి, పాకిస్తాన్ మతమౌఢ్య దుశ్చర్యలు దూరబడినవి. ఆంగ్లేయులు 'మత విభేదములను బెట్టి మహమదీయుల తలగొట్టి, తౌరక్యప్రభుల రాజధానిని ఢిల్లీని మెట్టి, సంస్థానమ్ముల జుట్లను స్వహస్తములలో నిడుకొనుచు ఆంగ్లేయు లఖండ భారతమును పాలించిరనియు, ఆంగ్లేయులు తాము భారతదేశము పాలించునపుడు పాకిస్తాను విభజన మక్కరలేకపోయినదనియు, వారును వీరును (ఆంగ్లేయులు, ముస్లిములు) ఈసాగురు (ఏసుక్రీస్తు) పాదభక్తుల లగుటయే కారణమనియు, ఐనను ఆంగ్లేయులకు ముస్లిములపైగల స్నేహమేపాటిదో కారాగారమున క్రగ్గిన బహదూరుషా జఫరు తెలుపగలడనియు, కాగా పాక్ విభజనకు హేతు వాంగ్లేయుల పచ్చి స్వార్థమనియు నందుకే 'రవియె యస్తమించనట్టి రాజ్యము వారికి గావలె, చివరకు మాకిడు రాజ్యము చీలికలై విడిపోవలె'నని ఘోరతంత్రము పన్నిరనియు విమర్శించినారు. 'చారిత్రక భౌగోళిక సంబంధము త్రోసిపుచ్చి యీ రీతిగ విభ జింప నెవడధికారమ్ము నిచ్చె'నని యుగ్రులైనారు.

భారతీయు లనేకులు ముస్లిం పాలనలో ముస్లిములై బ్రిటిషు పాలనలో కిరస్తానీలైనారు. దుర్మార్గులై మతము మార్పించిన వారి గూర్చి 'పచ్చిమోసమన బడదో పగటి దొంగతన మనరో, హెచ్చుగ మతములను మార్చవచ్చు జాతి మారదురా'యని యధిక్షేపించినారు. ఆంగ్లేయు లొకరక్తపు జాతినె మారువేష ముల బెంచి మీరు వారు వేరనుచు పోరాటము పెట్టింతురు. వారు రెచ్చగొట్టగా మతతత్త్వముతో సిగము తూలు ముస్లిముల కిట్లు హితము చెప్పినారు.

"మతము నాటకపు వేషము, మానవత సహజరూపము
కితవములీ మతము లనిన మతవాదికి కడుకోపము."

మనమొకే జాతివారమని తెలియక, ఆంగ్లేయుల కుతంత్రము లర్థము చేసి కొనక పాకిస్తాన్ అధికారులు క్రూరులై తమ సోదరులనే శత్రువులుగా భావించిరని తాపపడిరి. ఈమారు పాకిస్తాన్ ఘాతుకచర్యకు తలపడినచో పూర్వాక్రమిత కాశ్మీరు భాగమును మా కొప్పగించవలసి వచ్చునని హెచ్చరించినారు.

ఈ సంపుటిలోని మొత్తము కవితలలో సగభాగ మీ శత్రుదూషణమే యాక్రమించినది. దీనికి కారణము లేకపోలేదు. దురాక్రమణదారులగు శత్రువు లను మన వీరయోధులు పరాజితులను చేయగా కవిగారు నైతికముగా తమ విశిష్ట పాత్రను నిర్వహించినారు. శత్రువుల దురాగతములు లోకమునకు చాటి వారి దోషములను వివరించి మన దేశలక్ష్యములను దృఢనిశ్చయమును తెలియజేసి హెచ్చరించుటకీ దూషణ ముద్దిష్టమై విజయవంతముగా నిర్వహింపబడినది.

## 5. మహావీర సంస్మరణము-స్మృతికావ్యములు :

దేశమున కపకారము చేసిన శత్రువులను నిందించుటతో పాటు దేశము కోసము యుద్ధరంగమున బలియైపోయిన త్యాగాత్ములను స్మరించుట, మహాశౌర్య ముతో దేశరక్షణకు ప్రాణాలకు తెగించి పోరొనర్చి విజయము సాధించిన వీర యోధుల నభినందించుట యవశ్య పవిత్రకర్తవ్యములు. ఈ వర్గపుకవితలు 'జోహర్లు', 'జయ జవాన్' 'స్వాతంత్ర్య లక్ష్మి' యనునవి రచింపబడినవి. వీనితో పాటు నెహ్రూ రాజేంద్ర ప్రసాదుగారల యస్తమయసందర్భమున రచించినమూడు

స్మృతికావ్యములు 'తీరనివేదన' 'దుఃఖగీతి', 'బాబు వియోగము' అనునవి ఆను షంగికముగా ఇందే చేర్పబడినవి.

ఇందు 'జోహార్లు' అన్నది దేశము కోసము జీవితములు ధారపోసిన యమర వీరులకు స్మృత్యంజలి సమర్పించిన విషయము వర్ణింపబడినది. పాకిస్తాను చైనా దాడుల నెదుర్కొనిన వీరయోధులేకాక భారత స్వాతంత్ర్య శాంతి సమరములో సర్వస్వము సమర్పించుకొన్న లెక్క మున్నగు మహానాయకుల సంస్మరణము, 1857నాటి ప్రథమ స్వాతంత్ర్యయుద్ధవీరుల సంస్మరణము సైతము కావింపబడి నది. 'ఈనిన బెబ్బులియై మైదానములో దూకి అరిశిరాల గచ్చకాయ లాడిన ఝాన్సీరాణిని, తల్లిపదములన్ నవ్వుచు తల ఫలముగ నర్పించిన భారతవీర కుమారుడగు భగత్‌సింగును. స్వాతంత్ర్యము నా జన్మహక్కనుచు చాటిన లోక మాన్యుని, చలోఢిల్లి నాదాలతో జయ హింద నినాదాలతో వీరవిహారము చేసిన బోసు బాబును, రక్తపాతమేలేక రాజ్యము సాధించిన పూజ్య జాతిపితను, చెక్కలైన భారతము నొక్కటి చేయుటలో నుక్కుభీము డనిపించిన సర్దారుపటేలును, దేశము నకు కీర్తి తెచ్చిన తల్లులు కస్తూరిబాను సరోజినీదేవిని, భారత సమరాంగణమున ప్రధానశక్తియై యపరవిజయుడైన జవాహరుని' కృతజ్ఞతతో స్మరించినారు. మరియు తెలుగువీరులైన దేశభక్త కొండాను, ఆంధ్రరత్న దుగ్గిరాలను, ఆంధ్రకేసరి టంగు టూరిని, అమరజీవి పొట్టి శ్రీరాములును, తెలంగాణ సర్దారును, దేశమాత సంకెళ్ల నూడదీయ కృషిచేసిన త్యాగధనులను, ఉరికంబాలకు పిరంగిండ్లకు వెనుదీయని ధీరులను, 'వందేమాతరం' ఉద్యమకారులను, సర్వస్వము ధారపోసి శరీరాలు బలి చేసి స్వరాజ్యము సాధించిన స్వర్గలోకవాసులను, పుండువంటి చలిలోపల గుండె నిబ్బరముతో చైనీయుల బలిగొని చన్న మృతవీరులను, పాకిస్తాను రణములో శత్రువులను తరిమికొట్టి స్వర్గస్థులైన యోధులను, చివరకు విజయుడై తాష్కండు విశ్వశాంతి యుద్ధములో ఆహుతియైన ధీమడగు లాల్‌బహదూరును ఆర్ద్రహృదయ ముతో స్మరించి యంజలి ఘటించుట జరిగినది.

'జయ జవాన్' శీర్షికలో యుద్ధములో నసదృశశౌర్యము ప్రదర్శించి వైరు లను తరిమికొట్టి దేశరక్షణ కావించిన వీరవరులగు జవాను లభినందింపబడినారు. వారు 'భండనభీములు ఘన రణ పండిత లయకాలరుద్రు' లనియు, 'చండ విమత ఖండన చణసమరాంగణ వీరభద్రు'లనియు వినుతింపబడినారు. అప్పటి సేనాని

వరేణ్యులైన పదాతి దళాధ్యక్షుడు జయంతనాథ చౌధరిని, విమానదళాధిపతి అపరార్జును డగు అర్జునసింగును, రక్షణమంత్రి చవానును, ప్రధానిశాస్త్రి నుదాత్తముగా కొనియాడినారు.

> "ప్రధాని లాల్‌బహదూర్ భారతాంబ తలగొడుగు
> స్వరూపమున నాటి వడుగు చప్పుడులేని చలిపిడుగు."

అని శాస్త్రిగారి యనల్ప వ్యక్తిత్వ మల్పాక్షరముకురమున ప్రదర్శింపబడినది. శాస్త్రి శారీరకముగా బలవంతుడు కాక పొట్టిగా దుర్బలుడై యుండెను. ఐనను మహాబలశాలియై ధైర్యసాహసములతో భారతదేశమును సంరక్షించెను. నివురుగప్పిన నిప్పువలె ప్రశాంతముగా తోచునతడు సమయము వచ్చినప్పుడు గడబిడ లేకుండనే విజృంభించి శత్రువిధ్వంసము చేయించెను. ఈ విషయమే పైపాదము లందు గంభీరముగా చెప్పబడినది.

> 'స్వాతంత్ర్యలక్ష్మి' యను మూడవ కవితలో
> "జననీ! స్వాతంత్ర్య రమా! జయహారతి గైకొనుమా!
> ఆచంద్రార్కము మా భరతావనిలోనే మనుమా!"

అని దేశస్వాతంత్ర్యలక్ష్మికి జయహారతి యొసగబడినది.

స్వాతంత్ర్యమునకు శత్రుదేశముల దాడులవల్ల ముప్పువచ్చి మన ధీర నాయకుల, వీరయోధుల పోరాటము ఫలితముగా ఆ ముప్పు తొలగి విజయము లభించి నిరాతంకముగా నిర్భరోల్లాసముగా కలకలలాడు స్వాతంత్ర్య లక్ష్మిని సంతోషముగా సంభావించి సన్నుతి గావించుట యీ కవితలోని విషయము. ఇది సకల భారతీయుల పరమధర్మము. ఇందు స్వాతంత్ర్యము యొక్క విలువ, దానిని కాపాడుకొనుటకు దృఢదీక్ష చక్కగా వ్యక్తము చేయబడినవి.

> "స్వతంత్రయగు జన్మభూమి స్వర్గము కన్నను అధికము
> చితికిన పరతంత్రపు జీవితముకన్న మృతియె సుఖము
> మిన్నులు మీద విరిగిపడ మేము సహించెద మెల్ల
> స్వప్నమునను మాతృభూమి శత్రువశమ్మగుట కల్ల."

ఇత్యాది పంక్తులలో పై విషయము సుస్పష్టమగుచున్నది. వీరయోధ ప్రశంస చేసి వారి త్యాగఫలమై సర్వభారత జన మహాభాగ్యమైన స్వాతంత్ర్యమును కొనియాడి తదీయరక్షణకు దీక్షబూనుట మిక్కిలి సమంజసమైన విషయము.

స్మృతి కావ్యములలో 'తీరని వేదన', 'దుఃఖగీతి' యను రెండు కవితలు నెహ్రూగారిని గూర్చినవి. 'బాబు వియోగము' రాజేంద్రప్రసాదును గూర్చినది. ఈ యిద్దరు మహాపురుషులు దేశస్వాతంత్ర్యమునకు, దేశపునర్నిర్మాణమునకు జీవిత మెల్ల ధారపోసిన వారు కావున వీరి యస్తమయము సందర్భమున వ్రాసిన స్మృతి కావ్యము లిందు చేర్చుట యోగ్యముగా నున్నది. 'స్వారాజ్యలక్ష్మికి సఖుడు, స్వాతంత్ర్య రమణికి స్వామి, భారతలక్ష్మికి బంగారుపట్టియైన జవాహరుడు దివంగతుడు కాగా మనకు దిక్కెవ్వర'ని తీరని వేదన వ్యక్తము చేయబడినది. 'దుఃఖగీతి'లో

"భరతమాత కిరీటాగ్రభాగరాగ రంజితానర్ఘ రత్నమ్ము రాలిపోయె
వన్నెచెడి యామె వదనమ్ము వాడిపోయె గుండెలన్ జిమ్మచీకట్లు నిండు
కొనియె."

అనియు, 'భారతీయ నందనవన ప్రాంత శాంత సురభిళిత పారిజాత ప్రసూన మెవ్వరపహరించిరి మాయెద కగ్గివెట్టి' యనియు, 'భారతీయ దివ్యాకాశపథమునంటి వెలుగు నొక దివ్యతారక మలిగిపోయె' ననియు, 'జాతిపిత వెన్క భారతజనని భారము దాల్పగల యగ్రసోదరుడవని నమ్మికొన్న మా యాశలు వమ్మయ్యె నీమృతి యారని యగ్నికాల్పు' అనియు పరిపరి విధముల నతని యుదాత్త వ్యక్తిత్వము స్మరించి దురపిల్లుట జరిగినది.

'బాబు వియోగము'లో రాజేంద్రుని గురించి వ్రాసిన దిగువ పద్యరత్న మతని మహనీయతకు గోపురమెత్తుచున్నది.

"జనకుడొ లేక రాజ ఋషిసత్తముడెట్లగు, ధర్మరాజు శాం
తినిగొని రాజ్యమేలెను, యతిప్రవరుండొ వసించె నాశ్రమ
మ్మున, సురరాడ్గురుండొ తలమెత్తెను విద్దెలు కాదుకాదికే
మ్మునఁ బెనింద్రుడాత, డిలనారసి చేరె సురాలయావనిన్."

## 6. జాతీయ సమైక్యాది ప్రబోధము :

సంపుటిలో నాయకప్రశంస, శత్రుదూషణము, వీరసంస్మరణముతో పాటు అత్యవసరమగు జాతీయ సమైక్యాది ప్రబోధము సోదర భారతీయుల కిందు కావింపబడినది. ఇది 'ప్రబోధము' 'ఏదైతేనేమి' 'మేలుకో' యను కవితలలో చేయబడినది. 'ప్రబోధము' శీర్షికను శత్రుదూషణ విషయ చర్చలో పేర్కొంటిని. ఈ కవితలో శత్రునిందయేకాక సమైక్యాది ప్రబోధము కావింపబడినదని యందు తెలిపితిని.

"భారతీయు లొక్కటియై రారండోయ్ రారండోయ్
చోరు లింట దూరినారు లేలెండోయ్ లేలెండోయ్"

అని కేవల యుద్ధకాలమున ప్రేరేపించుటయేకాక శత్రుభయము లేకుండ, దేశ స్వాతంత్ర్యమునకు హాని కలుగకుండ తీసికొనవలసిన శాశ్వతచర్య జాతీయ సమైక్యము, దేశభక్తి, రక్షణదీక్షయని నొక్కి వక్కాణించినారు.

"ఆరుకోట్ల ముస్లిములు వీరసిఖ్ఖు సింహములు
"పారసీలు క్రైస్తవులు వారూ వీరనకుండా భారతీయులొక్కటియై రారం డోయ్" అని యనుటలో కులమత భేదము పాటించక అందరు భారతమాత పుత్రులే, అందరును భారతీయులే యన్న పవిత్ర జాతీయభావముతో దేశమును కాపాడుకోవలెనని యుద్బోధించినారు. హిందువులగు వరదాచార్యులవారికి ముస్లిములు మొదలగు అన్యమతస్థులపై భేదభావము కలదేమోయని కలలోను తలంచుటకు వీలులేదు. ఈ విషయము పై పంక్తులలో ముస్లిములను సిఖ్ఖులను పారసీలను క్రైస్తవులను సంభావించిన తీరువల్ల తెలియుటయేకాక వారి నిజజీవితము కూడ దీనిని నిరూపించును. జాతీయ కవులగు ఆచార్యులవారికి ప్రాంతీయ భేదము కూడ లేశమాత్రమునులేదు. వారి ప్రబోధనమునకు 'మరాఠా శివాజీలు, రాజపుత్ర రాణాలు, వీరఝాన్సినారీలు'—అందరును సమానముగా పాత్రులైనారు. 'సప్తశతాబ్దులు మొగలైషాలిడుదైన్యమును, ద్విశతాబ్దము లాంగ్లేయుల దాస్యము ననుభవించినాము. దానిని మరువబోము, మరల దానిని పిలువబోము, తిరుగబడితిమేని బ్రహ్మదేవునికి వెరువబో'మని వజ్రసంకల్పమును వెలార్చినారు. ఇంకను 'మత పిశాచకృత్యములను,

మహాప్రళయ నృత్యములను, గతచరిత్ర సత్యములను గమనించుచు సమైక్యమయి రారండోయ్'యని సమైక్యతావశ్యకతను వివరించినారు. గతము ఏ యనైక్యమువల్ల సర్వానర్థములకు మూలమైన దాస్యాంధకారములో జాతి మ్రగ్గినదో ఆ యనైక్యము పునరావృతము కారాదని దృఢ జాతీయ సమైక్యముతో అభ్యుదయ పరంపర లందవలెనని కవిగారి ప్రబోధము.

'ఏదైతేనేమి' అన్న కవితలో జాతీయ సమైక్యమునకు ప్రధానముగా అడ్డు తగులు కులమతముల గూర్చి చెప్పుచు జాతిలోని యీ భిన్నత్వములో ఏకత్వము దర్శింపవలెననియు, అప్పుడే జాతీయ సమైక్యము భాసిల్లగల దనియు రమణీయ దృష్టాంతములతో స్పష్టము చేయబడినది. ఈ విషయము శత్రుదూషణలో వివ రించి యుంటిని.

'మేలుకో'యన్న కవిత ప్రత్యేకముగా జాతికి ప్రబోధము కావించుటకు రచింపబడినది. ఇందులో జాతీయ సమైక్యముతో పాటు జాతి నిర్మాణాభ్యుదయ ముల కవసరమగు ఉద్బోధ కలదు.

"మేలుకొనవోయ్! భారతీయుడ!.... మేలుకొని నీ దేశసంపద
నేలుకొనవలెనోయ్! అన్నా! మేలు గనవలెనోయ్!" అని సంబోధించి
'చితికిపోయిన జాతీయ సోదరుల బ్రతుకుదెరువుకు సుప్రభాతము
పాడవలెననియు,

"గతము గొప్పలు కట్టిపెట్టి మతము మాటలు మూటగట్టి
అంటరాని తనమ్ము నవలకు గెంటవలెనోయీ" అనియు, కూడు గుడ్డల కాధారమగు కాపుబిడ్డడె జగతికి కాపనియు నేతబిడ్డడె ప్రగతికి నేతయనియు, పాడి పంట ముల్లెలగు పల్లెలను బాగుపరచ వలెననియు, వ్యవసాయాభివృద్ధిగావించి కరవురక్కసిని పారద్రోల వలెననియు, 'అనవరతము జపించు "ప్లానింగ్" ప్రణవ మంత్రము విని భయపడి నిరుద్యోగాధిదేవత హడలిపో వలె'ననియు,శాంతిని స్థాపించు కొనవలెననియు ననేక విధములైన కర్తవ్యములను ప్రబోధము చేసినారు. ఇవన్నియు జాతిని పటిష్ఠముచేసి సుస్థిరశాంతి నెలకొల్పి ప్రగతి పథమున సాగజేసి మహో జ్జ్వల దశనందుటకు హేతువులు కనుక యవశ్యాచరణీయములు. కావుననే ప్రబోధకావ్యములలో ఈ రచనలు చక్కని యుపదేశ ప్రయోజనమును సాధించు చున్నవి.

## రసభావ సంపద :

ఈ సంపుటియం దనుస్యూతమగు నొక యితివృత్తము లేకున్నను వస్తువు ననుసరించి ఆయారసములు పోషింపబడి హృదయావర్జకముగ నొప్పారినవి. మొదటి శీర్షిక 'శాంతిదేవత'లో శాంతము, 'లాల్‌బహదూరు'లో ధర్మవీరము, శత్రుదూషణ కవితల కొన్నిట వీర రౌద్ర భయానకరసములు, స్మృతి కావ్యములలో కరుణము సముచితపుష్టి నందినవి.

ఈ సంపుటిలో ముఖ్యముగా లాల్‌బహదూరు, జయం మనదే, ఖబర్‌దార్, ఏమి చేయగలవు?, మతము జాతి, మతమంటే, ఏదైతేనేమి, దివ్యదీపావళి, వెడలు వెన్కకు, గోవా విజయము, దుఃఖగీతి, ఎటుమారునో, జయధ్వజం-అను శీర్షికలు మరింత విశిష్టమై యుదాత్తభావ బంధురములై యలరారుచున్నవి.

భావపుష్టి కనేక మనోజ్ఞాలంకారముల చేత కావ్యసుందరి నలంకరించినారు. ఈ సంపుటిలో వారు తరచుగా ప్రయోగించిన యలంకారము రూపకము.

శాంతిదేవతను వర్ణించుచు 'ఆమె కరములు పూలసరములు....' ఇత్యాదిగా వ్రాసిన పాదములలో నన్నిట రూపకము ప్రయుక్తమై యింపునింపుచున్నది. జయం మనదే యన్న శీర్షికయందును రూపకము తరచైయున్నది. 'ద్వేషకరాళ వ్యాళము' చీకటి భూతము లురుముచు, కాలయముని పాశములై-మున్నగు పాదములలో రమణీయ రూపకములు సాక్షాత్కరించును అట్లే 'ఈ దేశమ్మను విస్తరి' (శునకము పని), 'శాసనాల అద్దములో' (ఏమి చేయగలవు), 'ఎట్టి రాజకీయ శకటము' (ఏదైతేనేమి) అను పంక్తులును, 'దివ్యదీపావళి' కవితలో పాదములకు పాదములును రూపకాలంకార దీపితములై యున్నవి 'గోవా విజయము'లో భారతవీరుని సింహముగను బుడుతకీచులను చిట్టెలుకలుగను రూపించి వ్రాసిన పద్యములలో సావయవరూపకము మిగులమనోజ్ఞమై యున్నది. ఇట్లే 'స్వాతంత్ర్య లక్ష్మి' మున్నగు కవితలందును రమ్యరూపకములు ప్రయుక్తములైనవి.

ఉపమయు నిందలి కవితలలో అందందు పసందుగా పొందుపరచబడినది.

'ముక్కు నొరయుచు నొక ముక్కునివలె నొదలుమరచు'-శాంతిదేవత,

'ఎంత క్లిష్టసమస్యనే నెదురుకొనుచు
వెన్నలోని వెంట్రుకవలె వెలికి తీయును.' -- లాల్‌బహదూరు.
'ఏడ్చు నమెరిక తేల్గుట్టిన దొంగవోలె' — ఏమి చేయగలవు.
'ధరణిజను గొనజూచు నరభక్షకుని రీతి
ద్రుపదపుత్రికనీడ్చు దుశ్శాసనుని భాతి' — వెడలు వెన్కకు.
'ఉచ్చరపిడుగటు శత్రుల చెండాడెకి రణహూరా!' — జయ జవాన్.
ఇత్యాదు లుపమకు మేలైన మచ్చుతునకలు..

ఇందు సందర్భోచితముగా లోకోక్తులు ప్రయుక్తములై సహృదయుల నలరించుచున్నవి.

'ఆమె పట్టినదెల్ల పైడియె ఆమె ముట్టినదెల్ల ముత్యమె. —శాంతిదేవత.
'మొదలు బుట్టు చెవులకన్న పిదప వచ్చు శృంగమ్ములె
పదునై భారతమాతనె ఎదను బొడిచె పాకిస్తాన్.' —పాకిస్తాన్
'నడుమంత్రపు వైష్ణవులకు నామాలవి ఘనమోయి' —కట్టర్ భుట్టో
'ఇంటిపేరు కస్తూరి ఇంట గబ్బిలాల కంపు
అంటే పాకీభాయి అయూబుకెచటి తలవంపు' — ,,
'గీతలెక్కువట చెల్లని ప్రాతవడిన రూపాయకు' — ,,
'కుక్కతోక శిలగట్టిన చక్కగ వచ్చునె భుట్టో' — ,,
'అందని లొట్టియ పెదవున కాసపడింగ్లీషునక్క' — ఏమి చేయగలవు.
'ముంజెయి కడియమ్మును గన ముకురము కావలయునొక్కొ'—మతము జాతి
'బడితె గలవానిదె పుడమియను దినమేగె' —వెడలు వెన్కకు
'కుక్కకాటుకు చెప్పుగొని బుద్ధిచెప్పుదే' — ,,

ఇందలి గేయము లన్నిటిలో నెక్కడనో తప్ప పాదాంతముల నంత్యాను ప్రాసమొప్పి కావ్యసౌందర్యము నినుమడింపజేసినది. ఇంకను ఉత్ప్రేక్ష, అర్థాంతర న్యాసము, శ్లేష, స్వభావోక్తి మున్నగు నలంకారము లందందు తళుక్కున మెరసి రసజ్ఞుల నలరించుచున్నవి.

## శైలీరామణీయకము :

ఇందలి శైలి నితాంతము ప్రసాదమాధుర్యగుణశోభితమై రసభావాను గుణమై సమసంస్కృతాంధ్ర శబ్దవిలసితమై మిక్కిలి యింపు నింపుచున్నది. 'జయం మనదే' యను కవితమాత్ర మోజోగుణ ప్రధానమై రాజిల్లుచున్నది.

జాతీయ భావములకు నిధానమైన యీ ఖండకావ్యములలో జాతీయములతో ముద్దులు గులుకు పలుకుబళ్ళతో చెలువొందిన శైలి చవులూరించుచున్నది.

జాతికి రామరక్ష, వికటాట్టహాసముల్ వెట్టిసేయ, మహోత్సాహము విలయ తాండవము సలుపుచుండ, కబళనార్థమ్ము నాల్కలను చాచ, నీవు నెఱపిన చాణక్య నీతి (లాల్‌బహదూరు), కొంగుబంగారము (వందనము), గడ్డిగఱచినన్ (ఖబర్దార్), కథ అడ్డము తిరిగినది (ప్రబోధము), బూదిబోయి పన్నీరు (మతోన్మాది), తెర చాటుగు భాగవతము (ఏమి చేయగలవు), అరణ్యరోదనము (మతమంటే), కట్టి పెత్తనము (వెకలు వెన్కకు) మున్నగు జాతీయ పదములు నుడికారములు భావ పుష్టి కావించుచున్నవి.

## భాషావిశేషములు :

గ్రాంథిక భాషా సముచితమైన యిందలి కవితలలో సకృత్తుగా వ్యావహారిక పద ప్రయోగము జరిగినది.

జయం మనదే, రారండోయ్, పదం పాడి, కదం త్రొక్కి, మొగని, వారూ వీరనకుండా, పట్టండోయ్, కష్టపడే, పాపాయి, తాతాయి, బాగా, మాదేశం, చేసెదం, చెడితేమి వంటి వ్యావహారిక రూపములు గోచరించును. శిష్టవ్యావహారిక ములై ప్రాచుర్యము గాంచిన యట్టి పదములు సహజములై రచనకు శోభనే కలిగించినవి.

కవితలలో కొన్ని యన్యదేశ్యములు ప్రయోగింపబడినవి. అవి యగత్యమై సందర్భోచితములై యున్నవి. ఉరుదూ భాషీయులగు పాకిస్తాన్ పాలకుల గూర్చి వ్రాసిన సందర్భములలో ముఖ్యముగా నివి ప్రయుక్తములై పాత్రోచితములై యున్నవి.

ఖబర్దార్ పాక్ భాయి, గులాపీ, ఖబురు, మొగలై షాహీలు, షికారు, లగాము, సైతాను, హజరతు బాల్, పాకిసర్కార్, నాపాకు, ఝూటా, ఖోటా (దుష్టము). దగాఖోర్ బడాచోర్ లగాంలేని మూబోరు (మూ = నోరు), బేమాని, పొట్టేగాండ్లము, రోజులు, దస్తావేజులు, జంత్రీ, జీ సర్కార్, బేగమ్, గిరిజా (చర్చి), ఖాజీ (ముస్లిముల పురోహితుడు), అల్లా, ఆదము, మౌలానా (తురుష్క పండితుడు) నికామగడు (పెండ్లి మగడు), ఆషిక్ మగడు (ప్రేమించిన మగడు), కాస మగడు (సొంతము మగడు), రజాకార్లు, ముజాహిదులు, తూఫాను, దండోరా యనునవి యించలి ఉరుదూ పదములు. కట్టర్, సప్లయి, బాంబులు, టాంకులు, జెట్ ప్లేనులు, ప్లానింగ్ అనునవి ఆంగ్లపదములు.

## ఛందో విశేషములు :

ఇందు కృతిసమర్పణతో కలిసి యొప్పుచున్న 32 కవితలలో ఐదు కవితలు మాత్రము పద్యమయములు. తక్కిన వన్నియు గేయకవితలు. కృతి సమర్పణము, లాల్‌బహదూర్, గోవా విజయము, బాబు వియోగము అను నాలుగు పద్య ఖండికలలో సాధారణముగా వాడుకలో నున్న వృత్తములు కందగీతాదులు కలవు. 'తీరని వేదన' యొక్కటి ద్విపదలో సాగినది.

ఇక 27 గేయకవితలలో ఎక్కువగా హయప్రచార రగడకు చెందిన త్రిశ్రగతిలో రచింపబడినవి. 'శాంతిదేవత' హరిణగతి రగడకు చెందిన మిశ్ర గతిలో సగము త్రిశ్రగతిలో సగము రచితమై యున్నది. 'మేలుకో' యన్నది మిశ్రగతిలోను, 'జయగీతి' 'వందనము' 'వెడలు వెన్కకు' అను మూడు కవితలు ద్విరదగతి రగడకు చెందిన ఖండగతిలోను, 'మా దేశం' అను కవిత యొకటి మధురగతి రగడకు చెందిన చతురశ్ర గతిలోను, తక్కిన 21 కవితలు త్రిశ్ర గతిలోను సాగినవి.

వెనుకటి ఖండకావ్య సంపుటములలో ఖండగతిగేయము లిష్టములై విరివిగా రచించిన ఆచార్యులవారిందు మూడు కవితలు మాత్రమే ఖండగతిలో వ్రాసి ముప్పాతిక భాగము కవితలు త్రిశ్రగతిలో వ్రాయుట గమనింపదగినది. ఈ త్రిశ్రగతి యెక్కువగా శత్రుదూషణ వర్గమునకు చెందిన కవితలయందే ప్రయుక్తమై యున్నది. దీనికొక కారణ మూహింపవచ్చును. ఒక విషయమునకు

చెందిన గేయముల నొక భావావేశముతో ఒక నిష్ఠతో వ్రాయబూనినపు డాచార్యుల వారికొకే గేయగతి సాగుచుండినట్లు గమనింతుము. మణిమాలలో మధ్యనొకచో చేర్చిన పదునాలుగు గేయకవితలును ఖండగతిలోనే సాగినట్లు తెలిపియుంటిని. అట్లే ఆహ్వానములో బాపూజి గురించిన 36 గేయములును ఖండగతిలోనే రచింపబడిన విషయమందు గమనించితిమి. ఈ సంపుటియందును శత్రుదూషణము మరియు నితరవర్గములకు చెందిన మొత్తము పదునైదు కవిత లొకే చోట కూర్పబడినవి త్రిశ్రగతిలో రచింపబడినవి. కనుక ప్రత్యేక విషయక కవితల నొక యూపులో వ్రాయబూనినపుడాచార్యుల వారొకే గేయచ్ఛందస్సు వాడుక చేయుదురని తెలియుచున్నది. కావుననే యిందు చాల భాగ మొకే త్రిశ్రగతిలో గేయములు సాగించినారు.

ఇందలి గేయములను త్రిశ్రగతిలోనే నడపించుటలో నొక సామంజస్యము కన్పడును. త్రిశ్రగతి 'తకిట' యను త్రిమాత్రాపదావృత్తితో సాగునది. ఇది వీరరసానుగుణశైలికి మిక్కిలి యుపయుక్తమగును. బ్యాండు లయకు తగినదై కదంత్రొక్కుచు పాడు 'మార్చింగ్' పాటల కనువైన గతి యీ త్రిశ్రగతిలో గలదు. ఈ గతిరగడకు హయప్రచార రగడ యని సార్థకనామము కలదు. ఆచార్యులవారు జయధ్వజములో 'జయం మనదే'యను వీర రసోదంచితమగు గేయమును తదీయానుగుణ లయ గల త్రిశ్రగతిలో సాగించి యదే యూపులో చాల వరకీ గతిలోనే గేయములు రచించిరి. ఇది యిట్లు ఛందస్సంబంధౌచిత్యము చేత చెలువొందుచున్నది.

## ప్రామాదికములు :

సలక్షణమైన యీ సంపుటిలోని కవితలలో కతిపయ ప్రామాదికములు కానవచ్చుచున్నవి. అవి కొన్ని వ్యాకరణ సంబంధులు మరికొన్ని ఛందస్సంబంధులు.

## వ్యాకరణ సంబంధులు :

1. జేవుఖు యస్త్రాగ్నికి (గోవా విజయము) - సంధిదోషము.

2. మీస దువ్వయూబుఖాను (ప్రబోధము) - ,,
మీస దువ్వు న యూబుఖాను - అని నుగాగమ మగును.[1]

3. ఏడ్చమెరిక (ఏమి చేయగలవు) - సంధిదోషము
ఏడ్చున మెరిక - అని నుగాగమమగును.[2]

4. ఆసప డింగ్లీషునక్క (ఏమి చేయగలవు) - సంధిదోషము
ఆసపడు నింగ్లీషు నక్క - అని నుగాగమ మగును.[3]

2, 3, 4 సంఖ్యగల మూడిటిలోను ఒకే విధముగా నుగామము చేయని దోషము వాటిల్లినది. ఈ రకమైన దోషములు వెనుకటి ఖండకావ్యము లందును కొన్ని గమనించి యుంటిమి.

## ఛందస్సంబంధులు :

## క. మాత్రాభంగములు :

గేయములలో దిగువ పేర్కొనిన ఎనిమిది పాదములలో ముద్దయక్షరము లుంచిన చోట్ల మాత్రాభంగము జరిగినది.

1. భేషని ప్రపంచమంతయు వీరభారతమును గాంచె. 'త్రిశ్రగతి' (శాంతిదేవత)
2. శ్వేతకపోత విహంగ స్వేచ్ఛావిహారములె యవి. ,, ( ,, )
3. భారతనదీ జలాలను పాక్ భూముల కిడినందుక. ,, (కట్టర్ భుట్టో)
4. జనతా జనార్దనుని పూజనమే యిహపర భాగ్యము ,, (మతమంటే)
5. ఆభరణ విభేదమ్ములై అంతయునొకే సువర్ణము. ,, (ఏదైతేనేమి)
6. వైరులతో పోరి కూలు వీరస్వర్గ వాసులార! ,, (జోహార్లు)
7. ప్రాణము తెగించి జాత్యభిమానము నిలిపెడి జేడా! ,, (జయ జవాన్)
8. గర్వద్విమాన ఘనబల పర్జన్యప్రతాపుడోయి ,, ( ,, )

1, 2, 3. బాలవ్యాకరణము-క్రియా. 16.

## చ. యతిభంగములు :

నాలుగుచోట్ల యతిభంగములు జరిగినవి. అవి యివి.

1. మన సహనము సౌజన్యము బలహీనత పిరికితనము. (మతోన్మాది)
2. పక్షపాత మతదాసులు పోసిరి పీనుగురాసులు. (పాకిస్తాన్)
3. జయింప సాధ్యమ్ముకాక చెడదిట్టుచు మిడుకుచుండె. (అవతారములెత్తు)
4. తల్లీ! స్వాతంత్ర్యరమా! భారతీయ త్యాగఫలమ! (స్వాతంత్ర్య లక్ష్మి)

ఈ యతిభంగముల గురించి ఆచార్యులవారి నడుగగా 'ఈ విషయము కావలెననియే స్వేచ్ఛను పాటించినాను' అని సమాధానము చెప్పినారు. కాగా బహుగుణోద్భాసితమైన యీ గ్రంథమునందలి యీ కొన్ని ప్రామాదికములు గణ్యములు కావు.

## కావ్యవైశిష్ట్యము :

'జయధ్వజం' దేశభక్తిని, జాతీయతను నిండుగా మెండుగా ప్రబోధించు ఉత్తమ జాతీయ కవితా సంపుటి. మన దేశమునకు శత్రువులగు విదేశీయులను హెచ్చరించి ప్రతిఘటించుటకును, శత్రు దురాక్రమణల నుండి దేశమును కాపాడు కొనుటకును, జాతీయ సమైక్యాది సౌశీల్యముతో దేశాభ్యుదయ పరంపరలను సాధించుకొనుటకును ఇందలి గీతములు చక్కని యుద్బోధ కావించుచున్నవి.

కృష్ణాపత్రిక దీని వైశిష్ట్యము నిట్లు కొనియాడినది.

"పోతన జీవిత చరిత్రను మహాకావ్యంగా రచించి చిరకీర్తి సాధించిన అభినవ పోతన వానమామలై వరదాచార్యులుగారు భక్తకవులేకాదు, జాతీయతనూ దేశభక్తినీ ప్రబోధించు ఉత్తమ జాతీయ కవులు కూడా. వీరి 'జయగీతి'ని ఉత్తమ జాతీయ గీతముల శ్రేణిలో జేర్పవచ్చును. జయధ్వజం మనకుగల ఉత్తమ దేశ భక్తి కావ్యాలలో నిస్సందేహముగా వొకటే యని చెప్పక తప్పదు."[1]

'జయధ్వజం' అత్యుత్తమ జాతీయ కావ్య మనుటలో సందేహము లేదు.[2]

1. కృష్ణాపత్రిక 1969 డిసెంబరు 13 - గ్రంథ సమీక్ష.
2. ఇతర కవి పండితాభిప్రాయములకు అనుబంధము 3 చూడవలెను.

# పోతన చరిత్రము మహాకావ్యము

## ప్రస్తావన :

పోతన చరిత్ర మొక మహాకావ్యము. మహాకవి శ్రీ వరదాచార్యుల వారితర కృతులెన్ని సంతరించినను వారిని చిరయశోవిరాజితులను చేసినది యీ మహాకావ్య రత్నమే. అభినవపోతన బిరుదాలంకృతులను చేసినదీ విశిష్టకావ్యలలామమే. ఆచార్యులవారి ద్వాదశవర్షకవితాతపఃఫలమై సకలాంధ్రజనుల సుకృతివిశేషమై యవతరించినదీ దివ్యకావ్య కల్పకము.

పోతన చరిత్రము పోతనకృత శ్రీమదాంధ్ర భాగవతమువలె పవిత్రమై పూజ్యమై సాహితీపరులకు, ఆధ్యాత్మికనరులకు నిత్యపారాయణయోగ్యమై యలరారు చున్నది. శ్రీభాగవతమువలెనే యిదియును ద్వాదశాశ్వాసవిలసితమై శ్రీరామచంద్ర పదసరోజసమర్పితమై యున్నది. ఇది మహాభక్తుడు మహాకవి మహనీయ సౌజన్యమూర్తియగు బమ్మెర పోతనగారి జీవితగాథను వర్ణించినదై యతని విశిష్ట వ్యక్తిత్వమును పరమరమణీయముగా చిత్రించినది. మొదటి పది యాశ్వాస ములు పోతనగారి చరిత్రము నభివర్ణించినవై చివరి రెండాశ్వాసములు కావ్యాను బంధముగా కూర్పబడి యందు రామచరిత్రము, నరసింహావతార కథ, గజేంద్ర మోక్షము, రుక్మిణీ కల్యాణము మున్నగు ప్రసిద్ధ భాగవతకథలు మహోత్కృష్ట ముగా విరచింపబడి యిది యొక దివ్య ప్రబంధముగా విలసిల్లుచున్నది. ఇది అష్టాదశవర్ణనాత్మకమై ఆలంకారిక ప్రౌఢరచనోద్భాసితమై,యేకనాయకమై,వస్త్వైక్య శోభితమై స్వతంత్రకావ్యమై యొప్పుటచేత మహాప్రబంధమై విరాజిల్లుచున్నది. ఇది సకల పూర్వాంధ్ర మహాకావ్యముల మేలిమిని, అందచందములను సంతరించుకొని యావిర్భవించిన దివ్యభవ్యకావ్యరాజము. సంప్రదాయ ప్రయోగముల మేలు కలయికతో శోభిల్లు రమ్యకావ్యరత్నము. ఇది ధ్వనివిలసితమగు ఉత్తమకావ్యము. ఇది చతుర్విధ పురుషార్థములను బోధించుచు జన్మసాఫల్యహేతువగు మోక్షమును ప్రధానముగా చెప్పుచున్న పుణ్యప్రబంధము. ఇందలి మహావిశిష్టమైన భోగినీనృత్య

షట్టి మాంధ్రసాహిత్యముననే యపూర్వమై హృదయపర్వము కావించుచున్నది. భాషా భావములకు రసపాత్రపోషణలకు బంధురవర్ణనలకు ఆలవాలమై సహృదయ హృదయావర్జకమై యొప్పారుచున్న ఉత్కృష్టకావ్యము. ఇట్టి మహాకావ్యమగు పోతన చరిత్రము గూర్చి చర్చించుటకు ముందు మహాకావ్య లక్షణములను వివరింతును.

## మహాకావ్య లక్షణములు :

ఆలంకారికులు కావ్యభేదములను తెలుపుచు అందు పద్యకావ్యములు నిబద్ధ ములు, అనిబద్ధములని రెండు విధములుగా వింగడించిరి. వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తిలో పద్యకావ్యము అనిబద్ధము నిబద్ధమని రెండు తరగతులని తెలిపెను.[1] భామహుడు తన కావ్యాలంకారమున సర్గబంధము, అభినేయార్థము, ఆఖ్యాయిక, కథ, అనిబద్ధము-అని కావ్యముల నైదువిధములుగా విభజించి చెప్పెను.[2] ఈ యైదింటిలో అభినేయార్థమన రూపకము. ఆఖ్యాయిక, కథ యనునవి గద్య కావ్యములు. కాగా మిగిలిన సర్గబంధము, అనిబద్ధము అనునవి పద్యకావ్యములు. ఇందలి సర్గబంధమే వామనుడు చెప్పిన నిబద్ధము.

నిబద్ధము లేదా సర్గబంధమన మహాకావ్యము. అనిబద్ధమనగా నుపకావ్యము. ఇవి ముక్తకాది ఖండకావ్యములు. వీనిని గూర్చి ఖండకావ్య ప్రక్రియావ్యాసమున వివరించియుంటిని. ప్రస్తుతము సర్గబంధము గూర్చి చర్చించవలసియున్నది.

సర్గబంధ మనగా సర్గములతో కూడుకొన్నది. ఇది విస్తృతమైన కథతో వివిధ రసభావములతో, బహుపాత్రలతో ప్రకృష్టబంధముతో నొప్పారి సంధి సామగ్రీ సమన్వితమై యుండును. సంధిసామగ్రి యనగా కావ్యములోని పద్యముల

1. పద్య మనేకభేదమ్ తదనిబద్ధం నిబద్ధంచ
—కావ్యాలంకార సూత్రవృత్తి : ప్రథమాధికరణము, తృతీయాధ్యాము, 26, 27 సూత్రములు

2. "సర్గబంధోభినేయార్థం తథైవాఖ్యాయికా కథే
అనిబద్ధంచ కావ్యాది తత్పునః పంచధోచ్యతే"
—కావ్యాలంకారము : ప్రథమ పరిచ్ఛేదము, 18 వ శ్లోకము.

నన్నిటిని ఏకసూత్రమున పుష్పమాలవలె కూర్చు కథ, కథ ననుసరించి సాగు వర్ణనలు, వర్ణనలను నడపు పాత్రలు సన్నివేశములు మొదలగు సాధనములతో ఆద్యంతముల కవిచ్ఛిన్న సంబంధము కలిగించు రచన. కథా భాగములగు సర్గములతో బంధింపబడి యుండుటచేత సర్గబంధ మనబడినది. అవిచ్ఛిన్న కథచేత నిబంధింపబడునది- కూర్పబడునది- కనుక నిబద్ధ మన నొప్పినది. ఇదియే మహాకావ్యము.

మహాకావ్యలక్షణమును విశ్వనాథుడు సమగ్రముగా వక్కాణించియున్నాడు.

"సర్గబంధో మహాకావ్యం తత్రైకోనాయక స్సురః
సద్వంశక్షత్రియోవాఽపి ధీరోదాత్తగుణాన్వితః
ఏకవంశ భవా భూపాః కులజా బహవోఽపి వా
శృంగార వీర శాంతానా మేకోంగీరస ఇష్యతే
అంగాని సర్వేఽపి రసాః సర్వే నాటక సంధయః
ఇతిహాసోద్భవం వృత్త మన్యద్వా సజ్జనాశ్రయమ్
చత్వార స్తస్య వర్గాః స్యుస్తే ష్వేకం చ ఫలం భవేత్
ఆదౌ నమస్క్రియాశీర్వా వస్తునిర్దేశ ఏవ వా
క్వచిన్నిందా ఖలాదీనాం సతాంచ గుణకీర్తనమ్
ఏకవృత్తమయైః పద్యై రవసానేఽన్య వృత్తకైః
నాతిస్వల్పా నాతిదీర్ఘాః సర్గా అష్టాధికా ఇహ
నానావృత్త మయఃక్వాపి సర్గః కశ్చన దృశ్యతే
సర్గాంతే భావిసర్గస్య కథాయాః సూచనం భవేత్
సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంత వాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః
సంభోగ విప్రలంభౌ చ ముని స్వర్గ పురాధ్వరాః
రణప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయా యథా యోగం సాంగోపాంగా అమీ ఇహ
కవేర్వృత్తస్య వా నామ్నా నాయకస్యేత రస్య వా
నామాస్య సర్గోపాదేయ కథయా సర్గనామతు."[1]

1. సాహిత్య దర్పణము : 6 వ పరిచ్ఛేదము, 315-325 శ్లోకములు.

ఈ మహాకావ్య లక్షణములను దిగువ రీతిగా అంశములుగా విభజింప వచ్చును.

1. నాయకుడు : దేవత కాని, సద్వంశుడగు క్షత్రియుడు కాని, ఏకవంశ భవులైన రాజు లనేకులు కాని యుండవచ్చును. నాయకుడు ధీరోదాత్తుడై యుండును.

2. రసము : శృంగార వీర శాంతములలో ఒకటి యంగిరసము, తక్కిన రసము లంగములు.

3. రచనా నిర్వహణ : నాటకము నందువలె ముఖాది పంచ సంధులుండును.

4. ఇతివృత్తము : ఇతిహాసోద్భవము కాని, సజ్జనాశ్రయ మితరము కాని యుండును.

5. ఉపదేశము : చతుర్విధ పురుషార్థములుండి యందొక్కటి ఫలమగును.

6. కావ్యాది : ఆశీస్సు, నమస్కారము, వస్తునిర్దేశము అనువానిలో నొకటి యుండును.

7. ఆయా సందర్భములందు దుర్జననింద, సజ్జన స్తుతి కావింపబడి యుండును.

8. సర్గములు : అన్యూనాధిక పరిమితిగల సర్గము లెనిమిదికంటె నెక్కువగా నుండును.

9. ఒక సర్గలో ఒకే విధమైన వృత్తములుండి సర్గాంతమున నన్యవృత్తము లుండును నానావృత్తమయములైన సర్గములును క్వచిత్తుగా నుండును.

10. సర్గాంతమున భావిసర్గయొక్క కథా సూచన యుండును.

11. వర్ణనలు : సంధ్యలు సూర్యుడు చంద్రుడు ఋతు వన సాగర శైలాదులు 22 వరకు వర్ణనలు యథాయోగముగా సాంగోపాంగముగా వర్ణింపబడి యుండును.

12. గ్రంథనామము : ఈ మహాకావ్యమును కవి పేరగాని, ఇతివృత్తము పేరగాని, నాయకుని పేరకాని, ఇతరుని పేరకాని పేర్కొనవలయును. సర్గమందు చెప్పబడిన కథకు తగిన నామ మా సర్గమున కుంచ వలయును.

విశ్వనాథుడు చెప్పిన యీ మహాకావ్యలక్షణములు పోతన చరిత్రమున కన్వయించి యని సమ్యగ్లక్ష్యమై విరాజిల్లు చున్నది. కాగా పై ఆలంకారిక లక్షణములకు సర్వవిధముల లక్షితమై లేక పోతన చరిత్ర మొకకొన్ని యంశములలో భేదించుచున్నది.ఆ భేదము నవ్యకవితాలక్షణానుసారియై యుపజ్ఞావిలసితమై యొప్పు చున్నది. ఈదృశమైన పోతన చరిత్ర మహాకావ్యమునకు లక్ష్యలక్షణ సమన్వయము కావింతును.

## లక్ష్యలక్షణ సమన్వయము :

1. నాయకుడు : వేలుపుకాని, సుక్షత్రియుడుకాని యుండి ధీరోదాత్తుడై యుండవలయునని లక్షణమున చెప్పబడగా పోతన చరిత్రములో నాయకుడగు పోతన బ్రాహ్మణుడై ధీరశాంతుడై యున్నాడు. నాయకవిషయమున నిట్టిభేదమిందు కలదు. ఇవి నవ్యమైన మార్పు.

నవ్యకవితలో కులప్రసక్తి లేకుండ సామాన్యుని నాయకుని చేసి కావ్యములు వ్రాయబడినవి. ఈ విషయమును డా॥ సి. నారాయణరెడ్డిగారిట్లు వివరించిరి.

"మన ప్రాచీనకావ్యములలోని పాత్రలు ప్రాయికముగా దివ్యములు, దివ్యాదివ్యములే. ఏ కొన్ని అదివ్య (మానవ) పాత్రలున్నను అవి అగ్రవర్ణములకు చెందినవే. బసవపురాణాదులలో మడివాలు మాచయ్యవంటి శూద్రపాత్రలున్నను అవి భక్తి ప్రయోజనము కలవి. నవ్యకవిత్వములో క్రింది వర్ణములకు చెందిన పాత్రలు నాయికానాయకులగుట గొప్పమార్పు. ఎంకిపాటలు, వనకుమారి, లవణ రాజుకల మున్నగువానిలో సామాన్యజనుల జీవితములే చిత్రింపబడినవి."[1]

ఆలంకారిక వచనానుసారముగా ప్రాచీన కావ్యములలో నాయకులు దివ్యులు, రాజులుండగా నవ్యకావ్యములలో కర్షక కార్మిక హరిజన గిరిజనాదులు నాయకులై యుండుట యన్నది హస్తిమశకాంతరము. కాగా ఆచార్యులవారు ప్రస్తుత వస్తు సముచితముగా సద్విప్రుని నాయకునిగా జేసి దక్షతతో నిర్వహించినారు.

1. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు : నవ్యకవిత్వలక్షణములు-వస్తునవ్యత, పుట 181.

దండి మహాకావ్యలక్షణము చెప్పుచు

"సర్గబంధోమహాకావ్య ముచ్యతే తస్యలక్షణం
ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశో వాఽపి తన్ముఖం
ఇతిహాస కథోద్భూత మితరద్వా సదాశ్రయం
చతుర్వర్గ ఫలాయత్తం చతురోదాత్తనాయకం
నగరార్ణవశైలర్తు......................
న్యూనమ ప్యత్రయైఃకైశ్చిదంగైః కావ్యం న దుష్యతి
యద్యుపాత్తేషు సంపత్తి రారాధయతి తద్విదః" 1

అని యితివృత్తాదుల విషయము తెలిపెనేకాని నాయకుడు వేలుపుకాని రాజుకాని యుండవలయునని నిర్దేశింపలేదు. చతురోదాత్తనాయకు డుండు నన్నాడు కాని యతని వర్ణప్రసక్తి తేలేదు. ఇది చాల ముఖ్యమైన యంశము. దీనినిబట్టి నాయకుడు దేవతకాని రాజుకాని యుండుటయేకాక విప్రాదు లుండవచ్చుననుటకు వీలున్నది. మరియు పోతన విప్రుడైనను వైదికకర్మలు పౌరోహిత్యముచేయు వాడు కాక గ్రామకరణముగా ఉన్న అమాత్యుడు, నియోగి. అంతేకాక కర్షకవృత్తిచేత జీవనము సాగించిన సుకవి. కావున కర్షకుడు, కవియైన పోతన నాయకుడగుట సంప్రదాయమునకు నవ్యతకు సమన్వితముగా నున్నది.

ఆలంకారికులు తమ కాలమువరకు వెలసియున్న కావ్యములను పరిశీలించి లక్షణము చెప్పుదురు. తర్వాతికవులు తమకాలము వరకుగల లక్ష్యలక్షణముల ననుసరించి కావ్యములు వ్రాయుచుందురు. సంప్రదాయపద్ధతి యిదికాగా ప్రతిభావంతులైన మహాకవులు దేశకాలపాత్రములను దృష్టియందిడుకొని యుపజ్ఞతో నూత్న ప్రయోగములు కావించి మెప్పింతురు. 'నిరంకుశాః కవయః' అనుటలో పర్యాప్తమైన అర్థమిట్టిదే. అట్టి నూతన ప్రయోగములు తదనంతరకవులచేత అనుసరింపబడి కాలక్రమమున సంప్రదాయములగుచున్నవి. అట్టివి మరల ఆలంకారికులచేత కారికలై లక్షణగ్రంథముల నలంకరించుచుండును. ఔచితీవేత్తయగు మహాకవి యెప్పుడును లక్షణమునకు నూటికి నూరుపాళ్ళు లొంగియున్నటుల మన మెచ్చటను కానము. కావుననే పూర్వము నుండియు మహాకవులు సంప్రదాయానుసారులగుచునే నవ్యప్రయోగములు చేయుచుండిన దానికి నిదర్శనము లనేకములు

1. కావ్యాదర్శము : ప్రథమాధ్యాయము, 14-20 శ్లోకములు.

కలవు. అట్టి వానిలో నొకటి విప్రాదులను నాయకులను చేయుట. వరదాచార్యుల వారట్లే విప్రుడగు పోతనను కావ్యనాయకుని చేసిరి.

ఈ విప్రుని నాయకుని చేయుట యన్నది ఆచార్యులవారి నూతన ప్రయోగము కాదు. ఇది బహుకాలము నుండి యున్నది. శివకవులు తమ సమకాలిక భక్తుల చరిత్రలతో మహాకావ్యములు వ్రాసిరి. పాల్కురికి సోమనాథుడు విరచించిన పండితారాధ్య చరిత్రములో నాయకుడు విప్రుడగు మత గురువు. బసవ పురాణములోని బసవేశ్వరుడు బ్రాహ్మణుడయ్యు కులమును నిరసించిన వీరశైవ మతప్రవక్త. కృష్ణరాయల విష్ణుచిత్తీయమున నాయకుడు భక్తశిఖామణి యగు విప్రుడు. రామకృష్ణుని యుద్భటారాధ్యచరిత్ర నాయకుడు మతగురువగు విప్రుడు. వైజయంతీవిలాసమున విప్రనారాయణుడు భక్తవరేణ్యుడగు బ్రాహ్మణుడు. రఘునాథ భూపాలుని వాల్మీకి చరిత్రములో నాయకుడు కిరాతుడయ్యు తపశ్శక్తిచేత ఋషిచంద్రుడై ప్రకాశించిన ఆదికవి. ఇట్లెన్నియో ప్రాచీన కావ్యములందు విప్రాదులను నాయకులుగా గాంచగలము. ఆధునిక యుగమునందును వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి శంకర విజయము మహాకావ్యమున సద్బ్రాహ్మణుడు జగద్గురువైన శంకరాచార్యుడు నాయకుడు. అట్లే తుమ్మల సీతారామమూర్తిగారి ఆత్మకథలో వైశ్యరత్నము, జాతిపిత గాంధీ మహాత్ముడు నాయకుడు. ఇట్లే విప్రాదులను నాయకులను జేసి రచించిన యాధునిక కావ్యములెన్నియో కలవు. కావున పోతన చరిత్రములోని పోతన నాయకత్వము ప్రయోగసమ్మతమై సమంజసమై యొసగుచున్నది.

ఇక నాయకుడు ధీరోదాత్తుడై యుండునన్న దానికిని పోతన చరిత్ర నాయకుడు ధీరశాంతుడగుటచేత లక్షణమునకు భిన్నముగా నున్నది. పోతన పరమ భక్తాగ్రగణ్యుడగు విప్రుడు. గుణకర్మ స్వభావముల చేత ధీరశాంతుడు. చతుర్విధ కావ్య నాయకులలో నొకడగు ధీరశాంతుని (ధీరప్రశాంతుని) గూర్చి విశ్వనాథుడిట్లు వచించెను.

"సామాన్య గుణైర్భూయాన్ ద్విజాదికో ధీరప్రశాంతస్స్యాత్"[1]

1. సాహిత్య దర్పణము : తృతీయ పరిచ్ఛేదము, 34 వ శ్లోకము.

నాయక సామాన్యగుణము లగు త్యాగాదులు గల ద్విజుడు ధీరశాంతుడని చెప్పబడినది. ద్విజుడన అమాత్య విప్రవణిజులలో నొకడని వివరింపబడి యుండుటవల్ల పోతన విప్రుడగు ద్విజుడై భక్తుడు ధీరుడు శాంతుడు నగుటచేత ధీరశాంతుడై యొప్పుచున్నాడు. పోతన మహాకావ్యములో నాయకుడు వేలుపుకాని భూపతికాని కాక విప్రుడైనందున ధీరశాంతుడై యుండుట జరిగినది. ఇది దర్పణ కార లక్షణ విరుద్ధమైనను అనేక మహాకావ్యములలో నున్నట్టిదే. విష్ణుచిత్తీయమున విష్ణుచిత్తుడు, పాండురంగ మాహాత్మ్యమున పుండరీకు డిట్టి ధీరశాంతులే.

2. మహాకావ్యమున శృంగార వీర శాంతములలో నొకటి యంగిగా తక్కిన రసము లంగములుగా నుండునని చెప్పబడెను. ఈ రసవిషయమున పోతన చరిత్రము చక్కని లక్ష్యమై విరాజిల్లు చున్నది. ఇందు శాంత మంగిరసము. భక్తి శృంగార వీర కరుణాదు లంగములు. కావ్యమున తదితర రసముల కంటె శాంత భక్తి రసములు చాల విస్తరించియున్నవి. భక్తియే ప్రధానరసమై యొప్పు చున్నది. ఇందలి యంగిరసమగు శాంతము భక్తియందంతర్భవించి యున్నది. ఈ విషయము 'రసనిర్వహణము' అను వ్యాసమున విపులముగా చర్చింపబడును.

3. రచనా నిర్వహణమున నాటకమునందువలె ముఖాది పంచ సంధులుండు నన్న లక్షణము పోతన చరిత్రమున లెస్సగా పట్టినది. ఉపక్రమోపసంహారము లతో కథను చక్కగా చిక్కగా నిర్వహించుటయే యీ పంచసంధుల ప్రయోజ నము. ఈ విషయమున వరదాచార్యులవారు ప్రత్యేక శ్రద్ధ వహించి పంచ సంధు లను నిర్వహించి మహాకావ్య కథకు మంచి పటిష్ఠత నాపాదించినారు. సంధి పంచ కములో ముఖ సంధియందు కథారంభము, ప్రతిముఖ సంధియందు కార్య ప్రయ త్నము, గర్భసంధియందు కార్య ప్రాప్త్యాశ, విమర్శ సంధి యందు కార్యనియ తాప్తి, నిర్వహణ సంధియందు కార్యఫలాగమము వర్ణింపబడును. ముఖాది సంధు లేర్పడుటలో పంచావస్థలగు ఆరంభాదులకు అర్థప్రకృతులగు బీజబిందు పతాకా ప్రకరీ కార్యముల సంబంధము కూర్పబడి యుండును.

పోతన చరిత్రమున నాయకుడైన పోతన శ్రీమహాభాగవతము నాంధ్రీక రించి భగవదంకితము గావింప వ్యాసాంశలో జన్మించిన మహాపురుషుడు. అతడు మహాభక్తుడై మహాకవియై జీవితమును కవిత్వమును శ్రీకైవల్యపదము చేరుటకు

ధారవోసిన మహనీయుడు. మహాకావ్యమున పోతన జన్మించి బాల్యమున తల్లి దండ్రులతో పాల్కురికి జాతర కేగి చూచిన వీధి భాగవతమువల్ల తత్త్వజిజ్ఞాస, తిరుగు ప్రయాణములో మార్గమధ్యమునందలి మావి తోటవల్ల కవితాసక్తి కలిగి, తర్వాత చిదానంద యోగివల్ల రామతారక శారదా మంత్రముల యుపదేశము పొందుటతో భక్తికి కవితాసక్తికి బీజములు పడి ప్రధానకథ ప్రారంభమై ముఖ సంధి నిర్వహింపబడినది. పిమ్మట మంత్రోపాసన, కవితా రచనాభ్యాసము జరిగి గంగా సైకత స్థలమున శ్రీరామచంద్ర దర్శనమై ఆ దేవుని కంకితముగా శ్రీమహా భాగవతము తెలుగుచేయ నానతిలభించి భవహరముగా ఆంధ్ర భాగవత రచన కావించుటతో బీజప్రాయమైన భక్తి, కవిత బిందువువలె విస్తరించి కార్య ప్రయత్నము జరిగి ప్రతిముఖసంధి నిర్వహింపబడినది. భాగవతము తమ కంకితము చేయవలెనని సింగభూపాలుడు, ప్రౌఢ దేవరాయలు చేసిన ప్రయత్న ములు, ఆ విషయమున శ్రీనాథుడు చేసిన ప్రేరణ మిక్కుటమై రామాంకితము చేయ నిశ్చయించిన తన దివ్యసంకల్పము నెరవేరునో లేదో యని పోతన సంశయాకులుడగుటతో ప్రాప్త్యాశ కలిగి గర్భసంధి నిర్వహింపబడినది. ఇందు శ్రీనాథుని చరిత్ర, సింగభూపాలుని కథ పతాకలై యొప్పుచున్నవి. పిదప పోతన అన్నగారి మాట కాదనలేక కర్ణాట చక్రవర్తికి గ్రంథ మంకితమిచ్చుటకు విధిలేక యొప్పుకొని పోవుచుండ మెట్టుకుధరమందలి రామాలయమున వాణి ప్రత్యక్షమై తనను పొట్టకోసమమ్మబూనినందులకు శోకింపగా 'ఆకటికింగొనిపోయి యల్ల కర్ణాటకిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!' యని వాగ్దానము చేసి వాగ్దేవి నోదార్చుటతోను, పిమ్మట రాచకొండ సేనాపతిచేత భాగవతము బలిమిమెయి కొంపోబడగా విరాగియై పోతన తీర్థయాత్రలు చేసి యొంటిమిట్టలోని రామచంద్రుని సన్నిధిలో గ్రంథ రక్షణార్థము ప్రార్థనలు కావించుచుండ రామాజ్ఞచే సింగ భూపాలుడు భాగవతమును కాపాడి పోతన శిష్యులచేత శిథిలభాగములను పూరింప జేయుటతో కార్యనియతాప్తి యేర్పడి విమర్శసంధి నిర్వహింపబడినది. ఇందు జంగమకన్యా జ్యోతిపురరాజ్ఞీ వృత్తాంతములు ప్రకరులై యున్నవి. చివరకు కర్ణాటప్రభువు పశ్చాత్తప్తుడై కృతి సమర్పణోత్సవభారము వహింపగా శ్రీనా థుని ప్రోత్సాహమున పోతన ఒంటిమిట్ట శ్రీరామచంద్రునకు కృతికన్యను సమ ర్పించుటతో నాయకాభ్యుదయమై కార్య ఫలాగమము వర్ణింపబడుటచేత నిర్వహణ సంధి నిర్వహింపబడినది. ఈ యన్నిటికి తోడుగా కావ్యమున కాద్యంతముల స్వప్న

క్రమోపసంహారములు నిర్వహింపబడుటచేత కథకు సమ్యక్సౌష్ఠవము సమ కూడినది.

4. ఇందలి యితివృత్త మితిహాసోద్భవముకాక 'అన్యద్వాసజ్జనాశ్రయమ్' అనియు చెప్పబడిన లక్షణము ననుసరించి సజ్జనుడైన పోతనగారి చరిత్రము వర్ణింపబడియున్నది.

5. ఉపదేశవిషయమున నిందు చతుర్విధ పురుషార్థములుండి తురీయమగు మోక్షము ఫలమైయున్నది. పోతన జీవితఘట్టములు ధర్మమును, శ్రీనాథుని చరిత్ర మర్థమును, పోతన దాంపత్య జీవనము కామమును చెప్పుచున్నవి. తుదకు పోతన గారి ధ్యేయము భాగవత రచన కావించి భగవదంకితము చేసి పునర్జన్మ లేకుండ జననమును సఫలము చేసికొనుటయే కావున మోక్షము ఫలమై విరాజిల్లు చున్నది.

6. కావ్యాదిని శ్రీరాముని స్తుతించుటచేత ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశము లలో నమస్క్రియ కావింపబడినది.

7. ఆయా సందర్భములలో దుర్జననింద సజ్జనస్తుతి కావింపబడి యుండు నన్న దానికి రాజ్యమదాంధులగు నిరంకుశ రాజులను, పరమలోభియు క్రూరుడు నైన వైశ్యుని, సింగన్నృపతి కంచుకిని మున్నగు వారిని నిందించుట జరిగినది. ఆయా సందర్భములలో చిదానంద గురువరేణ్యుని, పోతనగారి మాతృదేవిని, శ్రీనాథుని, శీలవతియగు భోగినిని ప్రశంసించుట జరిగినది.

8. మహాకావ్యమున సర్గము లెనిమికంటె ఎక్కువగా ఉండునని చెప్పబడి నది. సంస్కృత కావ్యములందు సర్గము లనబడునవి ప్రాకృత కావ్యములందు ఆశ్వాసములని పేర్కొనబడినవి.[1] ఆంధ్ర కావ్యములందును ప్రాకృత కావ్యము లందువలెనే ఆది నుండియు ఆశ్వాస సంజ్ఞతో రచింపబడుచున్నవి. పోతన చరిత్ర మున ద్వాదశాశ్వాసము లున్నవి. మొత్తము 3767 పద్యములుగల ఈ మహా కావ్య మున నెనిమిదాశ్వాసములు మూడు నాలుగు వందల వరకు పద్యములు గలవు.

1. "ప్రాకృతైర్నిర్మితే తస్మిన్ సర్గా ఆశ్వాససంజ్ఞకాః"

—సాహిత్యదర్పణము, 6 వ పరి. 326వ శ్లోకము.

చతుర్థాశ్వాసము కొంత పెద్దదై నాలుగు వందలకు మించిన పద్యములతో ఒప్పగా దశమాశ్వాసము మాత్రము చిన్నదై 136 పద్యములతోనే యున్నది. ఈ కొంత హెచ్చుతగ్గులకు కథాఘట్టములే కారణము. ఇక పద్యములు సాధారణముగా ఆంధ్ర కావ్యములందువలె నానావృత్తమయములై యున్నవి.

9. ఒకసర్గలో నొకే విధములైన వృత్తము లుండునన్నది సంస్కృత కావ్యములకే చెల్లును. తెలుగు కావ్యములందీ నియమము లేదు. కావున నానా పద్య మయములైన యాశ్వాసములే పోతన చరిత్రమున గలవు.

10. సర్గాంతమున భావిసర్గయొక్క కథా సూచన యుండవలెనన్నది పోతన చరిత్రమున పాటింపబడినది. ప్రథమాశ్వాసము చివర పోతన భగవత్కథల వినదలచి తత్త్వ జిజ్ఞాస కలవాడై యున్నట్లు వ్రాయబడినది. ఇది ద్వితీయాశ్వాస మందలి తారకోపదేశమునకు సూచనగా ఉన్నది. ఇట్లే తక్కిన యాశ్వాసముల చివరలలో తర్వాతి యాశ్వాసముల కథలు సూచితమై యున్నవి.

11. దర్పణకారుడు వర్ణన లిరువదియైదు వరకు సంధ్యాదు లుండునని చెప్పినాడు. ప్రతాపరుద్రీయములో పదునెనిమిది వర్ణనలు పేర్కొనబడినవి.[1] అప్పకవి యిరువదిరెండు వర్ణనలు పేర్కొనెను. ఐనను అష్టాదశ వర్ణనలుండు నన్న విషయము ప్రసిద్ధమై యున్నది. ఆలంకారికులు విధించిన వర్ణనలలో వేట మొదలగు నొండు రెండు తప్ప తక్కిన నగరార్ణవ శైలాది వర్ణనలు పోతన చరిత్రములో సందర్భానుసారముగా చేయబడియున్నవి. పదునెనిమిది వర్ణనలలో ఏవైన తక్కువ యున్నను దోషములేదని ప్రతాపరుద్రీయము చెప్పుటచేత పోతన చరిత్రమున కెట్టిలోపములేదు. ఈ వర్ణనల గురించి 'వర్ణనావైదగ్ధ్యము' వ్యాసమున విపులముగా చర్చింపబడినది.

12. ఈ మహాకావ్యమునకు నాయకుడగు పోతన పేరుంచబడినది. ఆశ్వాసములకు తత్తత్కథాభాగములకు తగిన 'జననము-బాల్యము' 'తారకోపదేశము-కల్యాణము' ఇత్యాది నామము లుంచబడినవి.

ఈ విధముగా పోతన చరిత్రము సర్వలక్షణ సంపన్నమై విరాజిల్లుచున్నది.

1. "నగరార్ణవశైలర్తు.......................

ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే,

ఏషా మష్టాదశానాం యైః కైశ్చిదూనమపీష్యతే''

—ప్రతాపరుద్రీయము: కావ్యప్రకరణము, 69-71 శ్లోకములు.

# పోతన చరిత్రము మహాప్రబంధము

మహాకావ్యమగు పోతన చరిత్ర మొక మహాప్రబంధము. ఆచార్యులవారు తమ పోతన చరిత్రమును మహాప్రబంధమని పేర్కొని యున్నారు. గ్రంథముఖ పత్రమున మహాకావ్యమని చిత్రించినను కృతిలో పలుమారులు మహాప్రబంధమని పేర్కొన్న విషయము గమనింతుము.

కావ్యపీఠికలోను, ప్రథమాశ్వాసము నందును దిగువ సందర్భములలో ఈ విషయము కన్పడును.

1. "చదివిన వానివోలె గురుసాహసి నౌచు మహాప్రబంధ మిం
   పొదవఁగ వ్రాయఁబూనితిని...."                    —పీఠిక, 7 వ పద్యము

2. "అర్హతయె లేక యిటులు మహాప్రబంధ
   నిర్మితి నొనర్చు చపలుని నేఁ దెలంగ...."    —పీఠిక, 50 వ పద్యము

3. "అవ్విధి సత్ప్రబంధరచనాశయ మొప్పఁ గృతిన్ రచింతు...."
   —పీఠిక, 52 వ పద్యము

4. "....భాగవత కావ్యరమన్ గృతి నిచ్చె నీకు శ్రీ
   బమ్మెరపోతరా జతని భవ్య చరిత్రము నే మహాప్రబం
   ధమ్ము నొనర్చి...."              —1 వ ఆశ్వాసము, 1 వ పద్యము

   ఆశ్వాసాంతగద్యము లందును మహాప్రబంధ మనియే పేర్కొనబడినది.

"....వరదార్య నామధేయ ప్రణీతంబైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్ము నందు ప్రథమాశ్వాసము."

ఇంతేకాక కావ్యపీఠికలో బహువిధముల కవుల స్తుతియొనర్చి ప్రత్యేకముగా 'ప్రబంధ స్తుతి' యను శీర్షిక పెట్టి

"రూపిత ప్రాసాద గోపురసీమల రమణీయశిల్ప చిత్రణము భంగి....
వర్ణనాదులు కృతికెంతో వన్నె గూర్పఁగల్గునని ప్రబంధాఖ్య సత్కావ్యభేద

గతిని దీర్చిరి నిజకళా ప్రతిభ మెఱయ మనువసుచరిత్రముల్ వ్రాసి
మను సుకవులు.'' —పీఠిక, 51 వ పద్యము

అని వర్ణనాదులు కృతికి మిక్కిలి శోభ కలిగించునని మను వసుచరిత్రములు వ్రాసిన సుకవులు సత్కావ్య భేదమగు ప్రబంధమును తీర్చి దిద్దిరని ప్రత్యేకాభిమానముతో ఆచార్యులవారు ప్రబంధస్తుతిని కావించినారు.

కావ్యములలో ప్రబంధము లనునవి విలక్షణములై విశిష్టములై వెలసి యున్నందువల్లనే ఆచార్యులవారు ప్రబంధ రచనాశయముతో పోతన చరిత్రమును మలచినట్లు విశదమగుచున్నది. ఈ సందర్భమున పోతన చరిత్రము మహాప్రబంధమని నిరూపించుటకు ముందు ప్రబంధలక్షణమును తద్వికాసమును సంగ్రహముగా చర్చింతును.

## ఆంధ్ర ప్రబంధములు :[1]

ఆంధ్ర సాహిత్య చరిత్రలో స్వర్ణయుగమని ప్రశస్తిగాంచిన శ్రీకృష్ణదేవ రాయల కాలమును ప్రబంధయుగమని సాహిత్య చరిత్రకారులు పేర్కొని యున్నారు. ఆ కాలమున అల్లసాని పెద్దనాది కవిపితామహులు తెలుగులో అపూర్వముగా విశిష్టముగా 'ప్రబంధములు' అను కావ్య విశేషములను మనుచరిత్ర వసు చరిత్రాదులను సృజించినందువల్ల ఈ యుగమునకు ప్రబంధయుగ మను ప్రసిద్ధి కలిగినది. కాగా, ఈ ప్రబంధము సంస్కృతాది వాఙ్మయములలో లేని సరిక్రొత్త కావ్యభేదమా? తదనుసరణమా? ప్రబంధముల పూర్వస్వరూపము తద్వికాసము నెట్టివి? ఇత్యాది విషయము లిచట పరిశీలింపవలసి యున్నది.

## ప్రబంధ శబ్ద విచారము :

సకల భాషలకు జననియైన సంస్కృతము యొక్క వాఙ్మయమును పరిశీలించినచో 'ప్రబంధము' అను శబ్దము కావ్య విశేషమునకు కాక కావ్యమునకును,

1. ఈ విషయము గురించి వ్రాయుటలో డా॥ పల్లా దుర్గయ్యగారి 'ప్రబంధ వాఙ్మయ వికాసము' అను సిద్ధాంత గ్రంథ మెక్కువగా నుపకరించెను.

నాటకాదులకును, అలంకార గ్రంథములకును పర్యాయముగా ప్రయోగింపబడినట్లు తెలియును. మరియు కవులు లాక్షణికులు కృతులను కావ్యములనియు ప్రబంధము లనియు నభేదముగా పేర్కొనినట్లు తెలియగలదు.

కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రనాటికలోని నాందియందు పారిపార్శ్వ కునిచే నిట్లు పలికించెను.

"ప్రథితయశసాం భాససౌమిల్లక కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః"

ఇందలి ప్రబంధశబ్దమునకు 'రూపకాణి' యని వ్యాఖ్య యుండుటచేత కాళిదాసు కాలముననే దృశ్యకావ్యములను ప్రబంధములని పేర్కొనినట్లు తెలియు చున్నది. ఇక కాళిదాసవిరచిత దృశ్యశ్రవ్య కావ్యములను ప్రబంధములని యానంద వర్ధనుడు తన ధ్వన్యాలోకములో నిట్లు నుడివెను.

"ఇతివృత్తవశాయాతాం కథంచిద్రసా ననుగుణాం స్థితిం
త్యక్త్వా పునరుత్ప్రేక్ష్యాప్యంత రాభీష్టరసోచిత
కథోన్నయో విధేయః యథా కాళిదాస ప్రబంధేషు"

బాణుడు కాదంబరిని సంపూర్ణముగా రచింపకమునుపే గతించెను. అతని తరువాత అతని కుమారుడు దానిని తండ్రియందలి గౌరవముచేత నుత్తర భాగ ముగా పూరించుచు, పూరించుటకు హేతువు నీ దిగువ విధముగా దెలుపుచు ప్రబంధ శబ్దమును వాడెను.

"యాతే దివం పితరి తద్వచసైవ సార్ధం
విచ్ఛేదమాప భువి యస్తు కథాప్రబంధః
దుఃఖం సతాం తదసమాప్తి కృతం విలోక్య
ప్రారబ్ధ ఏషచ మయా న కవిత్వ దర్పాత్"

ఇందు కథాకావ్యము (గద్యకావ్యము) కథా ప్రబంధమని పేర్కొనబడినది.

శ్రవ్య కావ్యములకు మొట్టమొదటి లక్షణ గ్రంథము వ్రాసిన భామహుడు భావికత్వమను ప్రబంధగుణము కావ్యమునకు ప్రత్యక్షాయమానత్వము కలి గించునని చెప్పుచు

"భావికత్వ మితిప్రాహుః ప్రబంధ విషయం గుణమ్
ప్రత్యక్షా ఇవ దృశ్యంతే యత్రార్థా భూతభావినః"[1]

అని పద్యకావ్యమును ప్రబంధశబ్దముచేత పేర్కొనెను. ఇట్లు పద్యకావ్యమును ప్రబంధమని పేర్కొనిన ప్రప్రథముడు భామహుడే.

రుద్రటుడు కావ్యభేదములను తెలుపుచు స్పష్టముగా కావ్యశబ్దమునకు బదులుగా ప్రబంధశబ్దమును వాడెను.

"జగతి చతుర్వర్గ ఇతి ఖ్యాతిర్ధర్మార్థకామ మోక్షాణాం
సమ్యక్ తానభిదధ్యాత్ రససమ్మిశ్రాన్ ప్రబంధేషు,
సంతి ద్విధా ప్రబంధాః కావ్యకథాఖ్యాయికాదయః
కావ్యే ఉత్పాద్యానుత్పాద్యా మహల్లఘుత్వేన భూయోఽపి"[2]

దీనికి వ్యాఖ్య వ్రాసిన నమిసాధువు 'ప్రబధ్యతే నాయకచరితమ్, ఏతేషు ఇతి కృత్వా' అని నాయకచరితము వీనియందు ప్రబద్ధమగును కావున నివి ప్రబంధము లనబడునని వ్యుత్పత్తి చెప్పెను.

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమునందు తరచుగా ప్రబంధశబ్దమునే వాడెను.

"ప్రసిద్ధేపి ప్రబంధానాం నానారసనిబంధనే
ఏకోరసోఽంగీ కర్తవ్యస్తేషా ముత్కర్ష మిచ్ఛతా"
"ప్రబంధేషు - మహాకావ్యాదిషు నాటకాదిషువా"[3]

అని ప్రబంధములందనగా మహాకావ్యములందు నాటకములందును అని వివరించెను. కావున మహాకావ్యమునే ప్రబంధమని ఆనందవర్ధనుడు పేర్కొనిన విషయము స్పష్టము.

భోజుడు తన రామాయణ చంపువును చంపూ ప్రబంధమని వచించెను.

"గద్యానుబంధ రసమిశ్రిత పద్యసూక్తి
ర్హృద్యాహి వాద్యకలయా కలితేవగీతిః

1. భామహకావ్యాలంకారము : 3 వ పరిచ్ఛేదము, 53 వ శ్లోకము.
2. రుద్రట కావ్యాలంకారము : 16 వ అధ్యాయము, 1, 2 శ్లోకములు
3. ధ్వన్యాలోకము : 3 వ ఉద్యోతము 21 వ కారిక.

"తస్మాద్దధాతు కవిమార్గవిదాం సుఖాయ
చంపూప్రబంధ రచనాం రసనా మదీయా"[1]

విద్యానాథుడు ప్రతాపరుద్రీయముతో పలుమారులు ప్రబంధశబ్దమును ప్రయోగించుటయేకాక తన అలంకార గ్రంథమును అలంకార ప్రబంధమని దిగువ రీతిగా పేర్కొనెను.

"ప్రతాపరుద్రదేవస్య గుణానాశ్రిత్య నిర్మితః
అలంకారప్రబంధోఽయం సంతః కర్ణోత్సవోఽస్తువః"[2]

అలంకార గ్రంథములనేకాక న్యాయవేదాంతాది శాస్త్ర గ్రంథములను కూడ విద్యానాథుడు 'ప్రబంధరాశి' యని పేర్కొన్న విషయము కాననగును. ఇట్లే రామాయణ మహాభారత రఘువంశాది మహాకావ్యములను ప్రబంధములని పేర్కొనిన ఆధారములు కలవు. మరియు శతకాది ముక్తక జాతి కావ్యములును ప్రబంధములని చెప్పబడియున్నవి. వాల్మీకిరామాయణ వ్యాఖ్యాతయగు గోవింద రాజు రామాయణమును ప్రబంధమని యిట్లు పేర్కొనెను.

"అత్రకేచిత్ శోకః శ్లోకత్వమాగత ఇత్యుక్త్యా అస్మిన్ ప్రబంధే శోకరస ఏవ ప్రాధాన్యే నోచ్యతే....వయంతు శృంగార ఏవ ప్రధానరసః"[3]

సంస్కృత నిఘంటువులలోను ప్రబంధశబ్దము కనబడును. అమరకోశమున 'ప్రబంధకల్పనా కథా'[4] యని కలదు. దీనికి 'ప్రబంధస్య కల్పనా'-ప్రబంధము యొక్క కల్పన అనగా రచన యని యర్థము.

'ప్రబంధస్యకల్పనా యథా కాదంబర్యాది రుత్పాద్యత్వాత్' అని భట్టక్షీర స్వామి వ్యాఖ్య కలదు. కావున నిట కాదంబరి వంటి కథాకావ్యమునకు పర్యాయముగా ప్రబంధ శబ్దము ప్రయుక్తమైయున్నది.

1. రామాయణచంపువు : బాలకాండ, 126 వ శ్లోకము.
2. ప్రతాపరుద్రీయము : ఉపోద్ఘాతము, 9 వ శ్లోకము.
3. రామాయణ వ్యాఖ్య - గోవిందరాజు. 4. అమరకోశము : ప్రథమకాండము, వాగ్వర్గము 6 వ శ్లో.

వాచస్పత్యమున 'ప్రబధ్యతే ఇతి ప్రబంధః' రచింపబడునది కావున ప్రబంధమని చెప్పబడుటచేత గ్రంథ సామాన్యార్థమున ప్రబంధ శబ్దమిచట వాడబడినది.

పైన నుటంకించిన ఆధారములవల్ల సంస్కృత వాఙ్మయమున ప్రాచీన కాలమునుండియు ప్రబంధశబ్దము దృశ్యశ్రవ్యకావ్యభేదము లన్నిటికిని, అలం కారాది శాస్త్ర గ్రంథములకును పర్యాయముగా ప్రయోగింపబడినట్లు విశదమగు చున్నది.

ఇక ఆంధ్రవాఙ్మయమునందలి ప్రబంధశబ్ద ప్రయోగమును గురించి పరి శీలింతము.

ఆదికవి నన్నయ ప్రబంధశబ్దము ప్రయోగించలేదు. భారతావతారికలో "దేవా! నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునంజేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద" నని కావ్యమనియే పేర్కొనెను. కాని ఆతని తరు వాతి నన్నెచోడుడు మాత్రము ప్రబంధశబ్దము ప్రయోగించెను. తెలుగులో ఈ శబ్దము వాడిన ప్రథముడితడే. అతడిట్లు వాడెను.

"జంగమ మల్లికార్జును నిసర్గ కవిస్తవనీయ సూక్తియు
క్తిం గొనియాడి, సత్కవితఁ గేనములే కనురక్తయైన భా
షాంగనఁదక్కనేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్."[1]

తిక్కన తన భారతభాగమును 'ప్రబంధమండలి' యని యిట్లు పేర్కొనెను.

"అని రచనా కౌతుకమున
మన మలరఁగ నీ ప్రబంధమండలి కధినా
ధునిగా నేపురుషుని జే
ర్కొనువాఁడనొ యను తలంపుగూరిన మదితోన్."[2]

కేతన తన దశకుమారచరితమును ప్రబంధ నామమున పేర్కొనెను.

1. కుమారసంభవము : 1-48
2. ఆంధ్ర మహాభారతము : విరాటపర్వము, 1-8

ఎఱ్ఱన తన నృసింహపురాణావతారికలో పలుమారులు ప్రబంధశబ్దము ప్రయోగించెను.

"ఇట్లు మహాప్రబంధకల్పనా కుతూహలాయత్తంబగు చిత్తముతో...."[1]

"ఇది యీశ్వరానుశాసన ముదయోన్ముఖ మయ్యెనాకు నూర్జితశుభసం
పద నొనరింతు ప్రబంధము సదయనృసింహావతార సంస్తవ సరణిన్."[2]

ఇత్యాదిగా తన కృతిని ప్రబంధమని ఎఱ్ఱన పేర్కొనెను,

విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణియను లక్షణగ్రంథమున ననేక పర్యాయములు ప్రబంధశబ్ద ప్రయోగము కావించెను. తెలుగులో ప్రబంధ శబ్దమును వాడిన తొలి లాక్షణికుడితడే.

"అట్లు కవికృతమైన కావ్యత్రయంబు గద్యపద్య విమిశ్రసంపాద్యమంద్రు
నగర ముఖ్యాష్టదశవర్ణనముల చేతఁబరఁగు నదియును భవ్య
ప్రబంధమనఁగ".[3]

ఇట్లు ప్రబంధశబ్ద మాత్రప్రయోగము చేయుటకాక ప్రబంధమున కష్టాదశ వర్ణన లుండునని లక్షణము చెప్పినాడు. తర్వాత అష్టాదశ వర్ణనలను పేర్కొనుచు చెప్పిన పద్యమున,

"పురవారాశి....సంకీర్తనా! కరమష్టాదశ వర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబలన్"[4] అని యష్టాదశవర్ణనాన్వితమైనది కావ్యమని కావ్య పదప్రయోగము చేసినాడు. కావున నితడు కావ్యప్రబంధ శబ్దములను పర్యాయములుగా వాడినట్లు తేటపడినది.

మంచన తన కేయూరబాహు చరిత్రమును ప్రబంధమని పేర్కొనెను. కావ్యావతారికలో కృతిపతి తనతో నన్నట్లు చెప్పిన దిగువ పద్యమున ఈ శబ్దము కనబడును.

---

1. నృసింహ పురాణము : 1-14
2. ,, : 1-23
3. కావ్యాలంకారచూడామణి : 3వ ఉల్లాసము, 91వ పద్యము.
4. ,, : ,, , 92వ ,,

"కావున నాకునొక్క కృతిగైకొన నిష్టము....కర్ణసౌఖ్యావహమై ప్రబంధ రచనాశ్రయ మయ్యెడు మార్గమూతగన్."

"స్థాయి రసము శృంగారంబయి యలవడఁ గథలు నియతులై యెడనెడరాఁ
గేయూరబాహు చరితము సేయుము, నీవట్టి కావ్యశిల్పము మెఱయన్."

అని ప్రబంధ శబ్దమును ప్రయోగించుటయేకాక ప్రబంధ రచనాశ్రయ మార్గమును స్థాయి రసము శృంగారంబై యలవడ రచించు విషయము తెలుపుట జరిగినది. ఇందును కావ్యప్రబంధ శబ్దములు రెండును నేకార్థమున ప్రయుక్తములు.

ప్రబంధయుగమునకు పూర్వపు దగు కావ్యయుగమునకు కర్తయగు శ్రీనాథ కవి సార్వభౌముడు తన కావ్యములను ప్రబంధము లనియు కావ్యములనియు పేర్కొనెను. శృంగారనైషధమున అవతారికలో

"నవరసభావానుబంధబంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపదలచి ...." కృతిపతి మామిడి సింగన తనతో నుడివినట్లు చెప్పిన వచనములో, "నాకు నొక్క ప్రబంధంబు పుణ్యశ్లోక పురాతన రాజర్షి చరితానుబంధురంబుగా రచియింపుము"

కథా ప్రారంభ సందర్భమున

"అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పబూనిన యిమ్మహాప్రబంధంబునకున్ గథానాయకుండు"

ఇత్యాదిగా తనకృతిని ప్రబంధము, మహాప్రబంధమని పేర్కొనెను. ఇక ఆశ్వాసాంతగద్యలయందు

"శ్రీనాథప్రణీతంబైన శృంగార నైషధ కావ్యంబునందు.... ........" అని కావ్యముగనే పేర్కొనుట జరిగినది. ఇట్లే శ్రీనాథుడు తన భీమఖండ కాశీఖండములను గూడ ప్రబంధములని పేర్కొనెను.

శ్రీనాథుని సమకాలికులగు జక్కన, మడికి సింగన ప్రభృతులు తమ కావ్యములను ప్రబంధములని పేర్కొని యుండిరి.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు తన శృంగారశాకుంతలములో పలు మాఱులు ప్రబంధశబ్దమును వాడెను. కావ్యావతారికలో

"ఒక్క ప్రబంధంబు రచియింపబూని యున్నంత......" అనెను. తర్వాత,

"శృంగారము ముఖ్యంబగు నంగియు నంగములు దలఁప నష్టరసములున్
సాంగమగునేని టంకము బంగారముతోడి యొఱ ప్రబంధము నొందున్." [1]

కథ ప్రసిద్ధయుమిగుల శృంగారవతియు. బరిగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథితయైన శకుంతలాఖ్యానభంగి నది ప్రబంధముచేయు ప్రఖ్యాతినొంద" [2]

అని వ్రాసెను.ఇందు ప్రబంధమున శృంగార మంగిగను,ఇతరరసము లంగములుగా నుండిన దానికి శోభ యినుమడించునని చెప్పబడినది.ఇచట ప్రబంధశబ్దము ప్రయోగించి కావ్యాశ్వాసాంతగద్యమున "శృంగారశాకుంతల కావ్యమునందు...." అని కావ్యశబ్దము వాడినాడు.

ఈ రీతిగా ప్రబంధయుగమునకు ముందున్న ఆంధ్రకవులు ప్రబంధశబ్దమును కావ్యమునకు పర్యాయముగా ప్రయోగించినట్లు స్పష్టమైనది.

సంస్కృతాంధ్రకవుల యొక్కయు లాక్షణికుల యొక్కయు ప్రయోగములను పరిశీలించినచో ప్రబంధశబ్దమును దృశ్య శ్రవ్యకావ్యము లన్నిటికిని, ఆలంకారిక గ్రంథములకును, వేదాంతాదిగ్రంథములకును పర్యాయముగా ప్రయోగించినట్లు విశదమైనది. ఆంధ్రకవులు ప్రబంధ కావ్యశబ్దముల నభేదముగా ఏకార్థములోనే ప్రయోగించిరి. ఇట్టియెడ పెద్దనాదులు రచించిన కావ్యములనే ప్రబంధము లనుట, ఆ యుగమునే ప్రబంధయుగ మనుట గమనార్హమైన విషయము. కాళిదాసుకాలము నుండియు సంస్కృతాంధ్రములలో వెలసిన కావ్యములకును మనుచరిత్రాదులకును భేద ముండుటవల్లనే కావ్యవిశేషములగు నివియే ప్రబంధములని పిలువబడినట్లు తెలియును. ప్రబంధశబ్దము 16వ శతాబ్ది వరకు కావ్యార్థమున ప్రయుక్తమై ఆ పిదప మనుచరిత్రరచననుండి ముందు వివరింపబడు విలక్షణమైన కావ్యవిశేషమను యోగరూఢార్థమున విలసితమైనది. ఇట్టి ప్రబంధము యొక్క స్వరూపము లక్షణము నెట్టివో చర్చింతును.

1. శృంగారశాకుంతలము : అవతారిక. 25 వ పద్యము.
2. శృంగారశాకుంతలము : అవతారిక, 26వ పద్యము.

## ప్రబంధ లక్షణము :

ప్రబంధము లనబడు కావ్యవిశేషములకు లక్షణముచెప్పు నాలంకారిక గ్రంథములు లేవు వీని లక్షణములను వివరించుటకు ప్రబంధము లావిర్భవించిన పిదప ప్రాయికముగా అలంకార గ్రంథములు వెలువడకపోవుటయే దీనికి హేతువు. ప్రథమ ప్రబంధకర్త అల్లసాని పెద్దన కించుక తర్వాతివాడగు బట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహము వ్రాసినను అది చాలవరకు ప్రతాపరుద్రీయమున కనుసరణమగుటచే ప్రబంధలక్షణమును ప్రత్యేకముగా చెప్పలేదు. కనుక సాహిత్య చరిత్రకారులు మొదలగువారు వివరించిన లక్షణములను పరిశీలింపవలసి యున్నది.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తమ ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహమున పూర్వకావ్యములకు ప్రబంధములకు గల భేదసాదృశ్యముల నిట్లు వివరించిరి.

"1. రచనా విధానము:- ఈనాటినుండియు కవులు ఆంధ్రీకరణ మార్గమును చాలవరకు విడిచిపెట్టి స్వతంత్ర కావ్య నిర్మాణపద్ధతి నవలంబించిరి.

2. కథా వస్తువు : ఇంతకు పూర్వము సంస్కృత పురాణములు సమగ్రముగ కథావస్తు వగుచుండెను. ప్రబంధకవులీ పద్ధతిని విడిచిరి. వారు రెండు విధములైన కథావస్తువును చేపట్టుచుండిరి. (అ) ప్రసిద్ధకథ (ఆ) కల్పిత కథా వృత్తాంతము. అల్లసాని పెద్దన వ్రాసిన మనుచరిత్రవంటి గ్రంథములలోని కథ ప్రసిద్ధమైనది. అనగా పూర్వ గ్రంథములలోనుండి తీసికొనబడినది. పురాణములలో నుండి యొక రమ్యమైన కథను గ్రహించి దానిని రసభావముల కనుగుణముగ విస్తరించి వ్రాయుట ఈ మార్గము. పింగళి సూరనార్యుడు వ్రాసిన కళాపూర్ణోదయము వంటి కావ్యమును కల్పిత కథాప్రబంధమని చెప్పవచ్చును. ఇందులోని వృత్తాంతము కవి తన కల్పనాశక్తిచే నిర్మించుకొన్నది.

3. నాయికా నాయకులు: భారత రామాయణాది గ్రంథములలోని నాయకులు ఉదాత్త ప్రకృతి కలవారు. వారియందు శౌర్యము, ఔదార్యము, సత్యవాక్య ప్రీతి మొదలగు గొప్ప గుణములను కవులు చిత్రించిరి. అట్లే నాయికలైన సీత, ద్రౌపది మొదలగు కాంతలు ధీరస్వభావము గలవారుగా చిత్రింపబడినవి,

ప్రబంధములలోని నాయకులు మధురప్రకృతి గలవారు. వీరు తమ కాలమును లలిత కళలకును కామినీగోష్ఠికిని వినియోగించువారు. ప్రబంధనాయికలు ప్రేమ నిధానములుగా గన్పింతురు. వీరిలో కులస్త్రీలేకాక వారవనితలును ఉన్నారు. నంది తిమ్మన పారిజాతాపహరణములోని నాయిక సత్యభామ కులస్త్రీరత్నము. అల్లసాని పెద్దన మనుచరిత్రలోని వరూధిని గంధర్వకామిని. పింగళి సూరన కళాపూర్ణో దయములోని కలభాషిణి వేశ్యకాంత. వీరు సంగీతమునకు పెట్టినది పేరు.

4. రసము: పురాణములలో వీరశాంతములకు ప్రాధాన్యము. శృంగారము కొలదిగా నుండును. ప్రబంధకవులు శృంగారమునకు అగ్రస్థానమిచ్చిరి. స్త్రీ పురుషుల ప్రేమభావములను వీరు సూక్ష్మాతిసూక్ష్మముగ పరిశీలించి వర్ణింతురు.

5. అలంకారములు: పూర్వకవులు ఉపమాలంకారము రూపకము స్వభావోక్తి వీనిని తమ రచనలలో ఎక్కువగా వాడుచుండిరి. ప్రబంధకవులు ఈ యలంకారములకు తోడు ఉత్ప్రేక్ష అతిశయోక్తి వీనిని విరివిగా కూర్చిరి.

6. వర్ణనము: పూర్వకవులు కథపై ఎక్కువ శ్రద్ధను చూపుచు వర్ణనములను మితముగా చేయుచుండిరి. ప్రబంధకవులు తమ నైపుణ్యమును వర్ణనాత్మకమైన రచనయం దెక్కువగా ప్రదర్శించిరి. కావ్యములలో అష్టాదశ వర్ణనములుండవలెనని కొందరి మతము. నగరము, సముద్రము, పర్వతములు, సూర్యోదయ చంద్రోదయములు, ఉద్యానము, విరహము, జలక్రీడలవంటి రమ్యవస్తువులను పదునెనిమిదింటిని వర్ణించుటయే అష్టాదశ కావ్య వర్ణనమనబడును. ప్రబంధకవులు వీటిని తప్పక పాటించుచుండిరి.

7. శైలి: పూర్వకవులు మొత్తముమీద సులభ సామాన్య శైలికి నలవడినవారు. వీరు కూడ మృదువైన రచన అక్కడక్కడ చేయకపోలేదు.

8. కవిత్వాదర్శము : పురాణముల యుగమందు కవుల యాదర్శము ధర్మప్రతిపాదనము, నీతిబోధ చేయుట. ప్రబంధకాలపు కవులదృష్టి లౌకిక కావ్యదృష్టి. కావ్యము ఆనందమిచ్చిన చాలునని వీరు తలచిరి. ధర్మమును నీతిని

బోధించుటకు వీరు ప్రయత్నము చేయరు. ఇవి పూర్వ కవిత్వమునకును ప్రబంధ కవిత్వమునకును గల సామ్యభేదములు."1

ఇట్లు పూర్వకావ్యములకంటె భిన్నములగు ప్రబంధముల లక్షణ మెట్టిదో విచారింపవలసి యున్నది.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు దిగువరీతిగా ప్రబంధమును నిర్వచించిరి.

"పురాణేతిహాసములలో నొకకథాభాగమును స్వీకరించి వీరశృంగారరసములలో నొక దానిని ప్రధానముగాను మిగిలిన రసములను గౌణముగాను గ్రహించి సంస్కృత మహాకావ్యములలో నుండదగిన పురవర్ణనాద్యష్టాదశ వర్ణనలలోఁ గొన్నిటినైనను ముఖ్యముగాఁజేర్చి తత్తద్రసోచిత వృత్తిరీతుల సంస్కృత (మార్గ) పద్ధతిని దేశీయ (దేసి) పద్ధతినిఁజేర్చి రససంపూర్ణముగ రచించిన కృతులను ప్రబంధములని విశేషాఖ్యతో వ్యవహరించుట యాంధ్రకవి సంప్రదాయ సిద్ధము. ఆ ప్రబంధములను మహాకావ్యములనియు వాడిరి. కేవలము వీర శృంగారములనే కాక ధర్మమునుగాని, భక్తినిగాని ప్రధానముగాగొని రచించిన హరిశ్చంద్రోపాఖ్యానము, పరమయోగి విలాసము మొదలగు ప్రబంధములును కొన్నికలవు.2"

కందుకూరి వీరేశలింగము పంతులుగారిట్లు ఉల్లేఖించిరి.

పురాణములనుండి కథను గైకొని స్వకపోల కల్పనలను విశేషముగాఁజేర్చి పెంచి చెప్పిన కేవలాంధ్రీకరణలుగాని రచనలు ప్రబంధములు.3"

"పురాణాదులలోని 'ఏక దేశకథ' ఇతివృత్తమై దివ్యాదివ్యనాయకమై తద్గుణ వంశశంసనముద్వారా కాంతా సమ్మితోపదేశయుజమై సద్యః పరనిర్వృతి సాధారణ ఫలమును, మోక్షసిద్ధియు పరమప్రయోజనమై భక్తిశృంగారముల (వీరము)లో నొకటి ప్రధానరసమై దృశ్యాదృశ్య కావ్యలక్షణ సమ్మిశ్రితమై యష్టాదశ వర్ణనా

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము : 8 వ ప్రకరణము - శ్రీకృష్ణదేవరాయల యుగము, పుట 106-109.
2. పరతత్వ రసాయనము : పీఠిక.
3. ఆంధ్రకవుల చరిత్రము : భాగము 1, పీఠిక, పుట. xii.

లంకృతముగ తత్సమశైలిలోఁగాని యచ్చతెలుఁగులోఁగాని చంపూపద్ధతిని నాతి విస్తరముగఁ గూర్పఁబడిన మిశ్రబంధము ప్రబంధమనఁదగును.[1]"

డా॥ పల్లా దుర్గయ్యగారు ప్రబంధముల ఆంతరంగిక స్వరూపము నిట్లు నిరూపించిరి.

"ప్రబంధకథ పురాణేతిహాస ప్రసిద్ధమైకవి కల్పనలతో నలంకరింపబడి యుండును. కథాకల్పనము కూడ కల్పనయే యగును. సూరన కళాపూర్ణోదయము నందువలె సమస్తకథయు నొక్కచో కల్పిత మగుటయు కలదు. అష్టాదశ వర్ణనలతో నలంకరింపబడి యుండును. "విభావానుభావ సంచారి సంయోగాద్రస నిష్పత్తిః" అను భరతోక్తికి నుదాహరణములై నవరసములలో నొకటి, ప్రాయికముగా శృంగార మంగిరసముగను, తక్కినవి అంగములుగను నుండును. సంధి సంధ్యంగములచేత సుసంధితములై యుండును. అలంకార సంశోభితములగును."[2]

ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు ప్రబంధ లక్షణములనిట్లు చక్కగా వక్కాణించిరి.

1. "ప్రబంధమునకు ఏకనాయకాశ్రయత్వము, దానితోపాటు వస్త్వైక్యము ప్రధాన ధర్మములు.

2. ప్రబంధము అష్టాదశవర్ణనాత్మకమై యుండవలెను.

3. అందు శృంగారము ప్రధాన రసము; ఆవశ్యకతనుబట్టి తక్కిన రసములు గౌణములు కావచ్చును.

4. ఆలంకారికమైన శైలి ప్రబంధమునకు జీవము.

5. ప్రబంధము భాషాంతరీకరణము కాగూడదు. స్వతంత్ర రచనమై యుండవలెను"[3]

---

1. తెలుఁగు మెఱుఁగులు.
2. ప్రబంధ వాఙ్మయ వికాసము - మొదటి సంపుటము : ఆంధ్ర ప్రబంధముల స్థూల స్వరూపము, పుట 93.
3. తెలుగు విజ్ఞాన సర్వస్వము-3 వ సంపుటము ; 'తెలుగు వాఙ్మయము - ప్రబంధ యుగము,'

విశిష్ట ప్రబంధముల పరిశీలనము చేతను వివిధ పండితుల నిర్వచనముల క్రోడీకరణము చేతను గ్రహించిన పింగళివారి పై యైదు లక్షణములు ప్రబంధముల స్వరూపమును మిక్కిలి చక్కగా విశదీకరించుచున్నవి.

పై లక్షణములకు లక్షితములై యొప్పారు మనుచరిత్రాదులే ప్రబంధములను కావ్య విశేషములుగా పరిగణింపబడుచున్నవి. కాగా మనుచరిత్రాదులకు పై లక్షణములలో నొండు రెండు లక్షణములు పట్టకపోవచ్చును. ఉదారణమునకు మను చరిత్రములో నేక నాయకాశ్రయత్వము లేదు. శ్రీ కాళహస్తి మాహాత్మ్య పాండురంగ మాహాత్మ్యములలో వస్త్వైక్యము కానరాదు. ఐనను తక్కిన లక్షణములు నిండుగా నుండుటవల్ల నవి ప్రబంధములేయై విలసిల్లుచున్నవి. ఉపర్యుక్త లక్షణ పంచకములో జీవభూతమైన లక్షణములు రెండు: 1. ఆలంకారికమైన శైలి, 2. స్వతంత్ర రచన. ఈ రెండు లక్షణములు పట్టని యే కావ్యమైనను ప్రబంధము కాజాలదు. అవశ్యముగా నీతల్లక్షణద్వయ శోభితములగుటవల్లనే మనుచరిత్ర శ్రీ కాళహస్తి మాహాత్మ్యాదులు ప్రబంధములైనవి. శ్రీనాథుని శృంగారనైషధ మొక రమణీయ ప్రబంధమనవచ్చును. కాని యది స్వతంత్ర రచన కాక యనువాద గ్రంథమగుటచేత తెలుగులో నది ప్రబంధముగా పరిగణింపబడలేదు.

ఆంధ్ర వాఙ్మయములో ఈ ప్రబంధావతరణము హఠాత్పరిణామము కాదు. ఆదికవి నన్నయ్యగారి భారత రచనా కాలమునుండియే ప్రబంధశైలికి బీజములు పడినవి. తిక్కనగారి భారతమున ప్రబంధచ్ఛాయలు కానవచ్చును. నన్నెచోడుని కుమారసంభవ మొక ప్రబంధమువలె చెలువొందుచున్నది. ఎఱ్ఱన నృసింహపురాణము శైలిచేతను వర్ణనాదులచేతను ప్రబంధబంధురత నెగడి యతడు ప్రబంధపరమేశ్వర బిరుదాంచితుడైనాడు. శ్రీనాథుని శృంగారనైషధ మనూదిత మనుటయే కాని కేవలము ప్రబంధము. అట్లే ప్రబంధపూర్వయుగమునందలి పిల్లలమఱ్ఱి పినవీరనగారి శృంగార శాకుంతలమును ప్రబంధప్రాయమై యొప్పుచున్నది. ఈ విధముగా నన్నయ నుండియు ఆంధ్ర వాఙ్మయము ప్రబంధోన్ముఖముగా సాగి క్రమవికాస పరిణామములు గాంచి పెద్దనగారి మనుచరిత్రతో సమగ్ర ప్రబంధముగా అవతరించినది. అంతకు పూర్వసాహిత్యమున ప్రబంధ ధోరణులు, ప్రబంధ శైలీ రచనలు కాన్పించినను నవి చాలవరకు అనువాద కావ్యములును అసమగ్ర ప్రబంధములునై యున్నవి.

కావ్య విశేషములగు నిట్టి ప్రబంధము లాంధ్రముననే కాక సంస్కృతము నందును తమిళ కర్ణాటాది భాషలయందును నున్నట్లు తెలియుచున్నది.

ప్రబంధ వాఙ్మయ పరిశోధకులగు డా॥ పల్లా దుర్గయ్యగారు

"ప్రబంధము సంస్కృత సాహిత్య సర్వస్వ పిండీకృత సిద్ధరసఘుటిక" యని నిరూపించుచు నిట్లు వ్రాసిరి.

"సంస్కృత పురాణేతిహాసముల నుండి ప్రసిద్ధ కథావస్తువును, నాటకముల నుండి శుభాంతత, వస్త్వైక్యము, సంభాషణా విధాన పాత్ర పోషణాదులును,....., మహాకావ్యముల నుండి రసాలంకారవర్ణనాదులును, కథాకావ్యముల నుండి సర్వ ప్రబంధ సామాన్య ప్రణయపరిణయకథ, విప్రలంభాదులు, శృంగారరస ప్రాధాన్యమును, ఆఖ్యాయికల నుండి ఆశ్వాస విభాగములును, ఈ కథాఖ్యాయికల యవతారికల నుండి యిష్టదేవతా గురుస్తుత్యాద్యవతారికాంశములును, మరియు చంపూ కావ్యముల నుండి పద్యగద్యోభయమయత్వము, భిన్నవృత్తరచనా విధానమును ఇత్యాద్యనేక రమణీయ విషయములను మాలాకారి భిన్నవర్ణ పుష్పములను వలె స్వీకరించి, యేకత్ర మేళవించి రూపొందింపబడిన ప్రత్యేక రస నిర్భరరచనయే ప్రబంధము. సమస్తవిధ సంస్కృత కావ్య సౌందర్యమును సంతరించుకొనిన సరస సాహిత్య ప్రక్రియ ప్రబంధము. సమస్త లక్షణ లక్షితము. సంగ్రహరూప సంగ్రథితము. ఉపదేశ మనోరంజకత్వములు రెండును దీని యుద్దేశప్రయోజనములు."[1] అని సంస్కృత సారస్వతము నందలి వివిధ ప్రక్రియలలోని యందచందములను మేళవించి సిద్ధము చేసిన యుత్కృష్ట కావ్యవిశేషమే ప్రబంధమని విశదీకరించిరి.

సంస్కృత వాఙ్మయమునందును ప్రబంధము లావిర్భవించిన తీరును వివరించుచు డా॥ దుర్గయ్యగారిట్లు వ్రాసిరి.

"సంస్కృత ప్రబంధముల పుట్టుకకు కిరాతార్జునీయ శిశుపాలవధ కావ్యములు క్రమముగా బీజాంకురముల వంటివి. అనంతరమున కుమారసంభవ,

1 ప్రబంధ వాఙ్మయ వికాసము - మొదటి సంపుటము : 'ప్రబంధము-సంస్కృత సాహిత్య సర్వస్వ పిండీకృత సిద్ధరస ఘుటిక' పుట 124,

అమరుక కావ్యములనుండియు, భోజుని శృంగార ప్రకాశమునుండియు శృంగార రస ప్రాధాన్యమును గ్రహించి సంస్కృత ప్రబంధలత హర్షనైషధమున పుష్పించి ఫలించినది. యుగధర్మము ననుసరించి శ్రీనాథుడీకావ్యమును 15 వ శతాబ్దమున తెనిగించెను. పదునారవశతాబ్ద మాంధ్రమున ప్రబంధయుగమైనది. ఇట్టి ప్రబంధములను భారతీయ ప్రధానభాషా వాఙ్మయములన్నియు నించుమించుగా కావ్యాదులవలెనే గ్రహించినవి."[1]

ఈ పరిశీలనమువల్ల సంస్కృతభాషలో క్రమపరిణామదశలో ఆవిర్భ వించిన కిరాతార్జునీయ నైషధాది ప్రబంధములను దృష్టియందిడుకొని తెలుగులో పెద్దనాదులు స్వతంత్ర ప్రబంధములు రచించిరని తెల్లమగుచున్నది.

## ప్రబంధ భేదములు :

ప్రబంధములు ఛందోభేదము ననుసరించి 1. పద్య ప్రబంధములు. 2. పద్య ప్రబంధములు. 3. పద్యగద్యోభయ ప్రబంధములు. 4. ద్విపద ప్రబంధము లని నాలుగు విధములు. మరియు విషయభేదము ననుసరించి యీ ప్రబంధములు 1. శృంగార ప్రబంధములు 2. భక్తి ప్రబంధములు. అని - ద్వివిధములు. భక్తి ప్రబంధములనే దివ్య ప్రబంధములనియు పుణ్యప్రబంధములనియు నందురు. ఈ భక్తి ప్రబంధములును శైవవైష్ణవ భేదములతో రెండువిధముల నొప్పుచుండును.

## పోతన చరిత్రము ప్రబంధము-లక్ష్యలక్షణ సమన్వయము:

పోతన చరిత్రము సర్వలక్షణ సంపన్నమైన ప్రబంధరాజము. ఆచార్య పింగళివారు తెలిపిన పంచలక్షణముల కిది చక్కని లక్ష్యమై శోభిల్లుచున్నది. ఆ సమన్వయము దిగువ రీతిగా అమరినది.

1. పోతన చరిత్రమున బమ్మెర పోతన నాయకుడుగా అతని జీవితగాథ యభివర్ణింపబడుటచేత ఏకనాయకత్వము, వస్త్వైక్యము చక్కగా సమకూడినవి.

1. ప్రబంధ వాఙ్మయ వికాసము - మొదటి సంపుటము : 'ప్రబంధము సంస్కృత సాహిత్య సర్వస్వ పిండీకృత సిద్ధరసగుటిక' పుట 187

2. పోతన చరిత్రమునం దష్టాదశవర్ణనలలో నొండురెండు తప్ప తక్కిన వర్ణనలన్నియు మనోజ్ఞముగా కావింపబడియున్నవి.

3. లక్షణములో శృంగారము ప్రధాన రసము; తక్కిన రసములు గౌణములు కావచ్చునన్నదానికి మాత్రము పోతన చరిత్రము భిన్నముగా నున్నది. శాంత మంగిరసముగాగల పోతన చరిత్రము ప్రబంధ మెట్లగునను సంశయము కలుగుట సహజము. కాగా శృంగార మంగిగా నుండునన్న ప్రబంధ లక్షణము సర్వత్ర అన్వయించునది కాదు. ఈ విషయము ముందే మనవి చేసితిని. శృంగారేతర రసప్రాధాన్యముగల ప్రబంధములు కలవు. ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము మున్నగు ప్రబంధములు శాంతము, భక్తి ప్రధానముగా గలవి. కనుక శాంత మంగిగాగల పోతన చరిత్రము ప్రబంధ మగుటలో నెట్టి యభ్యంతరము లేదు.

4. పోతన చరిత్ర మాలంకారిక శైలికి పెట్టినది పేరు. ఈ విషయము 'ఆలంకారికత' యను వ్యాసమున చర్చింపబడినది.

5. ఇది భాషాంతరీకరణముకాక స్వతంత్రరచనయై యున్నది. చరిత్రలో గల రవ్వంత కథను, అనుశ్రుతిలోగల కొన్ని కథలను గ్రహించి స్వీయకపోల కల్పనలతో పెంచి వర్ణనాదులతో శోభిల్లజేసి రచింపబడినది పోతన చరిత్రము.

కావున పోతన చరిత్రము సర్వలక్షణ సముద్భాసిత ప్రబంధరత్నము. పోతన చరిత్రము సర్వలక్షణలక్షితమైన మహాకావ్యమని పూర్వవ్యాసమున నిరూపించబడినది. అది మహాకావ్యమేకాక మహాప్రబంధమని నిరూపించుట యీ వ్యాసోద్దేశము. పోతన చరిత్రము మహాకావ్యలక్షణములు, ప్రబంధలక్షణములు సమగ్రముగా పట్టిన కృతిరాజము. ప్రాయికముగా ప్రబంధములు మూడు నుండి ఎనిమిది ఆశ్వాసములు గలవియే కానవచ్చును. మహాకావ్యలక్షణానుసారముగా 'సర్గా అష్టాధికా ఇహ' యను దాని ననుసరించి పండ్రెండాశ్వాసములు గల విస్తృత విశిష్ట మహాకావ్య మగుటచేత ఇది మహాప్రబంధ మగుటలో నెట్టి విప్రతిపత్తి యుండబోదు.

## పోతనచరిత్రము దివ్యప్రబంధము :

మహాప్రబంధమగు పోతనచరిత్రము వస్తువుననుసరించి మిశ్రప్రబంధమై విషయ భేదము ననుసరించి భక్తిప్రబంధమై యొప్పుచున్నది. భక్తిప్రబంధములకే దివ్యప్రబంధము లనియు, పుణ్యప్రబంధము లనియు నామాంతరములు గలవు. తెలుగులో పాండురంగమాహాత్మ్యము, ఆముక్తమాల్యద, శ్రీకాళహస్తి మాహాత్మ్యము వంటివి దివ్యప్రబంధములు. ప్రబంధము నందు ధీరశాంతుడును మహాభక్తుడు నగు పోతనగాథ భక్తిరసోదంచితముగా వర్ణింపబడుటయేకాక కావ్యానుబంధమున శ్రీమన్నారాయణుని యవతారగాథలు భక్తిరస నిర్భరముగా రచింపబడి యుండుట వల్ల నిది దివ్యప్రబంధరత్నమై శోభిల్లుచున్నది.

## పోతనచరిత్రము ఉత్తమ ప్రబంధము :

కావ్యములలో రసవర్ణనాదుల చేత ప్రబంధము బంధురమైనది, శ్రేష్ఠమైనది. సంస్కృతాంధ్రసారస్వతముల సమస్త సౌందర్యములను మేళవించుకొని క్రమవికాసదశలో సర్వాంగసుందరముగా అవతరించిన విశిష్టకృతి యగు ప్రబంధము కాలగతిలో అపప్రథకు గురియైనది. దీనికి దక్షిణాంధ్రయుగమున బరగిన యనంతరప్రబంధయుగము నందలి ప్రబంధరచనయే కారణము. ఆ యుగము నందు కవులలో సృజనాత్మకశక్తి సన్నగిల్లి రాయలయుగము నందలి ప్రబంధముల కంధానుకరణము లగు ప్రబంధములు తరచుగా వెలువడినవి. కావుననే యాకాలము క్షీణయుగమని పిలువబడినది ప్రతిభాశూన్యమైన గతానుగతికమైన నాటి ప్రబంధములు వెగటు కలిగించుచుండును. విజయవిలాసము, వైజయంతీ విలాసమువంటి యే కొన్ని ప్రబంధములో తప్ప తక్కినవి క్షుద్రములై యున్నవి. పిల్లవసుచరిత్రలు, రాధికాసాంత్వనము, శశాంకవిజయము వంటి అసభ్యమైన పచ్చిశృంగార ప్రబంధములు. చంద్రరేఖావిలాపము వంటి బూతుకావ్యములు తలసైనవి. ధర్మోపదేశము కొరవడి భోగలాలసతకు చిత్తాకర్షణ కలిగించు గుణము హెచ్చినది. భావము శూన్యమై కల్పన శిల్పము మరుగై రీతిప్రాధాన్యమైన శబ్ద సౌందర్యము మాత్రము మిగిలి శ్లేషయమకాది చిత్రకవిత్వములు బంధకవిత్వములు పెల్లయినవి. అప్పటి వాఙ్మయదుస్థితిని నవయుగవైతాళికుడు కందుకూరి వీరేశలింగము పంతులు తన సరస్వతీ నారద సంవాదకావ్యమున బాధతో వ్యక్తము చేసె తదీయసముద్ధరణకెంతో కృషి సల్పెను. ఆనాటి అసత్ప్రబంధములకు కంటగించిన సాహితీలోకమునకు భాగ్యోదయముగా నవ్యకవితోదయ మాయెను.

క్రమపరిణామ దశలో భావకవిత్వము పిదప అభ్యుదయ కవిత్వము ఖండ కావ్య ప్రక్రియలో తఱచుగా ఉపాదేయమగుచున్న ఈనాడు మరల వెనుకటి ప్రబంధ ధోరణిలో మహాకావ్యములు వ్రాయుట భావ్యమాయను సందేహము కలుగ వచ్చును. కాని ఆధునిక కాలమున కొందరు సుకవులు మహాకావ్యములు ప్రబంధ ఫణితిని రచించి సహృదయామోదము వడసినారు. అట్టివారిలో వరదాచార్యులవారు విశిష్టులు. ఆచార్యులవారు క్షీణయుగములో ప్రబంధముల కంటిన కల్మషములను చేరనీయక మనుచరిత్ర వసుచరిత్రాద్యుత్కృష్ట ప్రబంధముల మార్గమున పోతన చరిత్రమును రచించిరి. ఈ మహాప్రబంధము ఉదాత్తవస్తు విరాజితమై రసభావ పరిపూర్ణమై రమ్యకల్పనా శిల్పశోభితమై సుందరశైలీ విలసితమై సముచిత సభ్య శృంగార సమన్వితమై యలరారుచున్నది. మనుచరిత్రాది ప్రబంధములవే కాక పూర్వాంధ్ర మహాకావ్యముల సమస్త సద్గుణములను సౌందర్యములను తనలో మేళవించుకొని సంప్రదాయ ప్రయోగ సమన్వితమై విరాజిల్లుచున్న ఉత్తమ మహా ప్రబంధము పోతన చరిత్రము.[1]

1. పోతన చరిత్రములోని వస్తు రసభావాదులు ఆయా విషయములకు చెందిన వ్యాసములలో విపులముగా చర్చింపబడినవి.

# ఆంధ్ర మహాకవి జీవితము వర్ణించిన ప్రథమ మహాకావ్యము పోతనచరిత్రము

సహస్రవర్షకృషి విరాజితమైన ఆంధ్ర సాహిత్యోద్యానమున బహువిధ ప్రక్రియా లతావితతు లుద్భవిల్లి కుసుమించి అనేక దివ్యకావ్య ఫలములను ప్రసాదించి రసికజన హృదయ తర్పణము కావించుచున్నవి. తనివితీర ననుభవించి ధన్యతగాంచుటకు నన్నయగారినుండి నేటివరకు గల కవీంద్రులు సంతరించి పెట్టిన సరససాహిత్య సంపదలోని కృతిరత్నము లసంఖ్యాకములు. అట్టి ప్రశస్త కావ్యములలో నొక మహా పురుషుని జీవితమును వర్ణించుచు రమణీయ దీధితులను విరజిమ్ముచున్న మహాకావ్యరత్నము పోతన చరిత్రము. ఒక ఆంధ్ర మహాకవి జీవిత చరిత్రము తొలి మహాకావ్యముగా ఆవిర్భవించినది యీ పోతన చరిత్రము. ఈ విషయమును వివరించుటకు ముందు ఆంధ్రసారస్వతము నందలి కావ్యభేదములను, కావ్యములుగా మలచబడిన జీవిత చరిత్రములను గురించి యించుక చర్చింతును.

## ఆంధ్ర వాఙ్మయము నందలి కావ్యభేదములు :

ఆంధ్ర వాఙ్మయ పరిశీలనము కావించినచో అందు బహువిధములైన కావ్యము లున్నట్లు గుర్తింతుము. లాక్షణికులు పేర్కొనిన శ్రవ్య దృశ్య కావ్యభేదములలో శ్రవ్యకావ్యములు, అందును పద్యకావ్య భేదములందు మహా కావ్యములను గురించి వ్రాయటయే ప్రస్తుతాంశము కావున వానిని గురించియే వివరింతును.

వస్తుభేదము ననుసరించి త్రివిధములగు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అను కావ్యములన్నియు విషయభేదము ననుసరించి యనేక విధముల నొప్పారుచున్నవి వీనిని ముఖ్యముగా ఏడు విధములుగా విభజింప వచ్చును.

1. పురాణేతిహాసములు.
2. క్షేత్రాది మాహాత్మ్యములు.
3. జీవిత చరిత్రములు.
4. పరిమిత కథాభాగముగల కావ్యములు.
5. కథాకావ్యములు.
6. చారిత్రక కావ్యములు.
7. ఇతరములు.

వీనిని గూర్చి యొకింత వివరింతును.

1. ఈ యేడు విధముల కావ్యములలో పురాణములు, ఇతిహాసములు కావ్యములుగా వ్రాయబడినవి మొదటి రకములో చేరును. రామాయణ భారత భాగవతములు, మార్కండేయ పురాణము, వరాహపురాణము, భీమఖండ కాశీ ఖండములు మున్నగునవి యీ కోవకు జెందును ఆంధ్ర సాహిత్యమున తొలుత అనూదితమైన కావ్యములు చాలవరకివియే. ఇందు సర్గ ప్రతి సర్గాది పంచ లక్షణ ములు గల పురాణములు, పురాతన రాజవంశముల రాజుల చరిత్రములు వివరించు ఇతిహాసములు వస్తువులై యుండును

2. రెండవ వర్గమునకు చెందిన క్షేత్రాది మాహాత్మ్యములను తెలుపు కావ్యములలో క్షేత్రములు దైవతములు వ్రతములు పర్వములు మున్నగువాని మాహాత్మ్యము దెల్పు ఇతివృత్తము లుండును. కాళహస్తి మాహాత్మ్యము, శివ రాత్రి మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము, ఏకాదశీ మాహాత్మ్యము మున్నగునవి మాహాత్మ్య కావ్యములు.

3. మహాపురుషుల జీవిత చరిత్రములను వర్ణించు కావ్యములు మూడవ వర్గములోనివి. ఇట్టివి ఆంధ్ర సాహిత్యమున కొల్లలుగా శోభిల్లుచున్నవి. పండితా రాధ్య చరిత్రము, విక్రమార్క చరిత్రము, మనుచరిత్రము, వాల్మీకి చరిత్రము, బుద్ధ చరిత్రము, శివభారతము, రాణాప్రతాపసింహ చరిత్రము మొదలగునవి జీవితచరిత్ర కావ్యములు.

4. పరిమిత కథాభాగముగల కావ్యము లాయా మహా వ్యక్తుల జీవితముల లోని ప్రధానములైన రసవద్ఘట్టములు గ్రహించి వర్ణనాదులతో పెంచి రచించిన కావ్యములు. ఇవియు ఆంధ్రవాఙ్మయమున విరివిగా విరాజిల్లుచున్నవి. శృంగార నైషధము, పారిజాతాపహరణము, వసుచరిత్రము, విజయవిలాసము, ప్రబోధచంద్రోదయము... 

ప్రథమ పంక్తి: ప్రసన్నానందము

6. చారిత్రక కావ్యములననవి దేశచరిత్రలు, ఆయా రాజుల రాజ్యముల చరిత్రలు పరిపాలనా విశేషములగూర్చి తెలుపునవి. కాసె సర్వప్ప వ్రాసిన ప్రతాప చరిత్రయను నామాంతరముగల సిద్ధేశ్వరచరిత్ర, అందుగుల వెంకయ్య రచించిన రామరాజీయమను నామాంతరముగల నరపతి విజయము, కుమార ధూర్జటి సంత రించిన కృష్ణరాయ విజయము, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు విర చించిన ఆంధ్ర పురాణము మున్నగునవి చారిత్రకకావ్యములు. ఇవి తెలుగు సాహిత్యమున సకృత్తుగనే యున్నవి.

7. ఇతరములలో పావులూరి గణితము, మనుమంచిభట్టు విరచిత హయ లక్షణ విలాసము, అప్పనమంత్రి చారుచర్యవంటి గణితాది శాస్త్రవిషయక కావ్యములును, కేవల వర్ణనాత్మకములైన ఋతుసంహారమువంటి కావ్యములు మొదలగునవి చేర్పనగును.

## జీవిత చరిత్రల విశిష్టత:

పైన వివరించిన సప్తవిధకావ్యములలో జీవిత చరిత్రలు గల కావ్యములకు విశిష్టమైన స్థానము గలదు. లోకోత్తరగుణకర్మస్వభావములు కలిగి మహాపురు షార్థములను సాధించి లోకోపకారము కావించి ఆదర్శజీవనులును చిరస్మరణీయు లును ఐన మహాపురుషుల జీవితచరిత్రములు మానవాళికి మార్గదర్శకములై సమ్యగ్జీవనము సత్పురుషార్థజీవనము సాగింప స్ఫూర్తినిచ్చుచుండును. మరియు తదీయ జీవితములయందలి రసవద్ఘట్టముల రమణీయ కవితామృత రసాస్వాదన మున నాహ్లాదము కలుగుచుండును. మహాపురుషుల జీవితచరిత్రల పఠనమువల్ల మానవులకు జీవితములో నెదురగు విషమ సమస్యలకు చక్కని పరిష్కారము, ధర్మసందేహములకు నివృత్తి, కష్టసహిష్ణుత, లోకవ్యవహారజ్ఞానము, జ్ఞానవిజ్ఞాన సంపాదనము, చతుర్వర్గ సాధనోత్సాహము, ఆత్మానందము ప్రాప్తించును. వేయేల మమ్మటుడు పేర్కొనిన "కావ్యం యశసేఽర్థకృతే.... ....." ఇత్యాదిగా గల కావ్య ప్రయోజనము లన్నియు జీవితచరిత్ర కావ్యముల ద్వారా సమగ్రముగా సమకూడును.

ఇక్కడ 'చరిత్ర' అన్నదాని యర్థ మొకింత పరిశీలింపవలసియున్నది. చరిత్ర యనగానే దేశచరిత్ర యను అర్థము స్ఫురించును. చరిత్రలు రెండు

రకములు. 1. దేశచరిత్ర. 2. జీవితచరిత్ర. ఈ రెండు చరిత్రలకు వ్యత్యాసము కలదు. మొదటిది ఒక దేశముయొక్కయు, ప్రభువుల పరిపాలనయొక్కయు వృత్తాంతములను వివరించును. రెండవదగు జీవితచరిత్ర యొక విశిష్టవ్యక్తి యొక్క జీవితకథను తెలుపును. ఈ రెంటి టికిగల భేదమును ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారిట్లు విశదీకరించిరి.

"ఒక మహాపురుషుని జీవిత మహత్త్వాలోకముచేత కలిగిన అబ్బురపాటు ప్రేరణకాగా, ఆ మహత్త్వ విశిష్టతను లోకులకు తెలుపుటకై వ్రాయబడెడి కథయే జీవితచరిత్ర. పరచరిత్రయైనను, ఆత్మచరిత్రయైనను పేరునకు మాత్రమే అది చరిత్రగాని గుణముచే అది ఆఖ్యానవిశేషమే. చరిత్రయను పదమునకు ఏ కారణముచేతనో దేశచరిత్రయను అర్థము రూఢమైనది. ఒక దేశముయొక్కగాని జాతియొక్కగాని చరిత్ర యెంత సమర్థుడైన చరిత్రకారుడు వ్రాసినను, దాని ఆత్మను సమగ్రముగా వ్యక్తము చేయజాలడు. అతడు రాజ్యములయొక్కయు రాజులయొక్కయు పతనోత్థానములు లోనగు భూతార్థములను వివరించుటయందే శ్రద్ధచూపును ఇక జీవితచరిత్ర, ఏ వ్యక్తియొక్క చరిత్ర చెప్పుటకు ఉద్దేశించునో, అతని ఆత్మను వ్యక్తము చేయుటకు యత్నించును. ఆ వ్యక్తియొక్క జీవితమునందు ఏయే ఘట్టములు అతని మహత్త్వ నిరూపణమునకు ఉపకరించునో, ఆ ఘట్టములు కాలక్రమానుసారముగా సంఘటింపబడి విననింపైన కథారూపమున వ్రాయబడునపుడే జీవితచరిత్ర 'చరిత్ర' యనిపించుకొనని ఆఖ్యానమై వాఙ్మయకోటి కెక్కును."[1]

జీవిత చరిత్రలో ఒక మహాపురుషుని ఆత్మను చక్కగా వ్యక్తముచేయుట జరుగును. దేశచరిత్రలో రాజుల యొక్కయు వారి పరిపాలనల యొక్కయు గత వృత్తాంతములను క్రమముగా వివరించుట జరుగునని పై వివరణ సారాంశము. పింగళివారు 'జీవిత చరిత్ర' యను గద్య గ్రంథ ప్రక్రియను గురించి చెప్పినను జీవిత చరిత్ర గల పద్య కావ్యములకును నిది వర్తించును. పద్య కావ్యమున వ్రాయబడిన జీవిత చరిత్ర మరింత రసభావపూర్ణమై యొప్పారుచుండును.

1. సాహిత్యశిల్పసమీక్ష : 'జీవితచరిత్ర' వ్యాసము. పుట 357.

## చరిత్రకు కావ్యమునకు గల భేదము :

దేశచరిత్రకు జీవితచరిత్రకు భేదమున్నట్లే చరిత్రకును కావ్యమునకును భేదము గలదు. ఈ రెండిటికి గల భేదమును దెలుపుచు శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారిట్లు వ్రాసిరి.

"చరిత్ర జరిగిన కథ నున్నదున్నట్లుగా తెలుపును. కావ్య'మీ కార్యకారణ మునుబట్టి యిట్లు జరుగును' అని తెలుపును. చరిత్రకథకుఁ గార్యకారణ భావ మక్కర లేదు. కావ్యకథ కిది యత్యావశ్యకము. కావుననే చరిత్రను గూడ దృశ్య శ్రవ్య కావ్యములుగా రచించునపుడు కార్యకారణ సామగ్రితో మార్పులు చేయుదురు. మఱియు చరిత్ర యొక వ్యక్తిగతమగు నితివృత్తమును దెలుపును. కావ్యముకూడ వ్యక్తిగతమగు నితివృత్తమును దెలుపుచున్నను నా వ్యక్తి సర్వసాధారణమగు వ్యక్తియే కాని ప్రత్యేక వ్యక్తికాదు. కావ్యమున నా వ్యక్తికి ప్రాధాన్యము కాక యా వ్యక్తియొక్క వ్యాపారమునకే ప్రాముఖ్యము.... ఉదాహరణమును జూపుదును. శివాజీ చరిత్రమునఁ గవి శివాజీ పేరును దీసివేసి మరొక పేరును బెట్టరాదు. మేఘ సందేశమున యక్ష దంపతులు నాయికానాయకులు. యక్ష దంపతులన్న పేరినిఁ దీసి గంధర్వ దంపతులన్నను సందేశమునకు గొఱంతరాదు .... ....

ఇఁకఁ గావ్యమునవలెఁ జరిత్రమునఁ బ్రతిభ (భావనాశక్తి) తోఁ బని లేదు. అది యున్నదున్నట్లు విషయమును జెప్పును. కావ్యమున దాని యందుఁ బనిలేని వన్నియును గాపలయును. చరిత్ర యొకానొకకాలమునకు సంబంధించినది. కావ్యము సర్వకాలములకును సంబంధించి యుండును. మొత్తముమీఁదఁ గావ్యము సర్వ వ్యక్తి సాధారణము;సర్వకాల సాధారణమును నగును."[1]

సన్నిధానమువారిందు చరిత్రకు కావ్యమునకుగల భేదమును చక్కగా వివరించినారు. చరిత్రలో జరిగిన కథ సూటిగా పొడిమాటలతో చెప్పబడును. కావ్యములో కేవలము కథ కాక కార్యకారణ సంబంధానుసారముగా సత్యవృత్తము నాదర్శముగా వెలువరించుటకు నొక మహాపురుషుని జీవిత కథలోని యస్థిపంజరము వంటి చరిత్రాంశసంచయమునకు కల్పన యను అవయవ సౌష్ఠవమును, శిల్పమను

1. కావ్యాలంకార సంగ్రహము-సన్నిధానము వారి వివరణము: ద్వితీయాశ్వాసము, 'కావ్యమునకును జరిత్రకును గల భేదమేమి?' పుట 242, 243.

సౌందర్యమును తీర్చిదిద్ది రసభావవిలాసములతో రమణీయముగా రచన చేయ బడును. పింగళివారు చెప్పినట్లు, ఒక మహాపురుషుని యాత్మను వ్యక్తము చేయుట జీవితచరిత్ర రచనోద్దేశము. ఈ విషయము సన్నిధానమువారు చెప్పిన 'వ్యక్తికి ప్రాధాన్యముకాక ఆ వ్యక్తియొక్క వ్యాపారమునకే ప్రాముఖ్యము' అను దానికి సరిపోవును. శివాజి చరిత్రవంటి ప్రఖ్యాతములైనను, మేఘసందేశము వంటి ఉత్పాద్యములైనను జీవితచరిత్ర కావ్యములలో వ్యక్తి ప్రాధాన్యముకంటె నతని మహత్వాదర్శ జీవనమునకే ప్రాధాన్యముండునట్లు రచింపబడును. ఇవి దేశచరిత్రల వలె కాక దేశకాలాబాధ్యములై విశ్వశ్రేయములై యలరారుచుండును.

ఆచార్యులవారు తమ పోతన చరిత్ర మహాకావ్యమును పైన వివరించినట్లే ఉదాత్తరమణీయముగా తీర్చిదిద్దినారు. ఆచార్యులవారు పోతన చరిత్రము 'విజ్ఞప్తి'లో తమ రచనా సదాశయమును వివరించుచు,

"నేను వ్రాయునది శుష్కచరిత్రము కాదు. నాకు పోతన చరిత్రమును వ్రాయుటకన్న నతని యుదాత్తాశయముల ప్రతిబింబింపజేయుట ముఖ్య కర్తవ్యము"[1] అన్న మాటలు పండితవచనములతో నేకీభవించుచున్నవి.

## కావ్యములుగా మలచబడిన జీవితచరిత్రలు :

విషయము ననుసరించి వర్గీకరించిన కావ్యభేదములలో జీవితచరిత్రకావ్యములను కొన్నిటిని పేర్కొంటిని. ఆంధ్ర సాహిత్యమున నిట్టి కావ్యములు బహుసంఖ్యాకములనియు వ్రాసితిని. ఈ కావ్యములును నాయక భేదమునుబట్టి మరల అనేక విధములు. ఇక్కడ నాయకులన ధీరోదాత్తాది నాయకులు కాదు. వృత్తి ప్రవృత్తుల ననుసరించి నాయకులను పేర్కొనుట యిచట ప్రసక్తము. ఏతదనురూపముగా దిగువ రీతిగా జీవితచరిత్ర కావ్యములను వింగడింపవచ్చును 1. దైవ నాయకములు. 2. రాజనాయకములు. 3. ఋషినాయకములు. 4. ఆచార్య నాయకములు. 5. భక్తనాయకములు. 6. కవి పండితనాయకములు. 7. ఇతర నాయకములు.

1. పోతనచరిత్రము - పండితాభిప్రాయములు : 'విజ్ఞప్తి' పుట 75.

ఈ సప్తవిధనాయక కావ్యములలో దేవరాజనాయక కావ్యములే పుష్కలముగా రచింపబడియున్నవి దీనికి కారణము మన సాహిత్యముపైగల పురాణేతిహాసముల ప్రబలప్రభావము. మరియు మహాకావ్యమున 'తత్రైకో నాయకస్సురః, సద్వంశః క్షత్రియోవాఽపి' అని నాయకుడు వేలుపుకాని, సద్వంశక్షత్రియుడుకాని యుండునని దర్పణకారుడు చెప్పిన లక్షణము ననుసరించియు నిట్టి కావ్యములు లెక్కువైనవి. హరివంశము హరవిలాసము, కుమారసంభవము మున్నగునవి దేవనాయకములు. విక్రమార్క చరిత్రము, మనుచరిత్రము, కవికర్ణరసాయనము, యయాతి చరిత్రము, శివభారతము, విశ్వనాథనాయకుడు మొదలగునవి రాజనాయకములు. ఇక వాల్మీకి చరిత్రము, అష్టావక్ర చరిత్రము వంటివి కొన్ని ఋషినాయకము లొప్పుచున్నవి. ఆచార్యనాయకములలో ప్రవక్తలు, మతగురువులు, యోగులు మున్నగువారి చరిత్రలు నిబంధింపబడి యుండును. పండితారాధ్య చరిత్రము, ఉద్భటారాధ్య చరిత్రము, బసవపురాణము, బుద్ధచరిత్రము, శంకరవిజయము, పరమహంస భాగవతము (సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి కృతము), క్రీస్తు చరిత్రము మొదలగునవి ఆచార్యనాయకములై విలసిల్లుచున్నవి.

భక్తనాయక కావ్యములలో ఆముక్తమాల్యద, వైజయంతీ విలాసము వంటివి చేరును. కవి పండిత నాయక కావ్యములు తెలుగులో చాల అరుదుగా ఉన్నవి. వాల్మీకి చరిత్రము[1], తిక్కన మున్నగునవి యీ వర్గమున చేరును. ఈ రకపు కావ్యములనుగూర్చి తరువాత చర్చింతును. ఇక ఇతర నాయకములైన కావ్యములును కొన్ని గోచరించును. ఇందులో దేశభక్తులు, సంఘసంస్కర్తలు, శిల్పులు, గాయకులు మొదలగు కళాకారులు, వీరయోధులు, దాతలు, కర్షకులు మున్నగువారు నాయకులుగా రచింపబడిన కావ్యములు చేరును. ఇవి ప్రాయికముగా నవ్యకవితా విలసిత రచనలు. తుమ్మలవారి 'మహాత్ముని ఆత్మకథ', ప్రతివాదభయంకర వేదాంతాచార్యులవారి 'ఆచార్య జగదీశ చంద్రబోసు', వానమామలై జగన్నాథాచార్యులవారి 'రైతు రామాయణము', ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి 'జాతిరత్నం' మున్నగునవి వీని కుదాహరణములు.

1. వాల్మీకి ఋషియేకాక ఆదికవి కనుక ఈ వర్గమునందును చేర్పబడినది.

## తెలుగులో కవిజీవిత చరిత్ర వాఙ్మయము :

తెలుగులో సాధారణముగా దేవతలను, రాజులను, ఆచార్యాది మహాపురుషులను, దేశనాయకులను కథానాయకులను చేసి రచించిన కావ్యాది సాహిత్య గ్రంథములే తఱచుగా గానవచ్చును. కవులను పండితులను గురించి వ్రాసిన గ్రంథములు మిక్కిలి అరుదై యున్నవి. దీనికి ముఖ్యకారణము కవుల జీవిత విశేషములు తెలియకపోవుటయే. ఆధునికకాలమునందువలె పూర్వకాలమున దేశ చరిత్రలుగాని కవుల చరిత్రలుగాని రచించు శ్రద్ధ యెక్కువగా లేకుండెను. కవులైనను తమ్ము గూర్చి యేవోకొన్ని విషయములు తప్ప విపులముగా తమ జీవితవృత్తాంతములను తెలుపుకొనలేదు. నేటివలె నాడు స్వీయచరిత్రము లసలే వ్రాయబడలేదు. ఈ కారణములచేత కవులగురించిన గ్రంథము లెక్కువగా రచింపబడలేదు. ఒక కవిని గూర్చి కావ్యమో నాటకమో వ్రాయవలెనన్న ఆ కవి జీవితగాథ చాలవరకు తెలిసియుండవలయును. అంతేకాక అతడు పురుషార్థ జీవనుడై పూజ్యుడై స్మరణీయుడై యున్నచో అతని చరిత్రము పఠనీయమై తదీయ జీవితగాథ రచింపబడును. పింగళి లక్ష్మీకాంతంగారు కవుల ఘనత నిట్లు తెలిపిరి.

"కవులకు వేరువిధమైన మహత్త్వమేమియు లేకున్నను, వారిని మహాపురుషులనుగా పరిగణించుటకు ఉత్తమకావ్యకర్తృత్వ మొకటియే చాలును. రాజమంత్రులకు, సేనాధిపతులకు, రాజనీతివిశారదులకు, సంఘసేవాపరతంత్రులకు, ఆచార్యపురుషులకు ఉండెడి ఘనత యెట్టిదో, ఉత్తమగ్రంథకర్తలైన కవుల ఘనతయు అట్టిదే".[1]

నిజముగా కవులకు గల ఘనత, యశస్సు వారి ఉత్తమకావ్యముల వల్లనే కలుగుచుండును. 'కవి రమరః' యన్న సూక్తి యందుకే యేర్పడినది. కాళిదాసు జీవిత విశేషములుకాని, అతడు సాధించిన పురుషార్థములుకాని మనకు సరిగా తెలియవు. అతడు రచించిన మహాగ్రంథముల వల్లనే జగత్పూజ్యుడైనాడు. కాగా ఒక కవి తన విశిష్టకావ్యసృష్టికి తోడుగా ఉత్తమసౌశీల్య జీవనముతో, ప్రజోపయోగమహాకార్య నిర్వహణము, దైవభక్తి, దేశసేవ మున్నగు వానిలో ఏవైన కలిగియున్నవి విదితములైనచో అతని చారిత్రము మిక్కిలి పూజ్యమై చిరస్మర

1. సాహిత్యశిల్పసమీక్ష : 'జీవితచరిత్ర' వ్యాసము, పుట 362.

జీయమై సారస్వత జీవనులకే కాక సర్వమానవులకును శిరోధార్యమై వెలయుననుటలో విప్రతిపత్తి యుండదు వాల్మీకి వ్యాసాదులు, నన్నయ తిక్కనలు, బమ్మెర పోతన, వేమన మొదలగువారట్టి కవిమహాశయులు.

కవుల జీవితచరిత్రలవల్ల ఆ మహామహుల జీవిత విశేషములు తెలియుటయే కాక వారి కావ్యములను మరింత చక్కగా అవగాహన చేసికొనుటకును, సాహిత్యచరిత్ర సరిగా రచించుకొనుటకును వీలేర్పడును. ఈ దృష్టితోనే ఆధునిక కాలమున కవుల చరిత్రలు, సాహిత్యచరిత్రలు కష్టపడి పరిశోధించి వ్రాయబడినవి. గురజాత శ్రీరామమూర్తిగారి కవిజీవితములు, కందుకూరివారి ఆంధ్ర కవుల చరిత్రము, చాగంటి శేషయ్యగారి ఆంధ్రకవి తరంగిణి, ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము, దివాకర్ల వేంకటావధానిగారి ఆంధ్రవాఙ్మయచరిత్రము, ఆరుద్రగారి సమగ్రాంధ్ర సాహిత్యము-ఇత్యాది గ్రంథము లనేకములు విరచింపబడినవి. దేశచరిత్రల పరిశోధనముతో పాటు సాహిత్యచరిత్రల కవుల చరిత్రల పరిశోధన మధికమై ఆధునిక పండిత పరిశోధకు లెందరో వివిధకవుల జీవితముల గూర్చి గ్రంథములు వ్రాసిరి. వీనిచేత నుత్తేజితులై ఆధునిక కవులనేకులు పూర్వకవుల జీవితచరిత్రములను పద్యగద్యకావ్యములుగా నవలలుగా నాటకములుగా వెలయించిరి.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు 'నన్నయభట్టారక చరిత్రము' అను గద్యగ్రంథము వ్రాసిరి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 'శ్రీనాథ కవిరాజీయము' అను నాటకము వ్రాసిరి. అట్లే వారు 'కాళిదాస విలాసము', 'తెనాలి రామకృష్ణ చరిత్రము' అను వచన గ్రంథములు రచించిరి. తిరుపతి వేంకటకవులు జగన్నాథ పండితరాయల జీవితమును నాటకముగా సంతరించిరి. చిలుకూరి వీరభద్రరావుగారు 'తిక్కన సోమయాజి', 'శ్రీనాథ కవి' యను జీవితచరిత్రములు గద్యమున వ్రాసిరి. అట్లే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని చరిత్రమనను సంబంధించిన 'కనకాభిషేకము' అను గ్రంథమును రచించిరి. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 'వేమన' యనుపేర జీవితమును సాహిత్యమును గూర్చి సపరిశోధనముగా వ్రాసిరి. నోరి నరసింహశాస్త్రిగారు 'నారాయణభట్టు', 'రుద్రమదేవి', 'మల్లారెడ్డి' యను పేర్లతో కవిత్రయ జీవితచరిత్రములను, 'కవిసార్వభౌముడు' అను పేరుతో శ్రీనాథుని చరిత్రమును నవలలుగా రచించిరి. తిక్కన సోమయాజి జీవితచరిత్రమును వేము

గంటి నరసింహాచార్యులుగారు 'తిక్కన' అను పేర కావ్యముగా రచింపగా, డా॥ ప్రసాదరాయ కులపతిగారు 'కవిబ్రహ్మ' యను పేర నాటకముగా వ్రాసిరి. పోతనగారి జీవితచరిత్రమును చెలమచెర్ల రంగాచార్యులుగారు 'హాలికుడు' అను పేర నాటకముగా వ్రాయగా నిడుదవోలు వెంకటరావుగారు భారతప్రభుత్వ ప్రచురణగా 'పోతన' యను పేర పోతనగారి జీవితము సాహిత్యము గురించి పరిశోధనాత్మకముగా సమగ్రమైన వచనగ్రంథము వ్రాసిరి. అట్లే వానమామలై వరదాచార్యులవారు పోతన చరిత్రమును మహాకావ్యముగా రచించినారు. ఈ విధముగా ఆధునిక సాహిత్యయుగమున పూర్వకవులగూర్చి కావ్యాదులు వ్రాయుట యొక లక్షణముగా కనబడును. ఇది శ్రేయస్కరమైన కార్యము. ఎవరి కావ్య సంపద జాతికి ఉత్తమ మార్గోపదేశకమో అట్టి పూర్వకవిచంద్రులను కృతజ్ఞతతో స్మరించుట, వినుతించుట, వారి జీవితములలోని ఆదర్శములను గ్రహించి స్ఫూర్తినందుటకు వారిగూర్చి గ్రంథములు వ్రాయుట అవశ్యకర్తవ్యము.

పోతన చరిత్రమునకు మలిపలుకు వ్రాయుచు డా॥ పల్లా దుర్గయ్యగారీ యుగ నవలక్షణము నిట్లు కొనియాడిరి.

"....ఇట్లాధునికకవుల దృష్టి ప్రాచీనమహాకవులపై ప్రసరించుచుంట ఈ యుగ లక్షణములలో నొకటిగా గోచరించును. కవి కవిని ద్వేషించు నవలక్షణమును త్యజించి నేటికవులు ప్రాచీన మహాకవులనైన భూషించి వారి కీర్తి నజరామర మొనరింప సంకల్పించుచుండుట యొక నవలక్షణము. ఇట్టి పవిత్రోద్దేశ ఫలితమే ఈ పోతనచరిత్రము."[1]

బమ్మెర పోతన మహాకవియేకాక మహాభక్తుడు, జ్ఞానవైరాగ్య సంపన్నుడు, రాజులను ధిక్కరించి భాగవతమును రామార్పణము చేసిన ధీరోదాత్తుడు, దానమానధనుడు, మహనీయ సౌజన్యమూర్తి యగుటచేత అతని దివ్యచరిత్రము మానవాళికి మేలుబంతియై యొప్పుచున్నది. అందువల్ల అతని జీవితముగూర్చి సాహిత్యముగూర్చి యనేక గ్రంథములు వెలువడినవి. పోతనగారిపై ప్రత్యేక దృష్టి పడుటకు మరొక కారణమున్నది. అది పోతనగారి నివాసస్థలమును గూర్చిన

1. పోతన చరిత్రము : 'కవికావ్యపరిచయము' పుట 1.

వివాదము. 1848లో పురాణం హయగ్రీవశాస్త్రిగారు భాగవతమును ముద్రించి అందు పోతన కడప మండలములోని ఒంటిమిట్టనివాసియని ప్రతిపాదింపగా దానిని బలపరచుచు వావిళికొలను సుబ్బారావుగారు ప్రబలముగా వాదించిరి. దీనిపై కల్లోలము బయలుదేరి పండితలోకములో వాదోపవాదములు చెలరేగినవి. కందుకూరి వీరేశలింగము పంతులుగారు తొలుత పోతన ఒంటిమిట్టవాడని వ్రాసి పిదప కవులచరిత్ర ద్వితీయ ముద్రణలో తమ యభిప్రాయమును మార్చుకొని పోతన ఓరుగల్లు చెంతగల బమ్మెరనివాసియని నిశ్చయించి వ్రాసిరి. ఈ వివాదవిషయము గూర్చి కొమర్రాజువారు, జయంతి రామయ్యపంతులుగారు, శేషాద్రిరమణకవులు, మల్లంపల్లివారు మున్నగు మహాపండితులు పరిశోధించి పోతన ఓరుగల్లునివాసమును స్థిరపరచిరి. ఈరీతిగా అనేకపండిత పరిశోధకులదృష్టి పోతనపై ప్రసరించుటచేత తదీయ పరిశోధన వాఙ్మయము పెరిగి పెక్కు పద్యగద్యాదిగ్రంథములు విరచితములయ్యెను.

ఆంధ్ర సాహిత్యమునందలి పూర్వకవులలో బహుళ ప్రచార మందినవారు తక్కువగనేయున్నారు. కవిత్రయము, వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, పోతన, తెనాలి రామకృష్ణుడు, వేమన, క్షేత్రయ్య, రామదాసు మున్నగు కవులు కొంద రెక్కువ ప్రశస్తి గాంచినారు. వీరిలో కొందరి జీవితముల మీద చలనచిత్రములు తీయబడి విజయవంతమగుటయే ప్రజలకు వారిపై గల ఆదరాభిమానములకు తార్కాణ. ఇట్టి మహాకవులలో కొంటె కథల ద్వారా తెలిసిన తెనాలి రామకృష్ణుని మినహాయించగా అశేష జనులకు పోతన వేమన తెలిసినంత మరొకరు తెలియరు. తమ జీవితముల ద్వారా సాహిత్యము ద్వారా వీరిద్దరు ప్రజాహృదయ పీఠముల నధిష్ఠించియున్నారు. వీరి యిద్దరి పద్యములు కొన్నియైనగాని అక్షరాస్యుడుండడనుట అతిశయోక్తి కాదు. ఈ యిద్దరిలోను పోతన మధుర మంజుల మహోదాత్త కవిత్వము చేతను, మహనీయ భక్తి సౌశీల్యాది జీవనము చేతను పండిత పామర జనానురాగము నధికముగా చూరగొన్నాడు. అట్టి పూజ్యమహాకవి జీవిత చరిత్రము మహాకావ్యముగా రచించి కృతార్థులైనా రాచార్యులవారు.

## ఆంధ్ర మహాకవి జీవిత ప్రథమ మహాకావ్యము పోతన చరిత్రము :

ఒక ఆంధ్ర మహాకవి జీవిత చరిత్రమును ప్రథమ మహాకావ్యముగా రచించిన సత్కీర్తి వరదాచార్యులవారికి దక్కినది. ఆంధ్ర సాహిత్యమున ఆంధ్ర కవుల జీవితముల గూర్చి వ్రాయబడిన కావ్యనాటకాదులను వెనుక పేర్కొంటిని. ఈ కవిజీవిత రచనలు ముఖ్యముగా ఆధునిక యుగమునందే రచింపబడినవి. పూర్వ సాహిత్యమున నివి మిక్కిలి యరుదుగా నున్నవి.

పదునేడవ శతాబ్దమున వెలసిన రఘునాథభూపాలుడు 'వాల్మీకి చరిత్రము' అను కావ్యము వ్రాసెను. ఇది తెలుగుకవి చరిత్రము కాదు. అంతేగాక వాల్మీకి చరిత్రము మూడాశ్వాసములతో 450 గద్య పద్యములతో రచింపబడిన చక్కని కావ్యమేకాని మహాకావ్యము కాదు. పదునేడవ శతాబ్దివాడే యగు కుమారధూర్జటి 'కృష్ణరాయ విజయము' అను పద్యకావ్యము వ్రాసెను కృష్ణరాయలు కవియైనను చక్రవర్తిగా జగద్విఖ్యాతుడు. కృష్ణరాయ విజయములో రాయల పరిపాలనా విశేషములు, యుద్ధవిజయములే ముఖ్యముగా వర్ణింపబడినవి కాని యొక కవిగా రాయల జీవిత వృత్తాంతములు వివరింపబడలేదు. రఘునాథభూపాలుని కుమారుడగు విజయరాఘవుడు తన తండ్రి గూర్చి 'రఘునాథాభ్యుదయము' కావ్యము రచించెను. రఘునాథుడు కృష్ణరాయలవలె రాజకవియైనను మహారాజుగనే ప్రసిద్ధుడు. ఈ కావ్యమునందును రఘునాథుని విజయములు, పరిపాలనా విశేషములే ముఖ్యముగా వర్ణితములైనవి. ఇది ద్విపదకావ్యము.

ఆధునిక యుగమునందు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలగు రచయితలు రచించిన కవి జీవిత గ్రంథములు గద్యములు నవలలు నాటకములని తెలిసికొంటిమి. కాగా శ్రీ వేముగంటి నరసింహాచార్యులుగారు రచించిన 'తిక్కన' యను పద్యకావ్యము మాత్రము గణనీయమై యొప్పుచున్నది. ఇది చతురుల్లాసములలో 320 పద్యములలో ప్రబంధశైలిలో రచింపబడిన చక్కని కావ్యము. ఇది పరిమాణమున చిన్నదయ్యును రసభావగుణాలంకారములచేత, మృదుమధురశయ్యా సౌభాగ్యముచేత మిన్నయై వెలుగొందుచున్నది. ఐనను నిది లఘుకావ్యమేకాని మహాకావ్యము కాదు. మరియు ఈ కావ్యమునందు తిక్కన ఓరుగంటికేగి తన మహాభార

తము వినిపించి యలరించి గణపతిదేవ చక్రవర్తిచేత తన యేలికయగు మనుమ సిద్ధికి మరల రాజ్యమిప్పించిన కథాభాగము మాత్రమే వర్ణింపబడినదికాని తిక్కన గారి జీవితచరిత్రము సంపూర్ణముగా చిత్రింపబడలేదు. "మహాకవి శ్రీతిక్కనార్యుని పవిత్ర జీవితచరిత్రలోని కొన్ని ముఖ్య ఘట్టములతో ఈ కావ్యమును సంతరించి నాను." అని వేముగంటికవిగారిదే విషయము కావ్యనివేదికలో తెలుపుకొన్నారు. కావున తిక్కన కావ్యము మహాకవి జీవితమును సమగ్రముగా ప్రతిబింబింపజేసి నది కాదు.

ఇట్లు, ఇప్పటివరకుగల ఆంధ్రసాహిత్యమును పరిశీలించినచో వరదా చార్యులవారు రచించిన పోతనచరిత్రమే ఒక ఆంధ్రమహాకవి జీవితచరిత్రమును సమగ్రముగా వర్ణించిన ప్రథమ మహాకావ్యమని స్పష్టమగుచున్నది.

డా॥ పల్లా దుర్గయ్యగారీ విషయమునే తెలుపుచు,

"ఒక ఆంధ్రమహాకవి జీవితగాథను ఆంధ్రభాషలో తొలుదొల్త ప్రబంధీ కరించిన కీర్తి శ్రీ వరదాచార్యులవారికే దక్కినది."[1] అని వెలిపుచ్చిన అభి ప్రాయము వాస్తవోచితమైనది.

1. పోతన చరిత్రము : 'కవి - కావ్యపరిచయము'. పుట. 1

# పోతన చరిత్ర రచనము—కవి ప్రేరణములు

ఈశ్వరునికి జగన్నిర్మాణమువలె కవికి కావ్యనిర్మాణము సహజమై యున్నది. కావ్యసృష్టిచేయుట కవి వ్యాపారము. కవి కావ్యసృష్టి చేయుటకు గల హేతువు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములని యాలంకారికులు వచించిరి. ఇందు ప్రధానాంశమైన ప్రతిభ సహజన్యమైన దగుటచేత కావ్యరచనాశక్తి కవికి సహజముగనే యబ్బును. కవి తనకు నిసర్గమగు ప్రతిభకు తోడుగా వ్యుత్పత్తిని సంపాదించుకొని అభ్యాసవశమున కావ్యరచన చేయుచుండును. గాయకుడు గానము చేయునట్లు కవి కావ్యమును రచించుట వింతకాదు విశేషముకాదు. అది యతని సహజకార్యము, స్వభావము. కాగా కవి యొక విశిష్టమైన కావ్యమును నిర్మించుటయే గణనీయమైన విషయము. కావున కవులు ప్రశస్తమైన కావ్యములు రచించుటకు పాటుపడుచుందురు. కవు లాయా కావ్యములు రచించుటకుగల హేతువులు, తదీయప్రేరణలు నెట్టివో తెలిసికొన్నచో ఆ కవుల హృదయము సరిగా అర్థమయి కావ్యార్థములు లెస్సగా అవగాహన చేసికొని ఆనందాది కావ్య ప్రయోజనములు సమగ్రముగా పొందుటకు వీలగును. కావున నిచట వరదాచార్యులవారు పోతనచరిత్ర రచన చేయుటకుగల హేతువులను పరిశీలింపవలసి యున్నది. దీనికి ముందు సాధారణముగా కవుల కావ్యరచనా ప్రేరణ లెట్టివో దిఙ్మాత్రముగా చర్చింతును.

## కవుల కావ్యరచనా ప్రేరణలు :

సహజ కావ్య నిర్మాణదక్షులగు కవులకు కావ్యారంభమునకు ముందు ఏమి వ్రాయవలయును? ఎట్లు వ్రాయవలయును? అను ప్రశ్నలుదయించును. ఇవి ప్రధాన సమస్యలు. వీని పరిష్కారము మీదనే కావ్యముల ఉత్తమత్వ శాశ్వతత్వము లాధారపడియుండును. అందువల్లనే సుకవులు దేశకాలాబాధ్యములై విశ్వశ్రేయములై యొప్పు సత్కావ్యములు రచించుటకు కృషిచేసిరి. భామహుడు వివ

రించినట్లు సత్ కావ్యముల వల్ల కలుగు మేలును, అసత్కావ్యముల వల్ల కలుగు కీడును వారు చక్కగా గ్రహించి సత్కావ్యరచనకే పాటుపడి యుండిరి.[1]

పూర్వాంధ్ర కావ్యములను పరిశీలించినచో కవులీలాయా కావ్యముల నెందుకు వ్రాసిరో, యెట్టి ప్రేరణలచేత వ్రాసిరో విశదమగును. ఈ విషయములను వారు తమ కావ్యావతారికలలో తెలిపియున్నారు. సంస్కృతకవులందును రచనా ప్రేరణలు గోచరించును. ఆదికవి వాల్మీకి బ్రహ్మప్రేరణ చేత రామాయణము రచించెను. అతడు రామాయణ ప్రారంభమున నారదునితో "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్ ....ఆత్మవాన్ కో జిత క్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః" అని ప్రశ్నించి తా నడిగిన యన్ని సుగుణములు గల పురుషోత్తముడు శ్రీరాముడని తెలిసి యతని గాథను వర్ణించిన విషయము సుప్రసిద్ధము. అట్లే వ్యాసుడు బ్రహ్మప్రేరితుడై భారతమును, నారద ప్రేరితుడై భాగవతమును రచించెను.

కవుల కావ్యరచనా ప్రేరణలు ప్రధానముగా రెండు విధములు. 1. ఆత్మప్రేరణ. 2. పరప్రేరణ. కవి స్వయముగా ఆలోచించి ఒక వస్తువు నెన్నుకొని కావ్యరచన చేయుట ఆత్మప్రేరణ. ఈ యాత్మప్రేరణలో కవి దేశకాలములను సమాజమును సాహిత్య స్థితిగతులను దృష్టియం దిడుకొని మహత్తర ప్రయోజనము నాశించి స్వీయాభిరుచుల కనుగుణముగా సమంజసమైన సార్థకమైన యొక విశిష్ట వస్తువును గ్రహించి కావ్యనిర్మాణము చేయును. ఒక్కొక్కప్పు డేదేని ఘటన జరిగినప్పు డనుస్పందనము చెంది తదనురూపమగు నితివృత్తము కావ్యముగా మలచును. ఆత్మప్రేరణలో ఈ రెండు విధముల వస్తువరణము జరుగుచుండును. ఈ వస్తు వాలంకారికు చెప్పినట్లు ప్రఖ్యాత కల్పిత మిశ్రములలో నే దైనను కావచ్చును. ఇక పరప్రేరణలో కవి స్వయముగా విచారించి కాక పరులు చెప్పి ప్రోత్సహించిన వస్తువులను గ్రహించి రచన

1. "ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసు చ
ప్రీతిం కరోతి కీర్తిం సాధుకావ్య నిబంధనమ్"-భామహాలంకారము : 1-2
"నా కవిత్వ మధర్మాయ వ్యాధయే దండనాయవా
కుకవిత్వం పునః సాక్షాన్మృతి మాహుర్మనీషిణః"-భామహాలంకారము : 1-12

చేయును. ఇందు ఇష్టదేవతలు, పోషకులగు రాజులు, మంత్రులు మున్నగువారు, తాతతండ్రులు, హితులు మొదలగువారు తమ కిష్టమైన యితివృత్తముల కావ్యములు వ్రాయుట కభ్యర్థింతురు. ఈ ప్రోత్సాహకులు తమ కిష్టమైన కృతులనేకాక దేశకాలపాత్ర సాహిత్యాదిస్థితిగతులను పరిశీలించియు, కవుల శక్తిసామర్థ్యములను అభిరుచులను గమనించియు సమర్థములగు చక్కని కావ్యములను రచింపగోరుదురు. ఈ ప్రేరకులలో ఇష్టదైవములు, స్వర్గస్థులైన పితృపితామహులు కవులకు కలలో గన్పడియో ధ్యానావస్థలో దర్శనమిచ్చియో తమకుగాని యన్యులకుగాని సమర్పణముగా అభిమత కావ్యములు వ్రాయ నాదేశింతురు. రాజులు, మంత్రులు మొదలగు పోషకులు కొలువుదీరి సరస సాహిత్య గోష్ఠినుండి కవులను పిలిపించి తమ యభీష్టముల నెఱిగించి తమ కంకితముగా కృతులు రచింప వేడి కర్పూర తాంబూల జాంబూనదాదులు కానుకపెట్టి సాదరముగా నంపుదురు. ఇతరులగు మిత్రాదులు సముచిత గౌరవసత్కారములు చేసి కృతులు వ్రాయించుట కలదు. మన పూర్వాంధ్ర కావ్యములు చాలవరకు రాజాదుల పోషణవల్లనే ప్రవర్ధిల్లినవి కనుక కావ్యరచనకు వారి ప్రేరణలే తఱచైనవి. ఇచట ప్రాచీనాంధ్ర కవులలో కొందరు ప్రముఖుల కావ్యరచనా ప్రేరణలను సంగ్రహముగా ప్రస్తావింతును.

ఆదికవి నన్నయ తన యేలికయగు రాజరాజనరేంద్రుని ప్రేరణచేత మహాభారతాంధ్రీకరణకు పూనుకొనెను. ఆ మహారాజు 'విద్వజ్జనంబులు పరివేష్టించి కొలుచుచుండ విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబుల నుండి యొక్కనాడు' 'తన కులబ్రాహ్మణు ననురక్తు .... నన్నపార్యుజూచి .... నాకు ననవరతంబును శ్రీమహాభారతంబు నందుల యభిప్రాయంబు పెద్దయై యుండు....' నని పలికి తన కిష్టమైన యైదు విషయములు చెప్పి యందు 'భారతశ్రవణాసక్తిని' వ్యక్తము చేసెను. మరియు

"హిమకరుఁ దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్."[1]

---

1. భారతము : ఆది. 1-14

అని తన వంశీయులును ప్రసిద్ధులును సద్గుణశోభితులునైన పాండవోత్తముల చరిత్ర సర్వదా వినుటకెంతో యిష్టమని తెలిపి,

"జననుత కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్."[1]

అని వ్యాసప్రోక్త భారతము నాంధ్రీకరించుమని యభ్యర్థించెను. భారతము తన కిష్టమైనదేకాక "బహుభాషల బహువిధముల బహుజనముల వలన వినుచు భారత బద్ధస్పృహులగు వారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థమిలన్" అని జనులకు మహాపుణ్యప్రదమనియు వచించెను. ఈ రీతిగా రాజరాజప్రేరితుడై నన్నయ భారతాంధ్రీకరణము గావించి యతని యభీష్టమునేకాక ఆంధ్ర గురుపద్య విద్యకాద్యుడై ఆదికావ్య భిక్షపెట్టి యశేషాంధ్రజనుల యదృష్టమును ఫలింప జేసెను.

తిక్కన తన ప్రభువు మనుమసిద్ధి కోరిక మెయి నిర్వచనోత్తర రామాయణము రచించి యతని కంకితమిచ్చెను. ఆ రాజు తిక్కనను పిలిపించి 'వారని మన్నన నాదరించుచు'

"ఏ నిన్ను మామ యనియెడు దీనికిఁ దగనిమ్ము భారతీకన్యక; నా
కీ నర్హుఁడవగు దనినను భూనాయకు పల్కు చిత్తమున కింపగుడున్."[2]

తిక్కన యతని వాంఛ నెరవేర్చెను. తిక్కన ఉత్తర రామాయణము రచింప బూనుకొన్న విషయ మిట్లు తెలిపెను.

"ఎత్తరినైనను ధీరోదాత్తనృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట నుత్తర రామాయణోక్తియుక్తుఁడనైతిన్."[3]

ఇక తిక్కనగారి భారతాంధ్రీకరణ ప్రేరణ మరొకవిధమైనది. విరాట పర్వము మొదలుకొని స్వర్గారోహణము వరకు తానాంధ్రీకరించుట కితరుల

1. ,, : ఆది. 1-16
2. నిర్వచనోత్తర రామాయణము : 1-2
3. ,, ,, : 1-12

ప్రేరణలేదు. కవియే స్వయముగా ఆలోచించి వ్యాసకృత భారతామ్నాయము నన్నయచేత మూడు పర్వముల వరకే తెనిగింపబడియుండుట గమనించి తక్కిన భారతమెల్ల తెలుగు చేసెను. తన భారతాంధ్రీకరణకు హేతువు నిట్లు వివరించెను.

> ''హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
> భ్యుదయోల్లాసి విరాటపర్వమట యుద్యోగాదులుంగూడఁగాఁ
> బదియేనింటిఁ దెనుంగు బాస జన సంప్రార్థ్యంబులై పెంపునన్
> దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.''[1]

ఈ రీతిగా రచింపబూనిన 'ప్రబంధమండలి కధినాథునిగా నే పురుషుని బేర్కొను వాఁడనో' యను తలంపుతో నించుక నిదురించు సమయమున తన తండ్రి కొమ్మనామాత్యుడు కలలో గన్పడి తన యిష్టదైవమగు హరిహరనాథుని కన్పింపజేసెను. సాక్షాత్కరించిన ఆ దేవుడు తిక్కన వ్రాయబూనిన ఆంధ్ర భారతము తనకు కృతి యిమ్మని యర్థించి భవతారకజ్ఞానము ప్రసాదించి అంతర్హితు డయ్యెను. తదభ్యర్థనకు 'పుట్టు కృతార్థతంబొరసెఁ బుణ్యచరిత్రుఁడనైతి' నని మహానందము నంది ఆ హరిహరనాథుని కంకితముగా భారతాంధ్రీకరణ గావించెను. ఇక్కడ తిక్కన ఆత్మప్రేరణతో భారతాంధ్రీకరణ కుద్యమింపగా హరిహర దేవుడు మెచ్చి కృతిపతిత్వ మర్థించిన విషయము విశేషముగా నున్నది.

ఎఱ్ఱనగారి నృసింహ పురాణ రచనకు ప్రేరణ తీరు వేరొక విధమైనది. అతడు 'మహాప్రబంధ కల్పనా కుతూహలాయత్తంబగుచిత్తంబుతో నొక్కనాడు తదనుసంధానానుబంధ సమాధిని నిమీలితేక్షణుండై క్షణంబున్న సమయంబున' తాత ఎఱపోతసూరి యతని భావంబున నావిర్భావంబు నొంది తన యిష్టదైవమగు అహోబల నరసింహస్వామి కీర్తి విభవమును తన్మహిమావతారమును వర్ణించు ప్రబంధము చెప్పుమని ఆనతీయగా ఆ దేవుని కంకితముగా ఎఱ్ఱన నృసింహ పురాణము రచించెను ఇక్కడ ధ్యానావస్థలో తన తాత కనబడి తన ఇష్టదైవమగు నృసింహస్వామి యవతారగాథ రచింప ప్రేరేపించినది విలక్షణముగా నున్నది. ఎఱ్ఱన వేరొక కృతి హరివంశమును తన పోషకుడగు ప్రోలయ వేమారెడ్డి

---

1. భారతము-విరాట పర్వము : 1-7

ప్రభువుకాంక్షచేత రచించి ఆయన కంకిత మిచ్చెను. ఇక అరణ్యపర్వ శేషమును మాత్రము స్వీయాలోచన చేతనే ఆ మహోదాత్త గ్రంథము కొదువను దీర్చి పూరించెను.

శ్రీనాథుడు మామిడి సింగనామాత్యుని ప్రేరణచేత నైషధ మాంధ్రీకరించి యతని కంకిత మొసగెను. ఈ విషయము నైషధమున కవి యిట్లు వివరించెను.

"సరసభావాను బంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపదలచి కౌతూహలాధీన మానసుండనై తన్మహా ప్రబంధ ప్రారంభంబునకుం దగిన పుణ్య శ్లోక పురాతన మహారాజ చరిత్రం బెయ్యది యొకో యని వితర్కించుచున్న సమయంబున"[1] మామిడి సింగనామాత్యుడు సరససాహిత్య గోష్ఠి వినోద ప్రసంగంబున నన్నుబిలిచి పొగడి,

> "భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున నెద్ది రచియించె
> బుధలోకహితము పొంటె
> నట్టి నైషధసత్కావ్య మాంధ్రభాష ననఘ! యొనరింపు నాపేర
> నంకితముగ."[2]

అని వాంఛ వెలిపుచ్చగా శ్రీనాథుడు హర్షనైషధము నాంధ్రీకరించెను. ఇక్కడ మంత్రి రచింపవలసిన కావ్యమును పేర్కొని కృతిగొని సాహితీపోషణ చేసెను. శ్రీనాథుడు తాను రచించిన యితర కావ్యములలో హరవిలాసమునకు బాల్య మిత్రుడగు అవచి తిప్పయ శెట్టియు, భీమఖండమునకు రాజమహేంద్ర వరములోని బెండపూడి అన్న మంత్రియు, కాశీఖండమునకు రాజమహేంద్రవర ప్రభువు వీరభద్రారెడ్డి అన్న అల్లాడరెడ్డియు, శివరాత్రి మాహాత్మ్యమునకు శ్రీశైల మఠాధిపతి శాంతభిక్షా వృత్తి యతీశ్వరుడును ప్రేరకులై వాఙ్మయ పోషణము చేసిరి. ఈ రీతిగా శ్రీనాథుడు చాలవరకు రాజాదుల నాశ్రయించియే జీవితము గడపి వారి ప్రోత్సాహము వల్ల కావ్యములు రచించెను.

1. శృంగార నైషధము : 1-8
2. శృంగార నైషధము : 1-16

బమ్మెర పోతనగారికి భాగవతాంధ్రీకరణకు సాక్షాత్తుగా శ్రీరాముని ప్రేరణ లభించినది. పోతన 'శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాకుతూహలుడై' యొకనాటి చంద్ర గ్రహణకాలమున గంగకు వెడలి స్నానమాచరించి 'మహనీయ మంజుల పులినతలమండప మధ్యంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించిదు న్మీలితలోచనుఁడై యున్నయెడ' శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించి 'రామభద్రుండ, మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుఁగుసేయుము. నీకు భవ బంధంబులు తెగునని. యానతిచ్చి తిరోహితుడయ్యెను. అందులకు పోతన మహా ప్రసాదమని రాముని యాజ్ఞ తలదాల్చి భాగవతాంధ్రీకరణ కావించి జననము పునర్జన్మ లేకుండ సఫలము చేసికొనెను.

శ్రీకృష్ణదేవరాయ లాముక్తమాల్యదను శ్రీకాకుళాంధ్రవిష్ణువు ప్రేరణచే రచించియుండెను. ఆ విషయము రాయ లిట్లు వ్రాసెను.

"అని యిష్టదేవతా వందనంబుజేసి, మున్నేఁ గళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబులుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమదను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁగావింప నప్పుణ్యరాత్రి చతుర్థ యామంబున"[1]

"కలఁ దదంధ్ర జలజాక్షుఁ డిట్లని యానతిచ్చె"[2]
"....ఆంధ్రభాష యసాధ్యంబె యందునొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ"[3]

అని కోరి "ఏ మును దాల్చిన మాల్య మిచ్చు నప్పిన్నది రంగమందయిన పెండిలి కథ" చెప్పుమనినాడు. ఇట్లు కలలో ప్రత్యక్షమయి గోదాదేవీకథ వ్రాయుమని యానతీయగా అట్లే రచించి ఆ యాంధ్ర విష్ణువున కంకిత మిచ్చెను. ఇచట కలలో దైవము సాక్షాత్కరించి కావ్యము వ్రాయుమన్నది విశేషవిషయము.

1. ఆముక్తమాల్యద : 1-11
2. ,, : 1-12
3. ,, : 1-13

అల్లసాని పెద్దన మనుచరిత్ర రచనకు కృష్ణరాయలే ప్రేరకుడు. పెద్దన

"... ఇష్టదేవతా వందన సుకవిస్తుతులుఁ గుకవి నికృతియుఁ జే
సి నవీన కావ్యరచనకు ననుకూల కథల్ దలంచు నా సమయమునన్"[1]

ఒకనాడు కృష్ణరాయలు భువనవిజయాఖ్య సభలో ప్రాజ్ఞుల గోష్ఠిని కవితా మధురిమ డెందము దవులగా కొలువుండి పెద్దనతో,

"సప్త సంతానములలోఁ బ్రశస్తిగాంచి ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియ కానఁ
గృతి రచింపుము మాకు శిరీషకుసుమ పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య."[2]

అని యభ్యర్థించి

"మనువులలో స్వారోచిష మను సంభవ మరయ రససమంచిత కథలన్
వినసొంపు కలిధ్వంసక మనఘ! భవచ్చతుర రచన కనుకూలింబున్."[3]

'కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునంజెప్పు' మనెను. ఇందు రాయలు కావ్యప్రశస్తి నుగ్గడించి తన పేర కృతి రచింప మనసార కోరుటయేకాక రచింపవలసిన కావ్యమును, తదీయకథా వైశిష్ట్యమును, రచింపవలసిన తీరును తెలిపిన విషయ మెన్నదగి యున్నది. ఇటులే యనేక కవులు తమ యేలికల మంత్రుల యిష్టదైవముల ప్రేరణచేత కావ్యములు రచించియుండిరి. ఇక సంఘటన ప్రేరిత రచనలలో గోగులపాటి కూర్మనాథ కవిగారి సింహాద్రి నారసింహ శతక మొకటి. యవనులు సింహాద్రి క్షేత్రమును కొల్లగొట్టిన ఘోర సంఘటన గాంచి కవి సంతాపాతిశయముతో దానిని రచించెను.

ఆధునిక యుగమున ఏ కొందరో తప్ప మహాకవులనేకులు ఆత్మప్రేరణ చేతనే కావ్యములు వ్రాసినట్లు విశదమగును. దీనికి నాటికాలమున వలె నేటికాలమున సాహిత్యపోషకులగు రాజులు, సంస్థానప్రభువులు లేకపోవుటయేకాక ముఖ్యముగా స్వతంత్రమైన వ్యక్తిత్వము కారణము.

1. మనుచరిత్రము : 1-10
2. ,, : 1-14
3. ,, : 1-16

తిరుపతి వేంకటకవులు శ్రవణానందమును వాడరేవు వేంకటరత్న మంత్రి గారి అభ్యర్థనమువల్ల రచించి వారి కంకితము చేసిరి. వారు బుద్ధచరిత్రమును ప్రోల వరపు జమీందారైన కృష్ణారావు బహద్దరువారి ప్రోత్సాహమున రచించియుండిరి.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్పవృక్ష మును చిననాటి తండ్రిప్రేరణ చేతను ఆత్మప్రేరణ చేతను రచించిరి. దానిని వారిట్లు చెప్పికొనిరి.

"వ్రాసిన రామచంద్రకథ వ్రాసితివం చనిపించుకో వృథా
యాసముగాక కట్టుకత లైహికమా? పరమా? యటంచుఁ దాఁ
జేసిన తండ్రియాజ్ఞయును జీవుని వేదన రెండునేకమై
నా సకలోహవైభవసనాథము నాథకథన్ రచించెదన్."[1]

ఈ రీతిగా తండ్రి యాజ్ఞయు జీవుని వేదనయు నేకమై 'మరల నిదేల రామాయణం బన్నచో....తలఁచిన రామునే తలఁచెద నేనును నా భక్తిరచనలు నావిగాన' అని భక్తి తాత్పర్యములతో వాల్మీకిఋణము దీర్ప రామాయణ కల్పవృక్షమును రచించిరి.

దుర్భాక రాజశేఖర కవిగారు తాము రచించిన రాణాప్రతాప చరిత్రమున కాత్మప్రేరణయే హేతువు. ఆనాటి దేశస్వాతంత్ర్యోద్యమము జాతీయతచేత ఉత్తే జితులై సహజ దేశభక్తులగు వారు మహాదేశభక్తులగు రాణాప్రతాపుని గాథచేత ఆకర్షితులై 'నేనెల్లప్పుడు భావనాబలమునన్ నీ రూప నామ క్రియా ధ్యానంబుం గొని తన్మయత్వమున నన్యాకాంక్షలేకుంటి'నని కథానాయక తాదాత్మ్యముతో రచించిరి.

గడియారము వేంకటశేషశాస్త్రిగారి శివభారతము రచనాప్రేరణ కొంత విలక్షణమైనది. వారు 'నూతనమున్ బ్రాగ్గుణసమ్మితంబొక ప్రబంధంబు' రచింప తలంపుగొనియుండి ఒకనాడు తమ మిత్రుడు సహోద్యోగియునగు చరిత్రాధ్యాపకు నితో గూడి వాహ్యాళికేగగా ఆతడు 'మీరు కవులై గ్రంథములేల వ్రాయుటలే'దని యడుగగా తగిన యితివృత్తము కావలెనని తమ యభిప్రాయమును కావ్యప్రస్తావ నలో ఇట్లు వెల్లడించిరి.

1. శ్రీమద్రామాయణ కల్పవృక్షము - బాల-7.

"....పూర్వగాథ సాయంతన పద్మమై పలితమైనది, కల్పితగాథ బూటకం
బంతరసారమై విలువకందనిదైనది, ఖండగీతి భా
వాంతరలక్ష్యమై జగమునంట దుదాసితనాయకోన్నతిన్." అనియు,

"ఇన్నిటిలోన మేలిమి రహించెడు దేశచరిత్ర నేఁడు; సం
పన్నుఁడుదాత్తుఁడున్ జగదుపస్కృతి కాశ్రయమైన నాయకుం
డున్నతుఁడెవ్వఁడేనిఁ గృతియున్ జనరంజకమై తనర్చు; నా
యెన్నిక నట్టిగాథ లభియింపమి నింతట నూరకుండితిన్."

నియు వచించి యుదాత్తుడును జగదుపస్కృతి కాశ్రయమైనవాడును నగు చారిత్రక
రుషుని గాథ వ్రాయదలచి అట్టి గాథ లభింపక వ్రాయకుండితినని తెల్పగా ఆ
త్రుడు శివాజి చరితమును గైకొని కావ్యము వ్రాయుమని ప్రేరేపించెను. తత్ప్రే
ణచే 'దాన దయా శమ ధర్మవీర వర్తనుడు ప్రబంధనాయక పదమ్మున కర్హుడు
శ్రీశివప్రభుండని ముదమంది' శివభారతము రచించిరి. చారిత్రక మహాపురుషుని
ాథ వ్రాయ నిచ్చగలుగుటకా కాలమునాటి దేశభక్తి పూర్వక స్వాతంత్ర్యోద్యమము
ప్రేరకమైనది.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రపురాణము నాత్మప్రేరణ
చేతనే రచించిరి. 'ఒకనాటి బ్రాహ్మముహూర్తమునఁ దెనుగువారి చరిత్రసారంబు
నవపర్వ పరిమితంబుగా వింగడించుకొని 'ఆంధ్ర పురాణ' కావ్యరచనకుంగడంగిన
వాఁడ'నని కవిగారు కావ్యావతారికలో తెల్పుకొనిరి.

నవ్యకవితా యుగకర్తలగు గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు,
అభ్యుదయ కవితా యుగకర్త శ్రీశ్రీ - వీరు, వీరి యనుయాయులు, సమకాలిక
సాంఘిక రాజకీయాదిస్థితిగతులచేత ప్రేరితులై కావ్యములు వ్రాసిరి. గురజాడ లన
సాంఘిక రాజకీయాదిస్థితిగతులచేత... కాలపు సాంఘిక దురాచారములకు వగచి తదభ్యుదయార్థము రచించినవే ముత్యాల
సరములు, కన్యాశుల్క నాటకము. భావకవితా పితామహులగు రాయప్రోలువారు
వర్డ్సువర్తు, షెల్లీ మున్నగు ఆంగ్ల భావకవుల కవితలు చదివి ఉత్తేజితులై
తెలుగులో భావకవితా సృష్టి కావించిరి. వారు ప్రణయ కవితమే కాక అప్పటి దేశ
భక్తి జాతీయత ప్రేరేపగా భావకవితాశాఖా విలసితమగు దేశభక్తి కవితారచన
చేసిరి. వారివలెనే విశ్వనాథ కృష్ణశాస్త్రి, తల్లావజ్ఝల మన్నగువారు భావకవిత

వెలయించిరి. అభ్యుదయ యుగకర్త శ్రీశ్రీ రష్యాలో సుస్థిరమై దేశదేశాల వ్యాపించుచుండిన మార్క్సువాద సామ్యవాద మారుత ప్రేరితులై విప్లవ భావము చేతము నుద్రేకపరప 'మహాప్రస్థానం' గేయాలు రచించిరి. అట్లే దాశరథి, నారాయణరెడ్డి మొదలగు మహాకవుల కావ్యరచనకు సమకాలీన సాంఘిక రాజకీయ సాహిత్యాది స్థితిగతులే ప్రేరకములై యున్నవి.

## పోతన చరిత్రము-రచనాప్రేరణలు :

ఆచార్యులవారు పోతనగాథను కావ్యముగా రచించుటకు గల ప్రేరణలు, హేతువు లనేకములుగలవు. వానిని వారు కావ్యపీఠికలో, కథాప్రారంభములో తెలుపుటయేకాక విజ్ఞప్తిలో స్పష్టముగా వివరించి యున్నారు. మరియు కవిగారికి ఆబాల్యప్రాణమిత్రులును అతిసన్నిహితులునైన డా॥ పల్లా దుర్గయ్యగారు కూడ పోతన చరిత్రరచనకు హేతువులను తమ 'కవి-కావ్యపరిచయము'లో పేర్కొని యున్నారు. ఈ యన్నిటిని పరిశీలించినచో ఆచార్యుల వారు దేశకాల పరిస్థితులను సాహిత్యస్థితిగతులను గమనించి విశ్వశ్రేయస్సు నాకాంక్షించి తమ చిత్తవృత్తి కనుగుణముగా ఆత్మప్రేరణచేత పోతన చరిత్రము రచించినట్లు విశదమగును.

పోతనచరిత్ర రచనకు ప్రధానమైనప్రేరణ వస్తువునకు సంబంధించినదైనను తదనుబంధముగా మరికొన్నిటిగూర్చిన ప్రేరణలు విచారింపవలసి యున్నది. వారి రచనాప్రేరణలు I. కావ్యప్రక్రియ. II . వస్తువు. III. రచనావిధానము. IV. అంకితము అనువాని గురించి యున్నవి కావున వానిని క్రమముగా చర్చింతును.

## I. కావ్యప్రక్రియ:

పోతన చరిత్రము మహాకావ్యముగా మలచబడిన విషయము విస్పష్టము. అనేక ఖండకావ్యములు సంపుటములుగా వెలయించిన కవిగారు మహాకావ్యము రచింప తలంపూనిన విషయము పరిశీలింపవలసి యున్నది. దీనిని గూర్చి వారు స్వీయముగా 'విజ్ఞప్తి'లో నిట్లు విశదీకరించిరి.

"ఖండకావ్యము లేకైక ప్రయోజనప్రదములు. మహాకావ్యములు సకల పురుషార్థ సాధకములు. బహుళప్రయోజనప్రదములు.........మహాకావ్యము మాన

పత్వపు టానందపు టంచులను దట్టి పూర్ణరసానుభూతి నొసంగి పొంగి పొరలు మహానది.

మానవుని విజ్ఞానానుభవము పరిణతి నందని వినా మహాకావ్య నిర్మాణము సాధ్యపడదేమో? ఈ మహాకావ్యకర్తయే మహాకవి యనబడునేమో? ఈ మహాకవికీర్తి నందుటకు కాళిదాసంతటి ప్రతిభాశాలి పొట్టివాడు పొడువగు చెట్టు పండ్లను ఆసించుటవలె నపహాస్య భాజకమని యాత్మలో జంకినాడు. ఈ 20వ శతాబ్దిలో మహాకావ్యము లాంధ్రభాషలో పలువురు మహాకవులు వ్రాసిరి. బుద్ధచరిత్రము, సౌందరనందము, దేవీభాగవతము, రామాయణ కల్పవృక్షము, శివభారతము, రాణాప్రతాపసింహచరిత్రము, ఆంధ్రపురాణము మొదలగు కృతులు తామీకోవకు చెందినవే. వీనిలో కొన్ని సర్కారు జిల్లాలకు మరికొన్ని రాయలసీమకు చెందిన కవివరులు వ్రాసినవి. కాని యీ శతాబ్దిలో తెలంగాణము నుండి మహాకావ్య నిర్మాణము జరుగలేదేమో యని నా హృదయము శంకించినది. ఇట్లని నేను విశాలాంధ్రనుండి తెలంగాణమును వేరుచేయుట లనుకొనరాదు. ఆంధ్రదేశపు ప్రతి విడి భాగము విద్యావివేకముల కాలవాలమై కళాఖండ నిర్మాణమునకు సమర్థమైనదిగా నుండవలెననియే. అంగములలో నే యంగము బలహీనము కారాదని ఈ వెలితిని పూరింప నుద్యమించినది. కాని సముచితమైన యితివృత్త ముపలభ్య మగుటకై చాల కాల మన్వేషింప వలసి వచ్చినది."[1]

ఇందు సకల పురుషార్థ సాధకములు, బహుళ ప్రయోజనప్రదములు, పూర్ణరసానుభూతి సంధాయకములగునవి మహాకావ్యములే యని గుర్తించి, ఖండ కావ్యరచనలతో తనివి చెందక, మహాకావ్యరచన చేయవలెనన్న కవిగారి ప్రబల వాంఛ వ్యక్తమైనది. ఒక మహాకావ్యము వ్రాసి మహాకవి యను సత్కీర్తి నార్జింప వలెనను సదాశయమును వెల్లడియగుచున్నది. ఇదే విషయము నాచార్యులవారు కావ్యపీఠికలో

"అక్షరపదసంపదకై యక్షరపదముల వెలుంగు నవ్యయకవితా
లక్షణ లక్ష్యాకృతుల ముముక్షువుగతిఁ గొల్చి వ్రాయఁబూనెద సుకృతిన్."[2]

1. పోతన చరిత్రము: 'విజ్ఞప్తి' పుట 72.
2. పోతన చరిత్రము : 'పీఠిక' 14వ పద్యము.

అని సత్కావ్య రచనాశయమును వెలిపుచ్చినారు. అంతేకాక యీ శతాబ్దమున విశాలాంధ్రావనిలో సర్కారు రాయలసీమలలో మహాకావ్యముల నిర్మాణము జరిగి తెలంగాణమున జరుగనందున ఆ లోటు తీర్చుటకు తాముద్యమించిన విషయము సమంజసముగా వ్యక్తము చేసినారు. ఈ కారణములచేత తామొక మహాకావ్యము విరచింపవలెనని దృఢముగా సంకల్పించినారు. కాగా మహాకావ్యమునకు దగిన యితివృత్తము నిమిత్తము చాలకాలము పాటుపడవలసి వచ్చినది.

## II. వస్తువు :

మహాకావ్యమునకు సముచితమగు ఇతివృత్తమును గూర్చి విచారించుచున్న సమయములో పోతనగాథపై దృష్టిపడుట కొక ఘటన జరిగినది. దానిని విజ్ఞప్తిలో వారిట్లు తెలిపిరి.

"నేను ఒకమారు ఫిరదౌసీ చరిత్రమును బఠించి రాజులు సేయు దుర్ణయములకెంతయు ఖేదించితిని. ఆ సమయము నిజాము తెలంగాణముపై తన నిరంకుశ ప్రభుత్వము నెరపుచున్న దినములు. నాకప్పుడు రాజులను ధిక్కరించి వారి నిరంకుశ చర్యల నసహ్యించుకొని కవితాకన్యకు కర్షకవృత్తితో నుపజీవికను కల్పించి యాత్మాభిమానమును రక్షించుకొనిన మహాకవిశేఖరుడు,పోతనామాత్యుడు కండ్లగట్టెను. ఆశకు లొంగనివానికి ఈశత్వము లొంగునని చూపించిన పోతరాజే నిజమైన రాజని తలంచితిని."[1]

ఫిరదౌసి చరిత్ర పఠనఘటన పోతన రచనకు ప్రేరకమైనది. పారసీమహాకవి ఫిరదౌసి చరిత్ర సుప్రసిద్ధమైనది. గజనీ మహమ్మదు చక్రవర్తి తన వంశ చరిత్ర కావ్యముగా రచించుటకు ఫిరదౌసి నభ్యర్థించి పద్యమున కొక బంగారు రూపాయి నిత్తునని వాగ్దానము చేయుట, ఫిరదౌసి కష్టపడి 'షా నామా' రచించి చక్రవర్తికి సమర్పించగా అతడు మాటతప్పి వెండి రూపాయ లీయజూపుట, కవి మిక్కిలి ఖిన్నుడై వెడలి రాజును నిందించుచు పద్యములు వ్రాసి పంపగా రాజు క్రోధోన్మత్తుడై ఫిరదౌసిని బంధించుటకు భటులను పంపి తర్వాత పశ్చాత్తప్తుడై బంగారు నాణెములు పంపించుట, ఆ ధనము చేరులోపలనే సుమిలి మర

1. పోతనచరిత్రము : 'విజ్ఞప్తి' పుట 72.

ణించిన కవి శవము వెడలుట - ఈ సర్వవృత్తాంత మెదలు కదలించునదిగా నున్నది. గుఱ్ఱం జాషువా రచించిన ఫిరదౌసి కావ్యమును చదివినప్పుడు తమకీ యాత్మతాపము కలిగినట్లు వరదాచార్యులవారు చెప్పినారు.

గజనీ మహమ్మదువంటి ప్రభువు లన్నిదేశములలో నుందురు. మనదేశము నందును నుండిరి. నిరంకుశులగు రాజులు తమ పేర్ప్రతిష్ఠలకు కవులను పావుల వలె వాడుకొన్నారు. తమ కీర్తిసౌధములను వారి కావ్యక్షేత్రములలో నిర్మింపజేసి కొన్నారు. వారి ఆగడములకెందరో కవులు కళాకారులు బలియైపోయినారు. క్రూర ధారుణీపతుల దౌష్ట్యము లాచార్యులవారికి హృదయసంక్షోభము కలిగించినవి. ఆ రోజులలో నిజాం నిరంకుశచర్యలను కనులార చూచి, వట్టికోట ఆళ్వారుస్వామి,దాశ రథివంటి వారలకు విధింపబడిన జైలుశిక్షలకు వ్యథపడుటయేకాక తాము క్రూర ప్రభుత్వ పీడలకు గురియై కష్టము లనుభవించియుండిరి. కావున ఫిరదౌసి కావ్యము చదివినప్పుడు నిరంకుశరాజులను ధిక్కరించిన కవీంద్రుడు బమ్మెర పోతన స్మృతి పథమున మెఱయుట జరిగినది.

ఈవిధముగా రాజ్యమదాంధులగు క్షుద్రభూపతుల నిరంకుశ చేష్టల నస హ్యించుకొని వారిని ధిక్కరించి 'కావ్యకన్యకన్ గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్ హాలికులైననేమి ?' యని కోండ్రను నమ్ముకొని ఆత్మాభిమానముతో జీవించి కవుల కాదర్శపురుషుడైన కవిరాజు బమ్మెర పోతన జీవితచరిత్రము మహాకావ్యముగా రచింప నిశ్చయించుకొన్నారు.

నిరంకుశనరాధిపుల దురాగతములకు పరితపించినవారును, ఏవగించుకొని యెదిరించినవారును అగు తెలుగుకవులు కొందరు కలరు. వేములవాడ భీమకవి, తాళ్లపాక అన్నమాచార్యులు, బమ్మెర పోతన, ధూర్జటి, అడిదము సూరకవి, వేమన మున్నగు కవివరేణ్యులు రాజుల దుర్మదాంధత్వమును నిరసించిన అభిమానధనులే. ఇందరిలో ఆచార్యులవారు పోతననే వరిష్ఠునిగా భావించి యాతని గాథయే ప్రబంధీకరించుటకు హేతువులను వారు కావ్యవిజ్ఞప్తిలో పేర్కొనిన పోతనగారి విశిష్ట గుణ కర్మ స్వభావములే. విజ్ఞప్తిలోని మాటలనే అంశములుగా దిగువ పొందుపరచుచున్నాను.

## పోతనగారి విశిష్ట వ్యక్తిత్వము :

1. "పోతన మనశ్శాంతి ప్రదమగు హరిభక్తి భావ మరందపాన మత్త చిత్తు డగు వాఁడు క్షణికములగు విషయ సుఖములఁ ద్యజించఁగలఁ డనుటకుఁ దార్కాణము తానయై యొప్పిన మహాభాగవతోత్తముఁడు.

2. పారలౌకిక సుఖముల నొసంగు భాగవత ప్రబంధము నతి భాసురగతి రచించి పునర్జన్మ రహితమగు వైకుంఠవాసము గోరి హరి నర్చించి యమరత్వము నందిన ధన్యజీవి.

3. అనర్హుల స్తుతిలో దుర్వినియోగపడు వాణి కన్నుల నీరుగాంచి కరఁగిన నవనీత హృదయుఁడు.

4. 'అంబా ! ఆకలికైనను మలమలమాడి చత్తునుగాని నిన్నా కర్ణాట కిరాటకీచకుల కమ్మ' నని శపథమొనర్చి భారతి కాటుక కంటి కన్నీరు దుడిచి భవబంధము నడచిన త్యాగశీలి.

5. ప్రబంధ ముఖముల రాజుల నభివర్ణించి యష్టైశ్వర్యముల ననుభవింప జేయు నగ్రహారములకై యాత్మస్వాతంత్ర్యము నమ్ముకొని జీవించు కవుల దైన్యమును గాంచి కష్టపడినవాడు.

6. 'నిరంకుశాః కవయః' అను సూక్తిని నిల్పుటకై నిరంతరకృషి సల్పి సఫలీకృత మనోరథుండై యాత్మాభిమానముతో నలరారు మహాకవివీరుఁడు.

7. క్షోణీకోణ శతాంశ పాలకు లగు నృపు లనవధికమగు కాలజలధిలో నరనిమేషము స్ఫురించి యంతరించు బుద్బుద ప్రాయులను వాస్తవికతను గుర్తెఱిఁగినవాఁడు.

8. నిత్యానపాయిని యగు శ్రీదేవి సేవింప నిఖిల హేయగుణ రహితుఁ డును, సకల కల్యాణగుణ సహితుఁడునై యెప్పుడును రెప్పపాటు లేక నిత్య సూరివర్గము సేవింప నొప్పు సౌందర్య మహోదధియునై యైహికాముష్మిక సుఖ ప్రదుఁడునై యలరారు శ్రీహరిని సేవించి తద్రూపగుణాభివర్ణనము నొనర్చి యజ హరామరాదుల కందరాని సుఖసంపదల కధికారియైన ముక్తాత్మ.

9. పండిత పామరు లనక ఆంధ్రుల కందరికి నభిమానపాత్రుఁడై కవిజాతికి మార్గదర్శకుఁడైనవాఁడు,

10. ఆంధ్రులచేఁ గాక ఆంధ్రేతరులచేఁ గూడ స్తుతింపఁబడిన భక్త కవిలోక శిరోమణి.

11, తన వాక్కులు ధరణిజనులు తలఁదాల్చ భక్తి పథములలో నడపించి యాంధ్ర హృదయపీఠముల నధివసించి శాసించు మకుటములేని మహాకవి సార్వభౌముఁడు.

12. వాల్మీకి తర్వాత రామాయణకథ తన దేశభాషలో వ్రాసి ప్రజల మెప్పు పొందినవాఁడొక తులసీదాసుఁడే. వ్యాసుని తర్వాత భాగవతమును తన దేశభాషలో వ్రాసి మెప్పు పొందినవాఁడొక పోతనయే."[1]

ఏవం విధ లోకోత్తర గుణరత్న విరాజితుడైన మహాపురుషుని బమ్మెర పోతరాజును కావ్య కథానాయకునిగా స్వీకరించి తమ భవ్య కవితను చరితార్థము చేసికొన్నారాచార్యులవారు.

ఒక మహోత్తమ పురుషనాయకమగు చక్కని యితివృత్తము లభించి నంత మాత్రమున ఏకవియైనను దానిని గ్రహించి విశిష్టముగా కావ్యము రచింపగల వనుట యసంగతవిషయము. కవికి కావ్యనాయకునిపై అభిమానము, అతని వ్యక్తిత్వముపై అభిరుచి యుండి అతని చిత్తవృత్తితో తనకు కొంత సామ్యముండి యతనితో తాదాత్మ్యము భజించెనేని కవి ఆ నాయకుని వర్ణన మదాత్తముగా జేసి దివ్యకావ్యనిర్మాణము సుకరముగా కావింపగలడు. వరదాచార్యులవారికి పోతన పైన అపారమైన అభిమానము కలదు. పోతనవలెనే ఆచార్యుల వారును భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నులగుటవల్ల పోతన గుణగణములతోడను వ్యక్తిత్వముతోడను సామ్యముండుటవల్ల అతనిపై ప్రత్యేకాభిరుచి యేర్పడినది. అంతేకాక పోతన జీవితసాహిత్యములతో ఆచార్యులవారి జీవిత సాహిత్యములు చాల వరకు పోలి యుండుటచేత అతనితో వారు తాదాత్మ్యముచెందిన విషయము పరమ యథార్థము. కవిత్రయమువారికి భారతము, పాల్కురికి సోమనాథునికి బసవపురాణము, శ్రీనాథునికి శృంగారనైషధము హరవిలాసము, శ్రీకృష్ణరాయల కాముక్తమాల్యద, పెద్దనకు మనుచరిత్ర, తిమ్మనకు పారిజాతాపహరణము, ధూర్జటికి శ్రీకాళహస్తి

1. పోతన చరిత్రము : 'విజ్ఞప్తి' పుట 73.

మాహాత్మ్యము-ఎటుల పొసగినవో అటులే ఆచార్యులవారికి పోతనచరిత్రము పొసగినది. విశేషించి భాగవతము పోతన చేతబడుట యెట్టిదో పోతనచరిత్రము వరదాచార్యులవారి చేతబడుట యట్టిది. ఈ విషయమునే ఆచార్య దివాకర్ల వేంకటావధానిగా రిట్లు వివరించిరి.

"....స్వభావముచే సదాచారసంపదచే వారిరువురును (పోతన వరదాచార్యులు) ఋషితుల్యులు. శ్రీమద్భాగవతాంధ్రీకరణము పోతనచేతఁబడుట యెట్టిదో పోతనచరిత్ర ప్రబంధీకరణ మాచార్యులవారి చేతఁబడుట యట్టిది. వారి చరిత్ర పోతనచరిత్రకుఁ బ్రతిబింబము. అందుచేతనే వారీ చరిత్రము ననుభవ సిద్ధము నట్లింత మధురసుందరముగా వెలయింపఁజాలినారు."[1]

పోతన భక్తితో భాగవతమెట్లువ్రాసెనో ఆచార్యులవారు భక్తితో భాగవత శిఖామణియగు పోతనగారి చరిత్రమట్లు వ్రాసిరి. ఈ విషయ మాచార్యులవారు విజ్ఞప్తిలో నిట్లు తెలిపిరి.

"ఈ పోతనకవిరాజుతోబాటు తెలుగునాట నింకను నిరువురు రాజులు కలరు. అందులో నొకరు త్యాగరాజు. రెండవరాజు గోపరాజు. ఈ ముగ్గురి రాజుల నభివర్ణించి భుక్తిముక్తుల నాస్వాదింపగోరిన నాకు 'మద్వందనాచ్ఛతగుణం మద్దాసస్యచ వందనమ్' అను భగవద్వాక్యము స్మృతికి వచ్చి నాసంకల్పమునకు బలము చేకూర్చినది. వెంటనే శ్రీపోతన కవిరాజు జీవితేతివృత్తమును మహాప్రబంధ రూపముగా నారంభించి యత్యంత భక్తిశ్రద్ధలతో ముగించితిని."[2]

భగవంతుడు తనకు చేయు వందనముకంటె తన భక్తునికి చేయు వందనము వందరెట్లెక్కువయని సంతోషించువాడు కావున భగవద్భక్తుడగు పోతన గాథను భక్తితాత్పర్యములతో వరదాచార్యులవారు మహాప్రబంధముగా రచించి కృతకృత్యులైరి.

1. పోతన చరిత్రము : తొలిపలుకు' పుట 17.
2. పోతనచరిత్రము : 'విజ్ఞప్తి' పుట 73.

## సమకాలీన సమంజసేతివృత్తము:

ఆచార్యులవారు ఫిరదౌసి కావ్యము పఠించినప్పుడు హఠాత్తుగా ప్రేరణ కలిగి పోతన గాథపై దృష్టిపడి మహోదాత్త సుగుణ విభాసితుడును స్వీయ వ్యక్తిత్వసామ్యశోభితుడును నగుటచేత భక్తిశ్రద్ధలేర్పడి పోతనచరిత్రము రచించి నారని తెలిసికొంటిమి. పోతనచరిత్రము వ్రాయుటకి ప్రేరణలేకాక మరియొక హేతువు గోచరించును. అది సమకాలీన సమంజసవస్తు విచారము. మహాకవులు గతానుగతికములైన పిల్ల వసుచరిత్రలవంటి కావ్యముల జోలికి పోక దేశకాలము లకు దగిన విశిష్టవస్తువుల నెన్నుకొని మహాకావ్యములు రచింతురు. ఏవి ప్రస్తు తమో యేవి యాదర్శమో యేవి శాశ్వతమో అట్టి యుత్కృష్టములైన యితి వృత్తములనే గ్రహించి సత్కావ్యములు రచించి తమ ప్రత్యేకతను నిల్పుకొని యుగమును స్థాపించుటకు కృషిచేయుదురు. ఆచార్యులవారీ విధమైన సమ్యగ్వి చారము సమగ్రముగా చేసియే పోతన చరిత్రము రచించినారని తెలియగలదు.

ఆధునిక యుగమున మహాపురుషుల జీవిత చరిత్రలు, అందును కవుల జీవిత చరిత్రలు కావ్యములుగా వ్రాయుట యొక లక్షణముగా కన్పడునని వెనుకటి వ్యాసములో వివరించియుంటిని. ఆచార్యులవారు పోతన జీవితగాథ కావ్యముగా మలచుట ఏతల్లక్షణ విశిష్టమై యొప్పుచున్నది. ఆయా కవుల జీవితములతోబాటు పోతన జీవితము గద్య నాటకాది రూపములలో రచించుట జరిగియు పద్యమయ మహాకావ్యముగా రచింపబడలేదు. ఈ వెలితి పూరించుట కాచార్యులవారు సదాశయ ముతో సమకట్టిరి. శ్రీ మహాభాగవతాంధ్రీకరణ భాగ్యము పోతన గారికే దక్కి నట్లు పోతన గారి జీవితగాథను ప్రబంధీకరించు భాగ్యము వరదాచార్యులవారికే దక్కినది.

ఎందరో కవులుండ పోతనగాథనే వ్రాయుటకుగల యనేక కారణములను పైన తెలిపితిని. కాగా ఈ కాలమున పోతనవంటి మహాకవిని గూర్చి చదివి యతని ఉత్తమాశయములను, ఉదాత్త జీవితాదర్శములను సంస్మరించి సమ్యక్స్ఫూర్తి నందుట అత్యవసరమైయున్నది. ఈ యావశ్యకమును గుర్తించి అత్యంతాభినివేశ ముతో ఆచార్యులవారీ మహాకావ్యము రచించిరి. ఈ యభిప్రాయమునే కవిగారు స్వయముగా పోతనచరిత్రము పీఠికలోని 'అభ్యర్థన'లో బహుభంగుల వెలిపుచ్చి

భూజనులకు నవ్యచైతన్య వికాసముల నొనగూర్ప రమ్మని కర్షకకవీంద్రుడగు పోతన నావాహన చేసినారు.

"ఎవనికి వాగ్వధూటి వెత నెంతయుఁ దీర్చెడి దిక్కటంచుఁ గ
న్గవబడి యశ్రుపంక్తి దన కష్టసుఖమ్ముల విన్నవించె, నో
కవివర ! తెన్గు భాగవత కన్య నొసంగు మటంచు వేడెఁ దా
నెవనిని గాంచి శ్రీరమణుఁ డిట్టిఁడు మానవ మాత్రుఁ డౌనొకో"1

వాగ్దేవి కభయ మిచ్చి వ్యథ తీర్చినవాడు,రామునిచేత నభ్యర్థితుడై శ్రీభాగవతము తెనుగుచేసి సమర్పించినవాడును నగు మహానుభావుడు లోకోత్తరపురుషుడేకాని మానవమాత్రుడు కాడు. ఆ మహనీయుని చరిత్ర చిరస్మరణీయమైనది. అట్టి పోతన సుకవీంద్రుని, మా తెలంగాణ నీవంటి మహాకవిని గన్నంత పావన చరిత్ర యయ్యెనని లోకులు వినుతింప మరల గొంతెత్తి కవితామృతధారలు గురిపింప రమ్మని యాహ్వానించుచున్నారు. పలుకు వెలదిపై కన్నువేసి కడగండ్లపాలు చేయు నరాసురులగు ధరాపతుల కాలము పోయెననియు, పుష్పించి ఫలించు భాగవత కల్పతరువును పొట్టను బెట్టుకొన జూచు చెదపుర్వుల నరకాల నేలకు రాచి వాని దారులకు రాళ్లగొట్టెదననియు, '...వరద హస్తమ్ములో బుట్టి పెరిగి తిరిగి లేచి రావోయి హాలికా ! లేచిరమ్ము, గడుసు శ్రీనాథుల దినాలు గడచిపోయె, కర్షకుని దైవము ఫలించు కాలమిదియె'2 యనియు సమాహ్వానగావించినారు. దారి తప్పి దోరగలు పడిపోవుచున్న మానవ జీవిత శకటమును సముద్ధరించి యేలుటకు వచ్చి కలము హలము చేతబూని కర్మయోగివి కమ్మనియు నీ వంటి యొక కర్షక సత్కవి యిపు డత్యవసరమనియు నభ్యర్థించినారు. కలలు గాంచు ప్రాగ్దిశాతరుణి కనువిచ్చునట్లు, గంటములు సుకవితాసుధలు వర్షించునట్లు, గ్రామికులగు కర్షకుల దారిద్ర్యపిశాచములు పారిపోవునట్లు 'విప్లవ పాంచజన్య పృథుశంఖం బొత్తి మేల్కొల్పవే'యని ప్రార్థించినారు. మరియు ధర్మవిహీనులై బలహీనుల మ్రింగివేయు బలవంతులకు గుండె గాలముగా గంటమెత్తుమనియు, దేశభక్తి జాతీయత నుద్బోధించు కవితల వెలార్పుమనియు, అణ్వస్త్రములచేత దహించుకొనిపోవు

1. పోతన చరిత్రము : పీఠిక– 'అభ్యర్థన' 58 వ పద్యము.
2. పోతన చరిత్రము : పీఠిక–'అభ్యర్థన' 64వ పద్యము.

ప్రపంచమున 'భవత్కవన గాంగ ఝరిన్ సురలోక నందనోద్యానము నాటిపోన్ భరత ధాత్రికి రాఁగదవే' యనియు విజ్ఞప్తి చేసినారు. అంతేకాక,

"ధరణీపాలుర రాజ్యవైభములున్ దత్ప్రేయసీ నాయికా
విరహోన్మాదకృతుల్ సమీక విజయోద్యృత్తమ్ములున్ నిత్యమున్
బరహింసాత్మక సార్వభౌమతలు కావ్యం బౌచు రూపొంది యు
ర్వరకీ దుర్దశఁగూర్చె, శౌరిపద సద్భక్తిన్ బ్రసాదింపుమీ ?"[1]

అని నిరంకుశరాజుల రాణుల విరహోన్మాదకృతులు యుద్ధవిజయవృత్తాంతములు దౌర్జన్య దురాక్రమణలు కావ్యవస్తువులై దురవస్థపాలైన యీ భూమియందు శాంతి సౌఖ్యములకు, సత్యధర్మముల కాలవాలమగు హరిభక్తిని ప్రసాదించుమని పోతన నభ్యర్థించినారు. మరియు ప్రస్తుత కాలమున పోతనకంటె మించిన ప్రజాకవి మరి యొకరు కానరారని యీ విధముగా వినుతించుట జరిగినది.

"నిక్కముగా ప్రజాహృదయ నిర్మల ధర్మసుఖాసనమ్ముపై
నెక్కఁగ నీవు దక్క మరియెవ్వరు నర్హులు గారటంచు నల్
దిక్కులు మాఱుమ్రోఁగెడి నదే! నిజకావ్యవిపంచికాశ్రుతిన్
జక్క సవర్చి కర్షకజనస్వరగీతిక లాలపింపవే!"[2]

కవు లమాత్యుల నధికారుల నాశ్రయించి పొట్టకోసము కృతుల నమ్ము కొను దైన్యమును విడనాడి, తుచ్ఛభోగముల నాశింపక స్వేచ్ఛాజీవనులై ఆత్మాభి మానముతో అంచితగౌరవముతో జీవించుచు వాగ్దేవి నారాధించుటకును, సద్ధర్మాను రక్తికిని, భగవద్భక్తికిని, విశ్వశాంతి సౌభాగ్యములకును పోతన వంటి కర్షక కవీశ్వరుడు కావలయునని సమకాలిక సమంజసేతివృత్తమగు పోతన చరిత్రమును కవిగారు రచించిరి.

ఆచార్యులవారు పోతన చరిత్ర రచన పూర్తిచేసి ప్రచురణార్థము ప్రయ త్నించుచుండ అప్పటి ఆర్థిక శాఖామాత్యులు గౌ॥ మట్టి చెన్నారెడ్డిగారు సాహితీ

---

3. పోతన చరిత్రము : పీఠిక - 'అభ్యర్థన' 71వ పద్యము.
1. " : " - " 63వ "

బంధువులై పదివేల రూపాయ లిప్పించిరి. ఆ సందర్భమున కమ్యూనిస్టు నాయకు లొకరు 'చాదస్తపు పోతనకవి కథను రాసిన బూజుపట్టిన కవిత్వానికి ప్రజాధనం ఇలా దుర్వినియోగం చేయవచ్చా?' అని ఆక్షేపించినారు. దానికి 'పోతన చాదస్తపు కవి కాడు.' బూర్జువాకవి అంతకంటే కాడు. అతడు తనకాలపు క్రూరనిరంకుశ రాజుల నెదిరించి నిలిచిన ధీరకవి, విప్లవ కవి. అతడు శ్రమ విలువ, జీవకారుణ్యం బాగా తెలిసినవాడు కనుకనే కష్టపడి మడి దున్నుకొని జీవించాడు. పేదసాదల నాదుకొన్నాడు. అతనికంటె ప్రజాకవి యెవరండీ?' అని బదులు చెప్పగనే సంతోషించి 'అలాగా, ఐతే పోతన అభ్యుదయ కవే. అతని చరిత్ర కావ్యానికి సహాయం చెయ్యవలసిందే" అన్నారు.[1]

సాధువర్తనుడును, శాంతుడును, స్వాభిమానరతుడును, సద్ధర్మపరాయణుడును, సైరికుడును అగు పోతన సర్వజనప్రియుడగుటలో సందేహము లేదు. సమన్వయ సామరస్య సౌమనస్యములను కాంక్షించు ఈ కాలమున పోతనవంటి సుకవీంద్రుని చరిత్ర మవశ్యోపాదేయమైనదను తలంపుతో ఆచార్యులవారీ మహాశయుని చరిత్రము విరచించిరి.

## మరికొన్ని హేతువులు:

ఆచార్యులవారు పోతన గాథనే ప్రబంధీకరించుటకు గల మరికొన్ని హేతువులను డా॥ పల్లా దుర్గయ్యగారు దిగువరీతిగా పేర్కొనిరి.

"ప్రాచీనాంధ్ర మహాకవులు పలువురుండగా వీరు ప్రత్యేకముగా బమ్మెర పోతన జీవితగాథనే తమ కావ్యవస్తువుగా గ్రహించుటకు గొన్ని కారణము లూహింపవచ్చును.

సారస్వతజీవితము వలెనే పోతన సాంసారికజీవితము కూడ విశిష్టమయి పవిత్రముగా భాసించుట మొదటిది.

ఆచార్యులవారి జీవితమును నిరాడంబరమును నిర్మలమునై యొప్పుచుండుట రెండవది.

ఆంధ్ర భాగవతము వీరి కత్యంత ప్రీతిపాత్రమయి యభిమాన గ్రంథముగా నుండుట మూడవది.

1. ఈ యుదంతము వరదాచార్యులవారి ద్వారా తెలిసినది.

పోతనవలెనే వీరుకూడ తెలంగాణమువారగుటయేకాక, ఏకశిలానగరమున కును బమ్మెరకును మధ్యలో నున్న మడికొండ (మణిగిరి) గ్రామము నందు పుట్టి పెరిగి పెద్దవారగుట నాల్గవది. ఈ కొన్ని హేతువులే వీరి నీ కావ్యరచనకు ప్రోత్సహించియుండు ననవచ్చును."[1]

డా॥ దుర్గయ్యగా రూహించిన పై హేతువులు వాస్తవములు సమంజసము లునై యున్నవి. పోతనకు అభినవపోతనకు నిజజీవిత సారస్వతజీవితముల సామ్య ముండుటవల్లను, బాల్యమునుండియు వరదాచార్యులవారు భక్తులై భాగవతమును ప్రత్యేక భక్తి తాత్పర్యములతో పారాయణము చేయుటయేకాక పురాణము చెప్పుట చేత తదీయాంధ్రీకర్తపై నభిమాన మభివృద్ధి చెందుట వల్లను బమ్మెరయు తమ యభి జనమగు మడికొండయు సమీపప్రాంతము లగుటచేత అనురాగానుబంధములు పెనగొనుటవల్లను సహజముగా పోతనగారిపై గాఢమైన అభిమాన మేర్పడి యతని జీవితగాథ గైకొని కావ్యరచన కావించినారనుట యుక్తియుక్తమైనది.

ఈ విధముగా తొలుత ఫిరదౌసికావ్యము పఠించినప్పుడు ఆత్మప్రేరణ కలిగి పరమవిశిష్ట వ్యక్తిత్వముగల పోతన సుకవీంద్రుడు మానసవీథిని నడయాడి స్వీయగుణశీలాదుల సామ్యముండుటచేత అభిమానము ప్రగాఢమై సమకాలీన సమంజసేతివృత్త విచారమున అత్యంతావశ్యకము నమితార్థ్వమన్న దృఢనిశ్చయ మేర్పడి కవిగారు పోతన గాథను మహాకావ్యముగా రచించినారు.

## III. రచనా విధానము :

పోతనగాథను గ్రహించి మహాకావ్యము రచింపబూనిన ఆచార్యులవారు తద్రచనా నిర్వహణమునకు ప్రబంధధోరణి నవలంబించినారన్నది సువిదితము. ఐనను ప్రబంధధోరణిలోనే వ్రాయుటకుగల హేతువుల నరయుట ప్రస్తుత విష యము. ఆచార్యులవారికి ప్రబంధరచనపై మక్కువ గలదన్న విషయము కొంత 'పోతనచరిత్రము మహాప్రబంధము' అను వ్యాసమున తెలిపియుంటిని. ప్రబంధ ములపై మక్కువ, తదీయ రచనాశయము కవిగారి కెంత ఎక్కువగాగలదో వారు విజ్ఞప్తిలో తెలిపిన దిగువ వాక్యములవల్ల విశదము కాగలదు.

1. పోతన చరిత్రము : 'కవి-కావ్య పరిచయము' పుట 6.

"ఆంధ్ర కవితాకన్య పురాణేతిహాస కావ్య మార్గముల విహరించుచు వచ్చి పెద్దనాదుల కాలమందు రమణీయార్థ ప్రతిపాద్యములగు సుందర పదరీతులతో వినూత్న ప్రబంధ ప్రపంచోద్యానముల వెనుకటికన్న మిన్నలగు వింత విలస నమ్ముల విహరించి సహృదయుల సన్మానముల నందుకొని జయధ్వజ మెత్తినది. రసవత్కావ్య కళా విశ్వవీథులలో సీమాభూమిగ వెలువొందినది. ఈ ప్రబంధ పద్ధతి నన్ను మిక్కిలిగా నాకర్షించినది. అటులని నేను నూతన కవితా మార్గముల కును దూరుడగా నెంచలేదు. నాకవితలో నేను రెంటిలోని సౌందర్యముల శక్తి వంచన లేక యారాధించినాడనని సహృదయులు తెలిసికొనకపోరు.... కావున సరస కావ్యత్వమునకు పరిణతదశను సమకూర్చిన యలనాటి ప్రబంధఫక్కిలో నేనీ కావ్యరచనకు దొరకొంటిని.''[1]

కావ్య విశేషమగు ప్రబంధము రసవత్కావ్యకళకు పరిణతదశను సమ కూర్చిన విశిష్టకృతియని గ్రహించి అభిమానాభిరుచు లేర్పడుటయే పోతన చరిత్రము ప్రబంధధోరణిలో వ్రాయుటకు హేతువైనది.

## IV. అంకితము :

ఆచార్యులవారు తమ పోతన చరిత్రమును శ్రీరామచంద్రునకు భక్తితో అంకితము చేసినారు. ఈ విషయమును కావ్యారంభములో నిటుల తెలిపినారు.

"సొమ్ముల యాసలోఁ బడక క్షుద్రనృపాలుర నీసడించి చొ
క్కమ్మగు భక్తి భాగవత కావ్యరమన్ గృతినిచ్చె నీకు శ్రీ
బమ్మెర పోతరా జతని భవ్యచరిత్రమునే మహాప్రబం
ధమ్ము నొనర్చి నిన్ను కృతినాథునిగా నొనరించి చెప్పెదన్."[2]

మరియు పరమవాత్సల్యముతో తన కావ్యమును వినవలెనని శ్రీరామునిట్లు ప్రార్థించి నారు.

''సుతుని గొప్పలఁ గీర్తింప నతిముదమున వినుచుఁ దనుదాన మఱచెడి జనకునివలె
నాలకింపవె దేవ! మహానుభావ! జనవినుతకీర్తి! శ్రీరామచక్రవర్తి!''[3]

1. పోతన చరిత్రము 'విజ్ఞప్తి' పుట 74
2. ,, 1-2.
3. ,, 1-4.

అచ్చమైన భక్తితో భాగవతమును శ్రీరాముని కంకితము చేసినట్టి బమ్మెర పోతనగారి చరిత్రమును ప్రబంధీకరించి ఆ శ్రీరామునికే భక్తితాత్పర్యములతో అంకితము చేసినా రాచార్యులవారు. పోతన చరిత్రము నిటుల శ్రీరాముని కంకితము చేయుటకు గల కారణములు పరిశీలింపవలసి యున్నది.

పోతనవలెనే వరదాచార్యులవారును భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నులే కాక రామభక్తిపరులు. ఇరువురికిని శ్రీరాము డిష్టదైవము. ఆచార్యులవారు పోతనవలెనే బాల్యమున రామతారక మంత్రోపాసన చేసియుండిరి. తులసీరామాయణమును చిన్ననాడే పలుమారులు విని రామభక్తి ప్రపత్తులను ప్రగాఢము చేసికొనిరి. ఈ విషయము కవిగారి జీవిత సంగ్రహములో వివరించియుంటిని. అట్టి మహాభక్తిచేత తమ యిష్టదైవమగు శ్రీరామచంద్రునకే కృతి సమర్పణము కావించియుండిరి. మరియు రామభక్తుడగు పోతనగారి పవిత్ర జీవిత చరిత్ర ప్రబంధము రామునకు సమర్పించుటయే సమంజసము సార్థకమని భావించిరి. అందువల్లనే 'సుతుని (భక్తుడగు పోతనయొక్క) గొప్పలఁ గీర్తింప నతిముదమున వినుచుఁ దను దాన మఱచెడి జనకునివలె నాలకింపవె' యని రాముని వేడుకొన్నారు.

ఆచార్యులవారొక మహాకావ్యము రచింప సంకల్పించి యోగ్యమైన మహోదాత్తమైన యితివృత్తమున కన్వేషణ కావించి పోతనగాథను స్వీకరించి విశిష్టమగు ప్రబంధ రచన నాశ్రయించి యిష్టదైవమగు శ్రీరామచంద్రునికి సమర్పణముగా మహాకావ్యము రచించి చరితార్థులైనారు. వారి పోతనచరిత్ర రచనకుగల ప్రేరణలు తదీయసదాశయములు చక్కగాఅవగాహన చేసికొని సేవించు సహృదయ సాహితీపరులకు సంపూర్ణముగా కావ్యరసానందానుభూతి కలిగి పోతనగారి ఉత్తమ జీవితాదర్శముల సద్ధర్మోపదేశము వెలిగి విశ్వశ్రేయమగు ననుటలో విప్రతిపత్తి లేదు.

# వర్తమానకాలము నందు మహాకావ్యములు – పోతన చరిత్రము

ఆంధ్ర సాహిత్యచరిత్రలో కావ్యప్రక్రియా విషయమున ఖండకావ్యయుగముగా పరిగణింపబడుచున్న ఆధునిక కాలములో పోతన చరిత్రమువంటి మహాకావ్యముల రచన జరుగుచున్న విషయము గమనార్హమైనది. తఱచుగా ఖండకావ్యములు రచింపబడుచున్న ఈ కాలమున మహాకావ్య రచన ఏటికెదురీతవలె కన్పించును. ఇట్టి పరిస్థితిలో నేడు మహాకావ్యముల రచనలోని సామంజస్యమును, అందు పోతనచరిత్ర యొక్క స్థానమును విచారింపవలసియున్నది.

## ఖండకావ్యములు - మహాకావ్యములు :

వర్తమానకాలములో వెలువడుచున్న అనేక కావ్యప్రక్రియలలో నవ్యకవితా విలసితమైన ఖండకావ్య ప్రక్రియ బహుళ ప్రాచుర్యము ప్రశస్తిగాంచినది. ఈ విషయము 'ఖండకావ్య ప్రక్రియ....' వ్యాసములో వివరించియుంటిని. ఈనాడు మహాకావ్యములు రచింపబడుచున్నను ప్రధానముగా ఖండకావ్య రచన సాగుచున్నందువల్ల ఇది ఖండకావ్య యుగమై యొప్పుచున్నది. దేశకాలపరిస్థితులు, సామాజికాది స్థితిగతులు, పాలకుల ప్రజల అభిరుచులు మున్నగువానిపై ఆధారపడి కావ్యరచన సాగుచుండును. ఆయా కాలములలో పై కారణములవలన రచనలలో మార్పులు సంభవించును. సాహిత్య చరిత్రకారులు సమస్త సారస్వతమును పరిశోధించి ఆయా కాలములలో వెలసిన విభిన్న కావ్యములను పరిశీలించి యుగములుగా వింగడించి చర్చింతురు. అట్టివి ఆంధ్రసాహిత్య చరిత్రలో ప్రాఙ్నన్నయ యుగము, భాషాంతరీకరణ యుగము, కావ్యయుగము, ప్రబంధ యుగము, దక్షిణాంధ్ర యుగము, ఆధునిక యుగమని, ప్రధానముగా ఆరు యుగములు కలవు.[1] ఈ యుగములకీ పేర్లు తత్తత్కావ్య లక్షణబాహుళ్యమును ప్రధానముగా

1. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు తమ 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము'లో ఈ విధముగా విభజన కావించియున్నారు.

నెంచి పెట్టబడినవి. కాగా ఆధునిక యుగమును కావ్యప్రక్రియా దృష్టితో ఖండకావ్య యుగమనుట సమంజసమైనది.

కావ్యప్రక్రియ ననుసరించి ఖండకావ్యయుగమగు ఆధునికయుగము కవితా లక్షణము ననుసరించి నవ్యకవితాయుగమై నెగడుచున్నది. నవ్యకవితోద్యమములగు భావకవిత్వము, అభ్యుదయ కవిత్వము, అతినవ్య కవితాధోరణులలో సాగుచున్న అధివాస్తవికత, ప్రతీకవాదము మున్నగువానితో గూడిన కవిత్వములు సాధారణమై పోయినవి. ఇక ఛందస్సుననుసరించి పద్యమునకు ప్రాధాన్యము తగ్గి గేయములు వచనకవితలు తఱచైనవి. మరియు నవ్యకవిత్వ లక్షణములగు ఆత్మాశ్రయరీతి, వస్తుభావరచనలలో నవ్యత మొదలగు క్రొత్త నడకలతో ఆధునిక కవితాలతాంగి వింతసొబగుల విహరించుచున్నది.

ఈ రీతిగా కావ్యప్రక్రియలలో ఖండకావ్యములు, కవితోద్యమాలలో భావ కవిత, అభ్యుదయ కవిత, అతినవ్య కవిత, ఛందస్సులో గేయములు, వచన పద్యములు, కవితారీతులలో ఆత్మాశ్రయరీతి, వస్తుభావాది నవ్యత ప్రధాన లక్షణములై ఆధునిక యుగము ప్రవర్తిల్లుచున్నది. ఇట్టి యుగమున సంప్రదాయ కవితావిలసితమైన మహాకావ్యములు వెలువడుచుండుట విలక్షణముగా విడ్డూరముగా సాధారణదృష్టికి తోచుట సహజము. కాని ఖండకావ్యములు కాలప్రవాహమున పూలతెప్పలవలె తేలిపోవుచుండ మహాకావ్యనౌకలే తత్కాల ప్రవాహ రాభస్యమునకు తట్టుకొని కొట్టుకొని పోక గురువుగా మురువుగా మందగమనము సాగించుచున్నవని సూక్ష్మపరిశీలన వల్ల తెలిసికొనగలము.

ఒక యుగము నందలి ప్రధాన లక్షణ లక్షితములగు కావ్యములతో బాటు తద్భిన్నమైన కావ్యములును ఆనుషంగికముగా కొన్ని వెలువడుచుండుట కాన్పించును. కవిత్రయకాలమగు భాషాంతరీకరణయుగమున భారత రామాయణ మార్కండేయ పురాణాదుల యనువాదకావ్యములతో బాటు కుమారసంభవము, లక్ష్మీనృసింహ పురాణము, బసవపురాణము వంటి స్వతంత్రకావ్యములు వెలసినవి. కావ్యయుగమని పేరుగాంచిన పదునాల్గవ పదునైదవశతాబ్దముల కాలములో హరవిలాసము, భోజరాజీయము వంటి కావ్యము లనేకములు వెలువడగా తద్భిన్నముగా శృంగార నైషధము, శ్రీమహాభాగవతము, వరాహపురాణము, భీమఖండ కాశీఖండములవంటి

అనువాద గ్రంథములు పురాణాదులు కొన్ని విరచితములై యుండెను. అట్లే తర్వాతిదగు ప్రబంధయుగమున మనుచరిత్రాది ప్రబంధముల ప్రచుర రచనములతో బాటు వేంకటేశ్వరవచనములు, అన్నమాచార్య చరిత్రము వంటి ద్విపద కావ్యములు, సిద్ధేశ్వర చరిత్రము కృష్ణరాయ విజయము వంటి చారిత్రక కావ్యములు, సుగ్రీవవిజయ యక్షగానము మున్నగునవి వెలసియుండెను. కావున నేయుగమునందైనను యుగప్రధాన లక్షణానుసారములగు కావ్యములతోబాటు నితరలక్షణముల కావ్యములు వెలయుట సహజము. ఏతదనుగుణముగనే నేటి ఖండకావ్య యుగమున మహాకావ్యములు వెలువడుచుండుట జరిగినది.

ఇరువదవ శతాబ్దారంభము నుండి పరిగణింపబడిన ఆధునిక యుగముతప్ప తక్కిన పూర్వయుగము లన్నియు కావ్యప్రక్రియా దృష్టిచేత మహాకావ్య యుగములే. ఆ యుగములన్నిటను మహాకావ్యములు తఱచుగా రచింపబడి పండితగౌరవమునకు భాజనములైనవి. ఇట్లు పూర్వయుగములలో మహాకావ్యముల బహుళరచన సాగినను ముక్తకములు, శతకములు, ఉదాహరణకావ్యముల వంటి ఖండకావ్యములు వెలువడిన విషయము, తదీయలక్షణము చెప్పబడిన విషయము స్పష్టము. కావున పూర్వయుగములలో మహాకావ్యములతో పాటు ఖండకావ్యములు రచింపబడినట్లే ఆధునిక యుగమున ఖండకావ్యములతో పాటు మహాకావ్యములు వెలయుట స్వభావసిద్ధమైన విషయము.

దేశకాలాది స్థితిగతుల ననుసరించి నేడు మహాకావ్యముల రచనమునకు పఠనమునకు నంతగా కోరికగాని తీరికగాని లేక ఖండకావ్యములకే ప్రాచుర్యము ప్రాధాన్యము హెచ్చినదన్న విషయము పూర్వము తెలిసికొంటిమి. ఇట్టి దశలో పూర్వయుగములందంత కాకున్నను మహాకావ్యములు రచించువారును పఠించువారును, వాని నత్యంత శ్రద్ధాసక్తులతో సేవించువారును నున్నందున మహాకావ్యములకుగల ప్రాశస్త్య వైశిష్ట్యము లెట్టివో యించుక చర్చింపవలసి యున్నది.

## మహాకావ్య ప్రశస్తి :

ప్రాచీన లాక్షణికులు పండితులు కావ్యభేదములలో మహాకావ్యములకే ప్రాధాన్యము గౌరవ మిచ్చిరనియు వారు ఖండకావ్యములను గౌరవభావముతో

చూడలేదనియు ఖండకావ్య ప్రక్రియా వ్యాసములో తెలిసికొంటిమి. వామనుని వంటి లాక్షణికుడు 'నాఽనిబద్ధంచ కాన్త్యేక తేజః పరమాణువ'త్తని అనిబద్ధ (ఖండ) కావ్యము మహాకావ్యములో నొక కిరణము వంటిదనియు పరమాణువు వంటిదనియు దానిని నిరసించిన విషయమును చూచితిమి. ముక్తకాది ఖండకావ్యముల రచన యొక గొప్పపని కాదనియు, మహాకావ్య రచన చేయుట బహు దుర్లభమనియు రాజశేఖరు డీవిధముగా చెప్పెను.

"ముక్తకే కవయోఽనంతాః
సంఘాతే కవయః శతమ్
మహాప్రబంధేతు కవి
రేకో ద్వౌ దుర్లభాస్త్రయః"1

'ముక్తకములు రచించు కవు లనంతముగా నుందురు, లఘుకావ్యములు చెప్పువారు వందలు. కాని మహాప్రబంధములు రచించువారొకరిద్దరే, మూడవవాడు కనిపించడు' అని చెప్పుటలో మహాకావ్య రచన ఎంత కష్టసాధ్యమో, ఎంత ఘన కార్యమో అర్థము కాగలదు.

విన్నకోట పెద్దన మహాకావ్య మహిమ నిట్లుగ్గడించెను.

"కవి సంసిద్ధపదంబు భావరస విఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రవ్యంబున్ జతుర్వర్గసం
భవసద్మంబునునైన కావ్యమిల నాపద్మోద్భవస్థాయియై
కవి సంస్ఫూర్తియు దాతృకీర్తియుఁ దగన్ గల్పించు నెల్లప్పుడున్".2

ఇది కావ్యమహిమ గురించి చెప్పినది. ఇందు 'ఉదాత్తనాయకము, చతుర్వర్గ సంభవ సద్మము' అని పేర్కొనుటచేత ఇది మహాకావ్యమును గురించి చెప్పినదే కాని ఖండకావ్యము గురించి కాదని తెలియును. మహాకావ్యము చిరస్థాయియై కృతి భర్తకు కీర్తిని శ్రేయస్సును కలిగించునని దాని మహిమను పెద్దన చాటినాడు.

1. కావ్యమీమాంస : దశమాధ్యాయము, 'కవిచర్యా రాజచర్యా చ' పుట 133 (బిహార్ రాష్ట్ర భాషా పరిషత్తు పట్నావారి ప్రచురణము)
2. కావ్యాలంకార చూడామణి ; చతుర్థోల్లాసము, 'కావ్యమహిమ' 4వ పద్యము.

ఆచార్యులవారు ఖండకావ్య మహాకావ్యములకు గల తారతమ్యమును తమ మహాకావ్య విజ్ఞప్తిలో వివరించిరి. అందలి కొన్ని వాక్యములు 'పోతన చరిత్ర రచనము-కవి ప్రేరణములు' వ్యాసములో నుటంకించితిని. పూర్తి పాఠమును విషయావబోధ సౌకర్యార్థము దిగువ నిచ్చుచున్నాను.

"ఖండకావ్యము లేకైక ప్రయోజనపదములు. మహాకావ్యములు సకల పురుషార్థ సాధకములు, బహుళ ప్రయోజనప్రదములు. పృథగవయవము లేకైక ప్రయోజన ప్రదములే యయ్యును, సకలేంద్రియ కేంద్రమనబడు శరీరముతో సారూప్యము నొందినపుడు పరస్పర సహకార భావబంధము గల్గి సమష్టి స్వరూప ముతో సకలార్థ సాధకములై భాసించును. ఇట్టి అంగాంగిభావమే ఖండకావ్య మహాకావ్యములకు అవినాభావసంబంధమును గూర్చి నవరసానుభూతియను పరమ ప్రయోజన సాధకమగుచున్నది. మహాకావ్యము మానవత్వపు టానందపు టంచులను దట్టి పూర్ణరసానుభూతి నొసంగి పొంగి పొరలు మహానది".[1]

మరియు ఆచార్యులవారు వైశాలిని మహానాటకము 'విజ్ఞప్తి'లో ఖండ మహా కావ్యముల యంతరమును గురించి యిట్లు వ్రాసిరి.

"శ్రవ్యకావ్యములు ఖండకావ్యములనియు మహాకావ్యములనియు రెండు విధములు. రెండు విధముల కావ్యములును రసవంతములేకాని ఖండకావ్యములలో ఇతివృత్తము లేదు కనుక రసము స్థాయీభావ పర్యవసితమై భావశబలతను జేకూర్చు స్థిరతను గడించలేదు. 'వాక్యం రసాత్మకం కావ్యం' అనునంత రస మొక్క వాక్యముననే జనించి స్థాయీభావమును స్పృశించదు. విభావానుభావ వ్యభి చారీ భావసంయోగమున నిష్పత్తిచెంది స్థాయిభావపర్యవసితమైననే పాఠకుడు స్వీయానుభూతి యను నాత్మ సాక్షాత్కారము నా కావ్యాదర్శమున జూచుకొని తను దాను సంస్కరించుకొనగల్గును. అటులది విశ్వశ్రేయము నొనగూర్చును. కావున రససాక్షాత్కారము కథాసంవిధానములేని ఖండకావ్యాదులలో స్థిరగతి నిలువజాలదు. అందులకే వామనుడు ఖండకావ్యముల విస్ఫులింగములతో బోల్చి కథావిధానము గల మహాకావ్యమును జ్యోతితో బోల్చి తారతమ్యమును నిరూపించినాడు. మహా

1. పోతన చరిత్రము ; 'విజ్ఞప్తి' పుట 72.

కావ్యకర్తయే మహాకవి నామమున కర్హుడని తెలియజెప్పినాడు. విస్ఫులింగములు తామే ప్రకాశింపగల్గును గాని తిమిరమును బారదోలి పథమును జూపజాలవు. జ్యోతి తానా గమ్యపథము జూపగలుగు నంతవరకు నిలిచి వెలుగును.రసము కథా విధాన సంబద్ధమైనపుడే యది అన్యాపదేశమై కాంతాసమ్మితమగు నుపదేశ మొనర్ప గలదు."[1]

ఈ వాక్యములలో ఆచార్యులవారు ఖండకావ్యములకు మహాకావ్యములకు గల యంతరమును చక్కగా విశదీకరించినారు. ఖండకావ్యము లేదేనియొక ప్రయోజనమును సాధించునవి. మహాకావ్యములు సకల పురుషార్థములను సాధించునవి, బహు ప్రయోజనములను సమకూర్చునవి. ఖండకావ్యములు వేర్వేరగు నవయవములు. మహాకావ్యములు సర్వావయవశోభితములగు శరీరములు. ఖండకావ్యము లల్పఝరులు. మహాకావ్యములు మహానదులు. మరియు కథయుండి విభావానుభావ సంచారీభావ సంయోగముచేత రసనిష్పత్తిగల మహాకావ్యములే సంపూర్ణానందమును కాంతాసమ్మితోపదేశమును అందించగలవు. ఖండకావ్యములకిట్టి శక్తి యత్యల్పము. ఆచార్యులవారి యీ యభిప్రాయములు సమరసముగా సమంజసముగా నున్నవి.

పూర్వలాక్షణికుడు వామనుడు ఖండకావ్యమొక కాంతికిరణము, ఒక పరమాణువని అత్యల్పముగా భావించి దానిని లెక్కచేయలేదు. ఆచార్యులవారు ఖండకావ్యముయొక్క అల్పత్వమును తేటపరచినారు. అచ్చమైన కవిత ఖండకావ్యమునందును మహాకావ్యమునందును నుండును. కాగా ఈ రెండిటి కవితాగుణ పరిమాణప్రయోజనముల యల్పత్వాధికత్వములను వాని స్వరూపస్వభావముల యంతరువు నిచట వివరించుట జరిగినది. అల్పాహారమునకును షడ్రసోపేతమైన సంపూర్ణాహారమునకును గల భేదమే ఖండకావ్య మహాకావ్యములకును నుండు ననదగును. మమ్మటాదులు చెప్పిన 'కావ్యం యశసేऽర్థకృతే....' మున్నగు కావ్య ప్రయోజనములు ప్రధానముగా మహాకావ్యముల గూర్చి చెప్పినవేయనుటలో విప్రతిపత్తి యుండబోదు. అల్పపరిమాణముగల ఖండకావ్యములకంటె అధికపరిమాణము గల మహాకావ్యములు 'అధికస్యాధికం ఫల' మ్మను నట్లధికప్రయోజనప్రదములై యొప్పుచుండును. కావున నానారసభావసంపద్విరాజితములును, చతుర్వర్గఫల

1. వైతాళిని ; 'విజ్ఞప్తి' పుట 28, 29.

సంధాయకములును, బహుళప్రయోజనప్రదములును, సంపూర్ణానందకరములును అగు మహాకావ్యములు మహాప్రశస్తమై వెలయుననుట యుక్తియుక్తమైన మాట.

నేటి కాలమున నగణ్యములగు ఖండకావ్యములతో బాటు గణనీయములగు మహాకావ్యములు కొన్ని వెలసినవి. ఇవి ప్రాయికముగా సంప్రదాయచ్ఛవివిలసితము లైనట్టివి. ఐనను కొన్ని నవ్యకవితారీతులను సముచితముగా మేళవించుకొని 'నూతనమున్ ప్రాగ్గుణసమ్మితమ్ము'నగు సమన్వయ రచనతో శోభిల్లినవి. ఈనాటి మహాకావ్యములలో పురాణేతిహాససంబంధులు కొన్నియున్నను చరిత్రకు, చరిత్ర ప్రసిద్ధిగాంచిన మహాపురుషులకు చెందినవే యధికముగా నున్నవి. దీనికి నేటి దేశకాల పరిస్థితులు, దేశభక్తి, జాతీయత హేతువులు. ఈ విషయము కొంత 'పోతనచరిత్ర రచనము-కవిప్రేరణములు' అను వ్యాసమున వివరించియుంటిని. ఇరువదవ శతాబ్దారంభము నుండి పరిగణింపబడు ఆధునికయుగమున వెలసిన మహాకావ్యములలో బుద్ధచరిత్రము, దేవీభాగవతము, ఆంధ్ర వాల్మీకిరామాయణము, శ్రీకృష్ణ మహాభారతము, శ్రీకృష్ణ రామాయణము, శ్రీకృష్ణ మహాభాగవతము, రాణాప్రతాపసింహచరిత్ర, శివభారతము, శ్రీమద్రామాయణ కల్పవృక్షము, సౌందరనందము, ఆంధ్రపురాణము, పోతనచరిత్రము మిక్కిలి పేరెన్నికగన్నవి.

ఖండకావ్య ప్రాచుర్యము గల యీ కాలమునను మహాకావ్యముల రచన పఠనములు సాగుచుండుటకు పైన వివరించిన వాని ప్రాశస్త్యమే కారణము. ఎంత ఆధునికులై ఖండకావ్యప్రియులైనను పురాతనాధునాతన మహాకావ్యములను పఠించి ప్రభావితులై తత్ప్రయోజనములను పొందుచున్న విషయము వాస్తవము.

## పోతన చరిత్రము:

వరదాచార్య ప్రణీతమగు పోతన చరిత్ర మాధునికాంధ్ర మహాకావ్యములలో విశిష్టమై సమున్నత స్థానము నలంకరించి వెలయుచున్నది. ద్వాదశాశ్వాసములతో దాదాపు నాలుగు వేల పద్యములతో విలసిల్లు పోతనచరిత్రము గుణముచేతనేకాక వైపుల్యముచేతను గణనీయమై పురాతనాధునాతన మహాకావ్యముల సరస నిలువదగి దివ్యకాంతు లీనుచున్న మహాకావ్యరత్నము. ఆచార్యుల వారివలెనే వారి యీ పోతనచరిత్రము సర్వజన సమాదరణీయమై యొప్పారుచున్నది.

# వస్తు శిల్పము

## ప్రస్తావన :

మహాకావ్యమగు పోతన చరిత్రము యొక్క విశిష్టతను పరిశీలించిన పిదప తదీయ విశిష్టతకు హేతుభూతమైన దాని కవితా వైభవమును సమగ్రముగా దర్శింపవలసియున్నది. కావ్యమునకు వస్తువు, నాయకుడు, రసము, ధ్వని, పాత్ర పోషణాదు లతిముఖ్యమైనవి. కావ్యాంగములగు వీని సౌష్ఠవము ననుసరించియే కవితావైభవము శోభిల్లు చుండును. కనుక ఈ ప్రకరణమున సర్వాంగ పరిపుష్ట మగు పోతనచరిత్రము నందలి యితివృత్తాదులను క్రమముగా చర్చించుట జరుగును.

## వస్తు ప్రాధాన్యము :

కావ్యాంగములలో వస్తువు ప్రథమగణ్యమైనది. కావ్యమునందలి కథయే వస్తువనియు ఇతివృత్త మనియు వ్యవహరింపబడును. భరతముని

"ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తితమ్
పంచభి స్సంధిభి స్తస్య విభాగః సంప్రకల్పితః"1

అని ఇతివృత్తము కావ్యమునకు శరీరమని వచించెను. వామనుడును

'ఇతిహాసాది రితివృత్తం కావ్యశరీరమ్' అనుచు ఇతివృత్తము కావ్యశరీర మని నుడివెను.

వరదాచార్యులవారు పోతన చరిత్రము పీఠికలో కావ్యస్వరూపము నిటు లభివర్ణించిరి,

"ప్రతిభయేపితర, వ్యుత్పత్తియే జనయిత్రి, సుకవియెడంద ప్రసూతి గృహము,
కథ రూప, హౌచిత్యగతియె సౌందర్యమ్ము, రసము ప్రాణము, ధ్వని రమణ వయసు,

---

1. నాట్యశాస్త్రము: 19వ అధ్యాయము - ఇతివృత్త నిర్మాణము, శ్లోకము 1.

బహుళార్థదాయక భాసురాలంక్రియా సంధానత వివాహసంస్కరణము,
సరసాత్మపతి, విమర్శకుఁడత్త, వ్యాకృతి తానాడపడుచు, ఛందస్సు నడత
రమ్య శయ్యల సరసుని రతులఁదేల్చి రూఢి మధురద్రాక్షాపాక రుచులఁదన్పి
భవ్యగుణరీతి సాహిత్యబంధువితతి తలల నూఁపించు కృతికన్య ధన్య
భువిని."[1]

ఇందు కావ్యకన్యకు కథ రూపమని చెప్పబడినది. ఇది భరతుని వాక్యమున కనుప్రాసమై యున్నది. ఆత్మగుణాదులకంటె ప్రప్రథమమున దర్శనీయమై విరాజిల్లునది శరీరమే కనుక కావ్యశరీరమగు వస్తువు మొదట చర్చింపబడును. శరీరము నాశ్రయించియే సౌందర్యాదులు పరిఢవిల్లు నట్లు వస్తువు ననుసరించియే రస పాత్రాదులు శోభిల్లుచుండును. శరీరములేక ఆత్మ, ప్రాణము మున్నగునవి యేవియు నిలువజాలనట్లు కథలేనిదే రసాదులేవియు నుండుటకు వీలులేదు. కావ్యమున కథకుగల ప్రాముఖ్య మిట్టిది. కావున మొదట పోతన చరిత్ర వస్తువు ననుశీలనము కావింతును.

## వస్తు భేదము :

పోతనచరిత్రము నందలి వస్తువు ప్రధానముగా బమ్మెర పోతన జీవిత గాథ. ఇది పురాణేతిహాస ప్రసిద్ధము కాకున్నను కల్పిత కథ మాత్రము కాక మహాపురుషులగు భక్తుల చరిత్రకును కవిజీవిత చరిత్రకును చెందినదై ప్రశస్తి గాంచి యున్నది. అట్టి ప్రసిద్ధ కథను గ్రహించి సముచిత కల్పనలు కావించి వర్ణనాత్మకముగా రచించిన కావ్యము కనుక ఇందలి కథ ఆలంకారికులు చెప్పిన ప్రఖ్యాతోత్పాద్య మిశ్రములను వానిలో మిశ్రకథయై యొప్పుచున్నది. 'సత్కవి కల్పనా విశేషావహ పూర్వ వృత్తములు సానల దీరిన జాతిరత్నముల్' అని రామరాజభూషణుడు ప్రవచించిన ట్లిందలి కథ మిశ్రకథయై సానల దీరిన జాతి రత్నమై ప్రకాశించుచున్నది.

1. పోతన చరిత్రము : పీఠిక-'కవితాస్తుతి' 18 వ పద్యము.

## ఇతివృత్త సంగ్రహణము :

ఒక కావ్యమునకు వలసిన యితివృత్తమును సమకూర్చుకొనుటలో కవి మిక్కిలి జాగరూకుడై యుండవలయును. లేనిచో అది యపరిపుష్టమై రసాది నిర్వహణ కసమర్థమై యనుత్తమమై యడగియుండును. ఆనందవర్ధనాచార్యుడీ వస్తు సంగ్రహణగూర్చి సమ్యక్ సూచనలు చేసినాడు.

"విభావానుభావ సంచార్యౌచిత్య చారుణః
విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా
ఇతివృత్త వశాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిం
ఉత్ప్రేక్ష్యోఽప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః
సంధి సంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా
నతు కేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా
ఉద్దీపన ప్రశమనే యథాఽవసర మంతరా
రసస్యారబ్ధ విశ్రాంతే రనుసంధాన మంగినః
అలంకృతీనాం శక్తాఽవ ప్యానురూప్యేణ యోజనం
ప్రబంధస్య రసాదీనాం వ్యంజకత్వే నిబంధనం"[1]

ఇందు పేర్కొనిన యంశము లివి.

1. విభావ, అనుభావ, సంచారుల యౌచిత్యముచేత రమ్యముగా నుండు కథను-అది ప్రఖ్యాత కల్పిత మిశ్రములలో నేది యైనను- గ్రహింపవలెను.

2. ఇతివృత్తగతములైన యనౌచిత్యము లున్నచో తొలగించి రసోచితముగా మార్చవలెను.

3. రసాభివ్యక్తి నపేక్షించి, సంధి, తదంగములను కూర్పవలెనే కాని శాస్త్రమర్యాదను పాటించుటకై రసోపస్కారములుకాని సంధి, తదంగములను కూర్పరాదు.

---

1. ధ్వన్యాలోకము : తృతీయోద్ద్యోతము, 'కథాశరీరము'.

4. ఆయా ఘట్టములందు రసోద్దీపనము, రసప్రశమనమును యథోచితముగా కావించవలెను.

5. ఆరంభింపబడి ఆగిపోయిన అంగిరసమును మరల ననుసంధింపవలెను.

6. శక్తి యున్నదికదా యని యలంకారములను గూర్పక యనురూపముగా మాత్రమే కూర్చవలెను - ఇది యెల్ల ప్రబంధము రసాదివ్యంజక మగుటలో నిబంధనమనియు ధ్వనికారుడు వస్తుసంగ్రహణము గూర్చి విలువైన మాటలు సెలవిచ్చినాడు. కావ్యవస్తువు రసవ్యంజకము కావలయునన్నచో ఆనందవర్ధనుని సూచనలు పాటింపవలెను. నన్నయ తిక్కనాది ప్రాచీన కవీంద్రులీ కావ్యశిల్పమును పాటించియే మహాకావ్యములు వెలయించిరి.[1]

కావ్యకళాకోవిదులగు వరదాచార్యులవారు ధ్వనికారుని సూచనలను పాటించి ఇతివృత్తసంగ్రహణము కావించి మహాకావ్యము రచించినట్లు పరిశీలనవల్ల తెలియగలదు.

కావ్య కథానాయకుడగు బమ్మెర పోతనగారి జీవితచరిత్ర మితివృత్తముగా స్వీకరించిన ఆచార్యులవారా యితివృత్తమును సంగ్రహించుటలో మిక్కిలి శ్రద్ధ వహించిరి. ఈ విషయము వారిట్లు తెలిపిరి.

> "విన్న దొకింత భాగవత విశ్రుతపీఠికలోనఁ దాను పో
> తన్న వచించినంతయు యథార్థమిదే యను మా చరిత్ర తి
> క్కన్నల వాదధోరణి రవంత మనమ్మునఁ దోఁచినంత నీ
> సన్నిధిలోన నే మనవి సల్పెద నల్పమతిన్ మహాదృతిన్."[2]

ఇందు వస్తుసంగ్రహణమునకు తోడ్పడిన నాలుగు విషయములు పేర్కొనబడి యున్నవి.

1. అనుశ్రుతముగా వినవచ్చుచున్న కథలు.

1. "అమలోదాత్త మనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ బారగుఁడన్"
—నిర్వచనోత్తర రామాయణము, 1-13
"ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు..."
—శృంగార నైషధము, 8-202

2. పోతన చరిత్రము, 1-3

2. భాగవత పీఠికలో పోతన తన్నుగూర్చి తెలుపుకొనిన విషయములు.

3. సాహిత్య చరిత్రకారులు వాదోపవాదములు చేసి చెప్పిన విషయములు.

4. ఆచార్యులవారికి తమ మనస్సులో తోచిన విషయములు.

కావ్యాదిలో వస్తుసంగ్రహణ విషయము తెలిపిన ఈ పద్ధతి సాంప్రదాయిక మైనది. పూర్వకవులు కొందరిట్లు నుడివియున్నారు.[1]

ఇతివృత్త నిర్మాణములో తా ననుసరించిన విధానమును కవిగారు 'విజ్ఞప్తి'లో నిట్లు వివరించిరి.

"ఏ తత్ప్రబంధ రచనమునందు నే నతుకుల బొంతల నసమగ్రములగు చారిత్రక సిద్ధాంతముల కొన్ని రూఢిలో నున్న ప్రసిద్ధేతివృత్తములతో జతపరచితి నని సవినయముగా మనవి చేసికొనుచున్నాను."

పోతన యోరుగల్లువాడన నొంటిమిట్ట వాడను వివాదగ్రస్త విషయములలో విమర్శకుల విజిగీష విపరీత ధోరణికి దిగినది సకలాంధ్రలోకమునకు సుపరిచితమే. కొఱవి గోపరాజు, విద్యానాథుడు మున్నగుకవు లేకశిలానగరము నోరుగంటికి ప్రసిద్ధముగా వ్యవహరించుటజేసియు 'ఓరుకల్లు-ఏకశిల' అను పదముల యందలి సరియైన పోలిక నరసి, పోతన బమ్మెర దగ్గరి యోరుగల్లువాడే యను చారిత్రక సిద్ధాంతమును విశ్వసించి నేను నటులే వ్రాసితిని. కాని యాంధ్ర భాగవత కృతిని గూర్చి యావదాంధ్రుల కభిమానపాత్రుడగు పోతన మహాకవి తా నాంధ్రభూమిలోని యే ప్రాంతమునకు చెందినవాడైనను నాకు సమ్మతమే.

దానిలోని సత్యాసత్యముల చారిత్రకులకే వదలివైచి ప్రజాసామాన్యముచే ప్రస్తుతింపబడు ప్రసిద్ధేతివృత్తమే గ్రహించి గ్రంథ రచనమున కుద్యమించితిని. నేను వ్రాయునది శుష్కచరిత్రము కాదు. నాకు పోతన చరిత్రము వ్రాయుటకన్న నతని యుదాత్తాశయముల ప్రజా హృదయముల ప్రతిబింబింపజేయుట ముఖ్య కర్తవ్యము.

1. "ఏనును బెద్దలచేమును । వీనులలరఁ దరతరంబు విన్న విధంబున్
మానసమున నున్న తెఱఁగుఁ । గానుపునన్ గన్నక్రమముఁ గథనమొనర్తున్."
—ఎఱ్ఱన నృసింహపురాణము, 1-24.
"భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు...తేటపఱతు" —భాగవతము, 1-17.

సందర్భానుగుణముగా నాకు నచ్చినరీతి కొంత కథను కల్పించుకొనుటయు జరిగినది. పోతన తానాంధ్రులందరివాడని యెంచి యీకృతి కుద్యమించితిని. నేటికిని చారిత్రకు లెందరెంత పరిశోధించినను తానీతని చరిత్రములోని యాథార్థ్య మంధులు తడవుకొనుచు నభివర్ణించు హస్తిరూపమువలె నసమగ్రమనియే యెంచవలసినది."[1]

ఆచార్యులవారు కావ్యాదిలో చెప్పిన 'విన్నదొకింత' యను పద్యములో తెలిపిన యంశములనే యీ విజ్ఞప్తి వాక్యములు వివరించుచున్నవి. ఇందు విశేషించి పోతన జీవితగాథ గూర్చిన చారిత్రకాంశములపై, అందును అతని జన్మస్థలమును గూర్చిన దానిపై, విమర్శచేయుట జరిగినది. పోతన ఓరుగల్లువాడే యన్న ప్రబలోపపత్తుల ఆధారమున కవిగారు దానినే స్వీకరించినారు. ఐనను అఖిలాంధ్ర మహాకవియైన పోతనగూర్చి ప్రాంతీయభేదము తమకు లేదని విన్నవించినారు. సమగ్రముగా సరిగా తెలియని పోతన జీవితము గురించి యుపలభ్యములైన యొక కొన్ని చారిత్రకాధారములను గైకొని పరిశోధకులు వాదించి సిద్ధాంతములు చేసిరి. కాగా చరిత్రాధారములవల్ల అన్ని విషయములు తెలియక పోవుటయేకాక తెలియవచ్చిన కతిపయాంశముల గూర్చియు వాదభేదములు విపరీతమై క్లిష్టతా హేతువులైనవి. అందువల్లనే ఆచార్యులవారు పోతనగారి చరిత్రములోని యాథార్థ్య మంధులు తడవుకొనుచు నభివర్ణించు హస్తిరూపమువలె నసమగ్రమని భావించి ఆ 'చరిత్ర తిక్కన్నల వాదధోరణి రచంత' స్వీకరించి 'అతుకుల బొంతల నసమగ్రములగు చారిత్రక సిద్ధాంతములను' కొన్నిటిని వాడుకలోనున్న ప్రసిద్ధేతివృత్తములతో జతపరచి యుండిరి.

ఇక కవిగారు కావ్యప్రారంభమున ప్రకటించిన వస్తుసంగ్రహణవిషయక చతురంశములను చర్చింతును. విషయావబోధసౌలభ్యమునకై ముందు భాగవత పీఠికాంశము పరిశీలింతము.

## 1. భాగవతపీఠికలో పోతన తన్నుగూర్చి తెలుపుకొన్న విషయములు :

పోతన తన్నుగూర్చి భాగవతపీఠికలో తెలుపుకొన్న విషయములు

1. పోతనచరిత్రము : 'విజ్ఞప్తి' పుట 74, 75.

మిక్కిలి తక్కువ. తొలుత ఇష్టదేవతావందనము కావించి వాల్మీకి వ్యాసాది సంస్కృతకవులను, ఆంధ్రకవులలో కవిత్రయమును స్మరించుటయేకాక పూర్వ వర్తమాన భావిసుకవులను సంభావించినాడు. మనుజేశ్వరాధములకు కృతియిచ్చి భోగము లనుభవించి తుదకు నరకము పాలగుటకంటె భాగవతమును భక్తితో శ్రీహరికిచ్చి చెప్పితినని పేర్కొనెను. శివకేశవుల నారాధించనివాడు దయా సత్యాదులను దలపనివాడు మనుజుడై పుట్టనేలయని నిరసించినాడు. ఇంతవరకు చెప్పిన దిదొక యుదంతము. ఈ విషయములవల్ల పోతనగారి దైవభక్తి, కవుల మీది ఆదరాభిమానములు, వినయసౌశీల్యములు, శివకేశవాభేదము వ్యక్తమగు చున్నవి.

ఇక తాను శ్రీమహాభాగవతాంధ్రీకరణకు పూనుకొన్న విషయము సవిస్తర ముగా తెలిపినాడు. పోతన పూర్వజన్మతపఃఫలమున 'శ్రీమన్నారాయణకథా ప్రపంచ విరచనాకుతూహలుడై' యొకనాటి చంద్రగ్రహణకాలమున గంగకు వెడలి స్నానమాచరించి సైకతస్థలమున శివధ్యానము చేయుచుండ శ్రీరామ చంద్రుడు సాక్షాత్కరించి శ్రీమహాభాగవతమును తెనిగించి తనకు కృతి యిమ్మనియు, దానివల్ల భవహరమగుననియు ఆనతిచ్చెను. మహాప్రసాదమని శిరసావహించి కొన్నాళ్ళ కేకశిలానగరమున కరుదెంచి 'గురువృద్ధబుధబంధు జనానుజ్ఞాతుడై' భాగవతాంధ్రీకరణకు పూనుకొన్నట్లు వ్రాసినాడు. ఇది రెండవ విషయము.

ఇక మూడవసంగతిగా తన వంశవర్ణన చేసినాడు. కౌండిన్యగోత్రుడును ఆపస్తంబ సూత్రుడును అగు భీమన మంత్రితో ప్రారంభించి తన తండ్రి కేసన వరకు పేర్కొనెను. తండ్రి గుణగణములను, విశేషించి తల్లి లక్కమాంబ గుణశీలములను ప్రత్యేకాభిమానముతో వర్ణించినాడు. అన్నయగు తిప్పయను పేర్కొనెను. తల్లి తండ్రి అన్న అందరును శివారాధనాతత్పరులని వచించినాడు. మరియు స్కంధాంత గద్యములో పరమేశ్వరకరుణ వల్ల కవితాశక్తి యలవడిన విషయము, తనకుగల సహజ పాండిత్య బిరుదమును తెలిపినాడు.-ఇవి పోతనగారు తన్నుగూర్చి చెప్పికొన్న విషయములు. ఇవి నిర్వివాద సత్యవృత్తాంతములు. వీని నాచార్యులవారు యథాతథముగ గ్రహించినారు. కాగా పైన పేర్కొన్నట్లు పోతన పరమేశ్వరకరుణ వలన కవిత యలవడినదని చెప్పికొనగా ఆచార్యులవారు శారదా

మంత్రోపాసన వలన కవిత యలవడినదని చిత్రించిన విషయ మొకటి మాత్రము కావ్యమున భిన్నముగా కానబడును. పరమేశ్వరుని యనుగ్రహమున్నను విద్యాధిదేవతయగు సరస్వతి కటాక్షము లేనిది కవిత యబ్బుట యెట్లని ఆచార్యులవారీ సన్నివేశమును కల్పించి కావ్యకథాపటిష్ఠతకు దోహదము కూర్చిరి. ఈ కొన్ని వృత్తాంతములు పోతన భాగవతములో తెలిపినవి మహాకావ్య రచనకేమాత్రము సరిపోవునవి కావు. అందుకే అనుశ్రుతిలోని ప్రసిద్ధ విషయములు, చరిత్రాంశములు చేర్చుకొని విస్తరింపవలసి వచ్చినది.

## 2. అనుశ్రుతిగా వినవచ్చుచున్న కథలు :

పోతనగూర్చి అనుశ్రుతిలోనున్న కథలనేకములు. పరంపరగా వచ్చుచున్న పుక్కిటి పురాణములవంటి యీ కథలు కవి జీవిత చరిత్రము లందు క్రోడీకరింపబడియున్నవి.

1. చిదానందయోగి బాల పోతనకు రామతారక మంత్రోపదేశము చేసిన యుదంతము.
2. శ్రీనాథ పోతనల బాంధవ్య కథలు.
3. పోతన భక్తిమాహాత్మ్యమునకు చెందిన కథలు.
4. భాగవత శైథిల్యవృత్తాంతము.

జనశ్రుతిలో నుండి గ్రంథస్థములైన యీ కథలెంతవరకు నిజమోకాని యివిలేకుండా పోతన చరిత్రమునకు సరసత్వము సమగ్రత్వము సమకూడవు. కావున వీనిని పరిశీలించి సముచితముగా సవరించి సందర్భానుసారముగా ఇతివృత్తమున చేర్చుకొన్నా రాచార్యులవారు. ఇవి ఆచార్యులవారి రచనలోబడి సహజ రమణీయములై భాసిల్లి కథకు నిండుదనమును నెగడించు చున్నవి.

## 3. సాహిత్య చరిత్రకారులు వాదోపవాదములు చేసి చెప్పిన విషయములు :

భాగవత పీఠికా భాగమును, పోతనగూర్చి తర్వాతికవులు వ్రాసిన వ్రాతలను, పోతన సమకాలికులగు శ్రీనాథాదికవుల యొక్కయు, సింగభూపాలాది నరప

తుల యొక్కయు చరిత్రములను, పోతనకృతములనబడుచున్న భోగినీదండక వీరభద్రవిజయ నారాయణశతకములను, శాసనాదికములను పరిశోధించి సాహిత్య చరిత్రకారులు పోతనగూర్చియు అతని కృతులగూర్చియు వాదములుచేసి నిర్ణయ ములు కావించిరి. ఈ నిర్ణయములలో ననేక భేదాభిప్రాయములు కలవు. ఈ చరిత్ర కారుల వాదములకు గురియైన ప్రధాన విషయములు నాలుగు.

1. పోతన జన్మస్థలము. 2, శ్రీనాథ పోతనల బాంధవ్యము. 3. భాగవత శైథిల్య వృత్తాంతము. 4, భోగినీదండకాదితరకృతుల కర్తృత్వము.

సాహిత్యచరిత్రలలోగల పోతన గూర్చిన వాదోపవాదములనిట వివరించుట యవసరముకాదు. వాని సారాంశమును పొందుపరతును.

1. పోతన ఓరుగల్లు సమీపము నందలి బమ్మెరవాడని కొందరు,కడపమండ లములోని ఒంటిమిట్టవాడని కొందరు వాదించిరి. కొమఱ్ఱాజువారు, మల్లంపల్లివారు, శేషాద్రిరమణకవులు మున్నగు ననేక పండిత పరిశోధకులు పోతన బమ్మెరనివాస మునే ప్రబలాధారములతో స్థిరపరచిరి. అప్పటి నుండి ఒంటిమిట్ట వాదము వెనుక బట్టి పండితులు పైవాదమునే ఆమోదించినందున ఆచార్యులవారు పోతన బమ్మెర జన్మనివాసములనే కావ్యమున వర్ణించిరి. పోతన చరమజీవిత మొంటిమిట్టలో గడపి నట్లు కథను మలచిన విషయము తర్వాత చర్చింపబడును.

2. శ్రీనాథ పోతనలు సమకాలికులే కాని బావమరదులు కారని పరిశోధకుల వాదము. ఈ వాదములో భేదము లేదు. ఎక్కడను వారి బాంధవ్యమును దెలుపు శాసనాద్యాధారములు కానరాలేదనియు, శ్రీనాథ పోతనలైనను తమ కావ్యములలో తెలుపుకోలేదనియు కావున వారు బంధువులు కారనియు వీరి వాదము. కాని జన శ్రుతిలో వీరి బాంధవ్య కథ లతిప్రసిద్ధములై యున్నవి. అన్నిటికి గ్రంథాద్యా ధారములు దొరకలేక పోవచ్చును. కాగా పోతనకు శ్రీనాథునితో బంధుత్వమున్నట్లు వర్ణింపనిచో కావ్యము శుష్కమై శూన్యమై యుండగలదు. కావున కవిగారు శ్రీనాథ పోతనల బంధుత్వ మంగీకరించిరి. శ్రీనాథుడు ప్రౌఢవయస్కుడై యున్నప్పుడు పోతన బాలుడై యుండెనన్న కొందరి వాదమును ఆచార్యులవారు త్రోసిపుచ్చినారు.

3. భాగవత శైథిల్య వృత్తాంతమును చరిత్రకారుల వాదధోరణిని కొంత గ్రహించి కొంత మార్పు చేసిరి. దానిని తర్వాత వివరింతును.

4. పోతన కృతము లనబడుచున్న భోగినీదండక వీరభద్రవిజయ నారాయణశతకములలో ఆచార్యుల వారొక భోగినీదండకమునే స్వీకరించి తక్కిన రెండిటిని తిరస్కరించిరి. వీరభద్రవిజయ రచన భాగవత రచనకు ముందని కొందరు, తర్వాతనని కొందరు వాదించి యుండిరి. ఇది యన్యకృతమై పోతన పేర వెలయింపబడినదని తలంచి కవిగారు గ్రహించలేదు. ఒకవేళ వీరభద్ర విజయము పోతన కృతమే యైనను అది యతని ప్రాథమిక రచనయని కవిగా రూహించిరనుటకు సూచనగా కావ్యమున పోతన కవితాభ్యాస దశను వర్ణించుచు

"వరకవితోపాసన మిహపరసాధక మంచు నాత్మ భావించి మహే
శ్వర లీలా విలసనముల సరసమనోహర సుమధురశైలిన్ గూర్చున్"[1]

అని వ్రాసిరి.

ఇతివృత్త సంగ్రహణము గురించి ఆచార్యులవారు తెలిపిన 'చరిత్ర తిక్కన్నల వాదధోరణి రవంత' యని చెప్పుటలో చరిత్ర పరిశోధకుల మహాకృషిని దీక్షను సంభావించి తిక్కనవంటి చారిత్రకు లనుటయు, మొండిపట్టుదలతో వితండవాదము కొందరు చేసి యుండుటచేత తిక్కగలవారనియు ధ్వనింప జేయుటయు జరిగినది.

ఇట్లు వరదాచార్యులవారు పోతన భాగవత పీఠికలో తెలిపిన విషయములు గ్రహించి జనశ్రుతి కథలను సముచితముగా స్వీకరించి చారిత్రక పరిశోధితాంశ ములను కొంత జతపరచి తమ ప్రతిభాచక్షువునకు తోచినట్లుగా సమంజస కల్పనలు కొన్ని కావించి సమగ్రముగా చక్కగా ఇతివృత్తమును సిద్ధము చేసికొని మహా కావ్యరచన కావించినారు.[2]

## రచనా ప్రణాళిక :

పోతన చరిత్రము శ్రీమహాభాగవతమువలె ద్వాదశాశ్వాస పరివ్యాప్తమై సుమారు నాలుగువేల పద్య గద్యములతో విరాజిల్లుచున్న బృహత్కృతి. మహా కావ్యముగా విరచింపబూనిన ఈ పోతన చరిత్రమునకు వలయు నితివృత్తమును

1. పోతన చరిత్రము : 8-299.
2. కావ్యమున చేయబడిన కల్పనల గూర్చి తర్వాత చర్చింపబడును.

సమకూర్చుకొని ఆచార్యులవారు దానికొక రచనా ప్రణాళిక సిద్ధపరచి నిర్వహించి నారు. ఆ ప్రణాళిక చతురంశములతో నొప్పారుచున్నది.

I. పీఠిక. II. కావ్యోపక్రమము. III. కావ్యకథ. IV. కావ్యానుబంధము. ఈ నాలుగింటిని క్రమముగా చర్చింతును.

## I. పీఠిక :

ఇది కావ్యావతారిక. ఇది సర్వ కావ్యములందు వలెనే సాధారణమయ్యు కొన్ని ప్రత్యేక లక్షణములచేత అసాధారణమై యొప్పుచున్నది. 137 పద్యములలో విస్తరించియున్న ఈ పీఠిక యొక లఘుకావ్యమువలె కన్పడును. ఇంతటి బృహత్పీఠిక అన్యకావ్యములలో అరుదై యున్నది. వసుచరిత్ర కళాపూర్ణోదయ పాండురంగ మాహాత్మ్యాదులలోను నూరు పద్యాలవరకున్న పీఠికలు కలవు. వాని లోను కృతిపతివర్ణనలే చాలవరకు వ్యాపించియున్నవి. భారత భాగవత రామాయణములందును, మనుచరిత్రాదులందును ఏబది పద్యములకు మించని పీఠికలే కలవు. పోతనచరిత్ర పీఠికలోని పద్యములు విషయ వైవిధ్య విలసితములై యున్నవి.

కావ్య పీఠికలలో సాధారణముగా ఇష్టదేవతా వందనము, సుకవిస్తుతి, కుకవినింద, కవివంశ వర్ణనము, కృతి నిర్మాణ ప్రస్తావన, కృతిపతి వంశాభి వర్ణనము, షష్ఠ్యంతములు పొందుపరచుట సాంప్రదాయికమైన పరిపాటి. పోతన చరిత్రములో ఈ సంప్రదాయములను పాటించుచునే కొన్ని విశేషములను చొప్పించినా రాచార్యులవారు. ఇందు క్రమముగా ఇష్టదేవతావందనము, కవి పండితస్తుతి, అభ్యర్థన, పండిత వంశ పరిచయము, సత్యదేవస్తుతి - కావ్య నిరోధ నివారణ యను నైదు విషయములు కూర్పబడినవి. వీనిలో దాదాపు 50 పద్యముల వరకు కవి పండితాదుల స్తుతి కావింపబడియున్నది. పేరుపేరున ఆధునిక కవి పండితులను వినుతించిన విషయము అపూర్వమై యున్నది. బమ్మెర పోతన గూర్చిన 'అభ్యర్థన', 'సత్యదేవస్తుతి - కావ్యనిరోధ నివారణ' యనునవి కావ్య సాధారణములు కాని విశేష విషయములు.

ఇష్టదేవతా స్తుతిలో పీఠికారంభమున తమ యిష్టదైవము నుపాస్య దైవము నైన శ్రీరామచంద్రుని స్తుతి చేసినారు. పిమ్మట త్రిమూర్తి స్తుతి, బ్రహ్మస్తుతి,

శంకరస్తుతి కావింపబడినవి. పిదప నుపాస్య దేవతయగు సరస్వతీ స్తుతి మూడు పద్యములలో మనసార చేసినారు. ఆ వెనుక గణపతి స్తుతి చేసినారు.

కవి పండిత స్తుతి చేయుటకు ముందు ఆంధ్ర జనతా స్తుతి వినమ్రతతో విశిష్టముగా నిటుల చేసిరి.

> "చిన్న నటంచు నెంచకయె సిగ్గొకయించుక లేక భక్త పో
> తన్నను గూడి భాగవత తత్త్వము బాడ గళమ్ము విప్పితిన్
> నన్నిఁకఁ దిట్టిపొందు కరుణంగని దీవెన లిందు నాల్గుకో
> ట్లన్నల మంగళార్థ మయి యాంధ్రపదాల నివాళి బట్టితిన్."[1]

పిదప ఆంధ్ర భారతీ స్తుతి కావింపబడినది. ఇందాంధ్ర భాషా ప్రశస్తి లెస్సగా అభివర్ణితమైనది. ఆ పిదప చేసిన కవిస్తుతి, కవితాస్తుతిలో కవి ప్రశస్తి కవితా ప్రశస్తి వర్ణింపబడినవి. ఇక కవుల స్తుతులలో తొలుత సంస్కృత కవులగు వాల్మీకి వ్యాస కాళిదాస భవభూతులను భారవి ప్రభృతులను వినుతించుటయే కాక 'విశ్వకవి రవీంద్రుండాది వివిధ భాషలందు నుతికెక్కు కవులకు నంజలించిరి.' పిమ్మట తెలుగు కవుల స్తుతిలో పూర్వాంధ్ర కవులను స్తవ మొనరించి 'ఆంధ్రకవి స్తుతిలో' అధునికాంధ్ర మహాకవులను ఘనముగా వినుతించినారు. ఆ పిదప 'నవ్యకవి స్తుతి', 'అభ్యుదయకవి స్తుతి', 'తెలంగాణ పండితకవి స్తుతి' యని ఉపశీర్షికలుంచి ఆయా కవీంద్రులను పేరుపేరున కొనియాడిరి. పిదప 'సకల సుకవి స్తుతి'లో

> "మరచినట్టి సత్కవులకు మదికొకింత గుఱుతులేని సత్కవులకు
> కొంచె మింక
> చిఱుతలైన సత్కవులకు ధరణిఁ బుట్టుబొందఁ బోవు సత్కవులకు
> వందనములు."[2]

అని మరచినట్టి సుకవులకు, పరిచయములేని సుకవులకు, వర్ధమాన సుకవులకు, భావి సుకవులకు వందనము చేసిన ఆచార్యులవారి డెందము సుకవులయెడ ఎంత

1. పోతన చరిత్రము : పీఠిక - 'ఆంధ్ర జనతా స్తుతి. - 10 వ పద్యము.
2. పోతన చరిత్రము : పీఠిక - 'సకల సుకవి స్తుతి' - 49 వ పద్యము.

అనురాగ స్పందము కలదియో విశదమగుచున్నది. ఇది పోతనగారి 'వర్తమాన కవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించి' యన్న దానిని మించిన మన్ననను కవులయెడ తెలుపుచున్నది. ఇంతకంటె విశేషముగా మరొకస్తుతి చేసినా రాచార్యులవారు. అది 'కుకవి స్తుతి.' కవులు తమ కావ్యములలో సుకవి స్తుతితో పాటు కుకవినింద చేయుట పరిపాటి. కాగా పరమసాధువగు పోతన కుకవినింద వదలివైచినాడు. కాని ఆచార్యులవారు కుకవిని నిందించుట యటుంచి స్తుతి అపూర్వముగా కావించి కవిలోకమున కాదర్శమూర్తులై కీర్తిగాంచినారు.

"అర్హతయె లేక యిటులు మహా ప్రబంధ నిర్మితి నొనర్చు చపలుని నేఁ
జెలంగ
నొకరి నననేల యీతఁడు కుకవి యనుచు, అకట నాదు సాహస
కృతికొక నమస్సు"[1]

ఇక్కడ అర్హతలేకయే మహాప్రబంధనిర్మాణ మొనర్పబూనిన తమ చాపల్యమునకు తమ సాహసకార్యమునకు వినయముగ విచారము వ్యక్తముచేసి తామే యిట్లుండ నొకరిని కుకవియని పరిహసించుట పాపమని కుకవినింద నిరసించి యది తమకే యంటగట్టుకొన్న మహా వినయసంపన్నులు. ఇట్టి భావనచేత కవిగారు నిరుపమ మహోన్నతులై పొల్చినారు. కాగా వినయ విభూషణులగు పూర్వ కవులు కొందరున్నారు.[2] అట్టివారికంటె నొక మెట్టెక్కువ వినమ్రత చూపి వెలసినారు వరదాచార్యులవారు.

ఆ పిదప కావించిన ప్రబంధస్తుతిలో ప్రబంధముయొక్క వైశిష్ట్యమును వర్ణించినారు. అట్టి సత్ప్రబంధ రచనాశయముతో పోతన చరిత్రము వ్రాయబూని 'రవ్వలహారమందు కృతిరమ్యత చాలమి విల్వ తగ్గునే?' యనియు, 'రసమయ కావ్యమున ప్రమాదవశమున దొసగులు దొరలినచో మాన్యులు మెచ్చకుందురా?' యనియు, 'సుధారసనిధియైన తేనెపెర రంధ్రసమన్వితమంచు నిద్ది నీరసమని త్రోసిపుచ్చుట ప్రాజ్ఞజనోచితకృత్యము కా'దనియు యుక్తియుక్తముగా విజ్ఞప్తి చేసినారు.

1. పోతన చరిత్రము : పీఠిక – 'కుకవి స్తుతి' – 50 వ పద్యము.
2. "మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలేలోభా దుద్బాహురివ వామనః" కాళిదాసు రఘువంశము, 1-3,

ఈ సందర్భముననే విమర్శకులగూర్చి 'విమర్శకులకు వినతి', 'అసద్విమర్శక స్తుతి', 'సద్విమర్శక స్తుతి' యని నాలుగు పద్యములు చెప్పబడినవి. ఇందు అనుగ్రహపాత్రు నాకాశమునకెత్తి నిగ్రహపాత్రుని నీరధిలో ముంచజాలు సామర్థ్యముగల విమర్శకులను ప్రస్తావించి,

"మేటి కాళిదాసుఁడె మీదు మెప్పుగనని విజ్ఞత యదెట్టిదైనను విఫలమనియె-
ఇపుడె కవికీర్తి కొరకేను దపమొనర్తుఁ బ్రోత్సహింప బిడ్డకుఁ బాలు
వోయుటగును."[1]

అని సప్రశ్రయముగా వినతి చేసినారు. అసద్విమర్శకుల గూర్చి యొక్కమాట మాత్రమిటుల చెప్పి విడిచినారు.

"మొదలు తుద గ్రంథమెల్లయుఁ జదువకుండ నౌర! యితడు తానొక
కవియా యటంచు
నెంచు ఘనులకు నది విశ్వసించు ప్రజకు దూరముననుండి యొక
నమస్కారమిడుదు".[2]

ఇది 'అసద్విమర్శకస్తుతి.' ఇక్కడ వ్యాజస్తుతి చేయబడినది. పైరీతి అసద్విమర్శకులను తూలనాడక మర్యాదగా దూరమునుండి యొక నమస్కారము చేసినారు. అట్టివారి కింతకంటె చేయవలసినది లేదు. పిమ్మట సద్విమర్శకులను మందరనగ నికషోపల మరాళాదులతో పోల్చి 'అమిత ధీశాలి చిత్తసంయమన శీలి, సరస సద్గుణ వ్యాఖ్యాత సాధ్వసాధు విషయనిర్ణేత, సహృదయ విశ్వజేత' యని కొనియాడి యంజలించినారు. విమర్శకుల గురించి యింతగా ఉల్లేఖించుటకు నేడు రాగద్వేషదూషితాత్ములగు అసద్విమర్శకులు తరచై ఉత్తమ సాహిత్యమున కపచారము జరుగుచుండుటయే హేతువు.

1. "మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టిగ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁగూయఁగడంగు భంగిఁ బ్రా
ఘాంచితశబ్దసారులు మహాకవులాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తిసంగ సుఖలీలకు నేనును గాంక్షఁజేసితిన్."-ఎఱ్ఱన, నృ. పు 1-13.
2. పోతన చరిత్రము పీఠిక - 'అసద్విమర్శక స్తుతి' ౬౭వ పద్యము.

'అభ్యర్థన' అని వ్రాసిన 19 పద్యములలో నేటి కాలమున బమ్మెర పోతన వంటి సుకవీంద్రు డవసరమై యున్నాడని అతని నాహ్వానించుట జరిగినది. ఇదొక విశిష్ట విషయము.[1]

ఇందలి 'పండితవంశ పరిచయము' 39 పద్యములతో నొప్పు బృహ ద్భాగము. తొలికృతి యగు మణిమాలలో ప్రకటించిన పండితవంశ పరిచయమే రవంత మార్పుతో ఇందు కూర్పబడినది. అందులోకంటె ఇందు 11 పద్యము లదనముగా విరచితమై చేర్పబడినవి. వీనిలో ఆచార్యులవారు తమ మామయగు శ్రీమాన్ కొదుమగుళ్ళ జగన్నాథాచార్యులవారి గూర్చి మరికొన్ని విషయములు తెలిపినారు. కాగితములో శిల్పములు కత్తిరించు వారి భవ్యకళను వారి బ్రహ్మ విద్యా వేత్తృత్వమును వర్ణించినారు. మరియు తమ అత్తగారగు సుభద్రమ్మను గూర్చి వినుతించి తమ మాతృదేవి సీతాంబగారి గుణగణముల నమితభక్తితో, పోతన తన తల్లిని స్తుతించినట్లు స్తుతించి ధన్యులైనారు. తమ తోబుట్టువులను గూర్చి తెలిపి అందులో

"అందరం జిన్నవాఁడ విద్యార్జనమున నన్నలందరికంటెను జిన్నవాఁడ
నిహపరసుఖంబులం బొందు హేతువిదియె యనుచు వరియింతు
సుకవితావనితనెందు".[2]

అని సవినయముగా మనవి చేసినారు. చివరకు తామంతకు పూర్వము రచించిన మణిమాలాది కావ్యములను ప్రస్తావించి కాళిదాసాదుల ప్రతిభావారాన్నిధి ముందు వారికణమగు తనను, కావ్యము వ్రాసి కవిలోకయశము గాంచనెంచ ప్రజలు నవ్వుదురేమో యనియు, కాని విజ్ఞవర్యుల యా పరిహాసరుచులే యజ్ఞానతిమిరమున దారిజూపుననియు నెంతో వినమ్రులై విజ్ఞప్తి చేసినారు.

'సత్యదేవ స్తుతి'లో సత్యదేవుడు స్వప్నసాక్షాత్కృతి నొసంగి 'సకలదుఃఖ భంజకమై స్వాభిలషిత సౌఖ్యసంధాయకమగు' తన వ్రతమాచరించుమని యాన తిచ్చిన విషయము, తదాజ్ఞ తలదాల్చి భక్తితో ప్రతిమాసమతని వ్రతమాచరింపగా

1. దీనిని గూర్చి 'పోతనచరిత్ర రచన - కవి ప్రేరణలు' వ్యాసములో వివరించి యుంటిని.
2. పోతనచరిత్రము : పీఠిక - 'పండితవంశ పరిచయము' 111 వ పద్యము.

ఆదేవదేవు డిలువేల్పైన విషయము, తాము ఘోరక్షయవ్యాధి పీడితులై యున్నపు డవ్యాజకారుణ్యమున ప్రాణదాన మొనర్చిన దేవుడతడే యనియు భక్తి తాత్పర్యములతో వివరించిరి.

చివరిది 'కావ్యనిరోధ నివారణ'. ఇందు తాము పోతనచరిత్ర రచన సాగించుచు దానిని పూర్తిచేయకమునుపే సోకిన దారుణ క్షయవ్యాధితో నాలుగేండ్లు పోరాడి 'యముని ప్రోగ్రాము' మార్చివేసిన విషయము కరుణరసాత్మకముగా వర్ణించుకొన్నారు. అందు తమ అత్తమామలు, భార్య, ఆప్తులగు కాళోజి దాశరథి కవీంద్రులు, బూరుగుల రామకృష్ణరావు తమకు ప్రాణదాతలైనారని కృతజ్ఞతతో స్మరించినారు. వ్యాధికాలమున కాళోజి దాశరథి నారాయణరెడ్డిగారలనేక లేఖలు వ్రాసి తమకు ధైర్యమిచ్చుచు ఆరోగ్యప్రాప్తికి తహతహలాడిన విషయము తెలిపినారు. తమ అత్తమామలు పడినపాట్లు, సతీమణి కావించిన సేవలు కనులు చెమ్మగిల్లునట్లు వివరించినారు.

చివరకు చికిత్సాకాలమున దుర్భర దుఃఖసాగర నిర్మగ్నతలో తెప్పయై నిలిచి తమ యింటి దీపరక్షకుడైన యప్పటి ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణారావు గారిని నితాంత కృతజ్ఞతతో స్మరించి వారి గుణగణములను, బహుముఖ ప్రజ్ఞా విశేషములను మనసార నిట్లు వినుతించినారు.

> "కవితావధూటి నాకాంక్షించువేళల కవిరామకృష్ణుడై కానిపించు
> సంక్షేమరాజ్య సంస్థాపనాకుశలతన్ శ్రీరామకృష్ణుల స్థితి వహించు
> వేదాంతకాంతా ప్రసాదాప్తి వంగియ రామకృష్ణుండయి రహించరించు
> వివిధభాషాజ్ఞాన విభవాప్తి భండారకర రామకృష్ణుడై ఘనతమించు
> అవనిప్రజ రామకృష్ణ యంచనవరతము వినుతి యొనరించు
> నిహపరవిభవ మబ్బి
> యలరఁగలరంచు రామకృష్ణాఖ్య నిన్ను పిలిచినారలొ యేమొ నీ
> పితరు లనఘ!"[1]

బూరుగులవారిని గురించి చేసిన యీ స్తవము వాస్తవము.

---

1. పోతనచరిత్రము : పీఠిక - 'కావ్యనిరోధనివారణ' 129 వ పద్యము.

## ఆశ్వాసాంతగద్యము :

కావ్యమునందలి ఆశ్వాసాంత గద్యములో కవి స్వవిషయము, కావ్య విషయము తెలుపును కావున దీనిని పీఠికలో చేర్చి చెప్పుట యుక్తమని యిక్కడ ప్రస్తావింతును. ఆచార్యులవారు ఆశ్వాసాంత గద్యములో,

"శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయశాస్త్రిపుత్ర, వాగీశ్వరీ సమాసాదిత వైదేహీవర నివేదిత సరసకవితా విలాస, సహజపాండిత్య భాస, వరకవివిధేయ వరదార్యనామధేయ ప్రణీతంబైన పోతనచరిత్రమను మహాప్రబంధమ్మునందు ప్రథమాశ్వాసము".

అని విలిఖించినారు. ఇందు కవిగారు తమ గోత్రసూత్రములను, కవితావిషయక విశేషములను పేర్కొనిరి. తమ కవిత వాగీశ్వరీకరుణవల్ల ఉద్భవించి శ్రీరాముని కంకితమై విలసిల్లుచున్నదని తెలిపినారు. పోతనచరిత్రము శ్రీరాముని కంకితమని కావ్యాదిలో నివేదించినారు. కాని వాగీశ్వరీసమాసాదితమన్న విషయము కావ్య పీఠికలో ఎక్కడను తెలుపక ఇక్కడనే వ్యక్తము చేసినారు. ఈ విషయము కవి గారి జీవితసంగ్రహ వ్యాసమున వివరింపబడెను. గద్యములో మరొక విశేషము కలదు. అభినవ పోతనాది బిరుదము లెన్నో యుండగా దేనిని వాడుకొనక నిరాడంబరముగా 'సహజ పాండిత్య' యని పోతనగారు తెలుపుకొన్నట్లు 'సహజ పాండిత్యభాస' యని మాత్రము చెప్పికొన్నారు. ఇది వారి వినయశీలమునకు నిదర్శనము. ఇక్కడ 'వరదాచార్య నామధేయ' యనక 'వరదార్య' యని పేర్కొనుటచే కవి నామము భిన్నమైనట్లు కాన్పించును. కాని యిది పెద్ద భేదము కాదు. ఆచార్య-ఆర్యశబ్దము లేకార్థములో నామముల కనుప్రయుక్తములై యున్న దృష్టాంతములు గలవు.[1] కావున 'వరదార్య' యన్నది రూపాంతరమే గాని నామాంతరము గాదు. ఈ గద్యములలో స్వవిషయములే తప్ప భాగవతాదులందు వలె ఆశ్వాసకథా విషయములు ప్రస్తావింపబడలేదు.

## విజ్ఞప్తి :

ఆచార్యులవారు పోతనచరిత్రమున పీఠికకు ముందు పండితాభిప్రాయముల

1. "రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్" శ్లోకభాగము.

వరుసలో 'విజ్ఞప్తి' వ్రాసిరి. ఇది కావ్యాంతర్భాగము కాకున్నను కావ్యరచన గూర్చి చేసిన విజ్ఞప్తి కనుక దీనిని పీఠికాభాగముగ నిచట ప్రస్తావింతును.

కవిగారి కృతులలో ఈ 'విజ్ఞప్తి' మిగుల విశిష్టమైనది. ఇట్టి విజ్ఞప్తులు తర్వాతి గ్రంథములగు 'వైశాలిని' 'కూలిపోయిన కొమ్మ' 'సూక్తివైజయంతి' యను వానిలో గలవు. వీనిలో కవిగారు తమ కృతుల గురించి, కావ్యవాఙ్మయము గురించి స్వీయాభిప్రాయములు ప్రకటించి యున్నారు. ఇవి చాల విలువైనవై వారి కృతుల అధ్యయనమునకు మిక్కిలి తోడ్పడును.

అందలి 'విజ్ఞప్తి'లో ఆంధ్ర భాషాసారస్వతముల వైశిష్ట్యము, పురాతనాధు నాతన కవితారీతుల సమన్వయ దృక్పథము, ఖండకావ్య మహాకావ్య భేదము, తత్ప్రయోజనములు, తమ మహాకావ్య నిర్మాణహేతువు, పోతనచరిత్ర రచనా ప్రేరణలు, పోతనగారి ప్రశస్తి, ప్రబంధరచనాశయము, పోతనచరిత్ర వస్తు సంగ్రహణము, కావ్యానుబంధ రచన- అను విషయములు క్రమముగా విశదీకరింప బడి యున్నవి. తుదకు పీఠికలు, అభిప్రాయములు వ్రాసిన పండితులకు ప్రచుర ణాదులలో తోడ్పడినవారికి దాతలకు మున్నగువారికి కృతజ్ఞతలు తెలుపబడినవి. కావ్యపఠనమునకు ముందు కవిహృదయమై యొప్పు ఈ 'విజ్ఞప్తి' అవశ్య పఠనీయమై యలరారుచున్నది.

## II. కావ్యోపక్రమము

పోతనచరిత్ర ప్రథమాశ్వాసమున కథాప్రారంభమునకు ముందు 5-77 వరకు గల 72 పద్యములలో 'కావ్యోపక్రమము' అని కథకు పూర్వరంగముగా రచింపబడి యున్నది. ఇది ఆంధ్ర కావ్యములలో అపూర్వమై యొప్పుచున్నది. కావ్యమున ఈ కావ్యోపక్రమమే కాక కావ్యాంతమున (దశమాశ్వాసాంతమున) కావ్యోపసంహారము కూర్పబడినది. శృంగార నైషధాదులందు కావ్యోపసంహారము కానవచ్చునుగాని కావ్యోపక్రమము ఆంధ్రకృతులలో కానరాదు. విశిష్టమైన ఈ కావ్యోపక్రమ ప్రయోజనము వివరించుటకు ముందు, అందలి కథాసారాంశము తెలుపుదును.

పూర్వము నైమిషారణ్యమున శౌనకాదిమునులు సూతుని గాంచి నమస్క రించి యతని పౌరాణిక గాథలను వినుతించి "భవిష్యత్కలికాలమున మనుష్యుల

కర్థకామము లనునవి రెండే పురుషార్థములై యుండి విష్ణుభక్తులు వెదకినను కాన రాక ధర్మదేవత యొంటి పాదమున నడువజాలక మూలకు బడుననియు నధర్మ ప్రవర్తన విజృంభించుననియు వచింతురు. అట్టి దుర్దశలో సకల ధర్మమూలమగు విష్ణుభక్తిని వ్యాప్తిచేయు మహాత్ములు పుట్టరా?" అని ప్రశ్నించిరి. దానికి సూతుడు కలియుగమున పరాశరసూనసమానులగు విష్ణుభక్తులుద్భవించ గలరని భాగవత కర్తయగు నొక భాగవతోత్తముని చరిత్ర యిట్లు వినిపించును.

నారదు డొకప్పుడు శ్రీమహావిష్ణువును సందర్శించి "కలిజనులకు నిన్ను బొందు సులభోపాయమేది?" యని ప్రశ్నింప విష్ణువు 'కలిలో భాగవతమ్మె మోక్షపదసౌఖ్యప్రాపక' మంచు దాని రహస్యమును దెలిపి తదీయ వ్యాప్తి గావించుట కాదేశించెను. నారదుడావచస్సులు తలదాల్చి వ్యాసమునీంద్రుని చెంత కేగి నాలుగు శ్లోకములలో శ్రీభాగవత మతని కుపదేశించి 'దీనిని వ్యాపింపజేయు మిది విష్ణుదేవునాజ్ఞ' యని చెప్పి వెడలిపోయెను. వ్యాసుడు తదాదేశానుసారముగా దేవభాషలో శ్రీభాగవతము రచించి వ్యాపింపజేసెను. కాలక్రమమున కలియుగము ప్రారంభమాయెను. నారదుడు లోకసంచారము చేయుచు కాశిచెంతగల వ్యాసా శ్రమోపాంతసీమలో నరుగుచు వ్యాసమౌనీంద్రుని తపోమహిమ కచ్చెరువొంది తాను నాటిన భాగవత బీజము మహావృక్షమై ఫలవంతమైనందుల కుప్పొంగి దివ మునకేగి దేవేంద్రునికి వ్యాసుని మహిమను వర్ణించి చెప్పి అతడు రచించిన భాగ వతము వ్యాప్తిగాంచి మోక్షప్రదమై పరీక్షిత్తునకు మోక్షప్రాప్తిహేతువైనదనియు వ్యాసుడు 'వ్యాసో నారాయణో హరిః' అను ప్రశస్తిగాంచినాడనియు వివరించెను. అదివిని ఇంద్రుడీర్ష్యాగ్రస్తుడై హరియను నామ మింద్రోపేంద్రులకే కాని మానవు లకు చెల్లదనియు భాగవతము వ్యాసప్రోక్తమగుటవల్లకాక దేవభాషలో విరచిత మైనందువలననే మోక్షప్రదార్హమయ్యెననియు పలికి వేరొక భాషలో భాగవతము రచింపబడి యట్టి మన్నన వడసినచో ఆ భాషకు మూడు జన్మములు దాసుడ నయ్యెదనని శపథము చేసెను.

నారదుడు బాధపడి ఇంద్రుని గర్వోక్తులు వ్యాసుని కెరిగించెను. వ్యాసుడు మిక్కిలి ఖిన్నుడై కాశికేగి శివుని స్త్రీపురుషచేతనములను త్రిలింగరూపునిగా విను

తించి యింద్రుని మదాలాపములు తెలిపి 'సంస్కృతమ్మువోలె సారవంతమ్మగు బాసనీవె భాగవతము పెలయ' నని ప్రార్థించెను. శివుడతని త్రిలింగరూప స్తవమున కలరి త్రిలింగప్రాంతమని యొక ప్రదేశ మొప్పును. అందలి భాష తెలుంగన బడును. ఆ భాషలో పోతన యను కవి భాగవతము రచించును. అతడు వివాహితుడయ్యు బ్రహ్మచర్యమూని మహాతపమాచరించి భాగవతరచన కావించును. ఆ యాంధ్రభాగవతము గీర్వాణ భాగవతముతో తులదూగునని పలికెను. మరియు తాను తన పరివారముతో 'తెనుఁగుగాంగపూర మొలికింపగల'నని తెలుగులిపి పుట్టుకను వివరించి 'దేవతలె తెలుగుఁ కవులై పుట్టి పోషింతురు. నీ కోరిక తప్పక సఫలము కాగలద'ని వరమిచ్చెను. ఈ వృత్తాంతమెల్ల వినిన వాయువు పోయి దానిని దేవేంద్రుని కెరిగించెను.

దేవేంద్రుడు దానిని తమ దేవభాష కపమానముగా భావించి మహావ్యథితాత్ముడై దిక్పాలాదులతో గూడి శ్రీవిష్ణువును సందర్శించి విషయమెల్ల నివేదించి 'ఎల్లతల్లి బాసలతల్లి మందారవల్లి దేవవాణి దాని కదేటి తెల్గు పోటి?' యని వగచి దేవభాషను రక్షింపుమని వేడెను. అదివిని విష్ణువతని కుత్సితబుద్ధికి తాపపడి 'మద్భక్తవరు నవమతి సల్పు కుత్సితమానసుం డతఁడెవ్వఁడేని తాను, స్వాధిరూఢ శాఖాచ్ఛేద చర్యబూను దేబె యగునని మీరెల్లఁదెలియనగును, శౌరిపదభక్తు లాసురీశక్తినణఁచి విశ్వకల్యాణమును గూర్చు విబుధులెందు' అని హెచ్చరించి 'ఉచిత గతులనేదేని ప్రతిచర్య నాచరింపబూనుఁ'డని యింద్రుని యాత్మతృప్తికి సెలవిచ్చి మరల నతఁడుపాయమడుగగా 'దురభిమాన విదూషితుఁడితఁ'డని మదిలో నెరిగి 'స్వభక్తరత్నతతినేచు శ్రమమ్ములె సానరాళ్ళుగా నరసి' యిట్లు యుక్తిదెలిపెను. 'కవి తపస్సమాధిగాంచి ఋషిభావమొందుచు భాగవతమును రచించును. కావున పోతన తపస్సును ధనదారసుతరూపకేషణత్రయంబుచేత భంగము గావింపవలె'ననియు,

"స్వర్గాధిపత్య భాస్వద్భవ్యశక్రాంశ మవని సింగనృపాలుఁడై జనించు
భావజాతమనోజ్ఞలావణ్యరూప రత్యంశమ్ము సుకవిభార్యన్ వసించు
వేదశాస్త్రపురాణవిజ్ఞానదీప్త విఘ్నేశ్వరాంశ సుతాత్మ నెసఁగుచుండు
ఇందిరా హృదయాబ్జమందిరమ్మగు మామకాంశమ్ము శ్రీనాథునందునుండు

నాగభూషణాంశము చిదానందు(డగును, రంభ భోగినిగా ధరస్ సంభవించు
దాశరథినయి నేనును దత్కవీంద్రు(గాంచి యాచింతు నాం(ధభాగవత
కృతిని"[1]

"సురపతి తద్భాగవతము నరాంకితమొసంగు నటులొనర్పగవలె నీ(
పరివారము(గొని యపుడది ధరమోక్షప్రదముగాక తనుతను బొందున్."[2]

అని యొక కార్యప్రణాళిక నేర్పరచి చెప్పెను. అంతలో నారదు డక్కడకువచ్చి 'నీ లీలలు వాఙ్మనముల కతీత'మని నమస్కరించెను. హరినారదులు పరస్పర ముఖావలోకనమున నవ్వుకొనిరి. దేవతలెల్లరు వారి నవ్వులలోని రహస్యము తెరుగ లేక ప్రశ్నార్థకముగా నొకరిమొక మొకరు చూచుకొనిరి. అప్పుడు నారదుడు, "స్వీయ గౌరవమ్ము చెన్నారుటకుగాను ప్రక్కవారి( గించపఱచు జడు(డు ఒరుల దీపమార్చి యొప్పార(గలనను శలభరాజు కెచటి జయమటంచు."[3] పలికెను. ఇంద్రుడు సెలవుగొని వెడలిపోయెను. నారదుడు నారాయణుని గాంచి "నీకు దేవేంద్రుడు సోదరుడు, భక్తు డాత్మయై పఱలెడు పుత్రుడు, ఒకవైపున నీవు వేరొకవైపున పొట్ట. రెండింటను బాధయే ప్రాప్తించినది. ధర్మసముద్ధరణకు కంకణము ధరించిన నీకు నేనేమి వచింపగల"నని నమస్కరించి గగనమార్గమున సాగిపోయెను - ఇది కావ్యోపక్రమ సారాంశము. ఈ పూర్వకథ ననుసరించియే కావ్యకథ యంతయు సాగినది. ఈ కావ్యోపక్రమ కథ కల్పితమయ్యు యథార్థ కథవలె పొసగి కావ్యకథకు మూలమై పుష్టిని తుష్టిని సమకూర్చినది. ఈ పూర్వ కథాకల్పనవలని ప్రయోజనముల నరయుదము.

## కావ్యోపక్రమ కథాకల్పన ప్రయోజనములు :

1. పురాణములన్నియు పౌరాణికశ్రేష్ఠుడగు సూతుడు నైమిషారణ్యమున శౌనకాదిమునులకు ప్రవచింపగా సాగినట్లు కలవు. పోతన చరిత్రమందును 'మును నైమిషవని సూతుని(గని శౌనకమునివరాదిగణ ముత్కంఠన్' అడుగగా సూతుడు చెప్పుచుండ సాగినట్లుండుటచేత వేదోపబృంహితములగు పురాణములకున్న ప్రశస్తి పోతనచరిత్రమునకును కలుగుచున్నది.

1. పోతన చరిత్రము : 1-69
2. పోతన చరిత్రము : 1-70.
3. పోతన చరిత్రము : 1-73.

2. శ్రీమహాభాగవతమున శౌనకాదిమునులు సూతునిగని 'అలసులు మంద బుద్ధియుతులు....సుకర్మము లెయ్యవి చేయఁజాలరీ కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే'[1] యని ప్రశ్నించి దేవకీ వసుదేవుల కుదయించిన కృష్ణుని కథలు వినిపింపుమని కోరినట్లే యీ కావ్యమున శౌనకాదులు సూతుని గాంచి కలికాలమున మనుష్యుల దుస్థితిని దెలిపి 'శ్రీదనుజహరు భక్తి వ్యాప్తింబొనరించు మహాత్ము లెందుఁ బుట్టరొ కలిలో' నని ప్రశ్నించి 'పురాణపిరాజిత భక్తి శక్తి వర్ధనచణు లుద్భవింతురు పరాశరసూన సమానులత్తఱిన్' అను సూతుని వచనములు విని 'కలిజనముల సద్గుణగణవర్తనులు బుట్టుదురు ధర నన్నన్' మా మనములు విన గుతూహల పడునని కోరగా సూతుడు వారికి భాగవత కర్తయగు నొక భాగవ తోత్తముని చరిత్ర ప్రవచింతునని పోతనచరిత్రము నెరిగించినట్లు కవి కల్పించుట చేత పోతనచరిత్ర మహాకావ్యమున పౌరాణికప్రాశస్త్యముతో పాటు భాగవతవాతా వరణమును తత్పావిత్ర్యమును నేర్పడినవి.

3. సంస్కృత భాగవతము వలెనే యాంధ్రభాగవతమును భక్తి జ్ఞాన వైరాగ్య సంధాయకమనియు కైవల్యప్రదమనియు నుల్లేఖించుట జరిగినది.

4. సంస్కృతభాష వలెనే ఈశ్వరనిర్మితమగు ఆంధ్రభాష తత్తుల్యమై విశిష్టమైనదని తేటపడుచున్నది.

5. రామాయణములో రామాదులు హనుమదాదులు దేవాంశసంభూతులగు కారణజన్ములైనట్లే కథానాయకుడగు పోతన వ్యాసాంశలో, సింగభూపాలాదు లింద్రాది దేవతాంశలలో కారణజన్ములై యుద్భవించినారని కావ్యప్రధాన పాత్ర లలో దైవాంశ మారోపింపబడుట చేత కావ్యవస్తుగౌరవమున కాధిక్య మొప్పారు చున్నది.

6. రంభయేయైన భోగినిపై దండకము రచించుట పోతనకు దోషావహము కాదనియు, ఇంద్రాంశలో జన్మించిన సింగభూపాలుడు భాగవతము నపేక్షించి కష్టపెట్టుట కళంకహేతువు కాదనియు ఇట్టివే మరికొన్ని విషయములు నింద్య ములు కావనియు ఈ కావ్యోపక్రమములోని పూర్వరంగ కల్పనవల్ల స్పష్టమగును.

1. శ్రీమహాభాగవతము; 1-42.

7. పోతనగారి అతిలౌకిక కార్యములకు సముచిత సమాధానములు సమ కూర్చు చున్నది.

ఇట్లు కావ్యోపక్రమకథ సమ్యక్ప్రయోజన విలసితమై యొక మహాపురాణమునకు దివ్యప్రణాళికవలె, ఒక మహానాటకమునకు పూర్వరంగమువలె, ఒక మహాభవన నిర్మాణమునకు పథకము వలె విరాజిల్లుచు పోతనకు, ఆంధ్రభాగవతమునకు దివ్యత్వమును ప్రసాదించుచు పోతనచరిత్రమునకు మూలకందమై యొప్పారుచున్నది.

## III. కావ్యకథ :

కావ్య రచనా ప్రణాళికలోని తృతీయాంశము కావ్యకథ. కావ్యమున నిదియే ప్రధానభాగమై దశాశ్వాసపరివ్యాప్తమై విలసిల్లుచున్నది. దీనిని గూర్చి అనుశీలన కావించుటకు ముందు విషయావగాహ సౌలభ్యార్థము దీని కథాసంగ్రహ ముల్లేఖింతును.

### కావ్యకథా సంగ్రహము :

### ప్రథమాశ్వాసము :

తేనియ మాగాణమగు తెలంగాణమున కాకతీయ సామ్రాజ్యరాజధానియైన ఏకశిలానగరమునకు సమీపమున బమ్మెరయను గ్రామము కలదు. అందు కౌండిన్య గోత్రుడును, సుగుణమణియు, ధర్మవర్తనుడును, శివారాధన తత్పరుడును, మానధనుడును నగు కేసనయను నియోగి కలడు. అతని ధర్మపత్ని పరమ సాధ్వియు, పతివ్రతయు, సద్గుణవిరాజితయు, సదాశివపాదయుగార్చనారతయునగు లక్కమాంబ. ఆ పూతచరిత్ర తొలిచూలున తిప్పన యను నతని గనెను. ఆమె మలిచూలుతో నున్నప్పుడొక బ్రాహ్మణోత్తముడగు పౌరాణికుడేతెంచి రామాలయమున శ్రీమహా భాగవత పురాణ ప్రవచనము చేసెను. అది వినుట కందరితోబాటు లక్కమాంబ వెడలెను. ఆమె శ్రద్ధాసక్తులతో ప్రవచనము వినుచు 'మా వంటి వారికి అజ్ఞానము తొలగి జ్ఞానజ్యోతి ప్రకాశించు నిమిత్తము పఠించుటకీ భాగవతము నే భాగవతోత్తముడైనను తెలుగులో రచించెనా?' యని ప్రశ్నించెను. అందుకా పౌరాణికు డామెను గాంచి యామె గర్భమున నొక బ్రహ్మతేజము దాగినట్లు గ్రహించి

'ఉవిద! నీదు పొట్టనుదయించు నీ కోర్కి నిజము చేయువాఁడు నేడొ రేపొ యుదయ మొందకుండ నుండునె నిజభక్త వాంఛితములఁ దీర్చు వరదుఁడెందు" అని ధ్వని గర్భితముగా వచించెను. దాని కామె తృప్తినంది సప్తాహములు భాగవతము సంపూర్ణముగా విని గ్రంథపూజ గావించి యా ద్విజునకు మ్రొక్కి దీనవలు పొందెను. ఆ పిదప మూన్నాళ్ళకే లక్కమాంబ కొక చక్కని ముహూర్తమున ఆంధ్రశారద యదృష్ట మన వ్యాసాంశతో కుమారుడు జన్మించెను. జ్యోతిష్కులతని జాతకము నరసి 'ఇతఁడతులిత ప్రతిభాశాలి యగు'నని యాశ్చర్యపడిరి. వైభవోపేతముగా జాతకర్మోత్సవము జరిగెను. పోతన యని నామకరణము చేసిరి.

పోతన దినదిన ప్రవర్ధమానుడై ఆటపాటలలో తోడిబాలురలో మేటియై తిప్పనతో కలిసిమెలసి వర్తించుచు అనన్యప్రతిభతో విద్యార్జనచేయసాగెను. పోతనకు చదువుతోపాటు సంస్కారమును, "సాధుసజ్జన దర్శనోత్సాహగతియు, హరికథా పురాణశ్రవణాభిరతియు, శంభుపదసరోజార్చనాసక్తమతియు" పెరుగ సాగెను. ఇట్లుండ నొకనాడు సమీపమునగల పాల్కురికి గ్రామమున శైవవైభవము చాటు జాతర సాగుచుండ దానిగాంచుటకు పోతన తన తలిదండ్రులతో గూడి అచటికేగెను. జాతరలో వింతలను విశేషములను గాంచి వినోదించి, శివు డూరేగగా సేవించి యీశ్వరార్చన గావించి గురుసమాధిని దర్శించి దేవాలయ ప్రదక్షిణము చేసిరి. పిదప పిల్లవానికి చిరుదిండ్లు కొనియిచ్చి వెడలు నంతలో వీథి భాగవత మాడుచున్న ధ్వని వినబడి జిజ్ఞాసతో పోతన దాని గూర్చి అనేక ప్రశ్న లడుగగా తల్లి యుక్తియుక్తముగా సమాధానము లిచ్చి వీథిభాగవతతత్త్వము విప్పి చెప్పి పోతన లేతయెడదలో వేదాంత విచారము భాగవతముపై మనసు గలుగుటను రేకెత్తించెను. తిరిగి బమ్మెరకు పోవుచు మార్గమధ్యమందున చెలువొందు మావి తోటను తండ్రి వర్ణించి కొమరునిలోని కవితాత్మ బయల్పడునట్లు చేసెను.

## ద్వితీయాశ్వాసము :

ఒకనాడు ప్రొద్దున పోతన సస్యశ్యామలములైన పొలములను చూడబోయెను. అక్కడ సుందర ప్రకృతి దృశ్యములను పైరులను పచ్చికబయళ్ళలో మేయుచున్న గోవులను చూచుచు తన్మయుడైయుండగా చిదానందుడను నొకయోగి కనబడెను. అతడు చేరవచ్చి 'బిడ్డా! ఈ దారి యెక్కడకు పోవునో తెలిపెదవా ?' అని

యడుగ పోతన యతనికి సవినయముగా నమస్కరించి ఆ యోగి సోమనాథుని సమాధిని దర్శింప పాల్కురికికి పోవుచున్న విషయము తెలిసికొని యాత్రికుడైన యతనికి గ్రామాంతరమున భోజనమెపుడో యెట్లోయని గోక్షీరములు కొంత సేవించి పొందని దొన్నెలో పాలుపిండి యిచ్చెను. కడుపునిండ పాలుద్రాగి కడు సంతుష్టినంది 'గోరసమ్ముల తృప్తిని గొంటి వత్స! నీదు గోరసమిట్టులె నిఖిల జనము లవని నాచంద్రతారార్క మనుభవింతు గాత!' మని దీవించి పోదలచెను. అతని దీవనకు మరింత కరగిపోయి అతని పాదములపై వ్రాలి దైవదర్శన మార్గ జిజ్ఞాసువై ప్రార్థించెను. పదారేండ్ల పడుచువానికి పడతుల వంతగాక పరమాత్మ చింతగలుగుటకు వింతపడి యతని జన్మము కారణగర్భితమని తలంచి దివ్య దృష్టితో పోతన భవిష్యత్తును గాంచి సంతోషించి వేదవ్యాసుని కృపచే సర్వము తెలిసికోగలవని చెప్పి దయతో భగవత్సందర్శన మార్గము చూపి రామతారక తత్త్వోపదేశము చేసెను. మరియు 'వాణి నీకు జిహ్వాగ్రవశవర్తినిగ నివసించు'నని శారదామంత్రోపదేశము చేసి 'ఈ మహామంత్రమును బ్రహ్మచర్య వ్రతదీక్షతో ద్వాదశ వర్షములు జపించుచు తప మొనర్చిన సిద్ధి యగును. నీ వాయా కావ్యములను దర్శనాదులను పఠించునపుడు సరస్వతీదేవి వీణాపాణియై నీయందు వసించి నీకు సహజ పాండిత్యము ప్రాప్తింపజేయును. సిద్ధవిద్యానిధివగు నీకు మరొక నరుడు గురుడు కాడు. ఈ మహామంత్రము వలన నీకు మహాకవిత్వ పటిమ, అసాధారణ ధారణాశక్తి సిద్ధించును. ప్రారంభించిన తపస్సు ముగియకుండ బ్రహ్మచర్య దీక్షా వ్రత భంగమైనచో కావ్యకల్పనాశక్తి యొక్కటియే మిగిలి ధారణాశక్తి తరలి పోవును. కృతిని నరాంకితము చేసిన యెడల దానికి క్షతి యేర్పడి క్షతశేషములు లక్షణయుతములుగావను సపకీర్తి గలుగు'నని తదీయసిద్ధ మంత్రమహిమ నెరిగించి దీనజనావనమే దివ్యతపమని ప్రబోధించి దీవించి వెడలిపోయెను.

పోతన చిదానందయోగీశ్వరుని గూర్చి తలపోయుచునే గృహోన్ముఖు డయ్యెను. మంత్రద్వయోపదేశమువల్ల అతని మనస్సే మారిపోయెను. మరునాడు చేలకడకేగి ప్రకృతియంతయు సౌందర్యరాశిగా దర్శనమీయ రసభావపూరిత హృదయ స్రవంతి యుప్పొంగి కొన్ని పద్యములు వ్రాసి తిప్పన్నకు వినిపింప ఇంటికి రాసాగెను. దారిలో నిరుపేదయగు నొక జవరాలిని 'పొంగు యౌవనమును కొంగుచాటొనరించు మాత్ర ముడుపులేక రాత్రిపగలు లోకమెదుటదిరుగ లోలోన

గ్రుంగెడి శీలవతిని' గాంచి తన యుత్తరీయమిచ్చి ఆ దంపతుల కడగండ్లు విని వారి యజమాని గ్రాసమిత్తునని గరిసెల యింటికి తోడ్కొనిపోయి ఆమెను బలాత్కరింప యత్నింప ఆమె క్రోధోన్మత్తమయి విదలించుకొని వచ్చిన దుర్ఘటన విని తాపపడి వారికి సంబళమిచ్చి పంపి పోతన యామెపై చేయివేసిన తన మిత్రుడగు యువక భూస్వామికి హితవు చెప్ప నతని భవనమునకు వెళ్ళెను. ఆ మిత్రుడు శృంగార నైషధ కావ్యపఠనము వలన వివేకము లేక యందలి శృంగార వర్ణనలకు రెచ్చిపోయి పేదజవరాలిని కామించినట్లు గ్రహించి పోతన ధ్వని విలసిత మగు హితోపదేశక కవిత యొకటి ఆశువుగా వినిపించి అతని మనస్సు మార్చెను. పిదప ఇంటికేగి అన్నకు తన పద్యములు వినిపించి ఆశీస్సులు పొందెను. తదాదిగా పోతన నిష్ఠాగరిష్ఠుడై మహాదీక్షతో మంత్రోపాసన చేయుచు కవితలల్లుచుండ నేకా దశాబ్దములు గడచెను.

ఒకనాడు పోతన తల్లియాజ్ఞచే కోతకు వచ్చిన వరిచేల గాంచబోయి సాయంసమయమున కొన్ని మోపులు వేసిన బండిపై ఊరికి దారిపట్టగా ఒక ప్రక్క దూరము నుండి నాదారని గంట మ్రోత వినబడి ఆ దెసకు చూచెను. ఒక స్వారి కచ్చడములో శ్రీనాథ కవిసార్వభౌముడు తన తల్లితో చెల్లెలితో యాత్రలు చేయుచు పాల్కురికికి పోవుటకు వచ్చుచుండి దర్శనమిచ్చెను. పరస్పర పరిచయమైన పిదప పోతన మహాసంతోషముతో ఆ రాత్రి తమ యింట బసచేసి వెడలుడని కోరి వారిని తమయింటికి తోడ్కొని వచ్చి నాయనగారికి చెప్పెను. ఆ రాత్రి వారికి భోజన భాజనాదులతో చక్కని ఆతిథ్యము లభించెను. శ్రీనాథుడు తన చెల్లెలు నర్సమాంబను సర్వయోగ్యుడగు పోతనకిచ్చి పెండ్లి చేయుటకు తల్లి నొడబరచి మరునాడు తన వాంఛ కేసన కెరిగించి తదామోదము పడసి పెండ్లి జరిపించెను.

## తృతీయాశ్వాసము :

తల్లిదండ్రులు పోతన దంపతుల నొక్కటి చేయ ప్రయత్నించిరి. పోతన తపోభంగమునకు చింతించి శయన మందిరమున భార్యతో నేమియు పలుకక పడుకొనెను. పెనిమిటి ఆదరమునకు నోచుకొనని నర్సమాంబ వగపుగాంచి చెలులోదార్చిరి. లక్కమాంబ విషయ మర్థమై ఖేదపడి పోతన దంపతుల నింట నిడి తక్కిన కుటుంబ సభ్యులతో తీర్థయాత్రలకు బయలుదేరెను. పోతన సతితో

ఏకాంతవాస మొనర్చియు నిగ్రహముతో కాలము గడపసాగెను. అంతలో పొలాలు కోతకు వచ్చిన విషయము పాలేరు చెప్పగా పోతన వనభోజనార్థము వంటకముల సిద్ధమొనర్ప భార్యకు చెప్పి వెడలి పొలము కోతపట్టించెను. ఆకాశము మేఘావృతమై హాలిక హృదయ భేదనముగా వర్షము కురిసెను. భర్త రాకకు వేచి యతడు రానందున నర్సమాంబ వంటకములు తీసికొని బయలుదేరి పొలాల చెంతగల దుర్గాదేవికి నైవేద్యము పెట్టి తన కష్టాలు తీర్చుమని మనసార జగన్మాతను ప్రార్థించి వానచినుకులలో తడియుచు పోతన యున్నచోటికి చేర బోయెను. తడిసిన పొలము గట్టుపై కాలుజారి పడబోగా చెంగట కూర్చుండి యున్న పోతన చూచి తటాలున లేచి ఆమె భుజములు పట్టి ఆపి వర్షమున వచ్చితి వేమని జాలిపడి యెదార్చెను. ఆ స్పర్శ వల్లను తడిసి యొంటికంటుకొని యున్న వస్త్రములలోని తనూ సౌందర్యావలోకము వల్లను క్రొత్త లోకపు టనుభవమై పోతన హృదయము రాగరసపూర్ణమై పోయెను. శివానివేదితాన్న మచట నుంచి నర్సమాంబ వస్త్రము శుద్ధిచేసి స్నానమాడుటకు సరస్సున కేగగా పోతన ఆమెను చూచుచు పరవశుడై స్మరపీడితుడై యుండెను. ఆమె స్నాతయై వచ్చి నివేదితాహారము వడ్డింప అన్యమనస్కుడై యెట్లో యించుక భుజించి తమి నిల్పలేక ఆమెతో క్రీడింపబూనగా రాత్రి పొలము కావలికని వచ్చిన పాలి కాపువల్ల అంతరాయమేర్పడెను. అతడు సతితోగూడి గృహమునకేగి యా రాత్రి ఆమెను గూడి యేకాంత సౌఖ్యమనుభవించెను. ఈ రీతిగా వివశత్వమున తపో భంగమై పోతన చింతించెను.

కొన్నాళ్లకు యాత్రలు ముగించుకొని తమవారు తిరిగి వచ్చిరి. నర్సమాంబ నాలుగు నెలల గర్భవతి యని తెలిసి లక్కాంబ యెంతో సంతసించి 'శ్రీశైల మల్లికార్జునునికి మొక్కి వచ్చితిని. కొడుకు పుట్టినచో అతని పేరు పెట్టుకొందు'నని పొంగిపోయెను. నవమాసములు నిండి పుత్రోదయము కాగా మల్లన యని పేరుపెట్టి యుత్సవము చేసికొనిరి. తపోభంగమై ధారణాశక్తి కోల్పోయిన పోతన మిగుల వగచి విశ్వామిత్రునివలె మరల తపశ్చర్యకు వనముల కేగదలచి తల్లి యానతిమెయి నది మానుకొనెను. కొడుకును లాలించు మమకార పారవశ్యమున తపము తలంపు రాకుండ పోయెను. పిమ్మట జ్ఞానియగు పోతన సంసారమునం దంటి యంటక మెలగుచు కవితా సమ్మగ్నుడై లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణముల రచనాభ్యాసము సాగించుచుండెను. కొంతకాలమునకు

శ్రీనాథుడు భార్యావియోగము నంది కూతురు శారదను తోడ్కొని వచ్చి యామెను పోతన యింట నుంచెను పోతన వైరాగ్యబోధన మొనర్చి శ్రీనాథునికి దుఃఖోపశమనము చేసెను.

## చతుర్థాశ్వాసము :

శ్రీనాథుడు పోతనయింట కొన్నాళ్ళు వసించి యొకనాడు సింగభూపాలుని దర్శింప నతనితోగూడి రాచకొండ కరిగెను. శ్రీనాథ పోతనలు రాజసందర్శనము చేసికొని అతనిచేత సత్కృతులై రాజోద్యానమునందలి భవనమున వసతిగాంచిరి. రాజప్రార్థనచేత ఇద్దరుకవు లుద్యానవనశోభను వేర్వేర తమ చిత్తవృత్తుల కనుగుణ ముగా క్రమముగా శృంగార వైరాగ్యభావములతో ఆశువుగా వర్ణించి రాజు ప్రశంసలు గాంచిరి. కవు లాహ్నికములు దీర్చుకొన సెలవుగొని వెళ్ళగా వేగులవా డరుదెంచి ప్రజలు ప్రభువును కీర్తించుచున్న విషయము తెలిపి యొక వేశ్యా పుత్రిక శీలవతియై అనన్యచిత్తముతో ప్రభువుగారిని వలచిన వృత్తాంతము నివేదింప అతడు హర్షించెను. మరునాడు రాజసభకు వేశ్యామాత తన కూతురును తోడ్కొనివచ్చి పరిచయము చేసికొని రాజాజ్ఞగొని ఆమెచేత నృత్యము చేయించెను. ఆ సుందరి లోకోత్తరముగా నృత్యముచేసి సభను సమ్ముగ్ధము గావించెను. రాజు మహానందభరితుడై ఆమె కోరికమేరకు భోగినిగా ఆమెను పరిగ్రహించెను. జయ దేవుని అష్టపదులు పాడి రాధికయై మధురభక్తిరసము వెల్లివిరియ మనోజ్ఞ నృత్యము చేసిన మగువనుగాంచి అలరి ఆమె గుణగణములను వర్ణించుచు పోతన భోగినీదండకము రచించి రాజున కంకితము చేసెను, అందుకు రాజు మిక్కిలి సంతుష్టుడై నిండుసభలో పోతనను తన ఆస్థానకవి మండలి అధ్యక్షునిగా సన్మా నించుటకు పసిడి పళ్లెమున తాంబూలాదులు సమర్పింపబోగా భక్తుడును విరక్తు డును నిరాడంబరుడును అగు పోతన నరేంద్రుని పురస్కృతిని తిరస్కరించెను.

ఉద్యాన వసతికి కవులేగిన పిదప చారుడొకడు వచ్చి పోతనకు జాబిచ్చెను. జాబుద్వారా తన తల్లి యాసన్నమరణయై యున్నవార్త తెలిసి అశనిపాతమువలె నడలి యతడున్నవాడున్నట్లే బయలుదేరెను. శ్రీనాథుడు వారించి శీఘ్రప్రయాణము నకు అశ్వశకటమడిగి తెత్తునని రాజుకడకరిగి వేడగా రాజు పోతనచేసిన అవజ్ఞ గుండెలో ముండ్లగా ఉల్లసమాడి వాహనమంప నిరాకరించెను. పోతన అది తెలిసి

క్రోధతామ్రాక్షుడై రాజుల దుష్టరాజసమునకు మిక్కిలి రోతపడి బమ్మెరకు పయనమై వచ్చెను. అతడింటికిచేరి మాతృ మరణవార్త తెలిసి శోకించెను. తండ్రి కేసన శోకాతిరేకముచేత గుండె ఆగి మరణించెను. కొడుకులు యథావిధి జననీ జనకుల కపరకర్మలొనర్చిరి.

## పంచమాశ్వాసము :

పోతన తిప్పనతోగూడి గ్రహణస్నానార్థము మంత్రపురిచేరువ ప్రవహించు గోదావరికి వెడలి తల్లిదండ్రుల యస్థుల నిమజ్జనముచేసి శ్రాద్ధవిధి నిర్వర్తించెను. పిమ్మట చంద్రోదయశోభల నలరారు తెలుగునాటి జాహ్నవియగు గౌతమిని మనసార వర్ణించి గ్రహణవిముక్తి కాగానే గంగాస్నానమాచరించి విమల సైకత మున గూర్చుండి విశ్వేశ్వరధ్యానము చేయుచుండ శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించి శ్రీ మహాభాగవతము నాంధ్రీకరించి తనకు కృతియిమ్మని కోరి తాంబూలము సమర్పించెను. పోతన భక్తిపారవశ్యముతో రాముని స్తుతించి మహాప్రసాదమని తలదాల్చి తిప్పన కావిషయము చెప్పి ఏకశిలా నగరమునకుపోయి అచటి పండి తుల కాయుదంతము తెలిపి వారి ఆమోదమునంది బమ్మెరకు తిరిగివచ్చెను.

ఆ కాలమున దేశములో క్షామము విజృంభించి జనులల్లాడి పోవుచుండిరి. రైతులు వఱపులో దిక్కుతోచక మిగిలిన జలలేశమునకు పెనగులాడుచుండిరి. పోతన కరణమగుటచేత తన పొలాలకే నీరు పెట్టించుకొని యితరుల కందనీయుట లేదని అపోహపడి పోచయ్య అను కాపు పోతన పనిబట్టబూని రాత్రి చెరువుకడకు పోయి తన పొలానికి నీరుపెట్టుకొనుచుండెను. పోతన నీరటికాడు చెప్పుటచేత విషయములు తెలిసి అతని అపోహ తొలగింప సత్త్వమునకన్న తమస్సు బలవత్త రము కాజాలదని ధైర్యముతో చెరువుచెంతకు పోయెను. అంతలో పోచయ్య సర్ప దష్టుడై నేలగూలగా పోతన జాలిపడి తనకు తెలిసిన మూలికవెదకి చికిత్సచేసి బ్రతికించెను. మృత్యుముఖమునుండి కాపాడిన యతడు పోతనయే యని తెలిసి పోచయ్య అతని పాదములపై బ్రాలి క్షమార్పణ చెప్పుకొని యేడ్చెను. పోతన కాపు నోదార్చి అతని అపోహ తొలగించి అతని నింటికి తోడ్కొనిపోయెను.

పోతన క్షామకాలమున దీనులకు దానధర్మములు చేయుచు సంసారబాధ్యతలు గుర్తించుటలేదని అతని వదినె బాధపడి తిప్పయ్యతో కుటుంబమును వేరుపరచుమని

కోరెను. కాని తిప్పన దాని కొడబడక చివరకు 'ఏకశిలా నగరాధిపతి మన కిత్తు నన్న యుద్యోగము చేయుట కక్కడికి పోవుదము, తమ్ముడు బాధ్యత యెరిగి వర్తించు'నని చెప్పెను. ఒక నాడింటిలో పిల్లలు పస్తులుండుచున్న దుస్థితికి వగచి పోతన ధాన్యము బదులుకొని తెచ్చుటకు గ్రామములోనికి పోయెను. వీథిలో నొక బిచ్చగా డతిదీనముగా బిచ్చమడుగుచు కోమటికొట్టు ముందు నిల్చెను. సెట్టి బిచ్చము వేయకపోగా వానిని తరుముటకు కఱ్ఱయెత్తి కొట్టబోగా పోతన చూచి అడ్డుపడగా ఆ దెబ్బ అతని తలకు తాకి రక్తము కారెను. దాని నోర్చుకొని పోతన సొమ్మసిలి పడిపోయిన బిచ్చగాని కుపచారముచేసి యోదార్చి యింటికి తోడ్కొని వచ్చుచుండ వాడు కృతజ్ఞతతో ''నాకీ ఇనుపకడ్డి దారిలో దొరికినది. ఇది నాకెందుకు ? నీవు తీసికొ"మ్మని గంటమిచ్చెను. పోతన దానిని గైకొని వానిని తన యింటికి తోడ్కొని వచ్చి అన్నము పెట్టుమని భార్య నాదేశించెను. ఆమె అన్నము తెచ్చుటకు లోనికి పోయి పిల్లి తినుటచేత రిక్తమై యున్న పాత్రను గాంచి వ్యథపడి తోచక నిలు చుండెను. ఆలస్యమునకు హేతువేమని పోతన లోనికేగెను. అంతలో గాయపరచిన సెట్టి భయాందోళనము చెంది పరుగునవచ్చి తిప్పనకు పోతనకు క్షమాపణ చెప్పి వగచెను. అదే సమయమున భిక్షుకుడిపుడే వచ్చెదనని బయటకు వెడలి యెంత కును రానందున నతనికై వెదకి కానక పోతన ఆశ్చర్య విషాదములు పెనగొన భిక్షుక రూపమున సాక్షాత్కరించి భాగవతము వ్రాయుటకు గంటము ప్రసాదించిన నా రాముని గుర్తించి సేవింపలేకపోయితినని పోతన పరితపించెను. తిప్పనయు వ్యథపడి రాముడు గంట మిచ్చెను కావున ఆలసింపక భాగవతరచన ప్రారంభించు మని ప్రోత్సహించెను. "భాగవత రచనకు ముందు బ్రహ్మసత్ర మిడవలెనని యోరుగంటి విప్రులాదేశించిరి. ఈ కరవులోనదెట్లు సాధ్యమని చింతించు పోతనను గని సెట్టి దానికి వలయు ద్రవ్యము నేనిత్తునని కృతజ్ఞతతో పలికి పోతన నొడ బరచెను.

## షష్ఠాశ్వాసము ;

పోతన వసంతఋతువున శ్రీరామాలయమున భాగవత సప్తాహ మొనర్చి భాగవతానువాదమునకు పండితామోదము వడసి చిదానంద్రాశ్రమమున కేగి గురు వరేణ్యుల స్తుతి చేసి రచన కనుజ్ఞ వేడెను. ఆ యోగి భాగవత తత్త్వోపదేశము చేసి ఆశీర్వదించి పంపెను. పోతన ఇంటికి వచ్చి అగ్రజునసుమతి పొంది భాగవ

తాంధ్రీకరణమున కుపక్రమించి ఇష్టదేవతా ప్రార్థన కావించెను. రచనాదిలో పూర్వకవిస్తుతిచేసి రామధ్యాన మొనర్ప కృష్ణుని దర్శనమగుట చేత రచననాపి, స్వప్నమున రాముడు శంకానివారణము కావింప కృష్ణుని కృతిపతిని చేసి రాముడు శ్రోతగా భాగవత రచన చేయసాగెను.

గజేంద్రమోక్ష ఘట్టమున 'అల వైకుంఠపురంబులో' అను పద్యమును ముగింప నేరక గ్రంథమును కట్టిపెట్టి పొరుగునగల పల్లెకు వెడలగా రామశర్మయను నొక బ్రాహ్మణుడు పోతన కొరకని వచ్చి మల్లనతో మాట్లాడి దేవతార్చన కడ నున్న భాగవత కృతిని విప్పిచూచి పద్యమును పూరించి పోతనను ప్రశంసించుచు భోజనముచేసి పోయెను. పోతన తిరిగివచ్చి పద్యము పూరింపబడియుండుట చూచి విప్రుడు వచ్చి వెళ్ళిన వృత్తాంతము తెలిసి రాముడే యట్లు వచ్చి వ్రాసి పోయెను. తనకు దర్శనభాగ్యము లేకపోయెనని బాధపడి పూరింపబడిన పద్యమును భక్తి పరవశత్వమున పలుమారులు చదువుకొని యుప్పొంగిపోయి తన యనుభవ మును ప్రజల కెరిగించి భక్తి ప్రాశస్త్యమును వారికి వివరించెను.

రుక్మిణీ కల్యాణఘట్టమున 'బాలకమరె' యను పద్యము వ్రాయగా పోతన కూతురు అగ్నిలోబడి కమరెను. వైద్యు లామె జీవించుట యసాధ్యమని పెదవి విరచిరి. అప్పుడు పోతన హరిపై భారముంచి ఆ ఘట్టముననందే 'నెలత యౌవనంబు నిండి వెలిగె' నన్న పద్యము రచింపగనే ఆ బాలిక తెలివిగొని మాట్లాడెను. ఇట్లు తాదాత్మ్యముతో అనన్య దీక్షతో రచనచేసి భాగవతాంధ్రీకరణ పూర్తి చేసెను.

## సప్తమాశ్వాసము :

శ్రీనాథుని కూతురు శారద దుస్స్వప్నముగని యేడ్చి తండ్రిని జూడ బెంగగొనెను. నర్సమాంబ శారద నూరడించి శ్రీనాథుని పిలువబంప పోతనను ప్రార్థించెను. పోతన శ్రీనాథుని పిల్చుటకు మల్లనను పంపదలపగా నారయాది శిష్యులు తామే రాచకొండకు పోవుదుమని యనుజ్ఞగొని వెడలిరి. వారు రాచకొండకు పోయి రాజసభాభవనములోనికి పోనీయని వృద్ధకంచుకిని దూషించిరి. పిదప వారు పోతన శిష్యులని తెలిసి కంచుకి వారిని లోనికి పొండని వేడెను.

నారయాదుల వృత్తాంతము తెలిసి ఆదరించి పోతన యోగక్షేమము లర సెను. వారు పోతన భాగవతాంధ్రీకరణ విషయము ప్రశంసాత్మకముగా రాజున

కెరిగించి శ్రీనాథునకు శారదలేఖ నందించిరి. రాజు శ్రీనాథుని లేఖావృత్తాంత మెరిగి విచారించెను. పిమ్మట అతడు శ్రీనాథునితో ఉపవనికి పోయి శారదతో పాటు పోతనను రాచకొండకే పిలిపించెదనని చెప్పి భాగవతము నంకితము గొన వలెనను తన కాంక్ష నతనికి తెలిపి పోతనకవి నాహ్వానించుటకు తన పరివారము నంపెను. సేనాపతి పరివారముతో నేగి బమ్మెరలో రామాలయమున భాగవతము వినిపించుచున్న పోతనను సందర్శించి రాజాభిమతము నతని కెరిగించెను. పోతన రాచకొండకు రాజాల నందుకు చింతించుచు శ్రీరాము నాజ్ఞను సేనాపతికి విన్న వించెను. సేనాపతి రాజాజ్ఞను ధిక్కరింపజాలమని చెప్పగా పోతన రాజాజ్ఞకంటె రామాజ్ఞ యధికమనెను. చమూపతి క్రుద్ధుడై సైన్యమును పురికొల్పి భాగవతము నపహరించెను. అంతలో గ్రామస్థుడగు నొక యువకవీరుడు విజృంభించి కత్తి త్రిప్పుచు సైన్యము నెదిరించి చీకాకొనరించెను. అప్పుడే ఆ చెంతకు వచ్చిన పందుల గుంపుపై నొక కుక్క చెలరేగగా మందలోని మేటి వరాహ మొకటి బెదరి సైన్యముపై బడెను. సైనికులు పందితో పోరాడిరి. పంది సైన్యమును చెల్లా చెదరు కావింప, వశపడక సేనాపతి తన తలమీది భాగవతము వరాహము వద్ద పడగా విడిచిపెట్టి సైన్యయుక్తుడై పారిపోయెను. ఆ మేటి వరాహము ప్రశాంతమై భాగవతము పోతనకందునట్లు చేసి చూచుచుండగనే పరుగుతీసి అదృశ్యమాయెను. సైన్యముతో పోరాడిన వీరుడు మున్ను సర్పదష్టుడై తన చేత పునరుజ్జీవితుడైన పోచయ్య కుమారుడనియు, తండ్రికి చేసిన మేలు మరువక ప్రత్యుపకారము చేసినాడనియు తెలిసి పోతన మిక్కిలి కృతజ్ఞుడయ్యెను. ఇక పందులను దోలు వాలుగంటి మున్ను యజమానిచేత పరాభవింపబడి పోతనగారి అన్న పుత్రుముల ఆదరము గాంచినదై పందులను పెంచుకొనుచున్న యది నాటి ఉపకారము మరు వక మేటి పందిమీదికి కుక్క నుసికొల్పినదని తెలిసి ఆమెవల్ల వరాహవృత్తాంతము నరసి రామచంద్రుడే ఆ రూపమున వచ్చి దయతో భాగవతము రక్షించెనని గ్రహించి మిక్కిలి ఆనందించి భక్తిపరవశుడై వినుతించెను.

సేనాపతి రాజుతో పోతన భాగవతాపహరణార్థము జరిగిన యుద్ధ విష యము నివేదించెను. రాజు శ్రీనాథుని బమ్మెర కంపెను. శ్రీనాథుడు సపరివార ముగా బమ్మెరకు ప్రయాణమై మార్గమధ్యమున నొక తోటలో విడిసి యుండ నొక జంగమకన్య వచ్చి పోతన భాగవతమును నరాంకితము చేయడని నిర్ధారించి

చెప్పి శ్రీనాథుని వ్రేలికి రత్నాంగుళీయక మర్పించెను. పిమ్మట జంగమమఠపతి వలన వచ్చిన యువతి యతని సుతకాదని తెలిసి సరస్వతియే ఆ రూపమున వచ్చి తనను హెచ్చరించినదని శ్రీనాథుడు గ్రహించి విస్మితుడయ్యెను.

## అష్టమాశ్వాసము :

శ్రీనాథుడు బమ్మెరకు చేరబోయి దూరాన పొలము దున్నుచున్న మల్లనను జూచి పిలిచి కుశల మడిగి పోతన హాలికత్వము నెత్తిపొడిచెను. మల్లన పౌరుషముతో జనకుని ఘనతను చాటి చెప్పెను. శ్రీనాథుడు తన మహిమను చాటుటకు మల్లన ముందట పల్లకి మోయు బోయీలలో నొకవైపు వారిని విడువుడని పల్లకిని నడపించెను. మల్లన ఆశ్చర్యపడి తన తండ్రిని స్మరించి తన నాగలి కొక యెద్దును విడిచి నడపించెను. శ్రీనాథుడు రెండవ వైపు బోయీలను తొలగించి పల్లకి సాగించగా మల్లన రెండవ యెద్దును వదలి నాగలి నడపెను. శ్రీనాథుడవమానము పొంది మచ్చరముతో బమ్మెరకు పోయి పోతనచేత సత్కృతుడై కొమార్తె నూరడించి వరనిశ్చయమునకై రాజపరివారమును వేల సంఖ్యలో గొని వచ్చితినని పోతనకు తెలిపెను. శ్రీనాథుని పరివారమునకు విందిడలేక కుందుచు వాగ్దేవిని స్మరించుచుండ పోతన దర్శనార్థము జ్యోతిపుర రాజ్ఞి యరుదెంచి ఆ రాత్రి సహస్రభోజనమునకు వలయు పదార్థములు పోతనకిచ్చి భాగవత శ్రవణము నపేక్షించెను. పోతన మోహిన్యవతార ఘట్టము వినిపించెను. శ్రీనాథుడతని కవితలను శ్లాఘించెను.

శ్రీనాథుడు పోతనను రాజదర్శనమునకు ప్రోత్సహించు నిమిత్తము ధనావసర మహిమ నెరిగింప పోతన తన వైరాగ్య చిత్తవృత్తిని విశదీకరించెను. పిమ్మట శ్రీనాథుడు మల్లనకు వరనిశ్చయ మొనర్చి శారదకు నూతన వస్త్రము లొసగెను. పోతన కూతురు లక్ష్మి తన కొక పట్టుబట్ట కావలెనని పట్టుపట్టగా శ్రీనాథుడు బుజ్జగించి తాను కొని యిత్తుననెను. మన రాముడీయగలడని పోతన కూతునోదార్చెను. అటు తర్వాత శ్రీనాథుడు భాగవతము వినుచు పోతన వ్రాసిన 'సిరికిం జెప్పడు' అను పద్యము నాక్షేపించెను. అంతలో కర్ణాటాధీశ్వరుడు భాగవతము నంకితము గొనపంపిన లేఖ చదివి శ్రీనాథుడు పోతనను ప్రేరేపించగా అతడు రాజులు దురభిమాన దూషితులని విమర్శించెను. నర్సమాంబ బావమరదుల నిరువురను ఉపాహారము సేవింప భోజనశాలకు పిల్చుకొని పోయెను.

ఆ సమయమున లక్ష్మి శారదలు క్రీడా వినోదలై పెరటిలో పూల మొక్కలకు నీరు పోయుచుండిరి. శారద బావి నుండి వడివడిగా నీరు తోడుచుండ త్రాడు తెగి చేద నూతగూలెను. ఆ చప్పుడు విని తినుట విడచి తటాలున నూతివద్దకు పరు గెత్తిరి. శారద క్షేమముగా నున్నది తెలిసి శ్రీనాథుడూ రడిల్లెను. అది కాంచి పోతన 'సిరికిం జెప్పడు' అన్న పద్య మాక్షేపణీయము కాదని నిరూపించెను.

శ్రీనాథ పోతనలు తిప్పన నరయుట కోరుగంటికి వెడలిరి. అక్కడ కోటలో చెడి పడియున్న శిల్పఖండముల నిరువురును వర్ణించిరి. రాజులే కళా పోషకులని శ్రీనాథుడనగా కళలే రాజుల కీర్తికాయములను పోషించునని పోతన వచించెను. శ్రీనాథుడు తిప్పనను దర్శించి అతిథిమర్యాదలుగాంచి తన కోరిక నెరవేర్తునను వాగ్దానముచేసిన యెడలనే భుజింతునని పట్టుబట్టగా తిప్పన మాట యొసగి శ్రీనాథుని కోరిక తెలిసికొని బాధపడియు వాగ్దానముచేసినందున పోతనను భాగవతమును కర్ణాటాధీశ్వరున కంకితము చేయుమని చెప్పెను. పోతన అన్నగారి మాట దాటలేక విధిలేక సమ్మతించిపోయి మల్లన వివాహము కావించి కృతిని కర్ణాట ప్రభువున కర్పింప శిష్యసమేతముగా బయలుదేరి దారిలో హిడింబాశ్రమ మని ప్రసిద్ధిగాంచిన మెట్టు కుధరమును చేరెను.

## నవమాశ్వాసము :

పోతన మెట్టు కుధరముపై వెలసిన శ్రీరామచంద్రుని, రామప్పయను శివుని దర్శించి పూజించెను. పోతన రామచంద్రునితో తన వేదన నివేదించి చింతాక్రాంతుడైయుండ తదవస్థలో వాగీశ్వరీదేవి దర్శనమిచ్చి విలపించెను. పోతన సంతసించి నిన్ను రాజులకు విక్రయించనని వాగ్దానముచేసి ఆమె నోదా ర్చెను. మణిగిరిలోనున్న విద్వాంసులు, ప్రజలు పోతనను దర్శించి భాగవత శ్రవణము నర్థింప ఓరుగంటి గొప్పతనమును వినుతించి భాగవతము వినిపించి వారి మన్ననలు గాంచెను. అంతట కర్ణాట నృపాలపరివారము పోతనను సాదర ముగా గొనిపోవవచ్చి తదీయసేనాపతి పోతనకు రాజుగారి సందేశమును విని పించెను. పోతన తన యవశత్వమును సేనాపతి కెరిగించి యతడు కోపింప బుద్ధి చెప్పెను. రాజుతో పగ గొనితెచ్చుకోరాదని చమూపతి హెచ్చరింప పోతన రాజుల దుష్టనిరంకుశత్వమును దూషించెను. సేనాపతి క్రోధావిష్టుడయి భాగవతము లాగు కొని వెళ్ళిపోయెను. పోతన చేయునదిలేక రాముని కార్తినివేదనము కావించెను.

గ్రంథ మపహరించిపోవు కన్నడ సైన్యముపై రాచకొండసైన్యము దండెత్తి గెలిచి గ్రంథము స్వాధీనము చేసికొనెను. సింగనృపతి చమూపతి పోతనతో రాచకొండ కరుదెంచి కృతిని కొమ్మనిచెప్పగా పోతన నిరాకరించెను. సేనాపతి కృతిని గైకొని రాచకొండకు వెడలెను. రాజుల దుర్ణయములకు మనసు విరిగిన పోతన తన వైరాగ్యవృత్తి శిష్యులకు వెల్లడించి వారికి తెలియకుండ రాత్రి వెడలి పోయెను.

పోతన విరక్తుడై పరమేశ్వరుని లీలావిలాసములు పాడుచు తీర్థయాత్రలు చేయుచు తిరుమల శ్రీనివాసుని కంచి వరదరాజస్వామిని శ్రీరంగనాథుని సేవించి యచ్చటినుండి రామానుజ జగద్గురు పీఠాసీనుడగు నొక యతిపతి నాశ్రయించి తాపపుండ్రాది పంచ సంస్కారములు పొంది "విశిష్టాద్వైతమత నిష్ఠాగరిష్ఠుడై" యక్కడినుండి వెడలి పెరింబూదూర రామానుజులను శ్రీవిల్లిపుత్తూర ఆండాళును సేవించి తుదకు ఒంటిమిట్టచేరి యందలి రఘునాథుని దర్శించి యచటనే నివసింప సాగెను. అక్కడ స్వప్నమున రామచంద్రుడు పోతనకు భాగవతకృతి శిథిలావస్థ నెరిగింపగా అతడత్యంత పరివేదన నొందుచు గ్రంథక్షేమము తెలియువరకు భుజింప నని వ్యాసభాగవతమును భక్తితో పారాయణము చేయుచు దుఃఖించుచుండెను. శ్రోతలనుండి ఒక యోగి 'కవివర్యా! ఇట్లు విలపింపనేల? ఏడు రాత్రులును భగవదవతార కథా విశేషముల నాశుగతిఁ గావ్యగాన మొనరింప నాలించి హరి ప్రసన్నుండగు. భవద్రచితమగు భాగవతం బనపాయత నున్నవార్త మీచెవింబడు' నని తెల్పిపోయెను. పోతన అట్లే భక్తి ప్రపత్తులతో భగవదవతార గాథలను కావ్య గాన మాశుగతి నొనర్చెను.

సింగనృపాలునికి స్వప్నమున రామచంద్రుడు కనబడి 'నా కృతికాంతను నాశ మొనరించి యేమి యశముగాంతు' వని కోపముతో చెంపదెబ్బవైచెను. రాజు దరిపడి లేచి చెంపపై దద్దు చూచుకొని వెఱగుపడి మరునాడు సభలో స్వప్న వృత్తాంత మెరిగింప శ్రీనాథు డర్థము చేసికొని తత్ఫలము తెలిపెను. రాజు తన సేనానిని పిల్చి భాగవతకృతిని కొని రమ్మనెను. పెట్టెలో నుంచుటచేత చెదపట్టి శిథిలమైన భాగవతము నా పడవాలు చింతాభయాకులుడై రాజ సమక్షమున నుంచెను. రాజు చెదలుపట్టిన భాగవతము నరసి దుఃఖించి శేషభాగవతమును

శ్రీనాథునిచేత బమ్మెరకు పంపించెను. శ్రీనాథుడు సంక్రాంతి పర్వదినమున బమ్మెరకు చేరబోయి విషాదచ్ఛాయావిలమైన పోతన కుటుంబమును పరామర్శించి కూతునోదార్చెను. అంతలో రాచకొండ కోశాధిపతి వచ్చి కృతినుద్ధరింప రాజంపిన ధనమును శ్రీనాథుని కిచ్చిపోయెను. శ్రీనాథుడు మల్లనకు భాగవతశైథిల్యవృత్తాంత మెరిగించి శిథిలభాగములను పూరింపగోరెను. కాని మల్లన తండ్రిలేనందున వ్యథితాత్ముడై తాను పూరింపజాలని యశక్తత తెలిపి నారయ గంగన సింగనలను పిలిపించి వేడగా వారు పోతనార్యునికి నమస్కరించి శిథిలభాగములను పూరించిరి.

## దశమాశ్వాసము :

శ్రీనాథుడు పోతన జాడ తెలియుటకు కర్ణాటాధీశ్వరుడగు ప్రౌఢదేవరాయల కడకేగి సింగభూపాలుని స్థితి, ఆంధ్ర భాగవత వృత్తాంతము తెలిపి రాయలవలన పోతన యొంటిమిట్టలో నున్న విషయము తెలిసికొని అక్కడికి పోయి పోతనను కలిసికొనెను. భాగవత వృత్తాంత మెరిగించి శిథిలభాగములను పూరింపుమన పోతన తాను పూరింపజాలని కారణము తెలిపెను. అంతలో భటుడొకడు వచ్చి యిచ్చిన కన్నడరాయల జాబును శ్రీనాథుడు పోతనకు చదివి వినిపించి రానున్న శ్రీరామనవమినాడు శ్రీరామాంకితముగా కృతి సమర్పణోత్సవము నొంటిమిట్టలో రామునిసన్నిధి జరిపింతునన్న రాయల కోరికను పోతనచేత మన్నింపజేసెను. పోతన సింగనృపతి రాజ్యములోని బమ్మెరకు పోనొల్లక కుటుంబమును శ్రీనాథునిద్వారా పిలిపించుకొనెను. పిమ్మట రాయలు శ్రీరామనవమినాడు భాగవతకృతిని తన భద్రగజముపై నూరేగించి తెచ్చి మహావైభవముగా కృతిసమర్పణోత్సవము జరిపించెను. పోతన భక్తితో భాగవతమును శ్రీరామచంద్ర పాదపద్మముల కర్పించి ధన్యుడై భాగవత ఫలశ్రుతిని సభాసదుల కెరిగించెను. పిదప పోతన తాను సకుటుంబముగా నొంటిమిట్టలోనే శేషజీవితము గడపెను ఇట్లు నాయకాభ్యుదయమై కావ్యము శుభాంతమైనది. ఇది కావ్యకథా సంగ్రహము. ప్రకృష్టముగా సర్వాంగ సౌష్ఠవముగా కూర్పబడిన ఈ యితివృత్తము గురించి మున్ముందు చర్చింపబడును.

## IV కావ్యానుబంధము :

రచనా ప్రణాళికలో కడపటిది కావ్యానుబంధము. ఇది కావ్యములలో

అపూర్వమై యొప్పుచున్నది. ఏకాదశ ద్వాదశాశ్వాసములలో ఇంచుమించుగ ఏడు వందల పద్య గద్యములతో విస్తరించి యున్న ఈ భాగమే మను వసుచరిత్రాది ప్రబంధముల యంతయై విరాజిల్లుచున్నది.

ఒంటిమిట్టలో స్వప్నమున శ్రీరామచంద్రుడు భాగవతకావ్య శిథిలావస్థ యెరిగింపగా విలపించుచున్న పోతన కొకయోగి సప్తరాత్రములు భగవదవతార గాథల నాశువుగా కావ్యగాన మొనర్చినచో భగవంతు డాలించి భాగవత కృతి రక్షణ కావించును. గ్రంథ సంక్షేమ వార్త నీకు తెలియునని చెప్పుటచేత పోతన యుపవాస దీక్షబూని ప్రపన్నుడై ఆర్తితో ఆశువుగా గాన మొనర్చిన గాథలే యిందలి విషయములు. ఇందు దినమున కొకటి చొప్పున వరుసగా రామచరితము, మోహిన్యవతారగాథ, వరాహావతారగుణానుభూతి, గజేంద్రమోక్షణ కథ, కృష్ణావతారకథ, రుక్మిణీ కల్యాణగాథ 'భక్తిగాథా నివేదనము' అను పేరుతో శ్రీరామునికి నివేదింపబడినవి.[1]

ఈ భాగవత కథలను కావ్య కథాంతర్భాగముగా రచింపక విడిగా వ్రాసి కావ్యానుబంధముగా చేర్చుటకు కారణమివి పోతన జీవిత చరిత్రకు చెందినవి కాక భగవదవతారకథ లగుటయే. పోతన ఆశువుగా కావ్యగానము చేసినట్లు చెప్పబడిన యీ గాథలను నవమాశ్వాసమున ఆ సందర్భమునచే చొప్పించి యుంచినను పొసగి యుండెడివి. కాని అచార్యులవారు పై కారణమున చివరి రెండాశ్వాసములను కావ్యానుబంధముగా నిల్పినారు. ఈ గాథలు ప్రత్యేకములయ్యు కావ్యమునకు విడివడి యుండజాలవు కావుననే కావ్యానుబంధ విశిష్టములై యొప్పుచున్నవి,

## వస్తుసంవిధాన చాతురి :

కావ్యమునకు శరీరమైన వస్తువుయొక్క నిర్మాణము పోతన చరిత్రమున మిగుల చతురముగా జరిగినది. రచనా ప్రణాళికలో కావ్యకథ వివరింపబడెను. ఆ కథానిర్మాణ చాతురి యెట్టిదో పరిశీలింపవలసియున్నది. ఇందలి కథ సమ్యక్కల్పనా శిల్పరమ్యమై రసభావబంధురమై సముచిత వర్ణనా విలసితమై సందర్భ శోభితమై, కార్యకారణ సంబంధ ప్రకృష్టబంధ విరాజితమై వస్త్వైక్యముతో సర్వాంగసుందరమై యలరారుచున్నది. ఈ యుత్తమగుణములు విలసిల్లుట కాచార్యులవారు చాల మెలకువలు పాటించిరి.

---

1. ఈ భాగవత కథల గురించి ప్రత్యేక వ్యాసము రచింపబడినది కావున నిట చర్చింప లేదు.

పూర్వకావ్యములను పరిశీలించినచో నవి రెండువిధములైనవి గోచరించును. 1. కథా ప్రాధాన్యముగల కావ్యములు. భారత రామాయణాదు లట్టివి. 2. వర్ణనా ప్రధానములైన కావ్యములు. మనుచరిత్రాది ప్రబంధములిందు చేరును. మహాభారతము మున్నగు నితిహాస కావ్యములలో అతి సంగ్రహ వర్ణనలుండి కథయే ప్రధానముగా విస్తరించియుండును. ధర్మములు నీతులు బోధించుటకే యవి ముఖ్యముగా నుద్దేశింపబడినవి ఇక ప్రబంధములను చూచినచో నవి కవులు తమ వర్ణనావైదగ్ధ్యమును శబ్దార్థాలంకార చమత్కారచణత్వమును ప్రదర్శించుటకే వ్రాసినట్లు తోచును. మనుచరిత్ర కాళహస్తిమాహాత్మ్యాది కతిపయ గ్రంథములలో తగిన యితివృత్తము కలదుగాని వసుచరిత్రలో కథ 'అస్తినాస్తివిచికిత్సా హేతుశాత'మై, పోయినది. ఆముక్తమాల్యదలోను కథను కబళించు వర్ణనలే విస్తరించియున్నవి పోతనచరిత్రము పై రెండు విధములకు చెందక కథ, వర్ణనలు సమపాళ్ళలో సమన్వయము గాంచిన సర్వాంగసుందర కావ్యము. ఇట్టి కావ్యమునందలి వస్తుసంవిధాన చాతురిని దిగువ విషయములలో గమనించగలము.

I. వివాదగ్రస్త విషయముల పరిష్కారము.
II. రామభక్తి మహత్త్వాదుల దెల్పు రమ్య సన్నివేశములు.
III. ఔచిత్యదృష్టిలో చేసిన మార్పులు.
IV. ప్రబంధోచిత నూత్నకథా సన్నివేశ కల్పనము.
V. సన్నివేశ కల్పనాశిల్పము.
VI. కథాకథన శిల్పము.

ఈ విషయములను క్రమముగా చర్చింతును.

## I. వివాదగ్రస్త విషయముల పరిష్కారము

పోతన జీవితచరిత్రము గూర్చియు నతని భాగవతము గూర్చియు పండిత లోకమును వేధించు వివాదగ్రస్త విషయములు కొన్ని గలవు. అట్టివానిని గ్రహించి ఆచార్యులవారు కావ్యమున సముచిత కల్పనలు చేసి చక్కని పరిష్కారము కావించియున్నారు. వానిని దిగువ పేర్కొందును.

## వివాదగ్రస్త విషయములు :

1. పోతన తెలంగాణమునందలి బమ్మెర నివాసియా? కడపమండల మందలి ఒంటిమిట్ట నివాసియా ?

2. శ్రీనాథ పోతనలు సమకాలికులా ? సమకాలికులైనను వారికి బాంధవ్య మున్నదా?

3. భోగినీ దండకము పోతన రచనయా ? దానిని రచించి సింగనృపాలున కంకితము చేసిన పోతనకు రాజులపై వైముఖ్యమేర్పడుటకు హేతువేమి ?

4. పోతన భాగవతకృత్యారంభము నందును షష్ఠ్యంతములందును శ్రీకృష్ణుని వినుతించి స్కంధాద్యంతములందు శ్రీరామునేల సంబోధించెను ?

5. విలపించుచు సాక్షాత్కరించిన సరస్వతితో కర్ణాటకిరాట కీచకుల కమ్మనని పోతన చెప్పుటకు కారణమేమి ?

6. భాగవతమునందలి భాగములు కొన్ని శిథిలమగుటకు హేతువేమి? ఆ శిథిల భాగములను పోతనయే యేల పూరింపలేదు?

## పరిష్కారములు :

### 1. పోతన నివాసము :

పోతన తెలంగాణము నందలి బమ్మెర నివాసి యనియు, కడప మండలము లోని ఒంటిమిట్టనివాసి యనియు పండితలోకమున రెండు వాదములు కలవు. ఈ రెంటిలో మొదటి దానినే ప్రబలాధారములతో అత్యధిక సంఖ్యాక పరిశోధక పండితులు బలపరచి నిర్ధారించిన విషయము వెనుక మనవి చేసితిని. ఆచార్యుల వారు దీనినే గ్రహించి పోతన బమ్మెరలోనే పుట్టి పెరిగి భాగవతము రచించినట్లు వర్ణించిరి. కాగా పోతన శిలావిగ్రహ మొంటిమిట్ట కోదండ రామాలయమున నుండుట మున్నగు కొన్ని యుపపత్తుల దృష్ట్యా కవిగా రాలోచించి చక్కని పరిష్కారము చేసినారు.

భాగవతమును కృతిగొను నుద్ధతకాంక్షతో రాచకొండ విజయనగర ప్రభువులు పెనగులాడుటలో సింగనృపాల చమూపతి చేత కృత్యపహృతి జరుగగా

మనసు విరిగి విరక్తుడై పోతన వెడలిపోయి దక్షిణదేశ యాత్రలు చేసి చివరి కొంటిమిట్ట చేరి యచటి రామచంద్రుని సేవించుచు అక్కడనే చరమజీవితము గడపినట్లును, అక్కడి రామునికే భాగవతకృతి సమర్పించినట్లును కవిగారు కల్పన చేసిరి. ఈ సముచిత కల్పనచేత పోతన సకలాంధ్ర కవిగా చిత్రింప బడినందున పోతననివాసము గూర్చిన యుభయవాదములకు సమన్వయభావ మేర్పడినది.

## 2. శ్రీనాథ పోతనల బాంధవ్యము :

శ్రీనాథ పోతనలు సమకాలికులైనను బంధువులు కారని పరిశోధకుల వాదము. కాని జనశ్రుతిలో శ్రీనాథ పోతనల బాంధవ్య కథలనేకములు గలవు. కథాపుష్టికి రసాది నిర్వహణకు కవిగారు వారి బాంధవ్యగాథ నంగీకరించి కావ్యమున చేర్చిరి. నేటివలె ప్రయాణ సౌకర్యములు లేని నాటి కాలమున దూరపుబంధుత్వము సాధ్యమగునది కాదని పండితుల యభిప్రాయము. దీని కాచార్యులవారు శ్రీనాథుడు తీర్థయాత్రలు చేయుచు శైవుడగు తాను శైవమతాచార్యుడగు పాల్కురికి సోమనాథుని సమాధిదర్శనార్థము బమ్మెర మీదుగా పోవుచు పోతనకు పరిచయమై తన చెల్లెలి నతనికిచ్చి పరిణయము చేసెననియు, దూరపు బంధుత్వమునకు తన తల్లి సమ్మతి తెల్పినచో ఆ ప్రాంతముననే కల్గి రాచకొండ సింగ నృపాలుని యాస్థానమున వసించుచు బమ్మెరకు రాకపోకలు చేయదలచినట్లు సముచిత కల్పన కావించినారు. అట్లే అనుశ్రుతిలో నున్నట్లు శ్రీనాథుని పుత్రిక శారదను పోతన కుమారుడగు మల్లనకిచ్చి పెండ్లి చేసిన విషయము వర్ణింపబడినది.

## 3. భోగినీదండక రచన-రాజుల యెడ వైముఖ్యము :

భోగినీదండకము పోతనకృతమనియు, కాదనియు, పోతనకృతమగుచో భక్తుడగు కవి సింగభూపాలుని యెంపుడుగత్తెపై కావ్యము వ్రాయుటేమనియు, అంత ప్రభుభక్తిపరుడగుచో 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి....' యని రాజులను దూషించు వైముఖ్య మేల కలిగె ననియు నిత్యాదిగా విమర్శకుల వాదములు కలవు. ఈ విషయము క్షుణ్ణముగా పరిశీలించి ఆలోచించి చక్కని పరిష్కారము చేసినారాచార్యులవారు,

పోతన యెంబ్రాయమున కవితాభ్యాసదశలో శ్రీనాథుని ప్రోద్బలమున రాచకొండ కేగి రాజదర్శనము చేసినట్లును, అచ్చట శీలవతియు కళావతియు ననన్యచిత్తయు నగు వేశ్యాపుత్రిక లోకోత్తరముగా రాజసభలో నాట్యముచేసి అందు జయదేవుని అష్టపదులు పాడి రాధికగా నటించి మధుర భక్తి రసప్రసారము చేసి భోగినిగా రాజుచేత పరిగ్రహింపబడుట వలన సహజభక్తుడగు పోతనకు సద్భావ మేర్పడి హృదయము పొంగి భోగినీ దండకము వ్రాసి భోగినికి నాయకు డగు సింగనృపాలునే కృతినాయకుని జేసి సమర్పించినట్లును కల్పింపబడినది. భోగినీ దండకము పోతనకృతమే యనుటకు అందలి శైలియే కాక దండకాంత మున రచితమై యున్న దిగువ పద్యము తార్కాణయని పండితులు వ్రాసినది ప్రసిద్ధము.

> "పండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన యా సుధాంశు మా
> ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
> దండకమున్ రచించె బహుదాన విహర్తకు రావుసింగ భూ
> మండల భర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్."

పోతన ఈ పని రాజుపై భక్తి తాత్పర్యము లుండి తత్ప్రేరణచే చేసినది కాదు. అందుకే రాజు తన యాస్థాన కవిమండలి కధ్యక్షునిగా సన్మానము చేయ బూనగా పోతన తిరస్కరించి తన నిరాడంబర జీవనమును వైరాగ్య ప్రవృత్తిని ఆత్మాభిమానమును వెల్లడి చేసెను. పిమ్మట ఆపదలోఁ ఉన్న తనకు రాజుతోడ్పడక పోవుటయేకాక మర్మచ్ఛేదకముగా పరిహసించుటవల్ల పోతనకు రాజుయెడ తీవ్ర వైముఖ్య మేర్పడినట్లు కల్పించిన విషయము యుక్తియుక్తమైనది. పోతన అన్య ప్రేరణవల్లను అజ్ఞానము వల్లను రాజదర్శనము చేసి భోగినీ దండకము వ్రాసి రాజాంకితము కావించినను, అది పొరపాటేయని తర్వాత గ్రహించి తన జిహ్వా పవిత్రమగుటకు గ్రహణస్నానార్థ మేగిన సందర్భమున గంగాభవానిని నోరార వినుతించినట్లు కవిగారు కల్పించిరి.[1] మరియు నింద్రుడు సింగనృపతియై జన్మిం

1. ''అట్టులయైన గంగను మదంబను దావకసత్కృపార్ఘుఁన్
బిట్టుగ సన్నుతింతు మును వీఁటఁడి తేఁడుల వారకాంతలన్
బట్టు వలెన్ నుతించు తటి పంక కళంకిత వాగ్విహారసం
ఘట్టన కాస్పదంబగు నసత్ప్రసనమ్మది పూత మౌనబుల్'' -పోతనచరిత్రము5-35

పగా రంభ భోగినియై పుట్టి వలచి వచ్చిన విషయము కావ్యోపక్రమములో తెల్ప బడిన కల్పనచేత వారి ప్రణయోదంతమగు భోగినీదండకము రచనవల్ల పోతనకు న్యూనత కలుగలేదు.

## 4. ఆంధ్ర భాగవత కృత్యారంభ షష్ఠ్యంతములు :

పోతన శ్రీరామాజ్ఞచేత నతని కంకితముగా భాగవత మాంధ్రీకరించెను.[1] అగుచో భాగవత కృత్యాదియందును షష్ఠ్యంతము లందును శ్రీకృష్ణుని వినుతించి యతడు కృతిపతిగా, స్కంధాద్యంతములలో శ్రీరాముని సంబోధించి అతడు శ్రోతగా పోతన భాగవత రచన యేల చేసెనో పండితులకు తోచక తికమక పడిరి. సమస్యను కవిగారు తమ ప్రతిభాపాటవమున చక్కగా పరిష్కరించినారు.

పోతన భాగవతాంధ్రీకరణమున కుపక్రమించి కృతిపతియగు శ్రీరాముని హృదయమున భావింపగా మోహనాకృతిలో గోపాలుడు ప్రత్యక్షమాయెను. అంతట ప్రాయు గంట మాపి "ఈ వింత యిదేమి నాదయిన వీక్షణ పంక్తులఁ దాండవించు వేదాంతవినోది గోకుల విహారి, రఘూత్తముడేడి? యెంత సేవింతమనన్ గనఁబ డఁడు విస్మయమా నిదియేమి చిత్రమో!"[2] అని చింతించు పోతనకు శ్రీరాముడు కలలో సాక్షాత్కరించి 'విచారించకు. భాగవతమును నేనే విందును. దాని కొక్క నియతికల'దని యిట్లానతిచ్చెను.

> "శ్రీరామాకృతి సీతాభామిని సొమ్మగుట నిట్టి భాగవతకృతిన్
> మామక కృష్ణాకృతిఁగొను సోమస్థితి నిశిని బొందు సూర్యార్చివలెన్''.[3]

అని యంతర్హితుడయ్యెను. అంతలో పోతన మేల్కాంచి సంతోషించి గోపాలుని కృతిపతిని జేసి గ్రంథాదిలో స్తుతించి షష్ఠ్యంతములు రచించి స్కంధాద్యంతము లందు శ్రీరాముని సంధించెను. ఇది కవిగారుచేసినకల్పన. శ్రీరాముడేకపత్నీ వ్రతుడు. శ్రీరామాకృతి సీతాదేవి సొమ్ము. అతడు మరొకరికి భర్తకాజాలడు. కావున భాగ

1. "రామభద్రుండ: మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతముఁ దెనుంగు సేయుము"
-శ్రీ మహాభాగవతము : 1-15
2. పోతన చరిత్రము : 6-107
3. ,, : 6-109

వత కృతికన్యను దక్షిణనాయకమగు తన కృష్ణాకృతితో స్వీకరించును. రాముడు తన యేకపత్నీవ్రత నియమానుసారముగా శ్రోతగనే యుండదలచెను. ఈ కల్పన వల్ల లోక ప్రసిద్ధమైన శ్రీరాముని యేకపత్నీ వ్రతముతోపాటు రామకృష్ణుల యద్వైత తత్త్వము వెల్లడియగుచున్నది. ఇట్టి కల్పన సహేతుకమై సమంజసమై పండితులను కలతపెట్టు సమస్యకు సమ్యక్పరిష్కారము లభించినది.

## 5. సరస్వతీ సమాశ్వాసము :

ఒకప్పుడు సరస్వతి విలపించుచు సాక్షాత్కరింపగా 'కాటుకకంటి నీరు చనుగట్టు పయింబడ నేల యెడ్చెదో.... నిను నాకటికిం గొనిపోయి యల్ల కర్ణాట కిరాట కీచకులకమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!' అని వాగ్దానము చేసి వాణి నోదార్చిన విషయము పోతన చాటువు వల్లను జనశ్రుతి వల్లను ప్రసిద్ధమై యున్నది. ఇది యే సందర్భములో పలికినది ? కర్ణాట కిరాట కీచకు లెవ్వరు ? భాగవతమును కృతిగొన నభిలషించి యతడు సమ్మతింపనందున సింగ భూపాలుడు బలిమిమెయి తెప్పించి పాతిపెట్టించెనను ఐతిహ్యము కలదు కాని కర్ణాట ప్రభువు కోరి బలాత్కరించినాడన్నది అంతగా వాడుకలో లేదు. దీనికి పరిష్కారముగా సింగనృపతి కోరినట్లే కర్ణాటాధీశ్వరుడగు ప్రౌఢ దేవరాయలును భాగవతకృతి నంకితముగొన కోరినాడనియు, శ్రీనాథుడు తొలుత సింగ భూపాలుని కిమ్మని ప్రోత్సహించి దానికి పోతన సమ్మతింపనందున రెండవ మారు, కర్ణాట ప్రభువు పంపిన లేఖ ననుసరించి అతని కంకితమిమ్మని కోరి దానికిని పోతన అంగీకరింపనందున యుక్తి చేసి తిప్పనచేత కర్ణాటాధీశ్వరునికి కృతి యీయ సమ్మతింపజేసినాడనియు, విధిలేక పోతన కృతి సమర్పింప బయలుదేరి మెట్టు కుధరమున ఆగినప్పుడు సరస్వతి యేడ్చుచు కనబడగా పరితప్తుడై 'కర్ణాట కిరాట కీచకులకమ్మ' నని వాగ్దానము చేసి ఆ వాగ్దేవి నోదార్చె ననియు కవిగారు చక్కని కల్పన చేసినారు. ఇది యుక్తియుక్తమై యొప్పు చున్నది.

## 6. భాగవత శైథిల్య వృత్తాంతము :

భాగవతము నందలి కొన్ని భాగము లెట్లు శిథిలమైనవి? శిథిల భాగములను పోతనయే యేల పూరింపలేదు ? శిష్యులగు గంగన సింగన నారయ లేల

పూరించిరి ? అను ప్రశ్నలకు తగిన సమాధానములు దొరకలేదు పండితులలో ఈ విషయ మభిప్రాయ భేదములు కలవు.

కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహములో తెలిపిన దానిని ఒట్టి పోతన కృతి యీయనందుకు కినిసి సింగనృపతి దానిని బలిమి మెయి తెప్పించి పాతిపెట్టించగా కొన్ని భాగములు క్రిమిదష్టము లయ్యెనన్నది లోకమున ప్రసిద్ధమై యున్నది. కవిగారీ కథను గ్రహించి యించుక మార్పు చేసిరి. సర్వజ్ఞ బిరుదాంచితుడు, పండితుడు, కవి పండిత పోషకుడగు సింగభూపతి అంత నైచ్యమున కొడిగట్టినాడనుట అసమంజసమని ఆచార్యులవారు భావించి, రాజు కాంక్షించినాడు కదా యని అతని సేనాపతియే భాగవత మపహరించి తెచ్చి మందసమున దాచి యుంచగా చెదలు పట్టి కొన్ని భాగము లుత్సన్నము లయ్యెననియు, శ్రీరాముడు కలలో గన్పడి తెలిపి హెచ్చరించి చెంపదెబ్బ కొట్టువరకు రాజు కీ విషయమే తెలియదనియు మార్చినారు. దీనిచేత సింగనృపతికి గల కళంకము తొలగిపోయినది.

ఇక శిథిల భాగములను పోతన పూరింపకుండుటకు ఆచార్యులవారు తగిన కల్పన చేసినారు. సింగనృపతి చమూపతిచేత దాచిన భాగవతము తెప్పించి చెదలు పట్టినది చూచి దుఃఖించి తదీయోద్ధరణకు శ్రీనాథునికిచ్చి బమ్మెరకు పంపెను. శ్రీనాథుడు శిథిల భాగములను మల్లనను పూరింపుమన నతడు

> "....మజ్జనకులు లేని యీ వెలితి స్వాంతమునున్ గబళించు, గ్రంథ లే
> ఖన మొనరింప నోప నిఁక గంగన సింగన నారయాళి వ
> క్కన లిఖియించి పంచి త్వరగాఁ బిలిపించెద నంచు వాకొనెన్."[1]

పిమ్మట శ్రీనాథుడు పోతన జాడ తెలిసి ఒంటిమిట్టలో అతని దర్శించి భాగవత వృత్తాంతము తెలిపి శిథిల భాగములను పూరింపుమని యతనిని కోరెను దానికి పోతన నిరాకరించి 'శ్రీరాముని నాజ్ఞలేమి వ్రాయ మీ కృతులనిన నా వలనఁ గా'దని చెప్పి మరియు,

1. పోతన చరిత్రము : 9-380.

"భాగవతమును వ్రాసెడి భాగ్య మిటులు జిక్కెనని యొక్కతఱి
సంతసించు నన్ను
దరిసి శిష్యగణమ్ములో గురువరేణ్య! యీ యదృష్టము మాబోంట్ల
కబ్బునె యన"[1]

'దైవకృపావిశేషము(ం) దప్పక మీకును నట్టి భాగ్యమొక పట్టునఁగల్గవచ్చు'నని యంటిని. అది నేడు సమకూడెను. నాకు సంతోషమైనదని వివరించి చెప్పెను. అంతేకాక తాను పూర్వము రచించినవే కదా! ఆ శిథిల భాగములను స్మరణకు తెచ్చుకొని మరల వ్రాయవచ్చుననుటకు వీలులేదు. శారదామంత్రోపాసనా విషయక బ్రహ్మచర్య దీక్షావ్రతభంగమగుటచేత ధారణాశక్తి కోల్పోయినవాడని కవిగారు కల్పన చేసియుంచిరి. ఈ రీతిగా పోతన జీవితమునకును భాగవతమునకును చెందిన యనేక వివాదగ్రస్త విషయములను చక్కగా పరిష్కరించి సమన్వయము కావించి సమాధానపరచి యున్నారు.

## II. రామభక్తిమహత్త్వాదులు తెలుపు రమణీయ సన్నివేశములు :

సహజ భక్తుడగు పోతన చిదానంద యోగిచేత రామతారక మంత్రతత్త్వోపదేశము శారదామంత్రోపదేశము పొంది నిష్ఠాపరుడై దీక్షతో తపమొనరించి సిద్ధి గాంచెను. ఇష్టదైవమగు రామునిపై అనన్య భక్తి తాత్పర్యము లేర్పడెను. అట్లే ఉపాస్యదైవమగు వాగీశ్వరీదేవిపై భక్తివిశ్వాసములు నిండుగా నుండెను. భక్తిజ్ఞాన వైరాగ్యసంపన్నుడగు పోతనకు శ్రీరామచంద్రుడు పలుమారులు పలువిధముల దర్శనమిచ్చినాడనియు, భక్తజనమందారుడు ఆర్తత్రాణపరాయణుడు అగు ఆ దేవు డాపన్నుడు ప్రపన్నుడు అగు పోతన ననేక సందర్భములలో రక్షించినాడనియు కథలు వాడుకలో గలవు. భక్తిమహిమను చాటునట్టి యిట్టి కథలు పదునొకండు వరకు ప్రచారములో నున్నవి. ఆచార్యులవా రాకథలను చాలవరకు యథాతథముగ గ్రహించియు, కొన్ని నించుక మార్చియు నొండు రెండు నూతన కథలను కల్పించియు సందర్భోచితముగా చొప్పించి సరసముగా వర్ణించి పాఠకలోకమునకు పోతనగారి యెడగల గౌరవాభిమానముల నినుమడింపజేసిరి. ఆ కథలను దిఙ్మాత్ర ముగా పేర్కొందును.

1. పోతన చరిత్రము : 10-40.

## 1. శ్రీరామ సాక్షాత్కారము-భాగవతాంధ్రీకరణాజ్ఞ :

పోతన గౌతమీ తీరమున గ్రహణస్నానానంతరము గంగాధరధ్యానము చేయుచుండ శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించి భాగవతము తనపేర తెనుగు చేయుమనియు దానిచేత అతని భవబంధములు తెగుననియు దయతో ఆనతిచ్చిన వృత్తాంతము పోతన జీవితము నందలి ప్రప్రథమ శ్రీరామచంద్ర సాక్షాత్కారోదంతము. ఇది రామతారక శారదామహామంత్రముల సిద్ధికి నిదర్శనమై, గ్రంథ మంకితము కోరబడి రాముని యనుగ్రహమునకు, శ్రీమహాభాగవత మాంధ్రీకరింప సెలవగునంతటి మహాకవిత్వ శక్తి యబ్బుటవల్ల శారద అనుగ్రహమునకు పోతన పాత్రుడాయెను. ఈ యుదంతము తాను భాగవతమున దెలుపుకొనిన చారిత్రక విషయమును వాస్తవముగా చిత్రించినది.

## 2. శ్రీరాముడు భిక్షుక రూపమున వచ్చి గంట మిచ్చుట:

భాగవతాంధ్రీకరణకు ముందు చెలరేగిన క్షామకాలమున బిచ్చమడుగుచున్న భిక్షుకుని లోభిసెట్టి కొట్టబోగా అడ్డము వచ్చి ఆ దెబ్బకు తాను గురియై వానిని కాపాడి ఆదరించిన పోతనకా బిచ్చగాడు కృతజ్ఞతతో తనకు దొరికిన ఇనుపకడ్డి యని గంటమిచ్చి తర్వాత పోతన యింటివద్ద నుండి వెడలి యదృశ్యమైపోయెను. శ్రీరాముడే భిక్షుక రూపమున వచ్చి భాగవత లేఖనమునకు గంట మిచ్చిపోయెనని గ్రహించి పోతన అతనిని సేవింపలేకపోయితినని చింతించెను. అతడు రాముడే యనుటకు సూచనగా పోతన తన భార్యతో అతని కన్నము పెట్టుమని యతని గూర్చి అప్రయత్నముగా చెప్పిన దిగువ మాటలు ధ్వని గర్భితములై యున్నవి.

> "కన వశమ్ముగా దీతని గతిఁదలంపఁ జెప్ప వశముగా దీతని స్థితినిగాంచ
> నితని లక్ష్యమ్ము నిడువార లెవరుగలరు? మానినీ! తానితఁడు నొక్క
> మానవుండె "[1]

అట్టి కైతవభిక్షుప డదృశ్యమై యెంత వెదకినను జాడకానరాక పోతన "పేలిక ప్రేలు మూఁపు ... పైఁదేలిన శల్యసంతతుల దిక్కఁటియున్న కుచేలు రూపు, కెంగేలున గంటమించి తిలకించిన శ్రీపుఁ గృపాప్రదీపునిన్" తలచి తలచి విలపించి

1. పోతన చరిత్రము : 5-261.

"అన్యు(డెవండు గంటము సమర్పణముంబొనరించు నాకహో!
ధన్యము నాదుజీవితము తాపక సేవన మిట్లనన్య సా
మాన్యము కండ్లనాడెడి యమానుషభిక్షుక! నీకుఁ గావ్యపుం
గన్యనొసంగి పట్టమును గట్టెద శాశ్వత సాహితీమహిన్."[1]

అని భక్తిపరవశుడై తలపోసెను. ఇది ఆచార్యులవారు కల్పించిన ఔచితీవిలసిత సన్నివేశము.

## 3. భాగవతాంధ్రీకరణారంభమున రాముని స్వప్నసాక్షాత్కృతి :

పోతన భాగవత మాంధ్రీకరింప నుద్యుక్తుడై భావమున శ్రీరాముని సన్నిధానము కల్పించుకొనగా మనోజ్ఞరూపమున శ్రీకృష్ణుడు దర్శనమిచ్చెను. అతడు విస్మితుడును విచారచిత్తుడునునై వ్రాయు గంట మాపి ఆ రాత్రి నిద్రింప శ్రీరాముడు స్వప్నమున గన్పడి తన శ్రీరామాకృతి సీతాదేవి సొమ్మగుట చేత తన కృష్ణాకృతి భాగవత కన్యను స్వీకరించుననియు, తాను శ్రోతగా నుందుననియు ఆనతిచ్చెను. ఇది వరదాచార్యులవారు కల్పించినదై వివాదగ్రస్త విషయమునకు చక్కని సమాధానము చెప్పునదై యొప్పినది.

## 4. భాగవతరచనలో 'అలవైకుంఠపురంబులో' అను పద్యమును శ్రీరాముడు పూరించుట :

భాగవతములో గజేంద్రమోక్షణకథ వ్రాయుచు 'అల వైకుంఠపురంబులో' అను పద్య మింతమాత్రమే వ్రాసి ఆవల తోచక కట్టిపెట్టి పోతన పొరుగునగల యొక పల్లెకు పోగా రాముడు రామశర్మయను పేరుతో బ్రాహ్మణరూపమున వచ్చి మల్లనతో మాట్లాడి దేవతార్చన వద్దనున్న భాగవతకోశమును విప్పి చూచి పై పద్యమును పూరించి యుంచి వారింట భుజించి వెడలెను. పిదప పోతన వచ్చి పూరిత పద్యమును గాంచి విస్మితుడై రామశర్మ రాక విషయము తెలిసి శ్రీరాముడే విప్రుడుగా వచ్చి పద్యపూరణము చేసి పోయెనని యత్యంతభక్తి

1. పోతనచరిత్రము : 5-288.

పరవశుడై స్తుతించెను. భక్తుని లోపాలోపములను భగవంతుడు పూరించు నన్న దానికిది నిదర్శనము. వాడుకలోగల యీకథ యథాతథముగా గ్రహింపబడినది.

## 5. రుక్మిణీకళ్యాణకథా రచనలో ప్రత్యక్షానుభవము :

పోతన భాగవతము రచించునప్పుడు తాను చెప్పినదెల్ల ప్రత్యక్షముగా జరుగుచుండెననుటకు తార్కాణగా రుక్మిణీ కల్యాణఘట్టమున 'దేవకీసుతు కోర్కెతీఁగెలు వీడఁగ....' అను పద్యమున 'బాలకమరె' నని చెప్పగా పోతన కూతురు లక్ష్మి కుంపటిలో బడి కమరెననియు, అదే పద్యమున పిదప 'పద్మనయను వలనఁ బ్రమదంబు నిండార నెలఁత యౌవనంబు నిండియుండె'నని చెప్పగా లక్ష్మి మరల ఆరోగ్యవతియై జీవించెననియు నైతిహ్యము కలదు. ఇది వాడుకలోని కథను యథాతథముగా వర్ణించినది. దీనివల్ల పోతన వాక్శుద్ధి, కవితాసిద్ధి, రామానుగ్రహము వ్యక్తమగుచున్నవి.

## 6. శ్రీహరి వరాహరూపమున భాగవతకృతి రక్షణ చేయుట :

సింగనృపతి ఆనతిపై తచ్చమూపతి బమ్మెరకు వచ్చి, రామాలయమున భాగవత కావ్యగానము చేయుచున్న పోతనను రాచకొండకు రమ్మని కోరి, పోతన నిరాకరింపగా కుపితుడై భాగవతమును బలిమిమెయి లాగుకొని పోవోవ, గ్రామమునందలి యువకవీరుడడ్డుపడి పోరాడెను. అదే సమయమున అటువైపు పచ్చు పందుల మందనుండి యొక మేటివరాహము విజృంభించి సేనను చెల్లాచెదరు చేయగా సేనాపతి భాగవతమును విడచి పారిపోయెను. ఆ వరాహము చూచుచున్నంతలో కదలిపోయి యదృశ్యమాయెను. ఈ కథ యించుక మార్చబడినది. భాగవతమును తనకు కృతియిచ్చుటకు సన్మతింపని పోతనను బంధించి తెచ్చుటకు కర్ణాటాధీశ్వరు డాజ్ఞాపింప పోతన యింటివద్దకు పోయిన తదీయసేనలను విష్ణుమూర్తి యజ్ఞవరాహరూపమున వచ్చి పారద్రోలి పోతనను కాపాడెనను జనశ్రుతికలదు. ఇది పైరీతిగా నిసర్గరమణీయముగా నుండునట్లు మార్పు కావింపబడినది.

## 7. సరస్వతీదేవి జంగమకన్యగా వచ్చి శ్రీనాథునికి పోతన మనోనిశ్చయ మెరిగించుట :

సింగనృపాలుడు భాగవత మంకితము గొను కాంక్షతో పంపగా శ్రీనాథుడు బమ్మెరకు బయలుదేరి వచ్చుచు మార్గమధ్యమున నొక తోటలో విడిసియుండ నొక సుందరి వచ్చి శ్రీనాథుని దర్శించి తానా తోట యజమాని యగు జంగమ మఠపతి పుత్రికనని చెప్పి పోతన భాగవతమును నరాంకితము చేయడని నిర్ధారించి పలికి యతని చేతివ్రేలికి రత్నాంగుళీయకమును సమర్పించి వెడలిపోయెను. శ్రీనాథుడు తర్వాత జంగమ మఠపతివలన ఆమె యతని సుతకాదని తెలిసి విస్మితుడై సరస్వతీదేవియే అట్లు వచ్చి పోతన మనోనిశ్చయము చెప్పిపోయెనని తల పోసెను. ఈ వృత్తాంతము కేవలము కవికల్పితము. ఈ సన్నివేశకల్పనమువల్ల పోతన భాగవతమును నరాంకితము చేయడను భావికథార్థమును సూచించుటయే కాక యుపాస్యదైవ మగు వాగ్దేవి పోతన ననవరతము కనిపెట్టియుండి కాపాడు ననుటయు ద్యోతకమగుచున్నది. భక్తుడగు పోతన భాగవతము రామాంకితము చేయ నిశ్చయించిన సత్సంకల్పము విఫలము చేసి నృపాలాంకితము చేయించ బూనిన యసత్ప్రయత్నమును శారదాదేవి స్వయముగా కుంఠిత మొనర్చి శ్రీనాథుని నిరుత్సాహపరచుటకే జంగమకన్యారూపమున వచ్చెను. సమంజసమైన యీ కల్పన కథను పటిష్ఠము చేయుచున్నది.

## 8. మల్లనార్యుడెడ్లను విడిచి నాగలిని సాగించుట :

శ్రీనాథుడు బమ్మెరకు చేరవచ్చి యూరివెలుపల మడి దున్నుచున్న మల్లనను చూచి పోతన హాలిక వృత్తి నపహసించగా అతడు 'బాలరసాల సాల.... నిజదారసుతోదరపోషణార్థమై' యని రాజుల నాశ్రయించి పాపపు కూడు తినుట కంటె సత్కవులు హాలికులైనను కందమూలకౌద్దాలికులైనను మేలని నుడివి తన జనకుని మహిమను వర్ణించెను. శ్రీనాథు డీర్ష్య చెంది దర్పించి నా మహిమ చూడుమని భారతీదేవిని ధ్యానించి తన పల్లకి కొకవైపున బోయీలను తొలగించి దానిని నడపించెను. మల్లన అది చూచి తన తండ్రి రామభక్తి ప్రభావ మాత్మలో దలచి మ్రొక్కి యొక యెద్దును విడచి నాగలి నడపించెను. శ్రీనాథుడు రెండవ వైపు బోయీలను కూడ తొలగించి పల్లకిని నడపించగా మల్లన రెండవ ప్రక్క యెద్దును

కూడ వదలి హలము నడపించెను. జనులు మహాశ్చర్యముతో చూచిరి. శ్రీనాథుడు పరాభూతుడయ్యెను. జనశ్రుతిలోని యీ కథను కవిగారు గ్రహించి యించుక మార్పుతో వర్ణించిరి. శ్రీనాథుడు పోతనను హేళనచేసి బోయీలులేని పల్లకిని నడపి తన మహిమ చూపగా పోతన తానెడ్లులేని నాగలి సాగించి తన మహత్తు చూపెనన్నది వాడుకలో నున్న ఉదంతము. ఇక్కడ శ్రీనాథునితో వివాదపడి ప్రతిమహిమ చూపినవాడు మల్లనయని పోతన ఔదాత్త్యమును పోషింప ఔచితీ మంతమగు మార్పును కవిగారు చేసిరి. ఇందు పాండిత్య కవిత్వ శక్తులచే విఱ్ఱవీగుటయే కాక రాజాశ్రయ భోగములే శ్రేష్ఠములని తలంచు శ్రీనాథునికి తగిన బుద్ధి చెప్పి శృంగభంగము చేయుట జరిగినది. రాముని, ధాత్రిని నమ్ముకొన్న పోతన శ్రీనాథుని కెందును తీసిపోడనుటయే కాక పైచేయి యనియు నిరూపింప బడినవి.

## 9. జ్యోతిపురరాజ్ఞి సహస్ర భోజన మిడుట :

శ్రీనాథుడు వేయిమంది పరివారముతో రాజలాంఛనములతో పోతన యింటికి వచ్చి శారదను మల్లనకిచ్చి పెండ్లి చేయ లగ్ననిశ్చయమునకు వచ్చితినని చెప్పెను. శ్రీనాథుని పరివారమున కాతిథ్యమొసగుటకు ఇంట నేమియు లేమి పరితపించుచు పోతన వాగ్దేవిని ప్రార్థించెను. అంతలో జ్యోతిపురరాజ్ఞియను నొకరాణి వచ్చి తాను పాల్కురికి వేల్పగు ఈశ్వరునిగాంచి పోతనగారి ప్రశస్తివిని వారిని దర్శింప వచ్చినట్లు తెలిపెను. భాగవతమున మోహిన్యవతారగాథ వినిపింపగోరెను. మరియు శివార్పణగా సహస్రభోజనము నిర్వహింపదలచిన విషయము విన్నవించెను. అయాచితముగా ఆ రాణి సమకూర్చిన పదార్థములచేత పోతన శ్రీనాథ పరివారమునకు భోజనముపెట్టి భాగవతమును వినిపించి రాణినంపెను. అనుశ్రుతిలో ఈకథ కించిదన్యముగా నున్నది శ్రీనాథుడు సపరివారముగా పోతన యింటికి వచ్చినప్పుడు శ్రీవిష్ణువు పోతనరూపమున వచ్చి వలయు భోజనపదార్థము లిచ్చిపోయెనని వాడుకలో నుండ జ్యోతిపురరాజ్ఞి వచ్చియిచ్చెనని కవిగారు మార్చిరి. ఈ మార్పు సరసముగా సమంజసముగా నున్నది. సరస్వతియే జ్యోతిపురరాజ్ఞిగా వచ్చెననుట కానామమే ఆమెను స్ఫురింపజేయుచున్నది. ఆపత్కాలమున అఖిలభువనరాణి ఆదుకొన్నదనుట కిది చక్కని నిదర్శనము.

## 10. సరస్వతి విలపించుచు పోతనకు సాక్షాత్కరించుట:

పోతన అన్నగారిమాట జవదాటలేక కర్ణాట నృపాలునికి భాగవతము సమర్పింపబోవుచు మార్గమధ్యమున మెట్టుగుట్టచేరి యందు వెలసియున్న రామచంద్రుని సేవించి తన దుర్విధికి దుఃఖించుచుండ సరస్వతీదేవి భావవీథిని ప్రత్యక్షమై నన్ను రాజుల కమ్ముదువా యని విలపించెను. పోతన మిక్కిలి పరితప్తుడై 'కాటుకకంటినీరు .... నిను నాకటికింగొనిపోయి యల్ల కర్ణాటకిరాట కీచకులకమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!' అని వాగ్దానముచేసి ఆమె నోదార్చెను. జనశ్రుతిలోని యీ వృత్తాంతమును యథాతథముగా గ్రహించి కవిగారీకథకొక చక్కని భూమిక కల్పించినారు.

## 11. సింగభూపాలుని కలలో రాముడు కనబడి శిక్షించుట:

పోతన దక్షిణ తీర్థయాత్రలు కావించి ఒంటిమిట్టచేరి అచటి రఘురాముని సేవించుచు వసించుచుండ ఆ దేవుడు కలలో కన్పడి భాగవతకృతి శిథిలమగుచున్న వృత్తాంతము చెప్పగా అదలిపోయి గ్రంథక్షేమము తెలియువరకు భుజింపనని శోకించుచు వ్యాస భాగవత పారాయణము చేయుచుండి యొక యోగి ప్రబోధము ననుసరించి విష్ణుమూర్తి అవతారగాథలు ఏడురాత్రులు లాళువుగా గానము చేయ శ్రీరాముడు సింగనృపతి కలలో గన్పడి నా కృతికన్యను చెరబట్టి నీవేమి కీర్తిగాంతువని లెంపవాయించి హెచ్చరించెను. రాజు మరునాడు సభలో శ్రీనాథుని వలన స్వప్నఫలము తెలిసికొని భాగవతోద్ధరణకు పూనుకొనెను. అనుశ్రుతిలో రాముడు సింగనృపాలుని భార్యకు కలలో కన్పడి భర్తకుచెప్పి భాగవతమును పునరుద్ధరింపజేయవలెనని ఆనతీయగా ఆమె రాజుకు చెప్పి చేయించినట్లు కలదు. దీనికి వైరీతిగా మార్పుచేయబడినది. ఇది ప్రపన్నుడగు భక్తకవిని అతని కృతిని సంరక్షించిన శ్రీరాముని ఆర్తత్రాణపరాయణత్వమును నిరూపించుచున్నది. ఇట్లు పోతనగారి రామభక్తి మహత్త్వాదులను దెలుపు కథలను యథోచితముగా వర్ణించి కథానాయకుని వైశిష్ట్యమును పోషించి కావ్యమునకు వన్నెచేకూర్చుట జరిగినది.

## III. ఔచిత్య దృష్టితో చేసిన మార్పులు :

ఆచార్యులవారు పోతన జీవితమునకు చెందిన చారిత్రకాంశములను అనుశ్రుతిలోని కథలను గ్రహించి కావ్యమున యథాతథముగనేకాక ఔచిత్యదృష్టితో కొన్నిటిని కొంతమార్చి వర్ణించిరి. వానిని సంగ్రహముగా సమీక్షింతును.

పోతన జీవితమున వివాదాస్పద విషయములలో భక్తిమహత్త్వాదుల దెల్పు కథలలో కవిగా రౌచిత్యదృష్టితో చేసిన మార్పులను వివరించియుంటిని. చర్విత చర్వణముకాకుండ వానిలోని ముఖ్యవిషములను పేర్కొని ఇతరత్ర చేసిన మార్పులను వ్రాయుదును.

1. భాగవతమును తనకు కృతియీయ నిరాకరించిన పోతనను పట్టితెచ్చుటకు కర్ణాటాధీశ్వరుడు పంపిన సైన్యమును పోతన యింటివద్ద శ్రీహరి యజ్ఞవరాహ రూపమున నిల్చి పారద్రోలి పోతనను రక్షించెనన్నదానిని బమ్మెరలోని రామాలయమున భాగవతము వినిపించుచున్న పోతనవద్దకు సింగనృపతి సేనాపతివచ్చి, రాజాజ్ఞ ధిక్కరించిన పోతనగారి భాగవత మపహరింపబూనిన యెడ నొక మందలోని వరాహము చెలరేగి సైన్యమును తరిమి భాగవతమును కాపాడెనని చేసిన మార్పు.

2. బమ్మెరకు వచ్చిన శ్రీనాథుడు పొలములో పోతననుగాంచి యతని హాలికత్వమును గేలిచేసి తన మహిమను బోయీలులేని పల్లకి నడపించి చూపగా పోతన యెడ్లులేని నాగలిని నడపించి తన మహిమను చాటెనని యున్న యను శ్రుతి గాథలో పోతనకు మారుగా మల్లన తన్మహిమను ప్రదర్శించెనని చేసిన మార్పు.

3. సహస్రజన పరివృతుడై వచ్చిన శ్రీనాథునికి విందీయుటకు వలయు పదార్థములను పోతన రూపమున హరివచ్చి యిచ్చి వెళ్లెనను అనుశ్రుతి కథలో జ్యోతిపురరాజ్ఞి వచ్చి భోజన పదార్థము లిచ్చిపోయెనని చేసిన మార్పు.

4 భాగవతమును సింగభూపాలుడు కాక అతని సేనాపతి అపహరించి తెచ్చి రాజునకు తెలియకుండ దాచిపెట్టగా శిథిలమయ్యెనని చేసిన మార్పు.

5. భాగవతము శిథిలమగుచున్న వేళ రాముడు సింగనృపతి భార్యకుకాక ఆ రాజునకే కలలో గన్పడి హెచ్చరించినటుల చేసిన మార్పు. ఇవి యింతవరకు వివరింపబడిన వృత్తాంతములలోనివి. దిగువ నొక నూత్నాంశమును తెల్పుదును.

6. పోతన గజేంద్ర మోక్షణకథ వినిపించగా శ్రీనాథుడు 'సిరికిం జెప్పడు....' అన్న పద్యము నధిక్షేపించెను. పోతన శ్రీనాథుని సమాధాన పరచుట కతని సుతను దాచియుంచి ఆయన భోజనము చేయువేళ నూతిలో బండ వైపగా అత దదరిపడి తటాలున భోజన మాపి నూతి వద్దకు పరుగెత్తుకొని వచ్చెననియు దానికి పోతన నూతినుండి కూతునుదీయ త్రాడు బొక్కెన యేవి? పట్టి చేతులతో వచ్చి యేమిచేయుదువని పరిహాస మాడి హరియార్తత్రాణ సంరంభము నవగాహన చేయించెననియు కథ వాడుకలో గలదు. ఇక్కడ పోతన కృత్రిమముగా నొక సన్నివేశమును కల్పించినాడనుట ఆచార్యులవారికి నచ్చక ప్రకృతి సిద్ధముగా అది యమరినట్లు చక్కని కల్పన చేసినారు. శ్రీనాథ పోతన లుపాహారము సేవించువేళ ఇంటి పెరటిలో లక్ష్మిశారదలు పూల మొక్కలకు నీళ్లుపోయుచుండిరి. పందెము వైచి శారద నీళ్లు చేదుచుండ త్రాడు తెగి బొక్కెన బావిలో పడగా శారదయే పడె ననుకొని యందరు పరుగెత్తుకొని బావికడకు వచ్చిరి. అప్పుడు పోతన శ్రీనాథునితో

> "తన బిడ్డ నూతఁబడెనని వినుతోడనె బావిదరికి వెసనుఱికి యుర
> మ్మను బాఁదుకొనుచు నేడ్చెడి జననికిఁద్రాళ్లుగొనిచను విచార మొలయునే"[1]
> "తలఁగొట్టుకొనుచు సుతకై విఁపించెడి తల్లిఁగాంచి హృదయంబ్డితరుల్
> తలపైఁబడి వచ్చినచోఁ దెలియున్ దమకపుడు కడుపుతీపి యన నెదో"[2]

అని వివరించి 'సిరికిం జెప్పడు....' అన్న పద్య విషయము శ్రీనాథునిచేత సమ్మతింప జేసెను. ఈ మార్పు వల్ల పోతన యౌదాత్త్యము పోషింపబడి కథకు శోభ కలిగినది.

ఆనందవర్ధనుని 'ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిం' అను నిబంధన ననుసరించి యౌచిత్యశోభితములగు నిట్టి మార్పులవల్ల ఆయా పాత్రలకు సన్నివేశములకు మేలిమి యొనగూడి కావ్యసౌందర్య మినుమడించి రసవ్యంజకత్వ మలరారు చున్నది.

## IV. ప్రబంధోచిత నూత్నకథా సన్నివేశ కల్పనలు :

పోతనచరిత్రమున పోతనగారు భాగవతమున చెప్పికొన్న విషయములు, చరిత్రకారులు పరిశోధించి వెల్లడిచేసిన విషయములు, జనశ్రుతిలోని విషయములు

1, 2. పోతన చరిత్రము : 8-334, 335.

సమకూర్చుకొని సముచితమైన మార్పులతో చక్కని సమన్వయముతో ఇతి వృత్తము సిద్ధము చేసికొనుటలో కవిగారు మిక్కిలి జాగరూకత వహించినారని మనవి చేసితిని. కాగా ఒక మహాప్రబంధము నిర్మించు తలంపుగొనిన కవిగారు పై త్రివిధ విషయములనే కాక ప్రబంధోచితముగా కొన్ని నూతన కథా సన్నివేశ ములను కల్పించి వస్తువునకు సారస్యము సమగ్రత్వము సంతరింపజేసిరి.

'ప్రబంధ కల్పనామ్ స్తోకసత్యాం ప్రాజ్ఞాః కథాం విదుః' అని చెప్పబడినట్లు ప్రబంధమునందు అయథార్థవిషయము లుండవచ్చును. కాగా అవి యథార్థముల వలె భాసింపవలెను. ఆరీతిగా కల్పించి వర్ణించినచో అవి గణములై కృతికి శోభను కలిగించును. కావున ఆచార్యులవారు కావ్యవిశిష్టతకు దగిన కల్పనలు కొన్ని చేసి యున్నారు. అట్టివి దిగువ పేర్కొనబడినవి.

1. పోతన బాల్యమున చూచిన పాల్కురికి జాతర.
2. చిదానంద దర్శనము, రామతారక శారదామంత్రోపదేశములు.
3. పేద జవరాలి మానహరణ కథ.
4. లక్కమాంబా కేసనల తీర్థయాత్రాగమనము.
5. పోతన దంపతుల సమాగమ వృత్తాంతము.
6. శ్రీనాథుని భార్యావియోగ కథనము.
7. పోతన జననీజనకుల మరణ కల్పనము.
8. పోచయ్య యను కాపు కథ
9. భిక్షుక వృత్తాంతము, లోభిసెట్టి కథ.
10. శారదా దుస్స్వప్న కథనము.
11. జంగమ కన్యోదంతము.
12. జ్యోతిపురరాజ్ఞీ వృత్తాంతము.

వీనిని సంగ్రహముగా చర్చింతును.

## 1. పోతన బాల్యమున చూచిన పాల్కురికి జాతర :

పోతన చరిత్రమున పాల్కురికికి ప్రముఖస్థాన మీయబడినది. నాయకుని జన్మ నివాసస్థానమగు బమ్మెరగ్రామము కేంద్రముగా కథ సాగినను అప్పటి వరకప్రసిద్ధముగానున్న బమ్మెరకు పొరుగునగల పాల్కురికిగ్రామము సోమనా

రాధ్య కవీంద్రుని జీవితమువల్ల ప్రశస్తిగాంచి సమారాధితమగు అతని సమాధి యచటనుండుట వల్లను శైవ క్షేత్రమై విరాజిల్లుటచేతను అది యాత్రాస్థలమై ఆ గ్రామ ప్రసక్తి మాటిమాటికి కథలో వచ్చినది. చిదానందయోగి, శ్రీనాథుడు, జ్యోతిపురరాజ్ఞి వంటివారు పాల్కురికి సందర్శింప బోవుచునే బమ్మెరకు వచ్చి పోతనను దర్శించిరి.

ఏవంవిధ ప్రఖ్యాతిగాంచిన పాల్కురికికి పోతనబాల్యమున తల్లిదండ్రులతో గూడి శైవసంబంధమగు జాతర చూడబోయెను. జాతరలో చూచిన వింతలు ముఖ్యముకావు కాని అక్కడ ప్రదర్శించిన వీథి భాగవతమును చూచి చోద్యముగా పోతన ప్రశ్నింప తల్లి సముచిత సమాధానములిచ్చి చేసిన ఆ వీథిభాగవతమునకు చెందిన వేదాంతవ్యాఖ్య, తత్త్వోపదేశము, జీవేశ్వరులకు ప్రకృతికి సంబంధించిన సమన్వయము, జనన మరణముల స్వరూప నిరూపణము మున్నగునవి ముఖ్యమైనవి. ఈ పాల్కురికి జాతర సందర్శన వృత్తాంతము ప్రధానకావ్య కథకు సంబంధమున్నట్లు తోచదుగాని యిది పోతనకు బాల్యముననే భాగవత తత్త్వము వేదాంతచింత యేర్పడి భక్తి జ్ఞాన వైరాగ్య విలసితమగు భవిష్యజ్జీవితమునకు పునాది యేర్పడి పాత్రపోషణ కుపయోగపడుచున్నది. బమ్మెరకు తిరిగివచ్చు నప్పుడు దారిలోని మావితోటను కేసన వర్ణించిన వృత్తాంతము బాలునిలేతయెదలో కవితాభిరుచికి బీజములు పడునట్లు చేసినది.

## 2. చిదానందదర్శనము - రామతారక శారదా మంత్రోపదేశములు :

పోతనకు తారుణ్యదశలో చిదానందయోగి దర్శనమై రామతారకమంత్రోపదేశము లభించెనను ఐతిహ్యము కలదు. ఆ యోగి పోతన ఆతిథ్యమునకు సౌజన్యమునకు అలరి యతని భవిష్యత్తును దివ్యదృష్టి దర్పణమున కాంచి అతడు కారణ జన్ముడని గ్రహించి అపారకృపతో తానే శారదామహామంత్ర ముపదేశించి తత్సిద్ధికి ద్వాదశవర్ష బ్రహ్మచర్యవ్రతదీక్ష నాదేశించెను. ఈ విషయములు కవి గారు కల్పించినవి. ఇవి కథకు చాల ముడిపడియున్న విషయము వెనుక వివరించి యుంటిని.

## 3. పేదజవరాలి మానహరణ కథ:

పోతన చేలకడ ప్రకృతిదృశ్యములు చూచి యెదపొంగి పద్యములువ్రాసి తిప్పన్నకు వినిపింప ఇంటికి పోవుచుండ వీథిలో ఒక పేదజవరాలు కన్పడగా 'పొంగు యౌవనమును కొంగు చాటొనరించు మాత్రముడుపులేక' సిగ్గుతో పోవు చున్న శీలవతిని జూచి జాలిపడి మానరక్షణమునకై తనమీది ఉత్తరీయమిచ్చి, కూలిగింజలకొరకు పోవగా ఆయూరి యువక భూస్వామి ఆమెను మానభంగము చేయ యత్నింప తప్పించుకొనివచ్చిన ఆమె విషాదగాథ విని పరితప్తుడై ఆ దంప తుల నోదార్చి ఇంటికి గొంపోయి ధాన్యమిచ్చి పంపెను. పిదప తన మిత్రుడగు ఆ భూస్వామి వద్దకుపోయి యొక హితోపదేశ కవిత వినిపించి యతని మనసు మార్చెను.

ఈ వృత్తాంతము ప్రధానకథ కంతగా సంబంధమున్నట్లు కానరాదు. కాని పోతన గుణశీలము నిది యద్దముపట్టి చూపునదియేకాక మున్ముందు దీని ప్రయోజ నము కానవచ్చును. పోతన కడుంగడు సాధువర్తనుడను ప్రతీతికలదు. అతని వ్యక్తి చిత్రణము పాత్రపోషణకీ కథను కవిగారు కల్పించి తర్వాతి కథలో ఒక ప్రయో జనమును సాధించిరి. ఈ యుదంతము వల్ల గ్రామీణ స్త్రీల సౌశీల్యము విశదమగు చున్నది. పోతన కరుణార్ద్రహృదయము, శీలము వ్యక్తమగుచున్నవి. శృంగార నైషధ కావ్యపఠనమువల్ల కామోద్రేకియైన యువక భూస్వామికి సముచిత హితోప దేశక కవిత వినిపించి మనసు మార్చుటచేత పోతన కవిత శక్తిమంతమై ప్రభావ పూర్ణమై శ్రేయస్కరమై భాగవతరచనకు యోగ్యమైనదని ధ్వనించుచున్నది. ఈ పేద జవరాలు తరువాత కొలువు మాని పందుల పెంపకముతో స్వచ్ఛంద జీవి తము సాగించుచు కాలాంతరమున రాచకొండ సేనాపతి భాగవతకోశ మపహరించు వేళ చూచి నాటి పోతన మేలు మరువక తన కుక్కనుసికొల్పుటచేత అచటగల మేటి వరాహము విజృంభించి సైన్యమును పారద్రోలి భాగవతమును రక్షించెను. ఇట్లప్రధానమైన జవరాలికథచేత నొక ప్రయోజనమును సాధించినా రాచార్యులవారు.

## 4. లక్కమాంబా కేసనల తీర్థయాత్రాగమనము:

పోతన వివాహమై దంపతుల నొక్కటిచేయు నాటికి శారదా మంత్రో పాసనా బ్రహచర్య వ్రతదీక్షబూని పదునొకండేండ్లు గడచెను. తత్తపోభంగము

నకు వెఱచి పోతన తొలిరేయి భార్యతో నేమియు పలుకక పడుకొనెను. రోజులట్లే దొరలుచుండెను. కోడలి మనోవ్యథ గ్రహించి తదీయ నివారణార్థము పోతనకు భార్యతో ఏకాంతము సాగించు అవకాశము కల్పించుటకు లక్కమాంబ పెనిమిటితో పెద్ద కొడుకుతో కలిసి తీర్థయాత్రలకు బయలుదేరెను. ఈ యాత్రాకల్పనవల్ల పోతన గత్యంతరములేక సతితో సన్నిహితముగ మెలగి ఆమె నేలుకొనుటకు వీలేర్పడుట యొకటి. లక్కాంబను యాత్రలలో శ్రీశైలమల్లికార్జునునికి వంశాంకురమును ప్రసాదింప మ్రొక్కుకొనుట కవకాశము కలుగుట రెండు. క్రమముగా లక్కమాంబ కోరిక నెరవేరెను.

## 5. పోతన దంపతుల సమాగమ వృత్తాంతము :

పోతన దంపతుల నొక్కటి చేసినది మొదలుకొని నర్సమాంబ వానలో తడియుచు పొలము వద్దకు వచ్చినప్పుడు పోతన యనురక్తుడై వివశుడై ఆనాటి రాత్రి ఆమెతో సమాగమమగు వరకుగల ప్రణయోదంత మెల్ల ఆచార్యులవారు ప్రబంధోచితముగా కల్పించి రమ్యరమ్యముగా రసోదంచితముగా వర్ణించిరి. ఇక్కడి యీ సన్నివేశవర్ణనము సభ్యశృంగారమునకు పెట్టినదిపేరై యొప్పారు చున్నది. ఈ కల్పనవల్ల పుత్రోదయప్రయోజనము కలిగినను తపోభంగమై పోతన ధారణాశక్తిని కోల్పోయిన వాడయ్యెను. అది భవిష్యత్తులో భాగవత శిథిల భాగములను పూరింపజాలని పరిస్థితికి హేతువయ్యెను.

## 6. శ్రీనాథుని భార్యా వియోగ కథనము :

పోతనకు మల్లనపిదప లక్ష్మి జన్మించిన కొంతకాలమునకు శ్రీనాథుడు భార్యా వియోగదుఃఖముతో కూతురు శారదను తోడ్కొని పోతన యింటికి వచ్చెను. దుఃఖవివశుడై యున్న శ్రీనాథుని పోతన వైరాగ్యముచేత నోదార్చెను. శ్రీనాథుడు శారదను పోతన యింటనుంచి కొన్నాళ్ళచట మనస్సు కుదుటబడవైచి యొకనాడు పోతనను తోడ్కొని సింగభూపాలుని సందర్శింప రాచకొండకు బయలు దేరెను. ఈ కల్పనవల్ల శ్రీనాథుడు సుఖ దుఃఖములకు పొంగుచు క్రుంగుచునుండు వాడనియు, పోతన జ్ఞాన వైరాగ్య సంపన్నుడనియు తెలిపినట్లయినది. మరియు భార్యావియోగ కారణముననే శ్రీనాథుడు గత్యంతరములేక శారదాశిశువును దెచ్చి పోతనయింట నుంచుటయేకాక దూరపు బంధుత్వమువలని రాకపోకల య

కర్శ్యమును నివారించు నిమిత్తమును, పోతనను రాజాశ్రయమున నిలుపు ఉద్దేశము తోడను రాచకొండకు పోవుటకు వీలేర్పడినది.

## 7. పోతన జననీజనకుల మరణకల్పనము :

పోతన శ్రీనాథునితో రాచకొండలో రాజోద్యానవసతిలో ఉండగా తల్లి ఆసన్నమరణయైయున్న వార్త తెలిసి పిడుగుపడ్డట్లడవి పోబోవ శ్రీనాథుడు శీఘ్ర ప్రయాణమునకు వాహనమడిగి తెత్తునని రాజు నడిగి యపహసితుడై వచ్చి చెప్పగా పోతన క్రుద్ధుడై రాజులపై రోతబుట్టి బయలుదేరి బమ్మెరకు వచ్చెను. తల్లి చనిపోయినందున శోకించుచుండ తండ్రియు దుఃఖాతిశయముచేత గుండె ఆగి మరణించెను. అన్నదమ్ములు జననీజనకుల కపరకర్మలు చేసిరి. ఈ వృత్తాంత కల్పనము వలన పోతనకు తల్లియెడగల అనన్యప్రేమ వ్యక్తమైనది. రాజుల దురభిమానము దుష్టస్వార్థము విశదమైనది. అది పోతనకు రాజులయెడల తీవ్ర వైముఖ్యమేర్పడుటకు హేతువైనది. గతించిన జననీజనకుల అస్థులను నిమజ్జనము చేయు తలంపుతోనే పోతన చంద్రగ్రహణ కాలమున గంగకు పోవుట తటస్థించి శ్రీరామ సాక్షాత్కారము, భాగవతాంధ్రీకరణాదేశము లభించినవి. ఈ రీతిగా ఈ సన్నివేశకల్పనము బహుళార్థసాధకమై కథ ప్రకృష్టమై సాగుటకు దోహద మొసగినది.

## 8. పోచయ్య యను కాపు కథ :

అనావృష్టి పరితాపకాలమున కరణమగు పోతన తన పొలాలకు తప్ప అన్యుల పొలాలకు నీరందనీయుట లేదను అపార్థముతో పోచయ్య యను కాపు పోతనను చంపివేయుదునని నీరటికానిని బెదరించి అర్ధరాత్రి చెరువు తూమువద్ద కేగి దొంగచాటున తన పొలాలకు నీరు పారించుకొనుచుండెను. నీరటికాడు పోచయ్య బెదరింపులు చెప్పి పొలాలదరికి పోవలదని పోతనకు విన్నవించెను. అది విని పోతన

> "తత్త్వము నెఱిఁగియు నిటు ధీరత్వము విడనాడనేల? రాముఁడు గలుగన్
> సత్వరమేఁగెదను దమము సత్త్వమ్మునకన్న నధిక సత్త్వయుతంబే"[1]

1. పోతన చరిత్రము : 5-157

అని ధైర్యముతో పోచయ్య అపోహ తొలగింప పొలాల కొంటిగా పోయెను. నీరు పారించుకొనుచున్న పోచయ్య సర్పదష్టుడై పడిపోగా పోతన చూచి జాలిపడి సన్నసన్నని మబ్బుల మెరపులలో తనకు తెలిసిన యొక మూలిక వెదకి చికిత్స చేసి వానిని బ్రతికించెను. పిదప వాని కోపతాపము లేమిటని యడుగగా నీటి పారుదల విషయము పోతన నిరంకుశముగా ప్రవర్తించుచున్నాడనియు, వానిని గుడితల్లికి బలి యిచ్చినను తప్పులేదనియు పోచయ్య నుడివడెను. అది విని పోతన 'పోతన యట్టివాడే యగుచో వానిని బలి యిచ్చినను పాపము లేదు. నీ పొలానికి నేను నీరు పెట్టినాను. వానిని పట్టియిచ్చెదను. ఇదిగో! ఆ పోతనను నేనే' యని గొంగడి ముసుగుతీసి యెదుట నిల్చెను. పోచయ్యకు తల తిరిగి చాల పశ్చాత్తాపపడి పాదములపై వ్రాలి క్షమార్పణ కోరెను. పోతన వాని నోదార్చి యింటికి చేర్చెను. ఈ కథాకల్పనము వలన పోతనగారి పరమసౌజన్యము కారుణ్యచిత్తము, ధైర్యసాహసములు, క్షమాబుద్ధి విశదమగుచున్నవి. అంతేకాక ఈ పోచయ్య కొడుకే తన తండ్రికి చేసిన మేలు మరవక తర్వాత భాగవత మపహరింపబూనిన రాచకొండ సైన్యము నెదిరించి పోరాడిన యెక్కటి వీరుడు. ఇట్లీ యుదంతము ప్రధాన కథలో నొక ప్రయోజనము నెరవేర్చినది.

## 9. భిక్షుక వృత్తాంతము, లోభిసెట్టి కథ:

ఈ వృత్తాంతములు వెనుక చర్చింపబడెను. ఇవియు ఆచార్యులవారు కల్పించినవే. ఈ కల్పనలవల్ల పోతన సాధువర్తనము, సదయహృదయము, దీన జనావన తత్పరత, క్షమాబుద్ధి వ్యక్తమగుచున్నవి. రాముడు భక్తపోతన యందలి దయతో భిక్షుక రూపమున వచ్చి భాగవత లేఖనమునకు గంటమిచ్చుటయేకాక దుర్భరక్షామకాలమున భాగవత రచనారంభమునకు ముందు బ్రహ్మసత్ర మిడుటకు వలయు ద్రవ్యమును లోభిసెట్టిచే నిప్పించుటకు దీనభిక్షుక నాటక మాడెను. ఇట్లీ వృత్తాంతకల్పన వల్ల భాగవత రచనారంభము సిద్ధించెను.

## 10. శారదా దుస్స్వప్నకథనము :

భాగవతాంధ్రీకరణరచన పూర్తియైనపిదప ఒకనాడు శారద దుస్స్వప్నము గని తండ్రిపై బెంగగొని యేడ్చెను. నర్సమాంబ శ్రీనాథుని పిలిపించమని కోరెను. పోతన శ్రీనాథుని పిలువ మల్లనను పంపదలపగా నారయాదిశిష్యులు తాము

పోవుదుమని యనుమతిగొని బయలుదేరిరి. ఈ వృత్తాంత కల్పనవల్ల కథాగతి కెంతో ఉపయోగము కలిగినది. కథ యొక్కమలుపే తిరిగినది. పోయిన శిష్యులు రాచకొండలో రాజునకు తమ గురువర్యులు పోతనగారు భాగవతమాంధ్రీకరించిన విషయము తెలిపి తదీయరచనా వైశిష్ట్యమును వర్ణించుట, రాజానందపడి భాగవతము కృతిగొను తలంపువహించి పోతనను శారదతో భాగవతముతో రాచకొండకే రప్పింతునని సేనాపతిని పంపుట, సేనాపతి పోతనను తుదకు భాగవతమును లేజాలని పరిస్థితిని రాజున కెఱిగించుట, తర్వాత రాజు శ్రీనాథునే పంపుట-ఇత్యాది కథాఘటనము లన్నియు పరస్పర కార్యకారణసంబంధముతో జరుగుటపై సన్నివేశకల్పనకు ప్రయోజనము. ఇక్కడ శారద కనిన దుస్స్వప్నము యొక్క ఫలము పోతనయొక కనబడెనన్నట్లు అది మొదలుకొని అతడు పొందిన కష్టాల వల్ల వ్యంగ్యముగా తెలియుచున్నది.

## 11, 12 జంగమకన్యా జ్యోతిపురరాజ్ఞీవృత్తాంతములు:

వీనిని గురించియు, ఈకల్పనలవలని ప్రయోజనముల గురించియు రామభక్తి మహత్త్వాదులను దెలుపు సన్నివేశముల చర్చలో వివరించియుంటిని.

ఈరీతిగా ఒక మహాప్రబంధరచన కుపకరించునట్లు వరదాచార్యులవారు నూతన కథాసన్నివేశములు చక్కగా కల్పించి వర్ణించి కావ్యము సుసంపన్నమై సురుచిరమై వరలునట్లు చేసినారు.

## V. సన్నివేశకల్పనా శిల్పము:

ఆచార్యులవారు లభ్యమైన కథాంశములను నూతన కల్పిత సన్నివేశములను పూర్వాపర సందర్భశుద్ధితో జతపరచుకొని చక్కని చిక్కని కథను సిద్ధము చేసికొని సముచిత వర్ణనలతో విస్తరింపజేసి సరసముగా సమర్థముగా నిర్వహించినారు.

సన్నివేశకల్పనా శిల్పము 1. కార్యకారణసంబంధము. 2. రసపాత్రపోషణాదుల కుపయుక్తముగా నుండుట 3. సహజమై విశ్వసనీయమైయుండుట. 4. సముచితత్త్వము-అనువానిచేత రూపొంది హృదయావర్జకముగా శోభిల్లగలదు. ఈ శిల్పశోభకు కావ్యమంతయు నుదాహరణీయమే. ఐనను కతిపయ సన్నివేశములను ప్రదర్శింతును,

## 1. కార్యకారణ సంబంధము:

పూర్వాపూర్వకార్యము లుత్తరోత్తరకార్యములకు హేతువులై కథ సాగు చుండుటలో కార్యకారణసంబంధము ప్రతిష్ఠమై సహృదయులను మెప్పించును. సన్నివేశకల్పనలోని మెలకువనుబట్టి యీ శిల్పమేర్పడుచు. దీనికి చతుర్థ సప్తమా శ్వాసముల కథాభాగములను ప్రత్యేకముగా నుదాహరింపవచ్చును.

చతుర్థాశ్వాసములో పోతన భోగినీదండకము వ్రాసి సింగభూపాలుని కంకి తము చేసెను. పిదప రాజులపై రోత జనించెనన్నది కథాసారాంశము. దీనిని కార్యకారణసంబంధ శిల్ప రమణీయముగా కవిగారు వర్ణించిరి. శ్రీనాథునకు దుర దృష్టవశమున భార్యావియోగము కలుగుటచేత తన పసిబిడ్డయగు శారదను పోషింపలేక దానిని చెల్లెలి కొప్పగించుటకు బమ్మెరకు వచ్చెను. పోతన వైరాగ్య బోధనవల్ల సమాశ్వాసితుడైన శ్రీనాథుడు సావకాశముగా ఆలోచించి తమ దూరపు బంధుత్వమువలని రాకపోకల యిబ్బందులను తొలగించుకొను నిమిత్తము సమీప మునగల రాచకొండ ప్రభువు సింగనృపతిని దర్శించి యతని ఆస్థానకవిగా నుండ దలచెను. కాగా దీనికి తానొకడు పోవలెను. అట్లుకాక పోతనను వెంటబెట్టు కొని పోయెను. సామాన్యగ్రామకరణమై పల్లెటూరిలో నివసించుచు ఆర్థికసంక్షోభ మునకు గురియగుచున్న తన బావమరిదిని నగరముతో నరపతితో పరిచయము చేయించి రాజాశ్రయముననుంచి యతనికి కీర్తిప్రతిష్ఠలు సిరిసంపదలు పొదలు నట్లు చేయవలెనని తన చిత్తవృత్తి కనుగుణముగా భావించి పోతనను రాచకొండకు తోడ్కొనిపోయెను. పోతనకీ నాగరకజీవనముపైన రాజభోగాలపైన ఆస్థ లేదు. బావగారి ప్రోద్బలమున అమాయికముగా బయలుదేరిపోయెను.

రాజదర్శనానంతరము సత్కృతులై నగరమున వసించియుండ ఒకనాడు శీలవతియు,కళాకోవిదయునగు ఒక వేశ్యాపుత్రిక సభలో దివ్యముగా నాట్యమొనర్ప 'స్త్రీరత్నం దుష్కులాదపి' యను సూక్తి ననుసరించి ఆమెను రాజు భోగినిగా చేపట్టగా ఆమె సౌశీల్యమునకు మధురభక్తియుత రాధికానాట్యాభినయమునకు ముగ్ధుడై పోతన అప్రయత్నముగా దండకము రచించి ఆ భోగినీనాయకుడగు సింగనృపతికే అంకితమిచ్చెను. రాజు మహామోదభరితుడై కృతజ్ఞుడై పోతనను తన యాస్థానకవిమండలి కధ్యక్షునిగా సన్మానింపబూనెను. సహజ వైరాగ్య సంపన్నుడగు పోతన దానిని తిరస్కరించెను. నృపుడా అసమ్మతిని మతిలో

నుంచుకొనెను. తర్వాత తన తల్లి యవసానదశలో నున్నదన్న వార్త తెలిసి పోబోయిన పోతన శ్రీనాథునిద్వారా వాహనమడిగినప్పుడు రాజు చేసిన మర్మచ్ఛేద కాపహాస్యమునకు మిక్కిలి కోపతాపములకులోనై రాజుల దురభిమానమును తీవ్ర ముగా విమర్శించి వెళ్ళిపోయెను. ఇక్కడ పోతనయెడ రాజుకెంత కోపమున్నను 'ఆపద్గతంచ నజహాతి దదాతి కాలే, సన్మిత్రలక్షణ మిదం....' అని పరోపకార పద్ధతిలో (భర్తృహరి సుభాషితము-నీతిశతకము-శ్లో. 66) చెప్పినట్లు కష్టకాల ములో తోడ్పడవలసియుండెను. తోడ్పడకున్నను అపహసించుట అమానుషము. అందుకే పోతనకు తీవ్రవైముఖ్యమేర్పడినది. రాజులయెడ పోతన కనురాగ పురస్కారములు మొదటినుండియు లేవు. ఉదాసీనుడైన పోతనకు సింగనృపతి నీచప్రవర్తనవల్ల రాజులయెడ తిరస్కార వైముఖ్యము లేర్పడినవి. కాగా విచా రించినచో రాజు తప్పుకూడ లేదు మొదట. అతడు పోతనను తన సభ కాహ్వా నించలేదు. భోగినీదండకము వ్రాసి అంకితమిమ్మని కోరనులేదు. అది పోతన చేసికొన్న దోషము. ఈ దోషమునకు హేతువు పోతనకు జాగరూకత, ముందు చూపు కొరవడుటయే. దీనికి శ్రీనాథుడు దోహదకారి. దీని కంతటికి మూలము కావ్యోపక్రమములో చెప్పినట్లు దేవతాపథకానుసారముగా భాగవతము నరాంకితము చేయింప యత్నించుట కింద్రాంశలో పుట్టిన సింగనృపతి. ఇచట బుద్ధిపూర్వక ముగా కాక ప్రమాదవశమున ప్రవృత్తి మార్గమున బడిపోయిన పోతనకు, సహజ నివృత్తిమార్గగామియగు పోతనకు దుఃఖము తప్పలేదు. పోతన జీవితమున ఇదొక మరపురాని మరలరాని యనుభవము. అతని మంచికొరకే రాముడిట్లు చేయించె ననుకొనవచ్చును. ఇట్లిందలి కథాసన్నివేశములు కార్యకారణ సంబంధముతో రమ్యమై యొప్పారుచున్నవి.

ఇదే విధముగా సప్తమాశ్వాసములో భాగవతాపహరణ సన్నివేశము లందును కార్యకారణ సంబంధశిల్పమును తిలకింపవచ్చును.

## 2. రస పాత్ర పోషణాదుల కుపయుక్తముగా నుండుట:

సన్నివేశ కల్పనలు రసపోషణకుగాని పాత్రపోషణకుగాని కథాగతికిగాని ఉపయుక్తముగా నుండునట్లు చేసినపుడే రమణీయములై భాసిల్లును. లక్కమాంబ కేసనదిప్పనతో తీర్థయాత్రల కరిగినపుడు కల్పించిన సన్నివేశము పోతన

దంపతుల శృంగారరసపోషణకు వీలు కల్పించినది. సర్పదష్టుడగు పోచయ్యను పోతన క్షమించి బ్రతికించినట్లు కల్పించిన సన్నివేశము పోతన పాత్రపోషణకు, తర్వాత సింగనృపతి సైన్యమును యువకుడెదిరించి పోరాడిన వీరరసపోషణకు తోడ్పడినది. దీనభిక్షుకుని కాపాడిన సన్నివేశమే అతనిచేత భాగవతరచనకు గంటము పిప్పించి, రచనారంభమునకు ముందు బ్రహ్మసత్ర భాగవతసప్తాహము నానర్పవలయు ధనమును లోభిసెట్టిచేత పిప్పించి కథ సాగుట కుపయుక్తమైనది. అట్టి సన్నివేశములెన్నైనను ఉటంకించవచ్చును.

## 3. సహజమై విశ్వసనీయమై యుండుట :

కావ్యమున సన్నివేశములన్నియు సహజమై విశ్వసనీయమై విలసిల్లునట్లు కల్పింపబడినవి. మచ్చునకొండు రెండు పేర్కొందును.

పోతన యొకనాటి ప్రభాతవేళ సస్యశ్యామల కేదారములను ప్రకృతి దృశ్యములను మేయుచున్న గోవులను తిలకించుచు తన్మయుడై యుండ చిదానందయోగి పాల్కురికికి సోమనాథ దర్శనార్థము పోవుచు అతనికి గనబడి దారియడుగుట మిక్కిలి సహజముగా నున్నది. యోగికి సవినయముగ నమస్కరించి కమ్మని యావుపాలు పిండి యీయగా తృప్తిగా త్రాగి సంతోషపడి దీవించుట, పోతన జిజ్ఞాసువై దైవప్రాప్తికి మార్గమడుగుట, అతడు రామతారక శారదామంత్రముల నుపదేశించుట-ఇత్యాది సన్నివేశమెల్ల సహజముగా చక్కగా నమరియున్నది.

శ్రీనాథ పోతనల సమాగమము కూడ సహజమై చారుతరమై యున్నది. ఒక నాటి సాయంవేళ పోతన చేలనుండి బండిపై నింటికి పోవుచుండ శ్రీనాథుడు స్వారి బండిపై తీర్థయాత్రలు సేవించుచు పాల్కురికికి పోవువాడై బమ్మెర పొలిమేరలో నతనికి కనబడుట, శ్రీనాథుడు పొలముమీద ఆశువుగా పద్యము చెప్పి తన పరిచయ మగునట్లు చేయుట, పోతన అతని పద్యము నేకసంథాగ్రాహిత్వము చేత పొత్తములోని యొక కమ్మపై వ్రాయుట, శ్రీనాథు డదిచూచి, అందలి పోతన రచిత పద్యములను చూచి యతని ధారణాశక్తిని కవితారక్తిని గ్రహించుట, శ్రీనాథుని పోతన ఆనాటి రాత్రి తమయింట విడిది చేయగోరుట ఇత్యాది సన్నివేశ వృత్తాంతములెల్ల నిసర్గరమణీయముగా వర్ణితములై యున్నవి.

పోతన భాగవత రచనకు పూర్వము సోమోపరాగ కాలమున గంగా స్నానమునకు వెడలినట్లు భాగవత పీఠికలో కలదు. భాగవత రచనకు విధిగా గంగాస్నానము చేయవలసిన అవసరము లేదు. గ్రహణ స్నానమునకు అంత దూరము వెడల నక్కరయుండదు. కాగా కవిగారు పోతన తల్లిదండ్రులు మరణించుటచేత వారి అస్థికల నిమజ్జనార్థము గంగకు పోయెనని కల్పించుట సహజము గను విశ్వసనీయముగను ఉన్నది. మరియు కాపు పోచయ్య ఔద్ధత్యము, పోతన యింటిలో పిల్లల వస్తులు, భిక్షుకుని దైన్యము, లోభిసెట్టిపీడ-ఇవన్నియు క్షామ కాలమున గ్రామసీమల యందలి స్థితిగతులను, కష్ట నిష్ఠురములను సహజముగా కనులకు గట్టించుచున్నవి. ఇట్లే అనేక సన్నివేశములలో సహజత సాక్షాత్కరించును.

## 4. సముచితత్వము:

పోతనచరిత్రమున ఏ సన్నివేశమును గాంచినను అందు సందర్భశుద్ధి, ఔచిత్యము పొసగి ఆహ్లాదకరముగా కథ సాగిపోవుచుండును.

లక్కాంబ నిండు గర్భవతియై యున్నప్పుడొక బ్రాహ్మణుడా యూరికి వచ్చి రామాలయమున భాగవత పురాణ ప్రవచనము చేయుచుండెను. అందరితో పాటు లక్కాంబపోయి శ్రద్ధాసక్తులతో విని 'మా వంటివారు చదివి అర్థము చేసికొని తరించుటకు వ్యాసభాగవతము నెవరైన తెలుగులో వ్రాసినారా?' అని ప్రశ్నించెను. అది విని పౌరాణికు డామెను గాంచి యామె గర్భమున ఒక బ్రహ్మతేజము దాగియున్నట్లు గ్రహించి 'నీ పొట్టలో నుదయించు నీ కోర్కె నిజముసేయు వాడు నేడోరేపో యుదయ మొందకుండ నుండునె' యని ధ్వని గర్భితముగ పలికి దీవించెను. ఈ సన్నివేశ కల్పనమెంతో సముచితమై సందర్భ శుద్ధి విలసితమైయున్నది. భాగవతకర్తయగు పోతనకు జనని కానున్న లక్కాంబ పై ప్రశ్న వేయుటలోని పరమార్థము సహృదయ వేద్యము. ఆ కాలమున వ్యాస భాగవతము తెలుగులో వెలయవలసిన ఆవశ్యకము కానబడినదని యీ సన్నివేశము చెప్పక చెప్పుచున్నది.

శరదృతు ప్రారంభమున చేతికి వచ్చు కృషిఫలితమగు పంటలను చెడ గొట్టి వానకురిసి అంతలోనే పోతనకు చెలువ చెలువము చిలికి చిత్తద్రవ మొలికి చిరకాల తపఃఫలము ఖిలమైనట్లు కల్పించిన సన్నివేశము సమంజసమై యొసగి యున్నది.

శ్రీనాథుడు తన పుత్రిక శారదను మల్లన కిచ్చి వివాహము చేయు విషయము లగ్న నిశ్చయమున కని బమ్మెరకు వచ్చితినని చెప్పినను మదిలోమాత్రము రాజు పంపినట్లుగా పోతనచేత భాగవతమును రాజాంకితము చేయించవలెననియే యుండెను. పోతన వట్టి మాటలకు లొంగడని శ్రీనాథుడు వేయిమంది రాజ పరివారముతో వచ్చిపడి తన పరివారపు భోజనపు తిప్పలు తానే పడుదు నని పోతన మనస్సు ఖిన్నమగునట్లు మాట్లాడెను. వాగ్దేవి ఆపత్కాలమున జ్యోతి పురరాజ్ఞీరూపమున వచ్చి ఆదుకొనుట, శ్రీనాథుని ధనమహిమ బోధ వినక తన వైరాగ్య వృత్తిని ప్రకటించుట-ఇత్యాది సన్నివేశ కల్పన మెల్ల సమంజసముగా నున్నది.

భాగవతాపహృతికి దాని శైథిల్యమునకు కారకులైన నృపాలురలో సింగ నృపతి కృతిసముద్ధరణకు ధనమునంపుట, కర్ణాటాధీశ్వరుడు భాగవత కృతి సమర్పణోత్సవ మొంటిమిట్టలో జరిపించుట యుక్తి యుక్తమైన కల్పన. ఇట్లే ఔచిత్య దృష్టితో చేసిన మార్పులు గల పెక్కు సన్నివేశములు సమంజసమై సార్థకమై యొప్పుచున్నవి. ఈ కారణము లన్నిటిచేత కావ్యమునందలి సన్నివేశ కల్పనా శిల్ప మెంత రమణీయమైనదో విశద మగుచున్నది.

## VI. కథాకథన కౌశలము :

సంవిధాన చాతురిలో కథాకథనకౌశల మొకభాగము. సమర్థముగా చతురముగా సమంజసముగా కథాసన్నివేశముల కల్పన చేసిన కవిగారొక్కొక్క కథ నెంత చక్కగా వక్కాణించిరో పరిశీలింపవలసియున్నది. ఏ కథాసన్నివేశమైనను ప్రసన్నముగా సాగి పాఠకుని తనవెంట లాగుకొనిపోయి తన్మయుని గావించునను టలో సందేహము లేదు. దీనికి తృతీయాశ్వాసము నందలి పోతన దంపతుల శృంగార ఘట్టము ప్రబలోదాహరణము.

పోతన దంపతులకు శోభనము జరుపుటకు తల్లిదండ్రులు చేయు సన్నాహములకు పోతన బ్రహ్మచర్య వ్రతతపోభంగమునకు వెరచి చింతించుట, శయన మందిరమున పోతన యేమియు పలుకక పడుకొనుట, నర్సమాంబా మనోవ్యథ, చెలుల యోదార్పు, లక్కమాంబ విషయము బోధపడి కలతచెంది పోతన దంపతుల కేకాంతవాసము సన్నిహితత్వ మేర్పడి యనిష్టము తొలగుటకు వారి నింట నుంచి తక్కిన వారితో గూడి తీర్థయాత్రలకేగుట, పోతన యేకాంత మేర్పడియు మరింత

స్నిగ్ధ చిత్తముతో మెదలుట, చెడిగొట్టు వానలుపడు సూచనగని పొలాలు కోతలు పట్టించి పోతన అక్కడనే యుండుట, సర్వమాంబ వంటకములు సిద్ధముగాచేసి పెనిమిటి రాలేనందున సాయంవేళ తానే బయలుదేరి చిరువానలో తడియుచు దుర్గా దేవి మందిరముచేరి ఆ జగన్మాతకు నైవేద్యము పెట్టి తన కష్టాలు దూరముచేసి భర్తృసమాగమాభ్యుదయము కలిగింప ప్రార్థించుట, ఆమె బురదనేలలో భర్తను చేరవచ్చుచు జారి పడబోగా పోతన చూచి తటాలునవచ్చి ఆమె నాపి జాలిపడి పలుకరించుట, ఆమె దివ్య సౌందర్యమును గాంచి పోతన అపూర్వానురాగ పార వశ్యము నంది, ఆమె వస్త్రశుద్ధిచేసి స్నానమాచరించి వచ్చిన పిదప అన్యమనస్కత నివేదితాన్నమల్పముగా స్వీకరించి యింటికివచ్చి ఆరాత్రి వివశుడై ఆమెతో ఏకాంత జీవనసౌఖ్య మనుభవించుట-అను ఈ ప్రణయోదంతమెల్ల 'కన్గవకును నద్ద మెట్లటుల గ్రంథచమత్కృతి నేర్పుపెంపునన్ బ్రవిమల వస్తుతత్త్వమును భాసిలజేయుట' జరిగినది. ఈ శృంగారకథ యందలి సన్నివేశము లన్నియు స్వక పములై సముచితములై మనోజ్ఞ భావనా విలసితములై మంజుల వర్ణనోదంచి తములై కథాకథనము మిక్కిలి యింపు నింపుచున్నది.

సర్వమాంబా పోతనల యీ శృంగార ఘట్టము కళాపూర్ణోదయములోని సుగాత్రీ శాలీనుల కథకనుకృతి యైనట్లు తోచవచ్చును. కాని యీ రెండుకథలలో పోలిక కంటె భేదమే అధికముగా గలదు. అందు కృత్రిమాలంకారాటోపమిష్టము లేని శాలీనుడు శయన మందిరమున భార్యావిముఖుడై పడుకొనెను. ఇక్కడ బ్రహ్మ చర్య వ్రతభంగమునకు భయపడి పోతన భార్యను చూడకుండెను. కళాపూర్ణోదయ మున వంశాంకురేచ్ఛ ప్రబలయైయున్న సుగాత్రితల్లి అల్లుని భార్యావైముఖ్యమున కసహ్యించుకొని తోటపనులకు వినియోగించెను. ఒకనాటి భయంకర వర్షసమయ మున భర్తక్షేమ మరయదలచి సుగాత్రి తోటలో పనిచేయుచున్న భర్తను డాసి నగలుతీసి అతనికి తోడుగా పనిచేయుచుండ ఆమె సహజసౌందర్యమున కాకర్షి తుడై యామె నేలుకొనెను మరల నాటిరాత్రి శయనమందిరమున వివిధాభరణాభి శోభితయై వచ్చిన సతినిగాంచి శాలీనుడు మరల పరాఙ్ముఖుడై యుండెను. మరు నాడు తోటలో మరల నిరస్తభూషయై నిసర్గసౌందర్యవిరాజితయై యుండిన సుగా త్రిని పతి యనుగ్రహింప ఆమె యతని అంతర్యము గ్రహించి తదనుసారముగా ప్రవర్తించి భర్తతో హాయిగా కాలము గడపెను.

పోతన చరిత్రమున వ్రతభంగ భయ విముఖుడైయున్న పోతన కేకాంత
వకాశమునకై యింటివారు తీర్థయాత్రలకు పోవుదురు. తర్వాత అకాల వర్ష
పొలము కోతవట్టించి యక్కడనే యుండిపోయిన భర్తకై నిరీక్షించి ఆతడు
ందున నర్సమాంబ తానే బయలుదేరి దుర్గామాతకు నైవేద్యము పెట్టి సన్నని
శ తడియుచు పోతన చెంతకు వచ్చి జారిపడబోగా పోతన పట్టియాపి పలుక
ను. ఆర్ద్రవస్త్రము లంటుకొనియున్న ఆమె తనూసౌందర్యము నవలోకించుట
, దైవికముగా ఆమెను స్పృశించుటచేతను క్రొత్తలోకపుటనుభవమై యను
క విశుడై యామె నేలుకొనును. ఈ విధముగా భార్యావైముఖ్యమనునదియు,
ో అనురక్తి కలుగుట యనునదియు రెండు కథలలో సదృశమై కన్పడునే
వాని కారణములు, తర్వాత జరిగిన సన్నివేశముల తీరులు దారులు వేరై
న్దున కళాపూర్ణోదయ కథ కనుకరణ మెంతమాత్రము కాక పోతనకథా
వేశము విలక్షణమై విశిష్టమై యొప్పుచున్నది.

## ుమీరని విస్తృతిగల యితివృత్తము :

వస్తు నిర్మాణమును సంవిధానచాతురిని చర్చించిన పిదప చివరికొక విష
ు పరిశీలింపవలసియున్నది. అది యితివృత్త విస్తారమునకు చెందినది.
ు వేల పద్యములతో వ్యాపించియున్న పోతనచరిత్రము బృహత్కావ్యమై
న్నది. దీని విస్తృతి చూడగా కావ్యమునం దనవసరమైన కథాభాగములు సన్ని
ులు పాత్రలు వర్ణనలు చొప్పించుటవల్లనే యింత పెద్దగా పెరిగిపోయినదను
హము కలుగుట కవకాశమున్నది. కాని నిశిత పరిశీలన కావించిన యెడల
సందేహమునకు తావులేకుండ పోవును.

ఈ కావ్యమున పోతనగారి గార్హస్థ్య జీవితము, సాహిత్య జీవితము, అతని
శీలములను వర్ణించుట కత్యవసరమగు కథయే ప్రధానముగా సాగినది. అనవ
సన్నివేశములుకాని పాత్రలుకాని మచ్చునకైనను కానరావు. ప్రధాన కథకు
ంధించిన పరిమిత పాత్రలను ప్రవేశపెట్టి, ఆ పాత్రలైనను ఆవశ్యకమగు
కవరకే వ్యవహరించునట్లు కథను నడిపినారు కవిగారు. నాయకుడగు పోతన
దంతము సైతము రసవత్కథాగత్యమునకు మించి వర్ణింపబడలేదు. ఓరుగల్లు

సమీపమునగల బమ్మెరలోని పోతన యోరుగంటి కెన్నిమారులైనను పోయి యుండును. కాని కావ్యమున పోతన భాగవతాంధ్రీకరణకు విద్వజ్జనానుమతి పొందుట కొకమారు, శ్రీనాథునితోగూడి తిప్పన్నను దర్శింప నొకమారు మాత్రమే ఓరుగంటికి పోయినట్లు వ్రాయబడినవి. రెండవ ముఖ్యపాత్రయగు శ్రీనాథుడు పోతన కాత్మబంధువయ్యు నాలుగైదు పారులకంటె ఎక్కువగా బమ్మెరకు రాలేదు. మరియు శ్రీనాథుని సాంసారికజీవితము, రచనా వ్యాసంగము, రాచకొండ విజయ నగరములకు తప్ప అన్యప్రాంత పర్యటనలేమియు ప్రస్తావింపబడలేదు. పోతన సతి నర్సమాంబ సంగతికూడ అక్కరయున్నంత మట్టుకే మితముగా ప్రస్తా వింపబడినవి. పోతన జననీజనకులదికూడ అనవసరపు జోలి కానరాదు. పోత నతో తారసపడిన పేద జవరాలు, కాపు పోచయ్య వంటి పాత్రల వృత్తాంతము లును అలతులును కథాగతి ప్రయోజన పరిమితములునునై కూర్పబడినవి. ఇట్లే యేది చూచినను ఎక్కడ చూచినను అతి విస్తృతి కానరాదు. అగుచో ఇంత గ్రంథము దీర్ఘవర్ణనలచేత పెరిగెనేమో యనిపించును. కాని యిందలి వర్ణన లన్నియు నాతిదీర్ఘములై హితమితములై యొప్పుచున్నవి.[1] కావున కవిగారు చతురముగా కూర్చుకొన్న యితివృత్తమే విపులమైయున్నదికాని మితిమీరి విస్త రింపబడినదికాదని తెలియుచున్నది.

## సర్వాంగసౌష్ఠవ సౌందర్యశోభితమైన వస్తువు :

పోతన చరిత్రమునందలి వస్తువు ముఖాది పంచసంధిబంధురమై[2] ఆనంద వర్ధనుని సూచనానుసారముగా రసాభివ్యక్తి నపేక్షించి సంధి, తదంగములు కూర్పబడి, ఇతివృత్తగతములైన యనౌచిత్యములు తొలగింపబడి రసోచితముగా మార్చబడి, చక్కని రచనాప్రణాళికతో చతురసంవిధానముతో రమ్యకల్పనా శిల్పముతో రసవత్కథాకథనకౌశలముతో సమవిభక్త సర్వాంగసౌష్ఠవసౌందర్య సంశోభితమై సహృదయహృదయావర్జకమై యొప్పారుచున్నది.

1. వర్ణనలగూర్చి 'వర్ణనావైదగ్ధ్యము' వ్యాసమున చర్చింపబడినది.
2. ఈ విషయము 'పోతన చరిత్రము-మహాకావ్యము' వ్యాసమున వివరింపబడెను.

# రస నిర్వహణము

## ప్రాధాన్యము:

కావ్యములందు వస్తువు తర్వాత పరిశీలింపవలసినది రసము. వస్తువు ంచియుండు కావ్యాంగములలో రసము ప్రథమగణ్యమైనది కావ్యశరీర స్తువునకు రసము ప్రాణమై యొప్పారును. ఆచార్యులవారు కావ్యపీఠికలో రూపమును వర్ణించుచు 'రసము ప్రాణము' అని వ్రాసిరి. ప్రాణ ప్పుడే యంగములు పనిచేయుటకును సౌందర్యాదులు శోభిల్లుటకును వీలగు వ్యమున రసమున్నప్పుడే పాత్రల వ్యవహారము, ఔచిత్యము మున్నగునవి ల్లుటకు అవకాశము కలుగును.

భరతుడు రసప్రాధాన్యవాదియై యిట్లు ప్రవచించెను.

"నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తత ఇతి-
తత్ర విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః"[1]

రసమును వదలి యేదియు నుండదు. ఆ రసము విభావానుభావ సంచారి ల సంయోగముచేత నిష్పన్నమగునని భరతుడు చెప్పెను. దృశ్య శ్రవ్య ు లన్నిటియందును రసమే ప్రధానమైన దనుటవల్ల వస్త్వలంకారాది శేష సామగ్రియంతయు రసవ్యంజకత్వమునకే యుపకరించును. రసానుగుణము కేదియు కావ్యమున నుండరాదన్నది తాత్పర్యము.

రసమే కావ్యాత్మయని యభినవగుప్తుడు వివరించుచు,

"రసేనైవ సర్వం జీవతి కావ్యం; నహి రసశూన్యం కావ్యం కించిదస్తి,
రస ఏవ వస్తుతః ఆత్మా ; వస్త్వలంకార ధ్వనీతు సర్వథా రసంప్రతి
పర్యవస్యేతే"[2]

---

నాట్యశాస్త్రము : 6-31

ధ్వన్యాలోక లోచనము,

'రసముచేతనే కావ్యమెల్ల జీవించును. రసశూన్యమగు కావ్యముండదు. రసమే (రసధ్వనియే) కావ్యమునకాత్మ. వస్త్వలంకారధ్వనులు కూడ రసపర్యవసాయులు కావలయును' అని నొక్కి చెప్పిన పై యాలంకారిక వచనములు కావ్యమున రసమునకుగల ప్రాధాన్యమెట్టిదో వివరించుచున్నవి. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్న దర్పణకారుని మహావాక్యము సుప్రసిద్ధము. పురాతనాధునాతన సుకవి చంద్రులీ రసవిషయమున ప్రత్యేకాభినివేశము కలిగియుండిరనుటకు వారి కావ్యములే నిదర్శనములు. మాదయగారి మల్లన కవిత చెప్పినచో రసవంతముగా చెప్పవలెను లేదా మానుకోవలెనని దిగువరీతిగా వచించెను.

> "చెప్పఁదగు కవిత రసముల్
> చిప్పిల నప్పప్ప! బళిబళీ! యన లేదా
> యెప్పుడు చెప్పక యుండుట
> యొప్పుసుమీ! సుకవి యెంత యుచితజ్ఞుఁడో కో!

రసవంతమైన భోజనమువలె రసవంతమైన కావ్యమే సేవ్యమై రసజ్ఞుల నలరింపజేయును. కావ్యమున రసమునకుగల ప్రాధాన్యము నెరిగియున్న వరదాచార్య సుకవీంద్రులు పోతనచరిత్రమును రసస్రవంతిగా సంతరించియున్నారు. వారు విభావాది రససామగ్రిని చక్కగా సమకూర్చి నవరసభరితముగా నవనవోన్మేష భావహరితముగా కావ్యమును తీర్చిదిద్దిరి.

## అంగిరసము శాంతము :

పోతన చరిత్రమున శాంతమంగిరసమై జాలువారుచున్నది. భక్తి శృంగార వీర కరుణాద్భుతాదులంగములై యొప్పుచున్నవి. కావ్యమున శాంత భక్తిరసములు మిక్కుటముగా పోషింపబడియున్నందువలన భక్తియే యంగిరసముగా భాసిల్లుచున్నదనిపించును. కొందరు పండితులిట్లే భావించి భక్తియే యంగియని వ్రాసియున్నారు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు పోతన చరిత్రమునకు వ్రాసిన 'తొలిపలుకు' లోనేకాక "అభినవ పోతన" షష్టిపూర్తి సన్మాన సంచికలో "ఈ మహాకావ్యమున భక్తిరసమే అంగి. శృంగార వీరాద్భుతాదులంగములు"[1] అని తెలి

1. అభినవ పోతన : 'పోతన చరిత్రము - రసపోషణము' పు. 82 (భారతీ సాహిత్యసమితి, కోరుట్ల వారి ప్రచురణము)

3. డాక్టర్ పల్లా దుర్గయ్యగారును పోతన చరిత్రమునకు 'కవి-కావ్యపరిచయము' వ్రాసి యందు ''శాంతరసాంతర్భూతమయిన భక్తి ప్రధానరసముగను, శృంగా దు లంగరసములుగను నిందు పోషింపబడినవి.''[1]అని వచించిరి. కాని పరిశీలన పనచో నిందు శాంతరసమే యంగిగను, భక్తి మున్నగునవి యంగములుగను షింపబడినవని విశదము కాగలదు. కావ్యకర్తయగు వరదాచార్యులవారును కావ్య :న తాము శాంతమునే యంగిరసముగ నిర్వహించినట్లొక గోష్ఠిలో తెలిపి యుండిరి. ఇందు శాంతరసమువలె భక్తిరసమును నత్యంతముగా పోషింపబడి యుండుటచేత భక్తియే యంగిరసమన్న భ్రమ కలుగుచున్నది. కాని వాస్తవముగ దు భక్తిరసాంతర్భూతమైన శాంతమే ప్రధానరసమై యొప్పుచున్నది. ఈ షయమును నిరూపించుటకు ముందు శాంతరస స్వరూపమును సంగ్రహముగా ల్లేఖింతును.

## శాంత రసము :

ఉద్భటభట్టు నవరసములను వాని స్థాయి భావములను దిగువరీతిగా ర్కొనెను.

> ''శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
> బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః
> రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
> జుగుప్సా విస్మయ శమాః స్థాయిభావాః ప్రకీర్తితాః''[2]

ఇందు శాంత రసము, దాని స్థాయిభావము 'శమము' చెప్పబడినవి. మమునకు లక్షణము భట్టుమూర్తి యిట్లు చెప్పెను.

> "నిరుపమ వైరాగ్యాదుల
> కిరవై నిశ్చలతఁబూని హృదయము తిరమై
> నరులకుఁ బరిణతిఁ జెందిన
> ధరలోనది శమమనంగఁ దగు...."[3]

1. పోతనచరిత్రము : 'కవి కావ్య పరిచయము' పు. 34.
2. కావ్యాలంకార సార సంగ్రహము - 45, 46 శ్లో.
3. కావ్యాలంకార సంగ్రహము : 3-25.

దీనిని సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారిట్లు వివ

'వైరాగ్యాదులచే మనస్సు విషయములనుండి నివృత్తి
"వైరాగ్యాదినా నిర్వికార చిత్తత్వం శమః" (వైరాగ్యాదులచేఁ జి
యుండుట శమము) అని ప్రతాపరుద్రీయము, "నిత్యానిత్య
విషయ విరాగాఖ్యోనిర్వేదశ్శమః" (ఇది నిత్యము, ఇది యనిత్య
వలనఁ బుట్టిన విషయ విరాగమను పేరుగల చిత్తవృత్తివిశేష
శమము) అని రసగంగాధర లక్షణము.'[1]

ఇందు ప్రతాపరుద్రీయమున వైరాగ్యాదులచే మనస్సు
శమమని లక్షణము వివరింపబడినది. ఇచట వైరాగ్యాదులనగా
జ్ఞానము యోగము అని చెప్పనొప్పును. రసగంగాధరమున శమ
విచారమువలన బుట్టిన విషయ విరాగమను చిత్తవృత్తివిశేష
శమమని విశదీకరింపబడినది. ప్రతాపరుద్రీయలక్షణము రసగ
మించుమించు నొకటియే. రెండింటిలోను మనస్సు విషయమ
మానుటయే శమమని చెప్పినట్లయినది. విషయ నివృత్తికి ఒక
కారణముగా మరొకటి నిత్యానిత్యవిచారము కారణమనుచున్న
విచారము ప్రధానముగా జ్ఞానసంబంధి. వైరాగ్యాదులలోని జ్ఞానమ
హేతువని చెప్పబడినదే. కావున గ్రంథద్వయములోని వివరవ
కావు. ఇక నిర్వేదమన్నను శమమన్నను నొక్కటే. రసగం
ధరణికోట వెంకటసుబ్బయ్య ఇదే విషయము నిట్లు విశదీకరించెను.

"నిర్వేదము శాంతరసస్థాయి. బ్రహ్మము నిత్యము, ఇ
అని యీరెంటిని వివేచించుటచే జనించినది. అనిత్యవస్తు విషయక
(నిరభిలాష-విరక్తి) అను చిత్తవృత్తివిశేషమునకు నిర్వేదమని
నిర్వేదమునకే శమమని నామాంతరము ("శమః అయమేవ
వ్యజ్యతే" రసచంద్రిక)"[2]

1. కావ్యాలంకార సంగ్రహము (సన్నిధానము సూర్యనారాయణ శా
పు. 328.
2. రసగంగాధరము - పరివస్యు పు. 188.

శాంతరసము నాట్యశాస్త్రమున నిట్లు తెలుపబడినది.

"న యత్ర దుఃఖం న సుఖం న ద్వేషో నాపి మత్సరః
సమః సర్వేషు భూతేషు స శాంతః ప్రథితో రసః"[1]

అనగా నెందు దుఃఖముగాని సుఖముగాని ద్వేషముగాని మత్సరముగాని లేదో, ఎందు సర్వభూతములయందును సమత్వమే కలదో అది శాంతరసమని విశదీకరింపబడినది.

శమము స్థాయిభావముగల శాంతరసమునకు ధీరశాంతుడగు నాయకు డాలంబన విభావము. దైవభక్తి, సత్పురుష సేవ, వేదాంత విచారము, దైవానుగ్రహము మొదలగునవి యుద్దీపన విభావములు. యమ నియమాదులు, సర్వభూత దయ యనుభావములు. మతి స్మృతి ధృతి చింతా వితర్కాదులు వ్యభిచార భావములు. ఇది వీతరాగులకు మోక్షసాధనమై యొప్పుచున్నది.

శాంతరసము గూర్చి కొన్ని భిన్నవాదములు కలవు. భరతముని,

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌచే త్యష్టౌ నాట్యే రసాః స్మృతాః
రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః"[2]

అని యెనిమిది రసములను వాని స్థాయి భావములను పేర్కొనెను. ఇందు శాంతరసము ప్రస్తావింపబడలేదు. కావున భరతునికి శాంతము సమ్మతముకాదని తోచును. కాగా భరతునికి శాంతరసము సమ్మతమే యనుటకు,

"క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం
విశ్రాంతి జననం కాలే నాట్యమేతద్భవిష్యతి.
బ్రహ్మర్షీణాం చ విజ్ఞేయం నాట్యం వృత్తాంత దర్శనం"[3]

1. నాట్యశాస్త్రము : 6 వ అధ్యాయము. పు. 212.
2. ,, : ,, , రసములు. 15, 17 శ్లో.
3. ,, : 1వ అధ్యాయము - నాట్యోత్పత్తి.

అను శ్లోకము లుదాహరణీయములు. ఇందు నాట్యము తపస్వులకు ప్రశాంతిని గూర్చునని భరతుడు చెప్పుటచేత అతడు శాంతమును సూటిగా కాక మాటుగా నంగీకరించెనని తెలియుచున్నది. ఈ విషయమునే శాంతరసమును స్థాపించు ఘట్టమున అభినవగుప్తుడు 'మునినాప్యంగీక్రియతే క్వచిచ్ఛమ ఇతి వదతా' (క్వచిచ్ఛమః అని చెప్పుటచే భరతమునియు శాంతము నామోదించెను) అని వచించెను.

శాంతమును చేర్చి నవరసములను నిర్ధారించి పేర్కొన్నవాడు ఉద్భటభట్టు. అతని శ్లోకము లుదాహృతములైనవి. తర్వాత ఆనంద వర్ధనాభినవగుప్తాదు లనేకులు శాంతరసము నామోదించి సమర్థించినారు. అభినవగుప్తుడు దీనిని బలపరచుటయేకాక మోక్షైక సాధకమగుటచేత శాంతము రసము లన్నిటిలోను శ్రేష్ఠమైనదనియు శాంతమొకటియే ప్రకృతిరస మనియు నిరూపించెను. మరియు,

> "శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః
> తస్మాత్స సర్వశాస్త్రజ్ఞః యస్య శాంతం మనస్సదా"1

"సర్వశాస్త్రములును శమముకొరకే పండితులు నిర్మించిరి. కావున నెవని మనస్సు సర్వదా శాంతముగానుండునో వాడు సర్వశాస్త్రజ్ఞుడు." అని చెప్పబడుటచేత శాంతరసము యొక్క ప్రాధాన్యము ప్రస్ఫుటమగుచున్నది. అభినవగుప్తుని గురువగు భట్టతౌతుడు కూడ శాంతమే శ్రేష్ఠరసమని అభిప్రాయపడినట్లు కాణే పండితుడు తన 'Introduction to Sahitya darpana'లో నిటుల వ్రాసెను.

"We know that Bhattatouta was the guru of Abhinava gupta and that he wrote a work called Kavya Koutuka on which Abhinavagupta wrote a Vivarana. One of his doctrine was that Shanta was at the head of all Rasas as it led on to Moksha"

మహాభారతము, ప్రబోధ చంద్రోదయము, నాగానందము మున్నగునవి శాంతరస ప్రధాన గ్రంథములు.

1. అభినవ భారతి

## ావ్యమున శాంత మంగిగా నిరూపణము :

పోతన చరిత్రమున శాంతరసమే అంగియని పేర్కొంటిని. అది యెట్లు ాసగినదో నిరూపింతును.

వస్తువు నాశ్రయించి విలసిల్లు రసములలో నాయకు నాశ్రయించి ప్రధాన ుగా సాగు రసమే అంగియై విరాజిల్లగలదు. ఏది ఫలముగా కథ పరిసమాప్తి ందునో ఏ ప్రవృత్తి కభిముఖముగా నాయకుని చరిత్ర సాగునో అదియే అంగి 'స మునకు హేతుభూతమగును. ఇందు శాంతమే ఆ స్థానము నలంకరించుచున్నట్లు ెలియగలము.

కావ్యమున నాయకుడగు పోతన ధీరశాంతుడు. అతడు భక్తుడేకాక జ్ఞాన ైరాగ్య సంపన్నుడు. పరమశాంతుడు. ఆయన మోక్షపురుషార్థ మపేక్షించియే శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్' అని ప్రారంభించి భాగవత మాంధ్రీ 'రించెను. మోక్షప్రదమగు భాగవతము నందుకే తెలుగు చేసి పునర్జన్మ లేకుండ ననమును సఫలము చేసికొనెను. అతడైహిక సుఖభోగములందు విరక్తుడు, ిషయవాంఛావిదూరుడు, స్థితప్రజ్ఞుడు. కావ్యమున నాయకుని యీశమదమాదులు, ాంత ప్రకృతి చక్కగా పోషింపబడినవి. కావ్యారంభమున,

> "సొమ్ముల యాసలోఁ బడక క్షుద్రనృపాలుర నీసడించి చొ
> క్కమ్మగు భక్తి భాగవత కావ్యరమన్ గృతి యిచ్చె నీకు శ్రీ
> బమ్మెర పోతరా జతని భవ్యచరిత్రము నే మహాప్రబం
> ధమ్ము నొనర్చి నిన్ను కృతినాథునిగా నొనరించి చెప్పెదన్"[1]

అని చెప్పబడినది. ఇచట 'సొమ్ముల యాసలో బడక క్షుద్ర నృపాలుర నీసడించి' యన్నది పోతన వైరాగ్య ప్రవృత్తిని దెలుపుచున్నది. ఈ వైరాగ్య చిత్తముతో, ఈ యైహిక భోగములు శాశ్వతము కావన్న జ్ఞానముతో, విశ్వమునకు గతియై పతియై పాలించు శ్రీరామప్రభువు నందలి యచంచల భక్తి విశ్వాసములతో ముముక్షువై సాధుజీవితము సాగించి దారిద్ర్యాది విపత్తుల నోర్చి భాగవత

1. పోతన చరిత్రము : 1-2

మాంగ్రీకరించి దుర్మదాంధనృపాల పీడలకు చలింపక నిర్వికారుడై నిశ్చలుడై నిలిచి యిష్టదైవమునకే కృతి సమర్పించుకొని కృతార్థుడాయెను. కావ్యాంతమున - దశమాశ్వాసాంతమున - పోతన 'భాగవత మోక్షప్రదత్వము నిరూపింప ఫల శ్రుతి వినిపించు తలంపున' పరీక్షితుండు భాగవత శ్రవణమున ముక్తిగాంచిన తెఱంగభివర్ణించి చివరకు,

> "మీరలిటులె భాగవత మపార భక్తి
> విని తరించుటకై దానిఁ దెనుఁగు సేసి
> హరికిఁ గృతి నొసంగితి భవతరణమునకు
> ననుచుఁ దత్ఫలశ్రుతిని బోతన వినిచెను"[1]

> "ఏ నృపాలవర్యుఁ డెటు లేలినన్గాని నాకుఁ గల్గినట్టి నష్టమెంత
> మా నృపాలమౌళి మహి ధర్మపాలన న్యాయమున్ బొనర్చె నా కృతి
> నిడి"[2]

అని వ్రాయుడెను. ఇచట మోక్షప్రదమగు భాగవతమును తెలుగు చేసి భవ తరణమునకు హరికి కృతి యిచ్చుటయే ఫలమని విశదీకరింపబడినది, మరియు నే రాజులు తనకు కష్ట నష్టములు కలిగించినను కోపతాపములతో ప్రతీకార చర్యకు పూనుకొనక క్షమాచిత్తముతో శాంతము వహించి తన శ్రీరామప్రభువు పైననే స్థిరభక్తి విశ్వాసము లుంచినట్లు కడదాక వర్ణింపబడినది. ఇట్లు భక్తి జ్ఞాన వైరాగ్యయుతుడగు పోతన మోక్షసాధకమగు జీవితము ప్రధానముగా సాగించినట్లు కావ్యమున నాద్యంతములు వర్ణింపబడుటచేతను, మోక్షము ఫలముగా కథ పరిసమాప్తి చెందినందునను, నాయకుని చరిత్ర శాంతప్రవృత్తి కభిముఖ ముగా సాగినందువల్లను నిందలి యంగిరసము శాంతమే యనుట స్పష్టము.

## శాంతరస నిర్వహణము :

ఆచార్యులవారు స్వయముగా భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నులగుటచేత ప్రత్యక్షానుభవము వలె కావ్యమున శాంత భక్తి రసములను నిసర్గ రమణీయముగా

---

1. పోతనచరిత్రము : 10-120.
2. పోతనచరిత్రము : 10-121.

ండుగా పోషించి యున్నారు. ఇందలి యంగిరసమగు శాంతము భక్తి రసాంత
ర్భూతమై యున్నదను విషయము వెనుక వ్రాయబడెను. భక్తిరస మంతర్భవించి
ంతము వరలినది కనుక కావ్యమున సాధారణముగా శాంతము భక్తిమిశ్రితమై
సాక్షాత్కరించును. కొన్ని సందర్భములలో జ్ఞాన వైరాగ్యాది కలితమయి శాంత
పేపారుచుండును. కావ్యమున పోతన జీవిత మాద్యంతము భక్తి జ్ఞాన వైరాగ్యముల
ంటుపట్టులైన సన్నివేశములతో సాగినట్లు వర్ణింపబడి శాంతరసము పోషింపబడి
యున్నది.

పోతన గర్భమున నున్నపుడు తల్లి లక్కసానమ్మ రామాలయమున
ాగవత ప్రవచనము చేయుచున్న బ్రాహ్మణుని దర్శించి పురాణ శ్రవణము చేసి
యాయనతో సంభాషించిన సన్నివేశము శాంతరస స్ఫూర్తికి పూర్వరంగము
ద్ధము చేసినది. పోతన బాల్యమున తల్లిదండ్రులతో పాల్కురికి జాతర కేగి
వదర్శనము చేసి వీథి భాగవతము చూచి వివరమడుగగా తల్లి యా వీథి
ాగవత తత్త్వము నిరూపించుచు సమాధానము చెప్పిన ఘట్టము శాంతరస
పసారమునకు పోతన హృదయక్షేత్రము ననుకూలమొనర్చినది. సృష్టి రహస్య
మును, ప్రకృతి విశేషములను, పరమాత్మ మహిమను, జీవేశ్వర స్వరూపములను
థి భాగవతమునకు సమన్వయపరచి వేదాంత తత్త్వమును విప్పి చెప్పిన
యా భాగము బాల పోతనకు భావి జీవిత శాంత సౌధ నిర్మాణమునకు చక్కని
నాది వేసినది. బమ్మెరకు తిరుగు ప్రయాణములో మార్గమధ్యమునందలి మావి
తోట వర్ణన జ్ఞాన వైరాగ్యయుతమైన తత్త్వోపదేశము కావించి ప్రశాంత సహకార
నము శాంతమునకు సహకార మొసగునట్లు చేసినది.

"ప్రకృతి పురుషుల దివ్యదాంపత్యమందు నిమ్మనుజ సౌధరాజముల్
బొమ్మరిండ్లు
భూతగణ వృత్తమొక కమ్మ బొమ్మలాట ధరఁ బ్రజల చాపు పుట్టు
కల్ దాఁగురింత."[1]

అనియు

1. పోతనచరిత్రము : 1-186

"ఖేలామంటపమీ జగమ్ము జనముల్ క్రీడా వినోదార్థమై
గాలిం దేలు వినీల నీరదములై కాలాబ్ధి నోలాడు క
ల్లోల వ్రాతములై నటించును మరుల్లోపమ్ముతో నాలు దీ
పాలై మాటుమడంగిపోవు జగదంబాపాణి కన్మూయుటన్"[1]

అనియు నిత్యాదిగా ప్రకృతి పురుషుల తత్త్వము గురించియు, ఇహపరముల గురించియు చక్కని వేదాంత జ్ఞానము వైరాగ్యభావములు విశదీకరింపబడినవి.

ఇక పోతనకు చిదానంద యోగి దర్శనమై రామతారక శారదా మహామంత్రముల నుపదేశించిన ఘట్టము శాంతమునకు పట్టము గట్టినది. మున్యాశ్రమసమ ప్రశాంత నిశాంతవేళావిలసిత శాద్వలముల మేయు గోగణమును, ప్రకృతి దృశ్యములను గాంచుచు తన్మయుడై యున్న పోతనకు చిదానందయోగి దర్శనమిచ్చి, యిచ్చిన పాలుగ్రోలి యానందించి యాశీర్వదించి భగవద్దర్శనలాలసుడైన యతని కలరి,

"పాత్రుడగు బాలు హృదయసుక్షేత్రమందు విత్తె రామతారకమంత్ర బీజమంత
హరియు మానసగుహఁజొచ్చి యార్భటింపఁ గడచనెన్ మమత్వ మదోగ్ర కరిగణమ్ము"[2]

పిమ్మట తన్మంత్రార్థ మహిమ యెఱుకపఱచి జన్మతారకమగు శారదా మహా మంత్రోపదేశము చేసెను ఈ సన్నివేశము భక్తి జ్ఞానముల కాలవాలమై తత్త్వ బీజములు నాటి శాంతవట మేపారుటకు దోహద మొసగినది.

పోతన నిరుపేద జవరాలి నాదుకొని, ఆమెపై చేయివేసిన యువక భూస్వామికి ధ్వనిగర్భిత కవిత వినిపించి యతని మనస్సు మార్చిన సన్నివేశము శాంతచ్ఛాయాక్రాంతమై యున్నది. పోతన స్వాంతమున పెంపొందిన శాంతము పురుషార్థోన్ముఖముగా సాగుచు నీసన్నివేశమున నన్యుల కుపకృతి కావించుచు ప్రభావితము చేయదొడగినది. అది మరింత ప్రవృద్ధమై వేశ్యాని శ్రీనాథుని వంటి

1. పోతన చరిత్రము : 1-188
2. పోతన చరిత్రము : 2-35

మహాకవి చిత్తమునకు శాంతి చేకూర్చగలిగినది. అతడు భార్యా వియోగమునంది చిట్టి పట్టిని వెంటబెట్టుకొని పోతన యింటికి వచ్చి ధైర్యము చెడి దుఃఖించగా పోతన 'శ్రీనాథుని వలపోఁత నుడుపఁగా విరాగపూర్ణ వచస్సంఘాత సుబోధ సమాహిత చేతసునిన్ జేయ' ననేక జ్ఞానవైరాగ్య భాషణలు చేసెను. పోతన పలికిన తాత్త్విక వచనములు శ్రీనాథునకు వలె దుఃఖార్తుల కుపశమనకారులై యొప్పుచున్నవి.

"ఆయు వరిగిన కొలఁది తా ననవరతముఁ జనఁదొడగెఁ గాల సామీప్య
మునకె ప్రాణి
ఇది విషాదాంతనాటక మిఁదుఁ జివర మంగళము పాడఁగల్గు సమర్థుఁ
డెవఁడు?"[1]

"నానాచిత్ర విచిత్ర వర్ణగత సౌందర్యంబులెల్లన్ లయం
బూనన్ నీడను నేత్రహాసముఖ హస్తోరు ప్రదేశాల వి
న్నాణంబుల్ గనరావు భూశయనమున్ దానొంద రూపప్రతుల్
మేనన్ నీడవలెన్ జనించు నరుతో మృత్యు స్వరూపంబనన్"[2]

"పాంచభౌతిక సోదరభావగతిని జల్లఁగా దేహరథ మెట్లొ సాగుఁగాని
పాలిపగ నవి కచ్చకుఁ గాలుద్రవ్వి కుపితగతి వేరుపడఁ గొంప గూలిపోవు"[3]

ఇత్యాది జ్ఞాన వైరాగ్య విషయములతో పోతన 'శ్రీనాథు హృదయమునకు సరస శీతానునయ వాక్య చందనముల నలఁది దుఃఖాగ్ని సంతాప మపనయించెను'.

ఇచటి పోతన భాషణములు,

"జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి"[4]

1. పోతన చరిత్రము : 3-327
2. ,, ,, : 3-328.
3. ,, ,, : 3-332
4. భగవద్గీత : 2-27

కెరిగించి శ్రీనాథునకు శారదలేఖ నందించిరి. రాజు శ్రీనాథుని లేఖావృత్తాంత మెరిగి విచారించెను. పిమ్మట అతడు శ్రీనాథునితో ఉపవనికి పోయి శారదతో పాటు పోతనను రాచకొండకే పిలిపించెదనని చెప్పి భాగవతము నంకితము గొన వలెనను తన కాంక్ష నతనికి తెలిపి పోతనకవి నాహ్వానించుటకు తన పరివారము నంపెను. సేనాపతి పరివారముతో నేగి బమ్మెరలో రామాలయమున భాగవతము వినిపించుచున్న పోతనను సందర్శించి రాజాభిమతము నతని కెరిగించెను. పోతన రాచకొండకు రాజాల నందుకు చింతించుచు శ్రీరాము నాజ్ఞను సేనాపతికి విన్న వించెను. సేనాపతి రాజాజ్ఞను ధిక్కరింపజాలమని చెప్పగా పోతన రాజాజ్ఞకంటె రామాజ్ఞ యధికమనెను. చమూపతి క్రుద్ధుడై సైన్యమును పురికొల్పి భాగవతము నపహరించెను. అంతలో గ్రామస్థుడగు నొక యువకవీరుడు విజృంభించి కత్తి త్రిప్పుచు సైన్యము నెదిరించి చీకాకొనరించెను. అప్పుడే ఆ చెంతకు వచ్చిన పందుల గుంపుపై నొక కుక్క చెలరేగగా మందలోని మేటి వరాహ మొకటి బెదరి సైన్యముపై బడెను. సైనికులు పందితో పోరాడిరి. పంది సైన్యమును చెల్లా చెదరు కావింప, వశపడక సేనాపతి తన తలమీది భాగవతము వరాహము వద్ద పడగా విడిచిపెట్టి సైన్యయుక్తుడై పారిపోయెను. ఆ మేటి వరాహము ప్రశాంతమై భాగవతము పోతనకందునట్లు చేసి చూచుచుండగనే పరుగుతీసి అదృశ్యమాయెను. సైన్యముతో పోరాడిన వీరుడు మున్ను సర్పదష్టుడై తన చేత పునరుజ్జీవితుడైన పోచయ్య కుమారుడనియు, తండ్రికి చేసిన మేలు మరువక ప్రత్యుపకారము చేసినాడనియు తెలిసి పోతన మిక్కిలి కృతజ్ఞుడయ్యెను. ఇక పందులను దోలు వాలుగంటి మున్ను యజమానిచేత పరాభవింపబడి పోతనగారి అన్న పుత్రుముల ఆదరము గాంచినదై పందులను పెంచుకొనుచున్న యది నాటి ఉపకారము మరు వక మేటి పందిమీదికి కుక్క నుసికొల్పినదని తెలిసి ఆమెవల్ల వరాహవృత్తాంతము నరసి రామచంద్రుడే ఆ రూపమున వచ్చి దయతో భాగవతము రక్షించెనని గ్రహించి మిక్కిలి ఆనందించి భక్తిపరవశుడై వినుతించెను.

సేనాపతి రాజుతో పోతన భాగవతాపహరణార్థము జరిగిన యుద్ధ విష యము నివేదించెను. రాజు శ్రీనాథుని బమ్మెర కంపెను. శ్రీనాథుడు సపరివార ముగా బమ్మెరకు ప్రయాణమై మార్గమధ్యమున నొక తోటలో విడిసి యుండ నొక జంగమకన్య వచ్చి పోతన భాగవతమును నరాంకితము చేయడని నిర్ధారించి

మహాకవి చిత్తమునకు శాంతి చేకూర్చగలిగినది. అతడు భార్యా వియోగమునంది చిట్టి పట్టిని వెంటబెట్టుకొని పోతన యింటికి వచ్చి ధైర్యము చెడి దుఃఖించగా పోతన 'శ్రీనాథుని వలపోఁత నుడుపఁగా విరాగపూర్ణ వచస్సంఘాత సుబోధ సమాహిత చేతసునిన్ జేయ' ననేక జ్ఞానవైరాగ్య భాషణలు చేసెను. పోతన పలికిన తాత్త్విక వచనములు శ్రీనాథునకు వలె దుఃఖార్తుల కుపశమనకారులై యొప్పుచున్నవి.

"ఆయు వరిగిన కొలఁది తా ననవరతముఁ జనఁదొడగెఁ గాల సామీప్య
మునకె ప్రాణి
ఇది విషాదాంతనాటక మిఁదుఁ జివర మంగళము పాడఁగల్గు సమర్థుఁ
డెవఁడు?"1

"నానాచిత్ర విచిత్ర వర్ణగత సౌందర్యంబులెల్లన్ లయం
బూనున్ నీడను నేత్రహాసముఖ హస్తోరు ప్రదేశాల వి
న్నాణంబుల్ గనరావు భూశయనమున్ దానొంద రూపప్రతుల్
మేనన్ నీడవలెన్ జనించు నరుతో మృత్యు స్వరూపంబనన్"2

"పాంచభౌతిక సోదరభావగతిని జల్లఁగా దేహరథ మెట్లొ సాగుఁగాని
పాలిపగ నవి కచ్చకుఁ గాలుద్రవ్వి కుపితగతి వేరుపడఁ గొంప గూలిపోవు"3

ఇత్యాది జ్ఞాన వైరాగ్య విషయములతో పోతన 'శ్రీనాథు హృదయమునకు సరస శీతానునయ వాక్య చందనముల నలఁది దుఃఖాగ్ని సంతాప మపనయించెను'.

ఇచటి పోతన భాషణములు,

"జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి"4

1. పోతన చరిత్రము : 3-327
2. ,, ,, : 3-328.
3. ,, ,, : 3-332
4. భగవద్గీత : 2- 27

అని తప్పించరాని జననమరణములకు శోకించుట తగదన్న గీతోపదేశానుసారము సాగినవి. మరియు మృత్యు లక్షణము, జీవ లక్షణము, సృష్టి స్థితిలయ స్వరూపము, పాంచభౌతిక దేహాస్థిరత్వము, అవినాశియు పరిపూర్ణమునగు పరమాత్మ లక్షణము నిందు చక్కని యుపమానములతో వివరింపబడి శాంతరసామృతము నాస్వాదింప జేసి యాత్మతాపవినివారకమై యలరించుచున్నవి.

పోతన శ్రీనాథునితోగూడి రాచకొండకేగి రాజప్రార్థనచేత శ్రీనాథుని తర్వాత తానుపవనమును వర్ణించిన తెలుగు శాంతరస ప్రవాహమునకు సమ్యక్ సారణులను దీరిచినది. పోతన తన చిత్తవృత్తి కనుగుణముగా వనమును వర్ణించెను. ఉపవనములోని తరువులు "దళపుష్పఫల జలమ్ముల నలఘుమతిన్ విశ్వరూపి నర్చించుచు నిశ్చలవృత్తిఁ బొల్చు జన్మసఫలతను గనునంచు ననుభవముఁదెల్పు' నని భావించి చెప్పెను. అట్లే చెట్లెల్ల తాపసులవలె తలక్రిందుగ తపమొనర్చుచున్న వనియు, బాతులు నీటిలో నీదుచు మునిగి తేలుచు సంసారసాగరమున నంటియంటక జీవించు బ్రహ్మజ్ఞానివలె వచ్చి దరిజేరుననియు, పుష్పములు రెన్నాళ్ల సంతోషముగా నవ్వి జన్మభూమి సమర్చలో వ్రాలునవియు, వనలతలెన్ని వసంతములలో చిగిర్చి పూచి, కాచి యెన్ని శిశిరములలో వాడి యుడిగి పోయెనోయనియు ఇత్యాదిగా వర్ణించిన యా ఘట్టమున దైవభక్తి, మున్యాశ్రమ పావనభావన, త్యాగ సమర్పణ చిత్తము, సుఖ దుఃఖముల యస్థిరత్వము, వైరాగ్యచింత మున్నగునవి ప్రస్తుతములై శాంత రసధారల జాలు వారించినవి.

సింగభూపాలుడు పోతనను తన యాస్థాన కవిమండలి కధ్యక్షునిగా సన్మానింపబూనినప్పుడాతడు సమ్మతింపక 'ఈ కవీంద్రు జన్మ మీశ్వరునికె దక్క నొరులకెప్డు చేతులొగ్గి యడుగ'దని తిరస్కరించినప్పుడును, సింగనృపతి చమూపతి బమ్మెర వచ్చి పోతనను రాచకొండకు రమ్మని రాజాజ్ఞ తెలిపినపుడు ఆతడు రాజాజ్ఞకంటె రామాజ్ఞ గొప్పదని ప్రతిఘటించినప్పుడును, విలపించుచు దర్శన మిచ్చిన వాగ్దేవిని కర్ణాటకిరాట కీచకులకు నిన్నమ్మనని వాగ్దానము చేసి కర్ణాట సేనాపతి తనను తోడ్కొనిపోవుటకు రాగా రాజాలనని ధీరచిత్తుడై ధిక్కరించినప్పుడును పోతనలోని యైహిక భోగ విముఖత్వము ప్రస్ఫుటమై ధర్మవీర విలసితమైన శాంతము తనరారినది.

పోతన జననీజనకుల యస్థినిమజ్జనార్థము గంగకు బోయి గ్రహణ స్నానముచేసి సైకతమున శంకరధ్యానమగ్నుడై యుండ శ్రీరామ సాక్షాత్కారమై భాగవతాంధ్రీకరణాదేశము లభించగా పోతన భక్తిపరవశుడై యా రాముని వినుతించిన యా ఘట్టమెల్ల భక్తి రసమిళితమైన శాంతమునకు నెలవై చెలువొందు చున్నది.

భాగవతాంధ్రీకరణమునకు పూర్వము చెలరేగిన క్షామమున పోతన దీన భిక్షుకుని కాపాడి, పశ్చాత్తప్తుడైన లోభిసెట్టికి హితోపదేశము చేసిన ఘట్టము నందెల్ల కరుణరసానుప్రాణితమైన శాంతమాస్వాద్య మగుచున్నది.

పోతన భాగవతరచనారంభమునకు ముందు చిదానంద గురువరేణ్యుని దర్శించి తద్గురుస్తవము గావించి శ్రీరామాదేశానుసారముగ తాను భాగవతాంధ్రీ కరణ మొనరింపబూనిన విషయము నివేదించి భాగవత రహస్యము, తత్త్వజ్ఞాన మెరిగింప వేడగా యోగి పోతన సందేహములు నివృత్తిచేసి భక్తి జ్ఞానాదుల స్వరూ పము విప్పిచెప్పి తత్త్వోపదేశముచేసిన సన్నివేశము భక్తిజ్ఞానయుతమైన శాంతము నకు సదనమై పొదలుచున్నది.

శ్రీనాథుడు మల్లన వరపూజకువచ్చినప్పుడు దారిద్ర్యపీడితుడగు పోతనను గాంచి యతనిని రాజదర్శనమునకు పురికొల్పుటకై ధనావసరమహిమను బహు భంగుల వివరించి చెప్పగా నతడు నిర్వికార చిత్తుడై ధనాశ, భోగలాలసత్వము పాపహేతువులనియు నిరాడంబర జీవనమే తన కిష్టమనియు తన దృఢవైరాగ్య చిత్తవృత్తిని నొక్కిచెప్పిన భాగము శాంతమును నితాంతము పోషించుచున్నది. అట్లే కన్నడ సైనికుల నోడించి రాచకొండ దండనాథుడు భాగవతము తీసికొని వెడలిపోయిన దురంతమునకు మనస్సు వికలమై నారయాది శిష్యులతో,

> "మహిత వేదనా దోధూయమాన లూన వృంత జలజమ్ము మామక
> స్వాంత మిపుడొ
> నేల్రవాలెను, జీవనశ్రీలఁ జిల్కు మలయ పవనమ్ము దీని మేల్కొలుప
> లేదు."1

1. పోతన చరిత్రము : 9-204

"ఈ యనంత నీలాకాశ తోయనిధుల నుభయ పక్షాలఁ దరియించి
ప్రభువిభూతి
నలరు నుత్తుంగ ధర్మ హర్మ్యాగ్ర శిఖరభాగముల వ్రాలి శాంతిగా బ్రతుక
నిండు''[1]

అని యీరీతిగా పలికి తన వైరాగ్యప్రవృత్తిని వెల్లడించి విరాగియై తీర్థయాత్రలు చేయుచు ఆయా క్షేత్ర దైవతముల సందర్శన స్తుతులు కావించుచు పోయిన ఘట్టము శాంతరసస్థాయికి పరాకాష్ఠ యగునట్లు నిర్వహింపబడినది. ఇందు శిష్యులతో వైరాగ్యప్రవృత్తిని దెల్పునపుడొకింత కరుణచ్ఛాయ, తీర్థయాత్రలలో భక్తి రసము శాంతమునకు సౌష్ఠవ మాపాదించినవి.

కావ్యాంతమున పోతన యొంటిమిట్టలో శ్రీరామచంద్రునికి కృతిసమర్పణోత్సవము జరిపి భాగవత ఫలశ్రుతి వినిపించిన ఘట్టము భక్తిసంభరితమైన శాంతరసమునకు నిధానమై విరాజిల్లినది.

పోతన యాలంబనముననే కాక యన్య సందర్భములందును శాంత మొకింత పోషింపబడి యున్నది. కావ్యోపక్రమములో వ్యాసాశ్రమ వర్ణనము శాంతమున కద్దము పట్టుచున్నది. లక్కమాంబ పోతన దంపతుల నింట విడచి తక్కిన కుటుంబ సభ్యులతో తీర్థయాత్రలు చేసి వచ్చిన ఘట్టము భక్తితో గూడిన శాంతమునకు తావలమై యున్నది. ఇక కావ్యానుబంధము నందలి ప్రహ్లాదచరిత్ర ఘట్టమున భక్తి శాంత రసములు మధుర మంజులముగా జాలువారినవి.

ఈ విధముగా కావ్యక్షేత్రమున మొదటినుండి తుదివరకు, ఆయా ఘట్టములందు భక్త్యాదులను మిశితము చేసికొనుచు శాంతరస గంగ యాహ్లాద తరంగ యగుచు సాగినది.

## భక్తిరస పోషణము :

కావ్యమున నంగరసములలో ప్రథమగణ్యమైనది భక్తి. ఇది యిందు శాంతమున కించుమించు సమానముగా చెలువొందుచున్నది. ఇది యంగియగు శాంతము

1. పోతనచరిత్రము : 9-210

నందంతర్భవించినదని వెనుక తెలుపబడెను. భక్తి జ్ఞాన వైరాగ్యాములవల్ల శాంత మేపారునని చెప్పబడినందున శాంతరస పోషణమునకు భక్తి యంగమై యొప్పు చున్నది. ఈ విషయము శాంతరస నిర్వాహణములో వివరింపబడెను. ఇచట ప్రత్యేకముగా భక్తిరసము కావ్యమున పోషింపబడిన విషయము చర్చింపబడును. కావ్యపరివ్యాప్తమై యున్న భక్తిరసము గూర్చి యొకింత ప్రస్తావించుట అప్రస్తు తము కాదని వ్రాయుదును.

## భక్తిరస చర్చ :

భక్తి రసమా? భావమా? యను విషయమున మతభేదములు కలవు. దాదా పాలంకారికులందరు భక్తి భావమనియే నిర్ధారించిరి. దేవతా విషయకమగు రతి భావము కావున భక్తి భావమే కాని రసము కాదని వారి అభిప్రాయము. కొందరు భక్తి శాంతమున నంతర్భవించునని తలంచిరి. 'శృంగార హాస్య కరుణ ...' ఇత్యాదిగా ఉద్భటభట్టు పేర్కొనిన నవరసములలో భక్తి చేర్చబడలేదు. కాగా 'ఉజ్జ్వల నీలమణి' కర్తయగు రూపగోస్వామి, మధుసూదన సరస్వతి యను నిరువురాలంకారికులు మాత్రము భక్తికి రసత్వమును స్థాపించిరి. మధుసూదన సరస్వతి 'భగవద్భక్తి రసాయనము' అను గ్రంథమున సప్రమాణముగా భక్తికి రసత్వమునిట్లు సిద్ధాంతీకరించెను.

''రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథోర్జితః (తథాంజితః)
భావప్రోక్తో రసో నేతి యదుక్తం రసకోవిదైః
దేవాంతరేషు జీవత్వాత్ పరానందాఽప్రకాశనాత్
తద్యోజ్యం; పరమానందరూపే న పరమాత్మని
కాంతాది విషయావాయే రసాద్యాస్తత్ర నేదృశం
రసత్వం పుష్యతే పూర్ణ సుఖా స్పర్శిత్వ కారణాత్
పరిపూర్ణ రసా క్షుద్ర రసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా
క్రోధ శోక భయాదీనాం సాక్షాత్సుఖ విరోధినాం
రసత్వ మభ్యుపగతం తథాఽనుభవ మాత్రతః

24)

ఇహానుభవ సిద్ధేఽపి సహస్రగుణితో రసః
జడేనైవ త్వయాకస్మాదకస్మాదపలభ్యతే"[1]

'దేవాది విషయకమైన రతి భావమనియు రసము కాదనియు రసకోవిదులు నుడివిరి. అయితే ఇతర దేవతావిషయకమగు రతి భావమే. ఏలయన వారు జీవులేకనుక పరమానందము కలుగదు. కాని పరమాత్మ స్వరూపుడగు శ్రీకృష్ణునె రతి పరమానంద సంధాయకమగును. కాంతాది విషయకములగు నే రసములందును భగవద్రతి యందు వలె పూర్ణానందము కలుగదు. కనుక ఆ రసములందు తగిన పుష్టిలేదు. అవి క్షుద్ర రసములు. భగవద్రతియే పూర్ణరసము. మిణుగురు పురుగులకంటె సూర్యకాంతి ఎట్లు బలవత్తరమో యట్లది మిగిలిన రసములకన్న శ్రేష్ఠతరము. అనుభవమాత్రము చేతనే సాక్షాత్సుఖ విరోధములైన క్రోధ శోక భయాదులకు రసత్వమంగీకృతమై యుండగా ననుభవసిద్ధమై తక్కిన రసములకంటె వేయి రెట్లధికముగా రస్యమానమగుచున్న భక్తి రసము కాదనుట ఎట్లు?' అని భక్తికి రసత్వమును స్థాపించుటయే కాక శృంగారాదీతర రసములన్నిటికంటె భక్తి రసమే శ్రేష్ఠమైనదని నిరూపించెను. అతడే విభావాదుల నీరీతిగా తెలిపెను.

భక్తిరసమునకు భగవంతుడాలంబన విభావము. అతని చరిత్రము లుద్దీపన విభావములు. భగవదాకార చిత్తవృత్తి స్థాయిభావము. అదియే భగవద్రతి. తత్కాల జనితములైన నేత్రాది వికారము లనుభావములు. నిర్వేదశంకాహర్షాదులు వ్యభిచారులు. భగవదాకార చిత్తవృత్తి రూపమైన భగవద్రతి ఉపర్యుక్త విభావాదులచేత పోషింపబడి రసత్వమునందును. శ్రీమహాభాగవతము, తులసీరామాయణము వంటివి భక్తిరస ప్రధానములగు కావ్యములు.

## పోతనచరిత్రమున శాంతమున కనుప్రాణితమైన భక్తి రసము :

భక్తుడగు బమ్మెర పోతన చరిత్రము వర్ణించిన యీ కావ్యమునందు భక్తి రసము భాగవతమునందువలె నిండుగా మెండుగా పోషింపబడియున్నది. శాంతరస నిర్వహణలో శాంతమున కనుప్రాణితముగా చెప్పబడిన సన్నివేశములలోనివికాక

1. భగవద్భక్తి రసాయనము : ద్వితీయోల్లాసము, శ్లో. 74 నుండి 79.

తదితరమైన సందర్భములలోని భక్తి యిచటనుదాహృతమగును. పోతనకు మాతృగర్భమున నున్నపుడే భాగవత శ్రవణము వలన ప్రహ్లాదునివలె హృదయము భక్తి ముద్రితమై యొప్పెను. బాల్యమున పాల్కురికి జాతరలో వీథిభాగవత తత్త్వము విప్పిచెప్పినప్పుడును, మార్గమధ్యమునందలి మావితోటలో వర్ణన చేయబడినప్పుడును భక్తిభావములకు బీజములు పడెను. చిదానందయోగి రామతారక శారదా మంత్రముల యుపదేశమున భక్తిలతల కాలవాలమును దోహదమును లభించెను.

పోతన గ్రహణకాలమున జననీ జనకుల యస్థుల నిమజ్జనార్థము గంగకు వెడలి నప్పుడార్తితో చేసిన శ్రీరామ ప్రార్థన, తర్వాతి మహేశ్వరధ్యానము, రామ సాక్షాత్కారము కాగా కావించిన శ్రీరామస్తవము- ఇవెల్ల భక్తిరస తరంగిత ములై యొప్పుచున్నవి. పోతన యొనర్చిన గోదావరీస్తవము సైతము భక్తి భావములకు తావలమైయున్నది. గంటమిచ్చి తనయింటి వెలుపల నదృశ్యుడైన భిక్షుకుని తలచుకొని తపించిన సన్నివేశము భక్తిచ్ఛవి విలసితమైయున్నది. రామశర్మ 'అల వైకుంఠ పురంబులో....'అను పద్యము వ్రాసినది తెలిసి రాముడే వచ్చి వ్రాసి పోయెనని గ్రహించి యత్యంత భక్తి తాత్పర్యములతో తన్మయుడైన సన్నివేశమున భక్తిరస మలుగులు వారినది.

''అల వైకుంఠపురంబులో.... సంరంభియై''

"అను నా పద్యపదమ్ములన్ హరిపదాబ్జాభాసమున్ సల్పి గా
యనతన్ బాడుచు గండ్లకద్దుకొని భక్త్యావేశ సమ్మగ్న చే
తనుడై బాహ్యప్రపంచమున్ మఱచి సోత్కంఠతన్ స్రవద్బాష్పపూ
ర నిపాతోష్ణ జలాభిషేకముల నారాధించు వానిన్ దమిన్"[1]

"అద్దిర! శ్రీహరి వ్రాసిన పద్దియ మిదియనును దాళపత్రము గొనుచున్
ముద్దిడుకొను గనుదమ్ముల నద్దుకొనున్ మౌళిఁదాల్చు నలముకొను నెదన్"[2]

అని యిత్యాదిగా చేసిన వర్ణనమున మధుసూదన సరస్వతి వివరించినట్లు విభావాది సామగ్రి సాకల్యముగా సమకూడి రస నిర్వహణము రమ్యముగా జరిగినది.

1,2. పోతన చరిత్రము : 6-171, 172.

భాగవతమును రక్షించిన వరాహము యజ్ఞవరాహమే యని తలంచి నుతించిన విషయము భక్తిస్ఫూర్తి కలదై యున్నది.

మెట్టు కుధరముపై రామప్పను రాముని దర్శించి యా రామునితో తన యావేదనము నివేదనము చేసికొన్నప్పుడును కన్నడ పడవాలు భాగవతమును హరించగా రామునితో నావేదనము తెలుపుకొన్నప్పుడును ఆర్తిసంయుతమైన భక్తి జాలువారినది. పిమ్మట భాగవతము రాచకొండ సేనాపతిచేత నపహృతము కాగా విరక్తుడై తీర్థయాత్రలు చేయుచు ఆయా దైవతములను దర్శించి తన్మహత్త్వాదులను ప్రస్తుతించిన ఘట్టము భక్తిరస బంధురమై యున్నది. మరియు నొంటిమిట్టలో పోతన భాగవత శైథిల్య విషయము తెలిసి తదీయ రక్షణార్థ మార్తితో శ్రీరామ చంద్రుని ప్రార్థించుచు భాగవత గాథల నాటవుగా గానముచేసిన ఘట్టము కరుణ విలసిత భక్తిరస నిర్భరమై వరలుచున్నది.

కావ్యాంతమున పోతన ఒంటిమిట్ట రఘురామునికి కృతి సమర్పణోత్సవము చేసిన ఘట్టము కల్యాణాత్మకమైన భక్తిరసాయన మందించి సరసులకు విందు చేయుచున్నది.

నాయకుడగు పోతన కృతముగనేకాక యన్యాశ్రితమయ్యు కావ్యమున భక్తి రసము నిర్వహింపబడినది. ఇందు పోతనసతి నర్సమాంబ సేసిన దుర్గాస్తవము ముఖ్యమైనది. పోతన పొలాలు కోతపట్టించి యింటికి రాకయుండ నర్సమాంబ వనభోజనమునకు వండిన వంటకములను దుర్గాదేవికి నివేదింపబోయి యాపన్న శరణ్యయగు నా జగన్మాత నార్తితో స్తుతి ప్రార్థనలు కావించెను.

> "తల్లీ! యెల్లపుడున్ గళేబరగతార్థంబంటి ముక్కంటిలోఁ
> దల్లినమ్మయి యుండి నీ దుహిత యేతద్రీతి నీముందుఖో
> ఘిల్లంజూతువె నాఁడు రుక్మిణికి నీవేకావె ప్రార్థింపఁగా
> పుల్లాబ్జాక్షు నొసంగి ప్రోచితివి నా పూజల్ వృథాసేతువే?"[1]

యని మొరపెట్టినది. పరాశక్తిని వర్ణించిన ఈ దిగువ పద్యమా దేవదేవీ మహో త్కృష్ట మహిమను సాక్షాత్కరింపజేయుచున్నది.

---

1. పోతన చరిత్రము : 3-127

"త్రయ్యంత సారామృత సరోవర స్వర్ణ సరసీరుహమ్ములే చరణయుగళి
పరభక్తమానస వాంఛాఫలప్రద కల్పకశాఖలే కరయుగములు
సకలభూతప్రాణ సంత్రాణచణ ఘృణాదుగ్ధార్ణవమ్మదే దొడ్డ కుక్షి
విగతక్షయ కళంక విరహిత రాకాసుధాంశు సంకేతమే యాననమ్ము
అఖిలవేధోండ విలయ సృష్ట్యాది చిత్రలీలలే యక్షిమీలనోన్మీలనములు
అవని సుఖ దుఃఖ సంజ్ఞలే హాసరోష కాంతులో; ఆ శివామూర్తిం గాంతు
నిన్ను"1

మరియు 'అంబ! నీ దరికి నొంటిగ వచ్చితి జంటగల్గి నీ యనుపమ సత్కృపాజలధి నాత్మజపై ప్రసరింపనీయరాదనుకొనెదే మొ తల్లి! సుత నారటపెట్టిన దిక్కు చిక్కునే' యనియు మున్ను రుక్మిణి వేడగా శ్రీకృష్ణుని లభింపజేసినట్లు నా భర్త నన్నేలకొనునట్లు చేయవే యనియు పరిపరి విధముల భక్తిప్రపత్తులతో ప్రార్థన చేసిన యీ సన్నివేశము సహృదయులను భక్తిరస సరోవరమున నోలలాడించుచున్నది.

కావ్యోపక్రమమున నారదుడు విష్ణుస్తవ మొనరించినచోటు, వ్యాసుడు శివస్తవము సవరించిన సన్నివేశము, పోతన తలిదండ్రులు తీర్థయాత్రలు చేసిన ఘట్టము భక్తివిలసితములై యున్నవి. కావ్యానుబంధములోని ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షణ కథ భక్తిరస నిధానములై పరిఢవిల్లుచున్నవి.

ఈ విధముగా కావ్యమున నాయకాశ్రితముగను తదితర పాత్రోపస్కృతముగను భక్తిరసము వెల్లివిరిసి భక్తులకు కవితానురక్తులకు పరమాహ్లాదకరమై వరలుచున్నది.

## శృంగారము :

'శృంగార ఏవ ఏకో రసః' అని భోజునిచేత సిద్ధాంతీకరించబడిన శృంగార రసము పోతన చరిత్రమున సముచితముగా నిర్వహింపబడినది. కావ్యమున నిది శాంత భక్తి రసముల తర్వాత నెన్నదగియున్నది. నాతివిస్తరమైన యీ శృంగారము

---

1. పోతన చరిత్రము : 3-170

శృంగాయమానమై తృతీయాశ్వాసమున విరాజిల్లుచున్నది. ఇది పోతన దంపతులకు సంబంధించినది. ఈ విషయమునకు సూచనగా తృతీయాశ్వాసారంభమున

"రససుధా సరోవర మతి రమ్యతరము ఆంధ్రి శృంగారఝరము
ప్రహ్లాదకరము
అవధరింపుము శ్రీపోతనార్య చరిత మహిత కరుణాలవాల! రామ
నరపాల!"[1]

అని వ్రాసియుండిరి. దంపతుల నొక్కటి చేసినది మొదలుకొని పోతన తపోభంగ భయమున భార్యను గాంచకుండ నిగ్రహముతో నున్నంతకాలము భార్య విరహార్తి గుందినట్లు వర్ణించిన భాగమున పూర్వరాగ విప్రలంభము పోషింపబడినది.

"కనులముందు సెజ్జఁ గనఁబడు నాథుండు చనఁగరాని దూరమున వసించెఁ
జేతి దర్పణమునఁ జెలువారు శశిబింబ మందరానిచోట నలరునటుల"[2]

అన్నట్లు నాథు డేలుకొనకయుండ నర్సమాంబ పడకయందు 'కంటకముల బొరలు కరణి వలబ నామె జీవన మపరిపూర్ణ ఘటమునందుండి తొనఁకాడు జీవనాథమయ్యె' నని యిత్యాదిగా వర్ణించిన యీ ఘట్టమున విప్రలంభశృంగారము చక్కగా నిర్వహింపబడినది.

నర్సమాంబ దుర్గానివేదితాన్నము గొని పొలాలలో పోతన యున్నయెడకు వానలో తడియుచు వచ్చి కాలుజారి పడబోవ పోతన ఆమెను లేవనెత్తి సాంత్వన వచనములు నాదరించినది మొదలుకొని యా దంపతుల సమాగమము వరకు గల సన్నివేశమున మరల పూర్వరాగ విప్రలంభము పోతన కృతముగ నిర్వహింపబడినది. తడిసి యొడలి కంటుకొనిపోయిన జిలుగు వలువతో చెలువుగులుకు చెలువను తిలకించి పోతన యపూర్వరాగ వివశుడై తపించెను.

"అద్దిర! యప్పుడాయువతి యందము చందముఁ గాంచనచ్చునన్
గ్రుద్దిన యట్టు లంగచయ కోమల సౌష్ఠవ మెంతొ వింతగా

1. పోతన చరిత్రము : 3-2
2. ,, ,, : 3-30

దిద్ది మరుండు నేర్పుమెయిఁ దీసిన చిత్రపటమ్ము కిమ్ముగా
నద్దము గట్టి పెట్టిరటులయ్యెను సన్నని చీరమాటునన్"[1]

ఈ విధమైన యామె మనోహరరూపమును గాంచి 'తను దాను మఱచి విశ్వమును మఱచి పోతన యతిపరవశుడై యొక క్రొత్తలోకపు టనుభవమును గనెను.' పిదప తడిసిన యుడుపును శుద్ధిచేసి స్నానమాడుటకు చెరువుదరికేగు సతివెంట పోవలె ననిపించు వాంఛ నాత్మసంయమనమున నణచుకొని యామె మధురాకృతుల ననేక విధముల తలపోసెను.

"దొంగచూపుల నంపి యా తోయజాక్షి నాదు చైతన్యము హరించి పోఁదొడంగె
నరుగునది యామె యగునె? కా దరసిచూడ నేనె ననువీడి చనుచుంటి నిశ్చయముగ"[2]

అని మధురవేదన ననుభవించెను. చిత్తమును విషయాంతరములకు మరలించుట కచటి ప్రకృతిదృశ్యముల నవలోకించుచుండ సర్వము శృంగారమయమై కానబడి మరింత విరహవేదన ననుభవించెను. ముద్దుముద్దుగ గునిసి యాడుచు కూడు కపోత మిథునమును, కమలములపై వ్రాలి సొగియు భ్రమరములను మున్నగువానిని గాంచి చలించెను. భార్య సరస్సునకు వెడలి తడవాయెనేమిటని యచ్చటికిపోయి యామె స్నానముచేసి ధౌతవస్త్రము దాల్చుకొనెడి రమణీయదృశ్యము కనులబడ మరల కష్టముతో తనచోటికి తిరిగివచ్చి యామె యందచందాలె తలపోయసాగెను. ఆమె స్నాతయై వచ్చి దేవీ నివేదితాన్నమును వడ్డింపగా 'మానినీరూప మధుర భావానుభూతి' వేదనజెందుచు నరుచివల్ల తినవశముకాక వడ్డించునామె చేతినిపట్టి యాపెను. ఇట్లు కరస్పర్శ యొనర్చి, సత్రపాచంచలేక్షణముల తన్నుజూచు కోమలి మోముగాంచి స్మృతి కోల్పోయెను. ఆ శరద్రాత్రి భూమి నేకాంతమందిర మొనర్చ పోతన సతితో వినోదింప నుత్సహించునంతలో సందెకావలికని పాలేరు వచ్చి వారి నింటికంపెను. పోతన శారద యామినీ భామినీ విలాసముల కుత్తేజితు డగుచు మగువను దోడ్కొని మందిరమున కేతెంచెను. అక్కడ మదన తాపో

1. పోతన చరిత్రము : 3-153
2. ,, ,, : 3-162

పశమనమగునని సదనవనలతా మండపమును జేరగా నచటి తీవలు పూవులు సురభిళ మందానిలములు మనోభవాగ్నిని మరింత ప్రజ్వరిల్ల జేసెను. ఆ చోట నిలువలేక వచ్చి భోజనముసైపక శయ్యామందిరము చేరి తల్పముపై పరుండి యిట్లు చింతించెను.

"కోమలి ప్రేమ దృగ్రుచి రగుల్కొని నా యెదకంటుకొన్న యీ
కామ దవానలమ్ము నతిగాఁ బెనుచున్ మలయానిలార్భట
మ్మీ మదనాగ్ని పైన ఘటియించెడి వెన్నెల వెన్నముద్దయై
నా మహనీయ దీక్షలను నాశమొనర్పక యుండు టెట్లిఁకన్"[1]

ఈ రీతిగా దురంత దుర్దాంత కందర్ప వేదనకు గురియైనట్లు వర్ణించిన యీ భాగమున విప్రలంభము చక్కగా పోషింపబడినది.

పిమ్మట పోతన తన వల్లభను గూడి క్రీడించిన సన్నివేశమున సంభోగ శృంగారము చారుతరముగ నిర్వహింపబడినది.

వ్రతభంగమెంచి 'విరహార్తిని గుందుచున్న' పోతనను గన్గొని నర్సమాంబ 'తన కన్గొనల ప్రణయత్రపాధునుల్ పెనగొన కంకణక్వణన మెసంగ' కప్పురపు విడియము కట్టుచు,

"కన్నుల కాటుకల్ మరుని కత్తుల సానలు బట్ట నవ్వులున్
వెన్నెల వన్నెలన్ జిలుక ప్రేలెడి వేనలి పూలమాలలో
మిన్నునఁ దారకల్ గురియ మించులయంచుల యంబరమ్ములోఁ
బున్నమ చంద్రబింబమునఁ బోల్తుక తా ననవిల్తు కొమ్మయై"[2]

తాంబూలమీయబోయి సిగ్గునే నిలబడియుండెను. ఇచట ఆచార్యులవారి కవితా సుందరి నెఱజాణయై సుకవికాంతను ముస్తాబు వేసిన చాతుర్యము కడు రమ్యమైనది. ఇట్లు దేవసుందరియై నిల్చిన ఆమెను గాంచి అతడు మిక్కిలి ముగ్ధుడై 'వానలో తడియుచు వచ్చి నాకొరకు చాల కష్టపడితివి. నిన్నిడుమల బెట్టిన కటిక నేమనవలె'

1. పోతన చరిత్రము : 3-216
2. ,, ,, : 3-218

నని పలుకరించెను. 'దాసి గలిగియు సకాలమున భుజింపరై తిరసుచు బాధపడు మనోవ్యథకన్న మీరనెడు నిడుమ లెక్కువయా ? వడ్డించిన యన్నమైనను సరిగా తినరై తిరి. ఈ యజ్ఞతో నేపైన మహాపరాధములు జరిగినచో క్షమించు' డని యామె పలికెను. అపుడాతడామెను గాంచి ప్రేమతో

'ఓ పుణ్యపురాశి! నా కనుల పున్నమవెన్నెల! రూపశీల సంపన్నిలయంబ! నా హృదయ మర్మము దొంగిలు మారచోరుఁ బ్రచ్ఛన్నతఁ గొంగుమాటు నిడి సాకెడి దోషము సైఁపవచ్చునే ? అన్నముపైన నాదు హృదయమ్మెట నున్నది? నీమ రూపసంపన్న హసన్ముఖాంబురుహపంజరబద్ధ విహంగశాబమై యున్నది నీయధీనమయి యో సఖియా! దరిఁజేర్పు' మనుచు నామె చేతిని

హృదయమునకు హత్తుకొనదలచి విడెమిడెడు హస్తమును నిమురుచు లాగెను. ఆమె 'త్రపా తరంగ మగ్నాననయై విడువు' డనుచు చేతిని విడిపించుకొని మలగ బోగా నతడు చేలాంచలము గ్రహించెను. అది మూపు నుండి జారగా 'పృథులోర మ్రదువ, బొమలు నర్తిల చిడిముడి పాటుతో నురము చేతుల గప్పుచు

"కుంచితగాత్రమ్ముల నతి చంచల నేత్రముల రుద్ధచరణమ్ముల లజ్జాంచిత పద

నమ్మునఁ గిలికించితవతి యగుచు మగనికేలన్ వ్రాలెన్"[1]

అపుడతడామె మోమెత్తి చెక్కిళులంటి ముంగురులు సవరించి అరుణాధర సుధారసమానబోవ సిగ్గుతో 'కొనుడీ తాంబూలము నేఁ జనవలె నిదియంత యేమి చర్య?" యని యేమెరుగని పసిపిల్లవలె ననెను. దానికి 'ఇన్నాళ్లు విరహవహ్నిన్ నిన్నీగతి తాపపెట్టు నిష్ఠుర హృదయున్ గన్నెత్తిచూడఁ బాపము లన్నియు వెన్నడు క్షమింపు' మని మన్నన మాటలతో బతిమాలెడి భర్తనుగాంచి దుఃఖము పొంగిరాగా నశ్రులు రాల్చుచు 'భవదీయదాసి నంత మాట యెన్నడును పల్కరా'దని సప్రణయ ముగ జూచెను. అట్టియెడ వారేకమై మదన సామ్రాజ్య మేలిన విషయము ఉగువ రీతిగా వర్ణింపబడినది.

"వెన్నయటుల్ మనస్సులు ద్రవించె ముఖాబ్జము లప్రయత్నతన్ సన్నిహితంబులై పెనఁగె సప్రణయేక్షణ ఖంజరీటముల్

---

1. పోతన చరిత్రము : 3-232

మిన్నెగఁ బ్రాఁకె జంటఁగొని మేనులు తానములాడె సౌఖ్యసం
పన్నది దేశకాల సముపస్థితి మాటుమడంగె నిర్వ్యరన్"[1]

"డోలత్ప్రణయాంబుధిలోఁ దేలికఁదేలాడు పూలతెప్పలగుచు వా
రాలోల లోకనమ్ముల సాలోక్యముఁ గని రి పుష్పసౌరభగతులన్"[2]

"కుత్తుక బంటినిండి పతికూరిమి వెల్లువఁ బొర్ల లజ్జయన్
భిత్తిక గండివోఁ బ్రణయ బీజపు మొల్కలు పుల్కలెత్తగా
మత్తిలి వ్రాలు గన్నులు చెమర్చిన చెక్కులు కెంపు లీనఁగా
నత్తను స్పందిలేనియటులయ్యె నదెట్టి సమాధి యోగమో.''[3]

ఈ రీతిగా నిర్వహింపబడిన యీ శృంగారము విభావానుభావాది సామగ్రీ పరిపుష్టమై సభ్యతా విశిష్టమై సమంచితమై హితమితమై యొప్పారుచున్నది. ఇచట చల్లగాలికి చందమామకు మల్లెపూలకు మదనహేలకు నాయికా నాయకులు తాప పడిరే కాని కోపపడి యుపాలంభింపలేదు. పూర్వ ప్రబంధములలో వలె 'లికుచ కుచ, ఘనజఘన' యని ఇత్యాదిగా కచకుచాద్యంగముల వర్ణన చేయబడక భావ ప్రకటనకు ముఖ నేత్రాదుల వర్ణన సమర్థ్యాదముగా చేయబడి హార్దిక భావ వర్ణనకు ప్రాధాన్య మీయబడినది. ఇక సంభోగ వర్ణన 'సహసా నఖంపచ స్తన దత్త పరిరంభ మామూల పరిచుంబితాధరోష్ఠము' అన్నట్లు పచ్చిగా చేయబడక 'డోలత్ ప్రణయాంబుధిలోఁ దేలికఁ నేలాడు పూల తెప్పలగుచు....' అని సాభి ప్రాయముగా సభ్యముగా చెప్పి విడవబడినది. ఇట్టిది భక్తుడు ధీరశాంతుడగు పోతన గుణశీలముల కనుగుణమైనదే కాక నవ్యకవితా శోభితమై యున్నది.[4]

---

1. పోతన చరిత్రము : 3-242
2. పోతన చరిత్రము : 3-244
3. పోతన చరిత్రము : 3-245
4. 'నవ్య కవితలో అంగవర్ణన ఇంచుమించుగా పరిత్యక్తమైనది. ముఖ నేత్రాదులను-భావ ప్రకటన సాధనములు కాబట్టి-కొంచెము వర్ణించిరి. వక్షోజ జఘనాదుల వర్ణన పూర్తిగా విడువబడినది. అంగవర్ణన కన్న అంతరంగ వర్ణనకే నవ్యులు ప్రాధాన్యము నిచ్చిరి. అనుభూతి గాఢత్వమును ప్రకటించుటకే తమ ఆలోచనా శక్తి నెక్కువగా ఉపయోగించిరి.''
—డా॥ సి. నారాయణరెడ్డిగారి 'ఆధునికాంధ్ర కవిత్వము: నవ్య కవిత్వ మహోదయము.'- పు. 182.

పోతన దంపతుల యీ ప్రణయఘట్టము విశిష్ట శృంగారమునకు పట్టము కట్టి రసిక సామాజికులకు పసందైన విందొసగుచున్నది. శాంత భక్తిరస ప్రాచుర్యముగల యీ కావ్యమున ఈ రమణీయ శృంగారము లేనిచో పోతనకు తపోభంగము తప్పినను భిన్నరుచి గల రసజ్ఞలోకమున కాశాభంగము మాత్రము తప్పెడిదికాదు.

కావ్యమున మరికొన్ని సన్నివేశములలోను శృంగారము బంగారమై సింగారించుచున్నది. ద్వితీయాశ్వాసమున పోతన వివాహసన్నివేశమున నర్సమాంబా వధువు నలంకరించినప్పటి వర్ణన శృంగారపు చవులూరించుచున్నది.

"అభ్యంగనపుఁ బచ్చియార్చు పెన్నెరులలో శృంగార వార్ధి తరంగ
మడర....
లేమ తారుణ్య నందనారామసీమఁ గంతుఁడెదపొంగ బంగారు బంతులాడ
సకియ సౌందర్య దివ్య నిర్ఝరులయందుఁ బ్రేక్షకాక్షి దృష్టీనముల్
పెనఁగులాడ"[1]

మంగళాలంకృతయై దుర్గామహాదేవి నర్చించి పెండ్లి చవికె వద్దకు కొంపోవ చెలులు రాగా,

"కన్నులను వెన్నెలలుగాసెఁ గలికి సొగసు నవ్వులన్ మల్లియలు బూచె
నాణ్యమైన
గొంతులోఁ గోకిలలు గూసెఁ గొసరి కొసరి నడల రాజహంసలు కాళ్లఁ
బడుచు దాసె"[2]

అని యీరీతిగా ముద్దు మురిపెములతో శోభిల్లినట్లు వర్ణింపబడి శృంగారము చెలువు మీరి యున్నది. ఈ సందర్భమున 'అభ్యంగనపుఁ బచ్చి' యన్న పద్యము, విశేషించి 'కంతుఁ డెద పొంగ బంగారు బంతులాడ' అన్నది సభ్య శృంగార వర్ణనకు తావలమై యొప్పారుచున్నది.

1. పోతన చరిత్రము : 2-243
2. పోతన చరిత్రము : 2-246

చతుర్థాశ్వాసమున శృంగారము మూడు సందర్భములందు పొందుపరచబడి యున్నది శ్రీనాథ పోతనలు రాచకొండకు వెడలి యానగరాపణమున నొక యరుగుపై పూవులాకులమ్ముకొనెడి మరునాలిని గాంచిరి. అది 'విందగు యౌవనమ్ము వలపించెడి చక్కదనమ్ము' కలిగి చెలువారుచుండ శ్రీనాథుడు దానితో సరస సల్లాపములాడిన సన్నివేశము శృంగారచ్ఛవిరమ్యమై యొప్పుచున్నది.

సింగనృపతి కోరికపై శ్రీనాథు డొనర్చిన వనవర్ణనమున 'నెలరాజున్ వలపింపగా....' 'తొలి మబ్బు తెరనుండి తిలకించు చుక్కల దొరగాంచి కను గీటు తావ పడంతి' వంటి కొన్ని పద్యములలో హృద్యమగు శృంగారము నయగార మొలుక బోయుచున్నది.

ఇక సింగభూపాలుని సభలో చేసిన భోగినీ నృత్యఘట్టమొక యపూర్వ కళాఖండమై యఖండ శృంగారమున కాటపట్టై యలరించుచున్నది.

"చెక్కి చేసిన మోహినీ శిల్పమనగ దిద్ది తీర్చిన నవరత్న దీపమనగ
పోతవోసిన యపరంజి బొమ్మయనగ అచ్చమచ్చరయే యన నా లతాంగి"[1]

లోకోత్తరముగా నాట్యముచేసి, రాజును వలచి వలపింపదలచిన యానర్తకి శ్రీకృష్ణుని గానక విప్రలబ్ధయై పరితపించు రాధికగా నభినయించి రాజును సభా సదులను శృంగార వారాన్నిధిలో నోలలాడించినట్లు వర్ణింపబడి యున్నది[2]

సప్తమాశ్వాసమున రాచకొండ సైన్యమును పారదోలి భాగవతమును కాపాడిన మేటి వరాహము చెలరేగి వచ్చినట్టి పందుల మందను మేపుచున్న సుందరిని 'వాని చెంతనె వెలుంగు నొక యింతి కంతుచేనాడు పూబంతియన....' మున్నుగా వర్ణించిన సందర్భము శృంగారచ్ఛాయా విలసితమైయున్నది. ఇదే యాశ్వాసమున శ్రీనాథుడు రాచకొండ నుండి బమ్మెరకు పోవుచు మార్గమున తోటలో విశ్రమించి

1. పోతన చరిత్రము : 4-231
2. భోగినీ నృత్యము గూర్చి వ్రాసిన ప్రత్యేక వ్యాసమున నీ విషయము విపులముగా చర్చింపబడినది.

నప్పుడతని చెంతకు వచ్చిన జంగమకన్యా వృత్తాంత మొకింత శృంగారస్ఫూర్తి కలదై యున్నది. ఆ జంగమకన్య రూపరేఖా విలాసముల వర్ణనవల్లను, శ్రీనాథుడు జంగమకన్యతో సరససల్లాప మొనర్చుటలోను నిది ద్యోతకమగుచున్నది. అష్టమాశ్వాసమున నవయౌవనము ప్రాప్తించిన శారద రూపరేఖా చేష్టాదిక వర్ణనలో శృంగార మలరించుచున్నది.

కావ్యానుబంధమునందు ఏకాదశాశ్వాసమున మోహిన్యవతార ఘట్టము, ద్వాదశాశ్వాసమున రుక్మిణీకల్యాణ కథ శృంగారమునకు నెలవై వెలయుచున్నవి. అందు మోహిన్యవతారగాథ శృంగార రసమును బంగారు శృంగారముతో నందించుచున్నది. శివుడు, దేవతల కమృతము పంచినప్పటి మోహినీరూప మొకమారు కనబరచి కృతార్థుని జేయుమనగా విష్ణువట్లే యెప్పుడైనను చూచెదవని పోయి శివుడు తపోనిష్ఠలో నుండగా నొకనాడు మోహినీరూపమున ప్రత్యక్షమై విష్ణువు తన మాయావిలాసమును జూపి శివుని విమోహితుని జేసిన విషయమిందు రమ్యరమ్యముగా వర్ణింపబడి శృంగారము చక్కగా నిర్వహింపబడినది.

"కళలకుం బ్రోవు సౌందర్యములకుఁ దావు యౌవనవిలాస నిధి
ప్రణయంపు జలధి
రమణి యొక్కతె జగముల భ్రమలు గొల్పు స్మేరకోరకితాస్యయై
చెలువు మీర"[1]

కందుకక్రీడ సల్పుచు వచ్చి వాలుగన్నుల హరుని జూచి హావభావాదులు ప్రకటింప 'కని హరుడు పిచ్చియయ్యెను, కమలభవుడు అచ్చవడి మచ్చెకంటి తానెచ్చటిదనె, వజ్రి యీమె కాలికిఁ బోలవలయుననిన రంభలూర్వశులుం బుట్టి రావలెననె'[2] అని వర్ణింపబడినది మోహినీ శృంగార చేష్టలకు శివబ్రహ్మాదులే విభ్రాంతులు కాగా ఈ శృంగార ఘట్టము చదివిన పాఠకులు విభ్రాంతులు కాకుండ గలరా!

రుక్మిణీకల్యాణ కథలో రుక్మిణి యౌవనప్రాదుర్భావ సమయ తనూ సౌందర్యవర్ణనము, కృష్ణుని తలచుకొని యామె విరహమున క్రుంగిన సన్నివేశ

1. పోతన చరిత్రము: 11-120
2. ,, ,, : 11-126

చిత్రణము చక్కని శృంగారమును సవరించినవి. ఆచార్యులవారి శృంగారము సభ్యమనుటకు రుక్మిణీ యౌవనోదయ సౌందర్యవర్ణనలోని దిగువ పద్యము మరొక యుదాహరణము.

"ఓమనగుంట లాడుకొను నొక్కట నచ్చనగిల్ల లాడు నా
కోమలి పూర్వమట్లు లుఋకుల్ పరువుల్‌గల యాటలాడఁగా
నేమియొ సిగ్గుజెందు ధరియించిన పయ్యెదచాటులో నెదో
యామని దెచ్చె నామె నవయౌవనముల్ నృప మందిర స్థలిన్"[1]

ఈ విధముగా కవిగా రాచితీ శోభితమైన శృంగారమును నిర్వహించి కావ్యమునకు వన్నె తెచ్చినారు. ఇందలి శృంగారమును చర్చించుచు ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారిట్లు ప్రస్తుతించిరి.

''శృంగారరసము నౌచిత్యవంతముగా పోషించుటకు నిగ్రహమెంతైన నవసరము. కవి యా సందర్భమున నిగ్రహమును గోల్పోయినచో సన్నివేశ మనౌచిత్యమునకు భాజనమై సహృదయుడైన పఠితకు వైముఖ్యము గలిగించును. నిగ్రహరహితులైన యట్టి కవుల రచనలకు సంబంధించినదే 'కావ్యాలాపాంశ్చ వర్జయే'త్తను స్మృతివచనము. శ్రీమాన్ ఆచార్యులవారు శృంగారరస నిర్వహణమున ప్రదర్శించిన యౌచిత్యమూలకమైన నిగ్రహము ప్రశంసనీయము''[2]

భక్తి శృంగారములను నిర్వహించుటలో పోతన వలెనే అభినవ పోతన సిద్ధహస్తుడు.

## కరుణము :

పోతన చరిత్రమున కరుణరసము కూడ సముచితముగా సందర్భానుసారముగా నిర్వహింపబడియున్నది. శృంగారము తర్వాత నిందు గణ్యమైనదై యిది యొప్పుచున్నది. ఈ రసమును గూర్చి భవభూతి యిటుల చెప్పెను.

1. పోతన చరిత్రము : 12-225.
2. "అభినవ పోతన" : 'పోతన చరిత్రము-రసపోషణము' వ్యాసము పు. 83.

"ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదాత్ భిన్నః పృథక్పృథగివాశ్ర
యతే వివర్తాన్। ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారాన్ అంభో యథా
సలిలమేవ హి తత్సమస్తం"[1]

'కరుణ మొక్కటే రసము. ఆవర్త బుద్బుద తరంగ రూపములతో జలము కనబడునట్లు నిమిత్త భేదము వలన ఆ కరుణమే భిన్నభిన్నముగా గానబడు'నని చెప్పుట చేత కరుణ రసమునకుగల ప్రాధాన్య మెంతటిదో విశదమగుచున్నది. లోకము శోకమయము. అదియే నిమిత్తభేదముచేత శృంగారాదులుగా గోచరించును. శృంగారాదులు తాత్కాలికములు. అవి చివరకు శోకముగనే పరిణమించును. మరియు రస మనుభవించునపుడు కలుగు చిత్తద్రుతి - మనస్సు కరగుట-కరుణ రసాస్వాదనమున విశేషముగా కలుగును కావున కరుణరస మొక్కటే రసమని యతని వాదసారాంశము.

జీవితము సుఖదుఃఖాత్మకము. కావున కావ్యములందు శోకము స్థాయి భావముగల కరుణము పోషింపబడుచుండును. పోతన చరిత్రమున ధీరశాంతుడును విరాగియునగు పోతన తన కష్టాలకు శోకించినది లేదుకాని తన తల్లి యాసన్న మరణవార్త తెలిసి దుఃఖించిన ఘట్టము కలదు. మరియు పోతన కడుంగడు సాధువర్తనుడై కారుణ్యచిత్తుడై తనగురువు చిదానందయోగి 'దీన జనులను దయజూచు దివ్యకర్మ తపము లన్నిటిలో నుచ్చతమము వారి మరువవల'దని బోధించినట్లు దీనజనుల నాదుకొన్నవాడుగా కావ్యమున వర్ణింపబడియున్నందున నాయా సందర్భములలో దీన హీన మానవుల నాదరించిన సన్నివేశములలో కరుణము నిర్వహింపబడినది. శ్రీనాథాదీతర పాత్రల జీవిత ఘట్టములలోను నేత ద్రసము పోషింపబడియున్నది. ఈ విషయము క్రమముగా చర్చింతును. ద్వితీయాశ్వాసమందలి పేదజవరాలి కథ కరుణరస భరితమై యున్నది.

"పూట గడవని పేద కాపురపురాణి బాటనంటి తానెచటికో బయలుదేఱె నంతరంగాన నుడుకు దుఃఖాబ్ధులెవియొ కంట నీరొల్క శిరమెత్తి కాంచ
లేదు"[2]

లజ్జాభిమానములతో భర్తతో గూడి దారిలో బోవుచు,

1. ఉత్తరరామ చరిత నాటకము : 3-41.
2. పోతన చరిత్రము : 2-74

"పొంగు యౌవనమును గొంగుచాటొనరించు మాత్ర మడుపు లేక రాత్రి పగలు
లోకమెదుటఁ దిరుగ లోలోనఁ గ్రుంగెడి శీలవతిని గాంచి జాలినొంది"[1]

పోతన యామె దుర్భరస్థితిని దలచి గుండె చితికిపోవ నొడలి పైననున్న యుత్తరీయము తీసి యామెకిచ్చి వారి కష్టాలు విని యింటికి గొంపోయి ధాన్యమిచ్చి పంపెను.

శ్రీనాథుని తల్లి తన కూతును పోతన కొప్పగించునప్పటి సన్నివేశము కనులు చెమ్మగిల్ల జేయుచున్నది.

"తనయను గౌఁగిటఁ దార్చుచు జనని యొదల మూర్కొనుచు వీఁపు కలయ నిమిరి
యుప్పొంగి వచ్చు దుఃఖోర్మి మత్తడిమాఁక నెన్నఁడు నను వీడి యెఱుఁగ దనుచుఁ
గంటి నేనాడో యత్తింటి సొమ్మిద్ది మా యింట నుండినదని యెంతుననుచుఁ
గవ్వంబులన్ బెట్టి కడుపులో నెవ్వరో చల్ల జేయుదురు నా యుల్లమనుచు
కుడు మనన్ బండుగను వట్టిగోల యనుచుఁ గాంచి ప్రాణమెత్తుగఁ బెంచి కన్నకడుపు
నీ చెయిం బెట్టితిమి పాలనేని ముంచు నీటనే ముంచు భారమ్ము నీదె యనుచు"[2]

దీవించి పోతన చేతిలో కూతునుంచి దుఃఖించు తల్లిని గని కూతురు కనులలో బాష్పగంగలు స్రవించెను. ఆ సమయమున నెంతటివారికైనను దుఃఖము పొంగి వచ్చెను. ఈరీతిగా నీ సన్నివేశము శాకుంతలము నందలి 'యాస్యత్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్ట ముత్కణ్ఠయా' అన్న శ్లోకమున కణ్వుడు పతికడకు శకుంతలను సాగనంపి నప్పుడు దుఃఖపడిన విషయము స్మృతికి దెచ్చుచున్నది.

1. పోతన చరిత్రము : 2-82
2. ,, : 2-272

తృతీయాశ్వాసమున శ్రీనాథుడు భార్యావియోగమునంది 'దుఃఖదైన్యాహతిన్' బమ్మెరకురాగా పెద్దలు నర్సమాంబ దుఃఖము పొంగి యతనిపై బడి శోకించుట, ఇరుగుపొరుగువారి జాలి, శ్రీనాథుడు దుర్భరమగు దుఃఖముతో ధైర్యము చెడి, కంట తడిపెట్టి భార్యావియోగవేదనను, తల్లిని స్మరించుచు నేడ్చెడి పసిపాప నోదార్పలేనివ్యథను చెప్పిన విషయము కరుణరసభరితమై చదువరుల యెదలను కలికలి యొనరింప జాలియున్నది.

చతుర్థాశ్వాసమున పోతన రాచకొండలో నున్నప్పుడు తన తల్లి యాసన్న మరణవార్త తెలిసి కడునవలి బమ్మెరకు బయలుదేరి వచ్చునప్పటి యతని మానసిక వేదన, బమ్మెరకు చేరి తల్లి మరణించిన విషయము తెలిసిన యతని శోకము, పితృవిలాపము దుఃఖాతిశయము చేత తండ్రి గుండె యాగి మరణించుట- ఈ ఘట్టమెల్ల కరుణమున కిరవై యున్నది. పోతన బమ్మెరకు పోవుచు మార్గమధ్యమున రాత్రి యొకచోట నాగినప్పటి యాతని యారాటము 'ఆ నిశిన్ విధిలేక యాఁగె నొక్కెడఁగాని తల్లికై మనమందు తల్లడిల్లు' మున్నగునది హృదయమును మిక్కిలి ద్రవింప జేయుచున్నది.

ఇక పంచమాశ్వాసమున పోతన ఆదుకొనిన దీనభిక్షుకుని యుదంతము హృదయవిదారకమై యున్నది.

> 'తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి గొంగడిలో శని గూరుచుండఁ
> బెరిగి పెన్బూచిగాఁ బరఁగు మీసముల గడ్డముల నంటుకొని వంటకము
> మెఱయఁ
> గడుపుమంటకుఁ ద్రావు గంజిచుక్కలు రాలి పొట్టపైఁ జారికల్ కట్టిమెఱయఁ
> జీర పేల్బడ మాసి చిల్లులు బడు గోఁచి వేనోళ్ళ దైన్యమున్ విశదపరుప
> వెంటఁబడి పిల్లలున్ రాళ్ళు విసరుచుండఁ గొసరి మొక్కుచు నెగఁబడు
> కుక్కదాడిఁ
> దద్దఁ దప్పించుకొనుచు జేతనొక చిప్ప పేలికలు వ్రేల్మొలను వచ్చె భిక్షు
> వొకఁడు'[1]

1. పోతన చరిత్రము : 5-233.

అని వర్ణింపబడిన భిక్షుకుని యత్యంత దైన్యము రూపువాల్చి నిల్చి నితాంతము జాలి గొలుపుచున్నది.

నవమాశ్వాసమున పోతన భాగవతమును కన్నడ రాయలకు కృతియిచ్చ బోవుచు మెట్టుగుట్టపై నార్తితో వసించినప్పుడు వాగ్దేవి దర్శనమిచ్చి తన్ను కర్ణాటకిరాటకీచకుల కమ్మ బూనినందులకు 'చన్మెట్టల నశ్రుపర్షములు నెట్టన జాఱగ గద్గదోక్తులన్' పలుకుచు శోకించిన విషయము హృదయము చలింపజేయుచున్నది. ఈ యాశ్వాసమునందే శ్రీనాథుడు శిథిల భాగవతముగొని సంక్రాంతి పర్వదినమున బమ్మెరకు వచ్చి పోతన గృహమును గాంచినప్పటి దృశ్యమున కరుణము మూర్తీభవించియున్నది పోతన యింటిముందు మొలిచిడు పురిటిబిచ్చకత్తె దైన్యము, శూన్యమై బావురుమనుచుండిన పోతన నికేతనము, పస్తుపడుకొనియున్న శారద లేచి తంత్రిపై బడి బోరునయేడ్చిన యేడ్పు, పోతన యింటి అప్పుముప్పుల దారుణ దుస్థితి వివరించిన యీ సన్నివేశమెల్ల హృదయ సంక్షోభము కలిగించుచున్నది.

కావ్యానుబంధమునందలి యేకాదశాశ్వాసమున రామచరితమున రాముడు సీతా వియోగమునంది శోకించిన సన్నివేశమునను, ద్వాదశాశ్వాసమున గజేంద్ర మోక్షణ కథలో మకరముచే పట్టుబడిన గజేంద్రుడు ప్రాణరక్షకు శ్రీహరిని గూర్చి మొరపెట్టుచు 'కొండలగుండె నీరుగా' నేడ్చిన ఘట్టమునను ప్రత్యేకించి 'అపిగ్రావా రోదత్యపిదళతి వజ్రస్య హృదయ'మ్మనినట్లు కరుణరసము కట్టలుతెగి ప్రవహించుచున్నది.

ఈ విధముగా కావ్యమున కరుణ మాయా ఘట్టములందు సముచితముగా పోషింపబడి చిత్రద్రుతి కలిగించుచున్నది.

## అద్భుతము :

సహృదయుల నాశ్చర్యచకితుల జేసి యాహ్లాదపరచు నద్భుత రసము కూడ కావ్యమున నందందు సుందరముగా పొందుపరచబడియున్నది. ఇది ప్రధానముగా పోతన రామభక్తి మహత్వాది కథలలో నిర్వహింపబడి యున్నది. లోకోత్తర చమత్కారమువల్ల నుత్పన్నమగు నద్భుతము లోకోత్తరములైన యిందలి గాథలవల్ల నిసర్గమణీయముగా పోషింపబడి యొప్పుచున్నది.

పోతనకు గంగా సైకతముననైన శ్రీరామ సాక్షాత్కారము, దీనభిక్షుని యుదంతము, రాచకొండ సైన్యము నుండి కృతిని కాపాడిన వరాహవృత్తాంతము, రుక్మిణీ కల్యాణ కథారచనా సందర్భమున పోతనకూతురు కమరి పునరుజ్జీవిత యైన విషయము, గజేంద్రమోక్షణ కథారచనలో రాముడు రామశర్మగా వచ్చి పద్య పూరణ చేసి వెడలిన ఘట్టము, జంగమకన్యా వృత్తము, శ్రీనాథ మల్లనలు బోయీలు ఎద్దులు లేకుండ ఆందోళికా హాలములను నడపించిన దృశ్యము, జ్యోతిపురరాజ్ఞి వచ్చి సహస్ర భోజన సంతర్పణ మొనర్చిపోయిన సన్నివేశము, కావ్యానుబంధ భాగవత కథలలో మోహినీ విలాసము, నరసింహావిర్భూతి, కృష్ణావతారమునందలి కొన్ని కథలు అద్భుతరసమున కాలవాలములై యలరించుచున్నవి. ఈ సన్నివేశము లన్నిటిలో శ్రీనాథ మల్లనలు తమ మహత్త్వము చేత రిక్తాందోళికా సీరములను నడపించిన ఘట్టమున నీ యద్భుతము మరింత లెస్సగా నిర్వహింపబడినది.

## వీర రౌద్ర భయానక బీభత్సములు :

కావ్యమునందు తక్కిన యంగరసములగు వీర రౌద్ర భయానకాదు లల తిగా యథావకాశముగా పోషింపబడియున్నవి. వీరరస భేదమగు యుద్ధ వీరము వీనిలో నెక్కువగా యుద్ధవర్ణనలలో నిర్వహింపబడియున్నది.

## యుద్ధవీరము, భయానకాదులు :

పోతన రాచకొండకు రాజాలనని రాజాజ్ఞను ధిక్కరించి పలుకగా తత్సేనా పతి భాగవతమపహరింప సైన్యమును పురికొల్పగా ఆ చమూసమూహముపై యుసక వీరుడొకడు విరచుకపడి కత్తియుద్ధము చేసి చీకాకుపరచిన భాగము నందును, ఆ పిదప మేటి వరాహము చెలరేగి వీరవిహారము చేసి సైన్యమును చెల్లా చెదరు గావించిన సన్నివేశమునందును యుద్ధవీరము, భయానకము, బీభత్సము పోషింపబడినవి.

'ఒకమాఱు సరినిల్చి యుద్రిక్తతం బోరు శత్రుల మణిబంధ సందులెడల
ఒకమాఱు సింగమట్లుప్పరమ్మెగయును బగతురపురియలు పగులుచుండ
ఒకమాఱు వేగయట్లొయ్య నేలకు వంగు గుల్ఫాస్థికలు చిట్లి కూలిపడగ
ఒకమాఱు దుసికిల్లి యొనరున వెలివచ్చు నరిమూఁక పసులటుల్
పరువులెత్త

నిటులలతఁడు సేయు సాంపరాయికముఁ గాంచి గుండెలద

పిఁడటుంచుచు ప్రత్యర్థి వీరభటులు తీవ్రమగు వేండ్రవె

ఇత్యాదిగా యువకుడగు జగజెట్టి చేసిన లగుడయుద్ధ వర్ణ
నతములు విస్తరిల్లియున్నవి. పిమ్మట మేటి వరాహము విజృ
దంష్ట్రాకరాళాస్యంబు ప్రళయార్క బింబమై భయము 'గౌల
రక్తసిక్తాంగులై తాళవృక్షగతుల నేలఁగూలఁ' కోరతో జీరుచు
సృష్టింప రక్తధారలొలికి చిన్నాభిన్నములైన యంగములతో
చెదరిపోయినట్లు వర్ణించిన సన్నివేశమున వీర భయానక బీభ
బడినవి.

ఇట్లే భాగవత మనువదించిన సందర్భమున జరిగిన కర్ణా
యుద్ధవర్ణనమునందును మరియు కావ్యానుబంధమునందలి గ
లోని కరిమకరముల యుద్ధమున, కృష్ణచరిత్రలో కృష్ణుడొనర్చిన
రామ రావణ యుద్ధమునను, విశేషించి హిరణ్యాక్ష వరాహమూ
దుల పోషణ విశిష్టముగా చేయబడినది. మరియు నరసింహావ
నిర్భేదక గర్జారవమ్ముల శ్రుతిపుట పటలము క్షోభజెంద...., 
మధ్య్రవేలు జిహ్వ ప్రళయకాలానల జ్వాల పగిదిఁ గ్రాల, ప్ర
స్తంభమున జృంభగతి నావిర్భవించిన ఘట్టమున భయానక
పోషింపబడినవి. అట్లే నృసింహస్వామి హిరణ్యకశిపునిపొట్ట చీ
ప్రేవులన్ బెరికి భీకరలీలఁ వానినన్నిటిన్ దావడముల్ పొన
చేసిన చర్యల వర్ణనలో బీభత్సము నిర్వహింపబడినది.

పోతన రావకొండలో తనతల్లి యాసన్నమరణ యన
వేళ శ్రీనాథుడు రాజు నశ్వమడుగబోయివచ్చి రాజుపలికిన వ
వాక్యములు చెప్పగా పోతన యాగ్రహోదగ్రుడై

1. పోతన చరిత్రము : 7-217

నాటకములలో ముఖ్యముగా ప్రహసనములలో పరిపుష్టమైయుండు హాస
కావ్యములలో సేవ్యము కాజాలకున్నది. హాస్యమునకు పేరు వడసిన
కృష్ణుని కృతిలోనే హాస్యము సదసత్సంశయహేతువైయుండ
కృతుల లెక్కయేమిటి?

'వికృతాకార వాగ్వేష చేష్టాదేః కుహకాద్భవేత్
హాస్యో హాస స్థాయిభావః"[1] అని యాలంకారికులు చెప్పినట్లు
ఆకారము వాక్కు వేషము చేష్టయను వానిచేత నుద్భవించి హాసము స్థా
గల హాస్యరస మాంధ్ర ప్రౌఢ కావ్యములలో మిక్కిలి పోషించుట
లేకపోయినది.

వరదాచార్యులవారొక వీలు కల్పించుకొని హాస్యము నొందుచు రె
రవంత పోషించియున్నారు.

శ్రీనాథ పోతనలు రాజదర్శనార్థము రాచకొండకు పోయినప్పు
ణమున పూవులాకులమ్ముచున్న పుష్పలావికను గాంచి శ్రీనాథుడు దా
లాపములాడిన సన్నివేశము సున్నితమైన హాస్యమును వెలార్చుచున
సంభాషణము నర్మగర్భితమై చమత్కారముగా సాగి హాస్యమును
పూవుప్రబంధములందును పువ్వులు కొనబోయిన యువకులు పుష
జేసెడి సంభాషణ లిట్లే హాస్య చమత్కృతితో నలరింపజేయుట సు

తన కూతురు సూతబడెనేమో యని తినుచున్న శ్రీనాథుడు త
బావి కడకు పరుగెత్తుకొని పోయినప్పుడు పోతన 'సిరికిన్ జెప్పడు'
మధిక్షేపార్హము కాదని నిరూపించిన తీరు చమత్కారవంతమై హాస్య
చేసినది.

భక్తియందంతర్భవించిన శాంతము ప్రధానముగా ప్రచురము
కావ్యమున హాస్యమున కింతకంటె నవకాశము కలుగలేదు.

1. సాహిత్యదర్పణము : 3.2.4

ఈ రీతిగా ఆచార్యులవారు పోతనచరిత్రమున భక్తిరసానుప్రాణిత శాంతము నంగిగా నిర్వహించి తదంగముగా కించిదూనముగా భక్తిని విస్తరింపజేసి శృంగార కరుణాద్భుత వీరములను సముచితముగా పోషించి రౌద్ర భయానక బీభత్స హాస్యములను యథావకాశముగా నిర్వహించి మధురమంజులముగా తీర్చి దిద్ది కావ్యమును రసజ్ఞసేవ్యము గావించినారు.

ఇతివృత్త సంగ్రహణము గూర్చి ఆనందవర్ధనుడు

'సంధి సంధ్యంగ ఘటనం రసాభివ్యక్త్యపేక్షయా
న తు కేవలయా శాస్త్ర స్థితి సంపాదనేచ్ఛయా'

అని వచించినట్లు వరదాచార్యులవారు శాస్త్రమర్యాదాదృష్టితోకాక రసాభివ్యక్తి నపేక్షించి కథా సన్నివేశములను కల్పించుకొని నిర్వహించినందున కావ్యమున నాయా రసములకు సహజ రామణీయకము విలసిల్లినది. ఇందలి రస నిర్వహణ మిట్లు సహజమై సభ్యమై సముచితమై సహృదయ హృదయావర్జకమై యొప్పారు చున్నది. రసవైరుధ్య మేర్పడక యంగి యగు శాంతరసమున కనురూపముగా నంగము లమరి యొప్పుచున్నవి. శుష్క శూన్య భాగములు కానరాక కావ్యమెల్ల నమృతోపమానముగ నవరసోదంచితమై 'చెవులకు చవులై కవులకు తవులై' యింపు నింపుచు విరాజిల్లుచున్నది.

# పాత్ర పోషణము

కావ్య సామగ్రిలో ప్రాధాన్యము వహించు నంశములలో పాత్రపోష
మొకటి. కావ్యమున రసమునకున్న ప్రాముఖ్యము పాత్రలకును నుండును. నా
కాది పాత్రల మూలముననే కథాగమనము, వర్ణనలు, ఉపదేశము, చమత్కారా
కవితా సౌందర్యము శోభిల్లుచుండును. నాయకుడు లేనిది కథయే లేదు. నాయి
ప్రతినాయకుడు, నాయక ప్రతినాయక సహాయకులు లేనిది కథ సాగుటకు వీలులేదు
ఆలంబన విభావములగు నాయకాది పాత్రలను పోషింపనిచో రసనిష్పత్తి జరుగదు
కావున కావ్యమున పాత్రలు కీలకపాత్ర వహించుననుటలో విప్రతిపత్తి లేదు.

కావ్యములందు పాత్రపోషణచణత్వము ననుసరించి కావ్యగౌరవమ
కవితావైభవము విలసిల్లును. పాత్రపోషణమనగ పాత్రోన్మీలనము. పాత్ర
క్రమవికాసము క్రమపరిణామమే పాత్రోన్మీలనము. ఆయా పాత్రలయొక్క గు
శీలములను ప్రోదిచేయుచు వ్యక్తిత్వమును పదిలపరచుచు కథార్థమున కభిము
ముగా సాగునట్లు నిర్వహించుటయే పాత్రపోషణమగును. పాత్రపోషణ చాతుర్యమ
సజీవపాత్రలను నిర్మించుటలో గోచరమగును. సజీవపాత్రలనగా కదలికలే
కొయ్యబొమ్మలవంటివికాక చైతన్యవంతములై యుండు పాత్రలు. ఈ చైతన
వత్త్వము పాత్రల వైవిధ్యమువలన నేర్పడును. పాత్రల వైవిధ్యమన నేరెండ
పాత్రలును నొకేవిధముగా నుండకపోవుట. స్వరవైవిధ్యములేక సంగీతమునకు
గతిలేనట్లు పాత్రవైవిధ్యము లేనిది కావ్యమునకు గతిలేదు. లోకమునందలి కొందర
మనుష్యుల రూపురేఖలలో సామ్యముండినను గుణశీలాదులలో స్పష్టమైన వైవిధ్యమ
గోచరించునట్లే కావ్య ప్రపంచమున పాత్రలు విభిన్న ప్రకృతికములై యొప
వలెను. 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః' యన్నట్లు కవి కావ్యసంసా
నిర్వహణమున భిన్నభిన్న పాత్రలను ప్రవేశపెట్టి పోషింపవలసియున్నది పాత్ర
వైవిధ్యమువల్లనే రసభావ వైవిధ్యమేర్పడి కావ్యము రక్తిగట్టును ఆ వైవిధ్యమున
రూపరేఖలలో, వేషభాషలలో, గుణశీలములలో వ్యక్తివిస్పష్టముగా గోచరించునట్ల
తీర్చిదిద్దినపుడే పాత్రలు సజీవములై కావ్య కథారథము గమ్యము చేరుటక
సహకరించి సహృదయ సామాజికుల యెదలు కదలించి పరమాహ్లాదమొనగూర
గలవు.

సజీవపాత్రల నిర్మాణముతో నిపుణముగా పాత్రపోషణ గావించుట కవు లందరికి సాధ్యపడునది కాదు. మహాకవులు కొందరే యిట్టి మహాకార్యము నిర్వహింపగలరు. పూర్వ మహాకవులు కొందరిది నిర్వహించిరి. అందు తిక్కన పాత్రపోషణలో నద్వితీయుడని ప్రసిద్ధిగాంచెను. పెద్దన తిమ్మన పింగళి సూరన ప్రభృతి ప్రబంధకవులు కొందరలో నీ నైపుణ్యము బాగుగా గనబడును. అనంతర ప్రబంధయుగమనబడు దక్షిణాంధ్ర యుగకవులలోని యనుదాత్త ప్రబంధముల నాయికా నాయకు లచ్చు పోసినట్లొకే విధముగా నుండి కావ్యరూప దీపములు కొడిగట్టిపోయిన విషయము గమనింతుము. ఆలంకారికులు నాయక ప్రకరణములలో నాయికా నాయక భేదములను పేర్కొని వర్గీకరించి లక్షణము చెప్పినది సర్వకావ్య సామాన్యమున కుపయోగపడుటకు. ఆ లక్షణముల నన్వయింపజేయుచునే ఆయా నాయకాది పాత్రలను ప్రత్యేక రూపగుణశీలాదులతో చిత్రించినపుడే ఆయా కావ్యములకు విలక్షణత, విశిష్టత వెలుగొందగలవు. ఆచార్యులవారు పోతనచరిత్రమున పాత్రలను విస్పష్టరేఖలతో తీర్చిదిద్ది సజీవముగా శోభిల్లునట్లు పోషించియున్నారు. వారి పాత్రపోషణ కౌశల మీ వ్యాసమున చర్చింపబడును.

## పోతన చరిత్రము నందలి పాత్రలు :

కావ్యమున ప్రథమ ప్రాధాన్యము వహించు పాత్ర కథానాయకుడగు పోతన. బ్రహ్మాండమున పరబ్రహ్మమువలె కావ్యమున నతడు వ్యాపించియున్నాడు. పోతన తర్వాత నించుమించు నంతటి పాత్ర శ్రీనాథుడు. పోతన తల్లిదండ్రులు, భార్య నర్సమాంబ, తిప్పన, చిదానందయోగి, సింగభూపాలుడు, భోగిని, మల్లన, లక్ష్మీశారదలు, నారయాది శిష్యులు, ప్రౌఢదేవరాయలు సముచితముగ విస్తరించి యున్న పాత్రలు. ఇక నిరుపేద జవరాలు. యువక భూస్వామి శ్రీనాథుని తల్లి, పువ్వులావిక, వేశ్యామాత, వేగులవాడు, పోచయ్య యను కాపు, దీనభిక్షుకుడు, లోభిసెట్టి, రామశర్మ, కంచుకి, రాచకొండ విజయనగర చమూపతులు, యువక మల్లుడు, జంగమకన్య, జ్యోతిపురరాజ్ఞి మున్నగువారు అల్పవ్యాప్తి గలిగిన యప్రధాన పాత్రలు. కవిగారు ప్రధానపాత్రలను వలెనే యప్రధాన పాత్రలను సైతము నేర్పుగా తీర్చిదిద్ది కావ్యములోని పాత్ర లన్నిటికి పావిత్ర్యము నౌదాత్త్యము సంతరింపజేసిరి.

## పోతన :

కావ్యనాయకుడగు పోతన నాయక భేదములలో ధీరశాంతుడు. ధీరుడును శాంతుడును నగువాడు ధీరశాంతుడు. 'శమ ధీ ప్రసన్నుఁడు ద్విజుండౌ ధీర శాంతుండు'[1] అని ధీరశాంతుని లక్షణము చెప్పఁబడినది. శమముతో (శాంతముతో) గూడిన బుద్ధిచేత ప్రసన్నుడైనవాడని భావము. ధీరశాంతుని లక్షణమును విశ్వనాథుడిట్లు చెప్పెను.

"సామాన్య గుణైర్భూయాన్ ద్విజాదికో ధీర ప్రశాంతః స్యాత్"[2]

నాయక సామాన్య గుణములగు నౌదార్యాదులు గల ద్విజాదికుడు ధీరశాంతుడు. ద్విజాదికుడనగా నమాత్య విప్ర వణిజులలో నొకడు. ధీరశాంతుని గూర్చి విన్నకోట పెద్దయ చక్కఁగా నిట్లు నిర్వచించెను.

"సుభగుడు, శుచియు, వివేకియు,
నభిమానియు, మృదువు, సద్ద్విజాతులవంశ
ప్రభవుండును నగు నాయకుఁ
డభిమతముగ ధీరశాంతుఁడనఁ బొగడొందున్"[3]

ఇట్లాలంకారికులు చెప్పిన ధీరశాంత లక్షణములన్నియు పోతనలో పోతవోసినట్లు కవిగారు పాత్రను చిత్రించినారు. కాగా నిది కావ్యసామాన్యమైన ధీరశాంత లక్షణము. ఈ లక్షణములకు లక్ష్యముగా పోతనను చిత్రించుచునే యతని విశిష్ట విలక్షణ ప్రకృతిని విస్పష్టముగా విన్నాణముగా తీర్చిదిద్దుట జరిగినది.

పోతన జీవితములో ప్రధానముగా గన్పడు గుణములు రెండు. ఒకటి భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నమైన మహనీయత. రెండవది మహాకవిత్వము. తక్కిన గుణములన్నిటిని ఈ రెంటిటిలోనే చేర్చవచ్చును. శాంతము, సచ్ఛీలము, సాత్త్వికత, మాతా పితృ భ్రాతృ గురు భక్తి, దయ, ధర్మచింత, పరోపకార పరాయణత,

1. కావ్యాలంకార సంగ్రహము : 2-4
2. సాహిత్య దర్పణము : 3-34
3. కావ్యాలంకార చూడామణి : 3-11

సాధు సజ్జనసేవ, ఆత్మాభిమానము, దైవభక్తి ప్రపత్తులు, స్థితప్రజ్ఞత్వము మున్నగు మహోత్కృష్ట గుణములన్నియు మొదటిదానిలో జేరును. సహజ పాండిత్యము, అనన్య ప్రతిభాశాలిత, భాగవతాంధ్రీకరణ కావింప నంతటి మహోత్కృష్ట కవిత్వము రెండవదానిలో చేరును. భక్తియ కవితాశక్తియుగల పోతన యా రెండిటిని మోక్షార్థియై శ్రీరామపదార్పణము చేసి ధన్యుడైనాడు. అట్టి మహాభక్త కవియగు పోతన పాత్ర నత్యంత జాగరూకతతో ననన్య కౌశలముతో పోషించి కృతకృత్యులైనారాచార్యులవారు.

పోతన పాత్ర పోషణ విధానము చర్చించుటకు ముందు భాగవతము వలన తెలియదగు పోతనమత విషయములను సంగ్రహముగా ప్రస్తావింతును. ఏలయన శైవుడగు పోతన విష్ణు పారమ్య గ్రంథమగు భాగవత మాంధ్రీకరించి 'నమ్మితితో హరికిచ్చె' కావున నతని మత విషయము ముఖ్య చర్చనీయాంశము కావునను, పాత్ర పోషణ పరిశీలనలో నిది సహకరించును కావునను నిచట ప్రస్తుతమని వ్రాయుచున్నాను.

## పోతన మతము :

పోతన శైవుల ఇంటిలో జన్మించినాడు. అతని తండ్రి కేసన 'శైవశాస్త్ర మతము గనినవాడు' తల్లి లక్కసానమ్మ 'సదాశివ పాదయుగార్చనానుకంపానయ వాగ్భవాని. అన్న తిప్పయ 'ఈశ్వర సేవాకాముడు.' పోతన సోమోపరాగ కాలమున మహేశ్వరధ్యానము చేసినవాడు. స్కంధాంతగద్యలో 'ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర....' అని చెప్పికొన్నవాడు. భాగవతమునందలి యీ యాధారములచేత పోతన శైవుల యింటిలో జన్మించి శివభక్తుడై శైవమనుష్ఠించినట్లు తెలియుచున్నది. ఐనను నితడు వీరశైవుడు కాక శివకేశవ భేదము లేని స్మార్తశైవుడని పరిశోధకులు తెలిపిరి.[1]

1. "...వీరభద్రవిజయమునందు వలెనే భాగవతమునందుఁగూడఁ బోతన పూర్వికులు శివభక్తులైనట్లు, శైవులైనట్లు వ్యక్తమగుచున్నది. పోతనగారు దీనినిఁబట్టి శైవుఁడేయని నిశ్చయింపఁజెల్లును. కాని యాయన వీరశైవుఁడుగాడు; స్మార్తశైవుడు. స్మార్తులలో శైవులును వైష్ణవులును గలరు...స్మార్తులలో శివార్చనచేయుచు శివకేశవాభేదమును బాటించువారుకొందఱు, విష్ణ్వర్చనము చేయుచు శివకేశవాభేదమును బాటించువారు కొందఱు. వారికి శివభక్తి, వీరికి విష్ణుభక్తి ఇరువురు నద్వైతులే." శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి శ్రీమదాంధ్రమహాభాగవతానుశీలనము.
1. 'పోతన మతము' పు. 80

శైవుడగు పోతన విష్ణుపారమ్య పురాణమగు శ్రీమహాభాగవతమును తెనిగించి శ్రీరామచంద్రున కంకితము చేయుటకు హేతువు విష్ణుభక్తి కాదు. గంగా సైకతమున శ్రీరాముడు సాక్షాత్కరించి భాగవతాంధ్రీకరణ కానతీయుటకు మునుపే పోతనకు విష్ణుకథ యేదైన రచింపవలెనను నాసక్తియుండెను. దానినే 'మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున.... గంగకుఁజని'[1] యని తెలిపెను. కనుక మదిలో నస్పష్టముగా నున్న సంకల్పమునకు దగినట్లు స్పష్టమైన నిర్దిష్టమైన కావ్యము భాగవతము వ్రాయుటకు రామాజ్ఞ లభించినది. నన్నయ తిక్కనాది కవులు పురాణావళులు తెలుగు చేయుచు, తెలుగుచేయక యుంచిన భాగవతము తనకు లభించుట యదృష్టమని భావించినాడు. రామాజ్ఞ సరేకాని యంతకుముందే తనకు శ్రీమన్నారాయణ కథారచనా కుతూహలము కలుగుటకు హేతువేమి? శైవుడైన పోతనకు వైష్ణవ కథలు రచించు కోరిక యేమిటి? అనిన శివ కేశవ భేదములేని తనకు వైష్ణవకథలు రచించు తలంపు ఆంధ్రీకృతముకాక మిగిలియున్న వైష్ణవగ్రంథములవైపు దృష్టిపడుటచేత కలిగినదేకాని వైష్ణవ మతాభినివేశముచేత గాదు. అతడు శైవమతస్థుడైనందున బాల్యమున వీరభద్ర విజయము వ్రాసినట్లు పండితవాదములున్నను తనకంటె పూర్వమువాడగు పాల్కురికి సోమన వీరశైవావేశముతో శైవగ్రంథములు మిక్కిలిగా రచించిన విషయము సమచిత్తుడగు పోతనకు కొంత వెక్కసమనిపించియుండును. కాగా మహాకవులు శైవులైనవారు వైష్ణవకావ్యములను, వైష్ణవులైనవారు శైవకావ్యములను రచించిన యుదంతములుగలవు శంభుదాసుడగు నెఱ్ఱన నృసింహపురాణము రచించినది దీనికి తార్కాణ.

ఇట్లు శైవుడగు పోతనకు భాగవతాంధ్రీకరణ కాలమున క్రమముగా విష్ణుభక్తి ప్రవృద్ధమైనదని తలపవచ్చును. అందుకే 'శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్.... మహానందాంగనాడింభకున్' అని గ్రంథాదిలో వినుతించెను. ఐనను పోతనది వీరశైవము కాదు. కావ్యావతారికలో కృష్ణుని లక్ష్మీదేవిని స్తుతించుటతో పాటు శివుని విఘ్నేశ్వరుని దుర్గాదేవిని ఇష్టదేవతలని స్తుతించుటయు, 'చేతులారంగ శివుని పూజింపఁడేని నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని....' యని

1. శ్రీమహాభాగవతము 1-13.

మహాభక్తుడుగా మహాకవిగా విరజిల్లిన పోతనజీవిత సౌధమునకు జన్మబాల్యాదులు పునాదులై పరిఢవిల్లుటకు ప్రత్యేక శ్రద్ధవహించినారు.

కావ్యోపక్రమములో వివరించినట్లు పోతన వ్యాసాంశలో జన్మించినాడు ఇది 'నానృషిః కురుతే కావ్య'మ్మను మహావాక్యమున కన్వయించినది. మహానుభావుడగు పోతనజన్మము కారణ గర్భితమని కవిగారు పలుచోటుల సూచించినారు.

"తెన్గు భాగవత కన్యనొసంగు మటంచు వేడెఁ దా నెవనినిగాంచి శ్రీరమణుఁ డిట్టిఁడు మానవమాత్రుఁడౌనొకో!"[1]

"ఉదయించె నాంధ్రశారద యదృష్టమన నొక్క పాపఁడల వ్యాసాంశన్"[2]
"ఇవ్వటుని జన్మము కారణగర్భితంబిలన్"[3]
"ఈతఁ డే పరమోత్కృష్ట మహాపురాణ కృతి నిర్మాణార్థమై పుట్టెనో"[4]
"బద్ధ సంసారుల నుద్ధరింప నిటు జన్మధరించితివేమొ సత్కవీ!"[5]
"సూత శుకులను గరఁగి యచ్చునను బోయు
పోఁతనా వెలుఁగొందె నీ పోతనకవి
భయద భవవార్ధి తారణోపాయమైన
పోతరూపమై పోతన పుట్టెననిరి."[6]
"పోతనార్యుఁడొక కారణజన్ముఁడు"[7]

ఇత్యాది వాక్యములేకాక ఈయుక్తికి సమర్థనగా పోతన జన్మఘట్టముగల ప్రథమా శ్వాసాదిలో 'శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే' అను గీతావాక్యము శీర్షికగా నలంకరించిరి ఈ విధముగా కావ్యమున ఆదినుండి యంతము

1. పోతన చరిత్రము : పీఠిక-'అభ్యర్థన 53 పద్యము.
2. పోతన చరిత్రము : 1-111
3. ,, : 2-27
4. ,, : 2-170
5. ,, : 5-133
6. ,, : 9-67
7. ,, : 9-317

వరకు పోతన కారణజన్ముడగు మహాపురుషుడని పేర్కొని తదనుసారముగ నతని పాత్రను పోషించిరి.

మానవుని గుణశీలములపై 'వారసత్వము', పరిసరములు ప్రభావము కలిగించునని మనస్తత్వ శాస్త్రవేత్తలు చెప్పునట్లు పోతన యానువంశికగుణము లను ముఖ్యముగా తలిదండ్రుల గుణములను పుణికి పుచ్చుకొని పుట్టి పెరిగినట్లు కావ్యమున వర్ణింపబడి యున్నది. అట్లే పరిసరాల ప్రభావము కూడా నతనిపై బడి వికసించినట్లు కలదు. తండ్రినుండి యతనికి సర్వజనాదరణ బుద్ధి, దాతృత్వము, ఆత్మాభిమానము. మృడానీ పదభక్తి, పరోపకారచింత, కలనైనను తలవంచి యొరులను గొలువబోని స్వభావము, సత్యధర్మాదులును, తల్లినుండి యమృత హృదయము, శివారాధన, సౌశీల్యము, స్వార్థరాహిత్యము, దీనజన సేవా భావము సంక్రమించినవి. పావనమైన గుణకర్మ స్వభావములచే విశిష్టమైన యుత్తమ గృహమున జన్మించిన పోతన మాతృ గర్భమున నున్నపుడే ప్రబుద్ధు డైనట్లు కవిగారు చిత్రించిరి. లక్కాంబ నిండు గర్భిణియై యున్నపుడు బమ్మెర రామాలయమున బ్రాహ్మణోత్తము డొకడు భాగవత ప్రవచనము చేయుచుండ వెడలి సప్తాహములు శ్రద్ధతో విని తమవంటి వారు చదివి తరించుటకు భాగవతము నెవరైన తెలుగు చేసిరా? యని యడుగ నతడామె గర్భమున నొక బ్రహ్మ తేజము భాసిల్లుచున్నట్లు గ్రహించి 'నీదు పొట్టఁబుట్టెడు నీ కోర్కి నిజము సేయు వాఁడు నేడో రేపొ యుదయ మొందకుండ నుండునె?' యని పలికి 'సుతనయా వాప్తిర'స్తని యాశీర్వదించెను. ప్రహ్లాదుడు గర్భస్థుడై యున్నపుడు నారద ప్రబోధితుడై నెగడినటుల పోతన తల్లిగర్భమున నున్నపుడు భాగవత ప్రవచనము విని మేలు కాంచెను. మరియు గర్భవతియై యున్నపుడు స్త్రీకి కలిగెడు తలంపులు పుట్టబోవు శిశువునకు కలుగునన్న శాస్త్రవిషయానుసారముగా భవిష్యద్భాగవత కర్తయగు పోతనకు భాగవతముపై చిత్తము పడుటకు, తదాంధ్రీకరణ కాంక్ష యేపారుటకు తగిన ప్రేరణ, పరిస్థితి సమకూడినట్లు చిత్రించుట జరిగినది. మరియు నిదే విషయము పాల్కురికి జాతర నుండి బమ్మెరకు వచ్చు వేళ మావి తోటలో జరిగిన శ్రీకృష్ణ ప్రశంసలో లక్కాంబ స్వయముగా తన గర్భములో నున్నపుడు పోతన భాగవత కథలు విన్న విషయము చెప్పి తల్లిగొను నన్న పానములు, ఔషధములు గర్భస్థ శిశువునకును జెందునట్లే 'శ్రీగురుసూక్తి పొట్ట నివసించెడి నీకును జెందు'నని పచించెను.

పోతనకు భాగవతము మీద చిత్తము పడుటకు బాల్యమున మరొక చక్కని సన్నివేశము కల్పింపబడినది. పాల్కురికి జాతరలో వీథిభాగవత సందర్శనము, తదీయ తత్త్వబోధయతనికి సమకూడి భవిష్యద్భాగవ తాంధ్రీకరణకు ప్రేరకములైనవి. నేటివలెనే నాడును బ్రాహ్మణులు పురాణోత్తమ మగు భాగవతమును ప్రవచనము చేయుట, భాగవత కథలను రూపకములుగా ప్రదర్శించుట జరిగెడివి. బమ్మెర రామాలయమునకు వచ్చిన పౌరాణికుడు 'అలికతల భస్మతిలకు' డగుట చేత స్మార్తులగు బ్రాహ్మణులు మతభేదము పాటింపక భాగవతమును సేవించుచుండిరని తెలియుచున్నది.

పోతన జన్మించిన సుముహూర్తము చాల దొడ్డది. అతడు మహాకవి, పండితుడు మహాభక్తుడు, మహాయోగియగు నట్టి జాతకమును కవి గా రూహించిన విషయము సహజమైనది, ఆశ్చర్యకరమైనది.[1] జ్యోతిషులతని జాతకము పరిశీలించి

"కవిగురువులందు మౌఢ్యము కలదు గాని
ఇతని మతిలోన లేదది యింతయేని,
శశి యశమ్మునకైన మచ్చగలదేమొ
కాని యీ కళానిధి నద్ది గానబోము"[2] అనియు "బాలకుఁ డతుల ప్రతిభా శాలి యగున్ వీని నెమరఁ జతురాననుఁడున్ గేలియగున్ ఫణిపతియున్ వేల శిరము లూఁచి మెచ్చు వీని చరిత్రల్"[3] అనియు నత్యాశ్చర్యము నందుచు సంత సించి దీవించిరి.

'విదియనాటి విధుని విధముదోప' నెదుగుచున్న పోతన శైశవము సూక్ష్మ పరిశీలనతో పోషింపబడినది. అతడు మత్స్యావతార మహిమను చింతించునో యన తొట్టెలో చేపవలె నటించునని యిత్యాదిగా వర్ణించిన విషయము శిశువులో భాగవత వాతావరణమును కల్పించుచున్నది. పోతన తిప్పనల సౌభ్రాత్ర

1. ఇందలి జ్యోతిష శాస్త్ర విజ్ఞానము 'వైదుష్యము' అను వ్యాసమున చర్చింప బడెను.
2. పోతన చరిత్రము : 1-116
3. పోతన చరిత్రము : 1-117

మూరిలోని పిన్నలకు పెద్దలందరికి మెప్పుకాగా తమ్ముని కన్నపై గౌరవము, అన్నకు తమ్మునిపై ప్రాణమన్నట్లుగా నొప్పెను.

పోతన బాల్యమునుండియు కుశాగ్రబుద్ధి, చురుకుదనము గలవాడనియు నాటపాటలలో మేటియనియు వర్ణింపబడెను.

"తిప్పన చదివెడు పద్యముఁ జప్పున నొకసారి వినిన సరి పోతన తావిప్పుడు పొత్తము నొప్పుంజెప్పు"[1] నని యతని కేకసంథాగ్రాహిత్వము చిన్న నాడే ప్రకాశించినట్లు చెప్పబడినది. నాటి యాటపాటలలో విద్యాబుద్ధులలో ధైర్య సాహసములలో నతడే మేటి యనుదానికి,

> "ఆటల మేటి, విద్దియలయందున వానికి వాఁడె సాటి, కొ
> ట్లాటను బాలురంద ఱొకపైన నెదిర్చెడి ధాటి, తీయఁగాఁ
> బాటలు పాడుటందుఁ బికవాణికి వానికిఁ బోటియెందు మో
> మోటముఁ గొంకు జంకులను బొత్తుగ వీడి చరించు నాతఁడున్"[2]

అన్నది యుదాహరణము.

ఆటపాటలతో నేర్చెడి చదువునకు దగిన సంస్కారము పోతన పొందు చుండెను బడివిడిచిన పిదప, గుడికిబోవు తల్లి వెంబడి పడిపోయి వెనుక ముందాడక ఎంతో భక్తితో దేవునికి పడిపడి దండములు పెట్టెడివాడు. పోతన కతి బాల్యము ననే భక్తిజ్ఞానయుతమైన సాత్త్విక వాతావరణము తోడై చక్కని సంస్కార మబ్బినదని తెల్పుటకు

> "సాధు సజ్జన దర్శనోత్సాహగతియు,
> హరికథా పురాణ శ్రవణాభిరతియు
> శంభు పదసరోజార్చనాసక్త మతియుఁ
> బెరుగసాగె వేఱొక ప్రక్క బిడ్డయెడఁద."[3]

అని వర్ణించుట జరిగినది.

---

1. పోతన చరిత్రము : 1-126
2. పోతన చరిత్రము : 1-128
3. పోతన చరిత్రము : 1-132

పోతనకు బాల్యముననే భక్తి వేదాంతములపై నాసక్తి కలిగి భాగవతము గూర్చి బాల్యహృదయమున మంచి ముద్రపడుటకు పాల్కురికి యాత్రాగమనము, అక్కడి వీథిభాగవతము చూచి జిజ్ఞాసువై యడిగిన ప్రశ్నలకు తల్లి సముచిత సమాధానములతో భాగవత తత్త్వము విప్పిచెప్పుట మిక్కిలి యుపకరించినవి. అప్పటి తత్త్వోపదేశములో జీవుడు, దేవుడు, ప్రకృతి, జగన్నాటకము, జీవిత పరమార్థము మున్నగునవియేకాక 'దేవళమ్మునందు దీపించు లింగము, సింహముఖము దాల్చిన శ్రీహరి' ఒక్కదేవుని రూపులేయన్న యభేద జ్ఞానము తెలియజేయబడినది. ఈ శివకేశవాభేదబుద్ధి చిదానందగురూపదేశమున స్థిరమై నిల్చినది. పోతనకు నిసర్గముగా భాగవతాంధ్రీకరణాలోచన యున్నదన్నట్లు భాగవతమున ప్రసిద్ధి కెక్కిన కథల నాడుటచేత నా ప్రదర్శనకు భాగవతమన్న పేరు వచ్చినదని తల్లి చెప్పగా 'అది చక్కని పొత్తము నేను పఠించెదని'మ్మని యడిగి, అది గీర్వాణ భాషలో నున్నది, తెలుగులో వెలసిన నీకు తెలియుననగా తెలుగులో వ్రాసి యిమ్మనెను. ఆమె వ్రాయరాదనెను. నేను వ్రాయుదునని పోతన పలికెను. ఇది బాల్యచాపల్యమున కౌతూహలియై పలికినను పోతనయాత్మలో నా తలంపవ్యక్తముగా నున్నట్లు తెలియును. ఆలోచింపగా నా కాలమున వ్యాసభాగవతము తెలుగులో వెలయవలసిన యగత్యము మిక్కిలి తోచుచున్నది. భాగవతమును ప్రవచనము ద్వారా విన్నను యక్షగానములో కన్నను దానిని స్వయముగా చదివి యవగాహన చేసికొనుటకు భక్తితో నిత్యపారాయణము చేయుటకు తెలుగులో వ్రాయబడిన బాగుగా నుండునన్న వాంఛ యప్పటి తెలుగువారికి కలిగినది. ఆ మహాకార్యము నిర్వహింపనున్న పోతన కట్టి ప్రోత్సాహక వాతావరణము బాల్యముననే సమకూడినది.

భాగవతమును నేను తెలుగులో వ్రాయుదునన్న బాలపోతన చిలుక పలుకుల కలరి లక్కాంబ చెప్పగా కేసన యానందాశ్రు కలితనేత్రుడై 'వీనిఁ జూచి నేఁడుదయమె యోగియొక్కఁ డితఁ డుర్వి మహాకవిసార్వభౌముఁడై విదిత విశాల విశ్వపరివేష్టిత నిత్యయశస్వియౌననెను. అదియు నిదియు నొకటియగుట మానస మెల్లఁ బులకరించె' ననుచు కొడుకు భావిజీవిత ప్రపంచమును మనస్సులో చుట్టి వచ్చెను.

పోతనకు బాల్యముననే కవితపై ననురక్తి కలిగించుటకు పాల్కురికి నుండి తిరుగు ప్రయాణములో మార్గమధ్యమునందలి మావితోటను కేసనచేత వర్ణింపజేసినారు కవిగారు. కేసన కావ్యములు వ్రాయలేదు కాని యాతని మావితోట వర్ణన వలన నతనికి కవితాశక్తి కలదని తోచును. కేసన గూర్చి మొదట వర్ణింప బడినప్పుడు 'నానా కళానిలయుండు' అన్న దానిలో కవితాకళ స్ఫురింపకపోదు. దీనిచే పోతనకు కవితాకళ యొకింత పైతృకమని ధ్వనించుచున్నది మావితోట వర్ణన కవితాత్మకే కాక భాగవత జ్ఞానమునకును దోహదము చేసినది. కవులు చేయు వర్ణనవిధానము గ్రహించి పోతన తానొక పద్యము చెప్పి చెట్టు చెంతకు పరు గిడగా 'శుకుండొసంగు భాగవతఫల రసాయనంబో యన శుకము ఫలము రాల్చెను.' ఇది భవిష్యద్భాగవత రచనమును వ్యంగ్యముగా స్ఫురింపజేయుచున్నది. ఆ తోట లోను పోతన కుతూహలముతో నడిగిన ప్రశ్నలకు తండ్రి సమాధానములు చెప్పుచు భాగవత తత్త్వము విప్పుచు ప్రకృతి పురుషులు తల్లిదండ్రులనియు, జగమొక దాసుడుమూలల క్రీడారంగమనియు నిరూపించెను. జగన్నాటక సూత్ర ధారియగు కృష్ణుని ప్రసక్తి రాగా నతని విశేషము లడిగిన పోతనకు లక్కాంబ గృహములో విశ్రాంతిగా నున్నప్పుడు చెప్ప నొప్పుననియు నంతేకాక తన గర్భ మున నున్నపుడే యా కథలన్నియు నతడు వినియుండెననియు భాగవత కథా శ్రవణ విషయమతని యుత్కంఠను పురికొల్పెను. ఈ రీతిగా బాల్యమున పోతనకు భక్తి, భాగవత తత్త్వము, కవితాత్మ బయలుపడునట్లు ప్రత్యేక శ్రద్ధతో ఆ పాత్ర తీర్చి దిద్దబడినది. తలిదండ్రులే తొలిగురువులన్నట్లు పోతనకు తలిదండ్రులే మొదట భక్తిజ్ఞానాదులను రేకెత్తించి కవితాసక్తి కలిగించినట్లు కవిగారు చక్కగా పాత్రపోషణ కావించిరి.

పోతన పదారు వత్సరాల తారుణ్య ప్రాయమున చిదానందయోగి దర్శనమై రామతారక శారదా మహామంత్రముల యుపదేశము లభించి భక్తికిని కవితా శక్తికిని హృదయక్షేత్రమున ససలైన బీజములు పడినవి. అంతకు ముందు తలి దండ్రులవలన నుద్బుద్ధమైన భక్తి జ్ఞానాత్మక జిజ్ఞాస చిదానందుని సందర్శింప గనే వెల్లుబికి వచ్చినది. పోతన రామభక్తుడై శివకేశవాభేద భావము గలవాడగుట కీ ఘట్టము ముఖ్యహేతువైనది. ఇంటిలో మాతాపితలవల్ల నలవడిన సంస్కారము వలని 'సాధు సజ్జన దర్శనోత్సాహగతి' యిచ్చట చిదానందునికి భక్తి వినయము లతో నమస్కరించి మన్ననచేసి గోక్షీరము లిచ్చి సత్కరించుటలో, జిజ్ఞాసువై

భగవద్దర్శన విషయమడుగుటలో సువ్యక్తమగుచున్నది. యోగి గోరసముల తృప్తిగాంచి 'నీవు గోరస మిట్టులె నిఖిలజనము లవని నాచంద్రతారార్క మనుభ వింత్రుగాత!' మని దీవించెను. మహాకవి వగుదువన్న యోగీంద్రుని దీవన వట్టి వోవునా? భవిష్యన్మహాకవి కివియెల్ల శుభసూచకములై తన్మహనీయ స్థితికి పోషక ములై యొప్పునట్లు పాత్రను చిత్రించుట జరిగినది.

ఈ సందర్భమున మంత్రద్వయోపదేశము చేసి శారదా మంత్రోపాసనకు చెప్పిన నియమములు, బ్రహ్మచర్యవ్రత మహిమను, దీనజనోద్ధరణ దివ్యకర్మను గూర్చి సెలవిచ్చిన హితోక్తులు మిక్కిలి ప్రాముఖ్యము వహించియున్నవి. వీని పైననే శర్వాతి పోతనగారి ప్రధాన సాంసారిక సారస్వత జీవితమాధారపడి యుండినట్లు కల్పించి పాత్రపోషణ చక్కగా నిర్వహింపబడినది.

సహజముగను గురూపదేశమువల్లను కలిగిన దీనజనోద్ధరణగుణము పేద జవరాలిని, దీనభిక్షుకుని దయతో నాదుకొనుటలో పోషింపబడినవి. అతని సత్కవిత మహాప్రభావపూర్ణమై మునుముందు పవిత్రభాగవతము నాంధ్రీకరించు నంతటిదైన దనుటకు పేదజవరాలిని భంగపరప బూనిన యువక భూస్వామికి వినిపించి గుణవంతుని జేసిన హితోపదేశక కావ్యము తార్కాణము. 'కవిశ్శుచిః' యని చెప్పినట్లు కవి సచ్ఛీలుడై నడచి యితరులను సన్మార్గమున నడపింపగలిగి నప్పుడె సుకవియై మహాకావ్యరచన కర్హతగలవాడగునని ధ్వని గర్భితముగా చెప్పదగినట్లు పోతన పాత్రను చిత్రించుటయైనది. మరియు నిచట నింకొక విశేషము కలదు. పోతన కవిత వ్రాయమొదలిడిన యత్యారంభ దశలోనే చేలవద్ద గల ప్రకృతిని, వెనువెంటనే పేదజవరాలికి యువక భూస్వామికి చెందిన హితోప దేశక కవితవల్ల మానవ మనస్తత్త్వమును వర్ణించుటవల్ల కవితారచనకు సమ్యగ్ బీజావాపము జరుగునట్లు పాత్ర పోషింపబడినది.

పోతన తమస్సునకు వెరవని శుద్ధసత్త్వ సంపన్నుడు, కరుణాళువు, క్షమామూర్తి, అపకారి కుపకారము చేయువాడనుటకు తన్ను జంపబూని పొలాలలో సర్పదష్టుడైయున్న పోచయ్యను కాపాడిన యుదంతము పోషకమై యొప్పుచున్నది. అతని యతిథిమర్యాదకు, దాతృత్వమునకు దుర్భిక్షకాలమున "ఎవఁడు వచ్చినన్ బోతన యింటిముందు నంతో యింతో పెట్టికయె పొమ్మను

తెలుఁగరు"[1] అన్నదియు, "ఉన్నది లేనిది గృహమందెన్నండారయఁ దేవార లెవ్వరైనను బోతన్న భుజింపక చనవలదున్నది మన గృహమటంచు నొగి కొని వచ్చున్"[2] అన్నదియు నిదర్శనము. ఇట్టి మితిలేని దాతృత్వము పోతన లేమికి దారితీసెను. ఈ యతిథిమర్యాద, ఈ దాతృత్వ మర్యాద, ఈ దాతృత్వ స్వభావము పోతనకు సహజముగా నచ్చినవి. బుద్ధితెలియ మొదలైన తారుణ్యదశలోనే చిదానందయోగికి గోక్షీరము లిచ్చుట, శ్రీనాథునింటికి తోడ్కొనిపోయి యతిథి సత్కారము చేయుట మున్నగునవి దీనికి నిదర్శనములు.

పోతన కసాధారణ ధారణాశక్తి యబ్బినదనుటకు శ్రీనాథుని ప్రథమ సందర్శన సమయమున నతడు చెప్పిన యాశుపద్యమును వ్రాసిపెట్టుటలోను వినయశీలి యనుటకు తన పద్యములను శ్రీనాథుడు తాళపత్రమున చూచునంత వరకు ప్రకటింపక పోవుటయేకాక శ్రీనాథు డడిగినప్పుడు సవినయముగ మ్రొక్కి నిలుచుటలోను సువ్యక్తములైనవి. పోతన వినయాదిక సుగుణ సంపదకు కవి సార్వభౌముడిట్లు ముగ్ధుడాయెను.

"వెలుఁగొ నీ వినయాతిరేకమును నీ విద్యావివేకమ్ములా
వరణీయాంగజరూపవైభవము నవ్యాజస్వభావమ్ములా
దరణీయమ్ములు లోకమంతకును విద్వద్వంద్యుఁడౌ నీతఁ డే
పరమోత్కృష్టమహాపురాణకృతి నిర్మాణార్థమై పుట్టెనో!"[3]

మరియు "నిరుపమ కావ్యవాణి యితనిన్ వరియించుట పీనసుందరా హరియు హరుండు వాగ్వరుఁడు నైక్యవిధాకృతి వ్యాసరూపతన్" అని మదిలో మిక్కిలి వినుతించెను. నాచిరాత్రి బమ్మెరకు విచ్చేసి తమయింటిలో విశ్రమించుటకు ప్రార్థించి, తమ తండ్రి యతని దెలిసి మిగుల సంతోషించి కావ్యామృతము గ్రోలి పరవశించునని పలికి "భవశత పుణ్యపుంజ పరిపాక వశమ్మునఁగాక జ్ఞానవైభవ జితధాతయున్ సరస వాఙ్మయ లౌకిక నేతయైన సత్కవివరు దర్శనమ్మెటులు గల్గు" నని యింటికి దోడ్కొనిపోయిన విషయము పోతనకు సుకవీంద్రులయెడ గల యత్యంత ప్రేమను వ్యక్తము చేయుచున్నది. పోతన భాగవతాంకితకథో

1,2. పోతన చరిత్రము : 5-195, 197.
3. పోతన చరిత్రము : 2-170

వ్రాయుటయు, భాగవతాంధ్రీకరణలో శ్రీధరీయవ్యాఖ్య ననుసరించుటయు దీనికి నిదర్శనములు. కాగా, జనశ్రుతిలోనున్నట్లు పోతన చిదానందయోగివలన రామ తారకముపదేశము పొంది శివకేశవ సమన్విత తత్త్వదేవతయగు శ్రీరాము నుపా సించుటచేత నతనికి శివునితోపాటు విష్ణువును నిష్టదైవమాయె ననుట సమంజస మైనది. భాగవతరచనానంతరము పోతన వైష్ణవము స్వీకరించినట్లు ఆచార్యులవారు కల్పన చేసినది యుక్తియుక్తమని తోచును.

భాగవత పీఠికలో సంపాదకులిట్లు వ్రాసిరి.

"పోతనామాత్యుడు పుణ్యశీలి. శైవుల ఇంటనే పుట్టెను. కాని వీరభద్ర పళ్ళెము నెత్తి "హరోంహర" యని ఊగేగుచున్న నాటి మతోద్వేగమునకు ఓపలేక పోయెను. వైష్ణవము స్వీకరించెను. మహాభాగవతమును తెనిగించి, మాతృభాషను మధుమయము చేసి వైకుంఠములో హరికీర్తన మాచరించుటకు తరలిపోయెను."[1]

ఈ వాక్యములలో వైష్ణవము స్వీకరించిన పిదప భాగవతమును తెనిగించె నన్నది సంపాదకుల యభిప్రాయమగుచో నది యుక్తమయినదిగా తోచదు. భాగ వతాధారములనుబట్టి వరదాచార్యుల వారూహించినట్లు భాగవతాంధ్రీకరణానంత రమే విరాగియై తీర్థయాత్రలు చేయుచు శ్రీరంగమున విశిష్టాద్వైతము స్వీకరించి నాడనుట యుక్తముగానున్నది. కావ్యమున పోతనగారి మతవిషయకమైన మూడు దశలను 1. శైవులయింట జననము, శివారాధనము 2. రామతారకమంత్రోప దేశము వల్ల శివకేశవాభేదభావముతో రామభక్తి, తద్ద్వారా విష్ణుభక్తి 3. వైష్ణవ మతావలంబనము—అనువానిని కడుమెలకువతో పోషించి తత్పాత్ర కుదాత్తత నవ రించినారు. శ్రీవైష్ణవులగు వరదాచార్యులవారు తమకుగల మతవిషయక విశాల హృదయముతో సంయమనముతో పోతన పాత్ర నీ రీతిగా పోషించుట నితాంత ప్రశంసాపాత్రమైనది.

## పోతన పాత్రపోషణ:

పోతన పాత్రపోషణలో నతని జన్మము, బాల్యము, విద్యాకవితాభ్యాసము అను దశలను కవిగారు మిక్కిలి పటిష్ఠముగా నిర్వహించినట్లు తెలియగలము.

1. శ్రీ మహాభాగవతము-'పీఠిక' పుట 77. (ఆం. ప్ర. సాహిత్య అకాదమి వారి ప్రచురణ)

మహాభక్తుడుగా మహాకవిగా విరజిల్లిన పోతనజీవిత సౌధమునకు జన్మబాల్యాదులు పునాదులై పరిఢవిల్లుటకు ప్రత్యేక శ్రద్ధవహించినారు.

కావ్యోపక్రమములో వివరించినట్లు పోతన వ్యాసాంశలో జన్మించినాడు ఇది 'నానృషిః కురుతే కావ్య'మ్మను మహావాక్యమున కన్వయించినది. మహానుభావుడగు పోతనజన్మము కారణ గర్భితమని కవిగారు పలుచోటుల సూచించినారు.

"తెన్గు భాగవత కన్యనొసంగు మటంచు వేడెఁ దా నెవనినిగాంచి శ్రీరమణుఁ డిట్టిఁడు మానవమాత్రుఁడౌనొకో!"[1]

"ఉదయించె నాంధ్రశారద యదృష్టమన నొక్క పాపఁడల వ్యాసాంశన్"[2]
"ఇవ్వటుని జన్మము కారణగర్భితంబిలన్"[3]
"ఈతఁ డే పరమోత్కృష్ట మహాపురాణ కృతి నిర్మాణార్థమై పుట్టెనో"[4]
"బద్ధ సంసారుల నుద్ధరింప నిటు జన్మధరించితివేమొ సత్కవీ!"[5]
"సూత శుకులను గరఁగి యచ్చునను బోయు
పోఁతనా వెలుఁగొందె నీ పోతనకవి
భయద భవవార్ధి తారణోపాయమైన
పోతరూపమై పోతన పుట్టెనిరి."[6]
"పోతనార్యుఁడొక కారణజన్ముఁడు"[7]

ఇత్యాది వాక్యములేకాక ఈయన్నిటికి సమర్థనగా పోతన జన్మఘట్టముగల ప్రథమా శ్వాసాదిలో 'శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే' అను గీతావాక్య మును శీర్షికగా నలంకరించిరి ఈ విధముగా కావ్యమున ఆది నుండి యంతము

1. పోతన చరిత్రము : పీఠిక-'అభ్యర్థన 59 పద్యము.
2. పోతన చరిత్రము : 1-111
3. ,, : 2-27
4. ,, : 2-170
5. ,, : 5-133
6. ,, : 9-67
7. ,, : 9-317

వరకు పోతన కారణజన్ముడగు మహాపురుషుడని పేర్కొని తదనుసారముగ నతని పాత్రను పోషించిరి.

మానవుని గుణశీలములపై 'వారసత్వము', పరిసరములు ప్రభావము కలిగించునని మనస్తత్వ శాస్త్రవేత్తలు చెప్పునట్లు పోతన యానువంశికగుణము లను ముఖ్యముగా తలిదండ్రుల గుణములను పుణికి పుచ్చుకొని పుట్టి పెరిగినట్లు కావ్యమున వర్ణింపబడి యున్నది. అట్లే పరిసరాల ప్రభావము కూడా నతనిపై బడి వికసించినట్లు కలదు. తండ్రినుండి యతనికి సర్వజనాదరణ బుద్ధి, దాతృత్వము, ఆత్మాభిమానము. మృడానీ పదభక్తి, పరోపకారచింత, కలనైనను తలవంచి యొరులను గొలువబోని స్వభావము, సత్యధర్మాదులును, తల్లినుండి యమృత హృదయము, శివారాధన, సౌశీల్యము, స్వార్థరాహిత్యము, దీనజన సేవా భావము సంక్రమించినవి. పావనమైన గుణకర్మ స్వభావములచే విశిష్టమైన యుత్తమ గృహమున జన్మించిన పోతన మాతృ గర్భమున నున్నపుడే ప్రబుద్ధు డైనట్లు కవిగారు చిత్రించిరి. లక్కాంబ నిండు గర్భిణియై యున్నపుడు బమ్మెర రామాలయమున బ్రాహ్మణోత్తము డొకడు భాగవత ప్రవచనము చేయుచుండ వెడలి సప్తాహములు శ్రద్ధతో విని తమవంటి వారు చదివి తరించుటకు భాగవతము నెవరైన తెలుగు చేసిరా ? యని యడుగ నతడామె గర్భమున నొక బ్రహ్మ తేజము భాసిల్లుచున్నట్లు గ్రహించి 'నీదు పొట్టఁబుట్టెడు నీ కోర్కి నిజము సేయు వాఁడు నేడో రేపో యుదయ మొందకుండ నుండునె ?' యని పలికి 'సుతనయా వాప్తిర'స్తని యాశీర్వదించెను. ప్రహ్లాదుడు గర్భస్థుడై యున్నపుడు నారద ప్రబోధితుడై నెగడినటుల పోతన తల్లిగర్భమున నున్నపుడు భాగవత ప్రవచనము విని మేలు కాంచెను. మరియు గర్భవతియై యున్నపుడు స్త్రీకి కలిగెడు తలంపులు పుట్టబోవు శిశువునకు కలుగునన్న శాస్త్రవిషయానుసారముగా భవిష్యద్భాగవత కర్తయగు పోతనకు భాగవతముపై చిత్తము పడుటకు, తదాంధ్రీకరణ కాంక్ష యేపారుటకు తగిన ప్రేరణ, పరిస్థితి సమకూడినట్లు చిత్రించుట జరిగినది. మరియు నిదే విషయము పాల్కురికి జాతర నుండి బమ్మెరకు వచ్చు వేళ మావి తోటలో జరిగిన శ్రీకృష్ణ ప్రశంసలో లక్కాంబ స్వయముగా తన గర్భములో నున్నపుడు పోతన భాగవత కథలు విన్న విషయము చెప్పి తల్లిగొను నన్న పానములు, ఔషధములు గర్భస్థ శిశువునకును జెందునట్లే 'శ్రీగురుసూక్తి పొట్ట నివసించెడి నీకును జెందు'నని పచించెను.

పోతనకు భాగవతము మీద చిత్తము పడుటకు బాల్యమున మరొక చక్కని సన్నివేశము కల్పింపబడినది. పాల్కురికి జాతరలో వీథిభాగవత సందర్శనము, తదీయ తత్త్వబోధ యతనికి సమకూరి భవిష్యద్భాగవ తాంధ్రీకరణకు ప్రేరకములైనవి నేటివలెనే నాడును బ్రాహ్మణులు పురాణోత్తమ మగు భాగవతమును ప్రవచనము చేయుట, భాగవత కథలను రూపకములుగా ప్రదర్శించుట జరిగెడివి. బమ్మెర రామాలయమునకు వచ్చిన పౌరాణికుడు 'అలికతల భస్మతిలకు' డగుట చేత స్మార్తులగు బ్రాహ్మణులు మతభేదము పాటింపక భాగవతమును సేవించుచుండిరని తెలియుచున్నది.

పోతన జన్మించిన సుముహూర్తము చాల దొడ్డది. అతడు మహాకవి, పండితుడు మహాభక్తుడు, మహాయోగి యగు నట్టి జాతకమును కవి యూహించిన విషయము సహజమైనది, ఆశ్చర్యకరమైనది.[1] జ్యోతిషులతని జాతకము పరిశీలించి

"కవిపురుషులందు మౌఢ్యము కలదు గాని
యితని మతిలోన లేదది యింతయేని,
శశి యశమ్మనకైన మచ్చగలదేమొ
కాని యీ కళానిధి నద్ది గానబోము"[2] అనియు "బాలకుఁ డతుల ప్రతిభాశాలి యగున్ వీని నెమరఁ జతురాననుఁడున్ గేలియగున్ ఫణిపతియున్ వేల సరము లూఁచి మెచ్చు వీని చరిత్రల్"[3] అనియు నత్యాశ్చర్యము నందుచు సంతసించి దీవించిరి.

'విదియనాటి విధుని విధముదోప' నెదుగుచున్న పోతన శైశవము సూక్ష్మ పరిశీలనతో పోషింపబడినది. అతడు మత్స్యావతార మహిమను చింతించునో యన తొట్టెలో చేపవలె నటించునని యిత్యాదిగా వర్ణించిన విషయము శిశువులో భాగవత వాతావరణమును కల్పించుచున్నది. పోతన తిప్పనల సౌభ్రాత్ర

1. ఇందలి జ్యోతిష శాస్త్ర విజ్ఞానము 'వైదుష్యము' అను వ్యాసమున చర్చింపబడెను.
2. పోతన చరిత్రము : 1-116
3. పోతన చరిత్రము : 1-117

మూరిలోని పిన్నలకు పెద్దలందరికి మెప్పుకాగా తమ్మని కన్నపై గౌరవము, అన్నకు తమ్మునిపై ప్రాణమన్నట్లుగా నొప్పెను.

పోతన బాల్యమునుండియు కుశాగ్రబుద్ధి, చురుకుదనము గలవాడనియు నాటపాటలలో మేటియనియు వర్ణింపబడెను.

"తిప్పన చదివెడు పద్యముఁ జప్పున నొకసారి వినిన సరి పోతన తావిప్పుడు పొత్తము నొప్పంజెప్పు"[1] నని యతని కేకసంథాగ్రాహిత్వము చిన్న నాడే ప్రకాశించినట్లు చెప్పబడినది. నాటి యాటపాటలలో విద్యాబుద్ధులలో ధైర్య సాహసములలో నతడే మేటి యనుదానికి,

> "ఆటల మేటి, విద్దియలయందున వానికి వాఁడె సాటి, కొ
> ట్లాటను బాలురంద ఱొకటైన నెదిర్చెడి ధాటి, తీయఁగాఁ
> బాటలు పాడుటందుఁ బికవాణికి వానికిఁ బోటియెందు మో
> మోటముఁ గొంకు జంకులను బొత్తుగ వీడి చరించు నాతఁడున్"[2]

అన్నది యుదాహరణము.

ఆటపాటలతో నేర్చెడి చదువునకు దగిన సంస్కారము పోతన పొందు చుండెను బడివిడిచిన పిదప, గుడికిబోవు తల్లి వెంబడి పడిపోయి వెనుక ముందాడక ఎంతో భక్తితో దేవునికి పడిపడి దంతములు పెట్టెడివాడు. పోతన కతి బాల్యము ననే భక్తిజ్ఞానయుతమైన సాత్త్విక వాతావరణము తోడై చక్కని సంస్కార మబ్బినదని తెల్పుటకు

> "సాధు సజ్జన దర్శనోత్సాహగతియు,
> హరికథా పురాణ శ్రవణాభిరతియు
> శంభు పదసరోజార్చనాసక్త మతియుఁ
> బెరుగసాగె వేఱొక ప్రక్క బిడ్డయెడఁద."[3]

అని వర్ణించుట జరిగినది.

1. పోతన చరిత్రము : 1-126
2. పోతన చరిత్రము : 1-128
3. పోతన చరిత్రము : 1-132

పోతనకు బాల్యముననే భక్తివేదాంతములపై నాసక్తి కలిగి భాగవతము గూర్చి బాల్యహృదయమున మంచి ముద్రపడుటకు పాల్కురికి యాత్రాగమనము, అక్కడి వీథిభాగవతము చూచి జిజ్ఞాసువై యడిగిన ప్రశ్నలకు తల్లి సముచిత సమాధానములతో భాగవత తత్త్వము విప్పిచెప్పుట మిక్కిలి యుపకరించినవి. అప్పటి తత్త్వోపదేశములో జీవుడు, దేవుడు, ప్రకృతి, జగన్నాటకము, జీవిత పరమార్థము మున్నగునవియేకాక 'దేవళమ్మునందు దీపించు లింగము, సింహముఖము దాల్చిన శ్రీహరి' ఒక్కదేవుని రూపులేయన్న యభేద జ్ఞానము తెలియజేయబడినది. ఈ శివకేశవాభేదబుద్ధి చిదానందగురూపదేశమున స్థిరమై నిల్చినది. పోతనకు నిసర్గముగా భాగవతాంధ్రీకరణాలోచన యున్నదన్నట్లు భాగవతమున ప్రసిద్ధి కెక్కిన కథల నాడుటచేత నా ప్రదర్శనకు భాగవతమన్న పేరు వచ్చినదని తల్లి చెప్పగా 'అది చక్కని పొత్తము నేను పఠించెదని'మ్మని యడిగి, అది గీర్వాణ భాషలో నున్నది, తెలుగులో వెలసిన నీకు తెలియుననగా తెలుగులో వ్రాసి యిమ్మనెను. ఆమె వ్రాయరాదనెను. నేను వ్రాయుదునని పోతన పలికెను. ఇది బాల్యచాపల్యమున కౌతూహలియై పలికినను పోతనయాత్మలో నా తలంపవ్యక్తముగా నున్నట్లు తెలియును. ఆలోచింపగా నా కాలమున వ్యాసభాగవతము తెలుగులో వెలయవలసిన యగత్యము మిక్కిలి తోచుచున్నది. భాగవతమును ప్రవచనము ద్వారా విన్నను యక్షగానములో కన్నను దానిని స్వయముగా చదివి యవగాహన చేసికొనుటకు భక్తితో నిత్యపారాయణము చేయుటకు తెలుగులో వ్రాయబడిన బాగుగా నుండునన్న వాంఛ యప్పటి తెలుగువారికి కలిగినది. ఆ మహాకార్యము నిర్వహింపనున్న పోతన కట్టి ప్రోత్సాహక వాతావరణము బాల్యముననే సమకూడినది.

భాగవతమును నేను తెలుగులో వ్రాయుదునన్న బాలపోతన చిలుక పలుకుల కలరి లక్కాంబ చెప్పగా కేసన యానందాశ్రు కలితనేత్రుడై 'వీనిఁ జూచి నేఁడుదయమె యోగియొక్కఁ డితఁ డుర్వి మహాకవిసార్వభౌముఁడై విదిత విశాల విశ్వపరివేష్టిత నిత్యయశస్వియౌననెను. అదియు నిదియు నొకటియగుట మానస మెల్లఁ బులకరించె' ననుచు కొడుకు భావిజీవిత ప్రపంచమును మనస్సులో చుట్టి వచ్చెను.

పోతనకు బాల్యముననే కవితపై ననురక్తి కలిగించుటకు పాల్కురికి నుండి తిరుగు ప్రయాణములో మార్గమధ్యమునందలి మావితోటను కేసనచేత వర్ణింపజేసినారు కవిగారు. కేసన కావ్యములు వ్రాయలేదు కాని యాతని మావితోట వర్ణన వలన నతనికి కవితాశక్తి కలదని తోచును. కేసన గూర్చి మొదట వర్ణింప బడినప్పుడు 'నానా కళానిలయుండు' అన్న దానిలో కవితాకళ స్ఫురింపకపోదు. దీనిచే పోతనకు కవితాకళ యొకింత పైతృకమని ధ్వనించుచున్నది మావితోట వర్ణన కవితాత్మకే కాక భాగవత జ్ఞానమునకును దోహదము చేసినది. కవులు చేయు వర్ణనవిధానము గ్రహించి పోతన తానొక పద్యము చెప్పి చెట్టు చెంతకు పరు గిడగా 'శుకుఁడొసంగు భాగవతఫల రసాయనంబో యన శుకము ఫలము రాల్చెను.' ఇది భవిష్యద్భాగవత రచనమును వ్యంగ్యముగా స్ఫురింపజేయుచున్నది. ఆ తోట లోను పోతన కుతూహలముతో నడిగిన ప్రశ్నలకు తండ్రి సమాధానములు చెప్పుచు భాగవత తత్త్వము విప్పుచు ప్రకృతి పురుషులు తల్లిదండ్రులనియు, జగమొక దాసుడుమూలల క్రీడారంగమనియు నిరూపించెను. జగన్నాటక సూత్ర ధారియగు కృష్ణుని ప్రసక్తి రాగా నతని విశేషము లడిగిన పోతనకు లక్కాంబ గృహములో విశ్రాంతిగా నున్నప్పుడు చెప్ప నొప్పుననియు నంతేకాక తన గర్భ మున నున్నపుడే యా కథలన్నియు నతడు వినియుండెననియు భాగవత కథా శ్రవణ విషయమతని యుత్కంఠను పురికొల్పెను. ఈ రీతిగా బాల్యమున పోతనకు భక్తి, భాగవత తత్త్వము, కవితాత్మ బయలుపడునట్లు ప్రత్యేక శ్రద్ధతో ఆ పాత్ర తీర్చి దిద్దబడినది. తలిదండ్రులే తొలిగురువులన్నట్లు పోతనకు తలిదండ్రులే మొదట భక్తిజ్ఞానాదులను రేకెత్తించి కవితాసక్తి కలిగించినట్లు కవిగారు చక్కఁగా పాత్రపోషణ కావించిరి.

పోతన పదారు వత్సరాల తారుణ్య ప్రాయమున చిదానందయోగి దర్శనమై రామతారక శారదా మహామంత్రముల యుపదేశము లభించి భక్తికిని కవితా శక్తికిని హృదయక్షేత్రమున ససలైన బీజములు పడినవి. అంతకు ముందు తలి దండ్రులవలన నుద్బుద్ధమైన భక్తి జ్ఞానాత్మక జిజ్ఞాస చిదానందుని సందర్శింప గనే పెల్లుబికి వచ్చినది. పోతన రామభక్తుడై శివకేశవాభేద భావము గలవాడగుట కీ ఘట్టము ముఖ్యహేతువైనది. ఇంటిలో మాతాపితలవల్ల నలవడిన సంస్కారము వలని 'సాధు సజ్జన దర్శనోత్సాహగతి' యిచ్చట చిదానందునికి భక్తి వినయము లతో నమస్కరించి మన్ననచేసి గోక్షీరము లిచ్చి సత్కరించుటలో, జిజ్ఞాసువై

భగవద్దర్శన విషయమడుగుటలో సువ్యక్తమగుచున్నది. యోగి గోరసముల తృప్తిగాంచి 'నీవు గోరస మిట్టులె నిఖిలజనములకని నాచంద్రతారార్క మనుభవింత్రుగాత!' మని దీవించెను. మహాకవి వగుదువన్న యోగీంద్రుని దీవన వట్టి వోవునా? భవిష్యన్మహాకవి కివియెల్ల శుభసూచకములై తన్మహనీయ స్థితికి పోషకములై యొప్పునట్లు పాత్రను చిత్రించుట జరిగినది.

ఈ సందర్భమున మంత్రద్వయోపదేశము చేసి శారదా మంత్రోపాసనకు చెప్పిన నియమములు, బ్రహ్మచర్యవ్రత మహిమను, దీనజనోద్ధరణ దివ్యకర్మను గూర్చి సెలవిచ్చిన హితోక్తులు మిక్కిలి ప్రాముఖ్యము వహించియున్నవి. వీని పైననే శర్వాణి పోతనగారి ప్రధాన సాంసారిక సారస్వత జీవితమాధారపడి యుండినట్లు కల్పించి పాత్రపోషణ చక్కగా నిర్వహింపబడినది.

సహజముగను గురూపదేశమువల్లను కలిగిన దీనజనోద్ధరణగుణము పేద జవరాలిని, దీనభిక్షుకుని దయతో నాదుకొనుటలో పోషింపబడినవి. అతని సత్కవిత మహాప్రభావపూర్ణమై మునుముందు పవిత్రభాగవతము నాంధ్రీకరించు నంతటిదైన దనుటకు పేదజవరాలిని భంగపరప బూనిన యువక భూస్వామికి వినిపించి గుణవంతుని జేసిన హితోపదేశక కావ్యము తార్కాణము. 'కవిశ్శుచిః' యని చెప్పినట్లు కవి సచ్ఛీలుడై నడచి యితరులను సన్మార్గమున నడపింపగలిగి నప్పుడె సుకవియై మహాకావ్యరచన కర్హతగలవాడగునని ధ్వని గర్భితముగా చెప్పదగినట్లు పోతన పాత్రను చిత్రించుటయైనది. మరియు నిచట నింకొక విశేషము కలదు. పోతన కవిత వ్రాయమొదలిడిన యత్నారంభ దశలోనే చేలవద్ద గల ప్రకృతిని, వెనువెంటనే పేదజవరాలికి యువక భూస్వామికి చెందిన హితోపదేశక కవితవల్ల మానవ మనస్తత్త్వమును వర్ణించుటవల్ల కవితారచనకు సమ్యగ్బీజావాపము జరుగునట్లు పాత్ర పోషింపబడినది.

పోతన తమస్సునకు వెరపని శుద్ధసత్త్వ సంపన్నుడు, కరుణాళువు, క్షమామూర్తి, అపకారి కుపకారము చేయువాడనుటకు తన్ను జంపబూని పొలాలలో సర్పదష్టుడైయున్న పోచయ్యను కాపాడిన యుదంతము పోషకమై యొప్పుచున్నది. అతని యతిథిమర్యాదకు, దాతృత్వమునకు దుర్భిక్షకాలమున "ఎవడు వచ్చినన్ బోతన యింటిముందు నంతో యింతో పెట్టకయె పొమ్మను

తెలుఁగరు"[1] అన్నదియు, "ఉన్నది లేనిది గృహమందెన్నండారయఁ దేవార లెవ్వరైనను బోతన్న భుజింపక చనవలదున్నది మన గృహమటంచు నాగి కొని వచ్చున్"[2] అన్నదియు నిదర్శనము. ఇట్టి మితిలేని దాతృత్వము పోతన లేమికి దారితీసెను. ఈ యతిథిమర్యాద, ఈ దాతృత్వ మర్యాద, ఈ దాతృత్వ స్వభావము పోతనకు సహజముగా నచ్చినవి. బుద్ధితెలియ మొదలైన తారుణ్యదశలోనే చిదానందయోగికి గోక్షీరము లిచ్చుట, శ్రీనాథునింటికి తోడ్కొనిపోయి యతిథి సత్కారము చేయుట మున్నగునవి దీనికి నిదర్శనములు.

పోతన కసాధారణ ధారణాశక్తి యబ్బినదనుటకు శ్రీనాథుని ప్రథమ సందర్శన సమయమున నతడు చెప్పిన యాశుపద్యమును వ్రాసిపెట్టుటలోను వినయశీలి యనుటకు తన పద్యములను శ్రీనాథుడు తాళపత్రమున చూచునంత వరకు ప్రకటింపక పోవుటయేకాక శ్రీనాథు డడిగినప్పుడు సవినయముగ మ్రొక్కి నిలుచుటలోను సువ్యక్తములైనవి. పోతన వినయాదిక సుగుణ సంపదకు కవి సార్వభౌముడిట్లు ముగ్ధుడాయెను.

> "వెలుఁగౌ నీ వినయాతిరేకమును నీ విద్యావివేకమ్ములా
> వరణీయాంగజరూపవైభవము నవ్యాజస్వభావమ్ములా
> దరణీయమ్ములు లోకమంతకును విద్వద్వంద్యుఁడౌ నీతఁ డే
> పరమోత్కృష్టమహాపురాణకృతి నిర్మాణార్థమై పుట్టెనో!"[3]

మరియు "నిరుపమ కావ్యవాణి యితనిన్ వరియించుట వీననుందురా హరియు హరుండు వాగ్వరుఁడు నైక్యవిధాకృతి వ్యాసరూపతన్" అని మదిలో మిక్కిలి వినుతించెను. నాచిరాత్రి బమ్మెరకు విచ్చేసి తమయింటిలో విశ్రమించుటకు ప్రార్థించి, తమ తండ్రి యతని దెలిసి మిగుల సంతోషించి కావ్యామృతము గ్రోలి పరవశించునని పలికి "భవశత పుణ్యపుంజ పరిపాక వశమ్మునఁగాక జ్ఞానవైభవ జితధాతయున్ సరస వాఙ్మయ లౌకిక నేతయైన సత్కవివరు దర్శనమ్మెటులు గల్గు" నని యింటికి దోడ్కొనిపోయిన విషయము పోతనకు సుకవీంద్రులయెడ గల యత్యంత ప్రేమను వ్యక్తము చేయుచున్నది. పోతన భాగవతావతారికలో

1,2. పోతన చరిత్రము : 5-195, 197.
3. పోతన చరిత్రము : 2-170

భూత భవిష్యద్వర్తమాన కవులనెల్ల ప్రేమతో స్మరించిన సుగుణమిచట ననువర్తితమై పోతనను పోషించుచున్నది.

పోతన బ్రహ్మచర్యవ్రత కఠోరదీక్ష యనన్యమైనది. గురు వచనానుసారముగా మంత్రోపాసనకు బ్రహ్మచర్యవ్రత మవలంబించి యేకాదశ వర్షములు గడపుట యొక యెత్తు, చివరి వత్సరములో వివాహమై నాతిగల బ్రహ్మచర్యము నడపుట యొక యెత్తు ఇదియే యతని కగ్నిపరీక్ష. మనుచరిత్రలోని ప్రవరాఖ్యుడు పైబడిన యప్సరసను తిరస్కరించెననగా నది యతని పరకాంతావైముఖ్య సచ్ఛీలము. అది చాల గొప్పదే. కాని యంతకంటె గొప్పది పోతన దీక్ష. శోభనము నాటిరాత్రి పోతన

"ఇంతి పజ్జనున్న నేకాంతమున ఋష్యశృంగునకును శృంగభంగమగును
మాదృశులను గూర్చి మాటాడనేటికి శివుని గెల్చు మదనునెవడదల్చు."[1]

అని వ్యథపడి, 'అస్మద్బ్రహ్మచర్యానఘవ్రత దీక్షారతితోడ నిట్టి యసిధారా మార్గమందెట్లు నన్ కృతకృత్యుంబొనరింతువో' యని వాగీశ్వరిని ప్రార్థించెను. తొలిరేయి నుండియు నతికఠోరముగా నిష్ఠురముగా దీక్షగా బ్రహ్మచర్యవ్రతము నిర్వహించెను. కొంతకాలమిట్లు వేగించినను దైవికముగా కొన్ని సంఘటనలు జరిగి వశము తప్పి బ్రహ్మచర్యవ్రత భంగమాయెను. అది యతని ప్రారబ్ధము. దానిని తప్పించుకొనువారెవ్వరు ? పోతనసతి బ్రహ్మచర్య వ్రతభంగము చేయ రత్యంశలో పుట్టినదని కావ్యోపక్రమములో చెప్పబడెను. ఆమె యా పని నెరవేర్చినది.

పోతన తపోభంగభయమున విముఖుడై యుండెనే కాని యతని మానస మర్ధాంగియెడ క్రూరమైనది కాదు. అతని హృదయము వ్రతదీక్షలో నెంత వజ్ర కఠోరమో వామాక్షీప్రీణనములో నంత శిరీషకుసుమ కోమలము. అందుకే యా దంపతులు తర్వాత 'డోల్రత్పణయాంబుధిలోఁ దేలికదేలాడు పూలతెప్పలయి' వినోదించిరి. ఐనను, జ్ఞానవైరాగ్య సంపన్నుడైన పోతన మూఢునివలె సంసారసాగరమున బడి మునిగిపోలేదు. మరల తపమాచరింపబోదలచియు సుతుని మమతాబంధము, జననీవాంఛ తన సంకల్పము నెరవేర్చనీయక నింటిలో నుండియు

---

1. పోతన చరిత్రము : 3-10.

అంటియంటని బ్రహ్మణ్యునట్లు, మట్టిలో దిరుగు కుమ్మరిపురువు వలె రాజయోగియై సంసారము సాగించెను.

కవియై పుట్టిన పోతన ప్రకృతిని, మానవ సమాజమును, కావ్యశాస్త్రములను పరిశీలించుచు కవితా తపస్సమాధి సమ్మగ్నుడై యభ్యాసము చేసినట్లు చక్కగా చిత్రింపబడినది. పోతన తానార్జించిన జ్ఞాన వైరాగ్యములు ఫలవంతమైనవనుటకు భార్యావియోగ దుఃఖముతో వచ్చిన శ్రీనాథునకు వైరాగ్యబోధ చేసి యుపశాంతి గలిగించుట, తాను జీవితములో ననుష్ఠించుట నిదర్శనములు. పోతనది మెట్ట వేదాంతము కాదు. కనుకనే రాజభోగములు వలచివచ్చినపుడు తిరస్కరించుట, దుర్భరదారిద్ర్యము కలచిరెచ్చినపుడు చలింపక సహించుట జరిగినది.

పోతన కైహిక సుఖభోగముల యెడ వైముఖ్యము, ఆడంబరయుతమైన నాగరక జీవనముపట్ల ఆనాసక్తియున్నదాని కనుగుణముగా చక్కగా పాత్రపోషణ కావింపబడినది. అతడు రాచకొండకు రాజదర్శనానికి శ్రీనాథునివెంట నమాయిక ముగా వెడలెనే కాని ఆశలు పెట్టుకొని కాదు. నగర జీవనము రాజభోగములు అలవాటుగల శ్రీనాథుడా నగర శోభలను వినుతించగా,

> "కొందఱకుఁ బట్టణమ్ముల యందమొప్పుఁ గొందఱకుఁ బల్లెటూళ్ళనానంద మొదవు నిజముగా నమాయికతయు నిర్మలతయు సరళతయనఁ బల్లెలనె కాపురముసేయు."[1] అని పోతన గ్రామసీమా ప్రశాంత జీవనమునే మెచ్చెను.

అట్లే నగరముకోని పుష్పలావిక యతిథి సేవగొన లోనికి రండని పలికినపుడు 'పానంబుజోలి మఱియు మీదుగాలి వల'దని వారించెను.

పోతన సహజముగనే రాజులయెడ సుముఖుడు కాడను విషయము చక్కగా పోషింపబడినది. దర్బారులో సింగభూపాలుని దర్శనము చేసికొన్నపుడు తన చిత్తవృత్తి కనురూపముగా శ్రీనాథుడే బహుభంగుల రాజును స్తోత్రము చేసెను గాని పోతన యతని నొక్క వినుతియు చేయలేదు. శ్రీనాథుడు పోతనను రాజునకు పరిచయము చేయుచు,

1. పోతన చరిత్రము : 4-18,

"కరముంజాచుట హరునకె వెఱచుట లఘునకె కన్నువేయుటలన సుం
దరకవితాంగన పయినే శిరమును వంచుటలు గుణవిశిష్టతకె నృపా!"[1]

అని పేర్కొనిన యాదర్శముల నక్షరాల ననుష్ఠించిన వాడుగా పోతన మన కడు గడుగున దర్శనమిచ్చును. భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నుడును నాముష్మికజీవనుడును కావుననే రాజోద్యాన వర్ణనములో తరుగుల్మలతాదులెల్ల దళపుష్పఫల జలాదులతో పరమాత్మ నర్చించుచున్నట్లును. తపస్సు చేయుచున్నట్లును, వైరాగ్య జీవితము గడపుచున్నట్లును తనకు తోచినది. అతడు త్యాగి, భోగవిముఖుడు, ఆత్మాభిమాని యనుటకు సింగనృపతి యీయబూనిన యాస్థాన కవిమండల్యాధ్యక్ష పదవిని తృణీకరించి,

"ఈ కవీంద్రు జన్మమీశ్వరునికె దక్క నొరులకెప్డు చేతులొగ్గి యడుగ
దాడుబిడ్డ దేహ మమ్ము కొనెడునట్లు కృతుల నమ్ముకొనుటె బ్రతుకు
దెరువు"[2]

అని ఇత్యాదిగా పలికి తన యీశ్వర భక్తిని, దృఢవైరాగ్యచిత్తమును, ఆత్మాభిమానమును, సత్కవితా గౌరవాదరములను వెల్లడించిన విషయమే ప్రబల నిదర్శనము. ఇక్కడ 'ఆడుబిడ్డ దేహ మమ్ముకొనెడునట్లు కృతుల నమ్ముకొనుటె బ్రతుకు దెరువు' అన్నది 'బాలరసాల సాల....' యను పోతన చాటుధార కన్వయించు చున్నది. పోతన ధైర్యమునకు పండితులు గుండెపై చేయి వేసికొనగ రాజు నవ్వి

"మీ వంటి కవీంద్రు లిమ్మహి నెవారును లేరిక మీరె గుత్తగా
గొంటిరి సత్కవి స్ఫుర దకుంఠిత నిర్మల ధర్మకీర్తుల
న్నింటిని కంటి కాంచన మనీషులు శేషులు మీరె వాణికిన్"[3]

అని ముక్తకంఠముతో కొనియాడెను. ఇట్లు పోతన అందరివలె సామాన్య కవి కాడనియు, అనుపమ మహోదాత్త గుణసంపద్విరాజిత మహాకవి యనియు చిత్రించుట జరిగినది.

---

1. పోతన చరిత్రము : 4-81
2. ,, : 4-850
3. ,, : 4-854

పోతన భోగినీ దండకము వ్రాసినది భోగినియొక్క శీలమును, నృత్య సంగీత కళలను, మధుర భక్తిభరిత నాట్యమును గాంచి యలరుటవల్లనే కాని యామె హావభావములు చూచి భ్రమసికాదు. దండకమును రాజునకు కృతి యిచ్చినది భోగిని రాజు సొమ్మగుట భావించికాని మెప్పునకు కాదు. ఆశయము నిష్కల్మషమైనదైనను భోగినిపై కృతి రచించి రాజున కంకితము చేయుట పొరపాటని పోతన పశ్చాత్తాపపడి యసద్రసన పూతమగుటకు గంగాస్తుతి కావించినట్లు కవిగారు పోతన పాత్రను పోషించినారు. భోగినీ దండక రచనవల్ల పోతన రసజ్ఞత, 'స్త్రీరత్నం దుష్కులాదపి' యన్న నీతి వాక్యాదరము వెల్లడి యగుచున్నవి.

పోతన రాజులయెడ తీవ్రవిముఖుడై వారిని మనుజేశ్వరాధములని నిందించెననుటకు, అవసానదశలోనున్న తన తల్లిని చూడబోవు పోతన కశ్వయానము నిచ్చుటకు నిరాకరించుటయేకాక సింగభూపతి మర్మచ్ఛేదకముగా పరిహసించినది హేతువుగా చేసి సముచిత చిత్రణము కావింపబడినది.

పోతన తల్లిదండ్రుల యెడ, అందును తల్లియెడ నెనలేని ప్రేమగలవాడని తెలుపుటకు తల్లి యాసన్నమరణ వార్త విని మిక్కిలి వ్యథనందుచు మాతృదేవిని గూర్చి కలవరించుచు నారాటముతో బమ్మెరకు చేరబోయినట్లు వర్ణించుట జరిగినది.

పోతన మహారామభక్తుడనుటకు రాముడు సాక్షాత్కరించి భాగవత మాంధ్రీకరించి సమర్పించుమనుటయేకాక పలు పర్యాయము లాదుకొన్న విషయములే నిదర్శనములు. అట్లే యుపాస్యదేవత యగు సరస్వతీదేవిపై గల భక్తి కామె ప్రసన్నయై మహాకవితాశక్తి నిచ్చుటయేకాక రచించిన భాగవతమును కర్ణాట కిరాట కీచకుల కమ్మవలదని విలపించుచు విశ్వాసముతో ప్రత్యక్షమై సమాశ్వాసిత యగుటయే కాక యతని ననేక పర్యాయములు కాపాడిన యుదంతములే తార్కాణములు. ఈ విధముగా నుపాస్యదైవతము లిరువురు పోతనను చరితార్థుని జేసినట్లా పాత్ర స్తోత్రపాత్రముగా పోషింపబడినది. మరియు నతిమానుష ఘటనలెన్నో యత్యద్భుతముగా జరిగినట్లు చిత్రించుటచే పోతన భక్తిమహిమాన్వితుడుగా పోషింపబడినాడు.

పోతన భగవత్కృపకై మిక్కిలి తపించుచు గంగాసైకతమున నీశ్వరుని గూర్చి యార్తితో పలికిన పలుకు లతని భక్తి జ్ఞాన వైరాగ్యభావములను వెల్లడి చేయుచున్నవి.

పోతన కవితాహంకారములేని వినయస్వాంతుడుగా చిత్రింపబడినాడు. శ్రీరాముడు సాక్షాత్కరించి భాగవతాంధ్రీకరణ కానతిచ్చిన విషయము తిప్పన్నకు నివేదించి

"అదొక యాలాపనమొ కల్లయైన కలయొ కరణమెచట భాగవతానుకరణ మెచట
ఎచటి వ్యాసనారాయణుం డెచటి నేను నాకమెచట సృగాల మాణవక మెచట ?"[1]

"చదివినవాఁడఁగాను గురుసన్నిధి నెన్నఁడు, నేను సాహితుల్
కుదురుగ నెప్డొ తీరికగఁ గూర్చొనినప్పుడు ప్రొద్దుబుచ్చగా
నెదొ యొక గ్రంథమున్ దెఱచి యిష్టము వచ్చినయట్టులర్థముల్
గుదిరిచి నేను గూడ నిలఁ గొండొక పండితరాజనైతినే"[2]

అని సమర్థుడయ్యు నైచ్యానుసంధాన మొనర్చుకొని వినమ్రుడై పలికెను. అందుకే 'పలికెడిది భాగవతమఁట పలికించెడివాఁడు రామభద్రుండఁట'యన్న విశ్వాసముతో నాంధ్రీకరించెను.

పోతన రచనాశక్తి మహిమాన్వితమైనదని తెలుపుట కుదాహరణముగా రుక్మిణీ కల్యాణ కథలో రచనానుసారముగా పోతన కూతురు కమరి పునరుజ్జీవితయై శోభిల్లినట్లు వర్ణింపబడినది. పోతన క్షమాబుద్ధికి, త్రికరణ శుద్ధిగల పరోపకారమునకు పోతనను లోభిసెట్టి వంటి వారెందరో పశులై సద్బుద్ధిగల వారైనారని చిత్రించి పోతన సత్త్వసంపదను, మహానుభావమును చక్కగా ప్రోదిచేయుట జరిగినది

1, 2. పోతన చరిత్రము : 5-125, 127

పోతన గురుభక్తి మిక్కిలి కలవాడుగా చిత్రింపబడినాడు. చిదానంద గురు వరేణ్యుని తదుపదిష్టమార్గమున తపమాచరించి సార్థకముగా సంభావించుటయే కాక భాగవతాంధ్రీకరణకు ముందాతని సందర్శించి నితాంత భక్తి తాత్పర్యములతో సాక్షాత్ పరబ్రహ్మముగా గురుస్తుతి చేసి పూజించి భాగవత తత్త్వరహస్యములు తెలిసికొని యనుమతియు నాశీస్సులు పొంది వచ్చెను.

పోతన శిష్యవాత్సల్యము సైతము మిక్కిలి పోషింపబడినది. శారద లేఖను గొని రాచకొండకు పయనమైన శిష్యులకు పోతన ప్రయాణముగూర్చి సవివరముగా నెన్నియో మెలకువలు చెప్పి వారి యోగక్షేమములను కాంక్షించుటయేకాక 'భాగవతము రచించు భాగ్యము మా బోంట్ల కబ్బునె" యని వారడుగ 'దైవకృపా విశేషమునఁ దప్పక మీకును నట్టి భాగ్యమో పావన చిత్తులార! యొకపట్టునఁ గల్గగ వచ్చు'నని పలికి తర్వాత శిథిల భాగవత భాగములను దాను పూరింపనొల్లక యట్టి భాగ్యము శిష్యులకు కలుగునట్లు చేసెను.

పోతనగారి తితిక్ష, ఐహికభోగ విముఖత్వ మనుపమమైనవి. కరువు విజృంభించి యింటిలో నినుపగజ్జెల తల్లి ప్రవేశించి తాండవమాడుచుండ నప్పుల ముప్పులను గూలి యాకటి మంటలలో మలమల మాడుచుండియు భాగవతమమ్ముకొనుట కేమాత్రము సమ్మతించలేదు. రాచకొండ భూపాలుడొకవైపు విజయనగర ప్రౌఢ దేవరాయలొకవైపు భాగవత మంకితముగొని సిరులలో ముంచియెత్తుట కాహ్వానించినను, శ్రీనాథుని వంటి యాత్మబంధువు నెత్తిని నోరుపెట్టుకొని మొత్తుకొనినను ససేమిరా వినలేదు. నమ్ముకొన్న దైవమగు శ్రీరామునికి దప్ప నరాంకితము చేయ దలపలేదు స్వావలంబనముగా సాగించు హాలికవృత్తి వదలి యేలికల కెగబడ లేదు.

"నశ్వర రాజ్యసంపదల నశ్వర యౌవన జీవనమ్ములన్
నశ్వర భోగభాగ్యముల నమ్మిన మానవు నాశ్రయించుచున్
విశ్వవిధాత నచ్యుతుని విశ్వచరాచర భూత రక్షకున్
శాశ్వత సౌఖ్యదాతను విచారము దక్కి త్యజింపనొప్పునే"[1]

---

1. పోతన చరిత్రము : 7-197

అని రాచకొండ చమూపతితో ధిక్కరించి పలికిన పోతన ఐహిక క్షణిక భోగ విముఖత, రామభక్తి విశ్వాసములు చక్కగా పోషింపబడియున్నవి.

భ్రాతృభక్తి పోతనకు నిండుగా నుండె ననుట కతనికి తన పద్యములు విని పించియు, శ్రీరాముని భాగవతరచనాజ్ఞ తెలిపి యతని యాశీస్సులు పొందుటయే కాక శ్రీనాథ ప్రేరితుడై ప్రౌఢ దేవరాయలకు భాగవత మంకితము చేయుమని పలికిన యన్నమాట జవదాటనొల్లక లోలోన దుఃఖపడుచుండియు తదాజ్ఞ తల దాల్చి పాలింప బయలుదేరెనని చిత్రించుట జరిగినది

ఏ యాతనకును వెతపడని స్థితప్రజ్ఞుడుగా పోతన చిత్రింపబడినాడు. తల్లి పోయినప్పుడును భాగవతకృతిమతల్లి శిథిలమై పోయినప్పుడును మాత్రము దుఃఖ మాగక శోకించినాడు. అది యుక్తమైనదే.

తనకాటంకములు కష్టములు కలిగించిన సింగనృపతి, ప్రౌఢదేవరాయలు, శ్రీనాథుడు పశ్చాత్తప్తులై జేజేలు పలుకగా పోతన తన కార్యమున సఫలీకృతుడై భాగవతము నొంటిమిట్ట శ్రీ రామచంద్రునకు కృతి సమర్పణగావించి ధన్యుడై నట్లతని పాత్ర మనోజ్ఞముగా పోషింపబడినది.

"రక్తములోడ్చి చెమ్మటలురాల్చి దరిద్రత నాశ్రయించి మేల్
మౌక్తికహారపంక్తులను మాటలుగా జతగూర్చి వానితో
భక్తి సుధారసాబ్ధులను బంచెకి భాగవతమ్ము వ్రాసి స
న్ముక్తికి దారిఁజేయు రసమూర్తికి ద్రోహము నాచరించితిన్"[1]

అని సింగనృపతి పశ్చాత్తప్తుడై పోతనగూర్చి పలికిన వాక్కులవల్ల పోతన బహు కష్టముల కోర్చి భాగవతమును భవ్యముగా రచించి మోక్షమార్గము సుగమము చేసినాడన్నది విశదమగుచున్నది.

భాగవత గ్రంథావారసుల ననుసరించి మతవిషయకముగా పోతన పాత్ర చక్కగా చిత్రింపబడినది అతడు నిత్యము 'స్నానముఁ దీర్చి శ్రద్ధమెయి సంధ్యను

1. పోతన చరిత్రము : 9-225

వార్చి విభూతిఁ దాల్చి యీశానుని గొల్చుచుండెడివాడు''[1] అట్లే గంగాసైకతమున మహేశ్వరధ్యాన నిష్ఠాగరిష్ఠుడైయుండ శ్రీరామచంద్ర సాక్షాత్కృతి లభించెను. శ్రీనాథుడును పోతనగూర్చి సింగనృపతికి పరిచయము చేయుచు 'కరముంజాచుట హరునకె' యని వచించెను.

పోతన కాలక్రమమున రామతారకోపాసనవలన భాగవత పురాణ సేవవలన వైష్ణవముపై దృష్టిమరలి భాగవతాంధ్రీకరణలో విష్ణుభక్తి ప్రగాఢమై చివరకు విరక్తుడై తీర్థయాత్రలు చేయుచుండిన కాలమున విశిష్టాద్వైతమతము పుచ్చుకొన్నట్లు పోతన పాత్రను చిత్రించి చక్కని పోషణ గావించినారాచార్యులవారు.

పోతన శాంతుడుగా, ధర్మవీరుడుగా, భక్తి జ్ఞాన వైరాగ్యయుతుడుగా చిత్రింపబడిన దానికి 'రస నిర్వహణ' వ్యాసమున వివరించిన ఆయా సన్నివేశములు తార్కాణములు.

ఈ విధముగా పోతన యొక కారణజన్ముడైన మహాపురుషుడుగా, మహాభక్తుడుగా, మహాకవిగా, కవిపండితాభిమానిగా, రామభక్తి మహత్త్వ విరాజితుడుగా, ఐహిక సుఖభోగ విముఖుడుగా, మనుజేశ్వర పరాఙ్ముఖుడుగా, స్థితప్రజ్ఞుడుగా, కవితాకళను మోక్షార్థియై భగవత్సేవలో వినియోగించిన వాడుగా, ఉత్తమహాలికుడుగా, శమదమాదిగుణ శోభితుడుగా, మాతా పితృ గురుభక్తుడుగా, కారుణ్యమూర్తిగా, పరోపకారపరాయణుడుగా, భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నుడుగా చిత్రింపబడి యతని పాత్ర మధుర మనోజ్ఞముగా మహోదాత్తముగా పోషింపబడి యున్నది.

## శ్రీనాథుడు :

వరదాచార్యులవారు పోతన పాత్రను వలెనే శ్రీనాథుని పాత్రను సయితము ప్రత్యేక శ్రద్ధతో నభిమానముతో పోషించియున్నారు. శైవుడగు శ్రీనాథుడు సకల విద్యాసనాథుడగు కవిసార్వభౌముడుగా, ప్రౌఢకావ్యరచనా వైదుష్యాహంకారిగా, రాజపూజితుడుగా, ఐహిక భోగలాలసుడుగా, శృంగారిగా సాహిత్య లోకమున ప్రశస్తిగాంచి యున్నాడు. తదనుగుణముగా నతని పాత్ర యిందు మిక్కిలి చక్కగా చిత్రింపబడియున్నది.

1. పోతన చరిత్రము : 3-64

కావ్యోపక్రమ విషయానుసారముగా శ్రీనాథుడు విష్ణ్వంశమున జన్మించిన వాడు అతడు పోతన కాత్మబంధువై భాగవతము నృపాలాంకితము కావింపజేసి పోతన కుటుంబము భోగభాగ్యములతో తులదూగునట్లొనర్పవలెనని విశ్వప్రయత్నములు చేసి విఫలుడై పోతన దైవభక్తిని ధర్మనిష్ఠను మనసార మెచ్చిన మనస్విగా కావ్యమున వర్ణింపబడి యున్నాడు.

శివభక్తుడగు శ్రీనాథుడు తీర్థయాత్రలు చేయుచు బమ్మెరకు సమీపమున గల శైవక్షేత్రమగు పాల్కురికిలోని సోమనాథుని సమాధిని సందర్శింపబోవుచు బమ్మెర యూరివెలుపల చేలవద్ద పోతనకు తారసిల్లుటతో కావ్యకథలో ప్రవేశించును. కవితాపాండిత్య దర్పముగల వాడును, స్తోత్రప్రియుడును, కీర్తికాముకుడును, సుఖభోగాభిలాషియును నగు శ్రీనాథుడు తన చిత్తవృత్తి కనురూపముగ నాద్యంతములు ప్రవర్తించినట్లు కావ్యమున గోచరించును.

శ్రీనాథుని రాకయే రాజాస్థాన కవీంద్రుని కుచితముగా తీవిగా నుండెను.

"రథివలె గోశతాంగమున రాజిలుచున్ శరదాస్థ పూర్ణిమా
తిథి వెలుఁగొందు చందురుని తీరులుగేరు కళాప్రపూర్ణ నీ
పథమెటు వోవునంచు మృదు పండితవాక్కులఁ బల్కరించు త
త్పృథులమతిన్ బృహస్పతి కవిప్రతి నారసి"[1] పోతన చేరి మ్రొక్కుచు నతని వర్తమానమడిగెను. దానికి సూటిగా సమాధానము చెప్పక 'వినుమిపు డీవే నను దెలిసెద' పనుచు పోతనను పొలమును జూచి యాశువుగా నొక పద్యము చెప్పి తాను కవినని పోతనకు తెలియునట్లు చేసెను. పై పద్యమున శ్రీనాథుడు బృహస్పతియో శుక్రుడో యన వెలుగొందుచుండె ననుటలో నతని బ్రాహ్మీమయ మూర్తిమత్త్వమెంత విశిష్టమైనదో స్ఫురించుచున్నది. శ్రీనాథు డాశుకవితలో నుద్దండుడై యనేక చాటువులు చెప్పెనన్న ప్రశస్తి కిచట చెప్పిన యాశుపద్య మొప్పుచున్నది. ఇది మొదలుగ సింగనృపుని సభాంగణ ముఖద్వారమున నెలకొని యున్న శారదాంబను, సింగనృపుని, అతని యుపవనమును, భోగినిని ఇట్లే యాశుకవితలతో భూషించినట్లు కావ్యమున వర్ణింపబడినది

1. పోతన చరిత్రము : 2-159.

శ్రీనాథుడు పోతనస్తుతికేఁగి, అతని విద్యావినయములకును కులగోత్రాదుల కును సంతోషించి యతని ప్రార్థనచేత వారి గృహమున కేగెను. అక్కడ సత్కృతుడై, కేసన యడుగగా

"శ్రీలీను కొండవీటి నృ
పాలుర సంస్థానకవిని, వాసస్థలమో
కాలపటము, కావ్యకలా
శ్రీలలనారాధకుఁడను శ్రీనాథుఁడను"[1]

అని సాటోపముగా పరిచయము చేసికొనెను. అతడు శ్రీనాథుడని తెలియగనే కేసన యెంతో యానందించి శృంగార నైషధకర్తలని మిక్కిలి కొనియాడెను. పోతన యువకుడుగా నున్నపుడే శ్రీనాథుడు శృంగారనైషధ హరవిలాసాది మహా కావ్యములు రచించి ప్రౌఢ దేవరాయల యాస్థానమున గౌడ డిండిమభట్టు నోడించి కనకాభిషేకమునంది తెలుగునాట మహా ప్రసిద్ధి వహించియుండెనన్న సాహితీ చరిత్రకారుల వ్రాతల కనుగుణముగనే యిక్కడ శ్రీనాథ పాత్ర నిర్వహింపబడి నది. రాచకొండలో తారసిల్లిన పుష్పలావికయు శ్రీనాథుని గూర్చి ప్రస్తుతించిన విషయము దీనినే విశదపరచుచున్నది. ఇదే విషయము సింగనృపాలుని సభలో పోతన శ్రీనాథుని ప్రశస్తిని సముచితముగా వర్ణించి చెప్పెను.

లౌకికుడు వ్యావహారికుడగు శ్రీనాథుడు కేసన నర్థించి యొప్పించి సర్వ యోగ్యుడగు పోతనకు తన చెల్లెలినిచ్చి పెండ్లిచేసి, దూరపు బంధుత్వము వలని సంకటములను నివారింప రాచకొండ రాజాస్థానమున స్థానము సంపాదింతునని తన తల్లినొడబరచెను. ఇది రాకపోకల సౌకర్యమునకే కాక శ్రీనాథుని నానారాజాస్థాన నివాస ప్రియత్వమునకును నుద్దేశింపబడియున్నది. ఇక వేదశాస్త్ర పురాణాదు లన్నియు పుక్కిటబట్టిన వాడగుట శ్రీనాథుడు పోతన పెండ్లికి శుభముహూర్తము నిశ్చయించుట లెక్కలోనిది కాదు.

శ్రీనాథుడు ప్రౌఢకవీంద్రుడు నుద్దండ పండితుడని సాహితీలోకమునకు పరిచయము. కాని యాతని సాంసారిక జీవితము కాని, అతని కరుణార్ద్ర చిత్తము

---

1. పోతన చరిత్రము : 2-190.

కాని తెలియరాలేదు. పోతన చరిత్రమున శ్రీనాథు డార్ద్రహృదయుడు కారుణ్య మూర్తి యని చిత్రించుట జరిగినది. తన చెల్లెలిని పోతన కొప్పగించునప్పుడు కడుపు చుమ్మలు చుట్టగా పలికిన మాటలవల్లను, భార్యావియోగము నంది కూతురు శారద నూరడించలేక బమ్మెరకు తోడ్కొనివచ్చి దుఃఖించుచు పోతనతో చెప్పిన మాటల వల్లను, దుస్స్వప్నముగని బెంగతో నేడ్చుచు శారద వ్రాసిపంపిన లేఖను చదువు కొన్నప్పటి స్థితివల్లను నతని హృదయ కోమలత, ఆర్ద్రత వ్యక్తమగుచున్నవి. మరియు పోతన ద్వంద్వాతీతుడయిన స్థితప్రజ్ఞుడు కాగా శ్రీనాథుడు ద్వంద్వపీడి తుడైనట్లు చిత్రింపబడినది. భార్యావియోగము చెంది శ్రీనాథుడు క్రుంగిపోయిన విషయము, పోతన విరక్తుడయి వెడలిపోయిన పిదప భాగవతమునుగొని బమ్మెరకు వచ్చి పోతన యింటి మహాదురవస్థలో శారద వ్యథను చూచి బెగడొందిన విషయము, సింగనృపాలదత్త సంపదలను పొంగిపోయిన విషయము దీనిని నిరూపించు చున్నవి

శ్రీనాథుడు నాగరకుడు నగరజీవితాభిలాషి యనుట కతడు రాచకొండను వర్ణించుచు 'మలయజ మృగమద పరిమళ మిళిత సమీరములఁ జారు మృగనయ నలతోఁ దలలూపించుచు నాత్మల బులిపించున్నగర' మని మెచ్చిన విషయము నిదర్శనము.

శ్రీనాథుడు శృంగారి యని ప్రసిద్ధి. కావ్యమున యథావకాశ మీ విషయ మతనియెడ వ్యక్తము చేయబడినది. పోతనతో రాచకొండకు పోయినపుడు దుకాణము మీదనున్న పుష్పలావికతో చమత్కార నర్మోక్తులతో సంభాషించుట, భోగినిని రాజసభలో ప్రశంసించుట, రాజోద్యానమును శృంగారరస భరితముగా వర్ణించుట, జంగమకన్యా వర్ణనము నతని శృంగార ప్రియత్వమును చాటుచున్నవి.

శ్రీనాథుడెక్కడ దర్శనమిచ్చినను దివ్యాంబరాభరణ భూషితుడై యాకర్ష ణీయముగా విరాజిల్లుచుండును. శుద్ధసత్త్వసంపన్నుడగు పోతన నిరాడంబర వేష భాషల విలసిల్లగా రాజస ప్రవృత్తిగల శ్రీనాథు డాడంబర పటాటోపముల అట్ట హాసముతో విభాసిల్లువాడు. పోతన ఆముష్మికమునకు ప్రతినిధి కాగా శ్రీనాథు డైహికమునకు ప్రతిరూపము. వారిద్దరు రాజసభలో ప్రవేశించినప్పటి తీరులు క్రమముగా నిట్లు వర్ణింపబడినవి.

"శ్రీశైల శిఖరసంస్పృష్ట సంధ్యారాగగతిని కాశ్మీరరాంకవము వేన...."[1]
అను పద్యమున శ్రీనాథుని గురించియు,

"సతతావ్యయ విభూతి సంపన్నమతి యన భస్మపుండ్రాన్విత ఫాలతలము"[2]
అను పద్యమున పోతన గురించియు హృదయంగమముగా వర్ణించుట జరిగినది.

ఇందు 'కర్మవెనుకనె జ్ఞానమ్ము గ్రాలు కరణి' యనుటచేత లౌకిక కార్య ధూర్వహునిగా శ్రీనాథుని, పారలౌకిక జ్ఞాన విలసితునిగా పోతనను చిత్రించినట్లయినది. ఇదే విషయము శ్రీనాథ పోతనలను శ్రీనాథ పార్వతీనాథులుగా, సూర్యచంద్రులుగా, ఇహ పర సౌఖ్యాకృతులుగా, భోగీశ్వరత్వ యోగీశ్వరత్వములు మూర్తి గొన్నట్లుగా సింగనృపతి సభాసదులు భావించిరని వర్ణింపబడియున్నది.

భోగభాగ్యములను కీర్తి ప్రతిష్ఠలను కాంక్షించు శ్రీనాథుడు రాజుల నాశ్రయించుటలో, ధన కనక వస్తువాహనాదుల నర్థించుటలో లజ్జింపడు, నైచ్య భావము పొందడు. కావుననే సందర్శించిన సింగభూపాలునికి మంగళాశాసనము చేసి యతని శౌర్య దాన ధర్మాదిక గుణములను బహు భంగుల వినుతించి యతని సర్వజ్ఞ బిరుదమును ప్రస్తుతించి యింద్రునిగా నభివర్ణించెను. పోతనకై ఆశ్వ యానము నడుగుటకు వెనుదీయక పరిభూతుడాయెను.

నశ్వర భోగముల నాశించి రాజులపై రమణులపై నాస్థగొన్న శ్రీనాథుని మనస్తత్త్వము కావ్యమున చక్కగా చిత్రింపబడినది. రాజోద్యానమును పోతన భక్తి జ్ఞాన వైరాగ్య భావములతో వర్ణింపగా శ్రీనాథుడు శృంగార భావములతో నిట్లు వర్ణించెను.

"ఇవ్వనియె జవ్వనింబోలి యెలమి మీఱఁ
బుష్పవతి యౌటచే భృంగ భోగ్యమయ్యె

1. పోతన చరిత్రము : 4-62.
2. ,, ,, : 4-63.

నేతదారామ మా రామనృపతి వోలె
నలరి ద్విజ వాంఛితమ్ము సఫలమొనర్చె"[1]

ఇందు స్త్రీ ప్రశంస రాజ ప్రశంస చేయుటచేత శ్రీనాథునికి గల యర్థ కామ వాంఛలు వ్యక్తమగుచున్నవి. ఇట్లే చెట్లన్నియు కన్నియలుగా వనము శృంగార భవనముగా శ్రీనాథునికి తోచినట్లభివర్ణన చేయబడినది శ్రీనాథుని శృంగార కవితను మధురసముగా, పోతన భక్తి కవితను సుధారసముగా కవిగారు పేర్కొని వారి కవితల వైధర్మ్యమును ఢిగువ రీతిగా స్ఫురింప జేసినారు.

"శ్రీనాథ కావ్యమధురస పానోన్మత్తాత్ముఁడగుచుఁ బార్థివుఁడుండన్
దానా పోతన నిజ కావ్యానంద సుధారసమ్ముఁలతని కిటులిడెన్"[2]

పోతన రాచకొండకుపోయి రాజదర్శనము చేసి భోగినిపై దండకము వ్రాసి రాజునకు కృతి యిచ్చుట యను వ్యవహారమంతటికి మూలకారకుడు శ్రీనాథుడే. అతడు తన చిత్తవృత్తి కనుగుణముగ పోతనను రాజాస్థానములో ప్రవేశపెట్టి తదాశ్రయ పోషణములచేత తనవారు సుఖభోగములనుభవింప వలెనన్నది శ్రీనాథుని యాశయము. ఇది లౌకిక దృష్టితో చాల మంచిదే. కాని యైహిక భోగవిముఖుడును నాముష్మిక చింతనాపరుడును నగు భక్తపోతన్న కది నచ్చక శ్రీనాథుని సంకల్పము వికల్పమాయెను.

నారయాది శిష్యులవల్ల ఆంధ్రీకృత భాగవత రచనా ప్రశస్తి విని యా భాగవత మంకితము గొనుటకు సింగనృపతి యాశించుట గ్రహించి శ్రీనాథుడు దానిని మిక్కిలి ప్రోత్సహించి తత్కార్య నిర్వహణ భారము వహించెను. పోతన దృఢవైరాగ్య చిత్తము తెలిసియు శ్రీనాథ భూనాథు లిరువురు నందని పండున కన్నులు చాచిరి.

పోతన చేత తిరస్కృతుడై వరాహవిఘ్నిత భాగవతాపహృతికర్ముడైన చమూపతి తిరిగివచ్చిన పిదప తానును ప్రయత్నించుటకు రాజాజ్ఞ గొని శ్రీనాథుడు బమ్మెరకు పయనమయ్యెను. రాజ లాంఛనములతో సహస్ర సంఖ్యాక రాజ

1. పోతన చరిత్రము : 4-111
2. పోతన చరిత్రము : 4-122

పరివారముతో మహా వైభవముతో బయలుదేరిన శ్రీనాథుని యట్టహాస మతని ధిషణాహంకారమును కవితాదర్పమును దర్పణములో వలె దర్శింప జేయు చున్నది మార్గమధ్యమున మావితోటలో జంగమకన్యతో సాగించిన సంభాషణలో శ్రీనాథుని లౌకిక చిత్తవృత్తి విస్పష్టమగుచున్నది. జంగమకన్య 'స్మితపూర్వాభి భాషణ మొప్ప' నొక రత్నాంగుళీయకము శ్రీనాథుని వ్రేలికి దొడుగ దలంప నతడలరి

> ''సుమతులు కుమతులనక యొగి భ్రమియింపన్ జేసి లోభపఱచు మనోజ్ఞ
> ప్రమదాలాభంబు ధనాగమమును నిరసింపఁ గమలగర్భుని తరమే?''[1]
> ''పిచ్చిబట్టి హరుఁడు వెన్వెంటఁబరుగెత్తె మోహినీస్వరూపమును గనుగొని
> సిరికి హరియు యురమె సింహాసనమొనర్చె''[2]

అని కామినీ కాంచనములకు హర్షించుటయేకాక వానిని గెల్చినవారెవరును లేరని సమర్థించుటకు హరిహరుల నుదాహరించెను. దానికామె 'నీతిబాహ్య వర్తనలచేత లభించు రంభనైనను కుబేరకోశమునైనను తృణతుచ్ఛముగా త్యజించు పోతన వంటి సుకవులు పుట్టలేదా?' యని పలుకగా నోర్వక శ్రీనాథుడిట్లనెను.

> ''ఓరకుఁబెట్టు మప్పులుకులో వనజాయతనేత్ర! యిందు సం
> సారము లేనిదెవ్వరికి? ఛాందసులై లభియించినట్టి బం
> గారముఁ బాఱవైచి మనుగడ్డల నేతికొనంగ వీరు దీ
> క్షారతి ఋష్యశృంగులను గౌశికులన్ దలదన్ని పుట్టిరే?''[3]
> ''వ్యాపారమ్మొదిలేని మానవుఁడు బ్రహ్మజ్ఞానియై త్యాగవి
> ద్యాపాతమ్మిటు పల్లెవేయు నఱచేతన్ లక్ష్మి తా నాట్యమున్
> జూపెన్ బోపెను ద్యాగవర్తనల నచ్చోఁ జూరుకుంజెక్కి తా
> రేపీవేళకుఁ బోతనార్యుఁడన వేతేకాఁడెటో చూచెదన్''[4]

ఇదీ శ్రీనాథుని వరుస. జంగమకన్య పోతనస్తుతి చేయుటచేత తన కవమాన ముగా భావించి యావేశముతో పలికిన మాటలివి. అంతేకాక పోతనను లొంగదీయ గలనను నాత్మప్రత్యయము కూడ నిందు ధ్వనించుచున్నది. 'బ్రహ్మదేవుడు

1, 2 పోతనచరిత్రము : 7-321, 322
3, 4. ,, : 7-324, 325

వచ్చినన్ భక్తపోతనార్యు నెదఁద్రిప్పలే'డని జంగమకన్య చెప్పినను వినక దురభి మానముతో శ్రీనాథుడు బయలుదేరి బమ్మెరకు పోయెను.

ఈర్ష్యాక్రోధములు పెనగొన్న శ్రీనాథు డూరివెలుపల పొలము దున్ను చున్న మల్లనను పిలిచి వారి హాలికవృత్తిని హేళనచేసి బోయీలులేని పల్లకిని నడపించి 'తడాకా' చూడుమన్నట్లు తన మహిమ ప్రదర్శించి, మల్లనయు నెడ్లు లేని నాగలి నడపి తండ్రి పోతన మహిమను ప్రతిగా ప్రదర్శింపగా మరల నవ మానము పొందెను.

"అర్థకామార్థమై శారదాంబఁగొల్చు శంసనీయమౌ కవినాథు శక్తినంత
ధర్మమోక్షార్థమౌ చక్రధరునిగొల్చు భక్తిభావవిభ్రాజితశక్తి గెల్చె"[1]

నని శ్రీనాథుడు శారదోపాసకుడై మహిమోపేతుడైనట్లుగను, నతనిశక్తిని పోతన భక్తి గెలిచినట్లును కవిగారు చిత్రించినారు.

వేపురు రాజపరివారజనులతో వచ్చిన శ్రీనాథుడు దరిద్రుడైన పోతన నవమానించి ధనాశ గలిగింపనెంచెను. కాని తాను నమ్ముకొన్న వాగీశ్వరీదేవి జ్యోతి పుర రాజ్ఞీరూపమున వచ్చి సహస్రజన సంతర్పణచేసి వెళ్ళుటచే శ్రీనాథుడు మరొకమారు పరాభూతుడయ్యెను. ఐనను విడువక పోతనకు ధనావసర మహిమ నొక్కిచెప్పియు మరొకసారి విఫలుడైన యతని మాత్సర్యచిత్తము చక్కగా వెల్లడియగునట్లు శ్రీనాథుని పాత్ర పోషింపబడినది. గజేంద్రమోక్షణ కథలోని 'సిరికిం జెప్పడు' అన్న పద్యము నాక్షేపించి తర్వాత కడుపుతీపి యిట్టిదని తెలిసి కొన్న శ్రీనాథునికి పోతనకంటె కవితావిషయము లోకానుభవము తక్కువయని తెలియుచున్నది

భాగవత మంకితముగొనుట కాశించి ప్రౌఢదేవరాయలు లేఖనంపగా శ్రీనాథుడు సింగభూపతిజోలి ప్రక్కకు బెట్టి ప్రౌఢదేవరాయలకు కృతినీయ బొమ్మని ప్రోత్సహించుటచేత శ్రీనాథుని ధన లౌల్యస్వభావము నతిచారప్రకృతి వ్యక్తమగుచున్నవి చివరి ప్రయత్నముగా లౌకికుడగు శ్రీనాథుడు ఓరుగంటిలో నున్న తిప్పనచేత భాగవతమును రాయలకంకితము చేయుటకు చెప్పించి యొడ బరపించియు సాఫల్యము గాంచలేకపోయెను.

1. పోతన చరిత్రము : 8-33

ఓరుగంటిలో తురుష్కులచేత ధ్వంసము చేయబడి పడియున్న శిల్ప ఖండములను గాంచి వర్ణించుచు రాజులే కళాపోషకులని యనుటలో శ్రీనాథునికి రాజులయెడ గల యచంచల భక్తివిశ్వాసములు విదితమగుచున్నవి. అంతేకాక నానారాజ సందర్శనము చేసి వారిమెప్పు వడయుట కే రోటిపాట ఆ రోటివద్ద పాడు నట్లు ఆయారాజుల ముఖస్తుతులు చేయుట శ్రీనాథుని స్వభావముగా నిందు చక్కగా చిత్రింపబడినది. సింగభూపతినంతగా పొగడిన శ్రీనాథుడు ప్రౌఢదేవరాయలను సందర్శించి గొప్పగా పొగడి '....నృపసింహముపై శరభాకృతిన్ వడిన్ గవిసి దురంబొనర్చి జయగర్వమునన్ దులదూగకుందురే'[1] యని పలుకుటచేత నిట్టి స్వభావము విశదమగుచున్నది.

ఇంతచేసి శ్రీనాథు డకార్యము చేసినట్లుకాని దుష్టచింతన గలవాడైనట్లుకాని కావ్యమున నెక్కడను చిత్రింపబడలేదు. లౌకిక సుఖభోగప్రియుడగు శ్రీనాథుడు రాజసప్రవృత్తిచే కొంత వ్యవహరించినాడు. ఐహికముగా పోతన కుటుంబక్షేమము కోరియే పోతనను రాజాశ్రయ పోషణములు పొందుటకోసము విశ్వప్రయత్నములు చేసినాడు. శ్రీనాథుడు సంకుచితబుద్ధి గలవాడుగా గూడ చిత్రింపబడలేదు. అతని విశాల హృదయము, పోతనయెడ ననురాగము, భాగవతమునెడ పూజ్యభావ మున్నట్లు అతనిపాత్ర పోషింపబడినది. సింగభూపతి స్వప్నమున శ్రీరామ శిక్షితుడై సభలో ఆ స్వప్నవిషయ మడుగగా శ్రీనాథుడు 'అత్యంత చింతా సమాకుల చిత్తుడయి' జరిగిన వృత్తాంతమెల్ల తెలియజేసి భాగవతమును సాదర ముగా బమ్మెరకు గొంపోయి పోతనశిష్యులచేత శిథిలభాగములను పూరింపజేసి ప్రౌఢదేవరాయలను దర్శించి పోతనజాడ తెలిసికొని యొంటిమిట్టలో నతనిని గలిసి భాగవతకృతి సమర్పణోత్సవము ప్రౌఢదేవరాయలచేత నేర్పాటు చేయించెను.

భాగవత మంకితము కొనుటకు సింగనృపతిని ప్రోత్సహించిన శ్రీనాథుడే స్వప్న వృత్తాంతము చెప్పి 'భాగవత ప్రబంధమున్ బదిలముగాంగ బమ్మెరకుం బంపుట భావ్యమటంచు నెంతు నేనిది పరమేశ్వరేచ్ఛ యెదురీదంగం బోలునె యేటికెందునన్"[2] అని హితవు చెప్పుటయు, ఒంటిమిట్టలో పోతనను

---

1. పోతన చరిత్రము : 10-18
2. పోతన చరిత్రము : 9-311

దర్శించి 'నేఁడమితానందము నొందె నాదు హృదయమ్మార్యా! భవద్దర్శనమ్మలరెన్ జన్మ తరించె గెల్చితివి నన్నాసాంతమున్ నీవు, నీ శ్రమలెల్లన్ ఫలియించె భాగవతమున్ స్వాధీనమయ్యెన్ దమిన్"[1] అనియు భాగవత పునఃప్రాప్తి విషయము చెప్పి

"మున్ సీతాంగనాశీల సంత్రాణంబున్ బొనరించినట్లె కృతికాంతన్నేఁడు రక్షించె విజ్ఞానానందమయ స్వరూపమగు నీ జన్మంబు ధన్యంబు బావా! నా సోదరి నిచ్చి కాల్గడుగు సద్భాగ్యాప్తిచే ధన్యుఁడన్"[2] అనియు, భాగవత కృతి సమర్పణోత్సవ సందర్భమున,

"భావుకా! సకల రాజన్యలోకంబునకు నీ యకళంక చరిత్రంబు కనువిప్పు గలిగించెను. తమ బలంబునకన్న దైవబలం బెక్కువ యని గ్రహింపఁగలిగిరి. దైవభక్తుని దేవేంద్రుఁడేని నిర్జింపలేఁడను నిజము నెఱిఁగిరి."[3]

అనియు పచించుటచేత శ్రీనాథుని పశ్చాత్తాపము, పోతన విజయము వలని యానందము, పోతనయెడగల గౌరవాదరములు సువ్యక్తములగుచున్నవి.

కడగండ్లతో క్రుంగి కృశించిన శ్రీనాథుని చరమజీవితము నిందు వర్ణింపక పోవుట మేలైనది. మొత్తముమీద శ్రీనాథుడు ప్రౌఢకవిత్వ పాండిత్య దర్పితుడుగా, లౌకికభోగాసక్తుడుగా, శృంగారిగా, రాజాస్థాన విలాసప్రియుడుగా, కీర్తి కాముడుగా, ద్వంద్వములకు లోబడినవాడుగా, బ్రాహ్మీసమారాధన మహిమాన్వితుడుగా, విశాలహృదయుడుగా, పోతనయెడ ప్రేమాభిమానములు గలవాడుగా నతని పాత్ర రమ్యముగా పోషింపబడినది.

## సింగభూపాలుడు:

కావ్యమున సింగభూపాలుని పాత్ర మిక్కిలి ప్రాధాన్యము వహించి యున్నది. కథలో నితడు ప్రతినాయకుడుగా పోషింపబడియున్నాడు. పోతన

1. పోతన చరిత్రము : 10-31
2. ,, ,, : 10-44
3. ,, ,, : 10-51

భాగవతమును నరాంకితము చేయించి దానికి మోక్షప్రదార్హత లేకుండ నడగిపోవునట్లు చేయబూని యింద్రాంశలో జన్మించినవా డితడు.

రాచకొండ రాజధానిగా తెలంగాణమును పరిపాలించిన మహారాజగు నితడు సర్వజ్ఞబిరుదాంచితుడైన మహావిద్వాంసుడు. కవిపండిత పోషకుడు. శ్రీనాథుని సత్కరించినవాడుగా, భోగినీదండక కృతిభర్తగా, పోతన భాగవత మంకితము గొనదలచి, కవి సమ్మతింపనందున బల్మిమెయి తెప్పించి పాతిపెట్టించగా నది కొంత శిథిలమైనట్లుగా సాహిత్య చరిత్రలలో, జనశ్రుతిలో ప్రసిద్ధివహించినవాడు. ఆచార్యులవా రితనికథ నించుక మార్చి రాజుకాక సేనాపతి భాగవత మపహరించి రాజునకు తెలియకుండ దాచియుంచుటచేత నది శిథిలమయ్యెనని కల్పించిన విషయము 'వస్తుశిల్పము'లో తెల్పబడెను. కావ్యమున నితని పాత్ర యుక్తియుక్తముగ నుదాత్తముగ పోషింపబడియున్నది.

సింగభూపాలు డింద్రాంశలో జన్మించినాడనునది స్ఫురించునట్లు రాజదర్శనము చేసిన శ్రీనాథునిచే "కనుగీటుకునైనఁగాని చక్కఁగ రాని యనిమిషాంగన లంట యప్సరసలు.... అనుచు నింద్రుఁడే యిటు భువి నవతరించె"[1] నని వర్ణన చేయించబడినది. రాజు కవిపండితాభిమానము మిక్కుటముగా గలవాడు, కవితారసలోలుపు డనుటకు శ్రీనాథ పోతనల నాదరించిన తీరును, ఉపవనములో నుభయ కవుల కవితలు విని 'స్మృతిన్ ద్యజించి యటు సొంతముగాఁ జెవులప్పగించి స్మేరాననుఁడై విని కడు కృతార్థుఁడనైతి'నని పలికి మిక్కిలి కొనియాడిన విషయమును, నారయాది శిష్యులు సభకు వచ్చినప్పుడు నితాంత మాదరించి వినుతించిన విషయమును నిదర్శనములు.

అతని సంగీత నాట్యకళా ప్రియత్వమునకు భోగినీ నాట్యమును ప్రశంసించుట, శృంగార రసికతకు 'స్త్రీరత్నం దుష్కులాదపి' యని భోగినిని చేపట్టుట తార్కాణములు. భోగినీ దండకమును రచించి కృతి యిచ్చినప్పుడు రాజు కరగి పోతనను తన యాస్థాన కవిమండలి కధ్యక్షునిగా సన్మానింపబూనుటచేత నతని కృతజ్ఞతా హృదయము, కవిపోషణ స్వభావము విదితమగుచున్నవి. పోతన సన్మానమును తిరస్కరించి కటువుగా మాట్లాడినప్పుడు నృపు డాగ్రహింపక

1. పోతన చరిత్రము : 4-72

"కవివీరుని ధీకతఁగాంచి నవ్వి మీవంటి కవీంద్రు లిమ్మహి నెవారును లేరిక మీరె గుత్తగాఁ గొంటిరి సత్కవి స్ఫురదకుంఠిత నిర్మలధర్మ కీర్తులన్నింఁటిని కంటి కాంచిన మనీషులు శేషులు మీరె వాణికిన్"[1] అని పలికి సాదరముగా శ్రీనాథ పోతనల నారామవసతి కనిపిన యుదంతమువల్ల నతని విశాల హృదయము, క్షమౌదార్యములు, కవిపండితజన గౌరవము వ్యక్తమగుచున్నవి.

ఐనను రాజు క్షత్రియోచితమైన రాజసబుద్ధిని పోనిచ్చినవాడు కాదు. పండిత హిండితమగు నిండు సభలో తన సన్మానమును తిరస్కరించి రాజ సంపదలను లెక్కచేయని పోతనపై మండుచుండి యల్పమైన యశ్వశకట మడిగినప్పుడు నిరాకరించుటయేకాక మర్మచ్ఛేదకములైన మాటలాడెను. తల్లి యవసానదశలో నున్నదన్న యాపత్కాలమున నడిగినప్పుడు రాజటుల ననవలసినది కాదు. అందుకే పోతన రుద్రుడై రాజొనర్చిన యవమానము 'హృచ్ఛకలముల క్షారము లను జల్లుచుండ' రాజుల దురహంకారము ననేక రీతుల నిందించి వారి మొగ మెన్నటికి చూడ నిష్టపడని వాడాయెను. భోగినీ దండకమున భోగినితో ఆమె తల్లి 'రాజుల్ మహావ్యాజులే భోజులే చంచలచ్చిత్తులే మత్తులే వారిజేరంగరా'దని మొత్తుకొని యుండెను. ధూర్జటి 'రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నంభోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మవ్యథాబీజంబుల్' అని కాళహస్తీశ్వర శతకమున తిట్టిపోసెను. విద్వాంసులు సాహిత్యపోషకులగు సింగ నృపతి వంటివారే యిట్లుండ తక్కిన రాజుల సంగతి చెప్పనేరాదు. 'ప్రభవః స్మయదూషితాః' యని భర్తృహరి యంతటివాడే వాపోయెను. సరే యీరీతిగా సింగరాజు తన నైజరాజసప్రవృత్తిప్రకుపితుడై పోతనవంటి సుకవీంద్రుని శాశ్వతముగా దూరము చేసికొని కళంకితుడైనాడు.

పోతన భాగవతము నతిభాసురముగా నాంధ్రీకరించిన విషయమతని శిష్యులవలన తెలిసి సింగభూపాలు డంకితముగొనుట కాశపడుట కవితారసలుబ్ధుడై చిరకీర్తినార్జించు నుద్దేశముతోడనే. కాగా పోతన దృఢ వైరాగ్యము, లౌకికభోగ వైముఖ్యము తెలిసియు దురాశపడుటలో నతని కావ్యరసలౌల్యముతోపాటు అవి వేకము వ్యక్తమగుచున్నది. భాగవతముతోగూడ పోతన నాహ్వానించుటకు మిక్కిలి

1. పోతన చరిత్రము : 4-35

గౌరవాదరములతో గూడిన విన్నపమును తన చమూపతి ద్వారా పంపిన విషయము మరల పోతన సుకవీంద్రుని యెడగల ప్రేమాదరములను వ్యక్తము చేయును. చమూపతి విఫలుడై తిరిగివచ్చినప్పుడు రాజేమనుకొనెనో కాని శ్రీనాథుడు తానై మరొకమారు యత్నింతుననగా రాజలాంఛన పరివారములతో సాగనంపిన విషయ మతని పట్టుదల నించుక సూచించుచున్నది. కాని రాజు సఫలీకృతుడు కాజాలక పోయెను. పరిశీలించి చూచినచో నాంధ్ర భాగవతమును నరాంకిత మొనర్ప జేయు మాత్సర్యముతో జన్మించిన సింగనృపతిలో నుండవలసినంత గట్టి పట్టుదల కాని క్రౌర్యముకాని కానరావు. ఇది యీ పాత్రకొకింత యపకర్ష హేతువే.

సింగనృపతి దర్పగాంభీర్యములు కలవాడుగనేకాక ఆర్ద్రచిత్తుడుగను చిత్రింపబడినాడు. శారద దుస్స్వప్నమునుగని బెంగతో వ్రాసిన లేఖను చదివి 'నిలువెల్ల రాజు కరంగెం గడుపునన్ బెనవేసికొనెడి దుఃఖమ్మును నిముసమ్మాపి యూర్పుబుచ్చి' శారద మిక్కిలి కోపతాపములతో వ్రాసిన లేఖ రీతులను వివరించు టతో నీ విషయము తెలియును.

జనశ్రుతిలోగల రీతిగా భాగవతాపహరణదోషము సింగనృపతికిగాక యతని చమూపతి కంటగట్టి విద్వాంసుడును విద్వత్కవి పోషకుడును నగు మహారాజట్టి పాపము చేయలేదని కల్పించి యతని యపయశము తొలగించి యాపాత్రనుదాత్త ముగా పోషించినారాచార్యులవారు. చమూపతి చేసిన దోషమైనను భాగవతాపహర ణమువల్ల విరక్తుడై పోతన స్వగృహమునే కాక రాజ్యమునే విడిచిపోయినందు లకును, దాచియుంచిన భాగవతము కొంత శిథిలమైనందులకును మిక్కిలి దుఃఖించుటచేత సింగనృపతి పశ్చాత్తప్తుడైన విషాదనాయకుడుగా చిత్రింపబడి నాడు. పోతన కారణముననైనను కలలో రామసాక్షాత్కారభాగ్యమందిన యితనిని రామదాసు వలన రామసాక్షాత్కారమందిన తానాషాతో పోల్చవచ్చును. భాగవత కోశము మందసమున చెదలుపట్టియున్నది చూచి రాజు దుఃఖాతిశయముతో పలి కిన మాట లెదలను కదలించుచున్నవి.

"ఆంధ్రదేశంపుం బూర్వపుణ్యముల పంట
యాంధ్రహృదయ విజ్ఞానోదయార్కబింబ

మా తెలుఁగు భాగవతము కొంచెఁగనాఁడ
వేసియును జాతిఁగన మొగమ్మేది నాకు?"[1]

"రక్తములోడ్చి చెమ్మటలు రాల్చి దరిద్రత నాశ్రయించి మేల్
మౌక్తికహారపంక్తులను మాటలుగా జతగూర్చి వానితో
భక్తిసుధారసాబ్ధులను బంచెడి భాగవతమ్ము వ్రాసి స
న్ముక్తికి దారిఁజేయు రసమూర్తికి ద్రోహము నాచరించితిన్"[2]

"బ్రతుకు లర్పించి వ్రాసిన కృతి వియోగ
ఘోర చింతా భరమ్మది దారసుతులఁ
గడకు జన్మభూమిని గూడ విడువఁజేసెఁ
బోతనా! యెట్టి యాతనఁ బొందినావొ"[3]

అని యిత్యాదిగా ఖేదపడి మహాకావ్యము మట్టి పాలొనరించిన యపకీర్తి తరతరాలుగా నిల్చిపోవుననియు 'ఈ యపఖ్యాతి కొఱకు నేనేద్వఁగాని గ్రంథ నాశమ్ము నా యెడన్ గాల్చిపెట్టు'ననియు సంతపించి మిగిలిన కర్తవ్యమాలోచించి శిథిలశేష భాగవతమును మహాభక్తి తాత్పర్యములతో రాజలాంఛనములతో శ్రీనాథుని ద్వారా బమ్మెరకు పంపించి క్షమార్పణలతోపాటు నష్టపరిహారముగా వేయి బంగారు రూకలంపి ప్రాయశ్చిత్తము చేసికొనిన బుద్ధిమంతుడుగా చిత్రింపబడినాడు. సింగనృపతి కోశాధికారిచేత బంగరు రూపాయలు బమ్మెరకు పంపుచు నతనితో,

"బాలభానుండు నన్నయభట్టు సుకవి
యవనిఁ దిక్కన మధ్యందినార్యముండు
పోతరాజు రాకాశరచ్చీతకరుఁడు
తక్కు నాంధ్ర సత్కవిపాళి తారకాళి"[4]

అనియు మరియు భాగవతమును ప్రశంసించుచు చెప్పి పంపిన మాటల వల్ల పోతన యెడ నతనికి గల గౌరవాదరముల యాధిక్యము విశదమగుచున్నది

1. 2 పోతనచరిత్రము : 9-324, 325
3. పోతన చరిత్రము : 9-326
4. పోతన చరిత్రము : 9 375

ఇట్లు సింగభూపాలుడు కవి పండితాభిమానిగా, రసలోలుపుడుగా, పోతన యెడ తాత్కాలిక క్రోధము ప్రకటించినను గౌరవాదరములు కలవాడుగా, పశ్చాత్తప్తుడైన విషాద నాయకుడుగా నుదాత్తవ్యక్తిగా పోషింప బడినాడు.

## పోతన జననీజనకులు :

పోతన జననీజనకులగు లక్కమాంబా కేసనల పాత్రలను భాగవత పీఠికలో పోతన తెలిపిన గుణగణముల కనుగుణముగనే కావ్యమున పోషించుట జరిగినది. వారుత్తమగుణ కర్మ స్వభావములు గల యాదర్శ గృహస్థులుగా చిత్రింపబడినారు. పోతన మహాభక్తుడు, మహాకవి, సచ్చరిత్రుడగుటకు తగినట్లు తీర్చిదిద్దుటకు కృషి చేసినవారుగా కావ్యమున దర్శనమిత్తురు.

బమ్మెర కరణమైన నియోగి కేసన పెద్దలపై భక్తి, సాటివారి యెడ స్నేహము, చిన్నలపై దయగలిగి సర్వజన ప్రియుడై యజాత శత్రువని పేరు గాంచెను. మరియు నతడు 'అక్రూరుడు, ఉజ్జ్వల చారిత్రుఁడు, దానమానధన విస్తారుఁడు, నానాకళానిలయుఁడు, నయకోవిదుఁడు, మృడానీ దివ్య పాదాబ్జ సంకలిత స్వాంతుఁడు, దాంతుఁడు, ఆతతజగత్కల్యాణ కార్యార్థి'గా పేర్కొనబడినాడు. అతడు సాటిలేని దాతగా ప్రశంసితుడైనాడు మరియు 'ధర్మార్థ మర్థము పెరుగగా, మోక్ష సంగతికి కామనలు పెనగగా' పురుషార్థ చతుష్టయమును సాధించువాడతడు. ఇంకను అతని స్వభావ మిట్లు వర్ణింపబడినది.

> "కలనైనన్ దలవంచి యొడ్లఁ గొలువంగాఁ బోఁడు వేయేటికిన్
> దలపైఁ గత్తులు వచ్చినన్ సరి యసత్యం బాడ వెన్కాఁడు న
> వ్వులకైనన్ బరనిందఁ గొల్పు పరుషంబుల్ నోట రానీఁ డమా
> త్యులలో లేఁడిపుడింతవాఁడను జనోక్తుల్ బాడు నాగేస్తునిన్"[1]

అతడు కాలమైనను కరవైనను పండెడు క్షేత్రములతో పిడికెడన్నము నర్థులకు బెట్టి తాము దినునంతటి భాగ్యయోగ్యతలు కలవాడై తృప్తిగా జీవించెడివాడు.

1. పోతన చరిత్రము : 1-92

కేసనకు పైడికి తావి యబ్బినట్లు అనుకూలపతియగు భార్య లక్కాంబ పొసగియుండెను. ఆమె మహాసాధ్వీగా, పతివ్రతా శిరోమణిగా, కారుణ్యహృదయగా విలసిల్లిన విషయము

"పరమనోభావమ్ము నెఱుఁగని చేతమన్నితర పూరుషగుణస్తుతిఁ
దెలియదు"[1]

అను పద్యమున హృద్యముగ వక్కాణింపబడినది.

ఆమె యనాథులకు గతియై, అతిథి సేవాపరాయణయై వంశమునకు పేరు ప్రతిష్ఠలు తెచ్చెను. ఆమె శివభక్తురాలై నెగడినది. ఆమె భక్తి తాత్పర్యములకు రామాలయమున జరుగు భాగవత సప్తాహమున పాల్గొని శ్రద్ధాసక్తులతో విని గ్రంథపూజ చేయుట, భాగవతమును తమబోటివారు చదివి తరింప నెవరైన తెలుగు చేసినారా? యని యడుగుట తార్కాణ. ఆమె గుణగణాఢ్య కావుననే పుణ్యాత్ములగు తిప్పన పోతనలుద్భవించి సుశీలురై వరలిరి.

కేసన గొప్ప తత్త్వవేత్తగా, కవితా కళావిశారదుడుగా నిందు చిత్రింప బడినాడు. కావుననే పాల్కురికి జాతరలోని వీథిభాగవత తత్త్వమును లక్కాంబ చెప్పిన పిదప మార్గమధ్యము నందలి మావితోటను వర్ణించి తత్త్వజ్ఞాన విషయము లనేకము పోతనకు తెలియజేసెను. లక్కాంబయు విద్యావతిగా వేదాంత జ్ఞానము కలదిగా తెలియుచున్నది. తలిదండ్రు లిరువురును భవిష్యత్తులో పోతన మహాకవి కాగలడని తెలియుచు నెంతెంతో మురిసిపోయిరి.

కేసన కవిపండితులయెడ నత్యంత గౌరవాభిమానములు గలవాడైనట్లతని పాత్ర పోషింపబడినది. శ్రీనాథుని రాక కతడెంతో ముదమంది ఘనముగా విను తించి కావ్యామృతము గ్రోలి సత్కారము చేయుటయే దీనికి నిదర్శనము.

కొడుకు కోడలు సుఖముగా నుండి వంశోద్ధారకుడగు మనుమడు కలుగవలె నని తల్లులందఱ రాశించునట్లే లక్కాంబయు నాశించు స్వభావము కలది. పోతన పోతన భార్యను చూడక యున్నందున మతిపోయినట్లయి వారిద్దరి కేకాంతము

1. పోతన చరిత్రము : 1-97.

కలిగింప తక్కిన కుటుంబముతో తీర్థయాత్రలకేగి మనుమడు పుట్టిన మల్లన యని పేరు పెట్టుకొందునని శ్రీశైలము మల్లన్నకు మ్రొక్కివచ్చి కోడలు గర్భవతియని తెలిసి యెంతో మురిసిపోయి పుట్టిన మనుమనికి, మ్రొక్కుకొన్నట్లే మల్లన యని పేరు పెట్టి లాలించినది. లక్కాంబ కరుణార్ద్ర చిత్తము విగత మాతృకయైన శారదను తన యింట నుంచి పెంచుటలో వ్యక్తమగును. ఆమెకు పోతనపై నెంత వాత్సల్యముండెనో యామెయవసానదశ విని పోతన విలపించుటలో తెలియును. కేసనకు లక్కాంబపై నమితానురాగము కనుకనే ఆమె గతించిన మరునాడే, యేడ్చియేడ్చి గుండెయాగి తాను గతించెను. ఇట్లు పోతన జననీజనకులు అన్యోన్య ప్రేమతో సద్గుణగణములతో ఆదర్శగృహస్థులై జీవించి కొడుకుల నుత్తములుగా తీర్చిదిద్దుచు పెంచిన పుణ్యాత్ములుగా చిత్రింపబడియున్నారు.

## తిప్పన :

ఈశ్వరభక్తుడు నుదాత్తగుణ విరాజితుడునగు తిప్పన తమ్ముడగు పోతన యెడ నెనలేని కూర్మికలవాడు. 'తనకెవ్వరేదేని తినుబండ మిడిరేని యనుజుని కిడక తిప్పన తినండు' అని యిత్యాదిగా చెప్పుటచేత తమ్మునియెడ గల గాఢానురాగము వ్యక్తమగుచున్నది. అన్నదమ్ము లిరువురు క్షణము విడచి యుండని తగవులాటయననేమో తెలియక రామలక్ష్మణులవలె మెలగిరని చిత్రించుట జరిగినది. పోతన శ్రేయస్సు మనసార కాంక్షించువాడై యతడు వ్రాసిన కవితలు విని మెచ్చి దీవించెడివాడు. శ్రీరాముడు సాక్షాత్కరించి భాగవత మాంధ్రీకరించుమని యానతిచ్చిన విషయము పోతన చెప్పగా తిప్పన 'మోదమ్మున వినుచు హృదయమున మహదాశీర్వాదము నొనరించి మెచ్చెను.' అల్పుడనగు నేను భాగవతమేమి వ్రాయగలనని పోతన తన యశక్తతను తెలుప తిప్పన 'నీ భవిష్యత్తు ముదావహ' మనియు

> "సాధకున కిల సుఖదుఃఖ చయము లరయ
> నెంత మాత్రము నడ్డుల నిడఁగలేవు
> పూని రత్నాకరంబును బొందు నదుల
> మిట్టపల్లమ్ము లడ్డును బెట్టఁగలవె?"[1] అనియు నెంతో ప్రోత్సహించి ధైర్యము

1. పోతన చరిత్రము : 5-130

గాలిపెను. తిప్పన దేశ చరిత్ర జ్ఞానము కలవాడనుటకు అతడు తమ్మునికి మంత్ర పురిని వర్ణించి చెప్పినది తార్కాణ.

తిప్పన తమ్మునిమీద యవ్యాజప్రేమకు విశాలహృదయమున కాతడు, తన భార్య తమ్మునితో వేరుపడుమని చెప్పినప్పుడు సమ్మతింపక పలికిన మాటలు నిదర్శనములు. కరవుకాలమున నున్నది లేనిది చూడక యింటిలోనివన్ని పోతన యర్థుల కార్తులకు దానము చేయుచుండ పిల్లలు వస్తుండపలసి వచ్చుచున్నదనియు, వేరుపడినచో బాధ్యతలు తెలిసి పొదుపుగా జీవించగలడనియు భార్య చెప్పగా 'మందస్మితుడై యెదనేమి తొనఁకులాడక కదలని జలధియయి చల్లగా' నిట్లు పలికెను.

"ఆత్మ నపచారమెఱుఁగఁడే నన్న దెపుడు కాదనం డెదురాడఁడు కన్న కొడుకు
కన్న మిక్కిలి ననుగాంచి గౌరవించు వేరుపడుమన నాకెట్లు నోరువచ్చు"[1]

అనియు, ఏకోదరులు విడిపోవుట సమ్మతము కాదనియు, కళత్రాది బాంధవుల మరలబడయ వచ్చునుగాని సోదరుని బడయు బెట్లనియు, కొడుకులు బిడ్డలు లేని మనకు పోతన దంపతులే కొడుకులు బిడ్డలనియు, జీవితము చాల గడచి మిగిలిన యీ ప్రాయమునకు మూటగట్టుకొని పోవునదేమిటి? స్వప్నతుల్యములు పగటి భాగవతములైన బ్రతుకులకు వెంటవచ్చున దేమిటియనియు బహుభంగుల నచ్చచెప్పి వేర్పాటు తలంపు మాన్పించెను. పిదప తమ్ముని శ్రేయస్సు కోరియే యతనికి బరువు బాధ్యతలు తెలిసివచ్చుటయేకాక కరవు కాలమున తమ్మునికి శ్రమయెక్కువ కాకుండుటకని యేకశిలా నగరాధీశుడీయ బూనిన యుద్యోగము నిర్వహింప భార్యతో నోరుగంటికేగెను.

తెలియక శ్రీనాథునికి మాట యిచ్చినందులకు విధిలేక భాగవతమును ప్రౌఢ దేవరాయల కంకితమిమ్మని పోతనతో అనలేక అని విచార పడిన యన

1. పోతన చరిత్రము : 5-209

షాత్ముడు తిప్పన. మరియు దైవవశమున సంభవించిన యావైపరీత్యమునను వగచి 'ఘనుల జీవనములు కష్టమయమ్మౌట వారి శీలమునకు వన్నెయిడును, జాతి మణులకెల్ల సానల యొరపిడుల్ నృపుల శిరముకెక్కు నెపముతోనె'[1] యనియు, అన్నిటికి శ్రీరాముడే రక్షకుడనియు పోతన నోదార్చెను.

ఇట్లు తిప్పనార్యుడు రాముని వంటి సోదర ప్రేమగలవాడుగా, భక్తి జ్ఞాన యుతుడుగా చిత్రింపబడినాడు

## తిప్పన భార్య :

క్షామ కాలమున పోతన తనకుమాలిన దాన ధర్మములు చేయుచు నింటివారికి గతి లేకుండ చేయుచున్నాడని విచారించి తమ్మునితో వేరుపడుమని భర్తకు బోధించినయామె తిప్పన భార్య. ఇందువల్ల నామె స్వార్థపరురాలని తోచును. కాని యామె మాటల వివరమునను సరించి యామె యట్టిది కాదనియు, పొత్తులోనున్నంత కాలము పోతన సంసారపు బరువు బాధ్యతలు గుర్తింపక సంచరింపగలడనియు, విడిగా స్వతంత్రుడై యున్నచో నన్నియు తెలిసివచ్చి జాగరూకుడై మెలగ గల డనియు లేనిచో భవిష్యత్తులో నతనికే యనర్థము కలుగగలదనియు నామె వివరించి, భర్త సమ్మతింపకయుండ పోతనపై గృహభారము వేయు సదు ద్దేశముతో నేకశిలాధీశుడీయ దలచిన యుద్యోగము చేయబోవుటకు భర్తను సమ్మ తింపజేసినది.

ఈమెకు పోతనపై ద్వేషము లేదనుటకు శ్రీనాథ పోతన లోరుగంటిలో తిప్పన యింటికేగినప్పుడు "పోతన లోని కరిగి యల్ల తల్లిఁ జెలెఁ జూచు వదినతోఁ దనయు లగ్న విషయమెల్ల వాకొనె"[2] నననది నిదర్శనము. ఇట్లు తిప్పన భార్య లౌకికమైన సదుద్దేశముగల ఇల్లాలుగా పోషింపబడినది.

## నర్సమాంబ :

పోతనసతి యగు నర్సమాంబ రూపరేఖా విలాసములు, వినయ వివేకాది సుగుణసంపదగల సాధ్వీమణియు, పతివ్రతాలలామయు, ఉత్తమ గృహిణియునై

1. పోతన చరిత్రము : 8-296
2. పోతన చరిత్రము : 8-274

యొప్పినట్లే పాత్ర పోషింపబడి యున్నది ఈమె యధీరయగు ముగ్ధా నాయికగా తదీయ శృంగారము కావ్యమున వర్ణింపబడినది. ఈమె పోతన తపోభంగము నిమిత్తము రత్యంశలో జన్మించి దైవికమగు తనవిధి సార్థకముగా నిర్వర్తించినది. పోతన తపోభంగ భయమున బ్రహ్మచర్య వ్రత దీక్ష నిష్ఠురముగా సాగించుమంద నీమె యతని కటాక్ష వీక్షణములకు నిరీక్షించుచు విప్రలబ్ధయై కొంతకాలము తపించిపోయినది. ఈమె పత్యనుగ్రహార్థియై యార్తితో దుర్గాదేవిని పూజించి ప్రార్థించుటలో నీమె దైవభక్తి ప్రస్ఫుట మగుచున్నది. సుకవికాంత యైన యీమె యతనికి మిక్కిలి యనుకూలవతియై మెలగిన సాధ్వి. పుణ్యదంపతులగు తమకు జన్మించిన మల్లనను సుగుణశీలిగా సుకవితా శాలిగా తీర్చిదిద్దుటలో నీ తల్లి పాత్ర యున్నదనుకొనవలయును. అతిథి సంతర్పణలో దీనుల నాదు కొనుటలో భర్తకు తగిన భార్యయై యుత్తమ గృహిణియై విరాజిల్లినది.

ఈమె పాత్ర ముఖ్యముగా పోతనను పెండ్లాడి యతని హృదయమును గరగించుట, మల్లనను లక్ష్మిని కనుట, శ్రీనాథ పుత్రికను శారదను పెంచుట, గృహస్థ జీవనములో భర్తకు చేదోడు వాదోడుగా నుండుట యను కతిపయ విషయములందు మాత్రమే పరిమితమై యున్నది. తక్కిన పోతనజీవితములో నీమె కంత సంబంధము చిత్రింపబడలేదు.

పరిశీలించి చూచినచో కావ్యమున ప్రధానముగా పరివ్యాప్తముగా వర్ణింప బడియున్న భాగవత కృతికన్యయే నాయిక కాని నర్సమాంబ కాదని తెలియును. అట్టి నాయిక పోతన సుకవీంద్రుని పుత్రికయై యష్ట కష్టములకు లోనై తుదకు శ్రీరామచంద్రుని పాణిగ్రహణము చేయుటతో కథ శుభాంతమగుచున్నది.

## మల్లన :

పోతనకు దగిన పుత్రరత్నముగా మల్లనపాత్ర యిందు పోషింప బడినది. ఇతడు శ్రీవిష్ణువు సెలవిచ్చినట్లు 'వేదశాస్త్ర పురాణ విజ్ఞాన దీప్త విఘ్నేశ్వరాంశమున' జన్మించి పోతన మరల తపోదీక్షకు పోకుండ మమతా బంధమున కట్టివైచినవాడు. మల్లన తల్లిదండ్రుల, తాతయవ్వల చేతులలో గారాబముగా పెరిగి పైతృకమైన సుగుణరత్నములచేత శోభితుడై విద్యా వినయ

సంపన్నుడై యలరారినవాడు రామశర్మ తమయింటికి వచ్చినప్పుడు మల్లన మృదుమధుర భాషణలు మన్నన యతని వినయ వివేకములను, అతిథి మర్యాదా తత్పరతను వ్యక్తము చేయును

మల్లన తండ్రివలె భక్తి జ్ఞానయుత సత్త్వమూర్తియయ్యు నాత్మాభిమానము తండ్రికంటె నెక్కువ పాలున్నవాడు. యువకుడగుటచేత సహనము తక్కువయు పౌరుషమెక్కువయు గలవాడు. అందుకే శ్రీనాథుడు రాజలాంఛనములతో పల్లకిపై వచ్చుచు బమ్మెర గ్రామము వెలుపల చేలు దున్నుచున్న మల్లనను పిలిచి క్షేమమడిగి హాలికవృత్తిని హేళన సేసినప్పు డాత్మాభిమానము దెబ్బదిని 'కశాహత సింహకిశోరమై' మామ యనియు వెనుకాడక నిష్ఠురోక్తులతో నిట్లు పలికెను.

"బాలరసాల సా.... నిజదార సుతోదర పోషణార్థమై"[1]
"ఎలిక వెంటనంటి తమరెంద్రులు చంద్రులటంచుఁ బొట్టకై
నాలుక పాడు చేసుకొను నారకహేతువు కన్న సత్కవుల్
హాలికవృత్తి బూని వసుధాంగన నీ హరిపత్నిఁ గొల్చుటల్
పోలవె మామ! పాలకుల బోయిలకై బరువౌట గొప్పయే?"[1]

అని యీ రీతిగా పలికి శ్రీనాథుని కెదగాలమగునట్లు ప్రతిహేళన చేసెను. ఇంకను మామగారి మాటకుమాట బదులుచెప్పి హాలికత్వములోని మేలిమి, నాయనగారి మహానుభావము వివరింప శ్రీనాథుడోర్వక మచ్చరించి బోయీలను విడిపించి పల్లకి నడిపించి తన మహిమ ప్రదర్శింపగా మల్లన మహోత్సాహముతో తన జనకుని మహిమ ననుసంధాన మొనర్చి యెడ్లు విడిచి నాగలి నడపించి మహాద్భుతము సృష్టించి శ్రీనాథుని శృంగభంగము కావించిన దిట్ట.

మల్లన పితృభక్తితో గృహ వ్యవసాయ కార్యములు నిర్వహించుచు శ్రీనాథ పుత్రికను శారదను వివాహమాడి, తండ్రి విరక్తుడై వెడలిపోయిన

1. పోతన చరిత్రము : 8-13
2. పోతన చరిత్రము : 8-14

పిదప గృహభారము వహించినట్లు చిత్రింపబడినాడు. ఇతడు కవియై భాగవత శిథిలభాగములను పూరింపజాలి యుండియు 'మజ్జనకులు లేని యీ వెలితి స్వాంతమునన్ గలంచు గ్రంథలేఖన మొనరింపనోప'నని తాను వ్రాయక నార యాదులను బిలిపించి వారిచేత పూరింపజేసెను

## లక్ష్మీ శారదలు :

పోతన శ్రీనాథుల తనయలగు లక్ష్మీశారద లన్యోన్యముగా మెలగుచు నాడుచు పాడుచు పూలమొక్కలను పెంచుచు వినోదించినట్లును, ఉదయ ద్యౌవనలయి విలసిల్లినట్లును చిత్రింపబడియున్నారు. శారద చిన్ననాడే మాతృవిహీనయై పోతన యింటిలో పెరిగి మేనత్తలాలనలో లక్ష్మీస్నేహములో తల్లిలేని దుఃఖమును వెలితిని మరచి యూరట చెందినది. ఆమెకు పుట్టుకచేత తండ్రి రాజసము, పెరుగుటచేత పోతనయింటి సాత్త్వికత రెండును సంపడినవి. ఆమె దుస్స్వప్నము గని బెంగపడి తండ్రికి వ్రాసిన లేఖలో నీమె కోపతాపస్వభావము వ్యక్తమగు చున్నది. పోతన వెడలిపోయిన పిదప మాటుమడగియున్న యింటికి సంక్రాంతి నాడు శ్రీనాథుడు వచ్చినపుడు పైబడి యేడ్చిన శారదలో నీ లక్షణమే ద్యోతకమగు చున్నది. మొత్తముమీద శారదలో నౌద్ధత్యము ములుసూపినట్లు పాత్ర పోషింపబడినది.

## చిదానంద యోగి :

కావ్యమున చిదానందుని పాత్ర యల్పవ్యాప్తమయ్యును ననల్పమైన ప్రాముఖ్యము గలిగి వెలుగుచున్నది. ఇతడు నాగభూషణాంశమున నవతరించిన యోగి పుంగవుడు. పోతన మహాభక్తుడు, మహాకవి, మహాసాత్త్విక జీవనోదంచితు డగుటకు ప్రధాన కారకుడితడే. పోతన గోక్షీరములు త్రాగించినంతనే 'ఇట్టి పుణ్యమూర్తి నెందుఁగాంచ నేమి ప్రతిఫలమ్ము నిడు చిదానందుండు' అని యాలోచించి 'గోరసమ్ములఁ దృప్తినిగొంటి వత్స! నీదు గోరసమిట్టులె నిఖిల జనము లవని నాచంద్రతారార్క మనుభవింత్రుగాత!' మని దీవించి పోబోవ పోతన జిజ్ఞాసువై భగవద్దర్శన మార్గమడిగెను. యోగి తన దివ్యదృష్టితో నతని భవిష్యత్తెల్ల కాంచి కారణజన్ముడని తెలిసి యతనికి రామతారక ముపదేశించెను. మరియు తనంతట తానే శారదా మహామంత్రోపదేశము, హితోపదేశము చేయుట యతని

య్వ్యాజకృపకు తార్కాణ. ఇతనివల్లనే పోతన బ్రహ్మచర్యమహిమ, రామభక్తి వైశిష్ట్యము, శివకేశవాభేద విచారము, దీనజనసేవా పరమార్థము గ్రహించి యాచరించి తరించి మానవాళిని తరింపజేసెను. పోతన భాగవత మాంధ్రీకరింపబూని అనుమతి ఆశీస్సులు పొందదలచి చిదానందాశ్రమమునకు వెడలి గురుస్తుతి యొనర్చి యడిగిన యనేక సందేహములకు తత్త్వజ్ఞాన రహస్యము తెలిపి కృతార్థుని జేసి యాశీర్వదించి యంపిన భగవత్స్వరూపుడు.

## భోగిని :

దివ్యపథకము ననుసరించి రంభయే భోగినిగా జన్మించి యింద్రాంశ సంభవుడగు సింగభూపాలుని కరగ్రహణ మొనర్చెను. రూపరేఖా విలాసములలో నాట్యకళలో భోగిని సాక్షాద్రంభయే. గంజాయి వనములో తులసిమొక్కవలె నీమె వేశ్యాకులమున బుట్టియు శీలవతియై సింగభూపాలునిపై ప్రేమపెట్టుకొని యతనిని పరిణయమాడ దలచినది. తల్లి యెంత బోధ చేసినను వేశ్యావృత్తిలో నడుగు పెట్టక పట్టినపట్టు విడువక రాజసన్నిధికి తల్లితో వచ్చి జనన్మోహనముగా నృత్యము చేసి యతని హృదయమునకెక్కి యతని కర్ధాంగియైన యదృష్టవతి. భక్తపోతన వంటి సుకవీంద్రుని ప్రశంసలకు గురియై తదీయకృత దండకములో నక్షరస్థాన మలంకరించిన భాగ్యశాలిని. ఇట్లీమె పాత్ర రసవంతముగా పోషింపబడియున్నది.[1]

## ప్రౌఢదేవరాయలు :

విజయనగరాధీశ్వరుడగు ప్రౌఢదేవరాయలు పోతన కృత భాగవత ప్రశస్తి తెలిసి తానును నా మహాకావ్యము నంకితము గొనుట కాశించి పోతనగారికి గౌరవాదరముతో లేఖనంపి యుండెను.

పోతన యన్నగారి మాటచే కృతియిచ్చుటకు బయలుదేరియు సరస్వతీ విలాపమువల్ల నా సంకల్పమును విరమించుకొని, యెంత చెప్పినను వినక లేని చమూపతి యాగ్రహముతో భాగవతమపహరించిన విషయము తెలిసి రాయలు

1. భోగినిని గూర్చి 'భోగినీ నృత్య సౌందర్యము' వ్యాసమున విపులముగా చర్చింప బడినది.

మిక్కిలి చింతించెను. పోతన యెడను, నతని భాగవతము నెడను అనూన భక్తి గౌరవములుండి జరిగిన ప్రమాదికమునకు ప్రాయశ్చిత్తముగా నొంటిమిట్టలో శ్రీరామచంద్రునికి భాగవత కృతి సమర్పణోత్సవము జరిపించిన పుణ్యశాలిగా రాయల పాత్ర పోషింపబడినది.

## అప్రధాన పాత్రలు :

ఆచార్యులవారు కావ్యమున ప్రధాన పాత్రలను వలెనే యప్రధాన పాత్రలను సయితము నిపుణముగా పోషించి యున్నారు. ఈ యల్పపాత్రలన్నియు కథలో నొక్కొక్క ప్రయోజనమును సిద్ధింపజేయునవై యవసరమున్నంత మేరకే ప్రవేశ పెట్టబడియున్నవి. ఏ పాత్రయు ననావశ్యకమని తోచనట్లు చిత్రింపబడియున్నవి.

ఈ యప్రధాన పాత్రలలో నిరుపేద జవరాలు, కాపుపోచయ్య, దీనభిక్షుకుడు, లోభిసెట్టి యొక రకమగు పాత్రలు. వీరు పోతనచేత నుపకృతులై యతనికి ప్రత్యుపకారము చేసినవారు. ఇందు నిరుపేద జవరాలు మహాసౌందర్యవతియై పల్లె లక్ష్మియన భాసిల్లినది. బట్టకు పొట్టకు చాలనిదైనను 'కాసులయాస మానమును గంపలగాసము చేసికొనుట' కిష్టపడని మానాభిమానములుగల శీలవతి. అందుకే యువక భూస్వామి ఆశజూపి బలాత్కరించినపుడు మహోగ్రరూపము దాల్చి యతని విదలించుకొని వచ్చెను. ఆమె దైన్యము చూచి జాలిపడి పోతన యుత్తరీయ మిచ్చి వారి కడగండ్లు విచారించి యింటికి తోడ్కొనిపోయి బత్తెమిచ్చి పంపెను. ఆ జవరాలు పోతనమేలు మరవక కాలాంతరమున వరాహము ద్వారా భాగవత రక్షణకు తోడ్పడిన కృతజ్ఞురాలు. ఒకరికి కొలువుచేసి యవమానము పొందుట కంటె స్వతంత్ర జీవనము మేలని పందులను పెంచుకొని బ్రతికిన యభిమానవతి.

ఒకప్పుడు పోతన పేదజవరాలి నవమానము నుండి కాపాడగా మరొకప్పుడు దైవికముగా ఆ జవరాలు వలన పోతన కవమానము తప్పినట్లు చిత్రించుట యౌచిత్య భాసురమైనది. ఇట్లీపాత్ర పోతన దీనజనసేవ, భాగవత రక్షణ యను ప్రయోజనములను నెరవేర్చినది. ఈ జవరాలి భర్త పోతనయెడ భక్తిగౌరవములు గలవాడుగా చిత్రింపబడినాడు.

కాపుపోచయ్య పోతనయెడ నపోహపడి దురాగ్రహముతో నతని జంపబూని సర్పదష్టుడై పోతనచేత పునరుజ్జీవితుడై పశ్చాత్తప్తుడై సౌమ్యుడైనట్లు పాత్ర

పోషింపబడినది. పోతన చేసిన యీ మహోపకారమునకు కృతజ్ఞుడై యతని కొడుకు యుపమల్లుడు తర్వాత రాచకొండ సైనికులను కఱ్ఱయుద్ధముతో చీకాకు పరచి భాగవత రక్షణకు తోడ్పడెను.

ఇందలి దీన భిక్షుకుని శ్రీరాముని మారు రూపముగా ధ్వనింపజేయుచు కవిగారు చక్కగా చిత్రించినారు. దైన్యము రూపుదాల్చిన యా భిక్షుకుడు బిచ్చ మడుగుచు లోభిసెట్టిచేత కొట్టబడుచు పోతన వలన కాపాడబడినవాడై ప్రత్యుప కారముగా గంటమిచ్చి యదృశ్యుడైన దైవస్వరూపుడు. ఆంధ్ర భాగవత లేఖన మునకు గంటమిచ్చుటకేకాక పోతన దీనజనోద్ధరణ స్వభావనిరూపణ కుద్దిష్టమై యొప్పారిన దీ పాత్ర.

ఇక లోభిసెట్టి లోభిసహజమైన కార్పణ్య మిందు లెస్సగా నిరూపింప బడినది. దీనభిక్షుకుని కఱ్ఱతో కొట్టబోయి, అడ్డువచ్చిన పోతన కది తాకి రక్తము స్రవించుటచేత భయాందోళనములు చెంది పశ్చాత్తాపపడి పోతనకు క్షమాపణ చెప్పుకొనుటయేకాక సద్బుద్ధి కలిగి భాగవత సప్తాహమునకు వలయు ధన మొసగి భక్తుడైన వివేకవంతుడు. ఈ విధముగా జవరాలు, పోచయ్య, భిక్షుకుడు, సెట్టి పోతనచేత మేలుకాంచి కృతజ్ఞులై యతనికి ప్రత్యుపకార మొనర్చిన పుణ్య మూర్తులు. ఈ విషయములో ఈ నాలుగు పాత్రల కొకింత పోలిక యున్నను తదితర గుణకర్మ స్వభావములలో వైవిధ్యము గోచరించునట్లు పోషింపబడి యున్నవి.

## నారయ గంగన సింగనలు :

పోతన శిష్యులగు నారయ గంగన సింగనలు తమ గురువుగారి యెడ నత్యంత భక్తి గౌరవములు గలవారుగా వినయ విధేయతాది సుగుణ సంపదగల వారుగా చిత్రింపబడియున్నారు. బ్రహ్మచారులగు వీరు పోతన సన్నిధిలో సాహిత్య విద్యాభ్యాసము చేయుచు కొడుకుకన్న మిన్నగ మెలగినవారు. తారుణ్యోచితము లైన వీరి చేష్టలు, మాటలు, స్వభావము రాచకొండకు పయనించినప్పుడును, గురువుగారి వెంట విజయనగరము బయలుదేరి మణిగిరిపై నాగినప్పుడును సహజ రమణీయముగా చిత్రింపబడినవి. ఈ శిష్యుల మూలముననే పోతనగారి భాగవ

తాంధ్రీకరణ మహాప్రశస్తి సింగనృపతికి, తత్సభాస్తారులకు తెలిసెను. వీరనభిజ్ఞులు ననుభవరహితులు నగుటవలననే మొదట రాజసభలో ప్రవేశింపజాలకపోయిరి.

వీరు సత్కవితా పాండిత్య కావ్యమర్మజ్ఞతామండితు లనుటకు వీరు రాచకొండకు బోవుచు మార్గమధ్యాటవిని, అచటి వటమును వర్ణించుట, రాజసభలోనికి బోనీయని కంచుకిపై కినిసి తిట్టు కవితతో నతని వార్ధక్యమును వర్ణించుట, సింగనృపతి సమక్షమున గురువుగారి యాంధ్ర భాగవత వైశిష్ట్యము నభివర్ణించుట తార్కాణలు. గురువునకు దగిన శిష్యులుగా సుశిక్షితులై సుకవీంద్రులయినందు వలననే భాగవత శిథిల భాగములను పూరింపగలిగిరి. భాగవతాంధ్రీకరణకాలమున తమకును నట్టి భాగ్యమబ్బునే యని గురువుగారికి వినతి యొనర్చి, అట్టి భాగ్యము దైవకృపా విశేషమున మీకును కలుగవచ్చునని వారిచేత ననిపించుకొని యట్టి మహాభాగ్యమునకు నోచుకొనిన ధన్యజీవులు.

## రాచకొండ విజయనగర చమూపతులు:

ఉభయ రాజ్యముల చమూపతులును నీర రౌద్రస్వరూపులై ప్రభుభక్తి పరాయణులై తమ విద్యుక్త ధర్మములను నెరవేర్చినవారుగా నిందు చిత్రింపబడినారు. ఇద్దరిలో రాచకొండ సేనాపతి యెక్కువ గడుసువాడుగా గోచరించును. సింగనృపాలుని యనుజ్ఞ లేకున్నను, అతని కభిమతము కాకున్నను ఆ రాజుగారి యందలి భక్త్యతిశయముచేత విజయనగర చమూపతి నుండి భాగవతమును విడిపించి తెచ్చి దాచియుంచి తదీయశైథిల్యమునకు కారకుడై పశ్చాత్తప్తుడయ్యెను.

## యువక భూస్వామి :

బమ్మెరలోని యువక భూస్వామి పోతనమిత్రుడు భోగలాలసుడై శృంగారియైయుండి శృంగారనైషధకావ్య పఠనమువల్ల నుద్రేకమునొంది జీతమున్న పేదజవరాలిని బలాత్కరింపబూని తిరస్కృతుడై పిమ్మట పోతనగారి హితోపదేశక కవితాప్రబోధమువల్ల వివేకము తెచ్చుకొని క్షమార్పణ చెప్పికొన్న బుద్ధిమంతుడుగా చిత్రింపబడినాడు. పోతన కవిత సద్ధర్మోపదేశకమై ప్రభావ పూర్ణమైనదనుటకు తార్కాణగా నీపాత్ర పోషింపబడినది.

## రామశర్మ :

శ్రీరాముడే రామశర్మగా పోతన యింటలేనప్పుడు వచ్చి 'అల వైకుంఠపురంబులో' అన్న పద్యమును పూరించి వెళ్ళిన పురుషోత్తముడు. అతని దివ్యతేజస్సు, మాటలమన్నన, నడవడి యన్నియు శ్రీరాముడే యనునట్లు స్ఫురింపజేయుచుండును.

## జంగమకన్య, జ్యోతిపురరాజ్ఞి :

వాగ్దేవియే జంగమకన్యగా శ్రీనాథునికి దర్శనమిచ్చి తన దివ్యరూపరేఖా విలాసములను ప్రదర్శించి కవితామయప్రౌఢోక్తుల సంభావించి కాంతాకనకములను నిర్జించిన పోతన భాగవతమును నరాంకితము చేయడని నిష్కర్షముగా చెప్పి శ్రీనాథు నాశ్చర్యచకితునిజేసి యదృశ్యమాయెను. పోతన మనోనిశ్చయమును తెలిపి శ్రీనాథునికి కనువిప్పు కలిగించుటకు వాగ్దేవి యీరూపమున వచ్చినట్లు పాత్రపోషణ కావింపబడినది.

పోతన సహస్రపరివార సమేతుడగు శ్రీనాథునకు భోజనమిడజాలక కుందుచున్న వేళ, అతడు నమ్మికొన్న దైవతము సరస్వతియే జ్యోతిపురరాజ్ఞిగా వచ్చి పోతన ప్రశస్తినుగ్గడించి యతడు రచించిన మోహిన్యవతారకథ వినవలచి, ఆరాత్రి సహస్ర భోజన సంతర్పణము కావించి భక్తుడగు పోతన నాదుకొన్నట్లు పాత్ర చిత్రింపబడినది.

ఇతర పాత్రలగు శ్రీనాథునితల్లి, పుష్పలావిక, వేశ్యామాత, వేగులవాడు, కంచుకి మున్నగువారు తమ వృత్తులకు ప్రవృత్తుల కనుగుణముగా మెదలినట్లు పోషింపబడి కథానిర్వహణములో సముచితముగా సహకరించియున్నారు.

ఈ విధముగానిందు ప్రధానాప్రధాన పాత్రలన్నియు వైవిధ్యవిలసితముగా సజీవచిత్రణ శోభితముగా మిక్కిలి చక్కగా పోషింపబడి కావ్యమునకు వన్నెయు వాసియు సమకూర్చినవి.

# వర్ణనా వైదగ్ధ్యము[1]

కావ్యమున వస్తురసాదులతో బాటు వర్ణనలకును విశిష్ట స్థానము గలదు. కావ్యసుందరి రూప రేఖా విలాసములను, అంతరంగ బహిరంగ ప్రవృత్తులను మనోజ్ఞముగా సాక్షాత్కరింపజేసి సరసులడెందములకు పసందైన విందొసంగునవి వర్ణనలే. కావ్యమునందలి దేశకాల పాత్రాదుల గుణ రూపాదుల నగ్గడించి హృదయంగమ మొనర్చునవి వర్ణనలే. కావున కావ్యమున వర్ణనలు మిక్కిలి ప్రాముఖ్యము వహించి యున్నవి. ఆచార్యులవారు కావ్య పీఠికలో 'ప్రబంధ స్తుతి యొనర్చుచు ప్రబంధములలో వర్ణనల కుండు వైశిష్ట్యము నిట్లు వివరించినారు.

> "రూపిత ప్రాసాద గోపురసీమల రమణీయ శిల్పచిత్రణము భంగి
> సహజ సౌందర్య భాస్వత్కోమలాంగికి సురుచిర భూషణాంబరములట్టు
> పరితప్త కాంచనాభరణ సంతతులందు నవరత్న సత్కళానివహగతుల
> ఆపాత మధుర మోహనగాన వాణికి వీణా మృదంగ నిక్వాణ సరణి
> వర్ణనాదులు కృతికెంతొ వన్నెగూర్పం గల్గునని ప్రబంధాఖ్య సత్కావ్యభే
> గరిపి తీర్చిరి నిజకళా ప్రతిభ మెఱయ మను వసు చరిత్రముల్ ప్రాసి
> మను సుకవులు"[2]

ఇట్లు వర్ణనలు కృతికెంతో వన్నెగూర్పగలుగునని పెద్దనాదులు ప్రబంధ మను సత్కావ్య భేదమును నిజకళా ప్రతిభ మెఱయ తీర్చినారని వచించుటలో వర్ణనల విశిష్ట ప్రయోజనము ద్యోతకమగుచున్నది. వర్ణనలు సాధారణ కావ్యములందు కంటె ప్రబంధములందు ప్రత్యేకత సంతరించుకొన్న విషయము సుప్రసిద్ధము.

---

1. నేను "అభినవ పోతన" షష్టిపూర్తి సన్మాన సంచికలో వ్రాసిన "పోతన చరిత్రము-వర్ణనలు" అను వ్యాసమునకు సముచితముగా మార్పులు చేర్పులు చేసి దీనిని రచించితిని.
2. పోతన చరిత్రము : 'పీఠిక'-51

ఆచార్యులవారు మరొక సందర్భమున కవిత్వ లక్షణము చెప్పుచు వర్ణనల గూర్చి ఇట్లు వ్రాసిరి.

"ప్రాకృతికాంతరంగ బహిరంగ ప్రవృత్తుల వాస్తవస్థితిన్
లోకమునందు దర్పణములో వలెఁ జూపుటలే కవిత్వమా
ప్రాకృతికాంతరంగ పరివర్తనమే రసరూప మొందు బా
హ్యాకృతిలోని మార్పులె రసాంగ ప్రకాశక వర్ణనాచులా"[1]

ఇచట ప్రాకృతికాంతరంగ పరివర్తనము రసరూపము దాల్చగా, బాహ్యాకృతిలోని మార్పులు రసాంగ ప్రకాశకములగు వర్ణనాచులగునని విశదీకరింపబడినది. అనగా బాహిర ప్రకృతిలోని మార్పులను కనులకు గట్టినట్లు మనోజ్ఞముగా చెప్పునదే వర్ణన యని సారాంశము. 'కన్గనకును నద్దమెట్లటులు గ్రంథ చమత్కృతి నేర్పు పెంపు నన్ బ్రవిమల వస్తు తత్త్వమును భాసిలజేయుట'' వర్ణనల వల్లనే సాధ్యమగును.

నిజమునకు కవికార్యము వర్ణన చేయుటయే. 'కవయతి చాతుర్యేణ వర్ణయ తీతి కవిః' యన్నిక్కదా! కవి శబ్దవ్యుత్పత్తి. "దీనినే లోకోత్తర వర్ణనా నిపుణ కవి కర్మ కావ్యం" అని మమ్మటుడు వివరించెను. కనుక లోకోత్తరముగా వర్ణనము చేయు నతడే కవి. వర్ణనలు లేని కావ్యము నిస్సారమై యేదో పొడి మాటలతో చొప్పబెండు వంటి కథ చప్పగ చెప్పినట్లుండును. వర్ణనలు లేని కృతి యంగ సౌష్ఠవము నంతరంగవైభవము లేని యువతివలెను, శిల్పము లేని భవనమువలెను వెగటుగొల్పును. వర్ణనలచేతనే రసభావాదులు ముద్దులు మూటగట్టు రూపుదాల్చి దృశ్యమానములై రసికచిత్తముల హరింపజేయుచు స్వర్గసీమల విహరింపజేయును. కావుననే కావ్యములందు, అందును రచనా శిల్పసౌందర్యముల కవధియైన ప్రబంధములందు వర్ణనలు ప్రత్యేక స్థానము నలంకరించియున్నవి,

కావ్యశోభాకరములు, రసోపస్కార హేతువులునై చమత్కార భావ వ్యక్తికి నితాంతానుకూలములై కథను సుందర పరిపుష్టము చేసి సహృదయులు కావ్యరసామృతాస్వాదన మొనర్చుటకు వర్ణన లత్యంత సహాయకారులగుచున్నం

1. పోతన చరిత్రము : 2-125

దున కావ్యములలో నష్టాదశ వర్ణనలు చేయుట సత్సంప్రదాయమైనది. ఆంధ్ర సాహిత్యమున నన్నయాది పూర్వకవీంద్రుల రచనల లో వర్ణనలు సముచితములై సంగ్రహముగా చేయబడినవి. ఆ కృతులలో సమ్యక్కథా కథన దృష్టి ప్రధానముగా గోచరించును. కాలక్రమమున వర్ణనలు దీర్ఘములగుచు ప్రబంధములలో ప్రత్యేకత నాపాదించుకొన్నవి మనుచరిత్రవంటి కొన్ని ప్రబంధములలో సముచిత వర్ణనలున్నను వసుచరిత్ర వంటి ప్రబంధముల దిలకించితిమేని యవి వర్ణనల కోసము పద్యశిల్పము కోసము వ్రాయబడినట్లే తోచును. ఆ వర్ణనలు తొలగించి నచో మిగిలియుండు కథ 'అస్తి నాస్తి విచికిత్సాహేతు' వై పోవును. తగిన కథ లేక యతివేలములైన వర్ణనలుండు కావ్యము స్థితికిమించి లావెక్కిన శరీరమువలె స్తబ్ధమై నడకసాగక ఆయాసపెట్టుచుండును. ఇక సరియగు వర్ణనలు లేని కావ్యము కండలులేక నకనకలాడు నెముకల గూడువలె నడయాడు చుండును. అందు గతిలేని స్తబ్ధత, యిందు స్థితిలేని పరుగు. అది పొందదు; ఇది యందదు. కావున సరియగు నొడ్డు పొడుగు తోడి సుందరాకారమువలె తగు వర్ణనలతో నొప్పు కావ్యమే శ్రేష్ఠమైనది. అట్టి సముచిత వర్ణనలకు సాగరమైనదీ పోతన చరిత్రము. ఈ మహాకావ్యమున నిటుల శోభిల్లు వర్ణనల గూర్చి చర్చించుటయే ప్రస్తుత విషయము.

మహాకావ్య లక్షణము చెప్పుచు నందుండదగు వర్ణనల నాలంకారికులు వివరించిరి. విద్యానాథుడు దిగువ రీతిగా నిర్వచించెను.

> "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్
> ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవా:
> విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్
> మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి
> ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహా కావ్యముచ్యతే
> ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూన మపీష్యతే"[1]

ఇందు,

1. ప్రతాపరుద్రీయము : కావ్యప్రకరణము, 69-71 శ్లో.

1. పురము 2. సముద్రము 3. పర్వతము 4. ఋతువులు 5. చంద్రోదయము 6. సూర్యోదయము 7. ఉద్యానవిహారము 8. జలవిహారము 9. మధుపానము 10. సంభోగము 11. విరహము 12. వివాహము 13. పుత్రోదయము 14. మంత్రాలోచనము 15. ద్యూతము 16. ప్రయాణము 17. యుద్ధము 18. నాయకాభ్యుదయము-అను అష్టాదశ వర్ణన లుండునది మహాకావ్యమనియు, వీనిలో కొన్ని తగ్గించుటయు కొందర కిష్టమనియు వివరింపబడినది. విద్యానాథుడు తనకు ప్రాచీనుడగు దండి పేర్కొనిన యష్టాదశవర్ణనలనే పేర్కొనెను. విన్నకోట పెద్దనయు నీ యష్టాదశవర్ణనలనే పేర్కొనెను.

విద్యానాథుడిట్లు పదునెనిమిది వర్ణనలను పేర్కొనగా నతని తరువాతి వాడగు విశ్వనాథకవిరాజు ఇరువదియైదు వర్ణనల నిట్లు తెలిపెను.

"సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాన్త వాసరాః
ప్రాతర్మధ్యాహ్నమృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభౌచ ముని స్వర్గ పురాధ్వరాః
రణప్రయాణోపమయ మంత్రో పుత్రోదయాదయః
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ"[1]

దీనిననుసరించి

1. సంధ్య 2. సూర్యుడు 3. చంద్రుడు 4. రాత్రి 5. ప్రదోషము 6. అంధకారము 7. పగలు 8. ప్రాతఃకాలము 9. మధ్యాహ్నము 10. వేట 11. పర్వతము 12. ఋతువులు 13. వనము 14. సముద్రము 15. సంభోగము 16. విప్రలంభము 17. ముని 18. స్వర్గము 19. పురము 20. యజ్ఞము 21. యుద్ధము 22. ప్రయాణము 23. వివాహము 24. మంత్రాలోచనము 25. పుత్రోదయము - అను వానిని మహాకావ్యమున యథాసంభవముగా సాంగోపాంగముగా వర్ణించవలయును. ఇందు ప్రతాపరుద్రీయములో లేని వేట, ముని, స్వర్గము, యజ్ఞము అనునవి ముఖ్యముగా నెక్కువగానున్నవి.

2. సాహిత్య దర్పణము : 6వ పరిచ్ఛేదము, 322-324శ్లో.

అప్పకవి దిగువ విధముగా నిరువదిరెండు వర్ణనలు పేర్కొనెను.

''పురమును ఋతుషట్కమును బ్రయాణంబును శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు దూతంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపానజ వికారంబును వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్య కథనంబు హిమకరాభ్యుదయంబు విప్రలంభోచితంబు
పద్మమిత్రోదయంబును బరిణయంబు సురతమును దౌహృదంబును సుత జననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస''1

ఈ యిరువది రెండు వర్ణనలలో ప్రతాపరుద్రీయ సాహిత్య దర్పణము లలో చెప్పబడని కన్యాంగసౌందర్య కథనము, దౌహృదము కానవచ్చుచున్నవి. ప్రబంధ మష్టాదశ వర్ణనాత్మకమై యుండునన్నది ప్రసిద్ధమైనది. దండి, విద్యానాథుడు మున్నగు పూర్వాలంకారికులు పదునెనిమిది వర్ణనలను పేర్కొనగా తర్వాతివాడగు విశ్వనాథుడు వర్ణనల సంఖ్య నిరువదియైదువరకు పెంచెను. అప్పకవి యిరువది రెండిటికి కుదించెను. ఈ వర్ణనలన్నియు కావ్యములందిట్లే యుండవలయునని యాలంకారికులు నిర్బంధము చేయలేదు. ప్రతాపరుద్రీయము 'ఏషామష్టాదశానాంయైః కైశ్చిదూన మపీష్యతే' యనుటచేతను సాహిత్యదర్పణము 'వర్ణనీయా యథా యోగం' అనుటచేతను ఈ వర్ణనలలో కొన్ని తక్కువయున్నను లోటులేదనియు, యథాసంభవముగా నీ వర్ణనలు చేయవచ్చుననియు స్పష్టమగు చున్నది.

పోతన చరిత్రము సుమారు నాలుగువేల పద్యములుగల పండ్రెండాశ్వాస ముల బృహత్కావ్యము. 'వస్తుశిల్పము'లో తెల్పినట్లు కావ్యనాయకుడగు బమ్మెర పోతన గూర్చియు మనకు దెలియవచ్చు వృత్తాంతములు మిక్కిలి తక్కువ, ఆ కొన్ని గాథలైనను వివాదాస్పదములు. ఇది యిట్లుండ లోకమున

1. అప్పకవీయము : 1-23

విన్నదొకింత, భాగవత పీఠికలో పోతన తెలిపినది, చరిత్రకారులు పరిశోధించి తేల్చిన విషయ మొకింత, తమకు సమంజసమని తోచినదొకింత సమకూర్చి చక్కని యితివృత్తము సిద్ధము చేసికొని యాచార్యులవారు నిర్వ హించిరి. స్థూల దృష్టితో జూచిన నెంత సన్నివేశ కల్పన మొనర్చినను ఒకింత కథకు నాలుగు వేల పద్యము లనవసరమనియు నతి దీర్ఘ వర్ణనల వల్ల గ్రంథ విస్తరమై యుండుననియు తోచును. కాని యిందేమాత్రము వాస్తవము లేదు. పరిశీలించి చూచినచో పదపదమున కథ కలదు కథ కథలో వర్ణన గలదు. మహాభారతమున వలె దీనిలో నంతటను కథ వ్యాపించి యుండి మను చరిత్రాది ప్రబంధములందు వలె వర్ణనలు విస్తరించి యుండి యాశ్చర్యము గొల్పుచుండును. ఇందలి వర్ణనలు నాతిదీర్ఘములై సందర్భ శోభితములై యౌచిత్య భాసురములై రసభావ స్ఫోరకములై సహజ సుందరములై చక్కనివై చిక్కనివై సొబగు చినుచుండును. వేయేల? కథా సన్నివేశ వృత్తాంతములను లతాంతములను, రసపుష్కలములగు ఫలముల నవిరళముగ వెలయింపజేయు లలిత వర్ణనాంతావితానములతో నల్లిబిల్లి గొనిన సుందర నందన కావ్య నికుంజమీ పోతన చరిత్రము.

ఆలంకారికులు నుడివిన యష్టాదశ వర్ణనలలోను, పంచవింశతి వర్ణనలలోను మధుపానము, ద్యూతము, జలవిహారము, స్వర్గము, యజ్ఞము, మంత్రాలోచన మను నొక కొన్ని వర్ణనలు కావ్యమున లేవు వీనికి కావ్యకథలో నవకాశము లేనందున విడిచిరి కాని బలిమిమెయి వీనిని చొప్పించి కథను సాగదీయలేదు. ఈ కతిపయ వర్ణనలు పోగా పుర సింధు శైలర్తు చంద్రార్కోదయోద్యాన విహారములు, వివాహ విప్రలంభ సురత సుతోదయములు, అంధకార కన్యాంగ సౌందర్య దౌహృదములు, ప్రయాణ సంగ్రామ నాయకాభ్యుదయములు - అను వర్ణనలు మహాకావ్యమున సందర్భానుసారముగా మనోజ్ఞముగా చేయబడినవి. అంతేకాక యనేకములైన యితర వర్ణనలు ప్రసక్తానుప్రసక్తముగా గావింప బడినవి.

ఇందలి యాలంకారికోక్త వర్ణనల వివరము దిగువ నీయబడినది.

పుర వర్ణనలు :

బమ్మెర గ్రామ వర్ణన. (ఆ. 1, 82-87)

రాచకొండపుర వర్ణన : (ఆ. 4. 7-17)

మన్త్రపురి (మంథెన) వర్ణన : (ఆ 5. 4-10)
ఓరుగల్లుపుర వర్ణన : (ఆ. 1. 79-81)
(ఆ. 9. 74-79)
ద్వారకాపుర వర్ణన : (ఆ 12. 255-'56

సముద్ర వర్ణనము :

శ్రీరామ చరిత్రమున సముద్ర వర్ణనము : (ఆ. 11. 70)
కాసార వర్ణనము : (ఆ. 12. 9,10)
వేటవర్ణనము : (ఆ. 10. 82-84)
పర్వత వర్ణనము : మెట్టు కుధర వర్ణనము : (ఆ. 9 3-12)

ఋతు వర్ణనములు :

వసంత వర్ణనము : (ఆ. 6. 3-12)
గ్రీష్మవర్ణనము : (ఆ. 7. 39-43)
వర్షవర్ణనములు : (ఆ. 3. 111-114)
(ఆ. 3. 137-148)
(ఆ. 5. 179-184)
శరద్వర్ణనము : (ఆ. 3. 191-203)
హేమంత వర్ణనము : (ఆ. 9. 340-347)
చంద్రోదయ వర్ణనము : (ఆ. 2. 24-31)

సూర్యోదయ వర్ణనములు :

ప్రాతఃకాల వర్ణనములు : (ఆ. 2. 3-8)
(ఆ. 4. 216-219)
(ఆ. 7. 3-7)
మధ్యాహ్న వర్ణనము : (ఆ. 7. 39-43)
సాయంకాల వర్ణనములు : (ఆ. 2. 148-453)
(ఆ. 5. 17-22)
(ఆ. 8. 37-39)
అంధకార వర్ణనము : (ఆ. 5 159-162)

ఉద్యాన వర్ణనములు :

రాచకొండ పురోద్యాన వర్ణన : (ఆ 4. 14-17)

శ్రీనాథకృత రాజోద్యాన వర్ణన : (ఆ. 4. 111-120)

పోతనకృత రాజోద్యాన వర్ణన : (ఆ. 4. 123-134)

మావితోట వర్ణన (ఆ. 1. 167-173)

పెరటి తోట వర్ణన (ఆ. 8. 211-222)

వివాహ వర్ణన : పోతన వివాహవర్ణన : (ఆ. 2 241-281)

విప్రలంభ సమాగమ వర్ణనలు :

పోతన విరహవర్ణనలు : (ఆ. 3. 161-176)
(ఆ. 3. 205-216)

పోతన దంపతుల సమాగమ వర్ణన : (ఆ. 3. 242-246)

పుత్రోదయ వర్ణనము : (ఆ. 1. 111-119)

ప్రయాణ వర్ణనలు :

సింగభూపతి సేనల బమ్మెర ప్రయాణము : (ఆ. 7. 159-165)

శ్రీనాథుని బమ్మెర ప్రయాణము : (ఆ 7. 287-300)

ముని వర్ణనలు : (ఆ. 1. 22-24)
(ఆ. 2. 15-18)

కన్యాంగ సౌందర్య వర్ణనలు : (ఆ. 7. 307-311)
(ఆ. 8. 202-207)
(ఆ. 12. 224-225)

దౌహృద వర్ణన : (ఆ. 3. 266-269)

యుద్ధ వర్ణనలు :

యువక వీరుని కఱ్ఱయుద్ధ వర్ణన : (ఆ. 7. 201-224)

కన్నడ తెలుగు వీరుల యుద్ధ వర్ణన : (ఆ. 9. 165-181)

రామరావణ యుద్ధ వర్ణన : (ఆ. 11. 85-90)

యజ్ఞవరాహ హిరణ్యాక్షుల యుద్ధవర్ణన : (ఆ. 11. 190-198)

కరి మకరముల యుద్ధ వర్ణన : (ఆ. 12. 25-35)

నాయకాభ్యుదయ వర్ణనము.

భాగవతకృతి సమర్పణోత్సవము : (ఆ. 10.49-65)

ఈ వర్ణనల గురించి సంగ్రహముగా చర్చింతును.

## పురవర్ణనలు :

కావ్యనాయకుడగు పోతన గ్రామకరణము, కృషీవలుడు నగుటచే పుర వర్ణనలో మొదట నతని నివాసస్థలము బమ్మెర వర్ణింపబడినది. 'తేనియమాగాణమైన తెంగాణమున క్ష్మాతలస్వర్గమగు' నేకశిలాపురప్రశస్తి నుగ్గడించి శాంతిసౌఖ్యాకరమగు ఆ నగరోపాంతసీమలో పోతరాజుదయించిన బమ్మెర గూర్చి,

> "అది యొక పల్లెటూరు కలవందొక కొన్నిగృహాలు పెంకుటా
> ళ్ళఁ దల ధరించి మోయుటెటులా యని సంస్కృతి భారమెంచి బా
> ధఁ దనరుఁ బెన్గుటుంబివలె దాపున మౌనులవోలెఁ బూరి యిం
> డ్లెద నమితాశ పీడునెడ నా బరువే తృణ తుల్యమౌననన్"[1]

అని వర్ణింపబడినది. శ్రీనాథ పోతనల పాత్రల చిత్రణము ప్రధానముగా జరిగిన యీకావ్యమున ప్రథమముననే వారి భిన్నవ్యక్తిత్వములు జీవితములు స్ఫురింపజేయుటకు ఈ పద్యమున పెంకుటిండ్లను పూరిగుడిసెలను ధ్వనిగర్భితముగా వర్ణించిన విషయము స్తోత్రపాత్రమైనది. మరియు ఆశకు లొంగనివానికి ఈశత్వము లొంగునన్నట్లు ఆదర్శప్రాయమైన పోతన చరిత్రము అమితాశలుపీడి నిత్యసంతోషులై యున్నవారికి సంసారము భారమనిపించక శాంతి ఆనందము సమకూడగలవను ధర్మోపదేశమును వ్యంగ్యముగా నిడి చేయుచున్నది. ఇట్టిది కావ్యాది నుండవలెనను 'ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశోవాఽపి తన్ముఖమ్' అను లక్షణమున వస్తునిర్దేశమొనర్చుచున్నది. ఇటుల మొదలిడిన వర్ణనలో బమ్మెర యందలి యిండ్ల యలంకరణలు, గుమ్మడి మున్నగు పాదులు, మొక్కపెరండ్లు, ముండ్లదడులు, ద్వారాల పలుగాండ్లు, గుడిసెలకు వెనుకనుండు పిడుకలగూండ్లు మరియు నచటి కోళ్ళు మేకలు ఆవులు లేగలు మున్నగునవెల్ల స్వభావ రమణీయముగా వర్ణింపబడినవి. అందు 'ముత్యాల చెండ్లెత్తి మురిపించు జొన్న చేల్ కర్షకశ్రమబిందు ఘనతఁ

---

1. పోతన చరిత్రము : 1-33

దెల్పు' నన్ను పద్యరత్నము పల్లీ పరిసర సస్య లక్ష్మితోబాటు మహాకవి భావ సంపదను సాక్షాత్కరింప జేయుచున్నది. పాడిపంటల ముల్లెయగు నాపల్లె వర్ణన మరియు 'మోటఁదోలుచొకింత మ్రొగ్గి దండెడు తంత్రి ప్రతిచేసి పాడెడు చోటఁ గాఁపు' ఇత్యాదిగాగల గ్రామసీమా వర్ణన, గ్రామ పరిసరములలోని 'గొఱ్ఱె మందగోల, గొల్లని యీలయు, పసుల కాలిధూలి విసరణంబు, మంచెవారి కేక, మందకుక్కల ఢాక' మరియు కర్షకుల పల్లెపడుచుల వర్ణన మాచార్యులవారికి గల జనపదాల పరిచయమును, తదీయ దృశ్యనిశిత పరిశీలనమును వ్యక్తము చేయుచున్నవి.

చతుర్థాశ్వాసాదిని శ్రీనాథ పోతనలు వెడలి చూచిన రాచకొండ నగరము వర్ణింపబడినది. బహుపట్టణము లదివరకే దర్శించి వసించిన శ్రీనాథుడా నగరిని పోతనకు జూపుచు వచించి నటుల వ్రాయుట సమంజసముగా నున్నది. అందలి కోటలు శృంగాటకాదులు తడవిన పిదప నగరము నొక సరస్సుగా రూపించి సౌధములు 'నవనీరజ శోభల లక్ష్మితో నొప్పు' నని చక్కగా వర్ణించుట జరిగినది. మఱియు పురమందలి యశ్వ గజశాలాదులను 'జలకుండికాంత రస్తంభాగ్ర మండితలయి యంబుశీకరాల్ జిమ్ము స్త్రీ ప్రతిమలను', రమణీయ పురోద్యానమును, సుందరీమణులను ఇట్లెన్నెన్నో వింతలను విశేషాలను వివరించి శ్రీనాథుడచట నంగడిలోగల యొక నెఱజాణయగు పుష్పలావికతో సరస చతురోక్తుల సంభాషించిన విషయము మనోహరముగా వర్ణింపబడినది.

ఇక పంచమాశ్వాసమున పోతన తిప్పనతో గూడి, దివంగతులైన జననీ జనకుల యస్థికలు కలిపి శ్రాద్ధ విధులు నిర్వహింప సోమోపరాగ కాలమున దక్షిణ గంగయన నొప్పు గోదావరికి పోవుచు తత్తటమున గల మంత్రపురిని (మంథెన) తిలకించి నప్పుడా పుర మభివర్ణితమైనది. స్కాంద పురాణ గాథల ప్రథితమయి చరిత్రప్రశస్తి వహించి ద్విజాగ్రహారమై యొప్పు తత్పురము పోతన తిప్పనల చేత చక్కగా వర్ణింపబడినది. ఆ పిదప 9 వ ఆశ్వాసమున నేకశిలా నగర ప్రశస్తి వర్ణనము పోతనచేత మణిగిరి విద్వాంసుల మ్రోల లెస్సగా గావింప బడినది. ఆ సందర్భముననే శ్రీ వరదాచార్యవారు తమ జన్మస్థానమగు తెలంగాణమును, తెలంగాణలోని సత్కవులను పోతనచేత వర్ణింపజేసినారు. ఆ కవులను గూర్చి.

> "ఎక్కడనున్న సద్గుణములేనియు నొదలందాల్చుటందు వే
> రొక్కనిగాంచి ముందర నహో! యని వెన్కల వెక్కిరింపకే
> మక్కువ భ్రాతృవత్సలత, మత్సరమున్ విడనాడియుంటలో
> నిక్కపుటొజ్జబంతులయి నిల్చెదరీ తెలగాణసత్కవుల్"1

అని చక్కగా వచించినారు.

నగరవర్ణనలలో ద్వాదశాశ్వాసమున కృష్ణావతారకథానివేదనములో ద్వారకా పురవర్ణనము సంగ్రహముగా కావింపబడినది. మరియు 2 వ ఆశ్వాసములో పాల్కురికి గ్రామము, 9వ ఆశ్వాసమున మడికొండ, ఒంటిమిట్ట పురముల వర్ణ నలు చేయబడినవి ఇంకను ననేక పర్యాయములు సందర్భానుసారముగా పల్లె పట్టుల దృశ్యములు వర్ణితములైనవి. ఈరీతిగా పురవర్ణనలలో పల్లెలు పట్టణాలు బస్తీలు అన్నియు శోభిల్లినవి.

## సముద్ర వర్ణనము :

మహాకావ్యమున సముద్ర వర్ణనము 11వ ఆశ్వాసమున శ్రీరామచరితమున 'నాయుప్పు దిని' (11-70) యను పద్యమున గలదు. శ్రీరాముడు పథమిమ్మని యడుగ సముద్రుడు 'మిన్నుముట్టు గర్వమ్మునమిడిసిపడుచు నెగసిపడె' నని యా సముద్రునికి పొగరెక్కిన కారణములు చక్కగా వక్కాణింపబడినవి. 12వ ఆశ్వాసమున గజేంద్రమోక్షణ కథలో కాసారవర్ణనమును, 7వ ఆశ్వాసమున నార యాదులు రాచకొండకేగుచు నరణ్యమధ్యమున విశ్రమించినయెడగల నదీవర్ణ నమును గలవు.

## వేట వర్ణనము :

దశమాశ్వాసమున పరీక్షిన్నరపతి శమీకమున్యాశ్రమ సమీపారణ్యమున ఆడిన వేట ఘగుల సంగ్రహముగా వర్ణింపబడినది.

---

1. పోతనచరిత్రము : 9-66

## పర్వత వర్ణనము :

పర్వత వర్ణనములో 9వ ఆశ్వాసమున మొదట పోతన శిష్యసమేతుడై భాగవతము కర్ణాటాధీశ్వరున కర్పింప బోవుచు మార్గమధ్యమున చూచిన మడి కొండ చెంతగల మెట్టుకుధరము వర్ణితమైనది. హిడింబక్షేత్రమను ప్రసిద్ధిగల మెట్టుగుట్ట విశేషములు, అందలి యీశ్వరాలయ రామాలయములు, గుండములు మున్నగునవెల్ల వివరింపబడినవి. తమ యభిజనము మడికొండ యగుటచేతను, మెట్టుగుట్ట తాము బాల్యమున విహరించి వాగీశ్వరీ మంత్రోపాసన గావించిన ప్రదేశమగుటచేతను ఆచార్యులవారు మక్కువతో సవిస్తరముగా వర్ణించుటయేకాక మణిగిరి విద్వాంసులతో,

> "మణిగిరియు మిమ్ముబోల్ జాతిమణులఁ గాంచి
> యనవరతము సార్థకనామ మగునుగాత!
> నిజముగా మీదు విజ్ఞాన నిష్ఠఁ గాంచ
> నిచట నేఁ బుట్టనైతి నంచెదఁ దలంతు"[1]

అని పోతన వచించినట్లుగా వ్రాసినారు. అభినవ పోతనయైన వరదాచార్యులవారు మణిగిరిలో నవతరించి తమ యభిలాషను నెరవేర్చుకొని కృతకృత్యులై యా పుర మును సార్థకము చేసినారు.

## ఋతువర్ణనలు :

పోతనచరిత్రములోని ఋతువర్ణనలు మిక్కిలి సందర్భోచితములై నిసర్గ రమణీయములై విశిష్టములై శోభిల్లుచున్నవి. శిశిరర్తువొకటి తప్ప తక్కినవెల్ల వర్ణింపబడినవి. కొన్ని ప్రబంధములలో నేదో సందర్భము కల్పించుకొని ప్రత్యే కముగా వానికొరకే యనునట్లు దీర్ఘదీర్ఘములుగా జేయు ఋతువర్ణనల వంటివికాక శుష్క శాస్త్రపాండిత్య విషయములు గుప్పించి తల నొప్పించునవికాక యత్యంతౌ చిత్య భాసురములై సంగ్రహములై యిందలి వర్ణనలు విలసిల్లుచున్నవి.

6వ ఆశ్వాసమున పోతన శ్రీమదాంధ్ర భాగవత రచనకుపక్రమించుటకు ముందు భాగవత సప్తాహమొనర్చెను. అది వసంతఋతువు. ప్రకృతి నవ్యశోభలతో

1. పోతనచరిత్రము ; 9-72

ఆహ్లాదకర వాతావరణముతో మహాకావ్యరచనకు నితంతానుకూలముగా నుండెను. ఈ విషయ మీ దిగువపద్యమున హృద్యముగ వ్యంజితమైనది.

''నవరసంబులఁ జిల్కు నవకావ్యమువిధంబు నవవత్సరాది తానవతరించె
పంచాంగములు తరుపంచాంగముల యట్లు జీర్ణపత్రముల వర్జించి యొప్పె
శుకపికద్విజము లోపిక శుకద్విజులటుల్ తరుణ భాగవత గీతములు పాడె
తోరణమ్ములు లేమితో రణమ్మును సల్పి పచ్చపచ్చగ శాంతి పాదుకొల్పె
యువత కుసుమాయుధుని వలన్ దవిలి యోడె సవిత ప్రకృతికామినితో వసంతమాడె
కవిత నూత్నాబ్దమునకు స్వాగతముఁ బాడె నాడెఁ కవివాణి తెరవీడి నాట్య మాడె.''[1]

మరియు ''లక్షవత్తుల దీపవృక్షదీధితుల హారతులిచ్చె కింశుక ప్రసవవనిత''ఇత్యాదిగా ''కొమ్మలెల్ల సింగారించుకొని రహించి ప్రియవసంతునిపైఁ బూలవృష్టిఁ గురిసె''నని వసంతశోభలు వెదజల్లు వృక్షములను వసంతునికొమ్మలుగా జేసి కడు మనోజ్ఞముగా వర్ణించినారు. ఆయా ఋతువులలో భూదేవి చెందు మార్పులను వివరించుచు,

''శిశిరమ్ములోనఁ దన జీర్ణవస్త్రములొల్చె నల వసంతమున నూత్నాలం కృతులఁ దాల్చె
కుసుమాకరుని గూడుకొని యాడె, భూమహిళ, సతిహృద్వికారములె ఋతు షట్కమయ్యె''[2]

అని పొల్పుగ తెల్పబడినది. వసంతఋతువులో నవతరించిన శ్రీరామచంద్రుని నాయకునిజేసి రచించిన భాగవతము రచన వసంతములోనె ప్రారంభింపబడినట్లు వర్ణించుట యెంతో సముచితముగా నున్నది.

గ్రీష్మవర్ణనము సప్తమాశ్వాసమున నారయాదులు రాచకొండకేగు సందర్భమున చేయబడినది. ''చండకరుండు వహ్నికణజాలము దిక్కులఁగ్రక్క సాగె, బ్రహ్మాండము తప్తభాండమయి యంటఁగరానటు క్రాగెడిన్'' అని తెల్పుచు గ్రీష్మ మధ్యాహ్నమున మండుటెండలకు మృగ పక్షి వృక్షజాలములు పొందెడు దురవస్థ చక్కగా వర్ణింపబడినది.

1. పోతనచరిత్రము : 6-3
2. ,, : 6-8

3వ ఆశ్వాసమున కోతకువచ్చిన వరిపైరు చెడునట్లు వాన కురియ విజృంభించిన మేఘవర్ణన వర్షవర్ణనలో గలదు. 'చలన్మహితేంద్రనీల సన్మణి కృత పాక శాసన విమానమనన్' నల్లని మబ్బొకటి దివినాడినది. 'ఎప్పుడొక యింత యెండకన్నె ఱుగనట్టి మెఱపు దొరసాని మబ్బుల కురులలోన సింగిణి యను రంగుల పూల దండఁ గీలించె'నని యెంతో రమ్యముగా వర్ణింపబడినది. మరియు నింతింతై వటుఁ డింతయైనటుల నాకసమంతయై మేఘము ప్రజలకు భీతికలుగునటుల విజృంభించి నది. ఇచట మేఘవాహినులు భయంకరముగా చెలరేగినవని 'ధూర్తనాగారూఢ....' యన్నపద్యమున ప్రౌఢగంభీరముగా రూపించి వర్ణింపబడినది. అంతట 'కర్షక విషాద నిశ్వాస ఖండతండ మేకమై చండపవను సమాకృతిఁగొని వీచెనన గాలితో మబ్బు విచ్చిపోవు వర ప్రజాహిత దౌర్జన్యప్రభుత యగుచు" అని ప్రజలకు హాని కారకమై దౌర్జన్యము చేయు ప్రభుత్వము ప్రజల తిరుగుబాటుచే కూలిపోవునట్లు రైతుల మనోవేదనచేత పెనుగాలి వీచి మబ్బులు చెదరిపోయినవని చెప్పిన తీరెంతో యుక్తముగా నున్నది. తాత్కాలికముగా మబ్బులు విచ్చిపోయినను మరల నదరి వర్షించినవి. గాలివాన వచ్చు సూచనగాంచి పోతన త్వరత్వరగా వరికోయించుచు పొలాల వద్దనే యుండిపోయెను. పోతనసతి నాథుడింటికి రానందున తానే బయ ల్వెడలి దుర్గాదేవికి బోనమిడి పోతనకు భోజనమిడ పొలము తలమునకు రాదొడ గెను. అంతలోనె వర్షమారంభించి కురిసినదని కావ్యకథతో విడదీయరాని సంబం ధముగలిగి పెనవేసికొన్నట్లు వర్ణింపబడిన విధమెంతో స్వాంతావర్జకముగా నున్నది. పోతనసతి దుర్గాదేవితో తన ప్రియసమాగమవాంఛ నెరవేర్ప ప్రార్థింపగా నట్లే యగునన్నట్లు చెట్లమీది పక్షులు కలకలధ్వని చేసెదు. అది విని యాకాశ మానందబాష్పములు కురిపించెనో యన వర్షము మొదలై బిందువులు రాలసాగెనని వర్ణింపబడినది. అక్కరలో నోరువిప్పి యడుగగా నర్థికిచ్చు నీళ్ళను జీవనమందురనియు, పొట్టలు నిండినవారికిచ్చు నమృతమును విషమందురనియు అందుకే యనౌచిత్యమున ఘనుడు పండిన పంటలపై నకాల వర్షము కురిసి పతన మయ్యెనని మిగులచమత్కారముగా 'నీరు' పదమునకుగల పర్యాయ పదములగు 'జీవనము', 'అమృతము' అనువానికి చక్కని సార్థక్యము చేకూర్చి వచించినారు. వాన వెలిసిన విషయమెంత హృదయంగమముగా నుదాత్తముగా చెప్పినారో యీక్రింది పద్యములు తెల్పుచున్నవి.

"ఉటికి యుటికి తాఁ బడిపోవు నరునిభాతి కురిసి కురిసి వర్షమ్మాగెఁ
గొంత తడవు
నంత నాకాశమండలమంతఁ గూడ మైల గడిగిన ముకురము లీల వెలిఁగె"[1]

"పగిలె జేయి జాఱిపడి యద్దఫలకమ్ము లనఁగ నిలిచె మడువులందు జలము
అద్దములను దాపినట్టి పచ్చనికోక లాఱఁగట్టె శాద్వలాంగణములు"[2]

వర్షవర్ణన మిదియేకాక 6వ ఆశ్వాసమున గూడ చేయబడినది. అనావృష్టిచే భీకర క్షామ మేర్పడిన కాలమున ప్రజల భాగ్యవశమున గురిసిన వర్షము వర్ణింపబడినది. అచట ఘనాఖ్యతో నలరు మేఘుని గూర్చి వ్రాసిన 'ఎవనికై సింగిణి నవరత్నఖచిత సుస్వాగత ద్వారమై చదల మెఱయు'నన్న పద్యము మహోదాత్త భావసంపద చేత పెంపెసలారుచున్నది.

హేమంతఋతు వర్ణన నవమాశ్వాసమున సంగ్రహముగా చక్కగా చేయబడినది. సింగభూపాల చమూపతిచేత భాగవత మపహృతమగుటవలన విరాగియై పోతన వెడలిపోయిన పిదప సింగనృపతి యంపగా శ్రీనాథుడు జీర్ణభాగవతము గైకొని బమ్మెరకు వచ్చును. అది హేమంతకాలము. అప్పుడే శోభిలుచుండిన సంక్రాంతి వర్ణన మిచట గావింపబడినది. ఇట్లు హేమంతము, సంక్రాంతి రెండును రమ్యముగా వర్ణితములైనవి. హేమంతమును వర్ణించుచు,

"దంపతుల విడఁగొట్టుటొ ధాత్రిజనములురక యెండగొట్టె నటంచు
నుడుకుచుంద్రు
దంపతులఁ గూడఁబెట్టుటొ ధరణి ప్రజలునౌర! చలిపెట్టెనని వడఁకాడు
చుంద్రు."[3]

అని 'ఎండకొట్టుట' 'చలిపెట్టుట' యను వానిని సరసముగా చమత్కరించిరి. తెలుగువారి సంక్రాంతి వర్ణనము హైందవ సంస్కృతి సంప్రదాయముల సొగసులను సహజ మనోహరముగా విశదము చేయుచున్నది.

1, 2. పోతన చరిత్రము : 8-145-146
3. ,, : 9-345

## చంద్రోదయ వర్ణనము :

పోతన శ్రాద్ధవిధి నిర్వహింప గోదావరి కేగిన సందర్భమున చంద్రోదయ వర్ణన కలదు. సాయంతన శోభల జెలగు గంగాతరంగిణీ దృశ్యములు తిలకించు చుండ నపుడే యుదయించిన పార్వణచంద్రుని గాంచి పోతన వర్ణించును. ఈ వర్ణనలో 'కడు సున్నితంబైన యొడలంచు నే ప్రొద్దు నెండకన్నెఱుఁగనీకుండ సాకు' ఇత్యాదిగా రత్నాకరుడు లేకలేక కలిగిన యేకైక పుత్రుడగు చంద్రుని మిగుల గారవముగా జూచునని చక్కగా వచింపబడినది. కళంకి యని చంద్రుని రాకగని యతని సోదరి లక్ష్మీదేవి 'తలుపులిడుకొని యింటిలోపలికిఁ బోవు' నని పద్మములు ముడుచుకొనిపోవుట భంగ్యంతరముగా జెప్పబడినది. పుట్టు కళానిధియైనను స్వయంకృత పాపఫలిత మనుభవింపక తప్పదని శశిని జూచి తలపోసి స్వయం కృతముల గూర్చి సింహావలోకనమొనర్చుకొన్నట్లు చిత్రింపబడినది. ఈ చంద్రో దయ సందర్భముననే యంతకు ముందరి సాయంసమయ వర్ణనము మనోజ్ఞముగా చేయబడినది. ఇట్టి సాయంవర్ణన ద్వితీయాశ్వాసమునను పోతన బండిలో వరి మోపులు వేయించుకొని పొలము నుండి బమ్మెరకు బయలుదేరిన సమయమున గలదు. ఇక్కడి వర్ణన సాయం సంధ్యాశోభలను, తత్సమయ గ్రామ పరిసర దృశ్యములను చిత్రించుచు మిగుల నిసర్గరమణీయముగా సాగినది. మరొక సాయం వర్ణన 8 వ ఆశ్వాసమున గలదు. శ్రీనాథుడు భాగవతమును సింగభూపాలాంకితము చేయింపనెంచి బమ్మెర చేరవచ్చుచున్నవేళ సంగ్రహముగా జేయబడినది. అపుడస్త మింపనున్న సూర్యుని వర్ణించిన యుత్ప్రేక్షాకవిత భావసంపద యెంత యుత్తాల మైనదో "వరుణుండు చలిగాగ విరచించుకొనినట్టి పండు నిప్పుకల కుంపటి యనంగ...." అను పద్యమున తిలకింపవచ్చును.[1] ఇది 'ఆలంకారికత' వ్యాస మున వివరింపబడినది.

## సూర్యోదయ వర్ణనలు :

సూర్యోదయ వర్ణన 2 వ ఆశ్వాస ప్రారంభమున గలదు. ఇందు ప్రభాత శోభలు రమ్యముగా వర్ణింపబడినవి. "తమ్ముల యెదనుండి తుమ్మెదలంగూడి చీఁకటుల్ భువినుండి చెదరిపోయె" నన్న పద్యము సహోక్త్యలంకారభాసురమై

1. పోతన చరిత్రము : 8-78

గ్రామీణ ప్రాతఃకాల విధులరుణ శోభలతో పెనవేసికొని యున్నట్లు చెప్పిన విషయమెంతో సహజముగానున్నది. మరొక యరుణోదయ వర్ణన 4 వ ఆశ్వాసమున సింగభూపాలుడు చారుని వలన భోగిని తన యందనురక్తమైయున్నదన్న వార్తవిన్న మఱునాటి వఱువాత గావింపబడినది. "అల యుషస్సను తెరపటమవలి నుండి కమలబాంధవుఁ డత్యంత కాంక్షమెయిని మంచు ముత్యాల తలఁబ్రాలు ముంచిపోసె సిగ్గుమైఁ బద్మినియు దరస్మితము గురియ."[1] అను పద్యభావమెంత మధురమంజులమైనది! ఇచటి 'అట్టుమోడిచి పొదుగంది నాకుచు నిల్చియంభార వళి లేఁగటావు లఱచు' నను పద్యరత్నము సుందర స్వభావోక్తిచే ప్రకాశించుచు దృశ్యములను దర్పణమునందు వలె దర్శింపజేయుచు కవిగారికి గల నిశితప్రకృతి పరిశీలనాపాటవమును వ్యక్తము చేయుచున్నది. ఇట్లే వేరొక ప్రాతఃకాల వర్ణనము 7 వ ఆశ్వాసమున గలదు. శ్రీనాథుని కూతురు శారద దుస్స్వప్నము గని విలపించిన నాటి ప్రభాతమది. ఈ వర్ణన మిచట సందర్భోచిత భావాన్వితమై యొప్పుచున్నది.

## ఉద్యాన వర్ణనలు :

కావ్యమున నుద్యాన వర్ణనలు నాలుగు చోటుల చేయబడినవి. మొదట ప్రథమాశ్వాసమున పోతన తన తలిదండ్రులతో పాల్కురికి జాతరకు పోయి తిరిగి వచ్చునప్పుడు మార్గమధ్యమున నలరు మావితోట వర్ణింపబడినది. బాల పోతనలో కవితాత్మ బయల్పడు నటుల కేసన యా వనమును మనోహరముగా వర్ణించిచూపెను. 'తలలో శలాటువులొ యాకులొ యీఁకలొ....' యను పద్యమున 'చిలుకల చెలువమ్ములు లలిత రసాలఫల లావణ్యమ్ములు' గుఱుతింపరానట్లున్నవని లెస్సగా జెప్పబడినవి. గున్నమావిని ఒంటి స్తంభపు మేడ గావించి దేవతలు గానపరిషత్తును రచించిరని చెప్పిన విషయ మాచార్యులవారి యుదాత్తభావనా శక్తిని చాటుచు బాల రసాల కళావిలాసమును సాక్షాత్కరింప జేయుచున్నది. ఇచటి వర్ణన మెల్ల గున్నమావిని బోలిన యింపు సొంపులు పింపిళ్ళు గూయుచున్నది.

---

1. పోతన చరిత్రము : 4-218

దీని తర్వాత 4వ ఆశ్వాసమున శ్రీనాథ పోతనలు రాచకొండ కరిగినప్పు డచటి పురోద్యాన వర్ణనము శ్రీనాథుని చేత సముచితముగా గావింపబడినది. పిమ్మట సింగనృపాల దర్శనానంతర మతని యుద్యానమునకు బోయి యాతని కోర్కెననుస రించి శ్రీనాథ పోతనలు వేర్వేరుగా నాణువుగా వనవర్ణనము గావింతురు. ఈ వర్ణ నలా యిద్దరు కవుల యభిరుచులను మనస్తత్త్వములను చక్కగా విశదపరచు చున్నవి. తొలుత శ్రీనాథుడు వనశోభలుగాంచి, "ఇవ్వనియె జవ్వనింబోలి...." అని యీరీతిగా వనిని జవ్వనిగా, రామనృపతిగా దర్శించి సరసశ్లేషనానర్చి యాహ్లాదమయము కావించెను. శ్రీనాథుడు రమణులయందు రాజులయందు మక్కువగలవాడగుటచే వనము నిటుల భావించుట మిగుల యుక్తముగా నున్నది. అది సంధ్యావేళ యగుటచేత తదీయ విలసనములు తిలకించి, మబ్బుకన్నియలు నెలరాజును వలపించుటకు చేసిన శృంగార చేష్టలను లోకోత్తరముగా నిటుల వర్ణించెను.

> ''నెలరాజున్ వలపింపఁగా సురనదిన్ నీరాడి చెంగావి దు
> వ్వలువల్ దాలిచి మబ్బుకన్నియలు చెల్వంబొప్పఁగాఁ దారకా
> తిలకంబుల్ ధరియింపఁ జీఁకటికురుల్ దీపింపఁ గ్రీడాసర
> స్సలనన్ గ్రాలెడి నిల్వుటద్దములఁ జూచున్ గన్దొవల్ విప్పఁగన్"[1]

ఓహో! ఎంత ముద్దుగా నడచినదీ పద్దెము! ప్రకృతి సౌందర్యమెంత రమ్యముగా రసవంతముగా చిత్రించి చూపినారాచార్యులవారు! ఇక దాడిమము, నిమ్మపండు, చూతఫలము మున్నగునవెల్ల చక్కగా వర్ణింపబడినవి. నారికేళమును 'మూఁడు కనుల మూసియు మీసములను గడ్డములఁబెనుచు నారికేళసత్ఫల తపస్వి' యనియు, ''పొంగి కైలాసగిరిఁ బాఱు గంగనీరు, కామధేనువు పాలమీఁగడల తీరు మూఁకనుల మూసి ముక్కంటి ముద్రవేసి తీర్థము ప్రసాదమని యిందు దింపి రెవరొ" యనియు బలే చమత్కారము గావించినారు. 'అరవింద మశోకం చ....' యన్నట్లు అరవిందములు మున్నగు పుష్పపంచకము మన్మథగురు ప్రభావము గొప్పగా విప్పిచెప్పుననియు 'తొలిమబ్బు తెరనుండి తిలకించు చుక్కలదొరఁ గాంచి కనుఁగీటుఁ దొవపడంతి' ఇత్యాదిగా సుమాంగనలు హావభావాదులు ప్రకటించి తమ ప్రియులతో క్రీడింపగా "ప్రియవసంత సమాగమవేళ యగుట వనవిలాసిని

1. పోతన చరిత్రము : 4-113.

నూత్నయౌవన మనోజ్ఞశోభ పెనుపొంద, దీరైన సొమ్ముపెట్టి పలపొలయ రాగ మాధురుల్ జిలుక నవ్వు" ననియు వైహిక భోగపరాయణుడును శృంగారప్రియుడు నగు శ్రీనాథుడు వనదృశ్యములను నిజమనస్తత్త్వానురూపముగా శృంగార మయముగా వర్ణించి చెప్పుట యెంతయు సమంజసముగా నున్నది. పిమ్మట పోతన వనవర్ణన చేయుచు,

"దళపుష్పఫలజలమ్ముల నలఘుమతిన్ విశ్వరూపి నర్చించుచు ని
శ్చలవృత్తిఁబొల్చు జన్మసఫలతన్ గనునంచు ననుభవముఁ దెల్పు దరుల్[1]

అని భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నుడగు తానాత్మానుభవానుగుణముగా చక్కగా వక్కాణించినాడు. మరియు నిదే భావనతో మ్రాకులెల్ల తలక్రిందు తపము చేయు చున్నవని వానికిగల సత్త్వపోద్ఘాయములను 'తలక్రిందుల్ తపమున్ బొనర్చు....' నన్న పద్యమున హృద్యముగ వర్ణించెను. ఇట్లే కాసారములు విబుధులను పూజించు చున్నవనియు, 'బాతులపిండు జలములనీదుచున్ మున్గితేలుచు నెఱకలందు నొక్క జలకణమ్మేనియు నొత్తనట్లు వచ్చి దరిఁజేరు సంసారవనధిలోన నంటియంటక మనెడు బ్రహ్మజ్ఞునట్లు' అనియు వర్ణించెను. మరియు విశాల రసాల వృక్షమును వర్ణించుచు ధనికుడు లౌకికానందము నందుననియు, బలవంతుని జూచి లోకము భయపడుననియు, దైన్యరహితుని కభివృద్ధి తప్పదనియు, పేదలను భూదేవియే పాలించుననియు చక్కని నీతి నుద్బోధించినాడు. ఇట్లు భక్తపోతన వనదృశ్యము లలో భక్తిజ్ఞానాదుల దర్శించి యుదాత్తకవిత్వ దర్పణమున ప్రదర్శించెను. కవిద్వయము నోట ఈ రెండు విధముల వర్ణనలు చేయించుటలో వరదాచార్యుల వారు ద్విపాత్రాభినయమొనర్చి సన్నివేశమును మిక్కిలి రక్తికట్టించిరి. ఈ భిన్న దృక్పథము గల వర్ణనల కవితలు "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః యథాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే'' అని చెప్పిన యానందవర్ధనుని శ్లోకములకు తార్కాణమై యొప్పుచున్నది.

ఉద్యాన వర్ణనము చతుర్థాశ్వాసముననే మరొకమారు భోగినీనృత్య ఘట్టా నంతరము శ్రీనాథపోతనలు తమ వనతి యలరు నుద్యానమున విహరించువేళ పోతన చేసినది కలదు. అచట నొక రావిచెట్టున గల గూటిలో తల్లి గోర్వంక తన పిల్ల కాహారమిడుచున్న దృశ్యము చూచి యవ్యాజమగు మాతృప్రేమ నుగ్గ

1. పోతన చరిత్రము : 4-23.

డించుచు పోతన మనోజ్ఞముగా వర్ణించుచు మమతామూర్తియైన తన జననిని స్మరించును.

వనవర్ణనలో పెరటితోట వర్ణన యొకటి చేయబడినది. 8 వ ఆశ్వాసమున బమ్మెరతో శ్రీనాథపోతన లుపాహారము సేవించుచున్న తరి లక్ష్మీశారదలు పెరటి తోటకు నీళ్ళు చేదుటకుపోయి తులసిగద్దెను పూలతోరణాలతో నలంకరించి తోటను వర్ణింతురు. పొట్ల, కట్ల, రాచగుమ్మడి మున్నగు చెట్లను మగువలుగా రూపించి పొట్లకన్నె సమర్తాడినట్లు, పిచ్చుకలు సీతాకోక చిలుకలు పేరంటము వచ్చినట్లు, గుమ్మడి కట్ల పసుపు కుంకుమలలదినట్లు చిక్కుడుతీగ పందిళ్ళ వేదపై నీలాంబరాల పూలపాన్పు వేసి నట్లు, ఆలికులపతి గర్భాధానమొనర్చినట్లు వన్నెబీర బిడ్డలనెత్తి చన్ను గుడిపినట్లు వనితల సాంసారిక జీవిత చిత్రణము సహజ రమణీయముగా జేయబడినది. నవయువతులగు లక్ష్మీశారదలు తమ భావిసుఖమయ జీవితము లూహించుకొని యీరీతిగా ముచ్చటలతో వినోదించి నట్లభివర్ణించుట మిగుల సొగసుగా నున్నది. ఇట్టి పెరటితోట వర్ణన మహాకావ్యము లలో నరుదైనది. ఇట్లు కవిగారు నానావిధ వనవర్ణనలు రమ్యముగా జేసి మహా కావ్యము నత్యంత శోభాయమానము గావించిరి.

## వివాహ వర్ణన :

ద్వితీయాశ్వాసమున పోతన వివాహము శ్రీనాథుని చెల్లెలు నర్సమాంబతో జరిగిన విషయము వర్ణింపబడినది. ఈ వివాహవర్ణనము సవిస్తరముగా సంప్రదాయ బద్ధముగా సరసముగా సాగినది, వివాహవేళ నభ్యంగనము చేయించిన వధూ సౌందర్యమునుగూర్చి 'అభ్యంగనపుజచ్చి యార్చు....” అను పద్యమున “లేమ తారుణ్య నందనారామసీమఁ గంతుఁదెదపొంగ బంగారుబంతులాడ, సకియ సౌఁదర్య దివ్యనిర్ఝరులయందుఁ బ్రేక్షకాక్షి దృఙ్మీనముల్ పెనఁగులాడె' నని యెంతో చక్కగా సభ్యమైన శృంగారవర్ణన చేసి నారాచార్యులవారు. ఏతాదృశ సౌందర్యరాశియగు కన్యను వివాహమండపమునకు రావలసినదని చెలువలనగనే లజ్జాన్వితయైన యామెకు 'కన్నులను వెన్నెలలు గాసె....' అని యిత్యాదిగా మనోజ్ఞముగా వచింపబడెను. వధూశిరముపై బోసిన తలబ్రాలు “ప్రాలో వేణిని మెఱపులచాలో చూపులఁ బ్రసూనచయ వర్షాలో బాలిక నవ్వులరాల్ ముత్యాలో

మోదాబ్ధి శీకరాంబు శ్రీలో"[1] యన ప్రేక్షకులబ్బురపడునట్లు శోభిల్లినవి. సర్వ లాంఛనములతో పాణిగ్రహణమైన పిదప వధువును గూర్చుండబెట్టి చందనము చేతికందించి వరుని పేరుపెట్టి పిలిచి యతని చేతికి పూయుమనగా నామె లజ్జాతిశయముచేత మిన్నకుండిన విషయవర్ణన మెంతో రమ్యముగానున్నది.

> "పలుకుటకు మొగము లేకయు నలుగురిఁ దలయెత్తి సరిఁగనంజాలకయున్
> వలపించు ముగ్ధచేష్టలఁ దలవంపులు పొంది సిగ్గు తానే గెల్చెన్"[2]

ఇచట తలవంపులు పొందియు (ఓడియు) గెల్చుటయన్నది సిగ్గుకే చెల్లినది. ఇటుల వ్రాయు దివ్యప్రతిభ వరదాచార్యులవారికే చెల్లినది.

## విప్రలంభ సమాగమ వర్ణనలు :

ద్వివిధ శృంగారములగు విప్రలంభము, సురతము అనునవి 3వ ఆశ్వాసమున వర్ణింపబడినవి. ఆచార్యులవారీ శృంగార వర్ణనము కడుంగడు చతురముగా హృదయంగమముగా చేసినారు. ఇవి మిక్కిలి సభ్యములై సముచితములై యొప్పుచున్నవి.

పోతనకు ద్వాదశవత్సరవ్రతము పూర్తికాక మునుపే వివాహమయ్యెను. అప్పుడు 'పెండిలి యనఁగనె పోతన గుండెలలోఁ దపము మాట, కోమలికూపోద్దండ సుమాయుధు వేఁటయు రెండంచుల కత్తికోఁత రీతిఁ గలంచినది'. ఐనను 'తండ్రికెదురాడ నోడుచుఁ దరుణి రూప సరస సంపదన్ గూడుచు స్వాంతమందు శ్రీ రఘూత్తమున్ వేడుచు' తుదకు పెండ్లి చేసికొనియుండెను వివాహానంతరము దంపతుల నొక్కటి చేయగా తపోభంగ భీతి కతననే యతడు భార్యతో ప్రణయ విహారము సాగింపక కడు నిగ్రహముతో నాతిగల బ్రహ్మచర్యము కఠోరముగా సాగింపగా నరసమాంబ విరహవేదన పడిన విషయము, తర్వాత వానలో తడియుచు వచ్చిన నరసమాంబను తిలకించి మన్మథపరవశుడై పోతన విఃహార్తిగుందిన విషయము. పిమ్మట నాటి రాత్రి పోతన సతిని గూడి 'డోలత్ప్రణయాంబుధిలో' నోలలాడిన విషయము- ఈ విప్రలంభ సమాగమ వృత్తాంత మెల్ల కడు రమ్యముగా వర్ణించిన తీరు 'రస నిర్వహణము' వ్యాసమున సవిస్తరముగా చర్చింపబడెను.

---

1. పోతన చరిత్రము : 2-254
2. పోతన చరిత్రము : 2-264

## పుత్రోదయ వర్ణనము :

తృతీయాశ్వాసమున నర్సమాంబకు కుమారుడు మల్లన యుదయించినట్లు వర్ణన కలదు. ఐనను పుత్రోదయ వర్ణన పోతన జన్మించిన ఘట్టముననే ప్రధానముగా గలదు. లక్కమాంబకు ఆంధ్ర శారద యదృష్టమన వ్యాసాంశతో పోతన జన్మించెను. బ్రాహ్మముహూర్తమున క్షోణి మేల్కొలుపు కవియన చుక్కపొడిచిన పిదప బాలుడుదయించెను. అప్పటి సమయమెంతో శుభముగా ప్రశాంతముగా నుండెనని 'శుక భరద్వాజ ద్విజకులమ్ము శ్రుతిబాడె' నన్న పద్యమునను, 'ప్రాచీ దిశాంగన ప్రసవించె మేరువున్' అన్న పద్యమునను వర్ణింపబడెను. బాలుడుదయించిన ప్రశస్త వేళావిశేషమును వివరించి చెప్పిన విషయ మాచార్యులవారి జ్యోతిశ్శాస్త్ర వైదుష్యమును వ్యక్తము చేయుచున్నది. జ్యోతిషులు పుట్టిన బాలుని జూచి "కవి గురువులందు మౌఢ్యముగలదుగాని, యితని మదిలోన లేదది యింతయేని, శశియశమ్మునకైనమచ్చగలదేమొ కాని, యీ కళానిధి నద్ది గానఁబోము"[1] అనియు, "బాలకుఁ డతులప్రతిభాశాలి యగున్ వీని నెదురఁ జతురాననుఁడున్ గేలియగున్ ఫణిపతియున్ వేల శిరములూఁచి మెచ్చు వీని చరిత్రల్"[2] అనియు జాతకరీతి నరసి మహాశ్చర్యమగ్నులగుచు గొప్పగా దీవింపగా జాతకర్మము జరిగినది.

## ప్రయాణ వర్ణనలు :

భాగవతము నంకితముగొను వాంఛతో సింగనృపతి యంపగా పోతనను తోడ్కొనిపోవుటకు తత్సేనాపతి సైన్యముతో బమ్మెరకు చేరబోయిన ప్రయాణ వర్ణన సప్తమాశ్వాసమున కావింపబడినది. ఈ యాశ్వాసముననే నారయాదులు రాచకొండకు జేసిన ప్రయాణమును సింగభూపాలుడంపగా శ్రీనాథుడు సపరివారముగా బమ్మెరకు విచ్చేసిన ప్రయాణమును వర్ణింపబడినది.

## ముని వర్ణనలు :

ప్రథమాశ్వాసమునందలి కావ్యోపక్రమమున నారదుడు త్రిలోక సంచారము చేయుచు కాశికి చెంత వెలుగు వ్యాసమున్యాశ్రమము సందర్శించినప్పుడు తదాశ్రమ

---

1. పోతన చరిత్రము : 1-116
2. పోతన చరిత్రము : 117

వర్ణనము, ఆ మునీంద్రుని మహానుభావము రమ్యముగా వర్ణింపబడినవి. మరొక మునివర్ణన చిదానందునికి చెందినది. ద్వితీయాశ్వాసమున పచ్చికబయలులో పోతన సందర్శించిన చిదానంద యోగీశ్వరుని వర్ణన చక్కగా చేయబడినది.

## కన్యాంగ సౌందర్య వర్ణనలు :

సప్తమాశ్వాసమున శ్రీనాథుడు బమ్మెరకు పయనమై మార్గమధ్యమున మావితోటలో విడిసినప్పుడు చేరవచ్చిన జంగమకన్యా సౌందర్యవర్ణనము కడు చమత్కారముగా జేయబడినది. శ్రీనాథు డబ్బురపాటుతో నామెను వర్ణించి సంభాషించెను. ఈ విషయము కొంత 'రస నిర్వహణము' వ్యాసమున తెలుపబడెను.

అష్టమాశ్వాసమున శారద యంగసౌందర్య వర్ణన చేయబడినది. ఇచట నామె యంగ సౌందర్యముతో బాటు ఉదయద్యౌవన యగు నామె లజ్జానురాగ విలసితమైన యంతరంగ సౌందర్యము రమణీయముగా వర్ణింపబడినవి. అట్లే ద్వాదశాశ్వాసమున రుక్మిణీకన్యాంగ సౌందర్యము, మానసికస్థితి మధురమంజులముగా వర్ణింపబడినవి.

## యుద్ధ వర్ణనలు :

మహాకావ్యమున యుద్ధవర్ణలు ఐదు తావులలో గలవు. ఇవి కడు చతురముగా నిర్వహింపబడి వీర రౌద్ర భయానకాద్భుత బీభత్స రసములను చక్కగా పోషించుచున్నవి. 9 వ ఆశ్వాసమున కన్నడ వీరులు భాగవతమును హరించుకొని పోవుచుండ చారులవలన తెలిసిన రాచకొండ తెలుగు సైన్యములు వారిపై దాడి వెడలి చేసిన యుద్ధము వర్ణింపబడినది. ఇందు తెలుగు వీరుడు కన్నడ సైన్యముతో చేసిన వీరాలాపములు పిడుగులు రాలినట్లు మిక్కిలి భీషణములై యరుల గుండెలను ప్రక్కలించునవైయున్నవి. బెట్టిదముగా జరిగిన యుద్ధము కనులకు గట్టినట్లు వర్ణితమైన పిదప,

> "వసుధ జయలక్ష్మి తెల్గుల వసమగుటయుఁగనడ వీరర్యులసూయన్
> బసమించు రంభ గలియఁగ నసిధారావ్రతము లంటి యరిగిరి దివికిన్."[1]

1. పోతన చరిత్రము : 9-178

అన్నారాచార్యులవారు శత్రువులు కత్తికెరయై వీరస్వర్గమలంకరించి రనుటకు అసిధారావ్రత మొనర్చి రంభను గూడ బోయినారని చెప్పిన మాటలోని చమత్కారము కడు రమ్యమైనది. మరియొక యుద్ధము సప్తమాశ్వాసమున వర్ణింపబడినది. సింగభూపతి సేనాపతి సైన్య సమేతముగా వచ్చి భాగవతము బల్మిమెయి గొనిపోవు వేళ బమ్మెరలోని యొక యువక వీరుడు వారితో మహాద్భుతముగా కర్రయుద్ధము చేసి అరిమూకను ఛిన్నాభిన్నము చేయును. అదేసమయమున మందనుండివచ్చి భీకరసూకర మొకటి పరమాద్భుతముగా సైన్యముతో పోరాడి సంక్షోభము పుట్టించి యా సైన్యము చెల్లాచెదరై పారిపోవునటుల జేసి భాగవతము పోతనకు దక్కించును. అది యాదివరాహమేయై యుండునని శత్రువులు సైతము మ్రొక్కిరి. ఇచట యువక వీరుడు చేసిన కర్రసాము యుద్ధము మహాకావ్యములలో నపురూపమైనది.

మరొక మూడు యుద్ధములు కావ్యానుబంధమునగల భాగవత గాథలలో వర్ణింపబడినవి. అందొకటి 11వ ఆశ్వాసములోని రామ రావణ యుద్ధము. ఇది సంగ్రహ వర్ణనతో నొప్పినది. రెండవ యుద్ధమిదే యాశ్వాసమున యజ్ఞవ రాహ హిరణ్యాక్షులకు జరిగినది కలదు. ఇది మహా భయంకరముగా సాగినది. హిరణ్యాక్షుడు యజ్ఞవరాహమును జూచి హేళనగా నవ్వి "సూకర! దోర్యుగంపునానస యణగారు, నీ కపటనాటకపుంబని దీరు" నన్నాడు. వాడు క్రోధావేశముతో నన్నను వ్యంగ్యార్థము భాసించి వాని భుజబల మణగారి వరాహావతారము పని తీరినది. ఇక మూడవ యుద్ధము 12వ ఆశ్వాసము నందలి గజేంద్ర మోక్షణ కథలో కరిమకరములకు జరిగినది. ఈ ఘోర యుద్ధము నాచార్యులవారు మిగుల సుస్పష్టముగా కనులకు గట్టినట్లు రసభావోదాత్తత వెలుగ వర్ణించిరి. ఇచటి యుద్ధ వర్ణన భాగవతము నందలి గాథలోని దానికంటె నుదాత్తముగా సాగినదనుట యతిశయోక్తికాదు. మొసలి గజేంద్రుని పాదము కఱిచి పట్టుకొన్న దృశ్య మీ క్రింది పద్యములలో నెంత విశదరమ్యముగా పొల్చుచున్నదో తిలకింప వచ్చును.

> చురకత్తుల బోల్ దంష్ట్రిలు వర్క్రకచముఁగేరు పల్లువరుసల మధ్యన్
> గఱకాకుఱాయియైన మకరినాలుక నారకపు ముఖద్వారమనన్''[1]

> "ఆస్య వివరమందు నగ్గికుంపటిలోని మంటలట్లు మెఱయు మకరి నాల్క
> దారుసన్నిభంబు దంతావళ పదంబు నంటుకొనియె మేన మంట లెక్క"[2]

1, 2. పోతన చరిత్రము : 12-22, 23.

మరియు 'నక్రమ్ము వక్రమై' యను పద్యమున మొసలి పెనుగులాట, "నాగమ్ము నగమయి" యను దానిలో నేనుగు పోరాటము కడు మనోజ్ఞముగా వర్ణింపబడినవి. సహస్ర వర్షములు జరిగిన యుద్ధములో "బట్టఁబిండినట్లు బలమెల్ల నశియించి పీనుఁగట్టు లయ్యెనేనుఁగపుడు, రక్తమెల్లఁ ద్రావి రంజిల్లు మకరమ్ము నేకుపోయి మదపుటేనుఁగయ్యె"[1] అని వర్ణింపబడినది.

ఇట్లు కావ్యము నందలి యుద్ధవర్ణనలెల్ల వీరభయానకాది రసములకు నిధానములై కథను పరిపుష్టము పటిష్ఠము కావించి యాచార్యులవారి కృషిని విజయవంత మెనర్చినవి.

## నాయకాభ్యుదయ వర్ణనము :

దశమాశ్వాసమున పోతన భాగవత కృతి సమర్పణోత్సవము జరిపిన సందర్భమున నాయకాభ్యుదయ వర్ణన కావింప బడినది. పోతన ఒంటిమిట్టలో శ్రీరామచంద్రుని సన్నిధి నివసించినవాడై జీర్ణోద్ధరణమైన భాగవతకృతి నా దేవదేవునికి సమర్పణోత్సవము చేయబూనిన విషయము శ్రీనాథునికి తెల్పగా కృతిసమర్పణోత్సవము తాను వైభవముగా జరిపింపగలనని కర్ణాట చక్రవర్తి ప్రౌఢదేవరాయలు కబురంపును. రాజుల మదాంధత నెఱిగిన వాడగుటచే పోతన యీ విషయము శంకింపగా శ్రీనాథుడు "భావుకా! సకల రాజన్య లోకంబునకు నీ యకళంక చరిత్రంబు కనువిప్పు కలిగించెను తమ బలంబుకన్న దైవబలం బెక్కువయని గ్రహింప గలిగిరి. దైవభక్తుని దేవేంద్రుడేని నిర్జింపలేడను నిజము నెఱిగిరి...." అని శంకానివారణ మొనర్చి కొనియాడి రాయల కోర్కెను సమ్మతింప జేసెను. పోతనను వేధించిన సింగనృపాల ప్రౌఢ దేవరాయలు పశ్చాత్తప్తులై యొకరు జీర్ణ భాగవతోద్ధరణార్థము భూరిధనము బమ్మెర కంపగా మరొకరు తామే నిలబడి శ్రీరామాంకితముగా కృతిసమర్పణోత్సవము గావించుటతో నాయకుడగు పోతనకు విజయము, అభ్యుదయము సమకూడెను. ఈ వర్ణనమెల్ల ఆనందసంధాయకముగా సాగినది.

---

1. పోతన చరిత్రము : 12-33,

## ఇతర వర్ణనలు :

మహాకావ్యమున ప్రాబంధికములైన యష్టాదశాది వర్ణనలేకాక యితరము లగు ననేక వర్ణనలు సందర్భానుసారముగా రమ్యముగా జేయబడినవి. అట్టి వర్ణనలకెల్ల మకుటాయమానమైనది భోగినీ నాట్యవర్ణన. దీనిని గూర్చి ప్రత్యేక వ్యాసమున చర్చించుట జరిగినది. మరొక విశిష్ట వర్ణన గోదావరీ నదికి చెందినది. పంచమాశ్వాసమున పోతన యగ్రజునితో గూడి శ్రాద్ధవిధి నిర్వహింప గోదావరికేగినప్పుడు తెనుగునాటి జాహ్నవియన నొప్పు ఆ నదీమతల్లిని పోతన భక్తితో వినుతించినట్లు వర్ణింపబడినది, ఈ వర్ణనము సుదీర్ఘమై ౭౫ పద్యాలలో విస్తరించి యున్నది. అందు పావన గౌతమీ శోభామహత్వములు మిక్కిలి మనోజ్ఞముగా నుదాత్తభావ బంధురముగా వివరింపబడినవి. ఈ విపుల హృద్య వర్ణన ఆచార్యుల వారికి తెలుగు నేలపైన తెలుగు గంగపైన గల యత్యంత భక్తి తాత్పర్యములను వ్యక్తము చేయుచున్నది. అంతేకాక పోతన తాను మున్ను 'మాధవునిన్ వినుతించి ముక్తుఁడై యుండక నే సుధన్ విడిచి యుబ్బి సురన్ గొనినట్లు భోగినీ దండక మల్లి రాజ్యమదదర్పున కర్పణ సేసితి'నని చింతించి భోగినీ వినుతిచే పంక కళంకితమైన యసద్రసనము పూతమౌటకు నింత విస్తరముగా గంగా భవానిని వినుతించుట యెంతో యుక్తియుక్తముగా నున్నది.

"హరిచరణ మజుఁడు గడిగిన హరుఁడౌదలఁ దాల్చి తాపమార్చు
కొనిన పెన్
వఱద వఁట, భక్తకామిత వరద వగుట కేమిలోటు వరధుని గంగా"[1]
అనియు,

"శ్రీశు పదసరోజమ్మంటి చిల్కు తేనె నీశు పృథు శిరోజములైన
యెఱుపు తేంట్లు
తెచ్చి తెట్టెగా నిడికొనఁ దెరువరియయి కాచిపోసె భగీరథ ఘన తపోగ్ని[2]"
అనియు

---

1, 2. పోతన చరిత్రము : 5-38, 39

భాగీరథీ మహిమ పావిత్ర్యములు లెస్సగా రూపించి చెప్పబడినవి. గంగా తరంగణీ సౌందర్య మీ పద్యమున నెంత ప్రతిబింబించుచున్నదో తిలకించి పులకించవచ్చును.

> "కొమ్మలు చామరమ్ము లిరుగోనల వీచుచు నుండి పుష్ప వ
> ర్షమ్ములు గొట్ట, భూమిరుహ సంహతు లిట్టటు నిల్చి యాతప
> త్రమ్ములు బట్ట, రేఁబవలుఁ దారలు దారులు చంద్ర సూర్యులున్
> సొమ్ములు బెట్ట నంబరము సొంపుల చీరలుగట్టి రాణివై "[1]

శోభిల్లుచున్నావని వినుతింపబడినది. మరియు 'కలశపాథోరాశి క్రాగు పొంగును ద్రోసి యురికి వచ్చిన పాల నురువువేమొ' యను పద్యమున ప్రయోగించిన యుత్ప్రేక్షలు కడు రమ్యములై గంగామల్లి ఘనతను చాటుచున్నవి. ఇట్లనేక విధముల తదీయ సౌందర్యము విశిష్టత కనులకు గట్టినట్లు మనోహరముగా వర్ణింపబడినవి. ఇందలి పద్యములన్నియు నభంగ గంగా తరంగ రంగ త్ప్రవాహము వలెనే శంభద్భంగిమలతో గంభీరముగా సాగినవి.

మరొక మనోజ్ఞ వర్ణన ఓరుగంటి శిల్ప సౌందర్యమునకు చెందినది. నవ మాశ్వాసమున శ్రీనాథ పోతనలు తిప్పన గూర్చి యోరుగంటికేగినపుడచట చెడిపడియున్న కోటలోని శిల్పఖండముల నా యిరువురు వర్ణించినట్లు చెప్పబడినది. ఇచటి వర్ణన సజీవములో యనునట్లున్న శిల్పముల పరమ సౌందర్యమును, రాతి నంది, కుడ్య స్తంభములు మున్నగువాని సోయగము లెస్సగా కనులకు గట్టినట్లు చేయుచున్నది.

> "శిల్పలోకాశ్రితుల్ జీవకళాస్ఫూర్తి సతతముండెదరిట మృతియె లేదొ,
> ....శిల్పి యులిదెబ్బ తోడ శాసింపఁబడిన
> యీ మహీతల స్వర్గ మహీన కళల
> జన్మ మృత్యు జరామయ క్షామములను
> బ్రహ్మ సృష్టిలోఁ గల్గు లోపములఁ దీర్చె."[2]

అని శ్రీనాథుడు శిల్ప ప్రాశస్త్యమును కొనియాడును.

---

1. పోతన చరిత్రము : 5-53
2. పోతన చరిత్రము : 8-244

"గండ శిలల్ త్రిమూర్తులయి క్రాలఁగ శిల్పవినోద వేదమున్
బండలఁ దొల్చి పాతమిడు బ్రహ్మకు నీకు జగత్తులో 'గుడీ
గుండము' లేని దీనదశ గూరెనె? యూరును బేరు నానవాల్
రెండును జెక్క నక్షరములే కఱవా? బరువా? కళానిధీ!"[1]

అని కళాబ్రహ్మ యగు శిల్పిని పోతన ప్రశంసించును.

"పొలపుఁగట్టె తా గొడ్డలి పొట్టఁ జొచ్చి కులపుఁ గట్టెల నన్నిటి
గూల్చినట్లు
హైందవుండె తౌరుక్యుని యండఁ జేరి జాతి విద్రోహచర్యలు సల్పెనిటుల."[2]

అని హైందవజాతి యవివేక విద్రోహ చేష్టల వలన తురుష్కులు ముక్కలు చేసిన శిల్పఖండముల జూచి పోతన పరితపించును; ఇచట ఖండిత శిల్పముల దుర్గతి హృదయము ద్రవించునటుల వర్ణింపబడినది.

ఇతర వర్ణనలలో మరికొన్నిటి నిట తిలకింతము. 1వ ఆశ్వాసమున పోతన జననీ జనకుల వర్ణనము వారి యుదాత్త గుణ వ్యక్తిత్వములు తెల్పుచు చక్కగా జేయబడినది, 2 వ ఆశ్వాసమున నిరుపేద జవరాలి దుస్థితి కరుణరస భరితముగా నామె రూపము, దైన్యము, గుణశీలములు వర్ణింపబడినవి. ఇదే యాశ్వాసమున బమ్మెరకు చేరవచ్చిన శ్రీనాథుని యెడ్లబండి వర్ణనము కడు మనోజ్ఞముగా నుదాత్తముగా నున్నది. బండికి బూన్చిన యెడ్ల వర్ణన "హరుని పేరురమునా నలరారు ముఖసీమఁ బన్నత్రాళ్ళు ఫణులయి పెనఁగులాడ...." అను పద్యమున లెస్సగా గావింపబడినది. మెలమెల్లగా వచ్చి నిలిచిన యా బండి యిట్లు వర్ణింప బడినది.

"చకచక గిత్తల కదుముకుత్రకిట ధికిట ధకిట ధా మృదంగధ్వని టక్
టికు మను కేదారాహతి నికట తటిని శకట మొకటి నిల్చిన యంతన్."[3]

ఇందలి శబ్ద రామణీయకమే బండి రాకను ప్రత్యక్షపరచుచున్నది. ఇక 5 వ ఆశ్వాసమున క్షామవర్ణన కలదు. దారుణమై హృదయ విదారకరమైన కఱవు

1. పోతన చరిత్రము : 8-255
2. పోతన చరిత్రము : 8-251
3. పోతన చరిత్రము : 2-158

పరిస్థితిని చక్కగా వ్యక్తము చేయుచున్నదిది. అదే సందర్భమున బమ్మెరకు వచ్చిన భిక్షువు వర్ణన కలదు. అది వాని దైన్య స్వరూప స్వభావములను దర్పణములో వలె ప్రదర్శించుచు నితాంత కరుణరస భరితమై సాగినది. 7వ ఆశ్వాసమున నారయాదులు రాచకొండ కేగుచు నడవిలోని వటవృక్షమును వర్ణించిన 'పచ్చల పర్వతంబొ ధరఁ బట్టిన చల్లని యాతపత్రమో' ఇత్యాది పద్యములు మిగుల హృద్యములై యున్నవి. ఈ యాశ్వాసముననే నారయాదులు సింగభూపాలుని వృద్ధ కంచుకి వృద్ధాప్యమును వర్ణింతురు. రాజసభా వర్ణనము గావింతురు. శ్రీనాథునికి మార్గమధ్యమున దర్శనమిచ్చిన జంగమ కన్యా వర్ణన మిందే కలదు. అష్టమాశ్వాసమున లక్ష్మితో పందెము వైచి శారద చేదతో నీరు తోడిన 'కంకణ కింకిణీ క్వాణ ఝణంకృతుల్ గిరక గానములకు స్వరములల్ల' అన్న పద్యములోని వర్ణన మాంధ్ర కావ్యములందపూర్వమై యొప్పుచున్నది. మరియు కావ్యమున శ్రీనాథుడు (4-62, 7-289), పోతన (4-63), రామ శర్మ (6-123) పుష్ప లావిక (4-24), మోహిని (11-122-124, 133) ఇత్యాదిగా నాయా పాత్రల రూపరేఖల వర్ణన కడు మనోజ్ఞముగా గావింపబడినది. ఇవియే కాక కావ్యమున వరాహము (7-226), యజ్ఞవరాహము (11-185, 186), అశ్వగమనము (9-159-162) కీర రాయబారము (12-231-244), రుక్మిణీ సందేశ హరణము (12-251-275) మున్నగు వర్ణనలు మనోజ్ఞముగా గావింపబడి యున్నవి. ఇంతేకాక నవమాశ్వాసమున హేమంతములోని సంక్రాంతి వర్ణన శోభాయమానముగా సాగినది. 'మెఱుఁగు వాకిళులను మేఘమండలముల ముగ్గు విద్యుల్లతల్ మురిసియాడ' అని యిత్యాదిగా నత్యంత రమణీయముగా తెలుగువారి పండుగ వర్ణింపబడినది.

నవమాశ్వాసమున పోతన కావించిన తిరుపతి మున్నగు పుణ్యక్షేత్రముల వర్ణనములు విపులముగా మనోజ్ఞముగా గలవు. 11, 12 ఆశ్వాసములలో అనుబంధముగా రామచరితము, మోహిని అవతారగాథ, వరాహావతార కథ, నరసింహావతార కథ, గజేంద్రమోక్షణ కథ, కృష్ణావతార కథ, రుక్మిణీ కల్యాణ కథ కడుంగడు రమ్యముగా వర్ణింపబడినవి. ఇట్టి లౌకిక వర్ణనలే కాక భగవన్నుతి, ఉపదేశాదులవంటి యలౌకిక వర్ణన లనేకము చతురముగా జేయబడినవి. ఇవి యాచార్యులవారి భక్తి జ్ఞానములను వేదాంతాది శాస్త్రముల పరిజ్ఞానమును లెస్సగా విశదము చేయుచున్నవి. ఇందు ముఖ్యముగా పోతన శ్రీనాథున కొనర్చిన వైరాగ్య

బోధ (ఆ. 3. 325-335), మానవ జీవిత స్వరూపము (ఆ. 5. 67-75), నర్సమాంబ చేసిన దుర్గాదేవి ప్రార్థన (ఆ. 3. 126-133) చిదానంద గురుస్తుతి (ఆ. 6. 29-43) తిరుపతి వేంకటేశ్వర స్తుతి, (ఆ. 9. 234-242). భాగవత తత్త్వోపదేశము (ఆ. 6. 51-70), శ్రీశుకుడు పరీక్షిత్తునకు జేసిన జ్ఞానబోధ (ఆ. 10. 95-118) మొదలగునవి కలవు. ఈ వర్ణనలన్నియు నత్యంత హృదయంగమములై సుబోధకములై యవశ్య పఠనీయములై యున్నవి.

ఇందలి వర్ణనలు నాతి దీర్ఘములైన వనుటకు నే వర్ణనను పరిశీలించినను సాధారణముగా నైదు పది పద్యముల పరిమితిలోనే యున్నట్లు గమనించగలము. బమ్మెర గ్రామము 10, రాచకొండ నగరము 11, పర్వతము 10, వసంతము 10, వర్షము 12, శరత్తు 13, హేమంతము 8, చంద్రోదయము 8, నర్సమాంబ విప్రలంభము 16, పోతన విప్రలంభము 12, శ్రీనాథ పోతన కృత వనవర్ణనలు 10, 12, యుద్ధము 17 పద్యములలో వర్ణింపబడియున్నవి. పోతన వివాహ వర్ణన మాత్రము 41 పద్యములలో సవిస్తరముగా చేయబడినది. ఇందు గృహాలంకరణ మొదలుకొని వధూవరుల సింగారము, వివాహము, నాకబలి, అప్పగింతల వరకు గల వివాహ సంబంధమైన సాంప్రదాయికమైన తంతునంత వర్ణించుటచేత నింత దీర్ఘమైనది. ఐనను నిది సహృదయపర్వమై చొక్కమైనదే కాని వెక్కసమైనదే మాత్రము కాదు. దీర్ఘ వర్ణనలలో గౌతమీవర్ణన యొకటి. ఇది 25 పద్యముల విస్తృతి కలది. పోతన యసద్రసన పావన మగుట కతనిచేత నింత వర్ణింపజేయుటయే కాక ఆచార్యులవారికి తెలుగునాటి జాహ్నవిపైగల ప్రత్యేకాభిమానము వలన నింత పొడవైనది. ఇదియు కడు మనోహరమైనదే కాని విసుగు పుట్టించునది కాదు. మరొక దీర్ఘవర్ణన యోరుగంటిలో చెడిపడిన శిల్పముల సౌందర్యమును గూర్చినది. ఇది వేర్వేరుగా శ్రీనాథ పోతనలాత్రితో 23 పద్యాలలో చేసినది. ఇట్లు కారణాంతరములచేత రెండు మూడు కొంత పెద్దవైనను ప్రాయికముగా వర్ణనలెల్ల మితముగా హితముగా చేయబడియున్నవి.

ఇందలి వర్ణనలు చాలవరకు కథకు విడదీయరాని సంబంధము కలిగి కథా విషయములలో లీనమై యొప్పారి యున్నవి. దీనికి బమ్మెరగ్రామ రాచకొండ నగర వర్ణనలు, ఋతువర్ణనలు, సూర్యచంద్రోదయ వర్ణనలు, వనవర్ణనలు మున్నగునవి యనేకములు తార్కాణలు. తక్కినవైనను కృతకముగా తెచ్చిపెట్టినట్లున్నవి కాక సందర్భశోభితములై పొంది పొసగి యొసగి యున్నవి.

కావ్యమున నే వర్ణన చూచినను కవిగారి నిశిత పరిశీలన, నితాంతమథనము జరిగినట్లవగత మగును. ఒక దానిని వర్ణించినప్పుడు సర్వకోణముల నుండి సందర్శించి గంభీరమైన యున్నతమైన భావరత్నములచేత భూషించుచు తమ భవ్యకవితా దర్పణములో నిండుగా సాక్షాత్కరింపజేయుట యాచార్యులవారి ప్రత్యేకత. దీని కిందలి యే వర్ణనయైనను మచ్చుతునుకయే. మరియు వర్ణనలను వొడినుడులతో గాక రసార్ద్రముగా నొనర్చి యాస్వాద్యముగా నందించుట యిందలి విశిష్టత.

పోతన చరిత్రమున గల బహువిధ వర్ణనలు తిలకించగా మహాప్రబంధము లందును నిటుల విపుల వర్ణనలున్నట్లు కానబడవు. ఇందలి యొక్కొక్క వర్ణిత దృశ్యము రమ్యచిత్రము వేయదగినట్లున్నదనియు నిదొక చిత్రమయ కావ్యమనియు సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారు పండితాభిప్రాయములో కొనియాడిరి. ఇందలి వర్ణనల గూర్చి "ఈ వర్ణన లన్నియు శ్రీమదాచార్యులవారి ప్రకృతి పరిశీలనమును, భావనా శక్తిని, పూర్వమహాకవి కావ్యపరిచయమును వ్యక్తము చేయుచున్నవి."[1] అని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారును, "వర్ణనా బాహుళ్యమునకు వాసికెక్కిన ప్రాచీన ప్రబంధములందైన నిందలి వర్ణన ప్రాచుర్యము గోచరింపదనవచ్చును."[2] అని డా॥ పల్లాదుర్గయ్యగారును వినుతించి యుండిరి. ఏతన్మహా కావ్యవర్ణిత రమణీయ దృశ్యముల నెన్నిమారులు తిలకించి నను తనివి తీరదు. వర్ణనలను విడిగా ప్రచురించిన ననేక మనోజ్ఞ ఖండకావ్య రత్నములుగా ప్రకాశింపగలవు.

ఈ విధముగా మహాకావ్యము నందలి వర్ణనలెల్ల రసభావ పరిపూర్ణములై శబ్దార్థ చమత్కార శోభితములై ధ్వనిగర్భితములై మిగుల నౌచితీ భాసురములై యొప్పుచు కథాగత విషయములతో నవినాభావ సంబంధము కలిగి నిసర్గ సుందర ములై సహృదయ హృదయావర్జకములై విలసిల్లుచున్నవి. ఆంధ్ర మహాప్రబంధ ములలో పోతన చరిత్రము సర్వాంగ సుందర పరిపుష్టముగా నభివర్ణితమై విరాజిల్లు చున్నదనుటలో నతిశయోక్తి లేదు.

---

1. పోతన చరిత్రము : 'తొలిపలుకు' పుట viii.
2. పోతన చరిత్రము : 'కవి కావ్యపరిచయము' పుట 85.

# నాటకీయత

దృశ్య శ్రవ్య భేదము చేత నిరుతెరగులైన కావ్యములకు అనేకములైన వైధర్మ్యములున్నను గణనీయములైన సాధర్మ్యములును గలవు. దృశ్యకావ్యములగు రూపకములు రంగస్థలముపై పాత్రధారులు నటించి ప్రదర్శింపగా చూచి యానందింపదగినవి కాగా శ్రవ్యకావ్యములు చదివి విని యానందింపదగినవి. ద్వివిధ కృతులకు గల యీ ప్రధాన భేదమే వాని రచనా విధానములను రూపొందించినది. దృశ్యకావ్యములు రంగస్థలముపై ప్రదర్శించుటకు వీలుగా తదనుగుణమైన యనేక లక్షణములు రచనా స్వరూప స్వభావములకు సంబంధించి యేర్పడినవి. రంగములు, సన్నివేశములు, చతుర్విధాభినయములు, పాత్రల ప్రవేశ నిష్క్రమణాదులు నాటకములకు ననివార్యములై యున్నవి. ఇవి శ్రవ్య కావ్యముల కత్యావశ్యకములు కావు. ఇవి లేక పోవచ్చును కాగా దృశ్యశ్రవ్య కావ్యములకు గల సాధర్మ్యములలో నితివృత్తము, నాయికానాయకాది పాత్రలు, రసపోషణ, పాత్రపోషణ, సంధి సంధ్యంగఘటనము. వర్ణనాదులు, ధర్మోపదేశము మున్నగునవి ప్రధానమైనవి.

ఉభయకావ్య సాదృశ్యమింతగా నుండుట వలననే యాలంకారికులు కావ్య లక్షణములు చెప్పుచు నుపర్యుక్త విషయములు రెండింటికి సమానమని యభేదముగా చర్చించిరి. ప్రప్రథమమున వెలసిన నాట్యశాస్త్రమున భరతుడు నాటకములకు చెప్పిన యితివృత్త రసాది లక్షణములు శ్రవ్యకావ్యములకు చెందునని యుల్లేఖించిరి. కావ్యము దశరూపాత్మకమే యని అభినవగుప్తుడిట్లు వచించెను. "అన్యేతు కావ్యేపి గుణాలంకార సౌందర్యాతిశయ కృతం రసచర్వణ మాహుః, వయంతు బ్రూమః కావ్యం తావన్ముఖ్యతో దశరూపాత్మకమేవ"[1] అనగా 'కొందరు కావ్యమునందలి గుణాలంకార సౌందర్యాతిశయములనే పరిగణించి రసము నాస్వాదింతురు. కాని ముఖ్యముగా కావ్యము దశరూపాత్మకమనియే మా మతము' అని అభినవగుప్తుడు వచించెను. మరియు.

---

1. అభినవ భారతి : 1-291

"కావ్యేపి నాట్యాయమాన ఏవ రసః। కావ్యార్థ విషయేహి ప్రత్యక్ష కల్ప సంవేదనోదయే రసోదయః ఇత్యుపాధ్యాయాః"[1]

"కావ్యము నందును రసము నాట్యాయమానమే యగును. కావ్యార్థ విషయములో సైతము ప్రత్యక్ష కల్పమైన అనుభవోత్పత్తి మూలముననే రసోదయము సాధ్యమగును." అనియు,

"ప్రయోగత్వమనాపన్నే కావ్యే నాస్వాద సంభవః
వర్ణనోత్కలికాభోగ ప్రౌఢోక్త్యా సమ్యగర్పితాః
ఉద్యానకాంతా చంద్రాద్యా భావాః ప్రత్యక్షవత్ స్ఫుటాః"

"ప్రయోగత్వస్థితి వచ్చువరకు కావ్యరసాస్వాదము సాధ్యము కాదు. ప్రౌఢోక్తితో ఉద్యాన కాంతా చంద్రాదులను ప్రత్యక్షమగునట్లు స్ఫుటముగ వర్ణించినప్పుడు కావ్యమునకు నాటకము యొక్క ప్రయోగత్వస్థితి వచ్చును"- అనియు నభినవ గుప్తుడు వివరించెను.

ఈ వాక్యముల వలన శ్రవ్యకావ్య రసాస్వాదము, ఆ కావ్యము నాటకీయ శిల్పముచేత విలసిల్లినప్పుడే సాధ్యమగునని తేటపడుచున్నది. కావున నాటకీయత సంతరించుకొన్న కావ్యమే మిక్కిలి రమ్యమై రసవంతమై సహృదయ హృదయా వర్జకము కాగలదు.

## నాటకీయత - దాని ప్రాముఖ్యము

శ్రవ్యకావ్యములందు చతుర్విధాభినయములు, పాత్రల ప్రవేశ నిష్క్రమణములు మున్నగు దృశ్యకావ్య సంప్రదాయ సముదాయమును సంఘటింపజేసినచో అది నాటకీయత లేదా నాటకీయ శిల్పము అనబడును. నాటకీయతను, దాని విశిష్టతను విశదీకరించుచు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారిట్లు వ్రాసిరి.

కథాకథన శిల్పమునఁ బాటింపఁబడు ననేక ప్రక్రియలలో నాటకీయరచన యొకటి యని విమర్శకులు గుర్తించియుండిరి. శ్రవ్యకావ్యమునందు కవిగాని, కథకుడుగాని స్వయముగాఁజెప్పు కథాంశములను తగ్గించి పాత్రల సంభాషణముల కధిక ప్రాధాన్యము కల్పించి, సన్నివేశమున రూపకరచనా ప్రక్రియలోని

1. అభినవభారతి : 1-290

వివిధాంశములను జొప్పించి రచించుట నాటకీయ రచనమని విజ్ఞులు భావించుచున్నారు "[1]

శ్రవ్యకావ్యమున కవి స్వయముగా చెప్పునట్టి కథాంశములను తగ్గించి తరచుగా పాత్రల సంభాషణల ద్వారా కథను సాగించి ఆహార్యాద్యభినయములు మున్నగు రూపకరచనాంశములను ప్రవేశపెట్టినచో దానిని నాటకీయత యందురనియు, కావ్య కథాకథన శిల్పమున పాటింపబడు ప్రక్రియలలో నిదియొకటి యనియు స్పష్టమైనది.

నాటకీయత యనునది 1. ఇతివృత్త కల్పన.

2. కావ్యముయొక్క ఆద్యంతముల స్వరూపము.

3. సన్నివేశ శిల్పము.

4. చతుర్విధాభినయములు.

5. పాత్ర పోషణము.

అనువాని చేత ముఖ్యముగా పరిఢవిల్లును. పూర్వ మహాకవులలో తిక్కన పెద్దన తిమ్మన సూరన మున్నగువారి నాటకీయతను తమ కావ్యములలో ప్రశస్తముగా శోభిల్లజేసి యుండిరి. కావ్య సామాన్యములలో కంటె వస్త్వైక్యము, ఏకనాయకము, అను లక్షణములు గల ప్రబంధములలో నాటకీయత విలసిల్లుట కెక్కువ యవకాశము గలదు. మహా ప్రబంధమగు పోతనచరిత్ర మీ రూపకాంశ విలసితమగు చక్కని నాటకీయత కాటపట్టై విరాజిల్లుచున్నది. ఇందలి నాటకీయ శిల్పమును నిరూపించుటయే యీ వ్యాసోద్దేశము.

## 1. ఇతివృత్త కల్పన :

నాటకీయత గల యితివృత్త కల్పన యనగా కథలో నాటకము నందువలె సంధి సంధ్యంగములను గూర్చుట. అనగా ముఖాది పంచసంధులను నిర్వహించుట. కావ్యమున ఈ సంధి నిర్వహణము చక్కగా జరిగిన విషయము 'పోతనచరిత్రము - మహాకావ్యము' అన్న వ్యాసమున చర్చింపబడెను. మరియు నితివృత్త నిర్వహణలోని తీరు 'వస్తుశిల్పము' వ్యాసమున వివరింపబడెను. నాటక లక్షణానుసారముగా నిందలి వస్తువాధికారికము మిశ్రము.

---

1. నవ్యాలోకము : 'నన్నయ రచనలో నాటకీయత' పుట 49.

## 2. కావ్యము యొక్క ఆద్యంతముల స్వరూపము :

నాటకోచితముగా సంధి సంధ్యంగ ఘటన మొప్పారుటయేకాక కావ్యమున నాద్యంతముల స్వరూపమును నాటకీయ శిల్పముచేత పొల్పెసలారుచున్నది. నాటకముననుండు నాందీ ప్రస్తావనలను భరతవాక్యమును కావ్యమునందలి పీఠిక, కావ్యోపక్రమోపసంహారములు నిర్వహించుచున్నవి. కావ్యపీఠికాదిని గల శ్రీరామ స్తుతియేకాక కావ్యారంభమునందలి 'సొమ్ముల యాసలోఁ బడక' యను ప్రథమ పద్యము నాందియై యొప్పుచున్నది. కావ్యపీఠికలోని పోతన గాథకు, కావ్యకర్త యగు ఆచార్యులవారికి చెందిన విషయములేకాక కావ్యోపక్రమ విషయములు ప్రస్తావనగా విస్తరించియున్నవి. కావ్యోపక్రమము సూతునకు శౌనకాది మునులకు జరిగిన సంభాషణతో నాద్యంతములు సాగి పోతన శ్రీనాథాది కావ్యపాత్రల గూర్చియు వారు నిర్వహించు కార్యకలాపముల గూర్చియు ప్రస్తావింపబడి నాటక పూర్వరంగమును సిద్ధము చేసినది. ఇక దశమాశ్వాసము చివర పోతన వినిపించిన ఫలశ్రుతిలో, కావ్యోపసంహారములో భరతవాక్యము పలుకుట జరిగినది. ఈ విధముగా కావ్యమునందలి యాద్యంతముల స్వరూపము నాటకీయతా విలసితమై యున్నది.

## 3. సన్నివేశ శిల్పము:

కావ్యమున నాటకము నందువలె ననేక సన్నివేశములు క్రమముగా కల్పింపబడి చతురముగా నిర్వహింపబడి కావ్యమును మిక్కిలి రక్తి కట్టించుచున్నవి.

కావ్యకథ పోతన జన్మస్థలమగు బమ్మెర గ్రామ వర్ణనతో మొదలగును. ఆ బమ్మెర వెలసిన ప్రాంతమగు తెలంగాణములోని సుప్రసిద్ధ మహానగరము నేకశిలను ప్రస్తుతించి బమ్మెరను కనులకు గట్టినట్లు మనోజ్ఞముగా వర్ణించుట జరిగినది. ఇది నాటకమున రంగస్థలమును వర్ణించుట వంటిది. అట్టి రంగమున పోతనగారి తల్లిదండ్రుల గుణగణములను వర్ణించి పరిచయము చేయుట, గ్రామ రామాలయమునకొక విప్రుడేతెంచి భాగవత పురాణము చెప్పుచుండ లక్కమాంబ అందరితో వెడలి శ్రద్ధా భక్తులతో విని పౌరాణికునితో భాగవతము తెలుగులో వెలయుట గూర్చి సంభాషించుట, పోతన జననము, జాతకర్మము, పోతన శైశవ క్రీడలు, విద్యాభ్యాసము మున్నగునవి క్రమముగా చిన్న చిన్న సంఘటనలుగా నిర్వహింపబడినవి. ఇట్టి సన్నివేశములు ఛలన చిత్రములో ద్రుత చలద్దృశ్య

ములను (Swift-shifting images) ప్రదర్శించు శిల్పమునకు చెందినవై యొప్పుచున్నవి. ఇక ఇక్కడినుండి కథ నిలుకడగా సాగుచు సన్నివేశ శిల్పమును సంతరించుకొన్నది. పోతన పాల్కురికి యాత్రా సందర్శనము, చిదానంద యోగి సందర్శనము, పేదజవరాలి కష్టములు విచారించి యాదుకొనుట, యువక భూస్వామికి హితోపదేశక కవిత వినిపించుట, శ్రీనాథ దర్శనము, శ్రీనాథుడు పోతన యింటి కేగి యాతిథ్యము స్వీకరించుట, నర్సమాంబా పోతనల వివాహము, పోతన దంపతుల విప్రలంభ సమాగమములు, మల్లన జననము, శ్రీనాథుడు భార్యా వియోగము చెంది పోతన యింటికి వచ్చుట, శ్రీనాథ పోతనలు రాచకొండలో పుష్పలావికతో మాట్లాడుట, సింగ భూపాల దర్శనము-ఇత్యాదిగా కావ్యము నందంతట రసవద్ఘట్టముల సన్నివేశములు రమ్యముగా తీర్చబడి యున్నవి

సన్నివేశ శిల్పములో రంగస్థలమున పాత్రల ప్రవేశ నిష్క్రమణములను నిర్వహించుట కడు ముఖ్యమైనది. ప్రథమాశ్వాసమున పాల్కురికి జాతరలో వీథి భాగవత ప్రదర్శన స్థలము రంగము. పోతన జననీజనకులతో నచట చేరుట, దానిని చూచుచు సంభాషించి చివరకు వెళ్ళిపోవుట పాత్రల ప్రవేశ నిష్క్రమణ ములు, అట్లే ప్రభాతవేళ పచ్చిక బీళ్ళలో గోవులు మేయుచుండ పోతన చేరును, తర్వాత చిదానందుడు వచ్చును. వారి సంభాషణము, మంత్రోపదేశము ఐన పిదప చిదానందుడు వెళ్ళిపోవును, పోతన యూరిలోనికేగును. సన్నివేశమై పోవును. ఇట్లే సన్నివేశములెల్ల నాటకమునందు వలె డెందములకు విందొనగు చున్నవి.

## 4. చతుర్విధాభినయములు:

రూపకమున ఆహార్యము, ఆంగికము, సాత్త్వికము, వాచికములను చతుర్విధాభి నయములు మిక్కిలి ప్రాధాన్యము వహించుచున్నవి. ఈ యభినయముల నాచార్యుల వారు కావ్యమున సమృద్ధిగా ప్రవేశపెట్టి కనులకు గట్టించినారు. వీనిని క్రమముగా తిలకింతము.

ఆహార్యాభినయము:

'ఆహార్యాభినయో నాట్యోచితాలంకారధారణ'మ్మని చెప్పబడినట్లు పాత్రల రూపరేఖలు ప్రస్ఫుటమగుటకు నాటకమున సముచితముగా చేయు వస్త్రాభరణా దుల వేషధారణ మహార్యము. ఇది యెంత నిపుణముగా కళాత్మకముగా నున్న

నంత ప్రేక్షకుల నాకర్షించును. ఇట్టి ఆహార్యాభినయము నాచార్యులవారు కావ్యమున పుష్కలముగా చతురముగా ప్రదర్శింపచేసినారు, అట్టివానిని కొన్నిటిని దిగువ పేర్కొందును.

బమ్మెర రామాలయమునకు భాగవతపురాణము ప్రవచింప వచ్చిన విప్రుని రూపరేఖలు విశదముగా నిట్లు వర్ణింపబడినవి.

"సన్మతిన్ గల వేదశాస్త్రవిజ్ఞానంబు ఘన శిఖాభ్యున్నతిన్ గ్రాలుననగ....
శిరము గోష్పాద పరిమిత శిఖఁజెలంగ నలికతల విభాసిత భస్మతిలకుఁడగుచు
వెడఁద యురమున యజ్ఞోపవీతమలర సవదరించిన ధౌతవస్త్రమ్ముతోడ"[1]

విప్రుడరుదెంచి యుండెను.

పాల్కురికి జాతరలోని శివసత్తులు 'బారవైవ్రేలాడఁబడు పల్ల జడ గుంపుతో, నిలువెల్లఁ జాఁదిన వెలిబూది రేకులతో, రగరగన్ మెఱయు తామ్రపు నగలతో, కలిత త్రిశూల సంగత ఘంటికా ధ్వనులతో కక్ష్య వ్రేలెడి జోలెతో కరము లెత్తి తూఁచుండి'రని వర్ణింపబడినారు.

పోతనకు దర్శనమిచ్చిన చిదానందయోగి వేషము దిగువ రీతిగా వర్ణింపబడినది.

"మండిత కర ధృత దండ కమండలు హసదాననేందు మండలుని జటా
మండల ఖేలత్సుందర గండస్థలు లంబితాక్ష ఘన కుండలునిన్[2]"
"కాషాయాంబర కవచిత వేషున్ రుద్రాక్షదామ విస్ఫారదురో
భూషున్ హరిపద మార్గాన్వేషున్"[3]. పోతన సందర్శించెను.

శ్రీనాథ పోతనలు సింగభూపాలుని సందర్శించినప్పటి వారి వేషభూషాదులను స్ఫుటముగా వర్ణించిన విషయము 'పాత్రపోషణ' వ్యాసమునను, క్షామ కాలమున బమ్మెరకు వచ్చిన దీన భిక్షుకుని వేషవర్ణన విషయము 'రసనిర్వహణము' లోను వివరింపబడెను.

1. పోతన చరిత్రము : 1-101
2, 3. పోతన చరిత్రము : 2-16,17.

పోతన యింటికి వచ్చుచు పొలాలవద్ద మల్లనకు దర్శనమిచ్చిన రామశర్మ రూపరేఖలు వేషము నెంత సురుచిరమై సుస్పష్టమై యున్నవో దిగువ పద్య దర్పణమున దర్శింపగలము.

"క్రతు ధూమముల మాఁగి కడు చెమర్చెడి మేన
వెలిబూది పూఁతలు మలుఁగు సూప
గోష్పాద పరిమితిన్ గొమరొందు సిగముడి
విడివడి మెడలపై వ్రేలియాడ
వెడఁద వక్షమ్మున వెండి తీవియలట్లు
మెఱుఁగు జన్నిదముల వరుసలొరయ
సప్త కచ్ఛమ్ముల సరిదీర్చి కట్టిన.
మడుఁగు దోవతిచెంగు కడలఁ గ్రుమ్మఁ

గుశలు సమిధలు కట్టగాఁగూర్చి కట్టి
చంక నిఱికించి బ్రహ్మ తేజంపుఁ గళలు
దాఁగక మొగమ్ముపైనట్టి తాండవింపఁ
దరియ వచ్చెను భూసురవరుఁడొకండు"[1]

ఇట్లే కావ్యమున చతుర్థాశ్వాసమున శ్రీనాథపోతనల గాంచ నుద్యానమునకు వచ్చినప్పటి సింగనృపతి, సప్తమాశ్వాసమున రాచకొండ చమూపతి, కత్తి యుద్ధము చేసిన యువకమల్లుడు, జంగమకన్య, అష్టమాశ్వాసమున జ్యోతిపుర రాజ్ఞి, ఏకాదశాశ్వాసమున మోహిని, ద్వాదశాశ్వాసమున రుక్మిణీ కృష్ణులు రమణీయాహార్య శోభితులైనట్లు కవిగారు వర్ణించినారు.

## ఆంగికాభినయము :

ఆంగికాభినయము నాటకమునందు వలె కావ్యమున నితాంతముగా గోచరమగుచున్నది. ఇది యనేక ఘట్టములలో సమ్యక్ప్రదర్శితమై యున్నది. దిగువ కతిపయోదాహరణము లీయబడినవి.

1. పోతన చరిత్రము : 6-123

కావ్యోపక్రమమున నారదుడు వ్యాసుని ప్రశస్తి వర్ణించి చెప్పగా నింద్రుడు 'మాత్సర్య వివశుడగుచుఁ గినుక దనరఁగ మౌనిపైఁ బనికిరామినద్ది నవ్వులఁ దేల్చి' పలుకుటలో,

ఇంద్రుడు సంస్కృతభాషా రచితమగుటచేతనే భాగవతమునకు మోక్ష ప్రదత్వము వచ్చినదన నారదుడు 'అపహాస విభాసిత మౌనముద్రతో గనుగొనె' ననుటలో,

ప్రథమాశ్వాసమున పాల్కురికి జాతర చూచి బండిలో బమ్మెరకు చేర వచ్చుచుండ కేసన జగమొక దాగుడుమూతల క్రీడారంగమని తెల్పగా విని ఏమొ గుఱ్ఱెటెంగిన ప్రోడవోలెఁ బరికించెడి నందనుఁగాంచి మోము ముద్దునుగొని 'యేమి యర్థమెదఁ దోచెనొ తెల్పు' మని మాతృమూర్తి యడుగుటలో,

ద్వితీయాశ్వాసమున చిదానందయోగి దర్శనమిచ్చి దారిగూర్చి యడుగగా పోతన 'కని ప్రమొక్కి యతని చెంగట వినయ వినత శీర్షుఁడయి ద్రవీభూత సుచేత నుఁడై యనురాగోక్తుల' పలుకుటలో,

పోతన శ్రీనాథునింటికి దోడ్కొనివచ్చి 'బండిని డిగ్గి గభాలున లోనికిఁబోయి తండ్రికిన్ దండముపెట్టి నిర్భర ముదమ్ము నదమ్మయి గుండె నిండుచున్ గండ యుగాన హాసగతి గంతులు వెట్టగ పండితుండు నుద్దండ కవీశ్వరుండు వచ్చె'నని చెప్పుటలో,

పోతన వివాహానంతర మప్పగింతలవేళ 'తనయను గౌగిటఁ దార్చుచు జనని యౌదల మూర్కొనుచు వీఁపు కలయ నిమిరి యుప్పొంగివచ్చు దుఃఖోర్మి మత్తడి దూఁక' పలుకుచు పోతన కేలన్ దనయన్ దగనుంచి గుండె తఱుగుకొనన్ బెన్ వనటన్ జెందెడి తల్లిని గని కూఁతురుకనుల బాష్పగంగలు దొరలెన్, వంతన్ జెందెడి సుతఁగని చెంతంగొని కనులు దుడిచి చెక్కులపై వ్రాల్ కుంతలములు సవ రించుచుఁ జింతిల వలదనుచు బిడ్డ చిబుకము ముట్టన్' అను సందర్భములోను,

తృతీయాశ్వాసమున నేకాంతమున నర్సమాంబ పెనిమిటికి విడెమీయ బోవుచు లజ్జచే 'అవనత ముగ్ధాస్యయగుచుఁ గేలుంగేలుఁ గిల్చి నఖాగ్రముల్ గిల్లు కొనును' ఇత్యాదిగా వచించిన దానిలోఁగల లజ్జాన్విత చేష్టలలో, పోతన కాంతాను రాగ వివశుఁడై మాట్లాడుచు,

'ఆనందమ్మున విడెమిడు పాణింగొని నిమురుచున్ విభావోత్కర్షన్
దానై లాగుట నపుడమ్మానినియుఁ బ్రపాతరంగ మగ్నాననయై'

'విడువుఁడటంచు హస్తమును బ్రీడమెయిన్ విడిపించుకొంచు న
ప్పడఁతి మలంగవో నతఁడు పయ్యెదయంచు గ్రహింప జారి మున్
బడెనది మూఁపు నుండి యద్రువన్ పృథులోరము నర్తిలన్ బొమల్
చిడిముడిపాటుతో నురము చేతులఁ గప్పుచుఁ గాంక్ష మప్పుచున్"

"కుంచిత గాత్రమ్ముల నతి చంచల నేత్రముల రుద్ధ చరణమ్ముల ల
జ్ఞాంచిత వదనమ్మునఁ గిలికించితవతి యగుచు మగని కేలన్ వ్రాలెన్."

ఇత్యాది సన్నివేశములలో.

చతుర్థాశ్వాసమున శ్రీనాథుని నర్మోక్తులకు పుష్పలావిక 'తరుముకొని వచ్చు నవ్వునుఁ బోరి బయ్యెదకొనలఁ గఱచిపో నడచి త్రపాభర చపల వీక్షణ మ్ములు నెఱపెక్కఁగ వేఱు విషయమేదో తడవున్'. అను సందర్భమున నాంగి కాభినయము లెస్సగా ప్రకటిత మగుచున్నది. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే. ఇట్లే ప్రతి ఆశ్వాస సన్నివేశములందును నాంగికాభినయము కమనీయముగా నిర్వహింపబడి యున్నది.

## సాత్త్వికాభినయము :

సుఖ దుఃఖాదుల వలన గలుగు మానసిక తన్మయత వలన గలుగు స్తంభరోమాంచాదులవల్ల విలసిల్లు సాత్త్వికాభినయము కావ్యమున నందందు చక్కగా చూపబడినది. హృదయ సంబంధమైన రసభావములకు చెందినది కావున నీ యభినయము రసోదంచిత సన్నివేశములందే యొప్పారుచున్నది. అతి సూక్ష్మ మైన యీ యభినయము నాటకములందు సైతము మిక్కిలి తక్కువగా నుండును. ఈదృశాభినయమునకు కొన్ని లక్ష్యములను దిగువ నుటంకించుచున్నాను.

తృతీయాశ్వాసమున ప్రథమరాత్రి పోతన తన్ను గానక పడుకొనగ నర్స మాంబ పొందిన విరహవేదనలో సాత్త్వికాభినయ మొప్పుచున్నది.

'వేమరు నాథునిగాంచి కన్నులన్ స్వాతి పయఃకణమ్ములొగి
జాలుగొనన్ దడుపున్ దలాడలన్" అన్నపుడశ్రుపాతము వల్లను,

'కళలుడుగునట్టి శశితోడఁ గలుపకంటి వెళ్ళబారిన మోముతోఁ
దెల్లవాఱె'నని వైవర్ణ్యమును దెలుపుట వల్లను నీ యభినయము వ్యక్తమగు చున్నది.

'వానలో దడియుచు వచ్చిన సతిని గాంచి,
తను దాను మఱచి విశ్వమ్మును మఱచియు నామె రూపమును
గనుగొనుచున్ గనియె నొక క్రొత్త లోకపుటనుభవము నమాత్యుఁ
డెడఁద నతిపరవశుడై' అని పోతన యవశత్వమును దెలుపుటచే ప్రళయ భావము వ్యక్తమైనది. మరియు పోతన యనునయ వాక్యములకు నర్సమాంబ 'నాథుని గాంచి యార్తిమై కన్నులనుండి యశ్రుకణగంగలు పొంగ.... రసేక్షణ పంక్తులఁ జూచుట' లోను, వారు కూడి క్రీడించిన తన్మయతలోను సాత్త్వికాభినయము ప్రదర్శింపబడినది.

భార్యావియోగ దుఃఖముతో వచ్చిన అన్నను గాంచి నర్సమాంబ 'కనుదమ్ముల గిట్టున నిండు నశ్రువుల్ జొటజొట గ్రచ్చకాయలటు చుక్కలు రాల్చగ నోష్ఠ నాసికాపుటములు సంచలింపఁ బొరివోవుచు గద్గద కంఠమెత్తి దుప్పటమును మోమునందిడి గుభాలునఁ బైఁబడి యేడ్చె' ననుదానిలో అశ్రువు, వైస్వర్యము అను సాత్త్విక భావములు సువ్యక్తములైనవి.

పంచమాశ్వాసమున చంద్రగ్రహణ కాలమున పోతన గౌతమీ సైకతమున శివధ్యానము చేయుచుండ 'ఒదవె సుషుమ్న, ద్వంద్వపవనోర్మికలందు లయించె నెంతయున్ గదలిక లేనివారివలె గాలిఁ జలింపని దీవె యట్టు లున్మదతను పీడి బుద్ధిగత మత్సరుడై గ్రసియించు రాహుబముక్తిఁ దనరు సోము భాతిఁ గవి తేజరిలెన్ ఘటితామనస్కృతన్' అని వర్ణించిన తావున శాంతరస విసరమైన స్తంభ ప్రళయ భావముల సాత్త్వికము విలసిల్లుచున్నది.

తన్ను గాపాడుటకు సెట్టి కఱ్ఱదెబ్బ తినియు తనకుపచారము చేసిన పోతనను గాంచి దీనభిక్షుకుఁడు 'దుఃఖజలధు లుప్పొంగు కన్దోవలతో గాద్గద్య వాగ్వైఖరి' నతనికి కృతజ్ఞతలు తెలిపిన పట్టున సాత్త్వికాభినయ మేపారుచున్నది.

షష్ఠాశ్వాసమున 'అల వైకుంఠ' పద్యము పూరించి పోయిన రామశర్మ శ్రీరామచంద్రుడే యని గ్రహించి పోతన భక్తి తన్మయుడైన విషయమున సాత్త్వికము విరాజిల్లుచున్నది. పోతన 'ఆనందాశ్రులు జలజల ప్రవహింప హర్ష

సంగత రోమాంచల సత్తను సంగతి నిశ్చల వృత్తి న్నిలిచి మానసమునఁ దలంచెన్'[1] అనుటలోను,

> "సతత బాష్పావరుద్ధ దర్శనము గదురఁ
> గనులు దుడుచుచుఁ జదువునక్షరమొ పదమొ
> తన్మయానందము గళమ్ముఁ దట్టి పట్ట
> బాష్ప గద్గద స్వన మొప్పఁ బఠన ముడుగు"[2]

అను దానిలోను స్తంభాశ్రురోమాంచాదుల యభినయము పరిఢవిల్లినది. ఇట్లే ఆయా రసవద్ఘట్టముల నీ సాత్త్వికాభినయము దర్శనీయమై యొప్పారుచున్నది.

## వాచికాభినయము :

కావ్యమునందు తరచైన వాచికాభినయము నరసినచో నిది నాటకము కాబోలు ననిపించును. అసలు కావ్యమే సూతుడు శౌనకాది మునులకు కథ చెప్పుటతో ప్రారంభమై ఆ సూతుని కథనములోనే కావ్యోపసంహారము జరిగినది. ఈ రీతిగా పాత్రల సంభాషణలతో కావ్యమెల్ల సాగినట్లు భావించవచ్చును. ఇక దిగువ పేర్కొనిన విపుల సంభాషణలు కావ్యమున నాటకీయ శిల్పమును ప్రకాశింప జేసినవి.

| | |
|---|---|
| ఇంద్ర నారదుల సంవాదము | – 1 ఆ. 28-36 పద్యములు |
| వ్యాస కాశీ విశ్వేశ్వరుల సంవాదము | – 1 ఆ. 41-55 ,, |
| ఇంద్రోపేంద్రుల సంవాదము | – 1 ఆ. 58-70 ,, |
| పోతన జననీ జనకులతో సంవాదము (పాల్కురికి జాతరలో) | – 1 ఆ. 146-164 ,, |
| పోతన జననీ జనకులతో సంవాదము -(పాల్కురికి నుండి తిరుగు ప్రయాణములో) | – 1 ఆ. 167-201 ,, |
| పోతన చిదానందుల సంవాదము | – 2 ఆ. 18-55 ,, |
| పోతన పేద జవరాలు సంవాదము | – 2 ఆ. 84-103 ,, |

1. పోతన చరిత్రము : 6-163
2. ,, ,, : 6-173

| | | |
|---|---|---|
| పోతన యువక భూస్వామి సంవాదము | – 2 ఆ 107-130 | పద్యములు |
| శ్రీనాథ పోతనల ప్రథమ సంవాదము | – 2 ఆ. 159-176 | ,, |
| శ్రీనాథ కేసనల సంవాదము | – 2 ఆ. 182-197 | ,, |
| శ్రీనాథ కేసనల సంవాదము | – 2 ఆ 216-237 | ,, |
| పోతన దంపతుల సంవాదము | – 3 ఆ. 225-241 | ,, |
| భార్యా వియోగి శ్రీనాథుడు పోతనతో సంవాదము | – 3 ఆ. 312-337 | ,, |
| పుష్ప లావికతో శ్రీనాథ పోతనల సంవాదము | – 4 ఆ. 26-55 | ,, |
| శ్రీనాథ పోతనలు సింగ నృపతితో సంవాదము (రాజ సభలో) | – 4 ఆ 67-85 | ,, |
| సింగనృపతి శ్రీనాథ పోతనలతో సంవాదము (ఉపవనిలో) | – 4 ఆ. 102-138 | ,, |
| వేగుల వాడు సింగనృపతితో సంవాదము | – 4 ఆ. 141-213 | ,, |
| సింగ భూపాల పోతనల సంవాదము | – 4 ఆ. 343-354 | ,, |
| పోతన తిప్పనల సంవాదము | – 5 ఆ. 3-10 | ,, |
| పోతన శ్రీరామచంద్రునితో సంవాదము | – 5 ఆ. 91-118 | ,, |
| తిప్పన దంపతుల సంవాదము | – 5 ఆ. 198-223 | ,, |
| పోతన చిదానంద గురువర్యులతో సంవాదము | – 6 ఆ. 29-72 | ,, |
| నారయాదులు వృద్ధ కంచుకితో సంవాదము | – 7 ఆ. 61-86 | ,, |
| నారయాదులు సింగ భూపాలునితో సంవాదము (శ్రీనాథునితో) | – 7 ఆ. 92-121 | ,, |
| శ్రీనాథ సింగభూపాలుర సంవాదము | – 7 ఆ. 140-154 | ,, |
| రాచకొండ చమూపతి పోతనతో సంవాదము | – 7 ఆ. 168-197 | ,, |
| చమూపతి సింగనృపతితో సంవాదము | – 7 ఆ. 265-284 | ,, |
| జంగమ కన్య శ్రీనాథునితో సంవాదము | – 7 ఆ. 313-332 | ,, |
| శ్రీనాథుడు మల్లనతో సంవాదము | – 8 ఆ 8-31 | ,, |
| శ్రీనాథ పోతనల సంవాదము (శ్రీనాథుడు పోతన కవితల నగ్గించి ధనావసరము గూర్చి చెప్పిన సందర్భము) | – 8 ఆ. 95-145 | ,, |
| శ్రీనాథ పోతనల సంవాదము (మల్లన వరపూజ తర్వాత) | – 8 ఆ. 166-197 | ,, |

| | |
|---|---|
| శ్రీనాథ పోతనల సంవాదము | – 8 ఆ. 241-267 పద్యములు |
| (ఓరుగంటి శిల్పముల వర్ణనల వేళ) | |
| తిప్పనతో శ్రీనాథ పోతనల సంవాదము | – 8 ఆ 276-297 ,, |
| పోతన మణిగిరి పండితులతో సంవాదము | – 9 ఆ. 67-93 ,, |
| పోతన విజయనగర చమూపత్యాదులతోసంవాదము | – 9 ఆ. 99-145 ,, |
| (మణిగిరిపై) | |
| సింగనృపతి సభాసదులతో, శ్రీనాథునితోసంవాదము | – 9 ఆ. 301-336 ,, |
| శారదా శ్రీనాథుల సంవాదము | – 9 ఆ 359-372 ,, |
| శ్రీనాథ ప్రౌఢ దేవరాయల సంవాదము | –10 ఆ. 4-26 ,, |
| శ్రీనాథ పోతనల సంవాదము | –10 ఆ. 31-51 ,, |

ఉపర్యుదాహృత సంవాదములేకాక శ్రీనాథుడు తల్లితో, శ్రీనాథుని తల్లి కూతురుతో, శ్రీనాథుడు చెల్లెలితో, పోతన తిప్పనతో, పోతన యోరుగంటి పండితులతో, పోతన పోచయ్యతో, పోతన దీన భిక్షుకునితో, బేహారి పోతన తిప్పనలతో, రామశర్మ మల్లనతో, నర్సమాంబతో, జ్యోతిపురరాజ్ఞి పోతనతో, లక్ష్మి శారదతో, పోతన మణిగిరిలో శ్రీరామచంద్రునితో, సరస్వతితో జరిపిన సంభాషణలు మరియు పోతన శరద్రాత్రిని గౌతమిని వర్ణించినవి, శ్రీనాథుడు సంక్రాంతిని వర్ణించినవి, ఇతరత్ర ఆయా పాత్రలు కావించిన ఆత్మగత భాషణములనేకము గలవు.

కావ్యానుబంధములోని 11, 12 ఆశ్వాసములలో కొన్ని సంవాదములున్నను నవి పోతన యాశువుగా గాతము చేసినవి కావున వానిని పరిగణించలేదు. ఆ రెండాశ్వాసముల పద్య సంఖ్య 692. పీఠికాభాగము పద్యసంఖ్య 137. మొత్తము కావ్యమునందలి 3767 పద్యములనుండి వీనిని తీసివేసినచో కావ్యారంభము నుండి దశమాశ్వాసాంతము వరకు గల 2938 పద్యములలో పైజాబితాలో సంవాదముల పద్యములు 1020మరియు నితర సంవాదములు నాత్మగతములు కలిసి కావ్యము మొత్తమున 45% వరకు సంవాదములున్నవి. కించిదూనముగా సగము వరకు వ్యాపించిన యీ సంభాషణలు వాచికాభినయమునకు పుష్కలమైన నిదర్శనమై కావ్యమున నాటకీయవైభవమును చాటుచున్నవి.

ఇందలి యీ సంభాషణములు పాత్రోచితమై యింపు నింపుచున్నవి. ఇవి పాత్రల గుణశీలముల కనుగుణమై తత్పోషకమై చతురమై పాత్రల సంఘర్షణను దెలు

పుచు, కొన్ని యెడల వివాదరూపములోను మరికొన్ని యెడల ప్రశ్నోత్తర రూపములోను సాగి సన్నివేశములను రక్తిగట్టించుచు కావ్యకథాగమనమునకు సహకారులై యొప్పుచున్నవి. మచ్చునకు ప్రథమాశ్వాసములోని పాల్కురికి జాతరలో వీథి భాగవతము చూచి బాల పోతన తన జననీ జనకులతో సంభాషించిన ఘట్టమును రూపకరూపములో దిగువ వ్రాయుచున్నాను.

## పాల్కురికి జాతర—వీథిభాగవత తత్త్వోపదేశము :

రంగము : పాల్కురికిలో జాతర-వీథి భాగవత ప్రదర్శన జరుగుచుండును. పోతన తన జననీ జనకులతో దానిని తిలకించుచుండును.

పోతన: ఇవ్విధి దివ్విటీల్ వెలుఁగునేమి?

లక్కమాంబ: (నవ్వుచు నిజనందను గన్గొని) చంద్ర సూర్యులాదవ్వుల వెల్గనేల?

పోతన: దాపున నా తెర యేల?

లక్క : నివ్వటిలున్ పయిన్ మసక నీలపు నింగి యదేలరా?

పోతన: వెలుఁగులనీను ప్రొద్దుటను వేసము లాడవదేల?

లక్క : తళ తళలాడు తారకలు తాము పవల్ గనరావదేల?

పోతన: అలఁ దెలవాఱునంతఁ దుదియై చను నాటకమేల?

లక్క : రేల్ కలఁగనుటెల్ల మేలుకొనఁగాఁ గనరాదది యేలరా?

పోతన: వచ్చుచుఁ బోవుచుండెనట పర్గములోని కదేల?

లక్క : చచ్చుచుఁ బుట్టుచుండె జననంఘము భూస్థలి నేల?

పోతన: వారెచ్చటి కేఁగుచుండిరి?

లక్క : ఎవ్వఁడు వారికి వేస మిచ్చుచున్ బుచ్చునొ యట్టి సూత్రధరు పొంతకుఁ బోదురు.

పోతన: ఏఁగిన వీరిగాంచి యతఁడేమని పల్కును?

లక్క : వారి వేషాగతులన్ బొనర్చి యెటులాడుఁడు పాడుఁడటంచుఁ దెల్పెనో యాగతి నాటి పాడిన నహా! యని వారల మెచ్చు నిచ్చు మేల్ భోగములట్లు జేయమిని పొందని దండన ఁజేయువాఁడు:

(అనునంతలో బాలకులదరన్ సంగడి నిదురలు సెదరమృదంగ స్వన సింహగర్జనార్భటి గదురన్ రంగమున నృహరియుద్భట భంగిన్ బ్రత్యక్షమయ్యెను)

పోతన: రూపమిది యేమి?

లక్క: అసుర నడంపన్ సేవకుఁడగు ప్రహ్లాదున్ గావఁగ దేవుఁడు జనించెఁ గంబమున.

పోతన: దేవళమ్మునందు దీపించు లింగము దేవుఁడంటివి. ఇప్పుడీ విధముగ సింహముఖముఁ దాల్చి శ్రీహరి ప్రహ్లాదుఁ గావఁ దేవుఁడయ్యెఁ గాంచుమనెదె?

లక్క: హరిహరులేకరూపులు.

పోతన: ఎట్టులు?

లక్క: సిగఁ జెలంగు కుప్పె సింహాస్య వలయమ్ము రూఢి నొక్కపసిఁడి రూపుల గుట-ధీనిధివై సతమ్ము భిన్నదేవతలొక్కటి యంచు నెంచుచున్ మానసమం దుమారమణు మాటికి మాటికి సంస్మరింపనౌ. తాననలమ్ము వృక్షసము దాయ విభేదము లూడ్పుకైవశిన్ జ్ఞానము రూపభేదము లొకం డొనరించు నసంశయాకృతిన్.

పోతన: ( అతిభక్తి నంబ వచనామృతసారము నాస్వదించి ) ఏమనియెదరిట్టి యాటను?

లక్క: ఇద్ది భాగవత నామముతో నుతికెక్కు.

పోతన: (దాని విని సంతస మందుచు) భాగవతాఖ్య దీని నిటు బల్కుదురేల?

లక్క: ఈ కథా సుధల్ భాగవతమ్మనం దనరి ప్రస్తుతి కెక్కిన పుస్తకస్థమై సాగుటచే.

పోతన: చక్కని పొత్తము. నేఁ బఠించెదన్ వేగ మొసంగు నాకు. (అని మాతృదేవతను వేడెను).

లక్క: అదియొ గీర్వాణ వాణిలో నలరు. నీకుఁ దెలుఁగు పలుకుల వెలసినఁ దెలియును.

పోతన: తెలుఁగునన్ వ్రాసి యిమ్ము.

లక్క: వ్రాయరాదు.

పోతన: నే వ్రాతును.

లక్క: (అనంత వత్సలత నాత్మజునిం గని కౌఁగిలించి) నీ కెంతటి బుద్ధిరా బుడుత ! యేండ్లు మహాయువు బోసికొంచు జీవింతువుగాక ! ( అని ప్రేముడిన్ గయ్యివ్రేళులు బాలుని మీఁదు ద్రిప్పి నెటికల్ ఘటియింప కణంత లద్దుకొని పతిని గాంచి) భాగవతమును దెన్గులో వ్రాయునంట చెవి సిడెద రొక్కొ కొమరుని చిల్క పల్కులు. ఈఁడునకు మించి మాటల నాడును.

కేసన: (అది విని ముదితాశ్రు కణావిల లోచనాంబుజాస్పదుఁ డయి పత్నిఁ గాంచి) కల్కిరా! వీనిఁ జూచి నేఁడుదయమె యోగి యొక్కఁడితఁ డుర్వి మహాకవి సార్వభౌముఁడై విదిత విశాల విశ్వ పరివేష్టిత నిత్య యశస్వియౌ ననెను అదియు నిదియు నొకటి యగుట మానస మెల్లఁ బులకరించెను. (అనుచుఁ బొలఁతిఁ గూడి తనయు భావి జీవిత ప్రపంచమ్మును సూక్ష్మ దేహుఁడగుచుఁ జుట్టివచ్చెను)

(పిమ్మట కేసన నిజాత్మజునిం గొని ధర్మపత్ని లక్కమ్మయు వెంట రాఁ బురహరాలయ గోపుర దీపిత త్రిశూలమ్మును గాంచి మ్రొక్కి పదిలమ్ముగ గట్టును డిగ్గి బండిపై బమ్మెర కేఁగసాగెను)

ఇట్టిది యొక నాటక దృశ్యమువలె సాగి రంజింప జేయుచున్నది.

## 5. పాత్ర పోషణము :

దీని గూర్చి 'పాత్ర పోషణము' వ్యాసమున విపులముగా చర్చింపబడెను.

ఇందలి భోగినీ నృత్య ఘట్టమొక యంతర్నాటికయై కావ్యమునందలి నాటకీయతకు తిలకాయమానమై చెలువారుచున్నది. ఈ విధముగా పోతన చరిత్రము నీటైన నాటకీయత దీటుకొని మేటియై విరాజిల్లుచున్నది.



# ధ్వని సౌరభము

పోతన చరిత్రము ధ్వని ప్రధానమగు ఉత్తమ కావ్యము. ఆలంకారికులు ధ్వనికావ్యముత్తమమైనదని యుల్లేఖించిరి. మమ్మటుడు కావ్యభేదములను పేర్కొనుచు నిట్లు వివరించెను.

"ఇద ముత్తమ మతిశయిని వ్యంగ్యే
వాచ్యాద్ధ్వని ర్బుధైః కథితః
అతాదృశి గుణీభూత వ్యంగ్యం వ్యంగ్యేతు మధ్యమం
శబ్దచిత్రం వాచ్యచిత్ర మవ్యంగ్యం త్వవరం స్మృతమ్"[1]

అనగా వాచ్యార్థమునకన్న వ్యంగ్యార్థ మధిక చమత్కారము కలుగజేయు ధ్వని కావ్యము ఉత్తమ కావ్యమనియు, వ్యంగ్యార్థము వాచ్యార్థమున కంటె విశేష చమత్కారావహము కాని గుణీభూత వ్యంగ్య కావ్యము మధ్యమ కావ్యమనియు, వ్యంగ్యార్థము లేనిదై శబ్ద చిత్రకావ్యము అర్థచిత్ర కావ్యమనబడునది అధమకావ్యమనియు విశదీకరింపబడినది.

విశ్వనాథుడు కావ్యములు రెండు విధములని యిట్లు తెలిపెను.

"కావ్యం ధ్వనిర్గుణీభూత వ్యంగ్యం చేతి ద్విధా మతమ్
వాచ్యాతిశయిని వ్యంగ్యే ధ్వని స్తత్కావ్య ముత్తమమ్"[2]

కావ్యము ధ్వనికావ్యము, గుణీభూత వ్యంగ్యకావ్యమని రెండు రకములనియు, వాచ్యార్థమున కంటె వ్యంగ్యార్థము అధిక చమత్కారముగా (సుందరముగా) నుండునట్టి ధ్వనికావ్య ముత్తమమనియు విశ్వనాథుడు వివరించెను.

ఈ రీతిగా ఆలంకారికుల వచనములు ధ్వని కావ్యముత్తమమని యుద్ఘోషించుచున్నవి. ఆనందవర్ధనాచార్యుని చేత సిద్ధాంతీకరింపబడి యభినవగుప్త మమ్మటాద్యనేకాలంకారికులచేత అంగీకృతమైన 'కావ్యాత్మ ధ్వని' యన్న విషయమును, ధ్వనికావ్యమే యుత్తమ కావ్యమన్న విషయమును వరదాచార్యులవారు

---

1. కావ్యప్రకాశము - ప్రథమోల్లాసము, శ్లో. 2,3,4.
2. సాహిత్యదర్పణము - చతుర్థ పరిచ్ఛేదము, శ్లో. 1.

లెస్సగా గ్రహించి తమ కావ్యమును ధ్వని విలసితముగా విరచించిరి. పోతన చరిత్ర మానందవర్ధనుడు పేర్కొనిన త్రివిధములైన వస్త్వలంకార రసధ్వనులను గర్భీకరించుకొని ప్రకాశించుచున్నది. ఏతత్కావ్య పారిజాతమున గుమగుమ వాసించు ధ్వని సౌరభ పరంపరలను హృదయతర్పణముగా నాఘ్రాణింపజేయుటయే యీ వ్యాసోద్దేశము.

ప్రథమాశ్వాసమున కావ్యకథా ప్రారంభములో పోతన జన్మస్థలమగు బమ్మెర యిట్లు వర్ణింపబడినది.

"అదియొక పల్లెటూరు కలవందొక కొన్ని గృహాలు పెంకుచా
ళ్లఁ దల ధరించి మోయుటెటులా యని సంసృతి భారమెంచి బా
ధఁ దనరు పెన్గుటుంబివలె దాపున మౌనులవోలెఁ బూరియిం
డ్లెద నమితాశవీడునెడ నీ బరువే తృణ తుల్యమౌననన్"[1]

సాధారణముగా ప్రతిగ్రామమునందు నుండునట్లే బమ్మెరలోను కొన్ని పెంకుటిండ్లు కొన్ని పూరిండ్లు కలవని యీ పద్యమున చెప్పబడినది. కాగా పెంకు చాళ్లను ధరించి యున్న యిండ్లు సంసార భారముతో బాధపడు బహుకుటుంబి వలెను, తేలికగా నున్న పూరిండ్లు అత్యాశ విడిచినచో ఆ బరువే తృణతుల్యమగు నన్నట్లు మునులవలెను నున్నవని యుపమాలంకారముతో కైసేసి చమత్కార ముగా వర్ణించుట జరిగినది. ఇది వాచ్యము. ఈ పద్యమున నింతేకాక యొక విశిష్ట విషయము ధ్వనించుచున్నది. కావ్యమున ప్రధాన పాత్రలగు శ్రీనాథ పోతనల వ్యక్తిత్వము లిందు వ్యంగ్యముగా సూచింపబడినవి. సంసార భారముతో క్రుంగిపోవు పెను కుటుంబి వంటి పెంకుటిండ్లు అత్యాశాపరుడగు శ్రీనాథుని, అమితాశవీడి తృణలాఘవముతో ఒప్పు మౌనుల వంటి పూరిండ్లు ఆశకు లొంగని పోతనను స్ఫురింపజేయునట్లు ఇందు చక్కని వస్తుధ్వని కూర్పబడి యాహ్లాదకరమై యొప్పుచున్నది. కథా ప్రారంభమున గల యీ వ్యంగ్యవర్ణన కావ్య వస్తువును నిర్దేశించుచున్నది.

కావ్యోపక్రమములో వ్యాసునిపై మాత్సర్యము వహించి ప్రాధేయపడి పట్టుబట్టిన ఇంద్రునికి శ్రీ విష్ణువు ఆంధ్ర భాగవత కర్తకు తపోభంగము చేయు టకు, తదాంధ్ర భాగవతము నరాంకితము చేయుటకు యత్నింపవలెనని యుపా యము చెప్పగా నారదు డీరీతిగా వచించెను.

1. పోతన చరిత్రము : 1-88

''స్వీయ గౌరవమ్ము చెన్నారుటకుగాను ప్రక్కవారిఁ గించపరచు జడుఁడు
ఒరుల దీప మార్చి యొప్పారఁ గల నను శలభరాజు కెచటి
జయమటంచు "[1]

ఇందు ఆత్మ గౌరవ ప్రతిష్ఠలకు నీచు డన్యులను కించపరచును, దీపమార్పఁ జూచు శలభమునకు జయము కలుగదన్నది వాచ్యార్థము. పోతన చరిత్రములో ఇంద్రాంశలో జన్మించి భాగవత నరాంకితమునకు యత్నించిన సింగ నృపాలునికి జయము గలుగబోదన్న భవిష్యద్వృత్తాంతము స్ఫురింపజేయుట వ్యంగ్యార్థము. ఇక్కడ "రలయో రభేదః" అను సూత్రానుసారముగా శలభరాజనగా శరభ రాజనియు, శరభ శబ్దము చేత సింహ శబ్దము స్ఫురించి సింగరాజనగా సింగ నృపతి యని తోచుచున్నది. అట్టి సింగ భూపతి కావ్యకథలో భాగవత విషయము జయము గాంచలేదు. తుదకు భాగవతము దండనాథునిచే నపహృతమై యున్న విషయము తెలిసి పశ్చాత్తప్తుడైన సింగ నృపతి 'జ్యోతిని గాంచి మ్రింగఁ జనుచో శలభమ్ము ఫలమ్ము నొందునే'[2] యన్న మాట పై యభిప్రాయమును బలపరుచు చున్నది.

కావ్యోపక్రమములో పై సందర్భము నందే ఇంద్రాదులు వెడలిపోయిన పిదప నారదుడు నారాయణునితో,

''సురపతి సోదరుండు పరిశుద్ధ మనస్కృత భక్తుఁ డాత్మయై
వఱలెడి పుత్రుఁ డింద నొక వైపున వీఁపు మఱొక్క వైపునన్
బరఁగెను పొట్ట రెండిటను బాధయె చేకురె ధర్మ సంప దు
ద్ధరణ మొనర్పఁ గంకణము దాల్చిన నీకు వచించు వాఁడనే''[3]

అని పలికిన మాటలలోను ధ్వని విరాజిల్లుచున్నది. ఇంద్రుడు సోదరుడు, భక్తుడు పుత్రుడు ఒకరు వీపు మరొకరు పొట్టగా నున్నారు. ఇందెవరికి బాధ కలిగినను నీకే యవస్థ యని పలికి ధర్మ సముద్ధరణకు కంకణము కట్టుకొన్న నీకేమని చెప్పవలెనని నారదుడనెను ఇద్దఱిలో నెవరిని నిగ్రహించవలెనో నారదుడు చెప్పకున్నను అతని మాటల వల్ల వ్యంగ్యముగా అభిప్రాయము వ్యక్తమయినది.

1. పోతన చరిత్రము : 1-73
2. పోతన చరిత్రము : 9-317
3. పోతన చరిత్రము : 1-76

వీపుపై కొట్టవచ్చును గాని పొట్టపై కొట్టరాదని లోకోక్తి. ధర్మ సంరక్షకుడగు నారాయణుడు వీపు వంటి వాడుప భక్తుని పీడింపబూనిన అధర్మ ప్రవర్తకుడును నగు నింద్రు నణచి పొట్టవంటి వాడును తపశ్చర్యచే భాగవత రచనద్వార ధర్మవ్యాప్తి గావించు భక్తుడును ఆగు పుత్రునికి జయము కలిగించ వలెనని ధ్వని గర్భితముగా చమత్కారముగా చెప్పినట్లయినది. ఇట్లిచట వస్తు ధ్వని రమ్యమై యొప్పారుచున్నది.

కథాప్రారంభమున బమ్మెర రామాలయములో భాగవత ప్రవచనము చేయుచున్న బ్రాహ్మణుని వద్దకు లక్కాంబ వెడలి విని తమ బోంట్లు చదువుకొని తరించుటకు భాగవతము నెవరైన తెలుగులో వ్రాసినారా? యని ప్రశ్నించి నప్పుడా విప్రుడు.

"పొలతి! నీదు పొట్టఁ బుట్టెడు నీ కోర్కి నిజము చేయువాఁడు నేఁడొ రేపొ
యుదయ మొందకుండ నుండునె నిజభక్త వాంఛితములఁ దీర్చ
వరదుఁ డెందు"[1]

అని వచించుటలో ధ్వని చెలువొందు చున్నది. ఇక్కడ నీ పొట్టలో (మదిలో) పుట్టు నట్టి నీ కోరిక నిజము చేయువాడు నేడొ రేపొ యుదయ మొందకుండ నుండునా? యన్నది వాచ్యార్థము. ఆంధ్ర భాగవత కర్త త్వరలోనే తప్పక జన్మించగలడని శుభాకాంక్ష చేసినాడు విప్రుడు. కాగా, 'నీ కోర్కి నిజము చేయువాడు నేడొ రేపొ నీదు పొట్టఁ బుట్టెడు' మని ఫలవంతమగు శుభాశీస్సు లొసగినాడు. లక్కాంబ పోతనను గాంచనున్న భవిష్యద్వృత్తాంత మిందు వ్యంగ్య చమత్కారముగా వ్యక్తము చేయబడినది.

పోతన తలిదండ్రులతో పాల్కురికి జాతర చూచి తిరిగి వచ్చుచు మార్గ మధ్యమున మావి తోటలో ఆగినప్పుడు.

"పైకిఁగాంచె వటువు పత్రమ్ము లందుండి శుకము ఫలము రాల్చె
శుకుఁ డొసంగు
భాగవత రసాల ఫల రసంబో యన బాలు పదము లందుఁ బడియె
నదియు."[2]

1. పోతన చరిత్రము : 1-109
2. పోతన చరిత్రము : 1-177

అను పద్యము పోతన భవిష్య ద్భాగవతాంధ్రీ కరణోదంతము వ్యంగ్యముగా సూచింపబడినది. ఇట్లే పాల్కురికి జాతరలో పోతనకు తల్లి యొసగిన యుత్తరములలో, మావి తోటలో తండ్రి యొసగిన సమాధానములలోను వ్యంగ్య వచో వైభవ మాహ్లాదకరమై యొప్పుచున్నది. మచ్చున కొకటి యుదాహరింతును.

"బిడలగు ప్రాణుల బ్రదుకులు గడచుట లెట్లనుచుఁ బ్రకృతి కలకాలములున్
వడఁకున్ మది నుడుకున్ వెతఁదడుపున్ బాష్పాంబుధార ధారుణి నెల్లన్"[1]

పోతన యడిగిన ప్రశ్నలకు తండ్రి 'ప్రకృతి మనకెల్లరకు మాత' యని నుడివి యా ప్రకృతి మాత యే విధముగా మన యందరి నెంత మమతతో సాకుచున్నదో విశదీకరించి పైపద్యమనును. ఇందు బిడ్డలెట్లు బ్రతక గలరో యని ప్రకృతి సర్వకాలమును వడకును, ఉడుకును, కన్నీటితో దడుపునని చెప్పబడినది. కాని వడకుట మొదలగువానిచే బిడ్డలెట్లు బ్రతుకగలరు? కావున నిచట వడకు మొదలగు శబ్దములు క్రమముగా శీత గ్రీష్మ వర్షర్తు ధర్మములను ధ్వనింపజేయుచున్నవి. ప్రకృతి ఆయా ఋతువులలో వర్షాదులను ప్రసాదించి సస్యాదులచేత ప్రాణి సంతతిని పోషించుచున్నదన్న వ్యంగ్యార్థము రమణీయమై భాసిల్లుచున్నది.

ద్వితీయాశ్వాస ప్రారంభమున చేయబడిన ప్రభాత వర్ణన మా యాశ్వాస కథా విశేషములను వ్యంగ్యముగా స్ఫురింప జేయుచున్నది.

"కనులు గట్టి యెవఁడొ కపట నాటకమాడి తెరమఱుంగు చేసె
ధరణి ననుచుఁ
గాల్చివేయ నినుఁడు కటికచీఁకటి తెరలనఁ జనించెఁ దూర్పునం దరుణిమ"[2]
"తొలి దెసకుం దెలివి వచ్చెన్ దొఁ(గి చనెన్ నిదురమబ్బు తొంగలి రెప్పల్
నులుము కొనుచుఁ గను విప్పఁగ వెలసెన్ బాలారుణార్క బింబాకృతియై"[3]

అను నిట్టి పద్యభావములు కర్మబద్ధుడై జన్మించిన బాల పోతనకు చిదానంద దర్శనమై మాయావరణము తొలగి జ్ఞానము వెలిగెనన్న కథాంశములు స్ఫురించుచున్నవి. ఇట్లే ఆశ్వాస కథాంశ సూచనములగు ధ్వనులు షష్ఠ సప్తమాశ్వాసముల ఆరంభములందు గోచరించును.

1. పోతన చరిత్రము : 1-185
2. పోతన చరిత్రము : 2-4
3. పోతన చరిత్రము : 2-7

పోతన యొసగిన గోక్షీరములను త్రాగి తృప్తిచెందిన చిదానందుడు.

"గోరసమ్ములఁ దృప్తిని గొంటి వత్స! నీదు గోరస మిట్టులె నిఖిల జనము లవని నాచంద్ర తారార్క మనుభవింత్రుగాత! మనుచు దీవించి యేగం దంచె"[1]

ఇందలి వాక్కులలో పోతన భవిష్యన్మహా కవిత్వము వ్యంగ్యముగా సూచిత మగుచున్నది. పోతన ప్రభాతవేళ సుందర ప్రకృతిని గాంచి యుప్పొంగి మొట్ట మొదట వ్రాసిన కవితలో రెండు పద్యములు ధ్వనిగర్భితములై యున్నవి.

''సూర్యభగవాను వదనమ్ముఁ జూచి నవ్వి యాత్మ నర్పించుకొనిన యీ యంబుజమును

ఖలుఁడు గజరాజు సింగమ్ము కరణివచ్చి త్రుంచి తలమోదుకొనునఁట తుచ్ఛబుద్ధి"[2]

తమ హృదయేశ్వరుడగు సూర్యుని గాంచి కమలములు వికసింపగా మదపు టేనుగు లా పద్మములను తుచ్ఛబుద్ధితో త్రుచి తలమోదుకొనుచన్న సహజ విషయ మిచట చెప్పబడినది. ఇది వాచ్యార్థము. ఇందు ధ్వనివిశేషమొకటి శోభిల్లు చున్నది. సూర్యవంశ స్వామియగు శ్రీరామునకు పోతన తాను హృదయ పూర్వ కముగా నర్పించుకొను భాగవతమును సింగభూపాలుడు నీచబుద్ధితో తెప్పించి దాని శైథిల్యమునకు కారకుడు కాగలడన్న భవిష్యద్విషయ మిందు ధ్వనించుచున్నది.

ఇదే వరుసలో తర్వాతిదగు దిగువ పద్యము వ్యంగ్య విలసితమై యున్నది.

''శ్రుతుల విహరించు మధుపాన రతుఁడు తేఁటి భద్రగతి పూల నలరింప, క్షుద్ర శలభ

మెగసిపడి పూవురేకులె సగము గొఱికె దీప్తి మత్కావ్య పత్రాలఁ దిను చెదలన''[3]

రాసిక్యముగల భ్రమరము పువ్వులను సంతోషపెట్టగా నీచమైన శలభము గర్వించి కావ్యపత్రాలను దిను చెదలోయన పువ్వురేకులనే సగము కొరికి వేసెనన్న నైసర్గిక విషయ మిచట వర్ణింపబడినది. ఇక్కడ ఈ వాచ్యార్థమునకు మించిన

1. పోతన చరిత్రము : 2-23
2. పోతన చరిత్రము : 2-69
3. పోతన చరిత్రము : 2-70

వ్యంగ్యార్థమొకటి భాసిల్లుచున్నది. పోతన రచించిన భాగవతమును రసజ్ఞులు సేవింపగా రాజ్య మదాంధుడగు సింగనృపతి దాని శైథిల్యమునకు కారకుడగు నన్న భవిష్యద్విషయమించు ధ్వనించు చున్నది. దీప్తి మత్కావ్య పత్రాలనగా దీప్తిమంతములగు కావ్య పత్రాలనియు దీప్తిగల నా కావ్యపత్రాలనియు శ్లిష్టరామ ణీయకము సంతరింపజేసి పోతన కావ్యపత్రాలను కొంత చెదలు తినగలదను భావి దుర్ఘటన వ్యంగ్యముగా స్ఫురింపజేయుట జరిగినది. కావ్యకథలో పోతన ప్రప్రథ మున చెప్పిన పై రెండు పద్యాలలోను నతని భాగవతమునకు భవిష్యత్కాలమున సింగభూపాలుని చేత శైథిల్యహాని జరుగ గలదని ధ్వనించునట్లు కూర్చుట విశేష విషయము.

పేద జవరాలి మానభంగమునకు యత్నించిన యువక భూస్వామికి పోతన అన్యాపదేశముగా వినిపించిన హితోపదేశక పద్యములు ధ్వనివిలసితములై యొప్పారుచున్నవి.[1] ఈ విషయమును

> "ఒక్కరని నిర్ణయింపక ముక్కుకు సూటిఁజని హృదయమున నాఁటుకొనన్
> జక్కని ధ్వనితోఁ బద్యము లక్కవి పఠియించె మిత్రుఁ డౌనన నిట్టుల్"[2]

అని కవిగారు సైతము సూచించినారు. ధ్వనికావ్యముగా సాగిన ఎనిమిది పద్యా లలో కొన్నిటిని దిగువ నుటంకింతును.

> "సృష్టి సౌందర్య సంపదఁ జేతములకు హాయి నొనఁగూర్పఁగా దిద్దె నాదిశిల్పి
> యట్టి చిత్రమ్ముపై స్వార్థ హస్తముంచి మైలపఱచుట పాడియె మానవునకు."[3]

> "కొలని సహవాసమెడఁబాప జలజకాంత చివరికొక చుక్క మధువేనిఁ జిందఁ గలదె
> మనసు నొప్పించు త్రోవలఁ జనకు పాంథ! చిక్కదానందధామ మా సీమలందు."[4]

1. పోతన చరిత్రము : 2-112 నుండి 119 పద్యములు
2. పోతన చరిత్రము : 2-111
3,4, పోతన చరిత్రము : 2-112, 115.

"గుండె యసిగాయ మొనరింపఁ గుందు కనుల బాష్పములె హింసకు
శరమ్ముఁ బగులుచవొకొ
స్వీయగతి నడ్డు పర్వత శిఖర తతుల వనరు మేఘమ్మె పిడుగయి
వ్రాలదొక్కొ"[1]

ఈ పద్యాలలోని భావములు పరస్త్రీపై అత్యాచారము చేయబూనిన యువక భూస్వామి హృదయమునకు సూటిగా తాకునట్లు ధ్వనిగర్భితములై యున్నవి. ఈశ్వర సృష్టిలోని సుందర వస్తువులలో స్త్రీ యొకటి. అట్టి స్త్రీలపై కన్నువేసి స్వార్థకామమునకు బలిచేయుట ధర్మము కాదనియు, ఒక మగనాలిని సంసారము నుండి యెడబాపినచో ఎట్టి ఆనందమందించ జాలక పోవుటయే కాక ఆ యత్యాచారము వల్ల తాపమై పాపము చుట్టుకొనుననియు, ఒకరి మనస్సు గాయపరచినచో ఆ కార్చే కన్నీరే తన పతనమునకు హేతువు కాగలదనియు క్రమముగా ఈ పద్యములవల్ల వ్యంగ్యముగా ఉపదేశము లభించుచున్నది.

పోతన యువక భూస్వామి చెంతకు వచ్చి యతడు శృంగార నైషధము పఠించుచున్న విషయము తెలిసి సంతోషించి, 'రాజకవి కృతి కడుఁ జక్కని గ్రంథరాజ మది కాంక్షను బఠియించెదవు నీవు సత్కావ్య'మని మెచ్చి

"తరుణుఁడ వవివాహితుఁడవు సరసుఁడవున్ జిన్ననాటి సఖుఁడవు సుకళా
భిరతుఁడ వనుచును నా కావ్యరమను గొని వచ్చితిని నవధరింపఁదగున్"[2]

అని హితోపదేశ కవిత వినిపించెను. ఇక్కడ కావ్యగౌరవము చేత శృంగార నైషధమును పోతన వినుతించినను 'తరుణుఁడ వవివాహితుఁడవు' అని మిత్రుని సంభావించుటచేత యువకుడును నవివాహితుడును నగు నతడు శృంగార కావ్యములు చదివినచో నిగ్రహము కోల్పోయి కామోద్రేకి యగుట కవకాశము కలదని వ్యంగ్యముగా బోధించినట్లయినది.

పొలాలవద్ద మొదటిసారి శ్రీనాథుని దర్శించిన పోతన ఆతనిని తన యింటి కాహ్వానించుచు "మీఁదగురాక మాకిపుడు కళ్యాణప్రదం బెంతయున్"[3] అని యన్నమాట శ్రీనాథుని చెల్లెలితో పోతనకగు భవిష్యత్కల్యాణమును ధ్వనింప జేయుచున్నది. అట్లే యింటికి వచ్చిన శ్రీనాథుని సత్కరించి కేసన పలికిన

1. పోతన చరిత్రము : 2-119
2. పోతన చరిత్రము : 2-109
3. పోతన చరిత్రము: 2-174

"మీదు రాకపోక మీ కోసమే కాక మాకు శుభదము"[1] అని నుడువుటలోను భావి కళ్యాణ విషయము వ్యంగ్యముగా తెలియుచున్నది. ఇట్లే భవిష్యత్కథా సూచకములు కావ్యమున ననేక సందర్భములలో ధ్వని స్ఫూర్యావహముగా హృదయావర్జకముగా పొదలింపబడియున్నవి.

పండిన పొలాలను పాడు చేయునట్టి చెడగొట్టు వాన కురియు సూచనను,

"అంతటిలోనె యుత్తర దిశాంగణ మందుఁ దటిత్కుమారి వి
భ్రాంతిని గొల్పు క్రొమ్మెఱుఁగు బంగరు పాచిక బాఱవైచుచున్
బంతముఁ బూని పోతన తపమ్మల పంటలఁ బాడుసేయఁ గొం
డంత ప్రయత్నముల్ జరుపునంచు బయల్పడె నబ్దముల్ దివిన్"[2]

అని వర్ణించుట జరిగినది. ఇందు తటిత్కుమారి పంతము బూని పోతన శ్రమపడిన పంటలు పాడుసేయ మహాప్రయత్నము చేసినదను వాచ్యార్థమును మించి నర్సమాంబ అభినివేశముతో విలాస విభ్రమములు ప్రదర్శించి పోతన తపమును భంగపరచగలదన్న భవిష్యద్ఘటనను స్ఫురింపజేయు వ్యంగ్యార్థము రమణీయమై యొప్పుచున్నది.

తన దర్శనార్థము వచ్చిన నారయాదులను గాంచి సంతోషించి సింగభూపాలుడిట్లు పలికెను.

"తలఁప మూవురు మూడు వేదములు గాఁగ జెడిన యేకార్యమని చక్కఁ బడఁగనుండ
నవతరించితిరో మీరలవని, మీదు ఘన యశస్సాంద్ర చంద్రికా కాంతులెవియొ!"[3]

ఇందు నారయాదులు భాగవత శిథిల భాగములను పూరించగలరన్న భవిష్యద్వృత్తాంతము ధ్వనిగర్భితమై యున్నది.

నారయాదులు పోతన యాంధ్రీకృత భాగవతమును ప్రస్తుతించి వెడలిన పిదప సింగనృపాలుడు దానిపై మక్కువగొని తత్కృతి నంకితముగొను కాంక్షను వ్యంగ్యముగా వెలిబుచ్చగా శ్రీనాథుడది గ్రహించి యన్నమాటలలో భవిష్యద్ఘటన ధ్వనించుచున్నది.

1. పోతన చరిత్రము : 2-194
2. పోతన చరిత్రము : 3-84
3. పోతన చరిత్రము : 7-93

"అనుటయు నింగితజ్ఞుఁడగు నట్టి మహాకవి సార్వభౌముఁడా
మనుజపతిం గనుంగొనుచు మానస వీథుల సంతసమ్ము తా
నినుమడిగాఁగ నిద్ది తమకీడగు వాంఛ యవశ్యమేను బో
తనకిది తెల్పి తత్కృతి ముదంబెసఁగన్ గొని వత్తు నియ్యెడన్"[1]

ఇందు 'ఇద్ది తమకీడగు వాంఛ' యని శ్రీనాథుడనుటలో రాజున కనుగుణమగు వాంఛ యను వాచ్యార్థముతో బాటతనికి కీడు కలిగించు వాంఛ యని భవిష్యద్దుష్ట పరిణామములను దెలుపు వ్యంగ్యార్థము భాసిల్లినది.

మణిగిరిలోని కవిపండితులు భాగవతశ్రవణార్థము వచ్చి సంభావింపగా పోతన వారిని గౌరవించి వినుతించుచు నిట్లు నుడివెను.

"మణిగిరియు మిమ్ముబోల్ జాతి మణులఁ గాంచి యనవరతము సార్థక
నామ యగునుగాత!
నిజముగా మీదు విజ్ఞాన నిష్ఠఁగాంచ నిచటనేఁ బుట్టనైతినంచెదఁ దలంతు"[2]

ఇచట పోతనయే వరదాచార్యులుగా మణిగిరి (మడికొండ) లో పుట్టి అభినవ పోతనగా ప్రశస్తిగాంచి యొకనాటి తన యభిలాషను కృతార్థము చేసికోన్నారేమో యనునది ధ్వనించుచున్నది.

నర్సమాంబ కావించిన దుర్గాస్తవములో దిగువ పద్యము ఆ సర్వమంగళా దేవి దివ్యసౌందర్య సర్వస్వమును వ్యంగ్యముగా సాక్షాత్కరింప జేయుచున్నది.

"నడయాడున్ భవదీయ కాయమయి సౌందర్యార్ణవం బీకటిన్
బుడమిన్ దట్టుచు మధ్యసీమ గగనమ్మున్ ముట్టుచున్ నాభిలో
సుడులన్ జుట్టు వళిన్ దరంగగతి లేచున్ గ్రీవలో శంఖమై
యొడుపుల్ బెట్టుచుఁ జన్గవన్ రజత హేమోర్వీధ్రముల్ నెట్టుచున్"[3]

ఇందు పరమేశ్వరీ సుందరాంగములను రమణీయోపమానములచే భాసమాన మొనర్చి సౌందర్యజలధి శరీరము దాల్చి శోభిల్లుచున్నదని ధ్వని విలసితముగా వర్ణింపబడినది. ఆ జగదంబకు భూమి కటిగా ఆకాశము మధ్యముగా ఇత్యాదిగా అమరినట్లు వర్ణితమై ఆమె విశ్వరూపిణి యని వ్యంగ్యముగా తెలుపబడినది.

1. పోతన చరిత్రము : 7-147
2. పోతన చరిత్రము : 9-72
3. పోతన చరిత్రము : 3-131

నర్సమాంబ నగజాతస్తుతి యొనర్చి పొలాలవద్దకు చేరబోవు వేళ మొదలైన వానను గూర్చిన వర్ణనలో క్రింది పద్యము ధ్వని విశేషహృద్యమై యలరారుచున్నది.

"సద్దుగ మేడలెక్కి కనుసైగ లొనర్చెడి మేఘసంతతిన్
వద్దని సస్యకాంత తలత్రాలిచె గర్భభరాలసాంగియై
వద్దననేని త్రాగి పయివచ్చిపడెన్ ప్రజ నష్టమౌట తా
నద్ది యెఱుంగఁడెంతటి ఘనాహ్వయుఁడైనను త్రాగుబోతనన్"[1]

ఇందు అలంకారధ్వని శోభిలుచున్నది. కోతకు సిద్ధముగా నున్న వరి యందు పూర్ణగర్భిణీస్త్రీత్వమును, సముద్రజలము త్రాగి వచ్చిన మేఘుని యందు త్రాగుబోతు లక్షణమును ఆరోపించి ప్రజాశబ్దము చేత శ్లేషచమత్కారము కావించి మనోజ్ఞమైన వ్యంగ్యార్థము భాసిల్లజేయుట జరిగినది. త్రాగుబోతైన మగడు బాగుగా త్రాగివచ్చి నిగ్రహము కోల్పోయి గర్భస్థ శిశువునకు హాని జరుగునని తలపక పూర్ణగర్భవతియగు భార్యను వలదన్నను వినక కవయగోరు నన్నది యిందలి ధ్వని.

తటాకమున స్నానము చేసి తడిసిన యుడుపులొడలి కంటుకొని యుండ నిలిచిన నర్సమాంబ శరీరమున పోతనకు సాక్షాత్కరించిన దివ్యసౌందర్యమిట్లు వర్ణింపబడినది.

"మీలతో, నాఁచుపెనఁగు పద్మాలతోడఁ దడలు జడనల్లి సుడిగొని
ఉడగలెగయ
స్వర్ణసౌందర్య దివ్యశోభాస్రవంతి పారునేఱులై సొంపారు పడఁతిమేన"[2]

ఇచట పడతిమేన స్వర్ణసౌందర్య దివ్యశోభాస్రవంతి యేఱులై పాఱు నన్న దానిలో నొక ధ్వనిధుని రమణీయముగా ప్రవహించుచున్నది. ఈ వర్ణనలో ఆమె శరీరశోభ బంగరు చాయ గలదనియు, నేత్రములు మీలను బోలుననియు, శిరోజములు నాచువలె నుండుననియు, కేశసంయుతమగు ఆ మోము నాచుపెనగొన్న

1. పోతన చరిత్రము : 3-138
2. ,, ,, : 3-176

పద్మము పంటిదనియు, త్రివళులు అలలవంటివనియు, నాభి సుడిని బోలినదనియు, వక్షోజములు బుడగలవంటివనియు మిక్కిలి వ్యంగ్య చమత్కారముగా ఆమె సౌందర్యము వర్ణింపబడినది. ఇందు 'స్వర్ణ సౌందర్య దివ్య శోభాస్రవంతి పారు నేఱులై' యన్నదానిలో ముఖ్యముగా ధ్వని సారభూతమై రంజింపజేయుచున్నది.

పోతన విరహార్తితో సతితోగూడి పొలాలనుండి యింటికి చేరబోవుచు శరచ్చంద్రికా శోభలను గాంచుచు భావించిన దిగువ పద్యమున శృంగార రసధ్వని ముద్దులు గులుచుచున్నది.

"ప్రకట శరత్కాలా విభవ భాసురమౌ ఋతుకాల మందునన్
బకబక నవ్వసాగెను విభావరి, తారకలీను మల్లికా
నికర వికీర్ణ రమ్య శయనీయ సితాంబర సీమ వాయుడో
లికల నిశాపతిన్ గలిసి లీలఁ జెలంగి సుఖాళిఁ దేలుచున్."[1]

ఇందు ఋతుకాలమున కామ కళలచే శోభిల్లుచున్నదై మనోజ్ఞముగా నలంకరింపబడిన పుష్ప శయ్యపై నిరీక్షించియుండి చేరవచ్చిన తన హృదయేశ్వరుని గూడి సుఖాబ్ధి నోలలాడు వాసక సజ్జిక యను శృంగార నాయిక శృంగారలీల ధ్వనించుచున్నది.

పోతన దంపతుల ప్రథమ సమాగమ వర్ణనలోని దగు దిగువ పద్యమున మరొక రసధ్వని రమ్యమై రంజిల్లుచున్నది.

"ఆ వనజాక్షి నూత్నప్రణయాంకురముల్ వరరాగ వృష్టిలోఁ
దీవలు సాచి యల్లుకొని తీరగువూవులు పూచికమ్మ నె
త్తావులఁజిమ్మఁదేఁటులు సుధామధుమత్తత వ్రాలఁగా ఫల
శ్రీ విభవోన్ముఖమ్మయి చరించెను సౌఖ్యవసంత వీథులన్"[2]

ఇందు నర్సమాంబ ప్రణయమెట్లు క్రమవికాసము నంది ఫలోన్ముఖమైనదో వర్ణింపబడినది. ఆమె క్రొవ్వలపు పత్యనురాగమున నభివృద్ధిగాంచి ఆలింగనాదులు పొంది నానావిధ శృంగారభావముల చేత రమణీయమై మధురానుభవ విలసిత సుఖ పారవశ్యమున కనులరమోడ్పు చెందుచుండ సంతాన ఫలశ్రీ విభవో

1. పోతన చరిత్రము : 8-198
2. ,, ,, : 8-246

న్ముఖమయి శోభిల్లెనని రూపకవిశిష్ట వ్యంగ్యము హృదయాహ్లాదకరమై యొప్పారు చున్నది.

నర్సమాంబ గర్భవతియైన విషయ మీ క్రింది పద్యమున వ్యంగ్యాభిరామ ముగా వ్యక్తీకరింపబడినది.

"సరస సౌరభ్య సౌకుమార్య సంపదన్విత చూత పుష్పమ్ముతాను
ఫల దశనుగాంచె సుమనోజ్ఞ కళలఁగూడి యధిగత ప్రయోజన
సుకావ్యమ్ము వోలె"[1]

సరస సుందర సురభిళ సుకుమారమైన మావిపూవు ఫలించినదనుట వాచ్యార్థము కాగా రూపగుణ ప్రణయాఖికాభిరామయగు నర్సమాంబ పోతనను గూడి గర్భవతి యయ్యేననుట వ్యంగ్యార్థము. ఇట్టి సుమనో మనోజ్ఞ ధ్వనికి మరొక చాటువ పుష్పలావిక పోతనతో సంభాషించి నప్పటి సందర్భమున తిలకించ వచ్చును.

"అనుట లా యెమ్మెలాఁడి తానతనిఁ గాంచి మధుర దరహాసములు మొల్ల
మాల లల్ల
దాడిమ ఫలాల గిల్ల నేత్రములు చలుప కలువ పూరేకులన్ జల్లఁ
బలికె నిటుల"[2]

ఇచట పుష్పలావిక మనోజ్ఞ మందహాస వదనయై దాడిమీఫల సంకాశమైన దంతములు వెలియ కలువ రేకులవంటి కంటి చూపు లొలయ పలికెనని ధ్వనించు నట్లు రమ్యముగా వర్ణించుట జరిగినది. మరియు ఇందులో 'మొల్ల మాల లల్ల', 'దాడిమ ఫలాల గిల్ల', 'కలువ పూరేకులన్ జల్ల' అనుట చేత తన మనోహర విలాసములచేత పుష్పలావిక పోతనను పుష్ప ఫలాదులచేత పూజించినట్లైనదని ధ్వనించుచున్నది.

కావ్యమున ఆయా సందర్భములలో కొన్ని పాత్రల గురించి వర్ణించి నపుడు హృదయంగమమైన ధ్వనిని విరాజిల్ల జేయుట యొక విశిష్ట విషయము. ఇది ముఖ్యముగా శ్రీరాముని యొక్కయు సరస్వతీదేవి యొక్కయు అపర మూర్తులైన దీన భిక్షుకుని రామశర్మను జంగమ కన్యను జ్యోతి పుర రాజ్ఞిని గురించి చెప్పినపుడు గుప్పు మనుచున్నది. భిక్షుకుని తన ఇంటికి తోడుకొని వచ్చి పోతన తన సతితో నతని గూర్చి యిట్లు చెప్పెను.

1. పోతన చరిత్రము : 3-258
2. ,, ,, : 4-37

"కన వశమ్ముగా దీతని గతిఁదలంపఁ జెప్ప వశముగా దీతని స్థితిని గాంచ
నితని లక్ష్యమ్ము నిడువార లెవరు గలరు మానినీ! తా నితఁడు
నొక్క మానవుండె "[1]

ఇక్కడ 'భిక్షుకుని అతిదీన స్థితిగతులు దుర్భరములు, ఇతని నెవ్వడును సరకు చేయడు. ఇతడు కడు హీనుడగుట చేత మనుజులలో లెక్కకు రాడు' అన్న వాచ్యార్థము పొదలుచుండగా ఇతని స్థితిగతులు కనుటకు అనుటకు వీలుకానివి. ఏ ముముక్షువో తప్ప నితనిపై చిత్తము నిల్పువారులేరు, ఇతడు మనుష్యుడు కాడు దేవుడు అన్న వ్యంగ్యార్థము అంతర్గర్భితమై క్రమమై మెదలుచున్నది. భిక్షుకుడు చీకటిలో మటుమాయమైన పిదప వెదకి కానక పోతన శ్రీరాముడే భిక్షుక రూపమున వచ్చి దయతో గంట మిచ్చి వెళ్లెనని యార్తితో పలికిన మాటలు పై యధ్యాహారమున కపకాశ మిచ్చుచున్నవి.

పోతన యింట లేనివేళ వచ్చి విప్రుడు మల్లనతో,

"విను రామశర్మ యందురు నను, వసతి యయోధ్య పురమునాఁ బడు
గ్రామ
మ్మనఘా! నీ వాగ్వైఖరిఁ గనఁ బోతనకాత్మజుఁడవుగా మదిఁ దోఁచున్."[2]

అని పలికిన దానిలో వచ్చిన యతడు శ్రీరాముడే యని ధ్వనించుచున్నది. రామశర్మతో మల్లన, నర్సమాంబ సంభాషించిన మాటలును ధ్వని గర్భితములై యున్నవి. తర్వాత వచ్చిన పోతన రామశర్మ సాక్షాత్తుగా రాముడే యని గ్రహించి నిర్భర భక్తి తాత్పర్యములతో ప్రస్తుతించిన విషయ మీ తలపును బలపరుచుచున్నది.

ఇక జంగమ కన్యోదంతమును పరిశీలించినచో నదియొక రమ్య ధ్వని కావ్యమై సాక్షాత్కరించును.

"చెక్కి చేసినట్టు చెలువమ్ము దలఁపించుఁ బోఁత పోసినట్లు పొంకమమరుఁ
బటము వ్రాసినట్లు బరఁగు భామిని రూపుఁ గాంచ మూఢుఁ గూడఁ
గవి నౌనర్చు"[3]

1. పోతన చరిత్రము : 5-264
2. పోతన చరిత్రము : 6-128
3. పోతన చరిత్రము : 7-807

అని జంగమ కన్యను వర్ణించిన దానిలో ఆమె రూపము గాంచిన మూఢుడు కవి యగు ననుటచేత ఆమె సరస్వతి యని ధ్వనించుచున్నది. మరియు జంగమ కన్య తన వర్తనమును తెలుపుచు "సాహితీ సత్కళా సక్రమతిని, పేరు కళావతి.... కవిలోక దర్శనాకాంక్ష మెండు...."[1] అనుటలోను "నేను మీకొక్కటి మీదు శారదయు నొక్కటియా...."[2] అనుటలోను ఆమె వాగ్దేవి యని వ్యంగ్యముగా స్ఫురించుచున్నది. ఆమె శ్రీనాథునకు రత్నాంగుళీయక మిచ్చిన విషయము వాణి యతనికి సంపద సమకూర్చుచున్నదని ధ్వనించుచున్నది. ఆమె వెళ్లిపోయిన పిదప జంగమ మఠపతి చేత నామె యాతని కూతురు కాదని తెలిసి శ్రీనాథుడు విస్మితుడై యామె వేష భాషా చేష్టాదికములను స్మరించి సరస్వతియే ప్రత్యక్షమై పోతన దృఢ వైరాగ్య చిత్తమును నొక్కి వక్కాణించి పోయెనని భావించిన విషయము పై భావనను నిర్ధారించుచున్నది.

జ్యోతిపుర రాజ్ఞీవృత్తాంతము ననుశీలనగావించిన నామె మఱెవరో కాక పోతన యాతన బాపదయతో విచ్చేసిన వాగీశ్వరీదేవి యనియే వస్తుధ్వని రూపమున స్ఫురించుచున్నది.

సభలో సింగన్నపతికి వేశ్యామాత తన కూతుర గూర్చి సాటి వేశ్యలన్న విషయము దిగువ విధముగా తెలిపెను.

"పగలాఁడిక్రే గంట వలపులే పూఁచెనా రవ్వలు నీలాలు రాశిపడును
ఎలనాగ కెమ్మోవి చిలిపిగా నవ్వెనా ముత్యాలు పవడాలు ముసురుకొనును
చుణ యించుక పైఁట సవరించు కొనియెనా పైఁడి వెండియు నింట
బంతులాడు
పూఁబోఁడి పొలయల్క బొమముడుల్ గూర్చెనా యెట్టి శ్రీమంతమున్
గట్టువడును
ఔర! యందాలపుట్టి నీయనుఁగు బట్టి కళలకుం బెట్టినది పేరు కడమ మేము
దిగదుడుపు కక్కటకు రాము దీనిముందు దివ్విటీ క్రింద వెలుఁగాబు
దీపములము"[3]

---

1. పోతన చరిత్రము : 7-317
2. ,, ,, : 7-332
3. ,, ,, : 4-137

ఇందు వేశ్యాపుత్రిక కడకంట వలపు లొలుకబోసినచో రసికులు మెచ్చి రత్నాలు కుప్పలు వోయుదురన్న వాచ్యార్థము. ఆ సుందరి తెలుపు నలుపు గల కంటి చూపులు రవ్వలను నీలాలను పోలి సొగసుగా నుండునన్నది వ్యంగ్యార్థము. ఇట్లే తక్కిన పాదములతో ధ్వని విలసిల్లుచున్నది. ఈ విధముగా నిది యలంకార ధ్వని శోభితమై యున్నది.

సప్తమాశ్వాస ప్రారంభము నందలి ప్రభాత వర్ణనము (పద్యములు 3 నుండి 7 వరకు) ఆ యాశ్వాసము నందలి భవిష్యత్కథా ఘట్టములను స్ఫురింపజేయుచు ధ్వని గర్భితముగా సాగినది.

ప్రకృతి లతాంగి మిత్రు నెడఁబాయుట కోర్వక మూర్ఛ నొందె నా
తి కనులఁ జీఁకటుల్ వొడమెఁ దిన్నగ నాయమ సేదదేర్ప మం
చు కణము జల్లుచున్ విసరఁ జొచ్చెను శీతల మంద మారుత
ప్రకరము నా యుషస్సతి ప్రభాత ఖగస్వన వీణ మీటుచున్."[1]

ఈ పద్యమున తండ్రి నెడబాసి బెంగగొని దుస్స్వప్నము గనుట చేత దుఃఖించు శారదను అత్త నరసమాంబ యోదార్చెడు విషయము ధ్వనించు చున్నది.

"అక్కట! యామినీ యవనికాంతర కైతవ నాటకస్థమౌ
టక్కరి స్వప్నలోకపు విడంబనలోఁ బడి దారి తెన్నునున్
జిక్కక దేవురించు ఘన చేతనకోటిని బుంజురాయఁడున్
గొక్కరకో యటంచుఁ దొలికూఁతలఁ బిల్చె నిజాలయాళికిన్.''[2]

ఇందు అజ్ఞానాంధకారమున దాటిగానక అలమటించుచు అనేకాశలతో భ్రమ పడుచుండు మానవాళికి జ్ఞానోదయమగుటకు పిలిచి పోతన భాగవతము వినిపించు నన్నది వ్యంగ్యస్ఫోరకమై యొప్పుచున్నది.

చీఁకటి తెరలను జీల్చెడి బాకులగతి నరుగుదెంచు బాలార్కుని ది
గ్వ్యాకీర్ణ కిరణ సంతతి సోకుట ప్రకృతి హిమబాష్పశోకములుడిగెన్''[3]

---

1. పోతన చరిత్రము : 7-3
2. ,, ,, : 7-4
3. ,, ,, : 7-6

అని వర్ణించినదానిలో రాచకొండ చమూపతి కావించెడు భాగవత చౌర్య దౌర్జన్యము నరికట్టి కృతిరక్షణ చేయు వరాహమూర్తి కారుణ్యము గాంచి పోతనకును ఒమ్మెర ప్రజలకును వెతబాయునన్న విషయము ధ్వనించుచున్నది. ఇట్లే యిందలి తక్కిన పద్యాలలో సింగనృపతి భాగవతము కృతిగొన దురాశ పడుట, ఆ భ్రమ విడిపోవుట యిత్యాది విషయములు ధ్వనిగర్భితములై యొప్పుచున్నవి.

సింగనృపతి సభాప్రవేశమున కడ్డగించిన వృద్ధకంచుకిపై కినిసి నారయాదులతనిపై చెప్పిన యధిక్షేప పద్యములు ధ్వనిగర్భితమై ఆయనకు బుద్ధివచ్చునట్లు చేసినవి. మచ్చునకు కంచుకి వృద్ధాప్యమును వర్ణించుచు చెప్పిన సీస పద్యపు టెత్తుగీతియగు,

> ''ఎవ్వరోయి నీపయి బండలెత్తి వంచి తలకు సున్నము రుద్దిరి తాళమిడిరి
> వాక్కునకుఁ, గన్నులం దుమ్ముపై చిరింక మనఁగలేవు తాతా! చాల దినము
> లిచట''[1]

అని వర్ణించిన దానిలో పయిని బండలెత్తి వంచుట తలకు సున్నము రుద్దుట మున్నగువాని చేత కఠిన శిక్షకు గురిచేసి నందున నతడెక్కువ కాలము జీవింపలేడనునది వాచ్యార్థము కాగా నతడు వార్ధక్యము చేత వంగి తలవెంట్రుకలు తెల్లబడి నోట సరిగా మాటరాక కన్నులు కనబడక క్రుంగి కృశించి యున్నాడు కావున నెక్కువ రోజులు బ్రతుకజాలడన్న వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. శారద యౌవనోదయము దిగువరీతిగా వ్యంగ్యంగా వర్ణింపబడినది.

> "నివ్వాళు లిడఁగ లజ్జకు నవ్వనిత విలోల మోహనాక్షులు, మేనన్
> జవ్వనము నిండుకొన నెదఁ బువ్వులున కేదో కొఱంత పూర్ణంబయ్యెన్''[2]
>
> ''చిన్నతన మల్ల జాఱుటన్ సిగ్గుమీఱెఁబరికిణీ చీరగా మాఱి పయఁటఁగోరె
> ఆడమగ భేదమేర్పడె నంతకంత కేమొ తెలిసినట్టుల భావమేర్పడియెను."[3]

ఈ పద్యములందు అంగాంగ వర్ణనము కావింపక శారద వపు స్సౌందర్యమును, వయోనుగుణ భావపరిణామమును వ్యంగ్యచమత్కారముగా వర్ణించుట జరిగినది.

---

1. పోతన చరిత్రము : 7-72
2. " " : 8-202
3. " " : 8-208

భాగవతాపహృతి జరిగిన పిమ్మట పోతన మెట్టుకట్ట యందలి శ్రీరామునికి తన వేదన నివేదించుకొనుచు పలికిన దిగువ మాటలలో ధ్వని గుబాళించుచున్నది.

"హృదయ వాసన లీనుచు నెసఁగు మొగలి పూలకై జీవనము ధార వోయుచుంటిఁ
గాని తోడ్తోడనే కంటకములఁగూడ బెంచుచున్నాఁడ ననుచు భావించనైతి"1

సుఖములకాశించి సురుచిర సంపదల పెంపుదలకు జీవితము సాగించుచుండ ఆ సంపదల వెనువెంటనే ఆపదలు దాపరించునన్న విషయము పోతన భావించ లేదన్నది ధ్వని. భక్తితో భాగవతము రచింపగా విరక్తికి దారిదీయు విపత్తు కృత్యపహృతి రూపమున ప్రాప్తించునన్నది పోతన గ్రహించలేదు. ఈ మానసిక వ్యథ పోతనకు స్వవిషయమైనను వరదాచార్యులవారి ఆత్మాశ్రయ కవితయై సర్వ జనులకును నుపాదేయమై వరలుచున్నది.

విజయనగర సేనాపతినుండి భాగవత కృతిని విడిపించి రాచకొండ చమూపతి పోతనతో తమ ప్రభు సన్నిధిలో దానిని గొనవచ్చునని చెప్పినప్పుడు పోతన మనస్సు వికలమై వైరాగ్య భావనతో చెప్పిన దిగువ మాటలు ధ్వని గర్భితములై యున్నవి.

"ఇల మృదంగమునకు నెడమయుఁ గుడియు నా నిరుప్రక్కగతులెప్పు డెఱుఁగుటొప్పు
బోనమ్ము నిచ్చలు భుజియించుఁ బలికింప ధనధన శబ్దాలఁ దనరి యెడమ
తఱుఁగని బోనమున్ దన పొట్టనిడుకొని ఓంకారటంకృతి నొప్పు కుడియె
కుడిపైన ముక్కాలు నడక శోభించును నెడమపై పావలా నడక తగును
రాగ పట గుప్త చర్మసూత్రము బిగించి శ్రుతిఁజెడక యుంచి లయకాలఁ గతిఁ జరించి
"తద్ధితరి" యంచు మ్రోగింపఁ దగ రుచించుఁ గాని యెడమ మ్రోగుచు నున్న గతియె సున్న"2

1. పోతన చరిత్రము : 9-43
2. ,, ,, : 9-196

ఇందు మృదంగ వాదనమున జీవితయాత్ర ధ్వనించుచున్నది. మృదంగ మునకుండు నెడమ కుడిప్రక్కలు ఐహిక పారమార్థికములని వ్యంజింపజేసి ఐహిక జీవితము భోగాడంబర శోభితమై అహంభావ పూరితమై ధన్యము కాకుండుననియు, పారమార్థిక జీవితము జ్ఞాన వైరాగ్యపూర్ణమై చరితార్థమగుననియు మనుజుడు వివేకియై ఈ రెండింటి తారతమ్యము గుర్తించి యిహసుఖమున నొక పాలనుభ వించుచు పారమార్థికానుభూతిని మూడుపాళ్లు గాంచవలెననియు, 'తద్ధితరి' యని ప్రయోగించుటలో 'తత్ + హితరి' ఆ కుడిప్రక్కయే - ఆ పారమార్థిక జీవనమే తారకమని గ్రహించుట యొప్పునియు తత్త్వము వ్యంగ్యరూపమున మనోజ్ఞముగా బోధింపబడినది. ఇట్టి ధ్వని గర్భిత తాత్త్విక విషయములు కావ్యమున నందందు పసందుగా పొందుపరపబడి యున్నవి. ఇట్లే పోతన విరక్తుడై శిష్యులతో అన్న మాటలు ధ్వని విశిష్టములై యున్నవి.

"బతికినన్నాళ్ళు మాత్సర్యభావ మూని చచ్చువెనుక పాయసభక్ష్య శ్రాద్ధ మొసఁగి
తామె మెసవి లోలోఁ దృప్తిఁ దనరుచుండి మొసలికన్నీరు విడుచు నీ మూర్ఖజగతి."[1]

ఇది లోకములో జరుగుచున్న విషయము మహాపురుషుల విషయముకూడ. బ్రతికినప్పుడు సరిగా సేవింపక చచ్చినపిదప స్మారక సభలు వర్ధంతులుచేసి తమ దంభానురాగము నొలుకబోయుచుందురు. ఇక్కడ ముఖ్యముగా మహాకవుల గురించి లోకప్రవర్తన వ్యంగ్యముగా తెలుపబడినది. ఈ సందర్భమున "మహాకవి-ఆంధ్రదేశమున బ్రతికినంతకాలము చచ్చిపోయి, చచ్చిన తరువాత బ్రతుక మొదలిడువాడు" అని 'నిర్వచనములు' శీర్షికతో వ్రాసిన భమిడిపాటి వారి మాటలు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

శివుడు మోహినీ రూపరేఖా విలాసములు గాంచి విభ్రాంతుడై బహువిధముల తలపోసిన విషయములు వ్యంగ్యశోభితములై యున్నవి.

"మీనంబు పొలసుల మేన్వీడి స్నిగ్ధతం గాంచఁ దానీ లేమ కనులబడియె
కమఠంబు మృదుతను గడియింపనెంచి యూవనిత శ్రీపాదాలు పట్టుకొనియె

1. పోతన చరిత్రము : 9-207

కిటి యీమె మైకాంతి ఘటియింప స్వర్ణనిష్క వరాహగా మారుజన్మమెత్తె
హరి సర్వభూత దయాభ్యాసమునకు నీ పదతిలోనికి వచ్చినడుముకట్టె
వామనుడు మెడబడి ధనస్వామి యయ్యె రహిని రామత్రయమ్మ
నీనామరూపు
బూని సుప్త పంచశరు ప్రబుద్ధు జేసె ఘన జగన్మోహనాకృతి
గల్కియిదన."[1]

ఇందు త్రిజగన్మోహన మోహినీ సౌందర్యము వర్ణితమైనను క్రమముగా దశావతారములు వ్యంగ్య చమత్కారముగా తెలుపబడుట విశేషము. శ్రీహరి మత్స్యముగా అవతరించినప్పుడు పొలసుల మేనుండెను. అట్టి పొలసుల మేను విడిచి నునుపుగాంచుటకా మీనము మోహిని కన్నులుగా రూపుదిద్దుకొన్నది. అనగా మోహిని కన్నులు శ్రీహరి మత్స్యావతారమును స్ఫురింపజేయుచున్నవి. ఇట్లే తక్కిన అవతారములు వ్యంగ్యముగా తెలుపబడినవి.

వరాహావతార గాథలో వరాహమూర్తి హిరణ్యాక్షుని దాకగా వాడు క్రుద్ధుడై పలికిన పలుకులు ధ్వని గర్భితములు.

"....వసుధ సముద్ధరించుటకు వచ్చితె సూకర! దోర్యుగంపు నా
నస యణగాకు నీ కపట నాటకపుం బనితీరు...."[2]

ఈ మాటలలో హిరణ్యాక్షుని మదముడిగి మంటగలియుననియు, దుష్టశిక్షణార్థమవతరించిన వరాహమూర్తి కార్యము ఫలవంతముగా ముగియుననియు ధ్వనించుచున్నది.

హరిభజన మానుమని కొడుకును గద్దించి పలుకుచున్న హిరణ్యకశిపుని పలుకులకు తోడుగా గురువు బుద్ధి గరపుచుండ నతనితో ప్రహ్లాదుడాడిన మాటలు ధ్వని గర్భితములై చెలువొందుచున్నవి.

"వైకుంఠు బొగడని వక్త్రమ్ముఢక్కానాదవి దేవళమ్ములోనద మొనర్చు
హరిపూజనములేని హస్తంబు దర్వినా నదె యన్నపూర్ణ హస్తాయుధమ్ము
విష్ణుభక్తియెలేని విబుధుండు పశువన్న నదె మహాదేవు వాహనము సతము

1. పోతన చరిత్రము : 11-133
2. ,, ,, : 11-191

కంజాక్షునకుఁగాని కాయంబు భస్త్రినా నది రాగిఁ గరఁగి దేవాకృతి నిడు
చక్రిచింత లేని జన్మ బుద్బుదమన విష్ణు పాదవారి వెలయు నదియు
శ్రీపుఁ గనని కనులు శిఖిపింఛ నేత్రమ్ములనిన దేవ సన్నిధినవి యలరు"[1]

ఈ పద్యము శ్రీ మహాభాగవతము- ప్రహ్లాద చరిత్రలోని 'కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవన గుంభిత చర్మ భస్త్రిగాక' యను సుప్రసిద్ధ పద్యము ననుసరించుచునే విశిష్టార్థమును దెలుపుచున్నది. వైకుంఠు బొగడని వక్త్రము వక్త్రముగాదు ఢక్కయని భాగవతము నిరసింపగా, ఢక్క తోడను పోల్చరాదు ఏలయన ఢక్క దేవాలయములో ఈశ్వర సేవార్థము నినదించును. కనుక వైకుంఠు బొగడని వక్త్రము ఢక్కకన్న కడుహీనమైనదన్న వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. ఇట్లే తక్కిన పాదములందలి ధ్వనిని గ్రహింపగలము. ఇందులో నిట్టి యర్థమే కాక మరొక విశేషము నిక్షిప్తమై యున్నది. పద్యములోని యుపమాన ద్రవ్యము లన్నియు శివాలయమున నుపయోగపడునవిగా కవిగారు వర్ణించినారు. ఢక్క, అన్నపూర్ణ హస్తాయుధమగు దర్వి, మహాదేవు వాహనమగు పశువు, రాగిని గరగి దేవాకృతినిచ్చు భస్త్రి, విష్ణు పాదవారి వెలయు గంగా బుద్బుదము, శిఖిపింఛ నేత్రములు- ఇవి శైవ దైవాయతనములకు చెందినవి. ఇట్టి వర్ణనచేత విష్ణుభక్తిహీనములైన వక్త్రాదులను ఢక్కాదులతో నుపమింప రాదనియు ఏలయన నవి కనీసము శివభక్తియైన కలిగియున్నవనియు వ్యంగ్యముగా స్ఫురించుచున్నది.

రుక్మిణీదేవి నూతన యౌవనమును వర్ణించిన దిగువ పద్యమున ధ్వని చెలువొందుచున్నది.

"ఓమనగుంట లాడుకొను నొక్కట నచ్చన గిల్లలాడు నా
కోమలి పూర్వమట్టు లుఱుకుల్ పరువుల్ గల యాటలాడఁగా
నేమియొ సిగ్గుజెందు ధరియించిన పయ్యెద చాటులో నెదో
యామని దెచ్చె నామె నవ యౌవనఘుల్ నృప మందిర స్థలిన్"

అంగ వర్ణన లేకయే రుక్మిణి నవయౌవన దివ్యసౌందర్య శోభ యిందు మనోహరముగా ధ్వనించుచున్నది.

ఈ రీతిగా మహాకావ్యమున అనేకానేక సందర్భము లందు రమణీయధ్వని రాజిల్లి రసజ్ఞ హృదయములను హరించుచున్నది.

———

# ఔచితీ రామణీయకము

## ఔచిత్య ప్రాధాన్యము :

కావ్యమున ఔచిత్యమునకు విశిష్ట స్థానము గలదు. దేనికేది తగినదో యది ఉచితము. ఉచితము యొక్క భావమే ఔచిత్యము. కావ్య రచన కెట్టి వస్తు వుచితమో, ఆ వస్తు వేరీతిగా సంగ్రహించి యెట్లు నిర్వహింప వలెనో, ఏరసాదు లెచ్చట నెట్లు పోషింపవలెనో ఈ మొదలగు విషయము లెల్ల ఔచిత్య పరిధిలోనికి వచ్చును. ఔచితీశోభితమైనప్పుడే కావ్యము రమ్యమై రసవంతమై రాజిల్ల గలదు.

క్షేమేంద్రుడు కావ్యమున కౌచిత్యమే ఆత్మయని సిద్ధాంతీకరించెను. అతడు దిగువరీతిగా తన మతమును ప్రతిపాదించెను.

"ఔచిత్యస్య చమత్కార కారిణశ్చారు చర్వణే రస జీవిత భూతస్య
విచారం కురుతేఽధునా
కావ్యస్యాఽ ల మలంకారైః కిం మిథ్యాగుణితైర్గు ణైః యస్య జీవిత
మౌచిత్యం విచిన్త్యాఽ పి న దృశ్యతే
అలంకారాస్త్వలంకారా గుణా ఏవ గుణా స్సదా ఔచిత్యం రససిద్ధస్య
స్థిరం కావ్య జీవితమ్"[1]

అనగా "రసమునకు జీవిత భూతమును, చమత్కారావహమును నగు ఔచిత్య మును గురించి విచారింతుము. కావ్యమునకు జీవిత భూతమైన యౌచిత్యము లేనిచో అలంకారములేల ? గుణములేల ? అలంకారములు కేవల బాహ్య శోభాకరములగు నలంకారములే యగును. కాని జీవితము కాదు. అట్లే గుణములును జీవితము కాదు. కావున రసవంతమగు కావ్యమునకు ఔచిత్యమే జీవితభూతము" అని విశదీక రించెను. మరియు నతడిట్లు తెలిపెను.

"ఉచిత స్థాన విన్యాసా దలంకృతి రలంకృతిః
ఔచిత్యాదచ్యుతా నిత్యం భవన్త్యేవ గుణా గుణాః"[2]

---

1. ఔచిత్య విచార చర్చ : 3, 4, 5 శ్లోకములు.
2. ఔచిత్య విచార చర్చ : 6 వ శ్లోకము.

ఉచిత స్థానమున నిలిపినపుడే యలంకారము లలంకారము లగును. అట్లే యౌచిత్యమును వీడనపుడే గుణములు గుణములగును." అని కావ్యమున నౌచిత్యమునకు గల ప్రాధాన్యమును నొక్కి వక్కాణించెను.

ఈ యౌచిత్యము పదమున, వాక్యమున, ప్రబంధార్థమున, గుణమున, అలంకారమున, రసమున, క్రియయందు, కారకమున, లింగమున, వచనమున, విశేషణమున, ఉపసర్గమున, నిపాతమున, కాలమున, దేశమున, కులమున, వ్రతమున, తత్త్వమున, సత్త్వమున, అభిప్రాయమున, స్వభావమున, సార సంగ్రహమున, ప్రతిభ యందు, అవస్థ యందు, విచారమున, నామమున, ఆశీస్సున నుండునని క్షేమేంద్రుడు తెలిపి వీని కన్నింటికిని ఉదాహరణములను జూపెను.

ఈ యౌచిత్య విషయమును క్షేమేంద్రుడు ధ్వనికారుని నుండి గ్రహించి నట్లు తెలియును.

"అనౌచిత్యా దృతే నాన్య ద్రస భంగస్య కారణమ్ ప్రసిద్ధౌచిత్య
బంధస్తు రసస్యోపనిషత్పరా"[1]

"రసభంగమునకు అనౌచిత్యమున కన్న వేరు కారణము లేదు. చక్కని యౌచిత్యముగల కావ్యము రసోపనిషత్తే" అని చెప్పిన ధ్వనికారుని యభిప్రాయమును గ్రహించి క్షేమేంద్రుడు పై సిద్ధాంతమును స్థాపించెను. ఇతడానంద వర్ధనుని ధ్వనిమతమును గూర్చి ఖండన మండనము లేమియు చేయలేదు. 'ఔచిత్యం రస సిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్' అని రసవంత మగు కావ్యమునకు ఔచిత్యము జీవితభూతమని చెప్పుట చేత కావ్యమున రసమునకు గల ప్రాధాన్యము నితడు కాదనలేదని తెలియుచున్నది. ఆనందవర్ధనాభినవగుప్తులు సిద్ధాంతీకరించిన ధ్వని, రసధ్వని యను వాని ననేకాలంకారికు లామోదించి బల పరచి నందున నవియే సాహిత్య లోకమున ప్రధానముగా స్థిరపడి పోయినవి. ఐనను ధ్వనికారుని 'అనౌచిత్యాదృతే' యను నభిప్రాయానుసారముగా క్షేమేంద్రుడు ప్రతిష్ఠించిన యౌచిత్యమనుపాదేయము కాజాలదు.

1. ధ్వన్యాలోకము : పుట 330.

ధ్వనికారునికి ప్రాచీనుడగు దండియు కావ్యమున నౌచిత్యమునకు గల ప్రాముఖ్యము నుల్లేఖించెను.

కామం సర్వోఽప్యలంకారో రస మర్థే నిషించతి తథా ప్యగ్రామ్య
తైవైనం భారం వహతి భూయసా''1

అనగా సర్వ విధములైన శబ్దగత - అర్థగత - ఉభయగత - అలంకారములును రసస్ఫోరకములగును. ఐనను ఈ భారమును అగ్రామ్యత్వమే అనగా అనౌచిత్య రాహిత్యమే వహించుచున్నది. అని దండి కావ్యమున నౌచిత్యమునకు గల వైశిష్ట్యము నుగ్గడించెను.

ఔచిత్యమనునది సమస్త విషయములలో నుత్కృష్టత నాపాదించునన కావ్యమున నాపాదించకుండునా? ఆలంకారికులు వస్త్వలంకార రసధ్వన్యాదులను ప్రతిపాదించి వాని స్వరూప స్వభావములను వివరించి వానిలోని గుణదోషములను తెలిపి ప్రయోగౌచిత్యమును సయితము సూచించి యుండిరి. అందువలన ఔచిత్యము వలదన్నవారు లేరని నిరూపిత మగుచున్నది. కాగా ఔచిత్యమే కావ్యమున ప్రాధాన్యము వహించునని క్షేమేంద్రుడు వాదించి సిద్ధాంతము చేసెను. ఔచిత్యమే కావ్యాత్మయని సర్వులు సమ్మతింపకున్నను ఔచిత్య వైశిష్ట్యమును కాదనువారుం డరు.

పూర్వ కవుల కావ్యములు చాలవరకు ఔచిత్యశోభితములై యొప్పుచున్నవి. నన్నయ తిక్కనాదులీ యౌచిత్యము పాటించి తమ కావ్యములకు వన్నె కలిగించిరి. శ్రీనాథుడు "ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు—" నైషధ మాంధ్రీకరించినట్లు కావ్యోపసంహారమున చెప్పికొని తదుక్తరీతిగనే యౌచిత్యమును పాటించి రచన సాగించెను. పింగళి సూరన కవిత చెప్పవలసిన తీరునిట్లు తెలిపెను.

"పొసఁగ ముత్తెపు సరుల్ పోహళించిన లీలఁ దమలోన దొరయు శబ్దములు గూర్చి
యర్థంబు వాచ్య లక్ష్య వ్యంగ్య భేదంబు లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రస భావములకు నర్హంబుగ వైదర్భి మొదలైన రీతులిమ్ముగ నమర్చి

1. కావ్యాదర్శము : 1-62.

రీతులకుచితంబులై తనరారెడు ప్రాసంబులింపుగాఁ బాదుకొల్పి
అమరనుపమాదులును యమకాదులు నగునట్టి యర్థ శబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు వాంఛితార్థంబు లొసఁగని వారు
గలరె"[1]

అని సూరన యౌచిత్యము పాటించి కవిత చెప్పనేర్వవలెనని యుద్ఘాటించి తానును నట్లే కావ్యములు రచించెను.

వరదాచార్యులవారు పోతన చరిత్ర పీఠిక "కవితాస్తుతి"లో "ఔచిత్య గతియె సౌందర్యమ్ము" అని ప్రస్తుతించిరి. ఔచిత్యము వలన కావ్యమున కందము సమకూడునని ఆచార్యులవారి యభిప్రాయము. ఔచిత్యానౌచిత్యముల వలని మేలు గీళ్ళను ఆచార్యులవారు కావ్యమున నొక వర్షవర్ణనలో దిగువ రీతిగా ధ్వనింపజేసిరి.

"అవసరమంచు వాఁడెఱచి యాచన చేసెడి యర్థికిచ్చు నీ
ళ్ళవి నవజీవనమ్మనిరి యట్టులె పొట్టలు నిండఁబండు భూ
తవితతి కిచ్చునట్టి యమృతమ్ము విషమ్మని రిట్లనౌచితిన్
దివిజవదాన్యుఁడైన ఘనదీపితుఁడున్ బతన స్థితిన్ గనెన్[2]

ఇది చెడగొట్టు వాన గురిసిన మేఘము గూర్చి చెప్పినది. అక్కర గల వారి కందించిన నీళ్ళను జీవనమందు రనియు, కడుపు నిండతిని త్రాగిన వారికిచ్చు నీళ్ళను విషమందురనియు (నీళ్ళకు జీవనము, విషము-అను పర్యాయము లుండుట గమనార్హము) కనుక చెడగొట్టు వాన కురిసిన మేఘుడు అనౌచిత్య దోషమునకు గురియై అంతటి దివ్యదాత ఘనుడని ప్రసిద్ధిగాంచిన వాడును పతనమై పోయెనని వర్ణించుట చేత కావ్యమున నౌచిత్యశోభిత రచన సహృదయుల కానందమే కాక కవికి సత్కీర్తి ప్రసాదించుననియు, ననౌచిత్యము వల్ల పాఠకులకు బాధకలుగు టయే కాక యెంత ఘనుడైనను ప్రబంధకర్త కపయశము తప్పదనియు వ్యంగ్య ముగా తెలియుచున్నది.

పై విషయానుగుణముగా ఆచార్యులవారు కావ్యమున నవరించిన యౌచితీ రామణీయకమును ప్రదర్శించుటయే ప్రస్తుతాంశము.

1. కళాపూర్ణోదయము : 1-88
2. పోతన చరిత్రము : 3-139

ఈ వ్యాసమున క్షేమేంద్రుడు నిర్దేశించిన రీతిలో గాక కొన్ని ప్రధానాంశములలో శోభిల్లు ఔచిత్యము చూపబడును. కావ్యము నందలి 1. ఇతివృత్తము. 2. రసము. 3. పాత్రలు. 4. వర్ణన 5. అలంకారములు 6. గుణము-అనువాని యౌచిత్యమును చర్చింతును.

## 1. ఇతివృత్తౌచిత్యము :

ఇతివృత్తము నెన్నుకొనుటలో, దానిని సంగ్రహించుటలో, రచనా ప్రణాళిక సిద్ధము చేసికొని నిర్వహించుటలో, ఇతివృత్తౌచిత్యము గోచరించును. ఆచార్యుల వారొక మహాకావ్యము రచింప దలచి సముచితమైన వస్తువు కోసము చాలాకాల మన్వేషించి పోతన జీవిత గాథ నెన్నుకొన్న విషయము, ఆ వస్తువును సంగ్రహించిన తీరు, రచనా నిర్వహణ విధానము మున్నగు విషయము లెల్ల 'వస్తుశిల్పము' వ్యాసమున చర్చింపబడెను. కవిగారు దేశకాలములకు దగిన బంగారు వస్తువు నెన్నుకొన్నారు. దానికి 'పోతన చరిత్రము' అని నాయకుని నామ మలంకరించుట యుక్తమయినది. ఇక వస్తు సంగ్రహణములో 'విభావానుభావ సంచార్యౌచిత్య చారుణః' ఇత్యాదిగా ఆనందవర్ధనుడు సూచించిన విధముగా కథ యౌచిత్యభాసురముగా మలచ బడినది.[1] రచనా ప్రణాళికలో కావ్యోపక్రమము చేర్చుటవల్ల కావ్య గౌరవము చేకూరుటయేకాక కథ పటిష్ఠమై సమంజసమై యొప్పారినది. ప్రధాన కథలోని ఘట్టములలో ఔచిత్య దృష్టితో కొన్నిమార్పులు చేయుట వలన శోభ యినుమడించినది. ఈ రీతిగా వస్తువు నందలి యేయంశమును పరిశీలించినను ఔచిత్య భాసురమై యలరారుచుండును.

## 2. రసౌచిత్యము :

కథా నాయకుడగు పోతన ధీరశాంతుడును భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నుడును నగుటచేత శాంత మంగిగా, భక్తి యంగికి కించిదూనమగు నంగముగా అనగా భక్తిరసాంతర్భూతమైన శాంతమంగిగా నిర్వహించుట మిక్కిలి యౌచిత్యవంతమై యొప్పుచున్నది. వీనికితోడు శృంగార వీర కరుణాదు లంగములుగా సముచితముగా పోషింపబడి యున్నవి. ఇందు గణనీయముగా విస్తరించియున్న శాంత

1. ఈ విషయము 'వస్తుశిల్పము'న వివరింపబడెను.

భక్తి శృంగారములకు విభావాదులను సమగ్రముగా సమకూర్చి విశిష్ట సౌంద ర్యము వెలార్చుట జరిగినది.

ప్రాయికముగా ప్రబంధములలో శృంగార మతివేలమై సభ్యతా విదూరమై యనౌచిత్యదోషమునకు భాజనమైనదను నపవాదము కలదు. పోతన చరిత్రమా యపవాద సూత్రమున కపవాదమై విలసిల్లుచున్నది. ఈ కావ్యమునందు శృంగా రము సభ్యమై సముచితమై సముద్దీపించుచున్నది.[1]

ఏరసమును నస్థాన పతితము కాక తత్తదుచిత స్థానములందే శోభిల్లుట విశిష్ట విషయము. సహజ వైరాగ్య సంపన్నుడగు పోతనకు నిండు యౌవనమున దప్ప తర్వాతి జీవితమున శృంగారము ఛాయామాత్రముగానైనా వర్ణింపక పోవుట, భోగపరాయణుడును శృంగారియునగు శ్రీనాథునియందు పుష్పలావికతో, జంగమ కన్యతో సంభాషించి నప్పుడు సింగనృపతి వనవర్ణన చేసినప్పుడొకింత శృంగార మును వెలార్చుట మిక్కిలి యుక్తమై యున్నది. ఇటే తక్కిన రసవిషయముల నౌచిత్యము ముదావహమైయున్నది. మరియు కావ్యమున రసవైరుధ్యమునకు నెక్క డను తావీయక సందర్భోచితముగా సావకాశముగా సర్వరసములను నిర్వహించిన ఆచార్యులవారి రచన యౌచిత్యాభిరామమై సౌందర్యధామమై సాక్షాత్కరించుచున్నది.

క్షేమేంద్రుడు రసౌచిత్యమును గూర్చి
"కుర్వన్సర్వాశయే వ్యాప్తి మౌచిత్యరుచిరో రసః
మధుమాస ఇవాశోకం కరోత్యంకురితం మనః"[2]

అని నుడివినట్లు పోతన చరిత్రము ఔచితీరమ్యమైన రసములచేత వసంతమశోక తరువును శోభిల్ల జేయునట్లు సకల సహృదయ హృదయముల నాహ్లాదభరితము కావించుచున్న దనుటలో సందేహము లేదు.

## 3. పాత్రౌచిత్యము :

కావ్యమునందు పాత్రపోషణ మత్యంత నిపుణముగా కావింపబడిన విషయము 'పాత్రపోషణము' వ్యాసమున చర్చింపబడెను. కావ్యనాయకుడగు

1. ఈ విషయము 'రసనిర్వహణ'లో నిరూపింపబడెను.
2. ఔచిత్య విచారచర్చ—16వ శ్లోకము

పోతన "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" యన్నట్లు శిష్టాచార పరాయణులైన లక్కాంబ కేసనలకు వ్యాసాంశలో కారణజన్ముడై పుట్టి భాగవతోత్తముడుగా భాగవతాంధ్రీకర్తగా, జ్ఞాన వైరాగ్య సంపన్నుడుగా సత్పురుషుడుగా వెలసిన యతని పాత్ర ఫలప్రదముగా, భవ్యముగా పోషింపబడిన విషయము వివరింపబడెను. అట్లే శ్రీనాథుని పాత్ర, తదితర ముఖ్యాముఖ్య పాత్రలెల్ల సత్పాత్రముగా సమంజసముగా తీర్చిదిద్ద బడినవి. ఆ పాత్రలు తమకుచితమైన వేషభాషా చేష్టాదికములే యొనర్చినవి. వైరాగ్య సంపన్నుడగు పోతన నిరాడంబరుడుగా, రాజభోగభాగ్యవిముఖుడుగా, భోగపరాయణుడగు శ్రీనాథుడు ఆడంబర మూర్తిగా కీర్తిప్రతిష్ఠలను, రాజాస్థానములను, పట్టణములను, సిరిసంపదలను వాంఛించు లౌకికునిగా చిత్రించుట జరిగినది. మంత్రోపదేశము చేసిన చిదానందుడు, భాగవతమును వాంఛించిన సింగనృపతి, ప్రాణవల్లభుని ప్రణయమునకు తహతహలాడిన నరసమాంబ, అభిమానధనుడగు మల్లన ఇట్లే తక్కినవారెల్లరు తమ గుణకర్మస్వభావముల కనుగుణముగా ప్రవర్తించినట్లు సహజరమణీయముగా చిత్రింపబడినారు. రాచకొండ ప్రభుదర్శనము చేసికొన్నప్పుడు శ్రీనాథుడే రాజును ప్రస్తుతించుట, శ్రీనాథ పోతనలు తమ పరిచయము లెవరికి వారు కాక యొకరిని గురించి మరి యొకరు చెప్పుట ద్వారా చేసికొనుట, మరియు వారు వనశోభలను తమ చిత్తవృత్తుల కనుగుణముగా శృంగార భక్తిభావములతో వర్ణించుట, రాజానురక్తయైన భోగిని విరహిణి యగు రాధికగా నభినయించుట- ఇత్యాదిగా నే సన్నివేశము తిలకించినను నౌచిత్యరమ్యమై యొప్పుచున్నది.

కావ్యరంగముల పాత్రలయునికి ప్రవేశ నిష్క్రమణములు మిక్కిలి సముచితములై యున్నవి. మంత్రోపదేశము చేసిన చిదానందుడు, పోతన భాగవతాంధ్రీకరణమునకు గుర్వాశీర్వాదమునకు వెళ్ళినప్పుడు మాత్రమే మరల సాక్షాత్కరించును. పోతన సాయము పొందిన పేద జవరాలు వరాహమూర్తి వలన భాగవత రక్షణ జరిగిన సందర్భముననే ప్రత్యక్షము అగును. నర్సమాంబ మల్లన మున్నగువారు తమమేరమీరి వర్తించుట గాని, అనవసరముగా కథలో ప్రవేయము పెట్టుకొనుటకాని జరుగలేదు.

పాత్రల సంభాషణములును ఔచితీ రుచిరములై యున్నవి. ఈ విషయము ప్రధాన పాత్రలగు శ్రీనాథ పోతనాదులలోనేకాక అప్రధాన పాత్రలందును గోచరించును.

"ఇంటింటి కరుగుచును మీ బంటుకు బానిసను గింత బారెయ్యవ్వా!
కుంటోణ్ణి పున్నెముంటది యంటయు నే తల్లికిన్ దయలు రావయ్యేన్"[1]

ఇందు దీనభిక్షుకుడాడిన మాటలు పరమసహజమై హృదయాపర్జకమై యున్నవి. 'ఇంత' అనునర్థములో గింతయని పలుకుటలో నతడు తెలంగాణములోని బమ్మెర ప్రాంతము వాడని నిస్సందేహముగా విశదమగుచున్నది. పాత్రోచితమే కాక ప్రాంతోచితమగు మాండలికమును గూడ ప్రయోగించి మహితౌచిత్యమును ప్రదర్శించినారాచార్యులవారు.

'నరసింహావతార గుణానుభూతి'లో బాల ప్రహ్లాదుడు తండ్రిని గని ముద్దు నుడుల నిట్లు పలికెను.

''అరిని నాలాయనుని పలుడని పతింతు,కొత్తుమను కామ కోపాల గోనిదలచి
అనిన నీముద్దుగీతి కర్ణామృతమని బాలునెత్తి ముద్దాడి యిప్పగిదిఁ బల్కె''[2]

'హరిని నారాయణుని పరుడని వచింతు కొట్టుదును కామకోపాల ఘోణిఁ దలఁచి' యనుదానిపై పై పద్యమున వచ్చిరాని జిలిబిలి పలుకులు ప్రహ్లాద శిశువుచే పలికించుట నితాంత మౌచితీమంతమై యలరించుచున్నది.

ఈ రీతిగా కావ్యమున పాత్రౌచిత్యము ప్రస్తుతిపాత్రమై పరిఢవిల్లినది.

## 4. వర్ణనౌచిత్యము

పోతన చరిత్రమున సందర్భ శుద్ధిగల నాతిదీర్ఘవర్ణనలు సముచితముగా జేయబడిన విషయము వర్ణనా వైదగ్ధ్యమున వివరింపబడెను. ఐనను నిచట మరి కొంత చర్చింతును.

నాయకుడగు పోతన గాథగల కావ్యమున నతని జన్మస్థలమగు బమ్మెర గ్రామ వర్ణనతో కావ్య మారంభ మగుట యౌచితీమంతముగా నున్నది. అంతే కాక గ్రామములోని స్థితిగతుల వర్ణన సహజరమణీయమై యొప్పుచున్నది. శ్రీనాథ పోతనలు రాచకొండకు పోయినప్పుడు నగరవాసాభిలాషి యగు శ్రీనాథుని చేతనే తత్పురవరమును వర్ణింపజేయుట యుక్తియుక్తమైనది. పోతన తపో భంగము కానున్న సమయమున చేతికందెడు పంటలను చెడగొట్టు వానలను వర్ణిం

1. పోతన చరిత్రము 5-285
2. పోతన చరిత్రము : 11-233

చుట మిక్కిలి యౌచిత్య భాసురమై యున్నది. ఇట్లే యిందలి వర్ణనలెల్ల సందర్భోచితములై యొప్పుచున్నవి.

ఆలంకారికులు నిర్దేశించిన వర్ణనలనెల్ల పట్టుదలతో వర్ణించి విడచిన వైన మింట కానరాదు. రసోదంచితముగా రమ్యముగా కథను సాగించుటలో అవకాశ మున్నంత మేరకే నిసర్గముగా వర్ణించిన నిగారమిందునెగడి విందు చేయుచున్నది. ఇందలి వర్ణనలు నాతిదీర్ఘములై, ఆచార్యులవారే సెలవిచ్చినట్లు 'ప్రాకృతికాంతరంగ బహిరంగ ప్రవృత్తుల వాస్తవస్థితిన్ లోకము నందు దర్పణములోవలె' ప్రత్యక్షీకరింప జేయుచు చదువ జదువ జవులూరించుచున్నవి.

## 5. అలంకారౌచిత్యము

క్షేమేంద్రుడు అలంకారౌచిత్యము గూర్చి యిట్లు చెప్పెను.

"అర్థౌచిత్యవతా సూక్తి రలంకారేణ శోభతే
పీనస్తన స్థితేనేవ హారేణ హరిణేక్షణా''[1]

'ఉన్నత కుచములపై వ్రేలాడు హారము చేత సుందరాంగి శోభిల్లునట్లు అర్థగతమైన యౌచిత్యము గల యలంకారముచేత సూక్తి శోభిల్లును' అని నుడివిన యీ విషయము ఉపమాద్యలంకారము లౌపమ్యాభిరాములై యర్థవంతములై వాక్యములను తనరార జేయునని విశదపరచుచున్నది. పోతన చరిత్రమున నిట్టి ఔచితీ సురుచిరములగు నలంకారములు కొల్లలుగా నుల్లసిల్లుచున్నవి. మచ్చున కొకటి యుదాహరింతును.

"సరస గభీర నిర్మల సుధా మధురాంతరంగ భా
సుర యయి నిర్విరామ కృషి శోభితమై మహనీయ గోత్రమం
దిరయయి పాప తాప చయ నిర్వృతిసేయు సుశీలయైన యీ
గరిత పవిత్ర వర్తనల గంగవలెన్ దలదాల్చు నాథుఁడున్.''[2]

ఇది పోతన జనని లక్కాంబ గూర్చి వర్ణించినది. గంగవలె పవిత్రయైన లక్కాంబను భర్త అత్యంతానురాగముతో చూచుకొనుచున్నది యిందలి భావము.

1. ఔచిత్య విచార చర్చ : 15 వ శ్లో.
2. పోతన చరిత్రము : 1-95

ఇందు లక్కాంబకు గంగకు నభేదాధ్యవసాయము కూర్పబడినది. లక్కాంబకు గంగకు గల పోలికలు రమ్యముగా నుల్లేఖింపబడినవి. లక్కాంబ సరసగభీర నిర్మల విశాల సుధా మధురాంతరంగ. గంగయు రసవంతమై, లోతై నిర్మలమై విశాలమై సుధామధురమైన జలములు తనలో గలది. లక్కాంబ విరామమెరుగని పని పాటులు చేయుచు విలసిల్లునది. గంగయు తీరభూములలో సంతత వ్యవసాయము జరుగుచుండుటచేత శోభిల్లునది. లక్కాంబ గొప్ప వంశమున జన్మించినది గంగ గొప్ప కొండలలో జన్మించినది. లక్కాంబ పాపతాపములు తొలగింప జాలు సుశీల. గంగయు పాప తాప నివారిణి కావుననే కేసన లక్కమాంబను గంగను వలె తలదాల్చును. ఇందు శ్లేషానుప్రాణితమైన యుపమాలంకారము మిక్కిలి యర్థవంతమై యౌచితీకాంతమై సదుక్తిని శోభిల్ల చేయుచున్నది.

మరికొన్ని యుదాహరణములు దిగువ నీయబడినవి.

''కస్తూరీ తిలకాంచితాస్యరుచి రాకా చంద్ర బింబాకృతిన్
నిస్తేజమ్మొనరింపఁ గుంతలములన్ దీపించు దివ్యాక్షతల్
ప్రస్తామ్రప్రసవ ప్రభావిభవ విస్తారమ్ముతో వ్రాలఁగా
మస్తాగ్రమ్ముల వంచి మ్రొక్కులిడి రమ్మాన్యాళికిన్ దంపతుల్''[1]

వివాహమాడిన పోతన నవదంపతులు తలలువంచి పెద్దలకు నమస్కరించిన సందర్భమున కస్తూరీతిలక శోభితమైన వారి మోములను కళంక సహిత పూర్ణ చంద్రబింబముతో పోల్చుట, తలలనుండి రాలు నక్షతలను మావి పూవులతో పోల్చుట మిక్కిలి యౌచితీరమ్యమై యున్నది.

బమ్మెరలోని ప్రభాత వర్ణనలో

''తమ్ముల యెదనున్న తుమ్మెదలం గూడి
చీకటుల్ భువినుండి చెదరిపోయె.... ''[2]

అని యిత్యాదిగా చెప్పిన దానిలోని సహోక్త్యలంకారము పోతనకు చిదానందునిచే జ్ఞానోదయము కానున్న నాటిదగుట సందర్భోచితమై సహజమై యొప్పుచున్నది.

---

1. పోతన చరిత్రము : 2-259
2. ,, ,, 2-6

ప్రహ్లాదుడు తోడి బాలకులకు వేదాంత జ్ఞానము బోధించుచు నిచ్చిన యుప మానములు క్రీడాపరాయణ బాలకోచితములై యవగాహన సౌలభ్య విలసితములై యున్నవి.

"అల బొమ్మరింట మీరాడి యేగెడినట్టు లీ యాత్మ మెయి వీడి యేఁగు నెపుడొ
దాగురింతల దృష్టిదాచు కన్గుడ యట్టులు మాయ మీ జ్ఞానములు హరించు
కందుకమ్మెగిరింప నందక చనునట్లు చంచల మనము చేజారి యుఱుకు
ఆలు మగఁడు పుత్రుఁడని యాడు మీ పోల్కి-తాత్కా-లికమ్మె బాంధవ్యమెల్ల
ఉరక గోలీల వెంట మీరుఱుకునట్లు దేహి కర్మచే లోకాలఁ దిరిగి వచ్చు
మన నిజమ్మగు తలిదండ్రి మఱచి రాత్రి యంతు లేనట్టి యీ క్రీడలెంత వఱకు"[1]

సముచితార్థ శోభితమగు రూపకాలంకారమునకు దిగువ పద్య మనవద్యలక్ష్యము.

"అనవధికాశాదవానలోద్ధతి నార్ప వనధిజానాథు సేవనమె ఘనము
చంచల హృదయ ప్రశాంతి సాధింపగా నచలాంగనా మనోహరుడె గురుఁడు
అజ్ఞానతిమిర సంహతి నివారింపఁగా నర్కేందు నేత్రు విఖ్యాతి జ్యోతి
అస్థిరదేహ జన్మాద్యాపదలు బాప వైకుంఠవాసు ప్రాపణమె పణము
సకల బాహ్యాంత రింద్రియ చయ కృతాఘ పంకముడుగఁగా శ్రీవిష్ణు పదమె నదము
ఘోర సంసార భయద కూపారమీఁద సతము క్షీరాబ్ధిశాయి సంస్మరణ తరణి"[2]

ఇందు హద్దులేని ఆశాదవాగ్ని నార్పుటకు వనధిజానాథు సేవనమే ఘనమని యను టలో గంభీరమైన యర్థమున్నది. వనధిజానాథుడనగా సముద్రపుత్రికయగు లక్ష్మీ భర్త. ఇచట సముద్ర సంబంధము సూచించుట చేత(ఆశా) దావాగ్ని నార్పు టకు విపుల సముద్రమంత జలము గలవాడని యతని మహిత సామర్థ్యము స్ఫురించుచున్నది. అట్లే ఘనమనుటలో గొప్పయనియే కాక మేఘమనియు

1. పోతన చరిత్రము : 11-260
2. ,, ,, 11-313.

నర్థమై సముద్రమంత జలము గురియు మేఘమని విశద మగుచున్నది. ఇట్లే పాదమున వనజాధినాథ ఘన శబ్దములు సమర్థములై సాభిప్రాయములై పన్నె గూర్చు చున్నవి. ఇట్లే తక్కిన పాదము లందలి శబ్దార్థములు గ్రాహ్యములు.

ఈ రీతిగా కావ్యమున నలంకారౌచిత్యము స్తుత్యమై యలరారుచున్నది.

## 6. గుణౌచిత్యము

గుణౌచిత్యము గూర్చి క్షేమేంద్రుడిటుల చెప్పెను.

"ప్రస్తుతార్థోచితః కావ్యే భవ్యః భాగ్యవాన్ గుణః
స్యంద తీందు రివానందం సంభోగావసరోదితః"1

ప్రస్తుతార్థమున కనుగుణములైన ప్రసాదాది గుణములే కావ్యమున కంద చందములు సమకూర్చి సుందర సంగమ సమయమున నుదయించిన యిందు బింబముపలె డెందముల కానందము కూర్చునని పైశ్లోకము తెలుపుచున్నది. పోతన చరిత్రమున నేతదుక్తరీతిగనే ప్రయుక్తములైన గుణములు తనరియున్నవి.

ప్రసాద మాధుర్య సౌకుమార్యములు ప్రచురముగాగల యీ కావ్యమున నౌదార్యోజః ప్రభృతి గుణ ద్యుమ్నములును ఆయా సన్నివేశములందు మిరుమిట్లు గొలుపుచున్నవి. సర్వగుణములును సందర్భోచితములై స్వాంతావర్జకములై విరాజిల్లుచున్నవి. దిక్ప్రదర్శనముగా దివ్యగుణముల కొన్నింటి నుటంకింతును.

## ప్రసాదము :

"శైథిల్యం ప్రసాదః" అని వామనుడు నుడివినట్లు బంధముయొక్క శిథిలత్వము ప్రసాదగుణము. 'ప్రసిద్ధ పదంబుల నలఘూక్తి ప్రసాద మయ్యె'నని బట్టుమూర్తి. పోతన చరిత్రములో నిది తరచై సహృదయాహ్లాదకరమై యొప్పారు చున్నది.

ఉదా :

అలుకుంబూతల నొప్పు కుడ్యములపై నందందు నందమ్ముగా
జిలుకల్ పొన్నలు చంద్రవంకలు లతాచిత్రాలు సున్నమ్ముతో

1. ఔచిత్యవిచార చర్చ : 14వ శ్లో.

విలిఖింపంబడెఁ దిన్నె లోడికలతో వెల్గెన్, కుటీ వాటి వా
కిట లొప్పెన్ నునుబంతి పూసరులఁ బ్రాకెన్ గుమ్మడుల్ కొప్పునన్[1]

ఇది బమ్మెర గ్రామమునందలి గృహవర్ణన. ఇక్కడ గ్రామీణ గృహాలంకరణాదులను బంధ శిథిలత్వముతో సుప్రసిద్ధ పదప్రయోగముతో శోభిల్లునట్లు సముచిత ప్రసాద గుణభాసురముగా వర్ణించుట జరిగినది. దిగువ పద్యములు ప్రసాదమునకు లక్ష్యములు.

చెక్కిచేసిన మోహినీ శిల్పమనఁగ దిద్దితీర్చిన నవరత్నదీపమనఁగ
పోతపోసిన యపరంజి బొమ్మయనఁగ అచ్చ మచ్చరయే
యన నా లతాంగి"[2]

ఇది నృత్యముచేయ నిల్చిన భోగిని గూర్చి వర్ణించినది. సముచితముగా ప్రసాదాభిరామమై యొప్పినది.

"కలకల నవ్వుచున్నటులు కన్నులలోన దయారసాపగల్
జలజలజాలుచున్నటులు చక్కనిమోమొక మాట యంచెదో
వలుకఁగఁ బోవుచున్నటులు భక్తుల నొద్దకు సుప్రసన్నతన్
బిలుచుచు నున్నయట్టు లగుపించెడి శ్రీరఘుమూర్తి గాంచుచున్"[3]

అది మెట్టుపట్టమీద వెలసిన శ్రీరామచంద్రుని స్మరించుచు భావనాలోకమున నాదేవుని గాంచుచున్న ప్రసన్నదృశ్యమీవిధముగా ప్రసాదగుణ శోభితమై యున్నది. ఇట్టి పద్యములు కృతిలో కొల్లలై మల్లెలై మొల్లలై యుల్లసిల్ల జేయుచున్నవి. శృంగార కరుణాదుల నెసగు కైశికీ వృత్తికి దగిన వైదర్భీరీతి కనుగుణముగా ప్రసాద మాధుర్యములు శోభిల్లజేయబడి కావ్యమున గుణౌచిత్యమత్యంతము విలసిల్లుచున్నది.

## మాధుర్యము :

'పృథక్పదత్వం మాధుర్యం' అను వామన లక్షణము ననుసరించి దీర్ఘ సమాసములు లేక విడివిడి పదములతో భాసిల్లు మాధుర్యగుణము కావ్యమున నవిరళముగ చవులూరించుచున్నది.

1. పోతన చరిత్రము : 1-84
2. ,, ,, : 4-231
3. ,, ,, : 9-87

వివాహవేదిక చెంతకు గొంపోవ చెలులు వచ్చినప్పటి నర్సమాంబ లజ్జాన్వితామోదము మధుర మధురముగా నిట్లు వర్ణింపబడినది

"కన్నులను వెన్నెలలు గాసెఁ గలికిసొగసు నవ్వులన్మల్లియలు బూచె నాణ్యమైన

గొంతులోఁ గోకిలలు గూసెఁ గొసరికొసరి నడల రాజహంసలు కాళ్ళఁబడుచు డాసె"[1]

ఇక్కడ ముద్దరాలి ముద్దు భావములచు మాధుర్య శోభితము గావించుట మిక్కిలి యౌచితీమంతమైనది.

"నెలరాజున్ వలపింపఁగా సురనదిన్ నీరాడి చెంగా విదు
వ్వలువల్ దాలిచి మబ్బు కన్నియలు చెల్వంబొప్పఁగాఁ దారకా
తిలకంబుల్ ధరియింపఁ జీఁకటి కురుల్ దీపింపఁ గ్రీడాసర
స్సలనన్ గ్రాలెడి నిల్వుటద్దములఁ జూచున్ గన్దొవల్ విప్పఁగన్[2]

అని వన వర్ణనమున మబ్బు కన్నియల వలపుచేతలు మాధుర్యధుర్యముగా సముచితముగా చిత్రింపబడినవి. ఇట్టివే మరి కొన్ని పద్యములుటంకింతును.

"జలజల పూలు రాలినటు చల్లని మెల్లని పిల్ల తెమ్మెరల్
తెలతెల వాఱిపీచినటు తియ్యని కమ్మని పాల మీఁగడల్
తొలితొలి తోడు విచ్చినటు తోరపు సిగ్గున ముగ్ధ కన్దొవల్
వలపులఁ జిమ్మినట్లు చెలువ మ్మొలికించు భవత్కవిత్వముల్"[3]

ఇది పోతన వనవర్ణన విని సింగన్నృపతి యతని కవితను వినుతించినది. లలిత కవిత మాధుర్య గుణాభిరామమై యొప్పుట సమంజసమైనది.

"కాళుల నందియల్ చిలిపి గజ్జెలు ఘల్లనె జల్లనెన్ మహీ
పాలుని మేను, కెంజిగురు వాతెఱ నవ్వుల పూలు పూచెనా
లీల మరుండు మేల్మ ఖుమలీ యొఱలోపలి చంద్రహాసమున్
గేలను దూసె నద్ది గిలిగింతలు జేసె సభాసముద్రమున్"[4]

1. పోతన చరిత్రము : 2-246
2. పోతన చరిత్రము : 4-118.
3. ,, : 4-137
4. ,, : 4-234

ఇచట భోగినీ నర్తనశోభ కనుగుణమైన మాధుర్యగుణము వెలయింపబడి యెదల నాకర్షించుచున్నది.

## సౌకుమార్యము :

'అపారుష్యం సౌకుమార్యం' అని వామనుడును, "అరయఁగ బొట్లు పెటుందల నరుదగునది సౌకుమార్యమగు"నని బట్టుమూర్తియు చెప్పుటచేత కోమల ములును, బిందు పూర్వకాక్షరములును గల పదముల కూర్పు సౌకుమార్యమని చెప్పనొప్పును. అట్టి సౌకుమార్యము పోతన చరిత్రమున సమృద్ధిగా, సందర్భ శుద్ధిగా సాక్షాత్కరించుచున్నది.

వర్షమున తడిసిన గుడ్డలతో వచ్చిన నర్సమాంబ అంగసౌష్ఠవమిటుల వర్ణింపబడినది

"అద్దిర ! యప్పుడా యువతి యందము చందము గాంచ నచ్చునన్
గ్రుద్దిన యట్టు లంగచయ కోమల సౌష్ఠవమెంతొ వింతగా
దిద్ది మరుండు నేర్పు మెయిఁ దీసిన చిత్రపటమ్ము కిమ్ముగా
నద్దము గట్టి పెట్టినటులయ్యెను సన్నని చీర మాటునన్"[1]

ఇక్కడ సుకుమార గాత్రియగు ముగ్ధాసౌందర్యమును సౌకుమార్యమున వెలార్చుట యుక్తియుక్తమైనది

"విందగు యౌవనమ్ము వలపించెడి చక్కదనమ్ము నేమియో
యందము చిందులాడు సిగయందు నమర్చిన పూసరమ్ము కెం
పుందళుకుల్ చలించు స్మిత పుష్ప సుగంధితమౌ విడెమ్ము బల్
పొందిక పుల్ల గల్లపుట భూషణమై చెలువారుచుండగన్"[2]

పుష్పలావికను వర్ణించిన యీ పద్యమున సౌకుమార్యము సముచితమై యొప్పు చున్నది. ఇట్లే భరతనాట్యము చేసిన భోగిని గూర్చి చెప్పిన దిగువ పద్యము సౌకు మార్యమును సంతరించుకొని సమంజసమై యెసగినది.

1. పోతన చరిత్రము : 3-153
2. ,, : 4-24

"అందము చిందులు ద్రొక్కెను విందగు జవ్వనము భువనవిజయ
మొనర్చెన్
గుందనమున జీవము పడెఁ జెందామర లుఱుకులాడె చెలినృత్యములన్"[1]

ఇట్లే యనేకానేక సన్నివేశములలో సౌకుమార్య మౌచిత్య విభ్రాజితముగా పోషింప
బడి యున్నది.

## సమత :

కవితాకళా ప్రపూర్ణులగు ఆచార్యులవారు తమ పోతన చరిత్రమున రమ్య
శిల్ప గుణోదంచితమైన పద్యముల నెల్ల యెడలను మొల్లముగా నల్లగలిగిరి.
అందు సమతాగుణము సమంచితమై సౌందర్యము మూటగట్టుచున్నది. 'మార్గాభేద
స్సమతా' యను వామన వచనాను సారముగానేమార్గమున నుపక్రమింపబడునో
యామార్గమును విడువకుండుట సమత యనబడును. ఏతదనురూపముగా సమత
యిందు సపరింపబడినది. మచ్చునకొండు రెండుదాహరింతును.

"ముత్యాల చెండ్లెత్తి మురిపించు జొన్న చేల్ కర్షక శ్రమ బిందు
ఘనతఁ దెల్పు
బంగారు గొలుసుల బరువుల మెడవంచు వరి లక్ష్మి పాలేరు వరుసవిప్పు
వెండి కొండలు చెట్లఁ బండించు ప్రత్తిచేల్ పశుపతిత్వము రైతు
పరమొనర్పుఁ
జంక బిడ్డల గొంచు సాఁకెడు మొక్కచేల్ ప్రజకాఁపు చంక పాపలని చూపు
మేలి పంట పొలాల నాగేలు చాలు శ్రీ మహాలక్ష్మియైన యా సీతనేలు
నేల నవధాన్య రత్న భూషాళిఁ దాల్చి పాడి పంటల ముల్లెగా యా పల్లె
యనఁగ"[2]

ఇందు రైతుకృషి యొక్క ఘనత నాయా సస్యములు తెలుపుచున్నవని
నాలుగు పాదములందును వివరించి తద్ధర్మకాలపు క్రియలను పాదాంతము
లందుంచి సరియైన తూకముతో పద్యము నిర్వహించి సమతాగుణము చేత
నుత్కర్ష నాపాదించుట జరిగినది. భవ్యమైన పైరుపచ్చల మేలిమిని దెలుపుట
కిచట సమతాగుణము వెలార్చుట యౌచితీమంతమై యున్నది. ఇట్లే,

1. పోతన చరిత్రము : 4-257
2. ,, ,, : 1-87

''సావిత్రి సావిత్రి జన్మమెత్తెనొ కలిన్ సత్యవంతుం డౌర! సాధ్వి భర్త యనసూయ యనసూయ నవతరించెనొ నేడు నత్రి గుణాకారుఁ డతిపతియు''.[1]
ఇత్యాదిగా చెప్పిన ఈ పద్యమున తొలి పాదమున ప్రారంభించిన యమక ప్రయోగము ప్రతిపాదమున నిర్వహింపబడి లక్కాంబా కేసనల దాంపత్య వైశిష్ట్యము సమతాగుణముచేత సమంజసముగా శోభిల్ల జేయబడి యున్నది.

"కాషాయాంబర కవచిత వేషున్ రుద్రాక్ష దామ విస్ఫార దురో
భూషున్ హరి పద మార్గాన్వేషున్ జ్ఞానాగ్ని దగ్ధ నిజకృత దోషున్''[2]
అన్నదానిలో సర్వ పాదము లందంత్యానుప్రాసము నిర్వహింపబడి చిదానంద యోగి దివ్య స్వరూపమును సువ్యక్తము చేయుటలో సమత సముచితముగా సహకరించినది. ఇట్లే యనేక పద్యములందు సమత విరాజిల్లుచు సామంజస్య మునకు నెలవై చెలువొందుచున్నది.

## ఔదార్యము :

''వికటత్వముదారతా'' యని వామన లక్షణము. అనగా కూర్పునందలి వికటత్వ మౌదార్యమగును. ఏ కూర్పు నందక్షరములు నర్తించునట్లు వినువారికి తోచునో యెందు శబ్ద మర్థమునకు ప్రతిధ్వనిగా విరాజిల్లునో యది యౌదార్యము. పోతన చరిత్రమున నీ యౌదార్య గుణము సముచితముగా పోషింపబడినది.

శ్రీనాథుడు సవారి బండిపై బమ్మెరకు చేర వచ్చినప్పుడా బండి వేగము తగ్గి సమీపించిన విషయము దిగువ పద్యమున హృద్యముగ వర్ణింపబడినది.

''చక చక గిత్తల కదుముకు త్రకిట ధికిట ధకిట ధా మృదంగ ధ్వని టక్
టికు మను కేదారాహతి నికట తటిని శకట మొకట నిల్చిన యంతన్''[3]
ఇందు వృత్త్యనుప్రాసము, ఛేకము నమరి ధ్వన్యనుకరణముల చేత పటిష్ఠమై వికటత్వ మేర్పడి యిక్కడి శబ్దములు బండి సమీపించిన విషయమును ప్రతిధ్వనింప జేయుచు సమంచితౌదార్యము పోషింపబడి స్వాంతావర్జకమై యొప్పుచున్నది. ఇట్లే,

1. పోతన చరిత్రము : 1-96
2. పోతన చరిత్రము : 2-17
3. పోతన చరిత్రము : 2-158

"జెడిదపు టడిదము లగుడము విడి వడి కడుఁ బోరు చుండ
వెస లగుడము తా
నడిదపుఁ బికికిటి ముడిపైఁ గడువడిఁ దాఁకుటయు నొచ్చి కత్తిని
జార్చెన్"[1]

అను దానిలో రాచకొండ సేనాపతి బమ్మెర యువక మల్లుడు ఖడ్గ లగుడములతో పోరాడిన విషయము వృత్త్యనుప్రాస భాసమై యౌదార్యము సమంజసముగా చెలువొందుచున్నది.

## కాంతి :

'విమల విచిత్రాయత వర్ణావృత్తులుగల యతి మృదు బంధంబు కాంతి యగు' నని బట్టుమూర్తి నుడివెను. అనగా విచిత్రముగా వచ్చిన వర్ణమే మరల మరల వచ్చెడు బంధము కాంతి. ఈ కాంతియు కావ్యమున నందందు నందముగా బొందింపబడి యున్నది శరద్రాత్రిని వర్ణించిన సందర్భమున చెప్పబడిన దిగువ పద్యమున కాంతి కమనీయమై యున్నది.

"నెల గుండియలఁ బిండిసెలయేటి యెలబోటి యిల క్షీరవారాశి
నొలుకఁ బోయ
వెలగల్లు చలివెల్గు తెలిమించు తులకించి మలినాంబరము నంతఁ
జలువసేయఁ
గళలీను నెలతేని చలువ వెన్నెల లతల్ భూరుహచ్ఛాయలం బూలు బూయఁ
దెలికౌముదులు యామినులుదాల్చు చేరుచుక్కల ముత్తెముల
పులుంగడిగివేయఁ
గొలఁకులన్ నిల్వుటద్దాల తళుకు మీఱెనలుగడల్ పచ్చి పాల్గాఱెఁ
జలువరాల
మల కరఁగి పచ్చికబయళ్ళ నిలిచి పాఱె నన శుచిస్మితయై శరద్వనిత చేరె"[2]

ఇందు ప్రతిపాదము నందును నొకరీతిగా విచిత్రముగా వర్ణముల యావృత్తి జరిగి కాంతి పరిఢవిల్లినది. ఇది సౌందర్యరాశియై శృంగార రసమున కుద్దీపనమై నెగడు

1. పోతన చరిత్రము : 7-212
2. ,, ,, : 3-192

శరచ్చంద్ర చంద్రికా ధవళిమను వర్ణించునది కావున నిచట కాంతి వెదజల్లబడుట మిక్కిలి యౌచితీ భాస్వంతమై యున్నది.

వసంతర్తు వర్ణనలోని దిగువ పద్యమున రమ్యకాంతి రాజిల్లు చున్నది.

"అలివేణి మత్తకోకిలవాణి చూత పల్లవ పాణి సకల ఋతువుల రాణి
వల్లీతనువిలాస పుల్లప్రభాభాస మల్లికాహాస చంపక సునాస....''[2]

## ఓజస్సు

'విలసిత సమాస భరితోజ్జ్వల బంధం బోజమయ్యె'నని బట్టుమూర్తియు; 'గాఢ బంధత్వమోజః' యని వామనుడును నిర్వచించిరి. సంయుక్తాక్షరములు, జిహ్వామూలీయోపధ్మానీయాదులతో గూడిన దీర్ఘసమాస రచన వల్ల ఓజస్సు ప్రస్ఫుటమగును. వీరరౌద్ర భయానకములలో నొప్పారు నారభటీ వృత్తి కను రూపమగు నోజస్సు పోతన చరిత్రమున సందర్భోచితముగా విభాజితమైయున్నది.

సింగ భూభర్త శకట మీయ తిరస్కరించుటయేకాక మర్మచ్ఛేదకావహేళన వాగ్బాణ ప్రయోగము చేసినందుకు పోతన మహోగ్రుడైనప్పటి రౌద్రము దిగువ రీతిగా వర్ణింప బడినది.

"అరుణ సరోజరాజి పరిహాస మొనర్చెడి నేత్రసీమలన్
యెలసెను వీరభార్గవి తృణీకృత విశ్వవిభూతి వైభవ
స్ఫురణఁ దలిర్ప స్వేచ్ఛ మిన్నుఁ జూచెడి గుర్వభిమాన కేతువున్
గరమునఁ బూని తేని పృథుగర్వమతిన్ గబళించునోయనన్"[2]

ఇందు రౌద్రరసోచితమగు నోజోగుణము సమ్యక్పరిపుష్టమై యున్నది.

భాగవత కృతి రక్షణార్థము వరాహమూర్తి విజృంభించిన రౌద్ర భయానక దృశ్యమున దిగువ విధముగా నోజస్సు పరిఢవిల్లినది.

"శశ్వదరాళ దంష్ట్రికరాళాస్యంబు ప్రళయార్కబింబమై భయముగొల్ప
ఉత్క్షిప్త నిజవాల విక్షేపగతి కశాఘాతమై శత్రులన్ గలంత వెట్ట
క్షురసన్నిభ నిశాత ఖురహత క్షోణి నరాతి కన్గవ ధూళి రవలు నిండ

1. పోతన చరిత్రము : 6-7
2. ,, ,, : 4-385

అరిగజస్వాంత భీకర ఘుర్ఘురధ్వనుల్ క్ష్వేళావిరావ ప్రసిద్ధిగొల్ప
పాదయుగము మధ్య పడిఁ దూఱు శరమనన్ దాఁకునొకటఁ జగఱ ధరణి
గూల
చీఱుఁ గోర రక్తసిక్తాంగులై భటుల్ తాళవృక్షగతుల నేలఁ గూల"[1]

హిరణ్యాక్షవధ ఘట్టము నందును యజ్ఞవరాహము చేసిన భీకర యుద్ధవర్ణన ఓజో గుణ విరాజితమై సముచితమై యొప్పినది.

"కుల భూభృచ్ఛిఖరాగ్ర సన్నిభ గదా ఘోర ప్రహారాహతిన్
ప్రళయాదిత్య పటు ప్రభా విభవ సంపన్మూర్తి తానై విశృం
ఖలలీలన్ ఖలదండ తాడిత భుజంగ ప్రక్రియన్ రేఁగి ప్రో
జ్జ్వల వాగ్రీయ ఖురాహతిన్ జెఱుకుటూఁచన్ బోలె ద్రుంచెన్ గదన్"[2]

ఇటే రాచకొండ విజయనగర సైన్యముల కయిన యుద్ధము మున్నగు ఘట్టము లలో రసోచితముగా నోజో విస్ఫూర్తి కలదు.

ఈ రీతిగా కావ్యమునెందు పరిశీలించినను నాయాగుణము లౌచితీ భాసు రము లై యాహ్లాదకరములులై యొప్పు చుండుట గమనింపగలము.

ఇక క్షేమేంద్రుడు తెలిపిన పదవాక్యములందలి యౌచిత్యము నీ వ్యాస మున నుదాహరించిన పద్యములందేకాక కావ్యము నందితర పద్యగద్యములన్నింటను గమనింపవచ్చును. మరియు మున్ముందు చర్చింపబడు ఛందోవిశేష భాషా వైచిత్రి ప్రభృతి వ్యాసము లందును నౌచిత్యము వివరించబడును.

———

1. పోతన చరిత్రము : 2-33
2. పోతన చరిత్రము : 11-193,

# ఛందో విశేషము

## ఛందః ప్రశస్తి :

కావ్యాంశములలో ఛందస్సున కొక విశిష్ట స్థానము కలదు. కవితను కమనీయగతిలో సాగించుటకు ఛందస్సు మిక్కిలి తోడ్పడును. వేదములు ఛందోమయములై విలసిల్లుటచేత వేదాంశములలో ఛందస్సొకటై యొప్పినది. ఛందస్సు వేదపురుషునికి పాదయుగమని దిగువ రీతిగా ప్రస్తుతింపబడినది.

"ఛందః పాదౌతువేదస్యహస్తౌ కల్పోఽథ పఠ్యతే
జ్యోతిషామయనం చక్షుర్ని రుక్తం శ్రోత్రముచ్యతే
శిక్షా ఘ్రాణంతు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్"[1]

ఈ విషయమునే అప్పకవి యిట్లు తెలిపెను.

"అవె మూల స్వరూపుఁడైనట్టి వేదపురుషుఁ డాఱు ప్రధానాంశముల
వెలుంగు....
శిక్ష నాస నిరుక్తంబు చెవులు ఛంద మంఘ్రియుగ్మంబు కల్పంబు
హస్తయుగము
జ్యోతిషము నేత్రయుగళంబు శబ్దవిద్య సురుచిరానన మామ్నాయ
పురుషునకును"[2]

ఇట్లు వేదపురుషునకు ఛందస్సు పాదయుగమని యనువదించుటయే కాక దిగువరీతిగా ఛందఃప్రభావము నుల్లేఖించెను.

"వేదమునకుఁ బాదంబులై వెలయు కతన ఛందమన్నిటిలో నవశ్యంబు గాదె
పురుషుఁ డఖిలాంగయుతుఁడయ్యుఁ జరణయుగము లేక నడవ సమర్థుఁడే
లోకముననను"[3]

"ఛందస్సూత్రంబుల చేతం దగఁ గూర్పంగఁబడి కదా కావ్యమణుల్
చెందుఁ జతుర్దశ విద్యా సుందరహారంబులై యజునిసతి గళమున్"[4].

---

1. పాణినీయ శిక్షా : 41, 42

2, 3, 4. అప్పకవీయము 4- 8, 9, 10, 11

వేదమునకు పాదకల్పమై పరిఢవిల్లు ఛందస్సు వేదాంశములలో ముఖ్యావశ్యకమైన దనియు ఛందసూత్రములచేత గూర్పబడినప్పుడే కావ్యహారము రమ్యమై వాగ్దేవిగళ మును సమలంకరించుననియు అప్పకవి ఛందః ప్రాధాన్యమును విశదీకరించెను. ఛందస్సునకు గల యీ ప్రాముఖ్యమునే భరతుడు "ఛందోహీనో న శబ్దోఽస్తి నచ్ఛందః శబ్దవర్జితమ్"[1]. అని నొక్కి వక్కాణించెను. ఈ ఛందస్సు వేదము లకు వలెనే కావ్యములకు ననువర్తించును. ఆదికవి వాల్మీకి తన రామాయణము లయాభిరామమైన ఛందము చేత శ్లోకముల చేత - విరాజిల్లునని యిట్లు తెలిపి యుండెను.

"పాదబద్ధః అక్షరసమః తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా"[2]

విన్నకోట పెద్దయ తన లక్షణ గ్రంథమున ఛందః ప్రశస్తినిట్లుగడించెను.

"పొందై, గౌరవలాఘవ ప్రకృతమై పూర్ణాక్షరస్నిగ్ధమై
యందంబై, శ్రుతి సమ్మత ప్రకటమై, ప్రాపించు నానావిధ
చ్ఛంద స్సూత్రము లేక లోకములఁ జంచద్వాక్యరత్నావళీ
సందోహంబులు కంఠభూషణములై సంధిల్లునే యేరికిన్"[3]

గురులఘు విశిష్టమైన పదములతో శ్రుతిసుభగమగు లయతో శోభిల్లు ఛందస్సూ త్రములేక రమ్య వాక్యరత్నములు హారములుగా రూపొంది యలంకరించుకొనుట కవకాశము లేదని ఛందఃప్రయోజనము నుద్ఘోషించెను. మరియు ననంతుడు

"విద్యల లోపల నుత్తమ విద్య కవిత్వంబు, మఱి కవిత్వము ఛందో వేద్యము...."[4]

అని ఛందస్సువలన కవిత్వము తెలియదగినదని దాని ప్రాశస్త్యమును దెలిపెను. వరదాచార్యులవారు కావ్య పీఠికలో 'కవితా స్తుతి' యొనర్చుచు "ఛందస్సు నడత"

1. నాట్య శాస్త్రము : 14-44
2. రామాయణము : బాలకాండము-సర్గ1, శ్లో. 18
3. కావ్యాలంకార చూడామణి : 7-4
4. ఛందో దర్పణము : 1-5

యని నుడివిరి. కృతికన్యాగమనము ఛందస్సు వలన సాగునని దీని తాత్పర్యము. ఇది 'ఛందః పాదౌతు వేదస్య' అను మహావాక్యము ననుసరించి చెప్పబడినది.

అనేకాలంకారికులు ప్రాజ్ఞులు పైరీతిగా తెలిపిన ఛందఃప్రాముఖ్యమును దాని ప్రయోజనమును గూర్చి యొకింత వివరింతును.

'ఛందః' శబ్దమునకు 'ఛందయతి ఆహ్లాదయతీ ఛందః', 'ఛది ఆహ్లాదనే' అని గురు బాల ప్రబోధిక యర్థము చెప్పినది. అనగా ఆహ్లాదపరచునది ఛందస్సు అని అర్థము. కవితకు ఛందస్సు జతపడినపుడది ఆహ్లాదకరమగునని భావము. రస భావానురూపమైన లయను ఛందస్సందించుట వలన ఈ హృదయాహ్లాదము కలుగుచున్నది, జీవితములో సుఖదుఃఖాదుల ననుసరించి హృదయము స్పందించు నట్లు కావ్యము నందలి రస భావముల కనుగుణముగ తదుత్కర్ష హేతువగు ఛందస్సు వెలయుచుండును. అందుకే యనేక విధముల ఛందములు విలసిల్లినవి.

ఛందస్సు కవితాగమనమున కొక నిర్దిష్టమైన లయను ప్రసాదించుచున్నది. దీని వలన కావ్యము శ్రావ్యమై సేవ్యమై శోభిల్లగలదు. సంగీతమునకు తాళలయ వలె కవితకు ఛందస్సు మనోహరమైన గతిని సవరించి యలరింపజేయుచుండును. అచ్చమైన కవితకు అలంకారములు శోభనినుమడింప జేయునట్లు ఛందస్సు సమ్యగ్గమనమును సంతరింపజేసి సంతసింపజేయుచున్నది. సమవిస్తృతి క్రమ గతి యందగించు వివిధచ్ఛందములు డెందముల నాకర్షించు ననుటలో విప్రతి పత్తి యుండదు,

పద్య గద్య మయములగు నుభయ కావ్యములందును కవితాకళ చెలువొందు చుండ ఛందో విలసిత పద్యకావ్యము లధిక రమణీయములగుటచేత ప్రాచీనులు ఛందస్సుల నాశ్రయించియే యత్యధికముగా కావ్యములు రచించిరి. ఛందస్సు రమ్యత నాపాదించుటయే కాక ధారణకు మిక్కిలి యుపయోగపడుచుండుట చేత పద్యమయములే ముప్పాతిక మువ్వీసము వెలసినవి. ఈ దృష్టిచేతనే శ్రుతులు మొదలుకొని శాస్త్రి గ్రంథములు నిఘంటువులు సైతము ఛందోమయములై వెల యుట తటస్థించినది.

ఛందస్సు కావ్యరసభావ వ్యంజకమనుటలో నభిప్రాయ భేదములు కలవు, ఏలయన నాలంకారికులేయే వృత్తము లేయే రసవ్యంజకములని నిర్దేశించిరో అవి యట్లే సర్వత్ర కానవచ్చుట లేదు. ఉత్పల శార్దూలాది వృత్తములు సర్వరస పోషణలోను

నుపయుక్తమై యుండుటయే భిన్నాభిప్రాయములకు హేతువు. కొందరు కొన్ని విశేషవృత్తములు మాత్రము ప్రత్యేక రసవ్యంజకములనియు సామాన్య వృత్త ములు సర్వరసభావముల కనుకూలములనియు తెలిపిరి. ఈ విషయమున డా॥పాటిబండ మాధవశర్మగారు తమ "మహాభారతము నందలి ఛందశ్శిల్పము'' అను సిద్ధాంత వ్యాసమున నొసగిన విశదీకరణము సమంజసమై భిన్నాభిప్రాయ ములకు సామరస్యమును సమకూర్చుచున్నది.

"ఒక్కొక్క రసము పోషింపబడు దశాంతరములందు వేఱువేఱు వ్యభిచారి భావములచే సంకరమగుచుండును. రసమునకు రసాంతరములు అంగములగు చుండును. విరుద్ధావిరుద్ధ భావముల నిమజ్జనోన్మజ్జనాది దశాంతరములందు రసస్థితి యనంతవిధములుగా నుండును. మధురములైన భావములందు దీప్తములు, పరుష ములు నైన భావాంతరములు సంక్రమించినప్పుడు, సుకుమారములు ఆర్ద్రములు నైన భావములు సంక్రమించినప్పుడు హృదయవర్తనము భిన్న భిన్నముగా నుండును. ఉద్బుద్ధమైన స్థాయి విరుద్ధావిరుద్ధ సంచారి భావములచే సంకరమై పర్యంతమున రసత్వము పొందుటకు అనంతములైన దశాంతరములను ప్రాపించును."

"రస వ్యవహారమింత క్లిష్టమైనప్పుడు ఈ రసమునకు ఈ వృత్తము అను కూలము అని నిర్దేశించుట యసాధ్యము. కనుక ఛందములయొక్క వస్తురస భావాది వ్యంజకతా సామర్థ్యము వృత్తనామేతరమైన ఛందోధర్మము నాశ్రయించి యుండు ననుట యుచితము. ఆ ధర్మము ఛందోవృత్తి యనియు నానా విధములైన ఛందో వృత్తులు నానా విధములైన ఛందోగుణములచే సంక్రాంతములై నానా రస భావ వ్యంజనా సమర్థములగుననియు భావించుట సమంజసము."[1]

రస వ్యవహారము మిక్కిలి క్లిష్టమై యుండుటచేత నానా విధగుణశోభిత ములగు ఛందములు నానావిధ రస భావ వ్యంజకములై యొప్పారునని పై వివరణ వలన స్పష్టమైనది.

డా॥ పాటిబండ మాధవశర్మగారి యభిప్రాయముతో నేకీభవించు మాటలు డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారి సిద్ధాంత వ్యాసమునందును కాననగును. వారిట్లు విశదీకరించిరి.

1. ఆంధ్ర మహా భారత ఛంద శిల్పము: పుట-29, 30

"కవిత్వము హృదయ సంవాదియగుటకు ఛందస్సును తగినంతగా సహా యపడుచున్నది. ఛందస్సనగా పద్యముయొక్క గతి విధానము. క్షేమేంద్రుడు సువృత్త తిలకమున సాంస్కృతికములైన వృత్తములలో కొన్నింటియొక్క విని యోగము నిష్కర్షించి పెట్టు ప్రయత్నము చేసెను. పూర్వకవులు వ్రాసిన వృత్తములందలి లక్షణములను పురస్కరించుకొనియే ఆయన ఆ పనిచేసినను, అది సర్వథా సర్వత్ర వ్యాపనశీలమైన సిద్ధాంతముగా కనిపించుటలేదు...."

"వృత్తౌచిత్యమన్నది ముఖ్యముగా నాయా ప్రకరణముఃబట్టి కించిత్తు గ్రహింప దగినదియే కాని ఫలానా వృత్తము ఫలానా విషయమును వర్ణించుటకే యుపయోగించుటను సిద్ధాంతము చేయుటకు నలవికాదు. ఏమనగా క్షేమేంద్రుడు ఏ వృత్తమున కే వినియోగము చెప్పినాడో, ఆ వృత్తమట్లే సర్వకవుల గ్రంథముల యందును లేదు. సంస్కృత కావ్యములందా విషయమెట్లున్నను తెనుగున మాత్ర మాయన చేసిన నిష్కర్ష తూచా తప్పకుండ పాటించబడలేదు. కొన్ని వృత్తముల విషయము క్షేమేంద్రుని సిద్ధాంతమున కనుగుణముగా సమర్థింపవచ్చును."[1]

కేతవరపువారు వృత్తౌచిత్యమును చర్చించుచు క్షేమేంద్రుడు నిర్దేశించినట్టు లాయా వృత్తము లాయా రసముల వ్యంజనకు ప్రత్యేకించి యుపయోగపడవనియు, కొన్ని వృత్తములట్లు వినియోగింప వీలున్నదనియు వివరించిరి. కొన్ని వృత్తము లనుటలో మత్తకోకిల, స్రగ్ధర, పంచచామరము వంటి విశేష వృత్తములని చెప్పనొప్పును. ఏలయన వాని గతి యుత్సాహోద్రేకాదులను వ్యంజింపజేయు చుండును. కావున కొన్ని విశేషవృత్తములు తప్ప తక్కిన చంపక శార్దూలాది సామాన్య వృత్తములు సర్వ రస భావ వ్యంజన కుపయోగింపవచ్చునని తేట పడుచున్నది.

కవి కావ్యనిర్మాణమున సవరింపవలసిన ఛందశ్శిల్పము గూర్చి మాధవ శర్మగారిట్లు వ్రాసిరి.

"నానా రస భావముల నానావస్థాంతరములను సుష్ఠుగా వ్యంజించుటకు తగిన యంగ ప్రత్యంగ నిర్మాణ సౌష్ఠవము ఛందములకు సమకూర్చుటకు కవి ఛందో ఽంగ పరిజ్ఞాన సౌష్ఠవము గలిగియుండవలయును. అంగప్రత్యంగముల సముచిత

1. తిక్కన కావ్య శిల్పము: అష్టమోన్మేషము-వృత్తౌచిత్యవిచారము: పుట-506,507

సన్నివేశముచే స్వధర్మ నిర్వహణ దక్షములగునట్లు ఛందములను నిర్మించుటయే కవియొక్క ఛందశ్శిల్పము."[1]

శర్మగారు చెప్పినట్లు కవి ఆయా రసభావములను చక్కగా వ్యక్తము చేయుటకు తత్తదుచితచ్ఛందములను ప్రయోగించి కావ్యమును క్షమతరము గావించవలెను. కావ్యకరణ దక్షులు ఛందోమర్మ పరిజ్ఞాతలగు వరదాచార్యులవారు సముచితచ్ఛందః ప్రయోగ కౌశలముతో పోతన చరిత్రమును సంతరించిరి. కావ్యము నందలి ఛందశ్శిల్పమును చర్చించుటయే ప్రస్తుతాంశము.

## పోతనచరిత్రము నందలి పద్యగద్యములు :

ఛందోదృష్టిచేత నేర్పడిన కావ్యభేదములలో పద్యగద్యాత్మకమగుటచేత పోతన చరిత్రము చంపూకావ్యము. ఐనను నితర కావ్యములవలెనే దీనిని పద్య కావ్యమనుట సమంజసము. సంస్కృత సారస్వతములో చంపూకావ్యములకు ప్రత్యేకత కలదు కాని ఆంధ్రమున మాత్రము పద్య గద్య కావ్యములనుటయే యెక్కువ వాడుక. గురు పద్యవిద్యకాద్యుడైన నన్నయగారు ప్రారంభించినది చంపూ పద్ధతియైనను అట్టి కావ్యములను తెలుగువారు పద్యకావ్యములనుటయే దీనికి కారణము.

కావ్యమునగల మొత్తము 3787 పద్య గద్యములలో దిగువ పేర్కొనిన విధముగా వివిధ వృత్తములు గలవు.

595 ఉత్పల మాలలు
378 చంపక మాలలు
124 శార్దూల విక్రీడితములు
150 మత్తేభ విక్రీడితములు
872 కందములు
375 సీసములు
746 తేట గీతులు
302 ఆట వెలదులు

---

1. ఆంధ్ర మహాభారత ఛందశ్శిల్పము : పుట 39.

38 విశేష వృత్తములు, గేయములు
207 గద్యములు
———
3787

ఇందు మాలిని మొదలగు విశేషవృత్తములు, గేయములు 18 విధములవి కలవు. ఈ రీతిగా సామాన్యచ్ఛందములు 8, విశేషచ్ఛందములు 18 మొత్తము 26 రకముల ఛందములు కావ్యమున ప్రయుక్తములై యున్నవి.

దీనిని పరిశీలించినచో 1300 వరకు మార్గచ్ఛందః పద్యములును 2300 వరకు దేశిచ్ఛందః పద్యములును ఉన్నట్లు తెలియగలము. ఇంతటి బృహత్ కావ్యమున సాధారణచ్ఛందములే సర్వత్ర వ్యాపించియుండి విశేషచ్ఛందములు మిక్కిలి తక్కువగా కనబడుచున్నవి. కందములు తేటగీతులత్యధిక సంఖ్యలో నుండుట గమనార్హము. కావ్యమున వివిధ పద్యములు గద్యములే కాక శ్లోకములు, రగడలు కొన్ని ప్రయుక్తములైన విషయము విశేషము. ఇట్లు ఛందోవైవిధ్య విలసితమైన కావ్యమునందలి ఆయా పద్యముల గురించి సంగ్రహముగా చర్చింతును.

## సామాన్యచ్ఛందములు :

సామాన్యచ్ఛందములలో ఉత్పల చంపకమాలలు, శార్దూల మత్తేభములు, కందములు, సీసములు, తేటగీతులు, ఆటవెలదులు అను నెనిమిది రకముల పద్యములు చేరును.

## ఉత్పలమాల :

పోతన చరిత్రమున నుత్పలమాలలు 595 కూర్పబడినవి. సామాన్యచ్ఛందో వృత్తములు నత్యధికముగా ప్రయోగింపబడిన దిదియే. ఆంధ్ర కావ్యములలో సర్వ సామాన్యముగా విరివిగా వాడబడు చంపకోత్పలములలో నుత్పల మాచార్యుల వారికి ప్రియతరమైనట్లు తోచును.

ఉత్పలమాలాగతిని గూర్చి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారిట్లు వ్రాసిరి.

"ఈ వృత్త గతియందు భగణప్రభావ మధికమగుటచే నవరోహణాత్మకమై మధుర ప్రసాదాది గుణానుకూలమై వర్తించును. దీనియందలి భగణములను విశ్లథముచేసి జగణ సగణ స్ఫూర్తి భాసింపజేసినచో నుద్వేగవంతములగు

వీరరౌద్రాదులను భాసింపజేయవచ్చును.... సంస్కృతము నందంత ప్రాచుర్యము చెందని యీవృత్త మాంధ్రకవుల యభిమానమును చూఱగొని వివిధ రసములందు యథోచితముగాఁ బ్రయోగింపఁబడుచున్నది. తెలుఁగునఁ జంపకమునకున్న ప్రయోగబాహుళ్య మీ వృత్తమునకు లేదుకాని, చంపకమునకున్న గౌరవ ప్రవృత్తులు ఉత్పలమునకు గలవు"[1]

సుబ్రహ్మణ్యంగారి యుల్లేఖనామసారముగా భగణాధిక్యముచేత నవరోహణ స్వభావములుగల ఉత్పలమాల ప్రసాదమాధుర్యాది కోమల గుణములు గల శృంగార కరుణాదులకును భగణములను జగణ సగణములుగా భాసిల్లజేసినచో తీవ్రములగు వీరరౌద్రాదులకును నుపయోగపడును. ఇట్టి సౌకర్యము కలదగుట వల్లనే సర్వ కావ్యములలో ప్రయోగించినట్లే ఆచార్యులవారును దీనిని సర్వరస భావములకును ప్రయోగించియున్నారు. వారు నానావిధ రసభావములకే కాక కథా కథనమునను, వర్ణనలోను, సంభాషణలోను, స్తవములందును ఎల్ల విషయము లందును నుత్పల సౌగంధ్యమును గుబాళింపజేసినారు. ఈ విషయము దిఙ్మాత్రముగా నిరూపింతును.

కావ్యపీఠికలో త్రిమూర్తులను బ్రహ్మను శంకరుని సరస్వతిని, ఆంధ్ర జనతను స్తుతిచేయుట కుత్పలవృత్తము వాడబడినది.[2]

శృంగార రసవిసారమునకు దిగువ యుత్పలమాలలు వాహికలైనవి.

"కన్నుల కాటుకల్ మరుని కత్తుల సానలుబట్టి....[3] (పోతన దంపతుల శృంగారము)

ఎంతయుఁ గూర్మి మోము పయికెత్తి కపోలములంటి..."[4] ( ,, )

వెన్నయటుల్ మనస్సులు ద్రవించె...."[5] ( ,, )

ఆ వనజాక్షి నూత్నప్రణయాంకురముల్....[6] ( ,, )

కరుణ రసమున చెల్లెలి యప్పగింతలవేళ శ్రీనాథుడు కడుపు చుమ్మలుచుట్ట పలికిన

"దూర మొసంగినాడనని దూరకుమమ్మరో...."[7] యనునదియు,

శ్రీనాథుడు భార్యా వియోగము నొందివచ్చి పోతనతో పలికిన,

1. ప్రథమాంధ్ర మహాపురాణము : ద్వితీయసర్గము-ఛందశ్శిల్పము, పుట 323

2. పోతన చరిత్రము : పీఠిక, - 2, 4, 5, 6, 8, 10 పద్యములు.

3, 4, 5, 6, పోతన చరిత్రము : 3 వ ఆశ్వా - 218, 239, 242, 246, పద్యములు.

7. పోతన చరిత్రము : 2 వ ఆశ్వా - 278.

"కన్నుల నీరు కన్నులనె కన్పడకుండఁగఁ గ్రుక్కుకొందు...."
అన్నదియు ఉత్పల ప్రయోగమునకు తార్కాణము. (3 వ ఆ, 320. ప.)

వీరరౌద్ర భయానకములకు దిగువ పద్యము లుదాహరణములు,

రాచకొండ చమూపతితో బమ్మెర యువకుడు కత్తితో పోరాడిన యుద్ధ సన్నివేశమున వరుసగా నైదుత్పలమాలలలో వీరాదులు పోషింపబడినవి. మచ్చునకు రెండు.

"అంతనె యాము చేనికల యొాదలనాడెడి కోడెసింగమై
చెంతఁ జెలంగు వానికడఁ జేలగుడమ్మును దుస్సికొంచు వి
క్రాంతి వెలుంగ నెన్నడుము కాసెబిగించి కరాన మట్టి నా
క్కింతగ రుద్దికొంచు మొగమెత్తినగా నతఁడేగి వేగతన్"[1]

"పొంగెడు కండెముల్ కరుడువాల్చెడి కండలు మేనవీరతా
గాంగ జలాల మీలగుచు గండెసఁగన్ వడిఁ ద్రుళ్ళియాడఁ బూ
ర్ణాంగము నంటు వజ్రకవచాకృతిఁ బెట్టని కోటవోలెఁ గే
లంగల కోల రక్షనిడ లాయుచు మార్తుర నొంప డాయుచున్"[2]

ఈ పద్యములలో భగణములను జగణ సగణములుగా భాసింపజేసిన పట్టులలో వీర రౌద్రాదులు వ్యంజితమగుచున్నవి. మొదటి పద్యము మూడవ పాదమున వెలుంగ-బిగించి-కరాన అనునవి జగణ స్ఫూర్తి గాంచినవి. అట్లే రెండవ పద్యము రెండవ పాదమున జలాల-ఎసగన్ అనునవి జగణ సగణములై భాసిల్లి వీరరస వ్యంజక ములై రంజింపజేయుచున్నవి.

భాగవత మపహరించుకొనిపోవు కన్నడ వీరుల నెదిరించిన వీరుని విజృంభణ ముత్పలమాలలో నిట్లు సాక్షాత్కరించినది.

"అత్తరి కన్నడీల కెదురై యరుదెంచిన వీరుడున్ శివ
మ్మెత్తిన రుద్రరూపమున నేపుఁదలిర్పఁ బరాక్రమించి తా
నిత్తెఱఁగాడె దర్పిత మదేభ నికాయ శిరో వినిర్దళ
చ్చిత్త మెలర్ప గర్జనము సేయు మృగేంద్ర విభీషణార్భటిన్"[3]

---

1,2. పోతన చరిత్రము : 7-206, 207.
3. ,, ,, : 9-165.

ఇందు 3,4 పాదములలో మదేభ-నికాయ-శిరోవి, నిర్దళత్-ఎలర్ప-మృగేంద్ర-విభీషణార్భటిన్ - అను పదాలు జగణ విస్ఫూర్తిగాంచి వీర భయానకములను పోషించుచున్నవి.

పోతన గంగా సైకతమున నార్తితో ప్రార్థన చేసి ధ్యానమగ్నుడైనపుడు జాల్వారిన శాంతరసముత్పలమున శోభిల్లుచున్నది.

"అంతట పోతరాణ్మణియు నయ్యుపరాగము...."[1]

''చందురు మోమునన్ సుకవిచంద్రుదు ముఖాంబుజసీమ....''[2]

"ఎన్నడు దర్శనమ్మిడ విదేమి పరీక్షయటంచు దాను....''[3] మొదలగునవి

పోతన పై సందర్భముననే శ్రీరామచంద్ర సాక్షాత్కార భాగ్యము గాంచి నప్పటి భక్తిరస నిర్వహణమున నుపయోగించిన యుత్పలమాల లిట్లు చెలువొందు చున్నవి.

"కంటిని నీ పదద్వయిని కంటిని నీ మహనీయమూర్తి....''[4]

"ఎవ్వని దివ్యరూప నిధి నెవ్వని సన్మహిమార్ణవావధిన్"[5]

ఇట్లే ఇతర రసపోషణలోను నుత్పలములు ప్రయుక్తములైయున్నవి.

వర్ణనలలో నుత్పలోపయోగమునకు,

''చుక్కలనాడు మంచుమల చుంచుల మించెడి కోటకొమ్ములన్....''[6]

"యామిని తీవ దాని కొవలందునఁ జుక్కలు రేపు రాత్రికిన్....''[7]

ఇత్యాదులుదాహరణములు.

కథాకథనమునకు,

"అమ్మహితుండు కేసన నిజాత్మజునిం గొని ధర్మపత్ని ల
క్కమ్మయు వెంటరా...."[8]

మున్నగునవియు, సంభాషణలకు

''ఇవ్విధి దివ్వెటీల్ వెలుగునేమని బాలుడు ప్పచ్చ సేయగా....[9]

మొదలగునవియు లక్ష్యములు.

1, 2, 3. పోతన చరిత్రము : 5-64,66,67
4,5 ,, ,, : 5-91,94
6. ,, ,, : 4-12
7. ,, ,, : 8-197
8. ,, ,, ; 1-165
9. ,, ,, ; 1-149

కావ్యమునందెల్లయెడ నిసర్గరమణీయముగా పొందిపొసగిన ఉత్పల మాలలలో నొండు రెండు సందర్భములలో విశేషము గోచరించును. అందొకటి భోగినీ నాట్యఘట్టములో 12 పాదముల యుత్పల మాలిక కూర్పబడినది.

రెండవది మణిగిరిపై పోతనకు సరస్వతి విలపించుచు సాక్షాత్కరించిన విషయము వర్ణించునపుడు ద్విరుక్త టకార ప్రాసముతో నాల్గుత్పలములు కూర్పబడినవి. వీని వివర మిదే వ్యాసమున 'ఛందః ప్రయోగ విశేషములు'లో చేయబడినది.

మరొక చోట రాచకొండ సేనాపతి భాగవతకోశ మపహరింప గ్రామ యువకుడు అతనితో పోరాడిన సన్నివేశమున వరుసగా నైదుత్పలములు ప్రయోగింపబడినవి. అక్కడ వెనుదీయక ధైర్య సాహసములతో రౌద్రముతో చేసిన యువకుని కఱ్ఱ యుద్ధమును, అదే శౌర్యముతో నెదుర్కొనిన సేనాపతి ఖడ్గ యుద్ధమును నేకధాటిగా వర్ణించుటలో నిచట వృత్తైక్యము సమంజసముగా సమకూడినది. ఇట్లొక కొన్ని విశేషములు తప్ప ఉత్పలమాలలు సర్వము సమ్యగ్ధోరణిలో సాగినవి.

## చంపకమాల :

కావ్యమున చంపకమాలలు 378 కలవు. సాధారణముగా కావ్యములలో, చంపకోత్పల మాలలలో చంపకములే యెక్కువగా గన్పడును. కాగా నిందివి ద్వితీయ స్థాన మలంకరించినవి. ఉత్పలమాల పాదము నందలి ప్రథమ గురువును రెండు లఘువులుగా విడదీసిన చంపకముగా మారును కావున కించిద్భేదము తప్ప రెండిటి గతి యొకటే. అందువల్లనే చంపకోత్పలములు జంటకవుల వలె జతగూడి సాగుచుండును. ఇట్టివి ముఖ్యముగా శతకములందు గానవచ్చును. చంపకములో జగణ బాహుళ్య ముండుటచేత సహజముగా నిందు ద్రుతగతి చెలగి వీర రౌద్రాదుల కెక్కువ యుపయోగకరముగా నుండును అట్టి జగణములను భగణములుగా భాసింప జేసిన నవరోహణాత్మకమై ప్రసాద మాధుర్యాది గుణశోభిత మగు శృంగారాది సుకుమార రసభావ వ్యక్తీకరణకు నుపకరించును. ఈ విషయముననే చంపకమాల గూర్చి డా॥ పాటిబండ మాధవశర్మ గారిట్లు విశదీకరించిరి.

"విచ్ఛేద వశమున పాద ఖండములు తుల్య ప్రమాణములగుట చేతను, పాదము నందలి గురు లఘువుల విన్యాస సామంజస్యము వలనను, చంపకమాలా వృత్త పాదము మిక్కిలి సుఖముగాఁ బ్రయోగింప దగియున్నది. 21 అక్షరములలో 14 లఘువులైన దీని గతి మిగుల ద్రుతము. లఘ్వక్షర ప్రాయమైన యావృత్తము చిత్త వృత్తి యతను వాహియైన పట్టులందు-అనగా వీర రౌద్రాదులందుఁ బ్రయోగింపదగినది. సమాంతర వినివిష్టములైన గుర్వక్షరములు చంపకమాలా ద్రుతగతి యందు విలంబన మాదానము చేసి కొంతవరకు సామ్యము భాసింప జేయుటచేత ద్రుత్యభిముఖమైన సమగతి గల రత్యాది భావములందును ఈ వృత్తము ప్రయోగింపఁదగి యున్నది. లక్షణమును బట్టి చంపకమాల జగణ మయము. అనగా ద్రుతోత్ప్లుతగతి కలది కాని పదఘటనా వశమున జగణములు స్థగితములై భగణములు రూపు కట్టవచ్చును. అట్టి చంపకమాల ద్రుతావరోహణగతి గలది యగును. ద్రుతి యందు ఉత్ప్లుతి భాసించినచో వీరాదులు, అవరోహణము భాసించినచో శృంగారాదులు చంపకమాల నిర్వహింప గలదని భావింపవలెను."[1]

పై వివరణము ననుసరించి గతిభేదమును భాసింపజేసినచో చంపక మాల వీర రౌద్రాద్యుద్ధతరసములను, శృంగార కరుణాది సౌమ్యరసములను వ్యంజింప జేయునని తేట పడుచున్నది. కావుననే కావ్యములలో చంపకమాల సర్వరస భావ పోషణ కుపయోగింపబడి యున్నది.

పోతన చరిత్రమునందును చంపకమాల ఉత్పలమాల వలెనే సమస్త రసాదిక విషయములందును ప్రయుక్తమై యున్నది.

రాచకొండ ప్రభువు హేళన చేసినందుకు పోతన క్రుద్ధుడైన పట్టున దిగువ చంపకమున రౌద్రరసము నిర్వహింపబడినది.

"అరుణ సరోజరాజిఁ బరిహాస మొనర్చెడి నేత్ర సీమలన్
మెఱసెను వీరభార్గవి తృణీకృత విశ్వవిభూతి వైభవ
స్ఫురణఁ దలిర్ప స్వేచ్ఛ మిను జూచెడి గుర్వభిమానకేతువున్
గరముఁ బూని ఱేని పృథుగర్వ మతిన్ గబళించునో యనన్"[2]

---

1. ఆంధ్ర మహాభారత ఛందశ్శిల్పము : పుట 419.
2. పోతన చరిత్రము : 4-385 .

వీరరసస్ఫూర్తికి యువకమల్లుడు రాచకొండ సైనికులతో పోరాడినప్పటి వీరము దిగువ చంపకమున వ్యంజితమైనది.

> "కరమున వెల్గుదండమది కన్గవకున్ గనరాని యట్టులన్
> బిరబిర ద్రిప్పుచున్ భటుల పీఁచ మడంచుచు నెందుఁ దానయై
> యుఱుముచు శత్రు శీర్షముల నుద్దవడిన్ జని ఫక్కు ఫక్కునన్
> దుఱుమొనరించుఁ జిమ్మిపడి తోడనె నెత్తురుటేర్లు పాఱఁగన్"[1]

శృంగారమునకు మోహిని శివుని మోహింప జేసిన విషయము వర్ణించిన దిగువ చంపక ముదాహరణము.

> "వలపులు మోసులెత్తఁజెలి వాల్గనులన్ హరుఁజూచె నంతలో
> మలయపు గాలి వీచె నవమల్లిక పూచె సుగంధ మాత్మలన్
> నిలువున దోఁచె నామని వనిన్ బలు వన్నెలఁ దోఁచె శ్రావ్యమౌ
> కలరుతులన్ శకుంత మృదుగాన వితానము లూఁచె నుల్లమున్''[2]

ఇక కరుణమునకు గజేంద్రుడు హరిని ప్రార్థించిన సందర్భమున గూర్చిన దిగువ చంపకము లక్ష్యమై యొప్పుచున్నది.

> ''పరమ కృపాధనా! ప్రణయ భక్త జనావన! నీవు దక్క నే
> శరణములేదు నాకనుచు సామజ మూర్తిని దొండ మెత్తి యం
> బరమును గాంచి దీనగతి మార్గము గానక'' రావె యీశ్వరా!
> వరద ! యటంచు నేడ్చెనట వర్తిలు కొండల గుండె నీరుగాన్''[3]

ఇట్లే ఆయా రసభావము లన్నిటను చంపకమాల లింపు గొల్పుచు రసజ్ఞులను రంజింపజేయుచున్నవి.

## శార్దూల విక్రీడితము :

కావ్యమున సామాన్య వృత్తములలో కనిష్ఠముగా వాడబడినవి శార్దూల విక్రీడితములు. ఇవి ఇందు 124 కలవు. పోతన చరిత్రమ నసే కాక ఆంధ్ర కావ్యము

1. పోతన చరిత్రము : 7-211
2. పోతన చరిత్రము : 11-28.
3. పోతన చరిత్రము 12-48.

లందే యీ వృత్తము సకృత్తుగా ప్రయుక్తమై యున్నది. దీని ప్రయోగ వైర
ళ్యము గూర్చి డా॥ పాటిబండ మాధవశర్మ గారిట్లు వ్రాసిరి.

"19 అక్షరముల పాదమున 12 అక్షరముల వఱకు అవిచ్ఛిన్నోచ్చార
ణము విధింపఁబడుటచే శార్దూల వృత్తము వక్తృప్రాణ శ్రాంతికరము, దుఃఖా
వహము, ఓజౌనిర్వర్త్యము. అట్లే శ్రోతృ శ్రవణోద్వేజము, ఓజోజనకము. దీర్ఘ
సమాసఘటనాత్మక నిర్విరామ వాక్యనిర్మాణ ప్రవణులైన గౌడీయులకు శార్దూల
వృత్తము ప్రేమపాత్ర మగుట సహజము. గుర్వక్షర బాహుళ్యమున సాడంబరమై
యుండుటయు, గౌడీయాదర పాత్రమగుట యుచితము. "గౌడేష్వక్ష రాడంబరః"
అని అభియుక్తోక్తి. అని అభియుక్తోక్తి. ఆంధ్రమున శార్దూల వృత్త ప్రయోగ
వైరళ్యమునకుఁ గారణము దాని గుర్వక్షర బాహుళ్యము-ఓజోమయత్వము అని
భావింపదగియున్నవి. ఆంధ్రులు చతురలలిత మధురమైన వైదర్భ మార్గప్రియులు
ద్విత్రిగురుకములైన పదములు ఆంధ్రమున దుర్లభములు. దుష్కర ప్రాసమువలె
శార్దూల వృత్తమును విశిష్ట ప్రయోజనాపేక్షయున్న చోటనే అవశ్యంభావియై
యుపయుక్తమగుచున్నదని చెప్పవచ్చును. సంస్కృత సాహిత్యము నందు అనా
దృతమైన మత్తేభము ఆంధ్రులచే నత్యంత మాదృతమై యుండుటకు నాతిదీప్త
మైన యోజస్సు కారణమని తలపఁదగి యున్నది"[1]

శర్మగారి వివరణము ననుసరించి గుర్వక్షరము లధికముగా నుండుట
చేతను, ఓజోమయత్వము చేతను శార్దూలమును వైదర్భీరీతి ప్రియులగు నాంధ్రులు
విరళముగా వాడినారన్నది తెల్లమైనది. క్షేమేంద్రుడు "శౌర్యస్తవే నృపాదీనాం
శార్దూలవిక్రీడితమ్" అని నృపాదుల శౌర్యవర్ణనలో నిది ప్రయోగింపదగునని
సూచించెను. ఉద్ధతగతిగల శార్దూలమునకిట్లు వినియోగము చెప్పుట సమంజస
మైనదే. ఐనను కావ్యములలో శార్దూలమును గతిభేదమును భాసింపజేయుచు వీర
రౌద్రాదులలోనే కాక సౌమ్యములగు శృంగారాది రసముల వ్యంజింపజేయుటకును,
ఇతర సకల విషయములకును ఉపయోగించుట జరిగినది. కవులు భీకరమైన
శార్దూలమును జగదంబవలె స్వాధీనము చేసికొని మచ్చికతో నిచ్చమెయి సాహిత్య
జగతిలో విహరించుట విస్మయమును వినోదమును కలిగించుచుండును. "సింగం
బాకటితో గుహాంతరమునం జేడ్పాటు మై నుండి" వంటి శార్దూలమును తిక్కన

1. ఆంధ్రమహాభారత ఛందశ్శిల్పము, పుట 387, 388.

వంటి ఆదికవులొకరిద్దరు ప్రత్యేకముగా శౌర్యోద్ధతిలో ప్రయోగించినట్లు కాననగును. కాని తక్కిన కవులెల్లరును సర్వరసభావస్ఫురణకు దీనిని వాడుక చేసిరి. "లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె" నన్న భాగవత శార్దూలము కరుణవ్యంజకమై జాలి గొలుపుచున్నది. వరదాచార్యులవారు తమ కావ్యమున నితరాంధ్రకవుల వలెనే సమస్త రసాదులను శార్దూలమున నిర్వహించిరి.

ఇతర కావ్యములందువలెనే పోతనచరిత్రము నందును కావ్యాదిని శ్రీకారముతో మొదలయిన శార్దూలము శ్రీరామస్తుతిలో సమంజసమై యొప్పుచున్నది. సంప్రదాయ విశిష్టమైన యీ కావ్యమున శుభకరమై భూదేవతాకమైన మగణము మొదటగల శార్దూలము గూర్చుట యుక్తమైనది.

తక్కిన రసములన్నిట శార్దూలము కానవచ్చును కాని పోతన చరిత్రమున యుద్ధఘట్టములందు వీర రౌద్ర భయానక రస పోషణలో శార్దూలము ప్రయోగింపక పోవుట వింతగా దోచును. ఇట్టి పట్టుల శార్దూలమునకు మారుగా దత్తుల్యమగు మత్తేభము వాడబడినది. ఇట్లు ఆయా రస భావములకు ప్రయోగించిన శార్దూలములను స్థాలీపులాకన్యాయముగా నుదాహరింతును.

నర్సమాంబ కావించిన దుర్గాదేవీ స్తుతిలో దిగువ శార్దూలములు ప్రయుక్తమై భక్తి రస వ్యంజకములై యున్నవి.

"తల్లీ! యెల్లపుడున్ గళేబర గతార్ధంబంటి ముక్కంటిలో...."[1]

"ప్రాలేయాచల శృంగతుంగ రజతప్రాసాద భాగమ్ములన్...."[2]

ఇందు తెండవదానిలో శైలి దీర్ఘసమాసాన్వితమై యొకింత యోజోగుణ భాసితమై నర్సమాంబ వేదనా తీవ్రతను వ్యక్తముచేయుచు శార్దూలము సముచిత పాత్రను నిర్వహించినది.

శ్రీనాథుడు సింగనృపతి దర్శనము చేసినప్పుడు పలికిన,

"వప్రాట్టాలక శృంగమూర్ధ విలసత్ వాల్లభ్యచిహ్నధ్వజా
ధిప్రేంఖన్మసృణారుణాంశుక సముద్దీప్తస్వరూపమ్ము తా

---

1. పోతన చరిత్రము : 3-127
2. పోతన చరిత్రము : 3-128

విప్ర ప్రాజ్ఞ కవీంద్ర గాయక నటీ విశ్వమ్ముకై స్వాగతా

భిప్రాయ ప్రకటత్కరాగ్రమయి పంపెన్ యుష్మదాహ్వానముల్.''[1]

అను శార్దూలమున ఆ రాజుగారి యశోవైభవము నోజోగుణాన్వితము కావించి వృత్తౌచిత్యమును పాటించుట జరిగినది.

శృంగార రసప్రసారమునకు దిగువ శార్దూలములు లక్ష్యములు. మోహినీ సౌందర్య వర్ణనమునందలి

"సౌందర్యామృత సింధువున్ ద్రుహిణ శీర్షశ్రేణి మంథాన మా

కందంబై......''[2].

విప్రుడు కృష్ణునికడ చేసిన రుక్మిణీ సౌందర్య వర్ణనమునందలి

''బంగారమ్మున రంగులద్దు మెయినాపగ్గట్టు ముత్యాలచేర్ల....''[3].

సింగనృపతి వనవర్ణనలోని,

"కాషాయాంబర శోభ నర్యముఁడు సాక్షాత్కర్మ సన్యాసపున్...."[4]

అన్న శార్దూలమును,

గోదావరీ వర్ణనములోని

"పాఱున్ బక్షులతోరణమ్మది నభోభాగాన గోదావరీ...."[5]

అన్న శార్దూలమును తత్తత్సౌందర్యములను సముచితముగా వ్యక్తము చేసినవి. ఈ రీతిగా సర్వ విషయస్ఫూర్తికి శార్దూల ముపయుక్తమయి పరిఢవిల్లినది.

## మత్తేభ విక్రీడితము :

సామాన్య వృత్తములలో కావ్యమున మత్తేభమునకు తృతీయస్థానము లభించినది. ఇందివి 150. ఇవి శార్దూలములకంటె 26 ఎక్కువ. శార్దూల వృత్తముల పాదప్రథమ గుర్వక్షరమును రెండు లఘువులుగా మార్చిన మత్తేభ వృత్త మేర్పడును గనుక నీ రెండింటికి ఈ భేదముతప్ప తక్కిన గతియెల్ల

1. పోతన చరిత్రము : 4-68
2. పోతన చరిత్రము : 11-122
3. పోతన చరిత్రము : 12-270
4. పోతన చరిత్రము : 4-112
5. ,, ,, : 5-20

సమమైనదే. కావుననే ఉత్పల చంపకములవలె శార్దూల మత్తేభములు జంటగా సాగుట కవకాశము కలదు. శార్దూల మత్తేభములతో శతకములు రచింపబడి యున్నది సర్వవిదితమే.

మత్తేభమున గురులఘువుల సంఖ్య సమానముగా పదేసియుండుటచేత దీని గతి సమవిలంబిత ద్రుతమై యొప్పారుచుండును. ఇట్లు సమగతితో నాయా రముగా గంభీరముగా సాగు దీనిని మత్తేభ విక్రీడితమనుట మిక్కిలి సార్థకమయి యున్నది. సంస్కృతమున నంతగా వాడుకలో లేని యీ మత్తేభమును తెలుగు కవులు ఎక్కువ మక్కువతో నుపయోగించిరి. ద్రుతవిలంబిత గతులు సమానముగా గల యీ వృత్తమును తదితర కవులవలెనే ఆచార్యులవారును వీర రౌద్రాది కోద్ధత రసములను శృంగార కరుణాది మృదుల రసములను వ్యంజింపజేయుటకు ప్రయోగించిరి.

భక్తికి నర్సమాంబ చేసిన దుర్గాస్తవములో దిగువ మత్తేభములు ప్రయుక్తములు.

"గిరిశోన్మత్త మనస్సరోవర లసత్ క్రీడామరాళీ! మహే
శ్వరి! కాళీ! జగదాదికారిణి! నమస్కారమ్ము లో యమ్మ!...."[1].

"మును శ్రీ రుక్మిణి నీ పదమ్ములను సంపూజించి తానేగుటన్...."[2].

శృంగారమునకు పోతన సతినిగూర్చి విరహము ననుభవించిన విషయము తెల్పుచు

"మధుపానమ్మొనరింపకుండఁ గనులన్ మత్తెక్కు...."[3].

అను మత్తేభమును, శివుని మోహింపజేసిన మోహినీ విలాస క్రీడలు దెలుపు

"ఘన వక్షోజభరమ్ము గ్రక్కదల రాకాచంద్ర బింబాస్యమోహిని...."[4]

అను మత్తేభమును నుదాహరణములు.

శాంతమునకు గంగాసైకతమున పోతన శివధ్యాననిమగ్నుడైన విషయమును వర్ణించుచు దిగువ మత్తేభము గంభీరముద్ర దాల్చి పొల్చుచున్నది.

---

1. పోతన చరిత్రము ; 3-133
2. పోతన చరిత్రము ; 3-135
3. పోతన చరిత్రము ; 3-171
4. పోతన చరిత్రము ; 11-158

"భసితస్నిగ్ధ పవిత్ర లాంఛనలసత్ ఫాలుండు రుద్రాక్షహా
రసమాశ్లిష్ట విశాల వక్షుఁడవిలోలత్కించి దున్మీలితా
క్షిసమాలోకన నాసికాగ్రుఁడు సమగ్రీవా శిరః కాయుఁడు
ల్లసితాత్ముండు ప్రశాంత చిత్తుఁడగుచున్ లక్షించుచున్నంతలో"[1]

వీరరౌద్రాదులకు కన్నడ సైన్యము పోతనను చేరిన యుదంతము తెల్పు

''పరివారంబులతోఁ జలద్భటులతో భద్రే భరాజంబుతో....''[2]

అను మత్తేభమును, యజ్ఞవరాహ హిరణ్యాక్షుల యుద్ధమును వర్ణించు.

''కులభూభృచ్ఛిఖరాగ్ర సన్నిభగదా ఘోర ప్రహారాహతిన్"[3]

అను పద్యమును,

''మఖవారాహ కళేబరాయిత మహా మంత్రానల ప్రోజ్జ్వలచ్ఛిఖలన్...."[4]

అను మత్తేభమును నుద్ధత రస వ్యంజకములై ప్రాజిల్లుచున్నవి.

ఇటే కథాకథనమునను, వర్ణనలలోను ఇతరానేక విషయ ప్రవచనము లందును మత్తేభము చిత్తా కర్షకమై చెలువొందుచున్నది,

## కందము :

కందము చిన్న పద్యములలో నొకటి. ఇది చిన్నదయ్యును "కందము చెప్పిన గవి యగుఁ బందిని హతమార్చు నతఁడె బంటు...."[5] అని సామెత యేర్పడెను. దీనికి కారణము కలదు. జాతిచ్ఛందమునకు చెందిన దీనికి జాత్యుప జాతి పద్యములందుగాని, వృత్తములందుగాని లేని విపుల లక్షణము కలదు. భ జ స నల గగము లను గణములుండుటయే కాక రెండేసి పాదములతో గూడిన ప్రతి యర్ధమున బేసిగణము జగణముండరాదనుట, ఆరవగణము జగణ నలములలో నొకటి మాత్రమే యుండవలయుననుట, ఎనిమిదవ గణము గగ సగణములలో

1. పోతన చరిత్రము : 5-78
2. పోతన చరిత్రము ; 9-97
3. పోతన చరిత్రము ; 11-198
4. పోతన చరిత్రము ; 11-200
5. పోతన చరిత్రము 7-284.

నొకటి మాత్రమే యుండవలయుననుట- ఇత్యాది విషయములుండుటచేత కందము కూర్చుట క్లిష్టమైనది. కందము నందముగా గూర్చుట కూడ కష్టమైన పనియే. ఐతే యిది యభ్యాసదశలోని కష్టమే కాని యీ ఛందస్సు వశమైన పిమ్మట నల్లేరుపై బండినడకవలె చకచక సాగిపోవుచుండును. అంతేకాక యుపర్యుక్త నియమములు కొన్ని పాటించుచు నిందు నిర్దేశించిన భ జ స నల గగములను యథేచ్ఛగా నిల్పు నవకాశముండుట చేతను చిన్న పద్యమగుట చేతను కవులకిది సులువైనది. అందుకే సాధారణముగా కవులు కావ్యములందు కందములనే యత్యంతముగా పొందుపరచి యున్నారు.

కందమును తరచుగా ప్రయోగించుటకు మరియును కారణములు గలవు. కథను శీఘ్రగతిని సాగించుటకును, సంగ్రహముగా సరళముగా విషయమును హృదయములకు హత్తుకొనునట్లు చెప్పుటకును కందము మిక్కిలి యనువైనది. ఈ కందము యొక్క ప్రయోగబాహుళ్యమునకు హేతువును డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రిగారిట్లు వివరించిరి.

"మరియు క్షేమేంద్రుడు కొన్ని రకముల గ్రంథములయందు కొన్ని రకముల ఛందస్సులే ఉపయోగ్యములనియు, అట్లుపయోగించుట సులక్షణ మార్గ మనియు సిద్ధాంతము చేసెను. అది కొంతవరకు సంస్కృతమునందు వలెనే తెనుగు నకును సమన్వయించునదిగా కనిపించుచున్నది. ముందావిషయము కొద్దిగా వివరింప బడును.

"శాస్త్రకావ్యే అతి దీర్ఘాణాం వృత్తానాం నప్రయోజనం,
పురాణ ప్రతిబింబేషు, ప్రసన్నోపాయ వర్త్మసు, ఉపదేశ
ప్రధానేషు కుర్యాత్సర్వేష్వనుష్టుభామ్"

శాస్త్ర కావ్యమునందలి దీర్ఘములైన వృత్తముల వలన ప్రయోజనము లేదు. పురాణ ప్రతిబింబములుగా నున్న కావ్యగ్రంథముల యందన్నిటను అనుష్టుప్పు ఛందమునే వాడవలయును. అర్థప్రసన్నత ప్రధానమైన మరియు నుపదేశాత్మకత కలవాటి యందు అనుష్టుప్పు ఛందమునే యుపయోగింపవలయును. ఇది క్షేమేంద్రుని సిద్ధాంతవాక్య తాత్పర్యము."

".... క్షేమేంద్రుడు చెప్పిన శాస్త్రకావ్య లక్షణము భారతమునందున్నది. కనుక శాస్త్రకావ్యమైన భారతము నందలి దీర్ఘములైన వృత్తముల వలన నంతగా

ప్రయోజనము లేదు. మరియు భారత మితిహాసమగుట వలన పురాణ ప్రతిబింబ లక్షణము కొంత యున్నది. ఉపదేశాత్మకతయు భారతమున నున్నది. అట్టి గ్రంథమున కర్థప్రసన్నత మరియు ముఖ్యముగా నుండవలయును. సంస్కృత మహాభారత మనుష్టుప్పు ఛందము నాశ్రయించి వ్రాయబడినది. కనుక నచట క్షేమేంద్రుడు చెప్పినట్లు సరిపోవుచున్నది. మరి తెనుగున ననుష్టుప్పు ఛందము లేదు. తెలుగు భారతమెంత కావ్యేతిహాసముగా వ్రాయబడినను శాస్త్రవాసన చాల యున్నది. కనుకనే ఛందము నాశ్రయించి తెనుగు భారతము వ్రాయబడవలయును. ఈ విషయమును మొదట నన్నయ్యగారే ఆలోచించి యుండవలయును. ఆయన ఆలోచించెను. ఆలోచించి తెనుగున కందపద్యము, సంస్కృతమున ననుష్టుప్పు వలె, ప్రయోజనమును సాధించగలదను నిర్ణయమునకు వచ్చెను. ఆయన వ్రాసిన భారత భాగమున నన్నింటికంటె కందపద్యములే యధికముగా నుండుట ఆయన నిర్ణయమునకు ప్రబలమైన ప్రమాణము. మరియు నాయన ఆలోచించి చేసినదేమనగా సంస్కృతమునందు వలె గ్రంథము నందంతటను నొక ఛందస్సే వాడక, కందము వంటి చిన్న చిన్న పద్యములు ఆటవెలది, తేటగీతి, మొదలైనవియు వాడెను....”[1]

శాస్త్రిగారు తిక్కన భారతమునందలి వృత్తౌచిత్య విచారము చేయుచు చెప్పిన పై వాక్యములు ఇతర వాక్యములకును వర్తించును. నన్నయ తిక్కనల మార్గమునే తరువాతి కవు లవలంబించి ఛందో వైవిధ్య విలసితముగా నాంధ్ర కావ్యములు రచియించుటయే కాక సంస్కృత కావ్యములలో వాడబడు ననుష్టుప్పు నకు బదులు కందము, ఆట వెలది, తేట గీతివంటి చిన్న పద్యములను ప్రయోగించిరి. పోతన చరిత్రము శాస్త్రకావ్యము కాకున్నను ధర్మము, భక్తి జ్ఞానములు, లౌకిక నీతులు సమృద్ధిగా బోధింపబడి పురాణ ప్రతిబింబముగా నున్నందున అర్థ ప్రసన్నత, ఉపదేశాత్మకత దృష్టి యందిడుకొని వరదాచార్యుల వారు చిన్న పద్యములగు కంద గీతములను అత్యధికముగా ప్రయోగించిరి.

కందమున నుండు భ జ స నల గగములను నైదు గణములలో ప్రతిదియు నాలుగు మాత్రల గణమే కావున జాత్యుపజాతులలో నితర పద్యములకు లేని విశిష్ట లయ సంగీతములోని యేకతాళ లయగా నొయారములు కులుకుచున్నది.

1. తిక్కన కావ్య శిల్పము : అష్టమోన్మేషము – వృత్తౌచిత్య విచారము, పుట. 507, 508.

ఇది యింతే కాక యిందలి పంచగణములలో నాయాగణముల యావృత్తి చేత గతిభేదము భాసింపజేసి నానా రస భావములను వ్యంజింపజేయవచ్చును. కందము నందముగా విభిన్న గతులలో నడిపించు విషయము డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారిట్లు విశదీకరించిరి.

'కందము భ, జ. స, నల, గగ-యను గణములతో నిర్మింపఁబడును. పూర్వార్ధమున జగణము ద్వితీయ చతుర్థ షష్ఠ గణస్థానములలో నుపయోగింప వీలున్నది. అష్టమ గణముగా - గగ, సగణములలో నేదైన నుండవచ్చును. ఇట్టి నియమమే యుత్తరార్ధము నందును బాటింపఁబడును. కవులీ కందమున భ స జాదిగణములలో భగణము నధికముగా వాడినచో నది యవరోహణాత్మకమై ద్రుతగతి యందు భాసించును. దానిని 'భకంద' మందురు అట్లే సగణావృత్తి గల కందము 'సకంద' మనఁబడును; ఆరోహణాత్మకమైన గతి దానికి సహజము. జగణమా ఛందమున నాలుసార్లు ప్రయోగింప వీలున్నది. ఆట్లు జరిగినచో నా ఛందోగతి మహాచపలమై యుండును. 'నలకందము' ద్రుతగతి గలిగి చిత్త వేగమును వ్యంజించును. 'గగ కందము' విళంబిత గతి నాశ్రయించును. కావున రసానుకూలముగా నీ కంద భేదములను కవులు కావ్యములందుఁ బ్రయోగించుటఁ గాంచుచున్నాము''1

సుబ్రహ్మణ్యంగారు విశ్లేషణ చేసి చూపిన రీతిగా కందభేదములను వరదాచార్యులవారు రసానుగుణముగా రమ్యముగా ప్రయోగించిన విషయము గమనించగలము. సంగ్రహముగా వానిని సమీక్షింతును.

కావ్యమున కందముల సంఖ్య 872. వాడబడిన ఛందములలో దీనికి ద్వితీయ స్థానము కలదు. ప్రథమ స్థానము తేటగీతికి లభించును. కేతవరపు వారు వివరించినట్లు కందము లెక్కువగా అర్థ ప్రసన్నతా కాంక్ష తోడను ఉప దేశాత్మకత గల పట్టులందును మరియు కథను శీఘ్రగతి సాగించుటలోను అధికముగా వాడబడినవి. రసపోషణలో వర్ణనలలో వాడబడిన కందములును ననేకముగా కలవు.

1. ప్రథమాంధ్ర మహా పురాణము : ద్వితీయ సర్గము, ఛందశ్శిల్పము; పుట 329.

## 1. భకందము :

కం. "క్రోడపు రూపముఁ గని యా సీడకునుం భయముఁ జెంది నిల్వఁగలేమిన్
బోఁడిమి చెడి యెడితి మని యూడని బాఱెదరు దిక్కు కొకరై పగతుల్"[1]

ఈ కందమున నెనిమిది భగణము లావృత్తమై భకందముగా నందగించు చున్నవి. మందనుండి రెచ్చి వచ్చి బీభత్సము గావించిన వరాహమునకు రాచ కొండ సైనికులు భయపడి పారిపోయిన విషయమిందు వర్ణితము. అవరోహ ణాత్మకమై ద్రుతగతి భాసిల్లునిది యెదిరించలేక శత్రువులు నిలువక చెదరిపోయిన విషయమును వ్యంజించుచున్నది.

## 2. సకందము :

కం. "అను నమ్మనుజాధిపుతోఁ గనులార్ద్రిముగాఁగనుడుల గాద్గద్యమ్మున్
దనరఁగ శ్రీనాథుఁడు పోతన దేశము వీడి యెటకొ తాఁజనె ననియెన్"[2]

ఇందు 9 సగణములు వచ్చి యిది సగణ కందమై యొప్పుచున్నది. అపహృతిచే శిథిలమైన భాగవతకృతి దుస్థితికి వగచి సింగనృపతి యా కృతిరత్నమును రాజ లాంఛనములతో బమ్మెరకు పంపవలె ననగా వేదనా తీవ్రతతో శ్రీనాథుడు పలికిన విషయమిందు కలదు. సగణ బాహుళ్యముచేత నారోహణాత్మకమై దుఃఖము పొంగి వచ్చుచున్న విషయము వ్యంజితమగుచున్నది. ఇట్టి సకందములకు—"చుఱకత్తులఁ బోల్ దంష్ట్రిలు"[3] అను కందము గజేంద్రుని పట్టుకొనిన భీకర మకరముఖమును, "కాలానల కీలల నాభీలగతిన్"[4] అను పద్యము వరాహమూర్తి హిరణ్యాక్షుని ఘోరముగా వధించిన విషయమును స్ఫురింప జేయుచున్నవి.

## 3. జకందము :

కం. "కానిమ్ము చూతునని తన సూనుంగట్టెదుట నిల్పి చూడుమని యసిం
బూని ఝుళిపించి యీ నుడి మానెదవా లేద యొక్కమాటం జెపుమా"[5]

1. పోతన చరిత్రము : 7-241.
2. పోతన చరిత్రము : 9-316
3. పోతన చరిత్రము : 12-22
4. పోతన చరిత్రము : 11-195
5. పోతన చరిత్రము : 11-303

ఆరు జగణములు వచ్చుటకు వీలున్న ఈ కందమున నాలుగు జగణములు వచ్చి జకందముగా భాసించుచున్నది. నారాయణ స్మరణ మానని ప్రహ్లాదుని తండ్రి బెదరించిన విషయమిందు పొందుపరచ బడినది. జగణాధిక్యముచేత గతి కడు చపలమై యుద్వేజకమై దనుజేంద్రుడు కొడుకును భయపెట్టుటను స్ఫురింప జేయుచున్నది.

## 4. నల కందము :

కం. "బెడిదపుటడిదము లగుడము విడివడి కడుఁ బోరుచుండ వెస లగుడము తా
నడిదపుఁ బిడికిటి ముడిపైఁ గడువడిఁ దాకుటయు నొచ్చి కత్తిని జార్చెన్"[1]

ఈ కందమున 8 నలములుండుటచే నిది నలకందమై విలసిల్లుచున్నది. ద్రుతగతి చెలఁగి చిత్తోద్రేకమును స్ఫురింపజేయు నీ కందము రాచకొండ చమూపతితో జేయు యువకమల్లుని కత్తియుద్ధము తీవ్రతను భయంకరత్వమును వ్యంజించుచున్నది.

## 5. గగ కందము :

కం. "ప్రాలో వేణిని మెఱపుల చాలో చూపులఁ బ్రసూనచయ వర్షాలో
బాలిక నవ్వుల రాల్ముత్యాలో మోదాబ్ధి శీకరాంబుశ్రీలో"[2]

ఎనిమిది గగములు గల యీ గగ కందము విలంబితగతి గలదై నర్సమాంబా వధూ ముగ్ధాత్వమును సౌందర్యమును స్ఫురింప జేయుచున్నది. ఈ విధముగా కావ్యమున ననేక ఘట్టములలో పంచవిధ కందములు రస మాకందములై రమ్యతా రమా కందములై డెందముల నందములు చిందించుచున్నవి.

చిన్న పద్దెమగు నీకందము ననుష్టుప్పునకు మారుగా కథను సంగ్రహముగా శీఘ్రగతి సాగించుటకు నర్థప్రసన్నతకు నుపయోగించిన వైనమును తదౌచిత్యమును పరిశీలింతము.

పేద జవరాలిపై అత్యాచారము చేయబూనిన యువక భూస్వామికి పోతన హితోపదేశముచేసిన ఘట్టము 33 పద్యములలో విరచితమైయున్నది. దీనిని సంగ్రహముగా నుపదేశాత్మకముగా నిర్వహించుటకు 14 కందములు 12 తేటగీతులు

1. పోతన చరిత్రము : 7-212
2. పోతన చరిత్రము : 2-254

1 ఆటవెలది ప్రయోగింపబడినవి మధ్య కవితా ప్రశస్తిని ప్రస్తుతించుటకు ఉత్పల శార్దూలాది వృత్తములు 6 కూర్పబడినవి పోతన యనక భూస్వామిని చేరబోయి యతడు శృంగార నైషధము చదువుచున్న విషయము తెలిసి తన ధ్వనివిలసితమైన యుపదేశాత్మక కవితను వినిపించుట, భూస్వామి వివేకమునంది పోతనను వినుతించుట యను విషయములతో గూడిన యీ సన్నివేశమున చిన్న పద్యములు చక్కగా నక్కరకు వచ్చినవి ఇక్కడి కందములవలన కథ సంగ్రహముగా సాగి నీతిబోధ యర్థప్రసన్నతతో జరిగినది.

శ్రీనాథుడు తొలిసారి పోతన యింటికి వచ్చినప్పుడు కేసన సంతోషముతో కవికి అభ్యుత్థానమొనరించి ఆదరసత్కారములు కావించి పరిచయార్థము సంభాషించిన సన్నివేశము 11 పద్యములలో సాగగా నందు 2 తేటగీతులతో బాటు 9 కందములు ప్రయోగింపబడినవి.

"ఎదురుసని కవిని గని సమ్మదమొదవఁగ నతని పాదముల కెరఁగి యనెన్
సదయత మీరరుదెంచుట సదనమ్మె పవిత్రమయ్యె సాహిత్యనిధీ!"[1]

ఇత్యాదిగా కందములు ప్రయుక్తమై కథ సంగ్రహముగా సత్వరముగా సాగుట కుపకరించినవి.

కఱవు కాలములో పోతన యతిథి సంతర్పణము వల్ల పాటిల్లు అనర్థములను తిప్పనకతని సతి విశదీకరించిన పట్టున గల 11 పద్యములలో నొకటి తేటగీతి కాగా తక్కినవెల్ల కందములే.

"తన్నున్ మాలిన ధర్మంబున్నే యున్నంతలోన నొకరికిడకు మిం
తన్నమను పాపులెవ్వరు కన్నుంబోఁగ్గలునంత కాటుక తగునే"[2]

"ఊరంతకు సత్రము నెయి గాఱఁగ బెట్ట వలెననినఁ గావలదా సం
సారము పైఁబడి వచ్చిన వేఱుంగాపురము సేయ వీరికిఁదెలియున్"[3]

ఇత్యాదిగా సాగిన కందము లిచట నర్థప్రసన్నతకు నీతిబోధకుపయుక్తమై సందర్భోచితమై యొప్పుచున్నవి.

1. పోతన చరిత్రము : 2-182
2, 3, ,, : 5-201, 202

నారయాదులు సభలో సింగనృపతికి పోతనగారి భాగతాంధ్రీకరణ విశిష్ట తను వర్ణించి చెప్పుటకు 7 కందములు వరుసగా ప్రయోగింపబడి సంగ్రహముగా విషయ విశదీకరణ గావించుట జరిగినది.

చిదానందయోగి పోతనకు చేసిన యుపదేశసందర్భమున నితర పద్యములతో బాటు పెక్కు కందములు పొందించబడియున్నవి.

"రసరూపుఁడు నారాయణుఁ డసదృశ విజ్ఞానవహ్ని నావిరియై భ
క్తిసరిత్సాగర హిమమై మసలున్నిర్గుణత సగుణ మహితాకృతులన్"[1]

"భూతముల రమించెడి వాఁడాతండై యుంట రాముఁడనబడు నను వి
ఖ్యాత 'స ఏకాకీ న రమేత' యనెడి శ్రుతినిరుక్తి మేకొనె ధరణిన్"[2]

ఇత్యాద్యనేక కందములుపదేశాత్మకమై యర్థప్రసన్నత కాస్పదమై పొదలియున్నవి. ఇట్లనేకవిధముల కందపద్యములు కావ్యమున నౌచితీహృద్యముగ ప్రయోగింపబడి యొప్పారుచున్నవి.

## తేటగీతి :

ఉపజాతికి చెందిన తేటగీతి చిన్నపద్యములలో నొకటి. దీని నిర్దేశించిన సూర్యేంద్రగణములలో నేవియైనను వాడవచ్చుననుటలో నీపద్యము కూర్చుట మిక్కిలి సులభమైనది. ఇంతే కాక కందపద్య విషయము చెప్పబడినట్లే యీ తేటగీతి శీఘ్రకథాగమనమునకును, ప్రబోధకతకును అర్థప్రసన్నతకును అనుష్టుప్పునకు బదులుగా వాడుట కధికావకాశమున్నందున ఆంధ్ర కావ్యములలో దీని ప్రయోగ బాహుళ్యము గోచరించును. ఆచార్యులవారును పోతనచరిత్రమున నట్లే దీనిని పుష్కలముగా నుపయోగించిరి.

కావ్యమున విడిగా వాడిన తేటగీతులు 743. సీసములలో నెత్తుగీతులందు వాడినవి 358. కాగా మొత్తము తేటగీతులు 1104. కావ్యమున ప్రయుక్త పద్యము లన్నిట దీనికి ప్రథమస్థానము లభించుచున్నది. అనగా నించుమించు నూటికి 30 పద్యాలవరకు తేటగీతులే యున్నవన్నచో దీని ప్రయోగపౌష్కల్యము

1. పోతన చరిత్రము : 2-80
2. ,, : 2-87

విశదము కాగలదు. కావ్యమున ఈ పద్యప్రయోగౌచిత్యము గూర్చి స్థాలీపులాక న్యాయముగా సమీక్షింతును.

నవయువకుడగు పోతన ప్రకృతి దృశ్యములను గాంచి యుప్పొంగి ప్రప్రథమమున కవిత వ్రాసిన సన్నివేశమున 6 తేటగీతులే కూర్పబడుట పోతన కవితా రంభదశకు సమంజసమై యున్నది.పోతన తొలుత వ్రాసినాడన్న 'సూర్యభగ వాను వదనమ్ము జూచి నవ్వె'[1]. అనునదియు 'శ్రుతుల విహరించు మధుపాన రతుడు తేటి' [2] అనునదియు తేటగీతియే యగుట యుక్తమైనది.

పోతన యువక భూస్వామికి వినిపించిన హితోపదేశకవిత 8 తేటగీతులతో విలసిల్లి హితోపదేశకతను అర్థప్రసన్నతను నిర్వహించుచున్నది.

పొలము నుండి సతిని తోడ్కొని యింటికి వచ్చి విరహార్తి గుందుచు పోతన గృహారామ దృశ్యములు చూచుచు తలపోసిన విషయములు 6 తేటగీతులలో వ్యక్తము చేయబడినవి.

> "కన్నెలత నా చిలిపిగాడ్పు చిన్నవాఁడు పచ్చచీర చెఱఁగు బట్టిలాగఁ
> ప్రణయహృదయ వాసన బయల్పడఁగ నామె నవ్వు నతనితోఁ బువ్వుచిన్నారి నోట"[3].

ఇత్యాదిపద్యములు పోతన విరహావేదనను ప్రోదిచేయుచు అర్థప్రసన్నత నెసగి యల్పాక్షరముల ననల్పార్థమును భాసిల్లజేయుచున్నవి. ఇట్లే భోగిని నాట్యము చేయుచు విప్రలబ్ధయగు రాధికగా నభినయించుచు కృష్ణుడు కన్పడగా విరహార్తితో పలికిన మాటలను 7 తేటగీతులలో గూర్చి శృంగారరస వ్యంజనను, అర్థప్రసన్న తను సాధించినా రాచార్యులవారు.

పోతన శ్రీనాథునితో బాటు రాచకొండలో నుండగా తల్లి యవసానదశ తెలుపుచు తిప్పన వ్రాసినలేఖ, అది చదివి పోతన క్రుంగిపోయిన విషయము 5తేటగీతులలో నున్నది. వచనమున వ్రాయవలసిన లేఖ వచనమునకు చేరువ గల తేటగీతిలో వ్రాసి విషయ సంగ్రహణమును అర్థప్రసన్నతయు నొనగూడు

---

1. పోతన చరిత్రము : 2-69
2. ,, : 2-70
3. ,, : 3-210

నట్లు చేసి సామంజస్యమును సవరించినారు. ఇట్లే దుస్స్వప్నమును గన్న శారద వ్రాసిన లేఖయు తదీయసన్నివేశమును పది తేటగీతులలో యుక్తముగా రచించుట జరిగినది.

పోతన రుక్మిణీకళ్యాణగాథ నాంధ్రీకరించుచు 'బాల కమరె' నని వ్రాయ నతని సుత కమరుట, 'నెలఁతకు జవ్వనమ్ము కడు నిండివెలింగె' నంచు వ్రాయ గనే యాపుత్రిక పునర్జీవితయైన సన్నివేశమున శ్రీఘకథాగమనమునకు కొన్ని వృత్తములు కూర్పబడినను 4 కందములును, 7 తేటగీతులును ప్రయోగింపబడి సార్థకత నందినవి

రాచకొండ చమూపతి భాగవతము నపహరించుకొని పోగా పోతన విరక్తచిత్తుడై శిష్యులకు చెప్పిన వైరాగ్య విషయములు 8 తేటగీతులలో సంగ్రహముగా నర్థప్రసన్నముగా సాగినవి. మనసు విరిగి నిస్పృహతో నన్న మాట లిటుల సంక్షిప్తముగా జెప్పుట యుక్తమై యొప్పుచున్నది.

పోతన విజయనగర చమూపతితో వారి రాజాజ్ఞను ధిక్కరించి భాగవతము సమర్పింప తిరస్కరించి రాజుల దురాగతములను తీవ్రముగా ఖండించుచు పలికిన సన్నివేశములో 20 వరకు తేటగీతులుపయుక్తములైనవి.

> "సూన హృదయమ్ము మధువు నిచ్చుటకె విప్పె నర్థియై మధుకరము పేరాస నరిగె
> వాయువంతలో దాని నివ్వసుధ రాల్చెఁగుడుచు మధుకరప్రాప్తమొ కుసుమ గతియొ"[1].

అని భాగవతము రాజునకీయలేని విధి నిర్ణయమును దెల్పుటలోను,

> "ధరణిపతి ప్రజాకంటకత్వము వహింపఁ బురియె తలక్రిందులై రిపుసరణి వఱలు
> నలఘు దోషాతిరేకమ్ము కలన నెప్పు డంతరించును రాజత్వ మవనియందు"[2]

అని రాజుల దుష్టపరిపాలన నభిశంసించుచు ప్రబోధాత్మకత యొప్పునట్లు చెప్పుటలోను తేటగీతి తేటగీతియై తేజరిల్లినది,

1. పోతన చరిత్రము : 9-112.
2. ,, : 9-117.

చిదానందుడు పోతనకు రామతారక సరస్వతీ మంత్రము లుపదేశించినప్పుడును, భాగవతాంధ్రీకరణమునకు ముందు భాగవతతత్త్వ ముపదేశించినప్పుడును, పోతన భార్యావియోగార్తుడగు శ్రీనాథునకు వైరాగ్యబోధచేసినప్పుడును ప్రహ్లాదుడు తోడిబాలకులకు తత్త్వబోధ చేసినప్పుడును ఇట్లే అనేక సందర్భములలో తేటగీతులుపయుక్తములై ప్రబోధాత్మకతను, అర్థప్రసన్నతను నిర్వహించి సార్థకమై సమంజసమై యొప్పారినవి.

## ఆటవెలది :

ఇదియు నుపజాతికి చెందిన చిన్న పద్యము. ఇందును నిర్దిష్ట సూర్యేంద్ర గణము లేవైనను వాడుకొనవచ్చునను వీలుండుట చేత నిదియును అల్లికకు తేలికయై యున్నది. కందము, తేటగీతి వలెనే నిదియును శీఘ్రకథాగతికిని, అర్థప్రసన్నతకును ప్రబోధమునకును మిక్కిలి యనువై యెప్పుచున్నది. కావుననే కవులీ యాటవెలదిని తరచుగా నాడించుచుందురు. వేమనవంటి వారు ఆద్యంతముల దీనినే పట్టుకొనియున్న విషయము లోకప్రసిద్ధము.

ఆటవెలది లక్షణానుసారముగా సూర్యగణ బాహుళ్యము కలదగుట హగణ నగణములగు రెండు సూర్యగణములలో నేది యెక్కువగా వాడిన దాని కనుగుణ మగు గతి భాసించి వివిధ రస భావ వ్యంజనకుపయుక్త మగుచుండును. ఎట్లనహగణ బాహుళ్యమున్నచో వీరాదులను ప్రోదిచేయును. ఆచార్యులవారీ మర్మమెరిగి కావ్యమున ఆటవెలదిని బహుళభంగుల నృత్యము చేయించి యున్నారు.

కావ్యమున నాటవెలదులు విడిగా 302, సీసపుటెత్తుగీతులుగా 17 మొత్తము 319 ప్రయోగింపబడినవి. కందములతో తేటగీతులతో పోల్చిచూచినచో నివి చాల తక్కువ. ఇట్టి యాటవెలదుల ప్రయోగౌచిత్యము నించుక చర్చింతును.

భోగిని నృత్యము చేయుచు రాధికయై విరహ వేదన నభినయించిన దిగువ పద్యము హగణ బహుళమై యామె వ్యథను వ్యంజించుచున్నది.

"చిన్నవోవ మోము చెక్కుటఁ గేలూని సోలుమేనఁ గండ్లు తేలవైచి
వట్టి పిచ్చిదాని వలె నెందుఁజూచిన నందు చూచు మౌనయౌచు నురక"[1]

1. పోతన చరిత్రము : 4-277

వేదన వలని యామె మనోమాంద్యము నీ పద్యము నందలి హగణములు విలంబిత గతి సాగి స్ఫురింపజేయుచున్నవి.

ఇక ద్రుతగతి చెలగు నగణ బహుళమైన ఆటవెలది దిగువ నుదాహరింప బడినది.

"వలదు విడువుడనుచు వచియించుచునే కాని మేను మఱచి పత్యధీనయగును
జనుదు నాదు సెజ్జ కనుగాని పతిపరిష్వంగ సుఖము విడిచి జరుగదడుగు"[1]

భర్త కేలబడిన నర్సమాంబ స్థితి యిందు వర్ణింపబడినది. పతికరస్పర్శ సుఖము గాంచిన సతియొక్క హృదయావేగమును నగణ బాహుళ్యముచేత నేర్పడిన ద్రుతగతి వ్యంజించుచున్నది.

తత్త్వబోధకు పలుచోటుల నాటవెలది యుపయోగింపబడినది.

"ఓం నమశ్శివాయ నొక 'మ' వర్ణంబు నారాయణాయ లోన 'రా' తొలంగి
న 'నశివాయ' మఱియు 'నాయనాయ'గ మాఱి ముక్తినిడ ననర్హములగు
ననియు"[2]

ఇత్యాదిగా చిదానందుడు పోతనకు రామతారక తత్త్వోపదేశము చేసిన భాగమున ఆరు ఆటవెలదులు ప్రయుక్తములై యర్థప్రసన్నత నలరారుచున్నవి. అట్లే పరీక్షిన్మహారాజు ముముక్షువై అడిగినప్పుడు శుకయోగీంద్రుడు,

"జనన మరణవృక్ష సంప్రాప్తిఁ బొందించు విషయసంగకర్మ బీజమొకటె
దాని జ్ఞానవహ్నిదగ్ధము గావించి బంధముక్తిఁ బరమ పదవి గనుము"[3]

అని యీ విధముగా 10 ఆటవెలదులలో తేట తెల్లముగా తత్త్వోపదేశము చేయుట జరిగినది.

శ్రీఘకథా గతికి గూడ నందందు ఆటవెలదులు పొందింపబడి యున్నవి. పోతన యొంటిమిట్టకు జేరి రామస్మరణతో నట వసింప కలలో రాముడు కనబడి కృతిక్షతి గురించి తెలిపి తదుద్ధరణకు తాను పూనుకోగలనని యంతర్హితుడగుట, పోతన మహార్తితో గ్రంథక్షేమము తెలియువరకు భుజింపనని దీక్షబూని వ్యాస

1. పోతన చరిత్రము : 3-233
2. ,, ,, : 2-40
3. ,, ,, : 10-94

కృతిని పారాయణము చేయుట ఇత్యాది విషయముల కథ సంగ్రహముగా ఆరు ఆటవెలదులలో నడపింపబడినది.

రసభావ వ్యంజనకు,

"జలదమందు జిక్కు సౌదామినీలత కరణిఁ దరుణి మెఱసె హరి యెడందఁ
బసిడిలోనఁ గట్టువడిన నీలము భాతిఁ జెలువ యెడద శౌరి చిక్కుపడెను"[1]

అని కృష్ణుడు రుక్మిణి నపహరించి నప్పటి శృంగార భావమును,

"కాలమేఘనిభుడు గజరాజు గర్జించి పాదఘట్టనముల వసుధ యద్రువ
వడిగఁ దొండమెత్తి వనరాజినుద్ధతి దెబ్బ జఱచు దిశలు బొబ్బరిల్ల"[2]

అని గజేంద్రుడు మొసలితో పోరాడిన వీరమును స్ఫురింప జేయుచు ఆటవెలదు లుపయుక్తములై యున్నవి. అట్లే,

"ఆర్చి యార్చి యార్చి యటుగాంచు నిటుగాంచు నాశలో నిరాశ నభినయించుఁ
గొండగుహలు వనులు కోనలా నిర్మద గతికి నేడ్చు నురక ప్రతిరవముల"[3]

అని గజేంద్రుడు మకరిచే పట్టుబడి రోదించిన కరుణమున కాటవెలది యుపయోగింపబడినది. ఇట్టి పద్యము సర్వ రస భావములందును సముచితముగా ప్రయుక్తమై యొప్పుచున్నది.

నృత్య ఘట్టమున భోగిని విప్రలబ్ధయగు రాధికగా నభినయించిన సందర్భమున 11 ఆటవెలదులు ప్రయోగింపబడినవి. ఆటవెలది నృత్యము నాటవెలది పద్యములలో వర్ణించుట విశేషము. ముద్రాలంకారము వలె శోభిల్లునట్టి ఛందో విశేషము నన్నెచోడుడు తన కుమారసంభవమున తరచుగా గనబరచెను. చివరి పద్యమున

"నటన నిజమొనర్చి నాతి కృష్ణుని విరహంపు రాధపాత్ర నభినయించె
నాటవెలది యొక్క యనమాన ప్రతిభకు మురిసిపోయి రాజు ముగ్ధుడయ్యె"[4]

1. పోతన చరిత్రము : 12-298
2. పోతన చరిత్రము : 12-28
3. పోతన చరిత్రము : 12-49
4. పోతన చరిత్రము : 4-579

అని ఆచార్యులవారు వర్ణించిరి. ఆటవెలది నాట్య ప్రతిభకు రాజు ముగ్ధుడైనట్లే యిచట యాటవెలది పద్యప్రతిభకు పాఠకులు ముగ్ధులు కాక మానరు.

ఈ రీతిగా కావ్యమున నాటవెలది బహుభంగుల నర్తించి రక్తి కట్టించు చున్నది.

## సీసము :

ఉపజాతులయందే కాక సర్వ పద్యములందును సీసము పెద్దది. ఇందలి పాదములు సూర్యేంద్ర గణము లెనిమిదేసి యుండుట చేసి పొడుపైనవే కాక దీని కవినాభావముగా గీతము చెప్పబడుటచేత సీసము చాల పెద్దదైనది. సీసము పెద్దదైనను రచించుటకు మిక్కిలి సులభమై 'సీసము కవికైనా కమ్మరికైనా మెత్తనిది' యను నానుడి యేర్పడినది. ఈ సౌలభ్యమునకు హేతువు కంద గీతముల యెడ వర్తించునట్టిదే. ప్రతి సీస పాదమునకు ఆరు ఇంద్రగణములు రెండు సూర్యగణము లుండునన్న నియమములో నా యింద్ర సూర్యగణము లేవి యైనను వాడవచ్చు ననుటలో నీ పద్యరచన సులభమైనది. మరియు యతి ప్రాసయతులలో దేనినైన ప్రయోగింపవచ్చు ననుటయు ప్రాస నియమము లేక పోవుటయు రచనా సౌలభ్యమునకు మరొక హేతువు.

సీసము ప్రాయికముగా వర్ణనలలో శోభించును. కథాగతికిది యంతగా నింపు నింపదు. కావుననే కవులు తరచుగా దీనిని వర్ణనలలోనే ప్రయోగించిరి. నన్నయ తిక్కనాది ప్రథను కవులు దీనిని కథాగమనమునకే యెక్కువ వాడిరి. కాని తర్వాతి కవులు వర్ణనలకే యధికముగా వాడి యున్నారు సీసములో సొగసు చక్కని తూగు కూర్చుట నన్నెచోడునితో మొదలై శ్రీనాథుని చేతిలో నది యొయ్యారపు టుయ్యాలలూగినది. ఏ పాదమున కా పాదము విడిపోవుట, ప్రతిపాదము చివర నొకే విధమైన పదములు శిల్పించినట్లు కూర్పబడి సమానమైన తూగు చెలువొందుట అనగా ప్రక్రమ భంగము లేక సమతాగుణము విరాజిల్లుట పద్యమునకు ప్రాణము పోయునట్లు తుది గీతము కూర్చి యందు పద్యార్థమునకు సార్థక్యము కూర్చుట అను వానిచేత సీసము రమణీయమై యొప్పుచుండును. సీసమునకు నిర్దేశింపబడిన ఇంద్రగణము లారింటిలో రగణ తగణ నగ సలములు ఐదేసి మాత్రలుగల సమలయ గణములు. పైన వివరించిన రీతులచేత రమణీయమైన సీసము నీ సమలయ గణములతో రచించిన యెడల నది

ఖండగతితో సాగు ద్విరదగతి రగడగా సాగి సంగీతాహ్లాదము కలిగించుచుండును. శ్రీనాథుడు, పెద్దన, రామరాజభూషణుడు మున్నగు కవులీ పద్యశిల్పము నెరిగియే సీసములను రమ్యారమ్య విలాసగతుల లాస్యము చేయించిరి. సీసమునకు గల సూర్యేంద్ర గణముల నిచ్చ వచ్చినట్లు ప్రయోగించి గతిభేదములను భాసింపజేసి సర్వరస భావములను వ్యంజింపజేయుట కవకాశము కలదు. కావుననే పూర్వ సుకవులెల్లరు సీసాలలో సర్వరసములను శ్రవణపేయముగా నందించియుండిరి. పద్యశిల్ప మర్మజ్ఞులగు వరదాచార్యులవారును సీసములను లలిత లలితగతులలో నడిపించి సమస్త రసభావములను వ్యంజింపజేసినారు.

పోతన చరిత్రమున సీసముల సంఖ్య 375. ఈ సీసముల కెత్తుగీతలు 90% తేటగీతులే కూర్పబడినవి. సీసములన్నియు పైన వివరించినట్లు పాదములు విడి వడియుండి ప్రక్రమభంగము వాటిల్లక సమతా గుణశోభితమై నమలయాభిరామమై యున్నవి. నన్నయాదుల సీసములకువలె ఆచార్యులవారి సీసములకు యతి సీసములు, ప్రాసయతి సీసములన్న నియమములేక యథేచ్ఛగా సాగినవి. సరసభావ వ్యంజనలో ప్రయుక్తములైన యిందలి సీసములు ఎక్కడనో కథాగమనమునకు తప్ప సర్వత్ర వర్ణనాత్మకములై పరిఢవిల్లియున్నవి.

వర్ణనలకు పుష్కలముగా ప్రయోగించిన సీసములలో దిగువకొన్ని యుదాహరింపబడినవి.

"బ్రాహ్మణుం డావీట బహుళ విజ్ఞానియై" (ఏకశిలానగర వర్ణన) 1-80
"ముత్యాల చెండ్లెత్తి మురిపించు జొన్నచేల్" (బమ్మెర గ్రామ వర్ణన) 1-87
"మహి నస్తమింపని మార్తాండ బింబమ్ము" (సుకవిప్రశస్తి వర్ణన) 2-164
"గగన సీమంతినీ గళవిరాజన్మౌక్తిక" (శరద్రాత్రి వర్ణన) 3-202
"తొలిమబ్బు తెరనుండి తిలకించు చుక్కల" (వన వర్ణన) 4-120
"బేసరి కమ్మలు తీసినట్టులె వ్రేళ్ళ" (భోగినీ నృత్య వర్ణన) 4-250
"ఎవనికై సింగిణి నవరత్న ఖచిత" (మేఘ వర్ణన) 5-184
"తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి" (భిక్షుక వర్ణన) 5-233
వరుణుండు చలిగాగ విరచించి కొనినట్టి (సూర్యాస్తమయ వర్ణన) 8-37
"నాయుప్పుఁ దిని జీవనము నిల్పు లోకము" (సముద్ర వర్ణన) 11-70
"అందాల పాలమ్ము నలమి పైఁ బైఁబడి" (మోహినీ వర్ణన) 11-124

ఇట్లు సీసములు సర్వత్ర వర్ణనల కుపయుక్తములై యున్నవి. ఇక యేవో యొండు రెండు మాత్రము కథా గమనమునకు ప్రయుక్తములై యున్నవి. దేవవాణికి తెలుగు పోటి నివారించ వలెనని యింద్రుడు ప్రార్థింప హరి పలికినప్పటి

"అనవిని వనజాక్షుఁ డమరాధిపుని గాంచి స్మితసముల్లసిత భాషితము లీను సమబుద్ధి నిటు పల్కె సకల భూతస్వాంత సంవాసినగు కర్మసాక్షి నేను....."[1]

ఇత్యాదిగా గల సీసము భక్తరక్షణ గూర్చి వివరించుటకును,

శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయలతో రాముడు కలలో సింగన్నృపతిని శిక్షించిన విషయముచెప్పిన

"అవధారు రాజేంద్ర! అవనిజాపతి మహీపతివేష మొలయ స్వప్నమున నేఁగి...."[2]

అన్న సీసము గతవృత్తాంత విశేషము దెలుపుటకును ప్రయోగింపబడినవి ఇటులీ కొన్నియైనను సంభాషణలకును విషయ వివరణమునకును నుపయోగింపబడి సార్థక మైనవే కాని ప్రత్యేకముగా కథను నడపుటకు సీసములు వాడిన పైనము కానరాదు.

ఇక సకల రసవ్యక్తికి సీసములు ప్రయోగించిన విషయము దిఙ్మాత్రముగా ప్రదర్శింతును.

శృంగారమునకు-పోతన దంపతుల సమాగమ వర్ణనలోని

"శిరము నాఘ్రాణింప సేమంతికాసుమ స్నేహసౌరభములు చెంగలించె" (3-243) అను పద్యమును, మోహినీ వర్ణనలోని

"ముఖ చంద్రమండలమునకు నీడేయని యలకలు ఫాలానఁ గలియఁబడగ" (11-122) అను సీసమును తిలకించవచ్చును.

వీర రౌద్రాలకు రాచకొండ సైన్యముతో యువకుడు పోరాడినప్పటి

ఒకమాఱు సరినిల్చి యుద్రిక్తతం బోరు శత్రుల మణిబంధసంధు లెడల" (7-217) అను సీసమును, వరాహ విజృంభణ వర్ణన గల

"శశ్వదరాశ దంష్ట్రా కరాళాస్యంబు ప్రళయార్కబింబమై భయముఁ గొల్ప" (7-233) అను సీసమును నిదర్శనములు.

1. పోతన చరిత్రము : 1-61
2. పోతన చరిత్రము : 10-21

కరుణమునకు దీన భిక్షుకుని వర్ణించిన "తెగమాసి పిట్టగూడగు" అను సీసమేకాక నర్సమాంబ అప్పగింతలవేళ తల్లి తల్లడము వర్ణించిన "తనయను గౌఁగిటఁ దార్చుచు జనని యొౌదల మూర్కొనుచు వీఁపు కలయ నిమిది" (2-272) అను సీసమును తార్కాణములు.

శాంతమునకు వ్యాసాశ్రమ వర్ణనలోని

అనవరతాధ్యయ నావర్తనోన్మత్త శుకతతుల్ శుకమహర్షులయి పరలె" (1-22) అను పద్యమును, ప్రహ్లాదుడు తోడి బాలురకు తత్త్వబోధ చేసినప్పటి

"అల బొమ్మరింట మీరాడి యేగెడినట్టు లీయాత్మ మెయివీడి యేఁగు నెపుడొ" (11-260) అను పద్యమును లక్ష్యములై యొప్పుచున్నవి.

భక్తిరసమునకు నర్సమాంబ దుర్గాదేవిని స్తుతించిన

"త్రయ్యంత సారామృత సరోవర స్వర్ణ సరసీరుహమ్ములే చరణ యుగళి" (3-130) అను సీసమును, గంగాసైకతమున పోతన ఈశ్వర సందర్శన కౌతుహలియై స్మరించిన

"పద్మాక్షదర్శన భాగ్యహీనములైన కన్ను లంధవరాటకములు గావె" (3-75) అను పద్యమును, ఇట్టివే యనేక సీసము లుదాహరణములు. ఈ విధముగా నానా రస భావ వ్యంజమునకు సీసములు ప్రయుక్తములై యున్నవి.

ఇందలి సీసములన్నియు ప్రక్రమభంగము లేక సమతాగుణాభిరామమై యొప్పుచున్నవి. అందును పంచమాత్ర విశిష్టములగు ఇంద్రగణములచేతనే రచితమై ద్విరవగతి రగడలుగా సమలయాభిశోభిత విలాసగతి సాగిన సీసములు పుష్కలముగా గలవు. మచ్చునకు కొన్ని మెచ్చు తునుకలు దిగువనీయబడినవి.

"కలశపాథోరాశి క్రాఁగు పొంగును ద్రోసి మురికి వచ్చినపాల నురువు వేమొ" (5-45) ఇది గంగామతల్లిని వర్ణించినది. ఇందలి సంగీత సమలయ అభంగ గంగా తరంగముల యొయారములను వ్యంజించుచు మనోజ్ఞముగా సాగినది. ఇందు తక్కిన పాదములెల్ల యిట్లే లయాన్వితములై సమతా శోభితములై యున్నవి.

"నెలగుండియలఁ బిండి సెలయేటి యెలబోటి యిల క్షీరవారాశి నొలుకఁ బోయ'' (3-192) శరద్వనితను వర్ణించిన యీ సీసము తదీయ రమణీయ

విలాస గతులను వ్యంజించుచు రంజింపజేయుచున్నది. ఇట్లే సాగిన పద్యమెల్ల ప్రత్యేకించి సలగణ బాహుళ్యమమరి సోయగములు గులుకుచున్నది.

"కోలాటముల నాడుకొందు అచ్చరలు తామతని యంత్యప్రాస గతులలోన (6-117) అనునది పోతనగారి యాంధ్రభాగవత కవితా సౌందర్యమును మధుర మంజుల గతుల వెలార్చుచున్నది. ఇట్టిదే

"అలవేణి మత్తకోకిలవాణి చూతపల్లవపాణి సకల ఋతువుల రాణి" (6-7) అని వసంతర్తు శోభలను వర్ణించిన పద్యము పాదమున నుత్తరార్ధమున నొక నలముతప్ప తక్కినవెల్ల మరియు తర్వాతి పాదములనందెల్ల పంచమాత్ర గణములుండి బెడగునడల ఆమని నిగారముల వెదజల్లుచున్నవి. ఇట్లే అనేకానేక సీసములు సమలయ సంశోభితములై కావ్య సుందరిని మధుర మంజుల గతుల నడయాడజేయుచున్నవి.

## విశేషచ్ఛందములు :

కావ్యమున అత్యల్పముగా ప్రయోగించిన విశేషచ్ఛందములు 18 రకములు. ఇన్ని రకములలోను 4 మాలినులు, 5 ఉత్కళికలు, 14 శ్లోకములు కాగా తక్కిన 15 రకముల వృత్తాదులొక్కొక్కటి మాత్రమే కలవు. ఈ విశేషచ్ఛందః పద్య గేయములు శ్లోకములు మొత్తము 38. ఈ ఛందముల ప్రయోగమును తదౌచితిని సంగ్రహముగా చర్చింతును.

## మాలిని :

ఈ విశేషవృత్తము నన మ యయ- అను గణముల చేత నొప్పుచుండును. ఈ గణములవలన నీ పద్యపాదము పూర్వభాగము ద్రుతగతియు ఉత్తరభాగము విలంబితగతియు కలది యగుచున్నది. మాలినిని కావ్యములలో సర్గాంతములందును ఆశ్వాసాంతములందును ప్రయోగించుట యాచారమై యున్నది. నన్నయ తిక్క నాదులట్లే వాడియుండిరి. ఆశ్వాసాంత ప్రయుక్తములగు నివి కృతిపతి స్తుతి కావించుటలో వినియోగింపబడి శబ్దాలంకారములతో ముఖ్యముగా నంత్యాను ప్రాసముతో నొప్పారుచుండును. తిక్కన మాలినీవృత్తములను ఆశ్వాసాంతము లందే కాక కథార్థములందును ప్రయోగించి యుండెను.

పోతనచరిత్రమున మాలినీ వృత్తములు 4 ప్రయోగింపబడియున్నవి. అవియు సాంప్రదాయికముగా 1, 6, 10, 12 ఆశ్వాసముల చివరలో రచింపబడి కృతిపతియగు శ్రీ రామచంద్రుని సనుతిలో అంత్యానుప్రాస విభాసితమై యొప్పుచున్నవి. సకలాశ్వాసాంతములలో మాలిని వాడక నాల్గిటిలోనే వాడుట కవి స్వేచ్ఛయే కాక మధ్యయుగ కవుల తీరును తెలుపుచున్నది. పెద్దన తిమ్మనాదులు మాలినినే కాక భుజంగప్రయాతాది విశేష వృత్తములను యథేచ్ఛగా ఆశ్వాసాంతముల ప్రయోగించియుండిరి.[1] ఆచార్యులవారును వారి మార్గము నవలంబించి యిచ్చమెయి ననేక విశేషవృత్తములను వాడినారు.

"మనసిజసుకుమారా! మారభిచ్చిత్తచోరా!
వననిధి సుగభీరా! వార్ధి గర్వాపహారా!
కనకపట విదారా! కర్బురాలోకచీరా!"
జని మరణ నివారా ! శస్త రామావతారా[2]

ప్రథమాశ్వాసాంతమున ప్రయుక్తమైన యీ మాలిని ఉపర్యుక్త విధముగా కృతిపతి రామచంద్రుని ప్రస్తుతిలో అంత్యానుప్రాసాలంకారముతో యుక్తముగా సాగినది. తక్కిన మూడు మాలినులును నిట్లే ఆయా ఆశ్వాసాంతముల నలరారుచున్నవి.

## ఆశ్వాసాంతములందలి యితర విశేష వృత్తములు :

ద్వాదశాశ్వాసములలో పూర్వోక్తమాలిని నాలుగాశ్వాసముల చివర ప్రయోగింపబడగా తక్కిన యెనిమిది ఆశ్వాసముల యంతములలో ఎనిమిది విశేషవృత్తములు ప్రయుక్తమై యున్నవి. అవి క్రమముగా ద్వితీయాశ్వాసాంతమున భుజంగ ప్రయాతము, తృతీయములో తోటకము, చతుర్థములో పాలాశదళము, పంచమములో ప్రహరణకలిత, సప్తమములో మణిగణనికరము, అష్టమములో స్రగ్విణి, నవమములో ప్రియంవద, ఏకాదశములో అలసగతివృత్తము ఒక్కొక్కటి చొప్పున ప్రయోగింపబడినవి. పూర్వకవులు ప్రయోగించిన రీతిగా నివి యథోచితముగా కూర్పబడినవే కాని ప్రత్యేకోద్దేశముతో రచింపబడినవి కావు.

1. శ్రీ మహాభాగవతము నందును పంచమ స్కంధాంతమున మత్తకోకిల, షష్ఠ స్కంధాంతమున తోటకము, తరళము ప్రయుక్తములయి యున్నవి.
2. పోతన చరిత్రము : 1-205.

ఇవి యన్నియు మాలినులవలెనే కృతిపతి ప్రస్తుతి కుద్దిష్టమై యంత్యానుప్రాస విభ్రాజితమై యొప్పారుచున్నవి. ఈ మాలినీ ప్రభృతి వృత్తములన్నియు భక్తి భావవ్యక్తికనుకూల గతి గలిగి చెలగుచున్నట్టివి.

## ధ్రువకోకిల :

ఇందు ధ్రువకోకిల యొకటియే రాచకొండ నగర వర్ణనలో ప్రయోగింపబడినది. మత్తకోకిల పాదమునందలి మొదటి గురువును రెండు లఘువులుగా మార్చినచో ధ్రువకోకిల యగును కావున నిది యించుమించు మత్తకోకిల గతి గలదే యగుచున్నది లఘ్వక్షర బహుళమైన గతి గల యీ వృత్త మొకింత ద్రుతమై బంతివలె నెగురుచు సాగుచు నానందోత్సాహములను వ్యంజించుచుండును.

"మల తలంగల ధౌతమృణ్మయ మంజుసౌధగణాకృతుల్.... "[1].

అని సాగి రమణీయ భవనములతో నుపవనములతో రాజిల్లు రాచకొండ నగర వర్ణనకు మిక్కిలి సమంజసమై యొప్పియున్నది,

## ఉపేంద్ర వజ్రా వృత్తము :

కావ్యమున ఉపేంద్ర వజ్రా వృత్త మొకటి శ్రీనాథుడు సింగ భూపతిని మొదట సందర్శించినప్పుడు మంగళాశాసనము చేయుటలో ప్రయోగింపబడినది. ఇది సంస్కృతములో విరచింపబడినది. సంస్కృత మహా విద్వాంసుడును, 'రసార్ణవ సుధాకరః' యను నలంకార గ్రంథము రచించిన వాడునునగు మహారాజు నెడ యుచిత మగుటయేకాక సాధారణముగా రాజులను సంస్కృత భాషలో ఆశీర్వదించుట ఆచారము కావునను శ్రీనాథుడు సంస్కృత పాండిత్య శౌండీరుడు కావునను సంస్కృత శ్లోకమచట ప్రయోగించుట నితాంత మౌచితీ భాసురమై యున్నది. "చతుర్ముఖస్తే చతురాననత్వం.... "[2] అని యిత్యాదిగా సాగిన యీ శ్లోకము వరదాచార్యులవారి సంస్కృత రచనా పాటవమును ప్రస్ఫుటీకరించుచున్నది.

1. పోతన చరిత్రము : 4-9
2. పోతన చరిత్రము : 4-67

## మంగళ మహాశ్రీ వృత్తమాలా (అనుకృతి)

భోగినీ నృత్య వర్ణనలో కొన్ని గీతములు రగడలుకాక 'మంగళ మహాశ్రీ' యను విశేష వృత్తము మాలికగా గేయ ప్రాయముగా ప్రయోగింపబడి యున్నది. ఇది మంగళ మహాశ్రీలయను పోలియున్న రగడయే కాని ఆ వృత్తము మాత్రము కాదు. మంగళ మహాశ్రీకి నాలుగు పాదములుండి ప్రతిపాదమున 'భజసన భజసన గగ' యను గణములుండి ప్రతి యెనిమిది అక్షరముల కొకటి చొప్పున రెండు యతులుండును. ప్రాసనియమము కలదు. కాగా కావ్య ప్రయుక్తమైన ఈ గేయము ఐదేసి మాత్రల గణములతో 'తకిటతక' యను లయతో సాగు ద్విరదగతి రగడయై యొప్పినది. ప్రతిపాదమున పంచమాత్ర గణములారుండి చివర త్రిమాత్ర గణ మొకటి కూర్పబడి మూడవ ఐదవ గణములలో ప్రాసయతి యొప్పుచున్నది. ప్రతిపాదాంత్యగణము మూడుమాత్రలు గలదగుటచేత ద్విరదగతి రగడకు వలసిన ఐదు మాత్రలలో రెండు మాత్రలు తక్కువ పడుటయేకాక గేయపూర్తికి మరొక పంచమాత్రాగణము కావలసియున్నది. ఇట్లు ఏడు శూన్యమాత్రలై గేయము తాళ లయ బద్ధముగా ఆలాపన చేయుటకనువై యున్నది.

"ద్యోతలము నందెగయు శ్వేతాభ్రమై మదను కేతనమ్మై యెగయుఁ గొంగు
పింజలై కెంజాయ సంజలై కెంజివురు మంజరులఁ జిమ్మెడి చెఱంగు"[1]

ఇత్యాదిగా పదునాలుగు పాదములలో అంత్యానుప్రాసములతో సాగిన యీ ద్విరద గతిగేయము ద్విరదగతిని మధుర మంజులముగా నడయాడి భోగినీ రమణీయాంగ సౌష్ఠవమును కమనీయాలంకారములను కనులకు గట్టించుచున్నది. నర్తకి రమ్య రూపరేఖా విలాసములను వర్ణించుట కీగేయము యుక్తమై యున్నది.

### ఉత్కళిక :

దేశీయమై మాత్రాచ్ఛందస్సునకు చెందిన రగడ భేదములగు కళికోత్కళి కలలో ఉత్కళికలు కావ్యమున నైదు ప్రయోగింపబడినవి. అందు రెండు చతుర్థా శ్వాసమునందలి భోగినీ నృత్య ఘట్టమున, తక్కిన మూడు 6, 11, 12 ఆశ్వాస ములలో నొక్కొక్కటి కూర్పబడినవి. ఇవి నానా విధములగు రగడల గతులతో సాగియున్నవి.

---

1. పోతన చరిత్రము : 4-262,

భోగిని బహుభంగుల జేసిన లాస్యమును వర్ణించు సందర్భమున దిగువ ఉత్కళిక ప్రయోగింపబడినది.

"జాలె విడు బొంగరము లీల గిఱ్ఱునఁ దిరుగుఁ
బూల బంతింబోలెఁ దేలాడు నొక పరుగు
లాలించు పూల యుూయెల చేరుల లాగు
నోలి ముందును వెనుక నొయ్యారముగఁ దూఁగు.... "[1].

ఈ రీతిగా 60 పాదములలో రమ్య రమ్యముగా రచింపబడిన యీ గేయము పంచ మాత్రాగణ నిబద్ధమగు ద్విరదగతిలో సాగినది.

కళికోత్కళికలు ప్రాయికముగా ఉదాహరణ కావ్యములందు ప్రయుక్తములై యుండును. ఇవి తాళాంగ ప్రధానములై గానయోగ్యములై యొప్పారుటచేత కావ్యమునందు ఆడుచు పాడుచు చేయు నృత్యమువర్ణన కివి సానుకూలములై సమంచితములై యొప్పుచున్నవి. ఇక్కడి యీ యుత్కళిక కేవలము పూర్వ లక్షణానుసారికాక యించుక భిన్నముగానున్నది. కళికలో సగముభాగము ఉత్కళిక అనగా కళిక అర్ధపాదము ఉత్కళికా పాదమగును. దీనికిని 8 పాదములుండును. కళికలో ప్రతిపాదమున తృతీయగణాద్యక్షరయతి. రెండేసి పాదములకు ప్రాసము నుండును. కళికయం దర్ధపాదమగు నుత్కళికలో యతిలేక రెండేసి పాదములకు ప్రాసము నంత్యానుప్రాసము కూర్పబడియుండును. ఉత్కళిక దీర్ఘ సమాసాన్వితమై చివరి రెండు పాదములు ప్రథమాది విభక్త్యంతములై యుండును. ఇందలి దీర్ఘ సమాసాన్వితమై యుండునన్న లక్షణము సంస్కృత రచనలోనే. కాని తెలుగులో పాటింపబడలేదు. తెలుగులో ఈ విధానమును నిడుదవోలు వెంకటరావు గారిట్లు విశదీకరించిరి.

"ఉత్కళికలు దీర్ఘ సమాస రచనములగుటచేతను ద్రవిడభాషలోని దగు తెలుగున దీర్ఘ సమాస రచనము భాషాతత్త్వము వలన కుదురుపడక పోవుటచేతను నుత్కళిక యేకసమాసముగా నుండవయునను నియమముదాహరణములలో పేర్కొన బడినది. తెలుఁగున నేకసమాసము క్త్వార్థక క్రియలతో నడపి చివఱ సమాపక క్రియతో నంతము నొందించి విభక్త్యంతముగా జేయుట వలన నేర్పడును.

1. పోతన చరిత్రము : 4-256

ఉదాహరణములలో నిట్లే యేకసమాస రచనము గావింపబడినది"[1]

ఉత్కళికా లక్షణమిట్లుండ ఆచార్యులవారు కొంత పూర్వలక్షణము ననుసరించియు కొంత ఆధునిక కవిధోరణి నవలంబించియు నుత్కళికలు రచించిరి. కావ్యమునందలి యుత్కళికలు పాదనియతి లేకుండ యథేచ్ఛగా మాలికలుగా గూర్పబడుటయే కాక ప్రతి పాదమున రెండేసి గణములకు మారుగా కళికకువలె నాలుగేసి గణములు రచింపబడినవి. ప్రతిపాదమునను తృతీయ గణాదిని యతికాని ప్రాసయతికాని కూర్పబడినవి రెండేసిపాదములకు ప్రాసము పాటించి ఒక్కొకచో పాదాద్యక్షరముల యతి కూర్పబడినది. రెండేసి పాదముల కంత్యానుప్రాసము పాటింపబడినది. ఇవి ఉదాహరణ కావ్యములందలివి కావుకావున నివి ప్రథమాది విభక్త్యంతములుగా రచింపబడలేదు. ఈ విధముగా రచింపబడిన యిందలి ఉత్కళికలను పరిశీలించినచో నివి పేరుకే ఉత్కళికలు కాని గుణ రూపములచేత ద్విదరగతి ప్రభృతి రగడలే.

రెండవ యుత్కళిక భోగినీ నృత్యఘట్టమున సూర్యుడస్తమించి చీకట్లు గ్రమ్మి వర్షము కురిసిన రాత్రి యమునాతీరమున కృష్ణునికై తపియించు రాధికగా భోగిని యభినయించిన విషయము వర్ణించుటకు ప్రయోగింపబడినది.

"పొన్నపువు వాసనల ప్రోవులు పొగడపూవుల నెగడు తావులు
మల్లియల మొల్లల సుగంధము నల్లగలువల చలువచందము...."[2]

ఇత్యాదిగా ౯౫ పాదములలో సుదీర్ఘముగా సాగిన యిది 'తకిట తకతక' యను మిశ్రగతిలో సాగు 'హరిణగతి రగడ'. విలంబితగతిలో సాగు ఈ రగడ విప్రలబ్ధయైన రాధికగా నభినయించు భోగిని వేదనను వ్యంజించుచు లోకోత్తరముగా రచింపబడినది. రగడ మధ్యలో నందందు సందర్భోచితముగా తాళలయానుగుణముగా,

''ధణ ధణంధణ ధాణ ధంధణ డడడ డడడడ ఢాండ ఢమ్మని...''

మున్నగు రీతిగా ధ్వన్యనుకరణములును,

---

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర : 'సంస్కృతోదాహరణములు-వాని లక్షణములు' పుట 65, 66

2. పోతన చరిత్రము : 4-290

రగడ ఆద్యంతములలో,

"తర్ధిణాం ధిమితహ త ఝంతరి-జంత జగదరి..."(ఆదిలో)

''తత్త్రక్కిట తక్కిట కిడతక....'' (అంతములో)

ఇత్యాది తాళ లయ గతులు కూర్పబడి గీతవాద్యములతోడి నృత్యమును సాక్షర ప్రత్యక్ష మొనరించుచు దివ్యముగా సాగినది.

మూడవ యుత్కళిక షష్ఠాశ్వాసమున వసంతర్తు వర్ణనకుపయోగింప బడినది. ఇది ద్విరదగతిలో నెనిమిది పాదములలో సాగిన రగడ.

''విరహ తాపమ్ములో వేఁడి గ్రీష్మము లూర్చె

మేఘసందేశమ్ము మెఱయఁ గనులు చెమర్చె"[1]

అను రీతిగా నడచిన యీ గేయము వసంతశోభలను వెలార్చుచు యుక్తమై యొప్పు చున్నది.

నాలుగవ యుత్కళిక ఏకాదశాశ్వాసమున హిరణ్యకశిపుని నరసింహస్వామి వధించినప్పటి భయానక రౌద్ర సన్నివేశమును వర్ణించుటకు ప్రయోగింప బడినది. ఇది 'తకతక' యను తాళలయ గల మధురగతిలో 20 పాదములలో సాగినది.

''అక్షియుగమ్మున అగ్నిగోళముల్

వీక్షణమ్ములను విలయతాళముల్....''[2]

అని యీ విధముగా చతుర్మాత్రా గణ విశిష్టమగు నేకతాళమున నేకధాటిగా సాగిన యీ రగడ నృసింహుని మహోగ్ర విజృంభణను వ్యక్తము చేయుచు రసోదంచితమై యొప్పుచున్నది.

ఇక ఐదవ యుత్కళిక ద్వాదశాశ్వాసమున మకర పీడితుడై మొరయిడిన గజేంద్రుని రక్షించుటకు వచ్చిన శ్రీహరిని దేవతలు వినుతించిన విషయము వర్ణించుట కుపయుక్తమైనది. ఇదియు ద్విరదగతిలో 22 పాదములు సాగినది. గజ ప్రాణరక్షణ సంరంభియై హరి వచ్చిన యద్భుతదృశ్యమును గాంచి దివిజులు భక్త్యతిశయముతో సంభ్రమాశ్చర్యములతో సంస్తుతించిన విషయము నాయారపు నడక గల యీ రగడ చక్కగా వ్యక్తము చేయుచున్నది.

1. పోతన చరిత్రము : 6-8
2. ,, ,, : 11-369

## కళిక :

కావ్యమున ద్వాదశాశ్వాసమున గజేంద్రుడు తన్ను మొసలిబారి నుండి కాపాడిన శ్రీహరిని వినుతించిన సందర్భమున నొక కళిక ప్రయుక్తమై యున్నది.

"వేదము తెలుఁగవదే పారంబున్ వేధ యెఱుంగండే సారంబున్
ఘటఘటమున నిటు నటియించెడి పరు నటన సూత్రధరు నవపీతాంబరు"[1]

ఇత్యాదిగా చతురస్రగతిలో సాగి మధురగతి రగడయై 38 పాదములు కూర్పబడినవి. ఇదియును ఉత్కళికల విషయమున చెప్పబడినట్లే లక్షణానుసారముగా కొంత నవ్యముగా కొంత సాగినది. ఈ రగడ రెండేసి పాదములకొక పంక్తిగా కూర్పబడి ఆ రెండేసి పాదములకు యతిగాని ప్రాసయతిగాని పాటింపబడి యంత్యానుప్రాస శోభితమై యున్నది. ఏకతాళ లయలో సాగిన యీ రగడ గజేంద్రుని భక్తితాత్పర్యములను శ్రీహరి యఖండగుణ రూపాతిశయమును వ్యంజించుచు సమంచితముగా నొప్పారుచున్నది.

భగవత్సాక్షాత్కార సన్నివేశములలో ఆ దేవుని స్తుతికి దండకము ప్రయోగించుట పూర్వకావ్యములలో పరిపాటి. కాని ఆచార్యులవారు దీనికిచట ఉదాహరణ కావ్యము నందువలె కళికను ప్రయోగించి తమ వైలక్షణ్యమును ప్రదర్శించినారు. విశేషచ్ఛందస్సులలో కళికోత్కళికలారు ప్రయోగించుటచూడగా కవిగారికి దేశిచ్ఛందస్సులలో రగడలపై మక్కువ యెక్కువ యని విశదమగుచున్నది.

## ఆదితాళ గీతము

భోగినీ నృత్యవర్ణనలో నృత్యము ప్రారంభించిన సందర్భమున ఆదితాళ గీతము ప్రయుక్తమైనది. 16 మాత్రలతో సాగు ఆదితాళములో రచింపబడిన యీ గీతమున నృత్యము చేయుటకు వీలుగా మొదట తాళలయానుకూలముగా మృదంగజతి కూర్పబడినది. ఇందలి యీ మృదంగజతి "సలాం శబ్దము"గా వ్యవహరింపబడుచున్నదని వరదాచార్యులవారు వివరించిరి.[2]

---

1. పోతన చరిత్రము : 12-26
2. భోగినీలాస్యం : పుట. 13- వ్యాఖ్యాత శ్రీ వానమామలై వరదాచార్యులవారు. యువభారతి ప్రచురణము.

"తద్ధి-తకతధిమిత కిటతక ఝుంతా । జగతతోం గదిరిగుడు-తకరుంతా
దిరుగుడు ఝుంఝుం కిణజగణంత । జగణంతక-తగణంతక-తకరుంతక
తకఝుంతక తకిణం-తకరుం తకుందరి కిటతక-తరిత తరిత ధిమి
తధి మిత కిడ తక తకతా తెహిధ త్తతా-ఓ రాజా!
రాజాధిరాజసురతేజా!...."[1]

ఇత్యాదిగా సాగిన మృదంగజతితో గూడియున్న యీ గీతము రాజప్రస్తుతిలో ప్రయుక్తమై యంత్యానుప్రాసాభిశోభితమై నాట్యారంభమును సాక్షాత్కరింప జేయుచున్నది.

## త్రిపుట తాళ గీతము :

భోగినీ నృత్య వర్ణనలో ఆదితాళగీతము పిదప దశావతార విభ్రాజితుడగు హరిస్తుతియైన పిమ్మట యీ త్రిపుటతాళ గీతము ప్రయోగింపబడినది. ఆచార్యుల వారు దీనిని గూర్చి "ఈ జతి దశావతారశబ్దమనుపేర వ్యవహరింపబడుతూంది. (2 అక్షరాల కాలముగల త్రిపుటతాళ శబ్దమిది)"[2] అని వివరించిరి. త్రిపుట తాళము ప్రథమకాలములో 7 మాత్రలతోను ద్వితీయ కాలములో 14 మాత్రలతోను తృతీయకాలములో 28 మాత్రలతోను సాగును. ఇచటి గీతము ద్వితీయకాలమున నడచిన (2 అక్షరాల కాలముగల) త్రిపుట తాళములో సాగినది. ఈ గీతమునకు ముందును మృదంగజతి నృత్యమునకు వీలుగా కూర్పబడియున్నది.

"తగ్గధింత తాం హత ధీనుత తద్ధీనుత తాను ధణాంతరి
ధికుందరి తకుందక
జలధినిహత వేదావనచణ విలసద్ఘన నౌకాభకరణ!
ఖలసోమకదైత్య నిబర్హణ బల శోభిత మీనశరీరా...."[3].

ఈ రీతిగా 20 పాదాలలో సాగి దశావతారములు వర్ణింపబడుటచేత నిది దశావతార శబ్దమనుపేర ప్రసిద్ధిచెంది యున్నది. ఇచటి ఆదితాళ త్రిపుటతాళ గీతములు

---

1. పోతన చరిత్రము : 4-238
2. భోగినీ లాస్యం : పుట. 15. వ్యాఖ్యాత : శ్రీ వానమామలై వరదాచార్యులవారు. యువభారతి ప్రచురణము.
3. పోతన చరిత్రము : 4-240.

రెండును తాళలయానురూపములైన మృదంగ జతులతో జతపడి కమనీయ భోగినీ నాట్యమును కనులకు గట్టించుచున్నవి.

## తౌహర :

'తౌహర' అనుగీతము కావ్యములందపురూపమైనది. ఇది సాధారణముగా హరికథలయందు తరచుగా ప్రయోగింపబడుచుండును. తౌహరను గూర్చి డా॥ తూమాటి దొణప్పగారిట్లు తెలిపిరి.

"దొహరా" మరాఠీ భాషలో ప్రసిద్ధమైన సంగీత రచనానుకూలమైన ఛందో విశేషం. ఇది సంస్కృత 'ద్విధారా' శబ్దానికి వికృతియని మరాఠీ లాక్ష ణికుల యభిప్రాయం. ఇది ఆఖ్యానరీతికి ఉపకరించే రచనా విశేషం. తెలుగులో దీనికి 'తౌహరా, తోహరా' అని కూడ వాడుక. దీని నొక్కదానికి తప్ప తక్కిన మరాఠీ ఛందో విశేషాలకు తెలుగులో ప్రవృత్తిలేదు. ఇది తెలుగు హరికథలలోను హరికథేతరాలయిన మరికొన్ని సంగీత రచనా విశేషాలలోను ప్రయుక్తమయింది. కథానుసంధానంలోను, ద్రుతగతిలో కథ సాగవలసిన ఘట్టాలలోను దీనిని తెలుగు హరికథా రచయితలు వాడుకొన్న మాట వాస్తవం.... తౌహరాకు నిర్ణీత మయిన ఛందః ప్రస్తారం కనిపించదు. రచయితలు ఎవరి వీలును బట్టి వారు పెంచిగాని కుదించిగాని దీన్ని రచించి 'తౌహరా' అని వ్యవహరించినారు. దీనికి ఆది ప్రాస నిర్ణయం నిత్య లక్షణం, అంత్యాను ప్రాస నియమం వికల్పం. డోరా అని కూడా కొందరు కథా రచయితలు వ్యవహరించినారు. నారాయణ దాసాదులు తౌహరాకు మారుగా 'మంజరి' అన్న ఛందో విశేషాన్ని ఉపయోగించారు"[1].

దొణప్పగారు వ్రాసినట్లు మరాఠీ ఛందస్సగు తౌహర తెలుగు హరికథ లలో హరికథేతరములైన కొన్ని సంగీత రచనలలోను ప్రయోగింపబడి యున్నది. కాని తెలుగు కావ్యములలో దీనికి ప్రయోగము లేదు. ఆచార్యులవారు తొలి ప్రాయ మున కొంత కాలము హరికథా కాలక్షేపములు చేసి అందు తౌహరలు పాడి యున్నందున బాగుగా నుండుననియే తాము ప్రథమముగా పోతన చరిత్రములో తౌహరను ప్రయోగించి యున్నట్లు ఒక గోష్ఠిలో తెలిపిరి.

1. తెలుగు హరికథా సర్వస్వం : 'హరికథ-స్వరూప స్వభావాలు' పుట 110.

నిర్ణీతమైన ఛందస్సులేని 'తౌహర'ను సాధారణముగా హరికథలలో ఎక్కు-వగా వాడుకలో గల ఛందోరీతిని గ్రహించి ఆచార్యుల వారిందు పొందుపరచినారు. ఇందలి తౌహరకు ప్రతిపాదమున వినిమిదేసి మాత్రల గణములు నాలుగున్నవి. నాలుగవ గణమున మొదట రెండు గురువులకు సాహిత్యము కూర్పబడి చివరి నాలుగు మాత్రలు శూన్య మాత్రలుంచబడినవి. ఇవి రాగాలాపన కుపయోగపడును. ఈ నాలుగవ గణములోని రెండు గురువులలో మొదటి గురువు ప్లుతముగా గానము చేయబడును. కావున ప్లుతముగల మొదటి గురువు 3 మాత్రలు తర్వాతి గురువు 2 మాత్రలు మొత్తము ఐదు మాత్రలు కాగా శూన్య మాత్రలు చివరకు మూడు మిగిలి తాళము సరిపోవును. మూడవ గణము మొదట యతికాని ప్రాసకాని యుండి రెండేసి పాదములకు ప్రాసము కలదు. అంత్యాను ప్రాసము కలదు. ఇట్టి లక్షణముతో ఈ తౌహర 12 పాదములలో సాగినది.

"ముక్తాయిలంగొని మృదంగనాదము మ్మమ్మాఱుల్ వడి మ్రోఁగెన్
సక్తాత్మకమై సభాసముద్రము స్మయవీచికలన్ దూఁగెన్"[1]

ఇత్యాదిగా సాగిన యీపాట మొదట "తకథుం-తతఝణ తరికిణ కిటతక...." మున్నగు నానావిధ గతులతో గూడిన ముక్తాయింపు మమ్మారులు మ్రోగినట్టి మృదంగగతులు కూర్పబడి భోగినీలాస్య వర్ణనలో యుక్తముగా నుపయోగింప బడియున్నది.

## శ్లోకములు :

కావ్యమున షష్ఠాశ్వాసమున పోతన భాగవతాంధ్రీకరణమునకు ముందు చిదానంద గురువరేణ్యుని సందర్శించి చేసిన స్తుతి శ్లోకబద్ధమయి యున్నది. ఈ స్తుతి 13 శ్లోకములందును, చిదానందుడు శిష్యుని దీవించినది యొక శ్లోకము నందును రచింపబడియున్నవి. ఈ 14 శ్లోకములందును

"జరామరణ జిత్సుధారస...."[2] అనునది జలోద్ధతగతి వృత్తమును

"సంసారాంబుధి మగ్నబద్ధ...."[3] అనునది శార్దూలవిక్రీడితమును

1. పోతన చరిత్రము : 4-261
2. ,, : 6-33
3. ,, : 6-34

"ప్రహ్లాదరక్షణపటు...."[1] అనునది ఆర్యావృత్తమును నయి తక్కిన శ్లోకములు అనుష్టుప్పులై యొప్పుచున్నవి. మరియు "శ్రుతిం శ్రుతిం...."[2] అన్న అనుష్టుప్పు మాత్రమెనిమిది పాదములు కూర్పబడియున్నది.

సాక్షాత్పరబ్రహ్మముగా భావించి చేసిన సద్గురు స్తుతికిని, గురువర్యుని ఆశీర్వచనమునకును సంస్కృత శ్లోకములను ప్రయోగించుట శిష్టాచార సమంచితమైనది. ఈ 14 శ్లోకములును, శ్రీనాథుడు సింగనృపతిని మంగళాశాసనము చేసిన ఉపేంద్ర వజ్రా శ్లోకమును ఆచార్యులవారి సంస్కృత శ్లోకరచనా చణత్వమును ప్రకటించుటయేకాక యీ సంస్కృతరచన ఆంధ్ర కావ్యమునకొక వైశిష్ట్యమును సంతరింపజేయుచున్నది.

కావ్యమున పద్యములు శోకములేకాక రగడ భేదములును, కళికోత్కళికలును, ఆదితాళ త్రిపుటతాళ గీతములును, తౌహరయు ప్రయోగింపబడి విస్తర కవితా విశిష్టమైన కృతిలో వైవిధ్య విలసితమై గానయోగ్యమై చెలువొందు మధుర కవితా సౌందర్యము గుబాళింపజేయుట విశేష విషయము. ఇట్లు పద్యగేయములచేత సాహిత్య సంగీతములను, భోగినీఘట్టముచేత నృత్యమును చెలువొంది లలితకళా త్రయమునకిది త్రివేణి సంగమమై హృదయంగమమై యింపు సొంపుల పింపిళ్ళు గునియుచున్నది.

## వచనములు :

కావ్యమున ప్రయుక్తములైన వచనములు 20%. ఇవి మొత్తము పద్యగద్యములలో ఐదారుశాతము కంటె మించకపోవుటయేకాక చాల వరకు ఒకటి రెండు పంక్తులవే యున్నందున నివి యత్యల్పముగా ప్రయోగింపబడినవని స్పష్టమగుచున్నది.

ఇందలి గద్యములను దీర్ఘములు నాతిదీర్ఘములు, అల్పములని మువ్విధములుగా విభజింప వచ్చును.

---

1. ,, : 6-35
2. ,, : 6-31

## దీర్ఘ వచనములు ;

కావ్యమున దీర్ఘ వచనములు నాలుగు మాత్రమే కలవు. అవి సప్తమాశ్వాసమున రెండును ద్వాదశాశ్వాసమున రెండును ప్రయుక్తమై యున్నవి. మొదటి గద్యము నారయాదులు సింగనృపాల సభలో పోతనగారి భాగవతాంధ్రీకరణ ప్రాశస్త్య ముగ్గడించుటకు ప్రయుక్తమై యున్నది.

"ఒక్కనాఁడు పోతన రాహుగ్రస్త సోమోపరాగ సమయంబున నభ్రభంక షోత్తుంగ తరంగ యగు గంగన్ మునిగి సమీపస్థిత సైకత స్థలంబున బద్ధ పద్మాసనస్థుండై యీషదున్మీలిత నయన యుగళుండునై యీశ్వర ధ్యానానుష్ఠాన నిష్ఠా గరిష్ఠుండునై యుండు తఱి, ఇనకుల వంశ పయః పారావార రాకా సుధాంశు సంకాశుండుకు, నిఖిల చరాచర భూతేశుండుమ.... [1]

అని యీ రీతిగా 25 పంక్తులలో సాగిన గద్యము ప్రౌఢమై పోతన, భాగవత గద్య హృద్యమై శబ్దాలంకార భాసురమై పరిఢవిల్లినది. ఇది పోతనకు గంగా సైకతమున శ్రీరాముడు సాక్షాత్కరించి శ్రీ భాగవతమును తన పేర నాంధ్రీకరింప నర్థించిన వృత్తాంతమును, పోతన ఆంధ్ర భాగవత రచనలోని విశేషములను, రచనా కాలమున తదనురూపముగ జరిగిన సంఘటనలను వివరించి చెప్పుటకు యుక్తముగా నుపయుక్తమై యున్నది.

రెండవ గద్యము పోతన రామాజ్ఞచే గ్రామ రామాలయమున భక్తుల నాహ్వానించి యాంధ్ర భాగవతము వినిపించుచు భగవ దవతార కథా విశేషములను తెలుపుటకు కూర్పబడినది. ఇది అన్నిటికంటె పెద్ద గద్యమై మూడు పుటలలో వ్యాపించి యున్నది.

"అంత నొకనాఁడు పోతనార్యుండు భాగవతేతిహాసంబుల నుడువుచు ననంత కోటి భగవదవతార లీలలే భాగవత రూపమై యలరు...." [2]

ఇత్యాదిగా సాగిన యీ బృహద్గద్యము సరళమై సుబోధకమై పురాణోచితముగా పాంచాలీ రీతిలో విలసిల్లుచున్నది.

1. పోతన చరిత్రము : 7-11
2. ,, : 7-158

మూడవ వచనము గజేంద్రమోక్షణ కథలో గజేంద్రుడు జలక్రీడ లాడిన కాసారమును వర్ణించుటకు ప్రయోగింపబడినది.

"తత్సవిధ ప్రదేశంబులఁ గల సర్వంసహా కష్టసహన శీలతకు సుపాయనంబులన్ గట్టంబెట్టు పసరికపట్టు కోకలై యెల్లెడల నల్లుకొని యార్ద్రంబులున్ మార్దవంబులున్ నేత్ర పర్వంబులునగు పచ్చపచ్చని పచ్చిక బయళుల యందమ్ములును, తమ్ముల విభవమ్ములకు...."[1]

ఈ విధముగా 37 పంక్తులలో సాగిన యీ గద్యము ప్రౌఢమై పూర్వ ప్రబంధ గద్య సంకాశమై శబ్దాలంకార శోభితమై విశేషించి ముక్తపద గ్రస్త విన్యస్తమయి ప్రశస్తమయి ప్రకాశించుచున్నది.

నాలుగవ గద్యము రుక్మిణీ సందేశహరుడై అగ్నిద్యోతనుడు ద్వారకకు వచ్చినప్పటి శ్రీకృష్ణుని శుద్ధాంత వైభవమును, శ్రీకృష్ణుని రూపరేఖా విలాసములను వర్ణించుటకును, కృష్ణ సందర్శన వృత్తాంతమును దెలుపుటకును ప్రయోగింప బడినది.

"అగ్నిద్యోతనుఁడు హరి సెలవుగొని యచటి యింతులను వింతలను గొంతవడిఁ గాంచుచును గంతుజనకుని శుద్ధాంతమ్మునకుఁ జనుచుండ రణవిజిత నృప మకుట మణిగణ విరచితానేక తోరణమ్ములు సెలంగఁ దనూకృతారి శిరోవేష్ట చీనాంబరకృత కేతనంబులు వెలుంగ...."[2]

అని యీ విధముగా 30 పంక్తులలో సాగిన యీ గద్యమును ప్రౌఢమై ప్రత్యేకించి అంత్యానుప్రాసభాసమై యున్నది.

ఈ దీర్ఘ గద్యములు తరచు దీర్ఘసమాసాన్వితమై యుత్కళికా ప్రాయములై యొప్పుచు నందందు "రణవిజిత నృప మకుట మణిగణ...."[3], "ఘనసార క్రమ కాన్విత...." [4]ఇత్యాదిగా కంద పద్యపాదము లేర్పడుటచేత వృత్తగంధి సురభిళమై యింపుగొల్పుచున్నవి.

---

1. పోతన చరిత్రము : 12-11
2. ,, : 12-258
3,4. ,, ,, : 12-258 గద్యపంక్తులు.

## నాతిదీర్ఘ వచనములు :

కావ్యమున నాతిదీర్ఘ వచనములు 11 కూర్పబడి యున్నవి. ఇవి 5-170, 7-46, 7-251, 9-233, 9-265, 9-295, 9-296, 10-51, 11-3, 11-167, 11-322, 11-350 సంఖ్య కలవి. ఇవి చాలవరకు 4 నుండి 10 పంక్తులవరకుగల వచనములే. కాగా 10 వ ఆ. 51 వ వచనము 18 పంక్తులు, 11 వ ఆ. 322, 350 సంఖ్యలుగల వచనములు 15 పంక్తుల చొప్పున విస్తరించి యున్నవి. ఈ వచనములు కథాగమనమునందును, సంవాదములందును వర్ణన లందును ప్రయుక్తములై యున్నవి.

"అంత నచ్చటికి వచ్చిన పోతన యాతని దురవస్థన్ గని మనమ్మున ఘనమ్మగు నక్కటికమ్మూని విద్వేషమ్ము మాని యాప్రాంతమున నొక మూలిక కన్వేషణ మ్మొనర్చి, శిలాతలమ్మునఁ బేషణమ్మొనర్చి, నాసికాపుటమ్ములం బోసి నంత క్షుత సంగతుండగుచు"[1].

అని రచింపబడిన వచనము తన్ను జంప బూని సర్పదష్టుడైన కాపు పోచయ్యను పోతన బ్రతికించిన విషయము దెలుపుచు కథాగమనము నందు ప్రయో గింపబడి యున్నది.

శ్రీనాథు డొంటిమిజ్జలో వసించుచున్న పోతనను గని రామాంకితోత్సవము గూర్చి సంభాషించినప్పటి.

"అంతఁ బోతన ద్విజకుల జలధి సోముండగు కవిసార్వభౌమున్ గని మహాకవీ!...."[2] ఇత్యాదిగా గల వచనము సంవాదము నందు ప్రయుక్తమైనది.

ఇక వర్ణనకు,

"అని పలుకుటయుఁ బోతన యచ్చేరువంగల సూకరంబుల మూఁక నుపలక్షించినంత వాని చెంతనె వెలుంగు నొక యింతి కంతు చేనాడు పూబంతియన వింత చెలువమ్ములీను నెమ్మేను సంపెఁగల సొంపులను బంపక మొనర్ప...."[3]

1. పోతన చరిత్రము : 5-170
2. పోతన చరిత్రము : 10-51
3. పోతన చరిత్రము : 7-251

అన్న వచనము నిదర్శనము. ఇది భాగవతరక్షణ చేసిన వరాహము రెచ్చి వచ్చిన పందులను మేపు యువతిని వర్ణించుట కుపయుక్తమైనది.

ఈ నాతి దీర్ఘ వచనములలో పై వచనమును, పోతన విరక్తుడై శిష్యులను విడచి వెడలిపోయినప్పుడు "అనుచున్ నిజ మనఃపద్మంబున రక్తనలినదళ విశాల నేత్రు నీలజీమూత మనోహరగాత్రు...." అని రామస్మరణ చేయుచు సాగిపోయిన విషయము తెలిపెడి వచనమును ప్రౌఢములై తక్కినవి యెక్కువగా సారళ్యమును సంతరించుకొనియున్నవి.

## అల్ప వచనములు:

దీర్ఘ నాతిదీర్ఘ వచనములు పోగా తక్కినవెల్ల అల్ప వచనములే. ఇవి ఒక్క పదముతో మొదలుకొని ఒకటి రెండు పంక్తుల వరకున్నట్టివి.

"అని తలంచి నిసర్గరమణీయంబులగు ప్రకృతి దృశ్యంబుల మనోహరంబులగు పశుగణంబుల విహారవిలసనంబులంబారవశ్యమ్మున నారయుచుండ" 2–14.

"అని మంత్రార్థ మహిమంబుపదేశించి" 2–45

"అనుచుఁ బోతన తాను" 2–104

"అంతనయ్యారి రచ్చ బ్రామనులకడ చవికెలలో" 3–34

"అనుచు నాడి పోసికొనుచుందురు" 3–41

"అంతఁగొన్నిదినంబులకు" 3–55

"మరియు" 3–68

"అంత కేతన" 3–256

"అని నుడివెనంత" 4–21

"అంత" 11–16

"అలరు తరి" 11–107

అని యీ రీతిగా నున్న చిన్న వచనములు కథాగమనమునకును, సన్నివేశముల సంధానమునకును ప్రయోగింపబడియున్నవి.

ఇట్లు కావ్యమునందలి సర్వవచనములను పరిశీలించినచో నవి కథాగతికిని, వర్ణనలకును, వృత్తాంతనివేదనకును, సంవాదమునకును సముచితరీతిగా ప్రయుక్తము లైనట్లు విశదమగును. ఇవి ఆది యుగమునందలి భారతాది కావ్యముల యందలి వచనములను పోలి కొన్ని, మధ్యయుగమునందలి భాగవతాదులలోను, మనుచరిత్రాది ప్రబంధములలోను నున్నట్టి గద్యములను పోలి కొన్ని రచింపబడి యొప్పుచున్నవి. అతుకులు పెట్టుచోట్ల కొన్ని యెడల 'అంత' 'అనిన' ఇత్యాది వచనములత్యవసరమయి యున్నప్పటికి చాలవరకు వచనములు రసభావపూర్ణములై శబ్దార్థాలంకారోదీర్ణములై చవులూరించుచున్నవి.

## ఛందః ప్రయోగ విశేషములు:

ఛందో వైవిధ్య విలసితమై సుందరమైన కావ్యమున ప్రసిద్ధములై సాధారణములై యొప్పెడు ఛందస్సులే యత్యధికముగా ప్రయుక్తములై యున్నవి. మరియు సర్వకావ్య సాధారణములును నిసర్గ రమణీయములును నైన ఛందః ప్రయోగములే సర్వత్ర వ్యాపించియున్నవి కాని పాండిత్య ప్రకర్ష ప్రకటనోద్దిష్టములు, వక్రములు, గడుసుచేష్టలు, వింతలు విడ్డూరములు కానరావు. ఆచార్యులవారు తమ వ్యక్తిత్వానురూపముగా నిర్వహించిన నిరాడంబర ప్రసన్న ప్రయోగములలో సకృత్తుగా గానబడు విశేషములను సంగ్రహముగా ప్రదర్శింతును.

1. కావ్యములలో ఆశ్వాసాది పద్యము కృతిపతి సంబోధనముతో శ్రీకార కందముండుట పరిపాటి. పోతనచరిత్రములో కూడ అట్లే కందముండుటయే కాక తదనంతర పద్యము ప్రతి యాశ్వాసమునను తేటగీతి ప్రయుక్తమై యున్నది. ఒక్క ప్రథమాశ్వాసమున మాత్రము ఆచార్యులవారు పోతనచరిత్రమును మహాప్రబంధముగా రచింతునన్న విజ్ఞప్తికి రెండు ఉత్పలమాలలు కూర్చి ఆ పిదప తేటగీతి రచించినారు.

కావ్యమున ఆశ్వాసాదిని ప్రయోగించిన ప్రథమ పద్యము శ్రీయుతకందము కృతిపతి రామచంద్రుని సంబుద్ధిలో చెప్పుటయే కాక యీ ఆశ్వాసాది కందములలో క్రమముగా రామ చరిత్రము సూచనగా గ్రథనము చేయబడియుండుట విశేషము. ప్రథమాశ్వాసాదిని

"శ్రీ రఘువంశ సుధార్ణవ శారద రాకాశశాంక! జననీ కౌస
ల్యారోజ పూర్వశైల తటారూఢశరీర! దశరథాగ్రకుమారా!॥

అనుదానిలో శ్రీరాముడు రఘువంశదీపకుడై దశరథునికి పెద్దకొడుకుగా కౌసల్యకు జన్మించినాడన్న వృత్తాంతమును,

ద్వితీయాశ్వాసాదిని,

"శ్రీ సీతా హృదయాంబుజ భాసురమధుపాయమాన భావజరూపా!
కోసలనృప ముఖకువలయ హాస శరచ్చంద్ర! దనుజహస్తి మృగేంద్రా!॥

అను దానిలో శ్రీరాముడు సీతను పెండ్లాడి అన్యోన్యముగా కాపురముచేసిన విషయము, దశరథున కనన్య ప్రేమపాత్రుడైన విషయము, తాటకాది రాక్షసుల దురుమాడిన విషయము సూచింపబడినవి ఇట్లే తక్కిన యాశ్వాసాది పద్యము లందు రామకథాసూచన కలదు. చివరి యాశ్వాసముల ఆది కందములలో మాత్రము కథతో నిమిత్తము లేకుండ రాముని భక్తితో నభివర్ణించినది కలదు.

ఆశ్వాసాదిలో కందము పిదప కృతిపతి సంబుద్ధిలో తేటగీతి కూర్ప బడుటయు ఆ గీతములలో ఆయా ఆశ్వాసములకు చెందిన కథాభాగములను సూచించుటయు విశేషము. పోతన జనన బాల్యములుగల ప్రథమాశ్వాసాదిని గల గీతమున

"సుతుని గొప్పలఁ గీర్తింప నతిముదమున వినుచుఁ దనుదాన మఱచెడి జనకుని వలె
నాలకింపవె దేవ! మహానుభావ! జనవినుతకీర్తి! శ్రీరామచక్రవర్తి!"

అని పోతన కథ వినుటకు కృతిపతి నున్ముఖునిచేసి ద్వితీయాశ్వాసాది గీతమున

"తారకానుసంధాన కథావివరము అఖిలమానవలోక కళ్యాణకరము
చిత్తగింపవె యీ యితివృత్తమవల రమ్యగుణభద్ర! శ్రీరఘురామ భద్ర!॥

అని పోతన తారక మంత్రోపాసన చేసి లోకకళ్యాణకరముగా కళ్యాణము చేసికొనెనన్న ఆశ్వాస కథాభాగమును సూచించుచు రచించుట జరిగినది. ఇట్లే యన్ని యాశ్వాసాదులందును తేటగీతులు సాగినవి.

2. పోతన విరక్తుడై వెడలిపోయి తిరుపతి వేంకటేశ్వరుని సందర్శించి యభివర్ణించిన విషయము 'వేంకటేశ్వరా!' యను మకుటముగల ఉత్పలమాలలైదు

రచింపబడినవి. మధ్య ఒక మత్తేభము ఒక చంపకమాలయు కూర్పబడి "వేంకటాద్రి ప్రభో" "రమాధవా!" యన్న మకుటములును అలంకరింపబడినవి.[1] ఇవి శతక పద్యములవలె హృద్యములై భాసిల్లుచున్నవి. ఇతర శతకములందు వలె గాక యివి యించుక భిన్న మకుటములతో శోభిల్లు పండితారాధ్యుని శివతత్త్వసార పద్యముల వలె విలసిల్లుచున్నవి.

3. భోగినీ నృత్యమును వర్ణించు పట్టున 12 పాదముల ఉత్పలమాలిక రేఫ ప్రాసముతో యల్లబడినది.

"ధారుణిపైఁ బదాబ్జములు తాఁకుచు నుండెనొ లేదొ యన్నటుల్
నారి ప్రసూనబాణు విలు నారిగఁ దారుచు నాట్య మాడె...."[2]

ఇత్యాదిగా సాగిన యీ మాలిక ఏకధాటిగా అవిరతముగా చేసిన భోగినీ నృత్య రామణీయకమును ప్రత్యక్షీకరించుచున్నది. పద్యము మాలికగా మలచుటకు హేతువు బ్రహ్మాండముగా నాట్యము చేయుచున్న భోగినికి, సవరించుకొన్న ప్రసాధనములన్నియు చెదరిన పరిస్థితి యొక్కయు, రాజుగారి రాగోదిత హృదయగతి యొక్కయు నిరంతర పారంపర్యము గొలుసుకట్టుగా వర్ణింపబడుటయే. ఇట్లిది సందర్భోచితమై యొప్పుచున్నది.

మరొకచోట పోతన శ్రీరంగనాథుని దర్శించి వినుతించిన
"అక్షర జ్ఞాన శూన్యుని యటులె నేను...."[3]

అన్న తేటగీతి పంచపాదియై యొప్పుచున్నది. ఈ యెండు రెండు తప్ప కావ్యమున నధికపాద పద్యములు కానరావు.

4. పోతనకు మణిగిరిపై సరస్వతి ప్రత్యక్షమై విలపించుచు పలికిన సన్నివేశమున ద్విరుక్త టకార ప్రాసముగల ఉత్పలమాలలు నాలుగు కూర్పబడినవి[4]. ఈ పద్యములలో పోతనగారి తన్మయత్వము, గ్రంథము నరాంకిత మొనర్చు దుర్గతివలని యారని వేదన, అమ్ముడు వోవనున్న వాణి అంతులేని చింత ఏక ప్రాసతో గూడిన ఉత్పలమాలల వల్ల వ్యంజితమగుచున్నది. ఇట్లే నర్సమాంబ

1. పోతన చరిత్రము : 9-236 నుండి 242
2. ,, : 4-267
3. ,, : 9-255
4. పోతన చరిత్రము : 9-48 నుండి 51

వేదనతో బోనమునుగొని చేలకు వెళ్ళిన విషయము వర్ణించిన పట్టున వరుసగా నాలుగు పద్యము లందును నకారప్రాసము కూర్పబడి యవిరతమగు నామె విషాదమును స్ఫురింప జేయుచున్నవి.[1]

5. మావి తోటలో విడిది చేసిన శ్రీనాథుని చెంతకు జంగమకన్య వచ్చి యిచ్చిన ఫలపుష్పములను గొని యామెతో సంభాషించిన సీసము ఒక్కొక్క సీస పాదమున వెనువెంటనే గీతపాదము కూర్పబడి రచింపబడియున్నది.

సీ॥ "పవనకుమార సంస్పర్శమ్మదెట్టిదో యరనవ్వి మఱియు నీ విరి పడంతి"

తే.గీ॥ "అనుట లామె కన్నుల సిగ్గు పెనఁగులాడె...."

ఈ రీతిగా పద్యము నాలుగు పాదములు రచితమైనవి. ఇందులో ఒక పుష్పమునో ఫలమునో గూర్చి చమత్కారముగా శ్రీనాథుడడుగగా వెంటనే జంగమకన్య యను స్పందించి సాత్త్వికాద్యభినయము చేసినది కావున తదీయ రస భావానురూపముగా శ్రీనాథుడన్న సీసపాదము వెనువెంటనే జంగమ కన్యానుస్పందనము తెలుపు గీత పాదము కూర్చుచు పద్యము సాగించుట మిక్కిలి యౌచితీ శోభితమై యుండుటయే కాక యీ కూర్పు విశిష్టముగా నున్నది.

6. ఒంటిమిట్టలో శ్రీరామసన్నిధి నంకితోత్సవము జరిగినప్పటి వర్ణనలో "క్షేత్ర సర్వస్వమ్ము...."[2] అన్న సీసమున నాలుగు పాదములందును 'త్ర' ప్రాసకూర్పబడియున్నది.

## 7. ద్విప్రాస :

కావ్యమున మిక్కిలి అరుదుగా ద్విప్రాస కూర్పబడినది.

"పిలుచున్ దనప్రియ కాంతల నిలుచున్ నీరడుగుమట్టి నెఱి మంథనమై
కలఁచున్ బురదగ నీటఁ బెకలుచున్ బిసకాండములను గడు మోదముననన్"[3]

అని గజేంద్రుని జలక్రీడ వర్ణించు పట్టున ద్విప్రాస ప్రయుక్తమైనది. ఇట్లే రామ చరిత్రములో

1. పోతన చరిత్రము : 3-122 నుండి 125
2. పోతన చరిత్రము : 10-58
3. ,, : 12-15

"సాగుచు ఋష్యాశ్రమముల కేఁగుచు క్షేత్రాదికముల నీక్షించుచు నం
దాఁగుచుఁ బుణ్యనదంబులఁ దోఁగుచుఁ గొనె మునిగణమ్ముతో నాశీస్సుల్"

అనియు, రుక్మిణీ కళ్యాణ కథలో

"చూచెను జూపుల వలపులు బూచెను దరహాసరుచులఁ బూసౌరభముల్
పీచెను విద్యుద్వల్లులు దోఁచెను యువహృదయములను దోచెను బేర్మిన్"

అనియు ద్విప్రాసలు కూర్పబడినవి.

## 8. రేఫ ఱకార ప్రాస :

ఆచార్యులవారు, లక్షణ విరుద్ధమైనను పూర్వ కవులలో కొందరు ఆధునిక కవులలో అనేకులును ప్రయోగించినట్లు, రేఫ ఱకార ప్రాసను వాడిరి.

ఉదా:- "ధారుణిపైఁబదాబ్జములు తాఁకుచునుండెనొలేదొ యన్నటుల్
..................................కస్తురి చుక్క యట్టిటున్
గాచెను...."[3]

## 9. అఖండయతి :

వివాదాస్పదమైన అఖండయతిని వాడిరి. దీని ననేకులు వాడియున్నారు.

ఉదా : "...........................శతరూపతన్
లరిఁగొను నాత్మ తానటు లనంత సుఖాకృతి నుండి...."[4]

## ప్రామాదికములు :

స్వచ్ఛమై సర్వాంగసుందరమై చెలువొందు కావ్యమునందెక్కడ యొక్కటి రెండు ప్రామాదికములు శాకములందు తృణకణముల వలె దొ యున్నవి. 'ప్రమాదో ధీమతామపి'అని యుండనే యున్నది. దిగువ నివి యేరివే బడినవి.

1. పోతన చరిత్రము : 11-50
2. ,, : 12-296
3. ,, : 4-267
4. ,, : 6-57

## గణభంగములు :

1. కం. "................................

ప్రాసున్ నిగమత్రయీ విలాసున్ మదిఁగొల్తుఁగవికళా విన్యాసున్"[1]

కందము ఉత్తరార్ధమునందు 3 వ బేసి గణము జగణము వచ్చి గణ భంగమైనది.

2. ఆలయమందు భావుకమహాశయ! మీరలు లేమిజేసి భూ
పాలుఁడు పంపినట్టి కృతి భాగవతమ్మును మల్లనార్యుచే
తులనిడి జీర్ణకావ్యపు కృతుల్ దగఁబూర్తి యొనర్పగోర మీ
యలఘు వియోగ భారమతి నాతఁడు నియ్యకొనండు దీనికిన్"[2]

ఇందు మొదటి రెండు పాదాలు ఉత్పలమాలవిగా, తర్వాతి రెండు పాదాలు చంపకమాలవిగా ప్రమాదవశమున దొరలినవి.

## యతిభంగములు :

1. "అట్టులె యైన గంగను............వాగ్విహారసం
ఘట్టన కాస్పదంబగు నసద్రసనమ్మది పూతమౌనటుల్"[3]

ఇందు చతుర్థపాదమున యతి భంగమైనది.

2. "అచ్చపు భక్తి ఠాఘవు సుధామధురాకృతిఁ గన్ను దొన్నెలన్"[4]

ఇచ్చట ప్రథమ ప్రాదమున యతి భంగమైనది.

3. ధారుణిపైఁ బదాబ్జములు............నాట్యమాడెఁ జె
ల్వారెడు పండుటాకు నునుజెక్కులఁ జెమ్మట చుక్కలాచు నా
ప్పారెను...."[5]

ఈ పద్యమున 3 వ పాదమున యతి భంగమైనది.

---

1. పోతన చరిత్రము : 6-81
2. ,, : 10-36
3. ,, : 5-35
4. ,, : 11-34.
5. ,, : 4-267.

4. కం. "ఈ రేడు........ ....పూసలలో
దారంబయి యాత్మలంటి పొల్చెడి దేవా!"[1]

ఇందు నాలుగవ పాదమున యతి భంగమైనది.

ఇవి తప్ప కావ్యమెల్ల ఛందో విషయికముగా నిర్దుష్టమై శిష్టమై చెలువొందుచున్నది.

ఆచార్యులవారు కావ్యమున చిత్ర గర్భ బంధ కవిత్వములను చొప్పించక రసజ్ఞులను నొప్పించక ప్రశస్త విస్తర కవితచేత మెప్పించినారు అన్య కావ్యములలో కానబడు విశేషచ్ఛందములలో స్రగ్ధరాది మార్గఛందస్సులను గాని తరువోజ మధ్యాక్కరాది దేశిచ్ఛందస్సులనుగాని ప్రయోగింపక పూర్వోక్తరీతిగా ధ్రువకోకిలాదులను కళికోత్కళికాదులను వాడుకచేసి వేడుక కలిగించినారు. ఛందఃప్రయోగములెల్ల రస భావాదుల వ్యంజన కనురూపములై యౌచితీ దీపములై విరాజిల్లుచున్నవి. ఇందలి పద్య గద్యములన్నియు శ్రీనాథుడు పోతన కవిత్వమును గురించి

"అచ్చపు సంస్కృతాంధ్ర మహదబ్ధుల మందరముల్ మథింపఁగా
వచ్చు సుధారసమ్ములకు వన్నెలు దిద్దెడు కావ్యధార క
మ్మచ్చునఁ దీయు తీవియల మచ్చుల నిచ్చు మనోజ్ఞశైలి పూ
ల్విచ్చిన నందనోపవన వీథులఁగాదను పద్యగద్యముల్"[2]

అని ప్రశంసించినట్లు మధుర మంజుల గతులలో సాగి కావ్యమునకు దివ్య వైశిష్ట్యమును సమకూర్చినవి.

———

1. పోతన చరిత్రము : 12-43.
2. ,, : 7-118.

# ఆలంకారికత

## అలంకార శోభ :

కావ్య సౌందర్యోత్కర్ష హేతువులలో అలంకారములు ప్రముఖమైనవి. సహజ సౌందర్యవతి యగు యువతికి వస్త్రాభరణాద్యలంకారముల వలె నిసర్గ రమణీయమగు కావ్యమున కుపమాద్యలంకారములు తత్సౌందర్య శోభ నినుమడింప జేయును. అలంకార ప్రాధాన్యవాది యగు భామహు డలంకారముల ప్రయోజనము నిట్లు తెల్పెను.

> ''రూపకాది రలంకార స్తథాన్యై ర్బహుధోదితః
> న కాంత మపి నిర్భూషం విభాతి వనితాననమ్''[1]

'స్త్రీ ముఖ మందముగా నున్నను భూషణము లేనిది ప్రకాశించదు. అట్లే రూప కాద్యలంకారములతో సింగారింపబడని కావ్యము శోభించదు.' అని చెప్పుట చేత కావ్యమున నలంకారములకు గల ప్రాముఖ్యము విశదమగుచున్నది. రస భావాదులచేత రమ్యమైన కావ్యమునకే అలంకారములు దీప్తిని కలిగించును గాని రసహీనమైన కావ్యమునకు గాదు.

> ''సుందరాంగికిఁ గూర్చిన సొమ్ము లరయ గున్నమావికిఁ జిగురులు
> కుల్కునటుల
> వికృతరూపకుఁ బెట్టిన విలువ నగలు తుమ్మ మ్రాఁకున జిగురులు
> గ్రమ్ము నటుల''[2]

అన్నట్లు సహజ సుందరికి సొమ్ములు గున్నమావికి చిగురుల వలె శోభను పెంపొంద జేసి, కురూపకు బెట్టిన నగలు తుమ్మ చెట్టుకు జిగురు పట్టినట్లు శోభ నేమాత్ర మింపొందింప లేన ట్లందమైన కావ్యమునకే అలంకారములు సౌందర్యోత్కర్షము నాపాదింప గలవు.

---

1. కావ్యాలంకారము : 1-13
2. నా 'మణి మంజూష' : 'భావ లహరి' కవిత.

అలంకారము లందచందముల నధికతరము చేయునని కావ్యములలో పుష్కలముగా ప్రయోగింపరాదు. కంటిని మించివేయు కాటుక తగదు. ఈ విషయమున అలంకారములు వాడుట యందలి మెలకువల నానందవర్ధను డిట్లు వక్కాణించెను.

"వివక్షా తత్పరత్వేన నాంగిత్వేన కథంచన
కాలే చ గ్రహణ త్యాగౌ నాతి నిర్వహణైషితా
నిర్వ్యూఢా వపి చాంగత్వే యత్నేన ప్రత్యవేక్షణం
రూపకాదౌ రలంకార వర్గస్యాంగత్వ సాధనమ్."1

అనగా కావ్యమున నలంకారములను రసమున కంగముగా ప్రయోగింప వలె ననియు, సమయానుకూలముగా అవసరమున్నప్పుడే ప్రయోగించి అవసరము లేనపుడు త్యజింప వలె ననియు, అతినిర్వహణేచ్ఛ పనికి రాదనియు, అప్రయత్న సిద్ధములైనను అంగములుగ నుండునట్లు సమీక్షింప వలెననియు ధ్వనికారుడు చక్కని మార్గదర్శనము చేసినాడు. సుకవీంద్రు లందరును ఈ మార్గముననే పయనించి మంజులతర మహాకావ్యములను మలచి యుండిరి.

ఆచార్యులవారు కావ్యపీఠికలో 'కవితాస్తుతి' చేయుచు "బహుళార్థ దాయక భాసు రాలంక్రియా సంధానత వివాహ సంస్కరణము" అని ప్రస్తుతించిరి. అనగా కావ్యకన్యకు బహుళ ప్రయోజనకరములైన రమణీయాలంకారములను కైసేయుట వివాహము కావించుట వంటిదని నుడివిరి. అత్యానంద సందాయకమగు వివాహ సందర్భమున కావించు అలంక్రియ అత్యంత రమణీయముగా నుండును కనుక పై రీతిగా చెప్పబడినది. ఆచార్యులవారు వచించినట్లు అలంకారముల వలన అనేక ప్రయోజనములు గలవు. అవి రసభావముల నుద్దీపింప జేసి కావ్య సౌందర్యమును పెక్కు విధముల నెక్కువచేసి యాకర్షించును. కథా పరమార్థమును మనోజ్ఞముగా స్ఫురింపజేయును. ఇట్లెన్ని ప్రయోజనము లున్నను వర్ణ్య వస్తువు యొక్క స్వరూప స్వభావములను హృదయంగమముగా శోభింప జేయుటయే అలంకారముల ప్రధాన లక్షణము. ఈ యలంకారములు కవి ప్రౌఢోక్తి చేతను, కావ్యగత పాత్రల వాక్చతురత వల్లను సిద్ధించును.

1. ధ్వన్యాలోకము : ద్వితీయోద్ద్యోతము-19, 20 శ్లోకములు.

పురాణేతిహాస కల్పములైన భారతాది పూర్వకావ్యములలో అలంకారములు పొదుపుగా వాడబడినవి. కాలక్రమమున ప్రబంధములలో అవి తరచై అనంతర ప్రబంధయుగ కృతులలో రసభావములు కొరవడి కేవల మలంకారములు, ప్రత్యేకించి యమకాది శబ్దాలంకారము లతివేల ప్రయుక్తములై 'అలంకారము లనావశ్యకములు' అన్నంత అపప్రథకు గురియైనవి. ఆధునిక మహాకవులు పురాతనాధునాతన కవితారీతుల నాదరించి సమ్యగలంకార ప్రయోగ మొనర్చి కావ్యములను నిర్మించిరి. వరదాచార్యులవారును ఆనందవర్ధనుని అమూల్య వచనానుసారముగా పోతన చరిత్రమును సముచితాలంకృత మొనర్చి సర్వాంగ సుందరముగ సంతరించి యున్నారు.

## పోతన చరిత్రమున అలంకారములు :

కావ్యమున ఉపమోత్ప్రేక్షా రూపకార్థాంతరన్యాస స్వభావోక్తి శ్లేషాద్యర్థాలంకారములును, అనుప్రాసాది శబ్దాలంకారములును సందర్భోచితముగా సరసముగా కూర్పబడియున్నవి. ఇది ప్రబంధము కావునను, ప్రబంధము లాలంకారిక ప్రౌఢశైలి వెలయు ననుటచేతను, ఇందలి యలంకారములు ఔచిత్యము వీడక యసకృత్ప్ర యుక్తములై రమ్యరసవద్భావ వ్యక్తీకరణమున కుపకరణములై ప్రతిపద్య చమత్కారావహములై యలరారుచున్నవి. ఇట్టివానిలో తొలుత అర్థాలంకారములు చర్చింపబడును.

## అర్థాలంకారములు :

### ఉపమ :

కావ్యమున అర్థాలంకారము లన్నిటిలో ఉపమ నిరుపమముగ నిబిడముగ ప్రయోగింపబడి యున్నది. 'ఉపమా కాళిదాసస్య' అని ఉపమా ప్రయోగమున కాళిదాసు ప్రశస్తి వహించి యున్నాడు. వర్ణ్యవస్తువుయొక్క స్వరూప స్వభావములను సాక్షాత్కరింప జేయ జాలిన సముచితమైన యుపమానము నెన్నుకొనుటలోను, దానిని సమర్థ పదజాలముచేత సమంజసముగా వ్యక్తీకరించుటలోను ఉపమాలంకార ప్రయోగ చాతుర్యము విశద మగును. ఈ చాతుర్యము లోకశాస్త్ర కావ్యపరిశీలన, ప్రశస్త ప్రతిభగల సుకవులకే భాసిల్లుచుండును. ఆచార్యుల వారిట్టి ప్రయోగ నైపుణ్యముతో ఉపమ నిందు పసందుగా అందించి ఖిందు చేసినారు.

పోతన చరిత్రమున ఉపమలు వందకు మించి ప్రయుక్తములై యున్నవి. ఇవి పాత్రల గుణకర్మ స్వభావములను, ఇతర వర్ణ్యవస్తువుల స్వరూపాదులను, గహన తాత్త్విక నైతిక మర్మములను మనోజ్ఞముగా ప్రత్యక్షీకరించుట కుపయుక్త మైనవి. పోతన జనని లక్కాంబ గుణశీలము లీవిధముగా రమ్యోపమలచేత వర్ణింప బడినవి.

> "పర మనోభావమ్ము నెఱుఁగనిచేత మఱితరపూరుష గుణస్తుతిఁ దెలియదు
> చేతనాదేశానఁ జెలఁగు దేహమువోలెఁ బతియాజ్ఞ తలఁదాల్చి పఱలుచుండు
> దేహావరణమందె తిరుగు ప్రాణము భంగి నిలుదాఁటి పొరుగింటి కేఁగదెపుడు
> ప్రాణి హితార్థమై భ్రమియించు మన మట్లు స్వామి శ్రేయోభిలాషం జరించు
> తన మొగము తానె కనలేని కనుగవగతి నెట్టిదో స్వార్థపరత నా నెఱుఁగ దౌర!
> సన్న సెగ లక్క కరఁగెడి సరణిఁ గరుణఁ బరుల దుఃఖాగ్ని లక్కాంబ కరఁగుఁగాదె"[1]

ఇందు లక్కాంబ పాతివ్రత్యము, ఉత్తమ గృహిణీ లక్షణము చిత్తములకు హత్తుకొనునట్లు చేయుటకు మిక్కిలి సమంజసములైన యుపమానము లుపయోగింప బడినవి. సాధ్వియగు ఆమె పరపురుషగుణస్తుతి యెట్టిదో తెలియదు. దీనికి పరమనోభావ మెరుగని హృదయ ముపమానముగా చెప్పబడినది. పరుని హృదయ ములో నేమున్నదో తన హృదయానికి తెలియదు. అట్లే లక్కాంబ పరపురుషుల గుణవినుతి యెరుగదనుటలో ఎంతో సామంజస్య మున్నది. అట్లే జీవుని యాజ్ఞతో ప్రవర్తిల్లు శరీరమువలె పతి యాజ్ఞను తలదాల్చి మెలగు ననియు, దేహావరణము లోనే తిరుగు ప్రాణమువలె ఇల్లుదాటి పొరుగింటి కెప్పుడు పోదనియు, ప్రాణి హితార్థమే సంచరించు మనస్సువలె పతిశ్రేయస్సు కాంక్షించియే నడచుకొనుననియు లక్కాంబ పతిభక్తి చక్కగా వక్కాణింపబడినది. ఇందలి యెత్తుగీతిలో ఆమె పరోపకార పరాయణత వ్యక్తము చేయబడినది. తన మొగము తాను కాంచలేని కనుదోయివలె ఆమె స్వార్థపరత్వమేమిటో బొత్తిగా తెలియదు. పరుల దుఃఖ మును చూచి ఆమె హృదయము ద్రవించిపోవు ననుటను సన్న సెగ చేతనే కరగి పోవు లక్కతో పోల్చుటలో అత్యంతౌచిత్యము కలదు. ఇతర పదార్థాలు పెద్ద

1. పోతన చరిత్రము : 1-97

వేడికి కరగగలవు కాని లక్క కొంచెపు వేడికే కరగిపోగలదు. అట్లే లక్కాంబ పరుల దుఃఖమును కొంచెమైనను ఓర్వక వెంటనే జాలిపడి ఆదుకొనునని ఆమె దయాళుత్వము రమణీయమైన యుపమానముచేత వ్యక్తము చేయబడినది. ఇక్కడ పరుల దుఃఖాగ్నికి లక్కాంబ కరగునని రూపకము ప్రదర్శించియు, లక్కవలె కరగునది లక్కాంబ యని సమర్థ చమత్కారము చేసియు నలంకార భావము రమ్యతరము గావింపబడినది. పాతివ్రత్యము, అమాయికత, సాంప్రదాయికత, ఉత్తమ గృహిణీత్వము గల లక్కాంబయెడ ప్రయోగించిన ఇక్కడి యుపమానములన్నియు ఎక్కడినుండియో గ్రహించినవి కాక అందుబాటులోగల శరీరమునకు, గృహమునకు చెందినవే యగుట విశేషము. ఈ పద్యమునందలి యుపమ కవి ప్రౌఢోక్తిచేత సిద్ధించినది.

సింగనృపాల సభాప్రవేశము చేసినప్పటి శ్రీనాథుని వేషభాషలను కనులకు గట్టించుటకా కవిసార్వభౌమునికి సమర్థములైన యుదాత్తోపమానములే గ్రహింపబడినవి. ఇందును అలంకారము కవిప్రౌఢోక్తిసిద్ధమైయున్నది.

> "శ్రీశైల శిఖర సంసృష్ట సంధ్యారాగగతిని కాశ్మీర రాంకవము మేన
> నైరావణకరాప్త హరిశరాసన లీల మణిమయ స్వర్ణకంకణము కేల
> శశధరోభయపార్శ్వ సందీప్తగురుశుక్రక్రియ రత్నకుండల ద్వయము చెవుల
> మేరుగోత్రా ధృత క్షీరవారాన్నిధి ప్రక్రియన్ గౌశేయ పటము కటిని
> పంచశీర్షోరగ ఫణాగ్రభాసమాన మణులనంగ నంగుళీయకమైత్రి వ్రేళ్ళ
> వఱల లక్ష్మీసమర్చిత వాణి యగుచువచ్చె శ్రీనాథుఁ డచటి వారచ్చెరువడ"[1]

శ్రీనాథుని మేనగల కాశ్మీరపు శాలువ శ్రీశైల శిఖరము నావరించిన సంధ్యారాగముతో పోల్చుటలో విశిష్టత కలదు. శ్రీనాథుని విగ్రహము శ్రీశైల శిఖరమువలె సమున్నతమై దర్శనీయమై యున్నదనియు, అట్టి శరీరముపై సంధ్యారాగమువలె అరుణమై స్నిగ్ధస్ఫురణమై విలువైన శాలువ చెలువొందుచున్నదనియు సారస్యము గోచరించుచున్నది. చేత ధరించిన రత్నస్థగిత స్వర్ణకంకణము ఐరావతము తొండమున బట్టిన ఇంద్రధనుస్సు వలె ఉన్నదనగా అతని చేయి సుదృఢమయి సుందరమయి యున్నదనియు ఆ చేతికిగల కాంచన కంకణము నవరత్నములచేత బహువిధ దివ్యదీప్తులను వెదజల్లుచున్నదనియు స్ఫురించును. ఇక చెవులకు గల

1. పోతన చరిత్రము : 4-62

రత్నకుండలములు చంద్రుని కిరుప్రక్కల ప్రకాశించు గురు శుక్ర గ్రహము
నున్నవనగా శ్రీనాథుని ముఖము చంద్రబింబము వలె శోభిల్లగా కుండ
స్ఫుటకాంతిచే మెరయుచున్నట్లు సాక్షాత్కరించును. మరియు కటి భాగ
గప్పిన పట్టుపుట్టము మేరుగిరి చుట్టు వ్యాపించిన పాలసంద్రమువలె నున్న
అతని కటి ప్రదేశము సమున్నతమై యుజ్జ్వలమైయుండ, పట్టుబట్ట తెల్లగా న
మెరయుచు అలలవోలె పింజెలతో కదలాడుచున్నదని తెలియుచున్నది. ప్ర
గల యుంగరాలు ఐదు తలల నాగుబాము పడగల యందలి రత్నాలవలె
వనుటలోని ప్రకాశమాన రూపసామ్యము రమ్యమై యున్నది.'లక్ష్మీ సమర్చిత
యగు శ్రీనాథ కవిసార్వభౌముని రూపాలంకారములను శ్రీశైల శిఖరము,
వతము, ఇంద్రధనుస్సు, చంద్రుడు, గురుడు, శుక్రుడు, మేరువు,
సర్పఫణామణులు అను ఉదాత్తద్రవ్యములచేత నుపమించిచెప్పుట నితాంత ప
మంతమై నెగడుచున్నది.

భాగవతము నపహరించుకొనిపోవుచున్న కన్నడ సైనికుల నెదిర్చి
వీరుడు గర్జించుచు అతిభయంకరమైన తన ఖడ్గమును వర్ణించి చెప్పిన
తదుచితమైన యుపమానము లుపయోగింపబడినవి.

''వల్మీకనిర్యాత వరభుజంగార్భటిన్ గసుబుస్సు లాడెడి యసిని గనె

ఇత్యాదిగా చెప్పిన పద్యములో ఖడ్గము పుట్టనుండి బయటకు వచ్చి
టించు కాలనాగము వలె కస్సు బుస్సులాడుచున్నదనియు, మేఘము నుండి
వడిన మెరపు నాట్యము చేయునట్లాడుచున్నదనియు, జలధినుండి వెలికి
హాలాహల ప్రవాహమువలె కదలాడుచున్నదనియు, పొగలేని హోమాగ్నిజ్వా
నెగయు చున్నదనియు, ఆ ఖడ్గముయొక్క ఘోర మారక స్వరూప స్వభావ
భీకరముగా చెప్పబడినవి. ఇది భయానకరస పోషణ కుపకరించుచున్నది
యలంకారము కవినిబద్ధ పాత్రవాచికము వల్ల సిద్ధించినది.

మోహినీ రూపరేఖావిలాసముల విష్ణుమాయకు లోనై తేరుకొని
కేశవునితో నతని పదభక్తి లేనివాడు మాయావశుడైపోవునని చెప్పినది రమ
పమానములచేత విషయము గమ్యమానమగునట్లు దిగువ విధముగా వర్ణింపబ

1. పోతన చరిత్రము : 9-169

"బడిశామిషార్థమై యెడలేక యాసమై జలములనాడు మత్స్యంబు భాతి
జ్వాలాఫలాశ నాశాలోలుపత నెప్డు చదలునందాడెడి శలభ మట్లు
ఘనలసత్పదవీపతన మొందఁగా మింట మిలమిలలాడెడి మెఱపు కరణి
లక్ష్యసాధనకునై లఘుతనొందుచు నథఃపతనమ్మొనొందెడి బంతిరీతి
ఐహికాస్థిర సుఖలాలసాతురుండు ప్రబలమాయావశుండునై ప్రాణి యెందు
పవనహతిఁ జంచలతనాడు దివియవోలెఁ దెరలు భవదీయపదభక్తి వఱ
లకున్న"[1]

విష్ణుభక్తిలేని ఐహికక్షణిక భోగలాలసుడు మహామాయలోబడి గాలపు ఎరకు ప్రాకులాడు చేపవలె, జ్యోతిఫలమున కెగిరిపడు మిడుతవలె, మేఘమను ఉన్నత పదవినుండి పడిపోయిన మెరపువలె, గమ్యము చేరుటకని తన్నులబడుచు పతనమైపోవు బంతివలె, నరుడయి, గాలి తాకున చలించిపోవు దీపశిఖవలె నశించి పోవునని వర్ణించుటకో వాడిన యుపమాన ద్రవ్యములు సముచితములై విషయావబోధ సమర్థములై యున్నవి.

ఇక ప్రహ్లాదుడు తోడి బాలకులకు తత్త్వోపదేశము చేయుచు
"అల బొమ్మరింట మీరాడి యేఁగెడినట్టు లీ యాత్మ మెయివీడి యేఁగు
నెపుడొ"[2]

అన్న పద్యమునందలి యుపమానములు క్రీడాపరాయణ బాలకోచితములై యున్నవన్న విషయము 'ఔచితీ రామణీయకము' వ్యాసమున వివరించబడెను.

బలరామకృష్ణులు కలిసి బాల్యమున క్రీడించిన దృశ్యములు రమ్యరమ్యోపమలతో అలంకృతములై యిట్లు ప్రదర్శింపబడినవి.

"తెలిదమ్మి మరియు నిందీవరమ్మొకచోటఁ బలు విచ్చి నవ్విన పగిది మెఱసి
యాతత దీప్తియున్ శీతలచ్ఛాయయు వెనువెంట నుఱుకాడు విధము దోఁచి
హీర మసారముల్ చారుకోటీరానఁ బొదిగించి యుంచిన పోల్కి దెల్పి
యరుణోదయప్రభ లసితపర్వతపంక్తి నలమి కొన్నట్టులు దలఁపఁజేసి
మురిసి యీఁదాడు సమయానఁ బరువు లెత్తువేళలన్ వృక్షసీమల
వెలయుతఱిని
నడరి మల్లయుద్ధక్రీడ లాడునప్పు డెందు రామకృష్ణులు కనువిందొనర్త్రు"[3]

---

1. పోతన చరిత్రము : 11-166
2. పోతన చరిత్రము : 11-260
3. ,, ,, : 12-134

ఇందు ఉపమకు తోడు యథాసంఖ్యము చేర్పబడి సుందరతరము కావింపబడినది. ఇక్కడ ప్రయుక్తములైన యుపమానము లుత్కృష్టమైనవేకాక వర్ణించిన తీరును విశిష్టమై యున్నది. బలరాముడు తెల్లనివాడు. కృష్ణుడు నల్లనివాడు. ఇరువురు సోదరులు కలసిమెలసి ఆడి పాడిన విషయములు వర్ణింపబడినవి. నీళ్ళలో ఈదు లాడు నపుడు మొగములు పైకెత్తి సాగిపోవుచుందురు. అట్లు జతగూడి ఈదులాడు రామకృష్ణుల మోములు తెల్లతామర, నల్లకలువ ఒక్కచోట వికసించినట్లు శోభిల్లిన వనుట కడు మనోజ్ఞముగా నున్నది. అట్లే పరువులెత్తునపుడు ఎండ నీడ కూడి యురుకుచున్నట్లున్నవనియు, చెట్లెక్కి నిక్కినపుడు కిరీటమున వజ్రమును నీల మును పొదిగించినట్లు పొల్చెదరనియు, మల్లయుద్ధమొనర్చునప్పు డరుణోదయ కాంతులు కాటుకకొండ నావరించినట్లు అగపడుదురనియు లోకోత్తరముగా ఉప మించి వర్ణించుట జరిగినది.

కృష్ణుడు రుక్మిణిని రాక్షస వివాహమున గొని తెచ్చిన శుభావసరమున ద్వారకా పట్టణమొక పెండ్లికూతురుగ శోభిల్లెనని మంజులోపమానములతో వర్ణించిన విధము మహితముగా నున్నది.

> "అడుగులం బారాణి యలముకొన్నట్టులు పసుపుకుంకుమల కడపల వెలింగె
> తనువున మధుపర్కమును ధరించినయట్లు భవనముల్ వర్ణలేపములఁదనరె
> ఉరమునఁబూసరుల్ మెఱయు చున్నట్టులు రమ్యతోరణముల రచ్చలలరె
> మోముపైఁ బెండిలిబొట్టు వెట్టినయట్లు గోపురకలశముల్ కొమరు మిగిలె
> ధ్వజము లలరె బాసికములు దాల్చినట్లు పురవరమ్మొక పెండ్లికూఁతురుగ
> నలరె
> నపుడు గోధూళికాలగ్నమగుటఁ దెల్పఁ దారకలు ముత్తియపుటక్షతలుగ
> వెలసె."1

ఇచ్చట నగరమునకు చేసిన యలంకారములు పెండ్లికూతురునకు జేయు నలంకార ద్రవ్యములను బోలినవని సముచితోపమానములిచ్చి రాకుమారి రుక్మిణి పెండ్లికి నగరమునకే పెండ్లికళ వచ్చెనని వర్ణించుట శుభమును, శోభను స్ఫురింప జేయుచున్నది.

1. పోతన చరిత్రము : 12-304

ఈ రీతిగా అనేక సందర్భములలో ఉదాత్తములైన బహూపమానములను ప్రయోగించి ఉత్కృష్టముగా సమగ్రముగా వర్ణ్యవస్తు స్వరూప స్వభావములను సువ్యక్తము కావించుట జరిగినది. ఇక పెక్కుతావులందొకటి రెండు ఉపమానము లిచ్చి కవితాంగనా సౌందర్యము నినుమడింప జేసినవి కొల్లలుగా తిలకింపవచ్చును.

కాపు పోచయ్య పోయిన పొలాలవద్దకు పోతన పోయినప్పటి రాత్రిని వర్ణించుచు

"చీఁకునఁగల జీవమ్మటు మైకపువలఁ జిక్కుపడిన మానవునట్టుల్
వేఁకటి నొదిగిన శిశువటుఁ జీఁకటిలోఁ బడుచు నిదురఁజెందెను జగముల్"[1]

అని చెప్పబడినది. నిద్రజెందిన జగముల స్థితిని దెలుపుట కీయబడిన యుపమానములు గంభీరములై యున్నవి. 'చీఁకునఁగల జీవమ్మటు' అనుటచే ప్రాణముండియు గ్రుడ్డివాడేమియు చేయజాలకుండును. నిద్రగొన్నవారును అంతే. మత్తులో నున్నవాని గతియు, గర్భస్థశిశువు స్థితియు నంతే ఈ రీతిగా సార్థక సమంజసోపమలు ప్రయోగించి విషయమును హృదయంగమ మొనర్చిన సొబగు కావ్యమున సర్వత్రగాననగును.

గజేంద్రుని పట్టుకొన్న మొసలి భయదరూపచేష్టలిట్లు వర్ణింపబడినవి.

"చుఱకత్తులఁబోల్ దంష్ట్రలు వరక్రకచముఁ గేరు పల్లువరుసల మధ్యన్
కఱకాకుఱాయియైన మకరినాలుక నారకపు ముఖద్వారమనన్''[2]

"ఆస్యవివరమందు నగ్గికుంపటిలోని మంటలట్లు మెఱయు మకరినాల్క
దారుసన్నిభంబు దంతావళపదంబు నంటుకొనియె మేనమంటలెక్క.''[3]

మొసలి నోటిలోని కోరలు చుఱకత్తులవలె పండ్లు వరుసలు రంపాలవలె నాలుక కఱకాకుఱాయివలె నుండి దానినోరు నరక ముఖద్వారమువలె నున్నదని చెప్పుట మిక్కిలి సమర్థనీయమైనది. నరకములో పాపుల శిక్షకు చుఱకత్తులు రంపాలు మున్నగు మారణాయుధాలుండును. అట్లే మొసలి పట్టుకొనుట యన

1. పోతన చరిత్రము : 5-162
2. ,, : 12-22
3. ,, : 12-23

నరకమున బడుటయే. ఇక మకరి ముఖరంధ్రమున అగ్గికుంపటిలోని మంటలవలె మెరయు నాలుక మొద్దువంటి ఏనుగు పాదమును ఒడలెల్ల మంటలెక్కగా అంటుకొనెనట. ఆహా! ఎంత విశిష్టముగా నున్నది యిచట ఉపమ! మొసలి నోటిలో ఎఱ్ఱని నాలుక కేరగా కుంపటిలో మంటలెగయు చున్నట్లున్నది. కఱ్ఱ కొకచోట మంట లంటుకొని తక్కిన భాగమెల్ల తగులబడి పోవును. ఇందు ఏనుగు పాదము కఱ్ఱమొద్దు. దానికి మొసలి నాలుక మంటలంటుకొనగా శరీరమెల్ల మంటలెక్కినవి. మంటలనగా అగ్నిజ్వాలలు, వ్యథలు, కావున ఇక్కడ మంటలెక్కుట యన్నది అర్థద్వయశోభితమై ఆభీల మకరపీడ లెంత దారుణమైనవో యీ యుపమాలంకృతి చేత విస్పష్టముగా అవగాహన యగుచున్నది.

దురవగాహములగు తాత్త్విక విషయముల నరటిపండొలిచి యందించునట్లు తేటపరచుటకు ప్రయోగించిన యుపమానములను దిగువ పద్యములందు గాంచ నగును.

"సుత్తియ తప్తలోహమున సూదిమొదల్ గునపమ్ము రూపులన్
మొత్తము నామరూపచయ మూలక మౌచును వానిఁ గూడి కిం
చిత్తును దాను మారనటు చిత్తు పిపీలి మొదల్ విధాతయౌ
మొత్తము సృష్టి వృద్ధి లయ మూలకమై యవికారియై మనున్"[1]

"కాంతిలేక వర్ణంబుండి కనఁబడనటు గాలిలేని శబ్దము వినఁగలుగమి నటు
లవని దైవేచ్ఛలేమి మానవుని యత్నమింతయును గూడ ఫలియింప
దెయ్యెడలను."[2]

"ఇంద్రియ ప్రతతుల నెయ్యది నొచ్చిన నేని దాని బాధనాని యేడ్చు
మనము వోలె నతఁడు తన ప్రజల్ వొందెడి వెతలనెల్ల ననుభవించువాఁడు"[3]

"జన్మమిచ్చినట్టి జనకుఁడీతండని జనని సూపుభంగి సద్గురుండు
పరమపదవి నొసఁగు భగవానుఁడితఁడని తెలుపకున్నఁ దెలియఁగలమె."[4]

"దుష్టకర్మ నరక దుర్గతి నొందించుఁ బుణ్యకర్మ స్వర్గభూతి నొసఁగు
వానిరెంటి విడుము పంకమున్ జలమును నంటకుండ వెడలు నబ్జమటులు"[5]

1. పోతన చరిత్రము : 6-53
2. ,, ,, : 9-107
3. ,, ,, : 9-130
4. ,, ,, : 2-34
5. ,, ,, : 10-95

"సరససౌందర్య సౌరభ్య సౌకుమార్య సంపదన్విత చూతఫలమ్ము తాను
ఫలదశను గాంచె సుమనోజ్ఞ కళలఁగూడి యధిగత ప్రయోజన
సుకావ్యమ్ము వోలె" (3-258)

"తపము మాట తిరిగి తల యెత్తనే లేక మాటుమడఁగె వెడలు మాట
లుడిగెఁ
బాలకునకు మరగి పంజరబంధమ్మె సుఖమటంచు నెంచు శుకము భాతి."
(3-291)

"కవియై పుట్టిన పోతన వివిధ విషయగతుల కైత వెదకుచుఁ బోవున్
భువిఁ బిరుగులాడు గౌతమి సువిదితదతి జలధిజాడఁ జూచుకొనుగతిన్."
(3-294)

"జ్ఞానవంతుఁడైన కవినాథు శ్రీనాథు నాక్రమించి దుఃఖ మజ్ఞుఁ జేసెఁ
దాళపత్రమందుఁ దనరు నక్షరమును క్షరమొనర్చు చెదల పురువుభంగి"
(3-304)

"(శ్రీనాథుని) వెనువెంటఁ దాను పోతనయు వచ్చెఁ గర్మవెనుకనె
జ్ఞానమ్ము గాలు కరణి" (4-63)

"ఆడుబిడ్డ దేహ మమ్ముకొనెడునట్లు కృతుల నమ్ముకొనుటె బ్రతుకుఁ
దెరువు." (4-350)

"మును జన నన్నుమించి చను ముఖ్యుఁడవా యను నొక్కయెద్దు వె
న్కనిడిన నీవు పట్టి కొఱగాని జడుండ వటంచుఁ దిట్టుఁ బ్ర
క్క నడచినంత నా సమముగాఁ జన నర్హుఁడ వౌదువే యనున్
గన నెటువోయినన్ శ్రమయె క్ష్మాపతి పల్లెరుకాయ చాడ్పునన్."(4-395)

"శ్రీరామాకృతి సీతాభామిని సొమ్మగుట నిట్టి భాగవతకృతిన్
మామక కృష్ణాకృతిఁ గొను సోమస్థితి నిశిని బొందు సూర్యార్చివలెన్."
(6-109)

"అంధ తమసమందు నగ్నికీలలు దీప్తిఁజెందినటులు సుకవి చిత్తసీమ
నోటు వడుట వలన నుదయించు తామసవృత్తియందు నీర్ష్య పెచ్చు పెరిగె."
(8-34)

"మేఘమందు మెఱయు మించుదీవియఁబోలి కాచపాత్ర దీపకళిక వోలె
వెల్లమబ్బులందు వెలుఁగు సుధాంశువై యద్దముల సవారియందుఁ జెలఁగి"
(జ్యోతిపుర రాజ్ఞి) (8-74)

"నాకితం దనుకూలుఁడంచు ఖలు సన్మానించు జేఁడట్టివాఁ
డా కాలంబున నా ప్రదేశమున దీపార్చిః క్రియన్వెల్గు, నై
జాకీర్ణ ప్రతిభావిభాసితుఁడు తానై వెల్గు మార్తాండున
ట్లే కాలమ్మున కే ప్రదేశమున కెందీ విశ్వవిశ్వంభరన్."      (8-190)

"పొలపుఁ గట్టె తా గొడ్డలి పొట్టజొచ్చి కులపుఁ గట్టెల నన్నింటి గూల్చినట్లు
హైందవుండె తౌరుక్యుని యండఁజేరి జాతి విద్రోహచర్యలు సల్పెనిటులు."
(8-251)

"వనతరు లట్టు సత్కళలు వర్ధిలఁగావలెఁగాని రాజ పో
షణ మను కృత్రిమాద్యృతికి సొంతము స్వేచ్ఛను విక్రయించి వా
రనునటు లాడి యోపవని యందలి తొట్ల నెసంగు చెట్లనం
దనరి జలమ్ము వోయని దినాలఁ గృశించి నశింప జెల్లునే."   (8-264)

"మను దాసుల యఘతతి విషమును వలె దిగమ్రింగి సుకృతపున్
లవమును గ్రొ
త్తనెలం బలె నౌదలనిడి తన కొమరుని లీల నేలు దైవము నెంతున్."
(9-20)

"రాజ పోషణమున రాణించు సత్కళ లబ్ధకాయమాన లతగవెల్గు
ప్రభుని పోషణమ్ము బడయని సత్కళల్ విధవ వయసువోలె వితగఁ నేగు.
(శ్రీనాథుడు పోతనతో) (10-8)

"సురవంటిది యైహికసుఖ మరయన్ సుధవంటి దెందు నాముష్మిక సౌ
ఖ్యరమ యని కూర్మరూపత హరి తెల్పెను రెంటిలోని యంతరమెంతో."
(11-113)

"జవ్వని తొట్రిలం బదము శల్య విబాధితనంచు నార్తయై
పువ్వుల కుప్పవోలె వనభూమిని గూలెను" (మోహిని)   (11-136)

''నేనె విడిచిన సీగుడి నేలఁ గూలు నెట్టులను గబ్బిలము బండపట్టు వోలె
ధరణి భరమెల్ల నాపైన నౌరగు ననుచు భావన మొనర్చి యారాటపడు
నరుండు'' (11-265)

"కరికరేణుగుణము లిరులట్లు తను జుట్టఁ గేలి సల్పెనా విశాల సరసి
లిజలము లందుఁదేవి జనవాగ్విరుద్ధతఁ బర్వతమ్ము లీఁదు పగిదిఁదోచె.
(12-

"జలదమందుఁ జిక్కు సౌదామినీలత కరణిఁ దరుణి మెఱసె హరియెడ
బసిఁడిలోనఁ గట్టుపడిన నీలము భాతిఁ జెలువయెడఁద శౌరి చిక్కువడె
(12-2

ఇట్టివే చెన్నైన యుపమలు కావ్యమున నింకెన్నియో అలరారుచున్నవి

## రూపకము :

కావ్యమున ఉపమ తర్వాత గణనీయమైనది రూపకము. రూపకము
కించిదూనముగా ఉపమలన్ని యిందు ప్రయుక్తమైనవి. ఉపమానోపమేయ
అభేదము చేత ఉపమేయమునం దుపమాన మారోపింప బడిన రూపకమగును.

"ఉపమానేన యత్తత్త్వ ముపమేయస్య రూప్యతే
గుణానాం సమతాం దృష్ట్వా రూపకం నామ తద్విదుః"[1]

అని భామహుఁడు నిర్వచించెను. అనగా గుణసామ్యమును దృష్టియం దిడ
ఉపమేయమునం దుపమానము నిరూపింపబడినచో అది రూపకము. 'రూప
రూపకం' 'రూపారోపాత్తు రూపకం' అనియు రూపము యొక్క ఆరో
రూపకమని ఉల్లేఖింపబడినది. నాటకములందు నటులు రామాదిరూపములు
రూపకము ప్రదర్శించునట్లే ఇందు ఉపమేయ ముపమాన రూపము దాల్చి రూ
సామాజిక మనోరంజనము కావించుచుండును. పోతన చరిత్రమున సా
పరంపరిత రూపకములు నాటకములవలెను నిరవయవ రూపకములు నాటికల
ప్రదర్శితములై రక్తి కట్టించుచున్నవి.ఇవియును ఉపమలవలెనే వర్ణ్యవస్తు స్వ
స్వభావ నిరూపణమునకును గూఢతత్త్వ విషయావబోధనమునకును రస
స్ఫూర్తికిని ప్రయుక్తములై కావ్యసుందరిని కమనీయముగా కైసేసి యున్న

1. కావ్యాలంకారము : 2-21

## సావయవ రూపకములు :

భాగవత మపహరించుకొని పోవు కన్నడిగులతో తెలుగు వీరులు చేసిన యుద్ధము దిగువ రీతిగా వర్ణింపబడినది.

"స్రామొప్ప నడిదముల్ శంపాలతలు గాఁగ నెగయు పరాగముల్
మొగిలు గాఁగ
వీరాట్టహాస విభీషణారావముల్ పర్జన్య గర్జాప్తిఁ బరిఢవిల్ల
వడిఁ జిమ్ము నెత్తురుల్ వర్షధారలు గాఁగఁ గఱకు టమ్ములు
వడగండ్లు గాఁగ
వరదలై వాహినుల్ పరువు లెత్తుచు నుండ ప్రామఁకులై శత్రులు
మహినిఁ గూల
కనడిగుల తోడఁ దలపడి తెనుఁగు వీరు లాపహము చేయుటం
బ్రావృడాగమనపుఁ
దరుణ మేపారె నరిగ్రీష్మ తాప మెడలెఁ దెనుఁగు భువిభాగవతలక్ష్మి
దీప్తి నొందె"[1]

ఇందు కన్నడిగుల నెదిరించి తెలుగు వీరు లొనర్చిన సంగ్రామము వస్తువు. ఈ సంగ్రామము నందు వర్షారంభ మారోపింపబడినది. ఇది సావయవముగా నిర్వహింపబడిన రూపకము. ఈ యుద్ధమునకు ఫలము శత్రువు లోడిపోయి భాగవతము విముక్తమగుట. దీనిని సాక్షాత్కరింప జేయుటకు యుద్ధ వర్షము కురిసి శత్రు గ్రీష్మ తాపముడిగి తెలుగు నేల భాగవతలక్ష్మి ప్రకాశించెనని వచింపబడినది. దీనికి తదవయవము లగు ఖడ్గములను మెఱపులు, పరాగములను మేఘములు మన్నగునవెల్ల పరిఢవిల్లినట్లు వర్ణింపబడినది. ఈ రూపకములోని యుపమాన ద్రవ్యములు మిక్కిలి సమంజసములై భీకరముగా జరిగిన యుద్ధమును సాక్షాత్కరింపజేసి వీరరస స్ఫూర్తి చెలగి మిక్కిలి యింపు నింపుచున్నవి. ఇట్టి సావయవ రూపకము లనేకములు కావ్యమున శోభిల్లుచున్నవి.

పోతన సతితో పొలాలనుండి యింటికి వచ్చి విరహతప్తుడై మనశ్శాంతికి గృహారామము చేరి లతలను తిలకించుచుండ సర్వము శృంగారమయమై కనబడిన సందర్భమున దిగువ పద్యము చెప్పబడినది.

1. పోతన చరిత్రము : 9-176.

"రజనీ యవనికాంతరస్థయై స్వర్ణదీ వారి శీకరముల బోరుకాడి
విమల ప్రభాతాచ్ఛ వేళావసరముల జిలిబిలి ముత్యాల చీరఁగట్టి
అతిలోక నిజమనోహర రూపలతలలోఁ గుసుమాభరణశోభఁ గుస్తరించి
మలయానిలోద్ధూత మంజుల కింజల్క రమ్య పరాగాంగ రాగ మలమి
తీవ కన్నియ యలరు వాతావరణము నరసి తరురాజు శాఖాకరాళిఁ
బిలుచుఁ
దలను వ్రాల్చి సిగ్గుపడు లతాకుమారి తమి గలిగి యొండొరుల నేల
దరియలేరొ."[1]

దీనిలో బాగైన తీగను చెట్టు తన కొమ్మలు కదలించి పిలువగా ఆ తీగ తలవంచి సిగ్గుపడిన విషయము వర్ణింపబడినది. తీగ యందు బాలికాత్వము తరువునందు రాజత్వ మారోపింపబడినది. ఆ తీవకన్నియ స్నానాదికములు నిర్వర్తించుకొని శిస్తుగా ముస్తాబైన విషయము, దాని సొబగు చూచి మనసు పడి తరురాజు శాఖా కరములతో పిల్వగా అది సిగ్గుచేత తలవంచుకొన్న విషయము మిగుల సొగసుగా వర్ణింపబడినది. ఇది విరహార్తి గుందు పోతన కుద్దీపన విభావమై శృంగార రసోత్కర్ష హేతువై ఔచిత్య భాసురమై యున్నది.

ఇట్టిదే మరొక పద్యము శ్రీనాథుడు సింగ నృపతి వన వర్ణనలో చెప్పినది యొప్పినది. "నెలరాజున్ వలపింపఁగా సురనదిన్ నీరాడి....''[2] అను పద్యమున మబ్బుకన్నియలు నెలరాజును వలపించుటకు రమ్యముగా అలంకరించుకొన్న విషయము లోకోత్తరముగా వర్ణింపబడినది. ఇది శృంగారప్రియుడగు శ్రీనాథుని చిత్తవృత్తి కనుగుణముగా వర్ణితమై సమంజసమై యున్నది.

వరికోతలై బీటలు వారిన పొలమును గాంచి శ్రీనాథు డాశువుగా దిగువ పద్యము చెప్పెను.

"ధాత్రియై సస్య సంతానమ్ము నొడిగట్టి జీవనస్తన్యమ్ముఁ జేపి కుడిపి
లలిఁగాడ్పు తూఁగు టుయ్యేలలోన నిడి యూఁపి పులుఁగుల
జోలపాటల నలర్చి

1. పోతన చరిత్రము : 3-213.
2. ,, : 4-113.

వెలిచట్ల గడ్డి బొమ్మల గోవుపుత్త్రెలఁ బెనుగూర్మితో నాడుకొనుట కిచ్చి
పుట్టుటాదిగ నెందుఁ బోనీక తలఁదాల్చి దినమొక్క చాయగాఁ బెనిచి యింట
నాడుబిడ్డను రైతున కప్పగించె బండిపై నిడి కొనిపోవు చుండె నతఁడు
సాగ నంపఁగాఁ గ్రాలాక చదికిలఁబడి యిల నెఱియ వాయుఁ గడుపు
చెక్కలగు ననిన"[1]

ఈ పద్యమున భూమి తనలో పెంచిన పంటను రైతు కొంపోయిన విష యము వస్తువు. ఇచట భూమియందు మాతృత్వము, సస్యము నందు సంతానత్వ మారోపితమై సావయవముగా రూపకము నిర్వహింప బడినది. భూమాత సస్య సంతానమును జీవనస్తన్య మిచ్చి గారాబముగా పెంచి పెద్దచేసిన విషయము ముద్దు ముద్దుగా ఔపమ్య రమ్యముగా వర్ణించుట జరిగినది. పోతనకు బమ్మెర పరిసర క్షేత్రములలో శ్రీనాథుడు తొలిసారి కలిసినప్పుడు కృషి ప్రధానమగు గ్రామ సీమలో సస్యవర్ణన చేయుట ప్రస్తుతౌచిత్యశోభితమై యున్నది. అంతే కాక శ్రీనాథుడు తన చెల్లెలిని మునుముందు పోతన కీయగా కలిగెడు వేదన ధ్వనించు నట్లు సందర్భశుద్ధిగా రూపించి చెప్పబడినది. ఆచార్యులవారు 'ప్రకృతి మన కెల్ల రకు మాత' ఇత్యాదిగా వ్రాసి ప్రకృతిని భూమిని తల్లిగా, లోకమును భవనముగా విశ్వవిశాల భావనలు వెలిబుచ్చిన విషయము మహాప్రశ స్తమైనది. సాహిత్యదర్పణ కారుడు ప్రతిపాదించిన వత్సలరసమున కిచటి యలంకారము స్ఫూర్తికలిగించినది. ఇట్టి వత్సలరస విస్ఫూర్తికి

"రవి సోములనెడి నేత్రము లొప్ప మన నెప్పుడొక కంటఁ గాంచుచు నుండు
నామె....
మహి యనెడి స్వీయ వక్షోజమండలమున నూరు జీవనమ్ములఁ బాలు
ధారవోసి
యడిగినవి యెల్ల నొసఁగి యీ యఖిల భూత సంతతిని రొమ్మునకుఁ గట్టి
సాకుఁ బ్రకృతి"[2]

అను పద్యము హృద్యోదాహరణము. ఇదియును సావయవముగా చెలువొందుచున్న రూపకము.

1. పోతన చరిత్రము : 2-162
2. పోతన చరిత్రము : 1-183

గహనతాత్త్విక విషయ వైశద్యమునకు చక్కని రూపకములు పెక్కు కావ్యమున సాక్షాత్కరించుచున్నవి. చిదానందయోగి పోతన సంశయవిచ్ఛేదము చేయుచు నిట్లు పలికెను.

"ధర్మము దారి, దేహ మరదమ్ము, దశేంద్రియముల్ ధురీణముల్,
శర్మద మోక్షమాలయము, సారథి రూపుఁడు బుద్ధి, యాత్మయే
కర్మగుఁడైన యాత్రికుఁడు, కామము నర్థముఁ బాట ప్రక్కచేల్,
దుర్మద దూషితంబులయి దూఱు వృషంబులు ప్రక్కచేలలో"[1]

ఇందు జీవుడు మోక్షము నందవలెనన్న విషయము వస్తువు. అతి సూక్ష్మమై జటిలమైన దీనిని తేటగా మనస్సున పట్టించుటకు సావయవరూపక మాశ్రయించి జీవుడుఁ (ఆత్మ) యాత్రికుడై ధర్మమను దారిలో శరీర రథములో సాగిపోయి మోక్షాలయము చేరవలయునని తదుపస్కారకములుగా ఇంద్రియాదులను ధురీణాదులచేత రూపించి సమర్థముగా సమంజసముగా నిర్వహించుట జరిగినది. ఇట్టి రూపకమువల్ల అవలీలగా మనుష్యుడు బుద్ధీంద్రియాదుల స్వరూప స్వభావములను లెస్సగా అర్థము చేసికొని తరించుట కవకాశము కలుగును.

పోతన భాగవత మోక్షప్రదత్వము నిరూపింప పరీక్షిన్మహారాజు కథ చెప్పుచు అందు శుకుడారాజుకు తత్త్వోపదేశము చేయుచు నిట్లువచించినట్లు వ్రాసెను

"నాస్తికత్వ మమావాస్య నాఁటి రేయి, ద్వైతగతి శశి తారకోపేత నభము
నిర్మలాద్వైత భావమ్ము శర్మదమగు సవితఁ గూడి ప్రకాశించు దివము
సుమ్ము"[2]

ఇందు నాస్తికత, ఆస్తికతలోని ద్వైతాద్వైతముల స్వరూపము రూపకమున మనోజ్ఞముగా ప్రదర్శింపబడినవి. నాస్తికత అమావాస్యరాత్రి అనుటలో అది అజ్ఞానాంధకారభరితమై యే దేవుడు లేడను భావముదయించు ననియు, ద్వైత సిద్ధాంతము శశి తారలతో ఆకాశ మనుటచే అల్పజ్ఞానకాంతిలో జీవుడు దేవుడు వేరను నానాత్వభ్రాంతి చెలగునని యు, అద్వైత భావము సూర్యుని గూడి ప్రకాశించు దివ మనుటచేత దివ్యజ్ఞాన ప్రకాశములో ఒకే సూర్యుడు కనబడునట్లు శాశ్వతాఖండ

1. పోతన చరిత్రము : 6-60
2. పోతన చరిత్రము : 10-116

సత్యము సర్వ మీశ్వరమయమన్నది గోచరించుననియు స్పష్టముగా విశిష్టముగా తత్త్వ మవబోధమగును.

గజేంద్రుడు మకరపీడితుడై మొరపెట్టినప్పటి 'అఘమూలంబయి కర్మ కాండమయి'[1] అన్న పద్యమున భవమునందు నీపవృక్షత్వ మారోపించి ఆ భవ నీపాగ్రమునుండి ఘనాపజ్జలధిన్ మునిగిన దుర్గతి పర్ణింపబడి సముద్ధరణకు ప్రార్థన కావింపబడినది. ఇందు భవస్వరూప స్వభావములు లెస్సగా విశదీకరింపబడి జీవుని యార్తిని హృద్గతము చేయుచున్నవి.

"రసరూపుఁడు నారాయణుఁ డసదృశ విజ్ఞానవహ్ని నావిరియై భ
క్తిసరిత్సాగరహిమమై మసలున్ నిర్గుణత సగుణ మహితాకృతులన్."[2]

ఇది చిదానందుడు పోతనకు పరమాత్మను గురించి ప్రబోధించునపుడన్నది. పరమాత్ముడు నిర్గుణుడై నిరాకారుడై యుండి సగుణుడు సాకారుడగుట యెట్లు పొసగునో పరస్పర విరుద్ధముగా తోచు గహన తాత్త్విక విషయము. దీనిని సుగమము చేయుటకు రూపక మాశ్రయింపబడినది. నారాయణుని యందు రసత్వ మారోపింపబడినది. నారాయణుడను రసము జ్ఞానాగ్నిచేత ఆవిరియై నిరాకార మగును. భక్తి సరిత్తుచేత సాగరహిమమై నానాకారములు దాల్చి పొల్చును. అనగా పరమాత్మని జ్ఞానమార్గముచేత నిర్గుణ బ్రహ్మముగా భక్తిమార్గమున సగుణ బ్రహ్మముగా నుపాసించుటకు వీలుకలదని చెప్పి పరస్పర వైరుధ్యము పరిహరింప బడినది. ఇట్లే అనేక సందర్భాలలో దురవగాహములైన తత్త్వవిషయములు రూపకములలో హృదయంగమముగా దర్శనీయములై యున్నవి.

కావ్యమున రూపకములు తరచుగా సావయవములుగనే యలంకృతములై యున్నవి. మిగుల సొగసైన సావయవరూపకములలో కొన్నిటిని దిగువ పద్యములలో తిలకింప వచ్చును.

''రంభలు రామచిల్కలయి రక్తిని నాట్యము లాడుచుండ....''[3]

1. పోతన చరిత్రము : 12-45
2. ,, : 2-30
3. ,, : 1-168

అన్న దానిలో కేసన పోతనలోని కవితాత్మ బయల్పడు నటుల మావితోటను వర్ణించుచు శుకపికాదులలో రంభాదుల నారోపించి రసాలసాల మను ఒంటి స్తంభపు మేడలో గానపరిషత్తును ఖేచరులు రచించినట్లు రమ్యముగా వర్ణించుట జరిగినది.

"మణిభూషణోపేత మహిత బంధు వ్రాత మమలరత్నాకరంబగుచు నెగడ"[1]

అను పద్యమున వివాహవేళ పోతనయందు నారాయణత్వమారోపించి బంధుజనము పాలసముద్రము కాగా నర్సమాంబ యను లక్ష్మి యతనిని చేపట్ట సమీపించిన విషయము మహోదాత్తముగా మధుర మంజులముగా వర్ణితమైనది.

''త్రయ్యంతసారామృత సరోవర స్వర్ణసరసీరుహమ్ములే చరణయుగళి"[2]

ఇందు నర్సమాంబ కొలిచిన దుర్గామహాదేవి కరచరణాద్యంగకములు వేదాంతాది విలసితములని దివ్యముగా భవ్యముగా రూపించి జగజ్జననీ మహామహిమ సమ్యఙ్నిరూపితమై యున్నది. అట్లే "నడయాడున్ భవదీయ కాయమయి సౌందర్యార్ణవంబు...."[3] అన్నదానిలో ఆ లలితాదేవి దివ్యసౌందర్యము సాక్షాత్కరింప జేయబడినది.

"మణిదీప రూపేందుమండల ప్రభ విశ్వ ఘనసౌధమునఁ బాలగచ్చొనర్చె"[4]

ఇందు పోతన వివశుడై పొలముతలమున సతితో క్రీడింపనెంచగా ప్రాకృతికముగా రాత్రి ఆ ప్రదేశము నేకాంతమందిర మొనర్చి శోభన ద్రవ్యములనెల్ల సమకూర్చినట్లు సహజ రమణీయ రూపకము నిర్మింపబడినది.

''ఆ వనజాక్షి నూత్నప్రణయాంకురముల్ వరరాగవృష్టిలో....''[5]

అను దానిలో పోతన సతి నూతన ప్రేమలో లతాత్వమారోపింపబడి ఫలశ్రీ విభవోన్ముఖమైన విషయము మనోహరముగా వర్ణింపబడినది.

''కలహంస ధ్వనితో సుధాస్మిత లసత్కంజాస్య బింబమ్ముతో...."[6]

1. పోతన చరిత్రము · 2-248
2. ,, : 3-130
3. ,, : 3-131
4. ,, : 3-186
5. ,, : 3-246
6. ,, : 4-127

పోతన స్వీయ చిత్తవృత్తి కనుగుణముగా సింగన్నృపతి వనవర్ణన చేసినప్పటి సరోవరము విబుధులను (పండితులను, వేలుపులను) అర్ఘ్యపాద్యాదులతో పూజించు విషయ మిందు రమ్యరూపకమున ప్రదర్శింపబడినది.

ఇట్టే దిగువ పద్యములలో కమనీయ రూపకములు సావయవ శోభితములై చెలువొందుచున్నవి.

"కడు సున్నితంబైన యొడలంచు నే ప్రొద్దు నెండకన్నెఱుఁగనీకుండ సాఁకు" (5-27)

"కొమ్మలు చామరమ్ము లిరుగోనల వీచుచు నుండి...." (5-52)

"అలివేణి మత్తకోకిల వాణి చూతపల్లవపాణి సకల ఋతువుల రాణి"(6-7)

"హాలికు నుదుటిపైనలరుఁ జెమ్మటజాలు పాలకు నుదుట ముత్యాల చాలు" (8-18)

"నవరస సాగరాశికి ఘనమ్మగు కాల్వలు దోఁడి" (8-100)

"పర్వతమ్ములుగాఁగ బడుగు బండల గుండ్లఁబనివడి యెవఁడు కుప్పలుగఁ బోసె" (8-169)

"అరయఁగా నేను విద్యాస్వరూపిణిని బ్రోద్యద్బ్రహ్మ విద్య నా యాత్మ యెందు" (9-54)

"బెట్టిదులైన కన్నడిగ భీషణవైరుల శీర్షపంక్తులన్ గొట్టెద'' (9-170)

"సౌందర్యార్ణవ దుగ్ధమున్ స్మరసుమాస్త్రవ్రాతముల్ బిట్టు'' (9-250)

"మెఱుఁగు వాకిళలను మేఘమండలముల ముగ్గు విద్యుల్లతల్ మురిసి యాడ'' (9-346)

"నీలాబ్దములు కేశజాలమ్ములై యొప్ప సకల దిఙ్ముఖము లాస్యమ్ము లెసఁగ" (10-115)

"నిశి పొగయై దిశాతతుల నిండఁగఁ దారలు విస్ఫులింగరూపశతములై'' (11-130)

"కరవిభ్రాజిత పాంచజన్య ఘనశంఖస్వాన గర్జాకృతిన్" (12-82)

"శీర్షావతంసితశిఖిపింఛదీప్తులన్ హరిశరాసనశోభ దరుల విరియ" (12-206)

"రథము మందరముగ" (12-300)

ఇట్టివే యింకెన్నియో సావయవ రూపకములు కావ్యమును సింగారించి యున్నవి.

## నిరవయవ రూపకములు :

కావ్యమున నిరవయవరూపకము లందందు కొన్ని మాత్రము ప్రయుక్తములై యున్నవి. మచ్చున కొండు రెండు పేర్కొందును.

మేఘములు గ్రమ్మి మెరయుచున్న మెరపిటుల వర్ణింపబడినది.

"ఎప్పుడొకయింత యెండ కన్నెఱుఁగనట్టి మెఱపుదొరసాని మబ్బుల
కురులలోన

సింగిణియును దానొకవంక రంగులీను పూలదండఁ గీలించె నందాలు
గులుక"[1]

మెరపును దొరసానిగా రూపించి చెప్పిన యీ రూపక మెంత సొగసులు గులుకుచున్నది! మబ్బులు మార్తాండ బింబమును మాటుపరచియే మెరయును. కనుకనే యెన్నడును ఏ మాత్ర మెండకన్నెరుగనిదా అతిసుకుమారి మెరపు దొరసాని. ఆ రాణి మబ్బుల కురులలో సింగిణిని రంగుల పూలదండగా హంగుగా అలంకరించుకొన్నదట. రసమయ కళాదృష్టిగల సుకవులకే యిట్టి భావన యిట్టి యలంకార ప్రయోగ చాతుర్యము సాధ్యపడును.

తన్ను బెదరించు కన్నడ చమూపతిలో పోతన నిర్భయముగా రాజుల దుర్నీతి నధిక్షేపించుచు నిట్లనెను.

''ధర్మగుణ జపమ్మొనరించు ధరణిపాలు నాలుకయె యెఱగప్పిన గాల
మెపుడు

మేదినిన్ రాజకీయమ్మ మేడిపండు ప్రభువులకు స్వార్థరుజ తలఁ
బరఁగుచుండు"[2]

రాజులెన్ని సూక్తులు వల్లించినను కపటాత్ములై క్రౌర్యాచరణ గావింతురనునది వారి నాలుక యెరగప్పిన గాలమని రూపించి చెప్పబడినది. అట్లే 'రాజకీయము మేడిపండు' అని చెప్పుటలో మీదికెంత గొప్పగా గనబడినను లోపల అంతయు కుళ్లు అని చప్పున అవగతము కాగలదు. రాజులకు స్వార్థము మిక్కుట

1. పోతన చరిత్రము : 3-112
2. పోతన చరిత్రము : 9-140

మన్నది స్వార్థరోగము తలలో నిండి యుండుననుటచేత సులభ గమ్యమాన మగుచున్నది. ఇట్టి నిరవయవ రూపకములు గల పద్యములు మరికొన్ని యుదాహరింతును.

పోతన దంపతులు అనుకోకుండ పరస్పర మవలోకించిన దానిని

"దృగ్యుగళిన్ బెనఁగొని యాడెను మీన మిథునములు ప్రణయ ప్రవాహతోయోద్ధతిలో"[1] అని మనోజ్ఞముగా వర్ణించుట జరిగినది.

"ఒక్క రయితు హృదిఁ దళుకు తళుక్కను నాశాలతా విలోకద్యుతులై
యొక్కొకతఱి వినువీథిని ఛక్కు మనుచు మెఱసి యాడు
శంపాకాంతిన్."[2]

అని రాత్రి కాపు పోచయ్యకు పొలాలవద్ద మెరపు లాశాలతలై తోచినవనుట సమంజసముగా నున్నది.

పల్లెపడుచులు కలుపుదీయ బోవునపుడు వారు ధరించిన కొడవళ్ల గురించి "కొడవళ్ళు తాము పల్లెపడుచుల మూఁపుల పల్లకీల నెక్కివచ్చె"[3] ననుట రమ్యముగా నున్నది.

భాగవత మపహరించి కన్నడిగులుపోగా ప్రజలెల్ల చిత్తరువులవలె నిశ్చేష్టులై యుండగా పోతన మాట్లాడుట

"రేకెత్తిన మౌనవ్రత ఘన భిత్తిక భంజించి సుకవి వెండి నిటాడెన్"[4] అనుట విశిష్టముగా నున్నది.

దొంగ సన్న్యాసపు వేషముతో సీతాపహరణమునకు వచ్చిన రావణుని "మృదుహాసము మైనములోని కత్తియై"[5] భాసించిన దనుట యుక్తముగా నున్నది. ఇట్టివే నిరవయవ రూపకము లింకను కావ్యమును రక్తి కట్టించుచున్నవి.

1. పోతన చరిత్రము : 3-74
2. పోతన చరిత్రము : 5-166
3. ,, : 3-103
4. ,, : 9-149
5. ,, : 11-58

## పరంపరిత రూపకములు :

సందర్భానుసారముగా కొన్ని పరంపరిత రూపకములును ప్రయోగింపబడి కావ్యసుందరికి వన్నెలు చిన్నెలు సవరింపబడియున్నవి.

పోతన భాగవతాంధ్రీకరణారంభము చేసినప్పటి వసంతర్తు వర్ణన దిగువ రీతిగా చేయబడినది.

"లక్షవత్తుల దీపవృక్షదీధితుల హారతులిచ్చెఁ గింశుకప్రసవ వనిత
మధుపూర్ణచషక సంపన్నహస్తాబ్జయై నెమ్మిఁ గాంచెను బద్మినీలతాంగి
మంజుల ధవళ చామరపుంజపాణియై విసరసాగె శిరీషకుసుమయోష
చివురుకేలెత్తి యంచితపికామృత కలస్వన మొప్పఁబిల్చె రసాల బాల
లేతఁయాకు పయ్యెదమాటు లేమ రంభ మధురఫలభోజనము లిచ్చె
మాధవునకుఁ
గొమ్మలెల్ల సింగారించుకొని రమించి ప్రియవసంతునిపైఁ బూల
వృష్టిఁగురిసె.''1

ఇందు వసంతుని నాయకునిగాజేసి కింశుకాది వృక్షములను ప్రియురాండ్రను కావించి వర్ణించిన తీరు కడు మనోహరముగా నున్నది. కింశుకతరువు పూచినప్పుడు అచ్చముగా జ్యోతులు వెలుగుచున్నట్లు కనిపించును. కావున పలాశవనిత వసంత ప్రియునికి లక్షవత్తుల దీపాలతో హారతులిచ్చెనని చెప్పుట మిక్కిలి మంజులమై యొప్పుచున్నది. అట్లే తక్కిన పద్మిని శిరీషయోష మున్నగు నుపమేయముల కిచ్చిన యుపమానములు రమ్యరమ్యములై వసంతశోభలను దివ్యముగా సాక్షాత్కరింప జేయుచున్నవి.

భోగిని విప్రలబ్ధ యగు రాధికగా అభినయించుచు విరహార్తి నడలిన విషయమిట్లు వర్ణింపబడినది.

"బడిబడిం బఱతెంచు బాష్పస్రవంతిలోఁ దెగిజాఱు మంచిముత్తెముల పేరు
గాద్గద్య సందీప్త కంఠస్వనమ్ములో దరిదట్టి పొరలు దుఃఖరసఝరులు
రాగార్తబింబాధర స్పందనమ్ములోఁ జిరుగాలిఁ గదలుఁ గెంజిగురుగుదులు
రోమాంచ సముపేత కోమలాంగకములఁ బ్రభవించు బరుసైన పద్మలతలు

1. పోతన చరిత్రము - 6-4

కనెడి దంతయు నాపయిఁ దనను దాను మఱచి యాడుచు నేఁతొ యున్మాద
దశను

వక్తయును శ్రోత తానయై పదరుకొనుట నడరు ప్రేమ గీతాంత్య
స్వరాలపనము."[1]

ఎడతెగక ఉబికివచ్చు కన్నీటి బిందువులలో తెగి జారిపోవు మంచి ముత్యాల పేరు నారోపించుటలోని ఔపమ్యరమ్యత యింతయని కొనియాడగలమా? ఇట్లే తక్కిన పాదములలోని రూపకములు విరహిణియగు భోగినీ రమ్యాభి నయమునకు దర్పణము పట్టుచు రసోత్కర్షహేతువులై యలరారుచున్నవి.

"జననమరణ వృక్షసంప్రాప్తిఁ బొందించు విషయసంగకర్మ బీజ మొకటె
దాని జ్ఞానవహ్ని దగ్ధము గావించి బంధముక్తిఁ బరమపదవిఁ గనుము.''[2]

అని శుకయోగి పరీక్షిత్తునకు పరమ పదవి గను మార్గము తత్త్వము బోధించిన దానిలో హృదయంగమ రూపక మేపారినది.

ఇట్లు మనోహరముగా ప్రయోగించిన పరంపరిత రూపకములలో మరి కొన్నిటిని పేర్కొందును.

"జీవనజ్యోతులు చిరజీవిగా వెల్గ నాత్మనర్పించు స్నేహస్వరూపి''
(2-54)

''కోమలి యూర్పున నాగుంబాములు బుసకొట్టె" (2-102)

"చీఁకటి తెరలను జించి ప్రసాదించు నక్షత్రమా కవినాథు ప్రతిభ''
(2-224)

''నెలగుండియలఁ బిండి సెలయేటి యెలబోటి యిల క్షీరవారాశి
నాలుకఁబోయ" (3-192)

"కన్నుల కాటుకల్ మరుని కత్తుల సానలు బట్టి" (3-217)

"రసభావ జలధిలోఁ గొసరి మున్కలువేసి దరిమట్టి జాతిరత్నాలుదెచ్చు"
(4-434)

1. పోతన చరిత్రము : 4-295
2. ,, : 10-94

''చెమట ముత్తెములు రాశిం బోసిననెకాక ప్రభుసన్నిధులు భృత్యువశము గావు'' (4-362)

"శ్రీశు పదసరోజమ్మంటి చిల్కు తేనె'' (5-39)

''ఆపరాని దరిద్ర దుఃఖాశనదులు'' (5-228)

"ప్రకృతి లతాంగి మిత్రునెడఁబాయుట కోర్వక మూర్ఛనొందె'' (7-3)

''వాల్మీకి యాదికావ్యపుఁ బుట్టతేనెలో మునిఁగితేలిన దొడ్డ తెనుఁగుతేటి'' (7-96)

"శశ్వదరాళ దంష్ట్రా కరాళాస్యంబు ప్రళయార్కబింబమై భయముగొల్ప" (7-232)

"విశ్వకల్యాణ విజ్ఞాన వృష్టికొఱకు'' (9-201)

"ఎవనికై సింగిణి నవరత్నఖచిత సుస్వాగత ద్వారమై చదల మెఱయు" (9-227)

''అన్యకాంతల మేని యంట నీయని కాంతిఁ బులికళాసపుఁ జెల్వుఁ దలప వలదె'' (11-80)

ఇట్లే ఇంక అనేక పరంపరిత రూపకములు కృతిని నవరించియున్నవి.

## ఉత్ప్రేక్ష :

''ఉపమేయమునకుఁ గలిగిన యుపమానగుణక్రియాది యోగముచే నా
యుపమానమె యని తలఁచిన నపు డది యుత్ప్రేక్ష యయ్యె''[1]

అని బట్టుమూర్తి నిర్వచించెను. అనగా ఉపమానము యొక్క గుణక్రియాది సంబంధముచేత ఉపమేయ ముపమానముగానే ఊహింపబడినచో అది యుత్ప్రేక్ష. ఉత్ప్రేక్షాలంకారమునకు ఆముక్తమాల్యద పెట్టినది పేరు. పోతన చరిత్రమున ఉపమారూపకముల తర్వాత పేర్కొనదగినది ఉత్ప్రేక్ష. ఇవి కావ్యమున ఏబదికి మించియున్నవి. ఈ యలంకారములు ప్రధానముగా వర్ణ్యవస్తు స్వరూప స్వభావ నిరూపణమునకు ప్రయుక్తములై కావ్యసౌందర్యోత్కర్షము నాపాదించియున్నవి.

1. కావ్యాలంకార సంగ్రహము : 5-62

శ్రీనాథుడు భాగవతమును రాజాంకిత మొనర్ప యత్నించుటకు బమ్మెరకు వచ్చినప్పటి యస్తమయ సూర్యవర్ణన మిట్లు చేయబడినది.

''వరుణుండు చలిగాఁగ పిరచించికొనినట్టి పండునిప్పుకల కుంపటి యనంగఁ

జీఁకటి ప్రళయమ్ము చేకూర్ప జృంభించు నపరాబ్ధిగత బాడబాగ్నియనఁగఁ

గాంతి విశ్వమును మ్రింగఁగ నోరు దెఱచిన కాలరాక్షసి వక్త్రగహ్వరమన

వ్యోమాంబరీషాన నుడు లాజలన్ వేఁపఁ బొరి రాఁజఁ బెట్టిన ప్రొయ్యి యనఁగ

రతి విరక్త కాషాయాంబరములఁ దాల్చి కళలుడుగునట్టి మోమునన్ గాంతి దఱుఁగు

చూపులన్ జెట్లగుట్టల ప్రాపుగొనుచు వాఁడిదప్పిన ముదుకఁడై వంగెఁ బ్రొద్దు''[1]

అస్తమించుచున్న సూర్యుడు రగరగ మండుచు కనిపించును. అట్టి సూర్యబింబ మాచార్యులవారికి నిప్పుల కుంపటి యనిపించినది. బడబాగ్ని యని తోచినది. కాలరాక్షసి వక్త్రగహ్వరమని ఊహ కలిగినది. ప్రొయ్యిగా వితర్కింపబడినది. ఇక్కడి యీ యుత్ప్రేక్షలు కాలోచితములై సహేతుకములై యొప్పుచున్నవి. అది సంక్రాంతి యప్పటి హేమంతఋతువు. స్థలము పశ్చిమదిశా జలధి. కావున పశ్చిమదిక్పతి వరుణుడు చలి గాచుకొనుటకు పెట్టుకొన్న పండు నిప్పుకల కుంపటి యనుట నితాంతము రమణీయముగానున్నది. అట్లే చీకటు లలముకొనువేళ కావున దానికి సహించక విజృంభించు పశ్చిమాంభోధిలోని బాడబాగ్నియని యూహించుట మనోహరముగా నున్నది. ఇంకను పరిశీలింపగా కాంతి విశ్వమును మ్రింగుటకు తెరచిన కాలమను రాక్షసి వదనగహ్వర మనిపించినది. అబ్బా! ఎంత భయంకరముగా నున్నది. నాలుగవ యుత్ప్రేక్ష మరింత మంజులముగా క్రొత్తగా నున్నది. ఆకాశమను మంగలమున చుక్కలను పేలాలను వేపుటకు రాజబెట్టిన ప్రొయ్యి యనిపించినది. ఎంత సమంజసముగా సమకూడిన భావన! చరమదశలో వాడి తగ్గి వంగిన సూర్యుడు ఒక వృద్ధునివలె విరక్తుడై కాషాయవస్త్రములు దాల్చి కళయు కాంతియు లేనివాడై చెట్లను గుట్టలను ఆశ్రయించి తపించి కృశించిన

1. పోతన చరిత్రము : 8-37

హించేయుట ఆచార్యులవారి వంటి మహాకవులకే సాధ్యము. ఈ విధముగా ఇందలి యుత్ప్రేక్షలు రమ్యములై శోభిల్లుచున్నవి.

పోతన మనసార గంగాదేవిని వర్ణించుచు ఇట్లుత్ప్రేక్షించెను.

"కలశపాథోరాశి క్రాఁగు పొంగును ద్రోసి యురికి వచ్చిన పాలనురువు వేమొ

వీరభద్రుని కాలి విలయతాండవకేళి వంతుబాడిన వీణె తంతివేమొ

దురితాసురులఁ ద్రుంప శరపరంపర ముంప నాట్యమాడెడి పీర నారి వేమొ

గాలితోఁ బందెమ్ము గట్టి మ్రింగ భృశమ్ము పగఁబట్టి చను త్రాఁచు పామవేమొ

కరఁగిపోసిన రజతనగమ్మవేమొ యభ్రగతి వీడు విద్యుల్లతాంగివేమొ

పవనహతిఁదూలు హరుమల్లు పాగవేమొ భూమి జనకల్పవల్లి! గంగామతల్లి!"[1]

ఇందు గంగామతల్లి గుణరూపములు చక్కగా సాక్షాత్కరింపజేయబడినవి. పద్యపాదములలోని యుత్ప్రేక్షలు వరుసగా దివ్యత్వము, ఉదాత్తనాదము, పావనత్వము, ప్రవాహవేగము, స్వచ్ఛత, మనోహరకాంతి, తరంగవిలాసము అను వానిని అద్దము పట్టి చూపుట కుదాత్తమైన యుచితమైన ఔపమ్య భాసురోత్ప్రేక్షలు ప్రయుక్తములై యొప్పారుచున్నవి.

శ్రీనాథుని వెంట సింగన్నపతి సభను ప్రవేశించు పోతన యిట్లు వర్ణింప బడెను.

"సతతావ్యయ విభూతి సంపన్నమతి యన భస్మపుండ్రాన్విత ఫాలతలము

భవవార్ధితారణోపాయమ్మన కమూల్య కర్ణధారుఁడన రిక్తశ్రవములు

నిష్కామ మానస నిలయుఁ డీతం డన మహితరుద్రాక్ష సంపదల నెడఁద

బంధముక్తుండయి పరఁగు నీతండనఁ గంకణ విరహిత కరయుగమ్ము

శుద్ధసత్త్వగుణోపేత బుద్ధిఁ డీతఁ డనఁగ ధౌతవస్త్రోత్తరీయములు మేనఁ

దనర వెనువెంటఁ దాను పోతనయు వచ్చెఁ గర్మ వెనుకనె జ్ఞానమ్ము గ్రాలు కరణి"[2]

1. పోతన చరిత్రము : 5-45.
2. " " : 4-63.

పోతన రూపరేఖలు, నిరాడంబరవేషము పరిశీలింపగా కలిగిన యూహలు పై రీతిగా రూపు దిద్దుకొన్నవి. ఇందలి యుత్ప్రేక్షలు పోతనగారి దైవభక్తిని, మోక్షమార్గము చూపించు కారణజన్మమును, ఐహిక భోగవిముఖతను, పారమార్థిక చింతనను, సాత్త్వికమతిని సాక్షాత్కరింప జేయుచున్నవి. ఈ వర్ణనలో పోతనగారి బాహ్యాభ్యంతర స్వరూపస్వభావములు భవ్యముగా వ్యక్తీకరింపబడి అతని పరమవిశిష్ట వ్యక్తిత్వము కనులకు గట్టింపబడినది.

నారయాదులు రాచకొండకు పోవుచు మార్గమధ్యమున నందలి వటవృక్షము నిట్లు వర్ణించిరి.

> ''పచ్చల పర్వతమ్మొ ధరఁ బట్టిన చల్లని యాతపత్రమో
> వచ్చుచుఁ బోవు పాంథులకెవారును గట్టని ధర్మసత్రమో
> యెచ్చట దిక్కులేక చరియించెడి పక్షికి నిల్వనీడ నే
> నిచ్చెడి భూకటాక్షమొ రహించినదీ బహుపాదవృక్షమై''[1]

చిత్రకారుడు గీసిన బొమ్మలోగాని ఛాయాచిత్రగ్రాహకుడు తీసిన పటములో గాని వస్తువు యొక్క బాహ్య స్వరూపమే గోచరమగునుగాని దాని ఆంతర్యము, స్వభావము తెలియరావు. కాని కవిలేఖినికి బహిరంతస్స్వరూప స్వభావములను సాక్షాత్కరింపజేయు దివ్యశక్తి కలదు. పై పద్యమున పచ్చని యాకులతో పెద్దగా వ్యాపించిన మఱ్ఱిచెట్టు మరకతమణులు పొదిగిన మహీధరముగా తోచినది. ఇది వటస్వరూపమునకు దర్పణము పట్టుచున్నది. అది భూమి దాల్చిన చల్లని ఆతపత్రమనుటలో దాని విశిష్టత విశదమగును. ఏ గొడుగైనను ఎండను నిరోధించుటకే కాని స్వయముగా చల్లదనమిచ్చు శక్తి దానికి లేదు. వడలు తడలొత్తు వేసవిలో ఛత్రధారులైన వారికిది యనుభవము. ఈ మఱ్ఱిచెట్టు క్రింద నిలిచిన ఎండ కొట్టకపోవుటయే కాక చల్లగా నుండును. కావున చల్లని ఆతపత్రమనుట సమంజసముగా నున్నది. అట్లే వచ్చిపోవు బాటసారులకు ప్రకృతి సిద్ధముగా నమరిన ధర్మ సత్రమని యూహించుటలో ఉచితముగా లభించు విడిది కావున యోగ్యముగా నున్నది. ఈ యన్నిటికి మించిన భావము చివరి వాక్యములో కలదు. ఎక్కడ దిక్కులేని పక్షికి నిలువ నీడనిచ్చునట్టి ఆశ్రయమిచ్చునట్టి-భూదేవి కటాక్షమో యన శోభిల్లుచున్న దనుటలో వటవృక్షపు టార్ద్రస్వభావము

1. పోతన చరిత్రము : 7-47.

వ్యక్తమగుచున్నది. ఈ విధముగా ఇందలి యుత్ప్రేక్షలు సమంజసములై, రమ్యతరములై రాజిల్లుచున్నవి. ఇట్లే అనేక సందర్భములలో రమణీయోత్ప్రేక్షలు కావ్యసుందరిని తీర్చిదిద్దినవి. మచ్చునకు మరికొన్ని పేర్కొందును.

"ముల్లెగట్టు వెల్ల మొకమాలనన్ మేను ముడిచి పండు లేఁగబుడుత యెకట" (1-86)

"సవితృకరాశికి సందొసంగని రీతి ధరణిఁగట్టిన కోటబురుజులనఁగ" (1-171)

"నీలనీరద మొకండు చలన్మహితేంద్రనీల సన్మణీకృత పాకశాసన మనన్ దివినాడె" (3-111)

"పగిలెఁజేయి జారిపడి యబ్ధఫలకమ్ములనఁగ నిల్చె మడువులందు జలము" (3-146)

"విరహిలోక సంతాపక స్మరకృశాను గోళసంధుక్షణోద్ధూత గోవికీర్ణ విస్ఫులింగ సంతతులన విధుని చుట్టు తారకారాజి వెలుఁగు నపారములుగ" (3-200)

"పీటన్ భూసతి కుచగిరి కూటము లన నొప్పు నద్రికూటాగ్రములన్, నీటగు ముక్తాహారపు పేటలనన్ గొమరు మిగులు పేఁటలు గననౌ" (4-10)

"చెక్కి చేసిన మోహినీ శిల్పమనఁగ దిద్ది తీర్చిన నవరత్న దీపమనఁగ పోఁత వోసిన యపరంజిబొమ్మయనఁగ, అచ్చమచ్చరయే యన నాలతాంగి" (4-231)

"ఉదయ దర్ధార్కబింబోద్దీప్త శైలాగ్రమన మణిమకుట ప్రభాత్త శీర్షు" (5-88)

"ఐరావణము పెక్కు లాకారములు దాల్చి మందలై యిచటఁ బెంపొందె నేమొ" (7-58)

"యువతి నమస్కరించుటయు నొప్పగు కీల్జడ యట్టిటున్ మనో
భవుఁడను గారడీఁడు లలిఁ బాడెకి నాగసరంపు సొంపులన్
దవులుచు నాడుచున్న నల ద్రాఁచన నొప్పె...." (7-310)

"ఊర్ధ్వ విష్టప సప్తకోపరిఁ జెల్వారు వైకుంఠ భవన నివాసుఁడనఁగ" (9-234)

"ధర్మమిట్టులు నున్నతస్థానమంటెనాన్ సౌధాగ్రములు నిక్కి చదలఁనంటు"
(10-68)

"దంష్ట్రాగ్రముల మహిమన్ ద్రవ్వను భూకళత్రాధర దంతక్షతాదులనఁగ"
(11-203)

"పాలఁ గార్చుచు నుండెఁ బ్రాకారకుడ్యముల్ క్షీరాబ్ధిశాయి యాస్తికతఁ
దెల్ప (12-255)

## అర్థాంతర న్యాసము :

విశేషము చేత సామాన్యమును, సామాన్యము చేత విశేషమును సమర్థించ బడినచో నేర్పడునది అర్థాంతర న్యాసాలంకారము. ఇందు పొసగని రీతిగా నున్న యర్థమును సమర్థించుటకై యర్థాంతరము చూపబడును. పోతన చరిత్రమున ఈ యలంకారములును ఏబదివరకు ప్రయోగింపబడియున్నవి. ఇవి గూఢ తత్త్వార్థములను నీతులను హృదయంగమము చేయుటకు తఱచుగా వాడబడియున్నవి.

పోతన యువక భూస్వామికి హితోపదేశ కవిత వినిపించుచు నిట్లు బోధించెను.

"ఇలను బ్రేమామృతమ్ముల గెలుచుకొనఁగఁ బశుబలముకన్న స్నేహమే
పనికివచ్చు
భ్రమరకులన్ దొల్చునట్టి బంభరము తాను మధువుఁగొను జూడు పూవన్నె
మాయకుండ"[1]

ప్రేమామృతము పొందుటకు పశుబలము కన్న స్నేహమే పనికివచ్చునని చెప్పిన మాట బుద్ధిగమ్యము కాదు. పశుబలమెందుకు పనికిరాదని ప్రశ్నింతుము. దీనిని సమర్థించుటకు తుమ్మెద తేనెగ్రోలు మరొక విషయము చెప్పబడినది. తుమ్మెదకు చెట్లు తొలచు శక్తి కలదు. అది పశుబలము. ఆ పశుబలము గల తుమ్మెదయే పూవునుండి తేనెను గ్రోలునపుడు పువ్వుకు నొవ్వు, హాని కలుగకుండ స్నేహభావముతో సుకుమారముగా ప్రవర్తించును. అన్యాదమన సమర్థము పశుబలము కల భూస్వామి ఇతరుల నుండి యేదైన గ్రహించునపుడు స్నేహభావముతో వర్తిల్లవలెనే కాని పీడించుట పనికిరాదన్న నీతిని మనసున కెక్కించుటకిచట తుమ్మెదచేష్ట యుక్తముగా చెప్పబడినది.

1. పోతన చరిత్రము : 2-118

అప్పగింతలవేళ శ్రీనాథుడు చెల్లెలి నోదార్చుచ నిట్లు వచించెను.

''దూర మొసంగినాఁడనని దూరకు మమ్మరో! నీ మగండు బం
గారము నీదు పుణ్యము లగణ్యమలై ఫలియించె నీగతిన్
గూరిమి గల్గియున్న మనకుంగల దూరమె చేరువౌను గూ
పార హృదంతరాళ మెడఁబాయునె సోముఁడు వ్యోమవర్తియై.''[1]

దూర దేశానికి తన నిచ్చిరని సోదరి చింతింపకుండ శ్రీనాథు డామెను సమాధానపరచుటకు ప్రేమలున్నచో తమకు గల దూరము దగ్గర యగుననెను. ఈ మాటచేత నర్సమాంబకేకాదు పాఠకులకును తృప్తికాదు, అర్థముకాదు. ప్రేమయున్నంతమాత్రాన దూరము దగ్గర యెట్లగును? ఇది పొసగనిది. దీనిని సమర్థించుటకు చంద్రు డాకాశమున నుండియు సముద్ర హృదయాంతరాళ మెడబాయగలడా? యను అర్థాంతరమును శ్రీనాథుడు ప్రతిపాదించెను. చంద్రుడు బహుదూరమున ఆకాశమునందున్నను తన జన్మస్థానమగు సముద్రునికి దూరము కాడు. ఆ సముద్రజలములందు ప్రతిబింబించుచు తరచు ఆకర్షించుచు నుప్పొంగజేయుచుండును. అట్లే నర్సమాంబ అనురాగముచేత పుట్టింటికి దూరముకాక అలరుచు అలరింప జేయగలదను భావ మిందు సుస్పష్టమగుచున్నది.

ఇట్లే కావ్యమున రత్నాలవలె ప్రకాశించు అర్థాంతరన్యాసములలో నొకకొన్నిటిని ఉదాహరింతును.

''తీవఁబోంట్లు స్వప్రభువుల క్రేవఁజనఁగ మొదటఁ గొంకెద రాపయి వదలలేరు
పాదపముల మున్మను లతల్ ప్రాకి కొనుటఁ దెలియనట్లుం డలమికొన్నఁ దొలఁగలేవు.'' (3-234)

''మగువల వెతవలెఁ బొంగక మగవారల వ్యథలు లోనె మసలును గాష్ఠాధిగతాగ్ని పొగల మంటల నగపడు నగపడునె తప్తమగు లోహమునన్'' (3-322)

''వనము గల దట్లె పోతన తనువుగలదు పూలు గనరావు వినరావు పుల్గురొదలు

1 పోతన చరిత్రము : 2-278

సంక్షుభిత జీవనాంచిత సరసియందు లోకబింబములుండియు
లుప్తములగు." (4-376)

"సాధకుని కిల సుఖదుఃఖచయము లరయ నెంతమాత్రము నడ్డుల నిడఁగలేవు
పూని రత్నాకరంబును బొందు నదుల మిట్టపల్లమ్ము లడ్డును బెట్టఁగలవె."
(5-130)

"తలఁప దోషిని దండన సలుపుకంటె దోషమూలకారణము దునుము టొప్పు
తెగులు బోకార్చువాఁడు వెజ్జగును గాని యరయ తెగులుగొంటునె చంప
యముఁడు గాఁడె'' (5-188)

"ధరఁ గళత్రాది సకల బాంధవుల మఱలఁ బడయవచ్చు సోదరునెట్లు
బడయఁగలము?
పెట్టుశోభల మఱల రాఁబట్టవచ్చుఁ బుట్టు సౌందర్యమేఁగ రాబోదు
తిరిగి'' (5-214)

''ప్రబల నైచ్యానుసంధాన భావమూను న్యస్తభరుఁడె భవాంబుధిన్ని స్తరించు
మునుఁగు నజ్ఞుఁ డహంకారఘనభరమునఁ బెండ్లుదేలును వాహినిన్ గుండ్లు
మునుఁగు." (7-262)

''ఘనుల జీవనములు కష్టమయమ్మౌట వారి శీలములకు వన్నెయిడును
జాతి మణులకెల్ల సానల యొరపిడుల్ నృపుల శిరముకెక్కు నెపముతోనె"
(8-296)

''చలన మెఱుఁగని యీ ప్రజాస్థానమందు దొరలు పైనుండి క్రిందికి
దొరలు చుంద్రు
చుక్కలేవేళ క్షతిలేక చూచుచుండ శశి కళాభంగ మొందుచు జను సతమ్ము"
(9-122)

''కపటవర్తనా చణులగు నృపులముందు నభిమతాన్యాయమే న్యాయమై
చెలంగుఁ
గుటిలతర కూటనీతి ముకురమునందు నెడమ కుడి యగున్ గుడియుఁ
దా నెడమ యగును.'' (9-139)

''తనకుఁ దెలియనంత దైవంబె లేఁడని వచ్చినట్టులెల్ల వాగుచుండుఁ
బురుటి బిడ్డ యయ్యె నెఱుఁగని మాత్రాన జనకు నునికి యెందసత్య మగునె"
(10-107)

"తులము శిలనైన ముంచెడి జలములెందు మొద్దు మ్రాఁకుల బరువుల
ముంచఁగలవె
జీవనమ్మిడి తానె రక్షించునట్టి వానిఁ దేల్చక ముంచెడివారు గలరె?"
(11-361)

హరి కరస్పర్శ సుకృతి పాపాత్ముఁడనక ముక్తునొనరింపఁగల మహాశక్తి
గలది
దర్భలం గోయు ఛురికయుఁ దలలఁ గోయు నసియుఁ బరుసవేది స్పర్శఁ
బసిఁడి గాదె." (12-182)

## స్వభావోక్తి :

"సహృదయ హృదయంగమమై మహినున్నది యున్నయట్లు మాటల తేటల్
బహుళంబులుగాఁ జెప్పిన మహితోక్తియె జాతి యయ్యె"[1]

అని బట్టుమూర్తి నిర్వచించినట్లు వర్ణ్యవస్తువు యొక్క రూపక్రియాదుల నున్నది యున్నట్లు మనోహరముగా చెప్పిన స్వభావోక్తి యగును. దీనికే జాత్యలంకార మని నామాంతరము. రమ్య స్వభావోక్తి ప్రయోగించుటకు ప్రకృతి పరిశీలన నిశితముగా నుండవలయును.సాధారణముగా కావ్యములందు స్వభావోక్తు లధికముగా నుండవు ఆముక్తమాల్యదవంటి కొన్ని కావ్యములలో నివి తరచుగా ప్రయుక్తములై యున్నవి. పోతన చరిత్రమున నివి నలువదివరకున్నవి. ఆచార్యులవారికి స్వభావోక్తిపై ఆసక్తి, శక్తి మెండుగా గలవని యివి నిరూపించుచున్నవి.

బమ్మెర గ్రామ పరిసరదృశ్యము లిట్లు వర్ణింపబడినవి.

"కట్టి పిఱుందాని కంబళి ముసుఁగుతో నీరెండ గ్రాఁగుచు నిలుచు గొల్ల
పాదాల కసిదీఱఁ బసరిక బయళులఁ జంగున నెగురు వత్సముల గుంపు
పశుగణమ్ముల మూఁపుపైఁ బొరిఁబొరి వ్రాలిస్వారి చేసెడి భరద్వాజ పక్షి
వనదంశములఁ దోల వాలచామరమెత్తి వీఁపుపై నాడించు వృషభరాజు

1. కావ్యాలంకార సంగ్రహము : 5-112

దురదవోఁ దాటి ప్రాఁకుల నారయు గేదె గడ్డిమేయు గోవుల మెడగంట మ్రోఁత
కనుచు వినుచుఁ బోతన తన తనువు మఱచి యెడఁదపొంగు భావమ్మున నిటులఁ దలచె."[1]

ఇందు పల్లె చుట్టుపట్టుల గనబడు దృశ్యములున్నవి యున్నట్లుగా ఇంపుగా ఛాయాగ్రహణము చేసినట్లు వర్ణితమైనవి. ఈ స్వభావోక్త్యలంకృతిని పోతనతో పాటు పాఠకులును తనువు మరచి తిలకించగలరు. పల్లెటూళ్ళతో సన్నిహిత సంబంధముగల ఆచార్యుల వారిట్లనేకముగా తదీయ స్థితిగతులను నిసర్గరమణీయముగా వర్ణించియున్నారు.

ఇప్పటివి గ్రామసీమా దృశ్యాభివర్ణన కాగా ప్రత్యేకముగా ఒక కపోతముపై దృష్టి సారించి దాని ముద్దుచేతలకు ముకురము పట్టినది దిగువ గలదు.

"మెఱపుటీఁకల నిండుమెడ ముందు వెన్కకు గునిసియాడఁగఁ దోడఁ గూడి నడచుఁ
గేరి కూయుచుఁ బ్రియం జేరి రాఁ జుట్టుచుఁ బుచ్చమ్ము విప్పి సొంపుగ నటించుఁ
గను మోడ్చి ముక్కు ముక్కునఁ జేర్చి విడదీసి యట్టిట్టు నేలపై నంటి రాచు
మెడ నోరఁ ద్రిప్పి విచ్చెడి పక్షముల మధ్యఁ గొన ముక్కునన్ గోకికొనుచుఁ గూర్కు
ఱెక్క లీఁకలు విరియఁగ రెపరెపార్చి పంజరాకృతిఁ బైకేఁగఁ బాఱు కాంతఁ
బొంది సంతృప్తుఁ డగు నీ కపోతపతియె ధన్యుఁ డన్ని విధమ్ములఁ దలఁచి చూడ."[2]

పొలాలలో పోతన తన సతీసౌందర్యమును తిలకించి పులకించిన సందర్భమున మనసు మరలించుకొనుటకై యచటి ప్రకృతి దృశ్యములు చూచుచు వినోదించుచున్న కపోత మిథునమును గాంచి పై రీతిగా వర్ణించెను. పోతన

1. పోతన చరిత్రము : 2-11
2. పోతన చరిత్రము : 3-166

శృంగారమున కుద్దీపన విభావముగా ఇది ఔచితీమంతముగా వర్ణింపబడినది. సుందరమైన రూపములను క్రియల నదే పనిగా గాంచ మనసగును. పోతన అట్లే చూచి వర్ణించెను. ఇందు కపోతము యొక్క శృంగార చేష్ట లెంత స్వభావ సిద్ధముగా రమణీయముగా వర్ణింప బడినవో! ఎన్ని మారులు చదివి చూచినను తనివి తీరదు.

సమాగమమునకు పూర్వము నర్సమాంబ పోతన యెదుట చేసిన లజ్జాన్విత చేష్టలు ''అవనత ముగ్ధాస్య యగుచుఁ గేలుంగేలుఁ గీల్చి నఖాగ్రముల్ గిల్లుకొనును" (3-222) అని యిత్యాదిగా వర్ణింపబడినవి స్వభావ రమ్యముగా నున్నవి. ఇట్లే నిసర్గ రమణీయములైన స్వభావోక్తులు కొన్ని దిగువ పేర్కొన బడినవి.

"అలుకుంబూఁతల నొప్పు కుడ్యములపై నందందు నందమ్ముగా"
-బమ్మెర (1-84)

"కుంపటి వలె నుండు కుక్కుటరాయందు కుటి శిఖాగ్రము నెక్కి
కూయు నొకట" (1-86)

"తనవైపు యువకు లేరును గన్ను వేసిన బ్రతుకేటి కనునట్లు బాధ
పడును" -పేద జవరాలు (2-81)

"బడి బడి గూండ్ల కేఁగు ఖగపంక్తులు సస్యము లూఁగఁ జేలపైఁ
బడియెను" (2-148)

''పయ్యెదచుట్టు కౌనునకు బాసటయౌ మొలనూలి కట్టుతో"
-వరి కోయువారు. (3-105)

"చనఁ దొడఁగెన్ మహోత్వర....'' - నర్సమాంబ పొలాలకు (3-123)

"హర్షాతిరేకాన వర్ష ప్రవాహమ్ము కట్టఁ గట్టుచుఁ దటాకముఁ
బొనర్తు9''-గోపార్భకులు (3-148)

''అట్టు మోడిచి పొదుఁగంది నాకుచు నిల్చి యంభారవళి లేఁగటావులఱచు
(4-219)

"ఇసుకదిబ్బల నడ్డు లేర్పడ గునగున న్నడచుచు నెడ నెడ నదరి
ద్రూఁకి"- పక్షులు (5-19)

"కడుపుఁ జూపుచు గుండెఁ జెడ బాదికొను చన్న మవ్వ యవ్వో యని
యఱచుఁ బొట్టె"— కరవులో బిచ్చగాండ్రు (5-142)

"తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి గొంగడిలో శని గూరుచుండ"
భిక్షుకుడు (5-233)

"చదలనంటఁగ నిక్కి సాలాగ్రముల నెక్కి కూఁతలనిడెడి కపోత
సమితి"-అడవి (7-37)

"బడినోళ్లఁ దెఱచెడి వడఁదాక శోషిల్లి వృక్షశాఖల నహో! పక్షిచయము"
అడవి (7-43)

"ఒకసారి పొదఁదట్టి యాడిన పయ్యెదన్ వెనుదిర్గి కాంచి నవ్వొనరఁ
గొనును-" మోహిని (11-156)

ఈ చిన్నినోటిలో నేతల్లి పరమాన్నముల నింపెనోయని ముద్దుగొనును-"
యశోద కృష్ణుని (12-120)

"చిట్టికి జ్వర మేమి సేతు దుర్విధి యని హస్తాగ్రమున ఫాల మంటి వగచు"
-రుక్మిణీ బాల (12-219)

**శ్లేష :**

అనేకార్థములతో రంజింపజేయు శ్లేషచమత్కారము కావ్యమున కొక శోభను కలిగించుచుండును. ఆయా కావ్యములలో సందర్భానుసారముగా శ్లేషలు ప్రయుక్తమయి యుండగా, "రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గాకుండున్ దద్గతిఁ గావ్య మెల్లనగునే నోహో! యనం జేయదే"[1] యన్నట్లు రాఘవ పాండవీయము వంటి ద్వ్యర్థి కావ్యములు వెలసి యుండగా, శ్లేష ప్రాచుర్యముగల వసుచరిత్ర వంటి కావ్యములు కొన్ని చెన్నెసలారుచున్నవి. వర్ణ్య వస్తు స్వరూప స్వభావములను విశేషముగా వ్యక్తము చేయుచు శ్లేషలు ప్రియా శ్లేషల వలె ఎదలకు గిలిగింతలు పెట్టుచుండును. పోతన చరిత్రమున రమ్యములై రసవంతములైన శ్లేషలు కొన్ని సందర్భోచితముగా ప్రయుక్తములై యున్నవి.

తాను బోధించిన రీతిగా రాక్షస రాజేంద్రుని ప్రశస్తి చాటుమని గురువు పలుకగా ప్రహ్లాదు డిట్లు నుడివెను.

1. రాఘవ పాండవీయము : పీఠిక-10.

"చెండాడెదను నేను శ్రీనాథు శిరమూని హరికిశోరము భాతి ననవరతము
పగలొనర్చెదఁ దమో భావమ్మునం జక్రధారి వర్తనలు స్వాంతమునఁదలఁచి
తిరిగి జన్మింపని తెఱఁగు శ్రీహరిఁబట్టి రూపు మాపెదఁ గులోద్దీపనముగ
ఇవి యబద్ధములంచు నెపుడు దూఱెద విష్ణు వైకుంఠ నగర దివ్యస్థలాల
విష్ణు వెచ్చట లేఁడిల వెదకిచూడ దా నసురనాయకుఁడె జగత్త్రియవిభుండు
మజ్జనకు సంస్తవము వినా మానవులకు హరిభజన మేల యని బోధ
పరతు నవని"1

విష్ణు భజన మానుమని తన్ను వేధించు తండ్రిని గురువును ఉడికించుటకు ప్రహ్లాదుడు శ్లేషచమత్కారముగల పద్యము పఠించెను. ఇందు విష్ణునింద కలదని వారు సంతోషించిరి. ఇందలి భావమేమియని తండ్రి యడుగగా ఆ పదవాక్యము లందే విష్ణుస్తుతి వైభవములున్న అర్థముచెప్పి తన దృఢచిత్తమును వెల్లడి చేసెను. ఈ సందర్భములో ప్రయోగించిన యీ శ్లేష మిక్కిలి ప్రయోజనకారియై సమం జసమై యొప్పుచున్నది.

ఇందు చెండాడెదను, పగలు, దూఱెద-అనుపదములలో అభంగ శ్లేషయు, ఇవి యబద్ధములు (ఇవి + అబద్ధములు; ఇవియ, బద్ధములు), హరిభజనమేల (హరి భజనము + ఏల; హరిభజన, మేల) యను పదములలో సభంగశ్లేష, సీస తృతీయ పాదమున అన్వయము మార్పు వలన శ్లేష, ఎత్తుగీతిలో కాకువు వలన ధ్వని విల సిత శ్లేష శోభిల్లి యిచట శ్లేషాలంకారము కడు రమ్యమై రాజిల్లు చున్నది.

సింగనృపాలునిపై వలపు తలపు వీడని కూతునకు వేశ్యామాత రాజులోని దోషములు వివరించుటకు దిగువ రీతిగా శ్లిష్టరీతిలో బోధించినది.

"అమృత మొల్కించు దేవావతారంబన్న అల నిశాచరవృత్తిఁ జెఱఁగు
చుండు
చల్లని ప్రభువు దర్శన మొనర్తుమటన్న సరిదర్శనము మాస మరుగ
నొసఁగు
శీతలకర సమాశ్లేషమ్మొసఁగు నన్న కఠినుఁడై విరహులఁ గష్టపెట్టు
తన వారి నిధుల వర్ధనముఁ గోరునటన్న దమ్ములపై నరిత్వమ్ము జూపు

1. పోతన చరిత్రము - 11-289

అందగా రాని చుక్కల నాడుచుండు నఖిల జగముల నధికారియై చరించు
విశ్వసింపడు ఛాయకున్ వెలచుకొనును చంచలుడు రాజతని నమ్మ
జడులుగలరె?"[1]

ఇందు అర్థద్వయముగల రాజశబ్దము ప్రయోగించి ప్రభువునకు చంద్రునకు అర్థమగు శ్లేషతో వర్ణనయెల్ల రమ్యముగా సాగించుట జరిగినది. చంద్రునివలె భూపతి చల్లనివాడు చక్కనివాడని భ్రమించుట తగదని అతనిలో చంద్రునిలో వలెనే అనేకావలక్షణములు కలవని నిరూపించి కూతురు మనసును సింగనృపతి నుండి మరలించుటకు ప్రయత్నించుటకు వేశ్యామాతచేత ఈ శ్లేష ప్రయోగింప జేయుట సమంచితమై యున్నది. రాజులన్న మురిసిపోవు వారికిది సమ్యక్ప్రబోధము చేయుచున్నది. ఇక్కడి శ్లేషలు మిగుల సహజములై సుందరములై పఠితల నలరింపజాలి యున్నవి.

సింగనృపాలుడు ప్రసాదింపజూచిన ఆస్థాన కవిమండలాధ్యక్ష పదవిని తిరస్కరించి పోతన పలికిన ధీరవాక్కులలో చక్కని శ్లేష విరాజిల్లు చున్నది.

''ఒకరి రాజ్యాన మే ముండువారము కాము ఏలగా బదములు చాలగలవు
ఒకరి ప్రభుత్వాన నొదిగియుండము మేము గురులఘు గణపాలకులము గాన
అన్నవస్త్రాలకై యాచింపమన్యుల నవరసామృత భోజన మిడగలము
అర్థార్జనమ్మకై యర్థింపమొరుల సకల విధార్థాలంకృతు లిడగలము
స్వీయ తాళపత్రకుటీర సీమలందు నఖిలభూత కోటికి నమరాశ్రయ మిడి
శాశ్వతము బ్రోచు సత్కవీశ్వరుల మేము దైన్యమున బడియుండ
మితరగృహాల"[2]

ఐహికభోగవిముఖుడు ఆత్మాభిమానియు నగు పోతన, సత్కవీశ్వరులు దీనులు హీనులు కారనియు వారును రాజులవలె ఐశ్వర్యసంపన్నులే కాక వారి కంటె శాశ్వత సౌఖ్యములను పొంది యితరులకు పొందింప ఆశ్రయ మీయగల రనియు సుకవీంద్రుల దైన్య రాహిత్యమును విశిష్టతను ప్రశస్తిని ఎలుగెత్తి చాటుటకు ఇక్కడ శ్లేష ప్రయోగింపబడినది. ఇదియును నిసర్గరమణీయమై ప్రయోజనౌచితీ భాసురమై యింపు నింపు చున్నది.

1. పోతన చరిత్రము : 4-195
2. ,, : 4-351

ఏకశిలానగర వర్ణనలోని

"బ్రాహ్మణుం డా వీట బహుళ విజ్ఞానియై ప్రథితవిద్యానాథ పదవిఁబడసె"[1]

అను పద్యమునందలి విద్యానాథ రుద్రావతార తిప్పయ కాపయ్య పదములు శ్లిష్టములై వరుసగా విద్యానాథ ప్రతాపరుద్ర అవచి తిప్పయ కాపయ నాయకులను స్ఫురింపజేయుచు ఓరుగంటి మహాప్రశస్తిని రమ్యముగా తెలుపుచున్నవి.

"ఇవ్వనియు జవ్వనింబోలి యెలమి మీఱఁ బుష్పవతి యౌటచే భృంగ భోగ్యమయ్యె

నేతదారామ మా రామనృపతివోలె నలరి ద్విజవాంఛితమ్ము సఫల మొనర్చె"[2]

ఇది శ్రీనాథుడు సింగనృపతి వనమును వర్ణించినది. ఇందు పుష్పవతి, ద్విజపదములు అర్థద్వయ శోభితములై వనికి జవ్వనికి, ఆరామమునకు రామునకు అభేదము కూర్చుచు మనోహరమై శ్రీనాథునికిగల రమణులను రాజుల నాశ్రయించు స్వభావమును చక్కగా వ్యక్తము చేయుచున్నవి.

"కలవాడైనన్ జాలునె చెలువుఁడు రసికుండు గామి జీవితమేలా

చెలువలు కలువలు సరసుల చలువవలన నిలువఁగలుగు జలజదళాక్షీ!"[3]

అని తల్లితో భోగిని పలికిన దానిలో 'సరసులు' అన్న శబ్దము శ్లిష్టమై భాసుర భావమునకు ప్రాణము పోయుచున్నది.

ఇట్టి రమ్యశ్లేషలు కావ్యమున మఱెన్నియో కలవు. వానిలో మరికొన్ని దిగువ పేర్కొనబడినవి.

"వాయువతని యండ పశవర్తియైయుండు"-వ్యాసమహర్షి వర్ణన (1-29)

"సరస గభీర నిర్మల విశాల సుధామధురాంతరంగ భాసుర"-లక్కాంబ (1-95)

"భ్రమరాభుల సరసులఁ గని" - శ్రీనాథుడు కేసనతో (2-219)

"తలఁపన్ దోషాకరుఁడై" - సతీసమాగమానంతరము పోతన (3-249)

"సుమనస్సు లందె పదము లుంచు శారద కాలినడంబోవు కత మదేమి" - పుష్పలావిక శ్రీనాథునితో (4-55)

"అవని నరరూపతన్ సింగమైన నీవా" - సింగనృపతి స్తుతి (4-69)

1. పోతన చరిత్రము : 1-80
2. ,, ,, : 4-111
3. ,, ,, : 4-191

**లోకోక్తి :**

కావ్యమున అందందు సుందరమైన లోకోక్తులు ప్రయోగింపబడి వర్ణ్యములకు వన్నెలు చిన్నెలు సవరించినవి. ఇవి ప్రాయికముగా ఆయా పాత్రల గుణకర్మ స్వభావ నిరూపణమునకును, ప్రతిపాదిత విషయములను నీతులను ధర్మములను సమర్థించుటకును ప్రయోగింపబడుచుండును. లోకోక్తులు సుప్రసిద్ధములైనవి. కవి వీనిని నూతనముగా సృష్టింపడు. మహాకవుల సూక్తులు కొన్ని లోకోక్తులుగా 'చలామణి' యగుటయు కలదు. కాగా కవులు వాడుకలో గల లోకోక్తులను సందర్భోచితముగా నుపయోగించి శోభను గూర్చుటలోనే వారి చతురత సువ్యక్తమగును. విస్తారమైన లోకానుభవము, ప్రయోగచాతుర్యము గల సుకవులే సామెతలను సార్థకముగా ప్రయోగింపగలరు. నవరసోపేత కావ్యభోజనములో కమ్మని పచ్చళ్లగా సామెత లామెతలొసగు చుండును. ఆచార్యులవారు ముక్తాఫలములవంటి లోకోక్తులు ముప్పదివరకు ముద్దుగా గూర్చి తీర్చినారు.

శ్రీనాథుడు పోతనకు ధనావసరమును గురించి నొక్కిచెప్పుచు నిట్లనెను.

"దానమునందుఁ గర్ణుఁడను తావకకీర్త్యకళంకభాను శో
భా నపరూపరేఖల నభమ్ము లిభమ్ముల నెక్కి చాఁటగన్
వేనకువేల నిల్గడిగి పెట్టిన యప్పులఁ గొంద్ర దీర్చునే
యేనుఁగు లెక్కనైన ఋణ మేకుల రాటముతోడఁ దీఱునే?"[1]

పోతన దీనజన బంధువు, పరోపకారి, మహాదాత. అర్థులకు ఆర్తులకు లేదనక యిచ్చెడివాడు. అట్టి దానధర్మములలో ఉన్నవి చాలక వేలకువే లప్పు చేసినచో వానిని వ్యవసాయముతో తీర్చలేడు. ఈ విషయ మర్థము చేయించుటకు సమర్థనగా 'ఏనుఁగు లెక్కనైన ఋణ మేకుల రాటముతోడఁ దీరునే' అన్న లోకోక్తిని శ్రీనాథుడు వాడినాడు. 'మితిమీరిన ఋణము చేసి దాని నల్పాదాయముతో తీర్చలేము' అన్న అర్థములో వాడబడు ఈ సామెత ఇక్కడ చక్కగా సరి పడినది.

పేదరాలి ననుభవింపదలచి ఆమెను లోఁజరచుకొను యత్నములో యుపక భూస్వామి అన్న విషయము దిగువ రీతిగా నున్నది.

1. పోతన చరిత్రము : 8-122

> పట్టెం దన్నముఁ బెట్టి నిన్సుఖముగాఁ బాలింపలేఁ డౌర! మైఁ
> జుట్టం జాలెడు కోక దెచ్చుటకె చచ్చున్ గాకికిన్ ముక్కునన్
> గట్టం బెట్టిరి దొండపండు నిదిగో! కాసుల్ పదారంచుఁ జేఁ
> బట్టెన్ గట్టిగ నాకుఁ బ్రాణములు పైఁ బైనేఁగె నింకేమనన్.''[1]

భార్యాభర్తలలో ఒకరు నలుపు మరొకరు తెలుపగుచో వాడునట్టి ఈ సామెతను భూస్వామి చక్కగా వినియోగించుకొన్నాడు. దరిద్రుడు మోటుగాడు నైన వానికి అందగత్తె భార్యయై యున్నది. ఆ దిక్కుమాలిన మగడేమియు పోషింపలేడు. అట్టివానికి గట్టిన ఆమె కాకిముక్కున దొండపండువలె నున్నదనుట చక్కగా పొసగినది. ఇట్లు చాటువ యిచ్చి రెచ్చగొట్టి ఆ యువతిని వశము చేసుకోవలెనన్న కాముక భూస్వామి చిత్తవృత్తికి ప్రయోగము సముచితమై యున్నది.

బెదరించిన కాపు పోచయ్య యున్న పొలాలవద్దకు రాత్రి యొంటిగా పోవల దని పోతనకు చెప్పుచు నీరటి కాపు "పామై కఱచును గట్టెయుఁ జీమయుఁ బులి యగును దాను చెడ్డ దినాలన్"[2]అని సామెత వాడెను. రోజులు మంచిగా లేనప్పుడు సామాన్యుడును హాని చేయగలుగునన్న యర్థములో వాడబడు ఈ లోకోక్తి యిచ్చట యుక్తి యుక్తప్రయుక్తమై యున్నది. అట్లే తిప్పన భార్య అతనితో పోతన చేయుచున్న మితిమీరిన దానధర్మములు పనికిరావని చెప్పుచు నిట్లనెను.

> "తన్నున్ మాలిన ధర్మంబున్నే యున్నంతలోన నొకరి కిడకు మిం
> తన్నమను పాపులెవ్వరు కన్నుంబో గల్గునంత కాటుక తగునే''[3]

ఇక్కడ 'తన్నుమాలిన ధర్మమున్నే' యనియు, 'కన్ను పోగలుగునంత కాటుక తగునే' యనియు రెండు సామెతలు వాడబడినవి. ఇవి రెండును తనకు హాని కలిగించు ధర్మములు పనికిరావు. శక్తికి మించు ధర్మము చేయగూడదు. అను నర్థములో వాడబడును. ఇందు పోతన గురించి యతని వదినె ప్రయోగించిన యీ లోకోక్తులు సందర్భోచితములై యున్నవి.

---

1. పోతన చరిత్రము : 2-97
2. ,, : 5-155
3. ,, : 5-201

కావ్యమున నిట్లే సామెతలు సమంజసములై యొప్పారుచున్నవి. తెలుగు సామెతలే కాక సంస్కృత లోకోక్తులును కొన్ని వాడబడి యున్నవి. అందు సుందరమైన సామెతలను కొన్నిటి నుదాహరింతును.

'పువు పుట్టగనే పరిమళముల( జిల్కు' (1-176)
'పంగువుపైకి గంగ యరుదెంచినది' (2-110)
'యద్భావం తద్భవతి హి' (2-136)
'పాల నేని ముంచు నీటనేముంచు భారమ్ము నీదె' (2-272)
'అందని మ్రానిపండు నృపు( దజ్జులు సాచ(గ నేల' (4-181)
'చంద్రునకు నూలు పో(గు' (4-344)
'వచ్చునట్టిపని వాకిట( దీఱ' (4-380)
'యథార్థవాదినన నెంతయు లోకవిరోధియౌ' (7-41)
'కందము( జెప్పిన( గవియగు( బందిని హతమార్చు నత(డె బంటు' (7-234)
'పూలం గొట్టినం దిరిగి బుక్కన వేసిన యట్టులు' (8-144)
'విత్తొక టిడిన( జెట్టొకటి మొల్చు నెటుల్' (8-145)
'లక్ష్మిరా( దడక నడ్డము వెట్టుకొనంగ( జెల్లునే' (8-183)
'బ్రహ్మచారి శతమర్కటములకు సము(డు' (9-25)
'బట్ట( గాల్చి పైన( బారవేయు జగమ్ము' (9-336)
'చెట్టు గాలి లేని దెట్టు లూ(గు' (9-336)
'పులి పొట్టన్ మే(క జన్మించునే' (11-237)
'ఇంటి దీపమని ముద్దిడ మీసలుగాలు' (11-302)
'బ్రాహ్మణస్య క్షణం కోపమ్' (7-268)
'మణినా వలయం వలయేన మణి' (7-267)
'బెండ్లు దేలును వాహినిన్ గుండ్లు మును(గు' (7-262)
'గాంజ దుర్వనిన్ ఘన తులసీ ప్రరోహము' (4-160)

## ఇతరార్థాలంకారములు :

ఇంతవరకు చర్చించిన ఉపమాద్యలంకారములే కాక కావ్యమున భ్రాంతిమంతము, సందేహము, అపహ్నవము, విభావన, అతిశయోక్తి, సహోక్తి,

సమాసోక్తి మున్నగు అర్థాలంకారములు సకృత్తుగా యథోచితముగా ప్రయోగింప బడి యున్నవి. వానిలో కొన్నిటిని మచ్చున కుదాహరింతును.

మోహినీ విలాస వర్ణనలో భ్రాంతిమదలంకారము నిగారము గులుకు చున్నది.

''తన జాతి నిస్వన మ్మని యెంచి కలకంఠి కిలకిల నవ్వఁ గోకిలలు కూయు
తన మూఁక పల్కనుకొని కల్కివాక్సుధల్ జిలుక పన్నెల
రామచిలుక పలుకు
తన గుంపు మధు వాను నని యెంచి పద్మాస్య యలకలం గని
మూఁగు నలికులంబు
తన మంద చూచు నన్కొని చంద్రముఖి బెళ్కి యాడు చూపుల
డాయు నాడు లేళ్లు
తన కులమ్మె చివుర్చె మాధవరతి నని కొమ్మ మై గాంచి తలలూఁ
చెఁ గొమ్మలెల్ల
అంత నా కాంత నారసి స్వాంతమందు నిట్లు తలపోయుచుండె
మహేశ్వరుండు.''[1]

ఇందు మోహినీ హాసాదులకు తమజాతి రావాదులే యని భ్రాంతి చెంది కోకిలలు మున్నగునవి ప్రతిస్పందించి కూయుట మొదలగు ప్రతిక్రియలు చేసె ననుట మనోహరముగా నున్నది. మోహిని యొక్క నవ్వులు పలుకులు అలకలు చూపుతళుకులు ఎంత రమణీయము లైనవో యీ యలంకృతి సాక్షాత్కృతి కావించుచున్నది. మోహినీ విలాస విభ్రమములకు మదనుని మంట గలిపిన మహేశ్వరుడే భ్రాంతి చెందగా తక్కిన వారి లెక్కయేమి ?

ఉపమతో గూడిన భ్రాంతిమంతము దిగువ పద్యమున హృద్యమై యున్నది.

"తారలం గని ముత్యాల చేరు లనుచు మ్రింగఁ జను హంస కరణి
భ్రమించు మొయిలు
చాంద్రిఁగని నిత్య మీ పయస్సరసి యనుచు నమ్ము తమ్మియట్లిందువు
నవ్వి పడెడి.''[2]

1. పోతన చరిత్రము : 11-127.
2. ,, : 3-203.

ఇక్కడ తారలను చూచి ముత్యాల చేరులని హంస మ్రింగబోవు ననియు, వెన్నెలను గాంచి పాలకొలనని పద్మము నమ్ముననియు భ్రాంతిమంతము కాంతి మంతముగా నలంకరించి యున్నది.

గజేంద్ర రక్షణకు గగనమార్గమున అరుదేరుచున్న అంబుజాక్షుని దివిజు లాశ్చర్యచకితులై అవలోకించిన విషయమును వర్ణించిన పట్టున సందేహాలం కారము సవరింపబడినది.

"అది వారిదంబొకో హరిశరీరం బొకో అనుచు నభస్సీమ నరయువారు
అర్క బింబమ్మొకో యది రథాంగ మ్మొకో యని యంతరిక్షమ్ము గనెడివారు
అమలేందు దీపమో యది శంఖరూపమో యనుచు రోదసిని గన్గొనెడివారు
తారకా కాంతియో తా వైజయంతియో తోఁచదటంచు మిన్ జూచువారు
సూర్య చంద్రులనొక మాఱు చూడఁగలమె? మేఘ తారక లొకమాఱు
మెఱయఁగలవె?
కాదు సాయుధ మాధవాగమన మిదియొ, యనుచు సురలోక మెల్ల వాకొనెడి
వారు."[1]

ఆపన్న రక్షణ సంరంభుడై సరభసమున సాగిపోవు హరిని దూరము నుండి అకస్మాత్తుగా చూచు సురలకు భ్రమ సందేహములు సంభ్రమాశ్చర్యములు గలుగుట సహజము. అట్టివారు నీలగాత్రుని మేఘమనియు చక్రమును సూర్యు డనియు నిత్యాదిగా సందేహించినట్లు వర్ణించుట నిసర్గరమణీయముగా నున్నది. ఇట్లనుమానించి శంఖ చక్రములను చంద్ర సూర్యులేమో యని భావించినవారికి చంద్ర సూర్యుల నొకేసారి చూడగలమా యను ఆశంక కలిగి వితర్కించుకొని యతడు విష్ణువే కావలె ననుట నిశ్చయాంత సందేహాలంకారమయి రమ్యతరముగా నున్నది. ఇందలి ఔపమ్య సౌందర్యము వర్ణ్యమునకు మిక్కిలి దీప్తి నాపాదించు చున్నది.

ఇట్లే వివాహవేళ పోతన దంపతులు తలంబ్రాలు పోసికొనునప్పటి 'ప్రాలో వేణిని మెఱపుల చాలో'[2] అని యన్నదానిలోను, 'చిలుకలొ వలపుల మొలకలొ'[3]

1. పోతన చరిత్రము · 12-76
2. ,, : 2-254
3. ,, : 12-99

అని బాలకృష్ణునికి అభ్యంగన స్నానము చేయించు గోపికల గూర్చి వర్ణించినదాని లోను చక్కని సందేహాలంకారములు కైసేయ బడినవి.

అపహ్నవాలంకారమునకు దిగువ పద్య ముదాహరణము.

"గాయ మది గాదు వైశ్యుని క్రౌర్యమద్ది నోరు విప్పి తానచ్చటఁ జేరుకొనియె
రక్తవాహిని గాదు తద్రాక్షసాతి వక్ర దౌర్మార్గ్య బీభత్స వర్తనమది"[1]

దీనభిక్షుకునికి తగులు దెబ్బను తప్పించి పోతన తానే గాయపడినప్పటి వర్ణన యిది. ఇందలి యపహ్నవము లోభివైశ్యుని క్రౌర్యమును దౌర్మార్గ్యమును చక్కగా విస్ఫుటీకరించు చున్నది. ఇట్లె శారద తండ్రి శ్రీనాథునికి వ్రాసిన జాబు చదివి సింగనృపతి వ్యాఖ్యానించుచు

''గాన మొనరించు రాగసంగతిని దప్పు గారడీనినె ఫణమార్చి కసరికొట్టు
కుపిత నాగసుందరి బుసల్‌గొట్టుచున్న రీతులగుఁగాని యివి జాబు
వ్రాతలగునె''[2]

అన్నదానిలోను, దాని తర్వాతి పద్యము నందును, శ్రీనాథుడు పోతన గుణ రూపములను గాంచి

'ఈ కళానిధిఁగాంచి లోకమ్ము కిడు తల్లి వెలఁదియే ధరఁ బాలవెల్లిగాక!'[3]

అనుదానియందును అపహ్నవము మనోజ్ఞముగా నలంకృతమై యున్నది.

కావ్యమున కొన్ని యెడల విభావన గలదు. ఒక్కొక్కచో ఇది విడిగా లేక ఇతరాలంకార సమ్మిశ్రితమై శోభిల్లుచున్నది.

పోతన శ్రీనాథుని సందర్శన మైనప్పుడు కవీంద్రుని ప్రశస్తి నిట్లు వర్ణించెను.

"మహి నస్తమింపని మార్తాండబింబమ్ము క్షయ మెఱుంగని పూర్ణచంద్ర
మండు
విలయమ్ము నందని విశ్వమ్మునకు స్రష్ట యక్షరలక్ష్మికి నాత్మ విభుఁడు''[4]

ఇత్యాదిగా గల పద్యమున రూపకానుప్రాణిత విభావన కలదు. ఇక్కడి విభావనా లంకృతి సుకవీంద్రుని ప్రశస్తిని శస్తముగా చాటుచున్నది.

1. పోతన చరిత్రము : 5-246
2. ,, ,, : 7-130
3. ,, ,, : 2-178
4. ,, ,, : 2-164

బమ్మెరకు భాగవత ప్రవచనము చేయవచ్చిన విప్రుని

''గురుమౌఢ్య రహిత గురుఁడో విరూప నయన స్వరూప విరహిత హరుఁడో పరివర్జిత చిహ్నసుధాకరుఁడో''[1] అని వర్ణించిన దానిలోను, యజ్ఞవరాహమును, ''తొండమే లేని చిత్ర వేదండ మిదియొ''[2] అని వర్ణించిన దానిలోను చక్కని విభావన సమకూడి యున్నది.

అందందు డంబు చూపుచున్న అతిశయోక్తికి

''గుట్టలం బిడికిటన్ గొట్టి పిండియొనర్చు నుర్వి నిట్టట్టుల నూఁపివేయు
అర్కేందు బింబమ్ము లాటబంతు లొనర్చు నూఁదివేయును మింట నుడు గణముల
తోయధిన్ గ్రోధాగ్నిఁ దుకతుక నుడికించుఁ గులగోత్రములఁ దన్ని కూలఁ ద్రోయు
గ్రహ తారకావళిన్ గడగడ వడఁకించు దిక్పాలసమితిని ధిక్కరించు''[3]

అని హిరణ్యాక్షుని ఘోరచర్యలు వర్ణించినది చక్కని చాటువ. మహోద్ధతుడు, బల పరాక్రమ దర్పితుడు మహాటోపము ఆడంబరము గల ప్రతినాయకుడగు హిరణ్యాక్షుని చర్యలు వర్ణించుటలో అతిశయోక్తిని ప్రయోగించుట యుక్తియుక్తమైనది.

పోతన జన్మించినప్పటి శుభావసర వర్ణనలో సహోక్తి సమలంకృతమై యున్నది.

''ప్రాచీ దిశాంగన ప్రభవించె మేరువున్ బంగారు కొండయై పాపఁడొదవె
తరులతాగుల్మాలిఁ గురిసె నీహారమ్ము కొమరుపైఁ గలినీళ్ళు గురిసెనంత
మొదవుల పొదువులన్ మోముంచె వత్సముల్ తననోట వ్రేలిడికొనె నిసుంగు
మబ్బుల సందునన్ మసలియాడె నినుండు పసిపాప పొత్తికన్ వసతిగొనియె
పక్షితతి కూజిత మొనర్చెఁ బట్టి యేడ్చెఁజుక్కజారెను కన్నీటిచుక్క జారెఁ
గమలములు విచ్చె బుడుతఁడు కనులు విచ్చె బాలభానుఁగాంచెను ప్రజ బాలుఁ గాంచె''[4]

1. పోతన చరిత్రము : I-102
2. ,, : II-185
3. ,, : II-179
4. ,, : I-113

కారణజన్ముడగు పోతన జన్మించినప్పటి పురుటి విశేషములకు అప సుప్రభాత వేళావిశేషములకు తాదాత్మ్యము భజింప జేయుట యిక్కడి సహో లోని విశిష్టత. లోకోపకారకుడగు పోతనకు ప్రకృతి అనుస్పందనము చెందిన అలంకారము పొందించుట అందముగా నున్నది. మరొక సుందరమైన సహో శ్రీరాముడు శివధనుర్భంగము గావించిన సందర్భమున సాక్షాత్కరించును.

"విల్లెత్తె నా రఘువీరుఁడు కౌశికు తనువునఁ బుల్క లెత్తన్ ముదముగ
తోడి తేండ్ల శిరాలతోఁబాటు ధనువును వంచెను జానకీవల్లభుండు
జనకు సంశయముఁ దోడ్కొని నారి మును వెన్కలాడించెఁ బంక్తిరథాత
జుం
నారితోఁబాటు శ్రీనారీలలామయౌ వైదేహి మదిఁ దనవంక కీడ్చె
అరయఁ బదునాల్గు భువనమ్ములందుఁగూడ నెదురెవండిక నాకని
ఎగసి యా
భార్గవుని దుర్మదమ్ముతోఁబాటు ధనువు విఱిచివైచెను శ్రీరఘువీరుఁడపుడు"

ఇక్కడ శ్రీరాము డొనర్చు శివధనుర్భంగము నందలి ఆయా క్రియ కనుగుణముగా కౌశికాదుల యనుస్పందనమును మధురమనోజ్ఞముగా సహోక్తి వర్ణించుట సమంజసముగా నున్నది.

సరసమై చవులూరించు సమాసోక్తులు కొన్ని కావ్యమున ప్రయోగిఁ బడినవి.

"ప్రకట శరత్కళా విభవ భాసురమౌ ఋతుకాల మందునన్
బకపక నవ్వ సాగెను విభావరి తారక లీను మల్లికా
నికర వికీర్ణరమ్య శయనీయ సితాంబరసీమ వాయు డో
లికల నిశాపతిన్ కలిసి లీలఁ జెలంగి సుఖాళిఁ దేలుచున్"[2]

శరదృతువులో చంద్రతారకా విభాసితమైన రాత్రిశోభను వర్ణించిన య పద్యమున ఒక భామిని ఋతుకాలమున పుష్పశయ్యపై చేరి ప్రియునితో క్రీడిం సంతోషించు అప్రస్తుత వృత్తాంతము స్ఫురింపజేయుచున్న యీ సమాసోక్తి విరచి

1. పోతన చరిత్రము : 11-17
2. ,, ,, : 3-193

త్కంఠుడైన పోతన కుద్దీపన విభావమై ఔచితీరమ్యమై యలరారుచున్నది. ఇట్లే పోతన దంపతుల సమాగమ సందర్భమునందలి

"నూత్నయౌవనపు మనోజ్ఞవాసన లేవా కుంజపుష్పితయగు కొమ్మకెఱుక
తానె వలచి కలయు దాంపత్యరుచి ప్రమాఁకుగడియ విడని తీవగరిత
తెలియు.''[1]

అను దానిలోను కమనీయ సమాసోక్తి తనరారుచున్నది.

ఇంకను కావ్యమున పరిణామము, పర్యాయోక్తి, యథాసంఖ్యము, స్మరణము వంటి యితరాలంకారము లెన్నియో సందర్భోచితముగా ప్రయోగింపబడియున్నవి.

## మిశ్రాలంకారములు :

కావ్యమునం దాయా పద్యములలో విడివిడిగా ఉన్న ఉపమారూపకాదులే కాక కొన్నిటిలో రెండు మూడలంకారములు సమ్మిశ్రముగా ప్రయోగింపబడి కవితా సౌందర్యమును ఇమ్మడి ముమ్మడి చేసినవి. ఇట్టివి ముప్పాతిక వరకైనను గలవు. వీనిలో తరచుగా ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, శ్లేష, స్వభావోక్తి, విభావన, కొన్ని యెడల అనుప్రాసాలంకారము చేరి వివిధ వర్ణముల పుష్పమాలికల వలెను వివిధ రత్నశోభిత హారముల వలెను పద్యములు శోభిల్లుచున్నవి. మచ్చునకొండు రెండు మాత్రము పేర్కొందును.

పోతన విరహార్తుడై శరద్రాత్రిని గాంచి వర్ణించిన దిగువ పద్యమున రూపకము, సందేహము కలిసి చెలువొందుచున్నవి. ఇందులోనే కొంత అంత్యానుప్రాసము భాసమానమై యున్నది.

"గగన సీమంతినీ గళవిరాజ న్మౌక్తికస్రజమ్మో తారకావ్రజమ్మో
విమల మందాకినీ వీచీ చలద్రాజహంసికాప్రతులో సితాభ్రతతులో ...."[2]

ఇట్లే పద్యమెల్ల సాగినది. ఇందు తారకావ్రజమును మౌక్తికస్రజముగా సందేహించుటచేత సందేహాలంకారమే ప్రధానమైనది. అందు గగనసీమంతినీత్యాదిగా రూపకము చేయుటచేత రూపకానుప్రాణితమై సందేహ మిచట సమకూడి వర్ణ్యవస్తు సౌందర్యోత్కర్షము నాపాదించుచున్నది.

1. పోతన చరిత్రము : 8-247
2. ,, ,, : 3-202

శ్లేషానుప్రాణిత రూపకమునకు గజేంద్రుడు మొరపెట్టిన దిగువ పద్యము లక్ష్యము.

"వాడిపోయిన సస్య వనరుహ సంతతిన్ గాంచి పయోదమై కరఁగు నెవఁడు
ఘన శాణములఁ దటిత్కరవాలముల నూరి దుర్భిక్షతామారి దునుము నెవఁడు
వినువీథిలో నింద్రధనువు నెక్కిడి క్షుధాద్యసుర సంహతిని వేఁటాడు నెవఁడు
అర్కేందునయన దివ్యాలోకనచ్ఛవిన్ ఘన తమో యవనికన్ గాల్చు నెవఁడు
సాంధ్యరాగమ్ము నెఱపి యీ సకల భూతపుంజమున్ నెమ్మదిగ నిద్రబుచ్చు నెవఁడు
మలయ పవన శీతల హస్తముల స్పృశించి ప్రాణికోటిని మేల్కొల్పు ప్రభు వెవండు."[1]

ఇందు సర్వత్ర భాసురరూపకము ప్రదర్శింపబడి 'సాంధ్య రాగమ్ము'చే శ్లేష సౌఖ్యము సమకూర్చబడినది. సాంధ్యరాగ మన సంధ్య యెరుపు, సంధ్యవేళ ఆలపించు రాగము అని అర్థద్వయము సిద్ధించి శ్లేష యొప్పినది. సంధ్యాకాల రాగవర్ణమే ఇంపు గొలుపునన అపుడది సంగీతరాగమైనచో దాని సొంపు వచింప నలవికాదు. అట్లే సాంధ్యరాగము నెరపి జీవకోటి నీశ్వరుడు నిద్రబుచ్చు ననుటలో ఎంతో వైశిష్ట్యమున్నది.

వర్ష వర్ణనలోని "ఎవనికై సింగిణి నవరత్నఖచిత సుస్వాగత ద్వారమై చదల మెఱయు"[2] అన్న పద్యము రూపకశోభితమై 'ఎండి నీర్‌నీరని గుండె ప్రయ్యఁ దటాక మెపఁడప్పులిత నింత యెగసి యాడు' నన్నదానిలోని 'అప్పులు' అన్న శబ్దము, ఎత్తుగీతిలోని 'ఘనుఁడు' అన్న పదము శ్లిష్టములై శ్లేషయు, 'సుకృతీ గతాయువు' అన్న లోకోక్తిచేత లోకోక్త్యలంకారమును కలిసి అలంకార త్రయ మిందు సుందరముగా శోభిల్లుచున్నది. ఇట్లే శరద్వర్ణనలోని "తెలి గగనంపుఁ బయ్యెద నదృష్ట పయోధరయై"[3] అన్న పద్యమున రూపకోపమాశ్లేష కలాప కదంబ కమనీయమై కావ్యసుందరి కాంతులీనుచున్నది.

1. పోతన చరిత్రము : 12-42
2. ,, 5-184
3. ,, 3-194

పోతన గంగా తటమున చంద్రోదయవర్ణన చేసిన దిగువ పద్యమున రూపకోత్ప్రేక్షాశ్లేషవితతి ముప్పేటల హారము వలె ముద్దులు గులుకుచున్నది.

"పద్మసంభవ రచిత ప్రపంచకావ్య మందముల రాశియయ్యు దోషాప్తి గనుట
దాని నొక కళానిధి సన్నిధాన మందు నుంచ సవరించునన
సోముఁడొప్పు దివిని."[1]

ఇందు ప్రపంచకావ్య మనుటచే రూపకమై, 'దోషాప్తి' 'కళానిధి' యను శ్లిష్టపదములచే శ్లేషయయి, 'సవరించునన' అనుటచేత ఉత్ప్రేక్షగా పర్యవసించు చున్నది. కావ్యము సుందరమయ్యు దోషములున్నచో సవరించుటకు ప్రాజ్ఞు డవసరమన్న సాహిత్యవిషయ మిందు ధ్వనించుచున్నది. కళానిధి ప్రపంచమును వలెనే ఇందలి యలంకారములు కవితారమణిని భాసిల్లజేయుచున్నవి. ఇట్లే అనేకా లంకారములు సమ్మిశ్రితములై వసంత వనకామిని వలెను శరత్పూర్ణిమా యామినీ భామిని వలెను కావ్యమును విరాజిల్లజేయుచున్నవి.

## శబ్దాలంకారములు :

రసవదర్థ రమణీయతానందన మగు పోతన చరిత్రమున బాహ్యశోభా హేతువులగు శబ్దాలంకారములు మిక్కిలి తక్కువగా నున్నవి. రసభావములపై అర్థ చమత్కారములపై దృష్టిగల వరదాచార్యులవారు యమకాది బాహ్యా డంబరములపై చిత్తము పోనీయలేదు. కనుటకు వినుటకు వెనువెంటనే ఆకర్షించునవి శబ్దాలంకారములు. ఇవి శ్రవణ సుభగములై శైలిని సుందరతరము గావించి కావ్య రస గ్రహణములో క్రమపాత్రలవలె సంగీత శ్రవణములో తాళ మృదంగ ధ్వనుల వలె ఇంపు గొల్పుచుండును. కావ్యమున శబ్దాలంకారము లరుదైయున్నను అంత్యాను ప్రాసము మాత్రము మిక్కిలి విభాజితమై యున్నది. దాని పిదప వృత్త్యను ప్రాసము, యమకము, ఛేకము, ముక్తపదగ్రస్తము గణ్యములై సకృత్తుగా యున్నవి.

శబ్దాలంకారములు అన్ని రసములందును శోభాకరములు కాజాలవు. అతిప్రయోగము రసభంగ హేతువు నగును. శృంగార హాస్య వీర రౌద్ర

1. పోతన చరిత్రము ; 5-24.

భయానకాద్భుతములందు నెక్కువగా శోభించును. కరుణమున పనికిరావు. శాంత బీభత్సములందును నంతగా రాణించవు. భక్తియందు సముచితముగా నొప్పారగలవు. ఇట్టి మెలకువలను దృష్టియందుంచుకొని ఆచార్యులవారు రసోదంచితముగా ఈ యలంకారములను ప్రయోగించినారు.

## అంత్యానుప్రాసము :

ఈ యనుప్రాసము కావ్యమున బహుభంగుల విన్యాసము కావించి విజయ ఢంక మ్రోగించినది. ఆంధ్ర భాగవతమునందు వలెనే యివి యింపు గొల్పు చున్నవి. ఇవి సమస్త నామ పదాంతము లందును, క్రియా పదాంతము లందును ప్రయుక్తములై యున్నవి. ఇవి వంద వరకు విస్తరించియున్నవి.

1. ప్రాయికముగా పూర్వకావ్యములందు వలెనే యిందును ఆశ్వాసాంత పద్యము లందు అంత్యానుప్రాసము కూర్పబడియున్నది. స్తుతిరూపకములైన ఆ పద్యములందివి వినసొంపై యున్నవి.

2. భాగవత పీఠికలో వలె పోతన చరిత్ర పీఠికలోను కొన్ని యిష్టదేవతా స్తుతి పద్యములు అంత్యానుప్రాసమున ఒప్పుచున్నవి.

"వాణీ, మదేభ కుంభకుచ భాగవిభాసిత వల్లకీ నటత్
పాణీ...."[1] అని సరస్వతిని,
"తలఁచి వేడెదమదిని సత్కావ్య విఘ్నవార వారణ వారణ వదన మదను
దాసమానసమౌఢ్య సంతమసపటల హరణ తరుణేందు రేఖాయితైక
రదను."[2]

అని విఘ్నేశ్వరుని వినుతించుట జరిగినది. సంస్కృత కవిజన స్తుతిలోను ఇదీ కలదు.

"వందనీయ ప్రతిభారవి భారవిన్ మేధారచిత రసమేఘు మాఘు...."[3]

3. పాత్రల రూపగుణాదిక వర్ణన చేయుటలో తదీయోత్కర్ష హేతుకముగా అంత్యానుప్రాస ప్రయోగము జరిగినది.

1. పోతన చరిత్రము : పీఠిక-6.
2. ,, ,, : ,, -9.
3. ,, ,, : ,, -19.

లక్కాంబను గురించి యిట్లు వ్రాయబడెను.

"నిరుపమభర్తృ భక్తి గుణనిర్జిత శైలసుతా భవానినిన్
పరహృదయాంబుజాలయ నివాస పరాజితశ్రీని సత్యసుం
దర శివ వాగ్వినోద పరితర్పిత వాణిని లక్కసానినిన్"[1]

చిదానందుని గూర్చి,

"మండిత కరధృత దండ కమండలు హసదాననేందు మండలుని....
ఘనకుండలునిన్."[2]

"కాషాయాంబర కవచిత వేషున్ రుద్రాక్షదామ విస్ఫారదురో
భూషున్ హరి పదమార్గాన్వేషున్.... జ్ఞానాగ్ని దగ్ధ నిజకృతదోషున్"[3]

పేద జవరాలిని గూర్చి,

".... ఇంతిని నూత్నయౌవన లతేందిర కౌఁగిటఁ జెంగలించు పూ
బంతిని గంతుదంతి నతిపావన రూపసుధాస్రవంతినిన్."[4]

వ్యాసుని గూర్చి,

''వ్యాసున్ మృగచర్మాసన భాసున్ నిజనీలతను విభాజలదాను
ప్రాసున్ నిగమత్రయీ విలాసున్ మదిఁగొల్తుఁ గవికలా విన్యాసున్"[5]

పోతనను గూర్చి దిగువ రెండు పద్యము లందును నిండుగా అంత్యాను ప్రాసములున్నవి.

"భక్తుఁడు రామనామ మధుపాన నిమగ్న ప్రమత్త చిత్త సం
యుక్తుఁడు....''[6]

"విగతాడంబరవేషి నాస్తిక కథావిద్వేషి....''[7]

శివుని గూర్చి,

"హరు నద్రిజాత సుమనోహరు నఘహరు....''[8]

(పద్యమెల్ల నిట్లే సాగినది)

1. పోతన చరిత్రము : 1-94
2. ,, ,, : 2-16
3. ,, ,, : 2-17
4. ,, ,, : 2-75
5. ,, ,, : 6-81
6. ,, ,, : 7-97
7. ,, ,, : 7-98
8. ,, ,, : 9-18

విష్ణువు గూర్చి

"వైకుంఠపుర వాసు వరకోటి రవిభాసు జలధర దేహు నాజాను
బాహు.... 1"

ఇందు రెండేసి పదాల కొకటి చొప్పున పెక్కు అంత్యానుప్రాసములు కలవు.

రుక్మిణీ బాలను గూర్చి,

"బాలిక సొగసుల కెల్లను నేలికయై తరుణ సరస హృదయమ్ములకున్
డోలికయై వలపుల పూ మాలికయై యెదిగె నుడురమణు పోలికయై"[2]

ఇట్లే పోతన ఆటల గూర్చి (1-128), నర్సమాంబను గూర్చి (3-22), సరస్వతిని గూర్చి (2-141, 9-53), లక్ష్మీదేవిని గూర్చి (5-290), రాముని గూర్చి (11-92), శకుని గూర్చి (6-82), ఇంద్రజిత్తు గూర్చి (11-86), విభీషణు గూర్చి (11-102), శ్రీవిష్ణువు గూర్చి (11-169, 268) ప్రహ్లాదుని గూర్చి (11-347) ఇంకను ఇతరుల గూర్చియు వర్ణించిన సందర్భము లందు చక్కని అంత్యాను ప్రాస శిల్పములు చెక్కబడి యున్నవి.

4. ఇతర వర్ణ్య వస్తు వర్ణనలలో సార్థక విశేషణ ప్రయోగములో అంత్యాను ప్రాసము కూర్చబడినది.

శరత్కాల తారకముల గూర్చి,

"తారకములు రసకణ విస్ఫారకములు తిమిర గగన శాణోల్లీఢ
శ్రీరాజిత మణి దీపాంగారకములు వెలుఁగు మోద కారకములుగన్."[3]

వసంత సుందరిని గూర్చి,

"అలివేణి మత్త కోకిల వాణి చూతపల్లవ పాణి సకల ఋతువుల
రాణి

వల్లీ తనువిలాస పుల్ల ప్రభాభాస మల్లికాహాస చంపక సునాస...."[4]

ఇట్లే యిందు ప్రతిపాదమున ఒక రకమైన అంత్యానుప్రాస మలంకృతమైనది. ఇదే విధముగా

1. పోతన చరిత్రము : 11-268
2. పోతన చరిత్రము : 12-217
3. పోతన చరిత్రము : 3-198
4. పోతన చరిత్రము : 6-7

"తరులతాకూట సుందర జటాజూట శోభిత చిత్రకూట
పర్వతము లెక్కి"[1]

అను పద్యము నాలుగు పాదము లందును ఇట్లే అంత్యానుప్రాస మలంకృతమై యున్నది.

గజేంద్రుని వేదనను గూర్చి,

"హరి రాక కల్ల, యిఁక ఈ కరి జీవిత మిల్ల, యా మకరి యాకటికై
యెర యనిన కొల్ల ధర నెవ్వరికిన్ గావలె ననాథ బాధ లవెల్లన్."[2]

మకరిని చంప బంపిన హరిచక్రము గూర్చి,

"పరమ దయాళువై మకరిఁ బట్టి వధింపఁగఁ బంపె వేగ శ్రీ
హరి కరభీషణోరగ ఫణాగ్ర మణిప్రభ లీను చక్రమున్
వర సురవైరి నాశ పరిపాలిత శక్రము నైకకోటి భా
స్కర కిరణ చ్ఛటాచ్ఛవి ధగద్ధగితాంబర చుంబి వక్రమున్"[3]

ఇట్టివే దిగువ పద్య సంఖ్యలలో గలవు.

2-121, 2-117, 4-124, 5-286, 7-114, 8-87, 9-93, 12-297.

5. క్రియా పదాంతములలో కొన్నిట అంత్యానుప్రాసము భాసిల్లు చున్నది.

పెండ్లి విషయము పోతన ఆందోళన :

"తండ్రి కెదురాడ నోడుచుఁ దరుణి రూప సరస సంపదన్ గూడుచు
స్వాంతమందు
శ్రీ రఘూత్తము వేడుచుఁ జివరి కెటులొ సిద్ధపడెఁ బోతనయుఁ బెండ్లి
చేసికొనఁగ"[4]

పెండ్లికి లజ్జామోదములు పెనగొన్న నర్సమాంబ స్థితి :

"కన్నులను వెన్నెలలు గాసెఁ గలికి సొగసు నవ్వులన్ మల్లియలు
బూచె నాణ్యమైన
గొంతులోఁ గోకిలలు గూసెఁ గొసరి కొసరి నడల రాజ హంసలు
కాళ్లఁ బడుచు దాసె."[5]

1. పోతన చరిత్రము : 11-51
2. ,, : 12-51
3. ,, : 12-80
4. ,, : 2-240
5. ,, : 2-246.

మోహినీ విలాసము :

"వలపులు మోసు లెత్తఁ జెలి వాల్గనులన్ హరుఁ జూచె నంతలో
మలయపు గాలి వీచె నవమల్లిక పూచె సుగంధ మాత్మలన్
నిలువునఁ దోచె నామని వనిన్ బలువన్నెలఁ దోచె శ్రావ్యమౌ
కలరుతులన్ శకుంత మృదుగాన వితానము లూఁచె నుల్లమున్."[1]

ఇట్టివి మరికొన్ని దిగువ పద్య సంఖ్యలలో గలవు.

4-267, 11-90, 11-93, 11-141, 12-108, 12-296.

ఇంకను ననేక విధముల పద్యములందే కాక గద్యములందును అందందు అందమైన అంత్యానుప్రాసములు దర్శనమొసగుచుండును.

## వృత్త్యనుప్రాసము ;

కావ్యమున వృత్త్యనుప్రాసము తక్కువగనే యలంకరింపబడి యున్నది. ఇవి ఇరువదియైదు వరకు శోభిల్లుచున్నవి.

శ్రీనాథుని బండి బమ్మెరపొలాల వద్దకు వచ్చి ఆగిన విషయము దిగువ రీతిగా వర్ణింపబడినది.

"చకచక గిత్తల కదుముకు త్రకిట ధికిట ధకిట ధా మృదంగధ్వని టక్
టికు మను కేదారాహతి నికట తటిని శకట మొకటి నిల్చిన యంతన్."[2]

ఇందు కకార టకారావృత్తి తరచై శబ్దధ్వని చేతనే బండినడక గోచరమగుచున్నది. పొలాల యొద్ద నొరసికొనుచు ఎడ్ల నడకచేత మృదంగధ్వనితో సాగి వేగము తగ్గి మెల్లగా వచ్చి నిల్చినట్లు ప్రత్యేకించి 'నికటతటిని శకట మొకటి' యనుటలో ద్యోతకమగుచున్నది. ఇక్కడ 'త్రకిట ధికిట ధకిట ధా'యను మృదంగ ఘాతలు బండినడకను దండిగా ధ్వనింపజేయుచున్నవి.

"బెడిదపు టడిదము లగుడము విడివడి కడుఁబోరుచుండ వెస లగుడము తా
నడిదపుఁ బిడికిటి ముడిపైఁ గడువడిఁ దాకుటయు నొచ్చి కత్తిని జార్చెన్"[3]

1. పోతన చరిత్రము : 11-123
2. ,, : 2-158
3. ,, : 7-212

ఇది బమ్మెర యువకవీరుడు దుడ్డుగట్టితో రాచకొండ సైన్యము నెదిరించి పోరాడిన వర్ణన. ఇందు డకారావృత్తి చేత దుడ్డుగట్టి ఖడ్గము మాటిమాటికి తాకుచు ధ్వనించుచున్నట్లు తెలియుచు లగుడయుద్ధ తీవ్రతను వ్యంజింపజేయుచున్నది. ఇట్లే కరి మకరి భీకర యుద్ధమువలని కొలని సంక్షోభమిట్లు వర్ణింపబడినది.

"వడులై సుడులై తడలై గొడుగుల గతి బుడగలెగయఁ గొలని జలాలన్
గుడగుడ బుడబుడమన్ సడి బుడగలెగయుచుండె దొడ్డ భూకంపమనన్."[1]

దీని తర్వాతి పద్యమగు 'తరగల యొరపిడి....' అన్నదియు చక్కని వృత్త్యనుప్రాసముచేత శోభిల్లుచున్నది.

దిగువ మనోజ్ఞ వృత్త్యనుప్రాసములు కొన్ని యుదాహరింపబడినవి.

"అన విని మునిగణములు సూతుని గని...." (1-13)

"సాగు జగంపు వీథి.... దినమ్ము జనమ్ము ధనమ్ము నమ్ముచున్...."
(1-189)

"గంగాభంగ తరంగ సంగత తటక్ష్మాజమ్ములన్...." (5-18)

"అని మొఱవెట్టుటల్" (11-62) అను పద్యమున 'జటాయువు సాయము చేయఁ గోరి' 'చంచుపుటాగ్ర నఖాగ్రఘాతలన్' 'అసిధారలఁ జెక్కెను పక్కి రెక్కలన్' అని మూడు వృత్త్యనుప్రాసలు కలవు.

"అన విని ముని దనుజుని గని యను మనమున...." (11-214)

"ఎన్నాళ్లటి.... యన్నుల మిన్నలు వెన్నునిఁ జెన్నుం గఁదొవలఁ బూజ సేసిరి" (12-96) మరియు 7-25, 11-350, 12-11, 12-258 సంఖ్యలు గల గద్యములలో అనేక వృత్త్యనుప్రాసములు చెలువొందు చున్నవి.

## ఛేకానుప్రాసము :

కావ్యమున ఛేకానుప్రాసము, యమకము చాల తక్కువగా ప్రయోగింపబడినవి.

వర్షములో తడిసి వచ్చిన నర్సమాంబ యందచందము లిట్లు ఛేకములతో చిత్రింప బడినవి.

1. పోతన చరిత్రము : 12-29

''అద్దిర! యప్పుడా యువతి యందము చందము గాంచ నచ్చునన్
గ్రుద్దిన యట్టు లంగచయ కోమలసౌష్ఠవ మెంతొ వింతగా
దిద్ది మరుండు నేర్పుమెయిఁ దీసిన చిత్రపటమ్ము కిమ్ముగా
నద్దము గట్టిపెట్టినటు లయ్యెను సన్నని చీర మాటునన్.''[1]

ఇందు నాలుగు ఛేకములు ప్రయోగింపబడినవి. నర్సమాంబ మొదలే అందాల రాశి. ఆపై వానలో తడిసి వస్త్రము లొంటి కంటుకొని యుండ మరుడు దీసిన చిత్రపటము వలె చెలువులు జిలుకుచుండెను. దానికి తోడు ఛేకానుప్రాస ములవలని చక్కని యలంకారములు చొక్కపు మెరుగులు దిద్దినవి.

దేవదాసి భోగినికి దుర్బోధ చేయుచు ఆమెను వర్ణించిన సందర్భమున ఛేకమిట్లు చెన్నై ఆమె సొగసుల నినుమడింపజేయుచున్నది.

"చలువలఁ బంచి పొల్గురియు చక్కని చిక్కని మోముగోముకున్
శిల కరఁగున్ లతన్వేతల చిక్కుల స్రుక్కఁగఁ జేయు హొన్ను మేల్
కళ ననలేను మేను తెలికల్వల చెల్వము నేలు మీలునున్
వలఁబడిపోవు నీ బెళుకు వన్నెల చిన్నెల కన్ను సన్నలన్"[2]

దిగువ కొన్ని ఛేకము లుదాహరింపబడినవి.

"అని వచియించెఁ గేసనయు నాత్మఁ గుతూహలతాలతా వితా
ననికర మంబరమ్మలమి నవ్వుల పువ్వుల నీనఁ బోతరాజు....''

(1-148)

''అక్కవికుమారుల కలభాషణంబులు పలుభూషణంబుల వలె చెవుల మివుల రుచిగొల్ప....'' (7-102)

"అట్టి వెలుంగు జాడ నొక హాటక రత్నవిమాన కాంతి గ
న్పట్టెను దాన వీణఁ గొని భామిని కోమల రూపరేఖలన్
గట్టిన పట్టుపుట్ట మలకల్ మలకల్‌గొని గాలిఁ దేలుచున్
జుట్టిన మేఘపంక్తులకుఁ జుట్టరికమ్మొనఁగూర్ప నేర్పుమై"[3]

---

1. పోతన చరిత్రము: 3-153
2. ,, : 4-180.
3. ,, : 9-48.

ఇందలి ఆరు ఛేకములు వాగ్దేవీసౌందర్యశోభ నినుమడింపజేయుచున్నవి. పై దాని తర్వాతి పద్యమగు "పుట్టిన మాసిపోవు" అను దానిలోను మూడు ఛేకములు చెలువుమీరి యున్నవి.

మరియు 4-346, 11-99, 11-190, 11-274, 11-298 పద్యము లలో ఛేకములు చెన్నారియున్నవి.

## యమకము ;

లక్కమాంబను వర్ణించిన దిగువ పద్యమున యమకము రమ్యగమకమై రాజిల్లుచున్నది.

"సావిత్రి సావిత్రి జన్మ మెత్తెనొ కలిన్ సత్యవంతుండౌర! సాధ్వి భర్త
యనసూయ యనసూయ నవతరించెనొ నేఁడు నత్రిగుణాకారుఁ డతిప పతియు
భూజాత భూజాత పుణ్యయయ్యెనొ తిర్గి రామాననుం డహో! రమణి వరుఁడు
సతి సతి యై పునర్జన్మ మెత్తెనొ యేమొ శంకరాచరణుఁడీ సకియమగఁడు
అల సుభద్ర సుభద్ర యై యవని దిగెనొ...."[1]

వాల్మీకిని వర్ణించిన పట్టున కమనీయములైన యమకము లిట్లు చమత్కార ముగా ప్రయోగింపబడినవి.

"తలక్రిందు రామశబ్దము జపించుటనేమొ తలక్రిందు చేసె నితరకవులకు
పుట్టనుండుటొ వేరె పుట్టనుండం డిట్టి కవి నాఁగ మ్రోఁగెను గంట మెందు
ఎఱుకౌటనో నాకె ఎఱుకయంతయనన సర్వజ్ఞు రాము హస్తగతుఁజేసె
ఏనాది జాతులఁ దానొకండగుటేమొ యే నాదికవి నని యెలుఁగఁ జెప్పె
అవని నవకావ్య మగుటనొ నవరసములు పలచి యేరులై యశ్లోక వార్ధిఁ గలిసె
రామకథ యౌటనో తక్క రాజకథలు రాము నీసాటి యను భావరాజి వెలసె"[2]

1. పోతన చరిత్రము : 1-96
2. ,, ,, : 11-4

ప్రతి పాదము నందును యమకము ప్రయుక్తమౌటచే వర్ణ్యమునకు మంచి ఆకర్షణ చేకూరినది. ఇట్లే ప్రతి పాదము నందును యమకముగల పద్యము శ్రీ రామచంద్రుని గూర్చినది "పుట్టెడుఁ గౌసల్యా పట్టియై హరియనం బుట్టెఁడు ప్రేమమ్ము పుట్టెఁ బ్రజకు''[1] అన్నది విన్నాణమై యున్నది. సీతాస్వయంవరము చాటిన దిగువ పద్యము హృద్య యమకమునకు గమకమైనది.

"ఎవ్వఁడా మహాదేవు విల్లెత్తఁగలఁడొ
వాఁడె జనక జామాతయై వఱలఁగలఁడు
ఎవఁడు తానెక్కిడఁగ లేఁడొ శివధనుస్సు
జనకాజాః మాతః యని యనఁజను నతండు"[2]

గజేంద్రుడు మొసలిని చూచినప్పటి విషయము వర్ణించిన పట్టున మంజుల మైన యమకములు మలచబడినవి.

"దాని దాని దా నిదానమ్ముగాఁ గాంచి
మ్రానొ మీనొ కాని మేనిఁ దేల్చి
మకర మంచు నెంచక కరమ్ము సారించె.... "[3]

ఇట్లే యమకములు దిగువ పద్య సంఖ్యలలో ఒప్పారు చున్నవి.

పీఠిక-9, 3-223, 5-92, 6-3, 7-75, 7-226, 9-67, 10-68, 11-15, 11-146, 12-94, 12-144, 12-146.

## ముక్తపదగ్రస్తము ;

అన్నిటికంటె తక్కువగా వాడబడినవి ముక్తపదగ్రస్తములు. ఇవి ముచ్చటగా మూడు నాలుగు మాత్రము కానబడుచున్నవి. ఈ యలంకారముల వలన వాక్యముల కవ్యవహితత్వమేర్పడి పఠించుట కుత్కంఠ చెలగి విన సొంపుగా నుండును.

1. పోతన చరిత్రము : 11-10.
2. ,, ,, : 11-14.
3. ,, ,, : 12-21.

1. పోతన శ్రీరాముని స్తుతించిన దిగువ పద్యమున నిది శోభిల్లుచున్నది.

"రామా రఘుకుల జలనిధిసోమా! సోమక సురారి సూదన భీమా!
భీమాగ్రజాతనుత పదతామరస! రసస్వరూప! దర్శన మీవే."[1]

2. "సంధ్యాతపాగ్నిలో జాతరూప నగమ్ము కరఁగి పాఱిన యట్టులరుగు జలము జల పూరములలో....."[2] ఇది గౌతమీ శోభా వర్ణనములోనిది.

3. రాముఁడు సీతా వియోగము నందిన తరువాతి ఘటనలు దెల్పు దిగువ పద్యమున ఈ యలంకృతి కలదు.

"అనుచు సోదరు వెంట నడవులన్ మడువులన్ జెట్టుగుట్టలఁ బట్టి చింతనేఁగు
ఏఁగి యంజని సూనుఁడెఱిఁగింప ననుకంప న్గది సుగ్రీవున కభయ మిడును
అభయమ్మొసఁగి....."[3]

పద్య మెల్లయు నిట్లే ముక్తపదగ్రస్తముతో సాగినది.

4. గజరాజు క్రీడించిన కాసారమును తత్పరిసర దృశ్యములను వర్ణించిన సుదీర్ఘ గద్యము ముక్తపదగ్రస్తాలంకృతమై వొల్చుచున్నది.

"తత్సవిధ ప్రదేశంబుల.........పచ్చిక బయళుల యందమ్ములును, తమ్ముల విభవమ్ములకు.........కొలఁకులును, కులసతులం బలె...."(12-11)

ఇట్లే తక్కిన వాక్యములు సాగినవి.

ఈ రీతిగా పోతన చరిత్రము బహువిధార్థాలంకార శబ్దాలంకారముల చేత రమ్యముగా రసోదంచితముగా దిద్ది తీర్చబడి రసజ్ఞుల యెడందలకు విందొనగుచున్నది.

---

1. పోతన చరిత్రము : 2-140
2. ,, ,, : 5-17
3. ,, ,, : 11-68

# భాషా వైచిత్రి

## భాషా ప్రశస్తి :

కావ్య నిర్మాణమునకు భాష ఉపాదాన కారణము. బ్రహ్మ ప్రకృతి చేత జగములను సృష్టించునట్లు కవి భాష చేత కావ్యములను నిర్మించును. భవన నిర్మాణమునకు ఇటుకలు మృత్తిక సిమెంటు మున్నగు ముడి పదార్థము లవసరమగునట్లు కావ్య నిర్మాణమునకు శబ్దజాల మవసరమైయుండును. పంచభూతముల చేత శరీరమేర్పడునట్లు పదజాతముల చేత ప్రబంధము కూర్పబడుచున్నది. కావ్య స్వరూపమును గూర్చి వివరించుచు

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్". [1]. అని భామహుడును,
"శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ." [2]. అని దండియు,
"తనువగు శబ్దార్థంబులు." [3]. అని బట్టు మూర్తియు నిర్ధారించి చెప్పిరి.

ఈ యాలంకారికుల వాక్యములన్నియు శబ్దార్థములు కావ్య శరీరమని తేట పరచుచున్నవి. కావ్య శరీరమగు శబ్దార్థములలో అర్థమునకు మూలము శబ్దము కావున కావ్యసృష్టికి శబ్దమే-భాషయే-మూలహేతువగుచున్నది. ఇక్కడ శబ్దార్థములు తనువగుటచేత శబ్దము స్థూలశరీరము, అర్థము సూక్ష్మ శరీరమగు మనస్సు అని భావించుట యుక్తము.

ఆచార్య దండి శబ్దప్రాశస్త్యమును ఇటుల నుద్ఘోషించెను.
"ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రా సంసారం నదీప్యతే". [4]

1. కావ్యాలంకారము : 1-16
2. కావ్యాదర్శము : 1-10
3. కావ్యాలంకార సంగ్రహము ; 2-53
4. కావ్యాదర్శము : 1-4

అనగా 'శబ్దమను జ్యోతి ప్రకాశింపజేయనిచో త్రిలోకములు నిబిడాంధకారములో మ్రగ్గిపోయెడివి'-అని నుడువుటచేత శబ్దమునకు గల ప్రశస్తి యెంతటిదో అవగత మగును. లోక వ్యవహారమునకు సమస్త విజ్ఞానమునకు మూలసాధనమైన శబ్దము కావ్యమునకు కాకుండు టెట్లు ?

భారతీ జననీ స్తన్యములగు సంగీత సాహిత్యములకు ముఖ్య పదార్థములు పదార్థములు. అందు సాహిత్యమున కావ్యసుందరికి పదపదమున పదములే యావ శ్యకమై యుండును. శబ్దముల వల్లనే అర్థములు, భావములు, రసములు తదితర సర్వకావ్య సామగ్రి పరిఢవిల్లును. సమర్థమగు శబ్దజాలము చేతనే కావ్యశరీరము పటిష్ఠమై యొప్పును. సుందరమైన భాష చేతనే కావ్యశరీరము సుష్ఠుగా శోభిల్లును. కావున కవులు కావ్య నిర్మాణమునకు ప్రాతిపదికయగు భాషను ప్రప్రథమమున నభ్యసించి సుశబ్దమునకు శబ్దశాస్త్రము నధిగమింపవలసియుండును. కావ్యరచనకు కావలసిన ప్రధాన లక్షణత్రయములో మొదటిదగు వ్యాకరణమున వ్యుత్పత్తి సంపాదింపనిదే అడుగు కదలదు. నుడుగు పొదలదు. అందుకే 'మొదట భాషా శుద్ధి పిదప కవితాసిద్ధి,-అన్నారు. ఇట్టి మహత్తర శబ్దార్థ సాధనకు మహాకవులు తపించినారు. కాళిదాసు "వాగర్థ ప్రతిపత్తి" నపేక్షించి జగత్పితరులగు పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించెను. పోతన "జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శోభిల్లన్ బల్కుము నాదు వాక్కునను" అని సరస్వతిని వేడుకొనెను.

కావ్యమున ప్రయోగింపవలసిన రసోదంచిత భాషను గూర్చి యాలంకారి కులు చర్చించినారు. సన్నివేశమునకు పాత్రకు భావమునకు దగిన శబ్దజాలము సమకూర్పవలెనని విశదీకరించినారు. ఆయా వృత్తులకు దగిన రీతులు పాకములు నొనగూర్చి రసజ్ఞులకు నవసరతృప్తి గావించవలెనని వారి యభిప్రాయము. పింగళి సూరన 'పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన లీలఁ దమలోన దొరయు శబ్దములు గూర్చి' యని యిత్యాదిగా చెప్పిన విషయము సముచిత వృత్తిరీతులను సమకూర్చి రచన చేయవలెననియే వివరించుచున్నది. వరదాచార్యులనారు కావ్య పీఠికలో కృతికన్యను వర్ణించుచు........"సరసాత్మ పతి, విమర్శకుఁడత్త, వ్యాకృతి తానాఁడపడుచు, ఛందస్సు నడత,-రమ్య శయ్యల సరసుని రతులఁదేల్చి రూఢి మధుర ద్రాక్షాపాక రుచులఁదప్పి-భవ్య గుణరీతి సాహిత్య బంధు వితతి- తలల నూపించు కృతికన్య ధన్యభువిని"- 1. అని వివరించిరి. రమ్య శయ్యలచేత

1. పోతన చరిత్రము : 'పీఠిక' -13

అనగా మనోజ్ఞమైన పదముల పొందికచేత రసజ్ఞుని సంతోషపెట్టి మధురమైన ద్రాక్షాపాక రుచులతో తృప్తిగావించి చక్కని ప్రసాదాది గుణములచేత వైదర్భి ప్రభృతి రీతులచేత సెబాసనిపించు కావ్య సుందరియే చరితార్థ యైనదని నుడువు టలో శబ్దార్థ ప్రయోగములనెంత మెలకువగా చేయవలెనో ద్యోతకమగుచున్నది. ఇక్కడ వ్యాకరణమును ఆడపడుచు అన్నారు. వధువులో నే వంక కనబడినను ఆడిపోసికొను ఆడుబిడ్డవలె శబ్దములో నే దోషమున్నను వ్యాకరణము పట్టివేయును. ఆడుబిడ్డ మెచ్చిన కోడలు అందరిమెప్పు గాంచినట్లు వ్యాకరణ మొప్పిన భాష సకలపండితామోదము నందగలదు. కావున ఇచటి యీ యుపమానము సమం జసముగా నున్నది.

## పోతన చరిత్రము నందలి భాష:

కావ్యము నందలి భాష సమసంస్కృతాంధ్ర సమ్మిశితమై సమంజస వృత్తి రీతి పాక శయ్యాసౌభాగ్య శోభితమై సుందర పద బంధురమై జాతీయమై రమ్యమై రసవంతమై ప్రబంధ శైలి నొప్పారు చున్నది. గుణరత్న రత్నాకరమైన యిందలి భాషా వైచిత్రిని సంగ్రహముగా చర్చింతును.

## శైలి:

పోతన చరిత్రము నందలి శైలి ప్రబంధశైలి. ఈ మహాకృతి ప్రబంధముగా నిబంధింప బడినది కనుక యిందలి శైలి ప్రాబంధికమై యొప్పుచున్నది. ప్రబంధ లక్షణములలో 'ఆలంకారికమైన శైలి ప్రబంధమునకు జీవము'-అని 'పోతన చరిత్రము-మహాప్రబంధము' అన్న వ్యాసమున వివరింపబడెను. ఇందాలంకారిక మైన శైలి కలదనుటకు ఆలంకారికత వ్యాసమే నిదర్శనము. ప్రకృష్టమై ప్రౌఢమై యాలంకారికమైన యిందలి శైలి యచ్చముగా ప్రాబంధికము. కాగా 'మహా ప్రబంధము' వ్యాసములో విశదీకరించిన రీతిగా పూర్వ ప్రబంధములు కొన్నిటిలో వెక్కసమైనట్లు అతిదీర్ఘ జటిల సమాసక్లిష్టత లేక, రసహీనమైన శుష్కాలంకార భారము లేక సముచిత సారళ్యసారస్యములను సంతరించుకొని భవ్య నవ్య కవితా ద్యుతి విలసితమై చెలువులు విరజిమ్ముచున్నది. ఈ శైలి మనుచరిత్రము, పారిజాతాపహరణము, కళాపూర్ణోదయము, కాళహస్తి మాహాత్మ్యము, విజయ విలాసము వంటి బంధుర ప్రబంధముల శైలిని పోలియున్నది.

## వృత్తి రీతి పాకములు:

కావ్యమున రసోపస్కారములగు కైశికి మున్నగు వృత్తులకనుగుణముగా రీతులు పాకములు, సమకూర్పబడి రచన రసవంతమై రాజిల్లుచున్నది, ఇక్కడ వృత్తి రీతి పాకముల గూర్చి రవంత వివరింపవలసియున్నది.

రసాభివ్యక్తికి యోగ్యములైనవి వృత్తులు. శృంగారాది రస వ్యాపారములు వృత్తులనబడును. ప్రకాశవర్షుడు వృత్తి పదము నిట్లు నిర్వచించెను.

"రసోచితార్థ సంబద్ధ పద సంతాన శాలినీ
మనోవికాస సంకోచ వర్తనాత్ వృత్తిరుచ్యతే''.[1]

అనగా రసానురూపమైన అర్థములతో గూడిన పదసమూహము గలదై మనస్సుకు వికాస సంకోచములు గలిగించునట్టిది కావున వృత్తి యనబడుచున్నది. మరియు అభినవ గుప్తుడు 'రసోచిత ఏవ చేష్టా విశేషో వృత్తిః'-[2]-అని రసమునకుచితమగు చేష్టయే వృత్తి యనెను. ఈ వృత్తులు కైశికి, ఆరభటి, భారతి, సాత్త్వతి అని నాలుగు విధములు.

సుకుమార రసములగు శృంగార కరుణములలో కైశికి, ఉద్ధతరసములగు రౌద్ర బీభత్సములందు ఆరభటి, కించిత్సుకుమారములగు హాస్య శాంతాద్భుతములలో భారతి, ఈషత్ప్రౌఢములగు వీర భయానకములలో సాత్త్వతి యొప్పునని చెప్పబడినది. రస ప్రకాశకములగు ఇట్టి వృత్తుల నాశ్రయించి రీతులు చెలువొందు చుండును.

రీతియన పదముల కూర్పుయొక్క తీరు. దీనినే పద్ధతి, రచన, శైలి యనియు వ్యవహరింపనగును. రీతిని ప్రకాశవర్షుడిట్లు నిర్వచించెను.

"దేశ రుచ్యా వచోన్యాసో రీతి రిత్యభిధీయతే".[3].

అనగా ఆయా దేశీయుల యభిరుచిని బట్టి కవులు ప్రదర్శించు వాగ్విన్యాసమే రీతి యనబడును. రీతిప్రాధాన్యవాది యగు వామనుడిట్లు వచించెను.

"రీతిరాత్మా కావ్యస్య, విశిష్టా పదరచనా రీతిః, విశేషో గుణాత్మా"-[4]

---

1. రసార్ణవాలంకారము : 3-24.
2. ధ్వన్యాలోక లోచనము : 3.
3. రసార్ణవాలంకారము : 3-16.
4. కావ్యాలంకార సూత్రవృత్తి : 1వ అధికరణము, 2వ అధ్యాయము, 6, 7, 8 సూత్రములు.

అనగా కావ్యమునకు ఆత్మ రీతి, ప్రసాదమాధుర్య గుణములతోగూడిన విశిష్ట పద రచనయే రీతి. వామనుడు రీతి కావ్యాత్మ యనుటచేత కావ్యమున రీతికి గల ప్రాముఖ్యము విశదమగును. రీతులు వైదర్భి, గౌడి, పాంచాలి యని త్రివిధములు. కోమల పదరచన వైదర్భియనియు, ప్రౌఢపదరచన గౌడియనియు, ఉభయ విధ రచన పాంచాలి యనియు తెలుపబడినవి. ఈ రీతులును రసోపస్కారకములే. ఐనను వృత్తులకు రీతులకు భేదము కలదు వృత్తులు నాట్యాశ్రయములు, రీతులు రచనాశ్రయములు అనగా వృత్తులు రసానుకూల నాయక వ్యాపారములు. కావున సాక్షాద్రసోపస్కారకములు. ఈ వృత్తులను రీతులు సముచిత శబ్దములచేత వ్యక్తము చేయును కావున పరంపరగా రసోపస్కారములు.

ఇక పాకములనగా కావ్యార్థరుచులు. 'అర్థగంభీరిమా పాకః'-అని ప్రతాప రుద్రీయము. అనగా రసాస్వాదనలో సహకరించు విధముగా శబ్దార్థములను కూర్చుట పాకము. ఈ పాకములు వృత్తిరీతి గుణముల కలయికవలన నేర్పడును. ఇవి ద్రాక్షాపాకమనియు నారికేళపాకమనియు కదళీపాకమనియు ముప్విధములు. అగూఢమైన అర్థరుచి ద్రాక్షాపాకము, గూఢార్థరుచి నారికేళపాకము, నాతికఠినము నాతి సులభమైన అర్థరుచి కదళీపాకము. ఈ పాకము లేర్పడుటలో నుపకరించు ప్రసాదాది గుణముల గురించి 'ఔచితీ రామణీయకము' వ్యాసమున వివరింపబడెను.

కావ్యములందు ఏయే వృత్తులకేయే రీతి గుణ పాకము లొప్పారుచుండునో దిగువ తెలుపబడినవి.

కైశికీ వృత్తి-వైదర్భీరీతి-ప్రసాద మాధుర్య సౌకుమార్య గుణములు - ద్రాక్షాపాకము.

ఆరభటీవృత్తి-గౌడీరీతి-ఓజోగుణము-నారికేళపాకము.

భారతీవృత్తి<br>సాత్త్వతీవృత్తి } -పాంచాలీ రీతి-ఔదార్యగుణము-కదళీపాకము.

పై రీతిగా పొంది పొసగి యెసగిన రచనకు పోతన చరిత్రమెల్ల ఉదాహరణీయమే. ఇక ఈ విషయము 'ఔచితీ రామణీయకము' వ్యాసమున గుణౌచిత్యమున కొన్ని లక్ష్యములుటంకింపబడినవి. ఐనను కతిపయ కమనీయ లక్ష్యములను దిగువ పేర్కొందును.

## కైశికీవృత్తి :

"వెన్నయటుల్ మనస్సులు ద్రవించె ముఖాబ్జము లప్రయత్నతన్
సన్నిహితంబులై పెనఁగె సప్రణయేక్షణ ఖంజరీటముల్
మిన్నెగఁబ్రాకె జంటఁగొని మేనులు తానములాడె సౌఖ్యసం
పన్నది దేశకాల సముపస్థితి మాటుమడంగె నిర్వరన్"[1]

ఇది పోతన దంపతుల శృంగారమును వర్ణించినది. సుకుమార రసమగు శృంగార మును ప్రకటించుటచేత నిది కైశికీవృత్తి. దీనిని వైదర్భీరీతి సముచితముగా వ్యక్తీకరించినవి.కోమల పదరచన వైదర్భి యనుటచేత నిందలి పదములు కోమల ములై యొప్పుచున్నందున నిది వైదర్భీరీతి విలసితమైయున్నది. ఈ రచనలో సుప్రసిద్ధ పదముల కూర్పు బంధ శైథిల్యముతో నొప్పి పృథక్పదత్వము చేత భాసిల్లుచున్నందున ప్రసాద మాధుర్య గుణములు శోభగొలుపుచున్నవి. ఇది అగూఢమైన అర్థరుచి గలిగి శ్రమలేకుండ అర్థమై రసాస్వాదన యోగ్యమైనందు వలన నిది ద్రాక్షాపాకమున చవులూరించుచున్నది. ఈ రీతిగా నిది వృత్తి రీత్యాదుల కనుగుణముగా సమంచిత శబ్దవిన్యాసముచేత నొప్పారుచున్నది.

ఇట్లే మోహినీ విలాస వర్ణనలోని దిగువ పద్యము హృద్యమగు నుదాహరణము.

"వలపులు మోసులెత్త చెలి వాల్గనులన్ హరుఁజూచె నంతలో
మలయపు గాలి వీచె నవమల్లిక పూచె సుగంధ మాత్మలన్
నిలువునఁదోఁచె నామని వనిన్ బలువన్నెలఁ దోఁచె శ్రావ్యమౌ
కలరుతులన్ శకుంత మృదుగాన వితానము లూఁచె నుల్లముల్"[2]

కరుణ రసావిష్కారము గావించు కైశికీవృత్తి దిగువ పద్యములలో వరలినది.

"తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి
గొంగడిలో శని గూరుచుండ"—దీనభిక్షుకుని వర్ణన - (5-233)

"వలవల కంటి నీర్వడిపి వందురుచున్నయవీ యసిన్వగన్"- (3-303)
—భార్యావియోగము నందిన శ్రీనాథుని దుఃఖవర్ణన.

"పరమ కృపాధనా! ప్రణతభక్తజనావన! నీవు దక్క నే
శరణము లేదు నాకు...."—గజేంద్రుని మొర (12-48)

---

1. పోతన చరిత్రము : 3-242
2. ,, ,, : 11-123

ఇట్లే శృంగార కరుణ రస వ్యాపారములలోని వైదర్భీరీతి విలసిత పద్యములు కావ్యమున కొల్లలుగా గలవు.

## ఆరభటీ వృత్తి :

"మఖవారాహ కళేబరాయిత మహా మంత్రానల ప్రోజ్జ్వల
చ్ఛిఖలన్ జ్ఞాన విహీన దైత్యపశు విచ్ఛిన్నాంగముల్ బంధకృ
న్నిఖిలాత్మీయ కళత్రపుత్ర మమతాస్నేహాజ్యధారాహుతుల్
సుఖదుఃఖప్రద కర్మకాష్ఠ సమిధస్తోమమ్ముతో భస్మమై"[1]

ఇది యజ్ఞవరాహము హిరణ్యాక్షుని వధించిన విషయమును వర్ణించినది. బీభత్సము పెల్లుబికిన ఆరభటీవృత్తి. ఈ వృత్తిని గౌడీరీతి ప్రస్ఫుటీకరించినది. సంయుక్తాక్షరములు వర్గయుక్కులు గల శబ్దములు తరచై దీర్ఘసమాసాన్వితమైన ప్రౌఢ పదరచన యగుటచే నిది గౌడీరీతియై సమంజసముగా రసప్రకటన గావించినది. గూఢార్థరుచి యుండుటచే నిది నారికేళపాకమున బడి యర్థావగాహనలో శ్రమ కలిగించుచున్నది. గాఢ బంధ పదబంధముండుట చేత నిది యోజోగుణ విభ్రాజితమై యున్నది.

ఇట్టి గౌడీరీతికి దిగువ పద్యములు మరికొన్ని మచ్చుతునకలు.

"కుల భూభృచ్ఛిఖరాగ్రసన్నిభ గదా ఘోర ప్రహారాహతిన్-"(11-193)
-ఆది వరాహ హిరణ్యాక్షుల భయానక యుద్ధము.

"శశ్వదరాళ దంష్ట్రికరాళాస్యంబు
ప్రళయార్కబింబమై భయము గొల్ప" - (7-233)
-రాచకొండ సైన్యమును క్షోభపెట్టిన వరాహమూర్తి ప్రచండ రూపము.

"నగశృంగ నిర్గతాపగలట్లు భిన్నమూ
ర్ధములఁ గీలాలంబు ధారలొల్క" - (7-236)
-వరాహమూర్తి రాచకొండ సైన్యమును చేసిన బీభత్సము.

"అరుణ సరోజరాజి పరిహాస మొనర్చెడి నేత్రసీమలన్" - (4-355)
-సింగన్నపాల హసితుడైన పోతన రౌద్రము.

1. పోతన చరిత్రము : 11-200

## భారతీ సాత్త్వతీ వృత్తులు :

"కరమున వెల్గు దండమది కన్గవకున్ గనరాని యట్టులన్
బిరబిర ద్రిప్పుచున్ భటుల పీఁచ మడంచుచు నెందుఁ దానెయై
యుఱుముచు శత్రుశీర్షముల నుద్దవడిన్ జని ఫక్కుఫక్కునన్
దుఱుమొనరించుఁ జిమ్మిపడి తోడనె నెత్తురు చేర్లు వాఱఁగన్-"[1]

ఇది బమ్మెర యువకవీరుడు రాచకొండ సైనికుల నెదిరించి కఱ్ఱయుద్ధము చేసిన వర్ణన. వీరరసమును విస్తరింపజేసిన యిది సాత్త్వతీవృత్తి. దీనిని పాంచాలీరీతి సువ్యక్తము చేసినది.కోమలత ప్రౌఢత సమ్మిశితమై యొప్పునట్టి యీ రీతి యిచట యుక్తమైయున్నది. ఇది కదళీపాకరుచి నొప్పారి యించుక శ్రమతో రసాస్వాదన మున కవకాశమిచ్చుచున్నది. ఇది యౌదార్యగుణ విరాజితమై సముచితమై యున్నది.

"ఒదవె సుషుమ్న ద్వంద్వ పవనోర్మికలందు లయించె నెంతయున్
గదలికలేని వారివలె గాలిఁ జనింపని దీపె యట్టులు
న్మదతను వీడు బుద్ధి గత మత్సరుడై గ్రసియించు రాహు ము
క్తిఁదనరు సోము భాతిఁ గవి తేజరిలెన్ ఘటితామనస్కతన్."[2]

గౌతమీ సైకతమున పోతన మహేశ్వరధ్యాన నిమగ్నుడైన విషయము వర్ణించిన యీ పద్యమున వరలు శాంతమును భారతీవృత్తి నిర్వహించినది. దీనికి తగు రీతిగా పాంచాలీరీతి పొసగి కదళీపాకపు కమ్మదన మెసగియున్నది.

"వాయువె హంసనాఁ జెలఁగి వాహకుఁడై శిబికాభరమ్మిటుల్
మోయఁ దొడంగెనో...."[3]

అను పద్యము శ్రీనాథుని పల్లకి బోయీలు లేనిదై ఆకాశమున సాగినప్పటి యద్భుతమును వర్ణించినది. ఇందు భారతీవృత్తి పాంచాలీరీతి కదళీపాకము సమంచితముగా విలసిల్లు చున్నవి.

1. పోతన చరిత్రము : 7-211
2. ,, : 5-79
3. ,, : 8-28

ఈ విధముగా కావ్యమున పోషించబడిన శృంగారాది రసముల ప్రకటనలో చెలువొందిన కైశిక్యాదివృత్తుల కనుగుణముగా గుణములు రీతులు పాకములు శోభిల్లి రచన రమణీయమై యున్నది. రసోచిత భాషాప్రయోగము జరిగినదనుట కిది తార్కాణమై యొప్పుచున్నది.

## శయ్యా సౌభాగ్యము

శయ్య యన పదముల పొందిక. దీని గూర్చి బట్టుమూర్తి యిట్లు నిర్వచించెను.

"కదిసి పదంబులు ముందటి
పదములతోఁ బరమమైత్రిఁ బరగి పరపదా
స్పదమనకుండిన గతులం
దది శయ్య...."[1]

పదము లొకదాని కొకటి పొంది పొసగి యొప్పిన నది శయ్య. ఏ పదము తర్వాత ఏ పదము కూర్చిన అందముగా నుండునో యది దృష్టియంచిడుకొని ఏర్పరచిన పదముల కూర్పే శయ్య చెలువలు వలువలు దాల్చునపు డే చీరకే రవిక సరిపడి శోభించునో ఆలోచింతురు. మాలాకారుడు దండలల్లునప్పు డే పువ్వునకే పువ్వు జతపరచిన సుందరముగా నుండునో విచారించును. అదే విధముగా కవులు 'పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన లీలఁ దమశోన దొరయు శబ్దముల' నేర్చి కూర్చి కవితలల్లుదురు. మనుజుల కెత్తు వంపులు లేని పర్యంకశయ్య యెట్టిదో కావ్యమున శబ్దశయ్య యట్టిది. ఇందొక పదము తీసి వేరొకపదము చేర్చిన శయ్య చెడిపోవునంత యొద్దికగా నుండును. కావున శయ్యకు పరివృత్త్యసహిష్ణుత యను నామాంతరము కలదు.

పోతన చరిత్ర మామూలాగ్రముగా మంజుల శయ్యా సౌభాగ్యమునకు సదనమై పొదలుచున్నది. ఇది సరసుల నాకర్షించి మిక్కిలి యాహ్లాద పరచు చున్నది.

ఉపవనమును వర్ణించిన పోతన కవితకలరి సింగనృపతి యిట్లు ప్రశంసించెను.

1. కావ్యాలంకార సంగ్రహము: 3-33.

"జల జల పూలు రాలినటు చల్లని మెల్లని పిల్లతెమ్మెరల్
తెలతెల వాఱె వీచినటు తియ్యని కమ్మని పాలమీఁగడల్
తొలి తొలి తోడు విచ్చినటు తోరపుసిగ్గున ముగ్ధ కన్నెవల్
వలపులఁ జిమ్మినట్లు చెలువమ్మొలికించు భవత్కవిత్వముల్"[1]

ఇందలి పదములెల్ల నేర్పుగా కూర్పబడి చక్కని శయ్య ఏర్పడినది. ఇందు ఒక్క శబ్దము కూడ మార్చుటకు వీలులేనంత విన్నాణముగా శయ్య సవరింపబడి యున్నది. ఇట్టి రమ్య శయ్యకు మరికొన్ని లక్ష్యములు దిగువ పేర్కొనబడినవి.

"అభ్యంగనపుఁ బచ్చియార్చు పెన్నెరులలో
శృంగార వార్ధి తరంగ మడర" (2-243)
"అరుణారుణ బింబోదయ-" (2-266)
"నెల గుండియలఁ బిండి సెలయేటి యెలబోటి
యిల క్షీర వారాశి నొలుకఁబోయ"- (3-192)
"జిలిబిలి ముద్దు పల్కులను జేతమునన్ గిలిగింతవెట్టు"- (4-39)
"అందము చిందులు ద్రొక్కెను"- (4-257)
"నవ్వులు నవ్వ ముద్దు వదనమ్మునఁ బువ్వుల రువ్వ భాషణల్"(5-109)
"అందాలన్ విరజిమ్ము సత్కృతి, సువర్ణానూన శోభాలసత్"-(9-330)

ఇట్లే యుదాహరించుచు బోయిన కావ్యమెల్ల పేర్కొనవలసి వచ్చును.

## సంస్కృతాంధ్ర శబ్ద ప్రయోగము :

పోతన చరిత్రమున సంస్కృతాంధ్ర శబ్దములు సమానముగా ప్రయోగింపబడి యున్నవి. ఇవి మల్లెలు మొల్లలవలె, ముత్యాలు పగడాలవలె, చిలుకలు కోయిలలవలె కలసి మెలసి ఇంపుల సొంపుల పెంపెసలారి యున్నవి. ఉభయ భాషా సమప్రయోగ చాతుర్యములో నిది శ్రీ మహా భాగవతమును తలపునకు దెచ్చుచున్నది. ఇది యాచార్యులవారి యుభయ భాషా వైదుష్య వైశిష్ట్యమును ప్రస్ఫుటీకరించుచున్నది. ఒక్కొకచో రచన సాంస్కృతికమై మరొక్కచోట అచ్ఛికమై వేరొక చోట ఉభయ సమ్మిశితమై ఉల్లసింపజేయుచున్నది. క్రమముగా వీనిని ప్రదర్శింతును.

1. పోతన చరిత్రము : 4-187.

## సాంస్కృతిక రచన :

ఇందు సాంస్కృతిక రచన తరచుగా దీర్ఘ సమాస కలితమై యున్నది.

"వప్రాట్టాలక శృంగమూర్ధ విలసద్ వాల్లభ్య చిహ్నధ్వజా
ధిప్రేంఖన్మసృణారుణాంశుక సముద్దీప్త స్వరూపమ్ము తా
విప్రప్రాజ్ఞ కవీంద్ర గాయక నటీ విశ్వమ్ముకై స్వాగతా
భిప్రాయ ప్రకటత్ కరాగ్రమయి పంపెన్ యుష్మదాహ్వానముల్"[1]

ఇది శ్రీనాథుడు సింగనృపతిని సందర్శించినప్పుడన్నది. ఇందు తా, కై, అం పంచెన్- అను పదములు తప్ప తక్కినవెల్ల సంస్కృతములు. కవిసార్వభౌ దగు శ్రీనాథుడు సంస్కృత విద్వద్వరేణ్యుడగు సింగభూపాలునితో నీరీతి ప్రౌఢ సంస్కృత సమాస వాగ్ధోరణిలో భాషించుట సముచితముగా నున్నది.

"త్రయ్యంత సారామృత సరోవర స్వర్ణ
సరసీరుహమ్ములే చరణ యుగళి.... "[2]

ఇత్యాదిగా దుర్గాదేవిని సర్వమాంబ ప్రస్తుతించిన పద్యము ఏ రెండు మూ పదములో తప్ప సర్వము సంస్కృత పదవిలసితమై యున్నది. తక్కిన పాద లెల్ల యిట్లే దీర్ఘసంస్కృత సమాసయుతమయి యున్నవి. శివామూర్తిని వై ముగా వినుతించుటలో సంస్కృతము ను ప్రయోగించుట యుక్తముగా నున్నది.

గంగా సైకతము న శివధ్యానమగ్నుడైన పోతనను వర్ణించిన దిగువ పద్య -రెండు మూడు పదములు తప్ప- సాంస్కృతికము.

"భసిత స్నిగ్ధ పవిత్రలాంఛన లసత్ ఫాలుండు రుద్రాక్ష హా
రసమాశ్లిష్ట విశాల వక్షుఁ డవిలోలత్కించి దున్మీలితా
క్షిసమాలోకన నాసికాగ్రుఁడు సమగ్రీవా శిరఃకాయుఁడు
ల్లసితాత్ముండుఁ బ్రశాంత చిత్తుఁడగుచున్ లక్షించుచున్నంతలో-"[3]

ఒక వ్యక్తినిగాని వస్తువునుగాని నానా విశేషణములతో బహువ్రీహిచేత వర్ణిం నపుడు సంస్కృత సమాసముల నాశ్రయించుట కవులకు పరిపాటియైనది.

1. పోతన చరిత్రము : 4-68
2. ,, : 3-130
3. ,, : 5-78

వలన వర్ణ్యమును సంగ్రహముగా చక్కగా సాక్షాత్కరింపజేయుట కెక్కువ యవ కాశము కలదు. అదే రీతిగా ఇక్కడ పోతనను వర్ణించుట జరిగి ది.

సాంస్కృతిక రచనకుదాహరణముగా మరికొన్ని పద్యములు దిగువ పేర్కొనబడినవి.

''సంసార కుపార సంచార నౌకా ప్ర
గతి కరిత్రమ్ము పండితమతమ్ము" - (2-192)
"శ్రీశైలశిఖర సంస్పృష్ట సంధ్యారాగ
గతిని కాశ్మీర రాంకవము మేన'' - (4-62)
''హసదత్యంత మనోజ్ఞ పుష్పయుత దివ్యారామ సీమాంతర''- (4-357)
"సవనాజస్థితి ప్రాలి ఖూకణ పరిచ్ఛన్నాంగుఁడై...." (5-25?)
"కాలాగ్ని ప్రతిభాసమాన జఠరక్ష్మాపాల దుష్పాలనా" - (7-42)
''చేరంబోయిరి రాచకొండఁ ద్రిదివశ్రీ మించు ప్రాకార దు
ర్గారామాంగణ....'' - (7-55)

సప్తమాశ్వాసమున పద్యసంఖ్య 105 నుండి 109 వరకు 5 పద్యములు నారయాదులు సింగనృపతి సమక్షమున ఆంధ్రభాగవత ప్రశస్తిని ప్రశంసించినవి సాంస్కృతికములు. ఇట్లే యనేకానేక పద్యములు సంస్కృత పదభూయిష్ఠములై యున్నవి.

## సంస్కృత శ్లోకములు, వాక్యములు :

కావ్యమున సంస్కృత శబ్ద బహుళమైన రచనయే కాక కేవల సంస్కృత పద్యగద్యములును కొన్ని కూర్పబడినవి. 'ఛందో విశేషము'లో వివరించినట్లుగా 4 వ ఆశ్వాసమున ఒక శ్లోకము, 6 వ ఆశ్వాసమున 14 శ్లోకములు గలవు. అంతే కాక 12 వ ఆశ్వాసమున గజేంద్రుని మొరలోని దిగువ చంపకమాల సంస్కృతమై శ్లోకమై యొప్పుచున్నది.

"నిరుపమ నిర్వికార ధరణీగురుభార నివార యోగి హృ
త్సరసిజ మిత్ర! భక్త భవ సంగత బంధ లతాలవిత్ర! మే
42)

శరణ మిహాన్యథా నహి సు సత్వరమేహి పరేశ పాహి సం
హర మకరాకృతిం త్రిభువనాలయ! పాలయ మాం జగత్పతే."[1]

ఈ శ్లోకములేకాక సందర్భానుసారముగా కొన్ని సంస్కృత వాక్యవ
కావ్యము నలంకరించి యున్నవి. వానిని దిగువ నుటంకించు చున్నాను.

'వ్యాసో నారాయణోహరిః' (1-32), 'సుతనయావాప్తిరస్తు (1-11
'స ఏకాకీ న రమేత' (2-37), 'యద్భావం తద్భవతి హి'(2-136),'అన్నద
సుఖీభవ' (2-203), 'శుభస్య శీఘ్రం' (2-234), 'సులగ్న సావధాన'(2-25
'నాతి చరామి' (2-256), 'హే కేశవ! తవ విరహే సా కాంతా రాధికా విష
(4-268), 'యా హి మాధవ' (4-304), 'అయి ప్రియే చారుశీలే' (4-30
'నిర్విఘ్నమస్తు తే' (6-25), 'యాచమేత్ శ్రోత్రియ స్యాన్నమ్' (6-13
'రసోవై స నారాయణ' (6-174), 'న భూతో న భవిష్యతి'(7-115), 'మః
వలయం వలయేన మణి' (7-267), 'బ్రాహ్మణస్య క్షణం కోపమ్' (7-26
'స్త్రీ రాక్షసమ్ న కర్తవ్యమ్' (9-3), 'ఆనందో బ్రహ్మ' (9-250) 'వాసు
స్సర్వమితి', 'అంతర్బహిశ్చ తత్సర్వం' (11-350).

ఇందులో లోకోక్తులు, ఆశీర్వచనములు, సూక్తులు, శ్రుతి వాక్యము
శాస్త్రసూత్రములు, కావ్యోక్తులు, వేదాంత మహావాక్యములున్నవి. వీనిని ఆ
కరించుట అనవసరమే కాక అయుక్తము. ఆయా విషయములను వర్ణించునప
వివరించునపు డుదాహరించిన ప్రమాణ వాక్యములున్నవి. అవి యనువదించగూడ
అవి యథాతథముగా ఉటంకింపవలసి యుండును. అట్లే పెండ్లిలోని వై
సూక్తులు 'నాతి చరామి' వంటి వట్లే వాలాయముగా ప్రయోగింపవలసి యుండు
ఈ విధముగా నిందు ప్రయోగించిన సంస్కృత వాక్యములు సందర్భోచితవ
సార్థకములై రచనకు సౌష్ఠవము సంతరించినవి.

## అచ్ఛికపద ప్రయోగము :

సాంస్కృతిక రచనకు తీసిపోకుండ కావ్యమున అచ్చిక రచన సాగి
"పచ్చల నడుమం గెంపులు ముచ్చటగాఁ బొదిగి మంచి ముత్తెపు సరుఁ
సొచ్చెమగు పైఁడి గుండ్లవి కుచ్చులు వ్రేల్ మావిఁగొడుగుఁ గూర్చినదెవర

1. పోతన చరిత్రము : 12-46
2. ,, : 1-72

ఇది శుద్ధాంధ్ర పద్యము. కేసన మార్గమధ్య మందలి మావితోటను వర్ణించినది. బాల పోతనకు సులువుగా నర్థమగుటకు ప్రసిద్ధ దేశి పదములతో చెప్పుట మిక్కిలి యౌచితీమంతమై యున్నది.

ఇట్లే అధమ పాత్రలతో ఉత్తమ పాత్రలు సంభాషించినప్పుడును, అధమ పాత్రలు మాట్లాడినపుడును తదుచితముగా ఆచ్చిక పదప్రయోగ బాహుళ్యము కానవగును. పోతన పాలికాపుతో దిగువ రీతిగా గ్రామసీమా సహజమైన దేశిమాటలు పలికెను.

''కట్ట కొమ్ముకు తూము కాల్వదాపటనున్న యేపెల పాయకు నెగువ నలరు
మన నూవుఁజెల్కలో మఱ్ఱి వృక్షము నీడ వంట నౌనర్పఁగా వసతిఁజేయ
దాపున నీళ్ళుండుఁ దేపతేప చెలువు కట్టెక్కి దిగెడి యిక్కట్టు దొలఁగు
నొక దుర్గదేవళ మొక్కింత దూరమౌఁ గట్ట కా చివరలోఁ గ్రాలు కతన
నదియు నేమంత దూరమౌ నర్చనకయి పోయి వచ్చుటకాదె యీ రేయి నీవు
బండిఁగొనివచ్చి యిచటనే పండుకొనుము చనవలెను ప్రొద్దునకు ముందె
మనమచటికి''[1]

ఇందు వృక్షము, దుర్గ, దూరము, అర్చన-అను పదములు తప్ప తక్కినవెల్ల ఆచ్చికములే. ఈ నాలుగు సంస్కృత పదములును నిత్యవ్యవహారము లోనివే యగుట విశేషము. తమ చేలెవ్వియని నర్సమాంబ యడుగగా గొల్లపిల్లలు తమకు సహజమగు తేటతెలుగులోనే ఇటులనుడివిరి.

"కూఁత పెట్టున్న యాకట్ట కొమ్ము బట్టి
బువ్వచేయి వైపునకని పోయి చూడ
మఱ్ఱి కనబడు నదియె యమ్మా![2]

ఇట్లే ఆచ్చికశబ్ద భూయిష్ఠములైన పద్యములలో కొన్ని దిగువ పేర్కొనబడినవి.

"ప్రక్కననున్న ముల్లుగొని పచ్చలు విచ్చెడి తాటి కమ్మపై"- (2-62)

"నెటి కురుల్ దువ్వదు సరిచేయదైనను
సిగముడి తానెంతొ చెలువు గులుకు" (2-79)

"ఈ పదియైదు మేల్మి పనలింటికిఁ దెమ్మనె నమ్మ బండిపై-"(2-146)

1. పోతన చరిత్రము : 1-172
2. ,, : 3-150

"తీపగు సాని కాటుకలె తెమ్మని చెప్పెను గొంచుఁబోనిచో"-(2-147)
"కొసరి యొదిని నింపు కూలిగింజలతోడ"-(2-152)
"పయ్యెద చుట్టు కౌనునకు బాసటయౌ మొలనూలి కట్టుతో"-(3-105)
"కన్నుల కాటుకల్ మరుని కత్తుల సానలు బట్ట నవ్వులున్" -(3-218)
"పగలాఁడి క్రేఁగంటి వలపులే పూఁచెనా
రవ్వలు నీలాలు రాశి పడును''-(4-165)
"ఇసుక దిబ్బల నడ్డులేర్పడ గున గున
న్నడచుచు నెడనెడ నదరి చూఁకి''-(5-19)
''కడుపుఁ జూపుచు గుండెఁ జెకబాదికొను చన్న
మవ్వ యవ్వో యని యఱచుఁ బొట్టె"-(5-142)
''తెగమాసి పిట్ట గూడగు తలంగల చింపి
గొంగడిలో శని గూరుచుండ''-(5-233)
''చని యట వెల్లుబాటలను జక్కని పేఁటలఁ బూవుఁదోఁటలన్"-(7-56)
''ప్రల్లదులెవరేని బాసవాల్ నెలఁతలన్
బీడించి సిలుగులు బెట్టిరేమొ''-(12-74)

ఇట్టివే యనేకాచ్ఛిక రచనా విరాజిత పద్యము లింకను గలవు.

## సంస్కృతాంధ్ర పదసమ్మేళనము :

ఆయా సందర్భములలో సాంస్కృతిక రచన ఆచ్ఛిక రచన సాగినను అధిక భాగము సంస్కృతాంధ్ర పదసమ్మేళనముతో రచన రమ్యముగా సాగినది. మచ్చునకొండు రెండు పేర్కొందును.

''ప్రాచీదిశాంగన ప్రభవించె మేరువున్ బంగారు కొండయై పాపఁడౌదవె తరులతా గుల్మాలిఁగురిసె నీహారమ్ము కొమరు పైఁ గలినీళ్ళు గురిసెనంత మొదవుల పొదువులన్ మోముంచె వత్సముల్ తననోట వ్రేలిడికొనె నిసుంగు మబ్బుల సందునన్ మసలియాడె నినుండు పసిపాప పొత్తికన్ వసతిగొనియె పక్షితతి కూజితమొనర్చెఁ బట్టి యేడ్చెఁ జుక్కజారెను గన్నీటిచుక్కజారెఁ గమలములు విచ్చె బుడుతఁడు కనులు విచ్చె బాలభానుఁగాంచెను బ్రజ బాలుఁ గాంచె."1

1. పోతన చరిత్రము : 1-113

ఇది పోతన జనన వర్ణనము. ఇందు సంస్కృతాంధ్ర పదములు చక్కగా సమ్మిశ్రితమై రచన యింపు గొలుపుచున్నది. ఇందు ఎక్కువగా ప్రకృతి విశేషాలను వచించుటలో సంస్కృతమును పోతన శిశువును గూర్చి చెప్పుటలో అచ్చికమును ప్రయోగించుట గమనార్హము. అప్పుడే పుట్టిన తెలుగుపాపకు తెలుగు వాడుటయే సరియైనదని ఆచార్యులవారి తలంపు కాబోలు. మరియు ఆనాటి వరకున్న సంస్కృత భాగవత వాతావరణమును, ఆంధ్రీకరించనున్న పోతనను వ్యంగ్యముగా స్ఫురింప జేయుటయు కవిగారి ఆశయమై యుండును.

> "కదలెను పల్లవమ్ములనఁగా నధరమ్మదరెం బ్రకంపిత
> మ్మొదవు లతాంత గుచ్ఛమన నొద్దిక నట్టిటు లూఁగె గ్రీవయున్
> బ్రిదులు ప్రసూనయుగ్మమన వీక్షణముల్ బెళకాడె తీవియన్
> వదలిన పూలజల్లన సఖస్వేదజల్లబడెన్ సుమాంజలుల్"-1

భోగినీ నాట్యవర్ణనలోని యీ పద్యమున సంస్కృతాంధ్ర శబ్దసమ్మిశ్రిత సమ్యగ్రచన సాక్షాత్కరించుచున్నది. ఇట్టి యుదాహరణలు మొల్లములై యుల్లముల నుల్లసిల్ల జేయుచున్నవి.

## అన్యదేశ్యములు :

స్థాయి, సాంప్రదాయికత గల యీ మహాకావ్యమున అన్యదేశ్యములు క్వచిత్తుగా వాడబడినవి. అవియు తెలుగులో బహుళ వ్యవహారములోనున్నవై సందర్భోచిత ప్రయుక్తములై యొప్పారుచున్నవి. వీనిలో పదివరకు ఉరుదూ పదములు, నాలుగాంగ్లపదములు, ఒక తమిళపదము కలవు.

## ఉరుదూ పదములు :

ఇందలి ఉరుదూ పదములు దిగువ పేర్కొనబడినవి.

'సెబాసు' (1-37), 'మొకమాలు' (1-86), 'మఖుమలు' (2-10), 'మహళ్ళ' (4-12), 'సలాములు' (4-86), 'నగార' (4-221), 'మఖుమలీ' (4-234), 'దర్బారు' (7-134). 'జరీబుటాల ముఖ్మాలు' (9-160), 'ఎకాయకి' (9-185), 'పాదుషాలు' (10-19), 'సలాము' (10-19)' 'సవారి' (1'-236), 'మఖుమలు' (12-258).

1. పోతన చరిత్రము : 4-233

ఈ పదములలో 'మఖుమల్' అనుపదము ఐదుమారులు ప్రయుక్తమైనది. 'మఖ్మల్' అని ఉరుదూ. ఇది మొకమాలు, మఖుమలు, మఖ్మాలు - అను రూపాంతరములతో వాడబడినది. 'మఖ్మల్' అనగా ఒక సుకుమారమైన వస్త్రము.

"ముశ్లెగట్టువెల్ల 'మొకమా' లనన్ మేను ముడిచి పండు లేగబుడుత యొకట-" (1-86) ఇది బమ్మెర గ్రామవర్ణనలోనిది. ఇక్కడ ఉపమానము చక్కగా సరిపోయినది. ఈ మఖుమలు మున్నగు ఉరుదూ పదములన్నియు హిందిలోను కలవు. ఇవన్నియు తెలుగువారు తరచు వాడుచుండునట్టి సుప్రసిద్ధ పదములు. ఇట్టివి ఆయా కావ్యములందును వాడబడిన విషయము సువిదితమే.

"గజపతులె యపజితులైరి కటకు తురక పాదుషాలె సలామిడి
పదములంటి
కొలిచి రన సింగభూపతి బలమదెంత విక్రమించిన మిము మించు
వీరుఁడున్నె-"[1]

శ్రీనాథుడు ప్రౌఢదేవరాయలతో అన్నమాటలివి. క్రీ.శ 1322 లో ఢిల్లీ పాదుషా గయాజొద్దీన్ తుగ్లక్ కాకతీయ సామ్రాజ్యమును గెలిచినప్పటినుండి తెలుగు దేశములో ముస్లిముల వ్యాప్తి. ఫారసీ అరబీ పదాల వాడుక ప్రారంభమాయెను. ఆ కాలమునకు తరువాతివాడగు శ్రీనాథుడు ప్రౌఢదేవరాయలతో సంభాషించుచు ముస్లిముల గూర్చి 'పాదుషా', 'సలాము' అను పదములు ప్రయోగించుట సమంజసమైనది. ఇట్టివే తక్కిన పదములు యుక్తి ప్రయుక్తములై యున్నవి.

## ఆంగ్ల పదములు :

కావ్యపీఠికలో 'స్కూలు టీచరు' (73) 'ట్యూషనులు' (74) 'ప్రోగ్రాము' (119), 'గౌర్నరు' (136) అను నాలుగు పదములు వాడబడినవి. మొదటి రెండు పదాలు అభ్యర్థనలో ఈనాటి కవుల ఆర్థిక దుస్థితి వర్ణించుచు చెప్పినవి. 'ప్రోగ్రాము' పదము 'కావ్య నిరోధ నివారణ'లో ఆచార్యులవారు తాము ఘోరశయ్యకు గురియై శస్త్రచికిత్సల కోతలకోర్చి యముని ప్రోగ్రాము మార్చితి నని వ్రాసికొన్న సందర్భములోనిది. చివరి పదము డా॥ బూరుగుల రామకృష్ణా

1. పోతన చరిత్రము : 10-19

రావుగారి ప్రశంసలో వారు కేరళావనికి గౌర్నరై ప్రకాశించిరని వర్ణించినట్టిది. ఈ యాంగ్లపద ప్రయోగము ఆధునిక యుగ ప్రేరితులై చేసినట్టిది. ఇవియును కావ్య కథాంతర్గము కాక పీఠికలో ఆత్మాశ్రయముగా వ్రాసికొన్న విషయముల లోనివై యుక్తములేయై యొప్పుచున్నవి.

## తమిళ పదము :

ఒక్క తమిళ పదము 'ఇల్ల' యనునది అలవోకగా ప్రయోగింపబడి యున్నది.

"హరిరాక కల్ల, యిఁక యీ కరి జీవితమిల్ల యీ మకరి యాఁకటికై
యెర యనిన కొల్ల ధరనెవ్వరికిన్ గావలె ననాథ బాధలవెల్లన్-"[1]

కరి హరికి మొర పెట్టుచునన్న పద్యమిది. ఇందు కల్ల, ఇల్ల, కొల్ల, ఎల్ల, శబ్దము లంత్యానుప్రాసముగా గూర్చబడినవి. ఇట్లలంకార ప్రయోజనార్థముపయోగించిన యీ 'ఇల్ల' శబ్దము తమిళమైనను ఆంధ్ర జనవ్యవహారములో కలదు.

ఈ తీరుగా ప్రయోగించిన యీ కొన్ని అన్యదేశ్యములు సందర్భోచితములై యున్నవి. ఆచార్యులవారికి ఉరుదూ, హింది, ఆంగ్లము, తమిళము భాషలతో సముచిత పరిచయము కలదన్న విషయము వారి జీవిత చరిత్రలో ప్రస్తావించ బడినది. అట్టి బహుభాషా పరిచయము కావ్యమున ఆ భాషాపదముల ప్రయోగము నకు సార్థక సామంజస్యమును సమకూర్చినది.

## సమాస రచన :

కావ్యమున సమాసముల కూర్పు పరిశీలించినచో అది యెంతో నేర్పుతో తీర్చిదిద్దినట్లు కనబడును. అందందు ఆరభటీ వృత్తిలో గౌడీరీతిలో సముచితముగా దీర్ఘసమాసములున్నను ప్రాయికముగా రచన నాతిదీర్ఘ సమాసాన్వితమై యున్నది. పూర్వ ప్రబంధములు కొన్నిట నున్నట్లు రుమాలు పొడవు సమాసాలు, మాసాల తరబడి యాలోచించినను అర్థము కాని సమాసాలు కావ్యమున మచ్చునకైన కానరావు మరియు బలిమి మెయి సాగదీసిన కృత్రిమ సమాసాలు కాక సహజ

1. పోతన చరిత్రము : 12-51

ములై సుందరములై సార్థకములై యొప్పుచున్నవి. సమాసములు సాంస్కృతికము లును ఆచ్ఛికములును తరచై మిశ్రములు క్వాచిత్కముగా గలవు.

## సాంస్కృతిక సమాసములు :

పరిమిత పదకవిత సమాసమునకొక పద్యముదాహరింతును.

"అలఘూర్మిస్వన భాసమానమయి హంసాందోళికాయానమై
జలపూర్ణంబయి శీతలానిల సుఖస్పర్శాత్మకంబై కళా
నిలయంబై యతి నిర్మలంబయి మిళన్నీరేజ గంధాఢ్య మై
కొలనొప్పెన్ బలుమెట్లతో సమచతుష్కోణాకృతిన్ విస్తృతిన్."[1]

ఇందెనిమిది సమాసములు కూర్పబడినవి. వీనిలో మూడు సమాసములు రెండేసి పదాలతో నేర్పడినవి. తక్కినవియు నాలుగైదు పదాలకు మించనివే. సింగ నృపతి వనములోని క్రీడాసరోవర్ణన గల యిది పోతనచేత చక్కగా వక్కాణించ బడినది. ఇందలి సమాసములు వ్యర్థపద రహితములై సమర్థములై చక్కని పొందికతో అందగించుచున్నవి.

నారయాదులు సింగనృపతి సమక్షమున ఆంధ్రభాగవతరచనా ప్రశస్తిని వర్ణించిన దిగువ పద్యములలో సుందర సమాసములు కావ్యకల్పద్రుమమున తీవలు సాగి అల్లిబిల్లిగా అల్లుకొనియున్నవి.

"లోలోత్తుంగ తరంగ విఖేలన్నవ రస సుధాప్రకీర్ణ సురధునీ
డోలాలీలాలాలస బాల మరాళములు తెన్గు భాగవతకృతుల్"[2]
"పండిత పామర రంజక మండిత మృదు మధుర పద సమాసోపేతా
ఖండ ప్రతిభాయుత రసభాండాగారమ్ము లాంధ్ర భాగవత కథల్."[3]

ఇట్లే యిక్కడి పద్యములెల్ల సురుచిర సమాస భాసమానములై యున్నవి. సాంస్కృతిక రచనలో నుటంకించిన 'వప్రాట్టాలక....' మున్నగు పద్యములలో దీర్ఘసమాసాన్విత రమ్యరచన కాంచనగును.

1. పోతన చరిత్రము : 4-126
2. ,, , : 7-105
3. ,, ,, : 7-103

## అచ్ఛిక సమాసములు :

కావ్యమున సందందు పొందుగా అచ్ఛిక సమాసములు కూర్పబడి చెలువులు గులుకుచున్నవి. దిగువ కొన్ని మచ్చునకు పేర్కొందును.

'చిప్పతిండి' (1-27), 'విడుపు విడిది' (1-15), 'బాసవాలు' (1-77), 'వేలుపుజేని కంటకారము' (1-37), 'అణిముత్యంపుఁ జేరుల యల్లికలు' (1-51), 'ప్రాఁబల్కులు' (1-59), 'నునుబంతి పూసరులు' (1-84), 'ముమ్మొనవాలు' (1-138), 'నాగుపడగ గొడుగు' (1-143), 'వింతసింగిణి రంగులపెట్టె' (2-65), 'తమ్మిపూఁబోఁడి' (3-70), 'తీవంచ మోములదిట్ట చేపట్టిన జాణ' (8-69), 'కడుపు బంగారు బొక్కసముం జేసినమేటి' (8-69), 'పాఁపపేరులు' (11-140), 'ఇవము సూడును నెలయున్ జత కనులఁజేయు వేలుపు' (11-173) ఇత్యాదులు.

## మిశ్ర సమాసములు :

సాంస్కృతికాచ్ఛిక సమాసములు కాక కావ్యమున అటనట కొన్ని మిశ్ర సమాసపు పగడపు ముత్తెపుసరులు చెలువొందుచున్నవి. దిగువ కొన్ని యుటంకింపబడినవి.

'మబ్బుఖాండములు' ( 1-183 ), 'తూరుపు నల్లమలల శృంగములు' (2-6), 'తెల్లవస్త్రాలు' ( 2-10 ), 'పచ్చపచ్చని నిగారపుటాస్తరణమ్ములు' (2-66), 'నూత్నయౌవన లతేందిర కౌఁగిట' (2-75), 'పల్లియ లక్ష్మి' (2-84), 'హరుని పేరురము' (2-157), 'రజతంపుఁ దొడవులు' (2-157), 'పున్నెపు రాశి' (3-228), 'కన్నీటి ఝరులు' (9-60), 'మలయపు గాలి' (11-123), 'అందాల పొలము' (11-124) మున్నగునవి.

## నుడికారములు :

శబ్దసాగరమైన ఈ మహాకావ్యములో నానావిధములైన పదములు పదబంధములు గలవు. కథాకథనములో వస్తువర్ణనములో సంవాదములలో నీతి వేదాంత ప్రబోధములో వర్ణ్యము హృద్గతమగుటకు విశిష్టార్థస్ఫోరకములగు నుడికారములు కొల్లలుగా వెదజల్లబడియున్నవి. పొడి నుడులతో ఎడలకు వడదాకకుండ

నిట్టి పలుకుబడులామోద సస్యములకు తడిమడులై యడరుచుండును. రసభావ స్ఫూర్తికి శబ్దార్థ చమత్కారముల కివి దోహద మొసగుచుండును. శైలిని సుందర తరము గావించి చదువరుల నాకర్షించుచుండును. ఈ పలుకుబడులనే నుడికారము లనియు పదబంధములనియు, జాతీయములనియు వ్యవహరింతురు. ఈ పలుకు బళ్లలోనే ధ్వన్యనుకరణములు, ద్వంద్వపదములు, సామెతలు చేరును. పోతన చరిత్రమున వందలకొలది నుడికారములు ప్రయుక్తములై యింపు గొలుపుచున్నవి. మచ్చునకు కొన్ని యుదాహరింతును.

యుపక భూస్వామి అత్యాచారము చేయబూన పేద జవరాలికి

''మనసులో నగ్నివడె నొడల్మండిపోయె.... " (2-98) అని వర్ణింపబడినది. ఇక్కడ 'మనసులో 'నగ్నిపడుట', 'ఒడల్ మండిపోవుట' అనునవి రెండు నుడి కారములు. ఈ రెంటికి అర్థము కోపతాపములు మిక్కిలి కలుగుట. ఎంత కోపతాప ములు హెచ్చినవన్నను మనస్సులో అగ్ని పడెనన్నంత అర్థతీవ్రత భాసించదు. ఇక్కడ ఈ రెండును నిట్టి విశిష్టార్థములలో ప్రయుక్తములైయున్నవి.

పోతన తలిదండ్రులు యాత్రలు ముగించుకొని

"ముక్కు ముడిబెట్టక పదాన ముల్లు నాటకుండ వచ్చిరి" (3-255) అని చెప్పబడినది. ఇందు 'ముక్కుముడిబెట్టక', 'పదానముల్లు నాటకుండ' అనునవి రెండు పదబంధములు. ఇవి క్రమముగా ఏమాత్రము అనారోగ్యము పాలుగాక,ఎట్టి బాధయు పడక అను విశేషార్థముల నిచ్చుచు మనోజ్ఞములై యున్నవి.

ఇట్టి రమ్య జాతీయములు కొన్నిటిని పేర్కొందును.

'కంటకారమగుచు' (1-27), 'దిగదుడుపుకైనఁ గొఱగాదు' (2-54), 'మీసము దిద్దినాఁడు' (2-100), 'కడుపు చెక్కలగు' (2-162), 'తల పొట్టనఁ బెట్టుచు', 'కాళ్ళవ్రేళ్ళఁబడి' (2-252), ముప్పూలును నాలుగాయలయి' (2-280), 'ఉత్తర కుమారుని ప్రజ్ఞలు' (3-81), 'నడికడలిన్ బుట్టి ముంచు' (3-112), 'ప్రాయ దండకమగు' (4-337), 'అస్త్రశస్త్రముల్ గ్రుంగె' (4-375), 'పందిని నంది జేయఁగా' (4-393), 'పగటి భాగవతమ్ములు' (5-218), 'అరణ్యరోదనము' (5-247), కలవున వాంతి' (5-267), 'సంకునఁ బోయు తీర్థము' (6-143) 'గంధాక్షతల్ గాపు', 'పండ్లులేని పులి' (8-121), 'గురునకు తిరుమంత్రమ్మిడు' (9-275), 'ఎదురీదఁగఁ బోలునె యేటికి (9-311), 'మిన్నులు విర్గి వచ్చి తల

మీఁదనె కూలెను' (9-323), 'రోళ్ళ రోకండ్లఁ బాదరొక్కొ', 'తూర్పారఁ బట్టిపోయె' (9-328), 'పనిపండు' (9-353), 'నెత్తిపై నోరు నిడికొని మొత్తుకొనుచు' (11-70), 'ప్రక్కలో బల్లెము'(11-175), 'గడ్డి గఱచె' (11-204), 'నీళుల ముంచెదో లేదా పాలనె ముంచెదో' (11-273), 'మీనము మేషమంచు నిటు మిన్నని యెంచుట' (11-304), 'శ్రుతి మించి రాగమున బడు' (11-32), 'కొఱుకరాని కొయ్య' (12-35), 'పూసలలో దారము' (12-43), 'బుద్ధుల గంగిరెద్దు' (12-122), 'కాయా పండా' (12-246), 'వెన్నతోడ నేర్చుకొన్న విద్య' (12-302) ఇత్యాదులు.

## ధ్వన్యనుకరణములు :

శైలిని చక్కదనము నెక్కువచేసి హృదయావర్జకము కావించుట కుపయుక్తములగు ధ్వన్యనుకరణములు కావ్యమున పలుతావుల ప్రయుక్తములై యున్నవి. ఇవి భోగినీ నాట్యవర్ణనములో పద పదమున గోచరించును.

"చకచక గిత్తల కదుముకు...." (2-158), 'జలజల పూలు రాలినటు' (4-137), 'కిలకిల నవ్విపూలు' (6-6), 'దండమది.... బిరబిర ద్రిప్పుచున్' (7-211), 'కలకల నవ్వుచున్నటులు', 'జలజల బాఱుచున్నటులు' (9-37), 'ధగద్ధగితాంబర చుంబి చక్రమున్' (12180) ఇత్యాదులు.

భోగినీ నృత్య వర్ణనములోని 'తాహర' గీతము ధన్యనుకరణ భూయిష్ఠమై మారుమ్రోగుచున్నది.

"కాళ్ళ గజ్జియలు ఘలు ఘలు ఘలుమని కర్ణామృతములఁ బోసెన్
జోళ్ళతాళముల పల పల పలధ్వని చూపఱఁ జకితుల జేసెన్"- (4-161)

ఇట్లే యిందు 'కంకణాల్ గిణ గిణ గిణమని', 'అందియల్ చన చన చన'మని మ్రోగెననియు నిత్యాదిగా వర్ణింప బడినది.

నృత్య వర్ణనలో మరొకచోట ఉత్కళిక - రగడలో
"మీను బిల్లలవోలె మిల మిల మిలుకు మిలుకు మిలుక్కు మనుచున్....
త్రాచు పరువులవోలెఁ దళ తళ తళుకు తళుకు తళుక్కు మనుచున్
చక చక చ్చక చక్కు మనుచున్ చంచలల్....
ధణ ధణందణ ధాణ ధంధణ డడడడడడడ ఢాండ ఢమ్మని
గర్భ నిర్భేదముగ నుఱుములు నార్భటింపగ నవని చెవుడువడె....

రివురు రివురు రిరివురు రివ్ రివ్ రివ్ రిరివ్ రిరిరివ్ రిరివ్ మను
వాయుదేవుని ప్రళయ తాండవ వైభవమునకు శివము దూలుచు
ఛరరరరరర ఛల్లుమనుచును తరుల శాఖలు ధరణిఁ గూలఁగ....
ఘోరమను ఝుంఝూనిలమ్ములు భోరమను వర్షారవమ్ములు
రింజ రింజరి రింజరి రిరి రింరింజ రింజరి డుంరి ఝుం, అని
తెంపినీయక చఱచి కొట్టుచు కరక సంహతి విసరిపెట్టుచు....
రటట రట్టుర రట్టదుర్దుర పటురటద్ధ్వన శబ్దములలో...." (4-290)

ఈ రీతిగా విజృంభించిన పెనుగాలి వానలో మెరపులు, ఉరుములు, గాలి వీచుటల వర్షధారా పాతములు, వడగళ్ల సవ్వడులు, కప్పల చప్పుడులు అన్నియు మహ దంచిత ధ్వన్యనుకరణ శబ్ద ప్రయోగములచేత ప్రత్యక్షముగా కనబడు చున్న వినబడుచున్నట్లు రమణీయముగా వర్ణింపబడినవి. ఇట్లు ధ్వన్యనుకరణములు కా రచన కొక యాకర్షణ సమకూర్చినవి.

## ద్వంద్వ పదములు :

కావ్యమున అక్కడక్కడ చక్కగా ప్రయోగించిన ద్వంద్వపదములు శై రమ్యతకు సహకరించినవి. 'గింజ గిరుజు' (3-59), 'చిటిపొటి' (3-137 'అందము చందము' (3-153), 'అద్దదిద్దములు' (3-154), 'జిలిబిలి' (3-21 'వంపు సొంపులు' (2-77), 'నగ నాణెము' (2-79), 'చాటుకు నేటుక (4-178), 'ముచ్చటలచ్చటలు' (7-35), 'సాధక బాధకములు' (7-29 'ములుముట్ర' (7-31), ఇత్యాది ద్వంద్వపదము లలరించుచున్నవి.

కావ్యమున నెడనెడ ప్రయోగించిన లోకోక్తుల గూర్చి 'ఆలంకారిక వ్యాసమున చర్చించుట జరిగెను. ఈ లోకోక్తులును కావ్యార్థ ప్రకటనలో మిక్కి దోహదమొసగి ఆహ్లాద పరచుచుండును.

## సాభిప్రాయ పద ప్రయోగము :

రమ్యశైలికి సాభిప్రాయ పదప్రయోగము మిగుల తోడ్పడును అర్థవం ములై సందర్భోచితములైన యట్టి పదముల వలని రచన నితాంతము రమణీయ యొప్పును. పోతన చరిత్రమున నిట్టి పదములును కొన్ని ప్రయుక్తములై యిం నింపు చున్నవి.

మచ్చునకొక కొన్ని యుదాహరింతును.

"సురలఁగాంచి వ్యాసుఁజూచి వచ్చినయట్టి చొప్పులెల్ల నెంతొ చోద్యమలరఁ
జివ్వతిండి యిట్లు సెప్పె వేలుపు జేని కంటకారమగుచుఁ గలతవెట్ట."[1]

భాగవతకర్తయగు వ్యాసుని ప్రశస్తి యింద్రునికీర్ష్యపుట్టునటుల నారదుడు వర్ణించి చెప్పెనన్నది పై పద్య విషయము. ఇంద్రునికి మాత్సర్యకారణమగు వ్యాసమహిమ చెప్పిన నారదునికి 'చివ్వతిండి'యను పర్యాయ పదమును వాడుట సాభిప్రాయ ముగా నున్నది. నారదుడు లోక కళ్యాణార్థమైనను కలహములు పెట్టు వాడన్నది ప్రసిద్ధము. ఇట్లిచట పై పదము యుక్తముగా నున్నది.

శారదా మహామంత్ర జపము వలన సహజ పాండిత్యమబ్బునని చెప్పి చిదా నందుడు పోతనతో "నీకు నరుండొరుండు గురుఁడౌనే సిద్ధ విద్యానిధీ!"[2] అని పలికెను. ఇక్కడ పోతనను 'సిద్ధ విద్యానిధీ' యనుట సాభిప్రాయముగా నున్నది. పోతన కుచితమైన సంబోధన యది.

పేద జవరాలి దుర్భర దీనస్థితికి వగచి పోతన తన యుత్తరీయ మిచ్చుచు

"పల్లియ లక్ష్మివో యనఁగ భాసిలుచున్న భవత్స్వరూపమో
తల్లి! స్వమాన రక్షకిటు తల్లడ మందఁగఁ జూడఁజాల...."[3].

అని సాదరముగ వచించెను. ఇక్కడ 'పల్లియ లక్ష్మి', 'తల్లి' పదములు సాభి ప్రాయములు. ప్రాణము కంటె మానమును మిన్నగా జూచుకొను పల్లె పడుచు పల్లెసీమకు శోభ, కీర్తి యనియు 'మాతృవత్ పరదారాణి' యన్నట్లు పరవనితను తల్లివలె చూడ వలెనన్న ఆర్యోక్తికి నిదర్శనముగా ఈ పదములు ప్రయుక్తములై యొప్పుచున్నవి.

మోహినీ విలాసములకు విభ్రాంతుడై విరహతప్తుడైన శివుడు చంద్రో పాలంభము చేయుచు "........ సాంద్ర సుధానిధులొల్కఁ బోయుటల్ గళల విలాస మీనుటయుఁ గాదె తలం ధరియింతు నిన్నిటుల్ జలధిజ బాడబాగ్నివని

1. పోతన చరిత్రము · 1-27
2. పోతన చరిత్రము : 2-49
3. ,, : 2-34

స్వాంతమునన్ దలఁపన్ నిశాచరా!"[1] అని తాపపెట్టెడిచంద్రుని 'నిశాచరా!' యని సంబోధించుట సాభిప్రాయముగా నున్నది.

అట్లే శివుడు చెంతకు రాగా మోహిని సర్పభయమున దూరము తొలగగా "శశిమౌళి నవ్వి యలివేణి! యివే మణి భూషలౌనిదో!"[2] అని భయము వాపెను. శివుని 'శశిమౌళి' యనుట సార్థకము. తలపై చంద్రుడుగల శివుడు నవ్వుచున్నట్లే యగపడును. కావున ఈ పదమిచట సాభిప్రాయము. మరియు శివుడు మోహినిని సమీపించి 'ఎవతె వీవు సరసిజేక్షణ!....'[3] అని వివరమడిగినప్పటి 'సరసిజేక్షణ' పదము సాభిప్రాయము. శివుడు పలుకరించినప్పుడా వగలాడి విప్పారిన కనులతో చూడగా నామెను 'సరసిజేక్షణ'యని సంబోధించుట సార్థకము. హరి సరసిజేక్షణుడే కనుక ఇక్కడ ఇది మరింత సార్థకమై చమత్కారావహమై యున్నది.

ప్రహ్లాదుడు తండ్రి యిచ్చిన విషమును ద్రాగునపుడు హరిని స్మరించి
"అని వేడుచు విషముంగొని తన వదనమునందు నగవు దనర గరుడవా
హను భక్తుల విసమిది యేమొనరుచునని త్రావెఁ దండ్రి యొడలు
వడంకన్-"[4]

అని చెప్పబడినది. ఇక్కడ హరిని గరుడవాహనుడనుట సాభిప్రాయముగా నున్నది. సర్పధ్వంసి యగు గరుడుడు విషహారి. అట్టి గరుడుని వాహనముగ చేసికొన్న దేవదేవుడు తన భక్తులకు విషహాని ఏమాత్రము కలుగనీయడన్నది తాత్పర్యము. ఇట్లే కావ్యమున సందర్భోచితముగా సాభిప్రాయ పదప్రయోగము ప్రశస్తముగా చేయబడినది.

## మాండలిక పదప్రయోగము :

పోతనగారు భాగవతమునందు ద్రొబ్బు, రొప్పు, ఉఱుకు, దొడ్డు మున్నగు తెలంగాణ మాండలికములను ప్రయోగించినట్లే అభినవ పోతనగారును తమ తెలం

1. పోతన చరిత్రము : 11-131
2. ,, : 11-139
3. ,, : 11-147
4. ,, : 11-345

గాణ మాండలికములను కొన్నిటిని పోతన చరిత్రమున వాడుక చేసినారు. ఈ మాండలికముల గురించి వీని యుపయోగమును గురించి 'మణిమాల' వ్యాసమున వివరించియుంటిని. అన్య కవీంద్రులవలెనే ఆచార్యులవారును మాండలికములను ప్రయోగించిన విషయము సహజమైనది, యుక్తమైనది.

దిగువ కొన్ని తెలంగాణ మాండలికము లుదాహరింపబడినవి.

1. "దూకులెగురు లందుఁ దొండు మెండుగఁ బడి" (1-127)
   -పోతన బాల్యక్రీడలు.
   తొండు మెండుగ బడుట యనగా ముడుచుకొని పెద్దపాటు బడుట యని తెలంగాణమున వాడుకలో నున్నది.
2. "రగరగన్మెఱయు తామ్రపునగల్" - (1-138)
   -పాల్కురికి జాతరలోని బసివిరాండ్ర వర్ణన
   తెలంగాణలో రగరగ యనగా మెఱయుట యందలి ధ్వన్యనుకరణముగా వాడుకలో నున్నది.
3. "అన్ని దెలిసిన మారాజు లాచరించుపనులె...." (2-100)
   -పేదజవరాలు పోతనతో
   'మారాజు'లనగా మహారాజులు. గొప్పవారు, శ్రీమంతులు అను నర్థమున ఈ పదము తెలంగాణమున వాడుకలో నున్నది.
4. "....ఎట్టుశ్రమల్ బడ నోటి కందు నొక బుక్కెఁడుఁ కూడు...." (3-88)
   -పోతన జీతగానితో
   'బుక్కెఁడు' అనునది 'బొక్కెఁడు' పదమునకు రూపాంతరము. ఈ రూపమున తెలంగాణములో వాడుదురు. 'బొక్క' నుండి 'బొక్కెఁడు' ఏర్పడినది. బొక్కయన నోరు నిండిన పొడియగు తినుబండము.
5. "ఉఱికి యుఱికి తాఁబడిపోవు నరుని భాతి" (3-145)-వర్షవర్ణన.
   'ఉఱుకు' అన్నది దుముకు అను నర్థములో కలదు. కాని తెలంగాణలో పరుగెత్తు అను నర్థములో వాడబడును.
6. "ఉంచు బోనమ్మె సరిగ భుజింపరైతిరి" (3-227)
   ఉంచుట యన వడ్డించుటయని తెలంగాణ వాడుక.
7. "ఓసి వెడ్డిదాన ప్రేమ గుడ్డిదెందు" - (4-194) వేశ్యామాత భోగినితో.
   'వెఱ్ఱిదాన' అను అర్థములో 'వెడ్డిదాన' యను పదము తెలంగాణలో వాడుక.

8. "ఉండీల చువ్వయై యూగాడ నెన్నడుము"(4-256)
-భోగిని నాట్యవర్ణన.
'ఉండేలు' అను దానిని ఉండీల యని తెలంగాణలో అందురు ఇది పక్షులను గొట్టు ఒక ఆయుధము.

9. "పెను మ్రానుకాయ స్వభుజాబల పై దుపి లాగి
నీర్గొసునెడ...."(5-165)-కాపు పోచయ్య పొలాలవద్ద.
మ్రానుకాయ, మానుకాయ- యని తెలంగాణలో వాడుచుందురు. దీని యర్థము తూముకు ముద్దెర యిడు కొయ్య.

10. "ఇంటింటి కరుగుచును మీ బంటుకు బానిసను గింత బారెయ్యవ్వా!-
కుంటోణ్ణి పున్నె ముంటది యంటయు నే తల్లికిన్ దయలు రావయ్యేన్''(5-235) -భిక్షుకుని దీనాలాపములు.
బొద్దక్షరములలోని వాక్యమెల్ల తెలంగాణ 'యాస'లో మాట్లాడినది. అందు ప్రత్యేకించి 'గింత' యన్నది 'ఇంత' అనుదానికి తెలంగాణ వాడుక. అ, ఇ లతో మొదలగు సర్వనామాది పదములను తెలంగాణలో గగిలతో ప్రారంభించి పదముల నుచ్చరించుట ప్రసిద్ధమైనది. అది- గది, ఇది-గిది, అక్కడ-గక్కడ, అందుకు-గందుకు మొదలగునవి.

11. "బుక్కెడేయి కాల్మొక్కెదనవ్వ"యంచు నిలుముంగిటఁ బాఁటినయట్టు
లుంటి...." (5-238)-
-లోభిసెట్టి భిక్షుకునితో.
బొద్దక్షరములలోని వాక్యము తెలంగాణలోని వాడుకలోనిది.

12. "నిన్ననమి నెంతయు బెక్కొనె శారదాంబయే" (8-51)
-నర్సమాంబ శ్రీనాథునితో.
'బెక్కొను'=భయపడు - అని తెలంగాణలో వాడుక.

13. "పోతరాజునకది నచ్చదయ్యొ నెటు సొంపక మంచిది పోయి
రండనెన్" (3-57)
-యాత్రలకు పోవు అన్నతో పోతన.
'సొంపక' = ఎటుతోచక యని తెలంగాణమున వాడుక.

14. "మత్తేభ డోలాయమాన యానములోని జీకుటాకుల రాచరీవి గెలిచి"
(6-112)
—ఆంధ్ర భాగవత రచనా వైశిష్ట్యము.
'జీకుటాకులు' = నిక్కు టెక్కులు అని తెలంగాణ వాడుక.

15. "చేరంబిల్చును జందమామఁ గలువల్ చిత్రించుఁ గెంగేల షేల్
తారంగంబులఁ ద్రిప్పి యెల్లరి యెడందల్ ద్రిప్పు...." (12-122)-
యశోద బాలకృష్ణుని గూర్చి. 'తారఁగము' అను పదము పిల్లలను మురి
పించు హస్తాభినయ విశేషము అను నర్థములో తెలంగాణములో, విశేషించి
కరీంనగర మండలములో వాడుకలో నున్నది.

16. "ఓ తల్లి ! మీ కృష్ణుని చేతలతో వశముగాదు చేడెలు పాలున్ నేతులుఁగొని
చననొక ఖాగోతము! నీతోడఁ జెప్పుకొన సిగ్గగునే (12-150)" గోపికలు
యశోదతో.
'భాగోతము' అననది 'భాగవతము'నకు వికృతి రూపముగా తెలంగాణ
జన వ్యవహారములో గలదు. దీనికి వీధి భాగవతము, యక్షగానము-
అను నర్థములు వాడుకలో గలవు.

17. "నీలి నింబోళి కెంపు వన్నియల నలరు
సరిగ పట్టంచు కోకల సవదరించి" (12-38)-గోపికలు కృష్ణుని బారసాల
నాడు.
నింబోళి, లింబోళి యను రూపద్వయ పదములు తెలంగాణ వాడుకలో
గలవు. ముదురు పసుపు రంగు అని వీని యర్థము. 'నింబోళి' హిందీలోని
'నింబౌలి' పదమునుండి యేర్పడినది. దీని యర్థము వేపపండు. వేపపండు
ముదురు పసుపు వన్నెలో నుండును. కావున తెలుగులో ఈ వన్నెకు
'నింబోళి రంగు'అనుట వాడుకయైనట్లు తోచుచున్నది.

18. "ఉర్వినంతయు నూఁపివైచుచు నుదధి జలముల లోపి వైచుచు-(4-290)
-భోగిని నృత్యవర్ణన.

'లోపుట' యన ద్రవపదార్థమును కలియబెట్టుట యని తెలంగాణ వాడుక.
ఈ మాండలికములు చాల వరకాయా పాత్రలచేత పలికించుట మరింత యౌచితీ
మంతమైనది.

## ప్రయోగ విశేషములు :

కావ్యమున ప్రయోగించిన కొన్ని పదముల తీరును పరిశీలింపగా ఆచార్యుల
వారి రచనావిధము కొంత విశేషముగా గోచరించును. వానిలో,

1. ద్విత్వరహిత పద ప్రయోగము, 2. హలంత పద ప్రయోగము, 3. భావార్థ క్రియాపదముల బహువచనాంత ప్రయోగము అనునవి ముఖ్యమైనవి. వీనిలో మొదటి రెండు ప్రత్యేకతలను 'మణిమాల' వ్యాసమున సోదాహరణముగా వివరించి సమర్థించి యుంటిని. ఇక్కడ పోతన చరిత్రములోని పదముల నుదాహరింతును.

**1. ద్విత్వరహిత పద ప్రయోగము :**

కావ్యమున అందందు ద్విత్వాక్షరములు గల పదములను ద్విత్వరహిత రూపములో ప్రయోగించుట కనబడును. ఇవి 'మణిమాల' వ్యాసములో వ్యాకరణ సూత్రానుసారముగా వివరించినట్లు సాధువులే యైనను కవిగారి కిటుల ప్రయోగించుట యిష్టమని తెలియుచున్నది.

'పెద్దమలవాడు' (1-140), 'బిడలగు ప్రాణుల' (1-185), 'తలి' (4-390), 'మను పుట్టను' (5-186), 'చిటితల్లి' (6-210,) 'నలద్రాచు' (7-310), 'కసడ పీరవర్యులు' (9-178), 'మనుద్రవ్వి' (11-190), 'ముకు పచ్చలారని' (11-249) ఇత్యాదులు ద్విత్వరహిత పదములిందు ప్రయుక్తములై యున్నవి.

**2. హలంత పద ప్రయోగము :**

అజంత పదములను హలంతములుగా ప్రయోగించుట కొన్ని తావుల కన్పడును. ఇట్టివియు సాధువులే. వానిలో కొన్నిటిని దిగువ పేర్కొందును.

'వ్రేల్ ఫలములు' (1-175), 'అంతపుఁజూల్' (2-198), 'పాల్గాఱె' (3-192), మేల్వయసు (3-214), 'నీర్కంటె' (4-208), 'గుంజుకొన్ గతి' (4-274), 'ఊర్వెలికి' (4-387), 'నీపేర్ విన' (5-100), 'నీర్ గొనునెడ' (5-165), 'నీర్ నీరని' (5-184); 'గ్రుడ్ల నీర్ గ్రుక్కుకొనున్' (5-239), 'ఆనవాల్ నుడివిన' (6-164), 'ఊరికూర్' (8-42), 'దీవెనలున్నఁ జాల్' (8-64) మున్నగునవి యిందలి హలంత పదప్రయోగములు.

**3. భావార్థక్రియాపదముల బహువచనాంత ప్రయోగము :**

భావార్థ క్రియాపదములగు అనుట, వినుట మున్నగువానికి బహువచన ప్రయోగము కావ్యమున అక్కడక్కడ కనబడును. ఇట్టి ప్రయోగము కావ్యములలో అరుదుగా విలక్షణముగా నున్నది. సాధారణముగా నివి ఆనంత

ర్యార్థమున 'అనుట'కు అనినన్, అనగాన్, అనుటన్, అనుటయు,అనపుడు ఇత్యాది రూపములు కావ్యములందు ప్రయుక్తములై యుండును. పోతన చరిత్రము నందీ రూపములు తరచుగా గలవు. ఐనను అనుటలు, ఎంచుటలు-మున్నగురీతిగా బహువచనాంత రూపములు కొన్ని యెడల ప్రయుక్తములై యున్నవి. ఈ బహువచన రూపముచేత ఆ క్రియ విశేషముగా జరుగునట్లు తోచును. ఆచార్యులవారు ప్రయోగించిన యిట్టి పదములను కొన్నిటిని దిగువ పేర్కొందును.

"సేవించి ప్రార్థించుటల్" (1-17) (ప్రార్థింపగనే యని యర్థము)
"అనుటలయ్యువిద" (1-109).
"ఏమనుటలనన్" (3-225).
"అనుటలాయెమ్మెలాడి" (4-37).
"నరేంద్రుడెంచుటల్" (4-48).
"ఊహించి కొండాడుటల్" (4-74).
"ఏకోదరుల వీడుటలెటొ" (5-212).
"అర్పణచేసి నమస్కరించుటల్" (7-309).
"చెలులేమనుటల్" (7-312) - ఇత్యాదులు.

## విలక్షణ పదప్రయోగము :

కావ్యమున మాండలికములే కాక కొన్ని విలక్షణ పదములు ప్రయోగింపబడి యున్నవి. అట్టి పదములను దిఙ్మాత్రముగా పేర్కొందును.

1. రంభలు :

ఈ పదము కేసన మావితోటను వర్ణించిన సందర్భమున ప్రయుక్తమైనది.

"రంభలు రామచిల్కలయి రక్తిని నాట్యము లాడుచుండ.... ఒకే
స్తంభపుమేడ గానపరిషత్తు రచించిరయారె ఖేచరుల్" (1-168).

'రంభ' పదానికి ఒకానొక యప్సరస, అరటి మున్నగు అర్థములు గలవు. రంభ ఒక్కతెయే కాని పెక్కండ్రు లేరు. ఇక్కడ రంభలు అని బహువచన ప్రయోగము చేయుట చింత్యము. ఇది 'అప్సరసలు' అని సామాన్యార్థములో వాడబడినదని భావింపవలెను. పై పద్యము రెండు మూడు పాదములందు "దేవగాయకులు కోకిలలై జతఁ బాడఁ గిన్నరుల్ బంభరరూపులై కలవిపంచికి కిన్నెర మీటగా" అని చెప్పబడుటచేత నృత్య గీత వాద్యములలో గీత వాద్యమునకు దేవ

గాయకులు కిన్నరులు చెప్పబడగా నృత్యములకు రంభాద్యప్సరసలన్న య
మిక్కడ స్ఫురించుచున్నది. లోకసాధారణముగా 'రంభలు' అనగా సౌంద
వతులని యర్థము.

**2. రావు శిరోమణీ :**

ఇది "రావు శిరోమణీ! ప్రతిఫలమ్ము నొసంగఁ దలంతువేని....
(5-304), అని లోభిసెట్టి పశ్చాత్తప్తుడై పోతనను సంబోధించి సంభాషిం
సందర్భము లోనిది. పోతనను రావు శిరోమణీ!' యని సంబోధించుట విలక్ష
ముగా నున్నది. ఏలయన 'రావు' అన్నది వెలమ వారికి, నియోగి బ్రాహ్మణ
మున్నగువారికి పట్టపుపేరైనను పోతనకాలము నాటికి నియోగులకు కాని వె
రాజులకు గాని 'రావు' అన్న ఉపపదము వాడుకలో లేదు. మాదానేడు, సిం
నేడు అనియు నాయకుడు, నాయుడు అనియు ఉపపదము లుండెడివి. కాగా పో
రచించిన భోగినీ దండకము అంకిత పద్యములో

"పండిత కీర్తనీయుడగు బమ్మెర పోతన.... భోగినీ
దండకమున్ రచించె బహుదాన విహర్తకు రావుసింగ భూ
మండన భర్తకున్...." అని ప్రయోగించినాడు. పేరునకు మొదట గ
నామమువలె 'రావు' పదము కలదు. రేచర్ల వంశీయుడగు సింగనృపతికి 'ర
గృహనామము కాదు. అతనికి బిరుదుగా రాజు అను నర్థముతో 'రావు' ప
ప్రయుక్తమైనది. ఏతదనుసారముగనే పోతన చరిత్రము నందును "రావు శి
నృప భూషణ!...." (4-221) యని ప్రయోగింపబడినది. అట్లే పోతనను '
రాజు' అనుట కలదు.

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి....హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు...."[1]

అను ప్రయోగము కలదు. రాజును రాయడు, రావు అనుట పరిపాటి. అ
రావు పదము ప్రచురము కాకున్నను ఆదృష్టితో పోతనను 'రావు శిరోమణి'
సంబోధించుట యుక్తియుక్తముగనే యున్నది.

1. శ్రీ మహా భాగవతము : 1-11

3. బమ్మెర, బొమ్మెర :

"....బమ్మయే పోతనాఖ్యతోఁ బ్రభవమందె
ననఁగ బమ్మెర యన నొప్పు జనపదమ్ము."[1]

అను దానిలో 'బమ్మెర' యనియు

"ఎట్టెటూ మిమ్ము బంపిన దెవరు తాను
బొమ్మెరన్ వసియించెడి పోతరాజె...."[2]

అని సింగనృపతి వృద్ధ కంచుకి నారయాదులతో ననిన సందర్భమున 'బొమ్మెర' యనియు ప్రయోగింపబడినది. 'బమ్మెర' యను ప్రసిద్ధ పదమునకివి రూపాంతరములు. గ్రామనామ శబ్దములనేక రూపములతో నుండుట ప్రసిద్ధము కావున బమ్మెర, బమ్మర, బొమ్మెర అనుట యుచితమే.

4. వేంకట రెడ్డి :

పోతన విరక్తుడై తీర్థయాత్రలు చేయుచు తిరుపతి వేంకటేశ్వరుని దర్శించి నప్పటి ఆ దేవుని వర్ణనలో ఈ పదము ప్రయుక్తమైనది.

ఎత్తుగీతి : "ఏడుకొండలపై నిల్చి యెల్ల జనుల
కభయ దానమ్మొసంగు శ్రీహస్తముద్రఁ
దాల్చి భక్త మనోభీష్టదాయియైన
వడ్డికాసుల వేంకటరెడ్డి గాంచి."[3]

వేంకటేశ్వరుని వేంకటరెడ్డి యనుట విచార్యము. 'వేంకటేశ్వరుడు' వికృతి 'వెంకన్న' యని కలదు. కాని వేంకటరెడ్డి యని యనబడదు. ఇట్లనుటచేత తిరుపతిదేవుడు రెడ్డికాడు. దీనినిట్లు సమర్థించుకోవలెను. ఱేడు శబ్దభవము రెడ్డి కావున వేంకటాద్రి ప్రభుపును వేంకటరెడ్డి యనుట అయుక్తమేమియు కాదు. ఇది భక్త్యతిశయముచేత చనువుగా చమత్కారముగా ప్రయోగించిన పదము.

వేంకటేశ్వరుని వేంకటరెడ్డి యనుటలో ఆచార్యులవారికి మక్కువ యెక్కువ యని మరొక సందర్భములో తేటపడుచున్నది. దీనితోబాటు ఇతర దైవతముల

1. పోతన చరిత్రము : 1-82
2. ,, ,, : 7-84
3. ,, ,, : 9-234

నామములను గూడ వికృతి రూపములో చమత్కారముగా ప్రయోగించిన దిగువ పద్యము గమనార్హము.

"అన్నపూర్ణా మనోహరుఁడంచు పేర్వడ్డ
కాశి విస్సయ యింట గంగఁద్రావి
కదలి యల్లు డగు జగ్గన్నయన్నసత్రాన
కులభేదమెంచక కూడు గుడిచి
భక్తలోకపు కొంగు బంగారమై యున్న
పాండురంగప్పని పదము పాడి
కొండలేడిటి నెక్కి కూర్చున్న వేంకట
రెడ్డి రొక్కమునకు వడ్డి గట్టి....
యాత్రముగియించుకొని లక్కమాంబ కేస
నార్యుఁడిలుసేరి రొక వర్షమరుగు వెనుక."[1]

ఇందు విశ్వేశ్వరుని 'విస్సయ' యనియు, జగన్నాథునికి 'జగ్గన' యనియు, పాండు రంగవిభుని 'పాండురంగప్ప' యనియు పేర్కొనుటయే కాక వెంకన్నను వేంకట రెడ్డి యనుట జరిగినది. ఇందులో మొదటి మూడు వికృతి పదములు ప్రసిద్ధము లైనవే. ఒక్క వేంకటరెడ్డియే మనకు క్రొత్తవాడు. ఆప్తుల ఆత్మీయుల పేరులను అనురాగాతిశయముచేత సూక్ష్మీకరించి పిలుచునట్లు కవిగారు దేవతలను పైరీతిగా పేర్కొనినారు.

5. లేఁగటావు : లేఁగటాలు :

"అట్టు మోడిచి పొదుఁగంది నాకుచు నిల్చి
యంబాపరవశి లేఁగటావు లఱచు"[2]
"అంబా! యని లేఁగటాలు స్తన భారముతోఁబరువెత్తు నిండ్లకున్-"[3]

'లేఁగటావు' 'లేఁగటాలు' అన్నవి టుగాగమ సంధిచేత నిష్పన్నమగును. బాలవ్యాకరణమున

1. పోతన చరిత్రము : 3-251
2. పోతన చరిత్రము : 4-219
3. ,, : 2-151

"కర్మధారయంబులందుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు-"[1]
అను సూత్రము పై సంధికి సాధకము కాదు. ఈ సూత్రము ననుసరించి కర్మధారయసమాసముననే టుగాగమ మగును. విశేష్య విశేషణముల చేతనేర్పడు కర్మధారయము కాక పైపదములలో రెండును విశేష్యములుండుటయే కాక పూర్వపద మకారాంతమైయున్నది. ఈ సంధికి ఆంధ్రభాషానుశాసనము గతి కల్పించుచున్నది. అది యిట్లు సూత్రించినది.

"సమాసము నందు కొన్ని శబ్దముల ఉకారమునకు అజాది శబ్దములు కొన్ని పరమగు నపుడు టకారాగమము బహుళముగా నగును."[2]
అని చెప్పి దిగువరీతిగా వివరించినది.

"ఇతర సమాసములందు గూడ నీయాగమము కానవచ్చుటచే 'కర్మధారయము లంద' నెడి చిన్నయసూరి నియమము చాలదు."
"ప్రయోగములను బట్టియు వాడుకను బట్టియు నెపుడెచ్చట వచ్చునో గ్రహించునది."
"బహుళ మనుటచే, తేనెటీఁగ-దుక్కిటెద్దు-పల్లెటూరు-పడకటిల్లు-వెల్లటేనుగు ఇత్యాదులందితరాచ్ఛులకుఁ గూడ నీయాగమము కలుగుచున్నదని తెలియునది."

అని విపుల వివరణ యిచ్చినారు మల్లాదివారు. ఈ వివరణానుసారముగా లేఁగ + ఆవు = లేఁగటావు అని సిద్ధించుచున్నది.

**6.** గుడీ గుండము :

"బండల దొల్చి పొరమిడు బ్రహ్మకు నీకు జగత్తులో 'గుడీ గుండము' లేని దీనదశ గూరెనె?...."[3] ఇది సముచ్చయార్థకములో 'గుడియను గుండమును' అని యనవలసినది. ఇట్లు ప్రయుక్తమైనది. ఐనను ఇట్టి ప్రయోగము సాధువే.

---

1. బాలవ్యాకరణము-సంధి పరిచ్ఛేదము : 28 వ సూ.
2. ఆంధ్ర భాషానుశాసనము (మల్లాది సూర్యనారాయణశాస్త్రి): సంధి ప్రకరణము: 30 వ సూ.
3. పోతన చరిత్రము : 8-255

"సముచ్చయ లోపమునఁ బూర్వాచ్చునకు దీర్ఘము"[1]

అని మల్లాది వారు సూత్రీకరించి,

"దుర్భాషణముల్ వినీ వినని భంగి" -శృంగార నైషధము 6-33

"అంతా సంశయమే శరీరఘటనంబంతా విచారంబె-"

కాళహస్తీశ్వర శతకము.

''నమ్మమి మృత్యువు పెద్దయు, నమ్మట యపమృత్యువగుట

నరపతి నమ్మీ, నమ్మక"- భారతము: శాంతి పర్వము 2-351

ఇత్యాది పూర్వకావ్యోదాహరణము లిచ్చినారు. దీని ననుసరించి గుడీగుండము ప్రయోగము యుక్తమైనదే.

## ప్రౌఢ ప్రయోగములు :

కావ్యమున రెండు మూడు ప్రౌఢప్రయోగములు చేయబడినవి. ఇవి సాధారణ దృష్టికి తప్పులుగా తోచినను అరుదైన లక్షణ ప్రయోగముల వల్ల ఒప్పులే యై యొప్పుచున్నవి.

## I. సంధిప్రయోగము:

**1.** సరోపాంత :

"హసదత్యంత మనోజ్ఞ పుష్పయుత దివ్యారామసీమాంతర

స్థ సరోపాంత సితద్యుతి...."[2]

ఇక్కడ సరస్ + ఉపాంత = 'సరఉపాంత', 'సరయుపాంత' అను సంధి రూపము లేర్పడును గాని 'సరోపాంత' కాజాలదని సాధారణముగా తెలియును. దీనికి సూత్రము

"అస్' అంత పదమునకు 'అ' కారాద్యచ్చులు పరమైనపుడు సకారమునకుఁ బర్యాయముగా లోప యకారములు వచ్చును. లోప పక్షమున సంధిరాదు".[3]

1. ఆంధ్ర భాషానుశాసనము : ప్రయోగ విశేష ప్రకరణము. 7 వ సూత్రము.
2. పోతన చరిత్రము : 4-357
3. తత్సమ చంద్రిక (సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి) సంధి ప్రకరణము - 41 సూత్రము

**2.** వక్షసీమ :

"చక్కని చుక్క యీ నగర సౌధరమాంగన వక్షసీమ బల్
మక్కువఁ దాల్చు నుల్లబము మాడ్కి...."[1].

ఇందు 'వక్షసీమ' యనుట పొసగదనియు 'వక్షస్' పదము సకారాంతము కావున వక్షస్ + సీమ, 'వక్షస్సీమ' యని సంధి యేర్పడుననియు భావింపబడును.

**3.** వక్షహారము :

"ఎవని లోక ద్వితయ విభూతి విభవమ్ము నందు భార్గవి
వక్షహార రత్నము"[2]

ఇది వక్షస్ + హారము = వక్షోహారము అగును గాని, వక్షహారము కాద నుట కలదు. కాగా ఈ సరస్, వక్షస్ అను సకారాన్త పదములు అకారాంత పద ములుగా నొకానొకయెడ పరిగణింపబడి 'సరోపాంత' 'వక్షసీమ' అను సంధి రూపములు సరియైనవేయని సమర్థించుటకు సన్నిధానము వారి దిగువ వివరణ యుపకరించుచున్నది.

"దుర్వాసస్ + మహాముని - దుర్వాసో మహాముని యని కావలసియున్నది. కాని దుర్వాస మహాముని యని ప్రయోగములు కలవు."

"విచకర్త శిరాన్ ద్రౌణి రథః పాద రజోపమాన్" అనునెడ 'శిరాన్', 'రజోపమాన్' అను ప్రయోగములు గాన వచ్చుచున్నవి. ఇట్టివి "కేచిత్స కారాంతః అకారాంతా అపి భవంతి" అను న్యాయముచే అకారాంతత్వ మంగీకరించినచో సిద్ధములగును."[3]

కావున ఈ సంధి ప్రయోగములు మూడు సలక్షణములై ప్రౌఢములై యొప్పుచున్నవి.

## II. కారక ప్రయోగము :

"....నిన్ మాధవునిన్ వినుతించి ముక్తుఁడై
యుండక నే సుధన్ విడిచి...."[4]

1. పోతన చరిత్రము : 7-57
2. ,, : 11-355
3. తత్సమ చంద్రిక-సంధి ప్రకరణము - 42 (ఖ)
4. పోతన చరిత్రము : 5-33

ముక్తుఁడై యనునది యిచట సరిపడనట్లనిపించును. 'ముక్తుఁడనై' యనుట యొప్పుగా భావించుటకు వీలు కలదు.

"ప్రథమాంతంబులగు యుష్మదస్మత్ విశేషణంబుల కేకత్వంబున వు-ను-లును బహుత్వంబున రు-ము-లు నంతాగమంబులు ప్రాయికంబుగా నగు"[1]

"ఈ యాగమంబులు పరంబులగునపుడుత్వంబున కత్వంబగు."[2]

అను సూత్రముల ననుసరించి ముక్తుఁడను- ముక్తుఁడనై యగును. ఐనను ఇచట 'ముక్తుఁడై' యన్నదియు సరియైనదేయని మల్లాదివారి వివరణానుసారముగా సమర్థింపవచ్చును.

"వు; రు; ను- ము; చేరకపోవుటయుఁ గలదు."[3]

అని వారు సూత్రీకరించి

"పాండు భూవరునకుఁ గోడలైతి"-భారతము. ఉ-3.

"తుదిఁ బెనుఁ బామనై యధిక దుఃఖితుఁడైతి"-భారతము-ఆరణ్య 4-121

ఇత్యాద్యుదాహరణము లిచ్చియున్నారు. కనుక యిచ్చటి 'ముక్తుఁడై' యన్నది యుక్తమైనదే.

## ప్రామాదికములు

గుణరత్న రత్నాకరమై సలక్షణమై నిర్దుష్టమై విభాసిలు పోతన చరిత్ర మహాకావ్యమున క్వాచిత్కముగా కొన్ని నెరసులు ప్రమాదవశమున దొరలినవి. గుణగ్రహణ పారీణులగు దోషజ్ఞులు రసాస్వాదనలో అడ్డువచ్చు అత్యల్ప దోషములను పరిహరింపగలరను విశ్వాసముతో దిగువ పేర్కొనుచున్నాను.

### I. సంధిగత స్ఖాలిత్యములు :

**1.** నిల్వనుటకు :

"కనవలెనంచుఁ గోరు, సరిగాంచిన పోయెదవేల బేల! ని
ల్వనుటకు బుద్ధివారు....."[4]

---

1, 2. బాల వ్యాకరణము-కారక పరిచ్ఛేదము. సూత్రములు 33, 34

3. ఆంధ్రభాషానుశాసనము : ప్రయోగ విశేష ప్రకరణము సూత్రము 19 లో ఎ

4. పోతన చరిత్రము : 11-141

ఇక్కడ 'నిల్వనుటకు' అన్నది సరికాదు. దీనికి చిన్నయసూరి యిట్లు సూత్రము చేసెను.

"మధ్యమపురుష ము వర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు."[1]

అని చెప్పి యుదాహరణము లిచ్చి,

"చూడుమనియె-వినుమనియె. ఇచ్చట నచ్చు పరంబైనది కాఁబట్టి లోపము లేదు" అని విశదీకరించెను.

దీని ననుసరించి 'నిల్వుమనుటకు' అని సంధి చేయవలసియున్నది. కాగా ప్రౌఢ వ్యాకర్త దీనికి విరుద్ధముగా

"మధ్యమపురుష ము వర్ణకంబున కచ్చు పరంబగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి "[2]

అని సూత్రించి,

ఉ. "ఆడిదె నీదు పందెము" —కళా. 9-116

"భవచ్చిత్తేప్సితంబెద్ది చెప్పనినన్" —మార్కం. 1-127.

అను నుదాహరణము లిచ్చెను.

ప్రౌఢ వ్యాకర్త సూత్రానుసారముగా ఆడుము + ఇదె = ఆడిదె. చెప్పుము + అనినన్ = చెప్పనినన్—అనియైనది. కాని ప్రౌఢ వ్యాకరణ వ్యాఖ్యాతయగు బులుసు వేంకటరమణయ్యగారు ఈ సూత్రప్రయోజనమును విమర్శించినారు. వారిట్లువ్రాసిరి.

"పరిశీలింపగా మీది యుదాహరణములు రెండును పై సూత్రము పట్ల సరికావు. 'ఆడిదె నీదు పందెము' అను పాఠము తప్పు. ఇచట 'ఆడితె, నీదు పందెము' అని పాఠము కలదు 'నీ పందెము నాడితివా ?' అని దాని యర్థము; అయ్యదియే ప్రస్తుతము.

'భవచ్చిత్తేప్సితంబెద్ది, చెప్పనినన్' అనునదియు సరియైన పాఠము కాదు. 'భవచ్చిత్తేప్సితం బెద్ది చెప్ప నినున్ సంతత సత్యపాలనునిగాఁ బుణ్యుండు కాఁజూచితిన్' అనునదియే సరియగు పాఠము. 'చెప్ప నినున్' అను నీ పాఠమునే అంగీక

1. బాల వ్యాకరణము-సంధి పరిచ్ఛేదము : 47 వ సూత్రము
2. ప్రౌఢ వ్యాకరణము-సంధి పరిచ్ఛేదము: 18 వ సూత్రము

రించినచో బాల వ్యాకరణమును బట్టియే హల్లు పరంబైనందున 'ము' వర్ణకలోపము సిద్ధించును. 'చెప్పనినన్' అను పాఠమును గ్రహించినచో చె, 'ప్పనినన్.... బుణ్యుండు కాఁజూచితిన్' అనునెడ యతి భగ్నమై పోవును. కావునఁ బై యుదాహృతులు రెండును సరికానందున సూత్రారంభమునకుఁ బ్రయోజనము మృగ్యమని గ్రహింప వలెను."

కావున బాలవ్యాకరణ సూత్రానుసారముగా 'నిల్వుమనుటకు' అనుటయే యొప్పు.

## 2. చాలనుకొను :

"ఏది యెట్లున్నఁ బెనిమిటి యిడుము లెదకు
జ్ఞప్తిరాఁ బొట్ట గడచుటే చాలనుకొను."[1]

'చాలనుకొను' సరియైనదికాదు. 'చాలు' అన్న క్రియాపదము ద్రుతప్రకృతికము. కావున దాని కచ్చుపరమైనపుడు చాలున్ + అనుకొను = చాలుననుకొను-అని సంధి రాని రూపమేర్పడును. దీనికి

"ఇకాదులకుఁదప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు-"[2]

అను సూత్రానుసారముగా సూరియిచ్చిన యుదాహృతి వచ్చున్ + ఇపుడు = వచ్చు నిపుడు-ఐనట్లు 'చాలుననుకొను' అగుట యొప్పు.

పోతన చరిత్రమున ఈ 'చాలు' పదమునకిట్లే సంధి దోసగేర్పడినవి మరి కొన్నిచోట్ల కాననగును.

"గురువున్నఁ జాలెటిఁగి"-(11-256)
"చాలికచాలు"-(11-259)
"ఇద్ది చాలింతటితో"-(11-287)

## II. క్రియాపద స్ఖాలిత్యములు :

1. "తెలియనట్లుండలమి కొన్నఁ దొలఁగలేవు."[3]

ఇక్కడ "లిడ్లాట్టుల డుఙ్జునకెరు ను వర్ణంబులగు"[4] అను సూత్రానుసారముగా

1. పోతన చరిత్రము : 2-81
2. బాల వ్యాకరణము : సంధి పరిచ్ఛేదము: 9 వ సూత్రము
3. పోతన చరిత్రము : 3-234
4. బాల వ్యాకరణము : క్రియా పరిచ్ఛేదము: 16 వ సూత్రము

'ఉండు' అను క్రియకు ద్రుతము వచ్చి 'తెలియ నట్లుండున్ + అలమికొన్న = తెలియనట్లుండునలమికొన్ని' యగును. కావున పై కావ్యప్రయోగము సరియైనది కాదు.

2. "ఇకేమి చెప్పుదీ విక్కరణిన్, రచింతు పని యెంచను."[1] ఇందు 'లకారంబునకు డు ద్రుజువురును మ ఙ్ఙగు." [2] మున్నగు సూత్రముల ననుసరించి యుత్తమ పురుషైకవచన క్రియ కావున 'చెప్పుదును'అయి చెప్పుదును + ఈవు = 'చెప్పుదు నీవు' అను రూపమేర్పడును. కావున 'చెప్పుదీవు' అనుట సరికాదు.

**2.** కనతల్లి :

"చేరెను గౌశికుండట! చిచ్చుడికెన్ గనతల్లి ప్రేపులన్"."[3]
ఇక్కడ 'కనతల్లి' అనుట సరికాదు. 'కన్నతల్లి' యన వలెను. ఇది "పద్యాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు."[4]అను సూత్రాను సారముగా 'కన్నతల్లి' 'కనినతల్లి' యను రూపము లేర్పడును. కాగా 'కనతల్లి' యను రూపము జన వ్యవహారములో కానవచ్చును.

## III. ఆచ్ఛిక సంబంధి స్ఖాలిత్యము :

1. ఈ చేలన్ మా చేను లెవ్వో చెప్పరె యనినన్...."[5] అని నర్స మాంబ గొల్లపిల్లల నడుగును. ఇక్కడ 'చేను' బహువచనము 'చేలు' అగుట యొప్పు.

"బహువచనంబు పరంబగు నపుడు చేను పేను మీను శబ్దంబుల ను వర్ణంబు లోపించు."[6] అన్న సూత్రము దీనిని నిర్దేశించుచున్నది. కాగా తెలంగాణమున 'చేనులు', 'చేండ్లు' అని బహువచన రూపములు వాడుకలో నుండుటచేత మాండలిక ప్రయోగముగా దీనిని సమర్థింప వచ్చును.

గుణ సాగరములోని యీ కించిద్దోషములు "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అన్నట్టులొక లెక్కలోనివి కావు.

~~~~~~~~~~~~~~~~~~~~

1. పోతన చరిత్రము : 8-99
2. బాలవ్యాకరణము : క్రియా పరిచ్ఛేదము : 8 వ సూత్రము
3. పోతన చరిత్రము : 11-9
4. బాలవ్యాకరణము : క్రియా పరిచ్ఛేదము : 51 వ సూత్రము
5. పోతన చరిత్రము : 3-149
6. బాల వ్యాకరణము : ఆచ్ఛిక పరిచ్ఛేదము : 20 వ సూత్రము
~~~~~~~~~~~~~~~~~~~~

ఈ ప్రామాదికములను గూర్చి ఆచార్యులవారు స్వప్రశ్రయముగా నిట్లు విజ్ఞప్తి చేసిరి.

"రసమయ కావ్య దివ్య సుమరాజమునం దొసఁగుల్ ప్రమాదతన్
మసలినఁ దత్ప్రబంధమును మాన్యులు మెచ్చకయుందురే సుధా
రసనిధియైన తేనెపెర రంధ్ర సమన్విత మంచు నిద్ది నీ
రసమని త్రోసి పుచ్చుటలు ప్రాజ్ఞ జనోచిత కృత్యమౌనొకో"[1]

కావున రసజ్ఞులగు ప్రాజ్ఞులు ఆచార్య వచనములను పాటింతురనుటలో నెట్టి సంశయము లేదు.

మహాకావ్యమున 'కడుప్వుఁదరబట్టె' (7-16), 'ఎద్మెత్తగ' (5-138), 'అడ్గు భార్య'(6-178), 'మోదగతి నర్గి' (8-43), 'వెనుదిర్గి'(11-156) వంటి శ్రుతి సుభగము కాని పదములు మిక్కిలి క్వాచిత్కముగా పడియున్నవి. మృదు మధుర పద కుసుమశయ్యలో నివి మొగ్గలై యగ్గపడుచున్నవి.

రమ్యమై రసవంతమై సార్థకమై సమంజసమై యొప్పారు భాషావైచిత్రిగల పోతన చరిత్ర రచనగూర్చి విద్వదభిప్రాయము తెలిపి యీ వ్యాసమును ముగింతును.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిట్లు ప్రశంసించిరి.

"కవిగారి పదప్రయోగము సులక్షణమై మృదుమధురమై యింపు నింపు చున్నది. సంస్కృత సమాసముల వాడినను తెలుగు పదముల వాడినను వారి రచన ప్రౌఢమయ్యు సర్వసుబోధమై వీనులవిందు చేకూర్చుచుండును. తెలంగాణ మున వాడుక యందున్న పదములను జాతీయములను వారు పెక్కుచోట్ల వాడి యున్నారు. 'మీ బంటుకు బానిసను గింత బారెయ్యవ్వా-కుంటోణ్ణి పున్నెముంటది' యనునది తెలంగాణమునందలి పల్లె ప్రజల పలుకుబడి. ప్రహ్లాదుని తొక్కుపల్కులను గవిగారు యథాతథముగాఁ బ్రయోగించియున్నారు. వారెడనెడ వ్రాసిన శ్లోకములు, తెలుగు పద్యములలోఁ గీలించిన సంస్కృత వాక్యములు, లోకోక్తులు వారి కాభాషయందలి నిశిత పాండిత్యమును జాటుచున్నవి."[2]

అవధానిగారి అమూల్యాభిప్రాయ మక్షరాక్షరము యథార్థము.

1. పోతన చరిత్రము : 'పీఠిక' ప్రబంధస్తుతి. 53 వ పద్యము.
2. ,, : 'తొలిపలుకు' పుట xv,xvi.

# భోగినీ నృత్య సౌందర్యము

## ప్రస్తావన:

కావ్యములందు కథా ప్రయోజనమునకు, రసపాత్రపోషణకు, ధర్మోపదేశమునకు అనేక సన్నివేశములు కల్పింపబడి వర్ణింపబడును. పోతన చరిత్రము నందును నట్టి రమ్యరసవద్ఘట్టము లనేకములు సమ్యగ్వర్ణితములై యున్నవి. అందు భోగినీ నృత్య ఘట్టము వర్ణనల రత్నాలహారములో తరళమై విరాజిల్లుచున్నది. ఇది కథానాయకుడగు పోతన జీవితములో మలుపు తిరిగిన మైలురాయి వంటి ముఖ్య ఘట్టము. రమ్యరమ్యమైన యా నృత్య కళాప్రదర్శన ఘట్టము కథాగతికి, రసపోషణకు, పాత్రపోషణకు, నీతిబోధకు నిలయమై చెలువుమీరియున్నది.

## కావ్యములలో నృత్య వర్ణన:

ప్రాయికముగా మహాకావ్యములందు ఆలంకారికులు నిర్దేశించిన యష్టాదశ వర్ణన లుండుట పరిపాటి. తదితర వర్ణనలలో సంగీతాది లలితకళలను వర్ణించుట అరుదుగా కానబడును. అందును గీతవాద్యములతో హృద్యమగు నృత్యమును వర్ణించిన ఘట్టములు మిక్కిలి అరుదై యున్నవి. కావ్యములలో సకృత్తుగా దర్శన మిచ్చు నృత్య వర్ణనలను దిఙ్మాత్రముగా ప్రస్తావింతును.

కాళిదాసు మాళవికాగ్నిమిత్ర నాటకమున నృత్యమును వర్ణించెను. నాటక ద్వితీయాంకమున గల మాళవిక నృత్యము మిగుల సంగ్రహముగా వర్ణింపబడినది. నన్నెచోడుని కుమార సంభవములో ద్వితీయాశ్వాసాంతమున శివతాండవ వర్ణన శివ స్తవములో రేఖామాత్రముగా కావింపబడియున్నది. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రములో నృత్య ప్రశంస కావించి యున్నాడు. ఆ కావ్యములోని పర్వతప్రకరణమున శ్రీశైలమునందలి శివరాత్రిమహోత్సవములలో ప్రదర్శింపబడిన నృత్యములు వర్ణింపబడినవి. అందు నృత్యకళకు చెందిన శాస్త్ర సాంకేతిక పదజాలమే కాక వివిధ జానపద నృత్యముల వర్ణనమును గలదు. పాల్కురికి వారి బసవపురాణమునందును బసవేశ్వరుని వివాహ ఘట్టమునను, కళ్యాణ పుర ప్రవేశ సందర్భమునను చేయబడిన నృత్యముల ప్రస్తావన కలదు. మరియు బసవ

పురాణము తృతీయాశ్వాసమునందు కంచి ఏకామ్రనాథుని గుడిలో నాట్య నిమిత్తండికి శివుడు స్వయముగా తాండవ నృత్య స్వరూపమును వర్ణించి చెప్పినది ప్రశంసా పాత్రముగా నున్నది శ్రీనాథుని కాశీఖండమున షష్ఠాశ్వాసమున కర్పూర తిలకయను గణిక రత్నేశ్వర స్వామి సన్నిధిలో నృత్యము చేసినట్లు ప్రస్తావన కలదు. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్రము నందు (పుట 18,19) రాజుదర్బారు లోని నృత్యము రమణీయముగా వర్ణింపబడినది. కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోను, జక్కన విక్రమార్క చరిత్రములోను రంభాద్యప్సరసల నాట్య వర్ణన సంగ్రహముగా చేయబడినది. విశ్వనాథ సత్యనారాయణగారి "కిన్నెరసాని పాటలు" గేయకావ్యమున కిన్నెరనదీసుందరి నృత్యము మనోజ్ఞముగా వర్ణితమై యున్నది. విశ్వనాథవారి 'వేయి పడగలు' నవల యందును దేవదాసి గిరిక చేసిన దశావతార నృత్యములు ప్రశస్తముగా వర్ణింపబడియున్నవి. పుట్టపర్తి నారాయణా చార్యులుగారి 'శివతాండవము' నాట్యవర్ణనకు వాసిగాంచినది. అది కావ్యాంతర్గత నృత్య వర్ణనకాక ప్రత్యేకించి నృత్య వర్ణనకే రచింపబడిన కావ్యము. ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు తమ 'కర్పూర వసంతరాయలు' గేయ కావ్యమున లకుమాదేవి నృత్యమును మధుర మంజులముగా వర్ణించియున్నారు. ఇట్లు కొన్ని కావ్యములలో నృత్య వర్ణనలున్నను అవి మిక్కిలి సంగ్రహముగా చేయబడి యున్నవి.

## భోగినీ నృత్య ఘట్టము :

పోతన చరిత్రమునందలి భోగినీ నృత్యఘట్టము విస్తృతి చేతను విశిష్ట వర్ణన చేతను సర్వకావ్య నృత్య వర్ణనలలో ఉత్కృష్టపట్టము నలంకరించుచున్నది. ఇది చతుర్థాశ్వాసమున 230వ పద్యము నుండి 309వ పద్యము వరకు 80 పద్య ములలో సుదీర్ఘముగా వర్ణింపబడినది. ఇందులో 241 సంఖ్యగలదొక్క వచన వాక్యము తప్ప తక్కినవెల్ల పద్యములు, గేయములు. రాచకొండలోని యొక వేశ్యా పుత్రిక రూపగుణశీల విద్యా వివేక సంపన్న లలితకళా స్వరూపిణి సింగ నృపాలుని చేపట్టదలచి తల్లి యెంత బోధించినను వేశ్యావృత్తిలో అడుగు పెట్టక అనన్య చిత్తయై ఆరాటపడి తల్లితోగూడి రాజసభలో ప్రవేశించి దివ్యముగా నృత్యము చేసి సభను సమ్ముగ్ధము గావించి రాజుమనసునకెక్కి యాతని చేత స్వీకరింప బడెను. పట్టమహిషికాని రాజుభార్య యగునామె భోగినిగా వ్యవహరింపబడినది.

సింగనృపతి యంతకు ముందామె శీలము, తనపై ఆమెకుగల గాఢానురాగము చారునివల్ల వినినవాడగుట సభలో నామె రూపరేఖా విలాసములు, అభినయ కళా నైపుణ్యము గాంచి కరగి "స్త్రీరత్నం దుష్కులాదపి" యని సంభావించి యామెను పరిగ్రహించెను. పోతన ఆమె గుణ శీలములనంతకు పూర్వము దేవాలయావరణ ములో నవగాహన చేసికొని సద్భావన గలవాడై యుండుటచేత సభలో నామె లోకోత్తర నర్తనమునకును విశేషించి యామె రాధికగా నటించి మధుర భక్తిరస ప్రసారము గావించినందున హర్షించి యామె వృత్తాంతమెల్ల దండకముగా రచించి రాజున కంకితము చేసెను.

కావ్యమునందలి ఈ నృత్యకళాఖండమొక రమణీయ ఖండకావ్యమై శోభిల్లుచున్నది. ఇది నాటకము నందంతర్నాటికవలె విలసిల్లుచున్నది. ఈ భోగినీ నృత్యము శాస్త్రీయమై సాంప్రదాయికమై సాగినట్లు వర్ణింపబడినది. ఈ యభినయ కళను కమనీయ కవితామయము చేసి సాక్షరముగా సాక్షాత్కరింప జేయుటకు వరదాచార్యులవారొనర్చిన కృషి యనన్యమైనది. వారు భరతనాట్య శాస్త్రమును క్షుణ్ణముగా నధ్యయనము చేసియు, నాట్యాచార్యుల వలన తదీయ మర్మముల నెరి గియు, అనేక పర్యాయములు నృత్యములను నిశిత పరిశీలనతో తిలకించియు కావ్యమున నృత్యవర్ణన చేసిరి. విశారదులై నాట్య శారద మనోనయనముల నాడు చుండ తన్మయులై తదేక నిష్ఠతో సమాధ్యవస్థలో నుండి ముప్పది యారు గంటల కాలము నిద్రాహారములు లేక నిరంతరముగా రచన సాగించి ముగించిరి. ఇది యాచార్యులవారి కవితా తపస్సులో ప్రత్యక్షమైన నాట్యభారతి. సిద్ధించిన కళామృత కలశము. వారి కవితా వ్యవసాయమున తెలుగువారికి లభించిన తరు గని చెరుగని బంగరు పంట. సింగనృపతి వ్యాజమున ఆంధ్ర పాఠకులకేర్పాటు చేసిన లోకోత్తర నృత్యవినోద కార్యక్రమము.

## భోగినీ నృత్యము-శాస్త్రీయత, సాంప్రదాయికత :

భోగినీనృత్యము శాస్త్రీయముగా సాంప్రదాయికముగా నిర్వహింపబడినదని మనవి చేసితిని. ఆ విషయమిచట వివరింతును. ఇది భరత నాట్యము. భరతుడు చెప్పిన నాట్యమే యీషద్భేదముతో తమిళనాడులో భరతనాట్యమనియు, కేరళలో

కథకళి యనియు, మణిపూర్, అస్సాము, బెంగాలు ప్రాంతములలో మణిపుర నృత్యమనియు, ఉత్తర భారతములో 'కథక్' అనియు వ్యవహరింపబడుచున్నది. ఇదియే తెలుగుదేశమున కూచిపూడి భాగవతుల చేత ఆరాధింపబడి కూచిపూడి భరత నాట్యముగా ప్రసిద్ధికెక్కినది. కాగా సింగనృపాలుని కాలము నాటికి కూచి పూడి నాట్య సంప్రదాయము వ్యాప్తిగాంచలేదు. కావున భరతముని యాశయాను గుణముగా రచింపబడిన జాయసేనాధిపుని 'నృత్తరత్నావళి' వంటి నృత్యశాస్త్ర సంప్రదాయానుసారముగా భోగినీ నృత్యము సాగినట్లు వర్ణనవలన తెలియును. ఐనను ఇందు కూచిపూడి సంప్రదాయములోని కళాపనాట్య పద్ధతి తప్ప తక్కిన నృత్యరీతులు చోటు చేసికొనియున్నవి.

ధనంజయుడు నాట్యాదుల గూర్చి దిగువ విధముగా వివరించెను.

"అవస్థానుకృతిర్నాట్యం రూపం దృశ్యతయోచ్యతే। రూపం తత్సమారోపాత్
దశధైవ రసాశ్రయమ్.... ........
అన్యద్భావాశ్రయం నృత్యం నృత్తం తాలలయాశ్రయమ్
ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథాపరమ్
మధురోద్ధత భేదేన తద్ద్వయం ద్వివిధం పునః
లాస్య తాండవ రూపేణ నాటకాద్యుపకారకమ్...."[1].

అనగా కావ్యమునందలి నాయికా నాయకుల యవస్థలను చతుర్విధాభినయముల ద్వారా అనుకరించుట నాట్యము. ఆ నాట్యమునకే రూపమని నామాంతరము. నటులు నాయికా నాయకుల వృత్తములను తమ యందారోపించుకొనుటచేత రూపమే రూపకమనబడును. రసము నాశ్రయించి సాగు రూపకములు పది విధములు. ఇక భావాశ్రయమైనది నృత్యము. అట్లే తాళము లయ అనువాని నాశ్రయించి వర్తిల్లు నది నృత్తము. పదమును అర్థమును, అనగా భావము ననుసరించి సాగు అభినయ ముతో గూడిన నృత్యము మార్గమనియు, సామాన్యులు సంతోషించు నృత్తము దేశియనియు వ్యవహరింపబడును. నృత్య నృత్తములు మరల రెండు విధములు. మధురమైనది, సుకుమారమైనది లాస్యము, ఉద్ధతమైనది తాండవము. ఇవి నాట కాదుల కుపవరించునవి. ఈ నృత్తనృత్యముల లక్షణము నిట్లే జాయసేనాని దిగువ రీతిగా తెలిపెను.

---

1. దశరూపకము : ప్రథమ ప్రకాశము, శ్లో. 7 నుండి 10

"ఇదానీం ప్రకృతం నృత్యం యథాలక్షణ ముచ్యతే
భవేత్ భావాశ్రయం నృత్యం పదార్థాభినయాత్మకం
గాత్ర విక్షేపణార్థత్వాత్ నృత్తే బహుళమాంగికం
వివిధేన విలాసేన క్షేపో విక్షేప ఇష్యతే"[1]

ఈ లక్షణము ననుసరించి భోగిని చేసినది ప్రధానముగా నృత్యము. మొదట తాళ లయానుసారముగా కరచరణాద్యంగ విక్షేపముతో నృత్తము చేసినను ముఖ్యముగా భావానుగుణముగా నృత్యమునే చేసెను. మరియు కైశికీవృత్తిలో సుకుమారముగా చేసినది కావున భోగినీ నృత్యము మార్గలాస్యమగుచున్నది.

భోగినీలాస్యము ఏకపాత్ర కేళికా పద్ధతిలో సాగినట్టిది. దీనిని గూర్చి నాట్యాచార్యులు, ఆం.ప్ర. నృత్య అకాడమి అధ్యక్షులు శ్రీ నటరాజ రామకృష్ణగారిట్లు వివరించిరి.

"ఈ రెండు రీతులు (యక్షగానము - వీథినాటకము) కాక ఏకపాత్ర కేళికా పద్ధతిగా మరొక్క సంప్రదాయము ఆంధ్రదేశంలో అభివృద్ధి గాంచినది. ఈ కళా రీతి పండితసభలందు, రాజుల ఆస్థానములందు ప్రదర్శితమైనట్టిది. ఇది శాస్త్రీయ నర్తనరీతి. ఈ నర్తనము ముఖ్యముగా స్త్రీలు చేయువారు. వీరు దేవుని గుడులందు నాట్యము చేయుటచే వీరిని 'గుడిసాను' లనెడివారు. 'సాని' అనగా సంగీతమునకు ఆధారమైన సప్తస్వరముల్లో 'స' మొదటి అక్షరము- 'ని' ఆఖరిది అనగా సంగీతము ఆద్యంతములనెరిగి గుడికి అంకితమైనవారని అర్థము. సంగీతమనగా నృత్యవాద్య గీతముల సమ్మేళనము....[2]"

మరియు ఈ భరత నాట్యము గురించి, నృత్యక్రమము గురించి శ్రీ నటరాజ రామకృష్ణ నికేతనము వారగు శ్రీమతి గడ్డిభుక్త జీవరత్నమ్మగారిట్లు విపులముగా వివరించిరి.

"భరత నాట్యమను పేరుతో నేడు ప్రచారము నందున్న కేళికారీతి నట్టువ మేళ సంప్రదాయమునకు చెందినట్టిది. నట్టువ మేళమనగా స్త్రీలు ప్రత్యేకముగా నాట్యమాడుటకు అనుకూలముగా రూపొందింపబడిన నృత్త, నృత్య అభినయములు

1. నృత్తరత్నావళి : ప్రథమాధ్యాయము, శ్లో. 50, 51
2. అఖిల భారత తెలుగు సాంస్కృతిక వారోత్సవాల ప్రత్యేక సంచిక : "తెలుగు నాడు-కూచిపూడి నాట్యం" వ్యాసము, పుట 142

కల్గిన నర్తనరీతి. ఇందు స్త్రీలు మాత్రమే నాట్యమాడుదురు. పురుషులు హంగు దారులుగా నుందురు. ఇది ఏకపాత్ర నర్తన విధానము. అనగా నర్తకి సుమారు రెండు మూడు గంటలు ఆడుటకు అనువైన రీతిలో నృత్యక్రమము ఏర్పడి యుండును. పూర్వమీ నృత్య పద్ధతికి దర్బారు, కచ్చేరి, ఆస్థానము, దాసి ఆట, సాదిర్, కర్ణాటకము, మేజువాణి అను పేర్లుండెడివి. భరత నాట్యమను పేరు ఈ యాటకు సుమారు ముప్పది సంవత్సరముల నుండి వ్యవహారములో నున్నది. పూర్వ మీ నాట్యము విద్వత్తుగల నర్తకినులచే రాజుల ఆస్థానములలో కవి పండిత విద్యావేత్తల సమక్షమున ప్రదర్శింపబడిన 'కేశిక' రీతి యగుటచే ఇది దర్బారు, కచ్చేరి, ఆస్థానము మున్నగు పేర్లతో పిలువబడెడిది-"

"భరత నాట్యములో ఆడబడు అంశములకున్ను, దేవలములలో ఆడబడు కవుతములకును, మొహరలకును, నృత్తములకును సంబంధము లేదు. ఆ విద్య వేరుగా ప్రత్యేక తాళములందుండును. అయితే స్వామి కొలువులో చేసెడి కేళిక కును, కచ్చేరి ఆటకును మాత్రము సంబంధమున్నది. కచ్చేరి ఆటలో నృత్తము, నృత్యము. అభినయము ప్రదర్శించబడును.

"నృత్తములో అలరింపులు, జతిస్వరములు, స్వరపల్లవులు, శబ్ద పల్లవులు, సాహిత్య పల్లవులు, తిల్లాన మొదలైన రచనలకు అరువులు, అడుగులు, తీర్మాన ములు పట్టబడును. నృత్యములో శబ్దములు, పదవర్ణములు, స్వరజతులు, జక్కిణి, గీత ప్రబంధములు ఆడబడును. అభినయమునందు పదములు, జావళీలు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు, శ్లోకములు, పద్యములు ప్రదర్శింపబడును."

"ఈ ప్రదర్శన విధానములో కొన్ని తావులయందు కొలది మార్పులు, ఘటిల్లినవి. అలరింపుతో ఆరంభించి జతి స్వరము, శబ్దము, వర్ణము, పదములు, తిల్లాన అనువాటితో ముగించు క్రమము దక్షిణ భారతములో వాడుకయందున్నది. శబ్దముతో ఆరంభమై జతి స్వరము, వర్ణము, పదము, తిల్లాన అను వాటితో ముగించు విధానము ఆంధ్ర ప్రాంతములో ప్రచారము నందున్నది.... "[1]

1. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము-6 వ సంపుటము 'భరత నాట్యము' వ్యాసము పుట, 548

ఆంధ్రదేశమునందలి శాస్త్రీయ నృత్యభేదములను తెలుపు పట్టిక దిగువ నీయబడినది

## *ఆంధ్రదేశమునందలి శాస్త్రీయ నృత్యము

- నట్టువమేళములు
  - దేవదాసీ సంప్రదాయము
    - ఆరాధన లేదా పూజానృత్యము (ఆలయములో స్వామి సన్నిధిని బలిపీఠముపై)
      - శైవసంబంధి
      - వైష్ణవసంబంధి
    - కేళిక (వినోదము) (కళ్యాణమంటపములో)
  - రాజనర్తకీ సంప్రదాయము (ఇదియును కేళికయే)
    - మార్గపద్ధతి
    - దేశిపద్ధతి
- నాట్యమేళములు
  - కూచిపూడి భాగవతులు
  - ఇతర భాగవతులు
    - కలాపములు
      - భామాకలాపము
      - గొల్లకలాపము
    - నృత్యనాటకములు (కథాప్రధానములు) (వీథినాటకములు)
      - భగవత్సంబంధి (దీనిని ప్రదర్శించువారే భాగవతులు)
      - రాజసంబంధి

* ఈ పట్టిక డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారు తమ 'తెలుగు నాటక వికాసము' సిద్ధాంత గ్రంథము - చతుర్థాధ్యాయమున 'నృత్యములు' అన్న వ్యాసమున, పు. 139 లో పొందుపరచినది. ఇక్కడ ఉటంకింపబడినది.

ఈ వివరణముల ననుసరించి భోగినీ నృత్యము శాస్త్రీయ నృత్యములో నట్టువ మేళమున రాజనర్తకీ సంప్రదాయమునకు చెందిన మార్గపద్ధతి కేళికా నృత్యము. జీవరత్నమ్మగారు విశదీకరించినట్లు ఆంధ్రదేశ సంప్రదాయానుసార ముగా భోగినీ నృత్యము 'జతి స్వరము, శబ్దము, వర్ణము, పదము (అభినయము), తిల్లాన' అను విభాగముల క్రమ పద్ధతిలో సాగినట్లు వర్ణింపబడినది. ఈ నృత్య క్రమ పద్ధతిని 'నటరాజ' రామకృష్ణగారును తమ 'నృత్యరేఖ' గ్రంథమున 7వ పుటలో పేర్కొని యున్నారు.

నృత్యారంభమున నర్తకి ప్రవేశించి 'ముఖచాలి' కావించి పుష్పాంజలి సమర్పించి నటరాజునకు నమస్కరించుట ఆచారము. పిదప జతి స్వరములో తాళలయానుగుణముగ నృత్తము చేసి శబ్దమును, వర్ణమును అనుసరించి నృత్త నృత్యములు చేసి ఆ పిమ్మట పదమునుగొని యభినయించి తిల్లానతో నృత్యమును ముగించును. శబ్దములో తొలుత సలాం శబ్దము పిదప దశావతార శబ్దము నిర్వ హింపబడును. ఇందులో సారభూతమై సర్వశ్రేష్ఠమైన యంశము సాత్త్వికాభినయ శోభితమైన పద నృత్యము. ఇది శాస్త్రీయమైన సాంప్రదాయికమైన నృత్య విధా నము.

భోగినీ నృత్యముపైన పేర్కొనిన శాస్త్ర సంప్రదాయముల ననుసరించి సక్రమముగా చక్కగా చేసినట్లు వర్ణింపబడినది. దీనిని క్రమముగా చర్చింతును.

## నృత్యవర్ణన వైశిష్ట్యము :

సింగనృపాలుని సభలో నృత్యము చేసిన భోగిని ఉత్తమ నర్తకి. నర్తకి కుండవలసిన 'రూప యౌవన లావణ్య నృత్తవిద్యాశ్రయత్వతః....''[1] అని యిత్యా దిగా జాయసేనాని చెప్పిన యుత్తమ లక్షణములన్నియు నామెకు నిండుగా గలవు. అట్టి నర్తకీలలామమును ప్రవేశపెట్టి లోకోత్తరమైన నృత్యమును చేయించినా రాచార్యులవారు. చూచి యానందించవలసిన నృత్యమును రసవంతముగా కవితా మయము చేసి చూపుట సాహసోపేతమైనది. బహుదుస్తరమైనది. అనన్య సామాన్య ప్రతిభా విభాసితులగు ఆచార్యులవారు విశిష్టముగా విపులముగా వర్ణించి నృత్యమును కావ్యదర్పణమున కమనీయముగా ప్రదర్శించి యున్నారు. ఈ రీతిగా వారు శ్రవ్య

1. నృత్తరత్నావళి : 7-158

కావ్యమునందు దృశ్యమును గూర్చి రసజ్ఞులకు కమ్మని విందు నొనగూర్చినారు. నటరాజ రామకృష్ణగారీ విషయమిట్లు ప్రస్తుతించిరి.

"ఎంత నాట్యకళా పరిశీలనము- ధారణాపటుత్వము గల్గినగాని యింత విశదముగా కండ్లకు గట్టినట్టులా దృశ్యముల వర్ణింప నలవిగాదు. కవిత వేరు. నాట్యము వేరు. నాట్యము నూహించియో చూచియో కవితాబద్ధము చేయ సమకట్టుటయే సాహసము. అందునూ ఇట్టి పసందైన భోగిని నూహించి దానిని మన కళ్ళకు సాక్షాత్కరింపజేసెడి రీతిని, మృదుమధుర పదబంధురోపేతమై, అనర్గళ ధారా పరిపుష్టమై యొప్పు రచనము సాగించి మెప్పించుటలో కవి కృతకృత్యులైనారు. చదివినంతసేపును సింగభూపాలుని కొల్వున వివిధ నృత్య భంగిమలలో నాట్యమాడుచున్న భోగినీయే కండ్లగట్టును."[1]

సుప్రసిద్ధ నాట్యాచార్యులగు రామకృష్ణగారు సెలవిచ్చిన ఈ యమూల్య వచనములు ప్రాజ్ఞామోద యోగ్యములు.

తొలుత తెలిపినట్లు ఉత్తమ నర్తకియగు తన కూతురును వేశ్యామాత రాజ సభలోనికి తోడుకొని వచ్చి రాజునకు మ్రొక్కి సభికులాశ్చర్యపడ 'దివిగులుకు రంభ కళలను దించివేయు' తన బిడ్డను చూపి పరిచయము చేసినది. కావ్యోపక్రమ కథానుసారముగా రంభాంశలో జన్మించిన భోగిని గూర్చి యిట్లనుట సమంజసమైనది. దివిజులకు రంభ ఆశ్చర్యము గొలుపదు. కాని భువిజులకీ భోగిని రంభ కంటె రమణీయముగా కనబడి చకితులను జేసినది. నర్తకి కుండవలసిన ప్రతిభా పాండిత్యములెల్ల భోగినికి గలవన్న విషయము ఆమె తల్లి పరిచయ వాక్యములలో దిగువ విధముగా విశదమగును.

"నిత్యమ్మైన ధనమ్ము సత్కళ యొకండే యంచు గీర్వాణ సా
హిత్యాభ్యాసము గానశాస్త్ర పటిమల్ హృద్యాంధ్ర వాగ్వశ్య పాం
డిత్యంబున్ జయదేవ గేయ సుమ వాటీ చారు సంచారక
న్నృత్యోపేత మనోహరాభినయముల్ నేర్పించితిన్ దీనికిన్...."[2]

ఈ రీతిగా భోగిని సంస్కృతాంధ్ర సాహిత్య వైదుష్యము, సంగీతము, జయదేవుని యష్టపదులు గొని మనోహరముగా నభినయించు నృత్యమును నేర్చినది.

1. పోతన చరిత్రము : పండితాభిప్రాయములు : 'భోగినీ నర్తన శోభ' పుట 97
2. ,, ,, : 4-225

వేశ్యామాత రాజుతో తమ కిష్టమైన కళాప్రదర్శనమున కాజ్ఞయిడెదరని కూతురు నేర్చిన కళలను దెలిపితినని వినయముగా మనవి చేయగా భోగిని 'చాలులెమ్మని బొమముడుల్ గ్రాల విసిగి దృగ్యుగళి కాందిశీకమై దెసలఁ బర్వ సిగ్గున సవరుచును దన చెంగుకొంగు'....[1] అని వర్ణించుటచేత ఆమె వినయ వివేకములు ప్రస్ఫుట మగుచున్నవి. అప్పుడు రాజు,

"ఇలఁ గళోపాసకులకెందుఁ గలుగుఁ బ్రతిభ దేనిలోనఁ దన్మయత వారూనఁ గలరొ
యా కళలె దర్శనీయమ్ములని నృపాలుఁ డామె మదికి నచ్చినది చేయనగుననియె"....[2]

ఇట్లనుటలో సర్వజ్ఞుడగు సింగనృపతి సరసత సువ్యక్తమగుచున్నది.

రాజు పై రీతిగా సెలవీయగనే భోగిని నృత్యము చేయ సన్నద్ధయైనది. అంతలో నృత్యారంభమునకు ముందు జయదేవుని మధురాష్టపదులు మనోజ్ఞముగా ఆలపించుట జరిగినది. నృత్య ప్రదర్శనలో మేళమువారు తొలుత ప్రార్థనగీతము జంత్రగాత్రములతో ఆలపించుట ఆచారము. దీనిని 'మేళవింపు' అందురు. అది యిక్కడ నిర్వహింపబడినది.

ఇక్కడ జయదేవుని అష్టపదులను గూర్చి యొకింత చెప్పవలసియున్నది. కృష్ణభక్తుడైన జయదేవుడు రచించిన గీతగోవిందము మధురభక్తి విలసితమైన శృంగార గేయ ప్రబంధము. ఇందలి గేయములు అష్టపదులు. సంస్కృత సాహిత్యమున వెలసిన యీ అష్టపదులు మృదుమధుర పదబంధములకు, ధ్వని ప్రధానమైన భావరమణీయతకు, కృష్ణభక్త్యతిశయమునకు నిధానములై మహాప్రశస్తి వహించి యున్నవి. రాధాకృష్ణుల ప్రణయ సామ్రాజ్య విరాజితములగు నివి లలిత లలితముగా పాడుకొనుటకును రమ్యరమ్యముగా నృత్యమాడుకొనుటకును మిక్కిలి యుపకరించును. ఈ అష్టపదులను గ్రహించి తదీయభావానురూపముగా అభినయించుట నర్తకీమణులకు వేడుక. కాగా పదుమూడవ శతాబ్దివాడగు జయదేవుని యష్టపదులు సింగనృపతి కాలమునకు బహుళవ్యాప్తిగాంచి యుండుట చేతను, కృష్ణునిపై రాధకెంత వలపో సింగనృపాలునిపై తనకంత వలపు కావునను

1. పోతన చరిత్రము : 4-228
2. ,, ,, : 4-229

భోగిని అష్టపదులనే గ్రహించి పాడి యభినయించెననుట మిక్కిలి యుక్తియుక్తముగా నున్నది.

నర్తకి కంగ సౌష్ఠవ మత్యావశ్యకమైన ప్రథమ యోగ్యత కావున భోగిని యంగసౌష్ఠవము దిగువ పద్యమువల్ల విశదమగును.

"చెక్కి చేసిన మోహినీ శిల్పమనఁగ దిద్దితీర్చిన నవరత్న దీపమనఁగ
పోతవోసిన యపరంజి బొమ్మయనఁగ అచ్చమచ్చరయే యన నా లతాంగి"[1]

పుష్పాంజలితో నిల్చినది. ఆమె మోహినీ శిల్పమనుటచేత అంగాంగములు మిక్కిలి చక్కగా పొందిపొసగిన యందాల రూపమనియు నవరత్న దీపమనుటచే ముత్యాల వంటి తెల్లని పలువరుస, పగడాలవంటి ఎఱ్ఱని మోవి, వజ్రాలు నీలాలు రాశిపోసి నట్లున్న కన్నులు, ఇంద్రనీలాలవంటి కురులు మున్నగునవెల్ల ప్రకాశించుచున్న వనియు, పోతవోసిన యపరంజి బొమ్మయనుటచేత నామెశరీరము బంగరుచాయతో మెరసి పోవుచున్నదనియు విస్ఫుటమగుచున్నది. అట్టి దివ్య సౌందర్యముచేత విరాజిల్లుచు పుష్పాంజలి యొప్పగా 'కొమ్మయొ బొమ్మయొ' యంచు ప్రేక్షకులు నివ్వెరపడ శ్వాసగొను తీరేర్పడకుండ కనురెప్ప వేయక కదలక మెదలక నృపతి యద్భుతమంది చూడగా నతని యెదుట నిల్చినది. ఇది నర్తకీ ప్రవేశము. ఇచట రెప్పవేయక నిల్చెననుటతో భోగిని యచ్చరయగు రంభ యని ధ్వనించును.

రంగప్రవేశము చేసిన భోగిని 'ముఖచాలి' చేసి పుష్పాంజలి సమర్పించిన విషయము దిగువ విధముగా రమ్యముగా వర్ణింప బడినది. 'ముఖచాలి' యనగా ముఖమున కదలిక చూపుట. ఇందు మెడను కుడి ఎడమ ప్రక్కల కూగించి కను బొమ లొకదాని పిదప నొకటి యెగురవేసి, కంటి చూపుల నిరువైపుల ప్రసరింప జేసి యధరమును కదలించుట జరుగును.

"కదలెను పల్లవమ్ములనఁగా నధరమ్మదరెం బ్రకంపిత
మ్మొదవు లతాంత గుచ్ఛమన నొద్దిక నట్టిటు లూఁగె గ్రీవయున్
బ్రిదులు ప్రసూన యుగ్మమన వీక్షణముల్ బెళకాడెఁ దీవియన్
వదలిన పూలజల్లన సభన్ వెదజల్లఁ బడెన్ సుమాంజలుల్...."[2]

1. పోతన చరిత్రము : 4-231
2. పోతన చరిత్రము : 4-233

ఇందలి యౌపమ్య భాసురములగు నుత్ప్రేక్షలు భోగినీ రూపరేఖా విలాసములను మంజులతరమొనర్చి నృత్యమును తిలకించుటలో కంటె వర్ణన పఠించుటలోనే అధికాహ్లాదమును కలిగించు చున్నవి. కవితా సామర్థ్య మిట్టిదే కదా! పుష్పాంజలి సమర్పించుట యన సభకు నమస్కారము కావించి గౌరవించుట. ఇక్కడ పుష్పాంజలిలో నొప్పారిన హస్తముద్ర 'పుష్పపుటహస్త' మనబడును[1]. ఇది రెండు చేతులు కలిసి చూపునది కావున సంయుత ముద్ర.

పుష్పాంజలి యనంతరము నృత్తము చేయుటకు కాళ్ళు కదిలించగానే గజ్జెలు, అందెలు ఘల్లుమనెను. భూపాలుని మేను జల్లనెనని యు, ఆమె అందాల చిగురు మోవిపై చిరునవ్వులు పువ్వులు పూయగా మన్మథుడు 'మేల్మొఖముమలీ యొుఅంకోపలి చంద్రహాసమున్ గేలను దూసినట్లై సభాసముద్రమును గిలిగింతలు చేసె' నసియు వర్ణింపబడెను. ఇక్కడ అర్థద్వయ శోభితమగు చంద్రహాస శబ్ద ప్రయోగము భోగినీ మందహాస సౌందర్యము నినుమడింపజేసి రసిక జనములకు గిలిగింతలు చేయుచున్నది.

భోగిని నృత్తోన్ముఖకాగానే మేళమువారు వేణువీణాది వాద్యములను మధుర మంజులముగా వాయించినారు. ఈ వాద్యమేళనము గూర్చి జాయన యిట్లు వచించెను.

"భావిరాగాంశభూతేన. మధ్యసప్తక వర్తినా
వాదయే ద్వాంశికోనాదం స్వరేణాదౌ ప్రయత్నతః
మంద్రం గాతా క్షమః ప్రాప్తుం తారంచ నవినాఽమునా
యోజ్యస్తేన సమం నాదః సర్వాతోద్య సముద్భవః"[2]

అనగా 'మొదట మురళి వాయించువాడు రాబోవు రాగమున కంశమైన స్వరముతో మధ్యస్థాయిలో ప్రయత్నపూర్వకముగా నాదము పలికింపవలయును. మధ్యస్థాయి లేకున్నచో గాయకుడు మంద్రస్థాయినిగాని తారస్థాయినిగాని అందుకోజాలడు. తక్కిన సర్వ వాద్యనాదములను మురళీ నాదముతో సమముగా కలుపవలయును' అని దీని యర్థము. భోగినీ నృత్య వర్ణనలోని వాద్యముల మేళగింపు పైలక్షణము ననుసరించి నిర్వహింపబడినది.

1. "మిథః కంఠయోః శ్లిష్టా భుజంగ శిరసౌయదా. తదా పుష్పపుటః ప్రోక్తోయాఽఽఞ్ఛా యాందేవతార్పణే పుష్పానీయథా న్యానాం భక్ష్యాణామపి ధా ణే" - జాయన 'నృత్తరత్నావళి' 2-282
2. నృత్తరత్నావళి : 8-53, 54

> ''కసిగొని తంబుఱా శ్రుతులఁ గమ్మని తుమ్మెద ఝుంకృతిధ్వనుల్
> ముసరెను వేణు వీణలను మూల్గెను గాన కళా విలాసముల్
> దెసల తధిమ్ తళాంగ్ త్రకిట ధిక్కిట కిట్టాన్ తకధిమ్ తతెయ్యిమం
> చెసఁగె మృదంగ నాదమిటు లీఁగయు వ్రాలిన మ్రోఁగు మేల్నుతిన్''....[1]

ఇందు రాగ స్వరమునకు రంజనముగా తంబూరా మ్రోగింపబడినది. సంగీత కార్య క్రమములందు వాద్య సమ్మేళనములో తంబూర వాయించుట పరిపాటి. తంబూరా శ్రుతి షడ్జపంచమ (స,ప) స్వరముల సమ్మిశ్రితనాదము కలిగి మంద్ర మధ్య తార స్థాయిలన్నిటిలో సప్తస్వరములను పలికించుటకును సర్వరాగ సుధల నొలికించుట కును చక్కగా సరిపోవును. కావున నిది సమస్త వాద్యములకు సమ్యక్సహకారియై గాయకులకు మూలవాద్యమై యొప్పుచున్నది. తంబురాధ్వనులు తుమ్మెదలు కమ్మగా జుమ్మనినట్లు ఎదలను కదలించును. ఇట్లు తంబూర శ్రుతుల ధ్వనులు వ్యాపించ వేణువు నినదించెను. తదనుసారియై వీణ పలికెను. వాని ననుసరించి మృదంగము మ్రోగసాగెను. ఇట్లు వాద్యములన్నియు విన్ననువగు సమ్మేళనముతో నొక రాగ తాళము ననుసరించి రమణీయముగా మ్రోయుచు సర్వమును నాద మయము కావించెను. ఇందు జాయనలక్షణానుసారముగా నొక రాగములో మొదట వేణువు పలికింపబడగా తక్కిన వాద్యములన్నియు దాని ననుసరించి వాయింప బడినవి. ఇందు చెప్పబడకున్నను వేణువు నిర్దిష్టరాగములో మధ్యస్థాయిలో మ్రోయింపబడినదనుట గ్రాహ్యము. ఇక్కడ వాద్యములను మనోహరముగా మ్రోగించిన ఈ పద్యమెంత హృద్యముగా నున్నది! ఆయా వాద్యముల నాదము లకు మంజులోపమానము లొసగియు 'తధిమ్ తళాంగ్....' ఇత్యాదిగా మృదంగ శబ్దములను పేర్కొనియు సర్వ వాద్యముల నాదముల నంతరంగముల ప్రతిధ్వ నింపజేసినా రాచార్యులవారు. ఈగయు వ్రాలిన మ్రోగు మేల్ నుతిలో మృదంగ మొప్పినదనగా నదియెంత విశిష్టముగా శ్రుతి కూర్పబడినదో తెలియును. వాద్యములో శ్రుతి తప్పిన నృత్యములో గతి తప్పును. అందులో రాజసన్నిధిలో జరుగు నృత్యము కావున వాద్యములన్నియు మహాప్రశస్తముగా నుండవలయును. ఈ వాద్య సమ్మేళన వర్ణనవలెనే నృత్యవర్ణన సర్వము శాస్త్ర సమంచితమై చెలు వొందుచున్నది.

---

1. పోతన చరిత్రము : 4-285

వాద్య ధ్వనులు త్తేజ పరచుచుండ భోగిని తళుకు బెళుకుల యందచందముల చేత 'బమ్మయు రిమ్మగొనన్ త్రిభంగి మేనెసఁగ నొయారమొల్కఁగ' నటరాజా కృతి నిల్చి- "ఆంగికం భువనం యస్య వాచికం సర్వ వాఙ్మయం, ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికం శివమ్" అని నాట్యాచార్యుడగు నటరాజునకు భక్తితో నాట్యాంజలి సమర్పించి సింగనృపాలుని కీర్తించి భక్తిశ్రద్ధలు ప్రకటించుకొనెను. ఇక్కడి యీ పాట ఆట ఆదితాళములో మృదంగ జతి స్వరములో సాగినది. జతి స్వరములో ఒక రాగముయొక్క స్వరములు ఒక తాళములో కూర్చబడి గానము చేయబడును. ఆ తాళలయల ననుసరించి నృత్తము కావింపబడును.

"తద్ధి-తకతధిమిత కిటతక ఝుంతా-జగతతోంగదిరిగుడు-తకరుంతా...."
ఇత్యాదిగా సాగిన మృదంగ జతిలో

"ఓరాజా! రాజాధిరాజ సురతేజా! సర్వజ్ఞ సింగనృపభోజా!"....[1].
అని యీ రీతిగా రాజును ప్రస్తుతించెను. ఈ మృదంగజతిని 'సలాం శబ్దము' అని వ్యవహరింతురు. ఇందులో రాజును స్తుతించి నమస్కరించుట జరుగును కావున ఈ పేరు స్థారకమైనది. రాజ ప్రస్తుతి తరువాత భోగిని జగన్నాథుడగు శ్రీహరిని వినుతించినది. ఇది త్రిపుట తాళపు మృదంగజతిలో సాగినది.

> 'తగ్గధింత తాం హతధీనుత తద్ధీనుత తాను ధణాంతరి....' ఇత్యాది జతిలో
> "జలధినిహత వేదా వనచణ విలసద్ఘన నౌకాభకరణ ."[2]

అని యీ విధముగా దశావతారములను స్తుతించినది. ఈ మృదంగజతి 'దశావతార శబ్దము' అని వ్యవహరింపబడును.

సలాంశబ్ద దశావతార శబ్దముల మృదంగ జతుల ననుసరించి భోగిని రమ్యముగా నృత్తమొనర్చి అభినయించినది.

"త్రికరణ సమన్వయత్వముఁ దేటపరచు సాత్త్వికాంగిక వాచిక
సహజవృత్తి

1. పోతన చరిత్రము : 4-238
2. ,, ,, : 4-240

భావరాగ తాళాంచిత భరతనాట్య భంగిమలఁ జూపె నాహార్య సంగతిఁ
గొని...."[1].

భోగిని ముద్దు మురిపెములు చెలగ ముస్తాబై హృదయ జన్యమగు భావమును సాత్త్వికాభినయము చేత, వదన సముదితమగు రాగమును వాచికాభినయము చేత, కరచరణాద్యంగ సంగతమగు తాళము నాంగికాభినయము చేత త్రికరణ సమన్వయత్వము తేటపడగా భరతనాట్య భంగిమలను ప్రదర్శించినది. భావ రాగ తాళాంచితమగు నాట్యము కావున భరత మనబడునన్న విషయమిచ్చట నుల్లేఖింపబడినది.

"ఒడుపు నొదుగుఁ గల్గి కడు కోమలత నొప్పి
యభినయించు నట్టి యా లతాంగి
యొకొక యవయవమ్మె యొయ్యారముల నిధి
కవన జలధి శిల్ప కళల కవధి...."[2]

అని వర్ణించుటచేత యవయవ సౌష్ఠవము, సౌకుమార్యము, ఒయ్యారములు, ఒప్పిదములగు నభినయ భంగిమలెంత సురుచిరములైనవో విశదమగుచున్నది.

పిమ్మట ఆమె యనేకాభినయ ముద్రలు హంసముఖము, భ్రమరము, హరిణముఖము, పతాకము, శంఖచక్రములు, శిఖరము, అభయము, ముకుళము అను వానిని మనోహరముగా ప్రదర్శించినది.

ఆ పిదప వస్త్రాభరణము లొలిచి జలకమాడి దశావతార స్తుతిచేసి శివ పూజ లాచరించినట్లును, స్నానమాడు వేళ ప్రియుడు వచ్చి చెట్టెక్కి చూచుచున్న గుట్టు తెలిసి నవ్వుచు అత్తవచ్చె దిగుమని జంకెన చూపులతో గదిమివైచినట్లును, పూలు గోసి మాల గూర్చుటకు సిగలో బెట్టుకొన్న సూది జ్ఞప్తికిరాక కనుబొమల ముడిచి తలగోకికొన్నట్లును, జడచుంచు లల్లుకొన్నట్లును తిలకము కాటుక శ్రీగంధము నలంకరించుకొని తాంబూలము వేసికొన్నట్లును నితాంతసహజ రమణీయముగా వివిధ ముద్రలతో విన్యాసములతో నభినయించి 'అచ్చెరువు గూర్చు గతుల నాట్యమ్ము' సలిపినది

1. పోతన చరిత్రము : 4-248
2. ,, : 4-245

తదుపరి భోగిని 'వర్ణము' అను దాని ననుసరించి నృత్త నృత్య సమ్మిశ్రిత ముగా ఆడినది. ఈ వర్ణమునే 'పద వర్ణము' అనియు నందురు. ఈ పద వర్ణము భరత నాట్యములో నృత్త నృత్యములను ప్రదర్శించుటకు ప్రముఖ స్థానము వహించును. ఇది సంగీత రచనయై పల్లవి, అనుపల్లవి, ముక్తాయి, స్వరము-అను అనేక చరణములతో నొప్పారును. ఇక్కడ ఒక్క విషయము విశదపరచవలసి యున్నది. నృత్యములు చేయుటకు వర్ణములు, పదములు అను పాటలు గ్రహింపబడియుండును. భోగినీ నృత్య వర్ణనలో 'శబ్దము' నటించుటకు మాత్రము పాట రచింపబడినది. కాని వర్ణము, పదము అను వాని గీతములు వర్ణనలో చేర్చబడలేదు. అవి యుండునన్నది గ్రాహ్యము. ఇక్కడి భోగినీ నృత్యము ఉత్కళిక (ద్విరదగతి రగడ) గేయములో మిక్కిలి చక్కగా వర్ణింపబడినది.

"జాలెవిడు బొంగరము లీల గిఱ్ఱునఁ దిరుగుఁ
బూల బంతింబోలెఁ దేలాడు నొక పరుగు
లాలించు పూలయూయెల చేరుల లాగు
నోలి ముందును వెనుక కొయ్యారముగఁ దూఁగు
నటు నిటున్ విసరు ముత్యాల వీవనఁ బోలి
యటు సోలి యిటు వ్రాలి యందాల నడఁ దేలి
యల డోలికలఁ దేలు కలహంస గతి నేలి
మలకలగు నాగు కోమలి సొంపు నడఁ గ్రాలి....
తకధిమిత తకఝుణుత తకఝుంత ఝుంతరిత
తకిట జతి ప్రకటగతి నొకటొకటి జత పఱచి....
ఆట పాటల లోన నందచందము నించి
యలరించి సభకు సభ నాడించి పాడించి
మురిపించి మఱపించి కరఁగించి కదలించి
ముదము నిచ్చుచు నట్టె నిదురబుచ్చుచు మించి
లాలిసూపెడి శివాలాస్యమ్ములను బోల
బాలకృష్ణుని లీల ఖాలితాండవ హేల
నవ్యమోహినిలోలె నాట్యముల వలపించె
భవ్యభారతివోలె భరతమ్ము నొనరించె"[1]

1. పోతన చరిత్ర : 4-256

ఇందులో మృదంగజతి ననుసరించి తాళలయానురూపముగా నానావిధ కరణము లను ప్రదర్శించుచు చేసిన నృత్త నృత్యములు వర్ణితమైనవి.[1] ఈ వర్ణనలో అనేక విధములైన చారులు భ్రమణములు,విన్యాసములు ప్రయోగింపబడినవి. ఇవి యేవియు వాచ్యము చేయక పరిభాషా పదముల పట్టికలీయక ఉపమాద్యలంకారముల చేత వ్యక్తము చేయుచు వర్ణించుట విశిష్టమైన విషయము. ఈ నృత్యములో శివా లాస్యము, బాలకృష్ణుని నర్తనము, శివ తాండవము, మోహినీ విలాసము సర్వము వర్ణింపబడుట విశేషము. ఆమె నృత్య సౌందర్యమును

"అందము చిందులు ద్రొక్కెను విందగు జవ్వనము భువనవిజయమొనర్చెన్
కుందనమున జీవము పడె చెందామరలుఱుకులాడె చెలి నృత్యములన్"[2]

అని వర్ణించుచు నామె యందచందములు, పసందైన పడుచుదనము, కళావిలాస ములు- ఆమె నృత్యమునకు రమ్యశోభలను రాజిల్ల జేసినవని యుల్లేఖించుట జరిగినది. మరియు

"పవన డోలికల జంపాలలూఁగుచు సరస్తటినాడు కెరటాల సౌరుదోఁచ"[3]

ఇత్యాదిగా వర్ణింపబడి ఆమె నృత్యములోని పరమ రామణీయకము, నృత్యకళా ప్రావీణ్యము వ్యక్తము చేయబడినవి.

పిదప భోగిని మార్దంగికుని వైణికుని ఇరువది వ్రేళ్ల గతులను ఇరుగాళ్లతో చరించు చారులలో విషమ గతులలో నృత్తము చేసి కట్టివైచెను. సంకీర్ణ,ఖండగతి, త్రిశ్రజాతిముక్తాయి, రెండవ కాలము ముక్తాయి,ఐదు జాతులముక్తాయి-అను వానిని వివిధ తాళగతులలో నర్తించి అనితర ప్రజ్ఞచూపెను. ఇక్కడ 'తోహర'గేయములో

1. కరణ మనగా ఒక స్థానకము (నిలబడు పద్ధతి), ఒక చారి (పాదమును వేయు క్రమము), ఒక నృత్తహస్తము కలిగినట్టి-తాళలయల ననుసరించి ప్రదర్శింప బడు విన్యాసము. దీనినే 'అడవు' అనియు వ్యవహరింతురు. ఈ నాట్యాంశ వివ రము, నృత్య పద్ధతులు తెలిసికొనుటలో శ్రీ వానమామలై వరదాచార్యులవారు శ్రీ నటరాజ రామకృష్ణగారు సహకరించిరి. వరదాచార్యులవారు, యువభారతి వారు ప్రచురించిన 'భోగినీ లాస్యము' గ్రంథములో తమ భోగినీ నృత్య ఘట్ట మునకు వ్యాఖ్య వ్రాసిన దానిలోను ఈ వివరణ కలదు.

2. పోతన చరిత్రము : 4-257
3. ,, : 4-259

"ముక్తాయిలం గొని మృదంగ నాదము ముమ్మాటల్ పడిమ్రోగెన్
సక్తాత్మకమై సభా సముద్రము స్మయ వీచికలన్ దూఁగెన్"....[1]

అని యీ రీతిగా వర్ణించిన ఆమె నృత్యములో శోభిల్లిన కాళ్ళ గజ్జెల ఘలఘలలు, చేతి కంకణాల గినగినలు ఇత్యాదిగా ఆభరణముల ధ్వనులు తళుకు బెళుకులు రమ్యముగా వర్ణింపబడినవి.

ఆ పైన భోగిని ఆకాశచారుల నభినయించినది. అట్లామె చేసిన లోకోత్తర నృత్య సౌందర్యమును 'మంగళ మహాశ్రీ' వృత్తమాలా (అనుకృతి)లో

"ద్యోతలము నందెగయు శ్వేతాభ్రమై మదను కేతనమ్మై యెగయుఁగొంగు
పింజలై కెంజాయ సంజలై కెంజివురు మంజరులఁ జిమ్మెడి చెఱంగు
జంభారిపైఁ గినిసి యంబరము దిగివచ్చు రంభఁదలపించు రూపమ్ము
కరఁగి యుఱుకాడు బంగారు తేట నీటి నిర్ఝరి నేలు మేని పర్ణమ్ము....
వేణువై నినదించు వీణయై వీణగొను వాణియై చిలుకు గానమ్ము
సంగీత సాహిత్య సౌందర్య సౌభాగ్య సకలమ్ము నామెదే సొమ్ము....[2].

అని వర్ణించిన తీరు మహా ప్రశస్తముగా నున్నది. వివిధ గతుల నృత్యము చేయు నామె కొంగు ఆకాశమున నెగయు తెలిమబ్బై మరుని జెండాయై శోభిల్లినది. ఇట్టి సుందర రూపకములు గూర్చి చేసిన ఈ వర్ణన భోగినీ నృత్య రామణీయకమును సాక్షాత్కరింపజేయుచున్నది. సంగీత సాహిత్యములును సౌందర్య సంపదయు, నృత్యకళయు సర్వమును నామెదే సొమ్ముగా చేసిన నృత్యము పలెనే ఆచార్యుల వారు వ్రాసిన యీ కవిత అసదృశ ప్రజ్ఞా పాటవముతో అలరారుచున్నది.

భోగిని పై రీతిగా రమ్య నృత్యము చేసి లజ్జాన్విత ప్రణయేక్షణములతో రాజేంద్రుని చూచును. అతడు పరవశించి పోవును. నృత్యము వలని శ్రాంతి చేత భోగినికి చెక్కుల చెమట చుక్కలొప్పి నొసట కస్తురి బొట్టు అటిటుకారి, ముంగురులు మొగముపై నటునిటునర్తించి శృంగార రసోదంచిత నేత్రదృష్టులు ప్రసరించి, వక్షోజముల మీది పయ్యెద హద్దుమీరి, కీల్జడలోని విరి దండలు జారి వింత సోయగము వెలయగా సభికులెంతో సంతోషించిరి. నృపాలునకు మాత్రమామె రూపము తప్ప మరొకటి తోచక మనసు కరిగి యెటెటో మారి మదన తాపము నందెనని వర్ణించుట జరిగినది. నర్తకి కిచట రవంత విశ్రాంతి లభించును.

1. పోతన చరిత్రము : 4-261
2. ,, ,, : 4-262

ఇక తుదకు భోగిని పదమును గ్రహించి అభినయించును. నృత్య క్రమములో పదాభినయము శిఖరాయమానమైనది. ఇది సాత్త్విక ప్రధానమైనది. ఇంత వరకు చేయు నృత్త నృత్యములలో ఆహార్యాంగిక వాచికాభినయములు మాత్రమే చూపబడును. ఈ పదాభినయమునందు ప్రధానముగా సాత్త్వికాభినయము ప్రదర్శింపబడును అంతకు పూర్వపు నృత్యములో శబ్దమునకు అర్థాభినయము, కొంత భావాభినయము సాగగా ఇందులో శుద్ధ సాత్త్విక భావాభినయము కావింపబడి రస నిర్వహణము జరుగును. ఇందులో జయదేవుని అష్టపదిగాని, క్షేత్రయ్య పదముగాని ఇతర పదముగాని తీసికొని అభినయింతురు. తరచుగా అష్ట విధ శృంగార నాయికలకు చెందిన పదము లభినయింప బడును. ఇట్లు శృంగార రస నిర్వహణకు సాత్త్విక సంచారి భావముల యభినయము ముఖ్యముగా దీనిలో చేయబడును. ఈ అభినయము భరత నాట్యములో అతి ముఖ్యమైన పరాకాష్ఠాంశము. భోగినీ నృత్య వర్ణనలో తక్కినదెల్ల యొక యెత్తుగా ఇదొక్కటి యొక యెత్తుగా బ్రహ్మాండముగా పరిఢవిల్లి యున్నది.

భోగిని ఇక్కడ జయదేవుని అష్టపదులు గ్రహించి అభినయించినది. రాధా మాధవ ప్రణయ సన్నివేశము కల్పించి మధుర భక్తి రస గంగను పొంగజేసినది. సింగభూపాలునిపై తనకు గల గాఢానురాగము చేత విరహ వేదన ననుభవించుచున్న భోగినికి విప్రలబ్ధయగు రాధికగా నభినయించుట సులభతరమైనదే కాక రాధకు కృష్ణ సమాగమము చేత వ్యథ తీరినట్లు తనకు సింగనృపతి కటాక్షము చేత హృదయ తాపము తీరి చిరకాల వాంఛ నెరవేరి ధన్యకాగలిగినది.

భోగిని మొదట వాసకసజ్జికగా నభినయించినది. పిదప 'హే కేశవ! తవ విరహే సా కాంతా రాధికా విషణ్ణా' యనుచు కృష్ణునిపై తపించి విప్రలంభ శృంగారము నభివ్యక్తము చేసినది. గోపాలుడు తన యెడ పూర్వము చేసిన ప్రణయ చేష్టలు తలచుకొని ముగ్ధగా మధ్యగా ప్రౌఢగా హావ భావ విలాసములు వ్యక్తము చేసెను. అతడు కనబడనందున విప్రలబ్ధయై స్తబ్ధయై కన్నీరు నించుచు నిట్టూర్పులు విడిచెను. ఈ విషయము,

"నటన నిజమొనర్చి నాతి కృష్ణుని విరహంపురాధ పాత్ర నభినయించె
నాటవెలఁది యొక్క యసమాన ప్రతిభకు మురిసిపోయి రాజు
ముగ్ధుఁడయ్యె"[1]

అని వర్ణింపబడినది. స్వయముగా రాజుపైగల ప్రణయమువల్ల విప్రలబ్ధయగు రాధగా నభినయించినది నటనకాక నిజమే యయ్యెను. తనపై ఆ యాటవెలదికి గల ప్రేమకు, ఆమె చూపిన అసదృశాభినయ ప్రజ్ఞకు రాజు ముగ్ధుడాయెను.

విరహోత్కంఠితయైన రాధయై కుసుమ శయ్యపై పొరలుచు ప్రియుని గలిసికొను దారి చెప్పుమని చెలియనడిగి మనోభవ పీడకు కారకులైన చంద్రాదు లను నిందించును. ఇక్కడ చంద్రాద్యుపాలంభము దిగువరీతిగా చమత్కారముగా చేయబడినది.

"మలయానిలుఁడె వీనిఁ జిలువ పొట్టంబెట్ట రంయని నడుమంతరమున నాడుఁ
జందురుండట వీఁడు క్షయమొందుఁగాక యీ మూర్ఖచర్యలు నాఁడె
మొగులు ముట్టె
మాధవుండట వీని మదమడంగనదేమొ మ్రొక్కిన కొలఁది కొమ్మెక్కి
తూలుఁ
బూవిల్తుఁడట వీఁడు బుగ్గియై పోనేమి యెఱుఁగని యటులుండి యేడిపించు
తుంటవిల్తు దండబలను నొంటిదానిఁ బొంచి మొనగాని తనము
జూపించుకొనెడి
విభుఁడు రానిమ్ము చెప్పెద వీరియాట లపుడు తలకింద్రులగును నాయాత్మ
నగును."[2]

ఇచట మలయానిలుని చిలువ పొట్టంబెట్టనని తిట్టుటలో సహజత కలదు. గాలిని పాముహరించుట యున్న విషయమే. ఒకరిని నిందించునపుడు వానికిగల దోషము లను, పీడలను ఎత్తిచూపుట జరుగుచుండును. ఇక్కడ అదేరీతిగా చేయబడినది. రంయని నడుమంతరమున నాడు ననుటలో ఆకాశమున నాడుననియు మిడిసిపడు ననియు నర్థద్వయమొప్పుచున్నది. ఈ గాలికింత పొగరా ఇది నాశమైపోనీ యను భావములో ఉపాలంభించుట జరిగినది- తక్కిన పాదములందలి చంద్రాదుల యుపాలంభభావము లిట్లే గ్రాహ్యములు.

1. పోతన చరిత్రము : 4-279
2. ,, ,, : 4-282

ఈ రీతిగా మనోభవానల పరితప్తయై యడలెడు రాధను చెలి యోదార్చి మన్మథుని, అతని పరివారమును దూషించి, కృష్ణుడొక రమణిని గూడి యమునా తీర లతాకుంజముల క్రీడించుచున్నట్లు వార్త వచ్చినదనియు, అక్కడకేగిన కామనలు తీరుననియు చెప్పగా రాధ సంతోషించి చెలికి కృతజ్ఞత తెలిపి యభిసారికయై యమునకు జేరబోయెను.

రాధ యమునాతీరము చేరబోవునంతలో సూర్యాస్తమయమై అక్కడ పొన్నల పొగడల మల్లెల మొల్లల నల్లగలువల నెత్తావులతో చల్లగా మెల్లగా వీచిన తెమ్మెరలను, చవితి చంద్రుడస్తమించి దశదిశల గ్రమ్మిన కారు చీకట్లను, అంతలో పెనుమబ్బులు గ్రమ్మి యురుములు మెరుపులతో పెనుగాలులతో కురిసిన భయంకర వర్షమును, వర్షము వెలిసిన పిమ్మట యమునాతీర వనభూములలో ఒప్పులకుప్పయగు నా రాధ స్మరాధీనయై దీనయై మురళీధరునికై వెదకుచు, నెలుగెత్తి పిలుచుచు బహువిధముల నతనిని ప్రార్థించిన విషయమును వర్ణించిన తీరు వర్ణనాతీతమై యున్నది. ఈ వర్ణనమెల్ల ఉత్కళిక (రగడ) తొంబది యైదు పాదములలో మిగుల సుదీర్ఘముగా సుందరముగా సాగినది. ఇక్కడి వర్ణనలోని వర్షము లోకభీకరమైనది.

"ఆ నిశీథిని ఫాలతలమున నలకలగు కాదంబినులలో
నీల వార్ధితరంగ డోలలఁ దేలి తేపకు మిడిసి పడియెడి
మీను బిల్లల వోలె మిల మిల మిలుకు మిలుకు మిలుక్కుమనుచున్
గాల వల్మీకములు వెలువడి కసిబిసిగ వడి బెనఁగులాడెడి
త్రాఁచు పరువుల వోలెఁ దళతళ తళుకు తళుకు తళుక్కుమనుచున్
చకచకచ్చక చక్కుమనుచును చంచలల్ నీలాంబరమ్ముల
నంచులై కనిపించి చనుటయు నవని చీఁకటులావరించెనుగా
ధరగిరులపై దాడి వెడలిన సురుల రథములె యొఱుకు లిడునో
వజ్రియే ఖండన మొనర్చునో వడిగిరుల ఖండన మొనర్చునో
గిరి శిఖరములె దొరలిపడునో కరులు ఘీంకృతిఁ గలియఁబడునో
ధణధణంధణ ధాణ ధంధణ డడడ డడడడ ఢాండఢమ్మని
గర్భ నిర్భేదముగ నుఱుములు నార్భటింపఁగ నవని చెవుడు వడె....
రివురు రివురు రిరివురు రివ్ రివ్రివ్ రిరివ్ రిరిరివ్ రిరివ్మను
వాయుదేవుని ప్రళయ తాండవ వైభవములను శివము దూలుచు

ఛరర రరరర ఛఙ్ఝు మనుచును దరులశాఖలు ధరణిఁ గూలఁగ
లతలకుంజము లతుకులన్ విడి కుతల మందునఁ గూలిపడఁగా
హోరుమను ఝంఝూనిలమ్ముల ఘోరుమను వర్షారవమ్ములు
రింజ రింజరి రింజ రిరిరిం రింజ రింజరి రుం రిఝం, అని
తెలుపినీయక చలిచి కొట్టుచు కరకసంహతి విసరి పెట్టుచు....[1]

భీషణముగా కురిసినది వర్షము. మెరపుల ఉరుముల గాడ్పుల ధ్వన్యనుకరణము లతో శబ్దాలంకారములతో వర్ణింప బడిన యీ దండి వానలో పాఠకులు నిండుగా తడిసి ముద్దయై పోవుదురనుటలో సందేహము లేదు. ఇట్లే వాన వెలిసిన పిదప

రటట ర్రటుర ర్రట దుర్దుర పటురట ధ్వన శబ్దములతో
వటువు వేదము వల్లెవేయునొ వరుణపతి జయభేరి మ్రోయునొ
తాకు ఢెకణకుడేకు పూర్ణతటాకముల మండూక శబ్దములు
కిడ్డ కనగణ నగణ గనగణ నగణ గనగణ నగణ గనగం
కిడ్డ కజ గజజ గజ గజ గజజ గజగజ గజజ గజగజగం
కిడ్డ కడె గడ డెగ డెగ డెగడ డెగడెగ డెగడడెగడెగ డెగం
తగన గణ నగణ గణ గంత గజగ జజ గజగజ గంతగ డెగడడెగడెగడెగం
తగనగం, తగజగం, తగడెగం, నగం, జగం, డెగం-బహుగతి
నేక ముఖముగ భేకలోకము వీకమై"[2]

ఘోషించిన ధ్వనులను విశిష్ట ధ్వన్యనుకరణ శబ్దములచేత చమత్కారముగా వర్ణించుట జరిగినది.

ఇట్టి వానలో తడియుచు ఇరులలో తడవుచు రాధ గోపాలుని పిల్చుచు పరిదేవనము చేసిన విధ మెంతటివారి గుండెలనైన కరిగింప జాలి యున్నది.

"మాటి మాటికి మాధవా! యని మధుర రుతములఁ బిల్చునేరిని
తడియు వానకు జడియ దిరులకు దరువు తరువును దరియు నేలకొ....
వననికుంజము మాధవుండని భ్రాంతి పరిరంభణ మొనర్చును
పొదలు శంపాకాంతిలోఁ గని పొదరులివి యని వదలి యేడ్చును
పతిని బాసిన రతికుమారియొ భవుని వీడిన గాంగవారియొ

1. పోతన చరిత్రము : 4-290
2. ,, ,, : 4-290

కాఁకబెట్టిన మరుకటారియొ కేకలిడియెడి వన మయూరియొ
హోరుమని ప్రవహించు యమునాచారురవ వీణాశ్రుతింగొని
ప్రతి దిశంగని పిల్చునేరిని బ్రతివచనముగ వచ్చునా ధ్వని
ఓ దొరా! పిల్చునది యిది నీ రాధరా యనరాని ప్రణయపు
బాధరా దయనీయ మీనా గాథరా రారాదురా యనుఁ
బలుకరా! యీ దాసిపై నీకలుకరా రాగామృతంబున్
జిలుకరా యెదపంజరపు నా చిలుక రారా చిలిపిమారా!".... [1]

అని యిట్లనేక విధముల మాధవుని ప్రార్థించినది. వెదకి వెదకి పిలిచి పిలిచి విసిగి వేసారి విలపించి వ్యథాభరమున చెలితో గోపాలుడు మరుసటి రోజే వత్తునని యెన్నాళ్ళయినను రాడాయెనని యతని మెరమెచ్చులకు మోసపోయితినని వగచును. ఇక్కడి యామె వగపు సాత్త్విక సంచారీ భావాభినయమున సువ్యక్తమైనట్లు దిగువ రీతిగా మనోజ్ఞముగా వర్ణింపబడినది.

"బడి బడిం బఱతెంచు బాష్పస్రవంతిలోఁ దెగిజాఱు మంచి ముత్తెముల పేరు
గాద్గద్య సందీప్త కంఠస్వనమ్ములో దరిదట్టి పొరలు దుఃఖరస ఝురులు
రాగార్త బింబాధర స్పందనమ్ములోఁ జిరుగాలిఁ గదలు కెంజిగురు గుదులు
రోమాంచ సముపేత కోమలాంగకములఁ బ్రభవించుఁ బరుసైన పద్మలతలు
కనెడిదంతయు నాపయి తనసుదాను మఱచి యాడుచునెంతొ యున్మాదదశను
వక్తయును శ్రోత తానెయై వదరుకొనుట నడరు ప్రేమగీతాంత్య
స్వరాలపనము...." [2]

ఇందులో క్రమముగా అశ్రువు, వైస్వర్యము, కంపము, రోమాంచము అను సాత్త్విక భావములును, చాపలము, ఉన్మాదము, అపస్మారము అను సంచారీ భావములును రాధిక అభినయించినట్లు వర్ణింపబడినది. ఇది యామె విరహవేదన యొక్క ఆత్యంతిక దుర్దశను వ్యక్తము చేయుచున్నది.

అంతలో నెక్కడినుండియో సుమధుర వేణుగానామృత తరంగములు వినిపించుచున్నట్లు చెవియొగ్గి విని ప్రాణములు వచ్చినట్టులయి యదే దిశకు కాంక్షతో చూచును. 'అదిగో చెలీ! ఈ మురళీనినాదము యమునా తటము నుండి వచ్చుచున్న'దని చంకలో నొక కుండనమర్చుకొని నీటికని రాయంచనడలతో

1. పోతన చరిత్రము : 4-290
2. ,, : 4-295

వెడలి యావలి దరిని పాడుచున్న గోవిందుని గాంచును. తన దుర్భర విరహ వేదన యావేదన గావించును. కృష్ణుడది విని సంతోషించి యమున యావలి యొడ్డునకు చేరరాగా ఆమె యాతని వద్దకు పోయి వాలకము చూచి యా రాత్రి యెవతె యొద్దనో ప్రొద్దుబుచ్చినట్లు భావించి నిందించును. గోపాలుడు కోపపడక యేవో సాకులు చెప్పి ఆమె కూరట కలిగించును. ఈ రాధాకృష్ణుల సంవాదము దిగువ రీతిగా రమణీయముగా సాగినది.

"ఎఱుపెక్కెఁ గనులు నిద్దురలేక యెవతెను గూడియో' యనఁ 'గాదు వేడి' ననుచు
'గంట్లొనర్చెను నీదు కమ్మవాతెఱకుఁనే చెలి' యనఁ 'గాదిది చలి' కటంచుఁ
'జెదరె నీ యందాల శిఖిపింఛ మే తన్వి కేశినో' యనఁ 'గాదు గాలి' కనుచు
'నాసపైఁ గాటుక నలుపు లేకన్నుల కలికివో' యన 'జాతెఁ దిలక' మనుచు
'యాహి మాధవ' యనుచు నీర్ష్యమెయిఁబాడి ప్రణయ కోపాగ్నికీలయై పెనగులాడు
'అయి ప్రియే చారుశీలే!' యటంచుఁ గూడి శాంతగంగాప్రవాహమై చాగివేఁడు."[1]

ఇక్కడ రాధ ఖండితయై ప్రియుని యపచారములను సహింపక కినిసి ధిక్కరించి మాట్లాడినది. దానికి దక్షిణ నాయకుడగు మురళీమోహనుడు జడియక ధృష్టుడై సముచిత వ్యాజములు కల్పించి సమాధానములు చెప్పి ఆమెను సానునయానురాగ వాక్సుధల చల్లబరచి యలరించును. ఆమె కోపతాపములు తొలగి

"హరి ముగ్ధ వధూనికరే తరుణి విలాసిని విలసతి తత్కేళిపరే
పరిరంభణ చుంబన వర సురత వినోదే"....[2]

అనుచు నటించును. ఇట్లు సాగిన యీ రాధామాధవ ప్రణయ సన్నివేశమునెల్ల భోగిని సాత్త్వికాభినయ ప్రదర్శనతో రమణీయ నృత్యము కావించినది.

ఇక్కడ భోగిని నటించు ననుటలో పదాభినయానంతరము 'తిల్లాన' యను నృత్యాంశమును ప్రదర్శించుననుట గ్రాహ్యము. తిల్లాన యనునది దాక్షిణాత్య సంగీతమునకు క్రొత్తది. ఇది ఉత్తర హిందుస్థానీ సంగీతము నుండి మనకు

1. పోతన చరిత్రము : 4-304
2. ,, : 4-306

సంక్రమించినది. ఇది యొక రకమైన సంగీత గీతము. దీనిని ముస్లిం పరిపాలనలో పదుమూడు పదునాలుగు శతాబ్దముల మధ్య జీవించిన సాహిత్య సంగీత కళానిధి యగు అమీర్‌ఖుస్రో తొలుత రచించెను. పూర్వకాలపు తంజావూరు భరత నాట్యములో ఈ తిల్లాన ఉన్నదికాదు. ఇటీవలి కాలములో సుమారు 125 సంవత్సరముల క్రిందట వడివేలు పిళ్ళె మొదలైన నట్టువలు భరత నాట్యక్రమ పద్ధతిలో ఈ తిల్లానను చివరి యంశముగా చేర్చి యిప్పటి స్వరూపము నిచ్చిరని శ్రీ నటరాజ రామకృష్ణ గారుల్లేఖించినారు.[1] ఈ తిల్లానలో జతి స్వరములో వలె నృత్తము చేయబడును. ఇందు చిత్ర విచిత్రమైన తాళగతులను పాదవిన్యాసములో ప్రదర్శించుచు నర్తకి నృత్తము చేయును. ప్రదర్శనాంతమందు కావింపబడు ఈ తిల్లానవల్ల ప్రేక్షకులుత్సాహ పూరితులై సంతుష్టులగుదురు. భోగినీ నృత్యములో తిల్లాన నిర్వహించినట్లు వర్ణింపబడకున్నను 'సుదతి నటించున్' అనుటచేత గ్రహింపనగును. ఈ విధముగా భోగినీ నృత్యము పరమ స్తుత్యముగా ముగిసినది.

నృత్యావసానమున భోగిని ప్రణయ విలసితేక్షణ హాసాది విలాసములచేత సింగనృపతి హృదయము నాకర్షించి తనను పాణిగ్రహణము చేయునట్లొర్చినది. ఈ విషయము మనోజ్ఞముగా నిటుల వర్ణింపబడినది.

> "చికిలి చూపులలోన శృంగార రసవల్లి పూలు పూయుచుఁ దోరణాలు గట్ట
> చిలిపి లేనవ్వులఁ జెలువంపు వారాశి నెలబాలు లేఁత వెన్నెలల నలుక
> కలికి గ్రుమ్మనర్తనన్ లలిత లావణ్యాభ్రములు నింద్ర ధనువుల ముగ్గు దీర్చ
> కులుకు గ్రీవా భంగముల సారె కొయ్యారముల వాఁకకంబు మంగళము లీన
> నాతి కలకంఠరుతము సన్నాయిఁ బాడ లజ్జ తెరపట మగుచు విలాసమీనఁ
> బ్రణయ సితదృక్ప్రభలు తలఁబ్రాలు వోయ నారినృపతి మనమ్ము లగ్న మ్మొనర్చె."[2]

ఇందులో భోగిని శృంగారచేష్టలు వివాహమహోత్సవోచితమగు అలంకారములుగా నమరి ఆమె కలస్వనము సన్నాయి పాడగా లజ్జయే తెరపటమై హొయలొలుకగ అనురాగపూర్వకమగు తెల్లని చూపు వెలుగులు తలబ్రాలు వోయగా నామె రాజు హృదయమును లగ్నమొనర్చెనని వర్ణించుట సందర్భోచితమై యలరారు చున్నది.

1. నృత్యరేఖ : 'భరత నాట్య ప్రదర్శనము' పుట. 92
2. పోతన చరిత్రము : 4-307

> భోగిని నృత్యముకావించి నిలిచిన చంద మందముగా నిట్లు వర్ణింపబడినది.
> "తిలకము మోమున ంజెదరం దీవ్రత ముక్కుపుటమ్ములుబ్బి లో
> వెలికి మితాధికమ్ములయి వ్రేగుగ వచ్చుచుంబోవు నూర్పుగా
> డ్పుల బిగియంతయున్ సడలి పొల్చెడి తమ్ములపాకు తీవయై
> సొలసిన మేనితో నటిటు సోలెడి నెన్నడు మొప్ప నిల్చినన్."[1]

భోగినీ నృత్యమును ఇంత రమణీయముగా వర్ణించుటకాచార్యులవారు అనుపమ ప్రతిభతో సముచిత శబ్దప్రయోగముకావించి, యుపమాద్య లంకారములనుత్కృష్ట ముగా కైసేసి, ధ్వన్యనుకరణాది పదములను గుప్పించి, సముచితచ్ఛందముల పద్యగేయ గీతములను రచించి మృదంగజతులు గతులు సమకూర్చి భావోదంచిత ముగా రసమయముగా రచన కావించి యున్నారు.

భోగిని 'సరసాభినయచేష్టలకు' సింగనృపతి తనువు మరచి నిశ్చేష్టితుడయి ఆమె 'చలదపాంగ నిరీక్షణాతిశయమునకు' రెప్పవదని యనిమిషుడాయెను. ఆమెరూపరేఖలకు అందచందములకు ముగ్ధుడై మురిసి ఆత్మలో మెచ్చి 'కష్టపడి నేర్చెనహో! యిలుగట్టెం గళలిచట' నని ప్రశంసించెను. భోగిని తల్లి రాజుతో తన కూతునకతనిపై గల గాఢానురాగాభిమానములను వివరింపగా నామె లజ్జాభిశోభిత యాయెను. శ్రీనాథుడు భోగిని కన్నులలోని యాశయము గ్రహించి వారకాంత లలో నిట్టి 'సద్బుద్ధి సద్వర్తన' అరుదనియు, 'వారిజనేత్రి పుట్టువు కవశ్యముగా నొక కౌశికుండెదో దారినిందప్పివచ్చి యిటం దా వ్రతభంగమునొందంగావలె'ననియు వర్ణించి 'ఆదర్శ జీవనయైన యీమె నాట్యాభినయకళలు రూపరేఖ లెంతటి వాని నైన కలచును. ప్రభువే తీర్పుచెప్ప వలయు'నని వచించెను అంతట రాజు సానురాగ కటాక్ష వీక్షణముల నామె నవలోకింప నామె 'మోసులెత్తు నునుసిగ్గున బిత్తరి వాలుంజూపులతో' నతని గాంచి తలవంచెను. రాజు సంతోషించి తన కంఠసీమలో నాయకమణితో ప్రకాశించు ముత్యాలహారమును చేతబట్టి ఆమెను చేరబిల్చి బ్రహ్మ సరస్వతిని వివాహ మాడు నపుడు గళమున తాళినిడునట్లు భోగిని కంఠమున నలంకరించెను. రాజు భోగినిని సతిగా పరిగ్రహించినందున నతని రసికతను సభ మెచ్చెను.

1. పోతన చరిత్రము : 4-309

పోతన ఈ ఆనంద సన్నివేశము గాంచి ఆత్మలో జయదేవుని యష్టపదుల విశిష్టతనుగ్గడించి,

"భోగమిండ్లలోపల నీమె పుట్టవలసినదియెకాదు శ్రీహరి భక్తి నటనయందుఁ
దాఁగరఁగి యేచ్చి యేర్పించెఁ దక్కునరుల వ్రాయ దండకమగు నీమెవర్తన
మని"[1]

ఎదలో భావించి భోగినీ దండకము మనోహరముగా రచించి, దానిని భోగినీస్వామి యగు సింగభూపాలుని కృతిపతిని జేసి సభలో సమర్పించెను. ఈ రీతిగా భోగినీ నృత్యము శాస్త్రీయముగా సాంప్రదాయికముగా సాగినట్లు కడుంగడు కమనీయ ముగా వర్ణింపబడి చరితార్థమైనది.

## భోగినీనృత్య ప్రయోజనము :

కావ్యమునందు భోగినీనృత్యమొక ప్రముఖ ప్రయోజనము నుద్దేశించి వర్ణింపబడినది. ఇది కథాగతమై నాయకుడగు పోతన జీవితమున ముఖ్యఘట్టమై యొప్పినది. రసోదంచితాహారము తుష్టికే కాక పుష్టికి హేతువగునట్లును దంపతుల సంయోగము సౌఖ్యమునకే కాక సంతాన ప్రాప్తికిని మూలమగునట్లును భోగినీ నృత్యము వినోదమునకే కాక ఆమె వివాహమునకును నుపయుక్తమైనది. శ్రీనాథుని ప్రోద్బలమున సింగనృపతిని దర్శించిన పోతన, శీలవతియగు భోగిని దివ్య నృత్యము చేసి మధుర భక్తిరస ప్రసారము చేయగా హర్షించి దండకము వ్రాసి రాజునకు కృతియిచ్చుట, రాజు కృతజ్ఞతతో ఆస్థాన కవిమండలి కధ్యక్షునిగా పోతనను సన్మానింప బూనగా పోతన దానిని తిరస్కరించి పిదప రాజావహేళనకు గురియై రాజులకు బద్ధవిముఖుడై తర్వాతి కాలమున పరిశుద్ధాత్ముఁడై భాగవత మును శ్రీరామాంకితముగా రచించి యెట్టి యిక్కట్టులకును లొంగక సమర్పించుట యను కథయెల్ల భోగినీ నృత్య కృతముగా జరిగినది అట్లే యిది శృంగార మధుర భక్తి రసముల పోషణకు, పోతన సింగనృపతి భోగినీ పాత్రల పోషణకు నుపక రించు చున్నది. ఈ రీతిగా ఈనృత్యము కేవలము చిత్తరంజనార్థము ప్రవేశపెట్ట బడిన సాంస్కృతిక కార్యక్రమముకాక ప్రబల ప్రయోజనముతో కావ్యమును సుసంపన్నము పరిపుష్టము చేయుటకు చక్కగా ప్రయోగింపబడినది.

---

1. పోతన చరిత్రము : 4-337

భోగినీ నృత్యమువల్ల వస్తు రస పాత్ర ప్రయోజనము సిద్ధించుటయేకాక.... 'సద్యః పర నిర్వృతమే కాంతా సమ్మిత తయోప దేశయుజే'యని మమ్మటుడన్న కావ్య ప్రయోజనములు ఆనందము, ధర్మోపదేశము-అను రెండు సమకూడుచున్నవి. ఇందు ముందుగా ధర్మోపదేశము గూర్చి ప్రస్తావింతును.

ఈ ఘట్టమున భోగిని ప్రధాన పాత్ర. ఆమె వేశ్యా కులజయయ్యు శీలవతి, గుణవతి, ఆదర్శజీవన. తల్లి యెంత దుర్బోధ చేసినను వృత్తిలో నడుగిడక రూపగుణ విద్యా కళామూర్తియగు సింగనృపాలుని చేపట్టుటకు పట్టుబట్టినది. రాజ దర్శనమునకు ముందు తల్లితో వాదించుచు భోగిని,

> "కలవాఁడైనన్ జాలునె చెలువుఁడు రసికుండు గామి జీవితమేలా
> చెలువలు కలువలు సరసులు చలువ వలన నిలువఁ గలుగు జలజ
> దళాక్షి!"[1]

> "కళలకు శ్రీని మేల్వయసు గల్గిన వాని ధనంపు తేనిఁ జు
> క్కల చెలికాని......... ....సింగన భూమిజాని నే
> వలచిన దాని నన్నతఁడు వద్దన దేహము నేని వీడెదన్...."[2]

> "....చాలునీ ధర్మ బోధనముల్ తల్లి విసంబు వోయుననఁ
> బ్రత్యక్షమ్ము లీ జాతినే...."[3]

> "విలువ పీతాంబరము దాల్చు వేశ్యకంటె దిసమొలం జరించెడి
> దొడ్డి పసులు మేలు
> అతుల నైతిక వృక్ష సంహతి నొనర్పు వేరుపురువని
> ప్రఖ్యాతి వేశ్యజాతి...."[4].

అని వేశ్యావృత్తిని నిందించుట వల్లనే కాక నృత్యానంతరము వేశ్యామాత రాజుతో తన కూతురు గూర్చి,

> "ఏ కవీంద్రుఁ గాంచినను మా యింటఁ
> బిలిచి సింగ భూపాల సమ్ముఖ విశేష మడిగి
> యేఁగ వలెనని యొకటె పోరిడుచు నుండెఁ
> దమకబద్ధ మీ నుడి మా యెదకు నిజమ్ము."[5]

1. పోతన చరిత్రము : 4-191
2. ,, ,, : 4-192
3. ,, ,, : 4-201
4. ,, ,, : 4-209
5. ,, ,, : 4-320

"తాము చెడి ప్రపంచమ్ము నంతయును జెఱచు
ఘోరతరజారవృత్తినిఁ బాఱఁద్రోలి
పరిణయములాడి సత్కీర్తిఁబడయుఁ డనుచు సానిజాతిన్ ప్రబోధమ్ము
సల్పునుడులు పలుకు"[1] నని వచించుట వల్లను భోగిని సింగనృపతిని పరిణయ
మాడ దలచుట రాజైనందుచేతనే కాక యతనిలోఁగల సాహిత్య కళానిధిత్వము,
సరసత, సద్గుణ సంపత్తి కాకర్షింపబడి యని తెలియుచున్నది. మరియు నరక
సదృశమైన వేశ్యావృత్తిని మాని పెండ్లిండ్లు చేసికొని బాగు పడవలెనన్న సముద్ధ
రణ కాంక్ష యభ్యుదయ హేతుకమై యలరారుచున్నది. శ్రీనాథు డామె సచ్ఛీల
ము గాంచి కారణజన్మురాలని కొనియాడి 'ఈ నడత బుద్ధి గఱపెడి మానవులకు'[2].
అని వచించెను. ఇక సింగనృపతి యామెను పరిణయమాడుటలో 'స్త్రీ రత్నం
దుష్కులాదపి' యను నీతి వాక్యాదృత విశాలబుద్ధి, కళానురక్తి, రసికత ద్యోతక
మగును. పోతన వంటి భక్తకవి "భోగమిండ్లలోపల నీమె పుట్టవలసినదియె
కాదు"....[3]. అని యామోదించి దండకము రచించుటలోఁ నామె సౌశీల్యమునకు
నృత్యకళా నిష్ణాతృత్వమునకు అజరామరాకృతి సిద్ధించినది.

ఇక భోగినీ నృత్యము సద్యః పరనిర్వృతి కలిగించునన్న విషయము
వేరుగా చెప్పవలసిన పనిలేదు. నృత్యవర్ణన వైశిష్ట్యమున నిది విశదీకరింపబడెను.
ఆమె నృత్యమునకు రాచకొండ సభాసదులేకాక శ్రీనాథ పోతనలవంటి మహాకవులు
ముగ్ధులగుటయే కాక రసార్ణవ సుధాకర కర్తయు రసిక శిఖామణియునగు రాజు
స్వయముగా మెచ్చి ఆమెను చేపట్టెను. ఆమె రమ్య నృత్యమును పరమ రమణీ
యముగా వర్ణించినదానిని తిలకించి పులకించని పాఠకులుండరు. ఇట్టి యెడ
ప్రాజ్ఞులు నృత్య కళాకోవిదులు సెలవిచ్చిన యమూల్యాభిప్రాయములను దిగువ
నుటంకించుచున్నాను.

## పండితాభిప్రాయములు ;

నాట్యాచార్యులు 'నటరాజ' రామకృష్ణగారు ముక్తకంఠముతో నిట్లు
ప్రశంసించిరి.

1. పోతన చరిత్రము : 4-321
2. ,, ,, : 4-326
3. ,, ,, : 4-337

"....అఖిలనాట్య విషయ విలాసముల నాత్మ సాక్షాత్కార మొనర్చుకొని, అక్షరాకృతులలో నది మనకు చూపెట్ట సమకట్టిన ఆచార్యులవారి యనన్య సామాన్య ప్రతిభ యెంతేని యభినందనీయము. పురాకృత సుకృత విశేషమున గాక ఇట్టి భావపటిమ యలవడజాలదు. ఆశ్చర్యకరవిషయమేమనగా రాజులు-రాజ నర్తకీమణులు మచ్చుకైనా కానరాని నేటికాలమున ఆచార్యుల వారికి నృత్యరీతు లన్నియు నెట్లవగతమైనవి? యేమో! పోనీ ఇందులో ఏవైనా అతిశయోక్తులు- అసందర్భములు-ఊహాజనిత నృత్యములు - ఉన్నవా? ఊహూఁ! ఇందభి వర్ణితములైన ప్రతిగతియు నాడదగినదే. అశాస్త్రీయమైనదను మాట మచ్చుకైనా గానరాదు."

"ఆచార్యులవారు హరిహర భేదములు పాటింపక పోవుటకు శివలాస్యములు సైతమా నర్తకిచే చేయించుట యిందుకు నిదర్శనము. అంతశ్శుద్ధి, ఆత్మైక సాక్షాత్కారము కల్గిన వారికిభేదము మాత్రమెందులకని నిరూపించుకొనినారు."

"వాద్య వాదన పద్ధతులు సైతము చక్కగా తరచి, వితర్కించి విన్నను వొప్ప రచించుట యిందొక ప్రత్యేకత.... రాధా విరహ వర్ణనమున ఆచార్యుల వారందించిన హావభావములు నాట్యమునకే వన్నెలు బెట్టినట్లున్నవి. నాట్యమంతయు ఒక యెత్తు. రాధా విరహ వర్ణన మొక యెత్తు".

"ఇంత విపులముగా - సులభశైలిని సశాస్త్రీయముగా నాట్య సన్నివేశ వర్ణనము లింతవరకును వెలువడలేదనుట నిస్సందేహము. కోటికొక్కరికి ప్రజ్ఞోప పత్తులున్నను కావ్యములో ఉదాత్త సన్నివేశములో రసపరిపుష్టి నిచ్చునటుల రచించుట దుస్తరము. నేటి కాలాన నేవో కొన్ని గొప్పలు రంగరించుకొనుచు తమ ప్రతిభోత్పత్తుల చాటించుకొనువారే మిగిలిరి కాని - ఆచార్యులవారు సుగ్రాహ్య పద్ధతులలో-సహజ సుందరశైలిలో నిరాడంబరముగా భోగినీ విలాసమును వక్కా ణించి తాము తాదాత్మ్యము చెంది చదువరుల దృష్టిలో భోగినికొక విశిష్టతను గల్పించి అందందే అంతర్లీనమందినారు. సంస్కృతాంధ్ర సాహిత్యములందు కావ్యాంతర్గతములైన నృత్య సన్నివేశములలో సూచనా మాత్రముగా నృత్య దృశ్యము నభివర్ణించుటేకాని, నాటికిని నేటికిని నాట్యమున కింతటి ప్రాధాన్యమును తమ కావ్యములలో గల్పించి కృతకృత్యులైన కవిపుంగవులు లేరు. మాళవికాగ్ని మిత్రములో సైతము కాళిదాసు ఇంతటి విపులముగా నృత్యమును జూపింపలేదు.

మొదట నుదాహరించిన విధముగా కవితా నాట్యములలో-వాద్యవాదన పద్ధతులలో ప్రవేశము పరిశోధన మొనర్చినగాక యిట్టి రచనము సాగదు."[1]

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమి నృత్య గురుకుల కులపతి నాట్యాచార్య భాగవతుల రామకోటయ్య గారిట్లు కొనియాడిరి.

"చతుర్థాశ్వాసములో శ్రీవారు భోగినీ నాట్యమును వర్ణించిన మనోజ్ఞ వైఖరి ఆంధ్ర సాహిత్యమునకే యలంకార ప్రాయముగా నున్నదనుట అతిశయోక్తికాదు."

"వీరి యీ నాట్యవర్ణన మనన్య సామాన్య ప్రతిభా పాండిత్యముల గ్రుమ్మరించుచు నసితర సాధ్యమై యపూర్వ పద్ధతులలో నడచినదనుట అతిశయోక్తి కాదు. సాత్త్విక, వాచిక, ఆంగిక, ఆహార్య రూపములతో సమగ్రమగు నాట్యమును, ఒక వాచక రూపమగు కవితలోనే రససిద్ధి కల్గునట్లు వర్ణించుట సాహసమైన పనియనియే చెప్పవలెను"

"భోగిని పాత్ర ఆచార్యులవారి రచనలో బడి ఆంధ్రులకు మరపురానిదై చరితార్థత నొందినది. సుందర నాట్యములు కనుల గట్టునట్లు వర్ణింపబడిన తీరు అపురూపము"

"ఆచార్యుల వారిందు కూచిపూడి నాట్యకళా రీతులను గూర్చియు వివరించి యున్నారు. ఇవి యన్నియు సశాస్త్రీయములు. శ్రీ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వేయిపడగలలో నిట్లే కొన్ని కూచిపూడి రీతులను వర్ణించి యున్నారు. కాని మధుర కవితాస్వర్ధునుల ప్రవహింపజేయు ఆచార్యుల వారి గంటములో మా కూచిపూడి నృత్యమెల్లను ఒదిగి యొప్పారి రససిద్ధినంది నందులకు కూచిపూడి వాస్తవ్యుడనగు నేనెంతో గర్వించుచున్నాను. అభినందించుచున్నాను.

సంస్కృతాంధ్ర కావ్య సాహిత్యములలో నాట్యమింత విపులముగా రససిద్ధి నొందిన కళాఖండము గాంచ లేమేమో!"[2]

ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారిట్లు ప్రస్తుతించిరి.

"ఈ కావ్యమునందలి వర్ణనలలోనికెల్ల ముఖ్యముగాఁ బేర్కొనఁ దగినది భోగినీ నాట్యవర్ణనము. ఈ వర్ణన సందర్భమునఁ గవిగారు తమకాకళయందుఁగల యభిమానమును పాండిత్యమును సర్వతోముఖముగా వ్యక్తముచేసినారు. ఆ భాగము

1. పోతన చరిత్రము: పండితాభిప్రాయములు: 'భోగినీ నర్తనశోభ' పుట 98, 99, 100
2. ,, ,, : పుటలు : 101, 102

చదువుచున్నప్పుడు పఠితలకు సంగీత నాట్య విశారదయైన యొక నాట్యకత్తె మనో హరముగా నెదుట నాట్యము చేయుచున్నట్లు స్ఫురించును."[1]

డా॥ పల్లా దుర్గయ్యగారిట్లు శ్లాఘించిరి.

"భోగినీ నాట్య వర్ణన మంతయును ముఖ్యముగా నాటకీయతకుదాహరణము. ఆంధ్ర కావ్యములలో నాట్య వర్ణన మిట్లు హృద్యముగను దీర్ఘముగా వర్ణింపబడిన ఘట్టములరుదు.... భోగినీ నాట్యమును శ్రీ ఆచార్యులవారు మహాకావ్యములో చేర్చి కడు దీర్ఘముగను శాస్త్రీయముగను వర్ణించి యున్నారు. మహాకావ్యముల లోని నాట్యవర్ణనకిది మకుటాయమానము. ఇది ప్రత్యేకముగా నెంతేని వివరింపదగినది. ఇందు కవి యనన్య సాధారణ ప్రతిభ విదితమగుచున్నది.[2]

ఈ అభిప్రాయముల వలన భోగినీ నృత్యవర్ణన మెంత శాస్త్రీయమై సాంప్రదాయికమై అనన్య ప్రతిభా విభాసితమై అపూర్వముగా రమ్యమై రసవంతమై యొప్పుచున్నదో విశదమగును.

వరదాచార్యుల వారెక్కడ కావ్య గానము చేసినను శ్రోతలు 'భోగినీనృత్య ఘట్టమును వినిపించండి' అని కోరి విని తన్మయులగుచుందురు. పోతనచరిత్రము పలుమారు పఠించువారును ఈ నృత్యఘట్టమును మాటిమాటికి చవులూర చదువుకొనుచుందురు. ఇవి అనుభవములోని మాటలు. స్వయముగా చదువుకొని పరవశింపని వారుండరు. అందును నితాంత మృదుమధుర గాత్రముతో ఆచార్యుల వారు గానము చేయుచుండ వినిన వారికదొక దివ్యానుభూతి. అదొక బ్రహ్మానంద సామ్రాజ్యప్రాప్తి.

పోతనచరిత్రము విశేషించి భోగినీ నృత్యఘట్టము చేత ఆచంద్ర తారార్కముగా నలరారగలదనుటలో సంశయము లేదు.

1. పోతన చరిత్రము : తొలిపలుకు : పుట ix
2. ,, ,, : 'కవి - కావ్య పరిచయము' పుట : 44

# కావ్యానుబంధము - భాగవతకథలు

ద్వాదశాశ్వాస విలసితమగు పోతన చరిత్రమున కడపటి యేకాదశ ద్వాదశాశ్వాసములు రెండు కావ్యానుబంధముగా కూర్పబడినవి. ఈ రెండాశ్వాసము లందును 'భక్తిగాథా నివేదనము' అను పేరులో పూర్వోత్తర భాగములలో ప్రసిద్ధ భాగవత కథలేడు చెప్పబడినవి. దాదాపు ఏడువందల పద్యగద్యములలో పరి వ్యాప్తమై యున్న యీ యనుబంధ కావ్యభాగమే పూర్వప్రబంధముల యంత విస్తృతి గలిగి వెలయుచున్నది. రచనా పరమార్థ వైశిష్ట్యములచేత తక్కిన కావ్య మొక యెత్తు ఈ యనుబంధ కావ్యమొక యెత్తుగా పరిఢవిల్లియున్నది.

## అనుబంధ భాగవత కథలు :

కావ్యానుబంధములోని యీ భాగవత కథలు పోతన ఒంటిమిట్టలో శ్రీరామ చంద్రుని సన్నిధిలో తన భాగవతకృతి రక్షణార్థము హరిని ప్రార్థించుచు ఆర్తితో ఆశువుగా చెప్పినవి. రాచకొండ చమూపతి భాగవత మపహరించుకొని పోగా వికల మనస్కుడై విరక్తుడై పోతన వెడలిపోయి పుణ్యక్షేత్రములను సందర్శించుచు చివరి కొంటిమిట్ట చేరి యచట వెలసియున్న శ్రీరాముని దర్శించి యానాడచటనే వసించియుండ రాత్రి స్వప్నమున రాముడు సాక్షాత్కరించి యతని కృతికి చెదలు తినుటచేత అపాయము సంభవించెననియు, తత్కృతి సముద్ధణార్థము తానేగుదు ననియు, అతని నచటనే దీక్షవహించి యుండుట కానతిచ్చి శుభమగునని పలికి యంతర్హితుడయ్యెను. పోతన యదరిపడి లేచి, ఆర్తితో హరిస్మరణ చేసి కృతి నాశమునకు దుఃఖించి, 'స్వామి! నాదు గ్రంథ సంక్షేమ మెఱుఁగమిఁ గుదువ'ననుచు దీక్షగొని యుండెను. వచ్చు పోవు భక్తులు పోతన గాథ తెలిసి బాధపడిరి. పోతన "భాగవతమె యన్న పానంబు లిక నాకు తత్ప్రబంధ పఠన తత్పరతను వేళఁ బుచ్చువాఁడ వెడఁగునై చెడనేల"[1]. యనుచు వ్యాస భాగవతమును పఠింపదొడ గెను. వేలకొలది జనము వచ్చి పోతన ఆర్తితో జెప్పు భాగవతకథలను విను చుండెను. అంత శ్రోతలలో నుండి యొక యోగి పుంగవుడు లేచి "కవివర్యా !

1. పోతన చరిత్రము : 9-294

ఇట్లు విలపింపనేల? యేడు రాత్రులును భగవదవతార కథావిశేషంబుల నాశు గతిఁ గావ్యగాన మొనరింప నాలించి హరి ప్రసన్నుండగు, భవద్రచితమగు భాగవత మనపాయతనున్న వార్త మీ చెవింబడు"[1] నని తెల్పిపోయెను. పోతన యట్లే 'అత్యంత భక్తియుక్తులతో' సప్తరాత్రములు భాగవత గాథల నాశువుగా 'శ్రోతృజనాఘ లతా లవిత్రముగా' గానము చేసెను. తత్ఫలితముగా శ్రీరామ చంద్రుని కటాక్షము వల్ల కృతి సముద్ధరింపబడిన శుభవార్త శ్రీనాథుని వలన పోతన విని యానందించెను.

పోతన సప్తరాత్రములు వరుసగా రామచరిత్రము, మోహిన్యవతార గాథ, వరహావతార కథ, నరసింహావతార కథ, గజేంద్రమోక్షణగాథ, కృష్ణావతారకథ, రుక్మిణీకళ్యాణ గాథ గానము చేసెను. ప్రతి కథాగాన ప్రారంభములో ఆర్తితో "స్వామీ! జానకిని రావణునిచెఱ నుండి విడిపించితివి. మత్కృతిసీతం గాపాడుటకు కర్తవీవ కదా! మఱచితి వేమొ యందులకె మధుర సుధా రసభరితమ్మగు నీ చరితమ్ములు గానమ్మొనర్తు"[2] నని యీ రీతిగా పలుకును. ఇట్టివి పోతన భక్తి ప్రపత్తులకు, భరన్యాసమునకు నిధానములై పురుషోత్తముని భక్తాపన్నివారణ గుణ ప్రకాశములై యొప్పారుచున్నవి.

## భాగవత కథల రచన, అనుబంధముగా కూర్చుట:

కావ్య కథా సంబంధముగలవైనను ఈ గాథలను కావ్యాంతర్భాగములుగా గాక కావ్యానుబంధముగా గూర్చుటలోని యౌచిత్యము, ఈ కథల రచనాగత్యము విచారింపవలసి యున్నది. ఈ యనుబంధ గాథల రచన గూర్చి ఆచార్యులవారే యిట్లు వివరించి యున్నారు.

"ఇందు కావ్యానుబంధమని రెండాశ్వాసములు చివరివి వ్రాసితిని. ఇవన్నియు భాగవత కథలే. ఇవి కథకు సంబంధించినవనే అనుబంధ కావ్యముగా గూర్చితిని. దీనికి ప్రబలమైన కారణమొక్కటే. అది పోతరాజు తా వ్రాసిన భాగవతములోని హరి ఆర్తరక్షణము ఆశ్రిత పక్షపాతమును ఋజువు పరచుకొనుటలే. భాగవత భక్త రక్షణమును స్మృతికి దార్చుచు నీ భక్తుడనగు నా భాగవత రక్షణమేల

1. పోతన చరిత్రము : 9-296
2. ,, : 11-3

సేయలేవని ఆర్తిజెందుటే ఈ గాథల ముఖ్య లక్షణము. కాని యతనిపై పోటికి వ్రాసిననుట దుస్సాహసము, అపచారము."1

ఆచార్యులవారి విజ్ఞప్తి ననుసరించి యివి పోతన జీవిత గాథను తెలుపునవి కాక భాగవత కథలు కావున వీనిని కావ్యాంతర్గతములుగా కాక కావ్యానుబంధముగా రచించుట జరిగినదని తెలియుచున్నది. మరియు కథా సందర్భానుసారముగా భాగవత కృతి రక్షణార్థమును, హరి ఆర్తత్రాణ పరాయణత్వ నిరూపణార్థమును పోతన చేత ఈ భాగవత కథలు చెప్పింపబడినవనుట స్పష్టము. ఈ భాగవత కథల రచనమును వీనిని కావ్యానుబంధముగా గూర్చుట గురించియు మరికొంత విపులముగా చర్చింపవలసియున్నది.

శ్రీ మహా భాగవతమున ద్వాదశస్కంధములు గలవు. పోతన చరిత్రము నందును ద్వా దశ స్కంధములు గలవు. ఆశ్వాస సంఖ్యచేత భాగవత సామ్యము గల పోతన చరిత్రమున పండ్రెండాశ్వాసముల పర్యంతము కథ సాగినదా యని విచారింపవలసియున్నది. భాగవతమున మాత్రము ద్వాదశస్కంధాంతమువరకు కథ సాగినది. సవిమర్శకముగా పరిశీలించినచో భాగవతమునందును ప్రధాన కథ చాలవరకు దశమస్కంధముతోనే ముగియుచున్నది. తక్కిన ఏకాదశ ద్వాదశ స్కంధములు క్రమముగా 125, 53 గద్య పద్యములతో మిక్కిలి చిన్నవై నామమాత్రావశిష్టములై యున్నవి. ఏకాదశ స్కంధమున, దుష్టశిక్షణ శిష్టరక్షణచేసి ధర్మసంస్థాపన గావించుటకు లీలామానుష విగ్రహుడై జన్మించిన శ్రీహరి కృష్ణావతారము పరిసమాప్తి ముఖ్యముగా వర్ణింపబడినది. ద్వాదశ స్కంధమున ఆపన్నుడు ప్రపన్నుడు ముముక్షువునైన యే పరీక్షిత్తునకు శుకయోగీంద్రుడు సప్తాహములు. భాగవతము వినిపించెనో ఆ పరీక్షిత్తు మృతి నొంది మోక్షము పొందిన యుదంతము చెప్పబడినది. అనగా భాగవత గ్రంథము సమాప్తి కావింపబడినది. ఇట్లు చివరి రెండు స్కంధములల్పములయ్యు కథ లోని భాగములే యగుట అఖండములై భాగవతము పండ్రెండు స్కంధములతో విలసిల్లవలసి వచ్చినది.

ఇక పోతన చరిత్రమున పోతనగారి జీవితగాథ దశమాశ్వాసముతోనే ముగియుచున్నది. ఏకాదశ ద్వాదశాశ్వాసములలో పోతనగాథ కాక భాగవతగాథ లభివర్ణితములై యుండుటచేత కావ్యకథలో నంతర్భాగములై యతికి యున్నవి

3. పోతన చరిత్రము: 'విజ్ఞప్తి' పుట : 75

కావు. అయినను పోతన తన గ్రంథ రక్షణార్థము పరమార్తితో సందర్భోచితముగా చెప్పినవే కావున తీసివేయుటకు వీలులేని యొకానొక విచిత్రబంధము పొసగి యున్నది. ఈ బంధము అంతర్బంధముకాక అనుబంధమై యొప్పుచున్నది. కావుననే వీనిని కావ్యానుబంధముగా పొందుపరచవలసి వచ్చినది.

ఈ భాగవత గాథలు నవమాశ్వాసమున ఒంటిమిట్ట శ్రీరామచంద్ర సన్నిధిని పోతన గానము చేసినట్లు చెప్పబడినందున ఆ యాశ్వాసమునను ఆ తరువాతి ఆశ్వాసమునను వరుసగా ఈ గాథలను వర్ణింపజేసిన సరిపోయెడిది. కాని కావ్యకథా శిల్పదృష్టితో పరిశీలించినచో నిది యుక్తవిషయము కాదు. పోతన కథ నొక ప్రక్కకుబెట్టి యేడువందల పద్య గద్యములతో సుదీర్ఘములైన యేడు గాథలను వర్ణించుచు బోయిన కావ్యకథాగతికి ప్రతిబంధక మేర్పడి రచన ప్రశస్తము కాకుండవోవును. ప్రధాన కథలో ప్రసక్తానుప్రసక్తముగా అనేక కథలను చొప్పించి రచన చేయుట క్షేత్రదైవత మాహాత్మ్యాభివర్ణనకు, ధర్మోప దేశమునకు నీతిబోధకు ముఖ్యోద్దిష్టములైన భాగవత భారతములవంటి పురాణేతి హాసముల కుచితము కావచ్చును కాని కావ్యశిల్ప విశిష్టములగు పోతన చరిత్రము వంటి ప్రబంధములకు సముచితము కాదు. అందువల్లనే యీ భాగవత గాథలను కావ్యకథా మధ్యమున నిల్పుట కవకాశము లేకపోయినది. ఐనను నిట్టి కావ్యాను బంధము కావ్యములలో నపురూపమై విలక్షణమై యున్నది.

## భాగవతగాథల రచనా పరమార్థము :

పోతన చరిత్రమున భాగవత గాథలు రచించి కూర్చుటవలని విశిష్ట ప్రయోజనము విచారింపవలసి యున్నది. ఈ గాథలను సంతరించుటకు ఆచార్యుల వారు 'విజ్ఞప్తి' లో విశదీకరించినట్లు, 'పోతరాజు తా వ్రాసిన భాగవతములోని హరి ఆర్తరక్షణము ఆశ్రిత పక్షపాతమును ఋజువు పరచుకొనుటలే' యనునది ప్రధానహేతువు. దీని నించుక వివరింతును.

శ్రీ మహాభాగవతము శ్రీకైవల్యపదము చేరుటకు రచింపబడినదనుట లోక ప్రసిద్ధము. పోతన భాగవతమైనను అభినవ పోతన భాగవతమైనను ఆ కైవల్య పద ప్రాప్త్యర్థమే. పరీక్షిన్మహారాజు వృథా కృధా దర్పమున నకార్యమొనర్చి మునిశాపమునకు గురియై యేడు దినములలో తక్షక విషాగ్నిచేత దగ్ధమగు ప్రారబ్ధమునకు లోనై జన్మతారకముగా మోక్షార్థియై యాశ్రయించి ప్రార్థింపగా

శుకయోగీంద్రుడతనికి భాగవతము వినిపించెను. పరీక్షిత్తు భాగవత మామూలాగ్రముగా సప్తాహములు విని సప్తమ దివసమున తక్షక దష్టుడై భౌతికకాయము విడిచి చని పరమపదమును గాంచెను. ఇట్లు పరీక్షిత్తు నిమిత్తముగా ప్రవచింపబడిన భాగవతము సకల భక్తులకు ముముక్షువులకు మోక్షదాయకమై యలరారుచున్నది. పరమపావనమైన భాగవతము భక్తాదులకు ఇహమున ఆపదలనుండి రక్షించి అభ్యుదయములు ప్రసాదించి పరమున ముక్తిని ప్రాప్తింపజేయుచున్నది. ఈ విషయము నిరూపించుటకే భగవంతుడు శ్రీహరి అవతారగాథలు భాగవతమున వర్ణింపబడినవి.

పోతన చరిత్రమున భాగవతోత్తముడగు పోతన ఆ భాగవత గాథలను ఇహపర సాధకమైన ఉపర్యుక్త పరమార్థము నర్థించియే గానము చేసెను. అతడు "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్...." అనియు 'పలికెడిది భాగవతమట పలికించెడు వాఁడు రామభద్రుండటనే పలికిన భవహర మగునట' యనియు భాగవతము ననువదించెను. ముముక్షువై మోక్షప్రదమగు భాగవతము రచించిన పోతన మోక్షార్థము కాక భాగవత కృతి రక్షణార్థ మత్యంతార్తితో హరిని ప్రార్థించుచు భాగవత కథలను గానము చేయుటలోని సామంజస్యమేమిటో పరిశీలింపవలసి యున్నది.

మహాభక్త శిఖామణియైన పోతనగారి జీవిత మితర మహాభక్తుల జీవితములవలెనే భక్తి మహిమోపేతమై యొప్పారినది. భక్తులందరి యెడ విలసిల్లినట్లే పోతన యెడను నారాయణుని యార్తత్రాణ పరాయణత్వము, ఆపదుద్ధారకత్వము నిరూపితమైనది. పోతన జీవితములో అనేక కష్ట క్లిష్ట దశలలో పరమేశ్వరానుగ్రహము ప్రకాశించినది భాగవత రచనా కాలమున మరణించిన కొమరితను బ్రతికించుట, బమ్మెరలో వరాహ రూపమున భాగవత కోశమును రక్షించుట, దుర్భర దారిద్ర్యములో శ్రీనాథ మహాపరివారమునకు జ్యోతిపుర రాజ్ఞీరూపమున సంతర్పణ గావించుట మున్నగునవి ముఖ్యమైనవి. ఇట్టి వెన్ని సంభవించినను పోతన కన్నీరు కార్చలేదు. నిశ్చల భక్తితో ఈశ్వరుని స్మరించి భారమతనిపైవైచి గట్టెక్కినాడు. కాగా స్థితప్రజ్ఞుడగు పోతన శోకించినది రెండు సందర్భములయందు మాత్రమే. కనిపెంచిన తొలి దైవములగు తలిదండ్రులు గతించినపుడతని దుఃఖము కట్టలు త్రెంచుకొని ప్రవహించినది. అది నైసర్గికము ననివార్యమునైనది. శంకరునివంటి సర్వసంగ పరిత్యాగియు తల్లికొరకు తల్లడిల్లినవాడే. ఇక ప్రస్తుతాంశము భాగవత కృతి క్షతి గూర్చిన వేదన. ఇది పోతన జీవితములో పరాకాష్ఠకు చేరిన విపద్దశ.

భాగవతమపహృతమైనపుడే మనసు వికలమై సహజ వైరాగ్య భావనగల పోతనకు పూర్తిగా విరక్తి కలిగెను. ఆ ఖేదమే యెదను గాల్చుచుండ, చెద పురుగులచేత భాగవత ముత్సన్నమగుచున్నదన్న అశనిపాత సదృశ వృత్తాంతము శ్రీరాముని వలన కలలో తెలిసి అత్యంత సంతప్తస్వాంతుడై యడలెను. భాగవత సంక్షేమము కొరకు నిరశన దీక్షబూని పరమార్తితో హరిని స్మరించి అతని ఆపదుద్ధారక భాగవత గాథ లాశువుగా గానమొనర్చెను. భవబంధవిముక్తికి ప్రార్థింపవలసిన హరిని భాగవతకృతి విముక్తికి ప్రార్థించుట భావ్యమా ? యనగా స్వీయ రక్షణ మోక్షములకంటె భాగవతకృతి రక్షణ మోక్షణములే శ్రేష్ఠమైనవని తెలియగలము. తాను రక్షింపబడుచో తనకొక్కనికే మోక్షము. భాగవతము రక్షింపబడుచో భక్తులందరికి మోక్షము తద్ద్వారమున లభింపగలదు. కావుననే తన కష్ట నిష్ఠురములకెన్నడు నేడ్వని పోతన జీవితము ధారవోసి రచించిన భాగవతమునకై యేడ్చినాడు.

భక్తులాపన్నివారణకు పరమేశ్వరుని ప్రార్థించుచు ఆ దేవుని ఆపన్న రక్షణ గాథలను స్మరించి శరణువేడుట పరిపాటి. శ్రీ శంకరుల లక్ష్మీనృసింహ స్తోత్ర మటువంటిదే. అట్లే పోతన విపదంబుధి దాటుటకు విష్ణుకథా పోతము నాశ్రయించెను. తత్ఫలితముగా కృతి రక్షణ జరిగి శ్రీహరి ఆర్తత్రాణ పరాయణత్వము, భక్తజన పక్షపాతము నిరూపితమయ్యెను. శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు భాగవతము సప్తవాసరములు వినిపించినట్లే యిందు పోతన సప్తవాసరములు భాగవతగాథలు వినిపించుట విశిష్టముగా నున్నది. అక్కడ పరీక్షిత్తునకు ముక్తి ఇక్కడ భాగవతమునకు విముక్తి. రెండిటను భక్తుల కపవర్గసామ్రాజ్య సంపద సమృద్ధిగా గలదు. ఇట్టి పరమప్రయోజనముతో సందర్భోచితముగా రచింపబడిన ఈ గాథలవల్ల పోతన చరిత్రమున భాగవత వాతావరణమేర్పడి పుణ్య ప్రబంధముగా నిత్యపారాయణ యోగ్యమై భాగవతతుల్యమై విరాజిల్లుచున్నది. ఈ విధమైన వైశిష్ట్యమునాశించి యీ గాథలు రచించిరే కాని ఆచార్యులవారు తామన్నట్లు పోటికి వ్రాసినది మాత్రము కాదు.

## భాగవతగాథల పౌర్వాపర్యము

పోతన చరిత్రమున భాగవత గాథలు క్రమముగా రామచరితము, మోహిన్యవతార గాథ, వరాహావతార కథ, నరసింహావతార కథ, గజేంద్రమోక్షణ కథ, కృష్ణావతార కథ, రుక్మిణీకళ్యాణ గాథ-అనునవి కలవు. ఇందు మొదటి నాలుగు

ఏకాదశాశ్వాసమునను, తర్వాతి మూడు ద్వాదశాశ్వాసమునను చెప్పబడినవి. ఈ కథల క్రమము భాగవతమునందలి కథల క్రమమునకు సరిపోవుట లేదు. భాగవతమున ఈ గాథలు వరుసగా తృతీయ స్కంధమున వరహావతారకథ, సప్తమ స్కంధమున నరసింహావతారకథ, అష్టమ స్కంధమున తొలుత గజేంద్రమోక్షణ కథ, పిదప మోహిన్యవతారకథ, నవమ స్కంధమున శ్రీరామ చరితము, దశమ స్కంధమున శ్రీకృష్ణావతారకథ, రుక్మిణీకళ్యాణ గాథ, రచింపబడినవి. ఈ కథా క్రమ వ్యత్యయమునకు కారణము పరిశీలింపవలసి యున్నదియై

ఆచార్యులవారు చేపట్టిన కథలలో దశావతారములందు విశిష్టతరములైన వరాహ నరసింహ రామకృష్ణావతారములకు చెందిన కథలైదు. తక్కిన రెండింటిలో మోహిన్యవతారము నారాయణుని యేకవింశత్యవతారముల లోనిది. అది విష్ణు మాయావిలాస కలితమైనది. ఇక మిగిలిన గజేంద్రమోక్షణ కథ చతుర్థమనువుగా తామసుడున్న కాలమున దయా సముద్రుడగు హరి యార్తజనరక్షణ పరత్వము తెలుపునదిగా చెప్పబడినది. పోతన చరిత్రమునందు తొలుదొలుత రామ చరితము పిదప మోహిన్యవతారము చెప్పుట మాత్రము క్రమ విపర్యయమైనది. ఇవి రెండు ముందు చెప్పబడుటతప్ప తక్కినవెల్ల భాగవతక్రమము ననుసరించి యున్నవే.

పోతనచేత మొట్టమొదట రామచరిత్రము చెప్పించుటకు హేతువు దుర్గ్రాహ్యమేమియు కాదు. పోతన రామభక్తుడు. అతని యాదేశానుగ్రహముల వలననే భాగవతమాంధ్రీకరించి యతనికే కృతి ఇచ్చెను. అట్టి కృతి మట్టిపాలగుట కోర్వలేక ఆర్తుడై తదీయ రక్షణార్థము తన ప్రభువును తన కృతిస్వామియు నగు ఆ దేవదేవుని ప్రార్థించి యతని చరిత్రము మొదట పాడుట సహజమైనది. సమంజసమైనది. అంతే కాకుండా వరదాచార్యులవారును పోతన వలెనే రామభక్తులై రామునకంకితముగా పోతన చరిత్రము రచించిరి కావునను వారికి తమ యిష్టదైవమగు శ్రీరాముని స్మరించి తొలుత నతని చరిత్రమే పోతనచేత గానము చేయించి నారనుట యుక్తియుక్తమైనది.

ఇష్టదైవమగు రాముని చరిత్రము పిదప మోహిన్యవతారగాథ గానము చేయుటలోని యౌచిత్యము గమనింప దగినది. మోహిన్యవతారము శ్రీమన్నారాయణుని ప్రసిద్ధ దశావతారములలో రెండవదగు కూర్మావతారమున కనుబంధముగా ఆనుషంగికముగా వెలసినది. కావున తాను చెప్పదలచిన అవతార

గాథలను వరుసపెట్టి చెప్పబూనినప్పుడు మోహిన్యవతారమే మొదట స్ఫురించును. అంతేకాక రాచకొండ చమూపతిచేత అపహృతయైన కృతిని రావణాపహృతయైన సతిని కాపాడినట్లును, రాక్షసాపహృతమైన యమృతమును రక్షించినట్లును రక్షించు మని రాముని, మోహిన్యవతార విశిష్టుడైన హరిని వేడుట తత్కథలు పాడుట అపహృత వస్తు సంరక్షణ విషయ సామ్యముచేత ప్రస్తుతించుట. సమంజసముగా నున్నది. మరియును భాగవతమునందష్టమ స్కంధమున గజేంద్ర మోక్షణ కథ తర్వాత మోహిన్యవతారకథ ప్రవచింపబడియుండ వానిని ముందు వెనుకలుగా పోతన చరిత్రమున చెప్పుట-అదియును ఆర్త్యావేశమున నాశువుగా చెప్పుట అను చితమని భావించుట తగదు. ప్రసక్తానుప్రసక్తముగా చెప్పబడిన అసలు భాగ వతమునందే దశావతారకథా క్రమము విపర్యయమైన దృష్టాంతములు కానబడును. తృతీయ స్కంధమున వరాహావతారకథ, సప్తమస్కంధమున నరసింహావతార కథ యుండి, అష్టమ స్కంధమున తొలుత కూర్మావతారకథ, పిమ్మట వామన చరిత్రము ఆ పిదప స్కంధాంతమున మత్స్యావతారకథ, చెప్పబడినవి. కావున యీ కథాక్రమ విపర్యయమంతగా ఆక్షేపణీయ విషయము కాదు,

## భాగవత కథల స్వరూపము : విస్తృతి :

కావ్యము నందలి భాగవత కథల విస్తృతికిని భాగవతములోని కథల విస్తృతికిని వ్యత్యాసముకలదు. ఉభయ గ్రంథములలోని కథల పద్యగద్య సంఖ్యలు దిగువ నీయబడినవి.

1. శ్రీరామ చరిత్రము : భాగవతమున నవమస్కంధమున (258-363) 106 పద్యగద్యములు. పోతన చరిత్రమున ఏకాదశా శ్వాస మున (3-109) 107 పద్యగద్యములు.
2. మోహిన్యవతార కథ : భాగవతమున అష్టమస్కంధమున (384-409) 26 పద్యగద్యములు. పోతనచరిత్రమున ఏకాదశాశ్వాసమున (110-166) 57 గద్యపద్యములు.
3. వరాహావతార కథ : భాగవత తృతీయ స్కంధమున (498-704) 207 పద్యగద్యములు. పోతన చరిత్రమున ఏకాదశాశ్వాస మున (167-207) 41 పద్యగద్యములు.

4. నరసింహావతార కథ: భాగవత సప్తమ స్కంధమున (115-384) 270 పద్యగద్యములు. పోతన చరిత్రమున ఏకాదశాశ్వాసమున (208-378) 171 పద్యగద్యములు.

5. గజేంద్రమోక్షణ కథ: భాగవతమున అష్టమ స్కంధమున (17-136) 120 పద్యగద్యములు. పోతన చరిత్రమున ద్వాదశాశ్వాసమున (3-88)86 పద్య గద్యములు.

6. కృష్ణ చరిత్రము : భాగవత దశమస్కంధము (పూర్వోత్తర భాగములు), ఏకాదశ స్కంధములోను. 3249 పద్య గద్యములు. ఇందు కంసవధము వరకు మాత్రము 1386 పద్య గద్యములున్నవి.
పోతన చరిత్రము నందు ద్వాదశాశ్వాసమున (91-213) 123 పద్య గద్యములు.

7. రుక్మిణీ కళ్యాణ కథ : భాగవతమున దశమ స్కంధ పూర్వభాగమున (1677-1784) 108 పద్య గద్యములు. పోతన చరిత్రమున ద్వాదశాశ్వాసమున (214-307) 94 పద్య గద్యములు.

ఈ పట్టిక ననునరించి భాగవతమున ఈ కథల మొత్తము పద్యగద్య సంఖ్య 2223 కాగా పోతన చరిత్రములోని సంఖ్య 679 అగుచున్నది. దీనిచేత ఆచార్యులవారు భాగవతములోని కథలను ఇంచుమించు నాలుగవ వంతునకు సంగ్రహించి ఈ కథలు రచించినట్లు తెలియుచున్నది. ఈ కథలలో మొదటిదగు శ్రీరామ చరిత్రము, చివరిదగు రుక్మిణీ కళ్యాణ గాథ దాదాపు భాగవతములోని కథలకు సమవిస్తృతిలో వ్రాయబడినవి. మోహిన్యవతార గాథ రెండింతలైనది. వరాహవతార కథ ఐదవవంతుకు తగ్గిపోయినది. నరసింహావతార కథ, గజేంద్ర మోక్షణ కథ దాదాపు ఒకటి నరవంతు తగ్గినవి ఇక కృష్ణచరిత్రము మాత్రము పదవ వంతుకంటె ఎక్కువగా తగ్గిపోయినది.

భాగవతము నందలి కథలను మొత్తముపై నాలుగవ వంతునకు కుదించి వ్రాయుటలోని హేతువు విచారింపవలసియున్నది. పోతన చరిత్రములో ఈ భాగవత కథలు అనుబంధముగా ప్రాసంగికముగా రచింపబడినవే కాని కావ్య

ప్రధాన కథా భాగములు కావు. కావుననే రచనా ప్రణాళిక ననుసరించి వ్రాయ వలసి వచ్చి మిక్కిలి సంగ్రహముగా కూర్పబడినవి. ఇందులో ఆర్తికి భక్తి తాత్పర్యములకు కొదువలేదు. కథాశరీరములే చాలవరకు కుదింపబడియున్నవి. రామ చరిత్రమును రుక్మిణీ కళ్యాణ కథను భాగవతములోని కథలకు సమ విస్తారముగా కూర్పబడుటచే ఈ కథలలోని సన్నివేశము లుభయ గ్రంథము లందును సమానముగా వర్ణింపబడినవని చెప్పవచ్చును. మోహిన్యవతారకథ రెండంతలగుట మోహినీ విలాసములు భాగవతములో కంటె పోతన చరిత్రమున అధికముగా వర్ణింపబడుటవలన నని తెలియును. అట్లే వరాహావతార నర సింహావతార కథలు, గజేంద్రమోక్షణ కథ కొన్నివర్ణనలు తగ్గించి రచించుటచేత సంక్షిప్తమైనవి. ఇక కృష్ణచరిత్రము పదవవంతుకు తగ్గుటలో ప్రబలకారణము కలదు. భాగవతము ప్రధానముగా కృష్ణచరిత్రము చెప్పుటకే యుద్దేశింపబడినది. మొత్తము గ్రంథములోని దాదాపు తొమ్మిదివేల పద్యగద్యములలో కృష్ణ చరిత్రమునకే 3249 పద్యగద్యములు అనగా 36% భాగము వినియోగించుటయే తార్కాణ. పై మూడువేల పైచిలుకు పద్యగద్యములు బృహద్గాథతో పోల్చినచో పోతన చరిత్రములోని కథ ఇరువది ఐదు వంతులకు తగ్గియున్నది. కాని ఆచార్యులవారు కావ్యమున కృష్ణచరిత్రమును కంసవధ వరకే రచించిరి. కావున కంసవధ వరకు భాగవతమునగల పద్యగద్యములు 1386 అగుటచే పదవ వంతుకు కుదింపబడినదని చెప్పనొప్పును. భాగవతములోని కృష్ణచరిత్రములోని యనేక సన్నివేశములను విడిచి తక్కినవి కుదించి వ్రాయుటచేత నింత సంగ్ర హముగా ఈ కథ పొల్చుచున్నది ఇట్లీగాథలు సంగ్రహరూపమున కావ్యమున నలరారుచున్నవి.

## భాగవతకథల రచనా వైశిష్ట్యము :

పోతన చరిత్రమున భాగవత కథలు వ్రాయుటలోని పరమార్థము, వాని స్వరూపము చర్చింపబడెను. కాగా ఆ గాథల రచనా విశిష్టత యెట్టిదో విమర్శింప వలసి యున్నది. తెలుగులో భారత భాగవతములను కవిత్రయము వారు, పోతన మరొకరు మరల వ్రాయవలసిన యవసరము లేకుండ మహావిశిష్టముగా రచించి యున్నారు. ఐనను శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి వంటివారు కొందరు భారత భాగవతముల నాంధ్రీకరించి యున్నారు. వరదాచార్యులవారును పైన వివరించినట్లు

విశిష్ట ప్రయోజనము నుద్దేశించి సందర్భోచితముగా పోతన చరిత్రమున భాగవత గాథలు రచించిరి. ఈ గాథాసముదాయము విడిగా భాగవతము కాకున్నను తత్సదృశమై, పోతన రచిత భాగవతమే యుండగా మరల నిదేలయన్నచో కవి స్మామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రామాయణము రచించుచు "మరల నిదేల రామాయణంబన్నచో.... తలఁచిన రామునే తలఁచెద నేనును, నా భక్తిరచనలు నావిగాన"....[1] అని యన్నట్లు ఆచార్యులవారు భక్తితో రచించి తమ భక్తి శ్రద్ధలను దెలుపుకొనినారు. మరియు రచనలో తమ ప్రత్యేకతను నిలుపుకొనినారు.

భాగవతములో సుప్రసిద్ధములును మహాప్రశస్తములునునై మిక్కిలి ప్రచారములో నున్న కథలతో ఆర్తత్రాణపరాయణత తెలుపు కథలను ఆచార్యుల వారు గ్రహించి రచించినారు. ఈ గాథల రచనలో వారు భాగవత కథా విధానము ననుసరించుచునే శిల్పము శైలి భావ చమత్కారాదులలో తమ ప్రత్యేకతను, విశిష్టతను ప్రదర్శించియున్నారు. వీని రచన గూర్చి ఆచార్య దివాకర్ల వేంకటావ ధానిగారిట్లు కొనియాడిరి.

"శ్రీ మద్భాగవతమునఁ బండ్రెండు స్కంధములున్నవి. ఈ తుది రెండాశ్వాసములతో పోతన చరిత్రయుఁ బండ్రెండాశ్వాసముల కావ్యమై భాగవత తుల్యమైనది. ఈ కథలను జెప్పుటలో శ్రీమదాచార్యులవారు భాగవత కథా విధానమునే యనుసరించినను కథన శిల్పమున నప్రతిమానమైన కౌశలము ప్రదర్శించినారు. కథలో, తత్త్వములో, పద్యముల నడకలో, భావ సంపదలో నవి భాగవతమునందలి కథల కెందును దీసిపోవు. కావ్యైకదృష్టితోఁ జూచినచో నవి యనావశ్యకము లనిపించినను కథాకథన దృష్టితోఁ జూచినచో నద్భుతావహ ములై యలరారును"[2].

అవధానిగారు సెలవిచ్చిన యీ యభిప్రాయ మక్షరశః వాస్తవము. వస్తు భావ రచనా క్రమములో ఈ విషయము విపులముగా చర్చింతును.

## వస్తు సంవిధానము :

పోతన చరిత్రములోని భాగవత కథలు సుప్రసిద్ధములైన శ్రీ మహాభాగ వతములోని కథల వస్తు క్రమమునే అనుసరించి వ్రాయబడినవి. ఐనను సంగ్ర

1. శ్రీమద్రామాయణ కల్పవృక్షము : అవతారిక పుట 4
2. పోతన చరిత్రము : తొలిపలుకు పుట vii

హించి వ్రాయుటలో కొన్ని సన్నివేశములు సంక్షేపింపబడియు, కొన్ని మాత్రముగా ప్రస్తావింపబడియు, మరికొన్ని అప్రధానాంశములు వదలిపెట్టబడి వస్తు శిల్పదృష్టితో కొన్ని సన్నివేశములు విపులీకరింపబడియు క్వాచిత్క కొంత మార్చియు కొంత చేర్చియు కథలు వ్రాయబడినవి. ఈ కారణముల ఆచార్యులవారి కథా కథన రీతి కొంత ప్రత్యేకతను వైశిష్ట్యమును సంతరి కొన్నది.

శ్రీరామ చరిత్రము భాగవతమున మిక్కిలి సంగ్రహముగా రచిం యున్నది. పోతన చరిత్రమునను నిట్లే సంగ్రహముగా రచితమై దాదాపు భాగవ లోని కథయంత విస్తృతి గాంచియున్నది. ఇందు మొదట రామాయణ కర్త వాల్మీకి ప్రశస్తి ప్రశస్తముగా రెండు పద్యములలో వర్ణింపబడినది. ఇది ఆచా వారికి వాల్మీకి పైనను, రామాయణముపైననుగల గౌరవాభిమానములను వ్యక్ చేయును. పిదప రాముని జనన బాల్యకౌమారములు సంక్షిప్తముగానైనను ముగా వర్ణింపబడినవి. సీతా స్వయంవరములోని ధనుర్భంగము భంగ్యంతరవ వర్ణితమైనవి. భాగవతములో ప్రస్తావన మాత్రమైన లేని రామవనవాస గమ లోని గుహుని కథ (పద్యములు 28-49) ఇరువదిరెండు పద్యములలో సుదీర్ఘ వ మిక్కిలి మనోజ్ఞముగా విస్తరించి వర్ణించుట జరిగింది. అందు గుహుని ప్రపత్తులు, రామునకతడు చేసిన సేవలు విపులముగా వ్రాయబడినవి.

"మీలుగనరావు బుట్టలోఁ బూలెకాని వలలఁ బూనఁడు పూలదండలనె
గాలములులేవు పత్రఫలాలెకాని అద్భుతము నిషాదుండు ప్రహ్లాదుఁడయ్యె

"అచ్చపుభక్తి రాఘవు సుధా మధురకృతిఁ గన్ను దొన్నెలన్
బ్రుచ్చిలి త్రావి యా శిలలముండ్లఁ జరించుట స్వామిపాదముల్
నొచ్చెనటంచుఁ గేలఁగొని నొక్కుచు మ్రొక్కుచుఁ గండ్లనద్దె గో
ర్వెచ్చని బాష్పవారిఁ దడిపెన్ జడతన్ బడిపోయె నంభ్రములన్.... "[2]

ఇత్యాది పద్యములు గుహుని భక్తి తాత్పర్యములకు తార్కాణములు. ఇట్టిచట భక్తిరస నిర్భరముగా వ్రాయుటలో నాచార్యులవారి సహజ రామభక్తియే తులసీదాసుని 'రామ చరిత మానసము' కొంత ప్రభావము చూపినదనవచ్చున

1. పోతన చరిత్రము : 11-31
2. ,, ,, : 11-34

రాముని సీతావియోగార్తి హృదయము ద్రవించునట్లు వర్ణింపబడినది. విభీషణుడు బహిష్కృతుడై రాముని శరణుజొచ్చిన విషయము కొంత విపులముగా గలదు. భాగవతమునందు వలెనే యిందును రామరావణ యుద్ధము మిగుల సంక్షిప్తముగా వర్ణింపబడినది. చివరి శ్రీరామ పట్టాభిషేకమహోత్సవము భాసురముగా వైభవముగా వర్ణింపబడియున్నది.

మోహిన్యవతార గాథలో మోహినీ రూపరేఖా విలాసములు విపులముగా వర్ణింపబడినవి. ఉభయగ్రంథములందును మోహిని బంతిగొని యాడుచు కనబడినను పోతన చరిత్రమున నామె వసంత వనశోభలలో బంతి నెగిరించుచు ననేకములైన హావభావాది శృంగార చేష్టలు హొయలొలుకబోసి శివుని మోహింపజేసినట్లును, శివుడామెను గని రిచ్చవడి వినుతించి యామెతో సంభాషించి సాకులు కల్పించుకొని మన్మథ వికార చేష్టల కుద్యుక్తుడయినట్లును విశిష్టముగా వర్ణించుట జరిగినది.

"మీనంబు పొలసుల మేన్వీడి స్నిగ్ధతంగాంచఁ దానీ లేమ కనులఁబడియె"[1] ఇత్యాదిగా వర్ణించుటలో నామె విష్ణ్వవతార విశేషములను,

"కనురెప్పవేయక నినుగాంచగా నిత్య సాలోక్యవరముక్తి సంభవించు"[2] అని యీ రీతిగా వర్ణించుటలో ఆ వైష్ణవిలోని ముక్తి ప్రదత్వమును వినుతించుట జరిగి శృంగారములో తాత్త్వికత గర్భీకరించి వర్ణించిన విశిష్టత యింపు గొలుపుచుండును. మొత్తముపై మోహినీ శృంగార చేష్టలు, శివుని విమోహిత ప్రవర్తనము విపులముగా వర్ణించుటలో నీకథ ద్విగుణీకృతమైనది.

వరాహావతార కథ మిక్కిలి సంగ్రహింపబడి ఐదవ వంతునకు తగ్గిన విషయము తెల్పబడెను. ఈ సంక్షిప్తత ముఖ్యముగా రెండు సన్నివేశములలో జరిగినది. జయ విజయులు శాపగ్రస్తులై హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించిన ఘట్టము భాగవతమున 99 పద్య గద్యములలో విపులముగా వర్ణింపబడియుండ పోతన చరిత్రమున కేవలము ఆరేడు పద్యములలోనే ముక్తసరిగా చెప్పబడినవి. అట్లే హిరణ్యాక్ష వరహమూర్తుల యుద్ధము భాగవతమున 64 పద్యగద్యములలో వర్ణింపబడయుండ కావ్యమున 11 పద్యములలో సంగ్రహముగా వర్ణింపబడినది. తక్కిన సన్నివేశములలో అంతగా భేదము లేదు.

1. పోతన చరిత్రము : 11-133
2. ,, : 11-148

నృసింహావతార కథ భాగవతములో కంటె ఒకటినర పంతునకు కావ్యమున తగ్గునట్లు సంగ్రహింపబడినప్పటికిని అనేక విశేషములు కనబడును. కథాప్రారంభ మున నారదుడు వచ్చి హిరణ్యకశిపునితో సంభాషించి దురహంకారము, నిరంకుశ పరిపాలన, ప్రజాపీడ పనికిరావని హితోపదేశము చేయుట, పసివాడగు ప్రహ్లాదుడు బుడినుడుల హరిని పొగడి తండ్రి నుడికించుట, ప్రహ్లాదుడు తోడి రాక్షస బాలలకు భక్తి జ్ఞానవైరాగ్యములు బోధించి తన్మయత్వమున హరిని పాడియాడి యందరిని పరవశులను చేయగా గురుడు సైతము ముగ్ధుడై కరగిపోవుట, తండ్రితో వాదించి యతని యహంకృతిని నిరసించి మానవుని పరిమిత శక్తిని వివరించి పరధన వనితాపహరణములు పాపమని చెప్పి హరిభజనమేలని వర్ణించుట, తండ్రి కెదురాడ వలదని వారించెడి గురువునకు తండ్రి యెదుటనే వేదాంతబోధ చేయుట, తన్ను చంపుటకు తండ్రి స్వయముగా విషమిచ్చి గదాప్రహారములుచేయుట మున్నగునవి భాగవత కథకించుక భిన్నముగా వర్ణించిన విశేషములు. ఇక నృసింహస్వామి ఆవిర్భావము, హిరణ్యకశిపు వధ, నృసింహస్వామి శాంతించుటకు దేవతలు స్తుతిం చుట మొదలుగా గల చివరి సన్నివేశమెల్ల మిక్కిలి సంక్షిప్తముగా వర్ణితమైనది.

గజేంద్రమోక్షణ కథయు నొకటి నరవంతునకు కుదింపబడినదై చాలవరకు భాగవతములోని కథాక్రమమునే యనుసరించినది. ఐనను గజేంద్రుడు క్రీడించిన కాసారము, గజేంద్రుని జలక్రీడ మిక్కిలి రమ్యముగా వర్ణింపబడినవి. కరిని బట్టిన మకరము భీకరరూపము, కరి మకరముల భీషణ సమరము అత్యంత స్వాంతా వర్జకముగా కన్నులకు గట్టినట్లు నిస్తులముగా వర్ణింపబడినది. గజేంద్రుని మొర భాగవతమునందు వలెనే గ్రావములు కరగురీతిగా వర్ణితమైనది. ఇందలి గజేంద్రుడు కుయ్యిడుచు సరోవరవిరాజితమగు నొక పద్మమును హస్తమున గీలించి

"ఆపద గడద(గనీవిరి! నీపద పూజల నొనర్ప నిలిచినదిఁక నీ
పీహూవు తావి సని రుచి। లోపింపక మున్నెరమ్ము లోకాధారా।...."[1]

అని ప్రార్థించిన విషయము క్రొత్తగా నున్నది.

ఇక పదవ వంతునకు కుదింపబడిన కృష్ణ చరిత్రములో చాల వరకు సన్ని వేశములు సంక్షేపింపబడుటయే కాక కొన్ని యంశములు రేఖా మాత్రముగా తడవ బడి మరి కొన్ని విడువబడియున్నవి. మరియును కొన్ని సన్నివేశము లధనముగా

1. పోతన చరిత్రము : 12-64

వర్ణింపబడినవి. కొన్ని వేరువిధముగా నున్నవి. యశోద బాలెంత, జాతకర్మోత్స వము తెలుగునాటి అచ్చమైన ఆచారములతో వర్ణించుట జరిగినది.

"పసుపు నలుంగుతోఁ బస గుల్కు నగుమోము
బంగారు దివ్వె వెలుంగఁ జేయు....
పాలచేఁపుల దడిసెడి పైఁట కొంగు వలుఁద నడికట్టునిడి చేఁదవైచి నూత
సున్నపుంబూఁత శోభిలుచున్న కలశమందు
నీరూనివచ్చు నా నందసతిని."[1]

"అరసి వదినె వరుస యగువారు ముందేగి దడిని గట్టినటులు దారినిల్చి
చేరనీము మగనిపేరు చెప్పుటవినా లోనికనిరి నగుచుఁ జానతోడ.... "[2].

ఇత్యాదిగా చెప్పబడినవి పైదానికి తార్కాణ.

భాగవతమున కడునిడివిగా వర్ణింపబడిన పూతనాది రాక్షసుల వధముల నొక్క పద్యమున ప్రస్తావనగా పేర్కొనుట జరిగినది. అట్లే గోవర్ధనోద్ధరణము, కాళియ మర్దనము మొదలగు మహామహిమాన్విత చేష్టలును రేఖా మాత్రముగా ప్రస్తావింపబడినవి.

గోపికలు యశోదతో చెప్పికొన్న బాలగోపాలుని ధూర్తచేష్టలు భాగవతము లోని వానికంటె చమత్కారముగా వర్ణింపబడినవి. మరియు నింద నిందకోర్వక నందసతి నందనుని మందలించగా గడుసుగా సమాధానములు ఇచ్చినట్లు దిగువ రీతిగా వర్ణింపబడినది.

''గోపాల ! యీబేల కొంగు లాగితెయన నాబంతి నట దాచినది యనియెను
శ్రీకృష్ణ ! యీామె నాశ్లేషించితే యనఁ బాము పామన భయం పడితిననియె
మరళీధరా ! దీని ముద్దు గొంటివె యన ముద్దున కొక వెన్నముద్దనునవె
గోవింద! యీలేమ నీవి విప్పితె యన ముడిదాఁచె నెదొయని విడిచితిననె."[3]

మరియు యశోద కొడుకు దుడుకుపనులు చేసి నిందలపాలు చేయనేల యని వగచు చుండ నామెకు దివ్యదృష్టికలిగి కృష్ణుని నడవడి యెల్ల తత్త్వగర్భితమై తోచినట్లు విపులముగా వర్ణించుట మిక్కిలి విశిష్టముగా నున్నది.

1. పోతన చరిత్రము : 12-102
2. ,, : 12-103
3. ,, ; 12-151.

"గోపిక లెల్లరున్ నయన గోచరులైన మునీంద్రులైరి యా
రోపిత వల్లవీ సురత రూపము జీవసమాధి సౌఖ్య సం
దీపకమయ్యె జీర విడదీయుట లాత్మల జన్మ ముక్తికిన్
ప్రాపకమై కనంబడియె భామిని నొందిన దివ్యదృష్టిచేన్"[1].

ఇత్యాదిగా కృష్ణుని చిలిపిచేష్టలు భగవల్లీలలగా వర్ణింపబడినవి. చివరిదగు కంస వధ మిక్కిలి సంగ్రహముగా వర్ణింపబడినది. ఇక కృష్ణుని మృద్భక్షణము, నోటిలో బ్రహ్మాండములు చూపుట మున్నగునవి ఎక్కువ భేదములేకుండ వర్ణింప బడినవి ఈ విధముగా కృష్ణ చరిత్రము వస్తు శిల్పములో అనల్ప వైశిష్ట్యము నొంది యలరించుచున్నది.

సమవిస్తృతితో వ్రాయబడిన రుక్మిణీ కళ్యాణ కథ చాలవరకు భాగవతము లోని కథాక్రమము ననుసరించియున్నను కొంత విశేషము గోచరించును. రుక్మిణీ బాల్య క్రీడలు యౌవనోద్గమ మీషన్నవ్యముగా వర్ణింపబడినవి. ఇందు 'కీర సందేశము' అను నూతన ఘట్ట మొకటి కల్పింపబడినది. ఇది యిరువది పద్య గద్యములలో (231-250) సుదీర్ఘముగా నభివర్ణితమైనది. రుక్మి తనను శిశుపాలుని కిచ్చి వివాహముచేయు తలంపుతో నుండగా రుక్మిణి వగచి తన పెంపుడు చిలుకకు బుద్ధులుచెప్పి కృష్ణుని వద్దకు పంపును. చిలుక పోయి కృష్ణుని సందర్శించి రుక్మిణీ సందేశమును, ఆమె రూపగుణాదులను వర్ణించి చెప్పి యతని యామోదము గ్రహించి వచ్చి రుక్మిణికి ఆత్మానందముగా చెప్పును. తర్వాత కొన్ని నెలలకు లగ్న నిశ్చయమై వివాహ సన్నాహములు జరుగుచున్నప్పుడాందోళన చెంది అగ్ని ద్యోతనుడను సద్బ్రాహ్మణుని కృష్ణునికడకు తన సందేశమందింప పంపిన విష యము భాగవతములో వలెనే యున్నది. కాగా నవ్య కల్పనయగు కీరసందేశ ప్రయోజనము విచారింపవలసియున్నది అతిథిజనుల వలన విని రుక్మిణీ కృష్ణులు పరస్పరానురాగము పెంచుకొని పెండ్లాడవలెనను కాంక్షతో నుండిరి. కాగా తమ వివాహమునకు ప్రతిబంధకముగా పరిణమించుచున్న రుక్మి దుష్టప్రయత్నము కృష్ణుని కెరిగించి యతడు బద్ధానురాగుడైయుండి తనకు శిశుపాలుని వలని ముప్పు తొలగించి చేపట్టుటకు సంసిద్ధుడై యుండవలయునన్న దూరదృష్టితో ముందు జాగ రూక చర్యగా కీరసందేశము రుక్మిణి పంపినదని తలంపవచ్చును. ఇట్టి కల్పన సమంజసమై యొప్పారు చున్నది.

1. పోతన చరిత్రము ; 12-165.

పిమ్మట బ్రాహ్మణునితో సందేశమంపి లగ్నము సమీపించుటచేత పొందిన విరహాందోళన భాగవతరీతిలోనున్నది. అగ్నిద్యోతనుడు వెళ్లినప్పటి కృష్ణుని యంతఃపుర వైభవము పోతన చరిత్రమున దివ్యముగా వర్ణింపబడినది. చివరిదగు రుక్మిణీహరణము, రుక్మిపరాభవము భాగవతమున పాతికపైచిలుకు పద్యగద్యములలో సాగగా పోతన చరిత్రమున నైదారు పద్యములలో చాల సంక్షిప్తముగా క్లుప్తమైయున్నది. ఆలిని పోగొట్టుకొన్నట్లు అకలిపోవు శిశుపాలుని జరాసంధాదులోదార్చిన వైనము, కృష్ణుడు రుక్మిని చంపక విరూపుంజేయగా దుఃఖించు రుక్మిణిని బలభద్రుండూరార్చిన యుదంతము నిందు విడువబడినవి ఈ విధముగా పోతన చరిత్రమున భాగవత కథలు వస్తుస్వరూప కథా కథనములందు భాగవతమునందలి కథల తీరు ననుసరించుచునే కొన్ని యెడల విశేషముగా విభిన్నముగా నుండి అల్పమైన మార్పులతో చేర్పులతో నింపైన కూర్పులతో సంగ్రహభాగవతమై చవులూరించుచున్నవి.

## భావ సంపద :

కావ్యము నందలి యీ భాగవతకథలలోని భావసంపద పోతనగారి భాగవత కథల భావసంపదకెందును తీసిపోకపోవుటయేకాక కొన్ని యెడల మెరుగుగా గాన వచ్చు ననుటలో నతిశయోక్తి లేదు. ఇది ప్రబంధమగుటచేత నిందలి రచన ఆలంకారికమై చమత్కార భావబంధురమై యున్నది. కావ్యమునందలి భావసంపద్వైభవము గూర్చి 'భావసంపద' వ్యాసమున విపులముగా చర్చింపబడినది. మరియు 'ఆలంకారికత'లో గూడ వివరింపబడినది. ఐనను నిచట కొంత వ్రాయుదును.

శ్రీరాముడు సీతాలక్ష్మణులు వెంటరాగా వనమునకేగినప్పటి విషయమిటుల వర్ణింపబడినది.

> "ప్రసవపుమైత్రి వృంత మెడఁబాయఁగఁజాలని లీల లక్ష్మణుం
> డెసఁగుచు రామువెంట వనికేఁగెను సీతయుఁ బూచుపూవులోఁ
> బొసగు పరిమళమ్మటుల పోయెను రాఘవు వెంటనంటి యీ
> కుసుమము భృంగసంగతిని గోరని చంపకమయ్యె నవ్వనిన్"[1].

ఇక్కడ రాముని వెంట లక్ష్మణుడు సీత ఎట్టివారై వనములకు పోయిరో రాముడెట్టివాడో రూపకానుప్రాణితోపమలో రుచిరముగా చెప్పబడినవి. రాముడొక పుష్పము.

1. పోతన చరిత్రము : 11-23

పువ్వునకంటుకొని యున్న తొడిమ దానిని విడిచి యుండలేని రీతిగా లక్ష్మణుడు రామునివెంట పోయెననుటచేత నతడు రాముని విడిచి యుండలేడనియు తొడిమ పువ్వునకు కాపైనట్లు తాను రామునికితోడుగా ఉండగలడనియు, వికసించుపూవులో శోభిల్లు తావివలె సీత పోయెననుటలో పుష్పసుగంధముల కవినాభావ సంబంధ ముండునట్లొకరిని విడిచి మరొకరు జీవింపజాలరనియు రాముడున్నచోటనే సీత యుండగలదనియు రాముని హృదయామోదము సీతయేయనియు రమ్యభావమిందు విందొనగుచున్నది. కాగా రాముడు మరేపుష్పమోకాక భృంగసంగతిని గోరని చంపకమనుటలో తన హృదయ మింకెవ్వరికిని అర్పించని ఏకపత్నీవ్రతుడని చెప్పినట్లయినది. ఈ విధముగా సీతా రామ లక్ష్మణుల గుణ శీలములను, వారి స్నేహానురాగములను విశద మొనర్చుట కుత్కృష్టభావమును వెలార్చినారాచార్యుల వారు. ఇట్టి గొప్ప భావములకు పద్యములెల్ల తార్కాణములే యగును. వస్తు సంవిధానములో వివరించిన రీతిగా సన్నివేశకల్పనలో భిన్నత నవ్యతగల పట్టులందెల్ల నిట్టి భావసంపద నవ్యమై ప్రత్యేకమై విశిష్టమై వెలయుచున్నది. కావున నింకను వివరింపక ఆయా తుల్య సన్నివేశములలో భాగవతములోని భావములకు సమస్థాయిలో గల పోతనచరిత్రములోని భావములను దెల్పుట కొరకు కొన్ని ఉదాహరణము లిత్తును.

"సంవాదిన్యో మేధావినాం బుద్ధయః" అన్నట్లు ప్రతిభావంతుల బుద్ధులు కావ్య రచనములో నొకదానితో నొకటి పోలియుండుట కవకాశము కలదు. భాగవత కథల రచనలో పోతనగారికి అభినవ పోతనగారికి సంవదించుచున్న భావము లిచట పేర్కొనబడును. ఇందు ''దేహాంతరతుల్య సంవాదము, ఆలేఖ్యాకార సంవాదము, ప్రతిబింబాకార సంవాదము" అను త్రివిధ సంవాదములును గోచరించును. వానిని చర్చించుటకు ముందు సంవాద భేదములను సంగ్రహముగా వివరింతును.

## సంవాద భేదములు :

అన్యకవుల కావ్యములతో సంవాదము-పోలిక-త్రివిధములుగా నుండునని ఆనందవర్ధనాచార్యు డిట్లు వివరించెను.

''సంవాదాస్తు భవంత్యేవ బాహుల్యేన సుమేధసామ్।
నైకరూపతయా సర్వే తే మంతవ్యా విపశ్చితా॥

సంవాదోహ్యన్య సాదృశ్యం తత్పునః ప్రతిబింబవత్।
ఆలేఖ్యాకారవత్తుల్య దేహివచ్చ శరీరిణామ్॥
తత్రపూర్వ మనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరమ్।
తృతీయంతు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః॥
అత్మనోఽన్యస్య సద్భావే పూర్వస్థిత్యనుయాయ్యపి।
వస్తుభాతితరాం తన్వ్యాశ్శశిచ్ఛాయ మివాననమ్॥.... [1]

అనగా కావ్యసంవాదము లనేక విధములుగా ఉండును. సంవాదమనగా అన్య సాదృశ్యము. ఇది ప్రతిబింబాకార సంవాదము, ఆలేఖ్యాకార సంవాదము, దేహాంతరతుల్య సంవాదమని మూడు విధములు. ఇందు మొదటిది బింబమువలన నేర్పడు ప్రతిబింబము కావున దానిలో ఆత్మ శరీరములు రెండును ఉండవు. రెండవది చిత్తరువు వలె పోలినది కావున నందు ఆత్మ యుండదు. శరీరము మాత్రముండును. మూడవది ఒక దేహము మరొక దేహమును పోలియుండునట్టిది కావున దానిలో ఆత్మ శరీరములు రెండును ఉండును. ఈ మూడిటిలో నుత్తరోత్తరము 'శ్రేష్ఠతరము' అని దీని భావము. ఈ విషయమును కొంత విశదీకరింతును.

## 1. ప్రతిబింబాకార సంవాదము :

బింబమునువలె ప్రతిబింబమును తయారుచేయుట ప్రతిబింబాకార సంవాదము. ఒక కావ్యము నందలి పద్యము నచ్చుముగా మరొక కావ్యమున వ్రాయుట 'కాపి' చేయుట యన్నమాట. ఈ సంవాదము తుచ్ఛమైనది. సుకవులు దీని జోలికి పోరాదు.

## 2. ఆలేఖ్యాకార సంవాదము :

ఒక చిత్తరువు పోలిక మరొక చిత్తరువున్నట్లు ఒక కావ్యవస్తువు వర్ణనలో భావములో పద్యపుటెత్తుగడలో నడకలో పోలిక గలిగి మరొక కావ్య వస్తువు రచింపబడినచో నది ఆలేఖ్యాకార సంవాద మనబడును. ఇది మధ్యమమైనది. ఇట్టిదొకింత కవులు పాటింపవచ్చును.

1. ధ్వన్యాలోకము : చతుర్థోద్యోతము, 11 నుండి 14 శ్లోకములు.

## 3. దేహాంతరతుల్య సంవాదము :

ఒక దేహము మరొక దేహమును పోలియున్న చందమున వస్తువునందుగాని సన్నివేశమునందుగాని భావమునందుగాని పోలిక కనబడినను తన ప్రత్యేకతను కోల్పోక స్వతంత్రముగా నిసర్గరమణీయముగా భాసిల్లునట్లు రచించిన కావ్యము దేహాంతరతుల్య సంవాదము కలది యగును. ఇందు పరానుకరణము మిక్కిలి తక్కువగా నుండును. ఇది ఉత్తమమైనది. దీనిని సత్కవులు సంభావింపవచ్చును.

ఈ మూడు విధములైన యనుసరణములు కావ్యముల యందు శబ్దవిషయకముగ, భావ విషయకముగ, రచనా విషయకముగ కానవచ్చును. పూర్వకవుల కావ్యముల నుండి శబ్ద భావాదులను గ్రహించినచో తమ కావ్యములకు గౌరవ మబ్బునను సదుద్దేశము తోడను కవులు పూర్వ కవ్యనుసరణములు కావించుచుందురు. ఈ విషయము పిడుపర్తి సోమనాథుని బసవపురాణ కావ్య పీఠికలోని దిగువ పద్యము వలన తెలియును.

> "విరచించె జైమిని వేదపాదస్తవం బొక పాదమునను వేదోక్తి నిలిపి
> హరభక్తి వైదికంబని శ్రుతులిడి చెప్పెఁ బ్రతిభ సోమేశుఁడారాధ్యచరిత
> సరవి శ్రీనాథుఁడా చరిత పద్యప్రబంధముచేసె ద్విపదలు తఱచు నిలిపి
> యాతఁడు పద్యకావ్యము చేసె నైషధం బంచిత హర్ష వాక్యములఁ బెట్టి
> సోమగురు వాక్యములఁ బెట్టి భీమసుకవి గరిమ బసవ పురాణంబు గణనఁ
> జేసెఁ
> గానఁ బూర్వకావ్యము చేరుగతి రచించు వారికాది కావ్యోక్తులు
> వచ్చి నెగడు"

ఈ మాటల వలన పూర్వకావ్య సంప్రదాయము ననుసరించుచు తమ కావ్యములందాది కావ్యోక్తులుండుట గౌరవ ప్రదమన్న భావనతో వానికి చేరువగా తమ రచనలు చేయుట కవులలో కానవచ్చును.

ఎంతటి ప్రతిభావంతులగు మహాకవులైనను పూర్వ మహాకవులచేత ప్రభావితులై కొంతకు గొంత వారి ననుసరించుట జరుగుచుండునని మొదట మనవి చేసితిని. ఈ యనుసరణము పైనతెలిపిన త్రివిధ సంవాదములలో తృతీయ మగు దేహాంతరతుల్య సంవాదము వరిష్ఠమగుటచేత మహాకవులు దానినొకింత పాటింతురు. రెండవదియు కొంత రావచ్చును. కాని ప్రతిభాహీనులగు అల్పకవులు

మూడవ దానిని బాహాటముగా నాశ్రయింతురు. ఇట్టి వారి గూర్చియే 'అర్థపుందెఱ వాటుల్ తెగికొట్టువా'రని పెద్దన, 'పరార్థపంచనలచే దీపించువా'రని రామరాజ భూషణుడు కుకవినింద గావించి యుండిరి. 'కవి రనుహరతిచ్ఛాయాం, అర్థం కుకవిః' అని రాజశేఖరుడన్నమాట సుకవులు అన్యకవుల కవితారీతుల ననుసరింపగా కుకవులు భావములనే హరింతురని పై విషయమును బలపరచుచున్నది.

## కావ్యమున దేహాంతర తుల్యసంవాద రచన:

పోతన చరిత్రములోని భాగవత కథలు శ్రీ మహాభాగవతములోని కథల తీరు ననుసరించి వ్రాయబడుటచేత దేహాంతర తుల్య సంవాదము గోచరించు చున్నది.

శ్రీరామ చరిత్రమున భాగవతమున శ్రీరాముడు సేతుబంధనార్థము సముద్రుని దారియిమ్మని, ఈయకున్న క్రుద్ధుడై ధనువెక్కిడినంత సముద్రుడు లొంగిన సన్నివేశము తొమ్మిది పద్యగద్యములలో వర్ణితముకాగా పోతన చరిత్రమున ఆరు పద్యగద్యములలో చెప్పబడినది. ఈ పట్టున భాగవతమున,

"ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధ రత్నాగారమున్ మీనకుం
భీరగ్రాహ కఠోరమున్ విపుల గంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్య విభిన్న భంగ భవ నిర్ఘోషచ్ఛటాంభః కణ
ప్రోద్ధాంబర పారమున్ లవణ పారావారమున్ జేరువన్...." [1]

"కని, తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన, నదిఁయు మార్గంబు సూపక
మిన్నందిన, నా రాచపట్టి రెట్టించిన కోపంబున" [2]

"మెల్లని నగవున నయనము లల్లార్చి శరంబు విల్లునందిన మాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్" [3]

అని యిత్యాదిగా నుండగా పోతన చరిత్రమున,

"వానరబలమును గొనిచని తానంబుధిఁ జేరఁబోయి దాశరథి విన
మ్రాననుఁడై రత్నాకరు దానవపురిఁ జేరుకొనఁ బథమ్మిమ్మనియెన్" [4]

1. శ్రీ మహాభాగవతము : నవమస్కంధము-278
2. ,, ,, 279
3. ,, ,, 280
4. పోతన చరిత్రము 11-69

"నాయుష్షు దిని జీవనము నిల్పు లోకమ్ము విశ్వపాలకుఁడనై వెలయుదునని
నా యప్పులను గొని నడయాడు ఘనవృత్తి ఘనులకున్ ఘనుఁడనై
మనియెదనని
మా పుత్రిక నాసంగ మహినేలు విష్ణుండు ఎంతొ బైచేయినై యెసఁగుదునని
అమృతభిక్షల నిచ్చి యలరింతు నమరాళి దేవతారాధ్య ప్రభావుఁడనని
అంతు తెలియంగనీని యనంతుఁడనని నెత్తిపై నోరు నిడుకొని మొత్తు
కొనుచు
మిన్నుముట్టు గర్వమ్మున మిడిసి పడుచు నెగసిపడు మహోదధిఁ గాంచి
యినకులపతి"[1]

"ఆననరాగరేఖఁ బ్రళయాగ్ని శిఖాకృతి మోసులెత్తఁగాఁ
బూనిచె మేల్శరమ్ము జలపూర్ణనవాంబుద సంగతప్రభా
స్థాన తటిల్లతాభమయి సాగు ధనుర్గుణమందు లోకసం
తానము కంపమంద సురదైత్యవరుల్ బెగడొంద రాముడున్"[2]
"ధనువుఁ దాల్చుట జలనిధి తనువుదాల్చె గుణము గూర్ప నొకించుక
గుణము వచ్చె
శరము నుంచుట నుదధిలో శరములింకె జడధి రత్నాకరుండేని
జడధిగాఁడె"[3]

అని మున్నగు రీతిగా వర్ణింపబడినది. ఇక్కడ భాగవతమున జలచరములచేత భయంకరమై ఆకాశమునకెగయుచున్న కెరటాలతో త్రుళ్లిపడుచున్న సముద్రము కనులకు గట్టినట్లు స్వభావోక్తిలో సహజ రమణీయముగా వర్ణింపబడినది. ఆ సముద్రమాటోపమున నద్వమీయనందున కోపము హెచ్చి ధనుర్బాణము లందుకొన్నంత మాత్రమున నీరింకి సముద్రము బీడైనట్లు చెప్పబడినది. పోతన చరిత్రమున సముద్ర స్వరూపము వర్ణింపబడక యది యెందు కహంకరించి కన్ను గానక యెగిరి పడుచున్నదో కావ్యలింగాలంకారమున కమనీయముగా వర్ణింపబడినది. దాని యహంకార ప్రబల హేతువులు చక్కగా వక్కాణింపబడినవి. మరియునది విన్నపము లెక్కచేయక పోవుటయే కాక నిక్కి నీల్గుచున్నందులకు

1. పోతన చరిత్రము : 11-70
2. ,, : 11-71
3. ,, : 11-72

చెలరేగిన రాముని రౌద్రము, అతడు విల్లంబులు దాల్చగనే యది భయపడి లొంగి వచ్చిన విషయము రమణీయముగా చెప్పబడినవి. ఇట్లిక్కడ సన్నివేశ ప్రకరణము ననే పోలికగాని భావము లందును తత్ప్రకటన యందును పోలికలేక ఆచార్యుల వారు స్వతంత్ర ప్రత్యేకత వెలార్చి సహజ రామణీయక మొప్ప వర్ణించినారు.

ఇట్లే మోహిన్యవతార కథలో మోహినీ విలాసములు భాగవతమున సంక్షేపముగా చెప్పబడగా పోతన చరిత్రమున విపులముగా స్వతంత్ర భావములతో ప్రత్యేక కథా కథన రీతిలో రచింపబడి యున్నవి. మదియు వెన్న దొంగిలించిన కృష్ణుని వెంటబడి యశోద యతని బంధించిన ఘట్టము నందును కరి మకరముల యుద్ధము నందును ఇట్లే అనేకానేక ఘట్టము లందును దేహాంతర తుల్య సంవాదము గల భావ సంపద కొల్లలుగా లభింపగలదు.

## ఆలేఖ్యాకార సంవాద రచన :

పోతన చరిత్రములోని భాగవత కథలలో నందందు సకృత్తుగా ఆలేఖ్యాకార సంవాదము కానబడును. మచ్చునకు కొన్ని దిగువ చూపబడినవి.

రుక్మిణీ కళ్యాణ గాథలో రుక్మిణి బాల క్రీడల వర్ణన ఉభయ గ్రంథములలో ఆలేఖ్యాకారమున సంవదించుచున్నది.

"వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలల తోడ వియ్యంబులందు
గుజ్జన గూళ్లను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱయ
రమణీయ మందిరారామ దేశంబులఁ బువ్వుఁదీఁగెలకును బ్రోది సేయు
సదమల మణిమయ సౌధ భాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు
బాలికల తోడఁ జెలరేగి బంతులాడు శారికాకీర పంక్తికిఁ జదువు చెప్పు
బర్హి సంఘములకు మురిపములు గఱపు మద మరాళంబులకుఁ జూపు
మందగతులు"....[1]

"చిట్టికి జ్వరమేమి సేతు దుర్విధియని హస్తాగ్రమున ఫాలమంటి వగచు
చేయి చాటిడి సఖిచెవిలోన గోప్యమ్ము చెప్పు సమర్తాడె చిన్నదనుచు
నీడు వచ్చిన పిల్లనింట నెన్నాళ్లుంతు నని చెక్కిటన్ జేయి నునిచి గొణఁగు
నింత నల్లని బొట్టిఁ డిస్సియవ్వా! బిడ్డ నిడనని ముక్కుపై నిడునువ్రేలు

1. శ్రీ మహా భాగవతము : దశమ స్కంధము, పూర్వ భాగము-1687.

అతిగ సంసార మొనరించి యారితేతెఁ బెద్ద మానిసియన బొమ్మ పెండ్లి సేయుఁ

చిత్రగతుల గుజ్జెన గూళ్లు చిట్టుబెట్టి వండి వడ్డించు వియ్యాలవారిఁ బిల్చి"....[1]

ఈ రెండు పద్యము లందును భావము కొంత భిన్నమైనను భావ ప్రకటనలో పద్యపుబెత్తుగడలో నడకలో సామ్యము గలదు. ఇందలి భాగవత పద్యమున రుక్మిణి బాలికామణులు సాధారణముగా నాడు బాల్య క్రీడలాడినట్లు నిసర్గ రమ్యముగా వర్ణింపబడినవి. పోతన చరిత్రము నందలి రుక్మిణి 'అతిగ సంసార మొనరించి యారితేతె, పెద్దమానిసి' యన గడుసుగా వర్తించుచు ఆటలాడినది.

రుక్మిణి యౌవనోద్గమ వర్ణనయందును నిట్టి సంవాదము కలదు.

"దేవకీసుతు కోర్కె తీఁగెలు వీడంగ వెలఁదికి మైఁ దీగె వీడఁ దొణఁగెఁ
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁగాంతి నింతికి ముఖ కమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని వొడమాపఁ బొలఁతికి జనుదోయి పొడవు సూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె
హరికి ప్రేమబంధ మధికంబుగాఁ గేశబంధ మధికమగుచు బాల కమరెఁ
బద్మనయను వలనఁ బ్రమదంబు నిండార నెలఁత యౌవనంబు నిండి యుండె...."[2]

కృష్ణుపై నోలి వర్ధిష్ణువౌ మోహాంధకార పాశాకృతిఁ గచము పెరిఁగె
మురశిఖరునిపైనఁ బెరిఁగెకి యనురాగ గతిఁ గపోలముల రాగరుచి హెచ్చె
చక్రిపై నెద మరుల్ సరిక్రొత్తలవునన నూత్న వక్షోజ కాంతులు వెలిఁగె
ఫణిశాయిపై నున్న వలపు తీవలు ప్రాక నూఁగారు నల్లనై సాగిపోయె
హరిని గనని జీవితాశలు సన్నంబులయ్యెననుచు మధ్యమల్పమయ్యె
ఇభవరదుని పీడ నితర వస్త్వభిలాష మందమనఁగ నడలు మందమయ్యె....[3].

1. పోతన చరిత్రము : 12-219.
2. శ్రీ మహా భాగవతము : దశమ, పూర్వ 1689.
3. పోతన చరిత్రము : 12-224

ఇందు రుక్మిణీ యౌవనోదయ వర్ణనలో ఆలేఖ్యాకార సంవాదమున్నను నొక విశేషము కలదు. భాగవత పద్యమున కృష్ణునికి యౌవనోచిత కామవాంఛలధికము కాగా రుక్మిణి కంగాంగముగా పెరిగి యౌవనము నిండారెనని వర్ణింపబడగా పోతన చరిత్ర పద్యమున కృష్ణునిపై క్రమముగా వర్ధిల్లునట్టి మోహాంధకారమో యన రుక్మిణికి కొప్పు గొప్పదయ్యెనని యిత్యాదిగా చెప్పబడి యౌవనోదయమైనకొలది రుక్మిణికి కృష్ణునిపై ననురాగము గాఢమగుచు వచ్చెనని వర్ణించుట జరిగినది. భాగవతమున సహోక్తి వరలగా నిందు ఉత్ప్రేక్ష యొప్పుచున్నది. అంతేగాక పోతన చరిత్ర పద్యమున సాభిప్రాయ శబ్దములు సార్థకముగా ప్రయుక్తములై భావమును బంధురతర మొనర్చినవి. 'కృష్ణుపై' అనుటచేత నల్లనివాడని యర్థమై యుపమేయమగు కచము నల్లనిదగుటచేత మోహమను నంధకార పాశమో యనునట్లు కచము పెరిగెనని వర్ణించుట వలన కృష్ణుడు, మోహాంధకార పాశము, కచము మొత్తము నల్లనివై చక్కని సమన్వయము సమర్థనము సంతరించుకొన్నవి. అట్లే 'మురళీధరుడు' అనుటచేత మురళిపై రాగమాలపించువాడని ధ్వనించి అనురాగ గతి యనుటచేత ప్రేమయనియు, అనుసరించి యొప్పెడు సంగీతరాగ మనియు 'రాగరుచి' యనునది ఎఱ్ఱనికాంతి సంగీత రాగాభిరుచి యనియు నర్థములు శోభిల్లుచున్నవి. ఇట్లే తక్కిన పాదములందును నర్థములు గ్రాహ్యములు. ఈ విధముగా శబ్దార్థ చమత్కారముగల యీ పద్యభావము భాగవత పద్య భావమున కంటె మెరుగుగా నున్నదని చెప్పక తప్పదు.

ఇదే రీతిగా నరసింహావతార గాథలో భాగవతమున ప్రహ్లాదుడు

"కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే? పవనగుంభిత చర్మ భస్త్రి గాక"[1]. అన్న పద్యమునకు

"వైకుంఠుఁ బొగడని వక్త్రంబు ధక్కనా నిది దేవళమ్ములో నద మొనర్చు"[2]

అన్న పద్యము సంవదించుచునే భావముచేత విశిష్టమై యున్నది. ఈ పద్యము నందలి విశేషములు 'ధ్వని సౌరభము' వ్యాసమున వివరింపబడెను. ఇట్లే గజేంద్ర మోక్షణ కథలో

1. శ్రీ మహాభాగవతము : సప్తమస్కంధము-170.

2. పోతన చరిత్రము : 11-324

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె...." 8-90 అన్న భాగవత పద్యమునకు

"త్రాణ నశించె నా వశము దప్పెను దేహము, తావుదప్పె నా ప్రాణము.." (47) అను పోతన చరిత్ర పద్యమును,

"కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె....

పాలితాఖిల సుధాంధశ్చక్రమున్ జక్రమున్" (3-109) అన్న భాగవత పద్యమునకు

"పరమ దయాళువై మకరిఁ బట్టి వధింపఁగఁబంపె ..

ప్రభలీను చక్రమున్.... నైకకోటిభా

స్కర కిరణచ్ఛటాచ్ఛవి ధగద్ధగితాంబర చుంబి వక్రమున్" (12-80) అను పోతన చరిత్ర పద్యమును భావాదులలో సంవదించుచున్నది. ఇట్టివే మరి కొన్ని గోచరించును.

## ప్రతిబింబాకార సంవాద రచన :

కావ్యము నందలి భాగవత కథలలో మూడు పద్యములు శ్రీ మహా భాగవత పద్యములకు ప్రతిబింబాకార సంవాదముగా నున్నవి. భాగవతము నందలి సుప్రసిద్ధ పద్యములు మూడు యథాతథముగా అవే సందర్భములందు పోతన చరిత్రములో చేర్చుకొనుట జరిగినది. నరసింహావతార కథలోని

"ఇందుఁగలఁ డందులేఁడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం

డెందెందు వెదకి చూచిన నందందే కలఁడు దానవాగ్రణి! వింటే"[1].

అను పద్యము పోతన చరిత్రమున నదే కథా సందర్భమునందు (11-357) ఉపయోగింపబడినది. ఇట్లే గజేంద్ర మోక్షణ కథలోని

"అల వైకుంఠపురంబులో.... "[2] అను పద్యము 12 ఆ 69 పద్యమునను

"సిరికిం జెప్పడు.... "[3] అను పద్యము 12 ఆ. 70 పద్యమునను పోతన చరిత్రమున వాడబడినవి. కాగా ఇది గ్రంథచౌర్యము కాదు. ఆచార్యులవారు మహా

1. శ్రీ మహాభాగవతము : 7-275.
2. ,, : 8-95
3. శ్రీ మహాభాగవతము : 8-96

ప్రసిద్ధములైన ఈ భాగవత పద్యములను పోతన భాగవతము నందలి భక్తి గౌరవములచేత బాహాటముగా గ్రహించి తమ కావ్యమున పొందుపరచి ఈ పద్యములకు ఉద్ధృతవచన సూచక బిందుకల్పములు (Inverted commas) చిహ్నములుగా పెట్టినారు. కావున ఈ పద్య సంగ్రహణము కావ్యమునకు భూషణమే కాని దూషణము మాత్రము కాదు.

కావ్యము నందలి భాగవత కథలలో నందందు అరుదుగా గాననగు ఆలేఖ్యాకార సంవాదము, ప్రతిబింబాకార సంవాదము పోతనగారి రచన యెడ ఆచార్యుల వారికి గౌరవాభిమానము లుండుటవల్లనే యొప్పినవి కాని శక్తి చాలక గుప్పినవి కావు. ఇవితప్ప భాగవత కథల యందెల్ల యెడల రచనలో స్వతంత్రత, ప్రత్యేకత, విశిష్టత యొప్పారుచున్నవి.

## రచన :

వస్తు భావ రచనలలో మూడవదగు రచన గూర్చి యొకింత చెప్పి దీనిని ముగింతును. ఇక్కడ రచనలో భాషా ప్రయోగము శైలి చర్చనీయములు. ఈ విషయము సవిస్తరముగా 'భాషా వైచిత్రి' వ్యాసములో వివరింపబడెను. ఐనను నిచట ప్రస్తావనగా పేర్కొందును.

పోతన తన భాగవత రచన గూర్చి,

"కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱికి గుణములగు నే
నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్....[1]

అని తెలిపి అదే విధముగా రచన సాగించెను. అతని శైలి సమ సంస్కృతాంధ్ర శబ్ద విలసితమై ప్రసాద మాధుర్య గుణధుర్యమై అంత్యానుప్రాస విన్యాసములలో వైదర్భీ రీతిని ద్రాక్షాపాకరుచుల పండిత పామరులకు చవులూరించుచుండును. ఇట్లు సర్వజనామోదకరముగా నుత్కృష్టముగా భాగవత మాంధ్రీకరించి ఇంక

1. శ్రీ మహాభాగవతము : ప్రథమ స్కంధము - 18

మరొకరు తెలుగున వ్రాయవలసిన అవసరము లేకుండ చేసెను. ఇది ఇట్లుండ వరదాచార్యులవారు రచనా ప్రణాళిక ననుసరించి ప్రకరణ వశమున తామును భాగవత కథలు వ్రాయవలసి వచ్చెను. సుప్రసిద్ధమై పోతన భాగవత మొప్పియుండ మరల తమ రచన మెప్పుగాంచుటకు వారు చాలవరకు పోతన శైలినే యుపయోగించిరి. పోతనవలెనే ఆచార్యులవారు సమ సంస్కృతాంధ్ర శబ్ద ప్రయోగము కావించి ప్రసాద మాధుర్యాది గుణశోభిత మొనర్చి పోతనయంత ప్రచురణగా కాకున్నను అంత్యానుప్రాస మెక్కువగా నలంకరించి పోతన శైలికెందును తీసిపోని శైలి వెలయింప చేసిరి. సకల జనాదరము గాంచుటకు పోతన శైలిననుకరించినను ఆచార్యులవారు తమదైన యొక ప్రత్యేకతను ముద్రను శైలిలో కనబరచి రచన సాగించినారు. ఈ విషయ నిరూపణకు ఈ వ్యాసమునందలి వస్తుభావముల చర్చయే కాక "భాషావైచిత్రి" వ్యాసచర్చ చాలియున్నది.

ఉభయ శైలుల సాదృశ్యమిట్లుండ పోతనగారిది ప్రధానముగా వైదర్భీ రీతియైనను పురాణము కావున పాంచాలీ రీతిలోను రచన సాగి కావ్యశైలి చెలువొందుచున్నది. పోతన చరిత్రమున, అది ప్రబంధము కావున ప్రాబంధిక శైలి ఆలంకారికమై ప్రౌఢమై భాసిల్లుచున్నది. అనుబంధ భాగవత కథల రచనా శైలి భిన్నము కాక మొత్తము పోతన చరిత్ర కావ్యము నందలి శైలియై యున్నది. కాగా భాగవత కథలు సంగ్రహముగా రచించుటలో చక్కగా చిక్కగా విలసిల్లుటకు శబ్దార్థ భావ చమత్కారములను మెరుపులవలె తురగలింపజేయుచు రసోదంచితముగా భాగవతము నాడింపవలసి వచ్చినది. అది మిక్కిలి రక్తిగట్టి చరితార్థమైన దనుటలో సందేహము లేదు.

డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి గారు ఈ భాగవత కథల గూర్చి వ్రాయుచు,

"....ఈ పోతన చరిత్రమంతయు మొదటి పది యాశ్వాసములవరకు వ్రాయుట యొక యెత్తు తుది రెండాశ్వాసములను వ్రాయుట అది యింకొక యెత్తు...."

"మూలభాగవత కథాంశములను పోతన్న గారు నాల్గురెట్లుగా పెంచి వ్రాసిరి. ఆంధ్ర భాగవత కథాంశములను ఆచార్యులవారు నాలుగవ వంతునకు తగ్గించి

వ్రాసిరి. పోతన్నగారు పెంచిన దానిలోను ఆచార్యులవారు తగ్గించిన దానిలోను ఒక సాధారణ లక్షణము కనిపించుచున్నది. అది భక్త్యతిశయముతో గూడిన అనవద్య కవిత్వ విద్యా చాతుర్యము. శ్రీమాన్ వరదాచార్యులవారి తాదృశమైన చాతుర్య లక్షణము కలిమివల్లనే పోతన చరిత్రము నందలి భాగవతము రక్తిగట్టు చున్నది. ఇట్లింతటి నేర్పరితనముతో నది నిర్వహింపబడినది.''[1]

శాస్త్రిగారన్నట్లు ఈ భాగవత కథల రచనము "భక్త్యతిశయముతో గూడిన అనవద్య కవిత్వ విద్యాచాతుర్యము" గలవారై ఆచార్యులవారు ప్రశస్తముగా చేసినందువల్ల తక్కిన కావ్యమొక యెత్తు ఈ రచన యొక యెత్తుగా విరాజిల్లు చున్నదనుట యుక్తము.



1. 'అభినవ పోతన' (షష్టిపూర్తి సన్మాన సంచిక) 'పోతన చరిత్రమున భాగవతము' పుటలు 87, 90.

# కవితా తత్త్వము

సాహిత్య జగత్తును పరిశీలించి చూచినచో ఒక్కొక్క కావ్య మొక్కొక్క పద్ధతిలో రచింపబడి యున్నట్లు గోచరించును. ఆ కావ్యములలో కొంత సామ్యము గోచరించినను రచనా విధానములో భిన్నములై తమ ప్రత్యేకతను విశిష్టతను వెలార్చుచుండును. "ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్...." అనియు "అల్లసానివాని యల్లిక జిగిబిగి" "ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు...." అనియు నిత్యాదిగా నేర్పబడినవి ఆయా కవుల కవితాతత్త్వమునే పేర్కొనుచున్నవి. ఈ భిన్నత్వమునకు మూల మాయా కావ్యముల యందలి కవితా తత్త్వము. ఇది కావ్య శరీరమున కాత్మభూతమైనది. ఒకడు తన మానసిక స్వభావాను సారముగా ప్రవర్తించు నట్లొక కావ్య మీ కవితా తత్త్వము ననుసరించి నిర్మాణమై నెగడుచుండును. పోతన చరిత్రమున వస్తు రస ధ్వన్యాద్యనేక కావ్యాంగములను పరిశీలించిన తరువాత వీని యన్నిటికి మూలమైన కవితా తత్త్వ మీ కావ్యమున నెట్లు భాసిల్లుచున్నదో యనుశీలన కావింపవలసి యున్నది.

## కవితాతత్త్వ విచారము :

ఒక కావ్యము నందలి కవితా స్వభావమే కవితాతత్త్వమనబడును. కావ్యము నందలి కవితా రీతుల వలన గ్రహింపదగిన యాథార్థ్యమే కవితాతత్త్వ మగును. కావ్య రచన ముఖ్యోద్దేశము, ఆ రచన లోని కవితా గుణములు, కల్పన శిల్పముల లోని వైఖరులు, రస భావ వర్ణనాదులలోని తీరు తెన్నులు, శబ్దార్థా లంకార కలితమైన శైలీ విన్యాసము-ఈ యన్నిటి వలన తెలియనగు కావ్య స్వరూప స్వభావముల యాంతర్యమే కవితాతత్త్వముగా విభాసిల్లుచుండును. ఒకానొక కవితాతత్త్వము చేత కావ్యరచన సాగునట్లే కావ్య రచనా పరిశీలనచేత ఆ కవితాతత్త్వము గ్రహించుటకు వీలగుచుండును. అనగా కవితాతత్త్వము బీజము, కావ్యము వృక్షము. కవితాతత్త్వము జీవుని స్వభావమైనచో కావ్యరచన ఆ జీవుని శరీరము, అతని వృత్తమగును.

ఒక కావ్యమున ఒక కవితాతత్త్వము రూపొందుటకు మూడు ముఖ్య కారణములుండును. 1. కవి చిత్తవృత్తి : రచనాశయములు 2. వస్తు స్వభావము 3. సమకాలీన సాంఘిక సాహిత్యాది స్థితిగతుల ప్రభావము. వీనిని కొంత విపులముగా చర్చింతును.

## 1. కవి చిత్తవృత్తి : రచనాశయములు :

కావ్యమున నొక ప్రత్యేక కవితాతత్త్వ మేర్పడుటకు ప్రథమగణ్య హేతువు కవి చిత్తవృత్తి. కవి తన యభిరుచుల ననుసరించి యొక వస్తువు నెన్నుకొనుటయు కావ్యరచన చేయుటయు జరుగును. ఈ విషయము ఆనంద వర్ధనుని సుప్రసిద్ధ శ్లోకములు చక్కగా వివరించుచున్నవి.

"అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీచేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవ తత్
భావా నచేతనా నపి చేతనవచ్చేతనా నచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా"[1]

అనగా అపారమైన కావ్య జగమునకు కవియే బ్రహ్మ. అతడు తన ఇష్టాను సారముగా కావ్యలోకమును మార్చును. అతడు శృంగారి యగుచో కావ్యమును శృంగారమయ మొనర్చును. విరాగి యగుచో కావ్యము నీరసమగును. అచేతన వస్తువులను చేతన వస్తువులుగా చేతన వస్తువుల నచేతన వస్తువులుగా నొన రించుటకు స్వతంత్రతతో వ్యవహరించును. ఈ వివరణ ననుసరించి కవి యెట్టి వాడో కావ్యము నట్టిదై వెలయగలదు. కవితా విషయమొక కవికి ఏవిధమైన అభిరుచులు సిద్ధాంత విశ్వాసములు దృక్పథము కలవో యా విధమైన వస్తువే సంగ్రహింపబడి యదే రీతిలో రచన సాగును. కవిజీవిత చరిత్రములెల్ల ఈ విషయమునే నిరూపించుచున్నవి. సర్వాదర్శ ధర్మమూర్తిగా పురుషోత్త ముడుగా శ్రీరాముని చిత్రించుచు వాల్మీకి రామాయణము రచింపగా భక్తుడగు తులసీదాసు తన భక్తి ప్రపత్తుల కనుగుణముగా శ్రీరాముని పరంధామునిగా

1. ధ్వన్యాలోక వృత్తి : 497-499

చిత్రించుచు రామాయణమును భక్తి మయముగా సంతరించెను. కవిత్రయము వారు, పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన, వేమన మొదలగు సుకవీంద్రులందరు తమతమ చిత్త వృత్తుల కనుగుణముగనే కావ్యములు రచించిన విషయము సుప్రసిద్ధము. కవి చిత్తవృత్తి వస్తు విషయకముగనే కాక శైలి ఛందస్సు మున్నగు విషయములందును గోచరమగుచుండును. కావున కవి మనస్తత్త్వము ననుసరించి కవితాతత్త్వ మేర్పడు ననుట వాస్తవము.

## 2. వస్తు స్వభావము :

కవి కావ్యరచనకు తన కిష్టమైన వస్తువును సంగ్రహించినప్పుడు ఆ వస్తువునకు తగిన న్యాయము చేకూర్చుచు రచన చేయవలసిన యవసరమెంతైన నుండును. కవి తన కవితాదృక్పథము ననుసరించి మార్పుచేర్పులతో రచన సాగించినను వస్తుస్వభావమునకు విరుద్ధముగా వ్రాయుటకు వీలులేదు. ఈ విషయము కథాకావ్యమగుచో మరింత ఆత్మాశ్రయకవిత తగ్గి వస్త్వాశ్రయ కవితారీతి ప్రాధాన్యము వహించును. ఆస్తికుడగు నొక కవి నాస్తిక చరిత్రములు వ్రాయుటకు పూనుకోడు. కాగా, ఒక కవి శైవుడైన తరచుగా శైవకావ్యములు వ్రాయవచ్చును. అతడు వైష్ణవకథ గ్రహించి కావ్యరచన చేసినచో విష్ణుమహిమను, తద్భక్తిని విధిగా వర్ణించి దానికి సార్థక్యము సామంజస్యము సంతరింపవలసి వచ్చును. శైవమతస్థుడైన పోతన విష్ణు పారమ్యగ్రంథమగు భాగవతమును భవ్యముగా రచించినది లోకవిదితము. అట్లే కవులు తమ దివ్య ప్రతిభ చేత ఇతివృత్తగతములై ప్రసక్తానుప్రసక్తములైన యనేక విషయములను యుక్తియుక్తముగా వ్యక్తము చేయుచుందురు.

## 3. సమకాలీన సాంఘిక సాహిత్యాది స్థితిగతుల ప్రభావము :

చతురుడైన సత్కవి తన యిచ్చానుసారముగా నెట్టి కావ్యమును రచించినను తనకాలపు సాంఘిక సాహిత్యాది స్థితిగతులచేత ప్రభావితుడై తదనుగుణమైన రచన కొంత చేయవలసివచ్చును. లేనిచో అది సమకాలీన సమాజము మెప్పు పడయకపోవుటయే కాక గతానుగతికమై ప్రాతదై అంతగా ప్రయోజనకారి కాకుండ పోవును. ఇక కాలానుగుణమైన వస్తువును గ్రహించినచో అది యింకను

సరిపోవును. ఈ విషయము మన ఆంధ్ర సాహిత్యమును పరిశీలించినచో కవిత్రయము నాటి అనువాదయుగమునుండి క్రమముగా అనేకయుగములలో సాహిత్యము పరిణామము చెంది ఆధునిక కాలమునందలి భావకవిత, అభ్యుదయ కవిత వంటి రీతుల వరకు ప్రభావితము చేసిన కావ్యపరంపరలు తార్కాణలగుచున్నవి. వాల్మీకి రామాయణమును హిందీలో మైథిలీశరణగుప్త ఇటీవల "సాకేత్" అను పేర రచింపగా ఈ కాలపు సామ్యవాద భావములందు కొంతచోటు చేసికొన్నవి. అట్లే గురజాడ శ్రీశ్రీ వంటి ఆధునిక కవిచంద్రుల రచనలు సమకాలీన సంలీన వస్తు భావ రచనా విశిష్టములై యొప్పుట సువిదితము.

ఈ విధముగా నొక సుకవి తన చిత్తవృత్తి కనురూపముగా నొక వస్తువును గ్రహించి తదనుగుణముగా రచనచేయుచునే సమకాలీన స్థితిగతుల ప్రభావమున తదీయరీతులను సమ్మిళితము చేసికొనుచు కావ్యమును నిర్మించును. ఈ త్రివిధములైన హేతువులచేత కావ్యమున నొకానొక కవితా తత్త్వము గర్భితమై యొప్పారుచుండును.

## పోతనచరిత్రము నందలి కవితాతత్త్వ హేతుకాంశ పరిశీలన :

పోతనచరిత్రమున పొలుపారు కవితాతత్త్వమును తిలకించుటకు పైన దెలిపిన త్రివిధాంశములను పరిశీలించిన విషయము సుగమము కాగలదు.

## కృతికర్త వరదాచార్యులవారి చిత్తవృత్తి :

కావ్యకర్తయగు వరదాచార్యులవారి గూర్చి వారి వ్యక్తిత్వము గూర్చి "కవి పరిచయము'' వ్యాసమున విపులముగా వివరింపబడెను. ఐనను ప్రకరణ వశమున ముఖ్యాంశముల నిచ్చుట పేర్కొందును.

వరదాచార్యులవారు సాంప్రదాయికమైన విద్వత్కళా విలసితమైన శ్రీవైష్ణవ వంశమున జన్మించిరి. వారి జనకులును అగ్రజులును బహుశాస్త్రములయందు గొప్ప పండితులై సంస్కృతాంధ్ర ద్రవిడ భాషా విశారదులై బహు గ్రంథ కర్తలై ప్రకాశించియుండిరి. వారి శిక్షణలోను మడికొండలోని భక్తి జ్ఞానసాహిత్య కళా విభాసురమగు సామాజిక సహవాసములోను పెరిగిరి. వారు పోతనవలెనే

వాగీశ్వరీ రామతారక మహామంత్రముల నుపాసనచేసి సిద్ధిపొంది స్వయంకృషితో శాస్త్రములు కరలభ్యసించి సహజ పండితులై సత్కవులై విరాజిల్లిరి.

ఆచార్యుల వారికి సహజముగా అలవడిన సాంప్రదాయికత, భక్తి జ్ఞాన వైరాగ్యములు, సదాచారసంపద తమ కావ్యములకు ప్రధానముగా జీవము పోసినవి. కాగా వారు సంకుచిత మత వర్గాదిక సిద్ధాంతములలో మడిగట్టుకొని గిరి గీచుకొని కూర్చుండినవారు కారు. విశ్వవిశాల దృష్టి, 'ఆత్మ వత్సర్వభూతాని' యన్న అమృత హృదయము, గుణగ్రహణ పారీణత్వము, పరమ సహృదయత వారికి పూవు పుట్టగనే పరిమళించినట్లు చిన్ననాడే చెన్నెసలారి సర్వజనప్రియులై అజాత శత్రువులై అలరారినారు. కావుననే వారికి పురాతనాధునాతన కవితా సిద్ధాంతముల మేలిమియెల్ల మాలిమియైనది. అందువల్లవారు విన్నకోట పెద్దయ చెప్పినట్లు "సమయజ్ఞుడు సమచిత్తుడు, సమశబ్దార్థ ప్రయోగచతురుడు...." అను సుకవీంద్ర లక్షణములకు లక్షితులై సమన్వయ దృక్పథముతో మహాకావ్యరచన చేసి వెలసినారు.

ఆచార్యులవారు రచించినదొక మహాకవి యగు పోతన జీవితచరిత్రము కావునను, పోతనయే కాక శ్రీనాథుడు, సింగభూపాలుడు, నారయాదులు, మల్లన అను కావ్యపాత్రలు కవులే కావునను, పోతన చరిత్రమున అనేక సందర్భములలో కవిపండితులగురించి కవితా లక్షణములగురించి చేసిన ప్రసంగములు కానవచ్చును. ఆచార్యులవారీ యవకాశములను పురస్కరించుకొని సందర్భోచితముగా ఆయా పాత్రల ద్వారమున తమ కవితాశయములను వెల్లడి చేసినారు. మరియు కావ్యము నందలి విజ్ఞప్తిలోను పీఠికలోను తమ యభిప్రాయములను ప్రకటించియున్నారు. ఇవి యెల్ల కవితయెడ వారికిగల చిత్తవృత్తిని విశదము చేయుచున్నవి. పూర్వాధునిక కవులనేకులును నిట్లే కావ్యావతారికలందును, కావ్య కథాభాగములందును తమ కవితాభిప్రాయములను ప్రకటించిన విషయము సారస్వతేయులకు విదితమైనదే.

## ఆచార్యులవారి కవితాశయములు :

1. ఆచార్యులవారికి కవితా విషయమున ప్రాతక్రొత్తల పట్టింపు లేదు. ప్రాత క్రొత్తలలోని మంచిని గ్రహించి దేశకాలాబాధ్యములైన కావ్యములను రచించుటయే యుత్తమ మని వారి ఆశయము. ఈ విషయమును వారిట్లు వివరించిరి.

"సత్కవితకు స్వర్ణమువలెనే ప్రాతక్రొత్తలు లేవు. ఈ క్రొత్తప్రాతలు రుచిభేదముల నొప్పారెడి యాభరణ విశేషములే తప్ప మూల ద్రవ్యమగు ప్రతిభ తాను స్వర్ణమే యనుట శంకింపరానిది. కవితాకాంతకు ఛందోరీతులు భావ ప్రకటనలోని తీరుతెన్నులు నేటివి రేపటికి ప్రాతబడిపోవచ్చును వస్త్రరూప వైవిధ్యమువలె. అంతమాత్ర కవితాకన్యకకు క్రొత్త ప్రాతలంటవు."

"కాళిదాసెన్ని యుగములు మారినను కవికుల తిలకుడే. ఇప్పుడును నానాటికి క్రొత్త పుంతలు ద్రొక్కి క్రొత్తబలము పుంజుకొని సహృదయుల చిత్తముల రసానందపరాయత్తముల నొనర్చు నవయువక కనిసింహకిశోరముల ప్రతిభ యనాదరణీయ మనుట మాత్సర్య ద్వేషముల మారురూప మనవలదా? నవరత్నము లెన్నాళ్ళు గడచినను నవరత్నములే యనుట మరువరాని సత్యము. అవి తామెన్నడును శిరోధార్యములై దేశకాలాబాధ్యములునై సజీవములునై సౌభాగ్య ప్రదములునగు నక్షరధనములు"[1].

ఈ వాక్యముల వలన ఆచార్యులవారికి పురాతనము, అధునాతనము భేదము లేక, రసవంతమై సౌభాగ్య ప్రదములగు (శ్రేయస్కరములగు) సత్కవితలు ఏవియైనను శిరోధార్యములే యని తెలియుచున్నది. ఆచార్యులవారు కావ్యపీఠికలో పూర్వకవులతోపాటు ఆధునిక కవులను, నవ్యకవులను, అభ్యుదయ కవులను పేరుపేరున వినుతించి యుండుటయే దీనికి నిదర్శనము.

2. ఆచార్యులవారికి ఖండకావ్య రచనకంటె మహాకావ్య రచనయందే యెక్కువ యభినివేశము కలదు. కాలానుగుణముగా వారనేక ఖండకృతులు వెలయించినను వాని యల్ప ప్రయోజనత్వమును గ్రహించి మహాకావ్య నిర్మాణమే శ్రేష్ఠమైనదని భావించి రచించినారు. 'విజ్ఞప్తి'లో వారు, "ఖండకావ్యము లేకైక ప్రయోజనప్రదములు. మహాకావ్యములు సకల పురుషార్థసాధకములు, బహుళ ప్రయోజనప్రదములు...."[2] అని యిత్యాదిగా ఈ విషయమును విశదీకరించిరి"[3].

3. కవిగారికి ప్రబంధకవితపై మక్కువ యెక్కువ. వారితర కవితా రీతులను నిరసింపక రచనలు చేసినను ప్రత్యేకించి పోతనచరిత్ర మహాకావ్య

1. పోతన చరిత్రము : 'విజ్ఞప్తి' పుటలు 71,72
2. పోతన చరిత్రము : 'విజ్ఞప్తి', పుట 72
3. ఈ విషయము 'పోతన చరిత్రము-కవి ప్రేరణములు' వ్యాసమున విపులముగా చర్చింపబడెను.

విషయమున ప్రబంధరచనా పద్ధతినే అధికముగా అభిమానించి పాటించిరి. ఈ విషయము 'పోతన చరిత్రము-మహాప్రబంధము' అను వ్యాసమున చర్చింపబడినది. ఐనను విజ్ఞప్తిలోని మరికొన్ని వాక్యముల నిట ఉటంకింతును.

"ఆంధ్ర కవితాకన్య పురాణేతిహాస కావ్యమార్గముల విహరించుచు వచ్చి పెద్దనాదుల కాలమందు రమణీయార్థ ప్రతిపాద్యములగు సుందర పదరీతులతో వినూత్న ప్రబంధ ప్రపంచోద్యానముల వెనుకటికన్న మిన్నలగు వింతవిలసనమ్ముల విహరించి సహృదయుల సన్మానముల నందుకొని జయధ్వజమెత్తినది. రసవత్కావ్యకళా విశ్వవీథులలో సీమా భూమిగ చెలువొందినది. ఈ ప్రబంధ పద్ధతి నన్ను మిక్కిలిగా నాకర్షించినది. అటులని నేను నూతన కవితామార్గముల కును దూరుడగా నెంచలేదు. నా కవితలో నేను రెంటిలోని సౌందర్యముల శక్తి వంచనలేక యారాధించినాడనని సహృదయులు తెలిసికొనకపోరు. నాకు కావలసినది నవీన ప్రాచీన పాక్షికత్వములు గావు. నేను కోరునదెల్లను, ఏ కాలమునకు చెందిన మార్గమైనను "సత్యం శివం సుందరమ్" అను కళాసౌందర్యోపాసనమును మాత్రమే. సంకుచిత స్వభావము వీడి చూచు హృదయమున కది సర్వకాలముల నుపలభ్యమగును. సహజ సౌందర్యము గల స్త్రీ పురాతనాధునాతన వేషభాషలలో వెలసినను సరసహృదయుల సమాకర్షించును. సహజసుందరిగాని స్త్రీ నవీనాలంకారముల నెంతగా నాలంబన మొనర్చికొనినను నవమన్మథుని రతీదేవిగా మన జాలదు గదా! కావున సరస కావ్యత్వమునకు పరిణతదశను సమకూర్చిన యలనాటి ప్రబంధ ఫక్కిలో నేనీ కావ్యరచనకు దొరకొంటిని. ఈ మార్గమున నేనెంతవరకు కృతకృత్యుడనైతినో సహృదయైకవేద్యము"[1].

ఆచార్యులవారి యీ యభిప్రాయము లమూల్యమైనవి. 'రసవత్కావ్యకళా విశ్వవీథులలో సీమాభూమిగ చెలువొందిన'దనియు, 'సరస కావ్యత్వమునకు పరిణతదశను సమకూర్చిన'దనియు ప్రబంధ కవిత తమ నాకర్షించిన కారణము చక్కగా విశదీకరించినారు. ఐనను తాము నూతన కవితా పద్ధతులకు దూరముగా లేని విషయమును వ్యక్తము చేసినారు.

4. ఆచార్యులవారు కవితా విషయమున 'సత్యం శివం సుందరమ్' అను 'కళాసౌందర్యోపాసనమును' కాంక్షించువారు. ఈ విషయము పై విజ్ఞప్తి వాక్య

1. పోతన చరిత్రము : 'విజ్ఞప్తి' పుట 74

ములలో వ్యక్తము చేసినారు. ఇది సనాతనమైన సత్సాంప్రదాయికమైన యాలం కారిక వచనము ననుసరించి చెప్పినది. ఇదే విషయము కావ్యమున పోతన యువక భూస్వామితో నన్నట్లు చెప్పబడినది.

"ఉన్నది యున్నయట్లు సరసోక్తులఁ జూపు కళావిలాసమే
యెన్నఁగ సత్యరూపమది యెందును సుందరమై చెలంగు నా
వన్నె యొకండు చాలక శివంబును దానయి సాహితీ విలా
సోన్నతి వెల్గి బ్రహ్మసుఖసోదరమై తిరమై రహించెడిన్."[1]

ఇందు కవితా కళాస్వరూప స్వభావములు, దాని పరమార్థము చక్కగా చెప్ప బడినవి. సాహిత్యము సత్యం శివం సుందరమ్మయి యొప్పారు నన్నది సారాంశము. ఒక వస్తువును గూర్చి యున్నది యున్నట్లు రసవంతముగా వర్ణించినచో అది సత్యమై సుందరమై శోభిల్లును. అట్టి కళావిలాసమంత మాత్రమే కాక శివము-శుభము- అయి బ్రహ్మానంద సహోదరమై శాశ్వతమై వెలయగలదని దీని భావము. అనగా ఒక సత్యవిషయమును లోకశివము కొరకు సుందరముగా చెప్పుటయే కవితా లక్షణమని యాచార్యులవారి యభిమతము. ఇట్టి కవితయే 'విశ్వశ్రేయః కావ్యమ్మ'ను నన్నయగారి మహావాక్యమునకు లక్ష్యమగుచున్నది. ఈ సత్య శివ సుందర విషయము మరికొంత వివరింపవలసి యున్నది.

ఇక్కడ సత్యము, శివము, సుందరము-అను మూడంశములున్నవి. కవిత సత్యమై యుండవలయునన్నప్పుడు దేనిని గురించి చెప్పబడునో దానిని మఖ్య పెట్టక దాని స్వరూప స్వభావములను వాస్తవముగా అద్దములో చూపినట్లు సాక్షాత్కరింప జేయవలయును. కాగా దానిని శివము కొరకు చెప్పవలెననగా లోక కళ్యాణము కొరకు సమాజ శ్రేయస్సు కొరకు చక్కని హితబోధ, ధర్మోపదేశము చేయుచు చెప్పవలెనే కాని అది లోకులను తప్పుదారి పట్టించునదిగా కాని, అశుభ కరమగునదిగా కాని ఉండగూడదు. ఇక సుందరమను విషయమున్నది. విషయము వాస్తవముగా శ్రేయస్కరముగా నుండియు వినసొంపుగా లేనిచో మనసుకెక్కదు. ఒక స్వచ్ఛమైన శాకము నాయురారోగ్యకరముగా సేవింపదలచినపుడు దానిని రుచికర పాకమొనర్చుకొనునట్లు సత్యమై శుభంకరమై యొప్పు కవిత రమ్యమై రసవంతమై యుండునట్లు రచింపవలయును. అనగా విశ్వశ్రేయస్కరమైన యుపదేశమును వ్యంగ్యముగా కాంతాసమ్మితముగా నందించవలయు నన్నమాట. ఇట్టి మూడిటిలో

1. పోతన చరిత్రము : 2-126

ఏది కొరవడినను అది సత్కవిత, సంపూర్ణ కవిత కాజాలదు. వాస్తవిక
వాదమును, అధివాస్తవికతా వాదమును మెచ్చువారు తమ కవితలలో సత్యమ
శుష్కముగా కటువుగా బహిర్గతము చేయుచుందురు. దానిని మనోహరమ
చెప్పుట కిష్టపడరు. అట్టివారు కటూ్వౌషధమును కమ్మని యనుపానము లేకుండ
'కచ్చా టొమాటోను' క్రమపాక మొనరింపకుండను సేవింపబూనువారు. ఇక
కొందరు సౌందర్య వ్యామోహములోబడి సత్యాంశమును మరుగు పరచుచుంద
ఇది మసాలాలు మెండుగా గ్రుమ్మరించి కమ్మదనము కొరకు, కేవలము జి
తృప్తికొరకు అసలు శాకమంతరించునట్లు పాకము చేసికొని తినువారి వ్యవహార
మొదటి దానిలో రుచియుండదు. తినబుద్ధి కలుగదు. రెండవ దానిలో రుచి త
శరీర పోషణకు శాకమే మృగ్యమై పోవును. ఇక మరికొందరు క్షణిక స
కాంక్షతో, పాక్షిక దృష్టితో, స్వార్థచింతనతో తాత్కాలికోద్రేకముతో అ
రచనలు, అశ్లీల రచనలు చేయుచుందురు. ఇక్కడను వాస్తవమని చెప్పినను
భావరచనలు అసత్తుగా నుండి విశ్వశ్రేయములు కాకుండపోవును. ఇది అపథ్య
లను అఖాద్యములను అనుచితముగా భక్షించుట వంటిది. కావున సత్క
సత్యమై శివమై సుందరమై శోభిల్లవలెననుట ఆర్యసమ్మతము.

ఆచార్యులవారీ విషయము చెప్పిన సందర్భముననే కవితా స్వరూపము

"ప్రాకృతికాంతరంగ బహిరంగ ప్రవృత్తుల వాస్తవస్థితిన్
లోకమునందు దర్పణములోవలెఁ జూపుటలే కవిత్వ, మా
ప్రాకృతికాంతరంగ పరివర్తనమే రసరూపమొందు బా
హ్యాకృతితోని మార్పులె రసాంగ ప్రకాశక వర్ణనాదులా"[1].

మానవ ప్రకృతికాని, పశు పక్షి వృక్షాదుల ప్రకృతి కాని- ఆ ప్రకృతి యొ
అంతరంగ బహిరంగ ప్రవృత్తుల నిజస్థితి గతులను అద్దములో చూపినట్లు ఆ
విష్కృతి కావించుటయే కవిత్వమనియు, ప్రకృతియొక్క అంతరంగ ప్రవ
మార్పే రసరూపము దాల్చుచు దాని బహిరంగ ప్రవృత్తి మార్పు విభావా
వర్ణనగా రూపు దాల్చుననియు కవిగారు తేటపరచినారు.

౬. సత్కావ్యము కాంతా సమ్మితోపదేశకమై రసవంతమై రమణీయమ
ధ్వన్యంతర్ గర్భిత భావపూర్ణమై విశ్వశ్రేయమై యుండవలెననియు అకలంక

1. పోతన చరిత్రము : 2-125

అత్యుదాత్తమై, లోకాదర్శ విజ్ఞానదాయకమై, సత్కథా విభాసితమై, ఔచిత్య భాసురమై, సహృదయానందకరమై విరాజిల్లవలెనని యు ఆచార్యులవారి యభిప్రాయము. ఈ విషయములను కావ్యమున పూర్వోక్త సందర్భముననే పోతనచేత చెప్పించినారు.

"కాంతా సమ్మిత కర్ణపేయ రసవాక్య స్ఫూర్తి నొప్పారి ధ్వ
న్యంతర్గర్భిత భావపూర్ణ రమణీయార్థ ప్రపంచాతి భా
స్వంతంబౌచును గావ్యరాజమది విశ్వశ్రేయమొందన్ రసో
దంతంబై మనుటొప్పు నప్పుడది సత్కావ్యంబనంగాఁ దగున్"[1].

"అకలంకంబయి యత్యుదాత్తమయి లోకాదర్శ విజ్ఞాన దా
యకమై దివ్యకథా ప్రపూతమయి పాత్రౌచిత్య సల్లాప దీ
పకమై ప్రాజ్ఞమనోను రంజక రసప్రస్ఫోటమౌ
కావ్యమున్ సుకవీంద్రుండు రచించు"[2].

ఈ యాశయమువల్ల ఆచార్యులవారికి ఆలంకారికులు నిర్దేశించిన కావ్య లక్షణము లన్నియు భేదభావము లేకుండ సమన్వయరీతిలో సమ్మతమైనవని తెలియును. కావ్యాత్మ గురించిన మతభేదముల జోలికి పోక అన్నిటిని ఆదరించి ఆరాధించిన వారాచార్యులవారు. మరియు దండి రచించిన

''శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ వాక్యం''[3]. (రమణీయమైన యర్థముతో శోభిల్లునట్టి శబ్ద సముదాయము కావ్యము)

మమ్మటుడు నిర్వచించిన,

"తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి
ఇద ముత్తమ మతిశయిని వ్యంగ్యే వాచ్యాత్ ధ్వనిర్బుధైః కథితః"[4]

(దోషరహితములును, గుణసహితములును, అలంకారయుతములును నగు శబ్దార్థముల సముదాయము కావ్య శరీరము. అట్టి కావ్యములలో వాచ్యార్థమునకంటె వ్యంగ్యార్థము అధిక సుందరముగా ఉండునట్టి ధ్వని ప్రధానముగా గలది ఉత్తమకావ్యము)

1. పోతన చరిత్రము : 2-127
2. ,, : 2-128
3. కావ్యాదర్శము : 1-10
4. కావ్యప్రకాశము : 1.4

విశ్వనాథుడు నుడివిన

"వాక్యం రసాత్మకం కావ్యమ్"[1] (రసవంతమైన వాక్యము-వాక్య సముదాయము-కావ్యము)

జగన్నాథుడు చెప్పిన

''రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్''[2] (రమణీయమగు నర్థమును దెలుపు శబ్దము కావ్యము)

ఇత్యాదిగా ప్రసిద్ధాలంకారిక కావ్యలక్షణములన్నియు ఆచార్యులవారికి సమ్మతమే యని తెలియుచున్నది.

6. కవిగారికి చతుర్విధ కవిత్వములలో భావమననాత్మకమై అతిశయానందము గూర్చు విస్తర కవితయే శ్రేష్ఠమైనదనియు ఆశు కవితవల్ల నట్టి విశిష్టప్రయోజనము సమకూడదనియు అభిప్రాయమున్నట్లు సహేతుకముగా దిగువ పద్యము వలన తెలియుచున్నది. ఇది శ్రీనాథ పోతనలతో సింగ నృపతి యన్నట్లు చెప్పబడినది.

"ఆశువుకన్న భావమననాత్మకమైన కవిత్వమే సుధా
పేశల మాధురిన్ శ్రవణ పేయసుఖమ్మొనగూర్చు సర్పసం
కాశ నదీ ప్రవాహజలగర్భమునన్ లభియించునే గభీ
రాశయడోలికాలహరినాడు సరిత్పతి రత్న సంతతుల్''[3]

7. కావ్యమున కానంద ప్రదత్వమెంత ముఖ్యమో ఔపదేశికత అంతే ముఖ్యమని ఆచార్యులవారి యభిప్రాయము. ఈ యాశయము పోతన సతి గర్భవతియైన విషయము వర్ణించుపట్టున వ్యక్తీకరించుట జరిగినది.

''సరససౌందర్య సౌరభ్య సౌకుమార్య సంపదన్విత చూతపుష్పమ్ము తాను
ఫలదశను గాంచె సుమనోజ్ఞ కళలఁగూడి యధిగత ప్రయోజన సుకావ్యమ్ము
వోలె''[4]

1. సాహిత్య దర్పణము : ప్రథమ పరిచ్ఛేదము
2. రస గంగాధరము : ప్రథమ కావ్య లక్షణము.
3. పోతన చరిత్రము : 4-105
4. ,, : 3-258

మావి పూవు అందానికి చందానికి గంధానికి మకరందానికి మందిరమై డెందముల నందముల నోలలాడించి ఫలవంతమగునట్లే కావ్యము రస భావ చమత్కారాదుల చేత ఎదలకు గిలిగింతలు పెట్టుచునే సదుపదేశము సత్సందేశమందించవలెను.

8. ఆచార్యులవారికి సుకవుల యెడ సుధీమణుల యెడ అపారమైన అనుపమమైన గౌరవాదరములు గలవు. ఈ విషయము వారు కావ్యపీఠికలో కవులను కవితను విశేషముగా కొనియాడుటవలననే కాక కావ్యమునందనేక సందర్భములలో సంస్తుతించినదాని వలనను విశదమగుచున్నది.

పోతన శ్రీనాథుని ప్రథమ సందర్శనవేళ కవిప్రశస్తి నిట్లుగ్గడించెను.

"మహి నస్తమింపని మార్తాండ బింబమ్ము క్షయమెఱుంగని పూర్ణచంద్ర ముండు
విలయమ్ము నందని విశ్వమ్మునకు స్రష్ట యక్షరలక్ష్మికి నాత్మవిభుడు
అంతరాత్మను దానమాడించు స్వర్గంగ కాలవాహిని గెల్చు ఘనవిజేత
కమ్మని రసమిచ్చు కరఁగని కలకండ జనుషాంధు నాత్మదర్శక ముకురము
దేవ మానవ స్థావర తిర్యగాళి సమత నిజకావ్య కృతపర్ణశాల నుంచి
యక్షరామర పదవుల నందఁజేయు వరదుఁడె కవీంద్రుఁడన వేయి వాక్కులేల"[1]

ఇందు కవి యెంతటి విశిష్ట వ్యక్తియో ఎంతటి ప్రభావ విభాసితుడో మిక్కిలి చక్కగా వర్ణించుట జరిగినది. మరియు నిదే సందర్భమున పోతన శ్రీనాథునితో,

"భవశత పుణ్యపుంజ పరిపాకవశమ్మునఁ గాక జ్ఞానవై
భవజిత ధాతయున్ సరసవాఙ్మయ లౌకికనేతయైన స
త్కవివరు దర్శనమ్మెటులు గల్గును"[2]

అని సుకవి దర్శనభాగ్య విశేషమును నుతించెను.

శ్రీనాథుని పరిచయము కాగానే కేసన చేసిన పండిత ప్రశంసవల్ల ఆచార్యులవారికి కవి పండితులయెడ గల జగత్ పూజ్యభావము సువ్యక్తమగుచున్నది.

"సంసారకూపార సంచార నౌకాప్రగతి కరిత్రమ్ము పండితమతమ్ము
అజ్ఞాన విపిన మధ్యస్థపాంథజనమ్ము చన రాచబాట దోషజ్ఞుమాట

1. పోతన చరిత్రము : 2-164
2. ,, : 2-175

ధనమదాంధీభూత జననేత్ర తిమిర సంహారకాంజనము ప్రాజ్ఞాచరణము
మమతాబలాసురోన్మథనక్రియా వజ్రదర్పణ మార్యసందర్శనమ్ము
అఖిల మానవలోక కళ్యాణదాత వివిధ విజ్ఞాన వాఙ్మయ విశ్వనేత
యవని కవితా విపశ్చితుండపరధాత లోకపూజ్యుండతండొక నాకకాక"[1]

మరియు శ్రీనాథుడు కేసనతో,

''మండిత సత్కళాగగన మందిరుఁడున్ రసమానసాబ్జ మి
త్రుండును నౌ మహాకవి వరుండగుటెట్టి తపః ఫలమ్మొ! ఛీ
దండుగ తక్క విద్యలు వృథా ప్రభుతల్ తను రంధ్ర యుక్త మృ
ద్భాండ జలమ్ము జీవనము పాదరసమ్ములు సొమ్ము లిమ్మహిన్"[2]

"ఇలఁ గడు సున్నితంబు కవి హృద్గతి.... [3].

''చీకటి తెరలను జించి ప్రకాశించు నక్షత్రమా కవినాథు ప్రతిభ...."[4]

"బరి గంటమునె కేలఁ బట్టెనా గడియలో ముల్లోకములు పదమ్ముల నడంగు[5]

"ఉత్తమ కవితాలేఖన చిత్తమ్మెల్లరకు నురకచిక్కునె కూర్పన్
విత్తమ్మొ? నేరిచి కొన వొత్తమ్మొ? పూర్వజన్మ పుణ్యముగాకన్"[6]

అని సుదీర్ఘముగా చేసిన ప్రస్తుతి వలన సుకవి విశిష్టత సుస్పష్టమగును. ఇదే విషయము భోగినీ దండకము కృతిగొన్నవేళ సింగనృపతి కృతజ్ఞతతో పల్కిన మాటలవల్లను విదితమగుచున్నది.

"ప్రకృతికాంతా స్వరూపంబు సొంపులఁదీర్చి దిద్దనేయెద నిల్వుటద్దమయ్యొ
మాటలతోనె బ్రహ్మాండమ్ము సృష్టింపఁ గల మొనగాఁడేని గంటమరయఁ
దాను మాటక యనంతస్వరూపాల్ జూపఁగల్గునే హస్తలాఘవపు జనము
తనవాక్కు లోకమంతయుఁ దలందాల్పఁగా బలుకుబడిం గల్గి వెలయు నెవఁడు
మధుర విజ్ఞాన జలధిలో మనెడి రత్న సంతతులె వాని హృదయకోశమ్ము సొమ్ము
శాశ్వతాక్షర సామ్రాజ్య సంస్థకతఁడు నిర్మకుట సార్వభౌముఁడై నెగడు సుకవి"[7]

1. పోతన చరిత్రము : 2-192

2, 3, 4, 5, 6. పోతన చరిత్రము : 2-222, 223, 224, 225, 226,

7. పోతన చరిత్రము : 4-348.

## వస్తు స్వభావము :

కవితా తత్త్వ మేర్పడుటలో కవి చిత్తవృత్తి,అతని కవితాశయములతో పాటు వస్తు స్వభావము ప్రభావము చూపునని మనవి చేసితిని. "వస్తు శిల్పము", "పాత్ర పోషణ" వ్యాసములలో కావ్యవస్తు స్వరూప స్వభావములు విపులముగా చర్చింపబడెను. కాగా ప్రస్తుతావసరముగా ముఖ్యాంశములను మరల పేర్కొందును. కావ్యవస్తు స్వభావమనగా ప్రధానముగా కథానాయకుని చరిత్రము, అతని గుణ కర్మ స్వభావములు, అతడు కవి కనుక అతని కవితా దృక్పథము ఇక్కడ చెప్పబడును. మరియు శ్రీనాథ సింగభూపాలాది ముఖ్య పాత్రలకు చెందిన గుణ శీలములు స్వరూపమును ఆనుషంగికముగా పేర్కొనుట జరుగును.

1. కావ్య నాయకుడగు పోతన 15 వ శతాబ్దమున వెలసినవాడై సాహిత్య చరిత్ర ననుసరించి కావ్య యుగమునకు చెందియున్నాడు. ఆనాడు శ్రీనాథునివంటి కవిసార్వభౌముడు, సింగభూపాలుడు, ప్రౌఢదేవరాయలవంటి మహారాజులు విరాజిల్లియుండిరి. నాటి కావ్యరచనా రీతులు, రాచరికపు వ్యవస్థ, నాటి పల్లెల పట్టణాల తీరుతెన్నులు, సామాజిక స్థితిగతులు, మతాచార వ్యవహారములు మున్నగువాని నెల్ల మాటుపరపక సందర్భోచితముగా తేటతెల్లముగా రమణీయతా ప్రపుల్లముగా వర్ణింపవలసి వచ్చినది.

2. పోతన భక్తి జ్ఞానవైరాగ్య సంపన్నుడైన మహనీయుడు. మహాకవి, ముముక్షువు, పరమ సాధువర్తనుడు, పరోపకారపరాయణుడు. అతడు నిరాడంబరుడు, నిర్భయుడు, ఆత్మాభిమాని. మహారామభక్తుడై, కవితాకళను భగవదారాధనకు సద్వినియోగపరచి మోక్షార్థియై పారమార్థిక జీవితము సాగించినవాడు. దుర్మదాంధులై నిరంకుశులై చెలరేగిన రాజులను ధిక్కరించి తన భాగవతమును సొమ్ముల యాశకమ్ముకొనక క్రమ్మిన దారిద్ర్యాది విపన్మేఘముల కుమ్మలికమ్ముగొనక నమ్ముకొనిన రామునకే సమర్పించి చరితార్థుడైన స్వచ్ఛంద కవిమహాశయుడు స్వార్థపరులగు నరేశ్వరుల కూడిగము చేసెడి దుర్గతినుండి సరస్వతిని విడిపించి సమారాధనము చేసిన అసలు సిసలు భారతీభక్తుడు. కవులు దైన్య రహితులై స్వతంత్ర జీవనము సాగించి ఆత్మ విశ్వాసాభిమానములతో విరాజిల్లవలెనని చాటి చెప్పి చేసి చూపిన మేటి ఆదర్శకవి పోతనగారి యీ గుణకర్మ స్వభావములకు కావ్యమంతయు నుదాహరణీయమే.

## పోతనగారి కవితాశయములు :

పోతనగారికి అభినవ పోతనగారికి గల కవితాశయము లించుమించు సమానములే. ఇద్దరి చిత్తవృత్తు లొకటి యగుటయే దీనికి కారణము. ఐనను కాలానుగుణముగా పురాతనాధునాతన కవితా సిద్ధాంతానురూపముగా ఈషద్భేదము పొడసూపుట కవకాశము కలదు. ఆచార్యులవారి కవితాశయములుగా చెప్పబడినవి కాక విశేషించి యొప్పారు పోతనగారి యాశయము లిచట తెలుపబడును.

1. పోతన కవితా కళను భగవత్సేవలో వినియోగించుటయే పరమార్థమని విశ్వసించిన మహాభక్తకవి. అందుకే "శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్...." అనియు "పలికెడిది భాగవతమట....పలికిన భవహరమగు నట....'' అనియు ఘంటాపథముగా నుడివెను. ఇష్టదైవమగు రాముని యాజ్ఞచే భాగవత మాంధ్రీకరించి యతనికే కృతి సమర్పణము కావించెను. పోతన చరిత్రము నందీ విషయము చక్కగా నిరూపింపబడినది.

2. పోతన మహాభక్తుడు కావున భాగవతమును భక్తిరసాయనముగా అమూల్యోపాయనముగా భక్తులకు, సాహిత్యానురక్తుల కందించెను.

3. పోతన పరమభక్తుడేకాక సాధువర్తనుడు. కరుణాళువై పేదసాదుల నాదుకొన్నవాడును, సామాన్య కర్షకజీవనము సాగించి స్వావలంబనపరుడై పరోపకారపరాయణుడై వరలినవాడును గావున నాతనికి గల యీ సామాజిక స్పృహ పోతనచరిత్రమున చిత్రింపబడినది.

4. పోతన కృతులను నరాంకితము చేయుట పాపమని భావించినవాడు. దైవభక్తి, తత్త్వజ్ఞానము, వైరాగ్యచిత్తము కలవాడును, ఆత్మాభిమానియునగు అతడు ఐహిక సుఖభోగముల నాశింపక, తన నాకర్షించుటకు నయభయములు చూపి ప్రయత్నించిన రాజులను ధిక్కరించి వారి నిరంకుశ మదోన్మత్తప్రవర్తన నధిక్షేపించిన విప్లవకవి.

5. రాజులవలన కళలు వర్ధిల్లుటకాక కళలే రాజుల కీర్తిలతలను పోషించు ననియు, రాజపోషణపై నాధారపడిన కవుల కావ్యములు తొట్లెలో పెంచు పువు దీగెలవలె పోషణ జరుగనపుడు నశించిపోవును కావున ఆత్మశక్తి ఆధారముగా కవులు రచనలు చేసి స్వతంత్రముగా జీవింపవలెననియు చాటిచెప్పిన ధీశాలి

ధీరతాశీలి పోతన. ఈ విషయ మోరుగంటి శిల్పములను వర్ణించినపుడు పోతన శ్రీనాథునితో దిగువ విధముగా ననుటలో విశదమగును.

"కాలగర్భమ్ములోపలఁ గలిసి చనిన చరితములకు జీవము వోయు సత్కవియును
సాధుశిల్పియు గాన నా సత్కృతులను తలధరింత్రు పూజింతురు ధరణి జనులు"[1].

"ఇల భూపాలురె కాదె! సత్కళల నిట్లేపారఁ బోషింతు రం
దులకై వారిని సంస్తుతించుట లెటుల్ దోసంబులౌనన్న, వా
రల శైలస్థిరకీర్తికాయముల సంరక్షింప మోదింప నీ
కళలే హేతువు లౌటఁగాదె యిటు రక్షంజేతు రుర్వీపతుల్"[2].

"వనతరులట్లు సత్కళలు వర్ధిలగావలెఁగాని రాజ పో
షణమను కృత్రిమాదృతికి సొంతము స్వేచ్ఛను విక్రయించి వా
రను నటులాడి యౌపవని యందలి తొట్ల నెసంగు చెట్లనం
దనరి జలమ్ము వోయని దినాలఁ గృశించి నశింపఁజెల్లునే"[3].

ఇత్యాదిగా పోతన రాజాశ్రయము సుఖప్రదమైనను "పరదాస్యబద్ధ పాశవిక నిహీన వృత్తియగు స్వాతిశయమ్మును జంపు"ననియు "సత్కవులు నిరంకుశుల్ కళల దాస్య సుఖమ్ముల కమ్ము జూతురే?" యనియు హితము నుద్ఘోషించెను.

6. పోతన కవితా రీతులలో భక్తిరసము ప్రధానమై, శృంగార వీర శాంతాదులంగములుగా రసపోషణ, పాత్రపోషణ. వ్యంగ్య రచన, ప్రసాద మాధుర్య గుణప్రాచుర్యము, అనుప్రాసాలంకార శోభావిశేషమూ, సమ సంస్కృతాంధ్ర పదప్రయోగ విలసిత మధురాతి మధురశైలి ప్రముఖమైనవి.

## శ్రీనాథామల చిత్తవృత్తి, కవితాశయములు :

కవి సార్వభౌముడైన శ్రీనాథుడు ప్రధానముగా లౌకిక వ్యక్తి. ఐహిక భోగాభిలాషియై ఆడంబరముగా జీవించి కీర్తి ప్రతిష్ఠలనపేక్షించి రాజాస్థానముల

1. పోతన చరిత్రము : 8-260
2. ,, ; 8-262
3. ,, : 8-264

నలంకరించినవాడు. కళలు రాజపోషణవల్లనే వర్ధిల్లునని భావించినవాడు. అతడు శృంగారి యన్న వాదము కలదు. తన రచనలలో శృంగారమును భక్తిని సమముగా పోషించినవాడు. ప్రౌఢరచనాభిశోభితుడు. సింగభూపాలుడు గొప్ప పండితుడు రచయితయే కాక కవిపండిత పోషకుడు. శ్రీనాథ పోతనలను, నారయాదుల నాదరించిన విషయము దీనికి నిదర్శనము. రసలోలుపుడైన సింగనృపతి భాగవత మంకితముగొన ఆశపడి ప్రయత్నించినను, భాగవత శైథిల్యమునకు పరితపించినను అతనిలో క్షత్రియ సహజమైన రాజసబుద్ధి, దర్పము ప్రస్ఫుట మగుచుండును వాహనమడిగినప్పుడతడాడిన యవహేళన పూర్వక నిష్ఠురోక్తులతని రాజస ప్రవృత్తికి తార్కాణ. పుత్రుడగు మల్లన కవి తండ్రివంటి సుగుణసంపద, పౌరుషాభిమానములు కలవాడు. నారయాదులు పోతనకు దగిన శిష్యులై యతని ననుసరించి రచన చేసిన సుకవులు. ఇట్లు కావ్యవస్తువునందు ప్రధానముగా పోతన గుణశీలములు, పోతన పాత్రోన్మీలనమున కున్ముఖమై యుపయుక్తముగా మిళితమైన శ్రీనాథాది కవిపండిత పాత్రల చరిత్రములు వరలి, ఈ సర్వ వస్తూపాధికముగా తదనురూపమైన కవితా తత్త్వము కావ్యమున విలసిల్లుచున్నది.

## పోతన చరిత్ర రచనమునాటి సాంఘిక సాహిత్యాది స్థితిగతులు :

పోతన చరిత్ర కావ్యరచన 1946 లో ప్రారంభమయి 1960 లో సంపూర్తి యైనది. ఇట్టి కావ్యముపై ఆనాటి స్థితిగతుల ప్రభావము పడక తప్పదు. ఈ కావ్య రచనారంభము నాటికి అంతర్జాతీయముగా ద్వితీయ ప్రపంచ యుద్ధాగ్ని జ్వాలలు భీకర ప్రళయము సృష్టించి చల్లారుచుండినవి. విశ్వశాంతికి, వసుధైక కుటుంబ సౌభాగ్యమునకు కృషి ప్రారంభమాయెను. మార్క్సు వాదము, సమసమాజవాదము గాలులు భరత ఖండముపై వీచుచుండగా దేశములో మహాత్ముని నాయకత్వమున సత్యాగ్రహ పూర్వక స్వాతంత్ర్యోద్యమ తీవ్రత పరాకాష్ఠకు చెందినది, జాతీయత, దేశభక్తి, స్వదేశీ ఉద్యమము, గాంధీ ప్రబోధములు సర్వత్ర వ్యాపించినవి. తెలుగు దేశములోను ఇట్టి భావనలచేత ప్రేరితులై ఆంధ్ర ప్రాంతమున దేశవిముక్తికి, తెలంగాణలో నిజాం నిరంకుశ ప్రభుత్వము నుండి హైదరాబాదు విముక్తికి పోరాటములు సాగించిరి. క్రమముగా అవి ఫలవంతమై దేశమునకు స్వాతంత్ర్యము లభించి హైదరాబాదులో నిజాం ప్రభుత్వము పతనమై గణతంత్ర రాజ్యపాలన

యేర్పడి దేశమున ప్రణాళికల ద్వార అఖిల రంగములందు ప్రగతి సాధించు కృషి ప్రారంభమాయెను. ప్రత్యేకముగా కర్షకుల కార్మికుల బలహీన వర్గములవారి వారి యభ్యున్నతికి ప్రయత్నములు జరిగెను.

దేశకాల పరిస్థితుల ననుసరించి సాహిత్య రంగమునందు పరిణామములు సంభవించెను. అనంతర ప్రబంధ యుగమునందలి క్షీణదశలో చిక్కి స్రుక్కిపోయిన ఆంధ్ర సరస్వతికి నవ్యసాహిత్యోద్యమము ద్వారా ఊరట కలిగి ఉల్లాసము చెలగి నూతన శోభలు చెలువొందెను. వస్తు భావ రచనలలో భావమున కధిక ప్రాధాన్యము నొసగు భావకవిత శాఖోపశాఖలుగా విస్తరిల్లి పిదప మార్క్సువాద సామ్యవాద విభాజితమైన అభ్యుదయ కవిత, అధివాస్తవిక కవిత విజృంభించెను. ఖండకావ్య రచన మహాప్రాచుర్యము వహించెను. ఈ కాలమున క్రొత్తప్రాతల మేలు కలయికతో మహాకావ్యములు కొన్ని వెలసెను. నాటి మహాకావ్య రచన గూర్చి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారిట్లు విశదీకరించిరి.

"భావకవితలోని నిగ్గును, ప్రాచీన కవితలోని ప్రసన్నతను చేపట్టి అధునికులు మహాకావ్య నిర్మాణమును జేయసమకట్టిరి. అభ్యుదయ కవిత్వము ఖండకావ్యప్రక్రియ నాశ్రయించినది. ఈ కాలమున వెలసిన మహాకావ్యములలో నాధునికుల ఉక్తినైశిత్యము శిల్పవైశిష్ట్యముగా మారి కావ్యార్థములందు చోటు చేసికొనుచున్నది. తిరుపతి వేంకటకవుల అవధాన కవితాయుగమున వేగమునందిన కవిత, భావకవిత్వ యుగమున నిగ్రహము నేర్చుకొనినది. అభ్యుదయ కవితాయుగములో ఆవేశము నేర్చుకొనినది. అభ్యుదయ కవితాయుగములో ఆవేశము నేర్చుకొనినది. ఈ యుగ పరిణామ గతిని తట్టుకొని నిలిచిన మహాకావ్య కవిత ఆవేశమున కొదుగని నిగ్రహమును, నిగ్రహమును వీడని వేగమును సంతరించుకొనినది. శబ్దార్థములను భావశబలత్వమునకే కాక రస చర్వణమునకు గూడ నుద్దేశింపబడుటచే మహాకావ్య కవిత క్రొత్తప్రాతల మేలు కలయికయైనది. వర్తమానాంధ్ర మహాకావ్యములలో నాయా మహాకవుల వాగ్వృత్తుల నాశ్రయించిన శైలీవైవిధ్యమును ప్రక్కకుంచినచో సాధారణమైన కవితా గుణమిట్టిది. వానమామలై వరదాచార్యులవారి పోతనచరిత్ర కావ్యమును బరిశీలించునెడ ప్రాచీన మహాకవుల శైలీవిన్యాసముతో వెలయు వాగ్వృత్తిని సన్నివేశ పాత్రౌచిత్యముల కవధిగా భావించినచో మొత్తము కావ్యము అధునికాంధ్ర మహాకావ్య కవితాశైలికి చక్కని యుదాహరణముగా భావింప వీలగుచున్నది."[1]

1. అభినవ పోతన : 'పోతన చరితము-కవితాతత్త్వ విచారము' వ్యాసము, పుట 152

సుబ్రహ్మణ్యంగారు ఈనాటి మహాకావ్యముల కవితా గుణము క్రొత్త ప్రాతల మేలు కలయికతో వెలుగొందుచున్నదని చక్కగా వివరించినారు. వారన్నట్లు తిరుపతి వేంకటకవులనాటి అవధాన కవితావేగమును, భావకవితా నిగ్రహమును, అభ్యుదయకవితావేశమును-ఈ సర్వకవితా రీతులను సముచితముగా సమన్వయించుకొని యీనాడు మహాకావ్యముల రచన సాగినది. "క్రొత్తప్రాతల మేలు కలయిక క్రొమ్మెఅంగులు జిమ్మగా" అన్న గురజాడ వాక్కును, 'నూతనమున్ బ్రాగ్గుణ శోభితంబు' అని గడియారము వారన్న మాటయు దీనినే బలపరచుచున్నవి. ఈ క్రొత్త ప్రాతల మేలు కలయిక సాంప్రదాయికత, నవ్యత అను వాని కలయిక. ఈ రెండిటి కలయికతో ఒక చక్కని సమన్వయకవితా రీతి యేర్పడినది. ఈనాటి కవులీ సమన్వయ రీతిలో కావ్యరచన సాగించినారు. ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు తమ పరిశోధన గ్రంథములో 1950-60 దశాబ్దకాలములో వెలువడిన కావ్యములను సమీక్షించుచు వానిలో సమన్వయ కవితాధోరణి కలదని నిరూపించిరి.

"భావకవిత్వము, అభ్యుదయ కవిత్వము, అధివాస్తవిక కవిత్వము-ఈ మూడు ప్రధానకవితా వాదముల ప్రభావము ఈ తరముపై సమష్టిగా పనిచేసినది. అనగా ఈతరపు యువకవులు ఏయొక్క వాదమునకో ముడివడక, ఈ వాదత్రయములోని మేలినిగ్గులను వస్తు భావ రచనలలో మేళవించుకొని కవితా సృష్టి చేసిరి. ముఖ్యముగా అభ్యుదయ కవిత్వములోని వస్తు ప్రాధాన్యము, వాస్తవిక దృక్పథము; భావ కవిత్వములోని శబ్దశిల్పము, భావ సౌకుమార్యము, అధివాస్తవిక కవితలోని వచనగేయరీతి, వక్రోక్తినైపుణి ఈతరపు యువ కవులలో చొరబారి సరి క్రొత్త రూపుతో సాక్షాత్కరించినవి. ఈ లక్షణములన్నియు ప్రతికవిలో వెదకినచో అధికాంశములు ఈ దశాబ్ది కవులలో కాననగును. స్థూలముగా చూచినచో ఈ దశాబ్ది కవిత్వము సమన్వయ ధోరణిలో నడచినట్లనిపించును. సంప్రదాయమును నిరసించుటగాని, అతినవ్య కవితాప్రయోగములు చేయుటగాని లేక 'క్రొత్తప్రాతల మేలు కలయిక' నవలంబించినట్లు తెలియును. అంతేకాక ఈ దశాబ్ది కవులు ఒకే ఛందస్సును పట్టుకొని వ్రేలాడక పద్యము, గేయము, వచనగేయము-ఈ మూడింటిని సమానముగా ఆదరించినారు. ప్రణయమును, ప్రళయమును తుల్యాభిరుచితో కవితా వస్తువుగా స్వీకరించినారు. వాస్తవికతను, కాల్పనికతను సమాభినివేశముతో చిత్రించినారు."[1]

1. ఆధునికాంధ్ర కవిత్వము: అష్టమ ప్రకరణము-'ఈ దశాబ్ది కవితా సమీక్ష, పుట672.

రెడ్డిగారి అభిప్రాయానుసారముగా ఈ కాలపు కావ్యములు భావకవిత, అభ్యుదయ కవిత, అధివాస్తవికత-అను కవిత్వత్రయ ధోరణుల సమన్వయ సామరస్య కవితా తత్త్వముతో వెలువడినవి. ఈ ధోరణిలో వరదాచార్యుల వారనేక ఖండ కావ్యములను రచించియుండిరి. మహాకావ్యమగు పోతన చరిత్రమునను కాలానుగుణమైన యీ కవితాతత్త్వము సముచితముగా గోచరించు చున్నది.

## పోతన చరిత్రములోని కవితాతత్త్వ విచారము :

మొదట మనవి చేసినట్లు కవి చిత్తవృత్తి, కవితాశయములు, వస్తు స్వభావము, సమకాలీన సాంఘిక సాహిత్యాది స్థితిగతులు - అను వానిలో విశదీకరించి నట్టి సమస్త ధోరణుల సమన్వయ కవితా స్వరూపమే పోతన చరిత్రమున కవితాతత్త్వముగా భాసిల్లుచున్నది. సుదీర్ఘమైన ఉపరి చర్చవల్ల ఈ కవితా తత్త్వావగాహన సుగమము కాగలదు.

## 1. భక్తి తత్త్వ విలసితమైన మహాకావ్యము :

పోతన చరిత్రము భక్తి, తత్త్వము సమ్మిశ్రితమైన యొక దివ్య రసాయనమునందించు మహాకావ్యము. ఇందు భక్తి రసాంతర్భూతమైన శాంత మంగిగా విలసిల్లుచున్నదని 'రస నిర్వహణము' వ్యాసమున తెలుపబడెను. కావ్యమున అంగిరసమగు శాంతమున కించుమించు సమానముగా భక్తి వరలియున్నది. కావున పోతన భక్తుడే కాక వేదాంతతత్త్వ జ్ఞానియై తత్ఫలముగా ధీరశాంతుడై విరాజిల్లినవాడు కావున నిందు శాంతము, భక్తి ప్రముఖముగా పోషింపబడినవి. శాంతమునకు మూలము తత్త్వ జ్ఞానమే కావున పోతన చరిత్రము భక్తికి తత్త్వమునకు నిధానమై యున్నదనుట యొప్పు. భక్తి తత్త్వ శోభితమగు మహాకావ్యముగా పోతనగారి భాగవతము తర్వాత ఈ పోతన చరిత్రమే వెలసినదని చెప్పనగును. ఇదే విషయమును డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారిట్లు వివరించిరి.

''అసలు తెలుగువారికి భాగవతము తరువాత భక్తిప్రధానమైన మహాకావ్యమేమున్నది? శతకములు, పదకవితలు, కృతులు, పాటలు, మొదలగునవి యుండవచ్చును. కాని భక్తి రసాయనమును తత్త్వచషకమున నందింపఁ గలిగిన మహాకావ్యమేది? "పోతన చరిత్ర" మా లోపము తీర్చినది. అట్టి గ్రంథము తెలుగున

వ్రాసినచో పోతనయే వ్రాయగలడని ఇతరులకు సాధ్యము కాదనియు కడచిన ఐదు శతాబ్దముల సాహిత్య చరిత్రము తెలుగువారికి నమ్మకము కుదిరించినది. కావున భాగవతమో, భాగవతకర్త చరిత్రమో ఏమైననేమి? తాత్త్విక భక్తియుక్తమైన పౌత్త్రము వ్రాసియిచ్చిన కవిని 'అభినవ పోతన' యని యభిమానముతో తెలుగు ప్రజ పిలిచి గౌరవించినది"[1].

తెలుగులో భాగవతము పిమ్మట మరలనట్టి తాత్త్విక భక్తి యుక్తమైన మహాకావ్యము పోతన చరిత్రమని సుబ్రహ్మణ్యంగారన్నది వాస్తవము. కాళహస్తి మాహాత్మ్యమువంటి కావ్యములు వెలసినను, అవి భక్తి విలసితములైనను, తాత్త్వికములు కావు. మరియునవి క్షేత్రదైవత మాహాత్మ్యములనే ప్రధానముగా వర్ణించుచున్నవి. ఇట్టి పురాణముల ననువదించిన కవులలో మారనవంటివారు పురాణ కథాకథనము రమ్యముగా నొనర్పగా ఎఱ్ఱన శ్రీనాథుని వంటివారు స్థలదేవ తీర్థ మహిమాభివర్ణన ప్రధానముగా కావింపగా పోతన భక్తిరస పోషణ దృష్టితో భాగవత మాంధ్రీకరించెను. భాగవతమునకు పోతన చరిత్రమునకును గల సామ్యము భక్తి తత్త్వయుతమైన భవ్యకవిత. ఇది పోతనకును అభినవ పోతనకును గల భక్తి జ్ఞాన వైరాగ్యశోభితమైన వ్యక్తిత్వసామ్యము వలన సిద్ధించినది.

ఆంధ్ర సాహిత్యమున భాగవతమునకు గల ప్రశస్తి అనన్యమైనది. దానికి కారణము పోతనగారి భక్తి రసామృతపూరము ప్రవహింపజేసిన మధుర మంజుల రచన. పోతన భక్తి జ్ఞానముల సిద్ధిచేత పరిపక్వమైన వాణితో భాగవత భక్తుల చిత్త వృత్తులతో తాదాత్మ్యము భజించుచు భక్తజన మందారముగా భాగవతము నాంధ్రీకరించెను. జీవితములో పండించుకొన్న తత్త్వజ్ఞాన పరిణత శేముషీ సంపద నింపి జిజ్ఞాసువులకు ముముక్షువులకు చూర లిచ్చెను. వరదాచార్యుల వారును భక్తి జ్ఞానములచేత పరిపక్వమైన ప్రజ్ఞా పాటవముతో విరాజిల్లు వాక్కుతో భాగవత కర్తయగు పోతన చిత్తవృత్తి తాదాత్మ్యముతో నతని చరిత్రమును ప్రశస్తముగా రచించెను చిత్తవృత్తి సామ్యముచేత ఆచార్యుల వారికి మధుర మనోజ్ఞమైన పోతన భాగవత రచనారీతి ఆత్మీయముగా విలసిల్లెను. అందువల్లనే భాగవతము వలెనే పోతన చరిత్రము సాహితీ లోకమున ప్రశస్తి వహించి యున్నది.

1. అభినవ పోతన; ''పోతన చరిత్రము-కవితాతత్త్వ విచారము'' పుట 148.

2. పవిత్ర కవితాకళను భగవదారాధనములో వెలయించుట జన్మతారక హేతువనియు, కవులు ఐహిక భోగాభిలాషతో రాజామల నాశ్రయింపక దైన్య రహితులై ఆత్మాభిమానముతో స్వతంత్ర జీవనము గడపి చరితార్థులు కావలయు ననియు ప్రబోధించు తత్త్వము గలది. ఈ విషయము పోతన జీవిత మాదర్శ ప్రాయముగా నభివర్ణింపబడి నిరూపింపబడినది.

3. సత్యం శివం సుందరమ్మను ఆర్యోక్తికి లక్ష్యముగా విశ్వశ్రేయమై శాశ్వతమై యొప్పు సత్కవిత పోతన చరిత్రములోనిది మహాభక్త కవియు సత్పురుషుడును ఆదర్శ జీవనుడును నైన పోతన జీవితగాథను విశ్వశ్రేయమునకు కడుంగడు చెడంగుగా రచింపబడిన యీ మహాకావ్యమే దీనికి నిదర్శనము. ఇట్టి సత్కావ్యము సర్వ సారస్వతేయ సేవ్యమై సంభావ్యమై అజరామరముగా వెలయ గలదనుటలో సందేహము లేదు.

4. విపుల వస్త్వైక్య శోభితమై విశిష్ట కథావిలసిత సముంచిత వర్ణనాభి శోభితమై ఆలంకారిక ప్రౌఢ రచనా విభాసితమైన ప్రశస్త ప్రబంధ కవిత[1]. "ఇంతటి వస్తు వైవిధ్య వైపుల్యమును గలిగి వస్త్వైక్య శోభితములైన కావ్యములు తెలుగున వెన్నియో లేవు''[2] అని డా॥ పల్లా దుర్గయ్యగారు ఈ కావ్యమును ప్రశంసించి యుండిరి.

5. పురాతనాధునాతన కవిరారీతులయెడ భేదభావములేక సమస్త రీతుల లోని మంచిని గ్రహించి క్రొత్తప్రాతల మేలు కలయికతో సమన్వయ ధోరణిలో కవిత వెలయించుటకు మొదట తెలిపినట్లు కవిగారి చిత్తవృత్తి కనురూపమగు కవితాశయము, కావ్యవస్తుస్వభావము. సమకాలీన సాంఘిక సాహిత్యస్థితిగతులు- ఈ మూడును హేతువులగుచున్నవి.

పదునైదవ శతాబ్దమున వెలసిన భక్తకవి బమ్మెరపోతన జీవితగాథ వర్ణించు కావ్యమున అతిప్రధానముగా పోతన గుణకర్మ స్వభావములకు అతని కవితాశయములకు ననుగుణముగా భక్తి శాంతరసముల పోషణకును, ఆనుషంగి

1. ఈ విషయము 'మహాప్రబంధము' 'వస్తు శిల్పము' వ్యాసములలో విపులముగా చర్చింపబడెను.
2. పోతన చరిత్రము : కవి-కావ్యపరిచయము, పుట 24

కముగా శ్రీనాథాదుల మనఃప్రవృత్తులకు కవితాధోరణులకును అనువగు సాంప్రదాయిక ప్రాబంధిక కవితారీతులను చేపట్టవలసివచ్చినది. పోతన వ్యక్తిత్వముతో సంవదించుచున్న వ్యక్తిత్వము గల ఆచార్యులవారు పోతనగారి ప్రసాదమాధుర్యాది గుణ విభాసితమైన భాగవత కవితారీతిని మెరయించుచునే సన్నివేశపాత్రోచితముగా శ్రీనాథాదుల రీతులను గుబాళింపజేసినారు. ఇంతకు పురాణమగు భాగవతము రచన వేరు. భాగవతకర్తయగు భక్తకవి జీవితచరిత్ర రచన వేరు. అంతేకాక పోతనకు అభినవపోతనకు మధ్య ఐదువందల సంవత్సరముల దీర్ఘ కాల వ్యత్యాసము గలదు. ఈ కారణములచేత భాగవతరచనా రీతికి పోతనచరిత్ర రచనా రీతికి ఈ యొకయింత వైధర్మ్యము పొడసూపుచున్నది. అంతేకాక యెంతమాత్రము పోతనరీతి ననుసరించినను ఆచార్యులవారి కవితారీతి స్వీయ ముద్రతో ప్రత్యేకతను సంతరించుకొన్నది. ఈ కవితాధోరణిని గూర్చి విద్వద్విమర్శకులగు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిట్లు సెలవిచ్చిరి.

"నవ్యతాశోభితమయ్యుఁ బ్రాచీనతా పరిమళముల గుబాళింపులఁ బుక్కిలించిన యాధునికాంధ్ర మహాకావ్యరత్నములలో శ్రీవానమామలై వరదాచార్యులవారి పోతనచరిత్రమొకటి"[1].

మరియు అవధానిగారిట్లు ప్రశంసించిరి.

''ఈ కావ్యమున శ్రీనాథుని పద్యములందలి ప్రౌఢగంభీరగమనము, పోతన రచన యందలి మాధుర్య సౌష్ఠవములు, భట్టుమూర్తి కావ్యమందలి ధ్వన్యలంకార సౌందర్యము, చేమకూర వేంకటకవి కవిత్వమందలి శబ్దాలంకార చమత్కారము పుష్కలముగా గోచరించును![2].

డా॥ పల్లా దుర్గయ్యగారిట్లు వ్రాసిరి.

''మహాకవి పోతన జీవితకావ్యమునందు పోతన భాగవత కవితా వాతావరణమును గల్పించు నుద్దేశముతో నీకవి పలుతావుల నిట్టిశైలి నవలంబించెను ఇతర ప్రాచీన కవులలో శ్రీనాథ పెద్దన రామరాజభూషణ చేమకూరవేంకట కవులును సంస్కృత మహాకవి కాళిదాసును ఈ కవి కభిమానపాత్రులుగా గో

1. పోతన చరిత్రము : 'తొలిపలుకు' పుట I
2. ,, : ,, , పుట XIII

రింతురు. ఈ మహాకవుల కవిత్వశైలీ శయ్యల ఛాయలందందు భాసించి ఈ కవి శైలికి ప్రౌఢిమ నాపాదించినవి. ప్రాచీనకవుల భావగాంభీర్యమును రచనాశిల్పమును వీరు పుడికి పుచ్చుకొనిరే కాని భావానుకరణమునకు పాల్పడలేదు. వీరి భావములు స్వతంత్రములు"[1].

ఈనాటి మహాకావ్యముల కవితాగుణము వివరించుచు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు వెలిబుచ్చిన యభిప్రాయములోని చివరి వాక్యము మరల ప్రస్తావింతును.

''ప్రాచీన మహాకవుల శైలీ విన్యాసముతో వెలయు వాగ్వృత్తిని సన్నివేశ పాత్రౌచిత్యముల కవధిగా భావించినచో మొత్తము కావ్యము ఆధునికాంధ్ర మహాకావ్య కవితాశైలికి చక్కని యుదాహరణముగా భావింప వీలగుచున్నది"[2]

ఈ పండితవరేణ్యుల యభిప్రాయముల ననుసరించి రెండు ముఖ్య విషయములు విదితమగుచున్నవి. ఒకటి కావ్యవస్తూపాధికముగా తద్గత సన్నివేశపాత్రల కుచితమగు పూర్వకవుల కవితాధోరణులు ఇందు చెలువొందుచున్నవి. కాగా కావ్యము సాముదాయికముగా ఆధునికాంధ్ర మహాకావ్యశైలీ విలసితమై యున్నది. ఈ రీతిగా నిది ప్రాతక్రొత్తల మేలుకలయికతో శోభిల్లుచున్నది. రెండవది పూర్వకవులలో పోతన శ్రీనాథుడు పెద్దన రామరాజభూషణుడు చేమకూరవేంకటకవి కాశిదాసువంటి మహాకవుల కవితారీతులు కావ్యమున గోచరించును. ఈ పూర్వకవుల కవితారీతులు కావ్యమున పరిమళించుచున్న విషయము ఆచార్యులవారు 'వైశాలిని' నాటకము ప్రస్తావనలో పండితాభిప్రాయముగా నటిచేత.

"సరవి నన్నయ సమాసంబు శబ్దపుడంబు...." ఇత్యాదిగా పలికించిరి. ఈ పూర్వకవుల కవితారీతులు కావ్యమున నెట్లు శోభిల్లినవో ''పూర్వాధునిక కవి ప్రభావము" వ్యాసమున విపులముగా చర్చింపబడినది.

సంస్కృత మహాకవులలో కాళిదాసు ఉపమకు, భవభూతి కరుణరస నిర్వహణకు సదృశమైన రచన పోతనచరిత్రమున గోచరించును. ఈ రెండింటిని వరుసగా "అలంకారికత," "రసనిర్వహణము" వ్యాసములందు చర్చించుట జరిగినది. ఈ విధముగా పోతనచరిత్రము పూర్వ మహాకవులలోని యనేక రమణీయ కవితా ధోరణులను మేళవించుకొని పటిష్ఠమై యింపుసొంపులతో పెంపారుచున్నది.

1. పోతన చరిత్రము : కవి-కావ్యపరిచయము, పుట 55, 56
2. అభినవపోతన : ''పోతనచరిత్రము-కవితాతత్త్వవిచారము'' పుట 152

## ఆధునిక కవితారీతులు :

ఆధునిక కవితారీతులలో భావకవిత, అభ్యుదయకవిత కావ్యమున నచ్చ టచ్చట దర్శనమిచ్చి నవ్యకవితాభిమానులకు సంతుష్టి గలిగించుచున్నది. భావ కవితాశాఖలగు ప్రణయకవిత, దేశభక్తి కవిత, దైవభక్తికవిత, ప్రకృతి కవిత, సంఘసంస్కరణ కవిత అందందు సుందరముగా గోచరించుచున్నవి. వీనిని గూర్చి "సాంప్రదాయికత-నవ్యత" వ్యాసమున విపరముగా అనుశీలింపబడినది.

ఆచార్యులవారు పోతన గుణశీలముల కనుగుణముగా కథా సన్నివేశములను కల్పించి కాలానురూపమైన యభ్యుదయ కవితను కావ్యమున చక్కగా మేళవింప జేసినారు.

ఈ నాటి యభ్యుదయ కవిత మార్క్సు వాదదృక్పథముతో సాగినది. ఇది గతతార్కిక భౌతికవాదముతో భూస్వామ్య విధానమును. పెట్టుబడిదారి విధానమును ఖండించి శ్రమకు దగిన ఫలితమిచ్చుటలో అందరును సమానులుగా జీవింపగలుగు స్వామ్యవాదపు శ్రామిక రాజ్యవ్యవస్థ యేర్పాటు గూర్చి ప్రబోధించును. దీనికి పీడిత తాడిత జనులందరు తిరుగుబాటుచేసి తమ ధ్యేయసాధనకు సాయుధ విప్లవమువంటి హింసా మార్గమున పురోగమించుటకు ఆయత్తపరచుట యీ కవిత ముఖ్య లక్ష్యము. ఇందు దైవమునకు, కర్మ సిద్ధాంతమునకు, పూర్వ సంప్రదాయములకు, అహింసకు తావులేదు ఇట్టి దృక్పథముతో శ్రీశ్రీ వంటివారు అభ్యుదయ కవిత వెలయించిరి. అభ్యుదయ కవితా రీతియను నూతన ప్రయోగము జరిగినను ఆది సంప్రదాయపు పునాదిపైననే వెలయింపబడినది. కాగా వరదాచార్యుల వారు కేవల మభ్యుదయకవితా మార్గప్రవర్తకులుకారు కావునను. ఆస్తికమై వైదిక ధర్మమునందలి "ఆత్మవత్సర్వభూతాని," "సర్వేజనాస్సుఖినోభవంతు," "అహింసా పరమో ధర్మః" అను సూక్తులాధారముగా జీవకారుణ్యముతో శాంతిమార్గమున కర్షక కార్మికులకు శ్రేయస్సు కలుగవలెనన్న ఆశయము కలవారు కావునను, పోతన చిత్తవృత్తి యిట్టిదియే కావునను శ్రామికుల దీనుల మేలునాకాంక్షించు అభ్యుదయ కవితా ధోరణి సాగించిరి కాని తత్సాధనకు హింసాత్మక విప్లవమును ప్రతిపాదించ లేదు. మరియు కావ్యౌచిత్యదృష్టితో పద్యచ్ఛందస్సు నాశ్రయించిరే కాని వారికి గేయము మీద వచన కవితమీద అనిష్టమయికాదు. వారి యితర రచనలు ఈ విష యమును రుజువు చేయుచున్నవి. దీనిని గూర్చి డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారిట్లు వ్రాసిరి.

"వారమామల్లై వరదాచార్యులవారు చంపువుగా కావ్యము వ్రాసి ఛందో మార్గము నీ కావ్యమున గౌరవించిన వారయ్యు, విరళచ్ఛందమైన రచనము నందును సాదరదృష్టికలవారే. కావ్యౌచిత్యము నెఱిఁగి చందమున నౌచిత్యమును ప్రదర్శించిరి కాని వారికి ఆధునిక భావ సంస్కారములేకకాదు. కాని వారి భావలహరిని విప్లవముపైపు మళ్ళింపక విశ్వశాంతి జీవకారుణ్యముపైపు మళ్ళించిరి. పోతన కావ్య చిత్రణకు భిత్తిక నందించినది యీ భావశబలత. వరదాచార్యులవారు పల్లె వాతావరణము చిత్రించినను, హాలికుల జీవితమును వర్ణించినను నవ్యకవితా చైతన్యము తొణికిసలాడు వాగ్వైఖరిని ప్రదర్శించినారు. నవ్యులు సమకాలీన సమాజ ప్రవృత్తిని ప్రతిబింబించు మహాకావ్యము నభిలషించుచున్నారు. గతములో వర్తమానచ్ఛాయలు పండించుకొనిన మహాకావ్యమును వరదాచార్యులవారు తెలుగువారికి సమర్పించినారు. పరంపరాగతమైన కావ్యసంప్రదాయములను జీర్ణించుకొని సమకాలీన ప్రజాజీవితమును సూత్రప్రాయముగా వ్యాఖ్యానించుచు వర్తమానాంధ్ర కవి సార్వకాలిక మానవత్వపు విలువలను పాటించుచు రచించిన మహాకావ్య మీ పోతన చరిత్రము. సంక్షుభిత వర్తమాన కాలప్రవాహమున విరిసిన శతపత్ర శాంత పద్మ మీ కావ్యము''[1]

సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయములో చివరి వాక్యములు మిక్కిలి విలువైనవి. వాని ననుసరించి పోతన చరిత్రము సంప్రదాయమును సమకాలీనమైన నవ్యతను సమ్యక్ సమ్మేళనము కావించి సార్వకాలికమై మానవతా మూల్యములకు నిధానముగా రచింపబడినది. నానావిధ నూత్న ప్రయోగములతో కవితా లోకమును బహువిధోద్యమములతో తీవ్రవాదములతో మానవ లోకమును కల్లోలితమై యున్న కాలమున ఒక సమన్వయ రీతిలో శాంతి ప్రదమగు మహాకావ్యముగా పోతన చరిత్రము నాచార్యులవారు రచించిరి.

6. ఆలంకారికులు కావ్యాత్మగా నిర్దేశించిన రసము, ధ్వని, అలంకారము, ఔచిత్యము, గుణము. రీతి-ఇత్యాదులన్నియు కావ్యమున కత్యావశ్యకములే యని వాని యన్నిటికి ప్రాధాన్యమిచ్చి వారి కావ్యనిర్వచనము లన్నిటికి సమాధానముగా సముచితముగా స్థానము కలిగించి వస్తు భావ రచనలలో సర్వాంగ సౌందర్యమును సంతరింప జేసిన మహాకావ్యము. దీనికి 'రసనిర్వహణము' మున్నగు వ్యాసము లన్నియు నిరూపకములై యున్నవి.

1. అభినవ పోతన ; ''పోతన చరిత్రము-కవితాతత్త్వ విచారము,'' పుట 151.

7. ఆనంద ప్రదత్వము. ఔపదేశికత సమముగా విరాజిల్లిన ప్రశస్త కావ్యము. దీనికి కావ్యమెల్ల ఉదాహరణీయమే.[1]

ఈ విధముగా పోతన చరిత్రము భక్తితత్త్వ విలసితమై, భగవదారాధనలో కవితాకళను సద్వినియోగపరచుచు కవులు స్వతంత్ర జీవనము సాగించ వలెనని ప్రబోధించునదై, సత్యం శివం సుందరమ్మను మహావాక్యమునకు నెలవయి, విశ్వ శ్రేయమై, ప్రశస్త ప్రాబంధిక రచనాభిశోభితమై, రసధ్వన్యలంకారగుణాదు లన్నిటికి సముచిత ప్రాధాన్య మొసగినదై, పురాతనాధునాతన కవితా ధోరణులన్నిటి సౌందర్యసారమును జీర్ణించుకొని సమన్వయరీతిలో విరచింపబడి ఆనందమును, ధర్మోపదేశమును పుష్కలముగా ప్రసాదించుచున్న ఉత్కృష్టమైన ఆధునికాంధ్ర మహాకావ్యము.

1. కావ్యోపదేశముగూర్చి ఆ వ్యాసమున ప్రత్యేకముగా విపులముగా చర్చింపబడినది.

# భావ సంపద

## భావ ప్రాధాన్యము :

కావ్యాంగములగు వస్తు భావ రచనములలో భావమునకే అధిక ప్రాధాన్య ముండును. భావ సంపద్వైభవమే ఒక కావ్యమునకు ఘనతను గూర్చును. భట్ట గోపాలుడు

'కౌతి శబ్దాయతే విమృశతి రస భావాన్ ఇతి కవిః తస్యకర్మ కావ్యం'

అని కవి కావ్యములకు నిర్వచనము చేసెను. అనగా రసభావములను విమర్శించు వాడు కవి. అతని కర్మ కావ్యము. రసభావములు ప్రధానముగా శోభిల్లునదే కావ్యమని దీనివలన తెలియుచున్నది.

కావ్య హేతువగు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాస సముదాయమున ప్రథమాంశమగు ప్రతిభను గూర్చి రాజశేఖరుడు వివరించుచు

''సాచద్విధా కారయిత్రీ భావయిత్రీచ. కవేరుపకుర్వాణా కారయిత్రీ....
భావ కస్యోపకుర్వాణా భావయిత్రీ....[1].

అని వివరించెను. ప్రతిభ కారయిత్రి, భావయిత్రి అని రెండు విధములనియు, కవిచేత కావ్యము వ్రాయించు శక్తి కారయిత్రి, సహృదయునిచేత కావ్యార్థమును భావింపజేయు శక్తి భావయిత్రి యనియు దీనియర్థము. ఈ ద్వివిధ ప్రతిభలోను భావనాశక్తి యంతర్నిహితమై యుండును. దీనిని కొంత వివరింతును.

అసలు భావమనగా అభిప్రాయము. 'భావః కవేరభిప్రాయః' అన్నట్లు ఇక్కడ కవి యభిప్రాయమే భావము. వరదాచార్యులవారు కావ్యపీఠికలో వచించి నట్లు కవితాకన్యా సృష్టికి

''ప్రతిభయే పితర, వ్యుత్పత్తియే జనయిత్రి సుకవి యెడంద ప్రసూతి గృహము''

---

1. కావ్యమీమాంస - చతుర్థాధ్యాయము.

అని ప్రతిభా వ్యుత్పత్తులు తండ్రి తల్లి కాగా కవి హృదయము ప్రసూతిశాలయగు చున్నది. కవి హృదయములో కవిత ఉద్భవించుననగా కవి తన హృదయములో భావించినదే కవితయై పుట్టును. కవి ఒకానొక వస్తువును దర్శించినప్పుడు లేదా స్మరించినప్పుడు హృదయము స్పందించి వీణాతంత్రులు కదలినపుడు నాదముప్ప తిల్లునట్లు మధురానుభూతి కలుగును. ఆ యనుభూతిని ఆనందాతిరేకముతో మననముచేసి మథించుటలో లోకోత్తరమైన యొక అభిప్రాయము కలుగును. ఆ యభిప్రాయమే భావము. ఆ భావమును వ్యక్తీకరించుటకు తగిన యర్థమును దానికై శబ్దమును ఆశ్రయించును. అనగా సమర్థమగు భాషలో భావమును వ్యక్తము చేయును. అదియే కవిత. సహృదయుడు అట్టి కవితను చదివి ఆ శబ్దములచేత అర్థమును, అర్థముచేత భావమును గ్రహించి కవివలెనే ఆనందించును. అనగా కవి భావమునుండి శబ్దమునకు, సహృదయుడు శబ్దమునుండి భావమునకు చేరి తన్మయత్వమునందుట జరుగును.

కవి కవిత వెలయించుటకు భావమే మూలము. కవి మధురానుభూతినంది మనోజ్ఞ భావమును వెలార్చుటకు హేతువైన ప్రతిభ కారయిత్రి యనుట యిదియే. ప్రతిభ కవిచేత తొలుత భావింపజేసి కవిత వ్రాయించును కనుక కారయిత్రి. కవిత చదివి ఆనందించుటకును కవి హృదయము వంటి హృదయమును-ప్రతిభయు పాఠకునికుండును కనుక అతనిచేత కావ్యార్థమును భావింపజేయు ఆ దానిని భావయిత్రి యందురు. మొత్తముపై కవి భావము ఎంత బలమైనది విశిష్టమైనదియై యొప్పునో కావ్యము అంత సుసంపన్నమై శ్రేష్ఠమై ఆనందదాయకము కాగలుగును.

కవి ప్రతిభచేత లోకములోని వస్తువులు చిత్ర విచిత్రముగా నిత్యనూతన ముగా భాసించును. కావున సామాన్యుని దృష్టివంటిది కాక కవిదృష్టి విలక్షణ మైనది, లోకోత్తరమైనది. ఈ శక్తిచేతనే వస్తువును ఉన్నది ఉన్నట్లు కాక ఉత్కృష్టముగా ఉదాత్తముగా భాసురముగా భావించి వర్ణించును. అనగా తన యనుభూతి ననుసరించి భావించి చెప్పును. కవి క్రాంతదర్శియని వచించుట యిందు వల్లనే. అతడెంత ప్రతిభావంతుడైన అంత గొప్పగా భావనచేసి కావ్యము రచింప గలడు. అతడెంత రసహృదయుడైన అంత రసవంతముగా సిద్ధము చేయగలడు. ఎట్టి వస్తువునైన రమ్యముగా మార్చు దివ్యశక్తి కవిభావనకు గలదు. అతని భావన క్షుద్ర లోహమును స్వర్ణము చేయు పరుసవేది. ఈ విషయములో ధనంజయుడు చెప్పిన

"రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచమ్" అను సుప్రసిద్ధ శ్లోకము వివరించుచునన్నదానిని 'ఖండకావ్య ప్రక్రియ' వ్యాసములో పేర్కొంటిని. వస్తువెట్టిదైనను కవి భావనా శిల్పమున భాసించినచో రసభావ విస్ఫూర్తి గాంచనిది లోకమున లేదని ధనంజయుడు వచించుట వలన కవికిగల భావనా శక్తి యెంత మహిమాన్వితమైనదో తెలియగలదు. కవి తన భావననుసరించియే కావ్యమును రసవంతముగానో నీరసముగనో నిర్మాణము చేయగలడన్న విషయమును "అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః ..." అని ఆనందవర్ధనుడు ప్రవచించెను.

కావ్యమున భావమను దానికొక ప్రత్యేకత కలదు. ఎవ్వరేమి మాట్లాడినను ఒక అభిప్రాయము- భావము- ఉండునన్నప్పుడు వారు మాట్లాడిన దానిలో నుండునది సామాన్య భావమే కాని కవితాభావము కాదు. కవితా భావన రసార్ద్రమైనది. ఆహ్లాదకరమైనది. సత్యం శివం సుందరమైనది. రస నిష్పాదకములగు విభావాను భావ సాత్త్విక వ్యభిచారి భావములే కావ్యభావములు. అసలు భావమనగా 'నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ విక్రియా' (సాహిత్య దర్పణము) అనగా నిర్వికారాత్మకమగు చిత్తమున ప్రప్రథమమున గలిగిన వికారము భావమని తెలుపబడినది. కదలిక లేని సరసిలో రాయి విసరినచో జలములు చలించి యలలు చెలువొందునట్లు ప్రశాంతముగానున్న హృదయములో వస్తు దర్శనాదులవలన అనుస్పందనము గలిగి ఆలోచన రేకెత్తునయే భావము. ఈ భావ సంయోగము వలననే రసముత్పన్నమగును. కవితా రసాల ఫలమునకు రసము రసమగుచో దానికి మూలమైన భావము గుజ్జు. కవితా వ్యంజనమున రసమునన భావము సంభార ద్రవ్యమై యొప్పును. రసమొక సింధువగుచో భావములు బిందువులగును. భావ హీనమైన రసము కాని. రసహీనమైన భావము కాని లేదనియు ఈ రసభావముల కవినాభావ సంబంధము కలదనియు అగ్ని పురాణములో దిగువ విధముగా వ్రాయబడి యున్నది.

> "న భావహీనోఽస్తి రసో న భావో రసవర్జితః
> భావయంతి రసానేభిః భావ్యంతేఏ రసా ఇతి"[1]

రసభావములకిట్టి విడదీయరాని సంబంధమున్నను రసములు తొమ్మిదియై భావములనంతములై యుండుటను విచారించినచో రసస్ఫోరకములై శోభిల్లు ఈ

1. అగ్నిపురాణము : 339 వ అధ్యాయము, 12 వ శ్లోకము.

భావములు కొన్ని యెడల రసస్పర్శ కలిగియు మరికొన్ని యెడల తదన్యములయ్యు వెలయు చుండుట కాంచగలము. ముఖ్యముగా ఇతివృత్తాత్మకమైన కావ్యములందు భావములు రసోదంచితములై యుండుట కవకాశమెక్కువ కలదు. అన్య సందర్భ ములందు రసపర్యవసితములు కానివి, రసస్పర్శలేనివి కొన్ని విలసిల్లుచుండును. ఖండకావ్యములందును, నీతిశతకాదులగు ముక్తకములందును నిట్టి భావములు గోచ రించును. అగుచోనవి ఆనందప్రదములగునా యన నగు ననియే చెప్పవలసి యుండును.

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య'మ్మని జగన్నాథుడు చెప్పిన కావ్య లక్షణములోని రమణీయార్థమనగా చమత్కారము గలిగించు భావమే. కనుక రసస్పర్శ ఉన్నను లేకున్నను హృదయావర్జకమగు భావములు వెలార్ప వచ్చును. కావ్యము హృదయములను కదలించుట యున్నది ముఖ్యముగా భావముల చేతనే. చమత్కార భావము లెదలను కదలించి గిలిగింతలు పెట్టుచుండును. అట్టి భావ చమత్కారము లేని కావ్యము సారహీనమై చైతన్యరహితమై కొయ్యబొమ్మవలె తాను కదలదు. పాఠకులను కదలించదు. అందుకే

''కిం కవేస్తేన కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయేలగ్నం నఘూనయతి యచ్ఛిరః''

అనగా పర హృదయమున నేది లగ్నమై తలను కంపింప జేయదో ఆ కవియొక్క ఆ కావ్యమేల ? ఆ ధానుష్కుని బాణమేల ? అని ప్రాజ్ఞులు వచించినారు. కాగా సహృదయుడు రసార్ణవమున మునిగి తేలిన వాడగుచో, భావ శీకర సేచనమున అహ్లాదమవశ్యము పొందగలడు. చిత్తములు భావములచేత మెత్తబడి రసములో కరగిపోవుననుట సమంజసము. ఇట్లు రసోపస్కారములై రమ్యములై రాజిల్లు భావములు కావ్యము లందగ్రగణ్యములనుటలో విప్రతిపత్తి లేదు.

భావ వ్యక్తీకరణమునకు తత్ప్రతిష్ఠతకు కవులలంకారములను గుణములను ఆలంబనముగా గొనుట పరిపాటి.

"భావకత్వ మపి సముచిత గుణాలంకార పరిగ్రహాత్మకమ్"[1].

1. 'శోధనము' - 188

అని అభినవ గుప్తుడిదే విషయము స్పష్టము చేసెను. భావములు గుణాలంకారా శ్రితములై చమత్కారావహములై ధ్వన్యాస్పదములై రసానందపరవశులను గావించుచుండును. ఏవం విధ ప్రాధాన్యము వహించిన విశిష్ట భావ సంపదకు పోతన చరిత్రము నిండుగా నిలయమై నెగడుచున్నది.

## పోతన చరిత్రమున భావ సంపద :

అక్రాంత నవభావనాధ్వ సంచారులగు వరదాచార్యులవారు పోతన చరిత్ర మును మహితభావ సంపద్విభాసురముగా మలచియున్నారు. ఇందలి భావములు విశ్వవిశాలములై ఉన్నతములై గంభీరములై పవిత్రములై ఉత్కృష్టములై ఔచిత్య శోభితములై సుందరములై చమత్కార గర్భితములై సరసములై హృదయా హ్లాదకరములై యొప్పారుచున్నవి. ఆచార్యులవారి భావనా విహంగ మవధులు లేని యాకాశ వీథులలో విహరించును. అట్లని అవనీతలమును మరవదు. వారి భావ ములు రోదసీ పరివ్యాప్తములై రోచిర్విలాసములను వెలయించుచుండును. కావ్య మునందలి యీ భావములను 'ఆలంకారికత', 'ధ్వని సౌరభము' మున్నగు వ్యాస ములందు కొంత కొంత చర్చించుట జరిగినది. ప్రస్తుతము భావ సంపద గూర్చి విడిగా కొంత విపులముగా అనుశీలించబడును.

## భావౌన్నత్యము :

కావ్యమునందలి భావములను పరిశీలించినచో అవి తరచుగా మహోన్నత ములై విశ్వవైశాల్యము గలిగి వెలుగుచున్నట్లు గోచరించును. దీనికి కారణము మహాభక్తుడు మహానుభావుడు మహాకవి యగు బమ్మెర పోతనగారి మహాశయము లను చిత్తవృత్తిని తెలుపుచు మహాకవియు మహోదాత్తాశయులునగు వరదా చార్యులవారు కావ్యౌచిత్య దృష్టితో భావనచేయుటలో నిట్టి యౌన్నత్యము వైశాల్యము భావముల కేర్పడినవి. పోతనగారి భక్తి తత్త్వముల తాదాత్మ్యము వహించి అభి నవ పోతనగారు భావన చేయుటలో మిక్కిలి యౌదాత్త్యము, ఔదార్యము, దీప్తి, రామణీయకము సమకూడినవి. ఇతర పాత్రలలో శ్రీనాథుడు సింగభూపాలుర వంటి విద్వత్కవి వరేణ్యులును, కేసన తిప్పన చిదానందయోగి వంటి మహోదార చిత్తులును విలసిల్లుటచేత తమపాధికముగా నున్నత భావవ్యక్తికి సముచితావ కాశము కలిగెను.

## విశ్వమును ఈశ్వర స్వరూపముగా భావించుట :

భక్తితత్త్వ విరాజితమైన కావ్యమున అదనొదవినపుడెల్ల సమస్త చరాచర జగత్తు పరాత్పరుడగు పరమాత్మ స్వరూపమని భావించి వర్ణించుట ప్రకృతి పురుషులగు పార్వతీ పరమేశ్వరులే ప్రాణులన్నిటికి జననీ జనకులని భావనచేయుట, ప్రపంచమును విశ్వకుటుంబముగా తలచుట మున్నగునవెల్ల కవిగారి విశ్వవిశాల భావనకు నిదర్శనములు

పోతన సింగనృపాల సేనాపతితో భగవంతుడగు శ్రీరాముని మహిమ వర్ణించుచు విశ్వరూపకత్వము భావించి యిట్లు నిరూపించెను.

> "ధరణితోఁబాటు నీపర తారకలెవానికై నాడు వింత బొంగరములగునొ
> పవలు రేల్ వెలుఁగీను రవి చంద్రులెవ్వాని కరుణాకటాక్ష వీక్షణములగునొ
> ప్రాణి సంతతికెల్లఁ బ్రాణమై యొప్పారు వాయువెవ్వాని యుచ్ఛ్వాసగతియొ
> విశ్వ నాటకమెల్ల వీక్షింపగాఁ జేయఁగోరి యెవ్వడు సూత్రధారి యగునొ
> నిన్ను నన్ను మన్నియను నీ నిఖిల
> భూత కోటినెపుడు రక్షించెడి కోటి సూర్య
> వరకళా భాసమానుఁడై వఱలు నెవఁడొ వాని
> సాటియౌ రాజులీ వసుధఁ గలరె ?"[1]

చరాచర విశ్వమిందు పరాత్పరస్వరూపముగా చక్కగా భావింపబడియున్నది. శ్రీనాథుడు శారదకిచ్చిన జరీచీరను చూచి లక్ష్మి తానును కాంక్షింపగా పోతన జగత్ప్రభుపైన శ్రీరాముడే యట్టి చీర సమకూర్పగలడని యోదార్చిన సందర్భమున రాముని విశ్వప్రభుత్వమును వర్ణించిన పట్టున నిట్టి భావనయే కలదు. 'పర్వతమ్ములుగాఁగ ఐడుగు బండల గుండ్లఁ బనివడియెవఁడు కుప్పలుగఁజోసె'[2] అన్న పద్యమున ఈశ్వరుడే పర్వతములుగా రాళ్ళ కుప్పలు పోసెననియు నదుల రూపమున కాల్వలు తీసెననియు, పరచినట్లు చేలలో పచ్చగడ్డి నలికెననియు, అడవుల రూపమున నానావిధ తరుగుల్మలతావళుల తోటలు పెంచెననియు, చీకటింటి కాపురమెట్లని సూర్యచంద్ర దీపాలను అవసరానుసారముగా వెలిగించి ఆర్పి

1. పోతన చరిత్రము : 7-191
2. ,, ,, : 8-169

వేయుచుండుననియు అత్యంత విశాల భావములు వ్యక్తము చేయబడినవి. ఇదే సందర్భమున ఈలోకమునకు శ్రీరాముడెన్నెన్ని అమూల్యామేయ వస్త్రముల నొసగెనో దిగువరీతిగా కడుబెడగుగా నుడువబడినది.

"అవనీమహారాజ్ఞి కనిపెనే మారాజు పచ్చికమేల్వన్నె పట్టుచీర
గగనకాంతకెవండు కట్టఁబెట్టెను రేయి నీలిరంగుల జరీపూల చీర
దిక్సతికేవేళ తెచ్చియిచ్చునెవండు మంచు వన్నెల సన్నమల్లు చీర
ఇరుసంజలందెవ్వఁడిచ్చు ప్రాక్పశ్చిమాంగనలకు లేఁతచెంగావి చీర
హరిణ శార్దూల శుకపిక హంసకేకి నికర తృణవృక్ష ఫలపుష్పనివహములకు
గల చరాచరాదుల కయి వెలియనట్టి చీరలెవఁడిచ్చు నామహోదారుఁడొసఁగు"[1]

ఓహో! రంగురంగుల పెక్కుభంగుల రంగారు బంగారు చీరలెంత సింగార మొలుకుచున్నవి! అవియు వెలియనట్టి చీరలు! సృష్టిలోని చరాచరముల రంగు రూపులను వన్నెల చిన్నెలవలువలుగా దేవుడు కూర్చిన నిలువలుగా భావనచేయుట కెంత గొప్ప యెద కావలయును!

కావ్యకథాంతమున ఫలశ్రుతిలో శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు తత్త్వోపదేశము చేయుచు ఈ జగమే విశ్వరూపముగా వెలుగు ఈశ్వరుని సేవింపుమని ప్రవచించిన దానిలో 'నీలాబ్దములు కేశములుగా దిఙ్ముఖములు ముఖములుగా సూర్యచంద్రులు నేత్రములుగా రేబవళ్లు కంటిరెప్పలుగా, పెదవు లుభయసంధ్యలుగా, తారలు దంతములుగా, నదులు రక్తనాళములుగా, సముద్రాలు దరకోశములుగా, గిరులెముకలుగా, తరులు రోమములుగా, అఖిల విశ్వమాత్మదేహముగా"[2] వరమాత్ముడు వెలుగొందునని యతని విశ్వరూపము వైభవముగా సంభావింపబడినది.

గజేంద్రమోక్షణ గాథలో గజేంద్రుడు మొరపెట్టుచు శ్రీహరిని స్తుతించినది యిట్లే దిగువ విధముగా భావింపబడి భవ్యముగా నున్నది.

"వాడిపోయిన సస్యవనరుహసంతతిన్ గాంచి పయోదమై కరఁగునెవఁడు
ఘనశాణములఁ దటిత్కరవాలముల నూరి దుర్భిక్షతామారి దునుమునెవఁడు
వినువీథిలో నింద్రధనువునెక్కిడి క్షుధాద్యసుర సంహతినివేఁటాడు నెవఁడు
అర్కేందునయన దివ్యాలోకనచ్ఛవిన్ ఘన తమోయవనికన్ గాల్చునెవఁడు

1. పోతన చరిత్రము : 8-170.
2. ,, , : 10-115 భావము

సాంధ్య రాగమ్ము నెఱపి యీ సకల భూత పుంజమున్ నెమ్మదిగ
నిద్రబుచ్చునెవఁడు
మలయ పవన శీతల హస్తముల స్పృశించి ప్రాణికోటిని మేల్కొల్పు
ప్రభువెవండు"[1]

ఇక్కడ కరుణాళువైన పరమేశ్వరుడు జీవజాలమును కాచుచు ప్రోచుచున్న విషయము మనోహరముగా భావించి వర్ణించుట జరిగినది. ఇందలి 'సాంధ్యరాగము' వంటి శ్లిష్టపదములచేత హృష్టహృదయులు కాని వారుండరు. ఈశ్వరవిలాస రూపకమో యన చెలువొందు ఈ రూపకమునకు తన్మయులు కాని వారుండరు.

ఈశ్వరుని విశ్వరూపముగా భావించిన వానిలో పోతన గంగా సైకతమున శ్రీరాముని సందర్శించిన దృశ్యము మరొకటి.

"నీరదశ్రేణులు నీలాలకములయ్యె
నఖిల దిఙ్మండలం బాస్యమయ్యె.... ....
విశ్వరూపంబు హరిగ సేవించె సుకవి"[2]

అని స్థావర జంగమాత్మక జగమె శ్రీరామచంద్రునిగా సాక్షాత్కరించెనని రమ్యముగా భక్తి గమ్యముగా భావన గావింపబడినది.

నర్సమాంబ దుర్గాదేవిని ప్రస్తుతించినప్పటి

"త్రయ్యంత సారామృత సరోవర స్వర్ణ సరసీరుహమ్ములే చరణయుగళి"[3]
అను వర్ణనలో వెలిబుచ్చిన భక్తి భావన విశ్వరూపకమైనదే.

సకల పదార్థములలో ఈశ్వరుని భావించుటకు శ్రీనాథుడు స్వారి చేసిన బండి యెద్దులలో శివస్వరూపమును

"హరుని పేరురమునా నలరారు ముఖసీమఁ
బన్నతాళ్ళు ఫణులయి పెనఁగులాడ...."

అని యిత్యాదిగా భావన చేసినది తార్కాణ.

1. పోతన చరిత్రము : 12-42
2. ,, : 5-186
3. ,, : 3-180

పోతన గంగానదిని వర్ణించుటలో

"వేదాళి కనురెప్ప వేయక కాపాడు మత్స్యావతార సంపదలు పొదల...."[1]
అని గంగను దశావతార విలసితగా భావించుట యిట్టిదే. ఈ దశావతార భాగవత భావన బాలపోతన శైశవ క్రీడలను వర్ణించుచు

''మత్స్యావతార సన్మహిమంబుఁ జింతించు
ననఁ దొట్టియం జేపయటు నటించు....''[2] అన్నదానిలోను, శివుడు మోహినీ సౌందర్యమును వర్ణించుచు

''మీనంబు పొలసుల మేన్వీడి స్నిగ్ధతం
గాంచఁ దానీలేమ కనులఁ బడియె"[3]

అని విభ్రాంతుడగుటలోను కమనీయముగా గమ్యమానమగును.

లక్కాంబ బాల పోతనకు వీథి భాగవత తత్త్వము విప్పి చెప్పిన చొప్పు నను పరమాత్మ విశ్వరూపము భావింపబడి యున్నది. ఈ భగవద్విశ్వరూప భావన యెల్ల కవి గుండెలో నిండి జాల్వారిన భక్తి రసామృత పూరమే.

ప్రకృతిని తల్లిగా జగముల తల్లిగా భావనచేయుట విశ్వవిశాల భావనకు నిదర్శనము. మావి తోటలో కేసన పోతనకు బోధించిన ఈ విషయము 'సాంప్రదాయికత నవ్యత' వ్యాసము నందలి భావ నవ్యతలో చర్చింపబడెను.

## జగమును గృహముగా భావించుట మున్నగునవి :

జగమునొక గృహముగా భూమిని గంగను తల్లిగా భావించి వర్ణించుట విశాలమైన ఉన్నతమైన భావనా శక్తికి మూదల. చేనిలో పోతన ఆత్మసతిని గూడి క్రీడింప దలచినప్పుడు- అది శరద్రాకా సంధ్యా సమయమగుట నుద్దీపన విభావముగా ప్రకృతి వారికేకాంతమందిరముగా సజ్జీకృతమైనదని భావించుచు నిట్లు వర్ణించుట జరిగినది.

1. పోతన చరిత్రము : 5-49
2. ,, : 1-121
3. ,, : 11-133

''మణిదీపరూపేందు మండల ప్రభ విశ్వ ఘనసౌధమునఁ బాలగచ్చొనర్చె
వరతారకాంచితాంబర వీథి కాచగోళముల శోభిలు వితానములు దీర్చె
పుష్ప సౌరభసముద్భూత మందసమీర బాల సాంబ్రాణి ధూపమ్ము వైచె
శాద్వలాంగణ కృతాస్తరణమ్ము భూస్థలి హరిత కౌశేయ శయ్యల నమర్చెఁ
గీర్ణహిమము పన్నీరుఁ జిల్కించుచుండెఁ జెంఝిల్లికారవములు జోలవాడెఁ
బూర్ణ నిశ్శబ్దశీలయై పోయి రజని ధరణినంత యేకాంతమందిర మొనర్చె"[1]

ఇందు ప్రాకృతిక పదార్థ సముదాయమును దంపతుల కేళికనువగు నేకాంత మందిరముగా విరాజిల్లజేయుట ప్రతిభా విభాసిత భావనా మహత్త్వమే. ప్రథమ సందర్శనవేళ శ్రీనాథుడు

"ధాత్రియై సస్యసంతానమ్ము నొడిగట్టి జీవనస్తన్యమ్ముఁ జేపి కుడిపి .."[2]
అని భూదేవి తల్లియై పైరును కూతురుగా పెంచి రైతునకప్పగించినదని భావించిన దానిలోను, పోతన గౌతమీ వర్ణనలో

"పొలుపారు సైకతమ్ముల పొత్తిలి రచించి
సుందర దృశ్యములందగించి''[3]

అని గంగానది మాతయై ప్రజలను సంతతిగా లాలించి పాలించుచున్నట్లు భావించుటలోను రమ్యమైన మహోన్నత భావన వరలుచున్నది.

## వర్ణముల నుదాత్తముగా భావించుట :

కావ్యమున అయా వ్యక్తులను వస్తువులను వర్ణించు సందర్భములందు ఉదాత్తముగా భావన చేసి ఉత్కృష్టముగా నుపమించి చెప్పుట కానవచ్చును.

వ్యాసుని ఆశ్రమమును వర్ణించుచు

"అనవరతాధ్యాయ నావర్తనోన్మత్త
శుకతతుల్ శుకమహర్షులయి వరలె''[4]

---

1. పోతన చరిత్రము · 3-185
2. పోతన చరిత్రము : 2-162
3. ,, ,, : 5-42
4. ,, ,, : 1-22

అని యిత్యాదిగా ఆశ్రమములోని చిలుకలను శుకమహర్షులుగా సింహములను శ్రీహరులుగా, నెమిళ్ళను శంకరులుగా, మేకలను బ్రహ్మలుగా - ఈ యన్ని యిట్లు పెంపొందుటకు కారకుడగు వ్యాసమునీంద్రుని బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపముగా భావించుట నిస్తుల తపోమహిమానురూపముగా ఉన్నతమై ఉచితత్వభాసురమై యొప్పుచున్నది.

ఇదే రీతిగా ఏకశిలానగర వర్ణన

''కల్పవృక్ష శోభల సస్యకాండ మమరుఁ
గామధేను వైఖరుల గోగణము దనరు
క్ష్మాతల స్వర్గమవని నోర్గంటి పురము''[1]

అని యుదాత్తోపమ్యశోభితముగా భావించి వర్ణింపబడినది. మరియు పోతన శ్రీనాథునితో కవి మహిమ వర్ణించుచు

''మహిన స్తమింపని మార్తాండ బింబమ్ము
క్షయ మెరుంగని పూర్ణచంద్రముండు''[2]

అని యీ విధముగా కవిని సూర్యునిగా, చంద్రునిగా, అక్షరలక్ష్మికి ఆత్మవిభునిగా కాలవాహిని గెల్చు ఘనవిజేతగా భావించుట యుదాత్తతా రమణీయము.

శ్రీనాథుడు పోతన గుణరూపములను గాంచి

''ఈ కళానిధిఁ గాంచి లోకమ్ముకిడు తల్లి వెలఁదియే ధరఁ బాలవెల్లిగాక''[3]

అని తలపోసిన దానిలో పోతన తల్లిని పాలసముద్రముగా, తండ్రిని చంద్రశేఖరునిగా, అతని ప్రదేశమును విజ్ఞాన కోశముగా, అతని కావ్యభాషను వాగ్దేవీభూషగా, అతని నిలయమును పుణ్యతీర్థముగా భావిలచుట మహోదాత్త భావనాపటిమకు మనోజ్ఞ ముకురము.

ఇట్లే బమ్మెర రామాలయమున భాగవత ప్రవచనము చేయవచ్చిన బ్రాహ్మణుని

1. పోతన చరిత్రము : 1-81
2. ,, ,, : 2-164
3. ,, ,, : 2-178

"గురు మౌఢ్య రహిత గురుఁడో విరూపనయన స్వరూపవిరహిత హరుఁడో పరివర్జిత చిహ్నసుధాకరుఁడో"[1] అని బృహస్పతిగా శివునిగా చంద్రునిగా సంభావించి యౌదాత్త్యము ప్రకటింపబడినది.

పోతన యుపదేశ కవిత విని యువక భూస్వామి భావించిన తీరు మిక్కిలి గొప్పగా నున్నది.

"నీదు సుకావ్యము కర్ణాహ్లాదంబిడె భారతీకరాంచిత వీణా
నాదంబై కృష్ణార్జున వాదంబై సామవేద వరపాదంబై"[2]

గృహమున కేతెంచిన శ్రీనాథుని కేసన సత్కరించి యిట్లు వచించెను.

"శ్రీమందాకిని లోకపావని ప్రజాక్షేమార్థమై స్వేచ్ఛగా
హైమాద్రిన్వెస వీకి సాగర వరాహ్వానమ్మునన్ బోవ మ
ధ్యేమార్గస్థ వినమ్ర వేతసతరూద్దీప్తిన్ ప్రసాదించు న
ట్లే మీ యాత్రల మాకయత్నముగఁ గూడెన్ వాంఛితార్థమ్మిటుల్".[3]

గంగ హిమాద్రినుండి సముద్రమునకు చేరబోవుచు మార్గమధ్యమున వంగిన ప్రబ్బలి చెట్ల కభ్యుదయము ప్రసాదించునట్లు శ్రీనాథుడు తన యాత్రలో కేసన కుటుంబమును ధన్యము చేయునని చేసిన భావన సంభావనమై సముచితమై విరాజిల్లుచున్నది. ఇట్లే యనేక సందర్భములలో ఉదాత్తభావ వ్యక్తీకరణ జరిగియున్నది.

## పవిత్ర భావములు :

పూత చరిత్రుడగు పోతనగారి గాథలో ఆయా పాత్రలయెడ పవిత్ర భావములు వెల్లడి చేయబడినవి.

పరాభవ దుఃఖితయై వచ్చుచు దారిలోనెదురైన పేద జవరాలి దుస్థితిని గాంచి పోతన యుత్తరీయము మీదవైచి సాదరముగా బలికిన దిగువ మాటలతని పావన హృద్గత భావములను ప్రకటించుచున్నవి.

1. పోతన చరిత్రము : 1-102
2. ,, ,, : 2-121
3. ,, ,, : 2-193

"పల్లియలక్ష్మివో యనఁగ భాసిలుచున్న భవత్స్వరూప మో
తల్లి ! స్వమాన రక్షకిటు తల్లడమందఁగఁ జూడఁజాల నా
చెల్లెలివంటిదానివని చిత్తమునం దలపోసి నీకిదే
యొల్లియ గాఁగ నావసన మొక్క డొసంగెద స్వీకరింపుమా"[1].

ఇందు పోతన నవయౌవన మందుండి యువతియు సుందరాంగియు నగు పర స్త్రీని చూచి 'మాతృవత్పరదారాణి' యన్నట్లును, 'కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావనచేసి మరలు' ప్రహ్లాదుడో యన్నట్లును తల్లియని సంబోధించి సోదరిగా ఆదరించి, వట్టి ఇచ్చకాలాడుట కాక దిక్కుమాలినదగు ఆమె మాన సంరక్షణకు తన యొంటిమీది కండువా యిచ్చిన పోతన భావము కవులకే కాదు సమస్తజనులకు ఆదర్శమై యొప్పుచున్నది. ఇదే సందర్భములో వస్త్రము తీసికొనుటకు వెనుకాడుచున్న భార్యతో ఆమె పెనిమిటి 'దేవునంతటివాఁడయ్యె తీసికొనుము వస్త్ర' మనుటయు వాని పూజ్య పవిత్ర భావములను వ్యక్తముచేయుచున్నది. దీన భిక్షుకుని యెడ భావములును నిట్టివే.

బమ్మెర రామాలయమున సాగుచున్న భాగవత ప్రవచనము వినవచ్చిన గర్భవతి లక్కాంబను 'హవనవాటి లోని యరణిపాత్ర'[2]గా నుపమించుట పావన భావనకు నిదర్శనము. ఇంటికి వచ్చిన శ్రీనాథునికి నమస్కరించి కేసన,

'సదయత మీరరుదెంచుట సదనమ్మె పవిత్రమయ్యె సాహిత్యనిధీ![3]
'నేడే కృష్ణాష్టమి యీనాఁడే శ్రీరామనవమి నాభాగ్యమ్మీ
నాఁడే దీపావళి యొనగూడెన్ దమ రాకవలన కులము తరించెన్'[4]

అని సంభావించిన విషయము కేసనపూతభావ సంజాతమునకు తార్కాణ.

ఇంటికి వచ్చిన రామశర్మను పలుకరించిన తీరులోను నిట్టి సమ్యగ్భావములే వ్యక్తీకరింపబడియున్నవి. ఇట్లే అనేకానేక సన్నివేశములందిట్టి భావములు పాఠక భావములను విశుద్ధమొనర్చుచుండును.

1. పోతన చరిత్రము : 2-84
2. ,, ,, : 1-107
3. ,, ,, : 2-182
4. ,, ,, : 2-183

## సుందరభావములు :

పోతన చరిత్రమున నెందు గాంచినను మధురమంజులభావములు ప్రసూన గుచ్ఛములవలె భాసిల్లి యెదలను గుమగుమ లాడించును. ఉత్తుంగ హిమగిరి శృంగములందు విహరింపజేయును. ఇందలి భావ తరంగములు పాఠకుల నానందామృత సాగరమున నోలలాడించును. నవరత్నఖచిత నవభూషణములవలె దివ్య కాంతులు వెదజల్లి మరపుగాకుండజేయును. వేయేల యిందలి భావములు.

"చెప్పఁగ వలెఁగప్పురములు కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపైఁ
గుప్పిన క్రియ విరిపొట్లము విప్పినగతి గుమ్మనన్ గవిత్వము సభలన్"

అని రఘునాథ భూపాలుడన్నట్లు గుమ్మనుచు పారవశ్యము కలిగించుచుండును. కావ్యమున సర్వత్ర సాంద్రముగ శోభిల్లుచున్న యిట్టి సుందర భావములలో నొక కొన్నిటిని మచ్చునకు ప్రదర్శింతును.

బమ్మెర గ్రామసీమలో పండిన పంటచేలను తిలకించగా నెట్టి సుందర భావములు, జుమ్మని వెలికి చిమ్మినవో దిగువ పద్యమువలన తెలియును.

"ముత్యాలచెండ్లెత్తి మురిపించు జొన్నచేల్ కర్షకశ్రమ బిందు ఘనతఁదెల్పు
బంగారు గొలుసుల బరువుల మెడవంచు వరలక్ష్మి పాలేఱు పరుస విప్పు
వెండికొండలు చెట్లఁబండించు ప్రత్తిచేల్ పశుపతిత్వము రైతుపర మొనర్చుఁ
జింకబిడ్డలఁగొంచు సాఁకెడు మొక్కచేల్ ప్రజ కాఁపు చంకపాపలని చూపు
మేలిపంట పొలాల నాఁగేలుచాలు శ్రీమహాలక్ష్మియైన యా సీతనేలు
నేల నవధాన్య రత్నభూషాలిఁదాల్చి పాఁడిపంటల ముల్లె యీపల్లె యనఁగ"[1]

తెల్లని విత్తులుగల జొన్నకంకులు కఱ్ఱల పైభాగమున కదలాడుచుండగా అవి ముత్యాల బంతులెత్తుకొని ముద్దుగొల్పుచున్నట్లు తోచును. మరియు వానిని పరిశీలింపగా కష్టపడి పెంచిన రైతు చెమట బొట్లే జొన్నవిత్తులుగా రూపు దాల్చినవి యనిపించును. పసుపు గొలకలు బాగుగా వేసి వంగిన వరి బంగారు గొలుసుల బరువులచే మెడవంచు లక్ష్మివలె సాక్షాత్కరించి లక్ష్మికి జన్మస్థానమైన పాల సముద్రమువలె అ వరిపొలము భాసిల్లును. సమృద్ధిగా ప్రత్తి పండిన చేలు వెండి కొండలవలె కనబడి వాని మధ్య పొలుచు రైతు శివునివలె చెలువొందుచుండును.

1. పోతన చరిత్రము : 1-87

ఏపుగా పెరిగి యెన్నులు వేసిన మొక్కజొన్న కఱ్ఱలు చంకలో బిడ్డల నెత్తుకొని సాకుచున్నట్లగపడి ప్రజలు కాపువాని చంకపాపలు - అతడిచ్చు అన్నము తిని పెరుగువారు- అన్న విషయము విశదము చేయుచుండును. ఇట్లు వరుసగా జొన్న చేలవలన రైతుశ్రమ, వరిచేలవలన సిరి, ప్రత్తిచేలవలన ఐశ్వర్యము లేదా పశు సంపద, మొక్కచేలవలన ప్రజాపోషణ వ్యంగ్యముగా వ్యక్తమగుచుండును. మఱియు మేలైన పంటలొసగు నాగేలు చాలు శ్రీమహాలక్ష్మియగు సీతాదేవిని స్ఫురింపజేయును. సీతయన భూసుత నాగటి చాలు అను నర్థద్వయమిచటు అందముగా నన్వయించుచున్నది. పశుపతిత్వ మనునదియు ఈశ్వరత్వము, పశు సంపద్వ్యాజమాన్యము అను నర్థముల విరాజిల్లునున్నది. ఇట్లు నవధాన్యములను నవ రత్నములు పొదిగిన నగలు దాల్చి వగలొలుకు పల్లె పాడిపంటలకు ముల్లెయై విభాసిల్లుచున్నది. సామాన్యమైన పంటచేల నింత సుందరముగా విశిష్టముగా భావించి నాగరికులగు పాఠకులను పలెపట్టుల వైపాకర్షించు చున్నారాచార్యులవారు. ఇట్లే గ్రామసీమా వర్ణనములోని పద్యములు హృద్యభావ విలసితములైయున్నవి.

మార్గమధ్యమున తోటలోని మావిచెట్లను గాంచి కేసన భావించిన తీరు రమ్యరమ్యముగా నున్నది. 'రంభలు రామచిల్కలయి రక్తిని నాట్యము లాడుచుండ'[1] అను పద్యమున రసాలసాలమున అప్సరసలు రామచిలుకలయి నాట్యమాడుచుండ దేవగాయకులు కోకిలలై పాడుచుండ కిన్నరులు తుమ్మెదలై కిన్నరలు మీటగా 'ఒకే స్తంభపు మేడ గానపరిషత్తు రచించి రయారె! ఖేచరుల్' అని భావించుట లోకోత్తరముగా నున్నది. దేవతలు మామిడి చెట్టు నొంటి స్తంభపుమేడ చేసికొని ముందు 'గానకచేరి' కావించుట పాఠకుల నానంద పరవశులను చేయుటకే.

పై సందర్భమునందే మన్మథుడు వీరశృంగార రసములను ప్రసరింప జేయుట కనువగు వసంతములో సుందరీ జనుల యధరములవలె నరుణమగు పల్లవములలో 'ఇవపు మంటల యగ్గి రవులఁ జేసి' తన ప్రతాపము చూపెనని వర్ణించుటలో చిగుళ్ళను ఇవపు మంటలనుట ఓహో! ఏమి భావన! ఇట్లే పద్యమెల్ల భవ్యముగా సాగినది

సాధారణ దృశ్యములలో సంగీతాది కళలను దర్శించి ప్రదర్శించుట ఆచార్యుల వారి భావనా విశిష్టత. మామిడి చెట్టుపై గానసభ ఏర్పాటు చేయించిన కవిగారు జానపదుల చేతలలోను గీత వాద్యములను కీలింప జేసినారు.

1. పోతన చరిత్రము : 1-168

"మోటఁ దోలు చొకింత మ్రొగ్గి దండెడ తంత్రి శ్రుతిజేసి పాడెకి చోఁటకాఁపు
మిరపతోఁటల నలింబెఱుకు గాజులచేతఁ జిటుకు తాళము గొట్టు చిన్ని
పడుచు
పచ్చికన్లేఁగల భరతనాట్యము ప్రక్క బిల్లగ్రోవిని నూఁదు గొల్లబుడుత"[1]

ఉదయవేళల నిది యెదలకదలింపగా అస్తమయ సమయముల వారి గీత
ములు చేతముల నుఝ్ఝూత లూగించును.

"తాలవృక్షమ్ములు తలలూఁపఁ జుక్కలనాడు గాత్ర ధ్వనిఁ బడు గౌఁడు
చేలెల్ల నానందడోలల నూఁగ మంచియనెక్కి పాడు కృషీవలుండు
కలరుతమ్ములను గోకిల లాలపింపగాఁ గొసరిపాడును బూరిగోయి తరుణి
మ్రాఁగన్ను నిడి మేఁత మఱచి గోవులు నిల్వఁ బిల్లఁగ్రోవిని నూఁదు
గొల్లబొట్టె"[2]

ఇట్టి మనోజ్ఞ వాతావరణములో పల్లె పోతనయేకాదు పట్నపు శ్రీనాథుడును
పరవశించి కవితలు పాడవలసినదే. అదేమి స్థానబల విశేషమో కాని బమ్మెరలో
అడుగు పెట్టిన ప్రతివస్తువు సంగీతము లాలికించునన్నట్లు శ్రీనాథుడెక్కివచ్చిన
స్వారిబండి బమ్మెర పొలము తలమునకు

"చక చక గిత్తల కదుముకు త్రకిట ధికిట ధకిట ధామృదంగ ధ్వని టక్
టికుమను కేదారాహతి నికట తటిని శకటమొకటి నిల్చిన యంతన్".[3]

అనురీతిగా వచ్చినట్లు వర్ణితమైనది.

శృంగారరస విసారముగల నవవధువు నర్సమాంబ వర్ణనము మిగుల
సొగసైన భావములతో వరలి యున్నది.

'అభ్యంగనపుఁ బచ్చియార్చు పెన్నెరులలో శృంగార వార్ధి తరంగమడర'[4]
అన్న రమణీయ భావభరిత పద్యమున 'లేమ తారుణ్యా నందనారామ సీమఁగంతుఁ
డెదపొంగ బంగారు బంతులాడ' అని భావించినది భావభవునకు మర్యాద తప్పని

1. పోతన చరిత్రము : 2-10
2. ,, : 8-4
3. ,, : 2-159
4. ,, : 2-243

సభ్యత నేర్పి రసజ్ఞులకు తనివి తీరని శృంగార క్రీడ నాటించుచున్నది. పెండ్లి చవికె చెంతకేగు నర్సమాంబకు లజ్జామోదములు పెనగొన్న భావ విలాసమును దెలుప

"కన్నులను వెన్నెలలు గాసెఁ గలికి సొగసు నవ్వులన్మల్లియలు బూచె నాణ్యమైన
గొంతు కోఁగోకిలలు గూసెఁ గొమరికొసరి నడల రాజహంసలు కాళ్ళఁబడుచు డాసె"[1]

అని యనుటలో కన్నుల వికాసములను వెన్నెలలుగా నవ్వులను మల్లెలుగా ఇత్యాదిగా భావించిన యౌపమ్యము ధ్వని విలసితమై వినోదము కలిగించుచున్నది.

ప్రథమరాత్రి పోతన వ్రతభంగభీతి విముఖుడై యుండ నిరాశాహతయైన సతికి పతికనుల యెదుట సెజ్జపై నుండియు చేరరాని యంత దూరాన నుండె ననుటకు 'చేతి దర్పణమునఁ జెలువారు శశిబింబ మందరానిచోట నలరునటుల'[2] నున్నదని భావించుట మిక్కిలి యుక్తియుక్తముగా హృదయంగమముగా నున్నది.

మెరుపు తీగ నెందరు చూడరు? ఎన్ని మారులు చూడరు? కాని ఆచార్యుల వారి రసమయ దృష్టి విశిష్టమైనది. అది దొరసానివలె భాసిల్లినది.

"ఎప్పుడొక యింత యెండకన్నెఱుఁగనట్టి మెఱుపు దొరసాని మబ్బుల కురులలోన
సింగిణియును దానొకవంక రంగులీను పూలదండఁ గీలించె నందాలు గులుక"[3]

ఎప్పుడును ఎండకన్నెరుగదని యనుటలోనే యున్నది చమత్కారము. అంతటి సుకుమారికి ఇరులు గురియు శరదములే కురులు. ఆకురులలో ఏడు వన్నెల సింగిణిని పూలదండగా సింగారించుకొన్నదట! ఇట్టి విచిత్ర భావ చిత్రము నెన్ని మారులు దర్శించినను తృప్తి కలుగదు కదా!

వానవెలిసిన పిమ్మట దృశ్యములను వర్ణించుచు

'పగిలెఁ జేయి జాఱిపడి యద్దపుఁ జెక్కమ్మ లనఁగ నిలిచె మడువులందు జలము
అద్దములను దాపినట్టి పచ్చనికోక లాఱగట్టె శాద్వలాంగణములు'[4].

1. పోతన చరిత్రము : 2-248
2. ,, : 2-246
3. ,, : 3-112
4. ,, : 3-146

అని మడుగులందు నిలిచిన జలములను పగిలిన యద్దపు బిళ్లలుగా, పచ్చిక బయళ్ల నద్దాలు దాపినట్టి పచ్చని కోకలుగా నూహించుట కడుంగడు రమ్యముగా నున్నది. ఇందు అబ్దమనగా మేఘము, అద్దము కావున ఆహ్లాదకరశ్లేషయమరినది.

భామాకర స్పర్శ యెంత ప్రభావము చూపునో పోతన సతీకరస్పర్శనంది పొందిన యనుభూతి నిట్లు తలపోసెను.

"మధుపానమ్మొనరింపకుండఁ గనులన్ మత్తెక్కు వైశ్వానరున్
విధి సేవింపకముందె మైసకలమున్ వేఁడిన్ దపించున్ సుమా
యుధ పుష్పాస్త్రము లంట కుండఁగనె దివ్యోగ్రాక్షసంకాశుడున్
బ్రధనమ్మందు జితోస్మియన్న నరుఁడౌ భామాకర స్పర్శచేన్"[1]

మదిర సేవింపకయే మత్తెక్కుట, అగ్ని కాచుకోకుండానే తాపము కలుగుట యను మదనతాపపు విచిత్రావస్థను వెలార్చుట మంజులముగా నున్నది.

శ్రీనాథుడు భార్యా వియోగము నంది పోతన యింటికి వచ్చి దుఃఖించుచు స్త్రీపురుషుల వ్యథల భేదము నిట్లు వచించెను.

"మగువల వెతవలెఁ బొంగక మగవారల వ్యథలు లోనె మసలును గాష్ఠా
ధిగతాగ్ని పొగల మంటల నగపడు నగపడునె తప్తమగు లోహమునన్"[2]

ఇచట స్త్రీల వ్యథ కట్టెనుగాల్చు అగ్నిసెగల పొగలవలె బయటకు వ్యక్తమై పురుషుల వ్యథ తప్తలోహమువలె లోలోపలనే క్రమ్ముకొని యుండునని సముచితౌపమ్యముతో భావించి చెప్పబడినది.

శ్రీనాథుని సింగనృపతి వనవర్ణనలో పాత్రోచితమైన శృంగార భావ వ్యక్తీకరణ చెలువు మీర కావింపబడినది. మబ్బుకన్నియలు చందమామను వలపించుటకు చేసిన సింగారములు

"నెలరాజున్ వలపింపఁగా సురనదిన్ నీరాడి"[3] యను పద్యమున వర్ణించుచు మబ్బులను సుందరీమణులుగా భావించి ప్రదర్శించిన రూపకము రుచిరము

1. పోతన చరిత్రము : 3-171
2. ,, : 3-322
3. ,, : 4-118

యున్నది. ఇట్లే ఆయా లతలను లలనలుగా రూపించి వర్ణించిన దిగువ పద్యము లందలి భావము లెంత బంధురములైనవో సహృదయులు గుర్తింపగలరు.

"కన వ్యూహములఁ బన్ని కంటి పాపల రెంటి
బంధించెను గులాబి పడఁతి యొకటి"[1]

"తాంబూల చర్వణ దంత పంక్తులతోడి
దరహాస మొనరించు దాడిమమ్మ"[2]

"తొలిమబ్బు తెరనుండి తిలకించు చుక్కల
దొరఁగాంచి కనుగీఁటు తొవ పడంతి"[3].

ఇత్యాదిగా రమ్యముగా రసవంతముగా లతలు భావన గావింపబడినవి. ఇదేవిధముగా పోతన పెరటిలోని పొట్ల మున్నగు చెట్లను చెలువలుగా భావించి సాంసారిక కార్య కలాపములను సాగించినట్లు వర్ణించిన విషయము 'సాంప్రదాయికత, నవ్యత' వ్యాసమున వివరింపబడెను.

పోతన తన పారలౌకిక చిత్తవృత్తి కనుగుణముగా వనవర్ణన చేసినదానిలో తరువులు తపస్సు చేయుచున్నట్లు దిగువ రీతిగా రమ్యభావన కావింపబడినది.

తలక్రిందుల్ తపమున్ బొనర్చు నిటులీ ధాత్రిన్ తరువ్రాత మే
ఫలసిద్ధిన్ మదిఁగోరియో పవనమున్ బానీయమున్ గ్రోలి ని
శ్చల చిత్తంబులె నెండవానల శ్రమల్ స్వాంతమ్మునందోర్చి ప్రా
ణులకర్పించును దత్ఫలమ్ము లివియేనో సత్తపోధ్యేయముల్"[4]

భోగిని విరహిణి యగు రాధికగా నృత్యాభినయ మొనర్చుచు పొందిన సాత్త్విక భావములను ప్రకటించిన 'బడి బడిం బరతెంచు బాష్ప ప్రసవంతిలోఁ దిగజారు మంచి ముత్తెముల పేరు'. అన్న దానిలోని పరమ రామణీయకత 'భోగినీ నృత్య సౌందర్యము' వ్యాసమున చర్చింపబడెను. ఇట్టి రసవత్తర భావసంపదకు కావ్యము కాణాచియైయున్నది.

1. పోతన చరిత్రము : 4-115
2. ,, : 4-116
3. ,, : 4-120
4. ,, : 4-125

ఆచార్యులవారికి పోతనగారికి వలెనే మాతృభక్తి మిక్కుటముగా గలదు. ఋణము తీర్పరానిదని పోతనద్వారా వెలిబుచ్చిన దిగువ భావములు వానికవియే సాటి.

స్వప్రణయార్థ సర్వస్వము వెలనిచ్చి ననుగొంచు గర్భముననిడి దాచి
తన పుత్రుడనిపించుకొనుటకు నాదు తనువుకై రక్తమ్ము ధారవోసి
యదలు నెక్కడనో గర్భాందోళికా మధ్య నాకని రాయంచనడ జరించి
క్రొత్తచుట్టము ననుకొనుచు నల్పాహారముల దన్ను రుచులు కోర్కులని
కుడిచి
తివిరి దశమాసముల దశేంద్రియ విశిష్టమైహికాముష్మికాను భవాతియోగ్య
మైన యీమేను తనదు గర్భాంతరమున దీర్చి యిడు తల్లి ఋణమోగు
తెరువు గలదె"[1]

తొలిదైవమగు తల్లిఋణమే కాదు, ఇట్టి యసదృశరసార్ద్ర భావములు ప్రకటించి పాషాణ చిత్తునకును మాతృభక్తి కుదురునట్లు చేయు కవిఋణమును తీర్పరానిదే.

ఇక దుర్మదాంధులగు రాజులను నిరసించుచు మును జన నప్పు మించి చను ముఖ్యుడవా యను'[2] పద్యమున క్ష్మాపతి పల్లేరు కాయవలె నెట్లు మెదలినను మెచ్చక పీడించునని చక్కని యుపమానముతో భావించి చెప్పబడినది.

పోతన గౌతమిని, సంధ్యారాగముల విరాజిల్లు తత్పరిసర ప్రదేశ రామణీయకమును భావించిన తీరు ప్రశస్తముగా నున్నది.

"సంధ్యాతపాగ్నిలో జాతరూపనగమ్ము కరగి పాఱిన యట్టులరుగు
జలము
జలపూరములలోన దలక్రిందుగా దపోవిధిబూని బింబించు వృక్షరాజి
వృక్షబింబమ్ములన్ విరిడోలలూగెకే యఖిలార్భకుల తోచనాడు సవిత
సవితృ బింబమునకు సరసంపు గతి దాగురింతనేర్పెడి లహరీ ప్రతతుల
బొదల నుదకనారాయణు సదమలాంత రంగమున దివిభువుల కుత్సంగ
మనుచు

1. పోతన చరిత్రము : 4-333
2. ,, : 4-395

బైనఁగల మిన్ను నడుమనఁ బరఁగు మన్నుఁ గూడ నొకసారి నీలోనఁ
జూడజేతు"[1]

ఇట్టి భావ వ్యక్తీకరణకు సునిశిత ప్రకృతి పరిశీలనతోబాటు సుందర కళాదృష్టి యవసరమై యుండును. కలపుకుంచెతో కవి చిత్రించిన యిట్టి రమణీయ భావ దృశ్యములకు వెలకట్టలేము.

గంగాసైకతమున నుదయించిన చంద్రుని భావించిన సొగసు తిలకించి తీరవలసినదే.

"కడు సున్నితంబైన యొడలంచు నే ప్రొద్దు నెండకన్నెఱుఁగనీకుండ సోఁకు
నెవరి కండ్లెట్లుండినవొ యంచు నెడనెడఁగావిరి బొట్టు మొగానఁబెట్టు
పాల్గారురూపులే పగలురాతిరియేమి సోఁకునోయని మబ్బుకోక గప్పు
నొకడున్న వెఱపొందు నొకొ బేల యితఁడని చుక్కబాలికలను జోడొనర్చు
లేకలేకొక్క కొడుకు రత్నాకరునకు నందముల కుప్ప చందప్ప యద్దియేమొ
నాల్గునాల్గు నాళులకును నసితెవులుఁ గొనుచు మొనమొన్ననే తేరుకొనె
నొకింత"[2].

రత్నాకరుని కుమారుడు అతి సుకుమారుడు అందాలకుప్ప చందప్పను కడు మెలకువతో పోషించినట్లు వెలిబుచ్చిన భావాలు గమ్మత్తుగా ఉన్నవి.

గంగామతల్లిని గూర్చి

"కలశపాథోరాశి క్రాఁగు పొంగును ద్రోసి
యురికి వచ్చిన పాలనురువువేమొ"[3]

అని యిత్యాదిగా చేసిన యుత్ప్రేక్షలుత్కృష్టముగా నుండి యామె సౌందర్యమును శక్తిని పవిత్రతను ప్రకటించుచున్నవి. గంగ పుట్టిన చోటునుండి అడుగు పెట్టిన సంద్రము వరకేకరూపముగా నుండుట కూహించిన కారణము కమనీయముగా నిట్లున్నది.

1. పోతన చరిత్రము : 5-17
2. ,, : 5-27
3. ,, : 5-45

"సతికిఁ బుట్టింట నున్నచోఁ బతివిరహము
స్వామికుటినున్నఁ బుట్టింటఁ జనెడి కాంక్ష
యనుచు నాసుబోసిన యట్టులచటికిచటి కేక
రూపమ్ముతో నన్వయించి యుందా"[1]

గంగమ్మ మహారాజ్ఞికి గ్రాలునట్టి ఘనవైభవ మెట్టిదో కవిమభావ దర్పణమున నిట్లు ప్రతిబింబించుచున్నది.

"కొమ్మలు చామరమ్ము లిరుగోవల వీచుచునుండి పుష్ప వ
ర్షమ్ములు గొట్ట, భూమిరుహ సంతతులిట్టటు నిల్చి యాతప
త్రమ్ములు బట్ట. రేఁబవలుఁ దార లుదారులు చంద్ర సూర్యులున్
సొమ్ములు బెట్ట నందరము సొంపుల చీరలుగట్ట రాణివై "[2]

ఘనుడగు మేఘుని గూర్చి వెలార్చిన యుజ్జ్వల భావదీప్తి కెంతటి ఘనుల మనసు లైనను కరగి పోవలసినదే.

"ఎవనికై సింగిణి నవరత్న ఖచిత సుస్వాగత ద్వారమై చదల మెఱయు
ఎవనికి దివి సాఁగు నేకాధిపత్యమ్ము సూర్యచంద్రుల తేజి చూడలేరు
ఎవ్వాని కలయిక నెలమి భూదేవికిఁ బులకలై సస్యంపు మొలకలెదుగు
ఎండి నీర్నీరని గుండెవ్రయ్యఁ దటాకమెండఁడప్పులిడ నింత యెగసియాడు
ధరకేఁవడు జీవనములన్ని ధారవోసి
యంతరించునో సుకృతీగతాయు వనఁగ
నట్టి ఘనుఁడు ఘనాఖ్యతో నలరఁడెట్లు? వానిపై నగ్రపీఠికన్ వైవదెట్లు?"[3]

ఇందలి యొక్కొక్క భావ మొక్కొక్క ఆనంద సౌధసోపానము నెక్కించు చున్నది అమృత రసవృష్టిలో చొక్కించుచున్నది.

ఋతు వర్ణనలో వెలువరించిన భావములు రసగుళికలై రాజిల్లుచున్నవి. ఇంతవరకు కొంత వర్షర్తుగురించి తెలుపబడినది. ఇక ఋతువుల రాణియగు వసంతములో నొకింత విహరింతము. కొమ్మలెల్ల సింగారించుకొని దక్షిణ నాయకుడగు ప్రియవసంతు నలరించుచున్న దృశ్యమును తిలకింపుడు.

1 పోతన చరిత్రము : 5-46
2. ,, : 5-52
3. ,, : 5-184

"లక్ష వత్తుల దీప వృక్ష దీధితుల హారతులిచ్చె కింశుక ప్రసవ వనిత
మధుపూర్ణచషక సంపన్న హస్తాబ్జయై నెమ్మిగాంచెను పద్మినీ లతాంగి
మంజులధవళ చామరపుంజ పాణియై విసరసాగె శిరీష కుసుమయోష
చివురుకేలెత్తి యంచిత పికామృత కలస్వన మొప్పఁ బిల్చె రసాల బాల
లేఁతయాకు పయ్యెదమాటు లేమ రంభ మధుర

ఫల భోజనములిచ్చె మాధవునకుఁ

గొమ్మలెల్ల సింగారించుకొని రహించి ప్రియ

వసంతునిపైఁ బూలవృష్టిఁ గురిసె"[1]

ఇందు ఆయా వృక్షములు ప్రియాంగనలై, వేంచేసిన వసంతునికి హారతులిచ్చి మధుచషక మందించి చామరము విసరి ప్రియమార పలుకరించి మధుర ఫలాహారముపెట్టి పుష్పులుచల్లి వేడుక చేసెనని భావించిన రీతి మధుర మంజులముగా నున్నది. ఈ కొమ్మలు వసంతునికే కాదు వచ్చిన వారి కందరికిట్లే సంబరము గావించు చుండును.

హేమంత ఋతు వర్ణనలో

"వరుణుండు చలిగ్రాఁగ విరచించి కొనినట్టి
పండు నిప్పుకల కుంపటి యనంగ"[2].

అని యస్తమించు సూర్యునియెడ గుప్పిన యూహల గొప్పతనము 'ఆలంకారికత' వ్యాసమున చెప్పబడెను. ఇదే సందర్భపు సాయం వర్ణన యిట్లు చేయబడినది.

"పిలిచెను గూళ్లు పుల్గులను విశ్వము సాంధ్య కళారుణాబ్ధిలోఁ
గలిసెను లోకజీవనద కార్షక దేహ నిదాఘ వృష్టియున్
వెలిసెను శ్రాంతినిన్ గనక వేసరుగోతతి పాద మొక్కెడన్
నిలిచె దినమ్ము పై నిశలు నిప్పులు గ్రక్కెను దారకాకృతిన్"[3]

ఇజదులో అస్తమయ వేళా గ్రామీణ దృశ్యములు హృద్యముగా వర్ణింపబడినవి. ఈ వర్ణనకు మనోజ్ఞభావములు ప్రాణము పోసినవి. విశేషించి అంతట

1 పోతన చరిత్రము : 6-4
2. ,, ,, : 8-37
3. ,, ,, : 8-38

సంధ్యారాగములు వ్యాపించుటను విశ్వము సాంధ్యకళాయణాబ్ధిలో గలిసెననుట చాల బాగుగా నున్నది. అంతకంటె నిశలు తారకాకృతిలో దినముపై నిప్పులు గ్రక్కుట రమ్యతరముగా నున్నది.

శివుడు మోహినీవిలాసములు గాంచి ముగ్ధుడై మదన తాపమును పొందిన విషయము దిగువ విధముగా వర్ణింపబడినది.

> ''నిశి పొగయై దిశాతతుల నిండఁగఁ దారలు విస్ఫులింగ రూ
> పశతములై దివమ్మున విభాసిల, వాయువు లూఁదుగాడ్పులై
> దిశలకుఁ బ్రాఁకఁ గ్రొన్నెలయె దీపశిఖాకృతి జ్వాలలెత్త సూ
> నశరుఁడు పాంథచిత్త సదనమ్ములఁ జల్లఁగఁగాల్పఁ జొచ్చెడిన్''[1]

మన్మథుడు చంద్రరేఖను దీపశిఖగా జేసి చీకట్ల పొగలు చుక్కల మిణుగురులు వ్యాపింపగా చల్ల గాలుబూది మంటలు రెపి విరహులను చల్లచల్లగా గాల్ప దొడగి నాడనుట నిర్భర రమణీయ భావనకు నిదర్శనము. మన్మథ పీడ నిప్పులేని మంట కావున చల్లగా కాల్చుట యన్నది సమంజసము. రూపకము నెందరు కూర్పరుకాని యిట్లు రక్తి కట్టించిన వారరుదు. నానా విధములైన యిట్టి రూపకములు జడము లకు ప్రాణప్రతిష్ఠచేసి వికృతప్రాకృత పదార్థములకు విశిష్ట శిల్ప రామణీయకము భాసిల్లజేసి కావ్యరంగమున నాట్యమాడుచున్నవి.

పోతన యింటికి విజయం చేసిన జ్యోతిపురరాజ్ఞి పల్లకి నుండి వెలుపలికి వచ్చిన సోయగ మిట్లు భావింపబడినది.

> ''పూర్ణసౌందర్య జలనిధిఁ బుట్టిపెరుగు భార్గవి నెవారొ వలబన్ని పట్టిరనఁగ
> వలిపమగు నుల్లబంబున వెలుఁగులీను వెలఁది యాందోళికను వీడి వెలికి
> వచ్చె''[2]

పూర్ణసౌందర్య జలధిలో పుట్టిపెరుగు లక్ష్మియై సన్నని మేల్కట్టు మేలిమి గులుకు పల్లకి నుండి వెలికి వచ్చుట వలపన్ని పట్టి తెచ్చినట్లున్నదని భావించుట ఎంత మనోహరమైనది!

ఓరుగంటి శిల్పములను జూచి శ్రీనాథు డిట్లు వర్ణించెను.

1. పోతన చరిత్రము : 11-130
2. ,, : 8-75

''శిల్పిలోకాశ్రితుల్ జీవకళాస్ఫూర్తి సతత ముండెదరిట మృతియెలేదొ!
లలిత యోషావయో లావణ్య మించుక జాఱ వోదియ్యెడ జరయె లేదొ!
గజసింహసంహతుల్ గలిసియుండిన విందు జాతివైరమ్ముల జాడలేదొ!
తరులతాప్రసవ సంతతి నైగసిగ్యమ్ము తఱుఁగదీ జగతిలోఁ గఱవెలేదొ
శిల్పియులి దెబ్బతోడ శాసింపఁబడిన యీ మహీతల స్వర్గమహీన కళల
జన్మమృత్యు జరామయ క్షామములను బ్రహ్మ సృష్టిలోఁగల్గు లోపములఁ
దీర్చె''[1]

ఇందలి భావములను పరిశీలించిన 'నియతి కృత నియమరహితాం' అన్న ఆలంకారిక వచనము స్ఫురణకు వచ్చును. ఒక కవిత్వమేకాదు లలితకళలన్నియు బ్రహ్మ సృష్టికంటె విలక్షణమైనవే. ఈ పద్యములోని శిల్పములే కాక కవిగారి కవితా భావములను 'జన్మమృత్యు జరామయ క్షామములను బ్రహ్మ సృష్టిలోగల్గు లోపములను' దీర్చుచున్నవి. నిజానికి కళలెంత సౌమ్యమైనవి; సంతోషకరమైనవి. లోకమున పులులనుగాని పాములనుగాని చేరితిమా ఇంకేమున్నది? కాని శిల్పమున గాని, చిత్రమునగాని, కావ్యమునగాని, కథలోగాని క్రూరమృగాలను ఘోర రాక్షసులను చేరుటయే కాదు ముట్టవచ్చును పట్టవచ్చును. ఎట్టి అపాయము జరుగదు. కళకు కావ్యమున కెంత మహిమ! ఈ మహిమచేతనే నగమును నాగముగా నడిపించిన లోకాతీతమైన యద్భుతము దిగువ కానవచ్చుచున్నది.

అది మడికొండ దండగల మెట్టుగుట్ట ఇట్లభివర్ణింపబడినది.
''డోలల్లతాకుంజ తాలపత్రము లనారత చలత్కర్ణశూర్పములు గాఁగ
గండశైలోత్పాత గళదంబుపాతముల్ గండజమదపూర గతులనీన
అభ్రంకషన్మంజులాద్రి శృంగాకృతు లుత్క్షిప్తశుండాసమున్నతి గన
హరిహర చైత్యగోపుర వరప్రాకార వితతి యంబారి యాకృతులఁ బూన
సముచిసూదనుఁ డైరావణమ్ము నెక్కి జగడ మొనరింప శివుని గేశవునిఁ
గూడఁ
దనదుపృష్ఠమ్ముపైఁ దాల్చి దాడి వెడలు మదగజంబనఁదనరె నమ్మహిత
నగము''[2]

1. పోతన చరిత్రము : 8-244
2. పోతన చరిత్రము : 8-310

'భావానచేతనానపి చేతన వచ్చేతనానప్యచేతనవత్ వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా' అని యానంద వర్ధనుడన్నది ఇట్టి లోకోత్తర భావముల వలననే.

మనోవేదనలకు మహిత రూపము కల్పించుటయు భావనా మహత్వమే. మెట్టుగుట్టపై వెలసిన శ్రీరామునికి తనవేదనలు నివేదన సేయుచు పోతన యిట్లు చింతించెను.

"హృదయవాసన లీనుచు నెసఁగు మొగలి పూలకై జీవనము ధార
వోయుచుంటిఁ

గాని తోడ్తోడనే కంటకములఁ గూడఁ బెంచుచున్నాఁడనను చు భావించనైతి"[1]
ఇందు గంభీరమైన భావన కలదు. జీవితములో సుఖశాంతుల నాశించి ఘనకార్యము లను చేయుచుందుము. కాని అట్టి కార్యములు సుఖములతో బాటు దుఃఖములును కలిగించునని తెలియము. దీనిని మొగలి చెట్లు పెంచుటతో నుపమించి మానవ జీవితమును మనోజ్ఞముగా వ్యాఖ్యానించినారు కవిగారు. ఇక్కడ పోతన శ్రేయస్కారక మని భాగవతము రచింప రాజులవల్ల పీడలు కలిగె నన్నది ధ్వని. ఈ విషయము 'ధ్వని సౌరభము'లో వివరింపబడినది.

దరిద్రుల బాధలు చెప్పనలవిగానివి. పండుగలు ధనికులకేగాని దరిద్రులకు గావు. ఈ విషయము శ్రీనాథుడిట్లు భావించెను.

"పండుగ యన ధని భాగ్యముపండుఁగదా! పంచభక్ష్య పరమాన్నాప్తిన్
పండుగ యన రిక్తుని పని పండుఁ గదా నాఁడు వస్తుపండుట"[2]

మరియు లేమిచే వెతనొందు మానస్థుల పడు పాటులు కలవర పెట్టునవియే.

"మానమేఁగునటంచభిమానధనులు నగు మొగవుఁ దెర దాఁచిన వగపులెన్నొ
పండునిప్పక లటులు కుంపటి దహింపు కనబడదుగాని యంటినఁ గాల్పఁ
గలదు"[4]

అని వారి తాపము కుంపటి యగ్నితో పోల్చి చక్కగా భావించి చెప్పబడినది.

1. పోతన చరిత్రము : 9-43
2. పోతన చరిత్రము : 9-353
8. పోతన చరిత్రము : 9-356

పరవనితల జోలికి పోరాదు. పోయిన మహాప్రమాదమన్న నీతిని విభీషణుడు రావణునికి చెప్పెడి మిషతో మానవులకు కవిగారు బోధించిన దెంత గుండెకు దాకునట్లున్నదో దిగువ పద్యము వలన విశదమగును.

"అన్యకాంతలమేని యంటనీయని కాంతిఁబులికళాసవ్వఁ జెల్వు దలఁప వలదె
పరభామినీవేణి స్పర్శ చేయగరాని నల్లనాగమని యనంగ వలదె
పరసతీ మృదు బాహుబంధ సౌఖ్యమభోగ్య విషఫణిద్వయిగ భావింపవలదె
అన్యాంగనా మందహాస సుందర కాంతి గనరాని తటిదగ్ని యనఁగ వలదె
పరవనిత చూపులనుభవ బాహ్యమైన మకర నికట సరోజ యుగ్మమన వలదె
కుమతి! కామాంధ! పాప కూపమునఁబడుట కాంచలేవని యటనుండి కదలి
చనిరె"[1]

భద్రప్రాప్తికి మూలమైన యీ నీతి భావాహార్యముగా సర్వజన శిరోధార్యముగా చెలువొందుచున్నది.

కావ్యమున భక్తి తత్త్వమునకు, తదితరమునకు చెందిన నీతులెన్నియో భావోదంచితములై పరిఢవిల్లిన విషయము 'కావ్యోపదేశము' వ్యాసమున వివరించుట జరిగినది. ఐనను నొండు రెండుదాహరింతును.

పోతన తీర్థయాత్రలు చేయుచు భూతపురిలో వెలసిన శ్రీరామానుజస్వామిని దర్శించి భక్తి భావములిట్లు ప్రకటించెను.

"వృద్ధత్వ మందిన వేదత్రయమునకు దండత్రయమ్ము నూఁతగనిడియెను
మోహించివచ్చిన మోక్షైక లక్ష్మికిఁ గాషాయ వస్త్రమ్ము కట్టఁబెట్టె
పదములంబడి వచ్చు మదపతి వాణికి వేదాంత నిధులఁ ద్రవ్వి తలకెత్తె
హరి పదమ్ములు మేన స్థిర నివాసమొనర్చ సౌధోర్ధ్వ పుండ్రముల్ జత
పఱచెను
హరియె గీత వచించె రామానుజుఁడయి యహియె భాష్యమ్మొనర్చె
రామానుజుఁడయి
వేల తలలు దాలిచి వేనవేల నరుల కర్మభారమ్ము తనకంటఁ గట్టుకొనియె"[2]

రామానుజులవారు నిర్వహించిన మహాకార్యము లిందు భంగ్యంతరముగా భవ్యభావవిలసితముగా వచింపబడినవి.

1. పోతన చరిత్రము : 11-80
2. ,, ,, : 9-376

క్షీణదశలోనుండి పాతబడిన వేద విజ్ఞాన పునరుద్ధరణకు విశిష్టాద్వైత మత ప్రచారార్థము యతియై మనోదండ వాగ్దండ కర్మదండములను త్రిదండములను పాటించుటను వేదత్రయమునకు దండత్రయము నూతగా నిడినాడనుట చమత్కారముగ నున్నది. వృద్ధులైనవారికి దండము నూతగా నిత్తురు. ఇక్కడ వేదములు మిక్కిలి వృద్ధత్వమందుండుటచేత మూడు దండములు(ఊతకఱ్ఱలు) ఈయబడినవనుట సారస్యము. అట్లే గురుని తిరుమంత్రోపాసనచేత మోక్షము వలచి రాగా దానిని తిరస్కరించి తనకొక్కనికి కాదు అందరికి మోక్షము కావలెనని తిరుమంత్రమును గోపురమెక్కి చాటి తత్ప్రచారమునకు సన్న్యాసియై జీవితమంతయు కృషిచేసిన వాడగుటచేత ఈ విషయమును జెప్పుటకు వలచివచ్చిన మోక్షలక్ష్మికి కాషాయవస్త్రము కట్టబెట్టినాడని భావించి చెప్పుట ప్రశస్తముగా నున్నది. ఇట్లే తక్కిన భావములను గ్రహింపవచ్చును.

శ్రీరాముడు లంకకు దారి వదలుమని కోరగా సముద్రుడు 'మిన్నుముట్టు గర్వమ్మున మిడిసిపడుచు నెగసిపడె' నని చెప్పుచు అంతటి దుర్మదమునకు భావించిన హేతువులు మిక్కిలి యుక్తియుక్తముగా నున్నవి.

"నాయుప్పదిని జీవనము నిల్పు లోకమ్ము విశ్వపాలకుఁడనై వెలయుదునని
నాయప్పలనుగొని నడయాడు ఘనవృత్తి ఘనులకున్ ఘనుడనై మని యెదనని"[1] ఈవిధముగా మనోజ్ఞభావములతో సాగినది పద్యము.

తనను చంపుటకు హింసించి విఫలుడయి తండ్రి చింతించుచుండ ప్రహ్లాదుడు హరిని భక్తిభావముతో నిట్లు తలచెను.

"ఎవని సౌందర్యంపు నవరత్నఖనిలోన మన్మథుండన నొక్క మచ్చుపిసరు
ఎవని పావిత్ర్యమహిత సుధార్ణవములో జాహ్నవియన నొక్క జలకణంబు
ఎవని లోకద్వితయవిభూతి విభవమ్మునందు భార్గవి వక్షహారరత్న
మెవనిదౌ సౌకుమార్య విశేషముననోడి పాఁపఱేడును గ్రిందుపడి యడంగె
అతని సౌందర్యసౌకుమార్య ప్రపంచ పూతసౌశీల్య వాల్లభ్యపూర్ణ మహిమఁ
బొగడ విధి శివ సనక సూరిగణ నిగమ జాలమే చాలదన నజ్ఞబాలుడెంత"[2]

1. పోతన చరిత్రము : 11-70
2. ,, : 11-355

దీనిలో పరాత్పరుడగు శ్రీహరి సౌందర్యాదుల యుత్కృష్టత పరమ వైభవము చక్కగా భావింపబడి వక్కాణింపబడినవి.

పై సందర్భమునందే 'నిన్నేమి చేసినను చావవేమి?' యని తండ్రి యడుగగా ప్రహ్లాదుడిట్లనెను.

"తులము శిలనైన ముంచెడి జలములెందు మొద్దుమ్రాఁకుల బరువుల
ముంచఁగలవె
జీవనమ్మిడి తానె రక్షించునట్టి వానిఁ దేల్చక ముంచెడివారు గలరె?"[1]

నీటి బరువుకంటె రాయిబరువెక్కువ కావున అది మునుగును. అట్లే కట్టెమొద్దు బరువు తక్కువగుటచేత నీటిపై తేలును. ఇది భౌతిక సత్యము.

ఇది యిట్లుండ అంత మొద్దుమ్రాకులు నీళ్ళలో మునుగక తులము శిల యైనను మునుగుటకు హేతువును కవిగారు రమణీయముగా భావించినారు. నీళ్ళు తమ (జీవనము) చేత పెంచుకొనినవి మ్రాకులు. అట్లు స్వయముగా రక్షించునట్టి నీళ్ళు తమను ఉద్ధరించక ముంచజాలవన్న నీతని చక్కగా భావించి యను సంధింపజేసినారు. ఇంతటితో ఈ భావము పూర్తికాలేదు. నీళ్ళు తాము పెంచుకున్న వృక్షములను ముంచక కాపాడునట్లు ప్రహ్లాదుని రక్షించు భగవంతుడు శిక్షింప డన్నది నిష్కృష్టార్థము. పరమేశ్వరుడు భక్తరక్షణ పరాయణుడన్నది ఈరీతిగా రమ్యభావము చేత నిరూపింపబడినది. ఇట్లే అనేక భావములు రమణీయములై రాజిల్లుచున్నవి.

## చమత్కార భావములు :

కావ్యము నందెడనెడ అనేక భావ చమత్కారములు, ఉక్తి చమత్కారములు మెరయుచు హృదయములకు గిలిగింతలు పెట్టుచున్నవి. వానిలో కొన్నిటి నుదాహరింతును.

కావ్యోపక్రమములో విష్ణువుతో సంభాషించి నారదుడాకాశ మార్గమున వెడలి పోయి క్రమముగా అదృశ్యుడైన విషయము దిగువరీతిగా చమత్కారముగా భావింపబడినది.

1. పోతన చరిత్రము : 11-361

"అనుచు నమస్కరించి గగనాధ్వచరుండయి బాసవాలు వేఁ
జనఁ దొడఁగెన్ విపంచిఁ గరశాఖల మీటుచు దూరమేఁగున
మ్మునిఁగని శారదాభ్రమని పూర్ణవిధుండని తారయంచెదో
ధ్వనియని శూన్యమంచు నొగిఁబల్కిరి విష్ణుపదాలయస్థితుల్"[1]

పోతన బాల్యక్రీడలను వర్ణించుచు 'కాలుభూమిపైన గడియైన నాగదు పాదరసము గలదొ పాదములకు'[2] అనుట చమత్కారముగ నున్నది.

"పలుకుటకు మొగములేకయు నలుగురిఁదలయెత్తి సరిఁగనంజాలకయున్
వలపించు ముగ్ధచేష్టల తలవంపులు పొంది సిగ్గు తానే గెల్చెన్"[3].

ఇది పోతన వివాహఘట్టం లోనిది. పెండ్లికాగానే నరసమాంబను వదినె వరుసయైన వనితలు మగనిని పేరుతో పిలిచి చందనము చిలుకుమని యనగా ఆ ముగ్ధ సిగ్గుచేత మాట్లాడలేక తలవంచుకొనెను. ఆమె సిగ్గుకు లోనగుటచేత సిగ్గు గెలిచినదనుట మర్యాద. కాని యిక్కడ అది చమత్కారముగా చెప్పబడినది. ఓడినవారు తలవంచుట గెలిచినవారు తల ఎత్తుకొనుట నైజము. కాగా ఇక్కడ తలవంపులుపొంది (తలవంచుకొన్న స్థితిని గలిగించి) సిగ్గే గెలిచినదనుట గమ్మత్తుగా నున్నది.

వేరొకచోట పొలము పనులకు బోవు స్త్రీలు మూపున కొడవళ్ళు ధరించి వచ్చుటను" కొడవళ్లు తాము పల్లెపడుచుల మూఁపుల పల్లకీల నెక్కివచ్చెను వరిగోయనెంతొ ఠీవి"[4] యనుట చముత్కారము.

పోతన సతీసంగమ విషయమున

"కమల కోమల సతీహస్త పాశబద్ధుడై ముక్తిఁగనె మారుబారినుండి"[5]

అని చెప్పబడెను. ఇక్కడ బద్ధుడై ముక్తుడాయెననుట విరుద్ధము. దానిని సమర్థించుట చమత్కారముగా నున్నది.

1. పోతన చరిత్రము : 1-77
2. ,, : 1-130
3. ,, : 2-264
4. ,, : 3-103
5. ,, : 3-243

మల్లన శిశువును పోతనకుజూపి లక్కాంబ యిట్లు భావించి వర్ణించెను.

"హాస కుసుమముల నస్ఫుట భాసుర కల భాషణాది బాలశుకోప
న్యాసమ్ములఁ బండి పొరలు వేసమ్మున నందనవని విచ్చేసెనిలన్"[1]

ఇక్కడి పసివాని హాసాదులను వేషమును నందనవని యని శ్లిష్ట రూపకముతో చెప్పుట చమత్కారముగా నున్నది.

పోతన కొడుకునెత్తుకొని ముద్దాడుచు నిట్లు భావించెను.

"తరుణి ముద్దులతాంబూల పరిమళమ్ము వ్రాలు పసిపాపనోటి
చన్బాల తావి
మూడు లోకమ్ములన్ వశ్యమున్బొనర్ప దర్పకుండూఁదుచున్న
మంత్రములు గావె"[2]

ఓహో! ఏమి గొప్పభావన! తరుణి తాంబూల పరిమళము, పసిపాప నోటి చనుబాల వాసన త్రిలోకాలను వశము చేసికొనుటకు మన్మథుడూదుచున్న మంత్రాలనుట మహితముగా చమత్కృతముగా నున్నది. పోతనవంటి జ్ఞానియే వానికి వశముకాగా తక్కిన వారి లెక్కయేమి? ఇంతకంటె మరొక చమత్కారము పసివాని చేష్టలలో భావించినారు కవిగారు.

'జాయాపతుల వాక్యసరస సామర్థ్యముల్ వాగతీతములను మూగనోట' యన్న పద్యమున మల్లన

"ఒకటితో నొక్కటింగూర్చ నొక్కటియగు లేక మూడేని యగునని లోక
మెఱుంగఁ
గాలుసేతుల వ్రేళ్ళలెక్కనిడ మడచి యురక సరిదిద్దు గణితశాస్త్రోక్త
విధికి"[3].

పిల్లవాడు కాలుచేతు లాడించుచు వేళ్ళు మడచుచుండుట యిట్లు భావింపబడినది. ఒకటితో ఒక్కటి కలుప ఒక్కటికాని మూడుకాని యగునుకాని రెండు కావని గణిత శాస్త్రవిధిని సరిదిద్దుచున్నాడట. ఇది చిత్రముగానున్నది. కాగా ఆలుమగలిద్దరు కలిసినచో ఒక్కటి యగుదురు. ఆ యిద్దరి కలయికవల్ల బిడ్డపుట్టి ముగ్గురగుదురన్నది యిందలి చమత్కారము.

---

1. పోతన చరిత్రము : 3-279
2. ,, : 3-284
3. ,, : 3-286

శ్రీనాథుడు రాచకొండను, సింగనృపతిని వినుతించుచు నిట్లు పలికెను.

"కనుగీటుటకునైనఁ గాని చక్కఁగరాని యనిమిషాంగనలఁట యప్సరసలు
అడుగు భక్తుఁడు గామి యొడయుఁడైనను నేమి ఫల మొసంగదట కల్ప
తరుగణము
గురుబుధుల్ కవులయ్యు నరజాతి కనుఁ మున్ జుక్కలై చనునఁట
సురనికరము
కంటకూరుకులేని కష్టజీవనమునకంతమ్ము గనదఁట యమరజన్మ
రెప్పపాటులో వలపింతురిప్పడఁతులు ఫలములడుగుల నర్పించు
పాదపములు
గోరునకుఁ బోలుదురు సురల్ వీరిలోన ననుచు నింద్రుఁడే యిటు భువి
నవతరించె"

ఇందు స్వర్గమునకంటె ఇంద్రునికంటె రాచకొండ, సింగభూపతి శ్రేష్ఠులన్న
విషయము సహేతుకముగా చమత్కారముగా నభివర్ణింపబడినది.

శ్రీనాథుడు వనవర్ణన చేయుచు నారికేళఫలములను గురించి కడు చమ
త్కారముగా భావించి చెప్పెను.

"స్వచ్ఛమందాకినీ వారి సంగ్రహించి తలధరింపఁగ నెండవానల సహించి
మూఁడు కనులమూసియు మీసములను గడ్డములఁ బెనుచు నారికేళ
సత్ఫల తపస్వి"

"పొంగి కైలాసగిరిఁ బాఱు గంగనీరు కామధేనువు పాలమీఁగడల తీరు.
మూఁడుకనుల మూసి ముక్కంటి ముద్రవేసి తీర్థము ప్రసాదమని యుండ
దింపిరెవరొ"

మొదటి దానిలో నారికేళము నొక సత్తపస్విగా, రెండవదానిలో దివ్య తీర్థ
ప్రసాదముల ముద్రిత పాత్రగా చమత్కారముగా రూపించి చవులూరించిరి వరదా
రాచార్యులవారు.

భోగినీ హావభావములకెంతటి విరాగియైన సరాగి కావలసినదే యని
చెప్పుటకు దిగువ విధముగా చమత్కారము కావింపబడినది.

1. పోతన చరిత్రము : 4-72
2. ,, : 4-116
3. ,, : 4-118

"రామభక్తుఁడై హనుమఁడు రాఁడదేల
మారభక్తుడై తలక్రిందు మాఱిపోఁడె"[1]

ఇక్కడ 'రామ' శబ్దము వ్యత్యస్తమై 'మార' యైనది. ఇట్లు వర్ణవ్యత్యయముతో అర్థము సాధించి హనుమంతునంతటి బ్రహ్మచారియు తారుమారయి కాముకుడు కాగలడని భావము చమత్కరింపబడినది.

'యతి విటుఁడు గాకపోవునే యస్మదీయ
కావ్య శృంగార వర్ణనాకర్ణనమున'

అని సంకుసాల కవి యన్నట్లున్నది యిది. ఇట్టే వర్ణవ్యత్యయముతో భావచమత్కారము చేసినవి మరికొన్ని యిట్లు కలవు.

పోతన భోగినీ నృత్యానంతరము చేసిన జయదేవుని పదముల ప్రశంసలో
"చివరఁ దలక్రిందుతపముఁ జేసియును నెవని రమ్యతర వాగ్ఝరీ ధార రాధ యగుచు
గోపికానాథు ప్రణయమ్ము గుత్తగొనియె నట్టి జయదేవకవి వాణి యజుని రాణి"[2]

నారయాదులు వృద్ధకంచుకిని నిందించిన దానిలో
'కాళ్లు మూఁడయ్యె నీచేతి కట్టెఁగూడి
తప్పదిక తలక్రిందైన తాతపేరు"[3]

కర్ణాటాధీశ్వరునకు కావ్యమీయలేనని పోతన దండనాథునితో పలికిన సందర్భములోని
"ఆవును గసాయి కిత్తు నంచాడి తప్పు
ముఖము క్రిందైన మీఁదైన ముఖము ముఖము"[4]

పై సందర్భమునందే రాజుల దుర్ణయములను నిరసించిన
"ధరణిపతి ప్రజాకంటకత్వము వహింపఁ
బుడియె తలక్రిందులై రిపు సరణి పఱలు"[5]

---

1. పోతన చరిత్రము : 4-166
2. ,, : 4-333
3. ,, : 7-71
4. ,, : 9-115
5. ,, : 9-117

వీనిలో 'ధార' 'రాధ' యగుట, 'పురి' 'రిపు' అగుట అనునవి వర్ణవ్యత్యయ వల్లను 'తాత' 'ముఖము' అనునవి తలక్రిందులు చేసినను మారనివిగా కూర్పు వల్లను చమత్కారము సాధింపబడినది.

పోతన కన్నడ చమూపతితో రాజుల దౌష్ట్యమును ఖండించిన సందర్భములో మరికొన్ని భావ చమత్కారములు కానబడుచున్నవి

"ధరణిఁ బ్రజానురంజకుండె తాను నృపుండు ప్రజారి వృత్తిచేఁ
బౌరల నృశబ్దమున్విడినఁ బుండటు లెంచఁబడున్...."[1]

ఇక్కడ 'నృపుండు' నుండి 'నృ' తొలగి 'పుండు' గా మారినది. రాజు ప్రజానురంజకుడగుచో 'నృపుండు' అనగా నరపతి యగును గాని ప్రజల పీడించుచు వారిని త్రోసి పుచ్చినచో 'పుండు'గా సలుపు వాడగునని చమత్కరింపబడినది.

రాజుల నిరంకుశ ఘోరవర్తనల నెదిరింపలేక ప్రజలణగారి యుందురన్న దిగువ విధముగా చమత్కారముగా చెప్పబడినది.

"దైవప్రదత్తమౌ ధారుణీకకలమ్మ నాదినాదని గుండె బాదుకొనును
తానంబుదము వోయు దానోదకముఁ గొనఁ బన్ను లిమ్మని వంచి బండలె
కర్షకు చెమటోడ్చి గడియించు ధనమును దాత సొమ్మట్లు గోతముల నిం
నిజరాజ్యరక్షకై నిరుపేద ప్రజ సైన్యమని కత్తికోఁతల కప్పగించు
అవనిఁ దత్కృతి నిశ్చేష్ట యగుచుఁగాంచుఁ గాంచు వెలవెలబోయి
మేఘమ్ము దిః
గోతములు గాంచి నోర్మూసికొనఁ దొడంగె నొజను జొరెఁగత్తి మోమె
తిరుగలేక'

రాజు పీడలకు వరుసగా భూమి, మేఘము, గోతములు, కత్తి ఎదిరించలే యడగి యుండునన్న దానికి వరుసగా నిశ్చేష్టయగును, వెలవెలబోవును, నో మూసికొనును, మోమెత్తలేక పోవునని చెప్పుట చమత్కారముగా నున్నది. అవ యచల యగుటచేత నిశ్చేష్టమైనదని భావించుట సమంజసముగా నున్నది. ఇ తక్కిన వానిని గ్రహింపనగును.

1. పోతన చరిత్రము : 9-137
2. ,, : 9-141

హేమంత వర్ణనలో ఎండగొట్టుట చలిపెట్టుట గురించి విచిత్రమైన భావన కావింపబడినది.

"దంపతుల విడంగొట్టుటొ ధాత్రిజనము లురక యెండగొట్టె నటంచు నుడువుచంద్రు
దంపతులఁ గూడఁబెట్టుటొ ధరణి ప్రజలు నౌర! చలిపెట్టెనని వడఁకాడు చంద్రు"[1]

ఎండ 'కొట్టును' చలి 'పెట్టును' అనుట లోకవ్యవహారము. ఇట్లనుటకు కారణము చమత్కారముగా నూహింపబడినది. దంపతులను తన వేడిచేత విడగొట్టును. కావుననే ఎండ గొట్టుననియు, వారిని చలిచేత కూడబెట్టును కనుక చలి పెట్టుననియు లోకులందురని చమత్కరింప బడినది.

శ్రీనాథుడు ప్రౌఢదేవరాయలను ప్రస్తుతించిన తీరు మిగుల చమత్కారముగా నున్నది.

"మహినెట్టి దేవరాణ్మణి రాజ్యపాలన మింద్రుని ప్రౌఢత్వహీనుఁ జేసె
ధరణి నే రాజన్య దండనాథుల శక్తి స్కంధుఁ జిన్న కుమారుగా నొనర్చె
భువి నే నృపాలు సత్కవిపండితుల బుద్ధి గురుశుక్రులన్ మౌఢ్యచరులఁజేసె
వసుధ నే నృపువీటి వారాంగనల ధాటి కనువిప్ప లప్సరోగణములకయి
ధాత్రి నే రాజు సుందరోద్యాన మరసి దేవతరు రాజి పంచత్వభావమందె
నే నగర మమరావతి కెదురు దిరిగి విజయ పూర్వకాభిఖ్యతో వెలసెనుర్వి"[2]

విజయనగర రాజు ప్రౌఢదేవరాయలు. ఇంద్రుడు దేవరాయలే కాని 'ప్రౌఢ' అన్న పదమతని పేరునకు లేనందున విజయనగర దేవరాయల పరిపాలన యింద్రుని ప్రౌఢత్వ హీనుజేసెననుట చమత్కారముగ నున్నది. అట్లే రాయల సేనాపతుల శక్తి ఇంద్రుని సేనాపతిని చిన్నకుమారుని చేసె (క్రించు పరచె) ననుట ఇంద్ర సేనాని చిన్న వయస్సులోని కుమారస్వామి యనుట చమత్కారముగా చెప్పబడెను. రాయల కవిపండితులకు లేని మౌఢ్యము దేవేంద్రుని సభలోని గురుశుక్రుల కుండుట, రాయల నగరవేశ్యల ధాటికి దేవవేశ్యలకు కనువిప్ప (రెప్పపాటు లేక

1. పోతన చరిత్రము - 9-344
2. ,, : 10-4

పోవుట) కలుగుట (అది వారికి సహజము), రాయల యుద్యానము చూచి దేవలోక వృక్షములు పంచత్వ మందుట (చచ్చుట, ఐదు సంఖ్యలో ఉండుట- మందారము, పారిజాతము, సంతానము, కల్పము, హరిచందనము అనునైదు దేవవృక్షములు), రాయల నగరము 'విజయ' అను పదము పూర్వమున నుండి అదిలేని దేవనగర మగు అమరావతి కెదురు తిరిగినదనుట చమత్కారముగా నున్నది. ఇక్కడి యీ చమత్కృతి కొంత శ్లేషచేత విరాజిల్లుచు సహజ విషయములనే అర్థభావముల చేత కూర్పబడుటచేత యొప్పుచున్నది. ఇట్టి చమత్కారమే యజ్ఞవరాహ వర్ణనలో-

"హిమవంతుఁడీ కిటి సమత గాంచలేక
చలిచెమ్మటలు బుట్టి నిలిచిపోయె"[1]

ఇత్యాదిగా చెప్పబడి హిమవంతుడు సహజశీతలుఁడగుట చలిచెమ్మట బుట్టి నిలిచి పోయెననుట చమత్కారముగా నున్నది.

చిన్నయసూరి రచించినది బాల వ్యాకరణము. ఈపేరు నుపయోగించి ప్రహ్లాద బాలుని వచ్చిరాని మాటలను చమత్కరించినారు కవిగారు.

"శ్రీకారము చీకాలము టాకున్ తారాకులాలు డాకున్ దావ
దైకాదేశపు బాలవ్యాకరణము మెచ్చుకొనని పండితుఁడున్నే"[2]

శిశువు లుచ్చరింప రాక శ్రీకుచీ ఇత్యాదిగా నందురు. ఇది బాలవ్యాకరణపు వర్ణా దేశమట ! సూరివ్రాసినది బాలవ్యాకరణమైనను అది బాలుర వ్యాకరణము మాత్రము కాదు. పైన చెప్పినదే అసలైన బాలవ్యాకరణమని చమత్కరింపబడినది. సమగ్ర ముగా లక్షణము చెప్పనందున సూరి వ్యాకరణమునైనను కొందరాక్షేపించవచ్చును గాని పసివారి తొక్కుపల్కులకు పరవశింపని పెద్దలుండరు కావున ఈ బాల వ్యాకరణము మెచ్చని పండితుడు లేడని చెప్పబడినది.

పసివానిని గురించి మరొక చమత్కారము చేయబడినది. యశోద చిన్ని కృష్ణుని ముద్దాడుచు ఆనందించిన విషయమిట్లు భావింపబడినది.

1. పోతన చరిత్ర : 11-204
2. ,, : 11-238

"తినరా దొల్లననుచు విడువనురా దీ తియ్యమామి పండెట్లని యా
తినరాని పండులోపల మను తీపిని గుర్తెఱింగె మానిని పేర్మిన్"[1]

ఇక్కడ పిల్లవాడు తియ్యమామిడి పండు ఆ పండు తినరాని విడువ వీలులేని విచిత్రమైన పండని చమత్కరింపబడినది.

శ్రీకృష్ణునిపై విరాళిగొని వెతపడు రుక్మిణినిగాంచి చెలులిట్లు భావించిరి.

"తెఱపిగొనక మేఘంబులు గురియుచుండ విడక వడగాడ్పులెప్పుడు విసరుచుండు
నకట! తలక్రిందులయ్యె నీప్రకృతి యంద్రు బాష్పతతుల నిట్టూర్చెడి పడఁతిగాంచి"[2]

ఇక్కడ తెరపి లేక మేఘములు గురియుచుండగా వడగాల్పులు విసరుచుండుట ప్రకృతి విరుద్ధము. కాని యిట్టి వైరుధ్యము రుక్మిణి యెడ గానబడుచున్నది. ఆమె నిరంతరము కన్నీరు కార్చుచు నిట్టూర్పులు వదలుటను పైరీతిగా చమత్కరించుట జరిగినది.

ఇట్టి భావ చమత్కారములు కావ్యమున తరచుగా గోచరింపగా మరికొన్ని నామార్థ చమత్కారములవలన భావములు భాసిల్లుచున్నవి. ఇట్టి చమత్కారములు ఆచార్యులవారి మణిమాలాది ఛందకృతులలోను గానబడిన విషయమావ్యాసము లందు చర్చింపబడెను. ఇట్లిది వీరి కవితాగుణములలో నొకటైనది.

శ్రీనాథుడు సింగనృపతినిట్లు స్తుతించెను.

"అవని నరరూపతన్ సింగమైన నీవొ యాచరించు హిరణ్యదానాతిశయముఁ
గాంచి ప్రహ్లాద రక్షణఁగా దొడంగె రాజ్యమెల్లెడనన నబ్బురమ్మె భూప!"[3]

రాచకొండ ప్రభువుపేరగు 'సింగ' సింహశబ్ద భవము. కావున నతనిని నరరూపమున సింగమైనవాడని వినుతించుట చమత్కారము. పూర్వము నరసింహుడు నరసింహ ముల యాకృతి కలవాడు. కాని సింగనృపతి కేవలము నరరూపమున నున్న సింహము. హిరణ్యదానమనగా సువర్ణదానము, ప్రహ్లాద రక్షణ యన ఆనందమును

1. పోతన చరిత్రము : 12-119
2. ,, : 12-284
3. ,, : 4-69

ప్రోదిచేయుట యను నర్థములు ప్రతీతమై నరసింగ హిరణ్య ప్రహ్లాద శబ్దముల ప్రయోగముచేత విలక్షణముగా పౌరాణిక కథ గతార్థమై చమత్కార మావహిల్లు చున్నది. సింగనృపతి గురించి యిట్లే మరొక చోట భోగిని తలపోసినదిట్లు చెప్ప బడినది.

"అసురవంశ సంజాతుఁడౌ నిసుఁగునెందు నాత్మ పదభక్తుఁ డంచు హృదంతరమున
నరయు సర్వజ్ఞుఁ డొక సింగ మగుచు వచ్చి రక్షసేయఁడె? నాస్వామి రాఁడె? యనును"[1]

గంగాతీరస్థ మంత్రకూటము చమత్కారముగా నిట్లు భావింపబడినది.

"చేతనాచేతనముల నీక్షింపఁ జటి శ్రౌతమో స్మార్తమో జ్యోతిషమ్మొ సాంగ
మంత్ర పాఠమ్మొ పఠియింప మహిత గతిని కూటమైనట్లు దోఁచు నివ్విటఁ దాము"[2]

మంత్ర పాఠకుల కూటము కావున మంత్ర కూటమైనట్లు భావించుట చమత్కారము.

కావ్యానుబంధములోని శ్రీరామ చరిత్రము నందలి

"తలక్రిందు రామ శబ్దము జపించుటనేమొ
తలక్రిందుఁజేసె నితర కవులకు"[3]

ఇత్యాదిగా గల పద్యములందలి చమత్కారము, ఈ కొన్ని పద్యములు మణి మాలలో మొదట కూర్పబడినవి కనుక, వీని గురించి ఆ వ్యాసమున చర్చించుట జరిగినది.

## ఉక్తి చమత్కారములు :

కావ్యమున భావదీప్తిని ప్రజ్వలింపజేయుటకు సందర్భానుసారముగా అనేకముగా ఉక్తి చమత్కృతులు వెలయింపబడినవి. వానిలో కొన్నిటిని పేర్కొందును.

"నన్నయ్యని తెలియు మనెడి నన్నయ నెంతున్"[4]

నన్ను + అయ్య = నన్నయ అని చమత్కారము

1. పోతన చరిత్రము : 4-176
2. ,, 5-4
3. ,, 11-4
4. ,, పీఠిక - 20

"అరయఁ గంకంటి పాపఁడే యనఁబడుచును
సరసగతి రామచరిత కుత్తరము వ్రాసె"[1]

అరయ+కంకంటి పాపడు, అరయగన్+కంటిపాపడు - అనియు రామచరిత కుత్తరము వ్రాసెనన ఉత్తర రామచరిత్రము వ్రాసెననియు చమత్కారము.

"పూరిగుడిసె లెక్కి పొయి రాఁజెనని యగ్ని
సాక్షిఁ బల్కు ధూమ సంఘమొకట" (బమ్మెర గ్రామ వర్ణన)

పొయి రాజెనని ధూమ సంఘ మగ్నిసాక్షిగా పలికెననుట చమత్కారము.

"దండ యిద్ది యెవరి దండఁ జెల్వొ యనో యట్టి వారి ఘనతఁ బట్టి దీని
విలువ యెదుగు, పట్టి చిలిపి యాసించిన దండ తాడనమ్మె దండ
విలువ"[3]

ఇది పుష్పలావిక శ్రీనాథునితో నన్న నర్మోక్తి. ఇందు దండతాడన మన పూల దండతో కొట్టుట, మద్దు కఱ్ఱతో కొట్టుట యని శ్లేష చమత్కృతి.

"స్వర్గమ్మును గాంచకున్నదును, కావ్య జగత్తును బట్టి దున్నెదన్"[4]

ఇది పోతన తలపోసినది. భోగభాగ్యాల నాశింపక సాహితీ క్షేత్రమున ననేక కావ్యములను రచింతునన్నదానికి ఉక్తిచమత్కృతి.

"ఖగములస్తంభ తోరణాల్ గట్టె భువిని"[5]

సాయంవేళ గౌతమీ పరిసరాలలో పక్షులు 'అర్ధ వలయాకృతిం బంతు లలరు గతుల' నెగురు చున్న వానిని పై రీతిగా చెప్పుట చమత్కారముగా నున్నది.

ఇట్టి శబ్దార్థ భావ చమత్కారము లనేకముగా నందందు పసందుగా పొందింపబడి యున్నవి.

ఈ విధముగా కావ్యమున విశాలమైన ఉన్నతమైన ఉత్కృష్టమైన సుందరమైన చమత్కార బంధురమైన భావములు భాసిల్లుచు హృదయాహ్లాదము పొదలించుచు ఆలోచనామృతములను చూర లిచ్చుచున్నవి.

1. పోతన చరిత్రము :పీఠిక - 24
2. ,, 1-86
3. ,, 4-29
4. ,, 2-72
5. ,, 5-19

# వైదుష్యము

పోతన చరిత్రము వస్తు రస భావాలంకార ధ్వన్యాది సర్వకావ్యాంగముల చేత మహాప్రశస్తమై కావ్యనిర్మాణహేతువగు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు నిండుగా మెండుగా విరాజిల్లుట చేతనే మహా కావ్యమింత విశిష్టమై వెలసినదని విశదమగుచున్నది. ఆచార్యులవారి ప్రతిభాశక్తి యెంత మహత్తరమైనదో, సహజన్యమగు ఆ ప్రతిభను జాతిరత్నమును సానలదీర్చినట్లు ఎంత పరిశ్రమించి అభ్యాసమున బెట్టి మెరుగులు దిద్దుకొనిరో రమ్యరమ్యముగా రసోదంచితముగా ఉజ్జ్వలముగా ఉత్కృష్టముగా రచింపబడిన కావ్యమే సాక్ష్యమిచ్చుచున్నది. కాగా కావ్యహేతుభాగముల యందు రెండవదగు వ్యుత్పత్తి కావ్యమునేవిధముగా సుసంపన్నము చేసినదో చర్చించుట ఈ వ్యాసోద్దేశము.

## కావ్యనిర్మాణమున వ్యుత్పత్తి ప్రాముఖ్యము :

మమ్మటుడు కావ్యహేతువును గూర్చి చెప్పిన దిగువశ్లోకము ప్రసిద్ధమైనది.

"శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే"1

శక్తి, లోకశాస్త్ర కావ్యాద్యవలోకనమువలన గలిగిన నైపుణ్యము, కావ్యజ్ఞులయిన పెద్దల శిక్షణలో అభ్యాసము చేయుట అను మూడిటి సముదాయము కావ్యనిర్మాణమునకు హేతువగునని పై శ్లోకభావము.

మమ్మటుడు పైరీతిగా కావ్యహేతువును తెలిపి దాని వృత్తి యిట్లుకూర్చెను.

"శక్తిః కవిత్వ బీజరూపః సంస్కార విశేషః యాంవినా కావ్యం నప్రసరేత్, ప్రసృతంవా ఉపహసనీయం స్యాత్! లోకస్య స్థావర జంగమాత్మక లోక వృత్తస్య శాస్త్రాణాం ఛందోవ్యాకరణాభిదానకోశ కలా చతుర్వర్గ గజతురగ ఖడ్గాది లక్షణగ్రంథానాం కావ్యానాంచ మహాకవి సంబంధినాం ఆదిగ్రహణాదితి

1. కావ్యప్రకాశము : 1-3

హాసాదీనాంచ విమర్శనాత్, వ్యుత్పత్తిః కావ్యం కర్తుం విచారయితుంచ యే జానంతి తదుపదేశేన కరణే యోజనేచ పౌనఃపున్యేన ప్రవృత్తిరితి, త్రయః సముదితాః, నతు వ్యస్తాః, తస్య కావ్యస్యోద్భవే నిర్మాణే సముల్లాసేచ, హేతుః నతు హేతవః"

'శక్తి యనునది కవిత్వబీజరూపమయిన సంస్కార విశేషము. అదిలేక కవితావిర్భావము కలుగదు కలిగినను పరిహాస భాజనమగును. లోకముయొక్క అనగా స్థావర జంగమాత్మకమైన లోకవృత్తము యొక్కయు, శాస్త్రములయొక్క అనగా ఛందో వ్యాకరణాభిధాన కోశకలా చతుర్వర్గ గజతురగ ఖడ్గాది లక్షణ గ్రంథముల యొక్కయు, మహాకవుల కావ్యములయొక్కయు, ఆది యనుటచేత ఇతిహాసాదులయొక్కయు అధ్యయనమువల్ల నిపుణత అబ్బును. కావ్యజ్ఞులయిన వారి యుపదేశానుసారముగా మాటిమాటికి చేయు రచనాకృషి అభ్యాసమై యొప్పును. ఈ శక్తి నిపుణత అభ్యాసమను మూడు కలిసియే కావ్యహేతువగును.'

మమ్మటుడు వివరించిన కావ్యహేతువులో మొదటి భాగమగు శక్తి లోకోత్తర వర్ణనా చతురరూపమైన కవిత్వమునకు బీజరూపము. ఇది జన్మాంతరాభ్యాసము వలనగాని దేవతాప్రసాదమునగాని సిద్ధించును. దీనినే ప్రతిభ యని అభినవగుప్తుడనెను. "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా" యని భామహుడు దీనిని నిర్వచించెను. అనగా క్రొత్త క్రొత్త పోకడలమ గలిగించు ప్రజ్ఞయే ప్రతిభ యనబడునని భావము. ఈ ప్రతిభనే యాధునికులు 'భావనా శక్తి' యనియు ఆంగ్లమున 'Power of imagination' అనియు వ్యవహరింతురు. ఈ శక్తి లేక కావ్యనిర్మాణము చేయజాలరు. బలిమిమెయి చేయబూనినను సారము లేక పోవును. అట్టివి నవ్వుల పాలగునని మమ్మటుడనెను. కనుకనే కవిత్వము వ్రాయునట్టి ఈ శక్తి సహజముగా నుండవలసినదేకాని నేర్చుకొన్న వచ్చునది కాదు. ఇదే విషయము భామహుడిట్లు వచించెను.

"గురూపదేశా దధ్యేతుం శాస్త్రం జడధియో ఒప్యలమ్
కావ్యంతు జాయతే జాతు కస్య చిత్ప్రతిభా వతః"[1].

1. కావ్యాలంకారము : 1-5

అనగా మందబుద్ధి కలవారుకూడ గురూపదేశమువలన శాస్త్రాభ్యాసము చేయుటకు సమర్థులు కావచ్చును. కాని కావ్యము మాత్రము ప్రతిభావంతుడగు వానికెవనికో ఎప్పుడో ఉద్భవించును. వరదాచార్యులవారీ విషయము నిట్లుచెప్పిరి.

"ఉత్తమ కవితాలేఖన చిత్తమెల్లరకు నురక చిక్కునె? కూర్పన్
విత్తమ్మా? నేరిచికొన పొత్తమ్మా? పూర్వజన్మపుణ్యము కాకన్"[1].

ఇందలి కవితాలేఖన చిత్తమన ప్రతిభయే. అది యెంత లోకోత్తరమైనదో దుర్లభమైనదో పై విద్వద్వచనముల వలన విశదమగును.

సహజమైన ఇట్టి ప్రతిభకు తోడుగా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణము వలన నైపుణ్యము సమకూడునని చెప్పబడెను. నైపుణ్యమనగా వ్యుత్పత్తి. పాండిత్యమన్నమాట. విద్యాభ్యాసము చేయనివాడు పండితుడు కానట్లే పాండిత్యము సంపాదింపనిది కావ్యనిర్మాణ దక్షుడు కాజాలడు. ఇక మూడవదగు అభ్యాసము కావ్య రచనా కౌశల్యము నధికతరము సులభతరము కావించును. ఈ మూడిటిలో ప్రస్తుతాంశమగు వ్యుత్పత్తిని గూర్చి మరి కొంత చర్చింతును

కవికి ప్రతిభయుండి పాండిత్యము లేనిచో హృదయముండి శరీరబలము లేనివానివలె కృతినిర్వహణ చేయజాలని వాడగును. ప్రతిభా వ్యుత్పత్తులను శక్తి సామర్థ్యములతో పోల్చవచ్చును. కవికి శాస్త్రాది పరిజ్ఞానము లేనిచో మహావిషయ ప్రతిపాదనముకాని, విశిష్ట ధర్మోపదేశముకాని చేయలేకపోవును. స్థావర జంగ మాత్మక లోకజ్ఞానము లేనిచో దేనిని వర్ణించును? కావున కవి విద్వాంసుడై యుండవలయునని పెద్దలు నొక్కి వక్కాణించి యున్నారు.

ప్రతిభావ్యుత్పత్తులు రెండును ఉన్న కవియే కవి యనియు, అట్టి కవి శాస్త్ర కవి, కావ్యకవి, ఉభయకవి—అని మూడు రకములనియు అందు ఉత్తరోత్తరుడు శ్రేష్ఠుడనియు రాజశేఖరుడు విశ్లేషించి యిట్లు చెప్పెను.

"ప్రతిభావ్యుత్పత్తి యాంశ్చ కవిః కవిరిత్యుచ్యతే. సచ త్రిధా శాస్త్రకవిః, కావ్యకవిః, ఉభయకవిశ్చ. "తేషాముత్తరోత్తరో గరీయాన్" ఇతి శ్యామదేవః[2]

1. పోతన చరిత్రము : 2-226
2. కావ్యమీమాంస: పంచమాధ్యాయము: పుట 51 (డా॥ పుల్లెల శ్రీరామచంద్రుని వ్యాఖ్యానసహితము)

ఉత్తముడగు ఉభయ కవినే విద్వత్కవి యందురు. అతడు శాస్త్రమునందు వలె పురుషార్థ విజ్ఞానమును, కావ్యమునందువలె రసమును సమన్వయ రూపములో వెలువరించును. కావుననే "విద్వత్కవయః కవయః కేవల కవయస్తు కేవలం కవయః" అన్న అభియుక్తోక్తి యేర్పడినది.

కవికి సర్వ విషయజ్ఞానయస్తు మవసరమని భామహుడిట్లు తెలిపెను.

"న స శబ్దో న తద్వాచ్యం న స న్యాయో న సా కలా
జాయతే యన్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః[1]

అనగా "కావ్యాంగము కాని శబ్దముకాని అర్థముకాని న్యాయముకాని కళకాని లేదు. కవిపై గల భారము సామాన్యము కాదు.' ఈ యన్నిటితో చక్కని పరిచయము కలవాడై కావ్యమున కుపయుక్తపరచుకొను వాడే నిజమైన కవి యని యభిప్రాయము. వ్యుత్పన్నుడు కాని కవి సత్కవిత వెలార్చ జాలడు. కుకవిత్వమునకంటె అకవిత్వము మేలను భావముతో భామహుడే యిట్లు ఘోషించెను.

"నాకవిత్వమధర్మాయ వ్యాధయే దణ్డనాయ వా
కు కవిత్వం పునః సాక్షాన్మృతి మాహుర్మనీషిణః"[2]

కవిత్వము చెప్పనిచో అధర్మమునకు గాని వ్యాధికి గాని రాజదండనమునకు గాని పాల్పడడు. కుకవిత్వము మాత్రము సాక్షాత్తు మరణమే యని చెప్పిన యీ మాటలు సత్కవిత్వము చెప్పుటకు కవి పండితుడు కావలసిన యవసరమును గట్టిగా చెప్పుచున్నవి.

కవి కత్యవసరమగు వైదుష్యము లోక శాస్త్ర కావ్యాదుల యధ్యయనము వలన సమకూడునని మమ్మటుడు వివరించెను. రాజశేఖరుడును,

"గృహీత విద్యోపవిద్యః కావ్యప్రక్రియాయై ప్రయతేత....[3]

అని యిత్యాదిగా విద్యలను ఉపవిద్యలను అభ్యసించిన పిమ్మట కావ్యరచనకు ప్రయత్నింపవలెనసియు, నామపారాయణ ధాతుపారాయణములు (వ్యాకరణ

1. కావ్యాలంకారము : 5-4
2. ,, ,, : 1-12
3. కావ్యమీమాంస : దశమాధ్యాయము, కవిచర్యా-రాజచర్యాచ

శాస్త్రము), శబ్దకోశము, ఛందశ్శాస్త్రము, అలంకారశాస్త్రము అనునవి కావ్యవిద్యలు అనగా కావ్యరచన కుపయోగించు ప్రధాన విద్యలనియు, చతుష్షష్టి కళలుపవిద్య లనియు తెలిపెను. మమ్మటుడు చెప్పినది రాజశేఖరుడు చెప్పినది యించుమించు ఒకటియే.

మహాకవులెల్లరును తమ సహజ ప్రతిభకు సహకారముగా వ్యుత్పత్తిని సంపాదించి కావ్యములు రచించినవారే. వారి కావ్యావలోకనమువలన నిది స్పష్ట మగును. శ్రీనాథుని వంటి మహాకవి 'సకల విద్యా సనాథుడ'నని చెప్పికొనెను. పోతన సహజ పండితుడు. వరదాచార్యులవారును చిన్ననాడు తమ పెద్దన్న శ్రీమాన్ వెంకటాచార్యులవద్ద శాస్త్రాభ్యాసము చేసియు స్వయంకృషి కావించియు 'సహజ పాండిత్య భాసు'లైనారు.

## పోతన చరిత్రమున వైదుష్యము :

పోతన చరిత్రమును పరిశీలించినచో వ్యాకరణ చ్ఛందోలంకార శాస్త్రములు, శ్రుతి స్మృతుల విజ్ఞానము, ఉపనిషత్తులలోని భగవద్గీతలోని వేదాంతము, ద్రావిడ వేదాంతమగు విశిష్టాద్వైతజ్ఞానము, పురాణేతిహాస పరిచయము, చతుర్వర్గ విజ్ఞానము, జ్యోతిషము, యోగశాస్త్రము, చరిత్ర-సంస్కృతి, రాజనీతి, సంగీతము, నృత్యము, చరాచరలోకవృత్తము, కావ్య నాటక పరిజ్ఞానము ప్రస్ఫుటముగా గోచరించుచుండును. ఆచార్యులవారి కనేకానేక శాస్త్ర కళాది పరిచయ మున్నను కావ్యమున యథావసరముగా సందర్భోచితముగా ఆయా విషయ పరిజ్ఞానమును ప్రదర్శించినారు. ఈ శాస్త్రాది విజ్ఞానము శాస్త్రమునకు శాస్త్రము కావ్యమునకు కావ్యము కాక సూర్యతేజస్సాహ్లాదకర చంద్రికగా భాసిల్లునట్లు, పోషకశాకములు కమ్మని పాకములుగా సిద్ధమైనట్లు కవితా కళా విలసితముగా విరాజిల్లుచున్నది. ఇట్టి వైదుష్యమును సంక్షిప్తముగా చర్చింతును.

## వ్యాకరణచ్ఛందోలంకార శాస్త్ర పరిజ్ఞానము :

కావ్యరచనకు ప్రధాన విద్యలగు వ్యాకరణము, ఛందస్సు, అలంకార శాస్త్రము అను వాని వైదుష్యము పోతన చరిత్రమందంతటను పరివ్యాప్తమై ప్రత్యక్ష మగుచుండును. ఈ విషయము 'భాషా వైచిత్రి', 'ఛందో విశేషము', 'ఆలంకారికత' అను వ్యాసములందును, రసము, ధ్వని మున్నగు వ్యాసములందును ప్రత్యేకముగా

చర్చింపబడెను. ఐనను ప్రకరణానుసారముగా ఇక్కడ రెండు మాటలు వ్రాయు దును. ఇందు తొలుత వ్యాకరణము గూర్చి ముచ్చటింతును.

వ్యాకరణమున భాష, శబ్దార్థములు, వాని ప్రయోగ కౌశల్యము గణ్యము లగును. కావ్యమునందలి నిర్దుష్టమగు భాష, సంస్కృతాంధ్ర పద వాక్య ప్రౌఢ ప్రయోగ చాతుర్యము, అర్థపుష్టి వ్యాకరణ శాస్త్ర వైశారద్యమునకు నిదర్శనము.

'భాషావైచిత్రి' వ్యాసమున సాంస్కృతిక రచనలోను, అచ్చికరచనలోను, ఆరభటీ వృత్తిలోను ఉదాహరించిన పద్యముల వలన భాషా పాండిత్యము, వ్యాక రణ శాస్త్రవైదుష్యము ప్రస్ఫుటమగుచున్నది. మచ్చున కొకటి.

''మఖవారాహ కళేబరాయిత మహామంత్రానల ప్రోజ్జ్వల
చ్ఛిఖలన్ జ్ఞానవిహీన దైత్యపశు విచ్ఛిన్నాంగముల్ బంధకృ
న్నిఖిలాత్మీయ కళత్రపుత్ర మమతా స్నేహాజ్యధారాహుతుల్
సుఖదుఃఖ ప్రద కర్మ కాష్ఠ సమిధస్తోమమ్ముతో భస్మమై"[1]

ఇది యజ్ఞవరాహము హిరణ్యాక్షుని వధించిన ఘట్టము లోనిది. ఈ పద్యమున వ్యాకరణ సంబంధి సంధులు సమాసములు తద్ధితాదులు మున్నగునవనేకము లక్ష ణానుసారులై యొప్పుచున్నవి. ఇట్లే

"వప్రాపాట్టాలక శృంగ మూర్ధ విలసద్ వాల్లభ్య చిహ్నధ్వజా....[2]

మున్నగు పద్యములనేకములు ప్రౌఢ సంస్కృత భాషా వైదుష్యమును ప్రకటించు చున్నవి. ఇక అచ్చిక ప్రయోగ పరిజ్ఞానమునకు

"వగలాఁడి క్రేఁగంట వలపులే పూఁచెనా
రవ్వలు నీలాలు రాశిపడును....[3]

వంటి పద్యములును, విడుపువిడిది, ఆణిముత్యంపుఁ జేరుల యల్లికలు, ప్రాఁబ ల్కులు, ముమ్మొనవాలు, పాఁపపేరుల వంటి అచ్చిక సమాసములు సంధులు దృష్టాంతములు.

1. పోతన చరిత్రము : 11-200
2. ,, ,, : 4-68
3. ,, ,, : 4-165

సంస్కృత భాషా వాఙ్మయ పరిజ్ఞానమునకు కావ్యమునందలి సాంస్కృతిక శైలీ విన్యాసమేకాక ఎడనెడనుటంకించిన సంస్కృత వాక్యములు, రచించిన శ్లోకములు నిదర్శనములై యున్నవి.

ఇక ఛందశ్శాస్త్ర పరిచయమునకు రస భావోదంచితముగా ప్రయోగించిన సాధారణచ్ఛందములే కాక మాలిని, ఉపేంద్ర వజ్ర, ధ్రువ కోకిల వంటి విశేష చ్ఛందములను, దేశీయములైన కళికోత్కళికలను, వివిధ తాళముల గీతములను, నానాచ్ఛందో విలసితములగు సంస్కృత శ్లోకములను గూర్చిన విషయము ప్రబల దృష్టాంతము.

కావ్య విద్యలలో మూడవదగు అలంకార శాస్త్రపరిజ్ఞానము కావ్యమున కంఠ దఘ్నముగా కానవచ్చును. మహాకావ్య లక్షణము మొదలుకొని నాయక రసాలంకార ధ్వన్యౌచిత్యాది సమస్త కావ్యశాస్త్ర విషయముల వైదుష్యము భాసురముగా సాక్షాత్కరించును. వీనిని గూర్చి వివిధ వ్యాసములలో చర్చించినది నిరూపకమై యొప్పుచున్నది.

## వేదాంతము :

ఆచార్యులవారికి కవిత్వము తర్వాత ప్రాణానికి ప్రాణమైనది వేదాంతము. వారు పోతనవలెనే భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నులు. వారు బ్రహ్మసూత్రములు ఉపనిషత్తులు భగవద్గీత యను ప్రస్థానత్రయము నశేవముగా సేవించిరి. నిత్య జీవితమున ననుష్ఠించిరి. కావుననే వారి రచనలు తత్త్వగర్భితములై జీవేశ్వరతత్త్వమును, సృష్టిరహస్యమును, జీవిత పరమార్థమును ప్రబోధించుచు నుత్కృష్టమయి యొప్పారు చుండును. పోతన చరిత్రమున ఈ వేదాంత జ్ఞానమామూలాగ్రముగా వ్యాపించి యున్నది. 'కావ్యోపదేశము' వ్యాసమున భక్తి జ్ఞాన వైరాగ్యముల ప్రబోధము గురించి విపులముగా చర్చించిన దానిలో ఈ వేదాంతశాస్త్ర వైదుష్యము విశ్వరూప ప్రదర్శనము చేయుచున్నది. కావున చర్విత చర్వణముగా దీనిని మరల నిచట ముచ్చటింప నవసరము లేదు.

## విశిష్టాద్వైతము :

వరదాచార్యులవా రుభయ వేదాంత విజ్ఞాన విశారదులు. భగవద్రామానుజులు ప్రవర్తింపచేసిన విశిష్టాద్వైత మతతత్త్వ ముభయవేదాంతము. సంస్కృత

మున వ్రాయబడిన వేదాంతమును తమిళమున వ్రాయబడిన ఆళ్వారుల పాశురము లలో నుండు వేదాంతముతో సమన్వయించుట వలన విశిష్టాద్వైతమునకు ఉభయ వేదాంతమను పేరు వచ్చినది. సాధారణముగా శ్రీ వైష్ణవ విద్వాంసులకి యుభయ వేదాంతము సుపరిచితమై యుండును. అందు సద్గురువులగు వరదాచార్యులవారి కిసి కరతలామలకమై భాసిల్లుచున్నది.

పోతన విరక్తుడై పరమేశ్వర లీలావిలాసములు బాడుచు తీర్థయాత్రలు చేసిన ఘట్టమునందీ విశిష్టాద్వైత విజ్ఞానము వెదజల్లబడినది. అతడు తిరుమల శ్రీనివాసుని కంచి వరదరాజస్వామిని శ్రీరంగనాథుని పెరుంబూదూర రామానుజు లను శ్రీ విల్లిభుత్తూర ఆండాళును సేవించిన సందర్భము లందీవిషయములు ప్రస్తావింపబడినవి.

"అని యచటు (శ్రీరంగమును) విడిచి రామానుజ జగద్గురు పీఠాసీనుండగు నుభయ వేదాంత విద్యానిధియుఁ బరమ ప్రసన్నుండునునగు నొక్క యతిపతి నాశ్ర యించి తాప పుండ్ర నామ మంత్ర యాగాది పంచ సంస్కారముల వడసి విశిష్టా ద్వైతమత నిష్ఠాగరిష్ఠుండై భగవద్రామానుజముని ప్రభావంబు నంతరంగంబునఁ జింతసేసి-"[1] అని పోతన విశిష్టాద్వైతమతము పుచ్చుకొన్నట్లు వర్ణించుటవల్లను,

> "వృద్ధత్వమందిన వేదత్రయమునకు
> దండత్రయమ్ము నూఁతగ నిడియెను...."[2]

ఇత్యాదిగా నొనర్చిన శ్రీరామానుజవర్ణన వల్లను,

> "అని వినుతించి వైష్ణవ మతాంచితమంత్ర రహస్యమర్మముల్
> తనకెఱిఁగించు గ్రంథ సముదాయమునెల్లను నార్యసన్నిధిన్
> విని మననమ్మొనర్చి కనువిప్పు జనింపఁగ న్యస్త భార వ
> ర్తనుఁడయి యేఁగి భక్తి మెయి రంగ సతీమణి గోదఁ బాడుచున్"[3]

అని వ్రాయుట వల్లను నిది విదితమగుచున్నది. మరియు భాగవత గాథలలోని రామచరిత్రములో దశకంఠ వధానంతరము విభీషణుడు దాశరథి నిట్లు ప్రస్తు తించెను.

1. పోతన చరిత్రము : 9-265
2. ,, ,, : 9-273
3. ,, : 9-278

"శ్రీనివిడి హరిని జేరిన దానవియగు చుప్పనాతి దశ ఘటియిలు శ్రీ
మానిని జేరి హరిన్ విడ దానవపతి యగు దశాస్యుదశ గనఁడె యనున్"[1]
"కావున శ్రీ మానినీ పురుష కారంబున శ్రియఃపతి నాశ్రయించి
తరింప నగుఁగాదె యన"[2]

ఇందు శ్రీనారాయణుని భక్తితో ఆరాధించుట, భరన్యాసము చేయుట, లక్ష్మీదేవీ పురుషకారముతో శ్రీపతి నాశ్రయించి నపుడే భవతరణ మగుననుట విశిష్టాద్వైతము నందలి సిద్ధాంతములు. ఇట్టివి భాగవత కథలయందును, పోతన భాగవత జీవితమునందును నిరూపితమగుచున్నవి.

## జ్యోతిషము :

వరదాచార్యులవారి కుభయ వేదాంతముతోపాటు జ్యోతిషము పైతృకముగా అబ్బినది. వారు జ్యోతిషమునందును చక్కని పరిజ్ఞానము నార్జించినారు. పోతన చరిత్రమున మూడు నాలుగు సందర్భములందు జ్యోతిష శాస్త్ర విషయములు వెలార్చబడినవి.

పోతన జన్మించినప్పటి జాతక విశేషము లిట్లు తెలుపబడినవి.

"జనమనోంబుజ మిత్రుఁడన నొప్పు నీ
బిడ్డడన జాతలగ్న మందినుఁడు దనరె
నురు పండితానీక గురుపర్యుఁడగునట్టి చిఱుతండనఁగ ధనుర్గురుఁడు వఱలె
బుధ జనాంబుధి పూర్ణవిధుఁ డీతఁడగునన్
బుధ చంద్రులను కూల విధినెసఁగిరి
కవిసార్వభౌమ మూర్ధవతంసమితఁడనన్ గవి మహోచ్చస్థాన నివసతిగొనె
మందమతిచే శ్రమంబడు మహితుఁడనఁగ
మందుఁడవరోధక స్థానమందు వెల్గ
జ్యోతితోఁ బోరెడి తమిస్రపోతము లయి పరఁగె
ఛాయా గ్రహమ్ములు పాపదృష్టి"[3]

1. పోతన చరిత్రము : 11-100
2. ,, : 11-101
3. ,, : 1-115

"బాలకుఁడతుల ప్రతిభాశాలియగున్ వీని నెదురఁ జతురాననుఁడున్
గేలియగున్ ఫణిపతియున్ వేలశిరము లూఁచి మెచ్చు వీని చరిత్రల్"[1]

"అనుచున్ జ్యోతిష్కులు పాపని జాతకరీతినరసి బహుళాశ్చర్యాంబునిధిన్ మునిగి"రని వర్ణింపబడినది.

పోతన జననకాల గ్రహస్థితి తత్ఫలితములు చెప్పిన యీ విషయ మాచార్యులవారి జ్యోతిశాస్త్ర పాండిత్యమును స్ఫుటీకరించుచున్నది. దీని నించుక వివరింతును.

'జనన మనోంబుజ' పద్య భావమిది :

1. జన్మ లగ్నమున సూర్యుడుండెను. కావున జనుల హృదయాలను మిక్కిలి సంతోషపెట్టువాడు వికసింపజేయువాడు కాగలడు.

2. ధనూరాశిలో గురుడుండెను. కనుక మహా పండితులకు గురువగును.

3. బుధచంద్రు లనుకూలముగా (బుధుడు కన్యారాశిలో ఉండెను) ఉండిరి. అందువల్ల పండిత లోకమునలరింపజేయు శాస్త్రములు కళలు నేర్చి ప్రకాశించును.

4. శుక్రుడు మహోచ్చ స్థానమందుండెను. కావున మహాకవులలో శ్రేష్ఠుడగును.

5. శని అవరోధక స్థానమందుండెను. కావున మందబుద్ధిచే బాధపడు మహనీయుడగును.

6. ఛాయాగ్రహములు పాపదృష్టి గలిగియుండెను. కనుక కష్టాల పాలగును.

ఈ గ్రహ ఫలములకు వరాహమిహిరుని బృహజ్జాతకము నుండి ప్రమాణములు దిగువ చూపుచున్నాను.

(1) "శూరః స్తబ్ధో వికలనయనో నిర్ఘృణోఽర్కే తనుస్థే"[2]

ఏ జాతకుని జన్మకాల లగ్నములో సూర్యుడుండనో ఆ జాతకుడు శూరుడు స్తబ్ధుడు, నేత్రరోగి, నిర్దయుడునగును- అని దీని యర్థము. ఇక్కడ

1. పోతన చరిత్రము : 1-117
2. బృహజ్జాతకము : 20-1

శూరుడగునన్న లక్షణమొక్కటి పోతనకు పట్టుచున్నది. మరియు సూర్య
జన్మ లగ్నములో నుండగ సింహ లగ్న జాతకుడగును. అట్టివాడు ఆత్మాభిమ
ధైర్యశాలి శూరుడు కాగలడని గ్రంథాంతరములందు చెప్పబడినది. ఇవి పోతన
కానవచ్చు గుణములే. ఇంకను ఆయా గ్రహముల స్థితినిబట్టి గుణములలో మా
ఉండును. ఆ వివరమెల్ల ఆచార్యులవారు తెలుపుటకు వీలు లేకపోయినది.

2) (చంద్రోరత్నసుత స్వదారవిభవప్రజ్ఞా సుఖైరన్వితః
సింహేస్యాద్బలనాయకః సురగురౌప్రోక్తంచ యచ్చంద్రభే)
"స్వర్షేమాండలికో నరేంద్ర సచివః సేనాపతిర్వాధనీ.... "[1]

'స్వరాశిలో అనగా ధనుస్సులో లేదా మీనములో గురువుండిన జాతక
మండలేశ్వరుడు, మంత్రి, సేనానాయకుడు, ధనవంతుడగును.'

ఇక్కడ పాత్రానుగుణముగానగు పదవులను పొందునని గ్రంథాంతరవ
వివరముండుటచేత మహాపండితలోక గురువగునన్నది పోతనకు సరిపోయినది.

3) "త్యాగీ జ్ఞః ప్రచురగుణః సుఖీక్షమావాన్
యుక్తిజ్ఞో విగతభయశ్చ షష్ఠరాశౌ"[2]

బుధుడు ఆరవరాశిలో (కన్యారాశిలో) ఉన్న జాతకుడు దాత, పండితుడు, బ
గుణోపేతుడు, సుఖి, క్షమావంతుడు, స్వీయకార్యసాధనచతురుడు నిర్భయు
అగును. అన్న యీ లక్షణము ఆచార్యులవారు చెప్పినదానికి సరిపడుచున్న
బుధుడు చంద్రుడనకూలముగా నుండిరనగా బుధుడు కన్యారాశిలో నుండెను.

4) "గణైః పూజ్యః సస్వస్తురగ సహితే దానవగురౌ
ఝషేవిద్వానాఢ్యోనృపజనితపూజోఽతి సుభగః"[3]

'మీనరాశిలో శుక్రుడున్న జాతకుడు విద్వాంసుడు ధనవంతుడు, రాజపూజితుడ
సర్వజనప్రియుడగును. 'కవి సార్వభౌమమూర్ధవతంసుడగు' నన్న ఆచార్యులవా
మాటకివి సరిపోయినవి. శుక్రుడు మహోచ్చస్థానమున నుండుట యనగా మీనరాశి
నుండుట. విశ్వకవి రవీంద్రుడు ఇట్లే శుక్రుడు మహోచ్చ స్థానములో నుండ

1. బృహజ్జాతకము : 18-13
2. ,, : 18-10
3. ,, : 18-16

జన్మించినాడని అతని జాతకమును జ్యోతిషులు పరిశీలించి వ్రాసిన దానిని బట్టి తెలియుచున్నది. ఇక శని అవరోధకస్థానము నందుండుటవలన మందబుద్ధిచే బాధ పడునన్నది, ఛాయాగ్రహములగు రాహుకేతువులు పాపదృష్టి కలిగియుండినందున కష్టముల నెదుర్కొనువాడగునన్నది జ్యోతిషశాస్త్రమున తెలుపబడిన విషయములే.

ఇంతకు పోతనగారి యీ జాతక విశేషములు ఆచార్య కల్పితములు. పోతన జన్మించిన తిథి కాలములు తెలియవు. ఆయన గుణగణములను జీవితములోని విశేషములను దృష్టియందిడుకొని జ్యోతిర్విద్యా విశారదులగు ఆచార్యులవారు తదనుగుణముగా ఆయా గ్రహముల స్థితిని కల్పించి తెల్పి తత్ఫలితములను వర్ణించియున్నారు.

పోతన వివాహమునకు శ్రీనాథుడు సుముహూర్తము నిశ్చయింపదలచి పలికిన దిగువ వాక్యములు జ్యోతిర్విద్యలో ముహూర్త భాగమును దెలుపుచున్నవి.

"అరయ రాశిద్వయమ్మునేకాధిపత్య గతిఁ జెలంగుచు బహుగుణోన్నతి వెలుంగు

లక్షణాన్వితమ్మగు శుభలగ్నమొకటి యీ వధూవరులకు నిశ్చయింతుననియె"[1]

ఏకగ్రహాధిపత్యమున రెండు రాశులుండి బహుగుణములు (36 గుణములలో అధికాధికము) శోభిల్లునట్టి శుభలగ్నము పెండ్లికి నిశ్చయించుట జ్యోతిషపండితులు పాటించు విషయము.

మరొకచోట పోతన వెడలినప్పటి హిడింబాశ్రమ ( మెట్టుగుట్ట ) వర్ణనలో జ్యోతిష విషయమిట్లు కలదు.

"ఇది హిడింబాసురక్షేత్రమిందుఁదొల్లి
దనుజసుందరి తమి వాయుతనయుఁ గూడి
ధరణి 'స్త్రీరాక్షసం నకర్తవ్య'మనఁగఁ
గ్రాలు గణకూట శాస్త్రమున్ గల్లజేసె"[2]

ఇందలి 'స్త్రీరాక్షసం నకర్తవ్యమ్' అనునది కాలామృతమున నిట్లు వివరింపబడినది.

1. పోతన చరిత్రము : 2-236
2. ,, : 9-3

"స్త్రీరాక్షసం నకర్తవ్యం కర్తవ్యం నరరాక్షసం
స్త్రీరాక్షసం భవేన్మృత్యుస్సద్య ఏవ నసంశయ"[1]

ఇది వివాహ నిశ్చయములో వధూవరుల గణమైత్రి చూచుటలోని విషయము. 'రాక్షస గణముగల స్త్రీని వివాహమాడరాదు. పురుషుడు రాక్షస గణమువాడైన దోషములేదు. స్త్రీ రాక్షస గణము గలదైనచో మృత్యువు సంభవించును'. అని దీని యర్థము. ఇక్కడ హిడింబ రాక్షసగణము కలదేకాదు సాక్షాత్తుగా రాక్షసి-కాగా రాక్షసగణ స్త్రీని పెండ్లాడరాదన్న జ్యోతిష శాస్త్రమును, హిడింబ భీముని పెండ్లి అబద్ధము చేసెనన్న భావమున వ్రాయబడినది. హిడింబను చేపట్టుట చేత భీముని కెట్టి యాపద సంభవింపలేదు. సరికదా మేలే జరిగినది. అగుచో జ్యోతిషము తప్పు కాదాయన రాక్షస గణస్త్రీని పెండ్లాడకూడదని శాస్త్రము చెప్పినది కాని రాక్షసిని పెండ్లాడ వలదనలేదు. కనుక ఇచట ఈ విషయము చమత్కారముగా చెప్పబడి నది.

ఇట్లే ఏకశిలా నగరపండితులు పోతనకు
"జయ సంవత్సర చైత్రశుద్ధ ప్రతిపత్సంపన్ముహూర్తంబునన్"[2]
భాగవత రచన ప్రారంభము చేయవలెనని చెప్పినది జ్యోతిష విషయము. సంవత్స రాదినాడు ప్రారంభించిన కార్యము విజయవంతమగు ననియు, ఆనాడు బలమైన మంచి ముహూర్తము లేకున్నను దోషములేదనియు ప్రాజ్ఞులు చెప్పుదురు. మరియు "రాశిగణ కూటమైత్రి ప్రకాశింపన్ లగ్న పత్రికన్ వ్రాసి తమిన్ శ్రీ శుభమస్తని మల్లన నాశీర్వాదమ్ము చేసి రవనీసురులున్"[3] అన్నదియు జ్యోతిషాంశమే.

పోతన తల్లి ఆసన్నమరణ యన్న వార్తవిని రాచకొండనుండి వెడలు నపుడు
'వెదురులుం గ్రొత్తకుండలు నెదురువచ్చె'[4]
నని చెప్పినది జ్యోతిష శాస్త్రములోని యొక అంగమగు శకున శాస్త్రములోనిది.

1. కాలామృతము : 121 శ్లోకములోని వాఖ్యానములోనిది (వ్యాఖ్యాత వేంకటాఖ్యుడు)
2. పోతన చరిత్రము : 5-135
3. ,, ,, : 8-161
4. ,, ,, : 4-387

ఈవిధముగా ఆచార్యులవారు జ్యోతిష శాస్త్రవైదుష్యమును సందర్భోచిత ముగా కావ్యమున సువ్యక్తముచేసినారు.

## యోగశాస్త్రము :

కావ్యమున యోగశాస్త్ర విషయమొక్కచోట కానవచ్చుచున్నది. పోతన గౌతమీ సైకతమున మహేశ్వరధ్యానము చేసినప్పుడు చెప్పిన దిగువ పద్యములు యోగ విషయమును తెలుపుచున్నవి.

''భసితస్నిగ్ధ పవిత్ర లాంఛన లసత్ఫాలుండు రుద్రాక్ష హా
రసమాశ్లిష్ట విశాల వక్షుఁడవిలోలత్కించి దున్మీలితా
క్షిసమాలోకన నాసికాగ్రుఁడు సమగ్రీవా శిరఃకాయుఁడు
ల్లసితాత్ముండుఁ బ్రశాంతచిత్తుఁడగుచున్ లక్షించుచున్నంతలో''[1]
"ఒదవె సుషుమ్నద్వంద్వ పవనోర్మికలందు లయించె నెంతయున్
కదలికలేని వారివలె గాలి చలింపని దీపెయట్టులు
న్మదతను వీడు బుద్ధిగత మత్సరుఁడై గ్రసియించు రాహువు
క్తిఁ దనపు సోముభాతిఁ గవి తేజరిలెన్ ఘటితామనస్కతన్."[2]

ఇందు యోగవిషయము చక్కగా పొందుపరచబడినది. మొదటి పద్యమున యోగి యుపవిష్టుడు కావలసినతీరు శాస్త్రసమ్మతముగా వర్ణింపబడినది.

"సమంకాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్"[3]

అని యిత్యాదిగా గీతలో బోధించిన దానికి లక్ష్యముగా పోతన విషయము వర్ణిత మైనది ధ్యానమొనర్చు యోగి శరీరమును మెడను తలను కదలకుండ చక్కగా

1. పోతన చరిత్రము : 5-78
2. పోతన చరిత్రము : 5-79
3. భగవద్గీత : 6-13

నిలిపి దృష్టి నితర పదార్థములయందు ప్రసరింపనీయక నాసికాగ్రమునందు నిలుపుచు ప్రశాంతచిత్తమును పరమాత్మయందు లగ్నము చేయవలెను.

ఇట్టి స్థితిలో కలుగు అనుభూతి రెండవ పద్యమున చెప్పబడినది. ఇక్కడ యోగశాస్త్రోక్త విషయ మొకింత చెప్పవలసి యున్నది. మెదడునుండి వెన్నెముక పొడుగున వ్యాపించియుండు నాడులలో వెన్నెముకలో ఎడమవైపున 'ఇడ' కుడి వైపున 'పింగళ' మధ్యభాగమున 'సుషుమ్న' అను నాడులుండును. వెన్నెముక క్రింది భాగమున గలచోటు మూలాధార మనబడును. అక్కడగల చక్రము (చక్ర మనగా నాడుల కేంద్రము) మూలాధార చక్రమనబడును. అందు 'కుండలిని' యను ప్రాణశక్తి నిద్రాణమై యుండును. అది పామువలె ముడుచుకొని యుండుటచేత కుండలినీ శక్తి యనియు సర్పశక్తి యనియు పిలువబడును. యోగసాధకుడు మూలాధారమునందలి కుండలినీ శక్తిని మేల్కొలిపి వెన్నెముకలోని సుషుమ్నా నాడి ద్వారా ప్రసరింపజేసికొనుచు లింగస్థానము వద్దనుండు స్వాధిష్ఠానమును, నాభి వద్దనుండు మణిపూరక చక్రమును, హృదయ స్థానమువద్దగల అనాహత చక్రమును, కంఠమూల స్థానము వద్దగల విశుద్ధ చక్రమును స్పందింప జేయుచు దాటించును భ్రూమధ్య స్థానమువద్దగల ఆజ్ఞాచక్రము వద్ద నిలుపును సాధకుడు చూపును నాసికాగ్రమున నిలిపి చిత్తమును భ్రూమధ్యమున నిల్పి సాధన చేయును. ఈ యభ్యాసములో మనస్సు తీవ్రముగా ఏకాగ్రమై ఉచ్ఛ్వాస నిశ్వాసలు క్రమముగా సన్నగిల్లి నిల్చిపోవును. అప్పుడు మనస్సు గాలిలేని దీపమువలె నిశ్చలమై అహంకార మమకారములకు తావులేక విశుద్ధమై సుసూక్ష్మమై అమనస్కత ఘటిల్లును. అనగా మనస్సు బ్రహ్మధ్యానమునందు లయించి బాహ్యస్మృతిని కోల్పోవును. ఈ దశలో కుండలిని శిరోమధ్యమునగల సహస్రార చక్రమున చేరి నిల్చును. సమాధ్యవస్థ ప్రాప్తించును. సమాధియనగా ఇంద్రియ నిరోధము కలిగి మనస్సు ధ్యేయము నందు పరమాత్మయందు-ఐక్యమొందుట. యోగి సమాధియందు ఆత్మ సాక్షాత్కారము-భగవత్ సాక్షాత్కారము పొంది బ్రహ్మానంద మనుభవించును. ఈ విషయమెల్ల పతంజలి యోగశాస్త్రము నందును ఇతర యోగగ్రంథములందును వివరింపబడి యున్నది. సిద్ధాంతముగా దీనిని చదువుటవల్లగాక సాధన చేయుటవల్ల అనుభవైకవేద్యమై ప్రకాశించునని సిద్ధయోగులు సెలవిచ్చుచుందురు. ఈ విషయము భగవద్గీతయందును

"యథా దీపో నివాతస్థోనేంగతే సోపమాస్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః"[1]

అనగా 'ఆత్మయోగము నభ్యసించుచు నియతచిత్తముగల యోగుల నిశ్చలస్థితికి గాలి లేనిచోట దీపము కదలక నిశ్చలముగ నుండుట యుపమానముగ చెప్పబడుచున్నది' అని తెల్పబడినది. 'యోగశ్చిత్తవృత్తి నిరోధ'[2] అనగా చిత్తవృత్తి నిరోధము యోగమని పతంజలి నిర్వచించియున్నాడు.

ఈ యోగ విషయమునే ఆచార్యులవారు వర్ణించినారు. పోతనకు భ్రూమధ్యమున సుషుమ్నా నాడిలో మనస్సు నిలుపగనే ఉచ్ఛ్వాస నిశ్వాసము లంతరించి మనస్సు నిశ్చలము నిర్మలమునయ్యెను. అప్పుడతనికి అమనస్కత ఘటిల్లి ప్రకాశించెను. అనగా చిత్తము ఈశ్వర ధ్యానము నందు లయమై బాహ్యస్మృతి కోల్పోయెను. పోతనకు కుండలిని మేల్కొని ఆజ్ఞాచక్రమున నిలిచెనన్నది గ్రాహ్యము.

## కావ్యస్మృత్యాగమాది విజ్ఞానము :

కావ్యమున పారలౌకికమగు భక్తి జ్ఞాన వైరాగ్య విషయములును, లౌకికమగు ధర్మార్థ కామ సంబంధమగు ఆర్ష ధర్మములును ప్రబోధించుటవలన శ్రుతుల స్మృతుల శైవ వైష్ణవాగమ శాస్త్రముల విజ్ఞానమందందు పొందింపబడిన విషయము విదితమగును. 'కావ్యోపదేశము' వ్యాసమున చర్చించిన వానిలో నిది ద్యోతకము కాగలదు. 'స ఏకాకీ న రమేత' (2-37), 'రసోవైస నారాయణ' (6-174), 'అంతర్బహిశ్చతత్సర్వం'(11-350), 'ఆనందో బ్రహ్మ'(9-250), 'యాచయేత్ శ్రోత్రియస్యాన్నమ్' (6-137) వంటి మహా వాక్యములు శ్రుత్యాదుల పరిచితిని తెలుపుచున్నవి. పాల్కురికిజాతరలోని శివసేవ; పోతనచేసిన భాగవత సప్తాహము, నర్సమాంబ కావించిన దుర్గాదేవి స్తుతి, తీర్థయాత్రలలో పోతనచేసిన వివిధ క్షేత్ర దైవతముల స్తుతులు వర్ణనలు, చిదానంద గురుస్తుతి మరియు వివాహాది సంస్కార విపుల వర్ణనలు మొదలగునవి వైదిక ధర్మశాస్త్రముల యొక్కయు ఆగమ శాస్త్రముల యొక్కయు పరిజ్ఞానమును ప్రస్ఫుటము చేయుచున్నవి.

## పురాణేతిహాస పరిజ్ఞానము :

ఆచార్యులవారు బహు పురాణజ్ఞులు నితిహాసవిదులునైనప్పటికి పోతన చరిత్రమున ముఖ్యముగా భాగవత పురాణము రామాయణ భారతేతిహాసముల ప్రసక్తి

1. భగవద్గీత : 6-19
2. పాతంజల యోగశాస్త్రము : సమాధిపాదము, 2వ సూత్రము.

యేర్పడుటచేత ఈ మూఁడిటి పరిజ్ఞానము మాత్ర మిందు సువ్యక్తమగుచున్నది. కావ్యానుబంధమునందలి భాగవత భక్తి గాథల రచన ఆచార్యులవారి భాగవత పురాణ వైశారద్యమునకెత్తిన బావుటా. ఆ భాగవత గాథలలో అష్టోత్తర శత పద్యములతో రచించిన శ్రీరామ చరిత్రము, దశమాశ్వాసమునందలి ఫలశ్రుతిలో నరువది పద్యముల వరకు గూర్చిన పాండవుల చరిత్రము వారి రామాయణ భార తేతిహాసముల సుపరిచితికి నిబిడ నిదర్శనము.

## చరిత్ర సంస్కృతి విజ్ఞానము :

ఆచార్యులవారు ఆంధ్రదేశ చరిత్ర విజ్ఞానమును కావ్యమున అనేక సంద ర్భములందు ప్రదర్శించియున్నారు. అది వారి చరిత్ర పరిజ్ఞానమునకు దర్పణము పట్టుచున్నది.

కావ్య కథా ప్రారంభము నందు కావించిన ఏకశిలానగర వర్ణనలోని

"బ్రాహ్మణుండావీట బహుళ విజ్ఞానియై ప్రథితవిద్యానాథ పదవి బడసె"[1]

అని చెప్పినదానిలో ఏకశిలానగర చరిత్రాంశములు పేర్కొనబడి దాని ప్రశస్తిని వెల్లడిచేయుచున్నవి. ఇట్లే శ్రీనాథ పోతనలు చెడిపడిన యోరుగంటి శిల్పములను వర్ణించిన విషయములును, మణిగిరిలో విద్వాంసులు

"తగ నాంధ్ర రఘువు ప్రతాపరుద్రుఁ డొసంగు
స్వర్ణవృష్టింబాఱు చదలువాఁక"[2]

అని యిత్యాదిగా వర్ణించినదియు,

పోతన మణిగిరి పండితులతో
"ఓరుగల్ కోటలో నొక గంట నిలిచిన
నాంధ్రుల పౌరుషంబర్థమగును"[3]

అని వర్ణించినదియు నోరుగల్లు ప్రాశస్త్యమును, కాకతీయ సామ్రాజ్య చరిత్ర ప్రాభవమును, ఆంధ్రుల పురాణవైభవమును చాటి చెప్పుచున్నవి.

1. పోతన చరిత్రము : 1-80
2. ,, ,, : 9-74
3. ,, ,, : 9-78

రాచకొండ రాజధానిగా తెలంగాణము నేలిన రేచర్ల పద్మనాయక ప్రభువు సర్వజ్ఞ సింగభూపాలుని చరిత్ర చతుర్థాశ్వాసమున ముఖ్యముగా తెలుపబడినది. నగర వర్ణనలో రాజును దర్బారును వర్ణించిన దానిలో నివి స్పష్టమగుచున్నవి. ఇది సాధారణ నగర వర్ణనకాక ఆనాటి రాచకొండ నగర విశేషములను చరిత్రాంశము లను తెలియజేయుచున్నది.

పుష్పలావిక శ్రీనాథ పోతనలకు రాచకొండ నగరు దారి తెలుపుచు చెప్పిన
"గుఱ్ఱాల కోనేరు కొండయందేనికల్
కంఖాణములు వేలు గలవు సామి!"[1]

యన్న పద్యమునందును

"ఇది కచేరీ కొండ యిందుండు మన్నియ
తామర చెలి చూలి త్యాగమందు"[2]

అను పద్యము నందును రాచకొండలోని గుఱ్ఱాల కోనేరు, గజాశ్వశాలలు, అస్త్ర శస్త్రశాలలు, సాముగరిడీలు, సైనికవీరులు, కచేరికొండ, అందులో నాలుగువాకిళ్ళు నడవగా కచ్చేరి, అంగణములు, దివాణము వెనుకగల సంకెళ్ళ బావి యివి యన్నియు చెప్పబడినవి. కాగా కావ్యకథకు రసోపస్కారముగా ఔచితీభాసుర ముగా అవసరమున్నంత మేరకే ముఖ్యముగా రాచకొండ నగర వైభవము, సింగ నృపతి గుణరూప ప్రతాపౌదార్య పాండిత్య సాహిత్య పోషణాదులే రమణీయముగా వర్ణింపబడినవి కాని అనవసర చరిత్రాంశములు చొప్పింపబడలేదు. సర్వజ్ఞ సింగ నృపతి మహాసంస్కృత పండితుడై తద్భాషాభిమాని యన్న సాహిత్య చరిత్రాం శము శ్రీనాథుడు పుష్పలావికతో పలికిన

"ద్వేషముఁ గొల్పు చిహ్నములుఁ దేపలదంచుఁ దలంచి యిప్పుడీ
వేషముఁ దాల్చివచ్చితిమి విస్మయమందఁగనేల యాంధ్రవా
గ్యోషకు మాతృభాషకిల యోగ్యతలేదని సంస్కృతమ్మె స
ద్భాష యటంచు మీ విబుధవర్గముఁ మీఁదు నరేంద్రుఁ డెంచుటల్"[3]

అను మాటలవల్ల విదితమగుచున్నది. ఇట్లే శ్రీనాథుడు సింగనృపతిని సందర్శించు టకు ముందు అతని సభాభవనము చెంత చెలువొందు శారదాదేవిని కొనియాడిన

1. పోతన చరిత్రము : 4-54
2. ,, ,, : 4-55
3. ,, ,, : 4-43

కవిచరిత్ర విషయము కావ్యమున "మును నీ దివ్య కటాక్ష...."[1] అని పొందు పరచుట జరిగినది.

శ్రీనాథుడు పోతన జాడ నెరుగుటకు ప్రౌఢ దేవరాయల యాస్థానమునకేగి యతని వినుతించిన ఘట్టమున విజయనగర సామ్రాజ్య చరిత్రాంశములు తెలుప బడినవి.

"ప్రాక్పశ్చిమాంభోధిఁ బర్వెత్తు తరఁగ లే
రాజ్యలక్ష్మికిఁ జామరములు వీచు"[2]

అను పద్యము విజయనగర సామ్రాజ్యపు సరిహద్దులను, వైభవ ప్రాభవములను-శుష్క చరిత్రాంశములను కమ్ర కవితారసాయనముగ నందించుచున్నది. మరియు

"గజపతులె యపజితులైరి కటకుతురక పాదుషాలె సలామిడి పదములంటి
కొలిచిరన సింగభూపతి బలమదెంత విక్రమించిన మిముమించు వీరుఁడున్నె"[3]

అన్న శ్రీనాథుని మాటవలన ఆనాటి విజయనగర సామ్రాజ్య ప్రాభవము విశద మగుచున్నది.

తీర్థ శ్రాద్ధగతులు నెరప తిప్పన పోతనలు గంగకేగినప్పుడు తత్తటమున శోభిల్లు నేడు మంథెన యనబడు మంత్రకూటమును గురించి తిప్పన చెప్పిన చరిత్రాంశములు గణనీయములైనవి.

"వర పశ్చిమ చళుక్య వసుధాధినేత యా భూలోకమల్లుని యేలుబడిని
ప్రాతినిధ్యమ్మొని పాలించె నిచ్చోడు రాజధానిగ గుండరాజు తొల్లి
యా గుండనృపుని రాజ్యభ్రష్టుఁ గావించెఁ గాకతి ప్రోలరాట్సునుఁడు దొడరి

1. పోతన చరిత్రము : 4-58
2. ,, ,, : 10-6
3. ,, ,, : 10-19

యప్పట్ల రూపతి యడఁగిన యీ ప్రోలు కాకతివంశ దివాకరుండు
శ్రీ ప్రతాప రుద్రుఁ డమోఘశీలధనుఁడు మఱలఁ బొందించి వేదవాఙ్మయ విధాత
శాస్త్రనేత గోపాలకస్వామి యనఁగఁ బేరుగనిన విప్రున కగ్రహార మిడియె"[1]

విజయనగరమువంటి మహా నగరముల చరిత్రములు లోక ప్రసిద్ధములు. అవి తెలియుటలో ప్రత్యేకత లేదుకాని మంథెనవంటి చిన్న పట్టణముల చరిత్రలెరుగుట విశేషమే మరి. ఇట్లే మడికొండ పాల్కురికి చరిత్రల ప్రశస్తియు కావ్యమున వర్ణించబడినది.

ఇక కావ్యమున ద్యోతకమగు నాటి సంస్కృతి నొకింత ముచ్చటింతును. పోతన జీవించిన క్రీ. శ. పదునైదవ శతాబ్దము నాటి తెలంగాణ సంస్కృతి కృతి యందు చక్కగా సందర్భోచితముగా ప్రతిబింబించుచు ఆచార్యులవారికి గల సంస్కృతి పరిచితిని విశదము చేయుచున్నది. ఆకాలమున శైవమతము తగ్గుచు క్రమముగా వైష్ణవము వ్యాపించుచుండెను. అంతకుపూర్వము రెడ్డి పద్మనాయక ప్రభువులు శైవులైయుండి ఆకాలమున వైష్ణవము నవలంబించినట్లు చరిత్రాధారములు కలవు. వేదాంత దేశికుని పుత్రుడు వరదాచార్యుడను పండితుడు సర్వజ్ఞసింగభూపాలుని యాస్థానమునకు వచ్చి అక్కడి ఆస్థానపండితుడగు శాకల్యమల్లు భట్టు నోడించి వైష్ణవమతమును స్థాపించి రాజ సన్మానము పొందినట్లు తెలియుచున్నది. రాజుల ననుసరించి ప్రజలును వైష్ణవ మతావలంబులగుచుండిరి. ఆనాటి పాల్కురికి జాతర శైవ సంబంధికాగా అందు భాగవత యక్షగానము ప్రదర్శించుట వైష్ణవము ప్రబలుచుండెననుటకు తార్కాణ. అట్లే అద్వైతులగు బ్రాహ్మణులును భాగవత పురాణ ప్రవచనము చేయుచుండినట్లు కావ్యమున బమ్మెర రామాలయమున విప్రుడు చేసిన ప్రవచనము తెలుపుచున్నది. కాగా ఆనాటి శైవముకాని వైష్ణవము కాని వీరత్వముతో కూడినదికాదు. పోతనయు కాలక్రమమున వైష్ణవమువైపు మొగ్గినది నాటిదేశకాల పరిస్థితి ప్రభావము వలన ననియు తలంచుటకు వీలు కలదు. చిదానందయోగి వంటివారు నాటి మతసామరస్యమునకు ప్రతినిధులుగా కానవత్తురు. ఆనాటి మత సాంఘికాచార వ్యవహారములు. విశ్వాసములు, పోతన శ్రీనాథాది పాత్రల వృత్తముల వలన సువ్యక్తమగును.

---

1. పోతన చరిత్రము : 5-8

నేటివలెనే నాటికాలమున తీర్థయాత్రలు సేవించుట, శ్రీశైలమల్లికార్జున స్వామి వంటి దైవతములకు మ్రొక్కుకొని బిడ్డలకు పేర్లుపెట్టుకొనుట, పాలకురికి వంటి జాతరలు జరుగుట, భాగవత సప్తాహములు సంతర్పణలు నిర్వహించుట, పంట కోతలకు ముందు దుర్గాదేవికి నైవేద్యము పెట్టుట, జ్యోతిష ధర్మశాస్త్రాను సారముగా జాతకములు ముహూర్తములు శకునములు చూచుట, వివాహాది సంస్కారముల తంతు జరుపుట కాననగును. నేడు సన్నగిల్లినదికాని ఆనాడు క్షామకాలములో వర్షార్థులై ఋష్యశృంగుని చరిత్రము చెరువుగట్టున చెప్పించుకొనెడివారు. ఈ విషయము కావ్యమున

"అంతనొక దివసంబునఁ బోతన నియతాత్ముఁడై ఋష్య శృంగుని సచ్చరిత్రంబు సరస్తటంబునఁ బురాణవైఖరి నుడుపుటయు''1

"తొలకరి వానకుంబొలము దున్నిరికాఁపులు.... ...."2

అని ప్రస్తావింపబడెను.

కృషీవల జీవనస్థితిగతులు, కష్టనిష్ఠురములు, క్షామపీడలు, గ్రామీణజీవన వృత్తాంతములు ఐశ్వర్య బలాధికార గర్వాంధుల క్రూరకృత్యములు, ధనిక్ వణిగ్వర్గ కార్పణ్యములు, నిరుపేదల కన్నీటిగాథలు అన్నియు ఈనాటివలెనే ఆనాడును నుండుటచే తనవి కావ్యమున బమ్మెరగ్రామ సంబంధిగా చక్కగా చిత్రింపబడినవి.

ఆనాటి యంగనల సింగారములు కృష్ణచరిత్రములో రమణీయముగా వర్ణింపబడినవి. బాలకృష్ణుని బారసాలకిట్లు సింగారించుకొని చెలువలు పోయిరి.

"రాకిణిపింపిణీరావిరేకయుఁగుప్పె కోరకొప్పుల తలందారలీన
సరిగపట్టెడగుండ్ల సరము పూసలపేర్లు పాలిండ్లఁ దూఁగుటుయ్యేలలూఁగ
బిగువునొడ్డాణముల్ బిళ్ళలమొలనూళ్ళు జవ్వాడునడుముతో సరసమాడ
మట్టెలు పిల్లాండ్లు మరివీరమద్దియల్ లావణ్యగతులకు లయలువేయ
జిలుగుఁద్దాలకుట్టుపోఁతలు వెలుంగు పూలయంచుల గుత్తపుఁజోలములును
నీలి నింబోళికెంపువన్నియల నలరు సరిగపట్టంచు కోకల సవదరించి''3

1. పోతన చరిత్రము : 5-145
2. ,, ,, : 5-146
3. ,, ,, : 12-98

ఇక సామాన్యజనులు దేశీయ జానపద నృత్యగీతముల వినోదించగా నాగరికులు భరతనాట్య మార్గసంగీతములతో కాలక్షేపము చేసెడివారు. భోగినీ నృత్య ఘట్టము దీనికి చక్కని దృష్టాంతము. అప్పటి మధ్యయుగపుటాచారము వేశ్యాజీవనము వర్ణింపబడినది. పుష్పలావికతో నర్మసంభాషణలు నెరపబడినవి. నాటి రాచరికపు వ్యవస్థలోని సంప్రదాయములు ఆచారములు సింగభూపాల కృతముగా మనోజ్ఞముగా వర్ణింపబడినవి. ఇట్లనేకానేక సంస్కృతి సభ్యతల విశేషములు కడుంగడు నిపుణముగా వర్ణింపబడి యాచార్యులవారి తత్సంబంధ ప్రజ్ఞ ప్రస్ఫుటము చేయుచున్నవి.

## రాజనీతి విజ్ఞానము :

కావ్యమున రాజనీతి అత్యల్పముగా నొక్కచోట కన్పడుచున్నది. సింగ నృపతి చారునితో

"ప్రజలకు దల్లి పండితులపాలిటి కల్పకవల్లి........"[1]

అని మొదలుకొని చెప్పిన మాటలలో రాజు ప్రజానురంజకుడై పరిపాలించినచో పూజ్యుడై వర్ధిల్లగలడనియు రామునివలె ప్రజా సంక్షేమము కోరు రాజునకు చారచక్షుత్వమత్యావశ్యకమన్న రాజనీతి వ్యక్తము చేయబడినది. పోతనగారు రాజులను నిరసించినదానిలోను వ్యంగ్యముగా రాజులకు దౌర్జన్యము నిరంకుశత్వము తగదనియు అట్టివారి ప్రభుత్వములు పడిపోవుట నిక్కమన్న రాజనీతి గ్రాహ్యమగును.

## నృత్యకళ :

పోతన చరిత్రము భోగినీ ఘట్టము ద్వారా అద్వితీయమైన నాట్యకళను ప్రదర్శించినది. 'భోగినీనృత్య సౌందర్యము' వ్యాసమున శాస్త్రీయముగా సాంప్రదాయికముగా సాగిన నృత్యరామణీయకముగూర్చి విపులముగా చర్చింపబడెను. ఇది ఆచార్యులవారి నృత్యకళావైదుష్యమునకెత్తిన వైజయంతి.

1. పోతన చరిత్రము : 4-151

## గీత వాద్య ప్రావీణ్యము :

ఆచార్యులవారికిగల ప్రశస్త సంగీత కళాపరిజ్ఞానము ప్రబంధమున ర రమ్యముగా ప్రతిధ్వనించుచున్నది. భోగినీ నృత్యావసరమున గీతవాద్య వర్ణన చేయబడినది. నృత్యారంభమున

"కసిగొని తంబురా శ్రుతులఁ గమ్మని తుమ్మెద ఝుంకృతిధ్వన మొసరెను .......

ఎసఁగె మృదంగ నాదమిటు లీఁగయు వ్రాలిన మ్రోఁగు మేల్పుతిన్"[1]

అని వర్ణించుటవల్ల ఆయా వాద్యవాదన పరిజ్ఞానము ప్రస్ఫుటమగును. ఆ నాట్యములో ఆదితాళ త్రిపుటతాళ గతులలోని గీత వాద్యముల వర్ణన గతుల ముక్తాయి అబ్బురపాటు కలిగించును.

పోతన వైరాగ్య భావనతో రాచకొండ సేనాపతితో మాట్లాడుచు హిత దేశమునకు

"ఇల మృదంగమునకు నెడమయు కుడియునా
నిరుప్రక్క గతులెప్పుడెఱుఁగుటొప్పు.... [2]

అని యీ రీతిగా చేసిన మృదంగ ప్రశంస ఆచార్యులవారి మృదంగవా పరిజ్ఞానమును తెలుపుచున్నది. మరియు మావితోట వర్ణనలో

"రంభలు రామచిల్కలయి రక్తిని నాట్యము లాడుచుండ.... ఒకే
స్తంభపు మేడ గానపరిషత్తు రచించి రయారె! ఖేచరుల్"[3]

అని వర్ణించుటలో ఇట్టివే అందందు చేసిన వర్ణనలో గీతవాద్య విజ్ఞానము చే ప్రీతి కావించుచున్నది.

ఇంకను కావ్యమునందు కర్షక జీవన చిత్రణము వలన వ్యవసాయవ ఓరుగంటి శిల్పవర్ణనమువలన శిల్పకళ, అనేక సందర్భములందు కనులకు గ నట్లు దృశ్యములను వర్ణించుట వలన చిత్రకళ మున్నగు ననేక విద్యల కళ పరిచయము మనకు గోచరించును.

1. పోతన చరిత్రము : 4-235
2. ,, ,, : 9-196
3. ,, ,, : 1-168

## లోకపరిజ్ఞానము :

పోతన చరిత్రము నధ్యయనము చేసిన అపారమైన లోకపరిజ్ఞానము పరివ్యాప్తమైయున్నట్లు తెలిసి ఆశ్చర్యచకితులము కాగలము. మమ్మటుని సూత్ర వివరణములో 'లోకస్య స్థావర జంగమాత్మక లోకవృత్తస్య' అని చెప్పినట్లు స్థావర జంగమాత్మక లోకావలోకనము వ్యుత్పత్తికారకమగును. భూమ్యాకాశ సూర్యచంద్రాదులు గిరికానన నదీసముద్రాదులు, ఋతువులు మున్నగు స్థావరములను మానవులు పశుపక్ష్యాదులగు జంగమములను నిశిత పరిశీలన కావించుటవలన ఈ పరిజ్ఞానము భాసిల్లును ఈ స్థావరజంగమ లోకమును మరొకరీతిగా రెండుగా విభజించి చెప్పవచ్చును. ఒకటి ప్రకృతి రెండవది మానవ సమాజము. మొదటి దానిలో కేవల స్థావరములేకాక పశుపక్ష్యాదులు చేరును. రెండవ దానిలో మానవ మనస్తత్త్వము గుణకర్మ స్వభావములు మున్నగునవి మానవలోక సంబంధి సర్వస్వము చేరును. కవి ప్రకృతి వస్తువుల స్వరూప స్వభావములను ఋతువుల మార్పులను, వింతలు విశేషములను, మానవుల మానసిక స్థితిగతులను,కామక్రోధాది సహజాతములను, చతుర్వర్గ పురుషార్థ కార్యములను, ప్రజ్ఞావిశేషములను, సుఖ దుఃఖాద్యనుభూతులను నిరంతర నిశితపరిశీలనము వలన అవగతము చేసికొని వానిని రమ్యముగా రసవంతముగా సందేశాత్మకముగా కావ్యమున వర్ణింపవలసియుండును. ఈ ద్వివిధలోకవృత్తము సౌందర్యారాధనకు, లోక వ్యవహార మెరుగుటకు, విజ్ఞానసముపార్జనకు, ఉపదేశము పొందుటకు, హృదయాహ్లాదమునకు మిక్కిలి యుపయోగపడును. ప్రకృతియే గురువని రవీంద్రుడనెను. తాను పొందిన లోకానుభవమే తనకు గురువై బుద్ధి చెప్పుననుటయు యుక్తమే. కావున కావ్యమున దీని ప్రాముఖ్యము సామాన్యమైనది కాదు.

కావ్యకర్త లోకవృత్తమెట్లు తెలియవలెనో కావ్యమున పోతన కృత లోక పరిశీలనము ద్వారా ఆచార్యుల వారిట్లు విశదీకరించినారు.

"ఋతుసంగతుల మహోన్నత శోభలందేలు ప్రకృతి సౌందర్య సంపదలఁ
గోలు
శశిసూర్యబింబ ప్రశస్త ప్రభాదీప్త విశ్వాకృతులఁ గాంచి వినుతి సేయఁ
గమనీయ మృగపక్షిగణరూప రేఖావిలాస లాస్యములఁ బేరాసఁ గాంచు
సుఖదుఃఖసంగతిన్ జూపట్టు నరజాతిమానస పరిణామ మార్గమరయు

నవరసప్రకాశక భావనామరూప కలితమగు నీజగత్కావ్య కవి యెవండో
వాని మదిని దలంచి యవ్యాజభక్తి భావపారవశ్యమ్మునఁ బ్రస్తుతించు''[1]

పోతన చరిత్రమున నిట్టి లోకవృత్తమెట్లు విరాజిల్లినదో యించుక ముచ్చటింతును.

కావ్యమున చేయబడిన కథాకల్పన వలన, వర్ణనల వలన, పాత్రపోషణ వలన రసభావాదుల వలన, ఉపదేశమువలన లోకవృత్తపరిజ్ఞానము ద్యోతకమగును.

బమ్మెర గ్రామసీమావర్ణన వలన గ్రామీణ ప్రకృతి, కర్షక జీవనము, పాడిపంటలు మున్నగువాని పరిచయము ప్రస్ఫుటమగుచుండును. బమ్మెరలోని

'అలుకుంబూతల నొప్పు కుడ్యములపై' (1-84) అన్న పద్యమువల్ల జానపదుల ఇండ్లు వాకిండ్లు, వాని అమరిక సింగారము నెట్లుండునో కనులకు గట్టును. అట్లే

"కుంపటివలె నుండు కుక్కుటరాయండు
కుటిశిఖాగ్రము నెక్కి కూయు నొకట" (1-66)

అన్నది గ్రామములలో నుండు కోళ్లు మేకలు ఆవులు లేగలు మున్నగువాని స్వరూప స్వభావములు కావ్యదర్పణమున విశిష్టముగా గనబడి వింతగొలుపుచుండును. అట్లే పలువిధములైన పంటచేల వర్ణన ఎదలను కదలించుచుండును.

వసంత వర్ణనలో ఋతువుల పరిశీలనవలన గలిగిన యనుభూతి

''విరహ తాపమ్ములో వేఁడి గ్రీష్మము లూర్చె మేఘ
సందేశమ్ము మెఱయఁ గనులు చెమర్చె....
అల వసంతమున నూత్నాలంకృతులఁ దాల్చెఁ
గుసుమాకరుని గూడుకొనియాడె భూమహిళ
సతిహృద్వికారములె ఋతుషట్క మయ్యె నిల''[2]

అని వర్ణించుటలో భూవనిత హృదయ వికారములే అరు ఋతువులయ్యెనని భావించుటలో ఋతుప్రకృతి పరిశీలనాశక్తి వ్యక్తమగును.

"లక్షవత్తుల దీపవృక్ష దీధితుల హారతులిచ్చె
కింశుకప్రసవ వనిత'' (6-4)

1. పోతన చరిత్రము : 3-295
2. పోతన చరిత్రము : 6-8

అన్న వర్ణనలో మోదుగు పూలు హారతి దీపాలుగా, పద్మములు మధుపూర్ణ చష కములుగా, శిరీషములు చామరములుగా, గున్నమావి కొమ్మలు పిల్చుటకెత్తిన చేతులుగా రమ్యభావన చేయుటలో సహజ ప్రతిభతోబాటు సునిశితమైన ప్రకృతి పరిశీలనా పాటవము పరిఢవిల్లి యున్నది.

గ్రీష్మర్తువర్ణనలోని దిగువ పద్యము ప్రకృతి పరిశీలనకు మరొక తార్కాణ.

''చండకరుండు వహ్నికణ జాలము దిక్కులఁ గ్రక్కసాగె బ్ర
హ్మాండము తప్త భాండమయి యంటఁగరానటు గాఁగెడిన్ సుప
ర్ణుండు నభః ప్రదేశమున నూల్కొని రెక్కలు సాచి నిశ్చలాం
గుండయి యాడెఁ బ్రాణితతి గ్రుమ్మరఁన్ బయిలాడె నియ్యెడన్''[1]

ఇక్కడ మండు వేసవిలోని చండకరుని ప్రచండ విజృంభణకు లోకము తల్లడిల్లిన విషయము చెప్పుటయేకాక ఆకాశమున గరుత్మంతుడు రెక్కలు సాచి నిశ్చల ముగా గనబడెనన్న గ్రీష్మర్తు విశేషము తెలుపుట ఆచార్యుల వారి ప్రకృతి పరి జ్ఞానమునకు నిదర్శనము.

ఇట్లె ఋతువర్ణనలెల్ల కనులకు గట్టినట్లు వర్ణింపబడి కవిగారి ప్రకృతి పరి శీలనా సామర్థ్యమును చాటుచున్నవి. సూర్యాస్తమయ వర్ణనలోని

"వరుణుండు చలిగ్రాఁగ విరచించుకొనినట్టి పండు నిప్పుకల కుంపటి యనంగ'' (8-37) మున్నగు పద్యములలోని, గంగానదీ వర్ణనలోని

''సంధ్యాతపాగ్నిలో జాతరూప నగమ్ము కరఁగిపాఱిన యట్టులరుగు జలము'' (5-17) వంటి పద్యములలోని దివ్య భావములు స్ఫురించుటకెంత ప్రకృతి పరిశీలనా తాదాత్మ్యము కావలెనో చెప్పలేము.

ఇక పశు పక్ష్యాదుల రూపరేఖా విలాసములు స్వభావోక్తిలో వర్ణించినవెల్ల సూక్ష్మ పరిశీలనకు నిదర్శనములై తదీయ పరిజ్ఞానమును చెప్పకయే చెప్పుచున్నవి.

గోదావరి నదిలో విహంగము లిట్లు వర్ణింపబడినవి.

"ఇసుక దిబ్బల నడ్డులేర్పడ గునగున న్నడచుచు నెడనెడ నదరిదూఁకి జలముల పైఁ దేలి మిలమిలలాడుచు నెగయు మీనుల ముక్కున గఱచికొని

1. పోతన చరిత్రము : 7-40

తేపకు నీటిలో దేహమ్ములమ్ముంచి వచ్చి యీకలనెల్ల విచ్చి యార్చి
తుంగ గుంపులమధ్య దూరి నెమ్మదిగొని పొదుగుచు నిటునటు పొరచిలేచి
బారులుగ నొక్కపెట్టునఁ బైకెగయుచు
తెక్కలాడించు చొకములు సక్కసాఁచి
అర్ధ వలయాకృతిం బంతులరు గతుల
ఖగము లస్తంభతోరణాల్ గట్టె దివిని''[1]

ఓహో ఏమి సునిశిత పరిశీలనము! వాక్ఛాయాగ్రహణ యంత్రమున ఈ చల దృశ్యమునెంత నిపుణముగా తీసినారాచార్యులవారు! ఇక్కడి గౌతమీ సంధ్యా శోభావర్ణన సర్వమిట్లే నేత్రపర్వము కావించుచున్నది.

పోతన విరహ వేదనలో తిలకించిన

"మెఱపుటీఁకల నిండు మెడ ముందు వెన్కకుఁ గునిసియాడఁగఁ తోడ గూడి నడచు" (3-163) అను కపోత మిథున విలాసములును, నారయాదులు వర్ణించిన

"చదలు నంటఁగ నిక్కు సాలాగ్రముల నెక్కి
కూఁతల నిడెడి కపోతసమితి'' (7-67)

అను విపిన విశేషములను నిట్లే చలదృశ్యములను చలనచిత్రములో వలె ప్రదర్శించు చున్నవి. ఇక మానవ సమాజ పరిశీలనము నరయుదము.

అవమాన దుఃఖాగ్నిచేత తపించుచు పోవునట్టి పేదజవరాలి మానసికస్థితి యిట్లు వర్ణింపబడినది.

''తనవైపు యువకులేరును గన్నువేసిన బ్రతుకేటి కనునట్లు బాధపడుచు
గాలునిఁడుగఁ జీరగలుగు స్త్రీ లెమరైన దొంగతానైనట్లు క్రుంగిపోవు
నూరి పెద్దలు దారిఁ దారసిల్లిన యంతఁ దల వోయినట్లు చిత్తమునఁదలఁచు
ఈ బాధలేవియు నెఱుగని పశుజన్మ వెయిబాళ్ళు తనకన్న నయమనుకొను
జనము లేనిచోఁదలయెత్తి కనుచుధృతిని నేదియో పీడ తప్పినట్లేఁగుఁ దనకు
నేది యెట్లున్నఁ బెనిమిటి యిడుమలెదకు జ్ఞప్తిరాఁ బొట్ట గడచుటే
చాలనుకొను"[2]

1. పోతన చరిత్రము : 5-19
2. " " : 2-81

శీలవతియు మానవతియు పేదరాలును పరాభూతయునగు నొక యువతి దారిని పోవుచుండ పొందెడి పరితాపమును రూపుకట్టించుటలో కవి యిట్టి దృశ్యమును నిశితముగా పరిశీలించుటయే కాక పాత్రలో లీనమై మననశీలియై యిట్టి భావచిత్రము వేయవలసియుండును. ఇట్టి విషయములందు మనస్తత్త్వ పరిచయము లోకానుభవము అగత్యమైయుండును. ఇక్కడ పేదజవరాలు అలంకారమేమిలేకున్నను ఆకర్షించునట్లు వర్ణనలోను నొక్క స్వభావోక్తి తప్ప ఇతరాలంకారములేవియు లేకున్నను హృదయావర్జకయై యొప్పుట విశేషము.

ఏకాంత మందిరమున పెనిమిటికి విడెమిడవచ్చి నర్సమాంబ తోచక లజ్జామోదములు పొందిన విషయమిట్లు వర్ణింపబడినది.

"అవనతముగ్ధాస్యయగుచుఁ గేలుంగేలు గీల్చి నఖాగ్రముల్ గిల్లుకొనును
బయటనీవలి వలకయిని రాఁదిగుచుచోఁ గరమున నెటికలు విఱుచుకొనుచు
ఊరుపులన్ బదనాటిన వాతెరం గడనాల్కనట్టిటుఁ దడవుకొనును
ఒక పాదమూని యింకొకట మ్రొగ్గుచును బాదాంగుష్ఠముల నేలయంటిరాయు
గాలితరగల తాఁకునన్ వ్రాలిపడుచు మోముదమ్మిని ముద్దిడు ముంగురులను
గోరి యొకరవ తలయెత్తి గోళ్ళఁగొట్టు మిషగఁ బతిఁగాంచుఁ దోనె శిరసు
వ్రాలుచు"[1]

బళేదృశ్యము! కొంత సేపాచార్యులవారు ముగ్ధాపాత్రనభినయించినంత పని చేసినారు ఇట్టి వర్ణనానైపుణికి మానవలోక పరిశీలనమెంత కావలెనో! ఇట్లే

"తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి
గొంగడిలో శని గూడుచుండ" (5-233)

అని భిక్షుకుని రూపువాల్చిన దైన్యమును వర్ణించుటలోను,

"చిట్టికి జ్వరమేమి సేతు దుర్విధి యని హస్తాగ్రమున ఫాలమంటివగచు" (12-219) అని రుక్మిణీ బాలక్రీడలు వర్ణించుటలోను,

ఈ చిన్ని నోటిలో నేతల్లి పరమాన్న
ముల నింపెనో యని ముద్దుగొనును....
గిలిగిలింతల నవ్వించి గిల్లి బొజ్జ

1. పోతన చరిత్రము : 3-222

బుజ్జుమననూఁది ముద్దుల బుగ్గలద్ది
తలను పక్షము నలమికౌఁగిలిని జేర్చి
మూర్కొనుచుఁ బరవశతఁ గన్మూయు నొకడ" (12-120)

అని యశోద బాలకృష్ణుని ముద్దాడుటలోని వాత్సల్యభరిత చేష్టావర్ణనలోను ఇట్టివే యనేక వర్ణనలందును మానవలోక నిశిత పరిశీలనము నిబిడమై యున్నది.

పైన పేర్కొనినవి ప్రత్యేకముగా వ్యక్తుల రూపరేఖా విలాసములను మనస్తత్త్వ విషయములను వర్ణించినవి కాగా సామూహికముగా సన్నివేశములను వర్ణించిన వానిని పరిశీలించినచో వానిలోను మరింత సమాజ పరిశీలనా చణత గోచరించును. మచ్చునకు యశోద కృష్ణుని గన్న సందర్భమున జరిగిన నామకరణోత్సవము విపులముగా వర్ణింపబడినది. పాఠకులా ఉత్సవములో పాల్గొని తన్మయులు కాకమానరు.

"పల్లెజనమెల్ల నందుని యిల్లు చేరగా'' బారసాల చేసి కొడుకునకు నామకరణము చేయు సన్నాహములు చేసిరి. రాకిణి పింపిణి రావిరేక మొదలగు నగలనేకము ధరించి రమ్యచేలములు దాల్చి గోపిక లేతెంచిరి. అప్పుడు చిన్నికృష్ణునికి బాలెంతకు కావించిన స్నానాలంకారాదు లిట్లు వర్ణితములైనవి.

"తలయంటి నలుఁగు దీయుచు జలకమ్మాడించు తుడిచి శౌరికి రక్షా
తిలకమ్మిడి పొగవేసియుఁ బులిగోరిడి పురిటికూసమును దొడిగిరాగిన్''[1]

"పసిఁడిపట్టు పుట్టము గొల్లపైట వేసి కట్టె నేడువారాల నగల్ ధరించి
పచ్చిబాలెంత నందుని పట్టమహిషి బావిలోఁ జేద వేయఁగా బయలుదేఱె"[2]

ఇట్లెంతో అందచందము లొప్ప బావిలో చేదవేయబోయి

"పాలచేఁపుల దశిసెడి పైఁటకొంగు వలుఁద నడికట్టు నిడి చేఁదపైచి నూత
సున్నపుంబూత శోభిలుచున్న కలశమందు నీరూని పచ్చు నానందసతిని"[3]

చూచి వదినె వరుసయగువారు ముందుపోయి దారిలో దడిగట్టి నిల్చి నీమగని పేరు చెప్పకుండ లోనికి పోనీయమందురు. ఆమె 'నవ్వాలయ విడెంపు కెంపులు మరా

1. పోతన చరిత్రము : 12-100
2. ,, ,, : 12-101
3. ,, ,, : 12-102

క్కెడ దాల్చిని నీలిసొంపులన్ గలకలలాడు దంతసిత కాంతులతోఁ బెనఁగన్ నతాస్యయై' నిలుచును. అప్పుడు చెలువలు చెవిప్రత్తులచేత విన్నావో లేదో వదినె! మా అన్నయ్య పేరు చెప్పనిదే కదలుటకు వీలులేదనగా,

"అవనత శిరాన సిగ్గుతో నభిముఖముగఁ జూడ నోడి భ్రమించు వాల్చూపు తోడ

మూసినగు పిన్న నవ్వుతో మూఁగతనము వదలి పెదవిఁ గదల్చి తానెదియొ పలికె''[1]

"సరె! సరె! యని రివల్స్త్రీల్ 'మఱల నుడువు' మనిరి యవలి మానినులిట్లే యిరుతెగలు వాదులాడుట నరిగెను బాలెంత లోని కదె యద ననుచున్''[2]

ఈ రీతిగా చక్కగా చమత్కారముగా సాగినది వర్ణన. ఇట్లు క్రమముగా వివరముగా వర్ణించుటకు సంస్కార కార్యపరిజ్ఞానము, దేశాచారము, పరిశీలనా దృష్టి యవసరమగును 'సాంప్రదాయికత, నవ్యత' వ్యాసమున చర్చించినట్లు పోతన వివాహ సంస్కారము సింగనృపతి దర్బారు విషయములు ఇట్లె కడు విపులముగా కమనీయముగా వర్ణితమైనవి ఇదే విధముగా లోకానుభవముతో సూక్ష్మ పరిశీలనతో వర్ణించిన సన్నివేశము లెన్నియో కలవు.

లోకవ్యవహారజ్ఞానము వ్యక్తీకరించు ఘట్టము లనేకము కావ్యమున వర్ణించ బడియున్నవి. అందు ముఖ్యముగా మహాలౌకికుడు వ్యవహారదక్షుడగు శ్రీనాథుని ప్రవర్తనలో లోకవ్యవహారము సువిదితమగును. అతడు తన చెల్లెలి పెండ్లి విషయము కేసనతో మాట్లాడిన తీరు, రాజాశ్రయార్థము సింగనృపతితో వ్యవహరించిన విధానము, సిరిసంపదల గురించి పోతనతో చర్చించిన పద్ధతి, యుక్తితో నొక పథకము వేసి ప్రౌఢదేవరాయలకు భాగవత మర్పించుటకు తిప్పన్న నొప్పించిన విషయము ఇట్టివే పెక్కు వ్యవహారములు పఠితలకు లౌకిక మెరుగుటకు తోడ్పడును. పోతన ధార్మిక పారలౌకిక జీవనవృత్తి వలన తలిదండ్రుల యెడ గురువుల యెడ, అతిథుల యెడ, పేదసాదుల యెడ, చివరకు దుర్మదాంధులగు రాజుల సేనాపతుల యెడ నెట్లు ప్రవర్తించవలెనో విశదము కాగలదు. ఇతర పాత్రలవల్లను సముచిత లోకవ్యవహారము విదితము కాగలదు.

1 పోతన చరిత్రము : 12-106

2 ,, ,, : 12-107

మానవ స్వభావము, లోకముపోకడ తెలియదగు ప్రజ్ఞయు కావ్యమున ద్యోతకమగుచున్నది. పోతన చేసిన సింగన్నృపతి వన రసాల సాల వర్ణనలో ఈ విషయ మిట్లు తెలుపబడినది.

"పైకిజూడ నొకింతఁ బచ్చపచ్చగ నుండ ననిలుండు నుయ్యెలలూ నిడి యూఁపుఁ

ప్రతిదినమ్మింతింత ప్రైకివచ్చుటఁ గాంచి జడిసి యా నీడకున్ జనడు రవియు

నొరులనీడం బడియుండకుండుట వల్ల నాత్మాభివృద్ధి యేరాఁపలేరు

రక్షింపుమని మహీకుక్షిలోఁ దలనిడన్ దన జీవనమ్మది ధారవోయు

ధనికుఁడీరీతి లౌకికాదరముఁ బొందు బలిని గని లోక మిబ్బంగి భయము చెందు

దైన్యరహితున కభివృద్ధి తప్పదెందు ధాత్రి యొకఁడె పాలించు బీద జనునెందు"[1]

దృష్టాంత పూర్వకముగా దెలిపిన యిందలి లోకము పోకడ కవిగారి లౌకిక ప్రజ్ఞా విశ్లేషణ శక్తికి నిదర్శనముగా నున్నది.

భోగినీ దండక మంకితము చేసిన పోతనకు సింగభూపాలుడు వేనూటపదార్లు కాశ్మీరు పసిడి కాలువును సమర్పించి ఘనసన్మానము చేయబూని

"ఆస్థాన కవీంద్ర సంతతికిఁ గన్గుట్టన్ నృపాలుండనున్" (4-345) అని చెప్పబడినది. ఇక్కడ పోతనవంటి భక్తకవికి సౌజన్యమూర్తికి సన్మానముచేయుటయు అన్యకవుల కీర్ష్యా హేతువగునాయని సందేహము కలుగును. కాని యెంత మంచివాని యభ్యుదయమైనను అదే రంగమునగల ఇతరుల కసూయా జనకమగు ననుట నీతిగ్రంథోక్తమేకాక నిత్యానుభవములోని లోకస్వభావము, 'బోద్ధారో మత్సరగ్రస్తాః' యని భర్తృహరి యంతటివాడు వాపోయెను.

ఎంత ఏడ్చినను కాపాడుటకు లక్ష్మీపతి రానందున విసిగి నిస్పృహతో ఆ పరమేశ్వరుని గురించియు గజేంద్రుడిట్లు తలపోసెను.

"పిలిచినఁ బలుకరు కాంచన్ వలనుపడదు చనఁగరాదు పద్దకు లక్ష్మీ లలనాధీప లభాగ్యులఁ దిలకించెదరొక్కొ? వారి తీరది వేషే"[2]

1. పోతన చరిత్రము : 4-183
2. పోతన చరిత్రము : 12-52

సర్వసాధారణముగా ఐశ్వర్యవంతులు నిర్భాగ్యులను గానరన్న లోకసత్య మిక్కడ చెప్పబడినది. ఇట్టి స్వార్థపర సమాజములో దీనభిక్షుకుడు తనను కాపాడిన పోతనతో

"ధరణి నినువంటి దయగల తండ్రులొక్క-
రిద్దరుండమి నీ లోకమెట్లునిల్చు...."1

అని యన్నట్లరుదుగా పోతనవంటి పరార్థ ప్రాపకులగు సజ్జనులుందురు. ఇదే విధముగా కావ్యమున ప్రవచింప బడిన అనేకానేక ధార్మిక లౌకిక నీతులకు లోకవృత్త పరిజ్ఞానము హేతువై యలరుచున్నది

## కావ్యావలోకనము :

వరదాచార్యులవారు సంస్కృతాంధ్ర కావ్యనాటకాంబుధులనెల్ల నాపోశనము పట్టినట్లు పోతన చరిత్రమును పరిశీలించుటవల్ల విశదము కాగలదు. ఈ విషయము 'పూర్వాధునిక కవి ప్రభావము' 'సాంప్రదాయికత, నవ్యత' మున్నగు ననేక వ్యాసములందు చర్చించుట జరిగినది.

ఈ విధముగా మహాకావ్యమున లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణవల్ల ప్రాదుర్భవించి పరిణతి చెందిన వైదుష్యము నిండుగా నిపుణముగా భాసిల్లి రమ్యరస భావాదిక మహా విశిష్టరచనకు హేతుభూతమై యొప్పారు చున్నది.

# సాంప్రదాయికత, నవ్యత

పోతన చరిత్రము సాంప్రదాయికతను నవ్యతను విశిష్టముగా మేళవించు కొని విరాజిల్లుచున్న మహాకావ్యము. పురాతనాధునాతన రీతుల సమన్విత స్వరూపమే కావ్యమునకు వైశిష్ట్యమును సంతరింపజేసి త్రికాలాబాధ్యమై సర్వజన ప్రియమై వెలయగలదు. సంప్రదాయపరులు సాంప్రదాయిక కావ్యములనే మెచ్చ గలరు. నవతాప్రియులు నవ్యకావ్యములనే హర్షింపగలరు. కాని ప్రాతక్రొత్తల మేలుకలయికగల కావ్యములుభయుల మెప్పును గాంచగలవు. ఇట్టి కావ్యరచన సమర్థులగు మహాకవులకే సాధ్యపడును. పోతన చరిత్రమున విలసిల్లు సాంప్ర దాయికతను నవ్యతను చర్చించుటకు ముందు వీని స్వరూపములను సంగ్రహముగా ముచ్చటింతును[1].

## సంప్రదాయము-దాని స్వరూపము :

అమరకోశమున 'సమ్యక్ప్రదానం సంప్రదాయః', 'సమ్యక్ సరహస్యం ప్రదీయత ఇతి సంప్రదాయః' అని సంప్రదాయశబ్దమునకు వ్యుత్పత్తులు చెప్ప బడినవి సం + ప్ర + దా + ఘఞ్ = సంప్రపూర్వస్య దాధాతోః ఘఞ్, 'గురు పరంపరాగత సదుపదేశః' 'శిష్టపరంపరావతీర్ణోపదేశః' అని వ్యాఖ్యానింపబడినది. అనగా గురుపరంపర వల్లను శిష్టపరంపర వల్లను సాగుచు వచ్చుచున్న ఉపదేశము సంప్రదాయమని వివరింపబడినది.

ఆప్టే సంస్కృతనిఘంటువునందు సంప్రదాయశబ్దమునకు 'Traditional doctrine or knowledge' అనియు, 'An established custom, usage' అనియు నర్థము లీయబడినవి. కనుక సంప్రదాయమనగా పరంపరగా వచ్చిన జ్ఞానము, పాదుకొన్న ఆచారము అని చెప్పనొప్పును.

1. ఈ విషయము వ్రాయుటలో ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు' ప్రథమ ప్రకరణము చాల ఉపకరించినది.

కురుగంటి సీతారామయ్యగారు సంప్రదాయమునుగూర్చి యిట్లు చెప్పిరి. 'పారంపర్యముగా, అనుశ్రుతముగా, తరతరాలుగా, అనుస్యూతముగా వచ్చే కొన్ని నమ్మకాలయొక్కగాని, అభిప్రాయముల యొక్కగాని, కర్మలయొక్కగాని, సమూహానికి సంప్రదాయమని చెప్పవచ్చును'[1]

ఈ యభిప్రాయము ననుసరించి తరతరాలుగా ఎడతెగకుండ వచ్చు నమ్మకముల కర్మల సముదాయము సంప్రదాయమని తేలినది.

సంప్రదాయమొక జీవనదివలె నిరంతరము సాగుచుండును. నది పర్వతాగ్రమున పుట్టి ప్రవహించునపుడు కొండలబండల లోయలపాయల ఒడుదుడుకుల నెదుర్కొనుచు సాగిన అనేకములైన యుపనదులను గలుపుకొనుచు మహానదియై విశాలమైన మైదానములందు శాంత గంభీరముగా పయనించునట్లు ఒక సంప్రదాయము తొలుత ఏర్పడినపుడనేక ఘర్షణలకు లోనై ప్రాతికూల్యములను వెరవుతో తప్పించుకొనుచు ఆనుకూల్యములను మిళితము చేసికొనుచు సర్వజనామోదయోగ్యమై అనుష్ఠింపబడి సంప్రదాయము సుప్రతిష్ఠితమై తరతరాలుగా విరాజిల్లుచుండును.

ఒక సంప్రదాయము నెలకొల్పుట యొక క్రొత్తబాటవేయుట వంటిది. ఒక అసదృశ ప్రతిభావిభాసితుడు పూర్వమున్న దారిలో నడవక యొక నూతన మార్గము నేర్పరచును. తక్కినవారు దాని ననుసరింతురు. అప్పుడది సంప్రదాయమై పోవును. దీనినే భగవద్గీతలో

'యద్యదాచరతి శ్రేష్ఠః, తత్తదేవేతరో జనః
స యత్ ప్రమాణం కురుతే, లోకస్తదనువర్తతే'[2].

అనగా శ్రేష్ఠులైన వారెట్లు ప్రవర్తింతురో సామాన్యులట్లే ప్రవర్తింతురు. వారేది ప్రమాణముగా చేయుదురో లోకులు దాని ననుసరింతురన్న గీతావాక్యము శ్రేష్ఠులు నెలకొల్పిన ఆచారాదులే సామాన్యులచేత అనుసరింపబడి సంప్రదాయముగా స్థిరపడు నన్నదానిని బలపరచుచున్నది.

---

1. నవ్యాంధ్ర సాహిత్య వీథులు : 2 వ భాగము, పుట 261.
2. భగవద్గీత : కర్మయోగము - 21 శ్లోకము.

## నవ్యత - దాని స్వరూపము

మహాపురుషు లేర్పరచిన పద్ధతుల ఆచారాదులలోని మేలిమియే లోకులచేత ఆదరింపబడి సంప్రదాయముగా నేర్పడును. లోకులెంత దానిని పాటించిన ఆ సంప్రదాయ మంత సుప్రతిష్ఠితమై చిరకాలము సాగుచుండును. అట్టి సంప్రదాయము కాలగతిలో పరిణామము చెందుటయు జరుగుచుండును. వేయబడిన ఒక క్రొత్తబాట బహుకాల పథిక సంచారముల చేత మిగుల నలిగి చెడిపోవుట వలన బుద్ధిమంతులు దాని ప్రక్క మరొక క్రొత్త బాటవేయునట్లే చిరకాల పరంపరాగతమైన యొక సంప్రదాయములో దొసగు లేర్పడుట వల్లను దేశకాల సమాజాదిక స్థితిగతుల మార్పుల వల్లను అవసరమైన ప్రతిభావంతులు అందులో నూతన పద్ధతులను ప్రవేశపెట్టగా ఆ ప్రయోగములు ప్రజామోదము పొంది ఆచరింపబడి అదొక సంప్రదాయమై యొప్పను. అనగా ఒక సంప్రదాయము మీద వచ్చిన నవ్యప్రయోగమే క్రమముగా సంప్రదాయము కాగలదు. అనంతమైన కాలములో నిది యిట్లు నిరంతరము సాగుచుండును. ఈ మార్పు విషయము భారతదేశ మత సంప్రదాయములలో జరిగిన మార్పుల గురించి సర్వేపల్లి రాధాకృష్ణయ్య ఇట్లు వివరించెను.

"ఎప్పుడెప్పుడు తత్త్వపరిశీలనము సంకుచిత సిద్ధాంత శాఖల రూపమునొంద యత్నించునో, అప్పుడు సంస్కారోద్యమములు బయలుదేరి ఆయా భావములను విమర్శనాగ్ని పాత్రలను బోసి, అసద్భావములను నిర్మూలించి, సత్యభావములను సమర్థించి పోషించుచుండెడివి. అనుశ్రుతముగా వచ్చిన సంప్రదాయములు, విశ్వాసములు మార్పుచెందిన కాలమునకు సరిపడకపోవుటయే గాక, అసత్యముగా తోచినప్పుడు ఏమహోపదేశకునిదో అంతర్దృష్టి, ఒక బుద్ధునిదో, ఒక మహావీరునిదో, ఒక వ్యాసునిదో శంకరునిదో తత్త్వ జిజ్ఞాస, ప్రపంచమున నుద్భవించి ఉత్పాత లూగించెడివి" 1. ఈ విధముగా సంప్రదాయముపై జరిగిన ప్రయోగమే నవ్యత యనబడును.

## సంప్రదాయావశ్యకము :

దివ్య ప్రతిభాఢ్యులు జ్ఞానులు నైన శ్రేష్ఠులు అనేక ప్రయోగములు చేసి అనుభవ పూర్వకముగా తెలిసికొన్న పరిజ్ఞానమును ఆచార విచారములను లోకమున

---

1. Indian Philosophy : రాధాకృష్ణ : అనువాదము : బులుసు వెంకటేశ్వర్లు.

ప్రవేశపెట్టగా సుప్రతిష్ఠితమైన అట్టి సత్సంప్రదాయము ననుసరించుట లోకుల కత్యావశ్యకము. నితాంత హితకారియగు సంప్రదాయానుసరణము జాతిజనుల కర్తవ్యము. తల్లిపాలు త్రాగి వర్ధిల్లు శిశువువలె సంప్రదాయము జీర్ణమునుచేసికొని సాగుజాతి వెన్నెముక బలముతో చేవగలిగిన జీవముతో పరిడవిల్లును. సంస్కృతి సభ్యతలను పెంపొందించుకొని ఉత్కృష్ట దశనుగాంచును. సంప్రదాయ మార్గ గామియగు జాతి శాంతిభద్రతలతో శ్రేయశ్శ్రేణులతో విలసిల్లగలదు. ఈ విషయము సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడిట్లు వచించెను.

**'A living tradition influences our inner faculties, humanises our nature and lifts us to a higher level'[1]**

సజీవమైన సంప్రదాయము మానవుల ఆంతరప్రకృతులను ప్రభావితము చేసి సాత్త్విక సంస్కారవంతములుగా మలచి దివ్యదశను ప్రాప్తింపజేయునన్న పండితుని వచనము వలన సంప్రదాయానుసరణావసర మెంతటిదో విశదమగు చున్నది.

## సాంప్రదాయికతా నవ్యతల సమన్వయము :

వ్యక్తిగత జీవితమునగాని, సామూహికముగా కాని, జాతీయముగా గాని ప్రముఖ పాత్ర వహించి ప్రశస్తప్రయోజనమును సిద్ధింపజేయు సత్సంప్రదాయ మును పాటించుట యవసరమైనను కాలానుగుణముగా ఆ సంప్రదాయమున వచ్చు ప్రయోగపూర్వక సంస్కరణలను-నవ్యతలను గ్రహించుటయు కర్తవ్యమేయగును. దీనిని వివరించుచు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారిట్లు వ్రాసిరి.

'మానవుని జీవితములోని సమస్తాంగములయందు సంప్రదాయము పూసల లోని దారమువలె నుండును. జాతి జీవిత సౌధమున కది పునాది వంటిది.... సత్సంప్రదాయ మెల్లప్పుడు జీవనదివలె ప్రవహించుచుండును. సాంఘిక జీవన క్షేత్రమునగాని, మానవుని వ్యక్తిగతమైన బ్రతుకుబాటలోగాని, సాహిత్యాదిరంగ ములయందుగాని సంప్రదాయమే ప్రబల శక్తిగా పనిచేయును. ఒకానొక సంప్ర

1. The Hindu view of life : Page 18

దాయము గతములో ఘనమైనది కావచ్చును. కాని వర్తమాన కాలమున దానికిగల విశిష్టతను గమనించుట ముఖ్యము. అందుకు రచయితకు చారిత్రక దృష్టి అవసరము. దేశ కాల పరిస్థితుల దృష్ట్యా సామాజిక పరిణామమునకు సైదోడుగా నుండు సంప్రదాయము మాత్రమే స్వీకరింపదగినది. అందుకే గతమును గతము దృష్టితోకాక వర్తమాన దృష్టితో సమీక్షింపవలెనని ఇలియట్ అభిప్రాయపడెను. వర్తమాన పరిస్థితుల కనుగుణముగా కలిగిన చారిత్రక దృష్టి యెల్లప్పటికి నవనవోన్మేషమైన ప్రతిభకు ఉపస్కారకమైనది. సంప్రదాయము నాలంబముగా స్వీకరింపక ఏ వ్యవస్థయు వృద్ధి పొందదు. ఏ కవియు, ఏ కళాభిజ్ఞుడును నూత్న నిర్మాణము చేయలేడు. ప్రతి యుగమునందును, ఆయా కవుల వ్యక్తిత్వములను వారికి ముందుండిన కవులను బట్టియే నిర్ణయింపవలసి యుండును. ఏ కవికిని విడిగా అపూర్వ వ్యక్తిత్వముండదని ఇలియెట్ స్పష్టపరచెను. అయినను సంప్రదాయము పేర గతములోని వన్నియు దిగుమతిచేసికొనుట భావ్యముకాదు. అట్లే గతమును గ్రుడ్డిగా పూజించుటయును వాంఛనీయము కాదు. సంప్రదాయమును గ్రుడ్డిగా అనుకరించుటకన్న నవ్యతను పాటించుటయే శ్రేష్ఠమని ఇలియెట్ నొక్కి చెప్పెను (Novelty is better than repetition - "Traditon and the individual talent.)"[1]

మిక్కిలి యుక్తియుక్తమైన రెడ్డిగారి వివరణము ననుసరించి సంప్రదాయము నాధారము చేసికొని దేశకాల పరిస్థితుల కనుగుణముగా విలసిల్లిన నవ్యతను మేళవించుకొని జీవితము సాగించుట లేదా కావ్యరచన చేయుట ఉత్తమ కార్యము. కావున తొలుత మనవి చేసినట్లు సాంప్రదాయికత నవ్యత-ఈ రెండిటి సమన్వితరూపమే విశిష్టమైనది.

లోకమున సంప్రదాయమునెడ వ్యవహరించువారి తీరులను వాని గుణావగుణములను నారాయణరెడ్డి గారిట్లు విశదీకరించిరి.

"సంప్రదాయముల పట్ల జనులు మూడు రకములుగా వ్యవహరింపవచ్చునని J. L. Lowes అభిప్రాయపడినాడు. ఒకటి : వాని నామోదించి స్థిరపచుకొనుట. రెండవది : వానిని పూర్తిగా పోగొట్టుకొనకుండా కాపాడుకొని

1. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు: ప్రథమ ప్రకరణము. సంప్రదాయము - ప్రయోగము. పుట 5

తమకనుకూలముగా మార్పు చేసికొనుట. మూడవది : వానిని బ్రద్దలు గొట్టి తమ దారిని తాము పోవుట. ఈ మూడింటిలో మొదటి ధోరణి నవలంబించినచో కీర్తిగాని అపకీర్తిగాని రాదు. ఈ పద్ధతిలో జీవించుట యందుగాని రచనలు చేయుటయందు గాని వైలక్షణ్యములేదు. ఈ తెగకు చెందిన వారిని సంప్రదాయ దాసులన వచ్చును. మిగిలిన రెండు ధోరణులకు చెందిన వారు విలక్షణమైన వారు. ప్రాతయెల్ల గొప్పదను విశ్వాసము వీరికి లేదు. ఈ యిరుతెగలవారు సంప్ర దాయములో మార్పు నభిలషింతురు. కాని వీరిలో మూడవ ధోరణికి చెందినవారు అతివాదులు; నేలవిడిచి సాముచేయు మనస్తత్త్వము వీరిది. వీరి ప్రయోగ ములను సమకాలమువారు హర్షింపరు. సంప్రదాయపరులకు అవి పచ్చిచేదు బిళ్ళల వంటివి. కావున రెండవ ధోరణికి చెందినవారె అచ్చమైన ప్రయోగవాదులు **(Experimentalists)** అని నా అభిప్రాయము. శారీరములో ఏ దేని ఒక అంగము దుష్టముగానున్నచో దానిని మూల శరీరతత్త్వమునకు హాని కలుగకుండ తీసివేయుట వాంఛనీయముకదా ! ఈ తెగకు చెందినవారు సంప్రదాయములోని చెడును తీసివేసి దానిలో క్రొత్త నెత్తురును తడకొత్త జేయుదురు."[1]

ఈ విశదీకరణ వలన సంప్రదాయము పట్ల వ్యవహరించు మూడు తెగల వారిలో రెండవ తెగకు చెందినవారే యోగ్యులని తేలుచున్నది. సంప్రదాయమును గ్రుడ్డిగా నమ్మి యథాతథముగా ననుసరించు సంప్రదాయ దాసులలో నవనవో న్మేషము కానరాక జీవనజ్యోతి కొడిగట్టిపోవును. సంప్రదాయమునసలే సరకు చేయక 'పాత రోత కొత్త వింత' యని భావించి ప్రాతదానినెల్ల పడగొట్టి తీవ్ర వాదముతో తిరుగుబాటు చేయువా రుభయభ్రష్టులగుదురు. వారి సిద్ధాంతములు ప్రజాదరణ పొందక వరిగడ్డి మంటవలె క్షణకాలము మండి అణగారి పోవును. కాగా రెండవ తెగకు చెందినవారు సంప్రదాయము నందలి మేలిమి గ్రహించి చారిత్రక దృష్టి రహించి దేశకాలానుగుణముగా సముచిత ప్రయోగములను సలిపి చక్కని నవ్యతను సమకూర్చుచుందురు. ఇది పూర్వమునుండి యున్న మొక్క లతోనే క్రొత్త జాతులను పుట్టించి పెంపొందజేసి అభివృద్ధి వికాసములను సాధించుట వంటిది. ఇట్టి యభ్యుదయము పూర్వపు మొక్కలను పూర్తిగా

1. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయ ప్రయోగములు : ప్రథమ ప్రకరణము. సంప్రదాయము ప్రయోగము పుట 28,

ధ్వంసముచేసి సాధింపరానట్లె పూర్వ సంప్రదాయమును పూర్తిగా గూల్చి ఏదో ప్రగతిని వెలయింతు మనుట గగనపుష్పమే యగును. కావున సాంప్రదాయికత నవ్యత అనువాని సమ్యక్ సమ్మేళనముతో సమన్వయ రీతిలో చేయు పనులుగాని వ్రాయు కృతులుగాని విశిష్టములై శ్రేష్ఠములై చెలువొందగల వనుటలో నెట్టి సంశయము లేదు. ప్రపంచములోని వివిధ సంప్రదాయములుగాని కళలుగాని కావ్యములుగాని యిట్టి ప్రాతక్రొత్తల మేలు కలయికతోనే వికాసాభ్యుదయములను గాంచి వెలసియున్నవి.

## భారతీయ మతసాంఘిక సంప్రదాయములు : సాహిత్యముపై వాని ప్రభావము :

మన భారతీయ సంప్రదాయమునకు సంస్కృతికి మూలము వేదములు. వైదికమైన యీ సంప్రదాయము వేదోపస్కారములైన వేదాంతాది దర్శనముల లోను వేదాంత ప్రతిపాదకములైన ఉపనిషత్తులలోను, ఉపనిషత్సారమైన భగవద్గీత లోను, వేదశాస్త్రోపబృంహితములగు పురాణములలోను రామాయణ భారతేతి హాసములలోను ప్రవచింపబడి వికాసముచెంది విరాజిల్లుచున్నది. ఆది మధ్యాంత రహితుడును సచ్చిదానంద స్వరూపియు నగు పరమాత్మడీ జగముల సృష్టిస్థితి లయములు కావించుచు పరిపాలించుచున్నాడనియు, ఆ పరమాత్మ నుండి వేరయిన జీవాత్మలతనిని జేరుటకు భక్తి జ్ఞాన యోగ మార్గములు కలవనియు ధన దార పుత్రేషణములతో భోగజీవితము గడపుట మానవజన్మ ధ్యేయము కాదనియు శమదమాది గుణములతో ధార్మిక జీవనము సాగించి మోక్షము నందుటయే పరమార్థమనియు ప్రధానముగా మన సంప్రదాయము ప్రబోధించుచున్నది.

ఈ సంప్రదాయమున ధర్మబద్ధమైన జీవితమునకు పారమార్థిక ధ్యేయ సాధనకు చతుర్విధ పురుషార్థములు, వర్ణాశ్రమ ధర్మములు ప్రధానాంగములుగా ప్రతిపాదింపబడినవి. వీనికి తోడుగా ఆత్మ పరమాత్మ తత్త్వము, కర్మ సిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము ఉపదేశింపబడినవి. ఇవి మత ధర్మములకు చెందినవి కాగా ఉత్తమ సంస్కృతికి ఉత్కృష్ట లౌకికి జీవనమునకు అనేక సాంఘిక సంప్రదాయములు సుప్రతిష్ఠితమై యున్నవి. అందు షోడశసంస్కారములు, మాతా పితృ గురుభక్తి, అతిథి పూజ మున్నగునవెన్నియో చేరియున్నవి.

భారత దేశమున వెలసిన శైవ వైష్ణవ శాక్తేయాది మతములును, ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములును అన్నియు వేదాలవాలము నుండి యుద్భ విల్లిన నానావిధ పారమార్థిక లతలే. జైన బౌద్ధములును వైదికమతపు పునాదిపై లేచిన విలక్షణ మత సౌధరాజములే. ఒక్క చార్వాకము మాత్రము వైదికమును బొత్తిగా నిరసించి తన్మూలచ్ఛేదకముగా శుద్ధనాస్తిక మతముగా ఆవిర్భవించినది. కావుననే యది నిలువలేక నశించిపోయినది. వైదిక సంప్రదాయమనేక మతముల సిద్ధాంతముల కలగూరగంపగ అందు వైవిధ్యము గోచరించినప్పటికి ఆంతరమైన తత్త్వమొక్కటే. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' యన్నది దీని సూత్రము. భిన్నత్వములో నేకత్వము దర్శించుటయే యీ సంప్రదాయ పరమార్థము.

సమస్త సాహిత్యములందు వలనే సంస్కృతాది భారతీయ సాహిత్యము లందును సంప్రదాయము తన ప్రభావము చూపుచున్నది. ఆదికవి వాల్మీకి రామా యణమును వైదిక సంప్రదాయ విలసితముగా రచించెను. వ్యాసుడును అట్లే వైదిక ధర్మ కర్మముల సంస్కృతి సంప్రదాయములను ప్రతిబింబింపజేయుచు భారతాదు లను వివరించెను. కాళిదాసు కావ్యనాటకము లన్నియు నట్టివే. తర్వాతి కవులంద రును నట్లే వేద శాస్త్ర పురాణములచేత పూర్వ కావ్యములచేత ప్రభావితులై రచించిరి. విశ్వకవి రవీంద్రుని గీతాంజలి ఉపనిషత్తత్త్వ విలసితమైనదే కదా! ఆంధ్ర సాహిత్యమున ఆదికవి నన్నయ తిక్కన ఏర్పరచిన వైదిక సంప్రదాయ కల్పక పరి వ్యాప్తి నపేక్షించియే కావ్యములు రచించిరి. శ్రీనాథ పోతనాది కవివర్యులందరు నట్టి విశిష్ట సంప్రదాయ విభాసురములగు కృతులు వెలయించినవారే.

## నవ్యత : సాహిత్యముపై దాని ప్రభావము :

సంప్రదాయములో ఆయా కాలములందు పరిణామ దశలో సంస్కరణల రూపమున ప్రయోగములు చేరి నవ్యత విలసిల్లినది. అపారమైన వేదవిజ్ఞానమునకు దేశకాల సాంఘిక పరిస్థితుల ననుసరించియు తమ యభిరుచుల కనుగుణముగను మతాచార్యులు వివిధ వ్యాఖ్యానములు చేసి వివిధ సిద్ధాంతములను స్థాపించిరి. యజ్ఞ యాగాది కర్మల ఆడంబరము జంతుబలులధికమై అనాచారములు ప్రబలిపోగా విసుగు జెందిన సమాజమునకు జైన బౌద్ధములవతరించెను. బౌద్ధము కాలగతిలో వామాచారములోబడి మిడుకగా ఆదిశంకరుడు దానిని ఖండించి వైదిక మత పునరుద్ధరణ గావించి యద్వైతము ప్రతిష్ఠించి ప్రచారము చేసెను. క్రమముగా

విశిష్టాద్వైతము ద్వైతము వచ్చెను. ఇటీవలి కాలములో మహర్షి దయానంద సరస్వతి మత మతాంతరములలో పేరుకొని పోయిన కల్మషములను కడిగివేసి వేదముల సత్యార్థమును ప్రకాశింపజేసి భారతీయ - ఆర్య జాతిని జాగృతము చేసెను. సాంఘిక దురాచారములను నిర్మూలించి ఏకేశ్వరోపాసనాది సదాచారములను ప్రచారము చేయుటకు బ్రహ్మసమాజముద్భవిల్లెను. సర్వమత సమన్వయము స్వచ్ఛ జాతీయ జీవనము, ఆధ్యాత్మిక జీవనము సాగింప జాతిని మేల్కొలుపుటకు రామకృష్ణ పరమహంస వివేకానందస్వామి శంఖారావము గావించిరి. పురాతనాధు నాతన సిద్ధాంతముల సమన్వయ ప్రబోధము జేసిన జాతిపిత మహాత్ముని తత్త్వము ఈతరమునకు సువిదితము.

సాంఘిక రాజకీయ రంగములందును అంతర్జాతీయముగా జాతీయముగా పరిఢవిల్లిన ప్రజాస్వామ్యము, సర్వమత సహనము, వసుధైక కుటుంబ భావన, విశ్వశాంతి, మానవతా వాదము, జాతీయత, దేశభక్తి, అంధవిశ్వాస నిరాసము, సామ్యవాదము పరంపరాగత సంప్రదాయముపై పటిష్ఠముగా భాసిల్లిన నవ్యతలు. ఈ నవ్యతలెల్ల అన్ని సాహిత్యములపై వలెనే ఆంధ్ర సాహిత్యముపైనను ప్రబల ప్రభావముద్ర వైచినవి, నన్నయ తిక్కన నాచనసోముడు పాల్కురికి సోమనాథుడు శ్రీనాథుడు పోతన పెద్దన మున్నగు మహాకవులాయా కాలములలో పూర్వ సంప్రదాయములతో పాటు నవ్యతను మేళవించుచు కావ్యములను రచించినవారే. ఆధునిక కాలమున, పైన పేర్కొనిన స్థితిగతుల పరిణామానుసారముగా భావ కవిత అభ్యుదయ కవిత అధివాస్తవిక కవిత, ఈ యన్నిటి సమన్వయ రూప కవిత వెలువడి విరాజిల్లుచున్నవి.[1]

ప్రాతదెల్ల శ్రేష్ఠము కాదనియు కావ్యము క్రొత్తదైనంత మాత్రమున నిందింప దగినది కాదనియు కాళిదాసిట్లు నవ్యతాప్రీతిని వ్యక్తము చేసెను.

> 'పురాణ మిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవమిత్యవద్యమ్
> సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః'[2]

1. ఈ నవ్యకవితల గురించి 'ఖండకావ్య ప్రక్రియ', 'కవితాతత్త్వము' అన్న వ్యాసములలో వివరించుట జరిగెను.
2. మాలవికాగ్నిమిత్రము : ప్రథమాంకము - ప్రస్తావన.

ఈ మాటలవలన కావ్యములలో నవ్యత ఉపాదేయమని తేటపడుచున్నది. 'కొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా' ముత్యాల సరములు గూర్చిన గురజాడగారి అభిప్రాయమును, 'ఉభయ మార్గ సమన్వయ ధోరణీ గుణ ధ్యేయముగా' రచన చేసిన గడియారమువారి అభిప్రాయమును సాంప్రదాయికత నవ్యత అనువాని సమ్యక్సమన్వయమునే బలపరచుచున్నవి వరదాచార్యులవారు పోతన చరిత్రము 'విజ్ఞప్తి' లోన పేర్కొనిన విషయములును దీనినే దృఢపరచు చున్నవి.[1]

ఈ విధముగా కావ్యములందు సాంప్రదాయికత నవ్యత భవ్యముగా వరల వలయునన్న విషయము సమీక్షించిన పిదప అవి పోతన చరిత్రమున నెట్లు పొంది పొసగి యెసలారుచున్నవో చర్చింతును.

## త్రివిధ సంప్రదాయములు :

కావ్యములందు విరాజిల్లు సంప్రదాయము బహువిషయకమై యుండును. అది ప్రధానముగా త్రివిధమై యొప్పుచుండును. 1. మత సంప్రదాయము 2. సాంఘిక సంప్రదాయము 3. కావ్యసంప్రదాయము.

ఇందు వేదశాస్త్ర పురాణేతిహాసములందు స్మృతులయందు మతగ్రంథముల యందు ప్రవచింపబడిన మతధార్మిక విషయములు మొదటి దానిలో చేరును. రెండవదానిలో పైగ్రంథములందే కాక చరిత్ర రాజనీతి సామాజికాది శాస్త్రము లందుల్లేఖింపబడిన విషయములు చేరును. ఇక మూడవదానిలో మత సాంఘిక సంప్రదాయముల ప్రభావము చేత కావ్యములందనుసరింపబడి రూఢమైనవియు అలంకారగ్రంథములందు నిర్దేశింపబడినవియు నగు విషయములు చేరును. ఈ మూడు విధముల సంప్రదాయములలో మొదటి రెండు సంప్రదాయములగురించి వివరింపబడెను. మూడవదగు కావ్యసంప్రదాయమును ప్రస్తుతాంశముగా ముచ్చ టింతును.

1. ఆచార్యులవారి కవితాశయములను కవితాతత్త్వము' వ్యాసమున వివరించుట జరిగినది

## కావ్య సంప్రదాయము:

కావ్యసంప్రదాయమున ఆలంకారికులు చెప్పిన విషయములు, తద
సారముగా గతానుగతికముగా రచింపబడిన కావ్యపద్ధతులు చేరునని మనవి చేసి
అలంకార శాస్త్రములందు ప్రాయికముగా వివరింపబడిన ధీరోదాత్తాది నాయక నా
విషయములు, కావ్యస్వరూప లక్షణములు, రసభావాలంకారములు, గుణ
ములు, కవి సమయములు ఛందోవ్యాకరణ విషయములందలి యంతర్భాగము
కావ్యములలోని యీసంప్రదాయము వస్తుభావరచనములను మూడింటిలో ప్ర
ఫలించుచుండును. ఈ క్రమమునందే పోతన చరిత్రము నందలి సంప్రదాయ
శీలింపబడును.

## పోతన చరిత్రమున సాంప్రదాయికత :

కావ్యనాయకుడగు పోతన భక్తి జ్ఞాన వైరాగ్య సంప్రదాయానుసారి
మహనీయుడు కావునను, శ్రీనాథాదీతర వ్యక్తులు తరచుగా సాంప్రదాయి
యైనందువల్లను, కావ్యకర్తయగు వరదాచార్యులవారు సాంప్రదాయిక వంశమ
పుట్టి పెరిగి ఎక్కువగా సత్ సంప్రదాయము నభిమానించి యనుష్ఠించు
కావునను పోతన చరిత్రమధికముగా సాంప్రదాయికతా విశిష్టమయి వెలసి
కావ్యము గురించి వ్రాయబడిన వస్తు శిల్పము మున్నగు వ్యాసములందెడ
సాంప్రదాయికత, నవ్యత పేర్కొనబడినవి. ఐనను ప్రస్తుత మీ విషయ
ప్రత్యేకముగా చర్చింపబడును. సంప్రదాయ ప్రాచుర్యముగల కావ్యమున సాం
దాయికతను సందర్శించుట కష్టసాధ్యమగు విషయముకాదు కాని చక్కని స
న్వయరీతిలో భాసిల్లు నవ్యతను నిశిత పరిశీలన దృష్టితో చూడవలసియున్నది.

## వస్తుసంప్రదాయము :

పోతన చరిత్రము మహాకావ్యముగా మలచబడిన విషయము 'పోతన
త్రము మహాకావ్యము' వ్యాసమున నిరూపింపబడెను. అందు సాహిత్య దర
కారుని మహాకావ్య లక్షణములకు లక్ష్యమై యొప్పారుచున్నదన్న విషయమే
సాంప్రదాయికతకు ప్రథమ నిదర్శనము. నాయకుడు విప్రుడగు ధీరశాంతు
అంగిరసము శాంతము, శృంగారవీరాదు లంగములు, నాటకమునందువలె ము
పంచసంధులు, 'అన్యద్వా సజ్జనాశ్రయ' మన్నట్లు లైతిహాసిక వ్యక్తికాక వ

నీయుడగు పోతనగారి చరిత్రమితవృత్తము, చతుర్విధ పురుషార్థములు-అందు మోక్షము ఫలమగుట యుపదేశము, కావ్యాదిని నమస్క్రియ అష్టాదశ వర్ణనలు మున్నగునవన్నియు కావ్యసంప్రదాయము ననుసరించి నిర్వహింపబడియున్నవి.

పోతన చరిత్రమొక ప్రబంధమని తదీయవ్యాసమున నిరూపించిన విషయము దీని సాంప్రదాయికతకు మరొక తార్కాణ. నన్నయ భారతమునుండి సాగుచున్న కావ్యపద్ధతికి పదునారవ శతాబ్దమున పరిణామదశలో మనుచరిత్రతో ప్రబంధ పద్ధతి వెలసినది యానాటికి నవ్యమైనదే యైనను తరువాతి కవులనేకులా పద్ధతి నవలంబించుటచేత నదొక కావ్య సంప్రదాయమై వెలసెను. ఆచార్యులవారు కావ్య 'విజ్ఞప్తి'లోన 'సరస కావ్యత్వమునకు పరిణతదశను సమకూర్చిన యల నాటి ప్రబంధ ఫక్కిలోనే నీకావ్యరచనకు దొరకొంటిని' అని చెప్పినట్లు కావ్యము లందు సత్సంప్రదాయముగా విలసిల్లిన ప్రబంధధోరణిలో వారు పోతనచరిత్రము రచించిరి.

కావ్య సంప్రదాయము ననుసరించి పీఠిక రచించి 'మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథంతే' అన్నట్లు శ్రీకారాదిగా ఇష్టదేవతా స్తుతి, సుకవిస్తుతి, స్వీయవంశాభివర్ణనము చేయుట జరిగినది. కథా ప్రారంభము కూడ "శ్రీనిధి కాకతిరాజ్య...." అని శ్రీకారముతో ప్రారంభించబడినది. మరియు ఆశ్వాస విభజన గావించి, అశ్వాసాదులలో శ్రీకారపూర్వక కందములనుగూర్చి, ఆశ్వాసాంత పద్యములను గద్యమును సంతరించుట, కావ్యోపసంహారము కూర్చుట సంప్రదాయక్షుణ్ణ మార్గానుసరణము. అంతేకాక కావ్యారంభమున 'కావ్యోప క్రమము'పేర కథకు పూర్వరంగముగా రచించినది పురాణేతిహాసములందువలె నైమిషారణ్యమున శౌనకాదిమునులకు సూతుడు చెప్పినట్లు వర్ణించిన గాథయు కావ్యానుబంధముగా చివరి రెండాశ్వాసములందు రచించిన భాగవత కథలును సంప్రదాయముద్రాభద్రమై పొలుపారుచున్నవి.

కావ్యవస్తువు భక్తిజ్ఞాన వైరాగ్య శోభితుడును వైదిక సంప్రదాయ జీవిత మును గడపిన మహాపురుషుడును అగు పోతనగారి జీవితమును అతని కవితాశయ ములను నభివర్ణించినది కావున నది సాంప్రదాయికతకు ప్రబలమైన దృష్టాంతము. అట్లే పోతన జననీజనకులు, నర్సమాంబ శ్రీనాథుడు మున్నగు పాత్రల చరిత్ర ములు సాంప్రదాయికముగా సాగినట్లు వర్ణింపబడినవి.

సకల శాస్త్రములు కావ్యములు శాంతికోసమే నిర్మింపబడినవి. అభినవ గుప్తుడు 'శమార్థం సర్వ శాస్త్రాణి....' అన్న శ్లోకమున వచించినట్లు ధర్మమూల కము మోక్షదాయకము అగు శమమును—శాంతిని—ప్రసాదించుటకు కావ్యము ప్రధానముగా రచింపబడుట వలన సంప్రదాయము సమగ్రము సాక్షాత్కరించుచున్నది. కథా ప్రారంభములోని బమ్మెరగ్రామ వర్ణనలో 'అది యొక పల్లెటూరు' అన్న పద్యమున కావ్యవస్తు నిర్దేశములో ఈ శమమే ప్రతిపాదింపబడినది. కావ్యము నందలి భక్తి జ్ఞాన వైరాగ్య ఘట్టములన్నియు దీనినే ప్రబోధించుచు ప్రధానముగా వైదికమత ధర్మ సంప్రదాయమునకు దర్పణము పట్టుచున్నవి.[1]

పోతన జననీజనకుల గుణకర్మ స్వభావములు వైదిక ధర్మ కర్మములకు సాంఘిక సంప్రదాయములకు ప్రతిబింబములుగా వర్ణితములై యున్నవి. పాల్కురికి జాతర శైవమత సాంఘిక సంప్రదాయానుసారముగా సాగినది.

'జడలతో బూదిబొట్లతో స్వకరమంటు
ముమ్మొనలవాలుతో రాగిసొమ్ము తోడఁ
గక్షప్రవేలెడి జోలెతోఁ గరములెత్తి
దిశల శివసత్తులై తూలు బసివిరాండ్రు[2].

'....అగ్ని గుండాల నుఱికెడి యయ్యలు'

'....బొల్లి మోరల నాడు భల్లుకములు', 'పులిమొగపు లక్కబుఱ్ఱను దగిల్చి' పైప లడుగుకొను పెద్దమ్మలవాడు, హల్లీసకమాడు చెంచెతలు వీరముష్టి వారు మొదలగువారు,

"కదలనీక యడ్డమ్ముగా గంటఁబట్టి కలపకోలను గంటయంచుబకుఁద్రిప్పి
యందుఁగట్టిన గవ్వనాట్య మ్మొనర్చి నాదు
సేయఁ దత్త్వముఁ బాడు బూదిగురుడు"[3]

వింతలు వినోదములు కలిగింప దేవదాసీజనములు సేవమందు నృత్యగీత వాద్యములతో సాగగా 'బసవన కిలాతమున్ నాసపడగ గొడుగునెసఁగ దివ్విటీల్వెలుఁగ నూరేఁగె భవుఁడు'[4]

1. ఈ భక్తి జ్ఞాన వైరాగ్యముల గురించి 'రస నిర్వహణము', 'కావ్యోపదేశము' వ్యాసములందు విపులముగా చర్చింపబడెను.
2. పోతన చరిత్రము : 1-138
3. ,, ,, : 1-142
4. ,, ,, : 1-143

"సేవించి యీశ్వరార్చన గావించి గురువు సమాధిఁ గనుగొని భక్తిన్
దేవాలయ ప్రదక్షిణ మావహిలన్ జుట్టివచ్చె నలఁ గేసనయున్"[1]
అని యిత్యాదిగా వర్ణించినదెల్ల సాంప్రదాయికత నద్దములోవలె ప్రదర్శించుచున్నది.

కేసన శ్రీనాథుని కొనర్చిన యతిథి సత్కారము సాంఘిక సంప్రదాయాను సారియై యున్నది. అతడు శ్రీనాథుని ప్రత్యుత్థాన మొనర్చి పాదవందనము చేసి సాదరముగా సంభాషించి భోజన భాజనాదుల సేవ గావించిన రీతిలో మరియు రామశర్మకు మల్లన అతని తల్లి చేసిన సత్కారములో నా సంప్రదాయము ప్రస్ఫుట మగుచున్నది.

పోతన వివాహము విశిష్ట సాంఘిక సంప్రదాయానుగుణముగా వర్ణింప బడినది. పెండ్లికి జ్యోతిష విహిత శుభలగ్నము నిర్ణయించుట, పచ్చని పందిళ్ళతో పసుపు కుంకుమలతో తోరణాలతో వెల్లవేసిన గృహమలంకరించుట, ముహూర్త వేళ పరిణయ వేదికవద్దకు వరుని గొనివచ్చుటకు వైభవముగా ఎదురుపోవుట, మంగళాభ్యంగన స్నానము చేయించి సింగారించిన వధువుచేత మాంగళ్యార్థము దుర్గా మహాదేవి పూజ చేయించి పురోహితుడు రమ్మన్నాడని తోడుకొని వచ్చుట, మహాసంకల్ప పూర్వకముగా శ్రీనాథుడు తన చెల్లెలిని గో భూ హిరణ్యదానాదులతో గూడ ధారవోయుట, సుముహూర్తమున బ్రాహ్మణోత్తములు 'సులగ్నసావధాన' యనుచు మంగళాష్టకములు చదువుచు అక్షతలు చల్లుట, బ్రాహ్మణులు ముత్తైదు వలు ముట్టిన మట్టెలను మంగళసూత్రమును వధువునకు కట్టించుట, ఆలుమగలు తలంబ్రాలు పోసికొనుట, పోతన నాతిఁగూడి సన్నెకలు త్రొక్కి సాప్తపదీన మాచరించుచు అగ్నిసాక్షిగా 'నాతిచరామి' యంచు ప్రతిజ్ఞచేయుట, కొంగులు ముడివేయబడి చిటికెనలు పట్టుకోబడిన వధువు వరుని వెంబడి అగ్నిదేవునికి ప్రదక్షిణలాచరించుట, పసుపు బట్టలతో వధూవరులు అరుంధతికి నమస్కరించి పూజ్యులకు పెద్దలకు మ్రొక్కులిడుట, పిమ్మట సువాసినులు వాయనములు గైకొని వధువును కూర్చుండబెట్టి కుంకుమపెట్టి చందనము చేతికిచ్చి, పేరుపెట్టి పిలిచి పెనిమిటి చేతికి రాయుమనుట, ఆ పిదప స్థాలీపాకహోమము చేయించుట, నాకబలి తీర్చుట, వధువు నప్పగింతలు చేయుట యను పెండ్లితంతు సాంతమార్య సమ్మతమైన సాంఘిక సంప్రదాయ విభాసురముగా జరిగినట్లు వర్ణింపబడినది.

1. పోతన చరిత్రము : 1-114

ఇట్లే రుక్మిణీ కళ్యాణగాథ, పోతన నిషేకము, మల్లన జననోత్సవము, దివంగతులైన జననీజనకులకు పోతన తిప్పన లంత్యక్రియలు తీర్థశ్రాద్ధవిధులు నిర్వర్తించుట మున్నగునవి సాంఘిక సంప్రదాయ విలసితములై యున్నవి.

పోతన జన్మించినపుడు జ్యోతిషు లతని జాతకము పరిశీలించి ఫలితములు చెప్పుట, పోతన మల్లన వివాహములకు సుముహూర్తములు నిర్ణయించుట, శ్రీ భాగవత రచనారంభమునకు ఏకశిలాపండితులు సన్ముహూర్తము నిర్ణయించుట తల్లి అవసానవార్త విని పోతన రావకొండ నుండి బయలుదేరగా అశుభసూచకముగా 'వెమరులున్ గ్రొత్తకుండలు నెమరువచ్చె' నని శకునము తెల్పుట వంటివి జ్యోతిష శాస్త్ర సంబంధులై శాస్త్ర సంప్రదాయము ననువర్తించుచున్నవి.

భోగినీనృత్యము శాస్త్రీయమై సాంప్రదాయికమై విరాజిల్లి తదీయ సంప్రదాయమును చలనచిత్రములో వలె ప్రశస్తముగా ప్రదర్శించుచున్నది.

సింగభూపాల సభాంగణ వర్ణనలో నృపతి భోగినీ నాట్యము జరిగిననాడు అరుణోదయవేళ భూపాల రాగాలాపనచేయుట, నగరికి వాకిట నగారమ్రోగగా వందిమాగధులు రాజును స్తుతించుచు సుప్రభాతములు పాడుట, రాజు శుద్ధాంతము నుండి సభాభవనమునకు రాగానే వందిజనులు స్తోత్రములు పాడగా మంత్రులు సామంతులు నతమస్తకులై లేచి నిలుచుట యనునవియు, ఆనాటికి పూర్వము శ్రీనాథ పోతనలు సింగనృపతిని తొలుత సందర్శించినప్పుడతడు వారిని సంభావించి తన నుద్యానమున కలియుడని లేచిపోవుచుండ,

> "రాజేంద్రుఁడా హజారమువీడు ననునంత నగరు భేరీ జయనాద మెసఁగెఁ
> బట్టపుటేన్గు సంబరమాఁపలేక తొండము నెత్తి వడి బృంహితములు సేసె
> మన్నెవారలును సామంతులున్ మంత్రులు దళవాయిఁగమి సలాములు
> బొనర్చె
> వందిమాగధుల కైవారసంగత జయధ్వానముల్ సన్మార్గతలము ముట్టె
> నిలువుటఁగరేఖలు ప్రేల నృపుని మ్రోలఁ బట్టునెట్టెంపు తలవాలఁ బ్రణతి
> సల్పి
> యడుగులందు సమ్మాళిగలికి నృపతికి వీవధముఁ జూపుచున్ జన
> వేత్రధరులు"[1]

1. పోతన చరిత్రము : 4-86

అనియు పరిచారికలు చేసిన సేవలును వర్ణించినదెల్ల రాచరికపు దర్బారు సంప్ర దాయమును వెల్లడి చేయుచున్నది.

పోతన జననీజనకుల తీర్థయాత్ర, యాత్రనుండి వచ్చిన పిదప చేసిన అన్న సంతర్పణము, దక్షిణల నిచ్చుట యనునవియు, వరికోతలకు ముందు పోతనసతి దుర్గాదేవిని పూజించి నైవేద్యము సమర్పించుట ఇత్యాద్యనేక విషయ ములు సాంప్రదాయికమై యొప్పుచున్నవి.

భాగవతాంధ్రీకరణ మొనర్చి తనకు కృతి యిమ్మని శ్రీ రాముడు పోతన నాదేశించి 'పూగఫలాక్షతల్ గలుగు పుత్తడి పళ్లెరమిచ్చి' సత్కరించిన విషయము, పోతన భాగవతాంధ్రీకరణమునకు ముందు భాగవత సప్తాహము, నవరాత్ర బ్రహ్మ సత్రయజ్ఞ మాచరించుట, కావ్యకథాంతమున నొంటిమిట్ట శ్రీరామచంద్రునికి భాగ వత కృతి సమర్పణోత్సవము కావించుట మత సాంఘిక కావ్య సంప్రదాయ సంశోభితమై యున్నవి. ఈ విధముగా వస్తువునందును, అనేక సన్నివేశ కల్పనల యందును వర్ణనలయందును చక్కని సాంప్రదాయికత స్వాంతావర్జకమై యొప్పారుచున్నది.

## భావ సంప్రదాయము :

కావ్యమున వస్తు విషయకముగా వివరించినట్టి సాంప్రదాయికతయే భావము నందును ప్రకాశించుచున్నది. ఇది ఆచార్యులవారి హృదయ ఫలకమున ముద్రిత మైన సత్సంప్రదాయమునకు ప్రతిబింబమై భాస్వంతమై యున్నది. ఈ భావ సంపదలో వస్తుస్వరూపమును దాని తత్త్వమును భాసిల్లజేయుటకు కావించు రూప కల్పనలు, ఊహలు, ఉపమాన ద్రవ్యములు, కవి సమయములు, సందేశోపదేశ ములు మున్నగునవెన్నో చేరి యుండును. ఈ యంశములందలరారు భావ సాంప్రదాయికత కావ్యమునందనేకానేక సన్నివేశములలో సాక్షాత్కరించుచున్నది. కావున మచ్చునకొక కొన్నిటిని పేర్కొందును.

కథాప్రారంభమున నేకశిలానగర వర్ణనలో వెలార్చిన భావములు సంప్ర దాయ విలసితములై యున్నవి.

'బ్రాహ్మణుండాపీట బహుళ విజ్ఞానియై ప్రథిత విద్యానాథ పదవిఁ బడసె
క్షత్రియుండాకోట సమరప్రతాపుఁడై రుద్రావతారంపురూపుఁ గొనియె

వైశ్యుఁడా పూఁదోఁట వర్ధితనిధిపైఁడి తిప్పయ యనఁగ సందీప్తినొందె
శూద్రుఁడాచోట దస్యుల ప్రాణగొడ్డమౌ కాపయ్యనానెంతొ గణుతికెక్కె-
బ్రహ్మతనుముఖ బాహూరుపదములగుచు నేకతనుగాంచె జాతులనేకములయి
విడివిడిగఁ జీలిపడు వర్ణవితతియెందుఁ గ్రమతఁ గలిగిన నర్థయుక్తములు
గావె?"[1]

"కల్పవృక్షశోభల సస్యకాండమలరుఁ కామధేను వైఖరుల గోగణము దనరు
క్ష్మాతల స్వర్గమనని నోర్గంటి పురము...."[2]

ఓరుగంటి పురవర్ణనలో చతుర్వర్ణములను ప్రస్తుతించుట, ఆ నగరము భూతలస్వర్గమని స్వర్గమునందలి కల్పవృక్ష కామధేనువులతో సస్యములను గోవులనుపమించి చెప్పుట సాంప్రదాయికము. పోతన జననిని "నిరుపమ భర్తృ భక్తిగుణ నిర్జితశైలసుతాభవానినిన్"[3] అని యిత్యాదిగా పార్వతితో లక్ష్మితో సరస్వతితో పోల్చి వర్ణించుట, తర్వాతి పద్యములందు గంగతో, సావిత్రి, అనసూయ, భూదేవి మొదలగు దేవతలతో బోల్చుట, ఆమె భర్తను సత్యవంతుడు మున్నగువారితో బోల్చుట పురాణేతిహాస సంప్రదాయమునకు తార్కాణ.

బమ్మెర రామాలయమున భాగవత పురాణ ప్రవచనముచేసిన బ్రాహ్మణుని వర్ణించుటలో ప్రకటించిన

"సన్మతింగల వేదశాస్త్ర విజ్ఞానంబు
ఘన శిఖాభ్యున్నతిన్ గ్రాలుననఁగ"[4].

ఇత్యాది భావములిట్టివే. ఇట్లే పోతన యింటికి వచ్చిన రామశర్మ వర్ణనలో వెలిబుచ్చిన భావములు శుద్ధ సంప్రదాయ విభాసితములై యున్నవి.

పోతన శైశవ వర్ణనలో,

"మత్స్యావతార సన్మహిమంబుఁ జింతించు
ననఁ దొట్టియం జేఁప యటు నటించు"[5]

1, 2. పోతన చరిత్రము : 1-80, 81
3 పోతన చరిత్రము : 1-94
4. ,, ,, : 1-101
5. ,, ,, : 1-121

అని యీరీతిగా మత్స్య కూర్మాద్యవతార మహిమలను చింతిచుచున్నట్లు పోతన శివు నూహించినది విశిష్ట పౌరాణికభావ సంప్రదాయమే. పోతనకు దర్శనమిచ్చిన చిదానందుని వర్ణనము నిట్లే సాంప్రదాయికమైనది.

పొలాలవద్ద పోతనకు దర్శనమిచ్చిన శ్రీనాథుని శకట వృషభముల వర్ణనలో 'హరుని పేరురమునా నలరారు ముఖసీమఁ బన్ద్రతాళ్లు ఫణులయి పెనఁగు లాడ...." అని యిత్యాదిగా వృషభమును శివస్వరూపముతో నుపమించి చెప్పుట లోను, సింగనృపతి దర్శించినప్పటి 'శ్రీశైల శిఖరసంస్పృష్ట సంధ్యారాగగతిని కాశ్మీరరాంకవము మేన....' యని శ్రీనాథుని వర్ణనలో, 'సతతావ్యయ విభూతి సంపన్నమతి యన భస్మపుండ్రాన్విత ఫాలతలము....' అని పోతన వర్ణనలోను 'ఐరావణము పెక్కులాకారములుదాల్చి మందలై యిచటఁ బెంపొందెనేమొ!....' అని నారయాదులు రాచకొండ పురవర్ణన చేసిన దానిలోను విశిష్ట సంప్రదాయము విశదమగుచున్నది.

పోతన భాగతాంధ్రీకరణ ప్రారంభమప్పటి వసంతఋతు వర్ణనలోని దిగువ పద్యము పౌరాణిక విషయకలితమై సంప్రదాయమును వెలార్చుచున్నది.

'స్థాణు జటాచ్ఛటాటవి నిశాతకశాయిత పుల్లమల్లికా
బాణములన్నిగుడ్చి పగఁబాపికొనెన్ గుసుమేషువుద్ధతిన్
బాణిని మోడ్చి స్థాణువుల పర్ణవనిన్ శరణమ్ము వేడఁగా
వేణువులూఁదె దర్పకుని వీరజయాంకము లౌచుఁ గోకిలల్'[1].

పోతన జననీజనకుల అస్థికలు గంగలో కలిపిననాటి చంద్రోదయ వర్ణనలో

"అక్క యా కమలాలయ యాదిలక్ష్మి మనుజుఁడరుగుదెంచెడి నని
నంత నామె
తలుపులిడుకొని యింటిలోపలికిఁబోవు నెదకళంకపంకిలమని
యెఱిఁగెనేమొ"[2]

"ఏమి పాపమో యేటేట నితఁడు తాను సరవి ఛాయాగ్రహముఖాలఁ జచ్చి
పుట్టు
కంధి మారాజు చల్లని కడుపుబలమొ బ్రాహ్మణుల గంగయొడ్డు
తపఃఫలమ్మొ"[3]

1. పోతన చరిత్రము : 6-10
2,3. ,, : 5-29,30.

అని ప్రకృతి సహజముగా చంద్రోదయవేళ జలజములు ముకుళించు విషయ
నకు, సూర్యచంద్రాదులకు మధ్య భూమి వచ్చినపుడేర్పడు చంద్రగ్రహ
విషయమునకు పౌరాణికగాథల యన్వయముతో భావించిచెప్పుట సాంప్రదాయికవ
ఇట్టివే గంగావర్ణనలో వైష్ణవ కథానుసంధాన భావప్రకటన దిగువ పద్యము
కావింపబడినది.

"హరిచరణమజుఁడు గడిపిన హరుఁడౌదలఁదాల్చి తాపమార్చుకొనిన పె
వఁబడవఁట, భక్తకామిత వరదవగుటకేమిలోటు వరధుని గంగా!"[1]

భోగినీ నాట్య వర్ణనలో భోగిని విప్రలబ్ధయగు రాధికగా నభినయించు
చంద్రాద్యుపాలంభము చేసిన తీరు, అందలి భావములు మత కావ్య సంప్రదాయ
లను స్మృతికి దెచ్చుచున్నవి ఇట్లే ఋతువులు మున్నగు వర్ణనలలోను, అనే
సన్నివేశములందును భావసాంప్రదాయికత పొలుపారుచున్నది. ఇదేరీతిగా భ
జ్ఞాన వైరాగ్యఘట్టములందంతటను ప్రశస్త సంప్రదాయ భావసంపద పెంపా
యున్నది. చిదానందయోగి పోతనకుపదేశము చేసిన ఘట్టమునను, పోతన చేసి
సింగనృపతి వర్ణనలోను, గౌతమీ వర్ణనలోను, నర్సమాంబ దుర్గాదేవిని సం
తించిన సన్నివేశము నందును, పోతన శ్రీనాథునకు వైరాగ్యబోధ యొనర్చిన ప
నను, ఇట్టివే యనేక ఘట్టములందును ప్రబోధాత్మకమైన భక్తి జ్ఞాన వైరాగ్య విలసి
భావములు వ్యక్తీకరింపబడి చక్కని సాంప్రదాయికతను వెలయించుచున్నవి.

భావప్రకటనార్థ ముపమానోపమేయ సంయోజనము నందును సాంప్రదాం
కత భాసిల్లుచున్నది. కావ్యములందు ప్రాయికముగా ప్రయోగింపబడు నుపమా
ములు ప్రసిద్ధములై రూఢములై కావ్యసంప్రదాయ విలసితమై యొప్పుచుండున
ఈయుపమాన ద్రవ్యములు ప్రాచీనములు నవీనములు నని యనుటకు వీలులేదు
ఇవి వాయు జలముల వలెను భాస్కర సుధాకరుల వలెను వసంతాది ఋతువు
వలెను సనాతనములై సార్వకాలికములై విభాసిల్లుచుండును. వాని నుపయోగిం
వర్ణించుతీరులోనే ప్రాతక్రొత్తలు వరలుచుండును. పోతన చరిత్రమునందు సాంప్ర
దాయికముగా గల వీని యుపయోగమునకు కతిపయోదాహరణములిత్తును.

1. పోతన చరిత్రము : 5-38

మావి తోటలో శ్రీనాథుని చెంతకు వచ్చిన జంగమ కన్య యిట్లు వర్ణితమైనది.

"అంగదయోర్తు మన్మథసుమాస్త్ర సమాన మనోజ్ఞభీత సా
రంగ విలోకనమ్ముల మరాళ నిరాసకయాన వైఖరిన్
సంగడిఁదీయు రత్నకళచాడ్పున సుందర రూప రేఖలన్
బంగరు పల్లెమూని జయభారతి హారతులీయ వచ్చునాన్"[1]

ఇందు జంగమ కన్యను మన్మథసుమాయుధముఁతో, చూపులు బెదరిన లేడి చూపులతో, నడలు హంసలతో, రూపురేఖలు రత్నకళలతో నుపమించుట సాంప్రదాయికము, ఈయుపమానము లన్నియు కావ్యములందు ప్రసిద్ధముగా ప్రయోగింపబడునవే. మోహినీ సౌందర్య వర్ణనలోని

"నవ్వుల మల్లికల్ విరియు నాతి రసేక్షణ పంక్తులెయ్యెడన్
మవ్వపుటబ్జముల్ గురియు మంజువిలాసయుతాస్యబింబమీ
జవ్వనపున్మహోదధిని చంద్రముఁడై మెఱయున్ సుమాస్త్రుఁడా
పువ్వుశరమ్ము లెక్కునిడఁబూన్చిన నారియెకాక నారియే"[2]

యను దానిలో నవ్వులను మల్లెలతో, చూపులను పద్మములతో, మోమును చందమామతో పోల్చి రూపకాలంకృతి మెరయించినది సంప్రదాయ విభాసుర మైనదే. ఇట్లే నర్సమాంబ చేసిన దుర్గాదేవిస్తుతిలోని 'నతయాడున్ భవదీయ కాయ మయి సౌందర్యార్ణవంబీకటిన్ బుడమిన్ దట్టుచు....'[3] అనుదానిలోను, 'హాసము లందు ఫేనములపొంగ నిరీక్షణలందు మీనముల్...."[4] అనుదానిలోను, భోగినీ నృత్యవర్ణనలోని

'ద్యోతలమునందెగయు శ్వేతాభ్రమై మదను కేతనమ్మై యెగయుఁగొంగు'[5]

అనుదానిలోను నుపయుక్తములైన యుపమానములు సాంప్రదాయికమైనవి. ఇదే విధముగా పోతనజనని పాతివ్రత్యమును సీతాసావిత్ర్యాదులతో, ఏకశిలానగర వైభవమును స్వర్గముతో, కేసన శ్రీనాథుని వినుతించుటలోని

'సంసారకూపార సంచార నౌకాప్రగతి కరిత్రమ్ము పండిత మతమ్ము'[6]

అనుటలో సంసారమును కూపారముతో,

1. పోతన చరిత్రము : 7-304
2. ,, : 11-129
3,4. ,, : 3-131, 133
5. ,, : 4-262
6. ,, : 2-192

భాగవతాపహర్తలగు కన్నడ సైనికుల నెదిరింప వచ్చిన రాచకొండ సేన లోని వీరుని వర్ణనలో

"మార్కొనఁగవచ్చు వరవిక్రమార్కువోలె మారు వేషాననున్న కుమారువోలె
విజయలక్ష్మి వరించిన విజయువోలె వచ్చుచుండె వీరాగ్రణి వాజినెక్కి"[1]

అని వీరుని విక్రమార్కునితో కుమారస్వామితో విజయునితో పోల్చుటలో చక్కని సాంప్రదాయికత పరిపుష్టమై యున్నది. ఇట్టి సాంప్రదాయికమైన యుపమాన ద్రవ్యము కావ్యమున పుష్కలముగా పొలుపారి యున్నది.

కావ్యములలో కవి సమయములు పాటించుట సంప్రదాయము. అసలు 'సమయము' అనుటయే నియమము, ఏర్పాటు. కవులు కావ్యవర్ణనలో పాటించ వలసిన నియమములే కవిసమయములు. మతసాంఘిక సంప్రదాయముల వలెనే ఇవి కావ్య సంప్రదాయములై యొప్పుచుండును. ఔచిత్యమును దృష్టియందిడుకొని యేర్పాటుచేసిన యీ కవిసమయములను కవులు సముచితముగా పాటించవలసి యుండును. "లోక విరుద్ధములైనను కవిసమయ ప్రసిద్ధములయినచో నుపాదేయ ములే యగును."[2] పోతన చరిత్రమున నిట్టివి కొన్ని సమాదృతమై యున్నవి.

పోతన వివాహుడై పత్నీ సమాగమ మొనరించిననాటి రాత్రి శరత్కాల చంద్రోదయ వర్ణన కావింపబడినది.

"నెలగుండియలఁ బిండి సెలయేటి యెలబోటి
యిల క్షీరవారాశి నొలుకఁ బోయ...."[3]

"యామిని తీవ....చంద్రమస్వామియె నిండుగా విరియు
చల్లని తెల్లని బంతి పూవులన్, గాముని వాహినుల్ విజయ
ఘట్టము మ్రుట్టె శరత్తు పొత్తునన్"[4]

ఇత్యాదిగా శరచ్చంద్ర శోభలు ఉద్దీపన విభావముగా వర్ణింపబడి పోతనకు విరహార్తి నినుమడింపజేసినవి. శుక్లపక్ష రాత్రులలో చీకటులుండుట సహజమైనను

1. పోతన చరిత్రము : 9-158
2. ఈ కవిసమయములు సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహము - చతుర్థాశ్వాసము దోష ప్రకారమున ప్రస్తావింపబడినవి. అందీ వాక్యము కలదు.
3. 4. పోతన చరిత్రము : 3-192, 197

ఆ చీకట్లను వర్ణింపక కేవలము వెన్నెలలే యున్నట్లు వర్ణించుట, అందును నాయికా నాయకులకు సంయోగవేళ ఉద్దీపనముగా రాకా చంద్రోదయ వర్ణన చేయుట కవి సమయమై ఆ సత్ సంప్రదాయ మిచట యనుసరింపబడినది. ఇచటి యీ కవి సమయము వస్తువులందాయా ధర్మములున్నను నిబంధింపరాదను వర్గమునకు చెందినది.

పోతన చేసిన గౌతమీ వర్ణనలో
ఎత్తుగీతి : ''అంబరములోన శశిసూర్యులందగింప
విలసదబ్జముల్ నీలోన వికియుచుండు.''1

అని గంగలో పద్మములు వికసించినట్లు చెప్పబడినది. జలప్రవాహముగల నదులలో కమలకుముదములు వికసించుట ప్రకృతి విరుద్ధమైనను నదీ వర్ణనలో అందవి వికసించినట్లు వర్ణింపవలెననుట కవిసమయము. ఇది ఆయా వస్తువులందు లేని ధర్మములను నిబంధింపవచ్చునన్న తెగలోనిది. దీనివల్ల నదీ సౌందర్య శోభ యధికమై యాహ్లాదకరమగును. ఇట్లే భోగినీ సౌందర్యవర్ణనలో

"వగలాడి క్రేగంట వలపులే వూచెనా
రవ్వలు నీలాలు రాశిపడును....''2

అని వచింపబడినది. ఇక్కడ భోగినీ నేత్రములు (కనుపాపల చేత) తెల్లగా నల్లగానున్నట్లు వర్ణింపబడినవి నేత్రములను తెలుపు నలుపు కలసియున్నట్లు వర్ణించుట కవిసమయము. అది యిచట పాటింపబడినది. వసంతములో కోకిలను వర్ణించుట కవిసమయము. ఇది ఆయా ధర్మములను నియతముగా వర్ణించుటలోనిది. దీనివలన ప్రకృతిశోభ సమగ్ర విరాజితమై యొప్పును. కాలౌచిత్యమును పాటించి వర్ణించుటకు ఋతువులు మున్నగువాని వర్ణనలలో నిట్టి కవిసమయముల ననుసరింపవలెను. పోతన చరిత్రమున పోతన భాగవతాంధ్రీకరణ ప్రారంభ మప్పటి వసంతర్తు వర్ణనలో "....కోకిలములు స్వాగతాభ్యుదయ గీతము లాలపనంబొనర్చె....''3 అని చెప్పబడెను.

ఇదే విధముగా భావవిస్ఫూర్తికనేక కవిసమయములు సందర్భోచితముగా పాటింపబడి సంప్రదాయ మనుష్ఠింపబడియున్నది.

---

1. పోతన చరిత్రము : 5-48
2. ,, : 4-65
3. పోతన చరిత్రము : 6-6

## రచన సంప్రదాయము :

కావ్యమున రచనా సంబంధమైన చక్కని సాంప్రదాయికత గోచరించు చున్నది. రచనలో ముఖ్యముగా భాష, శైలి, పదప్రయోగము, ఛందో వ్యాకరణ ములు ఎన్నదగినవి. ఈ యంశములలోని సాంప్రదాయికత ఇచట సమీక్షింప బడును. కావ్యము నందలి భాష, ఛందస్సు అలంకారముల గురించి 'భాషా వైచిత్రి', 'ఛందో విశేషము', 'ఆలంకారికత' వ్యాసములలో విపులముగా చర్చింప బడెను. ఐనను ఇక్కడ సంక్షిప్తముగా పేర్కొని సాంప్రదాయికతను నిరూపింతును

పోతన చరిత్రము ప్రబంధ పద్ధతిలో రచింపబడినదగుటచేత ఇందలి శైలి ఆలంకారికమై ప్రౌఢమై పరిఢవిల్లి సంప్రదాయమును చక్కగా గర్భీకరించుకొని కమనీయమై యున్నది. కొన్ని ప్రబంధములలోవలె అతి దీర్ఘసమాస ఘటితమై జటిలమైనది కాక మనుచరిత్ర పారిజాతాపహరణములలో వలె నాతి దీర్ఘసమాస కలితమై ప్రౌఢమయ్యు సరళ సుందరమై యొప్పుచున్నది. సముచితాలంకార విభాసురమై మెప్పుగన్నది. దీనికి గ్రంథములోని పద్యగద్యము లన్నియు నుదాహరణీయములే. ఇందలి భాష సలక్షణమై గ్రాంథికమై యొప్పుటయే దీని సాంప్రదాయికతకు తిరుగులేని నిదర్శనము.

అందందు సందర్భానుసారముగా సంస్కృత వాక్యములు కూర్చుటయు 'అస్త్రశస్త్రముల్ గ్రుంగె', 'పగటి భాగవతమ్ములు', 'సంకునబోయు తీర్థము' 'గురునకు తిరుమంత్రమ్మిడు', 'మీనము మేషమంచు నిటు మిన్నని యెంచుట' మున్నగు జాతీయములు పదబంధములు ప్రయోగించుట విశిష్ట సంప్రదాయమునకు విశదమైన తార్కాణ.

ఇక పోతన చరిత్రము ఛందో విలసితమగుట మహత్తర సంప్రదాయ మునకు మరొక దృష్టాంతము. ఇందు సాంప్రదాయికమైన సలక్షణమైన వృత్తములు జాత్యుపజాతులు, మాత్రాచ్ఛందో గేయములు సంస్కృత శ్లోకములు ప్రయో గింపబడినవి.

ఈ విధముగా పరంపరాగతమైన సత్సంప్రదాయమును వస్తు భావ రచనలో ప్రవర్తింపజేసి పోతన చరిత్రమున భూరిసాంప్రదాయకతను పొలుపొంద జేసినారాచార్యవర్యులు.

## పోతన చరిత్రమున నవ్యత :

పోతన చరిత్రమున సత్సంప్రదాయము పాటించుటతో పాటు చక్కని నవ్యతయు సంతరింపబడియున్నది. ఈ నవ్యతను గురించి 'వస్తు శిల్పము' మొదలగు వ్యాసము లందందందు పేర్కొనుట జరిగినను 'కవితాతత్త్వము' వ్యాసములోని 'ఆధునిక కవితా రీతులు' అన్న ఉపశీర్షికలో కొంత చర్చింపబడినను ప్రస్తుతాంశముగా వానినిచట క్రోడీకరించి వివరించుట జరుగును. కావ్యము నందలి నవ్యతను వస్తు నవ్యత భావనవ్యత శైలీనవ్యత, ఆత్మాశ్రయ కవిత, దేశికవిత, భావకవిత, అభ్యుదయ కవిత అను అంశములందు చర్చింతును.

## వస్తు నవ్యత :

పోతన చరిత్రములోని యితివృత్తము భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నుడగు పోతన గాథ. సంప్రదాయ విలసితమై వెలసినప్పటికి ఈ వస్తు విషయమున సముచిత నవ్యతయు చెలువొందుచున్నది. దర్పణకారుని లక్షణానుసారముగా కావ్యనాయకుడు పోతన వేలుపుకాని క్షత్రియుడు కాని కాక విప్రుడగుట నవ్య విషయము. ఆముక్త మాల్యాదాది పూర్వప్రబంధములు కొన్నిటిలో విప్రులు నాయకులుగా ఉన్నారు. ప్రాచీన కావ్యములలో దివ్యులు, దివ్యాదివ్యులే తఱచుగా నాయకులై అదివ్యులు (మానవులు) నాయకులైన విషయము తక్కువ. కాగా కాలక్రమమున అదివ్యులు నాయకులైనను వారు అగ్రవర్ణములకే చెందినవారై యున్నారన్న విమర్శయున్నది.[1] అగుచో విప్రుడగు పోతన నాయకుడగుట నవ్యత యెట్లగునన్న ప్రశ్న యుదయించును. పోతన వైదిక ధర్మ కర్మములు పౌరోహిత్యముచేయుచు మనుగడ సాగించిన మహీసురుడు కాడు. అతడు బమ్మెర గ్రామ కరణమగు నియోగి. జీవనోపాధికి హాలికవృత్తి నవలంబించినవాడు. కవియై కావ్యరచనలో కాలము వెళ్ళబుచ్చినవాడు. వృత్తిచేత కర్షకుడు, ప్రవృత్తి చేత కవియైన పోతనను కేవల మగ్రవర్ణుడగు విప్రునిగా పరిగణించుట భావ్యము కాదు. మరియు పోతన సాధారణ కర్షక జీవనము సాగించుచు గ్రామీణ కర్షకులలో నొకడుగా అందరితో ఆప్యాయముగా మెదలి వారి కష్టనిష్ఠురములతో పాలుపంచు

1. ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డిగారు తమ సిద్ధాంత గ్రంథములో నవ్య కవిత్వ ములు-వస్తు నవ్యత (పు. 181) లో దీనిని వివరించిరి.

కొని పేదసాదుల నాదుకొనియున్నాడు. భోగముల కాశింపక కృతిని నరాంకితము చేయక దుర్మదాంధులు నిరంకుశులగు రాజులను ధిక్కరించి దారిద్ర్యము నాశ్రయించినవాడు. కావున పోతన భక్తుడగుటచేత సాంప్రదాయికత, కర్షకుడు, ప్రజాకవి యగుటచేత నవ్యత విలసిల్లి కావ్య వస్తువున ఈ రెండు సమ్యక్ సమ్మేళనము గాంచియున్నవి.

కావ్యమున పోతనతో పెనవేసికొనియున్న గ్రామసీమాభి వర్ణనము, కర్షక జీవన చిత్రణము 1,2,3,5,8 ఆశ్వాసములలో విపులముగా చేయబడినదగుట చేత నిది వస్తునవ్యతాకలితమై యున్నది.

ఒక ఆంధ్రమహాకవి జీవితమును మహాకావ్యముగా మహాప్రబంధముగా ప్రథమముగా నిబంధించిన ప్రశస్తి దీని నవ్యతకొక తార్కాణమగుచున్నది. అట్లే క్షీణయుగములోని అస్వతంత్ర్యప్రబంధములలోని అసభ్య శృంగారము, రసభావ శూన్యమైన రీతి ప్రాధాన్యము, చిత్రబంధాది కవితారచనము మున్నగు దుర్లక్షణములను పట్టించుకొనక సభ్యమైన సముచితమైన శృంగారముతో రమణీయ భావభరితముగా రసోదంచితముగా ఉత్కృష్టోపదేశకమగు ఉత్తమ ప్రబంధముగా విరచించిన విషయము నవ్యమనుట భావ్యమే. మరియు పూర్వాంధ్ర మహాకావ్యముల సమస్త సద్గుణములను మేళవించుకొని యపూర్వ శోభలతో విరాజిల్లుట నవ్యతాహేతువగుచున్నది. ఇందలి భోగినీ నృత్యవర్ణనము సాంప్రదాయికముగా సాగినను నింత విశిష్టముగా విపులముగా విరాజిల్లుట కావ్య ప్రపంచమున నపూర్వమగుటయు నొక నవ్యతయే.

వస్తు శిల్పసంబంధమైన దిగువ విషయములు నవ్యతను వెలార్చుచున్నవి.

1. కావ్యపీఠిక విషయ వైవిధ్య విలసితముగా 137 పద్యములలో సుదీర్ఘముగా రచించుట.

2. పీఠికలో ఆంధ్రజనతాస్తుతి, ఆంధ్ర భారతీ స్తుతి, కవిస్తుతి, కవితా స్తుతి కావించుట

3. ఆధునిక కవిపండిత విమర్శకులను పేరుపేరున స్మరించి 50 పద్యాలలో విపులముగా వినుతించుట.

4. కావ్యములలో గన్పడు కుకవినింద చేయక 'కుకవి స్తుతి' అపూర్వముగా చేయుట.

5. 'అభ్యర్థన' యని కావ్యనాయకుని ప్రస్తుతి, 'సత్యదేవ స్తుతి' 'కావ్య నిరోధ నివారణ' యను వానిని గూర్చుట.

6. కావ్యములలో బాహాటముగా గనబడు షష్ఠ్యంతములను రచింపక వదలుట.

7. కావ్యోపక్రమములోని పూర్వకథా విధానము పురాణపద్ధతిలో సాగి సాంప్రదాయికమైనదైనను ఆంధ్ర కావ్యములందులేని దీనిని పోతన చరిత్రమున అపూర్వముగా సంతరించుట.

8. కావ్యాంతమున భాగవత కథలు రచింప నేకాదశ ద్వాదశాశ్వాసములను కావ్యాంతర్గతముగా కాక కావ్యానుబంధముగా కావ్య సాధారణము కానిరీతిగా విలక్షణముగా గూర్చుట.

9. ప్రతి ఆశ్వాసము మొదట (చతుర్థాశ్వాసమున తప్ప) తత్కథాసార సూచకముగా భగవద్గీతాశ్లోక భాగములను ప్రశస్తముగా నుటంకించుట.

10. ఆశ్వాసాదులలో కందము పిదప కృతిపతిని సంబోధించుచు తేటగీతి గూర్చి, ఆ గీతులలో ఆయా ఆశ్వాసముల కథాంశములను సూచించుట.

11. కథ, వర్ణనలు, మరియు ఆనందము, ఉపదేశము సమముగా కొమ రొందునట్లు చక్కని సమన్వయ రీతిలో సంతరించుట.

ఈ విధముగా వస్తు విషయకముగా కావ్యమున నవ్యత సాంప్రదాయికతకు సైదోడుగా హవణిల్లుచున్నది.

## భావ నవ్యత :

కావ్యమున భావసంపద సంప్రదాయచ్యుతులతోబాటు, ఆధునిక కవితాను రూపమైన నవ్యరోచిస్సులను వెదజల్లుచున్నది. సాంప్రదాయికములైన పూర్వ కావ్యములు సాధారణముగా వస్తు ప్రధానములై యున్నవి. ప్రబంధములు చాలవరకు కథను ప్రక్కకుపెట్టి వర్ణనలకొరకు పద్యశిల్పము కొరకు రీతిప్రాధాన్యమునకు రచింపబడినవి. మరియు అందులో భావసంపద కొరవడి రసోచితములగు హార్దిక భావములు కాక మేధాజనితమైన కృత్రిమోహాలు కల్పనలు తరచై యున్నవి. నవ్య కవిత్వములో వస్తుభావ రచనలలో ముఖ్యమగు భావమునకే ప్రాధాన్య మీయ బడినది. ఈ విషయము ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గారిట్లు వ్రాసిరి.

"నవ్య కవిత్వమున వస్తు భావరచనలో భావమునకే అగ్రతాంబూలము కలిగినది. నవ్యకవులూహలతో ఇంద్రజాలము చేయక భావనాబలము నెక్కువ ప్రదర్శించిరి అష్టాదశ వర్ణనల నిర్బంధమునకు తిలోదకములర్పించిరి. ప్రాచీన కావ్యములనుండి యెరువు తెచ్చుకొన్న కవిసమయములను కాసంత సేపు ప్రక్కకు పెట్టిరి. అవసరమని తోచినప్పుడు ఔచిత్యభంగము లేనప్పుడు సరిక్రొత్త కవి సమయములను ప్రయోగించుకొనిరి. విన్నదానికన్న కన్నదానినే వర్ణ్యమొనర్చు కొనిరి. ఊహించిన విషయముకంటె భావించిన అనుభవించిన విషయమునే కవితామయ మొనర్చిరి".[1]

నవ్యకవులు నేల విడిచి సాముచేయక, ఊహాలోకములో విహరించుచు అతి లోక విషయములను వర్ణించుచు కృత్రిమ కల్పనలు చేయక, తమ పరిసరములను వాస్తవిక దృక్పథముతో అనుభూతి పూర్వకమైన భావములను వెలార్చుచు అష్టా దశవర్ణనలలో కవి సమయములలో కొంత స్వేచ్ఛగా ప్రవర్తించిరనియు రెడ్డిగారి వాక్యములు స్పష్టపరచుచున్నవి. పోతన చరిత్రమున నిట్టి భావనవ్యతకు సము చిత స్థానమీయబడినది. పూర్వ కావ్యములలోవలె కథా ప్రాధాన్యము కాక, ప్రబంధములలోవలె కేవల వర్ణన లౌల్యముకాక ఈ రెండిటికి తగు తావిచ్చుచునే భావమునకు ప్రశస్తమైన ప్రాధాన్య మీయబడినది.

బమ్మెర గ్రామసీమా వర్ణనములో హాలికులను ఆలను చేలను వర్ణించుటలో ఆర్ద్రానుభూతమైన నిసర్గమైన భావనాజలము నవ్యముగా ప్రదర్శింపబడినది. దీనికి.

ముత్యాల చెండ్లెత్తి మురిపించు జొన్నచేల్
కర్షక శ్రమఫలంబు ఘనతఁ దెల్పు"[2]

అను పద్యమొక చక్కని యుదాహరణము. గ్రామజీవన వర్ణనమే నవ్యకవితా విలసితమైనది. అందు పై పద్యమున పంటచేలను వర్ణించుటలోని తీరు, వెలి బుచ్చిన భావములు భవ్యములై యొప్పుచున్నవి. పాలేఱు, పశుపతి, శ్రీమహా లక్ష్మి, సీత వంటి పదప్రయోగము సాంప్రదాయికతను తెలుపగా, ముత్యాల చెండ్ల

1. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు : ప్రయోగములు — నవ్యకవిత్వ లక్షణములు 'భావనవ్యత' పు. 184
2. పోతన చరిత్రము : 1-87

వలె ముద్దుగొలిపెడి జొన్నచేలు రైతు చెమటబొట్ల విలువను తెల్పుచున్నవని కర్షకశ్రమ మూల్యమును భావించి చెప్పుట క్రొత్తగా నున్నది. ఇట్లే తక్కిన పాదములలోని భావములు నవ్యతాశోభితములు. బమ్మెర గ్రామములోని యిండ్లు వాకిండ్లు, పెరండ్లు, ముండ్లదడులు మున్నగునవి, 'కుంపటివలె నుండు కుక్కుట రాయండు కుటి శిఖాగ్రమునెక్కి కూయునొకట....' ఇత్యాదిగా ఊరిలోని పెంపుడు పశుపక్షుల స్వాభావిక రూపగుణ ప్రకటనము, ద్వితీయాశ్వాసమున ప్రాతర్వేళ పల్లె పట్టులలో ప్రశాంతముగా పరమ రమణీయముగా గనబడు దృశ్యములను కవితా దర్పణములో ప్రదర్శించిన పద్ధతి,

> "మోటదోలు చొకింత మ్రొగ్గి దండెడ తంత్రి శ్రుతిజేసి పాడెడి చోటకాఁపు
> మిరెపతోఁటల నలింబెలుకు గాజులచేతఁ జిటుకు తాళముగొట్టు చిన్నిపడుచు
> పచ్చికన్ లేఁగల భరతనాట్యము ప్రక్కఁ బిల్లఁగ్రోవిని నూఁదు గొల్ల
> బుడుత....[1]

మున్నుగా వెలిబుచ్చిన భావములు సంగీతకముగా నవమోహనములై యున్నవి.

అష్టమాశ్వాసమున లక్ష్మీశారదలు క్రీడించిన పెరటితోట వర్ణింపబడినది. మహాకావ్యములందు పెరటితోటల వర్ణన కానరాదు. ఇది అపూర్వమై క్రొంగ్రొత్త భావములతో నింపు నింపుచున్నది. ప్రబంధ సంప్రదాయమున నాయిక చెలులతో గూడి వనవిహారము చేయుచు పుష్పాపచయము, జలక్రీడ, మన్మథపూజ చేయుట గతానుగతికమైయున్నది. వనలతలందును లవలీలుంగ లవంగాదులను సురపొన్న లను పొన్నలను పొగడలను వర్ణించుట దోహదక్రియ లాచరించుటవంటివి పరి పాటి. కాని బమ్మెరలోని పోతనగారి పెరటిలో అచ్చమైన తెలుగువారి ముచ్చటైన పొట్ల గుమ్మడి చిక్కుడు బీరపాదులు బంతులు రుద్రాక్షలు ముద్దగోరింటలు మున్న గునవి పూచినవి కాచినవి. లక్ష్మీశారదలు ఈ మొక్కలను గాంచి

> "పొట్లకన్నె సమర్తాడెఁ గట్లనవ్వెఁ
> బచ్చపందిటఁ బిచ్చుకల్ ముచ్చటాడె
> జెలువ మొలయ సీతాకోకచిలుక పిండు
> మనము లుప్పొంగఁ బేరంటమునకు వచ్చె"[2]

1. పోతన చరిత్రము : 2-10
2. ,, ,, : 8-213

అనియు 'రాచసమ్మడి పూజాల పసిడిగిన్నెల పారాణి తెచ్చెను, గునుగు పూసార సాక్షి హారతులొసగెను, కట్ల పూలేమ కుంకుమబొట్టు దిద్దెను.... అలికులపతి గర్భ ధారణమాచరించెను." అని యిత్యాదిగా వర్ణించి మొక్కలలో స్త్రీల సాంసారిక జీవనమును భావించి తమ భవిష్యజ్జీవితవాంఛలను స్ఫురింపజేసికొనునట్లొనర్చుట మిగుల నవ్యమైనది. అట్లే శారద 'కంకణ కింకిణీక్వాణ ఝుణంకృతుల్ గిరక గానములకు స్వరములల్ల'1 అని నీళ్ళు చేదిన వర్ణన కావ్యములలో క్రొత్తదై ప్రకటించిన భావములు నిసర్గ రమణీయములై యున్నవి.

స్త్రీవర్ణనలో స్త్రీల కచకుచాద్యంగ సౌందర్యమునకంటె అంతరంగ సౌందర్యము, వారి ఉదాత్త గుణ శీలములు భావించి వర్ణించుట, సభ్యమైన సముచితమైన శృంగారమును పోషించుట నవ్యకవితాలక్షణము. కావ్యమున ఈ లక్షణము చక్కగా గోచరించుచున్నది.

కథా ప్రారంభమున లక్కాంబను సప్తపద్యములలో వర్ణించుట జరిగినది. అందామె ఉత్తమ గృహిణీ లక్షణములు 'సరస గంభీర నిర్మల విశాల సుధా మధురాంతరంగ భాసుర, నిర్విరామ కృషిశోభిత' అని యిత్యాదిగాగల ఉదాత్త గుణశీలములు, పాతివ్రత్యము, సాధుత్వము వర్ణింపబడెనేకాని ఆమె రూపరేఖా విలాసాది బాహ్య సౌందర్యము ప్రకటింపబడలేదు.

పరిణయవేళ నర్సమాంబ రూపరేఖలు వర్ణితములైనవి. ఆమె ముగ్ధయు నవ వధువును నగుటచేత బాహ్య సౌందర్యమే ప్రథమాకర్షకము కావున రూప వర్ణన కావింపబడినను అది మేర మీరలేదు. లజ్జాకరముకాక ఆహ్లాదకరము అగు నట్లు సభ్యముగా సమంజసముగా శృంగారము నిర్వహింపబడినది. వివాహాలం కృతయైన వధూవర్ణన మిట్లు చేయబడినది.

"ఆకృంగనపుఁ బచ్చియార్చు పెన్నెరులలో శృంగార వార్ధితరంగ మడరఁ
నెక్కొందగరువు చుక్కలు చిగురాకు తములమ్ములన్ లవంగములు పొదుగ
మృగనాభి పెండ్లిబొట్టుగ దిద్దు మోమునందవఁ బూర్ణ మృగాంకుఁ
దవతరింపఁ
జనుపుసాణి సొంపెసఁగు పాదాలలో లలిత రసాల శాఖలు చిగుర్ప
లేమ లావణ్య నందనారామ సీమఁ గంతుఁడెద పొంగ బంగారు బంతులాడ
సకియ సౌందర్య దివ్యోర్మ్యుదయంపుఁ బ్రేక్షకాక్షి దృఙ్మీనముల్
పెనఁగులాడ"2

1. పోతన చరిత్రము : 8-222
2. ,, : 2-243

ఇందలి భావములు ముఖ్యముగా యౌవనోద్గమయగు నామె కుచమండల రామ ణీయకమును యౌవన నందనవనములో మన్మథుడు హృదయముప్పొంగ బంగరు బంతులాడెనని వ్యంగ్యముగా స్ఫురింపజేసిన భావము సభ్యసముచిత శృంగారమున కెత్తిన పతాక.

పోతన దంపతుల సమాగమ శృంగారము సైతము అసభ్యము కాకుండ వర్ణించుట నవ్యతకు తిరుగులేని సాక్ష్యము.

"ఓ పున్నెపురాశీ! నా కనుల పున్నమవెన్నెల! రూపశీలసం
పన్నిలయంబ! నా హృదయ మర్మము దొంగిలు మారచోరుఁ బ్ర
చ్ఛన్నతఁ గొంగుమాటునిడి సెంకెడి దోషము సైఁపవచ్చునే?"

అని పోతన సతితో ననుటయు, వారి సంపర్కము గూర్చి,

"డోలత్ ప్రణయాంబుధిలోఁ దేలికఁ దేలాడు పూలతెప్పలగుచు వా
రాలోల లోకనమ్ముల సాలోక్యముఁ గనిరి పుష్పసౌరభగతులన్"[1]

అని సముదంచిత భావము వెలార్చుటయు దీనికి తార్కాణ. పూర్వప్రబంధము లలోనగుచో 'సహసా నఖంపచ స్తనదత్త పరిరంభ మామూల పరిచుంబితాధ రోష్ఠము'[2] అని గాటుగా సూటిగా వర్ణింపక విడిచెడివారు కారు.

విప్రలంభమునందును సహజమనోవ్యథ వ్యక్తము చేయబడినదే కాని గతానుగతికముగా చంద్రాద్యుపాలంభ శైత్యోపచారాదులు వర్ణింపబడలేదు. ఇది నవ్యకవితానురూప భావ సంపద్విలసిత కల్పన.

ప్రకృతిని మాతగా జగన్మాతగా భావించి వర్ణించుట యొక నవ్య కవిత్వ లక్షణము. ఆచార్యులవారు కావ్యమునందు దీనిని ప్రశస్తముగా పరిఢవిల్లజేసినారు. పాల్కురికి జాతరనుండి తిరిగి వచ్చెడివేళ కేసన మావితోటలో ప్రకృతి జగన్మాత యని పోతనకు ప్రబోధింప వర్ణించి చెప్పెను.

"ప్రకృతి మనకెల్లరకు మాత, పరమ పురుషుఁ
డగు మహేశ్వరుఁడే పితయనుచుఁ దెలియు"[3]

---

1. పోతన చరిత్రము : 3-244
2. మను చరిత్రము : 3-116
3. పోతన చరిత్రము : 1-180

"రవిసోములనెడి నేత్రము లొప్ప మన నెప్పుడొక కంటఁ గాంచుచు నుండు నామె
మబ్బు భాండము లెత్తి మధురోదకము వోయుఁ బర్వతోన్నత పీఠ పంక్తి వేయు
బహుధాన్యముల తీపి పాయసమ్ము నొసంగుఁ బండ్లజాతుల చిఱుదిండ్ల నిడును
దాపులన్ వెదజల్లు పూవుగిన్నెల నింపి కమ్మ తేనియ పానకమ్ము లిడును
మహి యనెడి స్త్రీయవక్షోజ మండలమున నూరు జీవనమ్ములఁబాలు ధారవోసి
యడిగినవి యెల్ల నొసఁగి యీ యఖిలభూత సంతతిని రొమ్మునకుఁ గట్టి సాకుఁ బ్రకృతి"[1]

అనియు ఆ ప్రకృతి లాలన పాలన చేయు తీరును, ప్రాణుల శ్రేయస్సునకై ఆయా ఋతువులలో పరితపించు విధమును రమణీయముగా భావించి చెప్పెను. ఈ వర్ణనలో ఆచార్యులవారు విశ్వ విశాల భావములను వెలార్చి ప్రకృతిమాతను బాగుగా ప్రస్తుతించినారు.

నవ్యకవితలో ఆర్ద్ర భావములకు ప్రాధాన్యమిచ్చుట యొకటని మనవి చేసితిని. పోతన చరిత్రములో నే వర్ణన, యే సన్నివేశము తిలకించినను నట్టి చక్కని భావములకు నెలవై చెలువు గులుకుచుండును. శ్రీనాథుడు రాచకొండ నగర సౌధముల నిట్లు వర్ణించెను.

"మలతలన్ గల ధౌతమృణ్మయ మంజు సౌధగణాకృతుల్
తలఁ దెంగెడి మల్లెమొగ్గల దండలై విలసిల్లునో
నిలిచిపోయిన నీలనీరద నీడమునఁ బొలుపారుచున్
చలనమందక చెల్వుగుల్కెడి చంచలాకృతులంచలో"[2]

ఈ సౌధ వర్ణనలో పూర్వ ప్రబంధములలోవలె కృత్రిమ కల్పన కాని ఊహా జగద్విహారము కాని లేక పర్వతసానువుపై ప్రకాశించు తెల్లని మేడల వరుసలు మల్లెమొగ్గల దండలవలెను. హంసలవలెను తోచునని చక్కని యుత్ప్రేక్షతో

1. పోతన చరిత్రము : 1-183
2. ,, : 4-9

సంభావించి చెప్పుట సహజరమణీయముగా నున్నది. ఇట్టి భావసంపదచేత కావ్య మంతయు కనకమై తనరారుచున్నది.

శివుని యెదుట చెలువులు గులికెడి మోహినిని వర్ణించిన పట్టున వెలయించిన భావన యెంత మధురముగా మనోహరముగా నవ్యతా బంధురముగా నున్నదో తిలకించ వచ్చును.

"అందాల ఫాలమ్మునలమి పైఁ బైఁబడి
ముద్దులు గొనవచ్చు ముంగురులును
కౌఁగిలింపఁగ వచ్చు కనురెప్పలన్ లజ్జఁ
బెనఁగులాడెడి సోగకనుల జంట...."[1]

పద్యమెల్ల నిట్లే హృద్యమై యున్నది.

ఉపమానోపమేయ ద్రవ్యములు ప్రకృతి ఒస్తువులవలె సనాతనములనియు వానికి ప్రాతక్రొత్తలు లేవనియు వాని నుపయోగించి వర్ణించెడి తీరులోనే నవ్యత ననలెత్తుననియు వెనుక మనవి చేసితిని. పోతనతో సంభాషించెడి పుష్పలావిక ఆనంద స్ఫూర్తి యిట్లు వర్ణింపబడినది.

"అనుట లాయెమ్మెలాడి తానతనిఁగాంచి మధురదరహాసములు మొల్ల మాలలల్ల
దాడిమఫలాల గిల్ల నేత్రములు చలువ కలువ పూరేకులన్ జల్లఁ బలికె నిటుల"[2]

ఇక్కడ నవ్వులను మొల్లలతో, దంతములను దానిమ్మ గింజలతో, కనులను కలువలతో పోల్చుటచేత సాంప్రదాయికత, ఈ యుపమానములతో చమత్కారముగా ముద్దుగా ముఖవికాసమును సాక్షాత్కరింప జేయుటలో నవ్యత అలరారుచున్నవి.

నవవధువగు నర్సమాంబను పెండ్లిచవికె వద్దకు కొంపోవ 'కన్నులను వెన్నెలలుగాసె....' అన్న వర్ణనలో పూర్వోపమానములను ప్రయోగించి చెప్పుట లోనే కాక అంగ సౌందర్యమున కంటె అంతరంగములోని లజ్జామోదముల స్థితిని వర్ణించుటలో నవ్యత చెలువులొలుకు చున్నది. పేదజవరాలి సొగసును వర్ణించుచు

1. పోతన చరిత్రము : 11-124
2. ,, : 4-37

"....పికులు గుత్తపుఱవికలోఁ జికిలిసేయు
మరుకటారియై మెఱసెడి మగువ వయసు"[1]

అని భావించుటలో, సాధారణముగా స్త్రీని మరుకటారి, మిటారి యనుట సంప్రదాయము కాని గుత్తపు రవికలో మెరుగువెట్టు మరుకటారియని వక్షోజములను వ్యంగ్యముగా సభ్యముగా స్ఫురింపజేయుటలో నవ్యత మెరయుచున్నది.

మరియు పేదజవరాలిని వర్ణించుచు "చక్కని నాగుగున్నలన సౌరిడ బాహులు...."[2] అనుటలో బాహువులను తామర తూండ్లతో, తీగలతో నుపమించుట కవిసమయమై యుండ నిచట నాగుగున్నలతో పోల్చుటచేత ఔచితీమంతమైక నవ్యోపమానము భాసిల్లినది. ఆ జవరాలిరూపు "మాసి మడత విడిన మరు పట్టు పుట్టము"[3] అని యుపమించుటయు నవ్యతా కలితమైయున్నది.

శ్రీనాథుడు కేసనతో కవి మాహాత్మ్యము వర్ణించుచు 'మండిత సత్కళాగగన మందిరుఁడున్' అను పద్యమున మహాకవి యగుటయే గొప్ప యనియు, తక్కిన విద్యలు ధనములు వ్యర్థములని 'పాదరసమ్ములు సొమ్ము లిమ్మహిన్'[4] అనును. చంచలములగు సొమ్ములను- సంపదలను- మెరపులతో పోల్చుట సంప్రదాయము. ఇక్కడ పాదరసముతో పోల్చుట నవ్యముగా నున్నది. ఇట్టి యుపమాన ద్రవ్య నవ్యత అందము కందళించి అందగించుచున్నది. ఈరీతిగా బీద జవరాలిని వర్ణించినను భిక్షుకుని వర్ణించినను కాపులను చిత్రించినను గోపులను చిత్రించినను నిసర్గ రమ్యభావములు నిండుగా నెగడుచు నవ్యతను నాణెముగా మెరయించుచున్నవి.

## శైలీ నవ్యత :

పూర్వకాలములో ముఖ్యముగా క్షీణయుగ ప్రబంధములలో గన్పడు శైలిని నిరసించి దిగువవిధమైనశైలి నవ్యకవితలో విరాజిల్లుచున్నది.

1. అనవసర పదముల ఆడంబరము తగ్గించినది.

---

1. పోతన చరిత్రము : 2-79
2. ,, : 2-77
3. ,, : 2-78
4. ,, : 2-222

2. గర్భబంధ చిత్ర కవితలను మానినది.

3. సాంస్కృతిక పదబంధములను, దీర్ఘసమాస జాటిల్యమును విడిచినది.

4. నిఘంటువులలో నిద్రపోవుచు వ్యవహార ప్రథ గాంచని పదములను పరిహరించినది.

5. సంస్కృతాంధ్ర సరణ పదప్రయోగముతో-శైలీసారళ్యముతో రచన సాగినది. ఏవంవిధ శైలీ నవ్యతను పోతన చరిత్రము సాంప్రదాయిక రచనతో పాటు చక్కగా సమ్మిళితము చేసికొని యొప్పుచున్నది ఇట్టి నవ్యశైలికి అనేకానేక భాగము లుదాహరణీయములు [1]

కావ్యము ప్రబంధమగుటచేత వస్తుతః ప్రాబంధికశైలిగలది. కాగా, శైలీ విషయ మపప్రథకులోనైన ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యము వంటిది కాక యీ కావ్యము మనుచరిత్రము పారిజాతాపహరణము వంటి ప్రబంధముల సాదృశ్యమును గాంచినది. కావున కావ్యగౌరవమును, సన్నివేశ పాత్రౌచిత్యమును, వృత్తౌచిత్యమును దృష్టియందిడుకొని ప్రయోగించిన సాంస్కృతిక పదబంధములు, దీర్ఘసమాసములు, ఓజోగుణముచేత నటనట ప్రౌఢిమ భ్రాజిల్లుచున్నను జాటిల్యము కౌటిల్యము కానరాదు. తక్కిన సన్నివేశములందు తరచుగా ప్రసాద మాధుర్య సౌకుమార్యగుణ విరాజితమై వైదర్భీరీతిని సాగి ద్రాక్షాపాకమున చవులూరించు చున్నది. ఎక్కడను అనవసర పదాడంబరము కానరాదు. గర్భ బంధాది కవితలు మచ్చునకైనను లేవు. పదములన్నియు సుప్రసిద్ధములై సజీవములై సంస్కృతాంధ్ర శబ్దసమ్మిళితములై సముచిత సారళ్యమును సంతరించుకొనియున్నవి.

"కన్నుల కాటుకల్ మరుని కత్తుల సానలుఁబట్ట నవ్వులున్
వెన్నెల వన్నెలన్ జిలుక వేనలి వ్రేలెడి పూలమాలలో
మిన్ననఁ దారకల్ విరియ మించుల యంచుల యంబరమ్ములోఁ
బున్నమ చంద్రబింబమనఁ బొల్తుక తా ననవిల్తుకొమ్మయై."[2]

1. 'భాషావైచిత్రి' వ్యాసమున ఈ విషయము కొంత వివరింపబడినది.
2. పోతన చరిత్రము : 3-218

పతిసమాగమవేళ నర్సమాంబ సమలంకృతయైన విషయమును వర్ణించిన యీ పద్యము శైలి పైన దెల్పిన పొల్పున నవ్యతా విరాజితమై యున్నది.
ఇట్టివే

"విందగు యౌవనమ్ము వలపించెడి చక్కదనమ్ము...." (4-24)
రసభావ జలధిలోఁ గొసరి మున్కలువేసి దరిముట్టి జాతిరత్నాలుదెచ్చు"
(4-334)
"కలశపాథోరాశి క్రాఁగు పొంగును ద్రోసి యురికివచ్చిన పాలనురువు
వేమొ (5-45)
"కొమ్మలు చామరమ్ములిరుగోనల వీచుచునుండి...." (5-52)
వంటి పద్యము లెన్నియో శైలీనవ్యతకు పేర్కొనవచ్చును.

## పదప్రయోగము:

నవ్యకవితలో పదప్రయోగమనగా నవ్యపదప్రయోగము కాదు. పదము లనావి సిద్ధములు. పదములను ప్రయోగించుటలో నవ్యతయని ఇక్కడ అర్థము. ఈ నవ్యత వ్యవహారభ్రష్టములై అర్థవిపరిణామము నొందిన 'కంపు' వంటి పదములను వాడకుండుట, 'మానుగ,' 'ధరలో' వంటి పాదపూరణ పదములను పరిహరించుట, శిష్ట వ్యావహారిక పదప్రయోగము కావించుట యను వానిలో భాసిల్లును. ఈ మూడు లక్షణములలో మొదటి రెండు లక్షణములకు కావ్యమెల్ల లక్ష్యమే. మూడవదగు శిష్ట వ్యావహారికమును ఇంచుమించుగ పాటించలేదు. ఈ విషయమున కావ్యము వస్తు రచనల దృష్టితో సాంప్రదాయికతనే పాటించినది. ఐనను క్వాచిత్కముగా 'సెబాసు', 'మఖుమలు' వంటి అన్యదేశ్యములను, 'మారాజులు', 'వెడ్డిదాన' 'బెక్కొను' వంటి మాండలికములను ప్రయోగించుట వల్లను, 'కనతల్లి' వంటివి ఒండు రెండు చోటుల వ్యాకరణ నియమము పాటింపక స్వతంత్రించి ప్రయోగించుటవల్లను, 'బొమ్మెర', 'వేంకటరెడ్డి' వంటి విలక్షణ పదములను ప్రయోగించుటవల్లను కొంత నవ్యత యొప్పుచున్నది.

## ఆత్మాశ్రయ కవిత :

నవ్యకవితా లక్షణములలో ఆత్మాశ్రయ కవిత యొక్కటి. కవి కావ్య వస్తువు నాశ్రయించి నాయికా నాయకాది పాత్రల యాలంబనముతో సన్నివేశముల

కనుగుణముగా అభిప్రాయములను వ్యక్తీకరించుచు రచన సాగించినచో నది వస్త్వాశ్రయ కవిత యగును. అట్లుకాక కవి కథ నాశ్రయింపక తానే ఆలంబన విభావమై స్వీయ వ్యక్తిత్వముతో తన సుఖ దుఃఖాద్యనుభూతిని ప్రకటించుచు రచించిన నది ఆత్మాశ్రయ కవిత యగును. పూర్వకావ్యములు దాదాపు వస్త్వాశ్రయ కవితానిబద్ధములే. శతకములందు మాత్రము ఆత్మాశ్రయ కవిత కన్పించును. పోతన చరిత్రమొక కథాకావ్యమై నాయికా నాయకాది పాత్రల ముఖమున భావ వ్యక్తీకరణ జరిగి సాగిన రచన కావున నిందు వస్త్వాశ్రయ కవిత వరలి సాంప్ర దాయికత నిండియుండగా అక్కడక్కడ కొంత ఆత్మాశ్రయ కవితాచ్ఛాయలు పొడసూపి నవ్యత ననలెత్తియున్నది. పోతన్నకు అభినవ పోతన్నకు చిత్తవృత్తిలో సామ్యమున్న భక్తి జ్ఞానాది విషయములను వర్ణించినప్పుడాత్మాశ్రయ కవితగా జాలువారినవి. భక్తి తన్మయతతో పోతనచేత చెప్పించిన భావములు పోతనతో తాదాత్మ్యము భజించిన వరదాచార్యులవారి స్వీయభావములే.

పోతన శ్రీరామచంద్రుని వాగ్దేవిని వినుతించిన ఘట్టములలో తాత్త్వికబోధ చేసిన సన్నివేశములలో ప్రకటించిన భావములు ఆత్మాశ్రయ కవితా విలసిత ములై యున్నవి. అట్లే తెలుగునాటి జాహ్నవిగంగా వర్ణన, పోతనచేసిన సింగ నృపతి వనవర్ణన, ఆసన్న మరణవార్త తెలిసిచేసిన మాతృప్రస్తుతి, బమ్మెర గ్రామసీమా వర్ణన, ఆయా సందర్భములందు పోతన కేసన శ్రీనాథులు చేసిన కవి పండిత ప్రశంసలు, విరక్తుడై యాత్రలలో చేసిన క్షేత్ర దైవత స్తుతులు, ఋతువర్ణనలు, దీనభిక్షుకాది వర్ణనలు, భోగినీ నృత్యవర్ణన మున్నగునవియు ఆచార్యులవారి స్వీయాభిప్రాయములచేత చెలువొందిన వగుటచేత నవి యాత్మా శ్రయ కవితలై నవ్యత శోభిల్లుచున్నది.

## దేశి కవిత :

మార్గ దేశి కవితా విభాగములలో మాత్రాచ్ఛందో విరాజితములైన రగడలు (గేయములు), కీర్తనలు, యక్షగానములలోని దరువులు మరియు ద్విపదలు దేశి కవితకు చెందినవి. దేశికవిత నవ్య కవితాలక్షణ విశిష్టమైనది. పోతన చరిత్రము తొంబదిపాళ్ళు మార్గకవితానుసారియై సాంప్రదాయికతను పోషించి మిగిలిన యంశము దేశికవితకు తావిచ్చి నవ్యతను కొంత భాసిల్ల జేసినది. కావ్యమున

దేశికవితలగు। మంగళమహశ్రీ వృత్తమాల (రగడ), రగడభేదములగు 5 ఉత్కళికలు, 1 కళిక, 1 ఆదితాళగీతము, 1 త్రిపుట తాళగీతము, 1 తోహర ప్రయుక్తములైయున్నవి [1] ఇందలి కళికోత్కళికలు లక్షణ విషయమున కొంత స్వేచ్ఛ పాటించుట మరికొంత నవ్యతకు తార్కాణ. ఆంధ్ర కావ్యములలో ప్రయుక్తము కాని మహారాష్ట్రచ్ఛందస్సు 'తోహర'ను పోతన చరిత్రమున వాడుకచేయుట అతి నవ్య విషయము.

## భావ కవిత్వము :

నవ్యకవితోద్యమములో తొలుత వెలసిన భావకవిత్వము, దాని శాఖలగు ప్రణయ కవిత్వము, దేశభక్తి కవిత్వము, ప్రకృతి కవిత్వము, సంఘ సంస్కరణ కవిత్వము, భక్తి కవిత్వము, స్మృతి కావ్యములు- అనునవి పోతన చరిత్రమున సముచితముగా సంతరింపబడి నవ్యత వెలుగొందుచున్నది.[2]

కేసన మావితోటనిట్లు వర్ణించెను.

"పసిడి ముద్దకు భోజ్యభాగ్యమ్ము గలిగింప రసము లూరింపరసికుఁడెవఁడో
గరుడపచ్చల కొమ్మకై మెచ్చి విరులవీవనలిచ్చి విసరించు ప్రభువెవండో
వరప్రవాళములఁ గప్రపుతమ్ములు మొనర్చి పికభామిని కొసంగు
ప్రియుఁడెవండో
ముత్తెంబులన్ బాలగుత్తులుగాఁ గూర్చి ధరసేసజల్లు భూధవుఁడెవండో
ఫలము సరసతఁగని పయింబడి శుకమ్ము పువ్వునవ్వుకు భ్రమియించి
పోవుఁదేటి;
పల్లవపు రాగమును రక్తిఁబాడుఁబికము; ఈ రసాలమున్ ప్రేమనెవ్వారు
గనరు"[3]

వస్తు భావరచనలలో భావమునకు ప్రాధాన్య మొసగు భావకవిత కీ పద్యము చక్కని యుదాహరణము. ఇట్టివే భోగిని నృత్య ఘట్టమునందు భోగిని విప్రలబ్ధయగు రాధికగా నభినయించుచు యమునా తీరమున కృష్ణుని పిల్చుచు దిగువ భావములు ప్రకటించెను.

1. ఈ దేశిరచనల గూర్చి 'ఛందోవిశేషము' వ్యాసమున వివరించుట జరిగెను.
2. భావకవిత్వము 'కవితాతత్త్వము' వ్యాసమున కొంత చర్చింపబడెను.
3. పోతన చరిత్రము : 1-169.

"గాయక శిరోమణీ! పికాగ్రణి! విశాల విమల యమునా తరంగిణీ వీచికలను
బంపు సందేశ రూపక ప్రణయగీతి రాగవేగమ్మునకు గుండెలాగలేవు"[1]

''యమున నీటికై యాఘటమ్మరుగదెంచి నీదు రాగామృతమ్ముతో
నిండిపోయె

దీని మోయగా నేను నాలోనలేను పత్తువే దీని నెత్త నో వన్నెకాండ!"[2]

ఇట్లే యిక్కడి యైదు పద్యములందు ప్రణయ భావతీవ్రత సువ్యక్తమైన భావ కవిత ప్రణయ కవితా శాఖకు చెంది యందగించుచున్నది. ఇదే విధముగా పోతన విరహతప్తుడై చేనిలోను ఇంటియందును తలపోసిన మధుర భావములు ప్రణయ కవితా విరాజితములై యున్నవి.

దేశభక్తి కవిత్వమునకు

"ఓరుగల్ కోటలో నొకగంట నిలిచిన నాంధ్రుల పౌరుషం బర్థమగును"[3]
అని పోతన వర్ణించిన ఓరుగల్లు వైభవాదుల విషయము నిదర్శనమై యున్నది.

ప్రకృతి కవిత్వమునకు కావ్యము నితాంతము భావ్యమైయున్నది. బమ్మెర గ్రామసీమా వర్ణనము, మావితోట వర్ణనము, శ్రీనాథ పోతనల వనవర్ణనలు, నదీ పర్వత వర్ణనలు, ఋతు వర్ణనలు, చక్కని లక్ష్యములై యలరించుచున్నవి.

సంఘ సంస్కరణ కవితకు వేశ్యలు వ్యభిచార వృత్తి మాని పెండ్లిండ్లు చేసికొని యితర వృత్తులచేత గౌరవముగా జీవించవలెనని భోగిని యుద్బోధ చేసినది దృష్టాంతము. మరియు భోగిని తల్లితో,

"సురనామ మూని యసురకృత్యముల రేపి సేవించువారిని జెరుపు
చుండు...."[4]

అని చేసిన మద్యదూషణమువలన మద్యపానము తగదను ప్రబోధము చేసినదియు, శ్రీనాథుడు తన తల్లితో

1. పోతన చరిత్రము : 4-298
2. ,, : 4-301
3. ,, : 9-78
4. ,, : 4-208

"ముదుకఁడన్ నాకండ్ల ముందు గావలెనంచుఁ
వసిపాప కొనరించుఁ బరిణయమ్ము...."[1]

అని మొదలుగా చెప్పినవి బాల్య వివాహములు, కన్యా శుల్కమాశించి పసిపిల్లలను వృద్ధుల కంటగట్టు వివాహములు పనికిరావను సందేశము నొసగునదియు సంఘ సంస్కార కవితలై యొప్పారుచున్నవి.

భక్తి కవిత్వమునకు కావ్యమున భక్తితత్త్వ సన్నివేశములందు వెలువరించిన కవిత నిదర్శనమై నెగడియున్నది.

'స్మృతి కావ్యములు' అను శాఖకు చెందిన కవిత పోతన చరిత్రమున రవంత కనబడుచున్నది. శ్రీనాథుడు భార్యావియోగము నొంది పోతన యింటికి సూతును తోడ్కొని వచ్చి గతించిన సతిని స్మరించి దుఃఖించిన పట్టున నిది పొడ సూపుచున్నది.

ఈ విధముగా కావ్యమున భావకవిత్వము, దాని శాఖలు యథావకాశముగా వ్యాపించి నవ్యశోభలను విరజిమ్ముచున్నవి.

## అభ్యుదయ కవిత్వము :

సామాన్య హాలికుడు, ప్రజాకవి, రాజులను ధిక్కరించిన విప్లవకవి యగు పోతనగారి చరిత్రమునందు ప్రజాసామాన్యమునకు, కర్షక కార్మికులకు, దరిద్రులకు, భిక్షుకులకు సంభవించు కష్టనష్టములను వర్ణించి వారి దీనహీన స్థితిగతులకు పరితపించి వారి శ్రేయస్సును కాంక్షించు అభ్యుదయ కవిత అందందు పొందింపబడియున్నది.[2] పేదజవరాలి కథ, దీన భిక్షుకుని యుదంతము, కరవుకాలమున కడగండ్ల ముండ్లలో పొరలిన నిరుపేదల కన్నీటి గాథలు కావ్యమున అభ్యుదయ కవితకు నెలవులైనవి.

కరవులో బిచ్చగాండ్రెగబడిన దుర్భరదుస్థితి పేదల హైన్యము హృదయ ద్రావకముగా నిట్లు వర్ణింపబడినది.

1. పోతన చరిత్రము : 2-209
2. నవ్యకవితా విభాజితమగు ఈ అభ్యుదయ కవిత గురించి 'కవితాతత్త్వము' వ్యాసమున కొంత చర్చింపబడెను.

"తేలిన యెముకల గూఁడుల వ్రేలఁగ బేలికలు గ్రుడ్లువెడలి క్షుధాగ్నిన్
గోలెడి యసువుల నిట్టటు నాలోకించెదరు బీదలల పుల్లెలకై"[1]

" మూఁకలై పొంచి దొంగిలు కాకులపయి
గురుగురు మఁటంచు నాకెడు కుర్కురముల
జేఁత జాఁత గొట్టుచు లాగి చింపుకొనుచుఁ
బొరిగఁ గలహింతురెంగిలి పుల్లెలకయి"[2]

ఇట్టి దీనుల దురవస్థగాంచి పోతన

"అపరాని దరిద్ర దుఃఖాశ్రు నదుల గండివడు నీతులను జాతికట్ట లెన్నొ
మండుటాఁకలి డొక్కల మంటకొడులఁ
దప్పుకొనలేక మసియైన ధర్మమెంతొ"[3]

అని దరిద్రుల ఆకలి కేకలను ప్రతిధ్వనింపజేసి పరితపించెను.

ఇక లోభిసెట్టిచేత కొట్టబడిన భిక్షుకుని

"తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి గొంగడిలో శని గూరుచుండి"[4]

అని ఇత్యాదిగా రూపుగట్టిన దైన్యము కనుల గట్టింపబడినది.

మల్లన శ్రీనాథునితో పలికిన దిగువ వాక్యములు రైతు విలువకు, శ్రమ మూల్యమునకు అద్దము పట్టుచున్నవి.

"హాలికు నుదుటిపైనలరఁ జెమ్మటజాలు పాలకునుదుట ముత్యాల చాలు
మడిదున్ను హాలికు మైజిల్లు పంకంబు మన్నియమై వెల్గు మలయజంబు
బడుగు హాలికుచేతి పశుపతిత్వ సమృద్ధి భూపాలుచేతి ప్రభుత్వ సిద్ధి
అదరు క్షామ మడంచు హాలికు హలవృత్తి క్ష్మాపతి రిపుఁ గూల్చు ఖడ్గశక్తి
హాలికుఁ డొనర్చు భోజ్య పదార్థసృష్టి జనవిభుని రాజ్యధనకోశ కనకవృష్టి
నరపతికి రైతు కోట పునాది గుండు ఏలికలకును నేలిక హాలికుఁడు"[5]

ఇంతేకాక పోతన ప్రౌఢ దేవరాయల చమూపతితో పలికిన దిగువ మాటల వలన ప్రజాబలమె గొప్పదనియు, ప్రజలను పీడించిన రాజునకు పతనము తప్పదనియు విశదమై ఇది నేటి ప్రజాస్వామిక వ్యవస్థా ప్రాధాన్యమును బలపరచుచున్నది.

1. 2. పోతన చరిత్రము : 5-143, 144
3. ,, ,, : 5-228
4. ,, ,, : 5-233
5. ,, ,, : 8-18

"చలన మెరుఁగని యీ ప్రజాస్థానమందు
దొరలు పైనుండి క్రిందికి దొరలుచుండ్రు
చుక్కలేవేళ క్షతిలేక చూచుచుండ
శశి కళాభంగ మొందుచుఁ జను సతమ్ము"[1]

"ఇగురుచవచ్చుఁ బాదపము లెప్పటియట్లె కుఠారధారలన్
దెగియుఁ దరుప్రకాండ మతి తీవ్రమహోగ్ర ప్రవాహవేగ ప
న్నగహతిచే సమూల పతనమ్ముగనున్, నృపపీడనన్ ప్రజల్
నెగడుదురెట్లొ రాజెటులనెగ్గుఁ బ్రజాశ్రుప్రవాహ ధాటికిన్''[2]

దుర్మదాంధులైన రాజుల దుష్ట నిరంకుశ పరిపాలన దుర్భరమైనప్పుడు ప్రజలు తిరుగుబాటు చేయుదురన్న భావము గ్రీష్మ ఋతువునందలి మోదుగుచెట్ల వర్ణనలో నిట్లు వెలార్చబడినది

"కాలాగ్ని ప్రతిభాసమాన జఠరక్ష్మాపాల దుష్పాలనా
భీలక్షుద్ధ నిరంతరజ్వలిక హృద్వీథుల్ వెలార్చెన్ బ్రజా
జాలమిట్లన నీ పలాశ సుమనస్సంఘాత కేతుచ్ఛటా
జ్వాలాతోరణ కారణమ్ము ఋతు వైప్లవ్యమ్ము సాధించెడిన్[3]

ఈ విధముగా ఆయా సందర్భములందు అభ్యుదయ కవితా ధోరణి కావ్యమున ప్రతిబింబించి నవ్యత రాజిల్లుచున్నది. 'కవితా తత్త్వము' వ్యాసమున వివరించినట్టు కావ్యమునందలి యభ్యుదయ కవిత హింసాధ్వంస మార్గము వలన విప్లవము ద్వారా కాక శాంతియుత పద్ధతుల ద్వారా సమాజ శ్రేయస్సును పీడిత జనుల ప్రగతిని కాంక్షించుచున్నది. ఈ రీతిగా యథావకాశముగా సందర్భోచితముగా నూతనాంశములను ప్రవేశపెట్టియు ఆధునిక కవితారీతులను అనువర్తించియు ఆచార్యులవారు కావ్యమున నవ్యతను విభాసిల్లజేసినారు.

కావ్యమునందలి యీ సాంప్రదాయికతను నవ్యతను పరిశీలించియే డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు

"మొత్తము కావ్యము ఆధునికాంధ్ర మహాకవితా శైలికి చక్కని యుదాహరణ" మనియు, ''పరంపరాగతమైన కావ్య సంప్రదాయములను జీర్ణించుకొని

1. 2. పోతన చరిత్రము : 9-122, 128
3. ,, : 7-42

సమకాలీన ప్రజాజీవితమును సూత్రప్రాయముగా వ్యాఖ్యానించుచు వర్తమానాంధ్ర కవి సార్వకాలిక మానవత్వపు విలువలను పాటించుచు రచించిన మహాకావ్య మీ పోతనచరిత్ర"[1] మనియు వినుతించియుండిరి.

కావ్యమునకు తొలిపలుకు వ్రాసిన ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారు "నవ్యతాశోభితమయ్యుఁ బ్రాచీనతా పరిమళముల గుబాళింపులఁ జిక్కిలించిన యాధునికాంధ్ర మహాకావ్య రత్నములలో శ్రీ వానమామలై వరదాచార్యులవారి పోతనచరిత్రమొకటి''[2] అని కొనియాడిరి.

డా॥ బూర్గుల రామకృష్ణరావుగారిట్లు అభిప్రాయపడిరి.

"వరదాచార్యులవారి పోతనచరిత్ర కొత్తపాతల మేలుకలయికలతో శోభిల్లు చున్ననూ ప్రాచీనమార్గము ననుసరించిన యాధునికాంధ్ర మహాకావ్యములలో రత్నము వంటిది"[3].

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిట్లు ప్రస్తుతించిరి.

''.... ఈనాడు తెలుగు కవులలో వారిది విశిష్టమైన వ్యక్తిత్వము. ప్రాచీన అధునాతన సాహితీపరులకు సర్వవిధాల మధ్యవర్తిగా నుండదగిన కవిశిరో మణులు శ్రీ ఆచార్యులవారు"[4].

శ్రీ అంగీరసగారు కావ్యమును పత్రికాసమీక్ష చేయుచు, ''శ్రీ వరదా చార్యులుగారు ప్రాచీన సంప్రదాయానికి చెందినా నవ్యకవిత్వ పద్ధతులపై అనా దరణ చూపకుండా, ఆ పద్ధతులనుకూడా మేళవించి దీనికి క్రొత్తదనాన్ని చేకూర్చారు"[5].

వ్యాసమున సోదాహరణముగా చర్చించినదాని ననుసరించియు, పండిత విమర్శకుల యభిప్రాయముల వల్లను పోతన చరిత్రము సాంప్రదాయికతను నవ్యతను చక్కగా మేళవించుకొని సమన్వయరీతిలో విశిష్టముగా వెలసిన మహా కావ్యమనుట యుక్తము.

1. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి ఈ యభిప్రాయములు విపులముగా ''కవితా తత్త్వము" వ్యాసమున నుటంకింపబడియున్నవి.
2. 'తొలిపలుకు' పుట 1. (పోతన చరిత్రము)
3. పండితాభిప్రాయములు : పుట 79.
4. ,, : పుట 84.
5. గ్రంథసమీక్ష-ఆంధ్రపత్రిక (వార) తేది : 29-11-1938.

# పూర్వాధునిక కవి ప్రభావము

## ప్రస్తావన :

కవి ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములచేత కావ్యము రచించుననియు కావ్య హేతువగు ఈ త్రికమునందలి వ్యుత్పత్తి లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణము వలన సిద్ధించుననియు మమ్మటుడు తెలిపెను.

కావున కవులు వ్యుత్పత్తి కోసము లోకవృత్తమును, శాస్త్రములను మహా కవుల కావ్యములను క్షుణ్ణముగా అధ్యయనము చేయుదురు. మహాకావ్య పఠనము వలన ఆయా మహాకవుల ప్రభావ ముద్ర కవిపై అవశ్యముగా అనివార్యముగా పడును. అన్ని క్షేత్రములందు వలెనే సాహిత్యక్షేత్రమునందును తమ పూర్వులు సమకాలికులునగు మహనీయుల ప్రభావము పడుట సహజము.

గోవు నానావిధ పుష్టికర గ్రాసము మేసి కమ్మని పాలిచ్చునట్లు కవి పూర్వాధునిక కవుల కావ్యములను ఎంత పఠించి ఆయా రీతుల నవగాహనము చేసికొని తనలో జీర్ణించుకొనిన నంత సామర్థ్యముతో చక్కని కావ్యములను రచింప గలడు. ఈ అన్యకవి కృతుల పఠన పరిశీలనముల వలన వారి ప్రతిభా వ్యుత్పత్తులచేత ప్రభావితుడై తాను వారివలె కృతులు రచించుటలో కొంత పోలిక, అనుసరణము పొందినవాడు కాకతప్పదు. ఈ సామ్యమునకు హేతువులు దిగువ రీతిగా చెప్పికొనవచ్చును.

1. సంప్రదాయానుసరణము.
2. మహాకవుల నాదర్శముగా గొనుట.
3. మహాకవుల యెడగల ఆదరాభిమానములచేత వారి కవితారీతుల ననుసరించుట.
4. యాదృచ్ఛికముగా సాదృశ్యము వచ్చుట.

వీనిని కొంత వివరింతును.

పరంపరగా వచ్చు మతధర్మ సాంఘిక సంప్రదాయములలో గాని కావ్య సంప్రదాయములో గాని గల మేలిమిచేత ఆకర్షితుడై కవి దానిని కావ్యమున

ప్రతిష్ఠించుటలో పూర్వకావ్యానుసరణము జరుగును. మహాకవులు యుగకవులగు వాల్మీకి వ్యాస కాళిదాసాదులను గాని నన్నయ తిక్కన పోతన పెద్దనల వంటి వారిని గాని ఆదర్శముగా గ్రహించి వారివలె ఉత్కృష్టమైన మహా కావ్యములను ప్రశస్త పద్ధతులలో రచింపవలెనను మహాశయ మేపారుటవల్ల తదీయానుసరణము గోచరించును. ఆయా మహాకవుల యెడ ఆదరాభిమానములు గాఢమై వారి రచనా ధోరణులను పూజ్యభావముతో ననుకరించుటయు జరుగుచుండును. "సంవాదిన్యో మేధావినాం బుద్ధయః' అన్నట్లొకొక్కప్పుడు ప్రతిభావంతుల ఆలోచనలు, యాదృచ్ఛికముగా సాదృశ్యము గాంచుటయు తటస్థించును ఇది ప్రతిబింబాకార సంవాదము, ఆలేఖ్యాకార సంవాదము, దేహాంతరతుల్య సంవాదము అను త్రివిధ సాదృశ్యములలో కానబడునని వీనిని గూర్చి 'కావ్యానుబంధము భాగవత కథలు' అను వ్యాసమున వివరించుట జరిగెను. ఇట్టి పూర్వకవి ప్రభావము నన్నయాదులలో నెట్లు పొడసూపుచున్నదో సంక్షిప్తముగా చర్చింతును.

## నన్నయాదులపై పూర్వకవి ప్రభావము :

ఆంధ్ర కవులను గురించి ముచ్చటించుటకు ముందు ఒకరిద్దరు సంస్కృత కవులను గూర్చి పేర్కొందును.

ఆదికవి వాల్మీకిపై వైదిక వాఙ్మయము, ఋగ్వేదములోని ఉషస్సూక్తుల వంటి వానిలో గల కవిత ప్రభావము చూపినదన్నది ప్రసిద్ధము. వేదవ్యాసునిపైన వైదిక వాఙ్మయముతో పాటు రామాయణము ప్రభావము చూపినది. రామాయణ ప్రశస్తిని వైశిష్ట్యమును గాంచి ఆకర్షితుడై అధ్యాత్మ రామాయణము వ్రాయకుండ నుండలేకపోయెను. వైదిక ధర్మములకు, ఆర్ష సంస్కృతికి ఆలవాలములైన వాల్మీకి వ్యాసుల గ్రంథముల ప్రభావము కాళిదాసుపైన ప్రగాఢముగా గలదు. అతడు వాల్మీకివలె ఉత్కృష్ట కావ్యము వ్రాయదలచి రామాయణ మదివరకే యున్నందున దాని యాకర్షణచేత రఘు వంశమును సంతరించెను. రామాయణము లోని హనుమత్సందేశమును దృష్టిలో నుంచుకొని మేఘసందేశము రచించెను. శైవమత వాఙ్మయాకృష్టుడై కుమార సంభవము, మహాభారత ప్రభావితుడై శాకుంతలము రచించెను. సంప్రదాయానుసారియై ఈ మహాకృతులన్నియు వైదిక ధర్మకర్మముల యుపబృంహణార్థము వెలయించెను. ఇట్లే సంస్కృత మహాకవులపై పూర్వకవి ప్రభావము కానవచ్చును

ఆంధ్ర సాహిత్యమున ఆదికవి నన్నయ్య భారతాంధ్రీకరణమునకు ప్రబల ప్రభావము మూలమగు వ్యాసభారతము. మరియు తన భారత రచనకు అంతకు పూర్వమే కన్నడములో వెలసిన పంప మహాకవి విక్రమార్జున విజయ కావ్య మొరవడియైనదనుటయు కలదు.

తిక్కనమీద వాల్మీకి వ్యాసాదుల ప్రభావమే కాక నన్నయగారి ప్రభావము ప్రబలముగా గలదు. నన్నయను 'ఆంధ్ర కవిత్వ విశారదుడు, విద్యాదయితుడు, మహాత్ము' డని పూజ్యభావముతో స్మరించి అతడు ప్రారంభించిన భారతాంధ్రీ కరణమును ఆయన సాగించిన స్వేచ్ఛానువాద- కథానువాద- పద్ధతిలోనే దానిని సొంతముగా నిర్వహించెను. నన్నయవలెనే తిక్కన వైదిక ధర్మ వ్యాప్తికి కావ్య రచన నుపయుక్తపరచెను. తిక్కనగారి ఆచ్చిక రచనకు నన్నెచోడుని కుమార సంభవము మేలుబంతియైనది. నన్నయ తిక్కనల ప్రభావము నిండుగా ఉండి వారిద్దరి సమన్వయ కవితాధోరణులతో ఎఱ్ఱన ఆరణ్యపర్వ శేషము పూరించెను.

శ్రీనాథ కవిసార్వభౌమునిపై కవిత్రయమువారి ప్రభావము నన్నెచోడుని ప్రభావము కానబడును.

పోతనపై పూర్వకవుల ప్రభావము చాల కలదు. నన్నయగారు వాడుక చేసిన సంగీతానురూపమై ప్రసాద మాధుర్య గుణధుర్యమైన మధుర మంజులశైలి పోతన భాగవత రచనలో ఇంపుసొంపుల పెంపారినది. భక్తితత్త్వ విషయములో మూలమగు వ్యాసభాగవత ప్రభావముద్ర చెరగనిదై యుండనే యున్నది. పోతన రచనలో తిక్కనగారి రచనారీతులు కొన్ని చోటు చేసికొన్నవి. అతని భాగవత రచనలో ఎఱ్ఱన నృసింహ పురాణము, నాచనసోముని ఉత్తర హరివంశము ప్రభావము చూపినవి. అట్లే అంత్యానుప్రాస విభాసరచనకు భాస్కర రామాయణ రచన, కొన్ని వర్ణనారీతులకు పాల్కురికి సోమన బసవ పురాణ మొజ్జ బంతులైనవి.

పెద్దనగారిపైన పూర్వకవుల ప్రభావముద్ర పెద్దగనే యున్నది. నన్నయ ఎఱ్ఱన, శ్రీనాథుడు మున్నగు మహాకవుల కవితా రీతుల ననుసరించుటలో నిది గోచరించును. రామరాజ భూషణునిపై పూర్వకవులదే కాక సమకాలికుడగు పెద్దన ప్రభావము కూడ కాన్పించును ఇట్లే ఆయా మహాకవులెల్లరు తమ పూర్వ మహా కవులచేత ప్రభావితులై కృతులు నిర్మించినవారే. ఆదే విధముగా వరదాచార్యుల వారును పూర్వాధునిక మహాకవులనేకులచేత ప్రభావితులై పోతనచరిత్ర రచన చేసిరి.

## వరదాచార్యులపై ప్రభావముగల మహాకవులు :

ఆచార్యుల వారిపై ప్రభావము చూపినవారు పూర్వ మహాకవులు మరియు ఆధునిక మహాకవులు గలరు. ఇది ఆచార్యులవారు పోతన చరిత్రమున స్మరించిన సుకవులవల్లను, కావ్యము 'విజ్ఞప్తి'లో తెలిపికొన్న దానివల్లను, వారు స్వయముగా ప్రత్యక్ష సంభాషణలో తెలిపిన దానివల్లను, వైశాలినీ నాటక ప్రస్తావనవల్లను పండితాభిప్రాయములవల్లను పోతన చరిత్ర కవితా రీతుల పరిశీలనవల్లను విశదము కాగలదు. ఈ కవులలో తెలుగువారే కాక సంస్కృత కవులును, తదన్యభాషా కవులు కొందరును గలరని తెలియుచున్నది.

మహాకావ్య పీఠికలో సంస్కృత మహాకవులలో వ్యాసుని వాల్మీకిని కాళిదాసుని భవభూతిని ప్రత్యేకముగా స్తుతించుట జరిగినది. తదితరులగు, భారవి, మాఘుడు, మురారి, భాసుడు, శ్రీహర్షుడు, జయదేవుడు, అనంతభట్టు, భోజుడు ప్రస్తుతులైనారు. ఈ కవుల సరసనే 'విశ్వకవి రవీంద్రుండాది వివిధ భాషలందు నుతికెక్కు కవులకు నంజలింతు'నని వ్రాసినారు.

ఆంధ్ర కవులలో నన్నయ, వేమన్న, పోతన్న ప్రత్యేకముగా వినుతి గాంచినారు. తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, శ్రీకృష్ణదేవరాయలు, పెద్దన, తిమ్మన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన, కంకంటి పాపరాజు, మొల్ల, చేమకూర వేంకటకవి వినుతింపబడినారు.

ఆధునిక కవులలో సుప్రసిద్ధులైన మహాకావ్య కర్తలను, నవ్యకవులను, అభ్యుదయ కవులను, తెలంగాణ పండిత కవులను పేరుపేరున స్మరించి వినుతించుట జరిగినది. ఇట్లే పురాతనాధునాతన సుకవీంద్రు లందరిని భక్తి గౌరవముల చేత ప్రస్తుతించినంత మాత్రమున వారందరి ప్రభావము ఆచార్యులవారిపై గలదనియు వారి కవితా రీతులనుసరింపబడినవనియు చెప్పుటకు వీలులేదు. కాని వారందరి సత్కావ్యము లుపాదేయములే యనియు వారి ప్రభావము ప్రత్యక్షముగనో పరోక్షముగనో కొంత కొంత ఆచార్యుల వారిపై నుండి యొక సమన్వయ సౌగంధ్యము పోతన చరిత్రమున గుబాళించినదనియు ననుటకు వీలున్నది.

వైశాలినీ నాటక ప్రస్తావనలో ఆచార్యులవారు తమ కవితా రీతుల గూర్చి యిట్లు చెప్పికొనిరి.

"సరవి నన్నయ సమాసంబు శబ్దపుడంబు తిక్కనౌచిత్యంపు తెనుఁగుసొంపు
శ్రీనాథకవి ప్రౌఢసీసంపు హరువును పోతన వైదర్భి రీతి మురువు
రామరాడ్భూషణు రసరంజితశ్లేష పెద్దన జిగిబిగిఁ బెనఁగు భాష
చేమకూర కవీంద్రు చెలువౌ చమత్కృతి కూచిమంచి సుశబ్ద గుంఫనిరతి
కాళిదాస భావోపమా గౌరవంబు భవ్యభవభూతి కరుణ నిర్భర రసంబు
నవకవుల సొంపు నీచేత నాట్యమాడు సరస కవితా కళారవీ! వరద
సుకవి!"[1]

ఇందులో పోతన చరిత్ర పీఠికలో ప్రస్తుతించిన వారి పేర్లే స్మరింపబడినవి. ఒక్క కూచిమంచి తిమ్మకవి క్రొత్తగా చెప్పబడినాడు. ఈ ప్రస్తావనలో ఆయా మహాకవుల కవితా రీతులును పేర్కొనబడినవి. పూర్వకవులనే కాక 'నవకవుల సొంపు'ను మేళవించుకొన్న విషయము చెప్పబడినది. మహాకావ్య 'విజ్ఞప్తి'లో పోతనను, 'ఫిరదౌసి', కర్త జాషువను ప్రస్తావించుట జరిగినది. పోతన చరిత్రమునకు 'తొలిపలుకు' వ్రాసిన ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారిట్లు సెలవిచ్చిరి.

'కవిగారికి పూర్వాంధ్ర మహాకవులలో శ్రీనాథుడు, పోతన, బట్టుమూర్తి, చేమకూర వేంకట కవి మన్నగు వారి కవిత్వము నెడ నభిమాన మధికమని తోచును. ఈ కావ్యమున శ్రీనాథుని పద్యము లందలి ప్రౌఢ గంభీర గమనము, పోతన రచనయందలి మాధుర్య సౌష్ఠవములు, బట్టుమూర్తి కావ్యమందలి ధ్వన్యలంకార సౌందర్యము, చేమకూర వేంకటకవి కవిత్వమందలి శబ్దాలంకార చమత్కారము పుష్కలముగా గోచరించును.'[2]

కావ్యమునకు 'కవి-కావ్యపరిచయము' రచించిన డా॥ పల్లా దుర్గయ్యగారిట్లు తమ యభిప్రాయము ప్రకటించిరి.

'మహాకవి పోతన జీవిత కావ్యమునందు పోతన భాగవత కవితా వాతావరణమును కల్పించునుద్దేశముతో నీ కవి పలుతావుల నిట్టి శైలి నవలంబించెను, ఇతర ప్రాచీన కవులలో శ్రీనాథ పెద్దన రామరాజభూషణ చేమకూర వేంకట కవులును సంస్కృత మహాకవి కాళిదాసును ఈ కవి కభిమాన పాత్రులుగా గోచ

1. వైశాలిని : 'ప్రస్తావన' పుట 6
2 'తొలిపలుపలుకు' XII, XIII పుటలు

రింతురు. ఈ మహాపుల కవిత్వశైలీ శయ్యల ఛాయలందందు భాసించి యీ కవి శైలికి ప్రౌఢిమ నాపాదించినవి ప్రాచీన కవుల భావ గాంభీర్యమును రచనా శిల్పమును వీరు పుడికి పుచ్చుకొనిరే కాని భావానుకరణమునకు పాల్పడలేదు. వీరి భావములు స్వతంత్రములు.'1.

వైశాలిని ప్రస్తావనను, పండితుల యభిప్రాయములను పరిశీలించినచో ఆచార్యులవారిపై పూర్వ కవులలో పోతన శ్రీనాథ రామరాజభూషణ చేమకూర వేంకట కవుల ప్రభావము మిక్కుగముగను, నన్నయ తిక్కన పెద్దన కూచిమంచి తిమ్మకవుల ప్రభావమును సంస్కృత కవులలో కాళిదాస భవభూతుల ప్రభావము తగు మాత్రముగను నున్నట్లు తెలియుచున్నది.

## పూర్వకవి ప్రభావము :

పోతన చరిత్రముపై పూర్వకవి ప్రభావమునకు, వ్యాసను మొదట మనవి చేసినట్లు, సంప్రదాయానుసరణము మున్నగునవి హేతువులగుచున్నవి. అన్నిటి కంటె పూర్వ మహాకవులను ఆదర్శముగా నిడికొని వారివలె ఉత్కృష్టమైన ఉజ్జ్వలమైన మహాకావ్యము రచింప వలెనన్న మహాశయమే ప్రబల కారణము. ఈ విషయములో 'స్పర్ధయా వర్ధతే విద్యా' అన్న ఆర్యోక్తికి తావలమైనారాచార్యులవారు. అందుకే కావ్యపీఠికలో 'అక్షర సంపదకై యక్షర పదముల వెలుంగు నవ్యయ కవితా లక్షణ లక్ష్యాకృతుల ముముక్షువుగతిఁ గొల్చివ్రాయఁ బూనెద సుకృతిన్'2. అని వచించిరి. ఈ యభినివేశములో పూర్వ మహాకవుల ఉత్తమ కవితారీతుల నొరవడిగా పెట్టుకొని తాము ను అట్టిరీతులలో కావ్యరచన చేసిరి. ఉదాహరణమునకు నన్నయకు పోతనకు ఇష్టమైన ప్రసాద మాధుర్య గుణములు తమకును ఇష్టమై పెద్దన రామరాజ భూషణాదుల కింపైన ప్రబంధ రచన తమకును ఇంపై ఆచార్యుల వారాతీరులో రచన చేసిరేకాని కేవలమనుకరించిరని చెప్పుటకు వీలు లేదు. పూర్వకవులకు వరదాచార్యులవారికి ఉన్నత సాదృశ్యము గుణమునకు చెందినది. కాని అనుకరణమువలన నేర్పడినదికాదు. మరియు త్రివిధ సంవాదములలో నుత్తమమగు దేహాంతరతుల్య సంవాదము అధికముగను, మధ్యమగు ఆలేఖ్యాకార

1. 'కవి-కావ్యపరిచయము' 55 వ పుట
2. పోతన చరిత్రము : 'పీఠిక'-14వ పద్యము

సంవాదము అల్పముగను పోతన చరిత్రమున గోచరించును. భావానుకరణము కాని, అధమమగు బింబ ప్రతిబింబ సంవాదము కాని కానరాదు ఆధునిక కవి ప్రభావ విషయమునను నిట్టిదే కలదు. పైన ఉటంకించిన డా॥ పల్లా దుర్గయ్యగారి యభిప్రాయము నందలి చివరి వాక్యములు 'ప్రాచీన కవుల భావగాంభీర్యమును రచనా శిల్పమును వీరు పుడికి పుచ్చుకొనిరేకాని భావానుకరణమునకు పాల్పడ లేదు. వీరి భావములు స్వతంత్రములు." అనునవి నా యభిప్రాయమునే ధ్రువీకరించుచున్నవి. ఏతాదృశమైన అన్యమహాకవి ప్రభావ మాచార్యులపై నున్నందువల్లనే పోతన చరిత్రము పురాతనాధునాతన మహాకవుల ఉత్తమ కవితా రీతుల సమన్విత రూపమున ఆవిర్భవించిన ప్రశస్త మహాకావ్యమై ప్రకాశించు చున్నది. ఈ సమన్వయ కవితా విభావిన మహా కావ్యములో శైలిలో వర్ణనలలో భావ సంపదలో కల్పనలలో తమదైన ప్రత్యేకత విశిష్టత విరాజిల్లు చున్నవి.

ఇక పూర్వకవులలోని సంవాదములను సంగ్రహముగా చర్చింతును.

## పూర్వకవుల కవితా సంవాదములు :

### నన్నయ :

కావ్యమున నన్నయగారి కథాకథన చాతురి, అక్షరరమ్యత నానా రుచిరార్థ సూక్తినిధిత్వము గోచరించును. చిదానందయోగి సందర్శనోపదేశ కథ, పేద జవరాలి కథ, శ్రీనాథ పోతనలు సింగభూపాల సభకు వెడలుట మున్నగు ననేక ఘట్టములలో నీలక్షణములు గానవచ్చును. ఇక నన్నయ, 'సమాసంబు శబ్దపుంజంబు' నకు "వరనవ్యాంబర దివ్యాభరణాలంకార పుష్పపరిమళ కలిత స్మరశర విజయ రమాయిత సురుచిరవేషమున దేవసుందరి యనఁగన్."[1]

"హసదత్యంత మనోజ్ఞ పుష్పయుత దివ్యారామ సీమాంతరస్థ సరోపాంత సితద్యుతి ప్రకర భాస్వచ్చంద్రకాంతోపల । ప్రసృతాపూర్వ విలాసకుట్టిమ ధరాభాగమ్మూలం బోతనా । ర్యసనాథుండయి నవ్యశోభఁ గనులారం గాంచు శ్రీనాథుఁడున్"[2].

వంటి పద్యములు తార్కాణలు.

1. పోతన చరిత్రము : 3-219
2. ,, : 4-357

## తిక్కన :

తిక్కనగారి వంటి పాత్రపోషణ నాటకీయత యొప్పు కవితారీతుల కా యా వ్యాసములలో చర్చించిన విషయములు నిదర్శనములు. అతని అర్థ గౌరవము గల యలతి తెలుగు పలుకుల శైలికి,

"వేమరు నేకలవ్యుఁ దలపించును మించును వీఁడు నేర్చెఁదా
నీమహి నిట్టినేర్పచట నెవ్వఁడు వీనికి నొజ్జ యంచుచున్"....[1].

"ప్రల్లదు లెవరేని బాసవాల్ నెలఁతలన్
 బీడించి సిఱుగులు బెట్టిరేమొ"....[2].

మున్నగు పద్యములు ఉదాహరణములు మరియు కావ్యమునందలి

"ఎవనికై సింగిణి నవరత్న ఖచిత సుస్వాగతద్వారమై చదల
 మెఱయు"....[3].

"ఎవ్వాని హృదయాబ్జ మే ప్రొద్దు విహరించు కలువల పడఁతి యేకాంత
 గృహము....[4].

వంటి పద్యములు

"ఎవ్వాని వాకిట నిభమద పంకంబు రాజభూషణ రజోరాజి నడఁగు"

అన్న తిక్కనగారి ప్రసిద్ధ సీసమును స్మరణకు దెచ్చుచున్నవి

## శ్రీనాథుడు :

ఇక శ్రీనాథుని ప్రౌఢరచనకు, సీసపు హరువునకు కావ్యమున ననేకముగా సాదృశ్యములు సాక్షాత్కరించును.

శ్రీనాథుడు సింగనృపతిని దర్శించినప్పుడు చెప్పిన పద్యములు శ్రీనాథుని ప్రౌఢశైలికి సైదోడుగా నున్నవి.

1. పోతన చరిత్రము : 7-215
2. ,, : 12-74
3. ,, : 5-184
4. ,, : 9-193

"వప్రాట్టాలక శృంగమూర్ధ విలసద్వాల్లభ్య చిహ్నధ్వజా
ధిప్రేంఖన్మసృణారుణాంశుక సముద్దీప్త స్వరూపమ్ము తా
విప్రప్రాజ్ఞ కవీంద్రగాయకనటీ విశ్వమ్ముకై స్వాగతా
భిప్రాయ ప్రకటత్కరాగ్రమయి పంపెన్ యుష్మదాహ్వానముల్".... 1.

"భసితస్నిగ్ధ పవిత్ర లాంఛన లసత్ఫాలుండు రుద్రాక్షహా
రసమాశ్లిష్ట విశాలవక్షుఁ డవిలోలత్కించి దున్మీలితా
క్షి సమాలోచన నాసికాగ్రుఁడు.... ".2

ఇట్లే శ్రీనాథుడు వనవర్ణన చేసిన

"తొలిమబ్బు తెరనుండి తిలకించు చుక్కల
దొరఁగాంచి కనుగీఁటు తావపడంతి".... 3

వేశ్యామాత తన కూతురు గురించిచెప్పిన

"వగలాఁడి క్రేగంట వలపులే పూఁచెనా
రవ్వలు నీలాలు రాశిపడును.... 4

శ్రీనాథుడు కేసనతో తన్నుగూర్చి చెప్పికొనిన

"కనకాభిషేకమ్ము గావించె మత్కావ్య
భార్గవిం బరికించి ప్రౌఢుఁ డొకఁడు"5

మున్నగు సీసములు శ్రీనాథుని సీసముల యొయ్యారమును పుణికిపుచ్చుకొన్నవి.

## పెద్దన :

అల్లసాని పెద్దనగారి 'అల్లిక జిగిబిగి' యను శైలికి పోతన చరిత్ర మందందు పాత్రమగుచున్నది. మరియు నతని శిరీషకుసుమ పేశలరీతికి, నాతి దీర్ఘములై రమ్యములైన వర్ణనలకు దీటగుశైలి వర్ణనలందు గోచరించును. శ్రీనాథుడు పయనించి వచ్చు శకట వర్ణనగల

1. పోతన చరిత్రము : 4-68
2. ,, ,, : 5-78
3. ,, ,, : 4-120
4. ,, : 4-63
5. ,, : 2-230.

"చకచక గిత్తల కదుముకు త్రకిట ధికిట ధకిట ధా మృదంగ ధ్వని ఒక్
టికుమను కేదారాహతి నికట తటిని శకటమొకటి నిల్చిన యంతన్ '[1].

పుష్పలావికను వర్ణించిన.

''ఎందగు యౌవనమ్ము వలపించెడి చక్కదనమ్ము నేమియో
యందము చిందులాడు సిగయందు నమర్చిన పూసరమ్ము కెం
పుందళుకుల్ చలించు స్మిత పుష్ప సుగంధితమౌ విడెమ్ము బల్
పొందిక పుల్లగల్లపుట భూషణమై చెలువారు చుండఁగన్.... ''[2].

మున్నగు ననేక పద్యములు దీనికి నిదర్శనముగా ప్రదర్శనమగును. మరియు సీతను బాసి శ్రీరాముడు పడిన పాటుల గూర్చి చెప్పిన

"అనుచు సోదరు వెంట నడవులన్ మనువులన్ జెట్టుగుట్టలఁబట్టి చింతనేగు
ఏఁగి యంజనిసూనుఁడెఱిగింప ననుకంప నద్రి సుగ్రీవునకభయ
మిడును.... "[3].

అను పద్యము మనుచరిత్రములోని 'ఏ విహంగముఁగన్న నెలుగిచ్చుచును సారెకును సైకతంబులఁ గూడఁదాకు' నన్న పద్యమును దలపించుచున్నది. ఇట్టి పట్టుల ఆలేఖ్యాకార సంవాదము తోచును.

## రామరాజభూషణుడు :

ఇక రామరాజభూషణుని పద్యశిల్ప రామణీయకము, సరస శ్లేష రచనా రీతి కావ్యమున గణనీయముగా గానవచ్చును. శరద్వర్ణనలోని

'నెలగుండియలఁ బిండి సెలయేటి యెలబోటి యిల క్షీరవారాశి నొలుకఁ
బోయ.... '[4].

రాముని వనవాస వర్ణనలోని

1. పోతన చరిత్రము : 2-158.
2. ,, ,, : 4-24.
3. ,, ,, : 11-68.
4. ,, ,, : 3-193.

"తరులతాకూట సుందర జటాజూట శోభిత చిత్రకూట పర్వతము
నెక్కి..... "[1]

మొదలగు పద్యములు వసు చరిత్రములోని సుప్రసిద్ధ పద్యములగు

"లలనా జనాపాంగ వలనావసదనంగ తులనాభికాభంగ దోఃప్రసంగము"

"ఒక చాయ ననపాయపికగేయ సముదాయ మొకసీమ నానామయూర
నినదము"

వంటి వానికి దీటై నీటై యొప్పారుచున్నవి.

ఇక వసుచరిత్రములోని వానికి పోలికగల సరసశ్లేషలకు, శరద్వర్ణనలో

"తెలిగగనంపుఁ బయ్యెద నదృష్ట పయోధరయై సతంబు ప్ర
క్కల మను నొడ్డనంటని యకల్మషజీవనయై సత్క్రియన్
విలసదపంకవృత్తి ధరణిం బరతెంచె శరద్వధూటి కా
వలయు ఫలమ్ములొంది తలవంచి పదమ్ముల నంట సస్యముల్.... "[2].

ప్రహ్లాదుడు విష్ణుస్తుతి గూఢముగా జేసిన

"చెండాడెదను నేను శ్రీనాథు శిరమూని హరికిశోరము భాతి
ననవతరమున."[3]

రాజును చంద్రుని అభేదముగా శ్లేషతో వేశ్యామాతనిందించిన

"అమృత మొల్కించు దేవావతారంబన్న అల నిశాచరవృత్తిఁ జెలఁగు
చుండు."[4]

మున్నగు పద్యములు హృద్యము లగు ఉదాహరణములు.

## చేమకూర వేంకట కవి :

కావ్యముచ చేమకూరవారి శబ్దాలంకార చమత్కారము అందందు నిగారము చూపుచున్నది. గజేంద్ర మోక్షణ కథలో గజేంద్రుడు గ్రాహమును గాంచి నప్పటి వర్ణనలోని

1. పోతన చరిత్రము : 11-51.
2. ,, 3-194.
3. ,, ,, : 11-289
4. ,, ,, : 4-195

"దాని దాని దా నిదానమ్ముగాఁ గాంచి
మ్రానొ మీనొ కాని మేనిఁ దేల్చు
మకరమంచు నెంచక కరమ్ము సారించె."[1]

నర్సమాంబ పోతనను జేరబోయినప్పటి వర్ణనలోని

''కన్నుల కాటుకల్ మరుని కత్తుల సానలుబట్ట నవ్వులున్
వెన్నెల వన్నెలన్ జిలుక వేనలి ప్రేలెడి పూల మాలలో
మిన్నునఁ దారకల్ విరియ మించుల యంచుల యంబరమ్ములోఁ
బున్నమ చంద్ర బింబమునఁ బొల్తుక తా ననవిల్తు కొమ్మయై..''.[2]

వేశ్యామాత కూతునకు దుర్బోధ చేసినప్పటి

''చలువలఁ బంచి పాల్గురియు చక్కని చిక్కని మోము గోముకున్''.[3]

వంటి యనేక పద్యములు హృద్యములై యొప్పుచున్నవి. మరియు

''మీనంబు పొలసుల మేన్వీడి స్నిగ్ధతం గాంచఁ దా నీలేమ కనులఁ
బడియె....''[4]

అను పద్యము పదబంధముల చేతను సాభిప్రాయ పదప్రయోగము చేతను విజయవిలాస పద్యములను స్మరణకు దెచ్చుచున్నది.

## కూచిమంచి తిమ్మకవి:

కూచిమంచి తిమ్మకవి గూర్చిన అచ్చ తెలుగు పలుకుబడి ఈ కబ్బమున అందందు అందముగా పొందింపబడి వీనుల విందొనగూర్చు చుండును.

కేసన మావితోటను వర్ణించినప్పటి

"పచ్చల నడుమం గెంపులు ముచ్చటగాఁ బొదిగి మంచి ముత్తెపు సరులున్
సొచ్చెమగు పైఁడి గుండ్లవి కుచ్చులు ప్రేల్మావిగొడుగుఁ గూర్చిన
దెవరో....''[5]

మొదలగు పద్యములును మరియు భాషావైచిత్రి వ్యాసమున వివరించిన అచ్చిక పదప్రయోగ మందలి శైలియు తార్కాణలు.

1. పోతన చరిత్రము : 12-21
2. ,, 3-218
3. ,, 4-180
4. ,, 11-133
5. ,, 1-172

## పోతన :

పోతన చరిత్రముపై అందరికంటె ఎక్కువ ప్రభావము గల కవి పోతన. కావ్యము నందలి పోతనగారి కవితాధోరణులను 'కావ్యానుబంధము-భాగవతకథలు' అను వ్యాసమున ఆ కథలలో గన్పడు సంవాదములను విపులముగా చర్చించితిని. తదితర భాగములందు గల సామ్యముల నిచట సంగ్రహముగా అనుశీలింతును.

పోతనగారి భక్తితత్త్వ కవిత, ప్రసాద మాధుర్య గుణ విరాజితమగు మధుర మనోజ్ఞ శైలి, అంత్యానుప్రాస శోభ నున్నగు కవితారీతులకు కావ్యము గణనీయముగా సామ్యము గాంచ పోతనగారి పద్యపు టెత్తుగడ, నడక, భావ ప్రకటనరీతిలో గల సాదృశ్యమునకు దిగువ పద్యము లుదాహరణములై యున్నవి. వర్ష వర్ణనలోని

"ఇంతింతై వటుఁడింతయైన గతి మబ్బీక్షించు చున్నంతలో
నంతై యాకస మంతయై.... "[1]

అన్నది 'ఇంతింతై వటుఁడింతయై....' యను భాగవతములో వామన విక్రమము లోని ప్రసిద్ధ పద్యమునకు, భోగిని తన తల్లితో చెప్పిన

"హిమకర స్పర్శచేఁ జెమరించు చందుఱా ఖద్యోతమును గాంచి కరఁగఁ
గలదె?"[2]

అనునది భాగవత ప్రహ్లాద చరిత్రములోని

"మందార మకరంద మాధుర్యమునఁ దేలు" పద్యమునకు,
గంగాసైకతమున పోతన విష్ణుస్మరణ చేసిన

"పద్మాక్షదర్శన భాగ్యహీనములైన కన్నులంధవరాటకములు గావె..."[3]
అనునది భాగవత ప్రహ్లాద చరిత్రములోని

"కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవన గుంభిత చర్మ భస్త్రిగాక"
అను పద్యమునకు, శారద పెరటి తోటకు నీళ్ళు తోడిన విషయము వర్ణించిన

1. పోతన చరిత్రము : 3-113
2. ,, : 4-189
3. ,, : 5-75

"కంకణ కింకిణీ క్వాణ ఝుణంకృతుల్ గిరక గానములకు స్వరములల్ల"[1]

అనునదియు, అదే సందర్భములోని

"మదవతి నెమ్మెఁ దీవియ సదమదమై సాఁగి తూఁగ జలముల ద్రాడున్
వదలుట లాగుట బిందియ నుదకము వంచుటలు తెలియకుండఁగఁ
జేఁదున్"[2]

అనునదియు, భాగవతములో సత్యభామా యుద్ధములోని

"సౌవర్ణ కంకణ ఝుణఝుణ నినదంబు శింజినీరవముతోఁ జెలిమిసేయ..."

"ఇషువుఁ దొడుగుట విడుచుట యేయుటెల్ల
నెఱుఁగ రాకుండ ననిసేసె నిందువదన"

యను పద్యమునకు ఆలేఖ్యాకార సంవాదముతో శోభిల్లుచున్నవి. ఇందలి భావములు భిన్నములయ్యు భావ ప్రకటనలో పద్యపు టెత్తుగడలో నడలో సామ్యము గలిగి యున్నవి మరియు పోతనను గొనిపోవచ్చిన కర్ణాటక చమూపతి రాకను వర్ణించిన

"పరివారంబులతోఁ జలద్భటులతో భద్రేభ రాజంబుతో....''[3]

అనునవి భాగవతమున రుక్మిణి పెండ్లికి బయలువేరి వచ్చిన శిశుపాలుని వర్ణించిన

"భట సంఘంబులతో రథావళులతో భద్రేభ యూథంబుతో...."

దశమ-1718

అను పద్యమునకు దీటైయున్నది. ఇట్లే పోచన చరిత్రమున అక్కడక్కడ పోతన గారి శైలి పద్యగమనము అనుసరింపబడి యున్నవి. ఇక హృదయాకర్షకమగు అంత్యానుప్రాస విన్యాసమునకు పోతనను అనుసరించిన విషయము "ఆలంకారి కత" అను వ్యాసమున శబ్దాలంకారములలో నుదహరించిన అంత్యానుప్రాస పద్య ములు తార్కాణలు.

కావ్యమున అనుబంధ భాగవత కథలలో, పోతన భాగవత పద్యములను కొన్ని గ్రహించినట్లే ఇతరత్రను పోతనగారి రెండు ప్రసిద్ధ చాటు పద్యములు

---

1. పోతన చరిత్రము : 8-222
2. ,, ,, : 8-225
3. ,, ,, : 9-97

చేర్చుకొనబడినవి. ఇవి బింబ ప్రతిబింబ సంవాదమునకు వ్రాసినవి కాక గౌరవ భావముతో సందర్భోచితమని గ్రహింపనవి.[1]

"బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్" అన్న చాటువు పొలము దున్నుచున్న మల్లన తన్నవహేళన చేసిన శ్రీనాథునితో అన్నప్పుడు[2] మరియు కర్ణాటాధీశునికి భాగవత మిమ్మని శ్రీనాథుడు చెప్పుచు కృషీవలత్వమును నిరసించగా పోతన సమాధానము చెప్పినప్పుడు[3] ఉపయోగింపబడినవి. ఇక రెండవ చాటువు "కాటుక కంటినీరు చనుగట్టు పయింబడ నేల యేడ్చెదో" అన్నది కన్నీరు గార్చుచు ప్రత్యక్షమైన వాగ్దేవి నూరార్చుచు పోతన పలికినప్పుడు చెప్పించబడినది.[4]. ఇంతేకాక భాగవత గజేంద్రమోక్షణ కథలోని 'సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగమున్ జేదోయి సంధింపఁ' దన్న పద్యము, భక్తావను డగు శ్రీహరి తమకు గతిగానెట్లు రాడోయని పోతన శ్రీనాథునితో అన్న సందర్భ మున మూడు పాదములు ఇట్లు గ్రహింపబడినవి.

> "సిరికిం జెప్పఁడు శంఖ చక్ర యుగమున్ జేదోయి సంధింపఁ దే
> పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁ డాకర్ణి కాం
> తరధమ్మిల్లము చక్కనొత్తఁడు గజ ప్రాణావనోత్సాహియై
> కరుణాసింధువు, భక్తకోటి మొఱలాకర్ణించి రాఁడెట్లనన్...."[5].

ఇదే పద్యము మొత్తము కావ్యానుబంధ గజేంద్రమోక్షణ కథలో గ్రహింపబడిన విషయ మా వ్యాసమున తెలుపబడెను.

ఈ విధముగా కావ్యముపై పోతన ప్రభావ ముద్ర ప్రగాఢముగా గలదు.

## శ్రీ కృష్ణదేవ రాయలు :

కావ్యమున కృష్ణరాయల కవితారీతులలో ఋతు వర్ణనలకు, స్వభావోక్తి, ఉత్ప్రేక్ష అలంకారముల ప్రాచుర్యమునకు సాధర్మ్యమును గాంచగలము. గ్రీష్మ వర్ణనలోని

1. ఈ విషయము అనుబంధ భాగవత కథలు' వ్యాసమున వివరించి యుంటిని.
2. పోతన చరిత్రము : 8-13
3. " " : 8-187
4. " " : 9-59
5. " " : 8-173

"బడినోళ్లఁ దెఱచెడి పడఁదాక శోషిల్లి వృక్షశాఖల నహో! పక్షిచయము"[1].
గౌతమీ సంధ్యాకాలపు పక్షుల వర్ణనలోని

"ఇసుక దిబ్బలనడ్డు లేర్పడ గునగునన్ నడచుచు నెడనెడ నడరిదూఁకి ..."[2]
మున్నగు పద్యములు ఆముక్త మాల్యదలోని స్వభావోక్తి వర్ణిత పద్యములను స్మరణకు దార్చుచుండును. మరియు శ్రీనాథుడు పుష్పలావికతో చేసిన సంభాషణలోని

"చెక్కుటద్దము నేలు చిగురు తమ్ములపాకు
వరలుచున్నది పలువరుస లొరసి....
పూవుఁబోఁడి భోగి భోగానుకారి యీ యలరుదండ
యెంత విలువసేయు...."[3].

అనునది ఆముక్తములోని 'వెలది! యీ నీ దండ వెల యెంత', యను పద్యమును గుర్తు చేయుచున్నది.

## వేమన :

నీతిని ధర్మమును వైరాగ్యమును బోధించు సందర్భములందు కావ్యమున నాడించిన యాటవెలదులు వేమన ఆటవెలదుల వలెనే విశిష్టమై హృదయావర్జకమై యెసక మెసగి యున్నవి.

"నాల్గు నాళులుండి నాశమౌ మేనికై సకల సుఖ వసతులు సంతరించు
నద్దె కొంపనెంత దిద్దితీర్చిననేమి వెడలుమనిన దినము విడువవలెను...."[4].

"తానె పోవు టెఱిఁగి దారపుత్ర వియోగమునకు
నేడ్చు ప్రాణి ముగ్ధుఁ డగుచుఁ
దలయె పోవునవఁ జెవుల పోఁగులకు నేడ్చువాని
నేమియనఁగ వలయుఁ బుడమి".[5].

మున్నగు ఆటవెలదులు తత్త్వమును వైరాగ్యమును బోధించునవి మకుటములేని వేమన పద్యాలై విలసిల్లుచున్నవి.

1. పోతన చరిత్రము : 7-43
2. ,, 5-19
3. ,, 4-28
4. ,, 10-97
5. ,, 10-103

## సంస్కృత కవులు :

సంస్కృత మహాకవులలో ఆదికవి వాల్మీకి ప్రభావ ముద్ర ఆచార్యులవారిపై గాఢముగా గలదు. రామభక్తులగు వారికి రామాయణము నెడ ఎనలేని భక్తి కలదు. వారికి రామాయణము భాగవతము రెండును గాఢాభిమాన పాత్రములు. రామాయణములోని మాతా పితృ భ్రాతృ ప్రేమలు, ఇతర పవిత్ర గుణశీలములు వారిని విశేషముగా నాకర్షించినవి. పోతన చరిత్ర పాత్రలనట్లే తీర్చిదిద్దుటలోను, 'దేశే దేశే కళత్రాణి' అను దానికి 'ధరఁ గళత్రాది సకల బాంధవుల మరలఁ బడయ వచ్చు....'[1]నని కావ్యమున బోధించి ఇట్లే అనేక ధర్మోపదేశములు చేయుటవల్లను ఈ ప్రభావము విశదమగును.

ఇక వ్యాసుని ప్రభావమునకు ఆంధ్ర భాగవత కర్త పోతన గాథను ప్రబంధీకరించుట, అనుబంధ భాగవత కథలు రచించుట, భక్తి తత్త్వములను ప్రపంచించి ప్రవచించుట నిదర్శనములు. మరియు కాళిదాసు ఉపమకు, భవభూతి కరుణరస నిర్వాహణకు సదృశమైన రచన పోతన చరిత్రమున గోచరించును. ఈ రెండింటిని వరుసగా 'ఆలంకారికత' 'రసనిర్వహణము' వ్యాసములందు చర్చించుట జరిగినది. జయదేవుని ప్రభావము సైతము మృదుమధుర పదవిన్యాస విషయమున కానబడును.

## ఆధునిక కవి ప్రభావము :

పోతన చరిత్రము మీద ఆధునిక కవి ప్రభావము సముచితముగా కాన్పించును. ఈ విషయము 'కవితా తత్త్వము' వ్యాసముననే కాక 'సాంప్రదాయికత, నవ్యత' వ్యాసమున విపులముగా చర్చింపబడెను. అయినను ఈ సందర్భమున మరికొంత మనవి చేయుదును.

ఆచార్యులవారిపై గల పూర్వ కవి ప్రభావమునకు ఆధునిక కవి ప్రభావమున కించుక భేదము కలదు పూర్వ మహాకవుల ఉత్కృష్ట మహాకావ్యముల నాదర్శముగా గొని పోతన చరిత్రము రచించుటయే కాక ఆయా మహాకవుల కవితా రీతులను, కొన్ని యెడల ఆలేఖ్యాకార సంవాదము- పద్యపు టెత్తుగడ, నడక మున్నగు వానిలో సామ్యముగల రచనను కొంత వెలార్చుట జరిగినది. కాగా

1. పోతన చరిత్రము : 5-214

ఆధునిక కవుల ప్రభావమున, వారు రచించినట్లు తాము ను నవ్యత వెలార్చు భావ కవిత అభ్యుదయ కవిత సంతరించిరే కాని యొక ప్రత్యేకాధునిక కవి రచనల పోకడల ననుసరింపలేదు. పోతన చరిత్రములో ఈ నవ్యత ఆధునిక యుగ లక్షణానుసారియైనదే కాని ఏ యొక్కరి ననుకరించినది కాదు. కావ్యమున నవ్య కవితా విలసనమునకు నవ్య కవులలో యుగకర్తలైన గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు. శ్రీశ్రీ మరియు ప్రసిద్ధాధునిక కవులగు కందుకూరి వీరేశలింగము, నాయని, నండూరి, జాషువ, వేదుల, కృష్ణశాస్త్రి వంటివారి ప్రభావము సామూహికముగా గలదు. అంతేకాక ఆధునిక యుగములో మహా కావ్యములను రచించిన తిరుపతి వేంకటకవులు, వావిలికొలను సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తి దుర్భాక రాజశేఖర శతావధాని, గడియారము వేంకటశేషశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, పింగళి కాటూరు కవులు, తుమ్మల సీతారామమూర్తి, మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి గారల ప్రభావము కలదు. ఈ మహాకావ్య కర్తల ప్రభావము వలన ఆచార్యుల వారికొక మహాకావ్యము రచించుటకును, అందులో సాంప్రదాయికత నవ్యత మేళవించి సమన్వయ కవితగా సొబగులు తీర్చిదిద్దుటకును స్ఫూర్తి లభించినది. అంతేకాని ఈ ఆధునిక మహాకవుల యేయొక్కరి సామ్యము పోతన చరిత్రములో కానరాదు.

## ఇతర భారతీయ కవులు :

భారతీయ కవులలో మధ్యయుగము వాడగు తులసీదాసు ప్రభావము కాన నగును వరదాచార్యులవారు తను బాల్యమున మడికొండలో తులసీ రామాయణమును తరచు వినుచుండి తర్వాత పారాయణము చేసి మిక్కిలి ఆకళింపు చేసికొని అభి మానము పెంచుకొన్నారు. పరమ భక్తి ప్రపత్తులతో తులసీదాసు మానవోత్తము డగు శ్రీరామచంద్రుని దేవునిగా చిత్రించి అడుగడుగున అతని మహిమలను వర్ణించి కావ్యమును భక్తిమయము కావించినది ఆచార్యులవారి నాకర్షించినది. అందువల్లనే గోస్వామి వలెనే ఈ స్వామిగారును అనుబంధ భాగవత కథలలోని రామ చరిత్రములో గుహుడు శ్రీరాముని భగవంతునిగా భజించి సేవించినట్లు వర్ణించిరి.

ఇతర భారతీయ కవులలో విశ్వకవి రవీంద్రుని ప్రభావము తోచును. అదియును ఆధునికాంధ్ర మహాకవుల ప్రభావము వంటిదేకాని అనుసరించుట

లోనిదికాదు. రవీంద్రుని ప్రశస్తి విని అతని 'గీతాంజలి' యనువాదము చదివి ముగ్ధులై తామును అట్టి తాత్త్విక రచన కావింప ప్రేరితులైరి. 'మణిమాల' ఖండ కావ్య సంపుటిలో 'రవికవి స్మృతి' యని స్మృతి కవిత రచించి యతనిని కొనియాడిన విషయమాచార్యులవారి కాతనిపైగల అభిమానమునకు తార్కాణ.

రవీంద్రుని రచనతోబాటు వరదాచార్యులవారు ప్రకృతికవి యని ప్రశస్తి వహించిన ఆంగ్ల నవ్యమహాకవి వర్డ్సువర్తు కవితలను శ్రద్ధాసక్తులతో చదివి నందున ఆయన ప్రభావముచేత ఆత్మాశ్రయ కవితా విలసితమగు ఖండకృతులను రచించుటయేకాక పోతన చరిత్రమున సందర్భోచితముగా ప్రకృతి కవితను ప్రశస్తముగా వెలయించుటకు నుత్తేజమును పొందిరి.

## వర్తమాన కవులపై పోతన చరిత్ర ప్రభావము :

పూర్వాధునిక మహాకవుల ప్రభావము పోతన చరిత్రముపై నున్నట్లే పోతన చరిత్ర ప్రభావము సమకాలిక కవులపై గలదన్న విషయము తెలుపుట అప్రస్తుతముకాదని యొకింత మనవిచేయుదును.

శ్రీ వరదాచార్యులవారు 1930 నుండి నేటివరకు ఏబది సంవత్సరములు నిరంతర కవితా వ్యవసాయమున అనేకముగా సువర్ణ కావ్యసస్యములను పండించి ఆంధ్రభారతిని సంపద్విభాసితను కావించిచారు. ఈ తరమునకు కవిలోకములో ఆచార్యులవారు వయస్సుచేతను గణనీయ కావ్యరచనచేతను వరిష్ఠులు. వీరిని రాష్ట్రములో ముఖ్యముగా తెలంగాణములో వీరి ఆత్మీయులగు కవిమిత్రులు శ్రీయుతులు పి. వి. నరసింహారావు, పల్లా దుర్గయ్య, బిరుదురాజు రామరాజు, కాళోజి, దాశరథి, నారాయణరెడ్డి, అనుముల కృష్ణమూర్తిగారలు మున్నగువారు వీరిని 'వరదన్న' అని అప్యాయముగా పిలుతురు. ఈ కవీంద్రుల ప్రేమాభిమాన సుధ లాచార్యులవారి పోతన చరిత్ర రచనకు సత్త్వము సమకూర్పగా పోతన చరిత్రము మేలుబంతియై ఆచార్యులవారి ఆదర ప్రోత్సాహములు దోహదమై వీరి కావ్యోద్యానములు విస్తరించినవి. ఆచార్యులవారి విశిష్ట జీవిత చరిత్రమునకు ముగ్ధులై అనేక కవిపండితులు విమర్శకాగ్రేసరులు వేనోళ్ళ వినుతింపగా సహృదయ సాహితీ బంధువుల సంస్థలవారు లెక్కకు మిక్కిలి ఘన సన్మానములు చేయగా వందలకొలది కవి పండితులు శిష్యులై వారి వాత్సల్యామృత పూరములచేత తమ కవితా లతలను పోషించుకొనుచున్నారు. పోతన చరిత్రము వర్తమాన కవుల

కనేకులకు ప్రభావముద్రవేసి మార్గదర్శనము చేయుచున్నది. ప్రాజ్ఞులకు భక్తులకు పారాయణ గ్రంథమైనది. ఆచార్యులవారి అన్న శ్రీమాన్ జగన్నాథాచార్యులవారు 'రైతు రామాయణమును', శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యుల వారు 'తిక్కన' కావ్యమును రచించుట వరదాచార్యులవారి ప్రోత్సాహ ప్రభావ ఫలితమే. ఈ గ్రంథకర్తయగు అందె వేంకట రాజము, మామిండ్ల రామగౌడు, మహమ్మదలి, రాగి చిన్నయ్య, శ్రీ గాదె శంకరయ్య, బైరి నర్సయ్య, చెప్యాల రామకృష్ణారావు, నీలా జంగయ్య, రావికంటి వసునందన్, తాళ్ళపల్లి మురళీధర గౌడు, నిమ్మల అర్జునగౌడు గారలవంటి వర్ధమాన కవులనేకులాచార్యులవారి చేత ప్రభావితులై వారి ఆశీస్సులతో రచనలు చేయుచున్నారు. కాలము గడిచిన కొలదియు పోతన చరిత్ర మఖండముగా ప్రకాశించుచు తరతరాలుగా భావికవుల కావ్యజ్యోతుల కుద్దీపకమై వెలయగలదనుటలో సందేహము లేదు

ఇప్పటి కవి పండిత వరేణ్యులపై ఆచార్యులవారి యొక్కయు పోతన చరిత్రము యొక్కయు ప్రభావమెంతకలదో వారు వెలిబుచ్చిన యభిప్రాయముల వలన విశదము కాగలదు.

శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారిట్లు వ్రాసిరి.

"మంద్ర గంభీర స్వరముతో వీరు (వరదాచార్యులవారు) పద్య పఠనము చేయుచున్నప్పుడు, అందలి కవితా రసామృతము వినువారి సర్వేంద్రియములకు సంతృప్తిని, అపరిమితానందమును గల్గించుటయేకాక, వీరి రచనా పాటవము విద్వాంసుల నుత్తూతలూగించి యిక్కాలము నందింతటి విద్వత్కవిశేఖరు డితరత్ర నున్నాడా యను నాశ్చర్యమును, ఆనందమును, తన్మయత్వమును కలిగించి యప్రయత్నముగా ప్రశంసావాక్యములు గురిపించునటులొనర్చును"[1].

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిట్లు వినుతించిరి

"తెలుగు సాహిత్యములో సర్వవిధాల పోతన చెంత నిలువదగిన కవీశ్వరుడు ఆచార్యులవారు. స్వయముగా వారు ఈ కావ్యమును వినిపించగా వినిన

1. పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 83.

పాఠకుల జన్మము నిస్సందేహముగా చరితార్థమను సంగతి శ్రోతలను తెలిసిన సత్యమే"[1].

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారిట్లు శ్లాఘించిరి.

"గ్రంథమంతయు సుధాలహరి వంటి ధారతో నిండినది. శ్రీ పోతరాజుగారి కవనముపమానమా? లేక యుపమేయమా? అనునంతటి తీరుతో నున్నది.... ఈ గ్రంథమన్నివిధముల నుత్తమోత్తమమనుటకన్న నేనకనేమియు వివరింపలేను''[2].

శ్రీ కాళోజిగారిట్లు కొనియాడిరి

"వరదన్నకూ పోతన్నకూగల పోలికే 'పోతన చరిత్ర'కూ, తెలుగు భాగవతానికీ గలదు"[3].

డా॥ దాశరథిగారిట్లు ప్రస్తుతించిరి.

''కవిత్వం పేరిట లొల్లాయపదాలు వెలువడుతున్న ఈరోజున 'కవిత్వం అంటే ఇది' అని ప్రత్యక్షంగా చూపగల మహాకావ్యం పోతన చరిత్రము. నేడు వరదన్న అఖిలాంధ్ర కవి. వరదన్న నుండి నేను చాలా నేర్చుకోవాలి. పోతన చరిత్రము కవితాకల్పవృక్షం"[4].

ఆచార్య డా॥ బి. రామరాజుగారిట్లు వినుతించిరి.

''తెలుగుభాష ఉన్నంతకాలం భాగవతం నిలుస్తుంది, పోతనచరిత్ర నిలుస్తుంది. అది త్రిలింగ ధాత్రికి రత్నదీపం. ఇది తెలుంగు బాసకు నిజ స్వరూపం....[5].

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారిట్లు వ్రాసిరి.

"కాలయవనికాభ్యంతరమునకు నిష్క్రమించుచున్న సాహిత్య సాంఘిక మానవతా ధర్మములకు ఉజ్జ్వల ప్రతీక పోతన చరిత్రము"[6].

1. పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 85.
2. ,, ,, : పుట 94.
3. ,, ,, : పుట 86.
4. ,, ,, : పుట 87.
5. ,, ,, : పుట 87.
6. ,, ,, : పుట 92.

చాలకాలము క్రిందట పోతన చరిత్రము తొలుత నాలుగాశ్వాసాలు అచ్చగు చున్న రోజులలో 1960 సంవత్సరములో ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములో అన్నమాచార్య కీర్తనలకు స్వరకల్పన చేసి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పాడిన సభకధ్యక్షత వహించిన కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వరదాచార్యులవారిచేత పోతన చరిత్ర కావ్యగానము చేయించి ఆనందము పట్టలేక దండలోని పువ్వులన్ని ఒలిచి ఆచార్యులవారిమీద చల్లి ఆలింగనము చేసికొని 'నేను అనేక విధాల దివ్యంగా రచన చేశాను. కాని ఇంత సున్నితంగా నాట్యవర్ణన నేను చేయలేననిపించును. ఈమాట అనక తప్పదు. ఇది అమృతభాండము, ఇక్షు ఖండము," అని కొనియాడిన విషయము ఆచార్యులవారు చెప్పగా తెలిసినది.

ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు తమ తొలికావ్యము 'జలపాతం'లో

"వరదాచార్యులు రామరాజకవి ఆళ్వార్‌స్వామి కాళోజి న

ల్గురునన్ గుండెలకద్దుకొన్న రసమూర్తుల్...." అని ప్రేమతో స్మరించి

పిమ్మట ఇట్లు కొనియాడిరి.

"గుండెలోన రసపద్ధర భాండమ్ములు గలవాడా!
గొంతులోన పుంస్కోకిల కూజితములు కలవాడా !
నిన్నేమని వినుతింతును అన్నా ! వరదన్నా.... !
చిక్కని కవితలకు నిన్నె చెప్పుకొందునోయన్నా
నిన్ను మించు కవియేడీ ? ఉన్నాడొక పోతన్న...."[1]

నారాయణరెడ్డిగారు కోరుట్లలో జరిగిన వరదాచార్యులవారి షష్టిపూర్తి సన్మాన మహోత్సవ సభకు అధ్యక్షత వహించి ప్రసంగించుచు పై గేయము చదువుటయేకాక

"ఒకవైపు శివభారతం, ఇంకొకవైపు ఆంధ్రపురాణం, వీటి మధ్యలో శ్రీమద్రామాయణ కల్పవృక్షం నిలుస్తుంటే వీటన్నిటినీ మించి మహోన్నత్యముతో మంచుకొండలా వరదన్న పోతన చరిత్ర అవతరించినది."[2] అని కొనియాడిరి[3].

ఇట్లు పోతన చరిత్రము పూర్వాధునిక మహాకవులచేత ప్రభావితమై పురాతనాధునాతన సారకవితా సౌందర్యవిరాజితమై వర్తమానకవులను ప్రభావితము చేయుచు ప్రకాశించుచున్నది.

1. పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 88.
2. 'అభినవ పోతన' షష్టిపూర్తి సన్మాన సంచిక: పుట XX (శ్రీ తాళ్ళపల్లి మురళీ ధరగౌడుగారి వ్యాసము)
3. ఇతర పండితాభిప్రాయములకు అనుబంధము 3 చూడవలెను.

# కావ్యోపదేశము

## కావ్యప్రయోజనములు:

చిత్తరంజనార్థమేర్పడిన లలిత కళలలో కవిత యుత్తమమైనది. ఇది యితర కళలవలె హృదయమును కరగించుటయేకాక బుద్ధికి పదను పెట్టుచుండుట విశేషము అనగా ప్రబోధక శక్తి కవితకు విశేషముగా గలదు. కావ్యమునకు గల యనేక ప్రయోజనములలో ఆనందము, ఉపదేశము అనునవి ప్రధానమైనవి. కావ్యప్రయోజనములు పేర్కొనిన మమ్మటుని దిగువ శ్లోకము మిగుల ప్రసిద్ధమైనది.

''కావ్యం యశసేఽర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే"[1].

అనగా కావ్యము యశస్సునకు, ధనసంపాదనకు, లోక వ్యవహారము తెలిసికొనుటకు, అశుభమును దూరము చేయుటకు, ఆనందము పొందుటకు, కాంతాసమ్మితోపదేశము గావించుటకు ఉపకరించును. ఇన్ని యుపయోగములలో చివరి రెండధిక ప్రాధాన్యము వహించి యున్నవి. ఈ ప్రయోజనములను భామహుడును ఇట్లు తెలిపెను.

''ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసు చ
ప్రీతిం కరోతి కీర్తిం చ సాధుకావ్య నిషేవణమ్''[2]

''సత్కావ్య పఠనము ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను సాధించుటకుపకరణమగును. కళల యందు ప్రావీణ్యమును, ఆనందమును, కీర్తిని కలిగించును" అని దీని యర్థము.

ఇందు చతుర్విధ పురుషార్థసాధకమనుట చేత తత్పురుషార్థ సాధన సమర్థమగు నీతి నుపదేశించునని భావము. కావున ఇతడును ఆనందమును ఉపదేశమును పేర్కొనిన విషయము తెల్లము.

1. కావ్యప్రకాశము : 1-2
2. కావ్యాలంకారము: 1-2

సాహిత్య దర్పణకారుడు 'సర్గబంధో మహాకావ్యం....' అని మహాకావ్య లక్షణములు చెప్పుచు,

'చత్వార స్తస్య వర్గాస్యుస్తేష్వేకంచ ఫలం భవేత్'.[1]

అనగా కావ్యమున చతుర్విధ పురుషార్థములుండి యందొక్కటి ఫలమగునని చెప్పినది ఉపదేశము కావ్యమున నుండవలెనని నిర్దేశించుచున్నది.

కావ్యము సకల పురుషార్థ సాధనకుపకరించుననగా ఇహపర సాధకమై వెలయునన్న మాట. కావ్యమిట్టి ఉత్తమోపదేశము నందించవలెనన్న ఉత్తమ నాయకుని చరిత్రము వర్ణితమై యుండవలయును. ఈవిషయము విద్యానాథుడు

"యత్ర పునరుత్తమ చరితం న నిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ
తద్విషయా చ స్మృతిః "కావ్యాలాపాంశ్చ వర్జయేత్"[2]

అని వక్కాణించెను. అనగా ఏ కావ్యమున ఉత్తమ పురుష చరిత్రము కూర్చబడదో యది పరిత్యజింప దగినదే. కావ్యాలాపములను విడువవలెనన్న స్మృతివచన మిట్టి కావ్యవిషయముననే చెప్పబడినదని వివరించెను. కావ్యములందు సాధారణముగా శృంగారాదిక విషయవర్ణనలుండి ఇంద్రియ లౌల్యమునకు, భోగాభిలాషకు గురిచేసి ధర్మమోక్షములకు దూరము చేయును. కావున కావ్యాలాపములు కూడవని చెప్పబడినది. ఇది ఉత్తమ పురుష చరిత్రము చిత్రింపబడని యధమకావ్య విషయమున చెప్పబడినది. ఉత్తమపురుషుని చరిత్ర ముత్తమోపదేశమొసగు కావున నుపదేశక కావ్యమే సేవ్యము, శ్రేష్ఠము అని తాత్పర్యము.

ఆంగ్ల లక్షణకర్తలును

The purpose of the poem is to teach and delight" అని ఉపదేశము, ఆనందము కవితోద్దేశములని తెలిపిరి.

అభినవగుప్తుడు వాఙ్మయము ప్రభు సమ్మితము, మిత్ర సమ్మితము, కాంతా సమ్మితము-అని త్రివిధములుగా విభజించి చెప్పెను. వేదములు ప్రభు సమ్మితములు. అవి ప్రభువువలె ధర్మములను శాసించును. పురాణములు మిత్ర సమ్మితములు. అవి మిత్రునివలె దృష్టాంత పూర్వకముగా కథల ద్వారా ధర్మమును

1. సాహిత్య దర్పణము : 6-318
2. ప్రతాపరుద్ర యశోభూషణము : 1-8

బోధించును. కావ్యములు కాంతా సమ్మితములు. అవి స్వాధీనపతికయగు సతీమణివ
రూపయౌవన గుణాలంకారాదులచేత పతిని పరవశింపజేసి వశము జేసికొని, ము
ముద్దుగా వ్యంగ్యముగా హితోపదేశము చేయును. ఇట్లు కావ్యములు కాంతాసమ్మి
తములనుటచే అభినవ గుప్తుడు కావ్యమునకు ఆనందము, ఉపదేశము రెండు
ప్రయోజనములని చెప్పినట్లయినది. ఆ రెంటిలోను 'తథాపి ప్రీతిరేవ ప్రధానమ్'
అని ఆనందము ప్రధానమనియు ఉపదేశ మానుషంగిక మనియు చెప్పినను అ
నవగుప్తుడు కావ్య ప్రయోజనములలో ఆనందోపదేశములు రెండిటి నంగీకరించెను
ఈ విధముగా కావ్య ప్రయోజనములలో ఆనందోపదేశములు రెండు ముఖ్యమై
న యాలంకారికులు నిర్దేశించిరి.

ఉపదేశ మందించని కావ్యము ఉత్తమ కావ్యము కాజాలదు. కేవల వినో
నుకొరకితర సంగీతాది కళలు కలవు. కాని ఆలోచనామృతమగు కావ్యము ఆ
చించిన కొలది ఆనందము చూరలిచ్చుచు చిత్త సంస్కారము కలిగించుచు, తే
కలిపిన చేదు మందు త్రాగుటకు రుచించి గుణమిచ్చునట్లు రమ్యముగా రసపం
ముగా హితోపదేశము చేయవలెను కర్తవ్య ప్రబోధముచేసి కావ్యము సన్మార్గ
చూపవలెను. ఉపదేశము లేక కేవలము చిత్తద్రుతి కలిగించు కావ్యము సంతా
ఫలములేని సతీ సంగమమువలెను, శరీర పోషణ కుపయోగపడని శాకపాక
వలెను, వరిష్ఠము కానిదైపోవును. కావున ఉపదేశాత్మకమైన రసవత్కావ్య
దివ్యమైనది.

పోతన చరిత్రము మమ్మటుడు పేర్కొనిన సర్వప్రయోజనముల
సిద్ధింపజేయుచున్నది. అందు ప్రధానమలైన యానందోపదేశములలో ఆనంద
ప్రసాదించుచున్న దనుటకు రసజ్ఞులగు పాఠకులే ప్రమాణము. ఈ విషయ
రస నిర్వహణాది వ్యాసములందు చర్చింపబడెను. కాగా ప్రస్తుతాంశమగు ఉ
దేశము కావ్యమున నెట్లు విరాజిల్లుచున్నదో అనుశీలింపవలసి యున్నది.

## పోతన చరిత్రమున ఉపదేశము :

పోతన చరిత్రము రసోదంచితమై రమ్యమై ఆనంద ప్రదమగుటయేకా
బహు విధములైన ధర్మములతో శోభిల్లు సదుపదేశము నందించుచున్నది. కా
మీమాంసాకారుడు పరిగణించిన శాస్త్రకవి, కావ్యకవి, ఉభయ కవి యను ముగ్గు
రిలో ఉత్తముడనబడు ఉభయకవికి లక్ష్యమైనవారు వరదాచార్యులవారు. ఉభ
కవినే విద్వత్కవి యందురు. ఉత్తముడగు విద్వత్కవి విరచించిన కావ్య

ఉత్కృష్టమై శాస్త్రకావ్య మనబడును కావున పోతన చరిత్రము శాస్త్రకావ్యమై శాస్త్రమునవలె పురుషార్థములను నిరూపించుచు కావ్యమునవలె రసమును పోషించుచున్నది. మరియు భారతము గురించి "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు...." ఇత్యాదిగా చెప్పబడినట్లు పోతన చరిత్రము ఔపదేశికతలో ధర్మశాస్త్రము వేదాంతము నీతి శాస్త్రమునై విరాజిల్లుచున్నది. కృతియందు మహాకావ్య లక్షణములు వివరించిన సందర్భమున తెలిపినట్లు మోక్ష మాత్యంతిక ఫలమై పురుషార్థ చతుష్టయమిందు బోధింపబడుటచేత నిది ఇహపర సాధకమై యెసగుచున్నది. ఇట్లివి భారత భాగవత రామాయణములవలె సదుపదేశకమై దేశికస్థానము నలంకరించుచున్నది.

కావ్యము నందలి ఉపదేశము కథానాయకుడగు పోతన కృతముగా ప్రధానముగా భాసిల్లుచున్నది. తక్కిన యుపదేశము శ్రీనాథాది పాత్రల ద్వారమున ఆనుషంగికముగా గ్రాహ్యమగుచున్నది. ఈ సర్వోపదేశమును 1. భక్తిజ్ఞాన వైరాగ్యములు 2. మహాకవి ఆదర్శములు 3. లౌకికనీతులు—అని త్రివిధముగా గ్రహింపవచ్చును. మరియు పోతన తదితర పాత్రల వృత్తముల సంభాషణల వల్లను, కథాసన్నివేశముల వల్లను, వ్యంగముగను, ఆయాపాత్రలు, కావ్యకర్త ప్రబోధాత్మకముగా వచించిన సూక్తుల వలన వాచ్యముగను ఉపదేశము లభించుచున్నది. ఈ సర్వవిధమైన యుపదేశమును క్రమముగా చర్చింతును.

## 1. భక్తి జ్ఞాన వైరాగ్యములు :

కావ్యమున నెట్టి నాయకుని చరిత్రము నిబంధింపబడునో యట్టి యుపదేశమే మనకు లభింపగలదు. ఇందు మహాభక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నుడును, మహాకవియు, ఉన్నతాదర్శములు, ఉత్తమాశయములు విలసిల్లు మహాపురుషుడును అగు పోతన జీవితగాథ వర్ణింపబడుటచేత అతని యుత్కృష్ట గుణకర్మ స్వభావము లన్నియు నుపదేశకములగుచున్నవి. అందు మొదట భక్తి జ్ఞాన వైరాగ్యయుతమైన ప్రబోధము పరిశీలింతము.

పోతన గూర్చి మడికొండ పండితులు

"పాతకులను గరఁగి యచ్చుననుబోయు పోతనా వెలుఁగొందె నీ
పోతనకవి

భయదభవవార్ధి తారణోపాయమైన పోతరూపమై పోతన పుట్టెననిరి"[1]

---

1. పోతన చరిత్రము : 9-67

ఇందు పోతన గూర్చి వారు భావించినది పోతన వ్యక్తిత్వమునకు సారభూత మైన వ్యాఖ్యానము. 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నట్లు పోతన సూత శుకుల సమష్టి వ్యక్తి యనియు, భవవార్ధి తారణోపాయమైన నౌకయనియు వర్ణించి పోతన యాధ్యాత్మికత రూపుదాల్చిన వాడని విదితము చేయబడినది. జన్మ తారక మైన ఈ ఆధ్యాత్మికతకు భక్తి జ్ఞాన వైరాగ్యము లంగములు. పోతన వీనిచేత తాను తరించుటయే కాక లోకులను తరింపజేయుటకు భాగవతమును తెలుగున వెలయించి సదాచార పూర్వకమైన ఆదర్శజీవితము సాగించిన మహనీయుడు, కారణజన్ముడు. కావ్యమునందలి యతని జీవిత చరిత్రయే వస్తు ధ్వని పూర్వకముగా ఈ మహోపదేశము నందించుచున్నది. రామాయణము చదివి 'రామాదివ వర్త వ్యమ్ నతు రావణాదివ' యని రామునివలె ప్రవర్తించవలయునుగాని రావణునివలె కాదని నీతిని గ్రహించునట్లు ఈ కావ్యమును చదివి పోతనవలె నడచుకోవలెను, సింగనృపాదులవలె కాదన్న సందేశము మనకు వ్యంగ్యముగా అందించుచున్నది.

కావ్యమున అసలు పోతన జీవితము ఎట్టిది? అని విచారించినచో అది పైన పేర్కొనిన భక్తి జ్ఞాన వైరాగ్య విలసితమైనది ఆధ్యాత్మికమైనదని స్ఫురింప జేయుట కాచార్యుల వారొక పద్ధతి ప్రవేశపెట్టినారు. అది ఆశ్వాసాదులలో భగవ ద్గీతా శ్లోక భాగములను తిలకాయమానముగా నలంకరించుట. ఒక్క చతుర్థాశ్వా సాదిని తప్ప తక్కిన యాశ్వాసాదుల నన్నిట గీతాశ్లోక భాగము లుటంకింప బడినవి. అవి పోతన జీవితచరిత్ర భాగములను దిగువ విధముగా స్ఫురింపజేయు చున్నవి.

ప్రథమాశ్వాసము : జననము- బాల్యము - "శుచీనాం శ్రీమతాం గేహే
యోగ భ్రష్టోఽభిజాయతే (భగవద్గీత) (6 అ. 41 శ్లో)

ద్వితీయాశ్వాసము : తారకోపదేశము-కళ్యాణము-"ఉపదేక్ష్యంతి తే జ్ఞానం
జ్ఞానిన స్తత్త్వదర్శినః" (4-34)

తృతీయాశ్వాసము : తపోభంగము- మల్లన జననము- "ప్రకృతి యాంతి
భూతాని నిగ్రహః కిం కరిష్యతి (3-33)

చతుర్థాశ్వాసము : రాజసందర్శనము- భోగినీదండక రచనము-
"స్త్రీ రత్నం దుష్కులాదపి"

పంచమాశ్వాసము : రామసాక్షాత్కారము- లేఖినీప్రదానము-
"రామశ్శస్త్ర భృతామహమ్" (10-31)

షష్ఠాశ్వాసము : రచనోపక్రమము- రామపద్యపాద పూరణము-
"నిమిత్త మాత్రంభవ సవ్యసాచిన్" (11-33)
సప్తమాశ్వాసము : కృత్యపహరణము- వరాహ కృతకృతి సంరక్షణము-
''నహి కళ్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి" (6-40)
అష్టమాశ్వాసము : శ్రీనాథ కృతపరీక్ష- పోతన విజయము-
"న మే భక్త ప్రణశ్యతి" (9-31)
నవమాశ్వాసము : వాణీఖేదాపనోదము- కృతిశైథిల్యము-
"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషుకదా చ న'' (2-47)
దశమాశ్వాసము : కృతిప్రాప్తి- ఫలశ్రుతి- ''సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ" (18-66)
ఏకాదశాశ్వాసము : భక్తిగాథా నివేదనము-పూర్వభాగము-
"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం'' (4-8)
ద్వాదశాశ్వాసము : భక్తిగాథా నివేదనము- ఉత్తర భాగము-
"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" (4-8)

ఈ విధముగా ప్రతి ఆశ్వాసము మొదట ఆ యాశ్వాసమునందలి కథా భాగమును దెలుపు శీర్షిక పెట్టబడి దానికి దగియున్న గీతా శ్లోక భాగముటంకింపబడి యున్నది. పోతన పుట్టి పెరిగిన కథ గల ప్రథమాశ్వాసమునకు 'జననము - బాల్యము' అన్న శీర్షిక తగియున్నది. కాని యిందులో విశేషము లేదు. కాగా దీనికి చేర్పబడిన 'శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే' యను గీతా వాక్యము, 'యోగభ్రష్టుడైన పుణ్యాత్ముడు సదాచార సంపన్నులైన ఐశ్వర్యవంతుల గృహమున జన్మించును'- అనునది ఎంతో యోగ్యమైనదే కాక పోతన పూర్వ జన్మమున యోగమభ్యసించి సిద్ధి నందని పుణ్యుడనియు, లక్కమాంబ కేసనలు సదాచారవంతులును భాగ్యవంతులునై పోతన వంటి కారణజన్ముని గన్న ధన్యులనియు నెంతో విశేషమును ధ్వనింపజేయుచున్నది. ఈ రీతిగా ఈ గీతాసూక్తులు పోతన జీవితమునకు లక్షణ సూత్రములుగా విరాజిల్లుచు సకలోప నిషత్సారమైన గీతయందు ప్రవచింపబడిన వేదాంత తత్త్వమునకు ధర్మమునకు అనుగుణముగా పోతన జీవితము సాగినదని గ్రాహ్యమగుచున్నది. అనగా పోతన చరిత్రము భగవద్గీతా సదృశమైన మహోపదేశము నందించుచున్నదని తాత్పర్యము. ఉటంకితమైన గీతా వాక్యములు ప్రభు సమ్మితములై పరిఢవిల్లగా

కావ్యము నందలి క్రమ కవితా కలిత గాథ కాంతాసమ్మితమై ధర్మప్రబోధము చేయుచున్నది.

ఇక చతుర్థాశ్వాసము నందలి 'స్త్రీరత్నం దుష్కులాదపి' యన్నదొక నీతి వాక్యము. దుష్టకులమున జన్మించిన స్త్రీయైనను సుగుణయైనచో చేపట్టవచ్చునన్న సుభాషితమునకు లక్ష్యమై ఆ యాశ్వాసమునందలి కథ సాగినది. అదియు నీతి బోధకమైనదే కాగా పోతన భోగిని గుణశీలములను, నృత్యకళా ప్రావీణ్యమును, ఆమె ప్రదర్శించిన మధుర భక్తిని మెచ్చి దండకము వ్రాసి సింగనృపతికంకిత మిచ్చినను, అది పోతన యాత్మకంటిన సత్కార్యము కాదు. అది గీతాబోధకను గుణమైనది కాదు. కావుననే కవిగారిచట గీతావాక్యము కూర్పక తదన్యమును సముచితమును నగు నీతి వాక్యముటంకించియున్నారు.

కావ్యమున ఆశ్వాసాదులలో శీర్షికలు, గీతావాక్యములేకాక ప్రథమ పద్యము కృతిపతి యగు రాముని సంబోధనతో చెప్పినవానిలో సూచన ప్రాయముగా రామ చరిత్రము నిక్షిప్తమైయున్నది.

> "శ్రీరఘువంశ సుధార్ణవ శారద రాకాశశాంక! జననీ కౌస
> ల్యోరోజ పూర్వశైల తటారూఢ శరీర; దశరథాగ్రకుమారా!"[1]

ఇత్యాదిగా చెప్పబడినది. ఇవి అన్నియాశ్వాసముల మొదట రామచరిత్ర స్ఫోరకముగా లేకున్నను చాల ఆశ్వాసములలో గలవు. వీనివలన పోతన చరిత్రము రామ చరిత్రమువలె ధర్మబద్ధమై పావనమై విలసిల్లుచు రామాయణమువంటి దివ్య సందేశము నొసగుచున్నదని గ్రహించుటకు వీలుకలదు.

ధీరశాంతుడగు పోతన జీవితము భారతీయ వైదిక ధర్మ సంస్కృతుల కనుగుణముగా సాగినది. "శమార్థం సర్వ శాస్త్రాణి నిర్మితాని మనీషిభిః" అని అభినవ గుప్తుడన్న మహా కావ్యానురూపముగా శాంతి రస ప్రధానముగా పోతన చరిత్రము రచింపబడినది. శాంతికి మూలము భక్తి జ్ఞాన వైరాగ్యములు. కావ్యము నందు విరాజిల్లు వీనిని గురించి ముఖ్యాంశములను సంగ్రహముగా పేర్కొందును.

ఈ చరాచర జగములకెల్ల సృష్టిస్థితి లయ కారణుడు పరమాత్ముడు. ఈ సమస్త మా భగవన్మయమే అతడే సకల జీవులకు గమ్యము. శివ కేశవాది నామ

1. పోతన చరిత్రము : 1-1

రూపములన్నియు నతనివే పరమేశ్వరుడు సగుణుడును నిర్గుణుడునై యున్నాడు. జ్ఞానాగ్ని ఈ నానాత్వమును దగ్ధము చేయును. అతనిని పొందుటకు భక్తిజ్ఞాన కర్మ మార్గములు గలవు. వానిలో భక్తి సులభమైనది. తత్త్వమువలన 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అని ఇత్యాదిగా ఈశ్వరుని గురించి తెలిసికొని భక్తితో స్తుతి ప్రార్థనోపాసనలు చేయుచు భగవదర్పణముగా నిష్కామముగా సత్కర్మలాచరించు చుండువాడు అతనిని చేరగలడు. భక్తి జ్ఞాన వైరాగ్యములు ఇహమున ఆపదలు తొలగించి సుఖములు కలిగించి పరమున ముక్తిని ప్రసాదించును — అని ఈ విధ ముగా పోతన చరిత్రము సనాతనమైన సర్వశ్రేష్ఠమైన భక్తిని వేదాంతమును ప్రబోధించుచున్నది.

భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నుడు స్థితప్రజ్ఞుడై అర్థకామములను గెలిచి ఆశకు లొంగనివాడై మనశ్శాంతి శోభితుడై యుండును. ఆశకు లొంగనివానికి ఈశత్వము లొంగునని ఆర్యవచనము. ఈ విషయము కావ్యకథా ప్రారంభమున బమ్మెర గ్రామ వర్ణన పద్యముననే సూచన ప్రాయముగా తెలుపబడినది.

## తత్త్వబోధ :

సహజ భక్తుడైన పోతనకు పాల్కురికి జాతరలోని వీథి భాగవతము గురించి తల్లి లక్కాంబ చెప్పిన తత్త్వము వలన జగమొక నాటకమనియు ఈశ్వరుడు సూత్రధారుడై జీవుల కాయా పాత్రలిచ్చి నటించుటకు లోకమునకు పంపి తాను చెప్పినట్లాడి పాడిన యుత్తమ భోగములిచ్చి, అట్లు చేయనివారిని శిక్షించుననియు తెలియుచున్నది. మరియు రంగమున నావిర్భవించిన నృసింహస్వామిని చూచి యడిగినప్పుడు

'హరి హరులేక రూపులు' సిగ(జెలంగు కుప్పె సింహాస్యవలయమ్ము రూఢి నొక్క పసి(డి రూపులగుట' యని తల్లి బోధించుట చేత శివకేశవులకు భేదము లేదన్న అద్వైత ప్రబోధము లభించుచున్నది. ఈ యభేదతత్త్వమే పోతనకు చిదానంద యోగి రామతారక మంత్రోపదేశ సందర్భమున తెలుపుటచేత దృఢ మగుచున్నది. శ్రీరాముడు శివకేశవ సమన్వయ దైవతమనియు శ్రీనారాయణ మంత్రములోని 'రా' యు శివపంచాక్షరీ మంత్రములోని 'మ' యు కలిసి 'రామ' మయ్యెననియు రామతారక మంత్రజపముచేత నారాయణుని శివుని ఉపాసించినంత మహాఫలము కలుగుననియు

"రామ తారకమ్మ రహినాత్మ జపియించు శంకరుండు, భక్తి శౌరిరూప
ధరుడు రాఘవుండు తానంబుధింగట్టు ముందు త్ర్యంబకునకు మ్రొక్కివేడె"[1]

"ఒకరినొకరు పూజలొనరించుకొననిట్టు లుభయులొక్క పేర నొదిగియుండ
వారు తక్కువనుచు వీరెక్కువనుచును మదిని దలఁచువాఁడు మానవుండె"[2]

"ఎన్ని మతములేని ఈశ్వరుండొక్కఁడె భాషలెన్నియైన భావమొకఁడె
పలు తెరంగు పూలఁ బరఁగు తేనెయొకండె ఆల రంగెదైన పాలొకండె"[3]

అని వివరించుటచేత శివకేశవులకు భేదము లేదనియు తెలిసి సర్వమత సమత్వ ప్రబోధము లభించుచున్నది. ఈ సందర్భమున చిదానందుడు పోతనకు చేసిన బోధ చాల ముఖ్యమైనది. 'ఈశ్వరుండు సృష్టి స్థితి లయకారుడు. రసరూపుడగు నారాయణుడు విజ్ఞాన వహ్నిచేత ఆవిరియై', భక్తి సరిత్సాగరహిమమై నిర్గుణుడును సగుణుడును అగుచున్నాడు. దేవునిగొల్చు మార్గములు కర్మ భక్తి జ్ఞానములని యనేక విధములు. అందులో సులభమైనది భక్తి'- అన్నది యతని బోధ సారాంశము. మరియు రామ తారకముపదేశించి భూతముల రమించెడి వాడగుట రాముడనబడెననియు "స ఏకాకీ న రమేత" అని శ్రుతినిరుక్తి కలదనియు శివకేశవ మంత్రముల అంతస్సారమే రామతారకమనియు ప్రబోధించెను. చివరకు బ్రహ్మచర్యవ్రతమునకు మించినది లేదనియు దీనజనులను దయజూచు దివ్యకర్మమే తపము లన్నిటిలో శ్రేష్ఠమైనదనియు ఆ దీనులను మరవవలదని బోధించెను. ఈ అమూల్య బోధయంతయు పోతనతో పాటు మానవాళికి శిరసావహింప వలసి యున్నది. ఈ ద్వితీయాశ్వాసము నందలి చిదానంద యోగి బోధ ఆశ్వాసాది నుటంకెంచిన రీతిగా

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"[4] (ఆ జ్ఞానమును బ్రహ్మజ్ఞులైన జ్ఞానుల నుండి, వారికి నమస్కరించి, తరచి తరచి యడిగి సేవచేసి తెలిసికొనుము) అన్న దానికుపలక్ష్యముగా సాగినది.

---

1. పోతన చరిత్రము : 2-42
2. ,, ,, : 2-43
3. ,, ,, : 2-44
4. భగవద్గీత : జ్ఞానయోగము, శ్లో. 34,

పాల్కురికి జాతర నుండి తిరిగి వచ్చుచు మావితోటలో కేసన పోతనకు చేసిన తత్త్వోపదేశము స్మరణీయమై యున్నది. ప్రకృతియే తల్లి, ఈశ్వరుడే తండ్రి యనియు, జగత్తొక దాగుడుమూతల క్రీడా రంగమనియు నిచట ఉపదేశింప బడినది.

పోతన భాగవతాంధ్రీకరణమునకు ముందు భాగవత తత్త్వ రహస్య మెరుగదలంచి చిదానంద గురువరేణ్యుని సందర్శించినప్పుడతడు ప్రబోధించిన తాత్త్విక విషయములు మిక్కిలి అమూల్యములై యున్నవి.

'ఆకాశమువలె నిర్గుణాకారుడై మబ్బుభేదములు తానై వెలయునట్లు ఈశ్వరుడు నామరూపములన్నియు తానేయగుచు నిట్టి నామరూపములును లేక యుండువాడును అంతర్బహిరింద్రియములకందకుండ లోన వెలుపల వ్యాపించి యుండువాడును అగు వేదాంతవేద్యుడు జ్ఞానైక సాధ్యుడగు ఆత్మయే పరమాత్మ యని గ్రహింపుము. అలలచే అబ్ధిలో సూర్యుడగపడనట్లు చంచల చిత్తునకు భగవత్ సాక్షాత్కారము కలుగదు' అని చెప్పి ముక్తిగాంచుటకు జీవుడు జ్ఞానియై ఆలోచింపవలసిన పరమార్థమును దిగువవిధముగా తెలిపెను.

'ధర్మము దారి, దేహమరదమ్ము, దశేంద్రియముల్ ధురీణముల్
శర్మద మోక్షమాలయము, సారథి రూవుడు బుద్ధి, యాత్మయే
కర్మగుఁడైన యాత్రికుఁడు, కామమునర్థము బాటప్రక్కచేల్
దుర్మద దూషితంబులయి దూఱు వృషంబులు ప్రక్కచేలలో"[1].

"మానస రశ్మిని జేకొని జ్ఞానేంద్రియయుగ్యముల వశంబున నిడుచున్
సూనృత పథముల నడుపుచుఁ దానై తన నుద్ధరింపఁ దలకొన వలయున్"[2]

జీవుడు శరీరరథమధిరోహించి బుద్ధియను సారథిచేత మనస్సను పగ్గముతో దశేంద్రియ వృషభముల నదుపులోనుంచి నడిపించుచు ధర్మమార్గమున పయనించుచు మోక్షాలయము చేరబోవలయును. అట్టి యాత్రలో ఇంద్రియ వృషభములు అహంకార మమకారములకు లోనై దారి ప్రక్కలగల అర్థము కామము అను చేలలో బడి పయనము సాగకుండ చేయును. బుద్ధిసారథి మెలకువతో

---

1. పోతన చరిత్రము : 6-60
2. ,, ,, : 6-61

ప్రయత్నపూర్వకముగా వానిని దారిలోబెట్టి గమ్యము చేర్పవలెను' అని చెప్పిన యీ బోధ జన్మతారణమునకు మానవులకు చక్కని దారి చూపుచున్నది. ఇందలి తత్త్వము

'ఆత్మానం రథం విద్ధి; శరీరం రథమేవ తు:
బుద్ధిం తు సారథిం విద్ధి; మనః ప్రగ్రహమేవ చ"[1].

అను ఉపనిషద్వాక్యములకు వివరణముగా నున్నది. చిదానందుడు మరియు మాయా స్వరూపమును దాని గెల్చువిధమునిటులుపదేశించెను

"సూర్యునిచేత ఏర్పడిన మేఘములు సూర్యునే కప్పివేయునట్లు ఆత్మతో పుట్టిపెరుగు మాయ ఆత్మనే మాయము చేయును. అట్టి మాయను హఠయోగి వైరముచేతను, రాజయోగి స్నేహముచేతను గెల్వజూచును. నాది యనుట మాయ, నేననుట జ్ఞానము. నాదియను మాయను విడచి నరుడు పురుషోత్తముడగును. ఈశ్వరుడు దీపము. జీవుడు కాంతి. త్రిగుణాత్మకమైన మాయ తెర. ఈ మాయ తెర కాంతి నడ్డగించగలదుకాని మండెడు దీపము నంటినచో కాలిపోవును కావున మాయ ఈశ్వరునంటదు[2].

కర్మ భక్తి జ్ఞాన వైరాగ్య స్వరూపమిట్లు తెలిపెను.

'పరదుఃఖమును గాంచి కరగుటలో పక్వమైన పరమార్థ చర్యయే కర్మము. కర్మయోగమునకు ఫలము శమ దమ సాధన షట్కసంపత్తి; భగవద్వియోగమున భరింపరాని దీనాలాపమే భక్తి. భక్తియోగమునకు ఫలము మోహత్యాగము. సత్యశోధనలో స్వస్వరూపమును తెలిసికొనుట జ్ఞానము. జ్ఞానయోగమునకు ఫలము నిత్యానిత్యవస్తు వివేకము. నిస్స్వార్థబుద్ధితోడి విశుద్ధవర్తనము వైరాగ్యము. వైరాగ్య సాధనకు ఫలము ఐహిక పారలౌకిక ఫలభోగవర్జనము. మనస్సులో జ్ఞానమననము, వాక్కున శ్రీహరిగుణగాన భక్తి, కార్యములందు నిష్కామ కర్మము విలసిల్ల జీవించు మనుజుడే ఉత్తమయోగి. మతశాస్త్రములందు తత్త్వమార్గము లెన్ని చెప్పబడినను గమ్యమొకటే. వేదములు, దర్శనములు, స్మృతి పురాణములు, ప్రస్థానత్రయము సర్వమీతత్త్వమునే విప్పిచెప్పుచున్నవి. కర్మము మట్టికుండ వలె రూపభంగము గాంచును. జ్ఞానము పరిశుద్ధమయ్యు నిత్యము దానిని మననము చేయనిచో

1. కఠోపనిషత్తు : 1 వ అధ్యాయము, 3 వ వల్లి.
2. పోతన చరిత్రము : 63-65 పద్యముల సారాంశము.

శుద్ధిచేయని రాగి పాత్రవలె పనికి రాకుండ పోవును. కావున స్వర్ణపాత్రవంటి భక్తియే సులభముగా ఆశ్రయింపదగినది. అందుచేత భక్తి సంధాయకమగు విష్ణ్వవతారగుణ రూప విభ్రాజితమైన భాగవతమునాంధ్రమున వెలువరింపుము'[1]

ఈ తత్త్వమువల్ల ఈశ్వరునారాధించు మార్గములనేకములనియు అందు భక్తి శ్రేష్ఠమును సులభసాధ్యమునై యొప్పుననియు గ్రాహ్యమగుచున్నది.

పోతన తన చిత్తవృత్తి ననుసరించి చేసిన సింగన్నృపాల వనవర్ణనవల్ల భగవంతుని భక్తి తాత్పర్యములతో కొలుచుట, తాపస జీవనము సాగించి పరోప కారము త్యాగభావము కలిగిమెలగుట, సంసారమున నుండియు అంటియంటకుండ వైరాగ్య భావనతో జీవయాత్ర సాగించుట ఉత్తమమను సందేశమందుచున్నది.

గంగామతల్లిని వర్ణించుచు పోతన,

"నదుల నామరూపమ్ములు నడకగల్గి నంతపఱకె యావల నొకటగునటంచు
భేదబోధకమాయాపనోదకమగు నిర్మలాద్వైత తత్త్వమ్ము నిర్వచింతా"[2]

అని అనుటలో అద్వైతమే చరమము పరమమైన సిద్ధాంతమని తెలియుచున్నది.

తత్త్వబోధలో శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రున కుపదేశించినది ప్రత్యేక ప్రాధాన్యము వహించియున్నది. ఇది వేదాంతసారమును చక్కని యుప మాన ద్రవ్యములతో నందించుచున్నది, మచ్చునకొకటి రెండు పేర్కొందును.

జననమరణ వృక్ష సంప్రాప్తిఁ బొందించు విషయ సంగకర్మ బీజమొకటె
దానిఁ జ్ఞానవహ్ని దగ్ధము గావించి బంధముక్తిఁ బరమ పదవిఁగనుము"[3]

"నాల్గు నాళులుండి నాశమౌ మేనికై సకల సుఖవపతులు సంతరించు
నద్దెకొంపనెంత దిద్ది తీర్చిననేమి వెడలు మనిన దినము విడువవలెను"[4]

తానె పోవుచె టిఁగి దారపుత్ర వియోగమునకు నేడ్చు ప్రాణి ముగ్ధుఁడగుచుఁ
దలమె పోవునను జెవుల పోఁగులకునేడ్చు వానినేమి యనగవలయుఁ
బుధమి"[5].

1. పోతన చరిత్రము 6-63 నుండి 71 వరకుగల పద్యములు భావము
2. ,, 5-59
3. ,, 10-94
4. ,, 10-97
5. ,, : 10-103

ఇట్టివే యనేక తత్త్వ వైరాగ్య విషయక నీతులు చక్కగా ప్రబోధింపబడి యున్నవి.

## వైరాగ్య బోధ :

కావ్యమున వైరాగ్య విషయక సందేశము పలుతావుల అందింపబడి యున్నది. శ్రీనాథుడు భార్యా వియోగమునంది కూతురు శారదను తోడ్కొని పోతన యింటికివచ్చి వగచినప్పుడు పోతన యాతని దుఃఖోపశమనమునకు వైరాగ్యబోధ కావించెను.

జీవితము విషాదాంతనాటకము. ఇందు చివర మంగళముపాడు సమర్థుడు లేడు. భూమిమీదపడు శరీరచ్ఛాయలో బహువిధ చిత్ర విచిత్ర వర్ణసౌందర్యములు లయమైపోవును. నేత్రముఖాదుల సొగసులు కానబడవు. మృత్యు స్వరూపమిట్లే యుండును. మృత్యువెప్పుడును కబళించుటకు వెన్నాడుచునే యుండును. పాంచ భౌతికమైన యీ దేహమునందలి వాయ్వగ్ని జలాదులు సోదరభావముతో నున్నంత సేపే ఈ శరీరరథము క్షేమముగ సాగును. ఆ భూతములు పాలిపగబూని విజృంభించెనేని శరీరము క్షణములో నశించిపోవును. ఈ పంచభూతాలకు ఆజన్మ శత్రుత్వము ప్రబలమగుటచేత దేహము స్థిరమైనదని నమ్ముటకు వీలులేదు. జనన మరణములు నైసర్గికములు. వీనితోగూడిన కాలచక్ర యాత్ర కంతులేదు. పూర్ణ మైన ఆ పరబ్రహ్మమునుండియే యీ చరాచరపూర్ణ జగము లుద్భవ మందుచు లయమగుచున్నవి. ఈ సృష్టి లయములవల్ల ఆ పూర్ణమెట్టి లోపమును పొందక స్థిరమైయుండును. పున్నమ చంద్రబింబములు పూర్ణములైన తటాకఘటాదు లందు ప్రతిబింబించి పూర్ణచంద్రునిలో లీనమైపోవును. '1

ఈ వాక్యములవలన మృత్యువెవరికిని తప్పదనియు, అన్నిటిని లయమొన రించు ఆ మృత్యువు ఛాయారూపములో ఎప్పుడును కబళించుటకు వెంటాడుచుండు ననియు, పాంచభౌతిక శరీరము నమ్మదగినది కాదు, పరమాత్మవలన అంతులేని యాత్రగా ప్రాకృతికముగా సంభవించుచున్న ఈ జనన మరణాలకు వగచి ప్రయోజనము లేదనియు ప్రబోధితమై దేహభ్రాంతి సడలి మనస్సునకు శాంతి కలుగును.

1. పోతన చరిత్రము : 327 నుండి 336 పద్యముల భావము. (తృతీయాశ్వాసము)

ఈ సందర్భములో చివర చెప్పిన

"పూర్ణమునుండి పెక్కులిలఁ బూర్ణము లద్భవమంది మాయ నా
పూర్ణము తాను లోపమును బొందక యెప్పుడు నిల్చునెట్లనన్
పూర్ణిమ చంద్రబింబములు పూర్ణతటాక ఘటాదులందు సం
కీర్ణత నొంది జీవనము కీడ్పడఁ బూర్ణశశిన్ సమైక్యమా"[1]

అనునది యుపనిషద్వాక్యమగు

"ఓమ్ పూర్ణమదం పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే"[2].

అను శ్లోకము ననువదించుచు పద్యమున ఉత్తరార్ధమున పూర్ణిమ చంద్రబింబాద్యు పమానము చేత దానిని విశిష్టముగా వివరించుచున్నది.

సింగనృపతి వనవర్ణనలో పోతన, నీళ్లలో నీదుచు మునిగితేలుచు రెక్కల కొక్క జలకణమైనను నంటకుండ బాతువులు దరిజేరుననుటలో నరుడు సంసారి యయ్యు వ్యామోహముతో అందులోబడి నశింపక ఆ సుఖములు స్థిరములుగావు, పర మాత్మయొక్కడే గమ్యము గతి యను వైరాగ్యభావనతో కాలము గడపి జన్మ తరింపజేసికోవలెనను ఉపదేశము లభించుచున్నది.

పోతన గంగాసైకతమున ఈశ్వరుని ప్రార్థించుచు పలికిన మాటలలో,

"గాత్రము కాచపాత్ర త్రుటికాలము నమ్మ వశమ్ముగా దహో!
చిత్రమగున్ ధనాశ యన ఛిద్ర ఘటమ్మటు నిండ దెన్నడున్
పుత్ర కళత్రముల్ వనులఁ బోయెకి దారిని గొంత దూరమున్
మాత్రమె వెంటవచ్చి తమ మార్గమునన్ జను పాంథులో ప్రభూ!"[3]

ఇత్యాదులు శరీర క్షణికత్వమును, దార పుత్ర ధనముల యస్థిరతను చక్కగా నిరూపించి తదీయ భ్రమలు విడచి జీవుడు శాశ్వతమగు పరమునకై పాటుపడ వలెనని ప్రబోధించుచున్నవి.

1. పోతన చరిత్రము : 3.336
2. ఈశా వాస్యోపనిషత్తు - శాంతి పాఠము.
3. పోతన చరిత్రము : 5-70.

ఇట్టిదే మకర గ్రస్తమై నరక బాధలనుభవించుచున్న గజేంద్రుని జూచి చేయునది లేక తాపపడుచు కరేణుగణము వెడలిపోగా

"ఈ రథ ప్రయాణమ్మున నిరుగు పొరుగు తరులతాదు లాప్తుల గతి
దనదు వెంట
వచ్చునటు దోఁచుఁగాని యెవ్వరును రారు రథిని వెన్నంటి యుండు
సారథి యొకండె"[1]

అని చెప్పబడినది. జీవుని వెంట కర్మ తప్ప ఏదియును రాదు. 'అర్థా గృహేషు వర్తంతే, శ్మశానే మిత్ర బాంధవాః, సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి' అని పుణ్యపాపములే జీవుని వెంట బోవునని చెప్పబడినది.

విజయనగర సేనాపతి నుండి భాగవతము విడిపించి రాచకొండలో సింగ నృపతి సమక్షమున తీసికొనరమ్మని ఆ చమూపతి యనగా పోతన వికల మనస్కుడై పలికిన వాక్కులలో వైరాగ్య సందేశము లభించుచున్నది.

జీవితమును మృదంగముతో పోల్చి యెడమ ప్రక్క యిహమనియు కుడి ప్రక్క పరమనియు నిరూపించి పరమే గతియని దానికోసము కృషి చేయవలెనని ప్రబోధించుట జరిగినది. మరియు దార సుత ధనాదులను నమ్ముకొని పారలౌకిక సుఖము లేదను మూఢుడు తల్లిచంట నొకట ప్రాలు ద్రావుచు వేరొక చన్ను లేదనుకొను పసివాడనియు, నాది నాదను భావముచేత మమతాబంధము పీడించును కాని కాదు కాదను భావము వృద్ధిచేసికొన్నచో వైరాగ్యము పెంపై దుఃఖములు లేక పోవుననియు వివరించుటచేత ఇహపరముల రాగవిరాగముల భేదమోదములు చక్కగా బోధింపబడుచున్నవి.

మనశ్శాంతికి వైరాగ్యమే తగిన యౌషధమను విషయము పోతన

"అందుఁ గేను నాకుఁ గృతియందు విశ్మద్ధిని జెందు సంగ బు
ద్ధిం దునుమాడ నాత్మఁగడుఁ శ్రీవకృపిన్ బొనరింతు, మిమ్మనే
మంచు విరాగభావమొక మందయి శాంతిని గూర్చుగాక నా
డెందము నందు.... ...."[2]

1. పోతన చరిత్రము : 12-38.
2. ,, : 9-200

అని యనుటవలన దెలియుచున్నది. ఈ విధముగా కావ్యమున ననేక సందర్భము లందు భక్తిజ్ఞాన వైరాగ్య విషయములు ఆయా పాత్రల ద్వారమున ప్రబోధింప బడి యున్నవి. ఇవి తరచుగా వాచ్యరూపమున నుపదేశింపబడినవి. చిదానంద గురువరేణ్యుని బోధలో, పోతన తానితరులకు బోధించినవానిలోను, ఆత్మలో విచారించుకొనిన వానిలోను ఈ వాచ్యోపదేశము సమంజసమై యొప్పినది. కాగా ఈ సందేశోపదేశములు కేవలము సిద్ధాంతములుగా నీతులుగా మిగిలిపోలేదు. అనుష్ఠాన పూర్వకమైన ఆదర్శ జీవనము వలన వ్యంగ్యముగను ప్రబోధించిన వైనము ప్రశస్తముగా భాసిల్లుచున్నది.

## భక్తి ప్రబోధము :

పోతనకు చిదానందుడు మంత్రోపదేశ సందర్భముననూ, భాగవతతత్త్వోప దేశ సందర్భముననూ మోక్ష మార్గములలో భక్తి సులభమైనది శ్రేష్ఠమైనదని చెప్పి యుండెను. ఏతదనుసారముగా పోతనయు ఆచరణపూర్వకముగా భక్తి ప్రాధాన్య మును ప్రవచనము చేయుచు బేహారి యడిగినప్పుడిట్లు ప్రవచించెను.

> "శక్తికి లొంగక శాస్త్రపు యుక్తికిని నలితుఁడగుచు నుండు నృహరి తా
> భక్తికి వశుఁడై శాశ్వత ముక్తిప్రదుఁడై వెలుంగు ముందుఁజెలంగున్"[1]
> "పెరయింతి దరినున్న బిడ్డ మాతనుగాంచి కైసాఁచి యేడ్చెడి కాంక్ష భక్తి
> పదసేవయొసఁగి నాపతి దయన్నను జూచుటెపుడను విరహిణి యేడ్పు భక్తి
> దారితప్పిన బాటసారి యూరుంజేరఁ బడియెడి తహతహపాటు భక్తి
> బంధితుండల యాత్మబంధువున్ గని స్వీయ ముక్తికై యేడ్చు నాసక్తి భక్తి
> ముక్తికాంత భోగమునకు సర్వస్వము త్యాగమొసఁగు ప్రేమధనము భక్తి
> శాంతి రూపశీల సమితి నవిచ్ఛిన్న తైలధారవంటి తలఁపు భక్తి"[2]

ఇందు భక్తికిడిన యుపమాన పూర్వక నిర్వచనముల వలన పరమాత్ముని చేరుటకు జీవుడు అత్యంతమైన ప్రేమతో పరితపించుటయే భక్తియని తేలుచున్నది. మరియు మోక్షసుఖార్థము సర్వస్వము త్యాగమొనర్చు ప్రేమధనమే భక్తి యనియు చక్కగా నిర్వచింపబడినది ఇది మధుసూదన సరస్వతి నిర్వచించిన

1. పోతన చరిత్రము : 6-185
2. ,, : 6-186

"ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తిర్భక్తి రిత్యభిధీయతే"[1]

అను భక్తి లక్షణమునకు సరిపోవుచున్నది. అనగా భగవద్గుణ శ్రవణాదులచేత ద్రవీభూతమై ఆ భగవంతుని యందు ధారావాహికమైన చిత్తవృత్తి యుండుటయే భక్తియని చెప్పిన పైశ్లోక నిర్వచనము ఆచార్యులవారు చేసిన నిర్వచన మొకటేయై యొప్పుచున్నది. ఈశ్వరునియెడ అత్యంతమైన ప్రేమ గలిగి తైలధారవంటి నిరంతర చింత కలిగి యుండుటయే భక్తియని తాత్పర్యము. భక్తి సూత్రకర్త లగు నారదుడు 'సాత్వస్మిన్ పరమప్రేమరూపా' యనియు, శాండిల్య మహాముని 'పరానురక్తిరీశ్వరే' యనియు నిర్వచించిన విషయమును, ఈశ్వరుని యెడ గల పరమ ప్రేమయే భక్తియని తేల్చి చెప్పుచున్నవి. 'భజ్' అను ధాతువునుండి ఏర్పడిన 'భక్తి'కి 'సేవ' యను నర్థము వచ్చును. దీనిచేత అంతరంగ భక్తి ప్రేమయనియు, బహిరంగ భక్తి సేవ యనియు గ్రహింపనగును.

మరియు పై సందర్భముననే భక్తిప్రశస్తి యిటుల కొనియాడబడినది.

"అఖిలభుక్తములను హరియించు జఠరాగ్ని యటులు పుణ్యాపాపహతి
నొనర్చి
యంబుభేద ముడుప నబ్ధిఁ జేర్చెడి గంగ వడువు హరి సమైక్యమిడును
భక్తి"[2].

ఇట్లు భక్తి సర్వకర్మ బంధములనుండి విముక్తిగావించి హరిపదప్రాప్తి గూర్చునని చెప్పుటయేకాక విద్యాధనాది విభేదములుడిగి ముక్తసంగులై యొప్పు భక్తవరుల నాశ్రయించెడువాడుకాక కలికాలమున భవజలధి దాటలేడనియు, భక్తుని జననము వలన వంశము తరించి యతని స్పర్శనముచేత భూమి పావనమై తీర్థములు సార్థకములై, ఆ భక్తిని ప్రస్తుతించు శాస్త్రములు సచ్ఛాస్త్రములై వెలయు నని వివరించుట జరిగినది. మరియు భక్తుడు,

"వాదమ్ములుడిగి మూకాస్వాదనగతి హరిగుణానుభవ పీయూషో
న్మాదుండై యేకాంత వినోదత నగు నేడ్చు వాకొనున్ దను దానే"[3].

1. భగవద్భక్తి రసాయనము : ప్రథమోల్లాసము. 3 వ శ్లోకము.
2. పోతన చరిత్రము : 6-187.
3. ,, ,, : 6-191.

అని హరిగుణానుభవామృత పానముచేత పిచ్చివానివలె తనకు తానే నవ్వును ఏడ్చును మాట్లాడును అని తెలుపబడినది. ఇట్టి భక్తునియొక్క విశిష్ట ప్రవర్తన మెల్ల ప్రహ్లాదునిలో మనము కాంచగలము. అతడు,

'పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్........ శ్రీనారాయణపాదపద్మ
యుగళీ చింతామృతాస్వాద సంధానుడై యేతద్విశ్వమున్ మరచుచు'

'వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడై యొక్కడు నేడుచు నొక్కచోట....'

అని మున్నగు రీతిగా ఏడ్చి, పాడి, నగి, గంతులువైచి పలికి పిచ్చివానివలె ప్రవర్తించిన విషయము భాగవతమున ప్రసిద్ధముగా వర్ణింపబడియున్నది.

హరిభక్తిపలని ప్రయోజనమిటుల వచింపబడినది.

"ఔరసుడని విధికి నామ్నాయ ధనమిచ్చె సతియటంచు రమకు స్వాంత
మొసగె
నైననేమి భక్తుడార్తుడై పిల్చిన వీరి విడిచి పుచ్చి వెడలివచ్చె"[1]

ఇందు శ్రీహరి తన కొడుకని బ్రహ్మకు వేదధనమిచ్చి, ఇల్లాలని లక్ష్మికి హృదయ మిచ్చి యున్నప్పటికిని గజేంద్రునివంటి భక్తుడార్తితో పిలువగా వారందరిని వదలిపెట్టి వచ్చి ఆదుకొనెననుటలో భగవంతునికి భక్తునికంటె ప్రియతముడు లేడనియు, భక్తికి వశమై అతడాపదలు తొలగించి వరములిచ్చుననియు విశద మగును. భక్తికి మించిన భగవత్ప్రాప్తి మార్గము లేదని యుపదేశించుటయే దీని పర మార్థము.

మరియు దైవభక్తిగురించి అందందు మరికొన్ని ప్రబోధములు కావింపబడి నవి. పంటలను చెడగొట్టు వాన పడు సూచన గ్రహించి పోతన పరితపించుచు దుఃఖదైన్యహరుడగు హరుని స్మరించిన సందర్భములో ఇట్లనును.

"........స్వామీ! భవాధీనంబైన విభూతి తావకకృపాదృష్టిన్ విభూతి
ప్రదంబౌ నాదృష్టి తిరోహితంబయినఁ జేయంజాలెడిన్ బూదిగన్"[2]

ఇందు ఈశ్వరాధీనమైయుండు విభూతి దయాదృష్టితో చూచిన విభూతి (ఐశ్వర్యము) ప్రసాదించును. అతని దయ ప్రసరింపనిచో బూదిగా మార్చి

1. పోతన చరిత్రము : 6-192.
2. ,, ,, : 3-94

వేయగలదు. ఇక్కడ ఐశ్వర్యము, బూడిద యను సర్థద్వయశోభితమగు 'విభూతి' శబ్దము వికృతి రూపమున (దయావైపరీత్యమున) బూదియగునని స్ఫోరకముగా ప్రయుక్తమైయున్నది.

నరుడు తనకు తానే కర్తయనుకొని నిన్నుగనడు నీ దయగాంచడు. నీ మహాశక్తి లేనిది తృణమైన గదలదని మునులన్నారు. కాని పరిమిత శక్తి యుక్తులుగల మానవుడు ఒక కొంత తోటపెంచి తాను కర్తనని రొమ్ము బాదుకొనును కాని మహారణ్యములు సృష్టించిన మహాదేవుని మరచిపోవును అట్లే భూమి మీద నొక మేడ గట్టి తాను ఘనుడననుకొనునుగాని భూమినే సృష్టించిన దేవుని తలపడు.

"తనకు భృతినొసంగు ధనికుని గని మ్రొక్కు తనకు ధనికునకును ధరణి కంత

నన్న వస్త్రములిడు హరినెంచి మ్రొక్కడు దూరదృష్టిలేని దుర్ముఖుండు"[1].

అని యనుటచేత మానవుడజ్ఞానియై తననేదో పోషించు శ్రీమంతునికి మ్రొక్కును గాని అందరికిని దిక్కై పోషించు దేవుని స్మరించి మ్రొక్కడని తెలియుచున్నది. ఇంకను అమ్మ యిచ్చిన బొమ్మను నమ్మి ఆ యమ్మనే మరిచి బొమ్మతో ఆడుచు ఆకలి యైనంతనే బొమ్మను విడిచి అమ్మా! యని యేడ్చు శిశువువలె నరుడు ఆపదలు దాపరించునపుడు నిన్ను స్మరించి యేడ్చునని చెప్పబడినది. ఈయెడ

"దుఖ్‌మే సుమిరన్ సబ్‌కరై, సుఖ్‌మే కరై న కోయ్
సుఖమే సుమిరన్ జో కరై దుఃఖ్ కాహే కో హోయ్"

అను కబీరు మహాకవి ద్విపద తలపునకు వచ్చుచున్నది. ఇట్టి సందర్భమున పోతన దైవస్మరణలో తలపోసిన వానివలన మానవుని శుభాశుభములు పరమేశ్వరుని యనుగ్రహ నిగ్రహాధీనములనియు, మనుజుడజ్ఞానాహంకారములచేత తానే కర్తనని విఱ్ఱవీగుచు సృష్టికర్తను జగత్పరిపోషకుని పాటించడనియు ఆపదల పాలైనపుడు మాత్రము దేవుడు జ్ఞప్తికి వచ్చి ఏడ్చుననియు కావున పరమాత్మునిదయ నపేక్షించి శరణాగతుడై నిరంతరము స్మరణ చేసిన దుఃఖములు కలుగక శుభములు చెలగు ననియు నుపదేశము లభించుచున్నది.

1. పోతన చరిత్రము : 8-98

పోతన పరమభక్తుడై తత్త్వజ్ఞానియై ఐహిక భోగవిరక్తుడై పారమార్థిక జీవనము సాగించి శ్రీకైవల్యము చేరిన సత్పురుషుడు. భగద్గీతలో

"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః"[1]

అని చెప్పబడినట్లు బహుజన్మ సంచిత పుణ్యవశమున ఆత్మజ్ఞానియై సర్వము వాసుదేవుడని గ్రహించి అతని నారాధించిన మహాత్ముడు. ఇట్టి వారరుదుగా నుందురు. ఈ దృశమైన పోతన జీవిత చరిత్రము పాఠకులకు భక్తిని జ్ఞానమును వైరాగ్యమును పూర్వోక్తముగా నుపదేశించుచున్నది. దీనికి నిదర్శనముగా పోతన జీవిత వృత్తమువల్ల వ్యంగ్యముగా లభించుచున్న యుపదేశమును పరిశీలింతము.

## పోతన జీవితము వలన గ్రాహ్యమగు భక్తి జ్ఞాన వైరాగ్యములు :

పోతన ప్రహ్లాదునివలె తల్లి గర్భమున నున్నపుడే భక్తిజ్ఞాన ప్రబోధితుడై యుండెను. ఇట్లు సహజ భక్తి తత్త్వవిలసితుడగు నతడు పాల్కురికి జాతర కారణమున తల్లిదండ్రులచేత తత్త్వమొకింత గ్రహించి చిదానంద యోగివలన మంత్రోపదేశ పూర్వకముగా భక్తి జ్ఞానములను లెస్సగా నెరిగి గురూపదిష్ట మార్గమున నియమ నిష్ఠలతో తపమాచరించి సిద్ధి పొందెను. వాగ్దేవీకరుణ వలన మహాకవిత్వము, రామానుగ్రహమువల్ల ఐహిక పారమార్థిక శుభములు కలిగెను. జిజ్ఞాసువై ముముక్షువై గురూపదేశానుసారముగా ఉపాసించిన మనుజుడు చరితార్థుడగునని యీ ఘట్టములు విశదము చేయుచున్నవి.

భగవంతుని అనన్య భక్తి విశ్వాసములతో కొలిచి అతనిపై భారము వేసి ధర్మజీవనము సాగించు వారికాభగవంతుడే యతని రక్షణ పోషణ భారము వహించి అనేక విధముల తోడగుచు ఆపత్కాలములందాదుకోగలడన్న మహోపదేశము పోతన జీవితము నుండి ప్రధానముగా లభించుచున్నది.

1. భగవద్గీత : విజ్ఞానయోగము, 19 వ శ్లో.

పోతన గోదావరిలో శ్రాద్ధ విధి నిర్వహించి శివధ్యాన నిష్ఠాగరిష్ఠుడై ఆర్తితో ఈశ్వర సాక్షాత్కారమునకు ప్రార్థింపగా శ్రీరాముడు దర్శనమిచ్చి తన కంకిత ముగా భాగవత మాంధ్రీకరించుమని యానతీయగా

"వేయాఱుల్ కవిపండితాగ్రణులు పృథ్విన్ వెల్గఁగా నీ పద
ప్రాయుండే త్వదమేయ భవ్యకరుణా పాంగైక పాత్రుండుగా
నేఁడే జన్మతపో విశేష మొకటై యేతమ్మెలెత్తెన్ హరీ!
నీ యాస్థాన కవీంద్రుఁడౌటకిటు పండెన్ నాయదృష్టమ్మహో!"[1]

అని వినమ్రతతో కించిద్జ్ఞుడగు తాను శ్రీరాముని ఆస్థాన కవీంద్రుడగు భాగ్యము పట్టినందులకు సంతోషించెను. పరమ భక్తులకు తప్ప నిట్టి దైవానుగ్రహము కలుగదని దీనివలన గ్రాహ్యమగుచున్నది. ఇక్కడ మరొక విశేషమున్నది. భక్తుడైన పోతన భాగవత రచనకు తానే కర్తనని యహంకరించలేదు.

"ఇది భగవదాజ్ఞ, యేమున్నది నాశ్రమమిందు మూఁగనాల్కన వాణిన్
పొదలించి పంగువున్ గిరినదులన్ దాఁటించు ప్రభువు నాయెడఁగలఁగన్"[2]

అని వినమ్రుడై భరన్యాసము కలవాడై రచన కుపక్రమించెను. ఇక్కడి యీ మాటలు 'మూకం కరోతి వాచాలం' అన్న ప్రసిద్ధ శ్లోకార్థము ననుసరించి చెప్ప బడినవి. ఈ సందర్భములోని పోతన వర్తనమెల్ల 'రామశ్శస్త్ర భృతామహమ్'[3] (శస్త్రధారులలో శ్రేష్ఠుడనైన రాముడను నేను) అనియు, 'నిమిత్తమాత్రం భవ సవ్య సాచిన్'[4] (ఓ అర్జునా! నీవు నిమిత్తమాత్రుడవై యుండుము) అను గీతోపదేశాను సారముగా ధన్యముగా సాగినది.

పోతన కంతకుముందు దీన భిక్షుక రూపమునవచ్చి భాగవత రచనకు గంటమిచ్చుట, గజేంద్ర మోక్షణ కథారచనలో రామశర్మగా వచ్చి 'అల వైకుంఠ పురంబులో' అను పద్యమును పూరించుట, రుక్మిణీ కళ్యాణ గాథారచనలో కమరిన పోతన కూతురు లక్ష్మి పునర్జీవితయగుట యెల్ల శ్రీహరి భక్తజనపాలకుడన్న విషయము చాటుచున్నది ఇక్కడ ఒక్క విశేషము కలదు. 'చెప్పవచ్చు లక్ష

1. పోతన చరిత్రము : 5-114
2. ,, : 6-24
3. భగవద్గీత : విభూతి యోగము, 31 వ శ్లో
4. ,, : విశ్వరూప సందర్శన యోగము; 33 వ శ్లో

చేయరాదొక్కటి' యన్నట్లు ఇతరులకనేకముగా సుద్దులు చెప్పవచ్చును. కాని తన మీదికి వచ్చినప్పుడాచరించువాడే నిజమైన భక్తుడు, జ్ఞాని. పోతన యట్టివాడు కావుననే తన కూతురు లక్ష్మి కుంపటి నిప్పుచేత కమరినప్పుడు వైద్యులు బ్రతుకదని పెదవి విరచిపోగా, భార్య బోరున నేర్చుచుండగా స్థితప్రజ్ఞుడును భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసము కలవాడునునైన యతడు 'సతి నేడ్వంబోకు మనుచు బిట్టు వారించి ధృతి చిక్కబట్టుకొనుచు వగవకుము శౌరి మనకిట్టి వంత లిడునె వాని కల్యాణ కథలేను వ్రాయువేళ'[1] అనియు

నరుడీ సంసరణాపదంబునిధి మున్కల్ వేయుచున్నప్పుడా
హరి స్మర్తవ్యుడటంచు ప్రాజ్ఞులిటు దుఃఖాంభోనిధిన్ మున్గి వం
దుర నా కేటికె వాని సచ్చరణ భక్తున్ వీతిహోత్రజ్వలత్
కరముల్ తోకనుదాక వా దొరయె నాకాపయ్యె నంచున్ మతిన్"[2]

కలతలు మాని సత్కవిశిఖామణి న్యస్తభరాత్ముడై....'[3]

రచన సాగించగా శ్రీరామానుగ్రహముచేత లక్ష్మి స్వస్థత గాంచెను. నమ్ముకొన్న దైవము వమ్ముచేయక అవశ్యము రక్షణచేయునన్న విషయమిచట యుపదేశకమై యున్నది. భగవంతుని యీ యార్తత్రాణపరాయణత్వము రాచకొండ చమూపతి యపహరింపబూనిన భాగవతకోశమును వరాహ రూపమున కాపాడుటలో, సహస్ర జన పరివృతుడై శ్రీనాథుడు వచ్చినప్పుడు జ్యోతిపురరాజ్ఞీ వ్యాజమున సహస్రజన సంతర్పణము గావించి మానము దక్కించుటలో ఇట్లే అనేక సందర్భములలో నిరూపితమైనది. చివరకు రాచకొండలో చెదలుపాలై నశింపకుండ భాగవతమును సంరక్షించిన దయ పరాకాష్ఠకుకు చెందినది. భాగవత గాథలలో గజేంద్రాదులను కాపాడిన విషయము జగత్ ప్రసిద్ధమైనదే.

వరాహమూర్తి కృతిరక్షణ చేసినప్పుడు పోతన భక్తి పరవశుడై పలికిన మాటలు ప్రబోధాత్మకములై యున్నవి.

1. పోతన చరిత్రము : 6-211
2. ,, : 6-212
3. ,, : 6-213

"చిన్నవాఁడను నేనెందు నిన్నుఁవీడ ననుస్తనంధయుఁ దక్కఁదా జనని యెందుఁ
పెద్దవాఁడను నేను నీయొద్దనుండ ననెడి సుతునిభారమ్ము మోయం గలుగునె?"[1].

"ప్రబల నైచ్యానుసంధాన భావమూను న్యస్తభరుఁడె భవాంబుధిన్ని స్తరించు మునుఁగునజ్ఞుఁ డహంకార ఘన భారమున బెండ్లు దేలును వాహినిన్ గుండ్లు మునుగుఁ"[2]

ఈ యభిప్రాయమువలన శరణాగతుడైన భక్తునే పరమాత్ముడు కాపాడు ననియు, నైచ్యానుసంధానభావముతో ఈశ్వరునిపై భారము వేయువాడె భగ సాగరము తరింపగలడనియు నుపదేశమిచట లభించుచున్నది. కావ్యమున సప్త మాశ్వాసమున వరాహకృత కృతి సంరక్షణము చేత

'నహి కళ్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత! గచ్ఛతి"[3]
(నాయనా పుణ్యాత్ముడెవడును దుర్గతిపాలు కాడుకదా !)

అను దానికిని, అష్టమాశ్వాసమున శ్రీనాథ కృతపరీక్ష-పోతన విజయము చేత
"న మే భక్త ప్రణస్యతి"[4]

(నా భక్తుడెన్నటికిని నాశనమును పొందడు)

అను దానికిని సరిపడి సజ్జనులైన భక్తుల కాపదలు తొలగి జయము కలుగునన్న నీతి గ్రాహ్యమగు చున్నది.

పోతన త్రికరణ శుద్ధిగా ఐహిక భోగ విముఖుడు, వైరాగ్య సంపన్నుడై వర్తించి, అట్టి వారికే మనశ్శాంతి శాశ్వతానందము ప్రాప్తించునని తన నడవడి ద్వారా ప్రబోధించెను.

మల్లన జన్మించిన పిమ్మట మరల తపమొనరింప వనమున కేగదలచియు సుత మమతాబంధమున బడి పోలేక పోయెను. ఐనను నతడు కర్మబద్ధుడై సంసా

1. పోతన చరిత్రము : 7-267
2. ,, : 7-262
3. భగవద్గీత : ఆత్మ సంయమ యోగము, 40 వ శ్లో
4. భగవద్గీత : 9-31

రమునబడి నశింపలేదు.అతడు జ్ఞానికనుక నిర్లిప్తముగా సంసార యాత్ర సాగించెను. ఈ సందర్భమున నతనిగూర్చి యిట్లు చెప్పబడెను.

"ఈఁత నెఱుంగు వాఁడు మఱి యీఁత నెఱుంగని యాత డిర్వురున్
నూతను దూకినంతనె మునుంగుటలెన్న సమానమయ్యునా
యీఁత నెఱుంగు మానిసి యొకించుకలోనె మునిగి తేలండో
పోతన సంసృతిన్ మెలఁగు పోకడలట్టివె కావొ యారయన్"[1]

ఈత నెరిగినవాడు నూతగూలియు క్షణములో మునిగి తేలునట్లు తత్త్వజ్ఞాని యగు పోతన సంసారము నందుండియు నందులోనే అణగారిపోక తామరాకు మీది నీటి బిందువువలె అంటి యంటక 'బ్రహ్మ విచార కథా సుధా సరోపర లహరీ వితాన గతి వర్తిలు రాజమరాళ బాలయై పరహిత చింతనొందు భవపంకము నంటక యుండు నిత్యమున్'[2] అని చెప్పబడినది. లోకమున ముముక్షువులు రెండు రకముల నుందురు. కొందరు సన్న్యసించి యరణ్యములందు తపమాచరించవలె నందురు. మరి కొందరు గృహస్థాశ్రమమున నుండియే నిర్మములై నిష్కామ కర్మము లాచరించుచు భక్తి తత్త్వ విలసితులై భగవంతుని పొంద వచ్చునందురు. శుకాదులు మొదటి వర్గమునకు చెందినవారు. జనకాదులు రెండవ వర్గమునకు చెందినవారు. పోతన జనకాదుల వంటివాడు. భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నుడు. సంసారము నందుండియు మోక్షమును గాంచగలడన్న యుపదేశము దీనివలన లభించుచున్నది.

పోతన వైరాగ్య చిత్తవృత్తి కనేక ఘటనములు తార్కాణములై యున్నవి. అతడు పరమ దరిద్రుడై సకుటుంబముగా పరిపీడితుడగు చుండియు, రాచకొండ ప్రభువొకవైపు విజయనగరాధీశుడొకవైపు కృతికి నయభయముల నొత్తిడి చేసినను, శ్రీనాథుడు పని గట్టుకొని ప్రాణము మీద కూర్చుండినను ససేమిరా కృతిని నరాంకితము చేయుటకిష్టపడలేదు. తర్వాత రాచకొండ చమూపతి కృతిని తీసికొని పోయి నప్పటి పరాకాష్ఠా దుర్దశలోను లొంగక దుఃఖించక శ్రీహరిపై భారమువైచి. 'విరాగ భావమొక మందయి శాంతిని గూర్చుగాక'యని కృతియందు పెంపొందు సంగబుద్ధిని దును మాడుటకు ప్రయత్నించి అందరిని వదలి అన్నిటిని వదలి పుణ్యక్షేత్రములను సేవించుచు తిరుగసాగెను పోతన వైరాగ్య ప్రవృత్తికి మరొక ప్రబల తార్కాణ

1. పోతన చరిత్రము : 3-292
2. " : 3-293

రాచకొండ ప్రభువు నిండు సభలో కవి మండలి కధ్యక్షునిగా పోతనను సన్మానింప బూనినపుడు తిరస్కరించుట. ఇట్లనేక సందర్భము లందలి వైరాగ్య ప్రవర్తన ద్వారా తదీయ ప్రబోధము వ్యంగ్యముగా లభించుచున్నది.

రాచకొండ చమూపతిచేత భాగవత మపహృతమైన కథాభాగముగల నవ మాశ్వాసమునకు మొదట

'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదా చ న'[1]

అను గీతావచనాను సారముగా కర్మలయందే తనకధికారము కలదుకాని వాని ఫలముల యందుకాదు-అన్న తత్త్వజ్ఞానము కలవాడై పోతన ప్రవర్తించుటచేత నీ విషయముపదేశకమై యున్నది. మరియు అనుబంధ భాగవత కథలు గల ఏకాదశద్వాదశాశ్వాసముల మొదట క్రమముగా

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే''[2]

అను గీతాశ్లోక ప్రథమ, ద్వితీయ పాదము లుటంకింపబడియుండి శిష్టరక్షణకు, దుష్టశిక్షణకు, ధర్మసంస్థాపనకు శ్రీహరి యుగయుగములందవతరించునన్న దివ్యవాక్యము ననుసరించి భక్తిగాథలు సాగి ఆర్తత్రాణపరాయణతను ప్రబోధించుచున్నవి. దశమాశ్వాసమున 'కృతిప్రాప్తి-ఫలశ్రుతి' యనుకథ విలసిల్లి ఆ యాశ్వాసాదిని గూర్చిన

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'[3].

అని పరమాత్ముడాదేశించి యభయమిచ్చిన రీతిగా పోతన న్యస్తభరుడై శరణాగతి పొంది విజయము సాధించుటచేత ఈశ్వరుడు శరణాగతావనుడు వరదుడన్నదానిని కావ్యముపదేశించుచున్నది. కావ్య కథాంతమునకు భగవద్గీతాంతమున గల సకల తత్త్వ సారభూతవాక్యమును సమన్వయింపజేయుట నితాంతౌచిత్యభాసురమైనదే కాక ఎంతటి వానికిని, ఎన్నటికైనను పరమాత్ముడే గతియున్నది చరమముగా పరమముగా ప్రబోధాత్మకమైయున్నది.

1. భగవద్గీత : సాంఖ్య యోగము, 47 వ శ్లో.
2. ,, : జ్ఞాన యోగము, 8 వ శ్లో.
3. భగవద్గీత : మోక్షసన్న్యాసయోగము, 66 వ శ్లో.

నర్సమాంబ దుర్గాదేవిని స్తుతించి శరణువేడినందుకు పత్యనురాగము లభించుటయు, లక్కమాంబ శ్రీశైలేశునికి మ్రొక్కుకొన్నందులకు మల్లన జన్మించుటయు ఈశ్వరశరణాగత రక్షణపరత్వమునే ప్రబోధించుచున్నవి.

ఈవిధముగా పోతన సందర్భానుసారముగా భక్తి జ్ఞాన వైరాగ్యములను నుడువుటచే కాక నడవడిచేతను ఉపదేశించెను.

## 2. మహాకవి ఆదర్శములు :

ఉత్తమాదర్శములు గల పోతనమహాకవి జీవితమువలన కవులకు సారస్వ తేయులకు భవ్యములగు సందేశోపదేశములందుచున్నవి కారణజన్ముడగు పోతనకు పూర్వజన్మ పుణ్యమువలన తపశ్చర్యాపూర్వక వాగీశ్వరీ దేవతానుగ్రహము వలన సత్కవిత సిద్ధించినది.

పోతనగారి సర్వోన్నత కవితాదర్శము కవితాకళను పరమేశ్వరారాధనలో సద్వినియోగము చేయుట. తక్కిన యుత్కృష్టగుణలతలన్నియు ఈ యాల వాలమునుండి ప్రవృద్ధమై పరివ్యాప్తమైనవే. దీనికి రామతారక శారదామంత్రములు బీజములుకాగా వప్త చిదానంద యోగీశ్వరుడు. పోతన హృదయ క్షేత్రమున సముద్భవించిన కవితాకల్పకము భక్తులకు- సాహిత్యానురక్తులకు భవ్య దివ్య ఫలములను ప్రసాదించినది.

పోతనకు ఉన్నత కవితాదర్శములేర్పడుటకు అతని సహజగుణ కర్మ స్వభావములకు తోడుగా చిదానంద గురువర్యుని పరమోపదేశము హేతువగు చున్నది. 'జిహ్వాగ్రవశవర్తినిగ వసించు వాణి నీకు' అనుచు సిద్ధమంత్రముప దేశించి జపవిధానము తెలిపి, ద్వాదశ వత్సరములు బ్రహ్మచర్యవ్రత దీక్షతో మంత్రోపాసన చేయవలెనని తత్ఫలమెరిగించి

> "కృతిని నరాంకితమొనరుప క్షితి నీదు ప్రబంధమునకు క్షీణత కూరున్
> క్షతశేషమ్ములు లక్షణయుతములు గావను నకీర్తి నొందును బుత్రా!"[1]

అని ప్రబోధించినది మిక్కిలి ముఖ్యమైనది. కృతిని నరాంకిత మొనరింపవలదనగా భగవదంకితము చేయవలెనన్నది గ్రాహ్యము. ఇది పునాది.గా కథాభవనము

1. పోతనచరిత్రము : 2-52

నిర్మితమైయున్నది. మంత్రోపాసన వలని దేవతానుగ్రహముచేత కవిత ప్రాప్తించు ననియు కృతుల నైహిక సుఖభోగముల నాశించి నరాంకితము చేయుట శ్రేయస్కరము కాదనియు నిచట కవులకు ప్రబోధము లభించుచున్నది.

పోతన కవిత వ్రాయనారంభించిన తొలినాళ్ళలోనే పేదజవరాలి దీనావస్థకు జాలిపడి అన్న వస్త్రములిచ్చి యాదుకొని ఆ జవరాలి నవమానపరచిన యువక భూస్వామికి హితోపదేశ కవిత వినిపించి యతనిని మంచిమార్గమున బెట్టిన యుదంతము 'కవిశ్శుచిః' యను నార్యోక్తి ననుసరించి కవియైనవాడు తాను స్వయముగా అమలిన హృదయుడై పరుల కష్ట సుఖముల కనుస్పందించి ఆదుకొనువాడై యుండవలెననియు అప్పుడే తాను సమాజమునకు హితోపదేశముచేయుట కర్హతగల వాడనియు సందేశము లభించుచున్నది. మరియు కవి ఆదర్శజీవను డగుటయేకాక ధీరుడై తన రచనల ద్వారా ఉన్మార్గముల బోవు వారికితవు చెప్పి సన్మార్గముల నడిపింపవలెనన్న యుపదేశమిచ్చుట గ్రాహ్యమగుచున్నది.

సింగభూపాలుని వంటి మహారాజు మెచ్చి తన యాస్థాన కవి మండలి కధ్యక్షునిగా సత్కరింపబూనినప్పటికి పోతన దానిని తిరస్కరించి పలికిన మాటలతీరు సర్వకవి లోకమునకు మహోన్నతాదర్శమైయున్నది.

'ఈ కవీంద్రు జన్మమీశ్వరునికె దక్కనొరులకెప్డు చేతులొగ్గి యడుగదు....' అని యిత్యాదిగా పలికిన వాక్కులవలన కవియైనవాడు పరాత్పరుడైన పరమేశ్వరుని తప్ప నన్యుల నర్థించగూడదనియు, ఐహిక భోగములకొరకు కృతుల నమ్ముకొన గూడదనియు, ఒకరికి తల యొగ్గి యొకరి ప్రభుత్వమున పరాధీనుడై పడి యుండరాదనియు, ఆత్మాభిమానముతో నిర్భయుడై నిరంకుశుడై స్వతంత్ర జీవనము సాగించవలెననియు సందేశము లభించుచున్నది. ఇట్టి సందేశమే భాగవత మంకితముగొన నభిలషించి సింగనృపతి పంపగా వచ్చిన విజయనగర చమూపతి తోడను, పోతన ధిక్కరించి మాట్లాడిన వైఖరిలోను లభించుచున్నది.

ఉభయ రాజ్యాధినేతల నయభయచేష్టలేకాక దుర్భర దారిద్ర్యము, శ్రీనాథుని యొత్తిడి వంటి వెన్ని పైకొన్నను చలింపక తన నిర్ణయమును మార్చుకొనక 'కావ్యకన్యకన్ గూళలకిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్ హాలికులైననేమి ......నిజదార సుతోదర పోషణార్థమై' యని చాటిచెప్పి ధాటిగ నిల్చిన పోతన నడవడి

"....విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి"[1]

అను సుభాషితమునకు లక్ష్యమై యతని స్థితప్రజ్ఞత్వమును వజ్ర సంకల్పమును ధీరతను వేనోళ్ళ చాటుచున్నది. ఈ యుదంతమువలన కవులు తమ సత్సంకల్పములలో దృఢచిత్తులై ధీరులై కార్యశూరులై యుండవలెననియు, నీచులకు కృతులిచ్చి నీల్గుటకంటె మడి దున్నుకొనియో అడవులలో కాయలు గడ్డలు తినియో స్వతంత్ర జీవనము సాగించుట మేలన్న నీతి గ్రాహ్యమగుచున్నది. ఈ యన్నిటిని మించి సరస్వతీదేవి సాక్షాత్కరించి నన్నమ్ము కొందువా యని విలపించినప్పుడు 'నిను నాకటికిన్ గొనిపోయి యల్ల కర్ణాట కిరాట కీచకులకమ్మ త్రిశుద్ధిగ నమ్ము' యని యామె కన్నీరు దుడిచి చెరబడకుండజేసిన పోతన మహత్తర త్యాగము, వాస్తవ వాగ్దేవి భక్తి లోకోత్తరమై యుగ యుగాల జగజ్జగాల కవులకు ఎత్తిన అఖండ దీపస్తంభమై ఎన్నడు చెదరని ధ్రువతారయై ప్రకాశించుచు మార్గ దర్శనము చేయుచున్నవి.

సుకవి వినయాదిక సుగుణ సంపన్నుడై యుండవలయునన్న మరొక యుపదేశము పోతనగాథ వలన లభించుచున్నది. గౌతమీ సైకతమున శ్రీరాముడు సాక్షాత్కరించి భాగవతమాంధ్రీకరించి తనకు సమర్పించుమని యానతి యిచ్చినపుడు,

"నాతరమౌనె 'యో యనిన నా' యనరాని విమూఢ జన్మ నో
పూతచరిత్ర! నిన్ గృతి విభూషితుఁ జేయుచు మెప్పుగాంచఁగా....[2]"

అనియు,

"వేయాఱుల్ కవిపండితాగ్రణులు పృథ్విన్ వెల్గఁగా నీ పశుప్రాయుండే"....[3]

అనియు మిక్కిలి వినీతుడై నుడివెను. అందుకే 'పలికించెడువాడు రామభద్రుం' డని సంపూర్ణ విశ్వాసముతో ఆంధ్రీకరించెను. ఇక్కడి యీ పోతన వాక్యములు ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుడు.

1. భర్తృహరి సుభాషితము : నీతి శతకము–ధైర్యపద్ధతి, 73 వ శ్లో.
2. పోతన చరిత్రము : 5-113
3. ,, 5-114

'స్వామీ! నన్ను నితఃపురాపఠిత శాస్త్రగ్రంథ జాత్యంధు........' అన్న వినీత వాక్కులను పురుడించుచున్నవి. ఉత్తమ ప్రకృతిగల సుకవీంద్రులందరు వినయ విభూషితులే కాళిదాసు, నన్నయ, తిక్కన, ఎఱ్ఱన మున్నగు సత్కవి వరేణ్యులట్టివారు.

ఏ క్షేత్రమునందైనను నెంతటి ప్రగతిని సాధించినను అహంకరించనివాడే యుత్తముడు. 'న్రమత్వేనోన్నమన్తః' అని భర్తృహరి నుడివినట్లు సుజనులు వినయముచేత ఉన్నతిని పొందుచు జగత్పూజ్యులగుచుందురు. అహంకారిని లోకులు అసహ్యించుకొందురు. 'సర్వజన సమ్మతుండగు గర్వముడిగి' యన్నది మహా భారతమున యక్ష ప్రశ్నకు యుధిష్ఠిరుని సమాధానము. ఈ గర్వము మిక్కిలి నింద్యమైనది. అనర్థదాయకమైనది.

"కామమునఁ బుట్టి క్రోధాన గండు మీఱి లోభమోహాల కైపు పెల్లునను రెచ్చి
మదపురక్కసి వెల్గ్రక్కు మత్సరంపు విషము మానవ ప్రాణముల్
విహ్వలింప"1

"అంతులేని బ్రహ్మాండంబులందు వట్టి కంటికానని యొక ధూళికణము నరుఁడు
తెలిసినవి యొక్క కొన్నియే తెలియరాని వున్నవెన్నెన్నొ దేనికీ
యుఱుకులాట?"2

అన్నట్లు మానవులు పరిమితశక్తియుక్తులు గలవారు కావున అహంకరించుట తగదని మహాత్ము లెల్లప్పుడును విన్రములై యుందురు

పురాతనాధునాతన కాలములందును కవులలో ఉద్ధతులు వినీతులు కలరు. వారు తమ తమ గుణకర్మ స్వభావముల కనుగుణముగా ఫలానుభవము గాంచినారు. పోతన అఖండ పాండితీమండితుడయ్యు, అనుపమ కవితా రచనాశోభితుడయ్యు సాధుస్వభావము కలిగి న్రమత వెలిగి సర్వజన ప్రియుడై సకల కవిలోకమున కాదర్శమూర్తియై విరాజిల్లినవాడు. పోతనగారి యీ న్రమత అనేక సందర్భములందు గోచరించుచుండును. శ్రీనాథుడు సహస్రజన పరివృతుడై బమ్మెరకు వచ్చి భోజనానంతరము భాగవతము వినిపింపుమనగా పోతన

1. నా 'మణిమంజూష'లో 'అహంకారము' కవిత
2. నా 'మణిమంజూష'లో 'అహంకారము' కవిత.

'నాభాగ్యము మీరనుటయె చాల్పదివేలని
వినయసుధాస్రవదుదార విధువదనుండై '[1]

"అనఘా! మీ మనునేఁగవినని చెప్పగ సిగ్గుపడెదనై నను మిము బోల్
ఘనులకడఁ జదివినవె సంకునఁ బోసిన తీర్థమగుచుఁ గొమరొందుఁ
గృతుల్"[2]

అని సవినయముగా మనవిచేసి కావ్యగానమొనర్చెను. మెట్టుగుట్టపై మడికొండ పండితులు ప్రజలు భాగవతశ్రవణ మభిలషించినప్పుడును ఇట్లే పోతన వినీతుడై విన్నవించెను.

అధ్యాపకుని బోధకంటె సుకవి వాణి గొప్పదన్న నీతి పోతనను వినుతించిన యువక భూస్వామి వాక్కుల నిట్లు ప్రబోధింపబడినది.

"ధరనుపాధ్యాయుఁడెదొ యొక్క తరుణమందుఁ బ్రాంత పరిమిత
జనులకు పాఠమిడును
గాని సత్కవివాణి శిక్షణమొసంగు సకల కాలమ్ములందు విశ్వప్రజలకు"[3]

ఈ రీతిగా పోతన పావనమైన కవితాకళను ఈశ్వరారాధనలో వినియోగించి, కృతిని నరాంకితము చేయక, భోగార్థియై భూపతులను గొలువక, స్వాభిమానముతో స్వచ్ఛజీవనము స్వచ్ఛంద జీవనము సాగించి వినయాదిక సుగుణమణి విరాజితుడై విశ్వకవులకు విశిష్టాదర్శమూర్తియై దివ్య సందేశము తన చరిత్రము ద్వారా అందజేసినాడు. పైన పేర్కొనిన కవితాదర్శముల వలన జీవితములో కొన్ని కష్టనష్టములు సంభవించినను శాశ్వతానందము మనశ్శాంతి, సత్కీర్తి సంప్రాప్తించి జన్మము సార్థకమగునన్న ప్రబోధము లభించుచున్నది.

## పోతనగారి సాహితీ జీవిత ప్రామాదికములు :

మహాపురుషుడు మహాభక్త కవిశిరోమణియైన పోతనకు సాహిత్యజీవితములో కొన్ని ప్రామాదికములు దొరలినవి. అవి అతనికే కాక మానవులందరికి గుణ

1 పోతన చరిత్రము : 8-88
2. ,, : 8-89
3. ,, : 2-131

పాఠము నొసగుచున్నవి. కాగా అంతటి మహానుభావునికి పొరపాట్లు జరిగినవా యనగ అతని ఆరాధ్య దైవమగు శ్రీరామచంద్రునికే జరిగినవనగా పోతనకు జరుగకుండునా? 'ప్రమాదో ధీమతామపి' యన్న యార్యోక్తి యుండనే యున్నది. పోతనచేసిన పొరపాట్లు ముఖ్యముగా మూడు.

1. శారదా మంత్రోపాసనాదీక్షలో బ్రహ్మచర్య వ్రతభంగము.
2. సింగనృపతిని దర్శించి భోగినీదండకము రచించి యతనికి కృతి యిచ్చుట.
3. అన్నకెదురాడ లేక ప్రౌఢదేవరాయలకు భాగవతమీయ సమగట్టుట.

ఈ మూడింటిని సంగ్రహముగా చర్చింతును.

## I. బ్రహ్మచర్య వ్రతభంగము :

పోతన గురూపదిష్ట మార్గమున దీక్షతో అత్యంత నిగ్రహముతో బ్రహ్మచర్య వ్రతమవలంబించినను సతీసాహచర్యము వలన దైవికముగా జరిగిన యొక ఘటనచేత నిగ్రహము కోల్పోయి వివశుడై వ్రతభంగము నందెను. అది యతని చేతిలో లేనిది. అట్లనుభవించి తీరవలసినది. 'బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి' యను నీతివాక్యమిచట గ్రాహ్యము మరియు నేతత్కాథ గల తృతీయాశ్వాసాదిలో చెప్పిన గీతావాక్యము 'ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి'? అనునట్లు మానవుడు జన్మసంస్కారము ననుసరించి యీ జన్మయందు కర్మములు చేయునపుడు నిగ్రహము పనిచేయజాలదు. కావున ఈ బలవత్తర హేతువుచేత పోతన బ్రహ్మచర్య వ్రతభంగము నొందుట అనివార్యమై తాపపడి తల్పులమనుభవించినాడు. అతనికి శారదామంత్రోపాసనలోని సిద్ధిలో మహాకవిత్వము మాత్రము నిలిచి ధారణాశక్తి తరలిపోయినది. ఆ లోపము పోతనకు తర్వాత భాగవతశిథిల భాగములను పూరింపకుండజేసి శిష్యపూరితములగు ఆ భాగములు లక్షణయుతములుగావను నపప్రథకు పాల్పడవలసి వచ్చినది. ఎట్టి క్లిష్టదశయందైనను వివేకభ్రష్టుడై వ్రతభంగము నొందినచో కష్టనష్టములకు గురికావలసి వచ్చునన్న నీతి యిందువలన లభించుచున్నది.

## II. సింగనృపతిని దర్శించి భోగినీదండకము రచించి కృతి యిచ్చుట :

సహజ వైరాగ్య సంపన్నుడు లౌకిక భోగవిముఖుడైన పోతన శ్రీనాథుని వెంట సింగనృపతి చెంత కలవోకగా పోయెను. ఆ పోవుటయే పొరపాటైనది. పిదప తన కే దురుద్దేశము దురాశ లేకున్నను పోతన పరవశుడై రాజప్రార్థనమున వనవర్ణన చేయుటయే కాక ఆ రాజును వలచిన నర్తకి భోగిని శీలవతి యనియు సంగీత నృత్యములలో మధుర భక్తిని ప్రదర్శించి కరగించెననియు ముగ్ధుడై ఆమెపై దండకము రచించి రాజాంకితము కావించెను. దానికి రాజు మెచ్చి సన్మానింపబూనుట, పోతన తిరస్కరించుట, రాజు నొచ్చుకొని పిమ్మట ఆపత్సమయములోనైనను ఆశ్వయానమీయక హేళన చేయుట ఇవన్నియు క్రమముగా జరిగిపోయెను. అనుల్లంఘనీయమై ఆచరించిన ఈ వ్యవహారమునకు పోతన మిక్కిలి పశ్చాత్తప్తుడయ్యెను. రాజులు దుర్మదాంధులు, నిరంకుశులు స్వార్థపరులని అనుభవ పూర్వకముగా తెలిసికొని నిరసించి వారియెడ శాశ్వతముగ బద్ధవిముఖుడాయెను. రాజును చేరి తత్ర్పేయసిని వర్ణించిన పాపమునకో యన తన తల్లియు తండ్రియు గతించిరి. తానపవిత్రుడనైతినని తద్దోషనివారణకు గంగను వినుతించిన విషయ మిటుల తెల్పుకొనెను.

అట్టులె యైన గంగను మదంబను దావక సత్కృపా ఝరిన్
బిట్టుగ సన్నుతింతు మును పిఱిఁడి తేఁడుల వారకాంతలన్
బట్టువలెన్ నుతించుతటి పంక కళంకిత వాగ్విహారసం
ఘట్టన కాస్పదంబగు నస ద్రసనమ్మది పూతమౌనటుల్''[1]

తాను రాజుల జోలి బొత్తిగా మానుకొన్నను, తొలుత చేరబోయి దండక మంకిత మిచ్చిన కర్మకు దుష్ఫలమంతటితో తీరిపోలేదు. సింగనృపాలుడు పోతన భాగవత రసలోలుడై వివేకము లేక అంకితముగొన దురాశ చెంది దానికై యత్నించి పోతన ననేక యాతనల పాలుచేసి తద్గ్రంథ శైథిల్యమునకు కారకుడాయెను. కావున పోతన కాలుజారిన నోరుజారిన యీ కథయెల్ల కవులకు పెద్ద హెచ్చరిక. ఇట్టి వ్యవహారములలో అప్రమత్తులై యుండవలెనని గట్టి గుణపాఠము బోధించుచున్నది.

1. పోతన చరిత్రము : 5-85

## III. అన్న కెదురాడలేక ప్రౌఢదేవరాయలకు భాగవత మీయ సమకట్టుట :

భాగవతమును నరాంకితము చేయక శ్రీరామాంకితము చేయవలెనన్న పోతన జీవితధ్యేయమునకు దైవికముగా ప్రత్యూహమేర్పడెను. శ్రీనాథుని కుతంత్రము వలన తప్పన విధిలేక బాధతో చెప్పినదానికెదురాడలేక సంక్షుభిత మానసుడై పోతన భాగవతమును ప్రౌఢదేవరాయలకు కృతి యియ్యనియ్యకొనెను. అది పెద్ద పొరపాటై, ఘోర పరిణామములకు దారి తీసినది. తన ఆత్మసంకల్పమే కాక రామునికిచ్చిన మాట తప్పినది. కాగా 'అవశ్యమేవ భోక్తవ్యం పురాకృత శుభా శుభమ్' అన్న వేదాంత వాక్యానుసారముగా ఆ ప్రారబ్ధము తప్పించుకోరానిది. దానికి దుష్ఫలముగా తాను వికలమనస్కుడై విరక్తుడై అందరిని విడచి వెడలిపోయి ప్రవాసము చేయుట, భాగవత మపహృతమై శిథిలమగుట, కుటుంబ మష్టకష్టాలు పడుట జరిగినది. "కృతిని నరాంకిత మొనరుప క్షితి నీదు ప్రబంధమునకు క్షీణత కూరున్, క్షతశేషమ్ములు లక్షణయుతములుగావను నకీర్తి నొందును" అని చిదానంద గురువరుడన్నట్లు ఘోరపరిణామములు సంభవించినవి. అనివార్యదుస్థితి లోనైనను గురువాక్యమును దేవతాజ్ఞను మీరి ఆడిన మాట తప్పినందులకిన్ని యనర్థాలు కలుగునని యీ చరిత్ర ముపదేశించుచున్నది. ప్రౌఢదేవరాయలకు కృతి యిచ్చుటకంగీకరించియు వాగ్దేవీపరివేదనకు కరగి మరల ప్రతిజ్ఞచేసి అంకితమీయ మానుకొన్న పుణ్యమునకు భాగవత మే కొంతయో యుత్పన్నమయి తక్కినది భద్రముగా నుండుట తటస్థించినదియు నుపదేశకమే యగుచున్నది. మొత్తముపై ఈ మూడు ప్రామాదికములును, మానవుడుద్దేశ పూర్వకముగా కాకున్నను పరిస్థితు లకు తట్టుకోలేకయో ప్రారబ్ధ వశముననో ప్రమాదపడి జారినచో ఆపదలు తప్పవను నీతిని బోధించుచున్నవి.

## 3. లౌకికనీతులు :

కావ్యోపదేశమున ప్రధానమైన భక్తి జ్ఞాన వైరాగ్య సంబంధమైన యుప దేశము, పోతన కవితాదర్శనములవలని సందేశములు పరిశీలించిన పిదప కావ్యమున తదితరమైన లౌకిక నీతులెటుల ప్రబోధింపబడియున్నవో చర్చింప వలసియున్నది. ఈ నీతులు కథానాయకుడగు పోతన వలనను శ్రీనాథాదీతర పాత్రలవలనను గ్రాహ్యమగుచున్నవి అనేకానేక విషయ సంకలితమైన నీతులకు

రత్నాకరమైన యీ మహాకావ్యము నీతిశాస్త్రమోయన విరాజిల్లుచు మానవుల కుత్తమాధ్యాత్మిక జీవనమునకేకాక ఉత్కృష్ట లౌకిక జీవనము సాగించుటకు మార్గ దర్శనము చేయుచున్నది. ఇందలి నీతులను కొన్నిటి నాచార్యులవారు తమ తర్వాతి కృతియగు 'సూక్తి వైజయంతి'లో పొందుపరచియున్నారు. ఇవి సహృదయ హృదయంగమమగునట్లు చక్కని యుపమాద్యలంకృతుల చేతను చిక్కని శబ్దార్థములచేతను ప్రవచింపబడి ప్రకాశించుచున్నవి. ఈ విధముగా ప్రశస్తిగాంచిన యిందలి నీతులను ముఖ్యముగా ధర్మము, అర్థము, కామము అని త్రివిధములుగా విభజింపవచ్చును. మొదట వివరించిన భక్తి జ్ఞాన వైరాగ్యములు తురీయమగు అపవర్గమునకు చెందియుండగా ఈ నీతులు త్రివర్గమునకు చెంది యొప్పుచున్నవి. ఇట్లు కావ్యము చతుర్విధ పురుషార్థములను ప్రబోధించుచు పూర్వము తెలిపినట్లు మోక్షము ప్రధానమై విలసిల్లుచున్నది.

ఇందలి త్రివర్గ ప్రబోధములో నేవో కొన్ని నీతులు బోధించుట కాక మానవులుత్తమమైన యుత్కృష్టమైన గుణకర్మ స్వభావములతో సదాచార విచారములతో సమ్యగ్జీవితము సాగించి సార్థక జన్ములు కావలెనన్న మహోప దేశము లభించుచున్నది. దానికి పోతన జీవితమే వ్యంగ్యముగా ప్రబోధకమై యున్నది. అట్లే పోతన జననీజనకులు, తిప్పన, నర్సమాంబ మున్నగు పాత్రల జీవితములు నుపదేశకములై యున్నవి.

ధర్మార్థకామములు సహితములై మోక్షప్రదమగుననియు, మానవ జీవిత వృక్షమునకు ధర్మము మూలమయి పరిరక్షింపబడినచో అర్థకామములు పత్ర పుష్పములయి శోభిల్లి మోక్షఫలము నిచ్చుననియు పోతన శ్రీనాథునితో దిగువరీతిగా వివరించినది కావ్యమున నీతిబోధలో మిక్కిలి ప్రాధాన్యము వహించుచున్నది.

> "ధర్మమ్ము తానర్థధర్మమ్మునై కామధర్మమై మోక్షైక ధర్మమగును
> అర్థమ్ము తాను ధర్మార్థమై యుక్త కామార్థమై నిత్యమోక్షార్థమగును
> కామమ్ము తానర్థకామమై సద్ధర్మకామంబుగా నోక్షకామ మగును
> మోక్షమార్థిక బంధ మోక్షమై కామ నిర్మోకమై సుఖదుఃఖ ముక్తినొసఁగు
> ధర్మమూలము పయిఁ దగ నర్థకామాది వృక్ష పత్రపుష్ప వితతిదనరు
> మోక్షఫలమునందు మూలమౌ ధర్మము జెడగనీక యున్నఁ బుడమి
> నగుడు"[1].

1. పోతన చరిత్రము - 8-137

కావ్యమున ప్రబోధింపబడిన త్రివర్గనీతులు సనాతనమైన వైదికములు. ఇవి ఇహపర సాధనములై యొప్పారునట్టివి. అట్టి ధర్మార్థ కామసంబంధి నీతులను క్రమముగా సంగ్రహముగా చర్చింతును.

## ధర్మసంబంధి నీతులు :

పురుషార్థములలో ధర్మమాద్యమైనది. పోతన శ్రీనాథునితో చెప్పిన పూర్వోదాహృత పద్యములోనున్నట్లు జీవిత వృక్షమునకు ధర్మము మూలము. ఇది యెంత దృఢముగా శ్రేష్ఠముగానున్న తక్కిన అర్థకామములంత విశిష్టముగా విలసిల్లి జీవిత పరమార్థమగు మోక్షఫలమును ప్రసాదించును. మరియు 'తత్త్వ బోధ'లో వివరించినట్లు జీవుని జీవితయాత్రకు గమ్యమగు మోక్షాలయమును చేరుటకు ధర్మము దారి యని నుడువుటచేత ధర్మమునకుగల ప్రాధాన్యము విశదము కాగలదు. మనుస్మృతిలో ధర్మప్రశస్తి యిట్లు ఉల్లేఖింపబడినది.

> ''నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠితః
> న పుత్రదారం న జ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః''[1]

అనగా తండ్రికాని తల్లికాని పుత్రుడుకాని భార్యకాని జ్ఞాతికాని యెవ్వరును పరలోకములో సహాయము చేయజాలరు. ఒక్కధర్మము మాత్రమే తోడుగా నుండును. మరియు 'ధర్మో రక్షతి రక్షితః' అన్న సూక్తి ప్రసిద్ధమైనది. 'ధర్మము నెవరు అనుష్ఠించి రక్షింతురో వారినా ధర్మము రక్షించును' అని చెప్పబడుట చేత ధర్మ రక్షణావశ్యకత్వము ప్రస్ఫుటమగు చున్నది. అట్టి విశిష్ట ధర్మము కావ్యమున బహు భంగుల ప్రతిపాదింపబడి యున్నది. బహు విషయ విలసితమైన ధర్మములలో గృహస్థ ధర్మములు, మాతాపితృ భక్తి, భ్రాతృభక్తి, గురుభక్తి, సతీధర్మములు, పుత్రశిష్య వాత్సల్యము, అతిథ్యభ్యాగత సేవ, పరోపకారము, దాతృత్వము, సజ్జన దుర్జన మానపౌరుషాది పద్ధతులు, జాతీయత, దేశభక్తి, రాజ ధర్మములు, ప్రజా శక్తి, శ్రమమూల్యము, మాతృ భాషాభిమానము, సంఘ సంస్కారము, మతసామ రస్యము, మానవతా వాదము మున్నగునవి అనేకము ప్రస్తావింపబడినవి.

1. మనుస్మృతి : 4-239

## గృహస్థ ధర్మములు :

కావ్య కథా ప్రారంభమున కేసనను వర్ణించు పట్టున ఉత్తమ గృహస్థుని గుణగణములు ధర్మములు చక్కగా వక్కాణింపబడినవి. గృహస్థుడు పెద్దలపై భక్తి, సమానులయెడ మిత్రతాసక్తి, చిన్నలయెడ పూర్ణదయానురక్తి వెలుగ సంచరింప వలయుననియు అపుడందరిచే అజాతశత్రువుగా చూడబడుననియు, అక్రూరుడై ఉజ్జ్వల చారిత్రుడై దానమానధనుడై నానాకళా నిలయుడై నయకోవిదుడై దైవభక్తిపరుడై యుండవలెననియు తెలుపబడినవి.

ధర్మార్థ కామమోక్షములనెట్లు సాధింపవలెనో కేసన వర్ణనమున నిట్లు వివరింపబడినది.

> "ధర్మమార్గాను వర్తనమునన్ భయమీఁగి బుద్ధివికాసమ్ము వృద్ధి సేయు
> సకలార్థ సందోహ సముపార్జనమ్మున గాత్రరక్షణము చక్కంబొనర్చు
> బహు రూపకామనా ఫలసిద్ధి ఘటియింప మనమును గౌతుకమ్మునఁదెమల్చు
> మోక్ష కాంతా కరాంబుజ పరిగ్రహణాప్తి నాత్మ బంధన దుఃఖహతి యొనర్చు
> ధర్మ సంరక్షణార్థ మర్థమ్ము పెరుగ మహితమోక్ష సంగతికి కామనలు పెనంగ
> నిజ మనీషాంగ హృదయాత్మ నివహమునకుఁ బుష్టినిడు పురుషార్థ చతుష్టయమున"[1]

చతుర్విధ పురుషార్థములను సాధించు యోగ్యత ఒక్క గృహస్థునకే కలదు. అట్టి గృహస్థుడు పురుషార్థములను సాధించు పద్ధతినిచెప్పి క్రమముగా వానివలన నతడు బుద్ధిని శరీరమును హృదయమును ఆత్మను పోషించు కొనవలెనని యుద్బోధించుట జరిగినది. మరియు తర్వాతి పద్యములలో దీనుడై యొరులను గొల్వరాదనియు, ఎట్టి విపద్దశలోను అసత్యమాడరాదనియు, పరిహాసమునకైనను పరులను నిందింపరాదనియు, ఆపత్సంపదలలోను అతిథులను యథోచితముగా సత్కరింపవలెననియు ఉపదేశము లభించుచున్నది.

---

1. పోతన చరిత్రము :

60)

## సతీ ధర్మములు :

సాధ్వియు ధర్మపత్నియునగు గృహిణియొక్క ధర్మములు లక్కసాని వర్ణన ద్వారా చక్కగా బోధింపబడి యున్నవి. ఇల్లాలు పవిత్ర వర్తనలచేత గంగయయి భర్తతలదాల్చునట్లు మెలగవలయునని, ఇతర పురుష గుణస్తుతి యెరు గక పొరుగిండ్లకు తిరుగక పతియాజ్ఞ శిరసావహించి అనుకూలవతి అనురాగవతి యయి అతని శ్రేయస్సును కాంక్షించుచు నడచుకొనవలెననియు, స్వార్థ రహితయై దయామయియయి పేదసాదుల నాదుకొనవలెననియు నుపదేశము లభించుచున్నది.[1] మరియు అప్పగింతలవేళ శ్రీనాథుడు తన చెల్లెలికి చెప్పిన మాటలవలన నవవధు వగు సతీమణి ధర్మముల యుపదేశము గ్రాహ్యమగు చున్నది. స్త్రీలు తలదాల్చు పువ్వులు హారములో చేరుటకు ముందు సూది మొగపు ముద్దు స్వీకార మొనరు నట్లు కష్ట నిష్ఠురములను సహించి అత్తగారి యింటిలో అందరి మన్ననలనుగాంచు నట్లు మెలగ వలయుననియు, అనురాగామృత మనోవాక్కాయ కర్మములతో భర్తను స్వాధీనపరచుకొని సేవించుచు అతిథులను గురుజనులను బంధువులను పూజించుచు ఉభయవంశముల నుద్ధరింప వలెననియు నుత్తమోపదేశము కావింప బడియున్నది.

ఈ యుపదేశమెల్ల లక్కాంబ, నర్సమాంబ చరిత్రములవలనను వ్యంగ్య ముగా కావ్యమున నందజేయబడియున్నది.

## మాతాపితృ భక్తి :

పోతన రాచకొండలో నున్నప్పుడు తన తల్లిని గూర్చి తలపోసిన పట్టు మాతృ వాత్సల్యము, తల్లి యవసాన దశలో నున్నదను వార్తవిని తల్లడిల్లిన సంద ర్భమున మాతృభక్తి సువ్యక్తమై వాని వైశిష్ట్యము ప్రబోధాత్మకమై యలరారు చున్నది. పోతన పితృభక్తి కతని గూర్చి గ్రామస్థులు రచ్చమానులకడ చవికెలలో మాట్లాడుకొన్న దిగువ మాటలు నిదర్శనమై యది యుపదేశకమై యున్నది.

1. పోతన చరిత్రము : 1-95, 96, 97 పద్యముల సారాంశము

"తండ్రి యెత్తు కుమారుడై తండ్రికెదురు నిలిచి మాటాడి యెఱుఁగడు పిలిచినఁజను
జనినఁ గంటఁ గన్గల్పి కాంచఁడు శిరమ్ము వంచి యడిగిన పలికె తా బదులొసంగు"[1]

## సోదర ప్రేమ :

సోదర ప్రేమకు మాతృ భక్తికి పోతన తిప్పనల నడవడులు తార్కాణలై యుపదేశకములై యున్నవి. అన్నదమ్ముల ప్రేమను వర్ణించుచు,

"తిప్పన సౌభ్రాత్రమ్మన నప్పురిఁగల చిన్నపెద్ద లందరికిఁ గడున్
మెప్పనుజునకన్న యనన్ గొప్పగుఁ దమ్ముఁడన నన్నకున్ బ్రాణంబౌ"[2]

అనియు,

"తనకెవ్వరేదేని తినుబండ మిడిరేని యనుజుని కిడక తిప్పన తినండు
అనుజన్మ నెవ్వరేమనినఁ దా నడ్డమ్ము వచ్చు మైనీఁగను వ్రాలనీఁడు...."[3]

ఇత్యాదిగా చెప్పిన పద్యములవలన సోదరప్రేమ బోధింపబడినది. ఇక పోతనకన్నయెడ గల భక్తి చక్కగా వర్ణితమై భ్రాతృభక్తి ప్రబోధింపబడినది. పోతన తాను వ్రాసిన మొదటి కవిత అన్నకు వినిపించి దీవనలు గొనుట, గంగా సైకతమున భాగవతాంధ్రీకరణ కావింపుమన్న శ్రీరాము నాజ్ఞను అన్నకెరిగించి యాశీః ప్రోద్బలములను గాంచుట, అన్నకు మ్రొక్కి రచన ప్రారంభించుట, ఆత్మ తాపహేతువైనను అన్నమాట తలదాల్చి భాగవతమును ప్రౌఢ దేవరాయల కొసగ బూనుట యెల్ల పోతన భ్రాతృ భక్తిని వెల్లడించుచు లోకుల కుపదేశకమై యొప్పారుచున్నది. మరి తిప్పన సోదరప్రేమ యనన్యమై యట్టిది మానవాళి శిరసావహింప యోగ్యమైయున్నది. క్షామకాలమున దుర్భరస్థితిలో వేరుపడుదమని భార్య చెప్పగా తిప్పన యొప్పక తమ్ముడు తమయెడ చూపు భక్తి విశ్వాసములను వివరించి

1. పోతన చరిత్రము : 3-37
2. ,, ,, : 1-124
3. " ,, : 1-125

"ధరఁ గళత్రాది సకల బాంధవుల మఱలఁ బడయవచ్చు సోదరునెట్లు
బడయఁగలము
పెట్టు శోభల మఱల రాఁబట్టవచ్చుఁ బుట్టు సౌందర్యమేఁగ రాఁబోద
తిరిగి"[1]

అని పల్కిన వాక్కులు

"దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః
తద్దేశం తు నపశ్యామి యత్ర భ్రాతా సహోదరః[2]

అన్న రామాయణ మహావాక్యమున కెనయై సౌభ్రాత్రమును చక్కగా నుపదేశమ
చేయుచున్నవి.

## గురు భక్తి :

కావ్యమున గురుభక్తి ప్రబోధము లెస్సగా కావింపబడి యున్నది. ఇ
పోతన ప్రసక్తముపల్ల వ్యంగ్యముగా గ్రాహ్యమగు చున్నది. పోతన చిదానందగుర
వరేణ్యుని యెడ కనబరచిన భక్తి తాత్పర్యములు, వినయ విధేయతలు, అతడ
మంత్రసిద్ధి నంది కవియై భక్తి జ్ఞానయుతుడై విరాజిల్లినను భాగవతాంధ్రీకరణమ
నకు ముందు గురువరుని సందర్శించి తాత్త్విక సందేహములను నివృత్తి చేసికొ
ఆశీర్వాదములు పొందిన విషయము అతని గురుభక్తిని చాటుచు అట్టి సద్గురు భ
వలన మానవులకు భక్తి జ్ఞానము లబ్బి నడవడి తీర్చి దిద్దబడి జన్మ తరించగ
దన్న ప్రబోధము లభించుచున్నది. గురువునెడ నిజమైన భక్తి ధనాదులొస
శుశ్రూషలు చేయుటలోనేకాక అతని యుపదేశాను సారముగా నడుచుకొని చరితార్థ
డగుటలో సువ్యక్తమగును. పోతన అట్లే గురుభక్తిని సార్థకముచేసి ఆదర
మూర్తియై యలరారినాడు.

## పుత్ర శిష్య వాత్సల్యము:

పుత్ర శిష్య వాత్సల్యమునకును పోతన చరిత్ర ముత్త మాచార్యకమ
వహిలగి యున్నది. కొడుకుల బుడి బుడినుడులు చిన్నారి నడలు వారి విద్య

1. పోతన చరిత్రము : 5-214
2. వాల్మీకి రామాయణము. యుద్ధకాండము

బుద్ధులు తల్లి దండ్రులకు పరమానందకరములు. అందుకే పాల్కురికి జాతరలోని భాగవత ప్రదర్శనము చూచి పోతన తల్లితో సంభాషించి భాగవతమును నేను తెలుగులో వ్రాయుదునని పలుకగా నామె కంతులేని వాత్సల్యము పొంగులు వారెను. అది యిట్లభివర్ణితమైనది.

> "అంత ననంత వత్సలత నాత్మజునిం గని కౌఁగిలించి నీ
> కెంతటి బుద్ధిరా బుడుత ! యేండ్లు మదాయువుఁ బోసికొంచు జీ
> వింతువుగాక యంచుఁ గయిువేళుల బాలుని మీఁదు ద్రిప్పి యా
> యింతి కణంత లద్దుకొనియెన్ నెటికల్ ఘటియింపఁ బ్రేముడిన్"[1]

తండ్రి కేసనయు ఆనందబాష్ప సంకలిత నయనుడై యొక యోగి ఆ నాడు ప్రొద్దున పోతనను జూచి 'వీడు మహాకవి సార్వభౌముడై జగద్విఖ్యాతి గాంచునని చెప్పెనదియు నిదియు నొక్కటి యయ్యె'ననియు పలికి పులకించి కొడుకు భవిష్యత్తు నాత్మలో నూహించుకొని తన్మయుడాయెను. సుతులను గాంచి మురియుటయేకాక వారి యుజ్జ్వల భవిష్యత్తునకై కలలుగని అంతటి వారగుటకు తల్లిదండ్రులు ప్రయత్నించుటలోనే నిజమైన వాత్సల్య మిమిడి యుండును. ఇట్టి ప్రబోధము లక్కాంబ కేసనల వాత్సల్యమున, వారతని సందేహనివృత్తి చేసి జ్ఞానాభివృద్ధికి కవితావిర్భావమునకు కృషి చేసినదానిచేత గ్రాహ్యమగుచున్నది. పోతనయు తన కుమారుడగు మల్లన నెత్తుకొని కురిపించిన వాత్సల్యామృత మిట్టిదే.

శిష్యవాత్సల్యము చిదానందునిలోను పోతన లోను నిబిడీకృతమై నితాంతోప దేశకమై యొప్పుచున్నది. గురువు శిష్యులపై అవ్యాజమైన వాత్సల్యముంచి వారి శ్రేయస్సును కాంక్షించి హితోపదేశముచేసి విద్యా జ్ఞానములను ప్రసాదింపవలె నన్నది యిందలి నీతి. చిదానందుడు పోతనను దయతో రామ తారక శారదా మంత్రములనుపదేశించి హితప్రబోధము చేసి యంపుట, ఆశ్రమమునకు పోతన వచ్చినప్పుడు భాగవత తత్త్వోపదేశము చేసి భాగవతాంధ్రీకరణ కాశీస్సుల నిడుట యాతని యాదర్శ వాత్సల్యమునకు నిదర్శనము. పోతన నారయాది శిష్యులకు విద్యాశిక్షణ నొసగుచు, వారు రాచకొండకుపోయి వత్తుమని పట్టుబట్టినప్పుడు 'అనుభవములేని బిడ్డ'లని వారికి ప్రయాణములోని సాధక బాధకములన్ని బోధించి సాగనంపుటలోని వాత్సల్య మొజ్జబంతియై యొప్పారుచున్నది.

1. పోతన చరిత్రము : 1-161

గురు శిష్యుల సంబంధ మెట్లుండవలెనో భార్గవుడు ప్రహ్లాదుని గూర్చి యతని తల్లి దండ్రులకు చెప్పుటలో దిగువ నీతి తెలియుచున్నది.

"శిష్యుఁగనఁ బుత్రువలెఁ బ్రీతి సేయు గురువు గురునిఁగన సర్పమటు భీతిగొనును చట్టు
నయభయమ్ములఁ గ్రమ శిక్షణమ్ము నొసఁగి శిష్యుఁ దనయంత వానిని జేయునొజ్జ"[1]

గురువు శిష్యుని నయభయములచేత విద్య గరపవలెనన్న తానతనిని పుత్రునివలె ప్రేమతో చూడవలెను. శిష్యుడు గురువునెడ సర్పభీతివలె భయముతో మెలగ వలయునని చెప్పిన యీ నీతి సనాతనమై బోధక సాధకలోకమునకు శిరోధార్యమై యున్నది. ఈ విషయము గురు శిష్యులకు "పుత్రవత్ ప్రీతిః సర్పవద్భీతిః" ఉండవలెనన్న ఆర్యోక్తి ననుసరించి వచింపబడినది.

## బ్రహ్మచర్యము:

కావ్యము బ్రహ్మచర్య వ్రతమునకు మిగుల ప్రాధాన్యమిచ్చి బోధించు చున్నది. చిదానందుడు పోతనకు శారదా మంత్రముపదేశించి ఆ మంత్రమును ద్వాదశ వర్షములు బ్రహ్మచర్య వ్రత దీక్షతో జపించిన సిద్ధించునని చెప్పుచు బ్రహ్మచర్య వ్రత పరమ విశిష్టతను ప్రబోధించెను. భీష్మ పరశురామ హనుమ దాది మహావీరులెల్ల బ్రహ్మచర్యమవలంబించియే మనస్సును గెలిచి యమునికి మరలబడిరి కావున దానికి సాటిలేదని మరియు నిట్లు సెలవిచ్చెను.

"జీవన జ్యోతులు చిరజీవిగా వెల్గ నాత్మ నర్పించు స్నేహస్వరూపి
రమణీయ దేహ హర్మ్య స్థిరత్వమునకై నమ్మకమైన పునాది బలము
బహురోగబాధలఁ బ్రతిఘటింపఁగ వైద్యుఁడక్కఱలేని దివ్యౌషధంబు
అజరామరత్వ లాభాప్తికై శమదమాఖ్యాంబుధిన్ బుట్టు జీవామృతమ్ము
జీవజీవమ్ము చావుకుఁజావు విశ్వసౌఖ్యసారమ్ము పురుషార్థ సాధనమ్ము
ఉత్తమబ్రహ్మచర్య సంపత్తు ముందు దిగదుడుపుకైనఁ గొఱగాదు మిగత ధనము"[2].

1. పోతన చరిత్రము : 11-254
2 ,, ,, : 2-54

ఇట్టి అసదృశామూల్య బ్రహ్మచర్యమునందరును ముఖ్యముగా విద్యార్థులు, జపతపము లాచరించు వారవశ్యముగా నవలంబింపవలెనన్నది యిందలి నీతి. యోగ నిష్ఠాపరులు విధిగా పాటించవలసిన యమనియమములయందలి యమములు 'తత్రాహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః' (యోగ సాధన పాదము, సూ-3) ఐదింటిలో బ్రహ్మచర్యమొకటి. 'బిందు పాతేన మరణం, జీవనం బిందు ధారణాత్' అని చెప్పబడుటచేత బ్రహ్మచర్యమునకు గల ప్రాముఖ్యమెట్టిదో విశదమగును.

## వైవాహిక ప్రబోధము :

కావ్యమున వైవాహిక విషయమునను విలువైన నీతులు ప్రబోధింపబడి యున్నవి. శ్రీనాథుడు తన తల్లితో చెల్లెలిపెండ్లి పోతనతో గావించుట గూర్చి మాట్లాడుచు ఈ విషయమునిట్లు వివరించెను.

"ముదుకఁడన్ నాకండ్ల ముందు గావలెనంచుఁ బసిపాపకొనరించుఁ బరిణయమ్ము
దాఁపుననుండు నాతనయ నాకని యెంచి తనయూరి ఖలునకుఁ దార్చు పెండ్లి
నావైపు బంధువుల్ నావారు వీరని యపురుషార్థికినిచ్చు నుపయమమ్ము
ధనవంతుఁడని యెంచి మనుమరాలికి తాతకొనగూర్చు వైవాహికోత్సవమ్ము
తన యభీష్టపూరణముకై తనయనలరు లలితరూప యౌవన సత్త్వములను బలిగఁ
గొనెడి ప్రేమాతిశయమనుకూల శత్రువిధిఁ బరఁగు సస్యహతినతివృష్టి భాతి'[1]

ఇందు తనయకు దగిన వరుని నిర్ణయించుటలో తీసికొనవలసిన జాగరూకతలు చెప్పబడినవి 'పిల్ల ప్రియమును గోరును బితరులెందు హితముగోరుదు' రనియు 'రూపయౌవన ఈరెండు జతపడినచో పసిడికి తావి యబ్బినట్లు భాసిల్లు' ననియు 'కుల పంశానురూపవృత్త విత్త విద్యాదులన్ గ్రాలు నుత్తముండు వరుఁడయినఁ బుత్రికా భీష్టమరయకుండఁ బెండ్లినొనరింపవచ్చును బితరు' లనియు తర్వాతి పద్యము లందు నుద్బోధింపబడినది.

1. పోతన చరిత్రము : 2-209

## అతిథిసేవ :

సత్పురుషుడైన పోతనగారి చరిత్రము అతిథుల నభ్యాగతులను సత్కరింపవలెనని వ్యంగ్యముగా బోధించుచున్నది. ఈ అతిథిసేవ మహాపుణ్యప్రద మైనది. గృహస్థుడు అతిథిసేవ చేయవలెనని సనాతన వైదిక ధర్మము ప్రబోధించుచున్నది.

"మాతృదేవో భవ పితృదేవో భవ, ఆచార్యదేవో భవ అతిథిదేవో భవ"[1]

అని అతిథిని భగవంతుని ప్రతిరూపముగా తలంపుమని యుపనిషత్తు బోధించుచున్నది. మరియు మనుస్మృతిలో

"ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం సర్వదా
నృయజ్ఞం పితృయజ్ఞంచ యథాశక్తి నహాపయేత్"[2]
"........ నృయజ్ఞోఽతిథిపూజనమ్"[3]

అని చెప్పబడినది. అనగా గృహపతి బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, నరయజ్ఞము, పితృయజ్ఞము- అను పంచమహాయజ్ఞములు యథాశక్తి నాచరింపవలెనని ప్రవచింపబడియున్నది. నరయజ్ఞమనగా అతిథి పూజనమని వివరింపబడినది.

"ఆకొనివచ్చిన యతిథిని వాకిట నిలబెట్టి యింటి వాడశనము తా
నే కుడువ మన్ను గుడుచుట గాకేమిర కుందవరపు కవి చౌడప్పా !"

అని కవి చౌడప్ప అతిథిని సత్కరించని పాపిని గర్హించినాడు. కావున అతిథిసేవ పుణ్యప్రదమైనది.

పోతన వంశమతిథి పూజనమునకు ప్రశస్తి వహించి యున్నది. శ్రీనాథ కుటుంబమును పోతన యింటికి పిలుచుకొనిరాగా కేసన చేసిన సత్కారము చాల ప్రశస్తమైనవి. ఇక పోతన తండ్రిగారి అతిథిసేవాగుణమునకు మిక్కిలి వన్నె పెట్టెను. కలిమిగల దినములలో నింటికి వచ్చిన వారినేకాక లేమికాలమున అన్నార్తులనింటికి పిల్చి సంతర్పణంచేయుటలో అతిథిసేవ పరాంకోటికి చేరును.

1. తైత్తిరీయోపనిషత్తు - శిక్షావల్లి
2. మనుస్మృతి : 4-21
3. ,, ,, : 3-70

పోతన యిట్లేచేసినాడు. కరవు తాండవించి యింటిలో పిల్లలు పస్తున్నప్పటికి పోతన దీనుల యాతన చూడలేక ఆదుకొనెడివాడు.

> "ఎవడు వచ్చినన్ బోతన యింటిముందు
> నంతొ యింతొ పెట్టకయె పొమ్మను టెఱుగరు"[1] అనియు
> "ఏపూటన్ సాపాటన రాపిడిగొని యతిథిశతము రాజిలు నింటన్...."[2]

అనియు,

> "ఉన్నది లేనిది గృహమందెన్నండారయఁడె వారలెదురైనను బో
> తన్న భుజింపక చనవల దున్నది మన గృహమటంచు నొగి కొనివచ్చున్"[3]

అనియు వర్ణించుట వలన పోతన అతిథిసేవా తత్పరత విశదమగును. మరియు పోతన దీనావస్థలోనున్న పేదజవరాలిని, భిక్షుకుని ఆదుకొన్న విషయము అతని లోని అనన్యాతిథిసేవా పరాయణతను దెలుపును. ఇంతేకాక పోతన చేలవద్ద దర్శన మిచ్చిన చిదానందయోగికి భక్తి తాత్పర్యములతో మన్ననచేసి గోక్షీరములిచ్చి సంతృప్తి చేసినది నితాంత శ్లాఘనీయము. పోతన వంశపు ఈ సదాచారమును మల్లన చక్కగా పాటించి తండ్రికి దగిన కొడుకనిపించుకొన్నాడు. ఇంటికి వచ్చిన అపరిచితుడగు రామశర్మకు మల్లన, నర్సమాంబ చేసిన అతిథి సత్కారమునకా శ్రీరామచంద్రుడే సంతుష్టుడై సంస్తుతించినాడు. ఇక శ్రీనాథుడు రాజపరివార సహస్రముతో వచ్చిపడినపుడతిథి సత్కార విషయమున పోతన అగ్నిపరీక్షకు గురియై నమ్ముకొన్న వాగ్దేవీకరుణచేత కృతకృత్యుడు కాగలిగినాడు. ఇట్ల పోతన అతిథిసేవనొక వ్రతముగా నిష్ఠతో సాగించి తన నడవడియే యుపదేశకముగా అఖిల గృహస్థుల కాదర్శమూర్తియై నెగడినాడు.

## పరోపకారము, దాతృత్వము :

పరోపకారము. దాతృత్వము అనునవి మానవునకవసరమనియు వానివలన అర్థులు, ఆర్తులు తమ కష్టముల నధిగమించుటయే కాక ఉపకారము చేసిన

---

1. పోతన చరిత్రము : 5-195
2. ,, : 5-196
3. ,, : 5-197

పుణ్యాత్మునికి కృతజ్ఞులై కాలాంతరమున ప్రత్యుపకారము చేయగలరనియు నీతి పోతన జీవితమువలన గ్రాహ్యమగుచున్నది. దీనికి పేదజవరాలిని, దీన భిక్షుకుని, కాపుపోచయ్యను కాపాడిన యుదంతములే తార్కాణములు. ఎన్ని ధర్మము లాచరించినను దయమే ప్రధానమైనది.

"దయయె మూలమైన ధర్మవృక్షమునకు వరయశస్సుమాలు పరిమళించు
తుదల పుణ్య ఫలములొదవు తాపమునార్చు నిత్యశాంతి యనెడి నీడ
నొసఁగు"[1]

అని వరదాచార్యులవారు ప్రవచించియున్నారు. 'పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడన' మ్మన్న ఆర్యోక్తి ప్రసిద్ధమైనది. ఇట్లు దయామూలకమై పుణ్యమును పురుషార్థమును కీర్తిని ప్రతిష్ఠను పెంపొందించు పోతన ధార్మిక జీవనము సమస్త జనులకు నొరవడి పెట్టుచున్నది.

పైన దెలిపిన పోతన పరోపకార గాథలు వ్యంగ్యముగా ధర్మోపదేశము చేయుచుండ కాపుపోచయ్య కథలోను దీనభిక్షుకుని కథలోను సందర్భోచితముగా కొన్ని విలువైన నీతులు ప్రవచింపబడి యున్నవి. చంపదగిన యట్టి శత్రువు పోచయ్య. అట్టివాడు సర్పదష్టుడై ప్రాణాపాయస్థితిలో నుండి పోతన కంటబడగా జాలిపడి క్షమించి బ్రతికించి వానినింటివారి కప్పగించెను. పిదప పోతన తలపోసిన నీతులివి.

"తలఁప దోషిని దండన సలుపుకంటె దోషమూల కారణమును దునుము
డొప్పు
తెగులుఁ బోకార్చువాఁడు వెజ్జగునుగాని యరయఁదెవులు గొంటునె
చంప యముఁడు గాఁడె"[2]

"అగ్నినగ్నితో నార్పఁగ నగునె జగతిఁ బగను బగతోడఁ దీర్పఁగ
వశమె సామ
దాన భేద దండోపాయశతులు నెందు సామగతియె శాశ్వత శత్రుజయము
గూర్చు"[3]

1. పోతన చరిత్రము : - 14 వ పద్యము
2. ,, : 5-188
3. ,, : 5-189

వైద్యుడు రోగమును చంపి రోగిని బ్రతికించునట్లు దోషిని దండించుట కంటె దోష మూలకారణమును నశింపజేయుట ఉత్తమము. అగ్ని నగ్నితో నార్పజాలని యట్లు పగను పగచేత తీర్పలేము. ఒకడు తామసుడై పగబెట్టుకోగా వానిని సామముచేత చల్లబరచి సత్త్వగుణముతో ఆ యపకారికి నుపకారము చేసినచో వాని పగ చల్లారిపోవును. పోతన యట్లే చేసి పోచయ్యను చక్కబరచెను.

ఇక దీనభిక్షుకుడెంత బతిమాలినను ఏడ్చినను లోభిసెట్టి బిచ్చము వేయక పోవుటయేకాక కఱ్ఱతో కొట్టబోగా పోతన అడ్డుపడి ఆ దెబ్బ తాను తిలభిక్షుకు నోదార్చి యింటికి పిల్చుకొని వచ్చియు బిడాలభక్షితమగుటచేత అతని కన్నము పెట్టలేక వగచిన పోతనగారి దిగువ వాక్యములు అతిథిసేవా పరత్వమును ప్రబోధించుచున్నవి.

"యాచకాభీష్ట పూర్తి ధనాలి సనియెఁ గాని వితరణాపేక్ష యెక్కరణిఁ బోవు
వాఁకనీరింకె నిరత ప్రవాహసరణి గమనపథమది మారదొక్క రవయైన"[1].

"కలిగిన లోభికన్న నొక గవ్వయులేని యుదారుఁగొల్వ సత్
ఫలమొదవున్ గటు ప్రకృతి భాసునపారదురాశు నబ్ధిరా
ట్తిలకుని గొల్వఁ ద్రాగుటకు దీర్థము బుట్టదు వాహినీతల
మ్ములు గతజీవనమ్ములయి పోల్చియు నా చెలమన్ జలమ్మిడున్"[2].

ఆర్తులను దీనులను చూచి పోతనగుండె చెరువయ్యేడిది దయాళువులు దాతలు నగువారి హృదయమటువంటిదే. లోకములో దాతలుందురు. లోభులుందురు. వారి స్వభావములు సహజములు. అవి మారవు.

"దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వముచితజ్ఞతా
అభ్యాసేన నలభ్యంతే చత్వారస్సహజా గుణాః"

అన్నది ఆర్యోక్తి. బలి శిబి కర్ణ రంతిదేవులెట్టి కష్టదశలోను తమ దాతృత్వమును విడనాడలేదు. ఇక లోభుల విషయము చెప్పనేరాదు. వారి నికృష్టగుణమును గర్హించుచు అక్బర్‌చక్రవర్తి మంత్రియు కవియు దాతయునైన అబ్దుర్రహీం ఖాన్‌ఖానా ఇట్లు నుడివెను.

---

1. పోతన చరిత్రము : 5-272
2. ,, : 5-273

'రహమన్! వే నర్ మర్‌చుకే జో కహుఁ మాంగన జాహిఁ
ఉన్‌సే పహలే వే మరే జిన్ ముఖ నికసతినాహిఁ'[1].

అనగా 'అడుగుకొనపోయిన వారు చచ్చినవారే. కాని వారడిగినప్పుడు లేదః వారంతకుముందే చచ్చినవారు'. లోభి యెంతటి నీచకర్ముడగునో దేవవా సుభాషితమిట్లు చెప్పినది.

"కృపణో ధనలోభేన స్వాం భార్యాం నాభిగచ్ఛతి
అస్యాం యో జాయతే పుత్త్రః స మే విత్తం హరేదితి"[2].

అనగా లోభి ధనలోభముచేత, పుట్టబోవు కొడుకెక్కడ తన ధనమును హరించు యని తన భార్యను కూడడు. ఇట్టి నికృష్టులు ఎంగిలిచేతనైనను కా కొట్టుదురా? లోభులు 'చమ్డీ గయీ తో గయీ దమ్డీ నహిఁజానా' (చర్మ పోయినా సరే దమ్మిడి పోవద్దు) అనువారు. దాతలేమో 'మూర్తి గయీ తో గం కీర్తి నహిఁజానా' (మూర్తి పోయినా సరే కీర్తి పోకూడదు) అను పుణ్యాత్మ కావ్యములోని సెట్టి పరమలోభులకు ప్రతినిధి. అట్టివానిగూర్చి ఆచార్యులవా వెలిబుచ్చిన నీతి మతిమంతులకు తలదాల్పవలసినది. గువ్వల చెన్నడు కూ 'కలిమిగల లోభికన్నను విలసితమగు పేదమేలు వితరణియైనన్, చలిచెలమ మే కాదా జలనిధి యంభోధికన్న' యని పై నీతినే ప్రబోధించి యుండెను.

## చెరపకురా చెడెదవు :

అవ్యాజప్రేమతో పరోపకార మొనర్చిన వారికాత్మానందము కలుగున అపకార మొనర్చిన దుష్టాత్ములకు పశ్చాత్తాపము ప్రాయశ్చిత్తము తప్పదను నీతి కావ్యము ప్రబలముగా ప్రబోధించుచున్నది. కావ్యోపక్రమములో తెలుగు భాగవతము రచింపనున్న పోతన తపోభంగము కావింపనెంచిన యింద్రు దౌష్ట్యమును గని నారదుడు విష్ణువుతో

---

1. రహమన్‌గారి దోహాలు (ద్విపదలు)
2. సుభాషిత రత్నాకరము : కృపణనింద, శ్లో 2. సంకలన కర్త : కృష్ణశాస్త్రి భాటవడేకర్.

'స్వీయగౌరవమ్ము చెన్నారుటకుఁగాను ప్రక్కవారి కించపఱచుజడుఁడు
ఒరుల దీపమార్చి యొప్పారఁగలనను శలభరాజుకెచటి జయము....[1].

అన్నది సారభూతమైన నీతివాక్యము.

పేదజవరాలిని బలాత్కరింపబూనిన కాముకుడగు యువకభూస్వామి పోతనహితోపదేశముచేత తన దోషము గుర్తించి పశ్చాత్తప్తుడై క్షమాపణ వేడుకొనెను. కాపుపోచయ్య దురహంకారముతో పోతనను చంపబూని, ఆపాపమున కోయన సర్పదష్టుడైనసెట్టి ఆయనచేత పునరుజ్జీవితుడై అతని యుపకారము మంచితనము తెలిసి తానొనర్పదలపెట్టిన ఘోరకర్మకు పోతన పాదములపైబడి యేడ్చెను. పరమలుబ్ధుడైనసెట్టి కరుణ యిసుమంతయులేక భిక్షుకుని తిట్టి కొట్టబోయి అడ్డు వచ్చిన పోతనకాదెబ్బ తగులగా భయపడి తిప్పన పోతనల కాళ్ళపైబడి క్షమాపణ వేడుకొని చేసిన తప్పునకు ప్రాయశ్చిత్తముగా పోతన భాగవతాంధ్రీకరణ ప్రారంభోత్సవ బ్రహ్మసత్రాదుల కవసరమగు భూరి ధనమును ధారవోసి భక్తుడాయెను. ఇక సింగనృపతి పోతనయెడ చేసిన మహాపరాధమునకు మిక్కిలి వగచి పదివేలరూపాయలు నష్టపరిహారముగా పంపి జీర్ణభాగవతమును పునరుద్ధరింపజేసెను. ప్రౌఢదేవరాయలును దురాశపడి భాగవత కోశాపహరణ మహాదోషమునకు గురియై పరితపించి క్షమాపణతోపాటు ఒంటిమిట్ట రఘునాయకుని సన్నిధిలో భాగవతకృతి సమర్పణోత్సవము వైభవముగా జరిపించెను. ఈ విధముగా నీ యుదంతము లోకరికి కీడు తలపెట్టినవారికి జయము కలుగక పోవుటయేకాక పశ్చాత్తాపమును శాస్తియు జరుగుట తథ్యమను ప్రబోధము కావించుచున్నవి. ఈ విషయమును కర్మసిద్ధాంతానుసారముగా యువకభూస్వామికి పోతన హితోపదేశముద్వారా పోతన చరిత్రమిటుల దెలుపుచున్నది

'ఒక్కవిత్తునాఁట పెక్కుగింజలు వెన్నునంటియున్న ఫలితమబ్బునట్టు
లొక్కపాపకర్మ పెక్కింతల ఫలమ్ము వెన్నునంటి కుడుపునిన్నురునకు'[2].
'కావునఁ జెడుసేఁతల నెదభావించుచు నుండరాదపాయకరము 'య
ద్భావం తద్భవతి హి' యని ధీవర్యులు నరుని గతిని దెల్పుదు రవనిన్'[3].

1. పోతన చరిత్రము : 1-73.
2. ,, ,, : 2-135.
3. ,, ,, : 2-136.

మరియు ఒకరి నవమానపరచదలచిన కుమతికే యవమానము తప్పదన్న నీతి శ్రీనాథుడు రాజపరివారముతో బయలుదేరి బమ్మెరకు వచ్చిన వృత్తాంతము వల్ల గ్రాహ్యమగుచున్నది.

## సజ్జనాది పద్ధతులు :

కావ్యమున సజ్జన దుర్జనాది పద్ధతులు తెలుపబడి తద్ద్వారమున చక్కని హితోపదేశము కావింపబడినది.

చిదానందగురువర్యుని ఉపదేశమునందిన పిదప పోతన హృదయము మారిన విషయము చెప్పుచు సజ్జనలక్షణమునిట్లు విశదీకరించినారు కవిగారు.

"ఇసుకను జక్కెరం గనఁగ నేక విధమ్ము నఁ గానిపించు నా
యిసుక జలమ్ములన్ గరఁగదేండ్లకొలంఁగ నాని పొత్తు తాఁ
బొసఁగిన యంత నీరములు పోవును జక్కెర మానవాళిరూ
పసమత నుండనేమి రసభావ విలీనుఁడె సజ్జనుండిలన్"[1].

లౌకిక సుఖదుఃఖాలకుగాని కావ్య కళాదిక రసభావములకుగాని స్పందించి తన్మయుడగువాడే సజ్జనుడనియు అట్లుకాని పాషాణచిత్తుడు దుర్జనుడనియు చక్కెర ఇసుక యుపమానముతో చక్కగా విశదీకరించి మానవాకారములోనుండినంత మాత్రమున సరిపోదనియు రసభావవిలీనుడై సజ్జనుడై బ్రతుకవలెననియు ప్రబోధించుట జరిగినది.

ధీరులగు ఘనుల జీవితములు కష్టముల కోర్చినప్పుడే వారి శీలమునకు వన్నెవచ్చునన్న నీతి ధైర్య పద్ధతిగా తిప్పన పోతనకు, భాగవతము ప్రౌఢదేవ రాయలకు సమర్పించుమన్న సందర్భమున ధైర్యమిచ్చుచు పలికిన మాటలవలన నిట్లు ప్రబోధింపబడినది.

"ఘనుల జీవనములు కష్టమయమ్మౌట వారి శీలములకు వన్నెయిడును
జాతి మణులకెల్ల సానల యొరపిడుల్ నృపుల శిరముకెక్కు నెపముతోనె"[2]

మరియు సాధకుడు సుఖదుఃఖములను లెక్కింపక కార్య సాఫల్యము గాంచు వరకు విశ్రమింపగూడదను నీతి తిప్పన పోతనకు భాగవతాంధ్రీకరణకు ప్రోత్సహించిన సందర్భమున ఇట్లు చెప్పబడినది.

1. పోతన చరిత్రము : 2-59.
2. ,, ,, : 8-297.

"సాధకుని కిల సుఖదుఃఖచయములరయ నెంత మాత్రము నడ్డులనిడగలేవు
పూని రత్నాకరంబును బొందునదుల మిట్టపల్లమ్ములడ్డును బెట్టఁగలవె?"[1].

భోగిని వేశ్యావృత్తిని నిరసించుచు తల్లితో పలికిన మాటలలో సుగుణ దుర్గుణములల వడుటలోని భేదమిటుల ప్రవచింపబడినది.

"చెప్పకున్నను నరుదెంచు చెడుగుణములు, పట్టిబోధింప సుగుణముల్ పట్టువడవు
మట్టి యంటును కుమ్మరి మనికిఁజేర పసిఁడి యంటునె కమసాలి వసతికేఁగ"[2].

చెడు గుణము లప్రయత్నముగ నలవడునుగాని మంచిగుణములెంత బోధించినను పట్టువడుట కష్టమనియు కావున చెడుగుణములంటకుండ జాగరూకతతో మెదలి మంచి నడవడి యలవడుటకు ప్రయత్నించవలెనన్నది యిందలి నీతి. ఇదే సందర్భమున ఆత్మశుద్ధి యవసరమన్న ప్రబోధము దిగువ పద్యము వలన కావింపబడినది.

"అంతరంగ పవిత్రతకందనట్టి పాత్రలోనుండు మలిన జీవనము తాను
దేవతార్చన మొనరించు తీర్థమైనఁగ్రోలు వారికిఁ గీడుఁ జేకూర్చదొక్కొ!"[3]

విద్వత్పద్ధతిలో సత్కవితను జనులే వెదకుచు చేరవచ్చి ఆరాధింతురు కాని జనుల వద్దకు ఆ సుకవి దీనుడై అడుగబోవుట పాడిగాదనియు, ఆ కవితయు సత్పురుష చరిత్ర రచనలో వెలయింపబడినపుడే జనసేవ్యమగుననియు వ్యంగ్యప్రబోధము పోతన శ్రీనాథునితో చేసిన సంభాషణ ద్వారమున నిట్లు లభించుచున్నది.

"విలువ గల రత్నమును దానె వెదకికొంచు మానవుఁడె వచ్చు, రత్నమ్ము మనుజుకడకు
వెదకుచుంబోవదీ విశ్వవీథి నదియుఁ దా సువర్ణమైత్రినె శిరోధార్యమగును"[4]

ఇందలి ఈ నీతి 'నరత్నమన్విష్యతి మృగ్యతే హి తత్' అన్న కాళిదాసు సూక్తి ననుసరించుచున్నది. మరియు కావ్యమున అల్పవిద్యగల నరుడు ఆశ్రితుని చెఱచుననియు పూర్ణవిద్యానిధి యందరిని సంతుష్టులను చేయుననియు, పరిశుద్ధ

1. పోతన చరిత్రము : 5-130
2. ,, : 4-210
3. ,, : 4-207
4. ,, : 8-109

మనస్కుడగు సుమతి విజ్ఞాన మల్పమయ్యు లోకులకపకార మొనర్పడనియు చక్కని నీతిని తిప్పన పోతనను ప్రశంసించు పట్టున వచించుట ద్వారా ఇటుల ఉపదేశించుట జరిగినది.

"నీరము కొంచెమున్న ధరణిం బురదం బొనరించి యంటగాఁ
జేరు విశుద్ధు మైలపడఁజేయును వెల్లువగా స్రవించు వాః
పూరములెల్ల మైలల ను బోనడచున్ గన నల్ప విద్యతోఁ
బూరుషుఁడాశ్రితుంజెఱచుఁ బూర్ణకళానిధి మన్చునెల్లరన్"[1]
"శద్ధ బుద్ధిగల్గు సుమతి విజ్ఞానము లల్పమయ్యుఁ బ్రజకు హానినిడవు
పూతసైకతములఁ బొల్పారు చెలమనీరల్పమయ్యుఁ ద్రాగ ననువుపడును"[2]

మరియు మనుష్యు డొకానొక విద్యలో పరిపూర్ణుడై తక్కిన విద్యలలో కొంత కొంత సాధించిన ప్రశస్తివహించుననియు, ఏదియు పూర్తిగా నేర్వక అదికొంత ఇదికొంత నేర్చిన పేరుకురాడనియు చంద్రతారకోపమానముతో తమ యన్నగారగు వేంకటాచార్యులవారి ప్రస్తుతిలో కవిగారిట్లు ప్రబోధించిరి.

"ఒక విద్యన్ బరిపూర్ణుండై మిగతలందొక్కొక్క యల్పాంశసా
ధకుడైనన్ శశిఁగూడి యుండు నుడుసంతానక్రియన్వెల్గుఁదా
నొకటన్ బూర్ణుఁడుగాక యన్ని కళలందొక్కింత సాధింపఁగన్
సకలోడుస్థగితాంబరంబున నమాసంగన్న చందంబగున్"[3]

ఇది ఆంగ్లలోకోక్తియగు

"Every thing in something and something in every thing"

అనుదానిని బలపరచుచు విశిష్టముగా బోధించుచున్నది.

## దేశభక్తి, జాతీయత:

భక్తి జ్ఞాన వైరాగ్య భావప్రాచుర్యము గల కావ్యమున లౌకిక నీతులలో దేశభక్తి, జాతీయ ప్రబోధము సైత మొకింత కావింపబడినవి. పోతన మడికొండ పండితులతో సంభాషించుచు జన్మభూమి యగు తెలంగాణమును ఓరుగల్లు

1. పోతన చరిత్రము : 8-290
2. ,, ,, : 8-291
3. ,, ,, : పీఠిక, 91వ పద్యము.

పట్టణమును వర్ణించినది దేశభక్తి ప్రబోధకముగా నున్నది. దేశ పురావైభవకీర్తనము జాతిజనులకు దేశభక్తి ప్రేరకమై యుండును. దిగువ పద్యము దానికి హృద్యమగు నుదాహరణము.

> 'ఓరుగల్ కోటలో నొకగంట నిలిచిన నాంధ్రుల పౌరుషం బర్థమగును
> ఓరుగల్ వాయువులొక తేపపీల్చిన నాంధ్రు స్వేచ్ఛావాంఛ లవగతమగు
> ఓరుగల్ సరసి నీరొకనాడు ద్రావిన నబల రుద్రమదేవి యన నెఱుంగు
> ఓలుగల్ శిల్పమ్ము నొకమారు గాంచినఁ దెలుగుల ప్రతిభలు తెలిసివచ్చు
> ఓరుగల్ కోట పేరెద నొక్కతడవఁ దలఁపఁ
>
> జాల్ తెల్గు చరితోన్నతుల నెఱుంగ
>
> ఓరుగల్ గడ్డనున్నట్టి యొకొక శిలను బిలిచిన
>
> నాహోయనుచుఁ బల్కుఁ దెలుఁగు వెలుఁగు"[1].

ఇట్లే శ్రీనాథ పోతనలు ఓరుగంటి శిల్పసంపదను వర్ణించిన ఘట్టమునందును దేశభక్తి కవిత జాల్వారి పాఠకులను పులకితగాత్రులను చేయుచున్నది. పోతన ధ్వంసము చేయబడిన దేవాలయాది శిల్పములను గాంచి వేదనాతప్తుడై పలికిన దిగువ మాటలు పౌరుషము పొంగజేయుచు జాతిజాగృతిని రగుల్కొలుపుచున్నవి.

> "పొలపుఁ గట్టె తాగొడ్డలి పొట్టఁజొచ్చి కులపుఁగట్టెల నన్నింటి గూల్చినట్లు
> హైందవుండే తౌరుక్కుని యండఁజేరి జాతి
>
> విద్రోహ చర్యలు సల్పెనిటులు"[2]

విజాతీయులు మన దేశమును దురాక్రమణ చేయుటకు విద్రోహచర్య లాచరించుటకు వారి దౌర్జన్యముతోపాటు మనవారి దౌర్బల్యము అనైక్యత అవివేకము విద్రోహము హేతువులు. భారత దేశమున అలెగ్జాండరు అడుగు పెట్టుటకు అంభి, ఘోరి ఢిల్లీ సామ్రాజ్యము నాక్రమించుటకు జయచంద్రుడు శత్రువులను గూడిన ద్రోహచర్యలే ప్రబల కారణములు. కాకతీయ సామ్రాజ్యము తురుష్కుల వశమగుటలో ప్రతాపరుద్ర మహారాజు సేనానులలో కొందరు స్వామిద్రోహముసేసిన విషయము

1. పోతన చరిత్రము : 9-78
2. ,, : 8-251

చరిత్ర ప్రసిద్ధము. ఇట్టి విద్రోహచర్యలు జాతికి దేశమున కంతటికి తీరని వాటిల్ల జేయుననియు అట్టివి స్వప్నము నందైనను తలపెట్ట వలదనియు, విద్రోహుల నొకకంట కనిపెట్టి నిరోధించుచు మాతృభూమిని కాపాడుకొ ననియు నిందుమూలమున ప్రబోధము లభించుచున్నది.

## రాజాశ్రయ నిరాసము :

పోతన చరిత్రము రాజుల నాశ్రయించుటను నిరసింపవలెనని ప్రబోధి చున్నది. ఐహిక సుఖభోగములను కీర్తి ప్రతిష్ఠలను వాంఛించు శ్రీనాథుని వారు రాజాశ్రయము వలన ప్రయోజనములను పేర్కొనుట జరిగినది. కాని నాయకుడగు పోతన కృతముగా ప్రధానముగా రాజాశ్రయ నిరాసమే క వ్యంగ్యముగను వాచ్యముగను రాజులు దుర్మదాంధులనియు, క్రూరులు నిరం లనియు, బుద్ధిమంతులు అభిమానధనులైనవారు వారిని చేరగూడదనియు గ నుపదేశించుచున్నది. పోతన తీవ్ర మనస్తాపముతో ప్రకటించిన అనుభవ పూ మైన దిగువ వాక్యముల వలన నీ ప్రబోధము సులభగ్రాహ్య మగుచున్నది.

"సొత్తున కాసఁజెంది చని క్షుద్ర నృపాలురఁ జేరి వారి యు
న్మత్త ప్రలాపగాన మహిమమ్ములు పందిని నందిఁ జేయఁగా
నెత్తినఁ బెట్టికొంచిదియె నిక్కమటంచును బ్రక్క తాళముల్
తొత్తయి తక్కతోమ్మనుచుఁ దొత్తువలెన్ లయవేయు టొప్పునే".[1]
"మనుజన నన్ను మించి చను ముఖ్యుఁడవా యను నొక్క యగ్గు వె
న్క నిడిన నీవు పట్టి కొలగాని జడుండ వటంచుఁ దిట్టుఁ బ్ర
క్కనడచి నంత నాసమముగాఁ జన నర్హుఁడ వౌదువే యనున్
గన నెటు వోయినన్ శ్రమయె క్ష్మాపతి పల్లెరుకాయ చాడ్పునన్".[2]
"....ఉరక కసు బుసులాడు మహోగ్రవదన
వైఖరుల వక్రతమములౌ వర్తనమ

---

1. పోతన చరిత్రము : 4-393
2. ,, : 4-395

ఛత్రఫణదీప్త ధనిక రాజ్య ఫణుల నీడ నుండ నెవ్వారికి కీడు దప్పు?"[1]

"పెరలకు నొంటి మన్నయినఁ బెట్టని వట్టి పిశాచి రాజులం
దఱిఁగని దానకర్ణ బలిదాతల పైఁడి మెఱుంగురుద్ది నో
రఱుగ నుతించి భూపతి కృతాఘము మ్రింగుచుఁ బొట్టనించుటే?
హరి హరి వారి మోము గనునంతటి పాపమె లేదు........"[2]

ఇత్యాదిగా అనేక సందర్భములందు రాజుల నాశ్రయింప గూడదని ప్రబోధింబడి యున్నది.

## ప్రజాశక్తి, రాజధర్మము :

ప్రజాశక్తికెదురు లేదనియు, ప్రజల బలము లేనిదే రాజులుండలేరనియు, ప్రజలు స్థిరులైయుండ రాజులు పదవీభ్రష్టులగుచుందురనియు తెలిపి పరిపాలకులు ప్రజలను మన్నచేయుచు తదనురంజనముగా పరిపాలింప వలెననియు లేనిచో పతనము తప్పదనియు కావ్యము ప్రబోధించుచున్నది. విజయనగర చమూపతి బెదరింపు మాటల కలిగి పోతన గట్టిగా బుద్ధిచెప్పిన పట్టున ఈ విషయము పట్టు బడుచున్నది.

"చలన మెఱుగని యా ప్రజాస్థానమందు దొరలు పైనుండి క్రిందికి దొరలు చుంద్రు
చుక్కలేవేళ క్షతిలేక చూచుచుండ శశి కళాభంగ మొందుచుఁ జను సతమ్ము"[3]

ఇత్యాది పద్యములలో నీ నీతి ప్రబుద్ధమై యున్నది. మరియు,

"ధరణిఁ బ్రజానురంజకుండె తాను నృపుండు ప్రజారి వృత్తిచేఁ
బొరల నృశబ్దమున్ విడినఁ బుండటు లెంచఁబడున్........"[4]

అని రాజు ప్రజానురంజకుడైనపుడే 'నృపుండు' అనబడి ప్రజలకు కంటకుడైనచో పుండువలె నెంచబడునని రాజులు తమ ప్రధాన ధర్మమగు ప్రజానురంజక

1. పోతన చరిత్రము : 8-193
2. ,, : 8-197
3. ,, : 9-122
4. ,, : 9-137

పాలన కావింప వలెనని ప్రబోధించుచున్నది. అంతేకాక 'ధర్మపన్నాలు' వల్లిం రాజ్యము వు లపాయకారులని యిట్లు తెలుపబడినది.

"ధర్మగుణ జపమ్మొనరించు ధరణిపాలు నాలుకయె యెఱగప్పిన గా మెపు

మేదినిన్ రాజకీయమ్ము మేడిపండు ప్రభువులకు స్వార్థరుజతలఁ బరఁగు చుండు"

"ఒక్క ప్రభుత చాలు నున్మాదరోగంబు విత్తబలము కల్లు మత్తు తోడు అబ్బినట్టి యువకు నలమిన నివి రెండు ప్రళయ తాండవమ్ము సలుపఁడేల"

ఇట్లనేక విధముల రాజులు ధర్మానువర్తకులు ఆదర్శమూర్తులు కావ ననియు కానిచో తాము నశించుటయే కాక ప్రజలను నాశనము చేయువార దురనియు వ్యంగ్యముగా నుపదేశించుచున్నది.

మరియు రాజు

'ప్రజలకుఁ దల్లి పండితులపాలిటి కల్పకవల్లి కర్షకవ్రజమును శ్రీ సౌఖ్యముల రంజి

జేసెడిపాలవెల్లియై నిజమును న్యాయమున్ మనిచినచో నతని కీర్తి రమ సుజనుల చే

పూజగొని చొక్కు'[8] ననియు, శ్రీరామునివలె ప్రజామోదముతో రా శాసన నిర్మాణ మొనర్చి ప్రజా సంక్షేమమే కోరు రాజునకు చార చక్షుత్వ మత పశ్యకమనియు సింగ నృపతి చారునితో సంభాషించు పట్టున రాజనీతి బోధిం బడినది.

## శ్రామిక మూల్యము :

వృత్తిచేత రైతయిన పోతనగారి చరిత్రమున రైతుల ప్రశస్తి వారి శ్ర మూల్య మభివర్ణితమై రైతుల నాదరింపవలెనని వ్యంగ్య ప్రబోధము కావించ

1. పోతన చరిత్రము : 9-140
2. ,, 9-141
3. ,, 4-151

చున్నది. శ్రీ నాథుడు పొలము దున్నుచున్న మేనల్లుని మల్లనను చూచి పరిహ సించినపుడు మల్లన పౌరుషాభిమానములతో

"హాలికు నుదుటిపైనలరుఁ జెమ్మటజాలు
పాలకు నుదుట ముత్యాలచాలు.... ...." [1]

అని యిత్యాదిగా పలికిన మాటల వలన ఈ విషయము విశదమగుచున్నది.

## సంఘ సంస్కారము :

కావ్యమున సంఘ సంస్కార ప్రబోధము సైతము సముచితముగా కావింప బడినది. ముఖ్యముగా వేశ్యావృత్తి నిరాసము కన్పడుచున్నది. మద్యపానమును నిందించుచున్నది. భోగిని వేశ్యావృత్తి అతిహేయమైనదనియు, వేశ్యలు పెండ్లిండ్లు చేసికొని సంసారజీవితము గడపవలెననియు ప్రబోధ మొనరించి తానాదర్శముగా వేశ్యావృత్తి నడుగిడక సింగనృపుని పరిణయమాడినది.

"విలువ పీతాంబరము దాల్చు వేశ్యకంటె దిసమొలం జరించెడి దొడ్డిపసులు మేలు
అతుల నైతిక వృక్ష సంహతినొనర్ప వేరుపురువని ప్రఖ్యాతి వేశ్యజాతి" [2]
"తాము చెడి ప్రపంచమ్ము నంతయును జెఱచు ఘోరతర జారవృత్తిని బాఱద్రోలి
పరిణయములాడి సత్కీర్తిఁ బడయుఁడనుచు సానిజాతిం ప్రబోధమ్ము సల్పు నుడులు" [3]

ఇత్యాది పద్యములలో నీ నీతి వేద్యమగుచున్నది.

ఇక భోగిని వేశ్యావృత్తిని నిరసించుచు పలికిన మాటల సందర్భమున

''సురనామ మూని యసురకృత్యముల రేపి
సేవించు వారిని జెరుపుచుండు.... .... .... ....
మధు ఘటమ్మెందునేని సన్మాన్యమగునె?" [4]

1. పోతన చరిత్రము : ౭-18
2. ,, 4-209.
3. ,, 4-321.
4. ,, : 4-208

అని నిందించుటచేత మద్యపానము పనికిరాదను ప్రబోధము వ్యంగ్య
గ్రాహ్యమగుచున్నది.

## మత సామరస్యము :

మత సామరస్య ప్రబోధమునకు కావ్యము సమంచిత ప్రాధాన్యము వ
యున్నది. మతాల వైషమ్యముతో మారణహోమములు గావించు మానవు
చక్కని హితబోధ. చిదానంద గురూత్తముడు పోతన కుపదేశించిన దానివల్ల
గ్రాహ్యమగుచున్నది. అంతకు ముందు పాల్కురికి జాతరలో వీథి భాగవతమ
తల్లి పోతనకు శివకేశవు లొక్కరేయని చెప్పినదియు నీయద్వైతమునే ప్రబో
చున్నది. మెట్టుగుట్టపై శివుని రాముని దర్శించి శిష్యులతో

"కన మతములు పెక్కగమ్యమింత కొకండె భాషలెన్నియైన భావ మొ
పర్వతమునకేఁగు పథములు వేరేని నగ్రమందుఁజేర్పనన్ని యొకటె"

అని ప్రవచించినదియు దీనినే విశదీకరించుచున్నది. అమూల్యమైన మతసామ
మీ బోధలచే వాచ్యముగను, పోతన జీవిత ద్వారమున వ్యంగ్యముగను ప్రబో
నది కావ్యము.

## మాతృ భాషా సాహిత్యాభిమానము :

పోతన చరిత్రము మాతృభాషయెడను అందలి సాహిత్యమునెడను ఆ
పండితులయెడను అదరాభిమానములు కలిగియుండవలెనని ప్రబోధించుచున
కావ్య పీఠికలో వరదాచార్యులవారు కావించిన ఆంధ్రభారతీ స్తుతి మున్నగు వి
ప్రస్తుతులే యీ విషయమును చెప్పక చెప్పుచున్నవి. కావ్యోపక్రమమున
దేవేంద్రుడు తమ మాతృభాష యగు సంస్కృతమును రక్షింప హరిని ప్రార్థి
నప్పుడు

"ఔదలం ధరియించి యన్న వస్త్రములిచ్చి పోషించు వర మాతృభూమికన
బొట్టలోఁగాని మేటిపుట్టువున్ నిర్మించి స్తన్యమ్ము లిడి పెంచు జనని కన
బాల్యమ్మునన కాక బ్రతికి నన్నాళులుం బాలిచ్చి పెంచు గోమాత కన
దలలోని నాల్కయై తలఁపునకాకార మొసఁగి విజ్ఞానంపు ఁబస దనర్చ

1. పోతన చరిత్రము : 9-23

ఘనతనిడు తల్లిబాసయేకాదె మిన్న యింతె కాక ప్రాఁబల్కులకిల్లు నెల్ల
తల్లి బాసలతల్లి మందారవల్లి దేవవాణి దాని కదేటి తెల్గు పోటి''[1]

అని పల్కుటలో మాతృభాషాభిమానము ప్రస్తుతమై యది కర్తవ్యమను ప్రబోధము వ్యంగ్యముగా లభించున్నది.

''స్వస్థానవేషభాషాభి మతాస్సంతో రసప్రలుబ్ధ ధియః
లోకే బహుమన్యన్తే వైకృత కావ్యాని చాన్య దపహాయ''[2].

అని నన్నయ్యగారు సెలవిచ్చినట్లు బుద్ధిమంతులగు సుజనులు స్వీయవేష భాషలపై అభిమానముగలవారై ప్రవర్తింతురు. మాతృభాషపై అభిమానము గాఢముగా నుండవలసినదే. మాతృభాష నభిమానింపనివాడు మాతృదేవి నభిమానింపనివాని క్రిందనే లెక్క. కాగా ఈ అభిమానము సదభిమానము కావలెను కాని దురభిమానము కాగూడదు. నిరభిమానమంతకంటె కూడదు. పై కావ్య సందర్భమున నింద్రుడు సంస్కృత భాషపై దురభిమానము గలిగి తెలుగును ద్వేషించెను. మాతృభాషా దురభిమానము, పరభాషాద్వేషము హానికారకము లనియు నిందువలన నీతి గ్రహింపవలసి యున్నది.

## దీనజనసేవ : మానవతావాదము :

ఎంత మతధర్మము లాచరించినను ఎన్ని జపతపములు చేసినను దీనజన సేవ మరువరాదనియు అంతకంటె గొప్పతనము లేదనియు కావ్యముపదేశించు చున్నది.

"దీనజనులను దయఁ జూచు దివ్యకర్మ
తపము లన్నిటిలో నుచ్చతమము
మరువవలదు......... ....".[3]

అనుచు చిదానంద యోగి పోతన వ్యాజమున సమస్తజనుల కుపదేశించెను. అందులకు పోతనకవి చరిత్రము లక్ష్యమై విరాజిల్లుచు వ్యంగ్యోపదేశము చేయు

1. పోతన చరిత్రము : 1-59
2. ఆంధ్రశబ్ద చింతామణి - సంజ్ఞ, 5
3. పోతన చరిత్రము : 2-55

చున్నది. కులమతములేవైనను మానవులందరొక్కటే యని సాటి మానవులయెడ సానుభూతితో ప్రవర్తింపవలెనను మానవతావాదమును కావ్యము ప్రబోధించు చున్నది. దీనభిక్షుకునింటికి గొనితెచ్చి పోతన భార్యతో

"ఒలువ నారలేక పలుక ప్రాణములేక క్షుత్పిపాసనడఁగి క్షోభఁ జెందుఁ
బ్రీతితోడ నీ దరిద్ర నారాయణు నన్న మొసఁగి తన్పఁ బున్నె మొదవు[1]".

అన్న మాటలు సర్వజన శిరోధార్యములు. ఉన్నవారికి గొప్పవారికి స్వార్థమునకు డంబమునకు ఎంతైన పెట్టుదురు గాని దీనులను హీనులను కాచువారుండరు. కాని యట్టి దరిద్ర నారాయణులను సేవించిన కలుగు పుణ్యమగణ్యము. అందుకే,

"దరిద్రాయ కృతం దానం శూన్యలింగస్య పూజనమ్
అనాథప్రేత సంస్కారోహ్యశ్వమేధసమం విదుః"

అని దరిద్రునికి చేసిన దానమశ్వమేధముతో సమానమైనదని చెప్పబడినది. దుర్భర దారిద్ర్యమునకు తట్టుకోలేక పేదలు కాలదన్నెడు ధర్మములు నీతులెన్నో యని పోతన పరితపించును.

"ఆపరాని దరిద్ర దుఃఖాశ్రునదుల గండిపడు నీతులను జాతికట్టలెన్నొ
మండుటాఁకలి డొక్కల మంటకొడుల (దప్పుకొనలేక మసియైన
ధర్మమెంతొ"[2]

ఇది ధనికులకు హెచ్చరిక చేయుచున్నది. ధర్మ నీతి ధ్వంస హేతువైన ఆకలిని చల్లార్చుటకు పేదసాదుల నాదుకొనుటకు కలవారు ముందుకు రావలెననియు లేనిచో అనేకానర్థములు సంభవింపగలవనియు వ్యంగ్య ప్రబోధము గావించుచున్నది. కాగా సంపన్నులు ధనమదాంధులు. వారు పేదలనేమాత్రము లక్ష్య పెట్టరు. ఇది పనికి రాదను నీతిని గజేంద్రుని మొరలోని దిగువ పద్య మెలుగెత్తి చాటుచున్నది.

"పిలిచినఁ బలుకరు, కాంచన్ వలనుపడదు చనగఁరాదు వద్దకు లక్ష్మీ
లలనాధీశులభాగ్యులఁ దిలకించెదరొక్కొ! వారితీరది వేఱే"[3]

1. పోతన చరిత్రము : 5-228
2. ,, : 5-268.
3. ,, : 12-52

ఈ విధముగా దీనజనులసేవ పరమపుణ్యమనియు సకల జన కర్తవ్యమనియు కావ్యముపదేశించుచున్నది. 'మానవసేవయే మాధవసేవ' యను మహాత్ముల మహితసూక్తి యిట్టిదే కదా!

## ఇతర నీతులు :

లోకములో మానవుడు బుద్ధిబలముతో యుక్తాయుక్త వివేచనతో మెదలుట కవసరమగు నీతులును కావ్యమున ననేకముగా ప్రవచింపబడియున్నవి. నారదుడు హిరణ్యకశిపుని వద్దకు వెళ్ళి సంభాషించి చెప్పిన నీతులు కడు యుక్తములైనవి.

"ముల్లు పెరికివేయ ముల్లు కావలెనని అగ్నితోడ నగ్ని నార్పవశమె?
ఒక్కసూత్ర మెప్పుడుపయోగ పడదెందు సాధనమ్ము గొంద్రు సమయ
మెఱిఁగి"[1].

హింసను హింసతో మాన్పలేమనియు, సమయానుకూలముగా కార్యసాధనపద్ధతి నవలంబింపవలెననియు నిది ప్రబోధించుచున్నది. ఇక నరులు తెలియని విశ్వవిజ్ఞాన రహస్యమెంతో కలదనియు, విజ్ఞులమని విఱ్ఱవీగుటకు వీలులేదన్న నీతిని దిగువ పద్యము బోధించుచున్నది.

"నరులెఱుఁగని రహస్యమెంతయు నిగూఢ విశ్వవిజ్ఞానకోశాన వెలయు
చుండు
ఉగ్గుపప్పను భావాలనొప్పుబిడ్డలెఱుఁగ రానట్టి కావ్యార్థమెల్ల కల్ల"[2].

మరొక నీతిమానవులకు మహితమతిని ప్రసాదించుచున్నది. బుద్ధి, వివేకము, ఉత్కృష్ట జన్మముగల మనుజుడు క్రూరమృగాలవలె ప్రవర్తింప గూడదన్నది దిగువ యుపదేశము.

"సదసద్వివేకముడిగిన మదశార్దూలంబు హింస మసలెనటంచున్
వదలవె హింస? స్తనంధయుడు దిస మొలన్ మెలఁగ మనమటుల్
మననగునే?[3]

హిరణ్యకశిపుడు సుతుని విద్యాపరీక్ష చేయగా ఆయన

1. పోతన చరిత్రము : 11-226.
2. ,, ,, : 11-227.
3. ,, ,, : 11-228.

"కోటిచదువులొక్కమాటలోఁ జెప్పెదఁ పరుల పీడనమ్మె పాతకమ్ము
నల పరోపకార మత్యంత పుణ్యమ్ము స్వాత్మతారకమ్ము శక్రవైరి!"[1].

అని సకల విద్యాసారము చెప్పుటలో పాతకహేతువైన పరపీడనము విడిచి పుణ్యమును జన్మతారకమునునైన పరోపకారమే చేయవలెనన్న యుపదేశము గ్రాహ్యమగుచున్నది. ఇది కాళిదాసు చాటువని చెప్పబడుచున్న 'శ్లోకార్థేన ప్రవ క్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్' అన్నదానిని అనుసరించియున్నది.

వ్యక్తికంటె సమాజము గొప్పదనియు, స్వార్థమునకు, పరార్థమునకు మిగుల తారతమ్యము గలదనియు ప్రహ్లాదుడు తండ్రికిట్లు చెప్పెను.

"వ్యష్టికై పాటుపడ బిందు వారియగును నే సమష్టినంచు శ్రమింప నీరధియగు
నరయ స్వార్థమ్మునకును పరార్థమునకు నబ్ధికిని బిందువునకున్న
యంతరమ్ము"[2].

ఇతరులయెడ తన రాగద్వేషములే తనకు ప్రతిఫలించునని పైసందర్భముననే యిట్లు చెప్పబడినది.

"వినుమొరులఁ బ్రేమఁ జూచినఁ దనఁదా ప్రేమించుకొనుటె తానొరు ద్వేషిం
చిన ద్వేషి తనకుఁదానే తనమోమును జూపు విశ్వ దర్పణమెందున్"[3].

ఇట్లే అనేకరీతుల నీతులు యుక్తియుక్తముగా బోధింపబడియున్నవి.

## అర్థసంబంధి నీతులు :

పురుషార్థములందు అర్థము ద్వితీయమైనను అద్వితీయమై 'ధనమూలమిదం జగ'త్తను లోకోక్తిని సంతరించుకొన్నది. మానవుడు నాలుగు పురుషార్థములను క్రమముగా సాధించవలెను. పారలౌకికము దుర్లభమునగు అపవర్గము నటుంచినచో లౌకికముగా వరుసగా 'ధీం శ్రీం స్త్రీం' అను త్రివర్గములను సాధింపవలెనని పెద్ద లందురు. కాగా ధర్మమోక్షములకు ప్రాధాన్యమిచ్చిన పోతన చరిత్రము ధర్మ

1. పోతన చరిత్రము : 11-286.
2. ,, ,, : 11-332.
3. ,, ,, : 11-334.

బద్ధమైన అర్థమునకు సముచిత స్థానమొసగినది. అర్థ కామ పరాయణుడైన శ్రీనాథుడు ధనావసరము గురించి నొక్కి వక్కాణించుటయేకాక తానట్లే నడచి పొంగుక్రుంగుల తత్ఫలమనుభవించినాడు. కావ్యనాయకుడు పోతన పారలౌకికమునకు ప్రతినిధి. అతడైహిక భోగవిముఖుడై అర్థముపై నత్యాశ యెన్ని అనర్థములకు దారితీయునో, ఆ యాశ వీడినచో ఎంత శాంతియో ఎంత ఆనందమో ఎంత శ్రేయస్సో చెప్పి చేసి నిరూపించెను ఈ ఇద్దరు మహాకవుల వాదముల రీతిని క్రమముగా చర్చింతును.

శ్రీనాథుడు ధనావసరమును దాని ప్రాధాన్యము ననేక విధముల పోతనకు గుర్తుచేసెను.

> "లక్ష్మికోపింప విష్ణులీలావిలాస ఘనజగన్నాటకంబెల్లఁ గట్టువడును
> అర్థమది చతుర్విధ పురుషార్థవితతి నల ద్వితీయమై యద్వితీయతఁ
> జెలంగె"[1].

జగములను ప్రవర్తింపజేయుటకు విష్ణువునకు లక్ష్మియే కారణమగుచున్నదన నితరులగురించి చెప్పవలసినది లేదు.

'అర్థము లేనివాని జీవితము వ్యర్థము. అర్థహీనుని భార్యయు లెక్కచేయదు. లోకులు వానిని గడ్డిపోచవలె గాంతురు. దినము గడచుట దుర్లభమగును. మానాభిమానములు మంటగలియును. అర్థమున్నచో బ్రతుకు చక్కగా సాగుటయే కాక బలము తేజస్సు అన్నియు శోభిల్లును'[2]

> "కలిమిగలవాని శవమునుం బలుకరింత్రు వేఁడు నిర్ధనుఁ గన్నెత్తి
> చూడరెవరు
> ద్రవ్యవంతుని వాక్కు వేదంపు ఋక్కు మిడుకు బీదపల్కులు చెవిఁ
> బడు ములుకులు"[3]

అనియు ప్రతిభావంతుని వద్ద ధనమున్నచో నది పది యంతలు ప్రకాశించుననియు, సకలలోపములను సరిదిద్దుటకు ధనము కంటె మించినది లేదనియు పాండిత్య

1. పోతన చరిత్రము : 8-112
2. ,, ,, : 8-113 నుండి 116 పద్యముల సారాంశము
3. ,, ,, : 8-117

ప్రకటనచే ధనమార్జించి నలుగురిని తృప్తిపరచుచు తాను సుఖపడవలెననియు, గురుజనులను బంధుమిత్రులను భార్యా పుత్రులను పోషించుటకును ధనమే ఆవస రము కదా'[1] యనియు శ్రీనాథుడు పలికిన మాటల వలన అర్థ ప్రాధాన్యము గ్రాహ్యమగుచున్నది.

ఇక పోతన వెలిబుచ్చిన ఆర్థిక నీతి విలక్షణమై విశిష్టమై యున్నది.

"అవసరమ్ములు నింద్రియ వినోదములటంచు నరమనోభీష్టమ్ము లిరు తెఱఁగులు;
అవసర సేవనమ్మసువుల మై నిల్పుఁదమి వినో దములింద్రియముఁ దన్పు
నొగి వినోదమ్ము లాయువు నెల్ల హరియించు నవసర సేవ జీవామృతమిడు
ధాత్రి నింద్రియ వినోదములకుఁ దుద గాన మవసర సేవన కవధి గలదు
ఆవసరములు పూర్తియగును న్యాయార్జనన్ వేడ్కఁ దీర్పవెంత విత్తమేని
అవసరమున కన్న నధిక మార్జించుచు ధనముఁ గొనుట దొంగతన
మటంద్రు"[2]

ఇది పోతనగారి యభిప్రాయసారాంశము పోతన అర్థమునుగూర్చి తాత్త్వికముగా విశ్లేషణచేసి చెప్పినాడు. అవసరాలకు ధనము వినియోగించుట ధర్మము ఇంద్రియ వినోదములకు వెచ్చించుట అధర్మము. అది పాపహేతువు. భోగలాలసుడై అత్యాశతో ధనార్జన చేయగూడదన్నది ముఖ్యనీతి. అర్థకామాదులలోని ధర్మము లిట్లు చెప్పెను

"తన యక్కఱకు డబ్బు దాఁచు లోభమ్మొప్పు పరధనాహరణ లోభమ్ము తప్పు
నిజ వస్తువులపయి నిల్పు మోహమ్మొప్పు అన్య వస్తుగత మోహమ్ము తప్పు
తన సతిన్ నియతిఁ గూడిన కామగతి యొప్పు పరసతిన్ గపయు కామరతి తప్పు
తన ప్రాణ రక్షకై తగిన కోపమ్మొప్పు పరవినాశక కోపభరము తప్పు

---

1. పోతన చరిత్రము : 8-118 నుండి 120 పద్యముల సారాంశము.
2. ,, ,, : 8-126

స్పర్థ గల్గిన యట్టి మాత్సర్య మొప్పు పరు నసూయగాఁ జూచు మత్సరము
తప్పు
సదభిమాన పూర్వక మదచర్య యొప్పు దురభిమాన దూషిత మదనిరతి
తప్పు"[1]

ఇందు కామక్రోధాద్యరిషడ్వర్గమును మానవుడు ధర్మబద్ధముగా వశము చేసికొన్నచో నొప్పుననియు తద్విరుద్ధమైన తప్పనియు ప్రబోధింపబడినది.

మరియు "బ్రతుకు కోసము శ్రవణాదులచేత శబ్దాదులను సేవింపవలెను గాని ఇంద్రియ సేవకోసము బ్రతుకుకాదు వర్ష ఋతువునందు ఉప్పొంగునదులు మలినములై వేసవిలో స్వచ్ఛములగునట్లు ధనము పెరిగినపుడే నరుని వర్తనము మలినమై అది తగ్గిపోయినపుడే శుద్ధమగును. దానము భోగము నాశము నను మూడు గతులు గల ధనమునకు దానమే యుత్తమము. ఏలనన అదొకటియే జీవుని వెంట వచ్చును. తక్కినవి యింటిలోనే యుండును. ధనము, యౌవనము మద్యమువలె మత్తు కలిగించి వివేకభ్రంశము చేయును. ధనము కాని యౌవనము కాని తుదకు జీవనము గాని స్థిరమైనవి కావు. అవి మేఘముల వలె పద్మదళ జలములవలె చంచలములు స్వప్న తుల్యములు. ధనమనగా లక్ష్మి. ఆమెను విష్ణుసేవలలో నుంచవలెనే గాని తనకని హరియించువాడు తగిన శిక్ష గాంచగలడు. కాలగతిలో కుచేలుడు కుబేరుడు కాగలడు. అర్థకామములు ధర్మ బద్ధములైనచో మోక్షమునకు దారి తీయగలవు. ధర్మము మూలమైన జీవిత వృక్షమున కర్థకామములు పత్ర పుష్పములై మోక్ష ఫలమును ప్రసాదించును"[2].

పోతనగారి యీ ప్రవచనము వలన మనుష్యుడు ధనమును ఇంద్రియ వినోదార్థము కాక బ్రతుకుట కవసరపడి ధర్మమార్గమున సంపాదించవలెననియు క్షణికమైన ధనము గూర్చి అత్యాశకు పోక కలిగినంతలో దానముచేసి తానను భవించుటలో తృప్తిపడిన బ్రతుకే ధన్యమయినదనియు హితోపదేశము లభించు చున్నది.

1. పోతన చరిత్రము : 8-128
2. ,, ,, : 8-130 నుండి 137 పద్యముల సారాంశము.

## కామసంబంధి నీతులు:

కామపురుషార్థము గూర్చి కావ్యమున నితాంతహితకరమైన యుపదేశము కావింపబడినది. ఇది ప్రధానముగా పోతన దాంపత్య జీవితమువలన వ్యంగ్యముగా గ్రాహ్యమగుచున్నది. తదితరసందర్భములందు వ్యంగ్యముగను వాచ్యముగను ప్రబోధింపబడియున్నది.

పోతన దాంపత్య మాదర్శవంతమైనది. దంపతులిరువురును రూపగుణశీల విద్యాసంపన్నులు. నర్సమాంబ గుణవతి, లజ్జావతి, అనురాగామృత హృదయ, పతిభక్తిసమన్విత, పోతన సదాచార సంపన్నుడు, నిగ్రహవంతుడు, ప్రణయ పూర్ణాంతరంగుడు, ఏకపత్నీవ్రతుడు. వారి దాంపత్యము, అన్యోన్యప్రేమాదరము లనన్యములు.

భక్తి జ్ఞాన సంపన్నుడగు పోతన సంసారవిమోహికాక తామరాకుమీది నీటి బిందువువలె అంటియంటక సంచరించినవాడు.

చతురాశ్రమములలో గార్హస్థ్యమే యిహపర సౌఖ్యసంపదల నిచ్చుననియు జనక మహారాజు వంటి జ్ఞాన సంపన్నులు సంసారమున నుండినట్లు తానుండిన వాడు. 'కామమ్మ తానర్థకామమై సద్ధర్మ కామంబుగా న్మోక్షకామమగును' అని పోతన శ్రీనాథునితోనన్నట్లు ఇంద్రియ వినోదమునకు ప్రాధాన్య మీయక సద్ధర్మ కామము ననాసక్తితో ననుభవించుచు ముముక్షువై తరింపవచ్చునన్నది కావ్యమున కామసంబంధమైన ప్రధానోపదేశము.

సంసారమున నడుగిడుటకు ముఖ్యఫలము సంతానప్రాప్తి యన్నది శ్రుతి విహితము. 'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః' యని తైత్తిరీయోపనిషత్తు శిక్షావల్లిలో గురువు సమావర్తన సంస్కారవేళ శిష్యునకుపదేశించును. సృష్ట్యాది నుండి సాగుచు వచ్చుచున్న ప్రజాతంతువును-సంతానోత్పత్తిని-త్రెంచివేయ వలదని ప్రబోధము. అందుకోసమే పరమపవిత్రముగా కామపురుషార్థమును సాగించుట. ఈ విషయము మల్లన జన్మించిన పిదప పోతన యిట్లు తలపోసెను.

"సంతానార్థమె సంచరింపఁదగు నీసంసారమందెప్పుడున్
వింతల్సల్పుచు నాటలాడుకొనుచున్ విధ్యుక్తధర్మమ్ము ర

వ్వంతేనిన్ బరికింపకే విఫలతన్ బ్రాల్మాలి కామాగ్నిలో
భ్రాంతిన్ రెక్కలు మాడి చచ్చు శలభప్రాయుండఁగా జెల్లునే''[1]

పోతనద్వారమున కావ్యము లోకులకందించు నుపదేశమిది. ఇక హీనకులజయైనను ఉత్తమగుణశీలయైనచో చేపట్టవచ్చునని 'స్త్రీరత్నం దుష్కులాదపి' అన్న ఆర్య నీతిని పునరుద్ఘాటించుచు భోగినిని సింగనృపతి పరిణయ మాడుట ద్వారా యుక్త మని బోధించుచున్నది.

నియమరహితమైన కామోపభోగముహానికారకమని మరొక నీతిని బోధించు చున్నది.

"సద్దుగ మేడలెక్కి కనుసైగ లొనర్చెడి మేఘసంగతిన్
వద్దని సస్యకాంత తల వ్రాలిచె గర్భభరాలసాంగియై
వద్దననేని ద్రాగి పయివచ్చిపడెన్ బ్రజనష్టమౌట తా
నద్ది యెఱుంగఁడెంతటి ఘనాహ్వయుఁడైనను ద్రాగుబోతనన్"[2]

పొట్టకు వచ్చిన వరిపొలముపై మేఘుడు చెడగొట్టువానను గురిపించి పంటను పాడు చేయునట్లు త్రాగుబోతై వివేకహీనుడైన భర్త నిండు గర్భవతినే గూడి సంతాన మునకు హాని కలిగించును కావున గర్భవతీసంగమ మయుక్తమని పరిహార్యమని ప్రబోధించుచున్నది.

పాపహేతువైన కామాతిచారమును పరస్త్రీగమనమును కావ్యము గాటుగా ఖండించుచున్నది. పేద జవరాలిని బలాత్కరింపబూనిన యువక భూస్వామికి పోతన వినిపించిన హితోపదేశక కవిత యిట్టి ప్రబోధము చేసినది. హృదయా నందము కొరకీశ్వరుడు సౌందర్యమును సృష్టించెననియు అట్టి సౌందర్యముపై స్వార్థహస్తము వేయగూడదనియు, ఒకరిపై అనురాగలతిక పెనవేసికొన్న కాంతను బాపుట పాపమనియు అది ఫలింపదనియు ప్రేమచేతనే హృదయాల నాకర్షింపవలెగాని బలిమిచేత గాదనియు ఒకరికి తాపము కలిగించిన పాపఫలమనుభ వింపక తీరదనియు నిట్లనేక విధముల నీతిని బోధించినది.

అర్థకామముల గురించి పరధన పరవనితాపహరణము దురిత హేతువన్న యీ సదుపదేశము

1. పోతన చరిత్రము : 3-275
2. ,, ,, : 3-138

'మాతృవత్పరదారాణి, పరద్రవ్యాని లోష్ఠవత్
ఆత్మవత్సర్వభూతాని, యః పశ్యతి సపశ్యతి.'

అన్న సుభాషితమును బలపరచుచున్నది. అనగా పరస్త్రీలను తల్లివలెను పర ద్రవ్యమును మట్టిపెల్లవలెను సకల జీవరాశులను తనవలెను ఎవడు చూచునో వా వానిని (పరమాత్మని) చూచును. మానవుడిట్టి లోకోత్తర జీవితము గడపవ ననియే కావ్యముద్బోధించుచున్నది.

సామూహికముగా ఈ నీతులను పరిశీలించినచో
'కర్మ విహీనత యొప్పదు ధర్మమునకు విజయమెందుఁ దప్పదు'[1].

అని దేవేంద్రునికి శ్రీహరి చెప్పిన హితవు భూమికయై శోభిల్లు చున్నది. మనుష్యు నిష్క్రియులై యుండక విధ్యుక్త కార్యముల నాచరింప వలెననియు, ఎప్పటికైన అధర్మము నశించి ధర్మమే విజయము గాంచును కావున ధర్మవిలసిత జీవన సాగించవలెననియు ప్రబోధించుచున్నది.

ఈ రీతిగా తొలుత తెలిపినట్లు కావ్య మిహ పర సాధకముగా ధర్మార్థ కా ముల చక్కని నీతిబోధ చేయుచు మోక్షమును ప్రధానముగా ప్రబోధించుచున్న

———

1. పోతన చరిత్రము : 1-64

# వస్తు సంవిధానము

## ప్రస్తావన :

పోతన చరిత్ర మహాకావ్యరచనానంతరము వరదాచార్యులవారు విప్రలబ్ధ గేయ కావ్యమును విరచించినారు. జ్ఞానపదమగు మహా కావ్యము తర్వాత జానపద మగు గేయకావ్యమును సంతరింపకుండ ఉండలేకపోయినారు. విశ్వనాథవారు శ్రీమద్రామాయణ కల్పవృక్షము పిమ్మట కిన్నెరసాని పాటలు వ్రాసియుండిరి. పండిత లోకమును ప్రధానముగా రంజింపజేయు ప్రౌఢ మహాకావ్యముల పిదప పండిత పామరాశేష జనాహ్లాదనార్థము సరళసుందరములైన గేయకృతులు రచించుట సుకవుల యభిమతము కానోపును. ప్రౌఢకావ్య రచనోద్భాసితుడగు శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రము వ్రాసినది యిట్టిదే యనిపించును.

పోతన చరిత్రము జ్ఞానపద విరాజితమైనను జానపద వాతావరణమందు చెలువొందినట్లే విప్రలబ్ధ జానపద శోభితమయ్యు జ్ఞానపదస్ఫూర్తి కలిగి వెలు గొందుచున్నది. చతుర్విధ కవితలలో పోతన చరిత్రము విస్తర కవితా విభ్రా జితము కాగా విప్రలబ్ధ మధుర కవితా విలసితమై యొప్పుచున్నది. హృద్యపద్య విద్యలో అందెవైచిన ఆచార్యులవారు రమణీయ శ్రుతిపేయ గేయరచనా చణత్వము నకును పట్టము కట్టుకొని రెండిటి యందును సవ్యసాచులై విరాజిల్లుచున్నారు. వారికి పద్య కవితకు సైదోడుగ గేయ కవితయు తొలినాళ్ళలోనే కైవసమై యుండెను. వారి గేయ కవితా కల్పలత మణిమాలలో అంకురించి ఆహ్వాన జయ ధ్వజములలో తీగలు సాగి పోతన చరిత్రములోని గీతములలో పుష్పించి విప్ర లబ్ధలో ఫలవంతమైనది. ఇట్టి విప్రలబ్ధ గేయ కావ్యమును చర్చించుటకు ముందు తెలుగున వెలసిన గేయ వాఙ్మయము గురించి సంగ్రహముగా ముచ్చటింతును.

## తెలుగులో గేయ కావ్యములు :

మార్గ దేశి కవితా విభాగములలో గేయ కావ్యములు దేశికవితకు చెందినవి. యక్షగానములలోని దరువులు, జానపద గీతములు, త్యాగరాజ కీర్తనలు,

క్షేత్రయ్యపదములు, మాత్రాచ్ఛందస్సులోని రగడలు, ద్విపదలు మున్నగునవి దేశి కవితలు ఏ భాషయందైనను తొలుత పొడిపొడి వచనములకంటె లయాన్వితమైన పాటలు పద్యములే ముందుగ యావిర్భవించినవని ప్రాజ్ఞులు వచింతురు. అందు పద్యములకంటె పాడుకొనుటకు వీలగు గేయములవంటి దేశిరచనలే ముందుగా వాడుకలో నుండెడివనియు చెప్పుదురు. ఆంధ్ర సాహిత్యము నన్నయగారిచేత మార్గ కవితా రచనతో ప్రారంభమగుట వలన అంతకు ముందున్న దేశిరచన లణగారి పోయినవని తెలియుచున్నది. మహా ప్రతిభాఢ్యులును మహనీయ కవితా పాండితీ మండితులును నగు కవిత్రయమువారు మార్గ కవితకు మలుపురాని మార్గము వేయుటచేత దేశికవిత దిక్కుగానక స్రుక్కిపోయినది అప్పటికి దేశిరచనలుండెడి వని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రములో శ్రీశైల వర్ణన సందర్భ ములో పేర్కొనిన వెన్నెల, నివాళి, వాలేశు, గొబ్బి పదములవలన విదితమగును.[1] సోమనాథుడు దేశికవితా పునరుద్ధరణకు పూనుకొని బసవ పురాణము, పండితా రాధ్య చరిత్రము అను రెండు గొప్ప ద్విపదకావ్యములను బసవ రగడను రచిం చెను. ఐనను తర్వాత కవులతని మార్గము ననుసరింపలేదు. రంగనాథ రామాయ ణము, హరిశ్చంద్రోపాఖ్యానము, పల్నాటి వీరచరిత్రము వంటి ద్విపదకావ్యములు విరచింపబడినను వానికి మార్గ పద్య కావ్యములకు గల గౌరవము లభింపకపోవు టయేకాక అధిక్షిప్తములాయెను. పెద్దన, రామరాజ భూషణునివంటి కవులు తమ ప్రబంధములందు వసంతర్తు పుష్పాపచయ వర్ణనలలో రగడలను ఛందోవైవిధ్య మునకు ప్రయోగించిరి. దక్షిణాంధ్ర యుగమునందలి సాహిత్యమున దేశిరచన పుష్కలముగా సాగినది. అనా డనేకముగా యక్షగానము లుద్భవించినవి. రంగా జమ్మ రామభద్రాంబ వంటి రచయిత్రులు పదరచనలు చేసినారు. విజయరాఘవ నాయకుడు, కందుకూరి రుద్రయ, కంకంటి పాపరాజు మున్నగు కవీశ్వరులు యక్షగానములు రచించిరి. క్షేత్రయ్య పదములు త్యాగరాజు కీర్తన లాకాలమున వెలసిన విశిష్ట దేశిరచనలు. త్యాగరాజు కీర్తనలేకాక ప్రహ్లాదభక్త విజయము, నౌకా విజయమను యక్షగానములను రచించెను. ఈ కాలమునందిన్ని దేశిరచనలు

1. "మదినుబ్బి సంసార మాయాస్తవంబు। పదములు, పర్వత పదము లానంద పదములు, శంకర పదముల్ నివాళి। పదములు, వాలేశు పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు............అర్ణవ ఘోషణ ఘూర్ణిల్లుచుండ".

—పండితారాధ్య చరిత్రము - పర్వత ప్రకరణము

వెలువడినను తరచుగా నివి అతివేలమైన అసభ్యమైన శృంగారమునకు తావిచ్చిన వను నపప్రథకు లోనైనవి. మరియు వానిలో కవిత్వమునకంటె సంగీత మధిక ప్రాధాన్యము వహించినది.

దేశికవితలోని గేయములనేక విధములు. భక్తి వేదాంత గీతములు, జానపదుల పదకవితలు, స్త్రీల పాటలు, కథల పాటలు మొదలగునవి. తాళ్ళపాక అన్నమాచార్య కీర్తనలు, త్యాగరాజు కీర్తనలు, రామదాసు కీర్తనలు, బ్రహ్మంగారి తత్త్వములు మున్నగునవి భక్తివేదాంత గీతములు. ఇక జానపదులగు కర్షకులు, గౌడులు, గొల్లలు మొదలగువారు పాడుకొను దంపుళ్ళ పాటలు, నూరుపుళ్ళపాటలు, రోకటిపాటలు, బండిపాటలు, పడవపదాలు, ప్రేమగీతాలు, ఏలలు, చందమామ పదములు మొదలగునవి జానపదుల పదకవితలు. ఇక స్త్రీలనేక సందర్భములందు పాడుకొను పాటలు వేడుక (పెండ్లి) పాటలు, మంగళహారతులు, శోభనపు పాటలు, తలుపుదగ్గర పాటలు, సీతాకళ్యాణము, శశిరేఖ పెండ్లి వంటి పాటలు, స్త్రీల పాటలలో చేరియున్నవి. కథల పాటలనునవి వీరకరుణాది రసములను పోషించు కథలకు చెందినవి. ఇవి చాలా పెద్దవి. ఇవి తందాన కథలు, బుఱ్ఱ కథలనియు పిలువబడును. పల్నాటి వీరచరిత్ర, కామరాజుకథ, బొబ్బిలి కథ, దేశింగురాజు కథ, సర్వాయిపాపని కథ వంటివి వీరగాథలు. బాలనాగమ్మ కథ, లక్షుమమ్మకథ, ధర్మాంగద చరిత్ర (పాముకాటు) మొదలగునవి కరుణ రసభరితములు. ఇందు జానపదుల పదకవితలకు, స్త్రీల పాటలకు, కథాగీతముల కనేకములకు కవులెవ్వరో తెలియదు. రచనాకాలము కూడ అంతగా తెలియదు. ఈ గేయములు శిష్ట కావ్యములలోని ప్రౌఢిమ, అలంకార భూయిష్ఠత లేనివైనను నిసర్గ రామణీయకత ఆత్మీయ భావములు సరళభాష యొప్పి వీర శృంగార కరుణాది రసములచేత ఎదలను కరగించును. గేయములు లయతాళబద్ధములై రాగ యుక్తముగా పాడుటకు వీలగును. కావున నివి పద్యములకంటె మిక్కిలిగా పండిత పామర జనులందరిని రంజింపజేయుచుండును.

ఇరువదియవ శతాబ్దారంభమువరకు, పైన విపరించి నట్లనేక గేయములు వెలసినను వానికి పండిత లోకమున ఆదరముగాని, కావ్య గౌరవముగాని లభించ లేదు. నవ్యకవితా యుగోదయమున గురజాడ అప్పారావుగారి ముత్యాల సరములతో గేయమునకు కావ్యగౌరవము లభించి దేశికవితకు మహోన్నత పీఠము ప్రాప్తించినది. వస్తువులో భావములో భాషలో దేశిపద్ధతుల నవలంబించి నవ్యత

విలసిల్లజేసి రచించిన అప్పారావుగారి గేయములు మిక్కిలి విశిష్టములై తక్కిన కవులందరికి చక్కని మార్గదర్శనము కావించినవి. మాత్రాచ్ఛందో విభాసితములగు గేయములలో నెంత గొప్ప భావములనైనను వెలార్చవచ్చుననియు ఎంత ప్రౌఢ కావ్యములలైనను రచింపవచ్చుననియు కథాకావ్యము, ఖండకావ్యము, ముక్తకము వంటి సర్వకవితా ప్రక్రియలకు గేయముపయోగింపవచ్చుననియు నిరూపితమైనది. గురజాడ అడుగుజాడలో నడచి రచించిన బసవరాజు వేంకట అప్పారావుగారి గీతాలు, నండూరి వేంకటసుబ్బారావుగారి యెంకి పాటలు చాల ప్రసిద్ధి గాంచినవి విశ్వనాథ సత్యనారాయణ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, సి. నారాయణరెడ్డి మున్నగు సుకవీంద్రులెందరో ప్రశస్త గేయకావ్యములు రచించి యున్నారు.

ఆధునిక గేయకావ్యములలో గురజాడ అప్పారావుగారి 'ముత్యాల సరాలు' శ్రీశ్రీగారి 'మహాప్రస్థానం' వంటివి విశిష్టమైన ఖండకావ్యములు. ఇట్టి గేయ ఖండ కృతులు విశ్వనాథ, కృష్ణశాస్త్రి, వానమామలై సోదరులు, కాళోజి, దాశరథి సి. నారాయణరెడ్డి, జె. బాపురెడ్డి, అనిశెట్టి సుబ్బారావు, ఆరుద్ర, సోమసుందర్ రమణారెడ్డి, గజ్జల మల్లారెడ్డి, మున్నగు అనేకానేక కవివరేణ్యులు లెక్కక మిక్కిలిగా రచించినారు.

సంఘసంస్కరణ ధ్యేయముగల గేయకావ్యములలో నారపరెడ్డిగారి 'కవిత' విద్వాన్ విశ్వంగారి 'పెన్నేటిపాట', నాగభైరవ కోటేశ్వరరావుగారి 'కన్నీ గాథ' మిగుల ప్రశస్తి వహించినవి. చారిత్రకేతివృత్తముగల గేయకావ్యము రచనలో డా. సి. నారాయణరెడ్డిగారు అగ్రగణ్యులు. వారి 'నాగార్జునసాగరము' 'కర్పూర వసంతరాయలు', 'విశ్వనాథనాయుడు' మిక్కిలి పేరెన్నికగన్న రమ్య రసవత్కావ్యములు. రెడ్డిగారు ఇంకను 'ఋతుచక్రం', 'జాతిరత్నం', 'నారాయణ రెడ్డి గేయాలు' 'సమదర్శనం' వంటి అనేక గేయకృతులు విశిష్టముగా సంతరిం గేయ కవిచక్రవర్తియను బిరుదు వహించినారు. రెడ్డిగారి యొరవడిలో నాగభైర కోటేశ్వరరావుగారు 'రంగాజమ్మ' కావ్యమును ఇంద్రగంటి శ్రీకాంతమ్మగార 'శిలామురళి' (ఒక బౌద్ధగాథ) చక్కగా రచించియున్నారు స్వీయచరిత్రనుగా స్వీయానుభవములనుగాని వెల్లడించుచు వ్రాసిన గేయకావ్యములలో విశ్వంగా 'నా హృదయం' సోమసుందర్‌గారి 'మేఘరంజని' గణనీయములు. వర్ణనాత్మక గేయ కావ్యములలో విశ్వనాథవారి 'కిన్నెరసాని పాటలు', పుట్టపర్తి నారాయణ చార్యులుగారి 'శివ తాండవము', నారాయణరెడ్డిగారి 'ఋతుచక్రం', సోమసుందర్

గారి 'గోదావరి జలప్రళయం', ముకురాల రామారెడ్డిగారి 'దేవరకొండ దుర్గం' ప్రశస్తి వహించినవి. పౌరాణిక కథలు గేయకావ్యాలుగా మలచబడిన వఝల వెంక టేశ్వర్లుగారి 'అమర వీణ' మడిపడగ బలరామా చార్యులుగారి 'మేనకా విశ్వామిత్రము' మనోజ్ఞ కృతులు.

ఇంక తెలంగాణ విముక్త్యుద్యమ సందర్భమున రచించిన దాశరథిగారి 'అగ్నిధార', సోమసుందర్‌గారి 'వజ్రాయుధం' ఖండకావ్యములు, ఆంధ్ర రాష్ట్రో ద్యమానికి చెందిన సోమసుందర్‌గారి 'కాహళి' మిక్కిలి చైతన్యము కలిగించిన రచనలు. మరియ జాతీయతను, దేశభక్తిని ప్రబోధించు గేయములు రచించిన వారిలో గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, శ్రీశ్రీ, ఆరుద్ర, సోమ సుందర్, దాశరథి, నారాయణరెడ్డి, బోయి భీమన్న ప్రభృతులెందరో కలరు. ఇవియే కాక శివశంకరశాస్త్రి, కృష్ణశాస్త్రి, రజని, నారాయణరెడ్డి, బాపురెడ్డి, యస్వీ జోగా రావు మున్నగు కవివరేణ్యులనేక గేయనాటికలు నానా విషయ సంకలితముగా మధుర మంజులముగా రచించి యున్నారు. ఇట్లు ఆధునిక యుగమున గేయము బహువిధ కవితా ప్రక్రియలలో విరాట్స్వరూపముదాల్చి విశిష్ట సాహిత్యమును సృష్టించినది

## విప్రలబ్ధ దేశికావ్యము :

వరదాచార్య విరచితమగు విప్రలబ్ధ నవ్యకవితా విరాజితమైన గేయ కావ్యము. ఇది కథాత్మకమయి 54 గేయములతో విలసిల్లుచున్నది. జానపదమై రాముడు లక్ష్మియను తెలుగునాటి కర్షక దంపతుల సాంఘికేతివృత్తము గలదై కర్షక జీవన చిత్రణము కావించుచు వారి ప్రణయమును పూర్వరాగమును విప్రలంభ మును పోషించుచున్నది. భావకవితా శాఖలో ప్రణయ కవిత్వమునకు పల్లీజన ప్రకృతికవిత్వమునకు సంఘసంస్కరణ కవిత్వమునకు చెందినదై యందగించు చున్నది. ఇది కులమతాతీతమైన వైవాహిక జీవితమును వర్ణించుచు మతసామరస్య మును బోధించి సంఘసంస్కరణ విషయమును ప్రతిబింబింప జేయుచున్నది. ఈ గేయకావ్య కథనే గ్రహించి మార్పులు చేర్పులతో ఆచార్యులవారిటీపల యొక నవల 'మానవులంతా మనవాళ్ళే' యనుపేర రచించినారు. అది యింకను ప్రచురింప బడలేదు.

విప్రలబ్ధ అచ్చమైన దేశికావ్యము. ఇది వస్తువులో భావములో రచనలో సర్వవిధముల దేశికావ్యమై విరాజిల్లుచున్నది. ఇందలి నాయికా నాయకులు లక్ష్మి, రాముడు తెలుగు రైతు బిడ్డలు. పుట్టి పెరిగి విహరించినది తెలుగు నేలలు. వారి కాపుబ్రతుకు ఘట్టములు సుఖ దుఃఖము లన్నియు తెలుగు వారివే. ఈ రీతిగా వస్తువులో దేశికవిత్వము వరలుచున్నది. ఇక వారు పాడుకొన్న పాటలు వెలి బుచ్చిన భావములు పొందిన అనుభూతులు నిండుగా తెలుగుదనమును తేటపరచుచు భావముననను దేశిచ్ఛవు లొలుకుచున్నవి. భాషయు తెలంగాణ ఆంధ్ర ప్రాంతపు మాండలికములతో యాసలతో నిసర్గమైన తెలుగు పలుకుబళ్ళతో జాతీయములతో అచ్చపు తెలుగు వెలుగులను వెదజల్లుచు, నానావిధ గతులలో సాగిన గేయములు దేశిచ్ఛందములై రచన దేశిచందమున సుందరమై యొప్పారుచున్నది.[1] ఇట్టి కావ్యము రచించుట కాచార్యుల వారి ప్రేరణ యెట్టిదో తొలుత పరిశీలింతము.

## రచనా ప్రేరణ :

ఆచార్యులవారు నవ్య కవితాయుగ ప్రభావితులై మణిమాలాది ఖండ కావ్యసంపుటములలో అనేక గేయములు రచించి పిదపగా ఒక చక్కని గేయకథా కావ్యము సృష్టింప సంకల్పించిరి. కాగా విప్రలబ్ధయే వ్రాయుటకు గల ప్రేరణ పరిశీలింపవలసి యున్నది. ఈ విషయమును కవిగారే యిట్లు తెలిపిరి.

"ఈ కావ్య నిర్మాణమునకు ప్రస్తుతం దేశంలో అచ్చటచ్చట జరుగుతూ ఉన్న మతకల్లోలాదికములే కారణాలు. అవి నా హృదయాన్ని కలత పెట్టినవి. నాలో నున్న అంతర్వాణి ప్రేరేపించినదీ కావ్య నిర్మాణమునకు."

"వాస్తవంగా ఇదొక కల్పిత కథ గాదు. పోలీసుచర్య నైజాంలో జరిగి నప్పటి ఒక సంఘటన. ఈ గాథలో ఉచితగతి నా వల్ల కొన్ని మార్పులు జరిగి నాయి. వానిని సహృదయులు ఆమోదిస్తారని నాకు విశ్వాసమున్నది."[2].

విప్రలబ్ధ నిర్మాణమునకు ప్రేరణ చరిత్రాత్మక సంఘటనలోని మతకల్లో లాలు. హైదరాబాదు రాష్ట్రములో నిజాము మత పక్షపాత నిరంకుశ పాలనలో ముస్లిములు రజాకార్ల పేరుతో దారుణ మత విద్వేషముతో హిందువులను ఘోర

1. ఈ విషయములు మున్ముందు క్రమముగా నిరూపించబడును.
2. కావ్య 'విజ్ఞప్తి'

నరక హింసల పాలు చేయుచు అల్లకల్లోలపు వాతావరణము చెల్లరేపగా భారత ప్రభుత్వము నుండి సర్దారు వల్లభభాయి పటేలుగారు చొరవ తీసుకొని సకాలమున పోలీసుచర్య ద్వారా హైదరాబాదును విముక్తముచేసి హైందవులను కాపాడిరి. స్వాధీన పరచుకొన్న భారతీయ సైన్యము ఆయా గ్రామములలో దౌర్జన్యములు సాగించిన ముస్లిములను నిర్బంధించెను. ఆ సమయములో హిందువులు భీషణ ప్రతీకార దాహము ప్రజ్వరిల్లి తమను హింసించిన గుండాలనే కాక అన్యులగు ముస్లిములను సైతము దుర్దామ ద్వేష వీతిహోత్రమునకు సమిధలను చేయసాగిరి. అట్టి మతకల్లోలములో జరిగిన ఒక దుర్ఘటన చూచి ఆచార్యులవారు హృదయ సంక్షోభముచెంది ఆ ఘటనకు మరికొన్ని సముచిత కల్పనలుచేసి మత సామరస్య ప్రబోధాత్మకముగా ఈ గేయ కావ్యమును రచించిరి. ఈ రీతిగా ఇది ఊహా జనితముగాని, ఉన్న పూర్వకథగాని కాక కన్నుల యెదుట జరిగిన దురంతము నకు పరితపించి ఆత్మలోని మానవత అలలుగా చెలగి ఆవిర్భవించిన సాంఘిక కావ్యము. కథలో ఒక మహమ్మదీయ బాలికను హిందువులు పెంచుకొని పెద్ద చేయగా ఆమె నొక హిందూ కర్షక యువకుడు పెండ్లాడిన యితివృత్తము నెన్ను కొనుటలో ఆచార్యులవారి విశాల హృదయము విశిష్ట సంస్కారము విశ్వమానవత విదితమగును.

## కృతి సమర్పణము :

ఈ కావ్యము శ్రీ నరహరి రాజిరెడ్డిగారికి సమర్పింపబడినది. రాజిరెడ్డిగారు ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు తాలూకాకు చెందిన భీమవరము జమీందారులు. వీరి తండ్రి శ్రీ నరసింహారెడ్డిగారి ఆస్థాన విద్వాంసులుగా వరదాచార్యులవారి తండ్రి శ్రీ బక్కయ్య శాస్త్రిగారుండి పోషింపబడిరి అట్లే రాజిరెడ్డిగారును వరదా చార్యులవారిని సంభావించి సహకారమందజేయుచున్నారు. రాజిరెడ్డిగారు సుప్ర సిద్ధులైన భూస్వాములు, విద్యాధికులు, సరసోదార హృదయులు. వీరి గుణగణము లను వంశ ప్రశస్తిని ఆచార్యుల వారంకిత గేయములో నుగ్గడించి యున్నారు. తమ వంశ పోషకులును రైతు రాజులునునైన రాజిరెడ్డిగారికి రైతు రాజు కావ్యము ప్రేమతో సమర్పింపబడుట ప్రశస్త కార్యము.

## కథా సంగ్రహము :

విప్రలబ్ధ వస్తుసంవిధానము చర్చించుటకు ముందందలి కథను సంగ్రహముగా తెలుపుదును. ఆచార్యులవారు కావ్యమున 'ముందు మాట'లో ఈ కథను పొందుపరచినారు. తదనుసారముగా దీనిని వ్రాయుచున్నాను.

నైజాములో రజాకార్ల పీడలకు దోపిడులకు మానభంగాలకు ప్రాణహరణాలకు హైందవ సమాజమట్టుడికి నట్టుడుకుచున్న రోజులలో పోలీసుచర్య జరిగి విముక్తి లభించెను. అప్పుడు పగలు సెగలు పొగలు గ్రక్కగా కొందరు హిందువులు గ్రామాలలో ముస్లిము కుటుంబాలపైబడి కిరాతక చర్యలాచరింప విజృంభించిరి. ఆ మత కల్లోలములలో రామవరమను గ్రామములో హిందువులొక ముస్లిము కుటుంబముపై దాడి చేయుదురు. వారింటి ముంగిట ప్రవేశించగనే ప్రాణ భయముతో ఇంటివారందరు దొడ్డిదారి నుండి పారిపోయి ప్రాణరక్షణ కావించుకొందురు. విపరీతమైన కాతరత్వములో వారు తమ పది నెలల పసిపాపను వెంట కొనిపోజాలక ఇంటిలో వదలి పలాయితులగుదురు. ఇంటిలో ప్రవేశించిన దుండగుల కాపాప కనబడగనే కసితో చంపబూనుదురు. అప్పుడా ప్రక్కనేయున్న కాపు కుటుంబము వారు ఆ పిల్ల తమ బిడ్డయే యనియు, ఆ మహమ్మదీయులకు సంతానము లేనందున తమ బిడ్డను తరచుగా తీసుకొనిపోయి ముద్దాడుచుందురనియు, అట్లు కాక తమ బిడ్డయే యైనచో వారు వదలిపెట్టి పోగలరాయనియు వారికి నచ్చజెప్పి విడిపించి ఆ యమ్మాయిని కాపాడుదురు.

సంతానములేని కాపు దంపతులా పాపను గారాబముగా పెంచుకొందురు. ఆ పాపకు మూడేండ్లు వచ్చును. ముస్లిం పిల్లను పెంచుకొన్నందుకు సమాజము వారిని వెలివేయును. ఆ పీడలకు తట్టుకోలేక అక్కడినుండి వలసపోయి చాల దూరాన ఉన్న ఆంధ్ర ప్రాంతములో గోదావరీ తీరానగల ఒక పల్లెలో నివాసమేర్పరచుకొని ఆ బిడ్డను తమ కన్నబిడ్డగనే చెప్పికొని పెంచుచు చింత విడిచి వెళ్ళబుచ్చుచుందురు.

ఆ యమ్మాయి పెరిగి పదారేండ్ల ప్రాయముగలది యగును. చుట్టు పట్టులనున్న పల్లెటూళ్ళలో సంపన్న కర్షకుల చేలలో కూలి నాలి చేసి జీవించు తల్లిదండ్రులకు తోడుగా ఉండి పని చేయుచుండును. ఒక గ్రామములోని ధనిక హాలికుని కొడుకు అందచందాలు గల రాముడను నవయువకుడు పొలము పనికి వచ్చిన లక్ష్మి

అపురూప సౌందర్యమునకు ముగ్ధుడై ఆమెను ప్రేమించి అంతస్తుల అంతరువులెంచి వ్యతిరేకించు తలిదండ్రుల యిష్టానికి విరుద్ధముగా పెండ్లిచేసికొనును. విధి లేక వారి పెండ్లిని పెద్దలామోదింతురు. పెండ్లయినచో పసుపు బట్టలతో దర్శనానికి రాగల నని లక్ష్మి మొక్కుకొన్నందున దంపతులు తిరుపతి దేవుని దర్శనము చేసికొని వత్తురు. రాముడు లక్ష్మికి చదువు నేర్పి సంస్కారవతిగా తీర్చిదిద్దును. ఆమె మాట లలో తెలంగాణపు బాస ఆంధ్ర ప్రాంతపు 'యాస' కలగలుపుగా వ్యక్తమగు చుండును. మరియు ఆమె విద్య నేర్చినందున అంతకు పూర్వపు గ్రామ్యము, సంస్కృత పదవిలసితమగు శిష్ట వ్యావహారికము కలిపి మాట్లాడు చుండును.

హాయిగా సాగిన వారి ప్రణయ జీవితములో కొన్నాళ్ళకు లక్ష్మి గర్భవతి యగును. ఆ దశలో ఒక మిత్రుని వలన లక్ష్మి ముస్లిము కుటుంబమునకు చెందిన దన్న పూర్వవృత్తాంతము తెలిసి ఆ విషయము తన తల్లి దండ్రులకు తెలిసిన ఇంటి నుండి గెంటివేయగలరని బాధపడి రాముడు నిండు గర్భవతియగు లక్ష్మిని ప్రసూతికని పుట్టింటికి పంపును. లక్ష్మియెడ తన తల్లిదండ్రులకు నానాటికి పెరుగుచున్న వైముఖ్యమునకు చింతించి రాముడు తాము వేరుగా కాపురము చేయుటకు గృహనిర్మాణము చేయుచుండును.

లక్ష్మి మగ శిశువును కని మురిసిపోవును. ఐనను బిడ్డపుట్టి పదినాళ్ళయినను చూచుటకు భర్త రానందున ఆరాటము పెరిగి కాకితో కబురు పంపును. ఎన్ని కబుర్లు పంపినను పెనిమిటి రానందున ఆర్తితో దయబుట్టు మాటలుచెప్పి రామచిలుకతో రాయబారమంపును. ఐనను అతడు రాడు ఎన్నాళ్ళకును అతడు కొనిపోవ రానందున ఆమె యేదో చేయరాని తప్పుచేయుట వలననే భర్త వదలిపెట్టి యుండునని లోకులు కాకులై ఆడిపోసికొనుట ఆమె చెవినిబడి తీరని వెతకులోనై తీవ్రసంతాపముతో భర్తకు లేఖ వ్రాయును. కొన్నాళ్ళకతడు కోడెల వ్యాపారము నకు తన పుట్టింటి యూరికి చెంత గోదావరి యావలి యొడ్డునగల పల్లెకు వచ్చి నాడని తెలిసి యామె యీవలియొడ్డుకువచ్చి అతనిని గలియ పడవలో నదిని దాటు టకు యత్నించును. అది వర్షాకాలము. గోదావరి కల్లోల మాలాభీలముగా ఉప్పొంగి ప్రవహించు చుండును. బెస్తవాడు పడవ నడుపుటకు నిరాకరించి భోజనాని కింటికి వెళ్లగా ఆమె పూర్వమత్తగారి యూరి ప్రక్కనగల వాగులో విహారానికి పడవ నడపనేర్చి యుండుటచేత పడవను ప్రవాహములో దించి నడుపుచుండును. ఈవలి ఒడ్డునుండి రాముడది చూచి లక్ష్మిని గుర్తించి నది దాటవద్దని మరలి పొమ్మని

అరచి చెప్పను. కాని ఆమె ఆ మాట వినక "కన్నీటి మున్నీట కాలి చచ్చుటకంటె నినుగనుచు చల్లగా మునిగిపోదీయేట" అని పడపను నడుపుచుండును. పెద్దగా అలలు పొంగిన ఉరవడికి పడవ అల్లకల్లోలమై తల్లక్రిందై పోవును. రాముడు శోకభయ విహ్వాలుడై ఆమెను కాపాడుటకు నదిలో దూకును. లక్ష్మి "నీవు దూక వద్దు. నేను పోవుచున్నాను. మరొక జన్మలో నిన్ను కలియగలను. మన బిడ్డను సాకుటకై నీవు బ్రతికి యుండవలసినది. నా తుది కోరిక మన్నించవా" యని యరచుచునే న లో మునిగిపోవును. రాము డామెకోసము ప్రవాహములో మునిగి నను ఫలితము లేకపోవును. బిడ్డకోస మతడొడ్డుకు చేరి అనేకముగా విలపించి వికల మనస్కుడై యింటికి తిరిగి వచ్చును,

నదిలో కొట్టుకుని పోవుచున్న లక్ష్మిని కొంతదూరాన సంధ్యావార్చుకొను విప్రుడొకడు చూచి దయతో రక్షించి వర్తమానము తెలిసి ఓదార్చి దీవించి ఆమెను రాముని యూరివద్దకు తోడుకొనివచ్చి వెళ్ళిపోయెను. ఈలోగా రాత్రి రాముని కలలో నొక విప్రుడు కనబడి మతసామరస్య మానవతా ప్రబోధము చేయును. అది విని లేచుసరికి రాముని యెదుట లక్ష్మి సాక్షాత్కరించి విప్రుడు కాపాడితెచ్చిన యుదంతము చెప్పను. రాము డానందముతో పొంగిపోయి తిరుపతి వెంకన్న దయవల్లనే తన లక్ష్మి దొరికినదని భావించును. ఇట్లు లక్ష్మి పతివంచి తయై విప్రలబ్ధయైనట్లే విప్రుని వలన లభించి విప్రలబ్ధయైనది. దంపతులు తమ అందాల పాప నెత్తుకొని ఆనందింతురు. ఈ రీతిగా కథ మోదాంతమగును.

## వస్తు నిర్వహణము :

ఈ కథ కావ్యమున 54 గేయములలో విస్తరించి చెప్పబడియున్నది ఈ కథను రెండు భాగములుగా విభజించినచో హైదరాబాదుపై పోలీసుచర్య, ముస్లిం కుటుంబముపై దాడి మొదలుకొని పాపను పెంచుకొన్న కాపుదంపతులు ఆంధ్ర ప్రాంతమునకు వలస వచ్చి కూలినాలి చేసికొని కాలము గడుపుచుండ ఆ యమ్మాయి పదారేండ్ల ప్రాయము గలదాయె నన్నంతవరకుగల కథ పూర్వ భాగ మగును. ఆ తర్వాతికథ ఉత్తర భాగము. కావ్యమునందు ఈ ఉత్తర భాగకథ మాత్రమే నిర్వహింపబడినది. కావ్యాంతర్గత కథకు పూర్వకథ పూర్వరంగము వలెనుండి అది ఆచార్యులవారు 'ముందుమాట'లో ముచ్చటించుట వల్లనేకాక కావ్యము లోని గేయములవల్లను ప్రత్యేకించి 39వ గేయము 'ఎటు మరచి యుండగలను నా స్వామిని' అనుదాని మొదట ఉల్లేఖింపబడిన వాక్యముల వల్లను విదితము కాగలదు.

కావ్యమున వస్తు నిర్వహణ యొక పద్ధతిలో జరిగినది. టొక్కొక్క గేయ మొక్కొక్క సన్నివేశమును చిత్రించుచుండును. ప్రతి గేయము మొదట ఆ సన్ని వేశమును దెలుపు మాటలు సంధి వచనములవలె శీర్షికాప్రాయముగా వ్రాయబడి యున్నవి. ఈ విధముగా కథాకథన మీ వాక్యముల వలన సాగగా, ఆ సన్నివేశ సంఘటనల చిత్రణ, వర్ణన సంభాషణలు, ప్రబోధములు, మున్నగునవెల్ల గేయ ముల రూపములో నిర్వహింపబడినవి. యెంకి పాటలలోగాని కిన్నెరసాని పాట లలోగాని ఆయా పాటలకు తద్విషయ వ్యక్తీకరణకు శీర్షికలు పెట్టబడియున్నవి. విప్రలబ్ధలో అంతేకాక గేయములలోని శీర్షికావాక్యములు కథను సూత్రప్రాయముగా చెప్పుచుండును. ఇటుల ఇందలి గేయములు కథను చెప్పుటకుకాక సన్నివేశ వర్ణ నలకు మనోభావ ప్రకటనలకు పాత్రలచేత స్వగతముగను సంవాద రూపమునను గానము చేసినట్లు కూర్పబడియుండుట విశేషము. ఈ విధముగా రచింపబడిన ఈ గేయములు రంగస్థలమున పాత్రధారు లభినయపూర్వకముగా పాడుచు నటించుట కనువుగా నుండుటచేత నిదొక చక్కని గేయనాటికగా ప్రదర్శించుట కవకాశము కలదు. రంగస్థలము దృశ్యాదులను నేపథ్యమునుండి ప్రతిగేయమునకు మొదట వ్రాయబడిన వాక్యముల ద్వార ప్రకటించిన సరిపోవును. 'ఆహ్వానము' ఖండ కావ్యసంపుటి వ్యాసమున 'రైతురాజు' గేయనాటిక గూర్చి చర్చించి యుంటిని. ఆ గేయము లీ కావ్యమున సందర్భానుసారముగా ఇంచుక మార్పు చేర్పులతో కూర్ప బడినవనియు మనవి చేసితిని ఈ విధముగా దీనిని గేయనాటిక యన్నను అయుక్తము కాదు.

ఒక హారములో పుష్పములేకాని దారము కానరానట్లు ఇందు గేయములే ప్రస్ఫుటముగా భాసిల్లుచు కథ అంతర్గతమై యొదిగియున్నది. కావున ఇందు గేయములకున్న ప్రాధాన్యము కథకు లేదు. అట్లని యివి ముక్తక ప్రాయములైన గేయములు కావు. ఈ గేయకుసుమములు కథాసూత్రమున గ్రథనము చేయబడి యున్నవి. ఏవంవిధ విరచితమైన ఈ కావ్యమును కథకొరకు కాక కవితామృతా స్వాదనకొరకు ముఖ్యముగా పఠింపవలసియున్నది. ఇదే విషయము ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు కావ్యమున కభిప్రాయము వ్రాయుచు నిట్లు తెలిపిరి.

"రచనలో పాటల ముత్యాలకు ఏకసూత్రత ఘటించడానికి కొంత ప్రయత్నం జరిగింది. ఐతే ఈ సంపుటిని కథాసమన్వయ దృష్టితో కాకుండా

కవితాస్వాదనదృష్టితో చూడగలిగితే రసానంద సింధువులను పుడిసిలించు కోవచ్చు"[1].

సన్నివేశకల్పన, కథాకథనశిల్పము ప్రాధాన్యము వహింపనందున విప్రలబ్ధగురించి రెడ్డిగారిట్లభిప్రాయపడుట సమంజసమైన విషయమే.

శ్రీ మిరియాల రామకృష్ణగారీ విషయము "కథలోని కొన్నిఘట్టాలను, సన్నివేశాలను మాత్రమే ఖండకావ్యాలుగా రచించి వీటిద్వారా కథాసమాహారాన్ని సంధానించడం వరదాచార్యకృత నూత్న శిల్పము"[2]. అని యీదృశ్యకావ్య నిర్మాణమునొక నూతనశిల్పముగా నభివర్ణించిరి.

ఇక కథానిర్వహణగురించి దిఙ్మాత్రముగా ప్రదర్శింతును.

కావ్యము రైతురాజును మేల్కొలుపుటతో ప్రారంభమగును. కవి రైతురాజును నిదురలేపుటకు సుప్రభాతము పాడును. ఈ మొదటి పాటలో గ్రామసీమలలో శోభిలు అరుణోదయ సౌందర్యము చక్కగా వర్ణింపబడినది. రెండవ గేయమున కవి రైతురాజును పొలము పనికి సాదరముగా ఆహ్వానించును. ఈ గేయమునందు కాపుపడుచు రూపరేఖావిలాసములు, వేషభూషలు, ఆమె విలువ మనోజ్ఞముగా వర్ణింపబడినవి. తర్వాతి గేయాలలో రైతులక్ష్మి పొలములో రైతు రాముని గాంచి అతని రూపరేఖలకు ముగ్ధయై యనురక్తయగును. రాముడు లక్ష్మిని తిలకించి ఆశ్చర్యానందములకు గురియై తలపోయును. ఆపిదప పొలము దున్ని నారువోసి వానకోసము వరుణదేవుని ప్రార్థించి, కురిసెడి వాననుగని ఎంతో సంతోషించును. ఇక్కడ వర్ష వర్ణన కడుంగడు కమనీయముగా సాగినది. పిమ్మట రాముడు మొలచిన వరినారు నాటువేయించుచు ఆపని చేయుచున్న నవయువతులలో చుక్కలలో చందమామవలె మెరయుచున్న లక్ష్మినిగని యెదలో ఎంతో మెచ్చుకొని వలచి పలుకరించును. ఆమె హావభావాదులచేత తన యనురాగమును వ్యక్తముచేసి తర్వాత పూర్వాంగ విప్రలంభ బాధ యనుభవించును ఇద్దరిలో సరసములు సాగును. రాముడు లక్ష్మి కొడవలి దాచిపెట్టి యామెకు మధురానుభూతి కలిగించును. ఆమె వెన్నెలలో కూర్చుండి కన్నెతలపులలో తేలియాడును. పిమ్మట వంశాలలోని అంతస్తులనెంచి వద్దను పెద్దల మాటలను లెక్కచేయక రాముడు

1. విప్రలబ్ధ : "పాటలపేటిక" పుట. 13
2. మహతి : "గేయకవితాప్రస్థానం" పుట. 51

లక్ష్మిని పెండ్లియాడును. ఆ పెండ్లి చేనిలో ప్రకృతిసిద్ధముగా వేడుక యేర్పాట్లు జరుగగా చేసికొందురు. పిదప వారి పెండ్లిని విధిలేక పెద్దలామోదింతురు. వివాహమైనచో పసుపు బట్టలతో దర్శనమునకు రాగలమని లక్ష్మి మ్రొక్కుకొన్నందున నవదంపతులు తిరుపతి వేంకటేశ్వరుని దర్శనానికి వెళ్ళుదురు. సరసాలాడుచు కొండయెక్కి వెంకన్నను దర్శించి లక్ష్మి స్తుతి ప్రార్థనలు చేయును. అక్కడ తరిగొండ వెంకమాంబ వ్రాసిన వేంకటాచల మాహాత్మ్యమును చూచి చదువ ముచ్చటపడును. చదువురాని ఆమెను చదువుకొమ్మని భర్త ప్రేరేపించి చదువునేర్పి సంస్కారవతిగా జేయును. వారు వనవిహారము చేసి వెన్నెలలో దగ్గరనున్న ఏటిలో బోటు షికారుచేయుదురు. ఇట్లు హాయిగా కాలక్షేపము చేయుచుండ వరి చేలెదుగుచుండును. అంతలో వానలు మరల కరవైనందున బావులకు విద్యుద్యంత్రాలమర్చుకొని రాముడు విద్యుత్కాంతిని గాంచి ఆ శక్తిని మనసార వర్ణించును. పిమ్మట కలుపు తీయించి పొలము కావలి కాయుచు ఆకటి కలమటించుచు చద్ది తీసికొని వచ్చు లక్ష్మికై ఎదురు చూచుచు అంతలో లక్ష్మి వచ్చి చద్దితోపాటు ప్రణయమందించి ఆనందపరచును. పొలము కావలిలో అక్కడనే రాత్రులు గడుపుచు రాముడు విరహ గీతాలు పాడుకొనును. తర్వాత లక్ష్మి వచ్చి తాను గర్భవతియైన విషయము సరసముగా వ్యంగ్యముగా వ్యక్తము చేయును. అంతలో పండినపొలమును కోతపట్టించి వరికుప్పలు బంతికట్టి లక్ష్మిచేత తూర్పారబట్టించి ధాన్యమును బండిపై ఇంటికితెచ్చి గుమ్మలలో నింపును. ఇంతవరకు జరిగిన కథ యొకయెత్తు. తర్వాతికథ యొక యెత్తుగా సాగును. లక్ష్మికి కష్టాలు ప్రాప్తించును. ఒకమిత్రుని ద్వారా లక్ష్మి ముస్లిముల బిడ్డయన్న పూర్వవృత్తమెల్లవిని బాధపడి పుట్టింటికి ప్రసూతికని పంపించుట, అక్కడ ఆమె కొడుకునుగని సంబరపడి భర్త చూడరానందున బాధపడి పందిరి మీద వ్రాలిన కాకమ్మతో కబురంపుట జరిగెను. అతడు రానందున రామచిలుకతో అంపిన సందేశము కావ్యమున మిక్కిలి ప్రశస్తి వహించియున్నది. ఇది మేఘసందేశమును పోలియున్నది. చిలుకను బుజ్జగించి స్తుతించి తన భర్తచెంతకు రాయబారమంపి అది పోవలసిన మార్గమును, వింతలను, విశేషాలను, తమ చేలను వర్ణించి చెప్పి తన పెనిమిటి విరహార్తి కృశించియుండుట నూహించి వర్ణించి అతనికి దయపుట్టునటుల చెప్పవలసిన మాటలు చెప్పును. ఇది రెండు పెద్ద గేయములలో దండిగా విస్తరిల్లియున్నది. కీర దౌత్యము తర్వాతను రాని భర్తకు, లోకుల అపవాదులు విని

సంతపించి నిష్ఠురముగా ఉత్తరము వ్రాయును. ఈ ఉత్తరము రెండు భాగము లుగా రెండు గేయాలలో వ్రాయబడినది. తర్వాత ఆవలి యొడ్డున గల పల్లెకు వచ్చిన భర్తను గలియ పడవలో గోదావరిలో దిగుట, కొట్టుకొనిపోవుట, రాముడు శోకించి కాడుకు కోసము ప్రాణత్యాగము చేయక విధిలేక ఇంటికి తిరిగి వచ్చుట, విప్రలబ్ధయై లక్ష్మి రాముని వద్దకు వచ్చుట ఇత్యాదులెల్ల సాగిపోయినవి. కావ్యము సమాప్తమయ్యె చివరి రెండు గేయములు తుదకనుబంధముగా కూర్చుట జరిగినది. ఆచార్యులవారికి అనుబంధ రచనతో ఏదో గట్టి యనుబంధమే యున్నది. ఈ యనుబంధము పోతన చరిత్రములోను తప్పలేదు. ఇందులోను తప్పలేదు. సరే యనుబంధ గేయములలో మొదటి దానిలో జనులు లక్ష్మి ముస్లిము మతానికి చెందినదని గుజగుజలు పోవగా తెలిసి మత భేదమును గర్హించుచు తీవ్రముగా తలపోసిన విషయమును, రెండవదానిలో తమ కుమారుని జన్మదినము గాంధి జయంతినాడు రాగా ఆనందముతో ఉత్సవము చేసికొనుచు జాతీయతా ప్రబోధాత్మ కముగా పాడుకొన్న విషయమును కూర్చబడినవి. ఇట్టివి అసలు కథకు-లక్ష్మి విప్రలబ్ధయైనంతవరకు గల కథకు-చెందక పోవుటచేత కథలో చేర్చక అనుబంధ ముగా కూర్చుట జరగినది. కథా సంవిధానములో రైతురాముడు పొలముదున్ని నారు పోసినప్పుడు లక్ష్మిపై అంకురించిన ప్రణయము క్రమముగా వరితో పాటు వర్ధిల్లి వరిపొట్టకు వచ్చినప్పుడామె గర్భవతియై వరి కోతలైన రోజులలో ఆమె కొడుకును గన్నట్లు నిర్వహించుట మిక్కిలి సమంజసముగా నున్నది. ఇట్లు కావ్యము సముచిత వస్తు సంవిధానముతో రమణీయ గేయమాలా సంభావ్యమై కర్షక జీవనమును చిత్రించుచు ప్రణయ గాథను భాసిల్ల జేయున్నది.

## విప్రలబ్ధ-యెంకి పాటలు:

విప్రలబ్ధను స్థూలముగా గమనించినచో ఇది యెంకి పాటల బాటలో సాగి నట్లు తోచును. కొందరీ విషయము విమర్శించి యున్నారు. శ్రీ ఆచంట జానకి రామ శర్మగారు విప్రలబ్ధను పత్రికలో సమీక్షించుచు నిట్లు వ్రాసిరి.

"ఈ రచనలో-రచయితకు తెలిసో తెలియకో-నండూరి వేంకట సుబ్బా రావు "యెంకి పాటల" ప్రాభవం కనిపిస్తుంది అక్కడక్కడ; కాని యెంకి పాటల లోని అమాయికత్వము గాని, సహజ కవితగాని యీ రచనలో కనుపించదు.

నాయిక మారువేషములో వుంటూ వచ్చిన మహమ్మదీయస్త్రీ కావడం కూడా ఏదో తెచ్చిపెట్టిన అంశముగా తోస్తుంది"[1]

ఇదీ ఆచంట వారి విమర్శ ధోరణి. వారు విప్రలబ్ధలో యెంకి పాటల ముద్ర కనిపించు ననుటయే కాక కావ్యమసహజముగా నున్నదనియు సెలవిచ్చి నారు వారి కనులకట్లు కనబడినది కాబోలు. అది యట్లుండ "రచయితకు తెలిసో తెలియకో యెంకి పాటల ప్రాభవము కనుపిస్తుంది'' అని వ్రాయుట ఎంత అపచారము. వరదాచార్యులవారు బహు ప్రసిద్ధి గాంచిన యెంకిపాటల విషయము తెలిసో తెలియకో యని భావించుట చిత్రముగా నున్నది. ప్రభావముద్ర యెంతవరకున్నదో పరిశీలించిన తెలియునుగాని రచయిత (వరదా చార్యులవారు) తెలిసో తెలియకో కాదు రచించినది. కాని ఆచంటవారు ఆచార్యులవారి గూర్చి తెలిసో తెలియకో వ్రాసినారనుట మాత్రము నిజము. ఇక యెంకి పాటల ప్రభావము విప్రలబ్ధపై నెంత కలదో సాధర్మ్య వైధర్మ్యము లేవియో రవంత చర్చింతును.

నవ్యకవితావిర్భావపు తొలితొలి రోజులలో వెలువడిన గురజాడవారి "ముత్యాల సరాలు" నండూరివారి యెంకిపాటలు" క్రొంగ్రొత్త తీరులలో ప్రకాశించుట వలన వానికి మిక్కిలి ప్రసిద్ధి సిద్ధించినది. ఆ పిమ్మట ఎన్ని గేయ కావ్యములు వచ్చినను అంతటి పేరురాలేదు. ఏ రంగము నందైనను వినూతన పద్ధతులలో మొదట వచ్చిన వానికి కలుగునంత ప్రశస్తి తర్వాతి వానికి కలుగకపోవుట సహజము. గొప్పవి క్రొత్తవియగు రచనల యొరవడిలో అనేక రచనలు వెలువడ వచ్చును. వాని ప్రభావము తరువాతి వానిపై పడవచ్చును. అంత మాత్రమున నవి పూర్వ రచనల కనుసరణములని కాని అనుకరణములని కాని యనుట సర్వత్ర భావ్యము కాదు. ఎఱ్ఱన నాచనసోమన హుళక్కి భాస్కరాదుల రచనల పోలికల కొన్ని కనబడినంత మాత్రమున పోతన తన వ్యక్తిత్వమును ప్రత్యేకతను స్వంత ముద్రను భాగవతములో నిల్పుకొన్నాడు. మొట్టమొదటి ప్రబంధముగా మనుచరిత్రను నిబంధించిన పెద్దన యొరవడిలో రామరాజభూషణాదులు ప్రబంధములు వ్రాసినంత మాత్రాన పెద్దన ముద్రకలవారు కారు, తమ ప్రత్యేకతను కోల్పోయిన వారు కారు. అట్లె యెంకి పాటల తరువాత ఎన్నో పాటలు వెలువడినవి. ఐనను దేని ప్రత్యేకత దానిదే.

1. ఆంధ్రజ్యోతి (దినపత్రిక) తేది:21-3-1971

యెంకి పాటలకు విప్రలబ్ధకు పోలిక రెండును గేయఫణితిలో నుండుట, స్వచ్ఛందముగా ప్రేమించి పెండ్లాడి కొడుకును గనుట, భాష జానపదమై యుండుట, ఎక్కడనో యొకింత భావప్రకటన రీతి సామ్యము గనుటతప్ప తక్కిన విషయములెల్ల విభిన్నమైనవే.

యెంకి పాటలు కథా సూత్రఘటితముకాని ముక్తక ప్రాయమైన గేయములు. వానిలోని గేయములు, వేనికవే భావోదంచితములై యొప్పారును కాని సుఖదుఃఖాత్మకము ప్రబోధాత్మకమునైన కథను చెప్పునవి కావు. "ఒకానొక కథాభిముఖముగా సర్వపాత్రముల మనస్థ్సితి జరుగవలసిన యవస్థ యెంకి పాటలలో లేదు. ఏ ఘట్టమైనను దానికది స్వతంత్రమే."[1] యని డా॥ కోవెల సుప్రసన్నాచార్యులుగారిదే విషయమును వ్రాసిరి. డా॥ నారాయణరెడ్డిగారిట్లు చర్చించిరి.

"సుబ్బారావుగారు తమ ప్రణయానుభూతులనే ఆ పాత్రల రూపమున వెలిబుచ్చినట్లు వారేయన్నారు. 'యెంకి నా ప్రేమరసానికి కాశ్రయము; నా శృంగార వాక్కునకు విశ్రామస్థానము; నా వలపులకు నిధానము" ('యెంకి పాటల గాలిదుమారము' వ్యాసము: 1926 ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక నుండి రెడ్డిగారు టంకించిరి)[2]. మరియు రెడ్డిగారు సిద్ధాంత గ్రంథములో వేరొకచోట ''యెంకి పాటలు పల్లీజన ప్రకృతిలోని సర్వాంగీణత్వము కలిగినవికావు, శృంగార కలాపమే కేంద్ర బిందువుగా పెట్టుకొన్నవి"[3]. అని యుల్లేఖించిరి.

రెడ్డిగారి యభిప్రాయానుసారముగను యెంకి పాటలలో కథలేదనియు, అందు ప్రణయ విహారముతప్ప గ్రామీణ జీవన చిత్రణము పల్లీయ ప్రకృతి వర్ణన కానరాదనియు విశదము కాగలదు. ఇక విప్రలబ్ధ దీనికి భిన్నమైనది. ఇందు కథ కలదు. కర్షక జీవన చిత్రణము, ప్రకృతి వర్ణనలు కలవు. యెంకి నాయుడుబావ దృష్టిలో పడుటకు ముందెవ్వారో ఆమె బాల్యాదు లెట్టివో తెలియదు. విప్రలబ్ధ లక్ష్మికి పుట్టుపూర్వోత్తరాల చరిత్ర కలదు. యెంకి యెప్పుడో ఒక్కింత విరహమనుభవించినను ఏ బాధలలోను నలిగిపోయినది కాదు. ఆమె స్వాధీనపతిక. లక్ష్మి

1. స్రవంతి : 1956 మార్చి సంచిక
2. ఆధునికాంధ్ర కవిత్వం : సంప్రదాయములు-ప్రయోగములు, భావకవిత్వము-యెంకి : పుట 374.
3. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు-ప్రయోగములు : భావకవిత్వము-(1) కర్షకులు. పుట 435.

అట్లుకాక జీవితములోని వెలుగు చీకట్లను చూచినది. దాటరాని విప్రలంభ కల్లోలినిలో బడి మునిగి పోయినది. భర్తకు కాకమ్మతో కబురంపినది. చిలుకతో రాయభారము పంపినది. అష్టకష్టాల ననుభవించినది. ఆమె విప్రలబ్ధ.

యెంకి పాటలలో స్వచ్ఛందమైన ప్రణయ జీవితము, ఉత్తమ దాంపత్యము వర్ణింప బడినవి. విప్రలబ్ధలో అంతేకాక కరుణ శాంతాది రసపోషణము జరిగి గ్రామీణాభ్యుదయము, సంఘ సంస్కారము, మతసామరస్యము, జాతీయత ప్రబోధింపబడినవి. ఇట్లనేకానేక విషయములందు విభిన్నమై తన ప్రత్యేకతను నిలుపు కొనుచున్నది. ఇక,

''ఎన్నెట్లో సెలయేరు యెన్నలా కరిగింది'' (విప్రలబ్ధ-దంపతుల బోటు శికారు)

''ఎటు మరచి యుండగలను''?''

"నా సామి నెటుమరచి యుండగలను?'' (విప్రలబ్ధ-లక్ష్మి పుట్టింలో విప్రలంభము) వంటి యొండు రెండు పంక్తులలో యెంకి పాటల చాయలు కనబడినను తనదైన ప్రత్యేకత కోల్పోక విప్రలబ్ధ కావ్యము విశిష్ట భాషా భావ సంపద్విరాజితమై యొప్పుచున్నది. ఇదే విషయము డా॥ దాశరథిగారు విప్రలబ్ధ పీఠికలో నిట్లువ్రాసిరి.

"శ్రీనాథుడు పెద్దనలో అక్కడక్కడా కనిపించినా పెద్దన వ్యక్తిత్వం చెడనట్లు నండూరివారి ఛాయలు అక్కడక్కడా తోచినా వరదన్న తన ముద్రను వదలుకోలేదు.''[1].

విప్రలబ్ధలో భావములు స్వతంత్రములు విశిష్టములునై చెన్నుమీరి యున్నవి. దీనికి ఉభయ కావ్యములలో సంవదించుచున్న యొక్క ఘట్టము నుదాహరించి తులనాత్మక పరిశీలన చేయుదును.

నాయుడుబావ యెంకితో 'తిరపతికి' వెళ్లును. పెండ్లి కాకముందే వారు తిరుపతికి వెళ్ళుదురు.

యెంకీ, నాతోటి రాయే! మన
వెంకటేశుణ్ని యెల్లి సూసొద్దాము!....

1. 'రసలుబ్ధుల రసాయనం విప్రలబ్ధ' (కావ్యపీఠిక) పుట. 8.

ఆసామి మీదేటా
పూసులాడు కొంటు,
కొండ మెట్లన్నినీ
కొంగట్టు కెక్కాలి
రేతిరి పగపెల
రెప్పయ్య కెంకీని
సల్లంగ సూడ' మని
సామితో జెప్పాలి"

మరియు 'ముందు గతి' యను పాటలో

"పక్క సూపులు మాని
పయికెళ్లి పోదాము !
యెక్కవే కొండ నెక్కవే!
నాపక్క నెక్కి యెక్కవే !
ముందు నువ్వుంటే నే
కిందా నిలబడగలను
నీ నీడనే తొక్కు
కొని సులువుగ రాగల । నెక్కవే...."

విప్రలబ్ధలో దంపతులు వివాహానంతరము, లక్ష్మి మ్రొక్కుకొన్నందున తిరుపతికి వెళ్ళుదురు.

పసుపు బట్టలతోడ పయనమై వస్తంటి
ఎంకన్న దర్శించ యెళుదామ స్వామి !
ఏమి గావాలంచు వెంకటేశ్వర్లడుగ
నేమందునో నీకు ఎరికేనే స్వామి ?....
నీ కౌగిటన్ సోలి నీ ప్రేమలను గ్రోలి
చావులెరుగని నాట వయసులుడుగని వీట
ఎడబాటు అంటేమొ ఎప్పుడెరుగని చోట
స్వామి సన్నిధిలోనె స్వర్గ సుఖమంటాను....
పసుపు కుంకుమచాలు పదికోట్ల వరహాలు
అని మ్రొక్కుకుంటాను అందాల రాజ !"

అనియు తర్వాతి గేయములో,

చూడలేనే యెండ వేడి నీ కష్టాలు
కాళ్ళ బొబ్బలు నీవి కావు నాయెదవే
ఏడు కొండల నీవు ఎక్కలేవే లక్ష్మి
నా చల్ల నీడలో నడచి రారాదె.
నీ నీడ ద్రొక్కేటి పాడు కాళ్లవియేల
కాలిపోతే నయముగాదె నా రాజా!
నవ్వుల్ల పువ్వుల్లు నడిబాట బోస్తాము
కాళ్ళనూ ఎండలూ రాళ్ళేమిసేయు...."

ఇటుల సాగును సంభాషణ.

ఇందు యెంకి పాటలలో 'ఆ సామి మీదేటొ వూసులాడుకొంటు' అన్న మాటలలో తమ ప్రేమయే ప్రధానమై దేవునిపై కొంత నిర్లక్ష్యము తోచుచున్నది. విప్రలబ్ధలోని లక్ష్మి మాటలలో భక్తివిశ్వాసాలు గాఢముగా కన్పడును. మరియు నాయుడుబావ యెంకిమీది అనురాగాతిశయముచేత ఆమెను 'సల్లంగసూడ'మని స్వామిని కోరుదుననగా లక్ష్మి అన్యోన్యప్రణయమును, ఇద్దరి శ్రేయస్సును, ఎడబాటులు గనని భర్తృసాన్నిధ్యసౌఖ్యమును, దీర్ఘ మాంగళ్యమును కోరుకోగల నన్ను మరియు కొండ యెక్కనప్పటి సంభాషణలో 'నీ నీడ నే తొక్కుకొని సులువుగ రాగల'నని నాయుడుబావయనగా, 'నీ నీడ ద్రొక్కేటి పాడుకాళ్ళవియేల కాలిపోతే నయముగాదె నారాజా!' యని లక్ష్మియనును. ఈ భావము, ఈ గాఢాను రాగ పావిత్ర్యము యెంకి పాటలలోనికంటె వరిష్ఠముగా నున్నవని సహృదయులు గుర్తింపకపోరు. ఇట్లున్నంత మాత్రాన యెంకి పాటల భావవైశిష్ట్యమునకు ఆ కావ్యప్రాశస్త్యమునకు నెట్టిలోటు రాదు దేని ప్రత్యేకత దానిదేయని నిరూపించుటయే ముఖ్యోద్దేశము. చివరకు విప్రలబ్ధ గురించి ప్రాజ్ఞ విమర్శకులు వెలిబుచ్చిన నాలుగు మాటలుటంకింతును

"నా హృదయాన్నెంతగానో కదలించిన ఈ రమణీయ కావ్యాన్ని చదివి అత్యంత ముగ్ధుడనై వరదన్న కవితాహృదయానికి జోహారులర్పిస్తున్నాను."[1] అని దాశరథిగారు వ్రాసిరి.

1. 'రసలుబ్ధుల రసాయనం విప్రలబ్ధ' : పుట 10

"అక్షరరమ్యత, అనుప్రాసగమ్యత, ఆర్ద్రభావుకత, అలంకార బంధుర వరదాచార్యుల కవిత్వంలో వరిష్ఠంగా కనిపించే గుణాలు.... వరదాచార్యుల వృ రచనా కౌశలానికి పోతన చరిత్రము దీపస్తంభంగా నిలిస్తే, మాత్రాచ్ఛం ఘటనా పటిమకు ఈ పాటలపేటిక మచ్చుతునకగా నిలుస్తుంది"[1] అని నారాయణరెడ్డిగారు ప్రశంసించిరి.

"....వారి రచన (విప్రలబ్ధ) జానపద నాయికా నాయకుల కుచితమై భాషతోడను అకృత్రిమములైన భావములతోడను నిసర్గసుందరములైన యలంక ములతోడను గూడి చదివిన కొలది చదువవలెనని చవులూరించుచున్నది"[2] ఆచార్య డా॥ దివాకర్లవారు కొనియాడిరి.

"గేయాలు రసవంతాలై, స్వాభావికవర్ణనలతో హృదయంగమా ఉన్నవి. ఆధునిక గేయకృతులలో ఇది (విప్రలబ్ధ) ఉన్నతస్థానాన్ని ఆక్రమిం గలదు"[3] అని 'ఆయాస్య' గారు ఉల్లేఖించిరి.

"అసలు ఇతివృత్తం ఎన్నుకోవడంలోనే రచయిత ఉదారత, విశా హృదయమూ, సంస్కారమూ గోచరిస్తాయి. వరదన్న ఎన్నుకున్న ఇతివృత్త వారిలోని మానవతావాదానికి ప్రతీక-పతాక"[4] అని దాశరథి రంగాచార్యులుగా వినుతించిరి.

"విప్రలబ్ధ ఆదికవి స్వాభావికతను, కాళిదాసు భావుకతను, మహాభార కవుల సాధుతను, ప్రబంధకవుల ప్రౌఢతను, నవ్యకవుల ప్రసన్నతను తనయం పొందుపరచుకొని న్రమసుందరముగా నడచినది"[5] అని శ్రీశ్రీ గాదె శంకరం గారు సమీక్షించి వ్రాసిరి"[6].

ఇట్టి విప్రలబ్ధలోని రసభావాదుల వైశిష్ట్యము తరువాతి వ్యాసములలో నిరూ పింపబడును.

1. 'పాటల పేటిక' : పుట 12, 13
2. విప్రలబ్ధ-'పండితాభిప్రాయములు' పుట 14.
3. ఆంధ్రప్రభ (వార) తేది : 10-2-1971 సమీక్ష.
4. 'అభినవపోతన' షష్టిపూర్తి సన్మానసంచిక : విప్రలబ్ధ-కథాశిల్పము. పుట 171
5. 'అభినవపోతన' షష్టిపూర్తిసన్మానసంచిక: విప్రలబ్ధ-కవితావైభవము పుట 184
6. ఇతర పండితాభిప్రాయములకు అనుబంధము 3 చూడవలెను.

# రస పోషణము

కావ్యమునకు ప్రాణము, ఆత్మభూతము అని చెప్పబడిన రసమునకు నిధానమై విప్రలబ్ధ యలరించుచున్నది. లక్ష్మిరాములను కర్షక దంపతుల ప్రణయ వృత్తము ప్రధానముగా వర్ణించిన యీ కావ్యమున రసరాట్టను ప్రశస్తి వహించిన శృంగార మంగిరసమై తరంగిణియై పొంగి ప్రవహించుచున్నది. వీర కరుణ శాంత భయానకములు, భక్తి వత్సలరసము లంగములుగా సముచితముగా సావకాశముగా పోషింపబడినవి. రసమున కాలంబనము నాయికా నాయకులు కావున రసపోషణము గూర్చి చర్చించుటకు ముందు కావ్య పాత్రలగు నాయికా నాయకుల గుణశీలములను సంగ్రహముగా సమీక్షింతును.

## లక్ష్మి :

కావ్యమున నాయికయగు లక్ష్మి శృంగార నాయికగా మొదట స్వాధీన పతిక పిదప విప్రలబ్ధ. ఈమె ముగ్ధగా కావ్యరంగమున ప్రవేశించును. ముస్లిము కుటుంబములో పుట్టినను హైందవ కర్షకులచేత పోషింపబడి ఆ కులము చేతనే వెలసినది. అచంట వారు తప్పు పట్టినట్లామె మారువేషములో ఉన్న ముస్లిము వనిత కాదు. ఆమెకు తాను ముస్లిము కుటుంబముతో పుట్టినట్లు ఎన్నడును తెలియ లేదు. బుద్ధి తెలియని మూడేండ్ల ప్రాయముననే పెంచుకొన్న తల్లిదండ్రులు దూర తీరానికి వలస వచ్చుటచేత ఈ విషయ మామెకు తెలియుట కవకాశము కలుగ లేదు. ఒక మిత్రుని వల్ల తర్వాత రామునికి తెలిసినది కాని ఆమెకు తెలియ రాలేదు. ఆమె పుట్టింటిలో చిరకాలముండి నప్పుడు ఆమెను గూర్చి లోకులు ఏదో చేయరాని తప్పు చేసినందున మగడు వదలిపెట్టి నట్లున్నాడని ఆడిపోసి కొనుటలో ఆమె శీలమును అన్యాయముగా శంకించిరేకాని ఆమె మహమ్మదీయ కులజ యని తెలిసికాదు. నవ్యకవితలో గ్రామీణ కర్షకులను నాయికా నాయకులను జేసి కావ్యాలు వ్రాయుట యుండగా ఆచార్యులవారు అంతకంటె ఒక మెట్టుపైకి వెళ్ళి కులాంతర మతాంతర వివాహము చేసికొన్న నాయికా నాయకుల యితివృత్తము వర్ణించినారు. నవ్య సాహిత్యమున అభిజాత్యమునకు కాక అచ్ఛగుణశీలము

లకే అగ్రపీఠము కావున లక్ష్మి యిక్కడ ఉత్తమ నాయిక. ఉదయద్యౌవన యగు ముగ్ధ – చుక్కలలో చందురునివలె మెరసిపోవు అందము కలది. స్వచ్ఛమైన స్వచ్ఛందమైన ప్రణయ సామ్రాజ్యమునకు పట్టపురాణి. ఆమెది 'అంటముట్టగ రాని అగ్గి శీలము'. అరమరికలులేని అనురాగమునకు పొరపొచ్చము లేని పతి భక్తికి ప్రతీక అమె. ఆమెది ప్రగాఢమైన ప్రేమ. భర్త యెడబాటును క్షణమోర్వని ప్రణయిని. భర్త శ్రేయస్సునే సర్వదా కాంక్షించు సాధ్వీమణి. ఆమెకు పతిభక్తి వలెనే దైవభక్తి నిండుగా గలదు. అమె జన్మతః సరసాత్మగలదై తర్వాత విద్యావతియై యుదాత్త సంస్కారము నందిన ఉత్తమ గృహిణి ఆమె విద్యా సంస్కృతులు శుక సందేశములో సువ్యక్తమగును. ఆమె కతులితాను రాగముతోబాటు అత్యంతాభిమానము కూడ కలదు. ఎంతకును రాని భర్తకు వ్రాసిన లేఖలోని యంశముల వల్లను, నదిలో కొట్టుకొనిపోవు వేళ పలికిన మాటల వల్లను నిది విదితమగుచున్నది. ఆమె వాత్సల్యసింధువై తనయు నుపలాలించిన జననీమకల్లి. మొత్తముపై సహృదయ చిత్తముల నలరించు ఉత్తమ నాయిక.

## రాముడు :

కథానాయకుడగు రాముడు ధీరోదాత్త ధీరలలిత లక్షణములు గల ఉత్తమ నాయకుడు. శృంగార నాయకులలో అనుకూలుడు. లక్ష్మి వలెనే స్వచ్ఛంద ప్రణయ విలసితుడు. ఇతడును నాయికవలెనే అమితానురాగ లతలల్లుకొని ఆమె వియోగమును నిమిష మోర్చినవాడు కాడు. అందుకే వారి అన్యోన్య ప్రేమ యసదృశమై యలరినది. అతడు సరసాత్ముడగు పతి. సద్ధర్మ పరాయణుడగు ఉత్తమ గృహస్థుడు. పేదరాలగు లక్ష్మిని ప్రేమించుటయేకాక అంతస్సులెంచక, అంతస్తులెంచు పెద్దలను లెక్కచేయక, పెండ్లాడిన ధీరుడు. పెద్దబుద్ధి కలవాడు. భార్యను శంకించుట కించపరచుట ఎరుగనివాడు. లక్ష్మిని పుట్టింటికి పంపుట, మరల తోడ్కొని వచ్చుటలో ఆలస్యముచేయుట, తల్లిదండ్రుల వైముఖ్యమువల్ల ఆమెతో వేరు కాపురము చేయుటకు వీలుగా గృహనిర్మాణము చేయుచుండుటయే కాని శంకాకలిత మనస్కుడై కాదు. ఆమె మహమ్మదీయ వనిత యని తెలిసి లోకాపవాద భీతిచే కొంత చింతించెను కాని అన్యధా భావించలేదు. కులమతాల కతీతముగా మానవత నారాధించిన మానవోత్తముడు. లక్ష్మి గోదావరి దాట యత్నించినప్పుడు తన యనివార్య పరిస్థితికి ఆమెను తోడుకొని రానందుకు పశ్చా

త్రాపపడుటయే కాక ఆమె మునిగిపోయి నందుకు కన్నీరు మున్నీరుగా శోకించిన జాలిగుండె గలవాడు.

రాముడు గ్రామీణకర్షకుడయ్యు విద్యా సంస్కారములు కలవాడు. లక్ష్మితో ప్రణయ సామ్రాజ్యమేలుటయే కాక హాలిక వృత్తిని చక్కగా నిర్వహించి యేలిక యైనవాడు. దైవభక్తి గలవాడు. దీనజనులపై దయజూపువాడు. అతడు 'చాద స్త్రాలు' లేని ధార్మికుడు సామాజికాభ్యుదయమును గ్రామీణ ప్రగతిని కాంక్షించి కృషి చేసినవాడు. స్త్రీ విద్య, గ్రామ విద్యుదీకరణము, రైతు సంక్షేమము, మత సామరస్యము, మానవతావాదము వంటి ఉత్తమ కార్యములు నెరవేర్చిన విశాల హృదయుడు. అతడు అనురాగ జీవనములోను అభ్యుదయ సేవనములోను ఆదర్శ మూర్తి. ఇట్టి లక్ష్మి రాములు దంపతుల కథ రసానంద బంధురమగుటలో సందియము లేదు ఇందు తొలుత అంగిరసమగు శృంగారము చర్చింపబడును.

## శృంగారము :

ప్రధాన రసమగు శృంగారము కావ్యమున సగానికిని పైగా 30 గేయము లలో పరివ్యాప్తమై చక్కగా పోషింపబడినది. ఆచార్యులవారి ఉత్కృష్ట కవితా గుణములలో నొకటగు సభ్య సమంజస శృంగార మీ కావ్యమునను సహృదయులకు మానసోల్లాసము కలిగించుచున్నది. ఇందలి శృంగారము నాయికా నాయకులగు లక్ష్మి రాములకు చెందినది. కథ కేవలము వీరిదే కావున అన్యపాత్రకృతముగ శృంగారము నిర్వహించుటకు వీలు కానిది.

నాయికా నాయకులలో మొదట నాయిక నాయకుని జూచి అనురక్త కావలెను. ఆమె ఇంగితములచే పిదప నాయకు డనురక్తుడు కావలెను. పిమ్మట వారి సంభోగ లీల. ఇది స్వభావ రమణీయమైన పద్ధతి యని రుద్రటుడు తన కావ్యాలంకారమున

"పూర్వం నారీ భవేద్రక్తా పుమాన్ పశ్చాత్తదింగితైః
తతస్సంభోగ లీలేతి స్వభావ సుభగా స్థితిః"

అని తెలిపినట్లు విప్రబ్ధలో నాయికా నాయకానురాగము వర్ధిల్లినది. లక్ష్మి పొలము పనికి వచ్చి నవయువకుడును మహా సౌందర్యవంతుడును కర్షకవర్యుడునగు రాముని గాంచి యనురాగము పెట్టుకొనుచు,

"నాయకుడెవరే ప్రసూన సాయకుడెవరే బాలా !
కంతుడో వసంతుడో జయంతుడో తెలియగజాల."[1]

అని యతని యందచందాలకు ముగ్ధమై తలపోయును. రాముడామెను చూచి ఆమె తనపై ననురక్తయని యింగితము గ్రహించి తానును ఆమెపై వలపుగొనును.

"ఏమి గనుచుంటి నేనేమి గనుచుంటి ?
నేనె నా కన్నులను నమ్మలేకుంటి"
"వనలక్ష్మి నాముందు వచ్చి నిలుచుండెనా
కనులు దెరచియె మంచి కలగాంచుచుంటినా"
"అందాల రంభ నా ముందాడుచుండెనా....
బంగారు బొమ్మలో ప్రాణమే పడెనా...."
"పువ్వుదీవియ నడచి నవ్వినను గాంచునా !
మవ్వంపు పువ్వులకు మాటలే వచ్చునా !"[2]

అని లోకోత్తరమైన ఆమె రూపరేఖా విలాసములు గాంచి విభ్రాంతుడై ఆమె అనురాగ భావమవగతము చేసికొనును. ఇట్లు పరస్పరావలోకన ప్రీతిచేత రాగోదయ మగును. ఇక్కడ మన్మథావస్థలలో మొదటిదగు చక్షుః ప్రీతి వర్ణింపబడినది. కొన్నాళ్ళ పిమ్మట ఆమె మీద చూపులను మనస్సును మరలించుకోలేక

"ఎవ్వరీ చిన్నది ఎంతబాగున్నది కన్ను యిక్కడినుండి కదల
నంటున్నది....
కనుల చూపులలోనె కనుకట్టు నొనరించి మాటమాటలనెదో మంతరిస్తున్నది
పిల్వకుండనె ఎదలొ పీటేసి కూర్చుండి తనువు మీదేమొ దొరతనము
చేస్తున్నది....
గుండె విప్పి మమత గ్రుమ్మరించేదాక వలపుభారము మనసు నిలుప
లేకున్నది"[3]

అని ఆమెపై మనస్సు నిలిపి పరవశుడై భావించును. ఇది మనస్సంగమను ద్వితీయావస్థ ఇందు విభావానుభావములు నిర్వహింపబడినవి.

1. విప్రలబ్ధ : 4 వ గేయము. పుట 7
2. విప్రలబ్ధ : 5 వ గేయము, పుట 9, 10
3. విప్రలబ్ధ : 10 వ గేయము, పుట 19, 20

రాముడు లక్ష్మిని పలుకరించును వలపు చిలుకరించును.

"ఎవ్వరేపిల్ల? మీరెవరె బంగరుబిల్ల!
వేరుగా జూడకే పేరేమొ చెప్పవే
చిలుకనవ్వులదాన! సిగ్గుపడుటెందుకే
కలికిచూపులదాన కంగారు పడెదేల
మొలకప్రాయముదాన మోమాటమెందుకే"[1].

అని యిత్యాదిగా అడుగుచు పొగడుచు అనురాగోక్తులు పలుకును. రైతు రాముని తలచుకొని లక్ష్మి విరహపరవశ యగును.

"ఏమనుచు చెప్ప నీ గాథ ఎదనేమొ పదరాని బాధ
ఏమయ్యె నామనసు కెపుడిట్లు కాలేదు
ఇదియయ్యెనని చెప్పుకొనగ నోరే రాదు
ఇది సుఖమ్మనుకొంటె ఎద తాపముంబెట్టు
ఇది కష్టమనుకొంటె యిడువగా లేనొట్టు....
నాసామి నను వలచి చూడాలె ననిపించు
చిలిపిగా చూస్తుంటె సిగ్గొచ్చి తలపంచు
తల్లీనమైపోవ తలపులెన్నోపుట్టు
సామి నను దరిదీయ చల్లచెమటలు పుట్టు...."[2]

అని యీవిధముగా విరహవేదన యనుభవించును. ఈ వర్ణన వలన సాత్త్వికభావములు వ్యక్తమై మనస్సంగ సంకల్పావస్థలు గోచరించును. ఈ చెప్పబడిన గేయములలో రాగోదయమైన పూర్వరాగ విప్రలంభము పోషింపబడినది.

పిమ్మట రాముడు కొంటెగా లక్ష్మి కొడవలిని దాచిపెట్టుటచేత ఆమె పొందిన మధురబాధ 13వ గేయమున వర్ణితమైనది, ఇందు సాత్త్విక సంచారీ భావముల పొలుపు కాననగును. ఈరీతిగా వర్ధిల్లినవారి యనురాగలతలెదల నల్లి చిల్లిగ నల్లుకొనును. ఒకనాడు లక్ష్మి వెన్నెలలో కూర్చుండి కన్నెతలపుల తేలియాడును

1. విప్రలబ్ధ : 11వ గేయము, పుట 21
2. విప్రలబ్ధ : 12వ గేయము, పుట 23, 24

"వెన్నెల వెలిపాల మున్నీటి కెరటాల
తారకలనాడు చందప్ప నాలోని కోరికల పూలన్ని విప్ప....
నెలవంక అందాలు తలపుకొస్తే చాలు
నా యెడద గ్రుచ్చితని నవ్వుల్ల జంబియాలు
ఏవేవొ గుర్తులెదనాడు ఓయమ్మ
ఏవొ ఈ మమతలే పాడు........
మురిపాల చంద్రుణ్ణి ముద్దైన ఏ తార
ముత్యాల తల్రాల ముంచెత్తినదొ రేల
నా కనులు కరవార గాంచు నెపుడచట
ఎదొ పెండ్లి విందారగించు"1.

అని మధురస్మృతుల దేలియాడుటలో వారి వలపులు సరస శృంగార చేష్టలు, ఆవేపనిగా తలపోయుచు పెండ్లాడి సుఖపడవలెనన్న కాంక్షలు సువ్యక్తమ రాత్రులలో నిదుర రాక చింతించుటలో జాగరమను మన్మథావస్థ చిత్రింపబడి

ఆ తరువాత రాముడు లక్ష్మిని పెండ్లాడుదమనుటలో నతని గాఢానురా వ్యక్తమగును.

"లచ్చియేటికె నీకు ఇచ్చకపుసిగ్గు ప్రేమించి యిద్దరము పెండ్లాడుదావె
నేను నీవాడనై నీవు నాదానివై ఉంటె చాలెవ్వరేమంటె మనకేమి?
మలినమ్ము గాని మన తొలివలపు పాపమే? ఊఁయనుము నీవు అడ్డు
మనకింక
కులమేల మతమేల? గుణమె కారణమంచు పదవి భాగ్యాలేల ఎదయె
ముఖ్యంబ
ప్రణయరాజ్యములేలు ప్రకృతి దేవత ఒడిలో తోటి స్త్రీపురుషులకు
పొరమిడుదావె

ఈ మాటలవలన గుణము, మనస్సు చూచి ప్రేమించి పెండ్లాడుటలో కుల మత కాని, పదవి భాగ్యాలు కాని అడ్డురావన్న ఉత్కృష్ట విషయము విదితమై రా స్వచ్ఛంద ప్రణయ తీవ్రతకు దర్పణము పట్టుచున్నది. పిమ్మట రాముడు ల

1. విప్రలబ్ధ : 14వ గేయము, పుట 29, 30
2. విప్రలబ్ధ : 15 వ గేయము, పుట 31, 32

వనదేవతల సాక్షిగా పెండ్లి చేసికొందురు. వారి పెండ్లికి వారి అనురాగ చేష్టలు, ప్రకృతిలోని పక్ష్యాదులే అన్ని హంగులు సమకూర్చినవి.

''కొత్తకోర్కెల చీరకొంగు ముళ్ళేసుకొని సరసాలు నవ్వుల్లు సన్నాయిలను బాడ

తరుణి నాకౌగిలిని తాళిబొట్టుగగట్టి ఉప్పొంగి మురిపాల ఊరేగుదామే

మనకు పైపక్షులు మంత్రాలు చదువంగ తలరాలు పువ్వుల్లు తల్రబాలు చల్లంగ

తీవల్లు తలలూపి దీవెనలు చెప్పంగ పచ్చపచ్చని మట్టి పందిల్లు వేయంగ....''[1]

నిసర్గ రమణీయముగా పెండ్లి చేసికొందురు. మనువునకు మనసే ప్రధానము కాని మంత్రాలు కావు. పెండ్లికి వధూవరుల యిష్టమే ముఖ్యము కాని పెద్దల సమ్మతి కాదు. ఈ రీతిగా గాంధర్వ వివాహము చేసికొన్నాడు రైతురాజు.

లక్ష్మిరాముల శృంగారములో ప్రేమించి పెండ్లాడినంత వరకుగల యిది మొదటి దశ. ఇంక రెండవదశ వారు కలిసి హాయిగా గడపిన సంయోగ శృంగారము. ఈ దశలో వారు లక్ష్మి మ్రొక్కుకొన్నందున తిరుపతి వెంకన్న దర్శనానికి వెళ్ళివత్తురు. వనవిహారము చేయుదురు. బోటుషికారు చేయుదురు. సరసాలాడుచు ప్రణయముతో పాటు పంటలు పండించుకొందురు. ఇక్కడ సంభోగమునుగాని, ఇతరాసభ్య శృంగారమునుగాని వర్ణింపక పోవుట ఉత్తమ కవితా గుణమున కుదాహరణ మగుచున్నది.

''పసుపుబట్టలతోడ పయనమై వస్తంటి ఎంకన్న దర్శించ యెళుదామె స్వామి''[2]

అని లక్ష్మియని ఆ దేవుని తానేమి కోరుకొనునో ఎరికేనా అనగా

''కొడుకు నిమ్మంటావు కొంటె నాలచ్చి మనయాట సాగనీదా బుజ్జి వచ్చి''[3]

అని రాముడనుటలో చమత్కారమున్నది. పెండ్లియైన పిమ్మట ఆడవారు కోరు కొనునది మాతృత్వము. మగవారికేమొ చిరకాలము ప్రణయసౌఖ్య సంపద కొల్ల

1. విప్రలబ్ధ : 16 వ గేయము, పుట 34
2. విప్రలబ్ధ : 17 వ గేయము, పుట 35
3. విప్రలబ్ధ : 17 వ గేయము, పుట 35

గొట్టవలెనని యుండును. ఇక్కడ ఇది అనువర్తింపబడినది. రాముని యీ మా
లక్ష్మి సమాధానము, ఆమె పవిత్ర ప్రేమను పతిభక్తిని తెలుపుచున్నది. ఎన్న
ఎడబాటు కలుగని ప్రేమదాంపత్యమును, దీర్ఘ మాంగల్యమును ఆమె కోరుకొ
మహోదాత్త హృదయమునకు ప్రతీక. దాంపత్య సుఖానుభవము, సంతాన ప్ర
ఇవి వాంఛనీయములే కాని యివి దంపతులకు సాధారణములే. కనుక ఆమె వా
లుత్కృష్టములు. తిరుపతి కొండలెక్కునప్పటి వారి సంభాషణ వారి యన్యోన్యా
రాగమును సువిదిత మొనర్చుచున్నది.

"ఏడుకొండల నీవు ఎక్కలేవే లక్ష్మి నా చల్లనీడలో నడచి రారాదే
యని రాముడగా "నీనీడ ద్రొక్కేటి పాడుకాళ్ళవి యేల కాలిపోతే నయము
నా రాజా!" యనియు "నవ్వుల్ల పువ్వుల్లు నడిబాట బోస్తాము కాళ్ళను ఎండ
రాళ్ళేమి సేయు" అనియు బదులు చెప్పుటలో ఆమె పతిభక్తి, అనురాగాతిశయ
తెలియును. ఇక్కడ మరొక భావచమత్కారము ఇట్లు కలదు.

"ఈశ్వరుని తలమీద కెక్కలేదే గంగ ఎత్తుకుంటా చంకకెక్కవే లచ్చి
యని రాముడనగా

"ఏ-పో-భలే మామ ఎక్కమందువు చంక చంటిపిల్లనె నేను చంకెక్కి
కూచో

అని యనును లక్ష్మి. ఈ విధముగా సరససల్లాపము లాడుచు శ్రమ తెలియక
తిరుపతి కొండలెక్కుదురు.

తిరుపతిదేవుని ప్రార్థనలో లక్ష్మి వియోగమెరుగని విమల దాంపత్యమ
వేడుకొనును. తరువాత వారు

"ప్రేమ పెరిగీ పెరిగి భూమి యాకాశాలు, సోముడూ సూరీడు చుక్క
దిక్కు
అన్ని మనమే యయ్యి ఆడుకుందామా పున్నెపాపాలన్ని కడిగివేద్దామా

అని హాయిగా వనవిహారము చేయుదురు. పిమ్మట దగ్గరగల ఏటి నీటిలో వెన్నె
సర్వము శృంగారమయమయి శోభిల్లు ప్రకృతి దృశ్యములలో బోటు షికారుచే
దురు. ఆవెనుక లక్ష్మి తన పెనిమిటితో తన ఆనందానుభూతిని తెలుపుచు
ఏడలేని తాదాత్మ్యమును చెప్పికొనును. ఆనందాతిశయముతో పాడుకొను

1. విప్రలబ్ధ : 22 వ గేయము, పుట. 45

రాముడు లక్ష్మిని కలుపు తీయుటకు పిల్చుట, ఆమె తెచ్చు సద్దికి నిరీక్షించుట, ఆమె వచ్చి చద్దితోపాటు ప్రేమనందించుట, రాముడు చద్ది గుడుచునపుడు లక్ష్మి మంచెయెక్కి పిట్టలను గొట్టుచు ఓరచూపులు నవ్వులు విసురుచు అతని యెదలో మదనాగ్నిని రగుల్కొల్పుట, రాముడు రాత్రులలో చేని కాపలకాయుచు విరహ గీతము లాలపించుట, ఆమె రూపరేఖావిలాసములను తలచుకొని తల్లడిల్లుట-ఇవి యెల్ల వారి శృంగారరస విసారమునకు సారసారములను దీసి ఫలవంతము చేసినవి. ఇక్కడ చేనిలోని రాముని విరహగీతి హృదయద్రావకముగా నున్నది.

> ''ఏజన్మలో నెవరి నెడబాపితిమొ యేమొ ఈచేనిలో నేను ఇంటికాడా తాను
> కన్నుల్లా తెలవారుతున్నది-మాకర్మమింతే నోచుకున్నది
> చద్దియన్నము తెచ్చి సరసమాడుచు లచ్చి పలుకరానీగాథ పడరాని ఒక బాధ
> ఎన్నడగు వరికోతలన్నది-కొంగు కన్నీట తడిసిపోతున్నది.
> అత్తమామల బెదురు ఆడుబిడ్డల యలుక వత్తమన రాలేదు పంజరములో చిలుక
>
> పెత్తనమ్మేది నారాణికి-ఎంత ప్రేముంటె యేమి దొరసానికి"[1].

ఇట్లే ఎంతో మనోహరముగా సాగినది గీతము. ఈ ఎడబాటు, ఈ మధురబాధ ఇద్దరిది. మధ్యమధ్య విరహబాధ కలిగినపుడే, ఆకలిబాధవల్ల అన్నము రుచించు నట్లు, ప్రణయము మధురతరమగును. ''....విరహమొఁ గలిసి యెడఁబాయ హృదయోత్కలిక...."[2] అని యన్నట్లిదె విరహవిప్రలంభము.

కొన్నాళ్ళ తర్వాత లక్ష్మి గర్భవతియైన విషయము, మగనికి వ్యంగ్యముగా తెలిపిన విషయము సరసముగా చమత్కారముగా నున్నది.

> ''నాటోలె లేదు నీమనసూ లచ్చి, యేటికే నాతోడ యేరుబంపము నీకు
> పరవానిగా నన్ను పరికింతువేల యన వరిపొట్టకొచ్చెనని చిరునవ్వు నవ్వితివి"[3].

ఎందుకు పూర్వమువలె నుండవు వేరుగా చూచెదవనగా వరి పొట్టకు వచ్చెనని చిరునవ్వు నవ్వుటలో తాను గర్భవతి యయ్యెనని ధ్వని. ఇట్టివే మరికొన్నిమాటలు చేష్టలు జరుగగా రామునికి విషయమర్థమగును.

1. విప్రలబ్ధ : 31వ గేయము పుట 65, 66
2. కావ్యాలంకార సంగ్రహము : 3-137
3. విప్రలబ్ధ : 33వ గేయము పుట 69

"నిన్ను విడిచి నేను ఎన్నాళ్ళిటుందునన అనుభవించాలె చేసినకర్మకని నవ్వు
త్వరపడితినా నాదు తప్పేమి యయ్యేనన ఐన తప్పుల కడుపునందెట్టి
నంటావు"[1].

ఈరీతిగా సాగును సరస సంభాషణ. లక్ష్మీరాముల ప్రణయములో నింతవరకిది ద్వితీయ ఘట్టము. ఇకనుండి ఆమె పుట్టింటికి పంపబడి విప్రలబ్ధయై భర్తచెంత కరుదెంచు వరకు కలది తృతీయఘట్టము.

లక్ష్మి పుట్టింటిలో కొడుకును గని, పెనిమిటి చూడరానందు కతనిని తలచు కొని పడిన విరహావస్థ ఎదలను కదలించురీతిగా వర్ణింపబడినది. ఇది 38వ గేయ ములో కలదు.

"ఎటు మరచియుండగలను నాసామి నెటువిడిచి యుండగలనూ''
అని భర్త పూర్వము తనయెడ గుప్పించిన అనురాగచేష్టలు భాషలు తలచుకొని బాధపడును. కొడుకును చూడరాని భర్తకై బెంగపెట్టుకొని పందిరిపై వ్రాలిన కాకమ్మతో కబురంపును.

"బేగి రమ్మని చెప్పవే కాకమ్మ ఆగలేనని తెల్పవే
ఎందరుంటేనేమి? అందాల మారాజు వద్దలేకుంటె నాప్రొద్దె చీకటిపడును"[2]
అని మొదలిడి పరిపరివిధాల పరితపించి చెప్పును.

"మమతల్లు గల ఆలుమగలు కనబడ చాలు ఎడతెగని కోతతో ఎద
యెందుకోగోలు
నిను విడచి బ్రతుకలేనను ప్రేమయెటబోయె కన నన్నికలలోనె యాయె
కన్నీటి వర్షాల కరగిపోనీ కఠిన పాషాణమెటులయ్యె పండంటి ఆ మనసు
కన్నబిడ్డను జూడగానైన రాలేదు చిన్నోడు తనపైన చేసిన్న తప్పేమి?[3]

అని విలపించుటలో ఆమె విరహార్తి విశదము కాగలదు. మరియు కేవలము ఆయ నతో కలిసి సుఖానుభూతి నొందక పోయితినన్న వేదనకాక తానొంటిగా ఎట్లుండెనో ఎండనక వాననక చెమటోడిసి కష్టపడి కలియో అంబలియో త్రాగి గడియ ఆగక వెళ్ళిపోవును ''రాత్రి అడవిలో బండు రాతెట్టగున్నాదో'' అని అతనిపై బెంగ పెట్టుకొనును.

1. విప్రలబ్ధ : 38వ గేయము, పుట 70.
2. ,, : 41వ గేయము, పుట 87.
3. ,, : 41వ గేయము, పుట 89.

"తమరు బెట్టిన మేల్మి దండగడియమ్మిపుడు ఒడ్డాణ మనిపించ ఒదలయ్యె
నను మిపుడు"1

అని యనుటలో చింతచేత ఆమె ఎంత చిక్కిపోయినదో తెలియును. పిదప చిలుకమ్మతో పంపిన రాయబారము చాలా ప్రశస్తమైనది. ఈ కీరసందేశ మాచార్యుల వారికిష్టమైనదిగా తోచును. పోతన చరిత్రము-అనుబంధ భాగవత కథలలో రుక్మిణి కళ్యాణమునందు మూలమునలేని కీర సందేశమును కల్పించి యుండిరి.

చిలుకను బుజ్జగించి పొగడి తన మనోబాధ వ్యక్తపరచి అరుణోదయవేళకు బయలు దేరుమనును. సుందర ప్రకృతి శోభలను తిలకించుచు అడవిదారిలో నేగి పండ్లు దినుచు విశ్రమించుచు సాయం వేళకు తన యత్తగారి యూరికి చేరవలె నను. అక్కడ వాగుదాటగానే వారి చేలు గనబడును. అందు ప్రాలి దానిమ్మ జామ పండ్లు తిని హాయిగా మామిడి చెట్టుపై నిద్రించి రాత్రి గడుపు మనును ఇంత వరకు 42వ గేయమున నీ విషయము వర్ణింపబడినది. తర్వాతి 43వ గేయములో రెండవ భాగముగా చిలుకను మేల్కొని తమ చేనిలో భర్తను కలియు మనును. అతని రూపరేఖలు వర్ణించి ఆయన తన నెడబాసి పొందు గాసిని ఊహించి చెప్పి,తన వేదనను సందేశము నందజేసి మందావు తప్పెనని సాకు చేసికొనివచ్చి తనను గొనిపోవలసినదని చెప్పమనును.

రెండు గేయాలలో చెప్పబడిన ఈ శుకసందేశము మిగుల విస్తరించి ఒక చిన్నసందేశ కావ్యముగా చెన్నెసలారుచున్నది.ఇది అచ్చముగా పూర్వోత్తర భాగములలో నున్న మేఘసందేశము ననుసరించియున్నది. ఇందలి ప్రేమకథ, నాయికా నాయకులు, వియోగ కారణము, దూత ఇవన్నియు భిన్నములైనను దౌత్యము గురించి చెప్పిన తీరులో క్రమములో మాత్రము మేఘసందేశమును బోలియున్నది. ఇందు సందర్భానుసారముగా చొప్పించిన సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు కడుంగడు రమణీయములై యున్నవి. లక్ష్మి చిలుకను రాయబారమునకు బ్రతిమాలుచు నిట్లనును.

1. విప్రలబ్ధ : 41వ గేయము, పుట 88

"రాయబారము సలిపి రమణి రుక్మిణి గలిపి తొలి ప్రభావతి వలపు ప్రద్యుమ్నుతో తెలిపి
కాపురాల్ నిలుపు నిను నీ పతికి నెడబాపి పట్టి - యీ పంజరపు బందెలో నిడు పాపి"[1]

అని చిలుకకుగల గత ఘన చరిత్ర నుగ్గడించి అట్టి చిలుకలను పాపాత్ములు పంజరముతో బంధింతురనియు, మగని యెడబాటులో గుందు ఆ చిలుకకు తన బాధ యెంతటిదో సరిగా అర్థమై సందేశ మందజేయగలదన్న విశ్వాసముతో అంపినది. మరియు సందేశమునకు చిలుకను పంపుటలోని యౌచిత్యము నిట్లు తెలిపినది.

"తొలి యక్షుడొక్కండు తెలివిమాలి యదేమొ మనిషి మాటలె రాని మబ్బుతో కబురంపె
కదలాడు జీవనము కలదేమొ యనుకొనెను పక్షిరాజా!-నీకు పలుకు జీవన ముంది"[2]

ఇది "ధూమజ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థా క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః...."[3]

అను మేఘ సందేశ శ్లోకము దృష్టియందిడుకొని చెప్పబడినది. మేఘునికి ప్రాణము లేదు పలుకు లేదు. నీకు రెండున్నవి నీవు తప్పక సందేశము నందించ గలవనుట బాగుగా నున్నది. ఈ రాయబారములో రుక్మిణి కథ, ప్రద్యుమ్న చరిత్రము, మేఘసందేశము చాటువ లిచ్చుట చూడగా లక్ష్మి విద్యనేర్చి విజ్ఞానవతి యైనదని తెలియుచున్నది. చిలుకను మెచ్చుకొనుచు-

"తరుణి శారద చేత తరిబీతు పొందితిని మదుని గజ్జెల గుర్రమను కీర్తి జెందితివి"

అనుట విశిష్టముగా నున్నది. చిలుక రాముని చేరుసరి కతడిట్లుండునని చెప్పినది.

"చెక్కిట చేయుంచి చినవోయి చూస్తాడు నిట్టూర్పు సెగలకు అట్టుడికి నట్లుడికి
లోలోన కుమిలి యింట్లో చెప్పుకొనలేక సామి బెంగెట్టుకొని సగమయ్యి ఉంటాడు[4]

---

1. విప్రలబ్ధ : 42 వ గేయము, పుట. 91
2. ,, : 42 వ గేయము, పుట 91
3. మేఘసందేశము : 1-5
4. విప్రలబ్ధ : 43వ గేయము, పుట 103

ఇది యతని విరహ వ్యథావస్థను కనులకు కట్టించుచున్నది. పెనిమిటిని గురించి తాను అనుక్షణము కలవరించుచున్న విషయము, కనులు మూసినను తెరచినను అతడే కనబడు విషయము, అతడు పూర్వమొలుక బోసిన సరసాలు అన్నియు చిలుకకు చెప్పను. వెంటనే వచ్చి తోడ్కొని పోవలసినదిగా చెప్పి చివరకు

> ''ఒకక్షణము నన్నిడిచి ఉండేటి వోడేనె బలిమి బందాల లోపల కట్టుబడెగాక
> మూప్రేమ తలపోస్తె మనసెట్లొ పోతుంది చెప్పలేనే గుండె చెరువు
> గొంతుకనిండె''1

అని దుఃఖాతిశయముచేత ఇంకను చెప్పలేక విరమించును. ఇట్టి సందేశమున లక్ష్మి విప్రలంభమునందలి బాలివెత చదువరులకు జాలి కలిగించుచున్నది.

రాము డప్పటికి తోడ్కొని పోవరానందున లక్ష్మి తనపై ప్రియునికేదో అనుమానము వచ్చినట్లు తెలిసి వ్రాసిన ఉత్తరములో అనురాగతాపమునే కాక అభిమాన కోపమును ప్రకటించును. తనను చూడనిచో క్షణమోర్వని ప్రియుడిన్నాళ్లె ట్లుండ గలిగెననియు గుండె ఎంత రాయి యాయెననియు వగచి ఓర్వలేక స్త్రీలకొక నింద కల్పించి పండువంటి కాపురము పాడగుట చూచి మురిసిపోవు లోకులు కాకులని విలపించి అతనికి నమ్మకము కలుగు విషయమిట్లనును.

> ''హృదయేశ ! నాప్రేమ హృదినెవరి పూజింతు ఎదగోసి నీకు నేనేరీతి
> జూపింతు
> నీవు నేనైతేనె నే బల్క నమ్మెదవు వేరైన మన ప్రేమమునకె సంశయ
> మొదవు''2

ఇంతకంటె అబల ఏమనగలదు ? ఎట్లు నమ్మించగలదు ? ఐనను కోపము పట్టలేక

> ''శ్రీరాము డానాడు సీతను త్యజింపడే తన కీర్తికొరకు సత్యమునే వధింపడే
> ప్రజ మెప్పులకు పాటుపడు! రాజుకది చెల్లు''

కాని నీకెందుకా పంతమని నిలదీసి యడిగినది. తాను శీలవతియని తెలిసియు రైతు రామునికి లోకాపవాదభీతి కలిగి అటుల అర్ధాంగిని వదలివేయుట క్షంతవ్యము కాదని భావము. చివరకు 'గంపంత కన్నిడుక కాంచెదిని పరమాత్మ' యని తాపము వ్యక్తము చేయును. ఇది లేఖ మొదటి భాగము. రెండవ భాగములో

1. విప్రలబ్ధ : 43 వ గేయము, పుట. 105
2. ,, : 44 వ గేయము, పుట. 107

మొత్తము నిష్ఠురములే వ్రాసినది. "నేను తప్పు చేసితినేమో పిల్లవాడేమి చేసెనని వదలివైచితివి ? పిల్లవానిలో నీ రూపము చూచి వీని పోషణ నా పాలబడినందుకు బ్రతికియున్నాను కాని లేనిచో ఈ వరకే భూమిపై నాపేరే లేకుండెడిది. నీవు నా మాట ఇంకను నమ్మనిచో బాధ భరించలేక నా యాత్మ ఈ దేహమును వీడి పోవును. బట్టగాల్చి మీద బడవేయు లోకానికి భయపడక సత్యానికి మాత్రమే వెరవవలెను. తొందర పడినచో అది నిన్నే చెరచును. నిజము నిలుకడ మీద తెలియును. అని పరిపరివిధాల తన యావేదన వెళ్ళబోసికొనినది లేఖలో.

ఉప్పొంగు గోదావరిలో తెప్పజార్చి వచ్చు లక్ష్మిని రావద్దని అరచి చెప్పటలో రాముని హృదయములోని ప్రేమ అగ్నిపర్వతమువలె బ్రద్దలయి ప్రవహించినది.

> "అంటముట్టగరాని అగ్గి నీ శీలమ్ము నీకు వేలిడిచూప నెవని యబ్బతరమ్ము
> కఠినాత్ముడను నిన్ను కష్టపెడితి క్షమించు గడియేని యిక నిన్ను విడిచి
> యుండను ముందు"[1]

ఈ రీతిగా ఆమెపై తనకుగల సంపూర్ణ ప్రేమ విశ్వాసముల నెలుగెత్తి చాటును. స్త్రీకి భర్త నుండి కావలసినది ఇదియే. జన్మకింతకంటె భాగ్యమేమి ? కాని యిప్పటికే ఆమె వ్యథ దుస్సహమైనది. ఆమెకు సహనము నశించినది. మనస్సు వికలమైనది. ఎంత వారించినను నిలువక భర్తనప్పుడే చేరుటకు దుస్సాహసము చేసినది. ఇక్కడి యీ దుస్థితి విప్రలంభములో పరాకాష్ఠ.

> "ఈ యేరు దాటొచ్చు నీ వేరుబంధంపు విరహాబ్ధినింక నేవిధి దాటుదు
> తలంపు
> కన్నీటి మున్నీట కాలి చచ్చుటకంటె నినుగనుచు చల్లగా మునిగి పోదీయేట
> నిను వీడి బ్రతుకుటే నిజమైన యాచావు నిను జూచుచుం జచ్చుటన నాకిదే
> బ్రతుకు
> నా ప్రాణమన నీవె నదిని జొరబోకొట్టు నదిని కాలిడితివా నను జంపుకొన్నట్టు
> మరొక జన్మెత్తి ఓ మామ నిను గలిసేను సిరిగల్గు నీ మోము మరువజాలను
> నేను"[2]

అని దురపిల్లుటలో ఆమె ప్రణయము పతిభక్తి యెంత గాఢమైనవో తెలియు చున్నది.

---

1. విప్రలబ్ధ : 46 వ గేయము; పుట 111
2. ,, : 47 వ గేయము; పుట 112 113

మునిగిపోవు లక్ష్మిని గని పెద్దపెట్టున యేడ్చు రాముని గనిన నతని హృదయము, లక్ష్మిపైగల యాతని నితాంతప్రేమ సువ్యక్తమగును.

"మునిగి పోయెడి నిన్ను గనుచుంటినే గాని అదుకొనలేనైతి బూదిగా నీ మేను
మనలేను నిను విడచి మందభాగ్యుడనేను మందభాగ్యుడ జాతిమణి దక్కునే నాకు ..
పగబట్టి విధి దుమ్మెపగలు చీకటిగ్రమ్మె జగతినాటకములో మిగిలె తుద చీకట్లు"1

అని యడలు రాముని శోకము కట్టలు త్రెంచుకొని ప్రవహించినది. లక్ష్మి కోరికపై కొడుకు కోసము రాముడు నదిలో పడిపోక నిల్చిపోవును. వికలమనస్కుడై వివిధ గతుల విచారించును.

తుదకు విప్రుడు కలలో గన్పడి ప్రబోధించిన తర్వాత విప్రలబ్ధయయి లక్ష్మిరాగా రాముని యానందమున కవధులు లేకుండును. ఈ విధముగా లక్ష్మి రాముల ప్రణయజీవిత శృంగారము సహజ రమణీయముగా సమంజసముగా సద్భావబంధురముగా పోషింపబడినది.

## ధర్మవీరము :

కావ్యమున వీరరసమున ధర్మవీరము రవంత నిర్వహింపబడినది. నాయకుడు రైతురాముడు వంశాలలోని అంతస్తులెంచి వద్దనువారిని లెక్కచేయక ధైర్యముతో లక్ష్మిని పెండ్లాడుదమని పలికి ఆపని నెరవేర్చుటలో నిది పోషింపబడినది.

ఒకరి మేలును జూచి ఓర్వగాలేని యీ పాపిష్ఠిలోకముతో పనియేమెమనకు
మిట్టపల్లాల యిక్కట్టులెన్నుంటేమి గంగ రత్నాకరుని కలియకుంటావె"2
అనియు

"కులమేల మతమేల గుణమె కారణమంచు పదవి భాగ్యాలేల ఎదముఖ్యము"3.

---

1. విప్రలబ్ధ : 48వ గేయము, పుట 115
2, 3 ,, : 15వ గేయము, పుట 32

అనియు వచించుటలో ప్రేమికునిగా, సమాజము నెదిరించి తన ధర్మము నిలబెట్టు కొనుటలో నిది వ్యక్తమగుచున్నది. అట్లే అనుబంధ గేయములలో, లక్ష్మి మహమ్మ దీయమతానికి చెందినదని తెలిసి లోకులు నిందించుట రాముడు విని మతభేద ఖండనము చేయుటలోను, గాంధి జయంతినాడు కొడుకు జన్మదినమురాగా ఉత్స వము చేసికొని జాతీయ భావ స్ఫోరకముగా పాడుకొనుటలోను ధర్మవీరద్యుతి తనరారుచున్నది. మరియు రాముని కర్షకవృత్తి నిర్వహణలోను నిది రేఖామాత్ర ముగా స్ఫురించుచున్నది.

## కరుణము :

విప్రలబ్ధలో కరుణము కొంత జాలువారుచున్నది. ఇది ప్రధానముగా గంగలో మునిగిపోవుచున్న లక్ష్మిని జూచి రాముడు విలపించుటలో గంగవలె ప్రవహించినది. ఇందులో విప్రలంభ శృంగారచ్ఛాయ పొడసూపినను ముఖ్యముగా కరుణరసభరితమై గుండెలను కరగించుచున్నది. తర్వాతి గేయములో రాముడు విచారముతో తలపోసినది కరుణ స్ప్రుహ కలదైయున్నది. రాముడు దున్ని విత్తనములు వేసి కరవైన వానకోసము వానదేవుని ప్రార్థించిన గేయములో

"నీవు రావోయి ఓ వానదేవా! నీవు రావోయి ఓ వరుణ దేవా!
ఇంటి వరకొకసారి రావా! మా పంటచేలను జూచి పోవా....!
ఇంటిలో గింజల్లు మంటిలో బోశాము
మింటికేంయా జూచి కంట నీరెట్టాము"[1].

అనుటతో కరుణ మొలకుచున్నది.

## భక్తి :

కావ్యమున భక్తిరసము లక్ష్మిరాములు తిరుపతిదేవుని సందర్శించి పాడుటలో చెలువొందుచున్నది.

"ఏడుకొండలవాడ! మూడు జగముల ఱేడ! కోటొక్కదండాలు కొనవయ్య
దయతోడ
మాకోసమై నీవు మమత చేపులురాగ వైకుంఠమును విడిచి వస్తివా నాతండ్రి!

1. విప్రలబ్ధ : 7వ గేయము, పుట 18, 14

మగనితోడిదె జగము మగువకేమున్నదిర ఇది తెలియదా నీకు ఏమందురా దొరా!

అపరాధులము మేము కృపజూడవలెగాని నెపమెన్న మాకింక నీకన్న గతియేది

మా యాపదల గడచి మాముందుగా నడచి మమ్మెప్పుడును విడచి మసలి యుండకు స్వామి"[1]

అను నిత్యాది వాక్యములలో నిది విశదమగును. ఈ గేయమునకు ముందున్న గేయమునందు కొండమీద ఎక్కిన క్రొత్త దర్శనపు సంతోషములో వ్యక్తము చేసిన భావములందును భక్తిస్ఫూర్తి కలదు. మరియు లక్ష్మి మునిగిపోవు వేళ రాముడు ఏడుకొండలవాని స్మరించి లక్ష్మినట్లే వేడుకొమ్మనుటలోను, లక్ష్మి బ్రతికిరాగా వేంకటేశ్వరుని దయవల్లనే ఆ రక్షణ జరిగినదనుటలోను భక్తి వ్యక్త మగును.

## శాంతము :

లక్ష్మి నదిలో మునిగి పోయిన పిదప రాముడు వికల మనస్కుడై విచా రించిన గేయమునందు శాంతము నిర్వహింపబడినది.

"ఎవరు నేను ఎచట నుండి యిటకు వస్తి
ఇచటి నుండి ఎటకు బోదు ఇది తెలిసినవాడె నాస్తి....
ఈ పూవులలో వాసన లెచటి నుండి వచ్చినవి
పూవు నేల వ్రాలగనే తావి యెచట జచ్చినది....
పాత్రను నా కొసగె నెవడు? సూత్రధారి కానరాడు
విశాదాంత నాటకములె వేయుచేల యేనాడు"[2]

అని యీ విధముగా తలపోసిన వానిలో జ్ఞానవైరాగ్య విషయములు విదితమై శాంతమేపారుచున్నది. తరువాతి గేయములో రాముని కలలో విప్రుడగపడి ప్రబో ధము చేసిన దానిలోను కొంత తాత్త్విక చర్చయు డుటచేత శాంత మొకింత తోచుచున్నది.

1. విప్రలబ్ధ : 20వ గేయము, పుట 41, 42
2. ,, : 49వ గేయము, పుట 116, 117, 118

## భయానకము :

లక్ష్మి దాటుటకు సాహసించి దిగిన గోదావరీ భీషణ ప్రవాహ వర్ణనలో భయానకరసము గుండెలకు దడ పుట్టించుచున్నది.

"ఊళ్ళకూళ్ళే మ్రింగ నుప్పొంగి చెలరేగు ఎట్టివా నీ నడక ఎట్టెటో యేరేగు
ప్రకృతి యాకలి గొంచు వికటాట్టహాసాల నాల్కలను సాచి యిటు నడచి వచ్చును బేల
కసి దీర్చుకొనుటకై కాటేయ పరుగెత్తు పగబట్టిచను నాగు పామోలె వస్తుంది
గట్లు కోస్తూ దారి చెట్ల గూలుస్తు వడి గోదలను కదపునం గొట్టుకొని పోతుంది"[1]

ఇత్యాదిగా భువన భీకరముగా పారుచున్న గోదావరీ వర్ణనలో భయానక రసము పొంగులు వారుచున్నది.

## వత్సల రసము :

కావ్యము నందు వత్సలరసము కూడ యొకింత పోషింపబడినది. లక్ష్మి కొడుకును గని సంబరపడుటలో నిది నిర్వహింపబడినది.

''అందపు విందిడు పాపా! అద్వైతానంద రూపా!
ఏ లోకము నుండి రాక ఎవరి బిల్పు నీ కేక
మాదు ప్రణయ పంజరపున్ మరుగై వచ్చిన చిలుకా!
మా ప్రేమరసాల యంటుమామిడి చిగురుల మొలకా! ...
కాయికు మన్నంట దెండ కన్నెరుగవు మహా భోగివి
చెదరని తపస్సమాధిని నిదురించుచు నగు యోగివి ....''[2]

అని వర్ణించుటలో వాత్సల్యముప్పొంగుచున్నది. మరియు లక్ష్మి విప్రలబ్ధయై వచ్చిన పిదప దంపతులు పిల్లవాని నెత్తుకొని ముద్దాడుచు పాడుకొనిన 52 వ గేయము నందును వత్సల రసము జాలువారుచున్నది.

కావ్యము నందీ విధముగా శృంగారము ప్రధానముగా భాసిల్లి కరుణ శాంతాదులు కొంత కొంత నిర్వహింపబడి చదువ చదువ చవులూరించు చున్నది.

1. విప్రలబ్ధ : 46 వ గేయము, పుట 110, 111
2. ,, : 40 వ గేయము, పుటము 84, 85

# హాలిక జీవన చిత్రణము, ఇతర వర్ణనలు

విప్రలబ్ధ కర్షక జీవన చిత్రణము కావించు నవ్యకవితా విలసిత భవ్య కావ్యము. వరదాచార్యులవారికి గ్రామీణ ప్రకృతి యన్నను కర్షక జీవనమన్నను మక్కువ యెక్కువ. ఈ విషయము పోతన చరిత్రములోను, అంతకు ముందటి ఖండ కావ్యములందును గమనించితిమి. ఈ కావ్యమునందు హాలికదంపతులను నాయికా నాయకులను జేసి వారి ప్రణయేతివృత్తము పెనవేసికొని యున్న హాలిక జీవనమును సహజ రమణీయముగా చిత్రించినారు. కావ్యము చిన్నదైనను సందర్భము కల్పించుకొని సూర్యోదయ సూర్యాస్తమయ వర్షాది వర్ణనలను భాసురముగా గావించినారు. వీనిని క్రమముగా చర్చింతును.

## హాలిక జీవన చిత్రణము :

కావ్యమున హాలిక జీవన చిత్రణము పదునైదు గేయములలో పసందుగా చేయబడినది. రైతు తెల్లవారి లేచినది మొదలుకొని చేలకు వెళ్లి సూర్యాస్తమయమున కింటికి చేరవచ్చు వరకు చేయు వ్యవసాయపు పనులు మరియు దున్ని నారు పోయుట, వానల కెదురుచూచుట. నాట్లు వేయుట, కలుపు తీయుట, పొలము కాపలి యుండుట, పండిన వరిని కోయుట, బంతి కట్టుట, ధాన్యమును తూర్పార బట్టుట, బండిలో ఇంటికి తెచ్చుట, గుమ్ములలో నింపుట-అను ఈ కృషికార్య సరణి యెల్ల నిసర్గ రమ్యముగా వర్ణింపబడినది. ఈ వృత్తిలో రైతు ఎదుర్కొను కష్టాలను, ఇల్లాలి సహకారములను సరసాలను ఆనందమును మనోజ్ఞముగా వర్ణించుట జరిగినది. కృషి జీవన చిత్రణము గావించిన యిందలి గేయములు దాదాపు 'ఆహ్వానము' ఖండకావ్య సంపుటిలోని 'రైతురాజు' గేయనాటికలోనివి కావున వీనిని గురించిన చర్చ ఆ వ్యాసమున కొంత కావింపబడినది ఐనను కొంత విపులముగా ఇచ్చట చర్చ జరుగును.

రైతురాజును మేలుకొలుపుటకు కవి సుప్రభాతము పాడిన విషయము, కావ్యము కర్షక నాయకుని సుప్రభాతముతో ప్రారంభమయిన విషయము సమ్మోజసముగా నున్నది.

"నిద్ర లేవోయి ఓ రైతు రాజా!
లేగ-టావుల్లు పాల్చేపి యంభారవశి పిల్చు"[1]

అని యరుణోదయ వర్ణన చేయబడినది. శ్రీ వెంకటేశ్వరుని సుప్రభాతములో మునులు భక్తులు నిలిచి పిలుతురు. కాగా మన రైతురాజును లేగటావులంభారవ ములతో పిల్చుట సహజ సుందరమైనది.

రెండవ గేయమున రైతురాజును కవి సాదరముగా ఆహ్వానించును
"నీవు రావోయి ఓ రైతురాజా!
మాకు పాడి పంటలొసంగి భారతావని నేల"[2]

అని యాహ్వానించుటలో చక్కని సార్థకత కలదు. రైతు రాజయినపుడతడు పాడి పంట లిచ్చి భారతదేశము నేలుననుట యుక్తియుక్తము. ఇట్లు రైతును రాజుగా రూపించి రాజునకు జరుగు గౌరవ మర్యాదలను ప్రకృతియే స్వయముగా చేయుచున్నట్లభివర్ణించుట జరిగినవి.

"రవి శశియు నిత్య నీరాజనములీయగా పవనుండు తరులతా చామరము వేయగా
నవమోహనమ్ములౌ నాగేటి వృషభముల్ నందీశ్వరులుగాగ నటరాజ మూర్తివై"[3]

రైతు పొలాలకు బయలుదేరి పోవునప్పుడు సూర్యుడును, తిరిగి మాపటికింటికి వచ్చునప్పుడు చంద్రుడును ఉదయించుచుండుటను హారతులిచ్చుచున్నట్లుగా భావించుట రమ్యముగా నున్నది. అట్లే వాయువే చామరములు వీచును. ముందు నడచు గిత్తలు నందీశ్వరులు కాగా రైతు నటరాజమూర్తియై ఠీవిగా సాగిపోవును. ఇంకను అతడు హలము దాల్చిన బలరామునిగా, కుఠారము ధరియించిన పరశురామునిగా, సీతా సమేతుడైన శ్రీరాముడుగా, పగ్గాలు ములుకోల దాల్చిన పార్థసారథిగా అగ వడునని యెంతో ఉదాత్తముగా వర్ణించుట జరిగినది. అతడు తాకిన భూదేవికి మైపులకలేపారుననియు అతడంటినంత గోమాతకు పాలచేపులు మీరుననియు ఆకాశగంగయే అతని కభిషేక మొనరించుననియు లక్ష్మీదేవి అతని హస్త పద్మమున ఉద్భవించుననియు ఉత్కృష్ట భావ బంధురముగా వర్ణించుట జరిగినది. అతని వేషమిట్లు కనులకు గట్టినట్లు చిత్రింపబడినది.

1. విప్రలబ్ధ : 1వ గేయము పుట 1
2, 3 " : 2వ గేయము పుట 3

"చెకుముకిల సంచితో జాలెమొలపట్టతో
కిఱ్ఱు చెప్పులతోడ తుఱ్ఱాయి పాగతో
క్షామాగ్ని జల్లార్చు చెమ్మటల జాలుతో వరలు
గొంగడి మేన వజ్ర కవచమ్ముగా''[1].

ఇందు 'క్షామాగ్ని చల్లార్చు చెమటలతో' యనుటలో రైతుచేయు కృషి విలువ యెంతటిదో విశదమగును. రైతురాజిట్లు రాజిల్లగా రైతురాణి రాణించిన విషయ మిట్లు వర్ణింపబడినది. రైతురాజు నాహ్వానించి తర్వాత రైతురాణిని కవి సాదరముగా నాహ్వానించును.

"బంతిపూల కొప్పులతో పచ్చబొట్ల యొప్పులతో
ఒల్లియకాసెపై వెండి బిళ్ళల మొలకట్లు మెరయ
అమృతము గొను మోహినివన నంబలిదుత్తం దలనిడి
పల్లియ లక్ష్మి లోకులనెల్ల సాకు అన్నపూర్ణ
రావే దొరసాని! రావే దయబూని''[2]

రైతు లక్ష్మి మన కనులముందు శోభిల్లుచున్నది. అంబలిదుత్త తలపై గల ఆమె కవిమహిమాన్విత వాగ్దర్పణములో అమృతము గొను మోహినిగా భాసిల్లుచున్నది. పల్లెలక్ష్మి యగు ఆమె పంటలు పండించి లోకుల కందజేయుటచేత అన్నపూర్ణ యైనది. ఆమె ఇంక ''కోతల పాటల వాణి కొడవలిగొను శర్వాణి పాడిపంటలను భువిపై ప్రసాదించు శ్రీపాణి'' యని వర్ణింపబడుటచేత ముగురమ్మల మూలపుట మ్మగా విరాజిల్లుచున్నది.

"ముసి ముసి నవ్వులతో నల్దెసల బర్వి వాల్చూపుల
నొసటం దిద్దిన కుంకుమ పసలుదయార్కుల నీనగ"[3].

ఆమె సొగసులు వెనజల్లుచున్నది.

తరువాతి గేయములో రైతు హలమును పట్టి దున్నుమని ఆత్మప్రేరణ చేయును.

1. విప్రలబ్ధ : 2 వ గేయము. పుట 4
2. " : 3 వ గేయము, పుట 6
3. " : 3 వ గేయము. పుట 6

"దున్నవోయి దున్ను మడి దున్నవోయి దున్ను
వడిగల గిత్తలగట్టి హడా ! హై ! కహ్-కెయ్యన"[1].

రైతు దున్నుటలో గల శ్రమ, ఉద్దేశము, కాపు విలువ వర్ణింపబడినవి

"వంతల మిట్టలబాపి-అంతా సమమొనరించి
అందరకును సమజీవన మందుబాటులో నుండగ"[2].

అని యనుటలో సామ్యవాదము ద్యోతక మగుచున్నది.

"కాపే లోకమునకంత కాపటంచు కొలువసాగ
కష్టే ప్రాణులకు జీవగఱ్ఱ యంచు తెలిసిరాగ"[3].

అని వర్ణించుటలో కాపు విలువ సువ్యక్త మగును. అతడు చలిగాలికి స్థాణువై యెండకు వజ్రియై జడివానలలో హిమశైల శిఖరముఖ్యుడై యొప్పుననుటలో అతని పరిశ్రమ యెంత కష్టతరమైనదో లోకులకు గుర్తు కాగలదు.

పొలము దున్ని వానకై ఎదురు చూచిన విషయము నితాంతరమణీయ ముగా వర్ణింపబడినది.

"నీవు రావోయి ఓ వానదేవా ! నీవు రావోయి ఓ వరుణ దేవా !
ఇంటివర కొకసారి రావా ! మా పంటచేలను జూచి పోవా !"[4]

అని దీనముగా ప్రార్థించిన ఈ గేయమున వర్షామేఘము విపులముగా విశిష్టముగా వర్ణింపబడినది.

"మెరపుటంకుశ మూని మబ్బుటేన్గుల నెక్కి
బడబడా యురుములా బాజాలు మ్రోగంగ
సరదాగ మబ్బుల్ల పరదాలు తీసికొని
రంగారు సింగిణీ రాచగుమ్మము దాటి
గడగడా ఉరిమేటి పిడుగు రాళ్ళవి తాకి
పచ్చి కడవల మబ్బు విచ్చిపోయి కురువాలె"[5].

---

1 విప్రలబ్ధ : 6 వ గేయము, పుట 11
2. " : 6 వ గేయము, పుట 11
3. " : 6 వ గేయము, పుట 11
4. ,, : 7 వ గేయము, పుట 13
5. ,, : 7 వ గేయము, పుట 13

అని యీ రీతిగా మనోజ్ఞ రూపకమున జలదము సాక్షాత్కరింపజేయబడినది. ఆ మేఘుని రాకకు మండూకములు వేదమంత్రాలు చదువును. చలిగాలి సుస్వాగత మొసగును.

"కోట్ల ప్రాణులు బిలువ కొండెక్కి కూర్చొనక
ఆకాశ భవనాల అంతస్థులన్ని దిగి''[1].

అన్నప్పుడు రాజ్యమదాంధుడైన రాజును గద్దెదిగి ప్రజలచెంతకు రావలసినదన్న హెచ్చరిక ధ్వనించుచున్నది ఈ గేయమున మరికొన్ని విశేషాలు తెలుపబడినవి.

"బండమీద వరదపాశమే పోశాము పాండవులకథలన్ని పాడి త్రాగేశాము"[2]

అనుటలో వానలు కురియని కరవులో బండమీద వరద పాశము పోయుట, పాండవుల కథలు ముఖ్యముగా విరాటపర్వకథ చెప్పించుకొనుట ఆచారమన్నది తెలుపబడినది. రైతులు "ఇంటిలోని గింజలు మంటిలో బోసి మింటికేయి చూచి కంట నీర్వెట్టుట' సహజము. "పకల నెత్తినబెట్టి బడికి పోవు పాపలకు వానచినుకుల మింటితేనె రుచి చూపాలె' ననుట, "చల్లనగు నీ వానజల్లులకు తడియైన మట్టి సౌగంధ్యమెద మత్తెక్కజేయాలె" ననుట కవిగారి లోకజ్ఞతకు, ప్రకృతి పరిశీలనకు నిదర్శనము.

వానదేవునికి దయవచ్చి కురిసెడు వర్షమును రైతు ఆనందాతిరేకముతో పాడుకొనును.[3]. మొలిచిన వరినారు నాటువేయుచు రైతు పాడుకొనును.

''నాటువేయవోయ్ పొలము పాటు జేయవోయ్
కాటువేయ జూచు కరవు కాలసర్ప విషౌషధుల''

అని నాటువేయు పద్ధతిని బహుభంగుల భావించి వర్ణించుట జరిగినది.

''అభ్యుదయ నిరోధకమీ యధిక సంతు వలదనుచును
విడి విడి యడుగుం దూరము నడుమున నొక్కొక్క కట్టను
బలము గల్గి జీవించే కొలదిమంది యైననేమి
బలహీన శతాల మించి ఫలవంతమ్మగు నిటులన''[4].

1. విప్రలబ్ధ : 7 వ గేయము, పుట 14
2. ,, : 7వ గేయము, పుట 14.
3. ఈ వర్షవర్ణన గూర్చి మునుముందు వర్ణనలలో చర్చింపబడినది.
4. విప్రలబ్ధ : 9వ గేయము, పుట 18

అని వర్ణించుటచేత నేటికాలమున ప్రబల ప్రచారములోనున్న పరిమితకుటుంబ ప్రయోజనము ప్రబోధింపబడినది.

లక్ష్మీరాముల కనురాగము కలిగిన తొలినాళ్ళలో రాముడు లక్ష్మిని మధుర వేదన పాలుచేయుటకు కొడవలిని దాచిపెట్టిన సన్నివేశము 13వ గేయమున వర్ణింపబడినది. నాయికా నాయకులు తమకు సహజమైన వృత్తికనువైన కొంటె చేష్టలు చేసికొన్నట్లు వర్ణించుట సముచితమైనది.

స్వచ్ఛంద ప్రణయజీవులగు లక్ష్మీరాములు వనదేవతల సాక్షిగా పొలము తలమున పెండ్లిచేసికొందురు. ఆ పెండ్లికి రాముడు వ్యవసాయ పరికరముల నుపయోగింతమనుట సమంజస విషయము.

"బ్రతుకు సంసారంపు బండి బరువెంతైన ఏకమై నాగేటి యెడ్లోలె మోస్తమని

పేర్మి నాగటి కాడి పెండ్లి పీటలమీద కూచుండి పెండ్లాడి లేచివత్తాము"[1] మరియు "భూదేవి సాక్షిగా గోదల్ల సాక్షిగా...."[2] ప్రేమ పెట్టుకొన్నాననును రాముడు.

వరి చేలెదుగుచుండ వానలు మరల కరవైనప్పుడు విద్యుద్యంత్రాలమర్చుకొని నీళ్ళు పారించుకొందురు. అట్టియెడ విద్యుచ్ఛక్తిని ఆకాంతిని రాముడనేక విధముల వర్ణించి తన యానందము ప్రకటించును. కొన్నాళ్ళకు రాముడు కలుపు తీయుటకు లక్ష్మిని పిలుచును.

"కలుపు తీయరావేమే కాపోరిపిల్ల-నీకంకణాలు గాజుల్లు ఘల్లుఘల్లుమనగా" అని ప్రారంభించి ఆకలుపు తీయుట యెట్టిదో దిగువరీతిగా ఉదాత్తభావనతో వర్ణించును.

"పయట నడుముకుజుట్టి చేత కొడవలిబట్టి దుష్టశిక్షణచేసే అష్టభుజ కాళికవై
మన భూమియందేమి పరజాతి యాస్వామి నరికివేసెదనన్న నారి ఝాన్సీవగుచు
దేవతల దాగాడు రాహుకేతుల వెదకి నరకు మోహినివోలె పెరికేయవలెతుంగ[3].

1. విప్రలబ్ధ : 16వ గేయము, పుట 33
2. ,, : 16వ గేయము, పుట 34
3. ,, : 27వ గేయము, పుట 57

ఈవిధముగా కలుపుతీయు కాపుపడుచులో పౌరాణిక చరిత్రాత్మక భావనలెన్నియో చొప్పింపబడి కలుపుతీయుటలోని అత్యగత్యమును వెల్లడిచేయుచున్నవి.

రాముడు పొలము కావలికాయుచు ఆకలిబాధతో చద్దిగొనితెచ్చు లక్ష్మికెదురు చూచును. మధురోహలు చేయును. కొండెక్కి పిలుచును. కొమ్మయెక్కి చూచును. ఆకలిమంట కలమటించును. అంతలో లక్ష్మి చద్దితెచ్చి దానితోపాటు వలపునందించును. అతడు తినుచుండగా లక్ష్మి మంచె యెక్కి పిట్టలను కొట్టుచు అతనివైపు ఓరచూపులు నవ్వులు విసురును. వాని కతడోర్వలేక తల్లడిల్లుచు బతిమాలును. తదుపరి రాముడు కావలి కాయుచు రాత్రులలో పొలము వద్దనే గడుపుచు లక్ష్మి యెడబాటు భరించలేక పరిపరివిధాల తపించును.

లక్ష్మి గర్భవతియైన విషయము వ్యంగ్య చమత్కారము తెలుపును" పర వానిగా నన్ను పరికింతువేల యన వరిపొట్ట కొచ్చెనని" లక్ష్మి చిరునవ్వు నవ్వుట మరియు 'వరి గింజలను త్రవ్వేల్లగొని కన్ను మూసికొని సామియని నుదురాని సరి చేసి యెంచుట' వంటివి గర్భవతులగు కాపుపడతులకు సహజ చేష్టలు.

వరి కోతకు రాగానే రాముడు "వచ్చెను కోతకు వరిచేలు ఫలమిచ్చెను గింజకు పదివేలు" అనుచు కోత పట్టించును. ఇక్కడ పండిన వరి గింజలను

"వసుధా దేవిని వరించి దేవుడు పసిడి యక్షతలు పారజల్లెనిక
తుట్టా దాలిచి దొరయై కురియును కట్టుకట్టయును కనక వర్షములు....
కోసుకొనుము నీ చేసే శ్రమకిదె దాచుకొనక వెలబోసె వసుంధర....
చీమ మొదలు భూస్వాముల వరకు రక్షించే వరి లక్షిమి పంటల"[1]

అని వర్ణించుట వలన రైతు చేసిన కష్టానికి తగిన ఫలము భూదేవి ప్రసాదించిన దనియు, వరి లక్ష్మి పిపీలికాది ప్రభుపర్యంత మందరికి అన్నమిచ్చి కాపాడు ననియు కష్టమూల్యము విశదపరపబడినది.

రైతుకోసిన వరి కుప్పలను బంతి కట్టును. ఇది యెంతో కమనీయముగా వర్ణింప బడినది. ఎడ్లు బంతిలో వరి కుప్పకు చుట్టు దిరుగుట ఇట్లు ఉత్ప్రేక్షింప బడినది.

"దైవము గుడిచుట్టు సరి ప్రదక్షిణాలు చేయ చేయ
ఫలము పొందుననగ ఎడ్లు వరి కుప్పకు చుట్టు దిరుగ"[2]

1. విప్రలబ్ధ : 34వ గేయము, పుట 72, 73
2. ,, : 35వ గేయము, పుట 73.

ఆస్తిక వర్యులగు ఆచార్యులవారికి ఏది చూచినను దైవత్వము గోచరించును. మరియు తల్లి తాను నోరు కట్టుకొని దాచి పిల్లలకిచ్చునట్లు మూతులకు బుట్ట లొప్పుగా ఎడ్లు వడ్లు రాల్చుననియు గడ్డి కుప్పమీద చేరి మాటి మాటికి గడ్డిపరచు రైతు మేరుగిరిపై విరాజిల్లు శ్రీ విష్ణువువలె నున్నాడనియు వర్ణించుట రమ్యముగా నున్నది.

"బంతి భోజనము చేయుచు ప్రపంచ మానవు లెల్లరు
'అన్నదాత సుఖీభవ'యని దీవెనలను బెట్టగ"[1]

అనుట వలన మానవులందరికి రైతే అన్నదాతయను వాస్తవము వెల్లడి చేయబడినది.

బంతి కట్టిన వడ్లను కుప్పబోసి రైతు తూర్పారబట్టుటకు లక్ష్మిని పిలుచును
"తూరుపారాబట్టరావే అందాల దొరసాని నాయింటి రాణి ఓ లచ్చి
తూరుపారాబట్టు దుమ్ములో నిను జూడ మబ్బుల్ల చందప్ప మన చేల దిగి వచ్చె
లలిగాలి నీ కొంగు లాగి ఆరడిచేయ సిగలోని మలెమొగ్గ సిగ్గొచ్చి నవ్వింది"[2]

ఈ రీతిగా సరసముగా సాగిన యీ వర్ణనలో తూర్పారబట్టునప్పటి యందచందము లెన్నో చిత్రింపబడి కవిప్రతిభ చేత సామాన్యమైన ఆ పని మాన్యమై మనోజ్ఞమై యొప్పారుచున్నది.

ఇక ధాన్యము నింపిన బండి నింటికి తెచ్చిన యుదంత మత్యంత స్వాంతా వర్జకముగా వర్ణింపబడినది.

"బండొచ్చెనండి బండి రెండెడ్ల చక్కనిబండి
నిండు గర్భవతివోలె బండి వచ్చెనండి"[3]

అని రైతు హర్షాతిరేకముతో పాడుకొనును.

"భూపాలుర భాగ్యాలు వ్యాపారుల రత్నాలు
మన పాలిటి శాస్త్రాలు ఈ బండిపైనె ప్రాలు

1. విప్రలబ్ధ : 35 వ గేయము, పుట 74
2. ,, : 36 వ గేయము, పుట 75
3. ,, : 37 వ గేయము, పుట 77

కర్షకుని చేతికష్టం వర్షాధినేత యిష్టం
భూజనులదగు అదృష్టం ఈ బండితోనె స్పష్టం"[1]

ఈ వాక్యముల వల్ల సమస్త లోకుల బ్రతుకులు రైతు పండించిన ధాన్యము వల్లనే సాగుననియు, ఆ పంటకు మూలము రైతుచేతి కష్టము, వానదేవుని దయ, ఇంతకు అనుభవించునట్టి ప్రజలు చేసికొన్న పుణ్యమని చెప్పుటవలన వ్యవసాయ మూల్యము తెల్లమగుచున్నది. సమాజములో రైతుకుగల అత్యంత ప్రాధాన్యము దిగువ వాక్యముల వలన తెలియుచున్నది.

"జనతాన్న వస్త్రదాత పశుపాలనాగ్రనేత
మనకెల్ల ప్రియ భ్రాత రైతన్న కెపుడు జోత........
రైతన్న లేని రోజు మన జీవితాలు క్లోజు
పోతన్న రైతురాజు వారంటె ప్రజకు మోజు"[2].

పోతన్న రైతురాజై గణుతి కెక్కినాడు కావున రైతన్నలలో పెద్దన్న పోతన్న. ఈ గేయములలో రైతన్న కేకాక కృషిలో పాలుపంచుకొను బసవన్నలకు, వర్ష న్నకు, కృతజ్ఞతతో నమస్సులిడుట మిక్కిలి యోగ్యమైన విషయము.

రైతు బండ్లనుండి వడ్లుతోడి గుమ్ములు నింపుచు ఈ విధముగా పాడును.

"తోడండి తోడండి వడ్లు తోడండి భూదేవి గోదల్లు మనకు తోడండి
ఘోరమగు లేమికి గొయ్యి తోడండి పైరుపచ్చల కెపుడు నీరు తోడండి"[3].

అని యీ రీతిగా వడ్లు తోడుటలోని విలువ చక్కగా వక్కాణింపబడినది. ఈ పాట జానపద గీతమువలె గుమాయించుచున్నది.

ఇంతటితో రైతుకృషి జీవిత చిత్రణము పూర్తి యగుచున్నది.

## పల్లీయ ప్రకృతి వర్ణన :

ఇక పల్లెపట్టుల యందచందములు, గోవుల ప్రశంస, గ్రామీణ యువతుల సోయగములు, మంచెలపై వారి కాపుదలలు, చేలలోని విశేషాలు ఎన్నెన్నో శుక

1. విప్రవలబ్ధ : 37 వ గేయము, పుట 79
2. ,, : 37 వ గేయము, పుట 79
3. ,, : 38 వ గేయము, పుట 79

సందేశములో వర్ణింపబడినవి. లక్ష్మి చిలుకతో రాయబారపు మాటలు చెప్పుచు తమ అత్తగారి యూరు చేరినప్పుడు కన్పడు పల్లీయ విశేషములను వర్ణించి చెప్పను గ్రామ సీమలలోని పంటల గూర్చి

"ఆడాడ వరికుప్ప లాకాశముల నొరయు
బంతులన్ కోతలన్ పైడి వర్షము కురియు
ఆకలిని బోకార్చు నమృత బిందుల లాగు
పాల్దాగి జొన్న చేల్ పరవశించుచు నూగు"[1].

ఇట్లు వరికుప్పలను జొన్నలను విశిష్టముగా దర్శించి కోడెల ఆబోతుల లేగల ఆటలు సహజ సుందరముగా వర్ణించుట జరిగినవి. ఈ సందర్భమున చేసిన గో ప్రశంస మిక్కిలి ప్రశస్తముగా నున్నది.

"ఆవులు కొట్టములో కడుపునిండ గడ్డిమేసి కనులరమూసి నెమరువేసి కునుకుచుండగా పిడుదులుపట్టి పొదుగునెత్తురు ద్రాగుచుండును. అట్టి పిడుదులను పొడిచి యేరివేయుము పుణ్యముండు"నని చిలుకకు లక్ష్మి చెప్పను. గోమాతను కొనియాడుచు నిట్లనును.

"అమ్మ పాలిస్తుంది అవల చాలిస్తుంది తమ్ముడౌ
తువ్వాయి దగునోరు గొట్టి నా
కపిల పాలిస్తుంది ఎపుడు పాలిస్తుంది మావంటి రైతులకు గోవుల్లే దేవుళ్ళు
పాడిపంటలు గోవు నీడలోనే సుమ్మ మాలచ్చి మేదైన గోలచ్చిమే నమ్మ
రెక్కలును బక్కలును రెండు చల్లంగుంటె
కుక్కలెన్నీ దింటె కూటి కరువేటంటె"[2].

మాత కొన్నాళ్లే పాలిచ్చి మానుకొనును గాని గోమాత జీవితాంతము పాలిచ్చి పోషించును. గోవు, లక్ష్మి వంటి రైతులకే కాదు మానవులందరికిని దేవతయే. పాడిపంటలన్నియు గోవుల వల్లనే వర్ధిల్లు ననుటలో అవని జనమునకు కబళ మన్నము దొరకుటలో గోవులు ముందు రైతులు తర్వాత అనుటలో గోప్రశస్తి విదితమగును. ఇక నందులవంటి పసుల మందలోని కోడెల ఆవుల ముద్దుగుల్కు

1. విప్రలబ్ధ : శుక సందేశము, పుట 96
2. ,, : శుక సందేశము, పుట 98

మూపురములపై వ్రాలు నల్లపిట్టలు నవయువతి చనుమొనలవలె కనబడు ననియు, నంది మూపెక్కి ఏ పురమునకొ పోవు శివలింగ రూపముగా మూపురము శోభిల్లు ననియు, ఎడ్లపై వ్రాలు పక్షులగుంపు శుక భరద్వాజ కులము సేవింపునకు వచ్చి నట్లు కన్పడుననియు ననేక విధముల సుందర భావములతో నభివర్ణించుట జరిగి నది. గొఱ్ఱె మూకలగోల బళే చమత్కారముగా నిట్లు వర్ణింపబడినది. తెల్లని చలువ బట్టలమూట చాకెతలు కొనిపోగా చూచి కంబళ్ళ మూటలకు కనుగుట్టెనో యనగ గొఱ్ఱెలొకే గోలచేయుచు కాలి ధూళిచేత దిశలను గప్పుచుండుననుట మనోజ్ఞముగా నున్నది.

పల్లె తల్లుల తరుణీమతల్లుల చందమిట్లు వర్ణింపబడినవి.

"పాలు చేపులు రాగ పయట కెంగులు తడువ
కూలి పడుచులు ఇండ్లకుంజేరగా నడువ
త్రుళ్ళిపడ బిగిచనల్ కొంగు నడుముకు జుట్టి
పడుచు లేగుదురు నీర్కడవలం దలపెట్టి"[1]

పట్టణభామిను లన్నచో శిస్తుగా సింగారించుకొని వినోద కాలక్షేపము చేయుచు విశ్రాంతి కలిగింతురుగాని పల్లెటూరి పడుచులు తమ పని పాటులలో నుండియే సహజ సౌందర్యముతో చెలువు లొలికించుచుందురు. జొన్న చేలలోని బెదరుబొమ్మ యిట్లు చిత్రించబడినది.

"మన జొన్న చేలలో దినమంత రాత్రంత కఱ్ఱ భుజమున బూని బుఱ్ఱ మీసాలతో
కదల కుండా నెపుడు కావలుండొక మనిషి అదిరి పోబోకు సుమి బెదరు బొమ్మ అదొకటి"[2]

బెదరు బొమ్మను జూచి మనుష్యులే బెదరుదురు. పక్షులు బెదరకుండునా? అందుకే యీ ప్రబోధము. పల్లెలను పంట చేలను పనిగట్టుకొని పట్టిగ వర్ణించుట కంటె ఇట్లు కథామూలముగా వర్ణించుటవల్ల రమ్యతరమై రసవంతమై యొప్పు చుండును. చేలలో మంచెలపై కాపున్న కాపుపడుచులు చూపు గురిపెట్టి మరుని విండ్లేయుటలోను ఒడిసెల గుండ్లేయుటలోను వలంతులై శృంగార పీఠాల రంగ

1. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 99
2. ,, : ,, , పుట 100

రించిన కనులతో ఆకర్షింతురని వర్ణించుట జరిగినది. చేనిలోని జామచెట్టు రసికుల నెంత ఊరించుచున్నదో తిలకించుడు.

> "బావి ప్రక్కన జామపండ్లు చెట్టున్నాది ఒక పడుచు పిల్లట్టు లూరించు నిన్ను అది
> బావి నా పండ్ల కొమ్మల బింబములు పడును రవికూడ్చి నీరాడు రమణులై కనబడును"[1]

ఓహో! యేమి ప్రకృతి పరిశీలన!, ఏమి భావనా సౌందర్యము! చేతనములకే కాదు జడములకు సైతము శృంగార ముప్పొంగజేయుచున్నదిది. ఇట్టి జామ పండ్ల వర్ణన వలన చిలుక తప్పక నోరూరి రాయబారానికి బయలుదేరి పోగలదు. ఈ విధమైన పల్లీ ప్రకృతి వర్ణనచేత కావ్యము కడుంగడు వైశిష్ట్యమును సంతరించుకొనుచున్నది. కర్షక జీవనమును, గ్రామీణ ప్రకృతిని ఇంత సహజ రమణీయముగా చిత్రించిన కావ్యములు దువ్వూరి రామిరెడ్డిగారి 'కృషీవలుడు' వంటి రెండుమూడు కంటె నెక్కువగ లేవు. ఇటీవల వెలసిన శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యుల వారి 'రైతు రామాయణము' కర్షక జీవితమునకు, గ్రామీణ ప్రకృతికి నిండుగా మెండుగా నిధానమై నెగడుచున్న మహా కావ్యము.

## ఇతర వర్ణనలు :

కావ్యమున ఇతర వర్ణనలలో సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు, వర్ష వర్ణన, చంద్రవర్ణన, సెలయేటి వర్ణన ప్రధానమైనవి. వీని కనుబంధముగా తిరుపతి క్షేత్ర వర్ణన, విద్యుత్కాంతివర్ణన, శిశువర్ణన మున్నగునవి సాక్షాత్కరించును.

## సూర్యోదయ వర్ణన :

విప్రలబ్ధలో సూర్యోదయవర్ణన రెండు సందర్భములలో కావింపబడినది. కావ్య ప్రారంభమున రైతురాజును నిద్రలేపుటకు కవి సుప్రభాతము పాడుటలో, శుకసందేశములో శుకమును సూర్యోదయవేళ బయలుదేరుమన్న సందర్భములోను ఈ వర్ణన కలదు. సుప్రభాతమునందలి యరుణోదయము సుందరతరమై భాసిల్లుచున్నది. ఈ వర్ణన యెల్ల రైతురాజును ప్రకృతి యుపచరించుచున్నట్లు సాగినది.

1. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 101

"ప్రాక్సతియు నొకవంక పైడి పళ్ళెరమూని తారకామణి దీపనీరాజనము లిచ్చు

అడుగులకు మడుగులే యర్పించు పచ్చికలు పరచు హిమబిందువుల పాద్యక్రియ లొసంగు"1

అంభారవముతో లేచు హాలికునికి ప్రాక్సతి సంధ్యారాగ శోభితమగు ఆకాశమును పైడి పళ్ళెరముగా గ్రహించి తారలను మణిదీపములచేత హారతులిచ్చుననియు, పరచుకొనియున్న పచ్చికబయళ్ళు అడుగులకు మడుగు లర్పించుననియు కురిసిన హిమబిందువులు పాద్యమొసగుననియు రూపించి వర్ణించుట శుభోదయముగా సుందరముగా నున్నది. మరియు,

"పూర్వదిశ నరుణిమలు పుంజురాయళ్ళగుచు గళమెత్తి కొమ్ముూది జయ గానముల బాడు

చూచుచుండగ వేగుచుక్క తొలిదెస పొడిచి కటికచీకటి గుండె గాయ పరచెను స్వామి"2.

కొక్కొరోకోయని గొంతెత్తి కూయు పుంజులను తొలిదెస ఎరుపులే రూపుదాల్చి జయగానములు పాడుననుట అపూర్వముగా నున్నది. చుక్క ఉదయించుటను పొడుచుట యందుము. దీనికి క్రుమ్ముట యను నర్థాంతరము గలదు. ఈ అర్థ ద్వయముతో ఈ పదము ప్రయుక్తమై ఆ వేగుచుక్క కటికచీకటి గుండెను గాయ పరచెననుట సరసముగా నున్నది. పొడిచి గాయపరచుట వల్ల రక్తముస్రవించును. దాని వల్లనే తొలిదెస యెరుపన్నది గ్రాహ్యము. ఇట్లే చీకట్లు గబ్బిలపు మూకలై తలవంచెనని రూపింపబడినది. చుక్కలదృశ్యమైన విషయమెంత చక్కని భావన గావింపబడినదో తిలకింపుడు.

"చుక్కలన్నియు మంచుముక్కలై పచ్చికలపై వ్రాలె ముత్యాల పారజల్లిన లీల"3.

ఇట్టి అరుణోదయమును కావ్యజగత్తులో నిత్యము కాంచినను తనివి తీరదుకదా! ఇంకను సూర్యోదయవేళ పద్మములొకింత కన్నులు విప్పగా కొమ్మలు పికముల గళములు విప్పి కమ్మగా సుప్రభాతములు పాడునని వర్ణింపబడినది.

1. విప్రలబ్ధ : 1 వ గేయము, పుట 1
2, 3. ,, : 1వ గేయము, పుట 2.

ఇక శుకసందేశ సన్నివేశములో

"తొలి దిక్కు తన నుదుట తిలకమ్ము దిద్దుకొని
నీ విజయసిద్ధికై నివ్వాళి బట్టినది
ఇదియే శుభోదయము ఇదె సన్ముహూర్తమ్ము
కదలి రమ్మిక రెక్క విదలించి లేలెమ్ము"[1].

ఉదయించిన సూర్యబింబము పూర్వదిక్సతినుదుట తిలకమువలె చెలువొందుచున్న దనుట రమ్యముగా నున్నది. అట్టి ఉదయవేళ దిశాముఖములందు పొగలు మబ్బులు గ్రమ్ముట యిట్లుత్ప్రేక్షింపబడినది.

"వినువీథి చీకటుల వృక్షాల సూర్యుండు పగలూని కాల్చుటనొ పొగలు మబ్బులు గ్రమ్మ
నాలోకపు టింద్రనగరిసౌధాలలో అగరుధూపము లిడిరొ పొగలు మబ్బులుగ్రమ్మ"[2].

ఇట్లే ఉదయాద్రియందు గ్రమ్ము వెన్నెలమబ్బులను, హిమబిందువులను, మలయ మారుతములను, వికసించు పద్మములను, తుమ్మెదల ఝుంకారములను, తేనె పట్టులను కొల్లగొట్టు భల్లూకములను భావోదంచితముగా వర్ణించుట జరిగినది.

## సూర్యాస్తమయ వర్ణన :

శుక సందేశమున చిలుక లక్ష్మి యత్తగారి యూరు చేరబోవు సరికి సూర్యాస్తమయమగుచున్న సందర్భమున ఈ వర్ణన చేయబడినది.

"అపరాబ్ధి రవి యీదులాడుచున్నటులుండు
చెరువులో తానమ్ము చేయుచున్నటులుండు
చెవినేదొ గుసగుసలు చెప్పుచుండును గాలి
అపరదిశకుంకుమల నలికి పూయును సంధ్య"[3].

అస్తమయ సూర్యబింబ విలసనములను, మరుదంకుర రవములను ఉత్ప్రేక్షించిన తీరు బాగుగానున్నది. అన్నిటికంటె రాగరంజితమైన సంధ్య పశ్చిమాకాశమును

1. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 92.
2. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 92
3. ,, : ,, పుట 95

కుంకుమల నలికి పూసినదనుట రమ్యతరముగా నున్నది. తరువాత అపరాబ్ధిలో సూర్యుడంతరించుట గాంచి నినుబీడి క్షణమైన నిలువలేమని కేలెత్తి మ్రొక్కి ఒతి మాలుచున్నవో యన్నట్లు కొలనిలో ముకుళించు పద్మములు తోచుచున్నవని యుత్ప్రేక్షించుట నాయికా విప్రలంభమును ధ్వనిగర్భితముగా తెలుపుచు సముచితమై యున్నది. ఇట్టి విరహావస్థ మరికొంత తెలుపబడినది. గగనలక్ష్మి భానుని ఘనవియోగములో హారములొలిచి పెట్టెలో పడవేయుననగా విహగపంక్తులు ఆకాశ వీథుల పయనించి గూళ్ళకు చేరబోవునని వర్ణింపబడినది. ఇంకను మసకచీకటు లల్లుకొనుట కూడ విరహావస్థయే యని యిట్లు తెలుపబడినది.

"విశ్వప్రకృతి మిత్రువిరహమ్ము గనలేక సంజవన్నెలచీర సంత్యాగ మొనరించి

మాసిపోయిన కోక మైదాల్చుకొనుననగ మసకచీకటులల్ల దెసలెల్ల నలముకొను"[1]

విప్రలంభముచేత తల్లడిల్లు లక్ష్మి దుస్థితి యిట్లే యుండినది. ఎద్దుపై స్వారిచేయుచు పోవు పసులకాపరి ఎట్లు నటరాజమూర్తి యయ్యెనో దిగువ గేయము రమ్యరూపకమున నుత్ప్రేక్షించి ప్రదర్శింపబడినది.

"అస్త్రాద్రి సానువుల నమరు రంగస్థలిని అరుణ సంధ్యా యవనికాగ్రమున నటియింప

నందిపై నెక్కిచను నటరాజమూర్తి యన పసులకాపరి యెద్దుపై స్వారి యై చనును"[2]

మరియు గ్రామసీమలలో సాయంవేళల పశువుల సందడి, గొల్లల అరపులు - ఇత్యాదు లన్నియు స్వభావసుందరముగా చిత్రింపబడినవి.

## వర్ష వర్ణన :

రైతురాముడు పొలము దున్ని నారు పోసి నీరు కోసము వానదేవుని ప్రార్థింపగా కురిసిన వర్షము వర్ణింపబడినది. ఇది పూర్వము కొంత చర్చింపబడినది. ఐనను మరికొంత యిచట వ్రాయుదును.

"వచ్చెను వచ్చెను వర్షాలు మా వసుధారాణికి తలంబ్రాలు
విచ్చిన పూలై ప్రజాముఖమ్ముల వెల్లివిరిసెను మురిపాలు"[3]

1,2. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 97
3, ,, : 8 వ గేయము, పుట, 15

అని పాడుచు రాముడు తన హర్షోత్కర్షమును ప్రకటించును. వానచినుకులు వసుధారాణికి తలంబ్రాలనుట లోకోత్తరముగా నున్నది. చినుకులు తలంబ్రాలవలె కనబడుటయే కాక తలంబ్రాలు పెండ్లిలో పోసికొనుట దంపతులేకమై సుఖపడి సంతానము గనుట కొరకైనట్లు వర్షాధినేత వసుధారాణి పాణిగ్రహణము చేసి చినుకులను తలంబ్రాలు పోసి సస్యశ్యామలత సమకూర్చి ఫలితమిచ్చుటకే కావున ఇక్కడ ఈ ఔపమ్యము ఔచితీరమ్యమై యలరుచున్నది. వర్షానికి ముందు కత్తులు కత్తులు కలిసినట్లు ఉత్తర దిక్కున ఉరిమి, కనుపాపలలో చెక్కని మెరసి ఆకాశ వీధి గడగడ గడగడ ఉరిమి చలిగాలి రివరివ విసరినది. ధ్వన్యనుకరణములతో గూడిన యీ వర్ణన వర్షారంభమును ప్రత్యక్షీకరించుచున్నది. వానలను వర్ణించుటలో ప్రదర్శించిన దిగువ రూపకములు వానికవియే సాటియై యాచార్యులవారి భావనా శక్తిని వేనోళ్ళ చాటుచున్నవి.

> "పాడుకరువులకు బాణాలు మా, పంటచేలకివి ప్రాణాలు మా
> కాపు కన్నులకు ముత్యాలు వరి కట్టనోళ్ళకు చనుబాలు"[1]

మరియు కురిసిన జలధారలు కోడెనాగులవోలె క్షీరధారలవలె వాగులై తోగులై ప్రవహించుట, భూసతి వానల తానములాడి పచ్చని కోకల పైట సవరిందుట, ఎద్దులు మదమెక్కి కొమ్ములతో మట్టిని జిమ్ముచు అంకె వేయుట, నెమిళ్ళు పింఛము విప్పి ముద్దుగా నాట్యము చేయుట వంటివన్నియు చెన్నుగా వర్ణింపబడినవి. వాన వెలిసిన పిమ్మట పచ్చికబయళ్ళలో మేయునట్టి ఆవులు ఆరవేసిన చీరల వలెను, గేదెలు నడచుచున్న గండశిలల వలెను కన్పడినవనుట కమనీయోపమ్యము. వానలు పడిన ఉల్లాసములో పొలము పనులు చేయు రైతును

> "కమ్మ గొడుగుతో కాపుఛత్రపతి చేలలోన భూపాలుండయ్యె
> పశుపతియై ములుకోలను బూని కరువుల పాలిటి కాలుండయ్యె"[2]

అని యనుటలో నెంతో యౌదాత్త్యమున్నది. ఛత్రము దాల్చుటవలన ఛత్రపతి (రాజు) అయ్యెననుట చమత్కారముగా నున్నది. ఈ విధముగా వర్ష వర్ణన కన్నులకు గట్టునట్లు గుండెలకు పట్టునట్లు కావింపబడినది.

---

1. విప్రలబ్ధ : 8 వ గేయము, పుట 15
2. ,, : 8 వ గేయము, పుట 16

## వెన్నెలరాత్రి వర్ణన :

లక్ష్మి వెన్నెలలో గూర్చుండి కన్నె తలపుల తేలియాడిన సందర్భమున వెన్నెలరాత్రి వర్ణింపబడినది. ఇది ప్రత్యేకముగా లక్ష్మి తన ప్రియానురాగమును తలచుకొని మధుర భావనలు చేయుటతో సమన్వయించి వర్ణన చేయబడినది.

"వెన్నెల వెలిపాల మున్నీటి కెరటాల
తారకల నాడు చందప్ప నాలోని కోరికల పూలన్ని విప్ప"[1]

అని యీ విధముగా తలపోయును. లక్ష్మి చంద్రునిలోని నలుపుటందాలు చూచి మొలక మీసపుకట్టు మొగమేదొ పొడకట్టుననియు, మబ్బులలో దాగియాడు చందమామ చర్యలు గనగా తన ప్రియుడు వెనుక నుండి వచ్చి కనుమూసి దాగు కొన్నట్లనిపించుననియు నిట్లే లక్ష్మి తలపోయుటలో నీ వర్ణన సాగినది.

మరియొక సందర్భమున శుక సందేశములో చిలుక లక్ష్మి యత్తవారి యూరు చేరునప్పటి వెన్నెల రాత్రి చంద్రవర్ణన చేయబడినది.

"ఇనుని తాపము వలన"[2] అన్న గేయ భాగమున చంద్రుని గగనమాత కుచముగా, పండువెన్నెలను పాలుగా రూపించి చెప్పుట అపురూపముగా నున్నది. అక్కడ వెన్నెలలో తెల్లగా మెరయుచు ప్రవహించు ఏరు చంద్రుడను పాలకుండ నెవరో యొలుకబోయగా వరదయై పారుచున్నట్లున్నదని భావించుట మనోజ్ఞముగా నున్నది. ఇంకను చంద్రుడిట్లు కనబడినాడు.

"షష్ఠి చంద్రుడు తాను చదల చుక్కలతోడి"[3] అను గేయభాగమున చుక్కలతోడి చంద్రుని తెల్లపిల్లల కోడిగా, వెన్నెల పాలవెల్లి ద్రచ్చగా పుట్టిన వెన్నముద్దగా భావించుట రమ్యాతిరమ్యముగా నున్నది. ఇట్లే చుక్కలు స్వర్గ నందనవనిలో పూచిన మల్లెలుగా, అప్సరసలు సంధ్య వాకిలినూడ్చి చల్లిదీర్చిన తెల్ల ముగ్గులుగా నున్నవనియు నింపుగా వర్ణించుట జరిగినది. సెలయేటి యలలలో ప్రతిబింబించు చంద్రుడు సెలయేటి బాలెంతబాలు నెత్తుకొని జోలపాడు నట్లున్నదనుట కవిగారి దివ్య భావనాశక్తికి తార్కాణ. ఇట్లనేక విధముల చంద్రుని చుక్కలను వెన్నెలను మనోహరముగా వర్ణించుట జరిగినది.

---

1. విప్రలబ్ధ: 14 వ గేయము, పుట 28
2,3. ,, : శుక సందేశము : పుట 101

## తిరుపతి క్షేత్ర వర్ణన :

పెండ్లాడిన పిదప లక్ష్మి రాములు తిరుపతి దేవుని దర్శనార్థము వెళ్ళిన సందర్భమున ఆ క్షేత్రవర్ణన సందర్భోచితముగా సంగ్రహముగా చేయబడినది.

> "చుక్కల్ని ఆడేటి చక్కన్ని స్వర్గాన్ని కన్నుల్ల కరవారగంటి తిరుపతిని
> అదుగదుగో కోవెలన్ ఇదిగిదిగో గోపురాల్
> భక్తులెల్లరు చీమబారులై మూగారు
> గుండు గొరిగించుకొని కొండనామము బెట్టి
> గోవిందయని ఒకే గోల చేస్తున్నారు"[1]

అని రాముడు లక్ష్మికి చూపి చెప్పెను. అటిటు చూడక గట్టిగా తన రెట్టపట్టుకొని నడువుమనును. వరాహ తీర్థములో సరిగంగ స్నానాలు చేసిన తాపములన్ని తీరు ననును. కుంటి గ్రుడ్డివంటి వికలాంగులకు తోచిన ధర్మాలు చేసికొమ్మనును. కొండలు ప్రతిధ్వనించునట్లు గోవిందాయని పిల్వగా గంటలు మ్రోగింపగా వినుట లేదా యనియు, ఎంతోదూరము నుండి ఆశపడిరాగా దర్శన మీయవా స్వామీ ! యనియు, దర్శించిన నిరుపేదల మొరలు సిరిగల మహారాజులకు చెవికెక్కవా యనియు వెంకటేశ్వరుని సంబోధించి వేడుకొనును.

## సెలయేటి వర్ణన :

కావ్యమున సెలయేటి వర్ణన లక్ష్మి రాములు వెన్నెలలో దగ్గరనున్న యేటి నీటిలో బోటుషికారు చేసినప్పుడు చాలనీటుగా చేయబడినది.

> "పున్నమ్మి చెంద్రున్ని మనసులో నుంచుకొని
> ఎన్నెట్లో సెలయేరు ఎన్నలా కరిగించి."[2].

అని తనలో ప్రతిబింబించు పున్నమ చంద్రుని మనసులో ఉంచుకొని కరగి ప్రవహించునన్నట్లు భావింపబడినది. మరియు సెలయేరు గల గల నవ్వుల గంప బోర్లించునట్లు, ఒయ్యారాల కడవ లొలుకబోసినట్లు ఇట్లే అనేకవిధాల విలాస గతుల సాగుచున్నట్లు వర్ణింపబడినది. ఇట్లే అది కలువలతో ఒళ్లంత కన్నులు

---

1 విప్రలబ్ధ : 19 వ గేయము, పుట 39
2 ,, : 23 వ గేయము, పుట 48

విప్పుకొన్నట్లు, నురువులై నవ్వులు విరిబంతులు వేసినట్లు - ఇట్లే అనేక విధాల ఒయ్యారము లొలుకబోసినట్లు వర్ణించుట జరిగినది. తుదకు గండ శిలలను భూదేవి వక్షోజముల జారు మేల్ముత్తెముల పేరు సెలయేరనుట రమ్యతరముగా నున్నది. ఈ వర్ణనయెల్ల నవదంపతుల ప్రణయ భావముల కనుగుణముగా సాగుట సమంజసమైనది.

## విద్యుచ్ఛక్తి వర్ణన :

వానలు కరవైనప్పుడు నీటి పారుదలకు విద్యుద్యంత్రాల నమర్చుకొన్న సందర్భమున రాముడు ఆనందాశ్చర్యములతో విద్యుచ్ఛక్తిని తత్కాంతిని వర్ణిచును.

"స్వాగతమ్మ లిదె విద్యుచ్ఛక్తీ జననీమతల్లి
మా పాలిటి కల్పవల్లి మా వెన్నెల పాలవెల్లి

అని విద్యుచ్ఛక్తికి స్వాగతము పలికి వినుతించుట గ్రామాభ్యుదయ కర్షకాభ్యుదయ కారకమగుట ప్రశస్తమైనది. ఈ శక్తి వశమగుటవలన అందని స్వర్గ మింటి యందు దిగివచ్చుననియు నందన వనములు ప్రతి గృహమున వెలయగల వనియు ఆకాశములోని తారక లవకతవకనున్న వని విద్యుద్దీపముల వరుస వెక్కిరించుచుండె ననియు వర్ణించును. విద్యుత్తు తీగెలలో పుష్పించుచున్న మణిదీపములనియు, అవి గాలికి మలగిపోని మన అదృష్ట రూపములనియు మనకిక చంద్రుల ఇంద్రులలెక్క లేదనియు విద్యుద్దీపముల నుప్పొంగి కీర్తించును. మరియు ఈ వర్ణనలో అగ్ని వాయు వరుణాది సురలు ఇకనుండి మన యింటి సేవకులనియు, ఆకాశవాణి, చలనచిత్రములు, వీవనలు మున్నగునవి విద్యుచ్ఛక్తితో నడచి సేవచేయు ననియు భంగ్యంతరముగా వర్ణించుట జరిగినది.

## శిశు వర్ణన :

లక్ష్మి కొడుకును గని సంబరపడిన సందర్భము నందును, లక్ష్మి విప్రలబ్ధయై వచ్చిన పిదప దంపతులు కొడుకును లాలించిన సందర్భము నందును రెండుచోట్ల శిశువర్ణన కావింపబడినది. ఈ విషయము రసపోషణలో కొంతచర్చించుట జరిగెను, లక్ష్మి పసిబిడ్డను గాంచి బహుభంగుల వర్ణించును. అతని హాసవిలాసాదులను చూచి

1. విప్రలబ్ధ : 26 వ గేయము, పుట 54

"ఎవరి గాంచి యీ హాసము ఏమా ప్రేమవిలాసము
ఇటు ముష్టి బిగించి పెనగుదేమా యుద్ధావేశము"[1]

అని ప్రశ్నించును. పిల్లవాడు దంపతుల మలినప్రేమరసమును మంచిచేసి వడబోసి మోహన రూపములో లోకాని కందజేయుననియు, దంపతులేతీరున ప్రేమించియు నేకత్వము నందలేకపోగా వారి తనువుల నొకటిచేసి తన రూపమున చూపించు ననియు భావింపబడెను. నీ వుంటేనే భవనం-నీవులేని యిల్లు వనం, నీవే మా ప్రేమ ధనం-నీవే మా నందన వనం" అని వినుతింపబడెను. అతని కులము మానవత అతని మత మహాయికత యని విశిష్టముగా వినుతించుట జరిగినది. పసి బిడ్డ ముద్దుల రూపమిట్లు సాక్షాత్కరింప జేయబడినది.

"భానూదయ కిరణమ్ముల పైడి తీవ యల్లికవో
నవ్వుల పువ్వుల గురిసే నందనవన మల్లికవో
వెన్నెల కాంతులె నీలో కన్ను ముక్కు మొగ మూనెనొ
చెన్నగు సుమ పల్లవతతి జీవమ్ములు పుంజుకొనెనొ"[2].

ఇట్లెంత ముద్దాడినను తనివి తీరదు. ఇట్లే కాపు దంపతులు పిల్లవాని నెత్తుకొని ముద్దాడుచు అనేక విధముల మురిసిపోవుదురు.

"పడుచు లేచుచు నురుకు పనియేదొ పాపాయి
ఎదురు గాలికి కనుల నెగయు నీలి తురాయి
ఏ రాజ్యమేలునో యీ దిసమొల సిపాయి
శ్రీరామ రక్షగా జెలగు నెపుడబ్బాయి"[3]

అని పరవశులగుట కన్న తల్లిదండ్రులే కాదు, ఈ వర్ణన విన్న సహృదయ వరేణ్యు లందరును.

కావ్యమ నందుగల మేఘ వర్ణన, హాలిక జీవన చిత్రణమునందు చర్చించుట జరిగెను.

ఈ విధముగా ఇందలి వర్ణనలు సందర్భోచితములై సుందర భావ విలసితములయి విరాజిల్లుచున్నవి.

1. విప్రలబ్ధ : 40 వ గేయము, పుట 84
2. ,, : 40 వ గేయము, పుట 86
3. ,, : 52 వ గేయము, పుట 127

# కవితా రామణీయకము

విప్రలబ్ధ వస్తువుచేతనే కాక భావసంపదచేతను విశిష్టమై వెలసియున్నది. గ్రామీణ కర్షక జీవన చిత్రణములోను, లక్ష్మీరాముల ప్రణయజీవితములోను అలంకారయుక్తమైన మధురమనోజ్ఞ భావసంపద చెలువొంది ధ్వని విలసితమై కవితా రామణీయకము సరసులకు చవులూరించుచున్నది. ఇట్టి ప్రశస్తగుణ విరాజితమైన యొక్కొక్కగేయ మొక్కొక్క కళాఖండమై అఖండ శోభలను వెదజల్లుచున్నది. ఇది జానపద గేయమాలిక యయ్యు ఉన్నతమైన సుందరమైన భావములచేత వరలుచున్న కవిత వలన ఉత్తమకావ్యమై యొప్పారుచున్నది.

భావసంపద వెలయించుటకు కవితా సౌందర్యమునకు కావ్యమున కైసేసిన యలంకారములలో ఉపమా రూపకోత్ప్రేక్షాద్యర్థాలంకారములను, అంత్యప్రాసాది శబ్దాలంకారములను ఆశ్రయించుట జగిరినది. పోతన చరిత్రమునవలెనే ఇందును అర్థాలంకారములే తరచుగా ప్రయుక్తమై శబ్దాలంకారములు సకృత్తుగనే యున్నవి. ఇట్టి యలంకారములతో విరాజిల్లు కవితా సౌందర్యమును క్రమముగా చర్చింతును.

## అర్థాలంకారములు :

అర్థాలంకారములలో, రూపకమువలె రంజింపజేయు కావ్యమున రూపకములే యత్యధికముగా ప్రదర్శింపబడియున్నవి. ఇవి ముప్పదికి మించి యున్నవి. అందు కొన్ని ముఖ్యమైన వానిని పేర్కొందు.

## రూపకము :

రైతురాజును మేల్కొల్ప సుప్రభాతము పాడిన మొట్టమొదటి గేయము రమ్య రూపకములచేత రక్తి కట్టించుచున్నది.

"ప్రాక్సతియు నొకవంక పైకిపళ్ళెరమూని తారకామణిదీప నీరాజనము లిచ్చు.... "[1].

1. విప్రలబ్ధ : 1 వ గేయము, పుట 1.

ఇత్యాదిగా గల యిందులో పూర్వదిశారమణి పసిడి పళ్ళెరము పట్టుకొని చుక్కలను మణిదీపముల హారతులిచ్చుట, పచ్చికలు అడుగులకు మడుగుబట్టలు పరచుట, హిమబిందు సముదాయము పాద్యమొసగుట అరుణోదయసమయ సహజ ప్రకృతి రామణీయకమును సాక్షాత్కరింపజేయుచున్నవి. ఈ రీతిగా ప్రకృతి రైతురాజునకు చక్కని రాజమర్యాదలు చేయుచున్నట్లు మేల్కొలుపు ప్రారంభములో వర్ణించుట సముచితముగా నున్నది. ఇట్లే పూర్వదిశలోని అరుణిమలు పుంజురాయళ్ళగుచు గళమెత్తి జయగానములు పాడుననియు, వేగుచుక్క పొడిచి కటికచీకటిగుండె గాయపరచెననియు, చీకట్లు గబ్బిలపు మూకలై తలవంచి గ్రుడ్డివారి కనులలో నివసించెననియు చక్కని రూపకములు సవరింపబడినవి.

రైతురాజును కవి ఆహ్వానించిన ద్వితీయ గేయమునందు రైతు పొలమునకు బయలుదేరు దృశ్యము రూపకముచేత సుందరతరమొనర్పబడినది. సూర్యచంద్రులు నీరాజనములీయగా, పవనుడు తరులతాచామరములు వేయగా, నాగేటిగిత్తలు నందీశ్వరులుగాగ రైతు నటరాజై ఠీవిగా దర్శనమిచ్చును.

రైతురాముడు పొలముదున్నుచు పడుపాటులను హృదయంగమము చేయుటకు

"చలిగాలికి స్థాణుడవై వడియెండకు వజ్రివియై
జడివానలు గురిసిన హిమశైలశిఖరముఖ్యుడవై"[1].

అని రూపించి చెప్పుటలో ఆతనిని స్థాణుడు వజ్రి హిమశైలశిఖరమనుటలో అతని కఠిన శ్రమతోపాటు విలువ విశిష్టత సువ్యక్తమగుచుండును.

వానదేవుని ప్రార్థించిన గేయములో

"మెఱపుటంకుశమూని మబ్బుటేన్గుల నెక్కి
బడబడా యుఱుములా బాజాలు మ్రోగంగ
సరదాగ మబ్బుల్ల పరదాలు తీసుకొని
రంగారు సింగిణీ రాచగుమ్మము దాటి"[2]

1. విప్రలబ్ధ : 6వ గేయము, పుట 12
2. " : 7వ గేయము, పుట 13

అని చేసిన రూపకముల సోయగము వర్ణింప నలవికానిది. వానదేవుడు మబ్బు టేనుగుల నెక్కి వచ్చును. అతని రాకలో ఉరుముల బాజాలు ్రమోగును. ఆ వర్ష ప్రభువు మబ్బుల పరదాలు తీసికొని సింగిణి రాచగుమ్మము దాటి వచ్చును. రూప కాలంకారమున సాధారణ వర్ష దృశ్యము రమ్యతరమై రాజిల్లుచున్నది. కావ్యలోక మున నిట్టి దృశ్యము లవశ్యము చూచి వశ్యము కాని వారుందురా? ఇట్లే గడగడ ఉరుమునట్టి పిడుగురాణ్ని తాకి పచ్చి కడవలమబ్బు విచ్చిపోయి కురియవలెననియు, భూసతి ముసురుల ముసుగులను దాల్చి చిలుకయై తనువెల్ల పులకింప చూడవలె ననియు రుచిరముగా రూపించి చెప్పబడినది.

వర్ష వర్ణనలో వర్షాలు వసుధారాణికి తలబ్రాలని రూపించుటలో ఎంతో అందము ఔచిత్యము ఉన్నది. వానదేవుడు వసుధారాణికి జలబిందువుల తలబ్రాలు పోసి చేపట్టి సస్యసంతానము నుద్భవింపజేయును.

"కోడె నాగులై యురికే వాగులు క్షీరధారలై పారే తోగులు
భూసతి వానల తానము లాడి పచ్చిక కోకల పైట సవరించె"[1]

అని వర్షాల దృశ్యములు కమనీయ రూపకములచేత కనులకు గట్టింపబడినవి.

నాటువేయుచున్న లక్ష్మిని చూచి వలచి తలచిన సందర్భములో

"పెదవి చెలియలి కట్ట నొదుగు సిగ్గుల కడలి
నవ్వు ముత్యాల్పోసి నా గుండె కొన్నది
మనసు మనసుకు నడుమ మమత బంధాలల్లు
చిలిపి చూపుల వలను చిక్కించుకొన్నది"[2]

అని రాముడనుకొనును. ముగ్ధలు తొలి వలపులో లజ్జాభరమున మాట్లాడలేక నవ్వుచు చిలిపి చూపులు ప్రసరించుచు తమ యనురాగమును వ్యక్తముచేసి వశము చేసికొందురు. ఈ విషయమిచట చక్కని రూపకమున చిక్కగా వక్కాణించ బడినది. ఆమె సిగ్గుల కడలి కావున పెదవి చెలియలికట్టయై దానిని దాటి మాటల యలలు బయటకు రావు. ఆ కడలి నవ్వు ముత్యాలుపోసి అతని గుండెను కొన్నది.

1. విప్రలబ్ధ : 8 వ గేయము, పుట 16
2. ,, : 10 వ గేయము, పుట 19

అట్లే ఇరువురి మనసుల మమతల త్రాళ్ళల్లినట్టి చిలిపి చూపుల వలలో అతనిని చిక్కించుకొన్నది. సుకుమార శృంగార విషయ మిచట సుందరముగా నలంకరించి చెప్పుట జరిగినది.

స్వచ్ఛంద ప్రణయములో ప్రకృతి సిద్ధమైన ఏర్పాట్లలో పెండ్లాడుదామని రాముడు లక్ష్మితో అన్న విషయములో నిట్లు రూపకము శోభ గొలుపుచున్నది.

"కొత్త కోర్కెల చీర కొంగుముళ్లేసుకొని సరసాలు నవ్వుల్లు సన్నాయిలను బాడ
తరుణి నా కౌగిలిని తాళిబొట్టుగ గట్టి ఉప్పొంగు మురిపాల ఊరేగుదామే"[1]

ఇందు లక్ష్మిరాముల స్వచ్ఛానురాగ చేష్టలే పెండ్లి హంగుల నమర్చి వీనుల విందు చేయుచున్నవి.

రాముడు లక్ష్మిని చదువు నేర్చుకొమ్మని ప్రోత్సహించుచు
"చదువులు నేర్చిన మొగాలు సౌరభాలు గల పూలు"[2]

అనుటలో విద్యావంతుల విలువ విశదమగును. లక్ష్మి రామునితో తన వీడలేని తాదాత్మ్యము చెప్పుకొనుచు నిట్లనెను.

"నీవు నేను పూవు తావిలా ఒకటైతె వాడినా ఊడినా వాసనలు పోనట్టి
వకుళ పుష్పంబునై వాసికెక్కెను చందనపు గంధమై అందగించేను"[3]

వకుళ పుష్పము వాడినను వాసనపోదు. చందనము నరికినను గంధము పోదు. అట్లే భార్యా భర్తలన్యోన్య ప్రేమచేత ఏకమై తాదాత్మ్యము పొందినచో ఎట్టి అవస్థలలోను వారి ప్రేమ చెడక చిరస్థాయిగా నుండగలదన్న విశిష్ట భావము నీరూపకము విశదము చేయుచున్నది.

రాముడు లక్ష్మిని కలుపు తీయ పిలిచిన గేయములో అందమైన రూపకములు పొంది పొసగియున్నవి.

---

1. విప్రలబ్ధ : 16 వ గేయము; పుట 34
2. ,, : 21 వ గేయము; పుట 43
3. ,, : 24 వ గేయము; పుట 51

'పైట నడుముకు జుట్టి చేత కొడవలిబట్టి దుష్టశిక్షణ జేసే అష్టభుజకాళికవై
మన భూమి యందేమి పరజాతియా స్వామి నరికి వేసెదనన్న వారి
ఝాన్సీ వగుచు"[1]

అని రూపించి చెప్పుటలో కలుపు తీయునట్టి లక్ష్మి కాళికగా ఝాన్సీరాణిగా కనుల ముందాడును.

లక్ష్మి చద్దిని దెచ్చి రాముని ఊరించుచు పలికిన సరసవచనాలలో బహుళ రూపకములు త్రాజిల్లి శృంగార ధారలను పొంగించుచున్నవి.

"తలపుల ఊటలలో ప్రణయపుటలుగులు పొంగినవోయ్
పలపుల గుండియలలో సరసామృత ఫలాలు తెచ్చితినోయ్
మామా తొలి రుచి చూడగదోయ్"[2]

ఈ రీతిగా సాగిన వానిలో రుచి చూచుటకి చాటున యొకటి చాలును. మరొక శృంగార రూపకము చమత్కార భావ బంధురమై దిగువ రీతిగా తేజరిల్లినది.

"మెడ నున్న ఒడిసేల గురిపెట్టి కొట్టకే గుండెపిట్టకుదాకి కూలె నీ మోలనే
బిగి నడుముకొని ప్రాణ మెగిసి పోకుండాపి అధరామృతము జిల్కి
బ్రదికించు కొమ్మింక"[3]

అని రాముడు లక్ష్మిని బతిమాలును. మదన జ్వరతప్తునికి ప్రియురాలి బిగికౌగిలి పథ్యమై ఆమె అధరామృత మౌషధమై స్వాస్థ్యము సమకూర్చగలదు. ఇక్కడ లక్ష్మి చూపులను ఒడిసెలతో గురిపెట్టి రాముని గుండె పిట్టను పడగొట్టినది. రాముడది భరింపలేక తల్లడిల్లుచు తన ప్రాణ మెగసిపోకుండ గట్టిగా నడుముకొని అధరామృతము చిలికి బ్రతికించుమని ప్రార్థించెను. అహ్లాదకరమైన యీ చమత్కార భావన వారి అన్యోన్య ప్రణయ తీవ్రతను వ్యక్తము చేయుచున్నది.

రాత్రి చేని కావలిలో రాముడు విరహ పరవశుడై పాడుకొనుచు

"అత్త మామల బెదురు ఆడుబిడ్డల యలుక
వత్త మన రాలేదు పంజరములో చిలుక

1. విప్రలబ్ధ : 27వ గేయము, పుట 57.
2. '' : 29వ గేయము, పుట 62.
3. '' : 30వ గేయము, పుట 64.

పెత్తనమ్మేది నా రాణికి - ఎంత ప్రేమ్మంటె ఏమి దొరసానికి"[1]

అని పగచుసు. అత్తమామల ఆడు బిడ్డల మధ్య చిక్కుకొని రాలేని లక్ష్మిని పంజరములో చిలుక యనుట రంజకముగా నున్నది. పంజరముతో రూపించి చెప్పినది మరొక రూపకము కలదు. పుట్టిన పట్టిని గని లక్ష్మి హర్షోత్కర్షముతో

"మాప ప్రణయ పంజరపున్ మసగయి వచ్చిన చిలుకా!
మా ప్రేమరసాల యంటుమామిడి చిగురుల మొలకా"[2]

యని ముద్దాడుటలో పసివాని యందము, వానిపైగల వాత్సల్య బంధము వ్యంజిత మగుచున్నవి.

ఇక చేని బావిలో జామపండ్ల కొమ్మలు ప్రతిబింబితములై రవిక లూడ్చి నీరాడు రమణులై కనబడునన్న రూపక సౌందర్యము హాలిక జీవన చిత్రణ వ్యాసమున వివరింపబడెను.

అనుబంధ గేయములో రాముడు మతభేదము నిరసించుచు భావించిన దానిలో అనేక రూపకములు సూక్ష్మ విషయములను చక్కగా ఎదలకెక్కునట్లు కూర్పబడినవి.

"భిన్నమతము లొకే బడిని చిన్న పెద్ద తరగతులు
అన్ని ఒకే జ్ఞానాంబుధి నంతరించు నుపనదులు....
కలహము నేర్పెడి గురువులు గడ్డిని దాగిన బావులు
ఆ గురువుల నమ్ము శిష్యు లజ్ఞ పశువులగు జీవులు"[3].

అని యనుటలో మతముల పరమార్థము, మతకలహాల యనర్థము రమ్యముగా బోధింపబడినవి. ఇట్టి రమణీయ రూపకము లింకెన్నియో కావ్యమునందు విరాజిల్లుచు రసజ్ఞులను రంజింపజేయుచున్నవి.

## ఉపమ :

కావ్యమున రూపకము తర్వాత పేర్కొనదగినది యుపమ. ఇందు ఉపమలు కొన్నియే ప్రయుక్తమైనను ఎన్నికగన్నవై హృదయంగమములై యొప్పుచున్నవి.

1. విప్రలబ్ధ : 31 వ గేయము, పుట 66
2. ,, : 40 వ గేయము, పుట 84
3. ,, : 53 వ గేయము, పుట 133

సుప్రభాత గీతమున

"చుక్కలన్నియు మంచుముక్కలై పచ్చికలపై వ్రాలె ముత్యాల పార
జల్లినలీల"[1].

అని రూపకములో ఉపమనందించుటలో భావసౌందర్య మినుమడించి అతిశయా నందము కలుగుచున్నది. చుక్కలే మంచుచుక్కలై పచ్చికల మీదపడుట ముత్యాలను పారజల్లినట్లున్నదనుట ఓహో ఎంతసొగసు! వర్షవర్ణనలో ఉత్తర దిక్కున ఉరిమి కనుపాపల చెక్కని మెరయుట కత్తులు కత్తులు కలిసినట్లున్న దనుట మిక్కిలి చక్కగా నున్నది. సురుచిరమైన యుపమకు దిగువ గేయభాగము మెచ్చైన మచ్చుతునక.

"ఆర వేసిన చీరలవోలె తూరుపు గట్లందావులు మేసే
నడచే నల్లని గండశిలలవలె పడమటిగట్లను గేదెలు మేసె"[2].

వాన వెలసిన పిదప పల్లె పరిసరాలలో పశువులు మేయు దృశ్యము రమ్యముగా సాక్షాత్కరింపజేయుట కలంకరించిన యుపమ ఇక్కడ ఎంతో ముద్దులు గులుకు చున్నది. లక్ష్మిరాములు వనదేవతల సాక్షిగా పెండ్లాడువేళ రాముడామెతో

"బతుకు సంసారంపు బండి బరువెంతైన ఏకమై నాగేటి ఎడ్లోల మోస్త
మని...."[3] అన్నదానిలోని యుపమానము కర్షకోచితమై శోభిల్లుచున్నది.

విద్యవిలువను దెలుపుచు రాముడు లక్ష్మితో నిట్లనెను

"ఇంటికి దీపమ్మట్టులు కంటికి కనుపాప యటులు
మణికి సాన ఒరపిడివలె మనిషికి విద్యయె వెలుగిడు"[4]

ఇక్కడి చెలువయిన యుపమానములు విద్యకుగల విలువను చక్కగా గమ్యమానము చేయుచున్నవి :

కాపు దంపతులు బోటు షికారు చేసిన సెలయేరు వెన్నెలలో నెట్లు చెన్నెస లారినదో ప్రన్నని యుపమలతో భాసురముగా వ్యక్తీకరింపబడినది.

1. విప్రలబ్ధ : 1వ గేయము, పుట 2.
2. ,, : 8వ గేయము పుట 16.
3. ,, : 16వ గేయము, పుట 32.
4. ,, : 21వ గేయము, పుట 44.

"గలగలా నవ్వుల్ల గంపబోర్లించినటు ఒయ్యారముల కడవ లొలక
బోసినయట్లు
కొత్త దంపతులెవరో కొసరు గుసగుసలట్లు మరుని గజ్జెల గుజ్జుమన నేగు
సెలయేరు"[1]

ఈ రమణీయోపమానముల వలన సెలయేటి ప్రవాహపు విలాసములు, అలల సవ్వడులు, అందచందాలన్నియు సాక్షాత్కరించుచు కవిగారి నిశిత పరిశీలనాశక్తిని ప్రతిబింబింప జేయుచున్నవి.

కలుపు తీయు కాపువారి పడుచును

"దేవతల దాగాడు రాహుకేతుల వెదకి నరకు మోహిని వోలె పెరికేయ
పలె తుంగ"[2].

అని యుపమించి వచించుటలో పడుచు బెడగు పొదతో బాటు తుంగ దొంగ గుణము, ఆమె దానిని పసిగట్టి పెరికివేయుటలోని నేర్పు లెస్సగా అవగతమగును.

వరికుప్పలను బంతికట్టుటలో తాను నోరు గట్టుకొని దాచి పిల్లలకిడుతల్లి వలె మూతుల బుట్టలతో నెడ్లు బంతిద్రొక్కుననియు, మేరిగిరిపై వెలయు శ్రీహరి వలె రైతు గడ్డికుప్పమీద నుండి గడెగడెకు గడ్డి పరచుననియు చక్కని పోలిక లొసగబడినవి.

తూర్పారబట్టు లక్ష్మి చంద మందముగా నిట్లు పోల్చి చెప్పబడినది.

"వయసు బరువోపక వడకాడు నడుము తంబురకాయ తీగెలా మెరవులా
అసియాడ"[3]

మరియు తాలు ధూళిని మేలు ధాన్యమును వేరుచేయు నామె పాలును నీరుకు వేరు పరచు హంసవలె భాసిల్లుచున్నదనియు, చేటలో ధాన్యము చెరగి రాశి పోయుటలో వరహాలొలికించు వరలక్ష్మివలె ప్రకాశించుచున్నదనియు నుదాత్తముగా నుపమించి చెప్పుటలో తూర్పారబట్టుటలోని ప్రాముఖ్యము ప్రస్ఫుటమగుచుండును. తర్వాత ధాన్యపుబండి నిండు గర్భవతివలె వచ్చినదనుట మిగుల సొగసైన భావన.

1. విప్రలబ్ధ : 23వ గేయము, పుట 49.
2. ,, : 27వ గేయము, పుట 58.
3. ,, : 36వ గేయము, పుట 75.

శుకసందేశములో శుకము పోవలసిన దారిని చెప్పుటలో అతుకని దంపతుల యంతరంగాల వలె కలియకయె చను బంశిగాడాలనుట, ఆవిడ పందులు అడుసు మడుగుల నుండి మట్టి గంధము నొంట బట్టించుకొని లేచి కడలి మున్గిన పుడమి పడతి బంధము పాపి సరస సంశ్లేష సంగతి దేల్చునట్లు తోచుననుట మనోజ్ఞముగా నున్నది. ఇట్టి రమ్యోపమలచేత భావసంపద పెంపొంది కవిత రమణీయమై రాజిల్లుచున్నది.

## ఉత్ప్రేక్ష :

విప్రలబ్ధలో ఉపమ పిదప గణనీయమైనది ఉత్ప్రేక్ష. రమ్యమైన ఉత్ప్రేక్షలు సంఖ్యలో నల్పమైనను ననల్ప భావవైభవమునకు నిధానమై కవితా సౌందర్యోత్కర్ష హేతువై యొప్పుచున్నవి.

"హలము దాల్చిన నాటి బలరాముడో యనగ
వర కుఠారము పూను పరశురాముడో యనగ
సీతతో గూడుకొను శ్రీరాముడో యనగ
ప్రగ్గాల మునుకోల పార్థసారథి యనగ"[1]

అని రైతురాజును కవి ఆహ్వానించుచు పై రీతిగా నుత్ప్రేక్షించుట యుదాత్తముగా నుండి హాలికుని వైశిష్ట్యమును ప్రకటించుచున్నది. అట్లే అంబలి దుత్తను తలనిడి వచ్చు రైతురాణి అమృతము గొనివచ్చు మోహిని యన నలరారుచున్నదనుట విశిష్టముగా నున్నది.

వరికుప్పల బంతిద్రొక్కు ఎద్దులు దైవము గుడిచుట్టు సరి ప్రదక్షిణాలు చేయ చేయ ఫలము వొందు ననగ వరికుప్పకు చుట్టు దిరుగుచున్నవని యూహించుట చమత్కారముగా నున్నది.

శుక సందేశములోని యరుణోదయ వర్ణనలో

"లతలు వృక్షములెల్ల రాత్రి పచ్చికసెజ్జ కుతుకమున పెనగాడి రతిదేలి యలసెనో

1. విప్రలబ్ధ : 2వ గేయము, పుట 4

చెమట వొడమె ననంగ హిమబిందువులు రాలు
మలయ మారుత సఖులు మెలమెల్ల వీచెదరు''[1].

అని సుందరమైన యుత్ప్రేక్ష చేయబడినది. రాలిన హిమబిందువులను లతా వృక్షముల రతిశ్రాంత శ్రమ బిందువులుగా నుత్ప్రేక్షించుట రమ్యముగా నున్నది. విరహవ్యథనందు లక్ష్మి చిత్త విభ్రాంతికిది ప్రతీకయై సమంజసమై యున్నది.

శుకసందేశములోని సాయం వర్ణనలో మనోజ్ఞములైన యుత్ప్రేక్షలచేత నలంకృతములైన భావములు విప్రలంభ పరితప్తయగు లక్ష్మి హృదయమును విప్పి చూపుచు సమంచితములై యొప్పుచున్నవి.

''గగన లక్ష్మియు భానుఘన వియోగమ్ములో
హారము లొలిచి పెట్టియలలో పడేయునన
విహగ పంక్తులు వ్యోమవీథులం బయనించి
గూళ్ళ చేరగబోవు వేళ్ళయగు నంతంత''[2]

సాయంవేళ నింగిలో పయనించు విహగ పంక్తులు హారముల వలె పొల్చును. అట్లు శ్రేణులు గట్టి పోవు పక్షులు గూండ్లలో చేరబోవుట గగనలక్ష్మి సూర్యుని ఘన వియోగములో హారము లొలిచి పెట్టెలో వేయునన్నట్లు తోచుననుట రమ్యా రమ్యముగా నున్నది. ఇదే విధముగా విశ్వప్రకృతి సూర్యుని విరహము కనలేక సంజ కెంజాయ చీరను వదలి మాసిపోయిన కోక దాల్చుననగా మసక చీకటు లల్లుకొనునని యూహించుట మనోహరముగా నున్నది. ఇట్టివే మరికొన్ని రమ్యోత్ప్రేక్షలు కావ్యమును కైసేసి రసజ్ఞుల నలరింప జేయుచున్నవి.

## ఇతరార్థాలంకారములు :

కావ్యమును నుపర్యుక్తార్థాలంకారములే కాక స్వభావోక్తి లోకోక్తి సందేహము భ్రాంతిమంతము ఉల్లేఖముపంటి యలంకారములను అందందు సుందరముగా పొందింపబడియున్నవి.

---

1. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 93
2. ,, : ,, పుట 96

స్వభావోక్తులలో "చెకుముకిల సంచితో జాలె మొలపట్టితో"[1] అని రైతు రాజును, బంతిపూల కొప్పులతో పచ్చబొట్ల యొప్పులతో"[2]. అని రైతురాణిని వర్ణించినవి స్వభావ రమ్యములై వర్ణ్య వ్యక్తులను కనులకు గట్టించుచున్నవి.

వర్షవర్ణనలో ఉత్తరదిక్కున ఉరిమి మెరసినదియు గాలి వీచినదియు స్వభావోక్తిలో ముద్దుగా వర్ణింపబడినవి. ఆ వర్ణనలోనే మదవృషభముల, ముదిత మయూరముల వర్ణన యిట్లు కావింపబడినది.

"మద వృషభమ్ములు కొమ్ముల గ్రుమ్ముచు
మట్టిని జిమ్ముచు అంకె వేయగా
ముదిత మయూరము పింఛము విప్పి
ముద్దుగ నాట్యం సలిపింది.''[3].

వర్షఋతువులో ఎద్దులకు నెమిళ్ళకు మదమెక్కును. అవి మహోత్సాహముతో విహరించును. వాని చేష్టలు నిసర్గ రమణీయముగా వర్ణింపబడినవి. మేఘములు భయంకరముగా ఉరిమి మెరసి హడలగొట్టి చల్లని వర్షము కురియునట్లే వర్షర్తువు మదపు టెద్దుల బెట్టిదపు కోరాడుటలతో, హృష్టమయూరముల హృదయంగమ నృత్యములతో రసనదముల నెదలలో ప్రవహింప జేయును.

శుక సందేశములోని సాయంసమయ పల్లీ ప్రకృతి వర్ణనలోని

"పసులు రంకెల గరువుపై జిమ్ము దుమ్మొకట
కొసరి ఎద ఆవు లోగొనుకోడె తరుమొకట
మారేసి యాబోతు మల్లయుద్ధము చేయు
ఆటాడు లేగల్లు అందాల వడబోయు''[4]

అని పశువుల విహారములు.

1. విప్రలబ్ధ : 2 వ గేయము, పుట 4
2. ,, : 3 వ గేయము. పుట 6
3. ,, : 8 వ గేయము, పుట 16
4. ,, : శుక సందేశము పుట 96

కొట్టంపుచూరుపై కూర్చున్న కాకి జత రెక్కమొదళుల విప్పి ముక్కుతో
గోకికొని
ముక్కు ముక్కు ఒరసి ముదమార తమిదీర అతి ప్రశాంతముగా ప్రకృతి
శోభగను హాయి"[1].

అని కాకి జతక్రీడ స్వభావోక్తిలో సవరించి ప్రదర్శింపబడినది. ఇట్లే పల్లెటూరి కూలి పడుచుల చెయిదములు మున్నగునవి బెడగుగా స్వభావోక్తిలో నుడువబడినవి.

విప్రలబ్ధలో సందర్భోచితముగా లోకోక్తులు కొన్ని ప్రయుక్తములై కవితను రమ్యతరము కావించినవి.

కాపు వరి కుప్పలు బంతి గట్టిన వర్ణనగల గేయములో
''బంతి భోజనము చేయుచు ప్రపంచ మానవులెల్లరు
"అన్నదాత సుఖీభవ" యని దీవెనలను బెట్టగ"[2].

అని 'అన్నదాతా సుఖీభవ' యను సామెత వాడబడినగి. ఏ గేస్తు అన్నము పెట్టి నను అన్నము పండించి పెట్టు మూలపురుషుడు రైతు కావున లోకవాసులందరికిని రైతే అన్నదాత యన్న సత్యమిక్కడ ప్రకటించుటకు ఈ లోకోక్తి మిక్కిలి యుక్తియుక్తముగా నున్నది.

లక్ష్మి పెనిమిటికి వ్రాసిన యుత్తరము రెండవ భాగమున
''సత్యమునకే వెరువజను నంధజగతికే సత్యస్వరూపుడే నిత్యమీయెద
నెరుగు
బట్టగాలిచి మీద బారవేయును జనము చెట్టూగు నెటుగాలి బెట్టకుండా
యనును
త్వరపడిన త్వరయెపుడు చెరచు నిన్నే ముందు నిజము నిలుకడ మీదనే
తెలియనగు నెందు''[3]

లక్ష్మితాపముతో వ్రాసిన లేఖలో మందపు అక్షరములలో ముద్రింపబడిన వాక్యములు సామెతలు. లోకులు నిరపరాధులకేదో ఒకటి ఆపాదించి అపనిందలపాలుచేసి పీడింతు

1. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 97
2. ,, : 35 వ గేయము, పుట 74
3. ,, : 45 వ గేయము, పుట 109

రనియు, కుశంకలతో తమ దురభిప్రాయములను సమర్థించు కొందురనియు, ఇట్టి 'నీలావనిందలు' నమ్మి తొందరపడి ప్రతిచర్యకు పూనుకొన్నచో హాని కలుగును కావున నిదానముగా విచారించినచో క్రమముగా వాస్తవము తెలియును-అన్నలోక విషయ మిచట ఈ సామెతల వలన చక్కగా వక్కాణించుట జరిగినది.

రైతు రామునికి విప్రుడు కలలో కనబడి బోధించిన మత సామరస్యములో

"కాల్చినం బూడ్చినన్ కడకు మిగులునవి యెముకలె
మరోజన్మ ముంటేమి సరి యది లేకుంటేమి
గుఱ్ఱము కడుపులో గ్రుడ్డు కొసకది ఆడదో మగదో
కానరాని విషయాలకు కలహించుటలన మూర్ఖత"[1]

అని వచించుటలో చక్కని సామెత వాడబడినది. తెలియరాని విషయము నెడ ఈ సామెతను వాడుదురు. అగమ్య గోచరములగు పారలౌకిక విషయాలలో మత భేదములతో కొట్టుక చచ్చుట బుద్ధిహీనత యని నొక్కి చెప్పుటలో వాడిన యీ లోకోక్తి సముచితమై యున్నది.

లక్ష్మిని గాంచి రైతు రాము డానందాశ్చర్యములకు లోనై తలపోసిన భావములు సందేహాలంకృతములై యలరారుచున్నవి.

"వనలక్ష్మి నా ముందు వచ్చి నిలుచుండెనా!....
అందాలరంభ నా ముందా డుచుండెనా!....
బంగారు బొమ్మలో ప్రాణాలు పడెనా!....
పగలె నే చంద్రబింబమ్ము కనుచుంటినా
ధరణి తెగిపడి యాడు మెఱపు గనుచుంటినా!
పువ్వు దీవియ నడచి నవ్వి నను గాంచునా...."[2]

అని యీ రీతిగా ఆశ్చర్యముతో వ్యగ్రుడై భావించుటలో సందేహాలంకారము సముచిత సహకార మందజేసినది.

లక్ష్మి కొడుకును గని మురిసిపోవుచు

"మారీచుని మాయలేడి మతి దోచని రాముడవో
ఆదిశేష సర్పముతో ఆటలాడు దేముడవో"[3]

1. విప్రలబ్ధ : 50వ గేయము, పుట 122
2. ,, : 6వ గేయము, పుట 9,10
3. ,, : 40వ గేయము, పుట 85.

అని పలికిన మాటలలోను సందేహ మొప్పుచున్నది. మారీచ మృగము మాయను రాముడు గుర్తించలేదు. అభము శుభము తెలియని ఈ శిశువు నంతటివాడే యను టలో సారస్యమున్నది. అట్లే ఆదిశేషునితో శ్రీ విష్ణువలరుచుండును. ఈ పాప డును పామునకు వెరవక దానితో ఆడగలడు. శిశువులోని యమాయికత తెలుపు టకు రాముడుగా విష్ణు దేవుడుగా సందేహించి చెప్పుట యుక్తముగా నున్నది. ఈ సందర్భమునందే

"భానూదయ కిరణమ్ముల పైడి తీవ యల్లికవో
నవ్వుల పువ్వుల గురిసే నందన వన మల్లికవో"[1]

అని పిల్లవానిని గూర్చి తల్లి భావించుటలో వాని శోభ సొగసు చక్కగా వ్యక్త మగుచున్నవి.

చద్దిని గొనితెచ్చు లక్ష్మికై నిరీక్షించు రాముడు
"పిలిచి నట్లైతె జామలతోట కెళ్లితిని. చిలుక పలుకని తెలిసి సిగ్గొచ్చి మరలితిని"[2]

అని చిలుక పలుకును చెలియ పలుకుగా భ్రమించినట్లు వర్ణించిన భ్రాంతిమంతము భావమును రసవంత మొనర్చినది.

కావ్యమున నొండు రెండు చోట్ల అర్థాంతర న్యాసము కూర్పబడి కవితకు నిగ్గు నెగడించినవి. రాముడు లక్ష్మితో పెండ్లాడుదమనుచు నిట్లు పలికెను.

"ఒకరి మేలును జూచి ఓర్వగాలేని యీ పాపిష్టి లోకముతో పనియేమి మనకు

మిట్ట పల్లాల యిక్కట్టు లెన్నుంటేమి గంగ రత్నాకరుని కలియకుంటాదె"[3]

అంతస్తుల యంతరాలెంచి వ్యతిరేకించు పెద్దలకు, వారి ప్రేమ కోర్వలేని లోకు లకు వెరచి సంశయించు లక్ష్మికి పెండ్లాడు విషయము ధైర్యము చెప్పి యొడ బరచుటకు గంగ యుదంతముతో సమర్థించి చెప్పుట అనురాగోచితమై కార్య సాఫల్య సమర్థమై యున్నది. రాముని కలలో విప్రుడు ప్రబోధించిన మత సామ రస్యములో.

1. విప్రలబ్ధ : 40వ గేయము, పుట 86
2. " : 28వ గేయము, పుట 59
3. " : 15వ గేయము, పుట 82.

"ఎన్ని రంగులును బూసిన కన్ను ముక్కు మొగమదియే
రకరకాల జాతులై సుఖ దుఃఖాలొక్కటియే
ఆల రంగదేదియైన పాల రంగదొక్కటియే"[1]

అన్నదియు చక్కని యర్థాంతర న్యాసాలంకృత భావన. ఎన్ని మతాల నవలంబించి నను మానవులొక్కటియే యను దానిని ఆవులు-పాలు అనువానితో సమర్థించిన దెంతో కమనీయముగా నున్నది.

వర్ష వర్ణనలో వర్షాలను గురించి చేసిన మనోహరభావన యుల్లేఖముచేత యలంకృతమై మిక్కిలి శోభించుచున్నది.

"పాడు కరువులకు బాణాలు-మా పంటచేలకివి ప్రాణాలు
కాపు కన్నులకు ముత్యాలు-వరి కర్రల నోళ్ళకు చనుబాలు"[2]

వర్షాలు కరువులను దూరము చేయుననియు, పంటలను పోషించుననియు, రైతుల కానందములనియు వరి కఱ్ఱలను బ్రతికించుననియు తెలుపుటకు ప్రయోగించిన యుల్లేఖాంశములు మిక్కిలి సమంజసములై స్వాంతావర్జకములయి చెలువొందు చున్నవి.

ఇక లక్ష్మి వెన్నెలలో కూర్చుండి కన్నె తలపుల తేలియాడిన భావము లెల్ల స్మరణాలంకృతములై సరసములై చవులూరించుచున్నవి.

"చందప్పలో నలుపుటందాలు గురిగట్ట మొుంక మీసపు కట్టు మొగమేదొ పొడకట్టు
తారమ్మ వెనకాల తారాడు వెలిమబ్బు కడనంటు చందురుని గనినంత నది యేమొ
కొంగట్టి లాగు ఆ కొంటె నవ్వుల సామి అచ్చంగ నా కండ్ల నాడు విందిడుచు
అందాల నాదు చెలికాడు"[3]

1. విప్రలబ్ధ : 50 వ గేయము; పుట 121
2. ,, : 8 వ గేయము; పుట 15
3. ,, : 14 వ గేయము; పుట 28, 29

ఇదే విధముగా గేయమెల్ల సాగినది. ఇందు లక్ష్మి చందురుని రూపరేఖావిలాసములు గాంచి తన ప్రియుని అతని శృంగారచేష్టలను స్మరించుటచేత ఈ వర్ణన సముచితమై కవిత సరసమై యొప్పుచున్నది. ఇట్టివే మరికొన్ని యర్థాలంకారములు సవరింపబడి కావ్య కన్యకు సొగసులు నెగడించినవి.

## మిశ్రాలంకారములు :

విప్రలబ్ధలో అందందు మిశ్రాలంకారములు మిరమిట్లు కొలుపుచు కవితా సౌందర్యమును గణనీయముగా నినుమడింపజేసినవి. మచ్చునకు రెండు మూడు ఉదాహరింతును.

శుక సందేశములో లక్ష్మి సందేశమంపుటకు శుకమునిట్లు కొనియాడెను.

"కారడవిలో మనుచు కాయగడ్డల దినుచు తాపసులవలె నొరుల దయతోడ గనుగొనుచు
విష్ణుపథవీథులన్ విహరించు ద్విజరాజ! శుకరూప! కులదీప! స్తుతిసేతునే యోజ"[1]

ఇందనేకాలంకారములు బహువిధ కుసుమముల వలె మిశితమై భావ సౌరభ పరంపరను వెదజల్లుచున్నవి చిలుకలను తాపసులతో నుపమించుటవలన నుపమయు, విష్ణుపథ వీథులన్, 'ద్విజరాజ' 'శుకరూప' అను నర్థద్వయ పదప్రయోగముచేత శ్లేషయు, పాదాంతములందు ప్రయోగించిన పదములచేత అంత్యానుప్రాసయు శోభిల్లుచున్నవి. ఇక్కడ సందేశ సహకారము గోరు లక్ష్మి చిలుకను తాపసులతో పోల్చుట విప్రోత్తమునిగా (ద్విజరాజ) శుకయోగిగా (శుకరూప) నుపమించి సంభావించుట మిక్కిలి సమంజసముగా నున్నది. తాపసులొకరి జోలికి పోక యెవరిని పీడించక దయాళురై పరోపకారమే చేయుచుందురు. అట్లే విప్రోత్తములు. శుక మహర్షి ముక్తిదాయకమగు తత్త్వము నుపదేశించిన పరమపుణ్యుడు. చిలుకయు నట్లే పుణ్యచింతతో ఉపకారము చేయును. చేయవలెను-అను సదుద్దేశముతో భావించి ప్రార్థించుట ప్రశస్తముగానున్నది. ఇట్టి భావన నిందలి యలంకారములు తీర్చిదిద్దినవి. శుక సందేశమునందిట్టివే మరికొన్ని మిశ్రాలంకారములు కవితను సింగారము కావించుచున్నవి. మచ్చున కొకటి రెండు దృశ్యములను తిలకింతము.

1. విప్రలబ్ధ : శుకసందేశము, పుట 91

"అప్సరస్తారకలు ఆకాశగంగలో జలకమాడగనెంచి పలు రంగు చీరలను
విడిచి దరినిడి నీటబడి మున్గ వారి చీరలె వన్నె
మబ్బులై వెలిగెనదె నుదయాద్రి"[1].

సూర్యోదయవేళ తారక లదృశ్యమై పూర్వాద్రిపై రంగుల మబ్బు తున్కలు గ్రమ్ముకొనట్టి రమణీయ దృశ్యమును అప్సరోభామినుల వస్త్రశోభలతో నౌపమ్య మెసగజేసి రూపకానుప్రాణితోత్ప్రేక్ష చేత నిరూపించిన శృంగారభావము నితాంతాహ్లాదకరమై యున్నది.

''ఇనుని తాపమువలన కనుల చీకటిగ్రమ్మ
పడియున్న సుకుమార ప్రకృతి సుందరినోట
గగనమాతయు తనదు ఘనకుచమ్మును పిండి
పాల్పోయునన శశియు పండువెన్నెల గాయ"[2].

అన్నది వెన్నెలరేయి వర్ణనలోనిది. పగలు సూర్యుని వేడిమికి తల్లడిల్లిపోయిన ప్రకృతి వెన్నెలలో హాయిగా పరవశించును. ఈ విషయమిచట రూపకోత్ప్రేక్షాలంకారమున శోభాయమానమై పొల్చుచున్నది. చంద్రుని గగనమాత కుచముగా భావించుట యపూర్వముగా నున్నది. ఇట్లే,

''షష్ఠి చంద్రుడు తాను చదల చుక్కలతోడి
తెల్లపిల్లల కోడి తిరిగి నట్లుంటాడు
వెన్నెలయగు పాలవెల్లి దరిచినవేళ వెన్న ముద్దై
తేలుచున్నట్టు లుంటాడు.''[3].

అన్న చంద్రవర్ణన ఉపమా రూపకోత్ప్రేక్షలతో శిస్తుగా ముస్తాబై చిత్తముల నాకర్షించుచున్నది.

## శబ్దాలంకారములు :

పోతన చరిత్రమునందు వలెనే విప్రలబ్ధ యందును అర్థాలంకార ప్రాచుర్యము మెప్పి శబ్దాలంకారము లల్పముగనే పొల్పు మీరి యున్నవి. లయతాళ విలాస

1. విప్రలబ్ధ : శుక సందేశము, పుట 93
2. " : " " " 101
3. " : " " " 101

గతుల నలరించు గేయములను ప్రధాన శోభాహేతువగు అంత్యానుప్రాసమీ గేయ మాలికలందు రమ్యలాస్యము లొనర్చినది. అందందు వృత్త్యనుప్రాసము, యమకము సంగీత స్వరగమకమువలె హృదయ గమకమై యొప్పారుచున్నది.

## అంత్యానుప్రాసము :

కావ్యమునందు పరివ్యాప్తమై యున్న అంత్యానుప్రాసము కొన్ని గీతములలో సంపూర్ణముగను కొన్నిటిలో పాక్షికముగను ప్రయుక్తమై యున్నది. లక్ష్మి వెన్నెలలో కూర్చుండి కన్నె తలపుల తేలియాడిన గేయము మొత్తము అంత్యానుప్రాస భాసమానమై యున్నది.

"వెన్నెల వెలిపాల మన్నీటి కెరటాల తారకల నాడు చందప్ప నాలోని కోరికల పూలన్ని విప్ప
చందప్పలో నలుపు టందాలు గుడి గట్టు మొలక మీసపు కట్టు
మొగమేదొ పొదకట్టు
నాలోనె నను తాపపెట్టు ఏమియని
ఎవరితో నుడువ నీ గుట్టు"[1].

ఇదే విధముగా గేయమెల్ల సాగినది.

రాముడు బండ్లనిండ వడ్లు తోడి గుమ్ములు నింపిన దిగువ గేయములోను ఈ యలంకారము సాంతముగా గలదు.

"తోడండి తోడండి వడ్లు తోడండి భూదేవి గోదల్లు మనకు తోడండి
ఘోరమగు లేమికి గొయ్యి తోడండి పైరుపచ్చలకెపుడు నీరుతోడండి"[2].

గేయమెల్ల నిటులే కర్ణపేయముగా సాగినది. ఈ అంత్యానుప్రాసలలో యమకము సైతము భాసిల్లి సొయగము నినుమడింపజేసినది. ఇట్లే మొత్తమునకు కాకున్నను చాలవరకు పాదము లందంత్యానుప్రాసములు వరలినవి అనేక గేయములు కలవు. ఇక పెక్కు గేయములలో చొక్కించు చక్కని యంత్యానుప్రాసముల కొక కొన్ని యుదాహరణము లిత్తును.

"స్వాగతమ్మ లిదె ! విద్యుచ్ఛక్తి జననీమతల్లి ! మా పాలిటి కల్పవల్లి !
మా వెన్నెల పాలవెల్లి"[3]

1. విప్రలబ్ధ : 14 వ గేయము, పుట 28
2. " : 38 వ " " 79
3. " : 26 వ " " 54

విద్యుచ్ఛక్తిని వర్ణించిన యీ గేయములలో దాదాపు పాదములన్నిట నిట్లే అంత్యానుప్రాసము కూర్పబడియున్నది.

రాముడు చేనిలో పాడుకొన్న విరహ గేయములో

"అత్తమామల బెదురు ఆడుబిడ్డల యలుక వత్తమనరాలేదు పంజరములో చిలుక

పెత్తనమ్మేది నా రాణికి-ఎంత ప్రేముంటె ఏమి దొరసానికి"[1]

అను దానిలోని యనుప్రాసలాకర్షణీయములై కవితను సుందరతరమొనర్చుచున్నవి.

"కర్షకుని చేతికష్టం వర్షాధినేత యిష్టం

భూజనులదగు అదృష్టం ఈ బండితోనె స్పష్టం"

జనతాన్న వస్త్రదాత పశుపాలనాగ్రనేత

మనకెల్ల ప్రియభ్రాత రైతన్న కెపుడు జోత"

రైతన్న లేని రోజు మన జీవితాలు క్లోజు

పోతన్న రైతురాజు వారంటె ప్రజకు మోజు"[2]

ఇట్టి రమణీయాంత్యానుప్రాసములనేక గేయములందు భాసిల్లి కవితా రామణీయకమునకు కారణమగుచున్నవి

## వృత్త్యనుప్రాసము :

ప్రథమ గేయములో నొక చక్కని వృత్త్యనుప్రాసము రమ్యలాసముగా విరాజిల్లుచున్నది.

"తమ్ములును సుప్తనేత్రమ్ములొకరవ విప్ప

కొమ్మలు పికమ్ముల గళమ్ములను సవరించి

ఝుమ్మను రవమ్ములను తుమ్మెదల శ్రుతి నించి

కమ్మనగు సుప్రభాతమ్ము పాడు విపంచి"[3].

ఇందు ద్విత్వమకార మనేక పర్యాయము లావృత్తియై హాయిగొల్పుచున్నవి.

మరొకచోట వర్షవర్ణనలో

1. విప్రలబ్ధ : 31 వ గేయము, పుట 66
2. ,, : 37 వ గేయము, పుట 77, 78
3. ,, : 1 వ గేయము, పుట 2.

మదవృషభమ్ములు కొమ్ముల గ్రుమ్మిచు
మట్టిని జిమ్మిచు అంకె వేయగా"[1]

అని వృత్త్యనుప్రాస భాసిల్లుటచేత వర్ణ్యము కన్నులకు గట్టుచున్నది. ఇట్లే యీ యనుప్రాసలు కావ్యమున కొన్ని మాత్రమే చెన్నుగా కూర్పబడినవి.

## యమకము :

వృత్త్యనుప్రాసవలెనే కావ్యమున యమకమునకును సకృత్ప్రయోగము కలదు. రాముడు పొలము దున్నుమని ఆత్మప్రేరణ చేసిన గేయములో

"కాపే లోకమున కంత కాపటంచు కొలువసాగ
కష్టే ప్రాణులకు జీవగట్టయంచు తెలిసి రాగ"[2].

యను పాదములందును, ఏడుకొండల వానిని ప్రార్థించిన గేయములో,

"మా యాపదల నడచి మా ముందుగా నడచి
మమ్మెప్పుడును విడచి మసలియుండకు స్వామి"[3]

అన్నదానిలోను, శుకసందేశములోని

"కపిల పాలిస్తుంది ఎపుడు పాలిస్తుంది మావంటి రైతులకు గోవుల్లె దేవుల్లు"[4]

అన్నదానిలోను యమకము శోభిల్లి యాహ్లాదపరచుచున్నది.

ఇట్లు కావ్యమున శబ్దార్థాలంకారములు సముచితముగా సవరింపబడి కవితా రామణీయక హేతువులై విలసిల్లుచున్నవి.

## భావచమత్కారము :

కావ్యశోభ కలంకారములతో బాటు అందందు భావచమత్కారము భాసిల్లుచున్నది. వర్ష వర్ణనలో

"కమ్మ గొడుగుతో కాపు ఛత్రపతి చేలలోన భూపాలుండయ్యె"[5]

1. విప్రలబ్ధ : 8 వ గేయము, పుట 16.
2. '' : 6 వ గేయము, పుట 11
3. '' : 20 వ గేయము, పుట 42.
4. '' : శుకసందేశము, పుట 98
5. '' : 8 వ గేయము, పుట 16

అని వానలో కమ్మగొడుగు దాల్చిన కాపు ఛత్రపతియై చేలలో భూపాలుడయ్యె ననుటలో చమత్కారమున్నది ఛత్రపతి యనగా రాజలాంఛనమగు ఛత్రము ధరించిన రాజు. రైతుకూడ ఛత్రము ధరించెను కాన ఛత్రపతి (రాజు) అయ్యె ననియు, రాజు భూమిని పాలించునట్లు రైతు కేదారభూమిని పాలించును కావున భూపాలుడయ్యెననుట సారస్యము.

రాముడు తనతో కొంటెగా సరసాలాడిన విషయము లక్ష్మి భావించిన దిగువ విషయము సరస చమత్కారభరితము.

"సిగ్గొచ్చి బొమ్మంటె చిన్నబోయెను సామి
తినలేను సరి! వల్ల నన లేనదేమొ"[1].

రాముడు తనను కొంటెగా కౌగిలించి ముద్దిడుకొన్న యనుభూతి యిది. రాము డామె కతిప్రియమైన మధురఫలము. ఆ పవిత్రఫలమును తాను తినలేదు. ఒల్లనని వదలలేదు. అనగా లజ్జచేత అతనితో క్రీడింపజాలదు. అనురాగముచేత క్రీడింపక వదల జాలదన్నది యిందలి చమత్కారము.

తిరుపతి కొండలెక్కువేళ
"నా తోడునీడవై నడచిరావే లచ్చి నా కంటిపాపవై నక్కిరావే లచ్చి
ఈశ్వరుని తలమీదికెక్కలేదే గంగ ఎత్తుకుంటా చంకకెక్కవే లచ్చి"[2]

అని రాముడనగా

"ఏ-బో-బలే మామ ఎక్కమందువు చంక చంటిపిల్లనె నేను
చంకెక్కికూచోను
నీడనై రాత్రి నిను వీడియుండెట్లాగు నీకంటిపాపనై నినుగాంచుటెట్లాగు"[3].

అని లక్ష్మి చమత్కారముగా సమాధానమిచ్చెను. ఇందులో చంకెక్కుమని రాము డనగా చంకెక్కి కూర్చుండుటకు చంటిపిల్లనా యని లక్ష్మి యనుటలో చమ త్కారమే కాక నాతోడు నీడవై నడచి రమ్మనగా నీ నీడనై వచ్చినచో రాత్రి నీడయుండదు గనుక నిన్ను వీడియెట్లుందు ననుటలోను, కంటిపాపవై నక్కి

1. విప్రలబ్ధ : 13వ గేయము, పుట 27.
2. ,, : 18వ గేయము, పుట 38.
3. ,, : ,, ,,

రమ్మనగా నీ కంటి పాపనై యుండి నిన్నేలాగున చూడగలననుటలోను సరస చమత్కారము కలదు. ఇట్లే కాపుదంపతులు పిల్లవానినెత్తుకొని ముద్దాడుచు

"ఏ రాజ్యమేలునో యీ దిస మొల సిపాయి"[1].

అనుటలో మునుముందెంత గొప్పవాడు కాగలిగినను చిన్ననాడు దిస మొలవాడై ముద్దు గొల్పునన్నది చమత్కరింపబడినది. ఈ విధముగా అటనట భావచమత్కారము బంధురమై ఆహ్లాదకరమై యున్నది.

## ధ్వని :

కావ్యాత్మయగు ధ్వని విప్రలబ్ధలో సందర్భోచితముగా విలసిల్లి మానసోల్లాసము కలిగించుచున్నది. మచ్చునకొక కొన్ని మెచ్చుగా ప్రదర్శింతును.

వానదేవుని ప్రదర్శించుచు రైతురాము డిట్లనెను.

"కోట్ల ప్రాణులు బిలువ కొండెక్కి కూర్చొనక
ఆకాశ భవనాల అంతస్థులన్నిదిగి, రావోయి"[2]

ఇక్కడ ఈ మాటలవలన ప్రజాకోటి మొరపెట్టగా రాజు మేడలపై అంతస్థులలో విలాసాలలో మునిగి తేలక దిగివచ్చి వారి గోడు విని తీర్చవలెనన్న విషయము ధ్వనించుచున్నది. ఇది యిప్పటి ప్రజాస్వామిక వ్యవస్థను బలపరచుచు సమంజసమై యున్నది.

పెండ్లియైనచో వెంకన్న దర్శనానికి వత్తునని మ్రొక్కుకొన్న విషయము లక్ష్మి భర్తకు చెప్పుచు తాను దేవుని కోరుకొనదలచిన విషయమునిట్లు వివరించెను.

"ఎడబాటు అంటేమొ ఎప్పుడెరుగనిచోట స్వామి సన్నిధిలోనె స్వర్గ
సుఖమంటాను.
మాజంట నెడబాపు మాయకాలముదాని తలచికొంటెనె చాలు నిలిచిపోవును
మనసు
పసుపు కుంకుమ చాలు పదికోట్ల వరహాలు అని మ్రొక్కుకుంటాను
అందాల రాజా!"[3]

---

1. విప్రలబ్ధ : 52వ గేయము, పుట 127.
2. ,, : 7వ గేయము, పుట 14.
3. ,, : 17వ గేయము, పుట 36.

అని మనసార ప్రార్థింపబూనిన యీ విషయము లక్ష్మి భవిష్యత్తులో పతినెడబాసి దుర్భర విప్రలంభ వ్యథను అనుభవించు విషయము శంకించుటను ధ్వనింప జేయుచున్నది.

లక్ష్మి రాములు వెన్నెలలో ఏటి నీటిలో బోటు షికారు చేయుచు

"పున్నమ్మి చంద్రున్ని మనసులో నుంచుకొని ఎన్నెట్లో సెలయేరు
యెన్నలా కరిగింది
కన్నెవాగు కలువ కను గిలుపుతున్నాది చిన్న మామను వలలొ చిక్కించు
కొన్నాది''[1]

ఇత్యాదిగా సాగిన ఈ సెలయేటి వర్ణన యెల్ల లక్ష్మీరాముల ప్రగాఢ ప్రణయ విలాసములను ధ్వనింప జేయుచు వారి చిత్తవృత్తి కనుగుణముగా సందర్భోచిత ముగా శోభిల్లినది.

రైతు రాముడు లక్ష్మి రూపు రేఖలను తలచుకొనుచు తల్లడిల్లిన సందర్భ ములో

"తనువు సింగారమ్ము గుణము బంగారమ్ము
అన్యులంటగరాని అగ్గి ఆ శీలమ్ము"[2]

అని వినుతించును. ఇక్కడ రెండవ పాదములోని మాటలో లక్ష్మి, సీతాదేవివంటి శీలవతి అని వ్యంగ్యముగా స్ఫురించుచున్నది.

లక్ష్మి తాను గర్భవతియైన విషయము భర్తకు చెప్పిన చొప్పెల్ల ధ్వని విలసితమై ఒప్పుచున్నది.

"పరవానిగా నన్ను పరికింతు వేలయన వరిఫొట్ట కొచ్చెనని చిరునవ్వు
నవ్వితివి''[3]

అని యిత్యాదిగా చెప్పినవి సరసధ్వనికి నిదర్శనములు. గరితలు గర్భవతులైన పుడు ఆ విషయము భర్తలకు వెల్లడి చేయలేక సిగ్గుతో ఇట్లే వ్యంగ్యభాషణము చేయుట పరిపాటి యగుట వలన ఇక్కడ ఇది ఔచితీమంతమై అలరుచున్నది.

శుకసందేశములో లక్ష్మి శుకము పోవలసిన మార్గము చెప్పి చేసిన సూర్యాస్తమయ వర్ణనలోని భావములెల్ల ఆమె విరహావస్థను ధ్వనింపజేయుచు సందర్భోచితములై యున్నవి.

1. విప్రలబ్ధ : 23వ గేయము, పుట 48
2. '' : 32వ గేయము, పుట 68
3. '' : 33వ గేయము, పుట 69.

"గగన లక్ష్మియు భాను ఘన వియోగమ్ములో
హారము లొలిచి పెట్టియలలో పడేయునన
విహగ పంక్తులు వ్యోమ వీథులం బయనించి
గూళ్ల చేరగబోవు వేళ్లయగు నంతంత
విశ్వ ప్రకృతి మిత్రు విరహమ్ము గనలేక
సంజ వన్నెల చీర సంత్యాగ మొనరించి
మాసిపోయిన కోక మైదాల్చు కొనుననగ
మసక చీకటులల్ల దెసలెల్ల నలముకొను"[1]

ఇట్టివే కావ్యమున మరికొన్ని చోట్ల రమ్యమైన ధ్వనులు రాజిల్లుచు రంజింప జేయు చున్నవి.

ఈ విధముగా కావ్యకవిత రమణీయ శబ్దార్థాలంకారముల చేతను, భావ చమత్కారము చేతను, ధ్వని వైభవము చేతను సుందరతరమై రసజ్ఞుల నానంద తరంగముల నోలలాడించుచున్నది.

---

1. విప్రలబ్ధ : శుక సందేశము, పుట 96, 97.

# భాషాచ్ఛందో విశేషములు

విప్రలబ్ధ కావ్యమునందు వస్తువు, రసము, వర్ణనలు, అలంకారాదులు పరిశీలించిన పిదప ఇందలి భాష యెట్టిదో ఛందో విశేషము లేవియో అనుశీలింప వలసి యున్నది. ఈ రెంటిలో తొలుత భాషా విశేషములు చర్చింపబడును.

## భాషా విశేషములు :

విప్రలబ్ధ అచ్చమైన దేశికావ్యమని వెనుక మనని చేసితిని. వస్తు భావ రచనములలో దేశీయమైన ఈ కావ్యమున రచనము - శైలీ సామగ్రి - దేశీయమైన విషయము గమనింపవలసి యున్నది. ఇందలి భాష ప్రధానముగా వ్యావహారికమై నవ్యకవితానురూప విరాజితమై యున్నది. మరియు కొన్ని యెడల గ్రాంథికము మరికొన్ని యెడల గ్రాంథిక వ్యావహారిక భాషా సమ్మేళనము కానవచ్చును. కొన్ని పట్టులందు సంస్కార భాషకాగా మరికొన్ని ఘట్టములందు గ్రామ్య భాష ప్రయుక్తమై యున్నది. ఇందలి 'యాస' తీరాంధ్రదేశమునకును తెలంగాణ ప్రాంతమునకును చెందినదై యున్నది. ఇది యంతయు చూడగా నింతటి వైవిధ్యమొక కావ్యము నందుండుట సమంజసమాయని సందేహము కలుగక మానదు. కాని దీనికి ప్రబల మైన కారణము గలదు. దానిని కావ్యకర్త వరదాచార్యులవారు కావ్యములోని 'ముందు మాట'లో నిట్లు తెలిసినారు.

"(లక్ష్మి) తలిదండ్రుల సాహచర్యంలో తెలంగాణపు బాసను మధ్యమధ్య ఆంధ్ర ప్రాంతపు యాసను జతపరచి కలగా పులగంగా మాటాడుతూ ఉంటుంది. ....(రాముడు లక్ష్మికి) అంతస్తుకు దగ్గ సంస్కారవతిగా జేయడానికి చదువూ సంధ్యా నేర్పిస్తాడు. ఆమె వాగ్వ్యవహారంలో గ్రామీణ భాష మరియు సంస్కృత సూక్తి కలసి కదం తొక్కుతూ ఉంటాయి"[1]

ఆచార్యులవారు తెలిపినట్లు లక్ష్మిని పెంచుకొన్న తల్లిదండ్రులు తెలంగాణము వారగుటవల్ల వారి పోషణలో ఆమెకు తెలంగాణబాస యలవడినది. వారు

---

1. విప్రలబ్ధ : 'ముందు మాట' పుట 19

వలసపోయి తీరాంధ్రప్రాంత గోదావరీ మండలమున నివసించుటవల్ల అక్కడి యాస ఆమెకు పట్టుబడినది. కావుననే ఆమె మాటలలో తెలంగాణ ఆంధ్ర ప్రాంతముల బాసలు యాసలు మాండలికములు కలగలుపుగా దొరలుచుండును. మరియు రాముడు అంతస్థుకు తగిన సంస్కారవతిగా చేయుటకు లక్ష్మికి విద్య నేర్పుట వలన ఆమె గ్రామీణ భాష సాంస్కృతిక భాష మాట్లాడుచుండును. కావ్యమునందు భాష నానావిధములుగా నుండుటకిది ప్రబల కారణము. ఇట్లిది పాత్రోచితమై యొప్పుచున్నది. ఇక నాయకుడగు రాముడు గ్రామీణ కర్షకుడగుట వల్లను విద్యా సంస్కారములు గలవాడగుట వల్లను శిష్ట వ్యావహారికము మాట్లాడుచుండును. అతని నుడులలోను అరుదుగా గ్రామీణభాష కొంత కొంత తెలంగాణ బాస దొరలును. గ్రామీణుల సాహచర్యము, లక్ష్మి సంపర్కమే దానికి కారణము. కొన్ని సందర్భములందు గ్రాంథిక భాషయు మాట్లాడుచుండును. ఇదియును పాత్రోచిత భాషయనియే చెప్పనొప్పును దృశ్యకావ్యము లందువలె శ్రవ్యములందు పాత్రోచిత భాష నూటికినూరు పాళ్ళుండుట కానరాదు. కావున పైన వివరించిన రీతిగా ఇందలి భాష పాత్రోచితమై ఒప్పుచున్నది.

## వ్యావహారిక భాష :

నవ్యకవితావిలసితమై గ్రామీణ కర్షక జీవన చిత్రణముగల విప్రలబ్ధలో భాష దాదాపు వ్యావహారికమై యున్నది. అందులోను గ్రామీణ భాష కొంత యున్నను ఎక్కువగా శిష్ట వ్యావహారికము విశిష్టముగా ప్రయుక్తమై యున్నది

"ముండ్లూ రాళ్ళని జంకక పురుగూ బూచని వెరవక
చీకటనక వెలుగనక సిపాయి బిడ్డవై సాగి" (పుట 12)

''పచ్చి కడవల మబ్బు విచ్చిపోయి కురువాలె....
చిలకయై తనువెల్ల పులకింప చూడాలె'' (పుట 13)

''కనుపాపల చెక్కని మెరసింది....చలి గాడుపు రివరివ విసరింది''
(పుట 15)

"కోడెనాగులై యురికేవాగులు క్షీరధారలై పారే తోగులు" (పుట 16)

"ముదితమయూరం పింఛము విప్పి ముద్దుగ నాట్యం సలిపింది"
(పుట 16)

ఇష్టే మంతరిస్తున్నది, పీటేసి (పుట 20), మోమాటము, చూడబోతే (పుట 21), చూడాలె, చూస్తుంటె, మాటల్లో (పుట 24), ఇమ్మంటావు (పుట 35), త్రొక్కేటి (పుట 37), స్వర్గాన్ని (పుట 39), అవిటోళ్ళు, చెవిటోళ్ళు (పుట 40), నవ్వేస్తు (పుట 60), కట్టుకుని (పుట 87), అయ్యేదేన (పుట 108), కష్టపెడితి (పుట 111), అంతా (పుట 119), మున్నగునవి శిష్టవ్యావహారికములు ప్రయుక్తములై యున్నవి.

## గ్రాంథిక భాష :

కావ్యమున గ్రాంథిక భాష అందందు కొంత ప్రయోగింపబడియున్నది. ఇది ముఖ్యముగా కవి చెప్పినట్లున్న మొదటి గేయములందును, మరికొన్ని వర్ణనాత్మక గేయములందును కూర్పబడినది. సంభాషణలలోను ఇతర విషయ వ్యక్తీకరణములందు మాత్రము వ్యావహారికమే ప్రయుక్తమై యున్నందున నిందలి గ్రాంథికము సందర్భోచితమైనదనుట యుక్తమే.

కవి రైతురాజుకు సుప్రభాతము పాడిన తొలి గేయములో

"ప్రాక్సతియు నొకవంక పైడి పళ్ళెరమూని తారకా మణిదీప నీరాజనా
లిచ్చు
అడుగులకు మడుగులే యర్పించు పచ్చికలు పరచు హిమబిందువుల
పాద్యక్రియ లొసంగు....
తమ్ములును సుప్తనేత్రమ్ము లొకరవ విప్ప కొమ్మలు పికమ్ముల
గళమ్ములను సవరించి...."[1]

అని యిత్యాదికా గ్రాంథిక భాషలో సాగినది గేయము.

"వచ్చెను వచ్చెను వర్షాలు-మా వసుధారాణికి తలబ్రాలు
విచ్చిన పూలై ప్రజాముఖమ్ముల వెల్లివిరిసెను మురిపాలు"[2]

అని సాగిన వర్ష వర్ణనలోను

"చదువులు సంధ్యలు నేర్చిన సదసద్వివేక మొలయును
చదల సూర్యుడుదయించనె సరిమార్గమెదో తెలియును"[3]

అని విద్యామూల్యమును వివరించిన గేయము నందును,

1. విప్రలబ్ధ ; 1 వ గేయము, పుట 1, 2
2. ,, : 8 వ గేయము, పుట 15
3. ,, : 21 వ గేయము పుట 44

"ఈ తీవియలం బూచునవెన్నియొ మణిదీపమ్ములు
మారుతహతి మలగవింక మన యదృష్ట రూపమ్ములు
ఎంతది మనకిక చంద్రుల ఇంద్రుల లక్ష్యమ్మనంగ
వెలుగులు చేజిక్కె నింటి వెనుకనె పాతాళగంగ"[1]

అని వద్యుచ్ఛక్తి వర్ణన కావించినదానిలోను

"అపరాబ్ధి నాదిత్యు డంతరించుట గాంచి నిను వీడి క్షణమేని నిలువ లేమేగకుర
యని కొలని ముకుళించు నంబుజాతములెల్ల కేలెత్తి మ్రొక్కి బతిమాలు చున్నటు దోచు"[2]

అన్న సాయం వర్ణనలోను గ్రాంధికభాష చెలువుమీరి యున్నది. వర్ణనాత్మకము లైన యీ గేయములలో గ్రాంథికభాషా ప్రయోగము సమంజసమై యొప్పుచున్నది.

## మిశ్రభాష :

కావ్యమున అనేకసందర్భములందు గ్రాంథికము వ్యావహారికము కలిసి యున్న మిశ్రభాష వాడుక చేయబడియున్నది. దీనికిని, తర్వాత పేర్కొనబడిన ఆంధ్ర తెలంగాణ ప్రాంతముల బాసల యాసల విన్యాసమునకును వ్యాసము మొదట తెలిపినదే కారణమైయున్నది.

"సంపెగ సొంపులతో నెయ్యంపు వియ్యమందెడి నీ
మిసమిసలాడే చొక్కపు పసిండి మైదీవియలో
పల్లవాల ప్రసూనాల ఫలసంపదలను గ్రోలే
పికమై మధుమత్త శిలీముఖమై శుకమై యొప్పెడి"[3]

అని లక్ష్మి ప్రియునికై నిరీక్షించుచు పలికినదానిలోను,

"ఇది సుఖమ్మనుకుంటె ఎద తాపముంబెట్టు ఇది కష్టమనుకుంటె యిడువగా లేనొట్టు
కదలిపోదామంటె కాలేమొ రాదు వదలకుండామంటె లోకాపవాదు"[4]

అని లక్ష్మి రాముని గాంచి విరహతాప పరవశయైన గేయమునందును,

1. విప్రలబ్ధ : 26వ గేయము, పుట 55.
2. ,, : శుకసందేశము, పుట 96.
3. ,, : 4వ గేయము, పుట 8.
4. ,, : 12వ గేయము, పుట 23.

"ఇంటికే దీపమ్మ అందాల రూపమ్మ రాజులకె దొరకనీ రత్న
మాణిక్యమ్మ
కంటిలో పాపనై యుంటెంతొ బాగుండు క్షణము కనబడకుంటె జగము
మున్గినటుండు"1

అని రాముడు పాడుకొన్న విరహ గీతికలోను గ్రాంథికము వ్యావహారికము కలగలుపుగా పొలుపొందియున్నవి. ఇట్టివెన్నియో విప్రలబ్ధలో కలవు.

## తెలంగాణ, ఆంధ్ర ప్రాంతముల బాసలు యాసలు :

కావ్యమున ముఖ్యముగా లక్ష్మి వాగ్వ్యవహారములో తెలంగాణమునకు, ఆంధ్రప్రాంతమునకు చెందిన బాసలు యాసలు అనేక సందర్భములందు ప్రయుక్తము లయియుండి యుభయ ప్రాంతముల భాషా సమన్వయమునకు దోహదమిచ్చుచున్నవి. మచ్చునకు కొన్నిటిని ఉదాహరింతును.

కురువాలె (పుట 13), చూడాలె (13), దాచిండు (25), పుటుకబుట్టిండు (104), నమ్మకుండేదుంటె (109) మున్నగు క్రియారూపములు తెలంగాణ వ్యవహారములో నున్నవి. అట్లే రామచక్కని గుణము (23), గోదలు (34) (ఆవులు, ఎద్దులు అని యర్థము), ఆగమై పోతావు (39) (తప్పిపోతావు అని అర్థము) మారాజు (40) (మహారాజు, గొప్పవాడు అని అర్థము) ఇసమోలె (60) (విషముపలె అని అర్థము), ఒడి (70) ('ఒడి' యనుదాని రూపాంతరము), గోలు (89) (తాపపడు అని అర్థము) బక్కలు (98) (ఎద్దులు అని అర్థము) వంటివి తెలంగాణ వాడుకలో గల మాండలికములు.

ఇక పోశాము (14), నీరెట్టాము (14), గేదెలు (16) కొంగట్టి (29) (కొంగుపట్టి అని అర్థము), యెళుదాము (35), బుజ్జి (35), మామ (38) (మామ యను పదమును ఆంధ్ర ప్రాంతములో గ్రామీణులు 'బావ' యను నర్థములో వ్యవహరింతురు. నాగరికులగు సంస్కారవంతులలో మాత్రము 'బావ' యనియే వాడుదురు) గోల (39), మొహము (47), సూరీడు (45),

1. విప్రలబ్ధ : 81 వ గేయము, పుట 66

ఎన్నలా (48) ('వెన్నవలె' అని), తేలిపోతుండాను (50), మల్లె (63), (వలె అని), దేముడవు (62) నిదురోత (70) (నిదురపోతాను అని), హంసల్లె (76), ('హంసవలె' అని), రాతెట్టిగున్నదొ (88), పండంటి (83), నిదురుచ్చు (102), బెంగెట్టుకొని (103), ఒద్దు (110), పోతోంది (111), అబ్బాయి (127) మున్నగు క్రియారూపములు, యాసలు మాండలికములు అంధ్రప్రాంత వ్యవహారమున గలవి. ఈ తెలంగాణ ఆంధ్ర ప్రాంతముల యాసనుడులును కలగలుపుగా రైతురాముడు కొన్ని వాడినను ఎక్కువగా లక్ష్మి వాడుకచేసినది.

## గ్రామీణ భాష :

విప్రలబ్ధలో పైన పేర్కొనిన బాసలు యాసలు మాండలికములేకాక జానపద కథాకావ్యమగుటచేత గ్రామీణభాషయు అక్కడక్కడ నిసర్గముగా, సముచితముగా వాడుకచేయబడియున్నది. ఇది దాదాపు తెలుగుదేశమంతటను గ్రామీణజన వ్యవహారములో నున్నట్టిది.

మోమాటము (21), మాటల్లొ (24), లక్షల్లు (24), వల్లను (27) ('ఒల్లను' అని), వెన్నెల (28), ఎంకన్న (35), నవ్వుల్ల పువ్వుల్లు (37), చక్కన్ని (39), ఇడువకే (39), ఆపదల మొక్కోడ (41), అలక (42) ('అలుక' అని), సర్గాన (43), పున్నమ్మ చంద్రున్ని (48), ఎన్నెల్లొ (48), ఇష్టమూర్తి (53), వయ్యారి (59), అమురుతము (70) లచ్చిమి (63), సత్తెము (66), అమ్మోరు (67), లక్షిమి (72), అనోడు (87) గోలచ్చిమి (98), ఒడిసేల (100), పలుకుక్కాలు (104) (పలుకక్కి అను పదమునకు రూపాంతరము) ఉండేటోడేనె (105) లోకుల్లు కాకుల్లు (106), ఎట్టివానీ నడక (110), ఎంకదేకుడు (114), గోదారి (125) విచ్చుళ్ల (135) అనునవి ఇందలి గ్రామీణ పదములు. ఇంతేకాక అందంమ లోకముతొ (32) కలలొ నీడలొ (105) ఆత్మతొ (10) వంటి పదాలు 'లొ' 'తొ' అనువానితో గూడిన గ్రామ్యములు ప్రయుక్తమైయున్నవి. ఇవి గ్రామీణజన వ్యవహారములో నున్నట్టివే చంద్రుని 'చందప్ప' (75) అనుట ఆచార్యులవారికిష్టమై అనేక సందర్భములందు ప్రయుక్తమై కానబడును.

## సంస్కృతాంధ్రములు :

గ్రాంథిక వ్యావహారికాది పద ప్రయోగమే కాక విప్రలబ్ధలో సాంస్కృతిక రచన అచ్ఛిక రచన అక్కడక్కడ సందర్భోచితముగా ప్రయోగింపబడినవి. కవి చెప్పినట్లున్న తొలి గేయాలలోను, వర్ణనాత్మకములగు భాగములందును సాంస్కృతికము కొంత ఎక్కువగా నుండి ఇతరత్రను, గ్రామీణ చిత్రణములోను, సంభాషణలోను అచ్ఛిక మధికముగా అలరారుచున్నది. వర్ణనలందు కొన్నియెడల సమ సంస్కృతాంధ్ర పదరచన రాజిల్లుచున్నది. సామూహికముగా అచ్ఛిక పద ప్రయోగము తరచై — దేశిరచనోద్భాసితమై యింపు నింపుచున్నది.

## సాంస్కృతిక రచన :

''రవి శశియు నిత్య నీరాజనము లీయగా
పవనుండు తరులతా చామరము వేయగా
నవ మోహనమ్ములౌ నాగేటి వృషభముల్
నందీశ్వరులుగాక నటరాజమూర్తివై ''1

అని కవి రైతురాజును ఆహ్వానించిన గేయము సాంస్కృతికమై యున్నది. ఇట్లే

''అస్తాద్రి సానువుల సమరు రంగస్థలిని
అరుణ సంధ్యాయవనికాగ్రమున నటియింప
నందిపైనెక్కి చను నటరాజ మూర్తియన
పసులకాపరి యెద్దుపై స్వారియై చనును''2

అన్న సూర్యాస్తమయ వర్ణనలోను

''జలదరూప వ్యష్టిజలము జలనిధి గలిసెను వెలిసెను
విద్యుద్వల్లీ కాంతులు విశ్వశక్తి లీనమయ్యె
గడగడ నుఱుమే గర్జన గగనములో నిదురించెను
హరిధనుస్సు రంగులన్ని యుఱ్కులి కరముల దాగెను''3.

అను వైరాగ్య భావనలోను,

వివిధ జాతి వృక్షమ్ములు విపినమ్మున కలిసి మెలగు
జాతి యొక్కటేయైనను సాటి నరుని ద్వేషింతువు

1. విప్రలబ్ధ : 2 వ గేయము, పుట 3
2. " : శుక సందేశము, పుట 97
3. " : 49 వ గేయము, పుట 119

"జాతి మతాతీత ప్రేమ సర్వేశ్వరుడని తెలియుము
మానవత యనం బ్రేమయె దాని ద్వేషి హరిద్వేషి"1.

అని మానవతను ప్రబోధించుటలోను సాంస్కృతిక రచన చేయబడి సముచితమై యొప్పుచున్నది. ఇట్లే అందందు కొంత ఇట్టి సాంస్కృతిక రచన కాననగును.

## ఆచ్ఛిక రచన :

దేశి కావ్యమగు విప్రలబ్ధ ఆచ్ఛిక రచనా ప్రచురమై అందగించుచున్నది. వర్ణనలందును, సంభాషణములందును, ఇతరములైన ఘట్టము లందును అంతటను జాను తెలుగు తేనె యలుగై జాలు వారుచున్నది. కబ్బములో ముప్పాతిక యావ రించిన తెలుగు పలుకుబడికి నీటగు చాటువ లొకకొన్ని యిత్తును.

"చీకటులు గబ్బిలపు మూకలై తలవంచె
చీకు కన్గవ నంధ లోకాల నివసించె
చుక్కలన్నియు మంచు ముక్కలై పచ్చికలపై
వ్రాలె ముత్యాల పొరజల్లిన లీల"2

అని కవి పాడిన సుప్రభాతములో,

"చెకిముకిల సంచితో జాలె మొలపట్టతో
కిల్లు చెప్పులతోడ తుట్టాయి పాగతో"3.

అని రైతురాజు వేష వర్ణనలో,

"బంతిపూల కొప్పులతో పచ్చబొట్ల యొప్పులతో
ఒల్లియ కాసెపై వెండి బిళ్ళల మొలకట్లు మెరయ...."4

అను రైతురాణి వేష వర్ణనలో,

"పెదవి చెలియలికట్ట నాదుగు సిగ్గుల కదలి
నవ్వు ముత్యాల్ బోసి నా గుండె కొన్నది...."5.

అని రాముడు లక్ష్మిని తిలకించి పులకించి తలచిన దానిలో,

1. విప్రలబ్ధ : 50 వ గేయము పుట 122
2. " : 1 " " 2
3. " : 2 " " 4
4. " : 3 " " 6
5. " : 10 " " 19

''బుగ్గపై చిటికేసి ముంగురుల నెగదోసి జాలిచూపులరాలు నీలాలు వెలబోసి
మాట మాటల్లొ నా మనసంత కోసేసి నవ్వుతూ నవ్వించి కవ్వించి
కరగించి''1.

అని లక్ష్మి విరహ పరవశయై తలపోసిన దానిలో,

"గలగలా నవ్వుల్ల గంపబోర్లించినటు ఒయ్యారముల కడవ లొలక
బోసినయట్లు
కొత్త దంపతులెవరొ కొసరు గుసగుసలట్లు మరుని గజ్జెలగుల్లుమన నేగు
సెలయేరు"2.

అన్న సెలయేటి వర్ణనలో ఇట్లే అనేకానేక సన్నివేశములందు కమ్మని తెలుగు నవ్వడి జుమ్మని యెదల మారుమ్రోగుచున్నది పై నుదాహరించిన గేయ భాగములలో నెక్కడనో యొక్క సంస్కృత పదమున్నను తక్కినదెల్ల అచ్చికమే. ఇంకను ముచ్చటైన అచ్చతెలుగు పలుకులను అంతటను చూడగలము.

చొక్కంపు పసిండి మైదీవియ (పుట 8), మవ్వంపు పువ్వులు (10), చెలువకడలి (10), వలపు పూదోట (10), మేల్ముత్తెముల పేరు (49), క్రీరెప్ప (51), వెన్నెల పాలవెల్లి (55), ఇనుప గజ్జియలతల్లి (55), దోరవయసు ఒయ్యారపు సొరులు (62), అరియప్పనము (64) తొగరు చూపులు (68), చెమట ముత్తెపుచాలు (76), అంటుమామిడి చిగురుల మొలక (84), చేకుటాకుల గొడుగు (94), సంజవన్నెల్చీర (97), తెల్లచుక్కల మ్రుగ్గు (102), క్రొమ్మావి చిగురుపచ్చల కొమ్మ (103) వంటి అచ్చికసమాసములు అందములు చిందించుచున్నవి.

## సమ సంస్కృతాంధ్ర పదరచన :

కావ్యమున అందందు సమసంస్కృతాంధ్ర పదమిశితమగు రమ్యశైలియు సాక్షాత్కరించుచున్నది.

"సంపెంగ సొంపులతో నెయ్యంపు వియ్యమందెడి నీ
మిసమిసలాడే చొక్కపు పసిండి మైదీవియలో
పల్లవాల ప్రసూనాల ఫలసంపదలను గ్రోలే
పికమై మధుమత్త శిలీముఖమై శుకమై యొప్పెడి"3.

1. విప్రలబ్ధ : 12వ గేయము, 24 పుట.
2. ,, : 28వ గేయము, 49 పుట.
3. ,, ; 4వ గేయము, 8 పుట.

ఈ గేయభాగమున మొదటి రెండు పాదాలలో అచ్చిక రచన, తర్వాతి పాదాలలో సాంస్కృతిక రచన చక్కగా చేయబడియున్నది. ఇట్లే,

"మద వృషభమ్ములు కొమ్ముల గ్రుమ్మచు మట్టిని జిమ్ముచు అంకె వేయగా
ముదిత మయూరం పింఛము విప్పి ముద్దుగ నాట్యం సలిపింది"[1]

అప్సరస్తారకలు ఆకాశగంగలో జలకమాడగనెంచి పలురంగు చీరలను
విడిచిదరినిడి నీటబడి మున్గ వారి చీరలె వన్నెమబ్బులయి వెలిగెనదె
నుదయాద్రి"[2].

ఇత్యాది గేయములలో సంస్కృతాంధ్ర పదములు చక్కగా మిళితమై చెలువులు గులుకుచున్నవి.

## అన్యదేశ్యములు :

సంస్కృతాంధ్ర పదములేకాక విప్రలబ్ధలో ప్రకరణోచితముగా అన్యదేశ్యములును కొన్ని ప్రయోగింపబడియున్నవి. వీనిలో ఉరుదూ పదములెక్కువగా ఉండి ఆంగ్లపదములొకటిరెండు కలవు. సుల్తానా (పుట 5), సిపాయి (12), బాజాలు (13), పరదాలు (13), జంబియాలు (29), రోజు (98), గులాబీలు (84), కబురు (87), తరిబీతు (92), పచ్చీసు (119), తమాష (129), గుండాలు (130), బాబు (155), సైతాను (132), జైహింద్ (134), భాయి (135), ఖానా (135), గానా (135), హిందుస్థాన్ (137), అనునవి ఉరుదూ పదములు కాగా రోజా (7), క్లోజు (78), సైంటిస్టు (131) అనునవి మూడు ఆంగ్లపదములు. ప్రధానముగా వ్యావహారిక భాషా విరచితమైన ఈ కావ్యమున జనవ్యవహారములో తరచుగా వినబడు పై అన్యదేశ్యములు ప్రయోగించుట సముచితమైన విషయమే కాగలదు.

## నుడికారములు :

కావ్యశైలి నాకర్షణీయముగా తీర్చిదిద్దుట కనేకముగా నుడికారములు పదబంధములు ధ్వన్యనుకరణములు ప్రయోగింపబడియున్నవి.

1. విప్రలబ్ధ ; 8వ గేయము, పుట 16.
2. ,, : శుకసందేశము, పుట 93.

కనువిప్పగు (పుట 3), జీవగఱ్ఱ (11), కొండెక్కి కూర్చొనక (4) పట్టపగ్గాలు (20), కాసుపీసమునీయ (పుట 41), పిలువని పేరంటము (58), అరియప్పనము (34), చేయెత్తు మనిషి (104), లోకులు కాకులు (106), మ్రింగి నీళ్లను త్రాగుట (115, వంటి నుడికారములు, ముసిముసినవ్వులు (6), మిసమిసలాడే మైదీవియ (8), ఉవి గడ గడ గడ గడ ఉరిమింది, దిశ చక చక చక చక మెరిసింది, చలిగాడుపు రివరివ విసరింది (15) వంటి ధ్వన్యనుకరణములు శైలిని సుందరమొనర్చి అర్థభావదీప్తికి హేతువులైయున్నవి.

## శైలి :

కావ్యమునకు ప్రాణములైన రసభావాదుల వ్యక్తీకరణకు సముదంచితమగు శైలి సంతరింపబడియున్నది. ఇంతవరకుదాహరించిన వ్యావహారిక గ్రాంథికాదుల చేతను సాంస్కృతికాదులచేతను విలసిల్లుచున్న కావ్యశైలి సందర్భోచితముగా రమ్యతరమై అర్థభావపుష్టికి దోహదమొసగుచున్నది. కావ్యమునందలి శైలి సాధారణముగా ప్రసాదమాధుర్యాది గుణశోభితమై వైదర్భీరీతిలో సాగి ద్రాక్షాపాకమున రుచిరమై యొప్పారుచున్నది.

కవి రైతురాజును మేల్కొలుపుటకు సుప్రభాతము పాడిన తొలిగేయము నందలి దిగువ పాదములు చక్కని శైలిలో కూర్చబడి ప్రాభాత ప్రశాంత ప్రకృతి శోభలో సంగీత లయాన్వితముగా కోయిలలు తుమ్మెదలు కావించు నాదమాధురికి సహృదయ హృదయారవిందములను స్పందింప జేయుచున్నవి.

"తమ్ములును సుప్తనేత్రమ్ములౌకరవ విప్ప కొమ్మలు పికమ్ముల గళమ్ములను సవరించి ఝుమ్మను రవమ్ములను తుమ్మెదల శ్రుతి నించి కమ్మనగు సుప్రభాతమ్ము బాడు విపంచి"[1]

మరియు,

''ముసిముసి నవ్వులతో నల్దెసల బర్వు వాల్చూపుల
నొసటం దిద్దిన కుంకుమ పసలుదయార్కుల నీనగ''[2]

---

1. విప్రలబ్ధ : 1వ గేయము, పుట 2.
2. ,, : 3వ గేయము, పుట 6.

అని కవి రైతురాణి నాహ్వానించుచు వర్ణించిన యీ పాదములు రమ్యశైలీ విరాజిత మలై శృంగారమును శోభిల్ల జేయుచున్నవి. ఇట్లే రైతులక్ష్మి నాయకుని గూర్చి వర్ణించిన దిగువ పాదములు మధుర మనోజ్ఞములు.

"మందారపు టందాలను మధురస ప్రబంధాలుగ
సుందరాధరాంచలముల సుధాపానముల గ్రోలే
నాయకుడెవరే ప్రసూన సాయకుడెవరే బాలా!
మొల్ల మొగ్గలను నవ్వే పల్లవరుసలౌకవైపు
కమలాలకు కనువిప్పగు కాటుక కనులొకవైపు"1

'పదానాం పరివృత్తి వైముఖ్యం పాకః' అన్నట్లు రమ్యశైలి కుదాహరించిన పై గేయము లెల్ల పదముల మార్పునకు వీలులేని కూర్పుతో సమర్థముగా సరసముగా ద్రాక్షా పాకమున విరాజిల్లునట్లు రచన చేయబడినది.

"బుగ్గపై చిటికేసి ముంగురుల నెగదోసి జాలిచూపుల రాలు నీలాలు
వెలబోసి
మాట మాటల్లో నా మనసంత కోసేసి నవ్వుతూ నవ్వించి కవ్వించి
కరగించు"2

అనునది లక్ష్మి విరహ పరవశయై పాడుకొన్న వలపుపాట శృంగారానుగుణమైన ప్రసాద మాధుర్య గుణ శోభితమై వైదర్భీరీతిలో చెలువు గులుకగా

"ప్రకృతి యాకలి గొంచు వికటాట్టహాసాల నాల్కలను సాచి యిటు
నడిచి వచ్చును బేల
కసి దీర్చుకొనుటకై కాచేయ పరుగెత్తు పగబట్టి చను నాగుపామోలె
వస్తుంది"3

అని ఉప్పొంగు గోదావరిని వర్ణించినది భయానక రసానురూపముగా పరుషాక్షర పద విభ్రాజితమై యున్నది. ఇట్లే కావ్యశైలి సందర్భోచితమై సరసమై సమర్థకమై చవులూరించుచున్నది.

1. విప్రలబ్ధ : 4వ గేయము, పుట 7, 8.
2. ,, : 12వ గేయము, పుట 24.
3. ,, : 46వ గేయము, పుట 110, 111.

## భాషాలాక్షణికత :

విప్రలబ్ధలో భాష గ్రాంథికము, శిష్ట వ్యావహారికము, గ్రామీణము (గ్రామ్యము) అను మూడు విధముల ప్రయోగింపబడియున్న విషయము వెనుక తెలుపబడెను. ప్రయుక్తమైన గ్రాంథిక భాష సలక్షణమై యున్నది. ఇక నవ్య కవితానురూపముగా ప్రచుర ప్రయోగముగల శిష్ట వ్యావహారికమునకు శిష్టజన వ్యవహారము, ఆధునిక గేయ వచన కావ్యములు ప్రమాణములు. గ్రామీణ భాష యన్నది పల్లీజన పాత్రోచితముగా నవ్య కవితా లక్షణోపేతముగా నున్నందున దానికిగాని శిష్ట వ్యావహారికమునకు గాని లోకవ్యవహారము, ఆధునిక కవి ప్రపంచమే ప్రమాణము కావున శబ్ద శాస్త్రానుసారసాధుత్వా సాధుత్వ చర్చ యవసరము కాదు.

## ఛందోవిశేషము : గేయగతులు :

విప్రలబ్ధ మధురకవితా విరాజితమైన గేయకావ్యము. ఇందు మొత్తము 54 గేయములు కలవు. ఈ గేయములలో గతివైవిధ్యమంతగా కానరాదు. ద్విరద గతి రగడకు చెందిన ఖండగతి గేయములు, హయప్రచార రగడకు చెందిన త్రిశగతి గేయములు, మధురగతి రగడకు చెందిన చతురశ్రగతి గేయములు అను మూడు రకముల గేయములు మాత్రమే కలవు. ఈ మూడు విధములలోను ఖండగతి గేయములు 38, త్రిశగతి గేయములు 13 కాగా చతురశ్రగతి గేయములు 3 మాత్రము రచింపబడియున్నవి. ఆచార్యులవారికి గేయములలో ఖండగతి మిక్కిలి మక్కువయని ఇందలి గేయములవల్లనేకాక మణిమాలలోను ఆహ్వానములోను అత్యధిక సంఖ్యలో కూర్చిన యీ గతి గేయములవల్ల స్పష్టమగుచున్నది. ఖండగతి గేయము ద్విరదగమనముతో నొయ్యారముగా సాగుటయే ఈ మక్కువకు హేతువని తలంపవచ్చును.

## గేయముల పరిమాణము :

ఇందలి గేయములు ప్రాయికముగా ఇరువది పంక్తులనుండి నలువది పంక్తుల వరకు రచింపబడినవి. ఐదు గేయములు మాత్రము పెద్దగా నున్నవి. ఇందులో నలువది రెండవ గేయమగు శుకసందేశము నూట తొంబదియారు పంక్తు

లలో సుదీర్ఘముగా సాగిన అన్నిటికన్న పెద్దగేయము. తక్కిన నాలిగింటిలో లక్ష్మి యేటిలో మునిగిపోయిన పిదప రాముడు విచారముతో తలపోసిన నలువది తొమ్మిదవ గేయము ఏబదియారు పంక్తులు, ఈ గేయము తర్వాతిది రాముని కలలో విప్రుడు కనబడి ప్రబోధించిన ఏబదవ గేయము ఏబదియారు పంక్తులు, మతభేదమును నిరసించుచు రాముడు భావించిన ఏబది మూడవ గేయము డెబ్బది రెండు పంక్తులు. దీని తర్వాతిది కొడుకు పుట్టినరోజున గాంధిజయంతి నాడు లక్ష్మి రాములు పాడుకొన్న 54వ గేయము 58 పంక్తులు కలవిగా విరచింపబడి యున్నవి. వర్ణ్యవిషయము ననుసరించియే ఈ గేయములిట్లు చిన్నగా పెద్దగా కూర్పవలసివచ్చినది. శుకసందేశము విషయగౌరవము చేతను విపుల వర్ణనల చేతను చాల పెద్దదై వైశిష్ట్యమును సంతరించుకొన్నది,

## గేయముల స్వరూపము, మాత్రలు :

విప్రలబ్ధలోని గేయములు శ్రవణ పేయములై రాగాలాపనతో పాడుకొనుట కనువుగా కూర్చబడియున్నవి. కావున ఇవి కథాగతికి వస్తు నిర్వహణకు మాత్రము వ్రాయబడినవి కాక చక్కని పాటలుగా సంతరింపబడినవి. ఒక ఎనిమిది గేయము లలో తప్ప తక్కిన వాని యన్నిటను గేయముమొదట పల్లవి పాదములు కూర్ప బడినవి. ఇవి గీతములలోవలె ప్రతిచరణమునకు ఆవృత్తియయి ఆలాపనకుపక రించుచున్నవి.

కవి సుప్రభాతము పాడిన తొలి గేయమునకు

"నిద్రలేవోయి ఓ రైతురాజా!
లేగటావుల్లు పాల్చేపి యంభారవళి బిల్చు"

అన్నది మకుటము. ఇట్లే 5వ గేయమున లక్ష్మిని గాంచి రాముడాశ్చర్యానందములు పొందిన దానికి

''ఏమి గనుచుంటి నేనేమి గనుచుంటి ? నేనె నా కన్నులను నమ్మలేకుంటి''

అన్నది, రైతు పొలము దున్నిన వర్ణనగల 6వ గేయములో

''దున్నవోయి దున్ను మడిదున్నవోయి దున్ను
వడిగల గిత్తలగట్టి హడా హై కహ్ కెయ్యన''

అన్నవి మకుటములు.

కావ్య గేయములందు కొన్నిటికి నిండుగా శబ్దములు కూర్చియు, కొన్నిటికి గీతాలాపన కనువుగా శూన్య మాత్రలుంచియు రచించుట జరిగినది.

పూర్తిగా సాహిత్యము గూర్చిన గేయాలలో

"ఏడు కొండలవాడ మూడు జగముల జేడ!
కోటొక్క దండాలు కొనవయ్య దయతోడ"[1]

అన్న దొకటి. 'తకిటతక' యన్న ఐదేసి మాత్రాల గణములతో సాగు ఈ గేయమునందు పూర్తిగా శబ్దములు కూర్పబడినవి. ఇట్లే

"పున్నమ్మి చెంద్రున్ని మనసులో నుంచుకొని
ఎన్నెట్లొ సెలయేరు ఎన్నలా కరిగింది"[2]

అన్న ఖండగతి గేయము,

విద్యుద్దీపపు కాంతుల వెలిగి పోవుచున్నావే
లక్ష్మీ! నీ సౌందర్యము లక్షలలో తేలినదే"[3]

అన్న త్రిశ్రగతి గేయము

"అందాల చిలకమ్మ అందె వేయిస్తానె
పాలుబట్టిన జొన్న చేల విందిస్తానె"[4]

అన్న ఖండగతి గల శుకసందేశ గేయము,

"ఎవరు నేను ఎచట ఉంటి ఎచటి నుండి యిటకు వస్తి
ఇచటి నుండి యెటకు బోదు ఇది తెలిసినవాడె నాస్తి"[5]

అన్న త్రిశ్రగతి గేయము, ఇట్టివే మరికొన్ని సాహిత్యము నిండుగా గూర్చిన గేయములు.

ఇక ఒకటి రెండు శూన్య మాత్రలు పాదాంతములందు కొండొకచో పాద మధ్యములందు నిల్పిన గేయము లధికముగా నున్నవి.

---

1. విప్రలబ్ధ : 20వ గేయము, పుట 41.
2. ,, : 23వ గేయము, పుట 48.
3. ,, : 26వ గేయము, పుట 54.
4. ,, : 42వ గేయము. పుట 90
5. .. : 49వ గేయము. పుట 116

U I UI U I I I I U I U I UI III
1. దున్నవోయి దున్ను, మది దున్నవోయి దున్ను ,,,- 12 + 12 మాత్రలు

I I I I U I IUII I U UI U U I I
2. వడి గల గిత్తలగట్టి, హడాహై, కహి కెయ్యన ,,

U I I UII UII U U I I I IU II
3. వంతల మిట్టల బాపి, అంతా సమమొనరించి, ,,

U I I I I I I UII U I U I U U I I
4. అందరకును సమ జీవన మందుబాటులో నుండగ 12 + 12 మాత్రలు"[1].

12 మాత్రల మిశ్రగతిలో సాగిన ఈ గేయ పాదములలో, గుర్తు ఉంచినవి శూన్యమాత్రలు. ఇట్టివి మొదటి పాదమున మధ్యలో ఒక మాత్ర చివరలో 3 మాత్రలు కలవు. ఇట్లే తక్కిన పాదములందు గుర్తించగలము. ఈ శూన్య మాత్రా ప్రయోగము వల్ల గేయము నాలపించుటకు వీలుపడి రమ్యతరమగును.

ఎక్కువ శూన్యమాత్రలు గల మరొక గేయము దిగువ నుదాహరించితిని.

U I U U I UUIUU III UI U U I U I I I U I IIIII
నీవు రావోయి ఓవానదేవా ,,, నీవు రావోయి ఓ వరుణదేవా ,,,,,,
U II I I I UI UU IIII U U I UII U I U U IIIII
ఇంటిపర కొకసారి రావా ,,,, మా పంట చేలను జూచి పోవా ,,,,,,

10 మాత్రలతో ఖండగతిలో సాగిన ఈ గేయములలో ఎక్కువగా శూన్యమాత్ర లుండుటచేత తాళపరిపూర్తికి ఎక్కువగా ఆలపించుటవల్ల ఈ గేయము మరింత ఆకర్షణీయముగా నుండును. మొదటి పాదము మొదట 'నీవు' అన్న త్రిమాత్ర పదము తాళపుదెబ్బకు ముందు లయతో అందుకొని పాడుటకు కూర్పబడినది. ఇట్టివి మరికొన్ని గేయాలలో కానబడుమ. ఇట్లే అనేక గేయములలో శూన్యమాత్రలు తగు మాత్రము కూర్చుట వలన కొంత లయలో మార్పు ఏర్పడి పాటల మాదిరు లలో వైవిధ్యము పొడసూపి రచన మనోజ్ఞమై యొప్పుచున్నది. ఇట్టి గేయాలలో

1. విప్రలబ్ధ : 6వ గేయము, పుట 11

'వచ్చెను వచ్చెను వర్షాలు' (పుట 15), 'కలువు తీయ రావేమే' (57), 'వచ్చేసి మా లచ్చిమేనా' (59), 'లచ్చి వచ్చినాదోయ్ మామా' (61), 'కొంగు నడుముకు జుట్టి (63), 'ఏ జన్మలో నెవరి నెడబాపితిమొ' (65) 'తోడంకి వడ్లు తోడంకి' (79) మున్నగునవి రమణీయములైనని.

చక్కని లయతో సాగిన గేయాలలో క్వాచిత్కముగా గతితప్పిన పట్టులు కానవచ్చుచున్నవి.

"ప్రజలందరిన్ సమగతి పచ్చపచ్చగా నుంచగ
కరువుల వధించు సైన్యముగా వరిపైరులు నిల్వగ"[1]

ఇందు రెండవ పాదమున లయ తప్పినది. 'త్రకిట' యను మూడేసి మాత్రల

III IIUI

గణములతో సాగు ఈ గేయమున 'కరవు లవధించు' అనుటలో రెండవ గణము ఏర్పడుటలేదు. కావున ఈ పాదమున 12 మాత్రలు సరిపోయినను లయ తప్పినది. ఇట్లే,

"మానవ కుటుంబ మొకటను మమతా వేద ప్రబోధము"[2]

అను త్రిశ్రగతి గేయపాదమున లయ తప్పినది. ఒండు రెండిట్లు తప్పుట ప్రామాదికమే కాని వేరుకాదు.

## యతులు, ప్రాస యతులు :

ఇందలి గేయములకు, ఆచార్యులవారి 'ఆహ్వానము' మున్నగు వానిలోని గేయములకు వలెనే లక్షణములో స్వేచ్ఛ కానిపించును. రగడలకు నిర్దేశించిన యతులు ప్రాసలు అన్నిటిని పాటించక రెండేసి పాదములకు యతిగాని ప్రాస యతిగాని కూర్చి రచించుట ఆధునిక గేయరచనలో కనపడు సారళ్యము. ఆచార్యుల వారు అట్లే గేయములన్నిట యతులనుకాని ప్రాస యతులనుగాని యథేచ్ఛముగా వాడినారు. పాదాంత్యప్రాసలు నిర్బంధముగా కాక ఐచ్ఛికముగా కూర్చుటవలన కొన్నిట అవి యుండియు మరికొన్నిట లేకుండియు కన్పడుచున్నవి.

1. విప్రలబ్ధ : 9 వ గేయము, పుట 17
2. విప్రలబ్ధ : 50 వ గేయము, పుట 121

"కోతల పాటల వాణీ! కొడవలిగొను శర్వాణీ!
పాడి పంటలను భువికై ప్రసాదించు శ్రీపాణీ!
"ముసిముసి నవ్వులతో నల్దెసల బర్వు వాల్చూపుల
నొసటందిద్దిన కుంకుమ పసలుదయార్కుల నీనగ''1

ఇందు మొదటి 4 పాదములలో రెండేసి పాదముల కొకటి చొప్పున యతులు, తర్వాతి నాలుగు పాదాలలో ప్రాసయతులు కూర్పబడినవి. ఇందు పూర్వార్ధమున పాదాంత్యప్రాసము కూర్చి ఉత్తరార్ధమున వదలివేయబడినది. గేయములన్నిటను దాదాపు ఇదే లక్షణము కనబడి యింపునింపుచున్నవి. యతులు, ప్రాసయతులు భంగమైన స్థితులును అరుదుగా కన్పట్టును. వానిని దిగువ పేర్కొందును.

"దేహ సుఖాలను విడచి దార పుత్రులన్ మరచి'' (పుట 12)
"మెఱపుటంకుశమూని మబ్బుటేన్గుల నెక్కి" (పుట 13)
''చక్కదనమూ వయసు చెట్టపట్టాల్ బట్టి" (పుట 20)
''శశిలోని యమృత మీ సెలయేటి యూట" (పుట 53)
"చైతన్య ప్రభుదేవుని సేవింపుము కనులు దెరచి'' (పుట 122)
"చైతన్య ప్రభువర్యుని సేవ వీడి నిర్గుణుడని" (పుట 123)
"జైహిందని ఒక్కసారి చేయుడోయి నినాదము (పుట 134)

ఈ యన్నిటియందును యతిభంగము హల్లుల మైత్రిలో కాక వానిమీది యచ్చుల మైత్రిలో జరుగుట గమనార్హమైనది. ఇంతే కాక

''గళమెత్తి కొమ్మూది జయగానముల బాడు" (పుట 2)
''పవనుండు తరులతాచామరము వేయగా" (పుట 3)
"భూదేవి నిను దాక మై పులకలేపార
గోమాత నీ వంట పాల చేపులు మీర" (పుట 4)
"మనసు బట్టగలేక పాపాలుచేస్తారు'' (పుట 40)

ఇత్యాదిగా కొన్నిట యతిభంగమైన సందర్భములును గోచరించును. ఇట్టివియు ప్రామాదికములే కాని పెద్దగా పరిగణ్యమగు దోషములు కావు. ఆచార్యులవారి యతుల విషయము కాని గతుల విషయము కాని మరికొంత మెలకువ పాటించిన

1. విప్రలబ్ధ : 8 వ గేయము, పుట 6

చక్కదిద్దుకొని యుందురు. వారు ఛందో విషయము కొంత స్వేచ్ఛగా వర్తించి రనియు తలంచుటకు వీలు కలదు. ఈ కొంత దొసగు తప్ప గేయములన్నియు ఛందస్సులలో లయాభిరామములై విరాజిల్లుచున్నవి.

## గేయగతులు - ఔచిత్యము :

కావ్య గేయములలో అన్ని రసములకు భావములకు త్రివిధ గతులనే వాడుక చేసి మెప్పించి యుండుటచేత ప్రత్యేక భావమునకు ప్రత్యేకగతి యౌచితీ మంతమై యున్నదవి చర్చింప నవసరము లేదు. కవిగారిందు అత్యధికముగా ఖండగతిలో గేయములను సాగించిన విషయము తెలిపితిని. అది ద్విరదగతి యన్న సార్థక నామముతో వివిధ విలాసములలో లాసము చేయును. కావున దాని నన్ని రసభావములకు అనుగుణమగు గుణరీతి పాకములను కుదురు కొలిపి పొదలింప జేసినారు.

> "రావోయి ఓ వానదేవా !'' (పుట 13) అన్న కరుణరస గేయమునకును
> "ఎవ్వరీ చిన్నది ఎంత బాగున్నది" (పుట 19) అన్న శృంగార గేయమునకును
> "ఊళ్ళకూళ్ళే మ్రింగ నుప్పొంగి చెలరేగు" (పుట 110) అన్న భయానక మునకును

ఖండగతి నుపయోగించిన వైనము చూడగా మాత్రాగణములను నేర్పుగా వాడి యొకే గతిలో సర్వరసభావములను వెలయింప జేసినారని స్పష్టమగుచున్నది.

''వచ్చెను వచ్చెను వర్షాలు మా వసుధారాణికి తలంబ్రాలు" (పుట 15) అన్న గేయము చతురశ్రగతిలో సాగి ఏకతాళలయ యగుటచేత ద్రుతగతి సాగి వర్ష వేగమును కర్షక హర్షోత్కర్షమును వ్యంజింప జేయుట కుపయుక్తముగా ఈ గతి యలరారినది. ఇట్లే అందందు కొంత ఛందోగతికి రసభావ స్థితికి సంబంధము గోచరించుచున్నను సామూహికముగా అన్ని రసభావములకన్ని గతులను నేర్పుగా ప్రయోగించినారనుట యుక్తము. ఈ విధముగా కావ్యమున ఛందస్సు సమంజస ముగా సార్థకముగా రమ్యముగా రసవంతముగా విరాజిల్లినవి.

# కావ్య ప్రబోధము

విప్రలబ్ధ కావ్య మానందముతో సమానముగా ధర్మోపదేశము నందించు చున్నది. కావ్యము పరిమాణములో చిన్నదైనను ప్రబోధములో మిన్నయై యొప్పారు చున్నది. ఇందలి యుపదేశమును పంచవిధములుగా వింగడింపవచ్చును. 1. ప్రణయ జీవిత ప్రబోధము 2. గ్రామీణ కర్షకాభ్యుదయ నీతి 3. మత సామరస్య మానవతా ప్రబోధము 4. దేశభక్తి, జాతీయతా ప్రబోధము 5. ఇతర నీతులు. ఈ యుపదేశము కొన్ని యెడల పాత్రల సంభాషణముల ద్వారమునను మరికొన్ని యెడల కథా నిర్వహణ, వర్ణనాత్మక సంఘటనముల ద్వారమునను, వాచికముగను వ్యంగ్యముగను లభించుచున్నది.

## ప్రణయ జీవిత ప్రబోధము :

కావ్య నాయికా నాయకులగు లక్ష్మి రాములు స్వచ్ఛ హృదయముతో స్వచ్ఛందముగా ప్రేమించుకొని అంతస్తుల యంతరము లెంచక, వ్యతిరేకించు పెద్దలను లెక్కచేయక పెండ్లి చేసికొనిరి. దీనివలన పెండ్లికి అచ్చమైన ప్రేమ, గుణశీలములే ప్రధానము కాని కలిమిలేములు, కులమతాలు కావన్న ప్రబోధము వ్యంగ్యముగా లభించుచున్నది. ఇదే విషయము రాముడు లక్ష్మితో అన్న దిగువ మాటల వలనను వాచ్యముగా తెలియుచున్నది.

"కులమేల మతమేల గుణమె కారణమంచు పదవి భాగ్యాలేల ఎదయె ముఖ్యంబంచు

ప్రణయ రాజ్యములేలు ప్రకృతి దేవతఒడిలొ తోడి స్త్రీపురుషులకు పారమిడుదామె"[1]

ఇంతేకాక ఇదే సందర్భమున ఈ స్వచ్ఛంద ప్రణయ వివాహములో ఈర్ష్యాపరులగు లోకులను సరకు చేయవలదన్న నీతియు బోధింపబడినది.

---

1. విప్రలబ్ధ : 15 వ గేయము పుట 32.

"ఒకరి మేలును జూచి ఓర్వగాలేని యీ పాపిష్ఠి లోకముతొ పనియేమె మనకు

మిట్ట పల్లాల యిక్కట్టు లెన్నుంటేమి గంగ రత్నాకరుని కలియకుంటాదె"[1]

ఉత్తమ దాంపత్యమునకు అమలినమైన అత్యంతమైన అనురాగము, ఎడబా టెరుగని జీవన వాంఛ కావలెనన్న యుపదేశము, లక్ష్మి తన పెనిమిటితో తిరుపతి దేవుని వేడుకోదలచిన విషయము.

"నీ కౌగిటన్ సోలి నీ ప్రేమలను గ్రోలి చావులెరుగని నాట వయసు లుడుగని వీట

ఎడబాటు అననేమొ ఎప్పుడెరుగనిచోట స్వామి సన్నిధిలోనె సర్గ సుఖ మంటాను"[2]

అని వచించుట చేత లభించుచున్నది. ఈ మాటలవలన ధర్మపత్ని కుండవలసిన సాధ్వీ లక్షణములును గ్రాహ్యమగుచున్నవి.

కారణమేదైనను దురదృష్టవశమున లోకాపవాదము వచ్చినపుడు, తల్లి దండ్రుల తీవ్ర వైముఖ్యము తీంద్రించినప్పుడు భార్యను పుట్టింటిలో దిగ విడిచి వచ్చుటచే అక్కడ చిరకాలమున్న కులసతికి పతివియోగ తాపము దుర్భరమగుటయే కాక కాకులగు లోకుల వాకుల బాకులకు గాయపడి పతిగానక గతిగానక ప్రాణ త్యాగము చేసికొనుటకును వెనుకాడరనియు, కులసతులపై వచ్చిన అపవాదము లెంతవరకు నిజమో నిదానముగా విచారించి కర్తవ్య మాలోచించవలయుననియు లోకుల మాటలు నమ్మి తొందరపడి యేమైనచేసిన అనర్థములు సంభవించుననియు నీతిలక్ష్మీరాముల దాంపత్య జీవితము వలన గ్రాహ్యమగుచున్నది. మరియు ఇల్లాలికి పుట్టింటిలో చిరకాలముండుట అనర్థహేతువని లోకాపవాదమువల్లనే కాక, లక్ష్మి

"మావోళ్ళకేమెరుక మరి నాల్గు రోజుల్లు ఉండిపొమ్మంటారు ఉసురోసు కుంటారు"[3]

అని కాకమ్మతో కబురుచేయుటచేత బాధలు పడుటవల్లననియు తెలియును.

1. విప్రపల్లి : 15వ గేయము పుట 32
2. ,, : 17వ గేయము, పుట 33
3. ,, : 41వ గేయము పుట 88

## గ్రామీణ కర్షకాభ్యుదయనీతి :

గ్రామీణులును కర్షక జీవనులునగు లక్ష్మీరాముల జీవిత వృత్తము వలన కర్షకాభ్యుదయము, పశుపోషణము, గ్రామాభ్యుదయము అను వాని నీతి బోధింపబడియున్నది.

సమాజములో కర్షకునికిగల మహా విశిష్ట స్థానము, కృషి మూల్యము వివరింపబడి అతని యభ్యుదయమునకు పాటుపడవలెనన్న ప్రబోధము కావ్యమున ప్రముఖముగా గలదు.

రైతు పాడిపంటలొసగి ప్రజలను పాలించు రాజనియు, అతనికి సూర్య చంద్రులు, వాయువు ప్రకృతి సిద్ధముగా రాజోపచారములు చేయుదురనియు పశువు లతనిని సేవించుననియు భూదేవి సత్ఫలము లొసగుననియు కవి సాదరముగా రైతు నాహ్వానించిన రెండవ గేయములో వర్ణించుటచేత రైతు విలువ తెలియును. అట్లే,

"కోతల పాటల వాణీ! కొడవలి గొను శర్వాణీ!
పాడి పంటలను భువికై ప్రసాదించు శ్రీ పాణీ![1]

అని రైతు పడుచును రాణిగా శర్వాణిగా శ్రీపాణిగా వర్ణించుటచేత ఆమె త్రివిధ శక్తులతో తేజరిల్లి ప్రజలను పాలించు వైశిష్ట్యము చక్కగా విశదమగుచున్నది.

రాముడతిశ్రద్ధాసక్తులతో చేసిన పొలము పనులు వెలిబుచ్చిన భావములు హాలిక వృత్తి మూల్యమును ప్రకటించుచున్నవి. రైతు పొలము దున్ను విషయము గల గేయములో

"కాపే లోకమునకంత కాపటంచు కొలువ సాగ
కట్టె ప్రాణులకు జీవగట్టు యంచు తెలిసి రాగ, దున్నవోయి దున్ను"[2]

అని వర్ణించుటవలన కర్షకుని విలువ చలువ వెల్లడి యగును. మరియు

"రైతన్న లేని రోజు మన జీవితాలు క్లోజు"[3]

1. విప్రలబ్ధ : 3 వ గేయము, 6 వ పుట
2. ,, : 6 వ గేయము, పుట 11
3. ,, : 37 వ గేయము, పుట 78

అనుటలో కర్షకుని ప్రశస్తి యెంతటిదో బాగుగా తెలిసి యతని అభ్యుదయము కూర్చుట యత్యావశ్యకమన్న నీతి గ్రాహ్యమగుచున్నది.

కావ్యమున పశుపోషణ గురించియు, గోసేవ గురించియు చక్కని యుపదేశము లభించును.

"ముచ్చెలకు చర్మమిచ్చి ముండ్లల్లో తాము జచ్చి
వడి బండి గట్ట పారు బసవన్నలకు జోహారు"[1].

అని యనుట వల్లను,

"అమ్మ పాలిస్తుంది అవల చాలిస్తుంది తమ్ముడా తువ్వాయిదగు నోరుగొట్టినా
కపిల పాలిస్తుంది ఎపుడు పాలిస్తుంది మావంటి రైతులకు గోవుల్లె దేవుళ్ల
పాడిపంటలు గోవు నీడలోనే సుమ్మ మా లచ్చి మేదైన
గోలచ్చిమే నమ్మ.... "[2].

అని యిత్యాదిగా చేసిన ప్రశంసవల్ల పశువుల ప్రశస్తి, గోవుల వైశిష్ట్యము చక్కగా తెలిసి వానిని బాగుగా పోషింపవలెనన్న నీతి గ్రాహ్యమగుచున్నది.

దేశాభ్యుదయము గ్రామాభ్యుదయము మీద ఆధారపడి యుండును. గ్రామాభ్యుదయము కర్షకాభ్యుదయముపై పశుసంపద్వృద్ధిపై వ్యవసాయాభివృద్ధిపై ఆధారపడి శోభిల్లును. వ్యవసాయాభివృద్ధికి నీటిపారుదల అత్యావశ్యకము. దానికి ఆధునిక పద్ధతులవలంబించి విద్యుద్యంత్రాలమర్చుకొని బావుల నీరు పారించుకొనుట ప్రశస్తము. విద్యుచ్ఛక్తి నీటి పారుదలకే కాక గ్రామసీమలలో పరిశ్రమలకును, దీపాలు మున్నగువాని సౌకర్యములకును వినియోగపడి ప్రగతికి హేతువగును.

"విద్యుద్దీపపు కాంతుల వెల్గి పోవుచున్నావే
లక్ష్మి! నీ సౌందర్యము లక్షలలో తేలినదే
కడుపునిండ కుడువగలము కరువెక్కడిదే మనకు
మన చేలల్లో నెప్పుడు మాలచ్చిమి తాండవించు
రామారము కీవేళనా సామాన్యపు దినముగాదు
శ్రీమానిని విద్యుద్రుచి చేరవచ్చె నింక బోదు....

1. విప్రలబ్ధ : 37 వ గేయము, పుట 78.
2. ,, : శుకసందేశము, పుట 98.

అందని స్వర్గము మన గృహ మందే ఇక దిగి వచ్చును
నందనవనములు ప్రతి సదనమ్ములోన కన వచ్చును.... "1

అని గ్రామాభ్యుదయ హేతుకమగు విద్యుచ్ఛక్తి వరప్రసాదముగా లభించినదని రైతురాముడానందోత్సాహములతో కొనియాడుట సహజమే. ఈ విషయము వల్ల గ్రామీణులు కర్షకులు విద్యుచ్ఛక్తి నుపయోగించుకొని లాభపడవలెనన్న నీతి గ్రాహ్యమగుచున్నది.

## మతసామరస్య మానవతాప్రబోధము:

విప్రలబ్ధలో మతసామరస్యము, మానవత ప్రధానముగా నుపదేశింపబడినవి ఈ కావ్యరచనకు మూలకారణము దారుణ మతకల్లోలముల వలని మనోవ్యథ కావున సర్వమత సమరసచిత్తులును, మానవతావాదులును అగు కవిగారిందు మతములపేరిట మారణహోమములు చేయుట దానవకృత్యములనియు మతములు కల్పితములనియు మానవతయే సహజమైనది శాశ్వతమైనదనియు అన్ని మతముల వారు సామరస్యభావముతో మెలగి మానవత చెలగి జీవించుట శ్రేయస్కరమనియు ముఖ్యముగా ప్రబోధము చేసిరి.

పగతీర్చుకొనుటకు ఘోరకృత్యములాచరింప వచ్చి చంపబూనిన హిందువుల నుండి ముస్లిముల పాపను హిందూ కాపుదంపతులు దయతో రక్షించి పెంచుకొనుట, అట్టి బాలికను రైతురాముడు పెండ్లాడి తర్వాత ఆమె ముస్లిము వనిత యని తెలిసి లోకాపవాదమునకు వెరవగా విప్రుడొకడు కలలో కన్పడి మత సామరస్య ప్రబోధముచేయగా అతని హృదయము కలకదేరుట నదిలో కొట్టుకొనిపోవు లక్ష్మిని విప్రుడు కాపాడి రాముని కొప్పగించుట, రాముడు లక్ష్మితో ఎట్టి పొరపొచ్చములేని యనురాగముతో జీవితము గడపుట, లోకనింద చెవిబడి రాముడు మతవైషమ్యమును గాటుగా ఖండించుట అను ఈ కావ్యకథయెల్ల వ్యంగ్యముగా మత సామరస్యమును మానవతను ప్రబోధించుచున్నది. మరియు రాముని కలలో విప్రుడు బోధించిన దానివల్లను, తర్వాత రాముడు మతభేద ఖండనము చేయుచు తలపోసిన దానివల్లను వాచ్యముగా మిగుల విలువైన మతసామరస్య మానవతా నీతులు ఉపదేశింపబడి సర్వమత మానవులకు శిరోధార్యములై చెలువొందుచున్నవి.

1, విప్రలబ్ధ : 26వ గేయము, పుట 54,55.

"నీవెవడవు నీవెవడవు నిజం చెప్పు మానవుడా!
నిజముగ మానవుడ వీవు నీజాతియె మానవత-
మమత మానవుని సొమ్ము అది యతనికి సహజమ్ము
మమత వీడు మానవతయె దానవతగ మారు సుమ్ము"[1].

అని కలలో విప్రుడు ప్రబోధించిన దానిలో మానవు డే మతస్థుడైనను వాస్తవముగా అతడు మానవుడు. అతని జాతి మానవత. ఆ మానవతకు మమత సహజమైనది. మమతలేని మానవత దానవత యగునని చక్కగా విశదీకరింపబడినది.

"ప్రేమయె దేవుండనియెడి పెద్దల నుడి నీ వేదము
దేవుండంతట గలడను భావము గురు ప్రసాదము
స్వార్థపరుల చేతిలోన జాతి మతమ్ములు పడుచో
మానవతనె విభజించును మమతా ప్రేమల త్రెంచును
రకరకాల ఆలయాలు ఒకే మట్టి భేదాలు....
మానవ కుటుంబమొకటను మమతా వేద ప్రబోధము
మత కుల భేద వివాదము మానవతకె ప్రమాదము"[2]

అని యిత్యాదిగా మానవత గురించి అమూల్యనీతి యందింపబడినది. ఇంకను ఎన్ని నాటకాలు మధ్య వేసినను నిత్యజీవితములో మనుష్యుడే. ఏ మతమవలంబించి ఏ యాచారములు పాటించినను మానవత్వమును మాత్రము మార్చలేడు. ఎన్ని రంగులను బూసికొన్నను సహజములగు కన్ను ముక్కు మొగమదియే. ఎన్ని జాతులైనను సుఖ దుఃఖము లొక్కటే "ఆల రంగదేదియైన పాల రంగదొక్కటియే". వివిధజాతి వృక్షమ్ములు విపినములో కలిసియుండును. కాని మానవజాతి యొక్కటే యయ్యు మానవుడు సాటి మానవుని ద్వేషించును. జాతి మతాతీత ప్రేమ సర్వేశ్వరుడని తెలియవలెను. "దేవమందిరమున కన్న భావ మందిరము గొప్పది'' ఆ భావమున నుండు చైతన్య ప్రభువేవుని సేవింపవలెను. బహు మతముల సిద్ధాంత భేదములు కాని, పరమాత్మను గురించి పరలోకము గురించి యున్న భిన్నాభిప్రాయములు కాని అవి యెట్లుండినను ఆ కానరాని విషయాలకు కల

1. విప్రలబ్ధ : 50 వ గేయము, పుట 120
2. ,, : 50 వ గేయము, పుట 121

హించుటలన మూర్ఖత" అని మత పరమార్థము, మానవతా వైశిష్ట్యము అనేక దృష్టాంతములతో చక్కగా బోధింపబడినవి.

లక్ష్మి మహమ్మదీయ మతానికి చెందినదని తెలిసి జనులు రహస్యముగా తూలనాడుట విని రాముడు బాధతో మతభేద ఖండనము చేయుచు భావించిన దాని వల్లను మతవైషమ్య దోషము, మతసామరస్య పరమార్థములు బాగుగా ప్రబోధింపబడినవి.

"ఓ దేవా! నిజముగ నీవుండు చోటుకేది త్రోవ
ఏ మతమది సత్యముగా నీదరి జేర్చెడి నావ....
వేదము నీ పలుకేనట బైబిలు నీ పలుకేనట
ఖురాను నీ పలుకేనట పరస్పర విరోధాలట
దేవా! నీవున్నావా! ఉండియె చేస్తున్నావా
తగవులాట బెట్టి మాకు తమాష జూస్తున్నావా"1.

అని ప్రశ్నించుటలో మతములన్నియు దేవుని చేరు మార్గాలయినప్పుడు మతస్థులు వైరములు కలహాలు పెట్టుకొనుట తగదన్న నీతి గ్రాహ్యమగును.

"మతమును మదముగ మార్చుచు మహా మూర్ఖులగు గుండాల్
నరమారణ హోమ బలికి తెరచిరి యజ్ఞపు కుండాల్
ఇట్టి సోమయాజుల కీ విచ్చెదవా స్వర్గసుఖాల్
నీవు దయాళుడవందురు ఏ విధి హింసను సైతువు"2.

అని యనుటలో మతమును మదముగా మార్చి మానవమారణ హోమములు చేసినచో వారికి ఘోర నరకమే కాని సద్గతులుండవని తెలియును. మరియు మత వాదులు దేవునితో మంతనాలాడి ఇప్పుడే యిలకు దయచేసినట్లు దేవునికి తామే నిజమగు ప్రతినిధులమని 'తలా తోక లేకుండా తలా ఒకటి ప్రవచింతురు.' ఈ మతవాదుల ఆగడాలు చూచినచో దేవుడు వద్దు మతము వద్దు ప్రశాంతముగా జీవింప గలుగుటయే చాలునని యనిపించును. ఇంతకు ఈ భావము కలుగుటకు హేతువు మతమూఢుల దోషమని అనేకవిధముల నీతి ప్రబోధింపబడినది.

1. విప్రలబ్ధ : 53 వ గేయము, పుట 129
2. ,, : 53 వ గేయము; పుట 130

మత పరమార్థమిట్లు బోధింపబడినది.

"మతము నేర్పునది అహింస మతము నేర్పు విశ్వప్రేమ
మతము స్వార్థమెడలగొట్టు మతమాత్మను చక్కబెట్టు
మదము నేర్పునది హింస మదము నేర్పు విద్వేషము
మాకు తెలియకడిగెదము మతమా మదమా వీరిది"[1].

ఈ మాటల వల్ల మతమన్నది అత్యంత హితకారియై అహింసను విశ్వప్రేమను పరోపకారబుద్ధిని పెంచి ఆత్మోన్నతికి కారణమగును కావున మతమవలంభించి సత్ప్రయోజనములను గాంచవలెగాని మతమును మదముగా మార్చి హింసాదుల చేత ధ్వంసము చేయగూడదన్న యుపదేశము లభించుచున్నది. మరియు ఈశ్వరు డంతట నుండియు కానరాడు. అంతమాత్రాన అతడు లేడని భావించరాదు. కనబడు రూపములలో కానరాని ఆత్మస్వరూపుడే పరమాత్ముడు. మానవరూపములో నతని గాంచి సేవింపవలెను. అన్ని రూపములు తానేయయి యతడు సగుణుడు. అన్నిటిలో నున్న ఆత్మాకృతిచేత నిర్గుణుడు. భిన్న రూపములలో ఏకత్వమున నుండి విశ్వరూపియై వెలసియున్న పరమాత్ముని సేవింపవలెనను ఈశ్వరతత్త్వము ఆస్తికత చక్కగా బోధింపబడినవి.

ఇంకను 'దేవుడొక్కడే యని సర్వమతములు తెలిపెను. మానవులంద రతని పుత్రులే యగు సోదరులు. వసుధైక కుటుంబియై ప్రకాశించు దేవుడు సహోదరులగు అతని బిడ్డలు కలహించుకొన్నచో అతని యెద గాయపడును. ప్రేమ యనునది దైవ స్వరూపము. ద్వేషమే సైతాను. భిన్నమతము లొక్కే బడిలోని చిన్న పెద్ద తరగతులు. అవి యన్ని యొకే జ్ఞానాంబుధిలో కలసిపోవు ఉపనదులు. అంతులేని ఆకాశమువంటి అప్రమేయ పరమేశ్వరుని మతపు కొల బద్దలతో కించపరచుట అవివేకము'-అని మిక్కిలి విలువైన సూక్తులుపదేశింప బడినవి. మతభేద ఖండనము చేయుచు

''పరుడెవ్వడు లేడనుటయె పరాత్పరుని గుర్తించుట
సరి మానవుప్రేమించుటె స్వర్గములో వర్తించుట
అన్యత బోధించే వారంతా మోసం గురువులు
ఐక్యత భేదించే వారందరు భూమికి బరువులు....

1. విప్రలబ్ధ : 53 వ గేయము; పుట 131

కలహము నేర్పెడి గురువులు గడ్డిని దాగిన బావులు
ఆ గురువుల నమ్మ శిష్యులజ్ఞపశువులగు జీవులు"[1].

అని వచించుటలో చక్కని మతపరమార్థమును గ్రహించి భూతములనే స్వర్గముగా తీర్చిదిద్దుకోవలెననియు. మతభేదద్వేషములను రెచ్చగొట్టు గురువులను నమ్మి మోసపోవలదనియు హెచ్చరిక లభించుచున్నది. మరియును మతకలహాలవలన కులవిద్వేషాలవలన కొట్టుకొని చచ్చుటచేత హారములో పువ్వులన్ని రాల్చబడి దారము మిగులునట్లు జాతి నిర్వీర్యమై రూపుమాయుననియు, మతముకంటె జాతీయ భావనయే గొప్పదనియు ప్రపంచ నాటకములో, చిన్నలు పెద్దలందరు తమతమ పాత్రలను పరస్పరము సమరస భావముతో పోషించినప్పుడే నాటకము రక్తి గట్టుననియు లేనిచో అది 'విచ్చుళ్ళ' యగును కావున జగన్నాటక రక్తికి మానవులందరు మతమౌఢ్యము విడనాడి సహకార భావముతో మెలగవలెననియు చక్కని యుద్బోధ చేయబడినది.

## జాతీయతా ప్రబోధము :

కాపు దంపతులు తమ కొడుకు పుట్టిన దినమున పండుగ చేసికొనుచు, ఆనాడే గాంధిజయంతి అగుటవలన అభినందించుటకు వచ్చిన జనసమూహములో ఆనందోత్సాహములతో పాడుకొన్నదానిలో జాతీయతా ప్రబోధము కావింపబడినది. జాతీయకవి యగు వరదాచార్యులవారి సందర్భము కల్పించి దేశభక్తిని జాతీయతను ఎంతో చక్కగా నుపదేశించినారు.

"జైహిందని ఒక్కసారి చేయుడోయి నినాదము
ఇది గాంధి ప్రసాదము ఏలకోయి వివాదము"[2].

అని ప్రారంభించి హిందూ ముస్లిము ఈసాయి బౌద్ధులు మున్నగువారెల్ల ఒకే మాత పుత్రులనియు ఆ మాత హిందుమాత యనియు బోధించబడినది.

మతాలు వేరైనంత మాత్రమున జాతి వేరని భావించి ద్రోహచర్యలొనర్చుట క్షమార్హము కాదని యిట్లు ప్రబోధింపబడినది.

1. విప్రలబ్ధ : 53 వ గేయము, పుట 132, 133
2. విప్రలబ్ధ : 54 వ గేయము, పుట 134

మతము వేరె అని అరచి మాతృప్రేమనె మరచి
జన్మతోడ వచ్చినట్టి జాతిని బలిజేయుటలో
మన మాతయె హిందుస్థాన్ మరొక పేరనదె భారత్
భారతీయ దేశమ్మది పౌరసత్వమిట వారిదె
ఒకే తల్లి గర్భమ్మున నుదయించిన సోదరులు
అకట మతము మార్చుకొనిన యంతలోనె వేరగుదురె
మతభేదము సోదరతను మార్చలేదు ఓ భాయి!
మతము మధ్య వచ్చినదోయ్ జాతి మాత ఇచ్చినదోయ్
హిందుదేశ 'ఖానా' దిని ఇతరదేశ 'గానా' లను
బాడెడి దుర్మోహులార! స్వమాతృ విద్రోహులార!
దేశవృక్ష మూలములనె తినే చెదలు పురువులార!
కాలుచేత రాచి వేయు కాలమ్మును దెచ్చుకొనక"1.

భారతదేశములో పుట్టినవారెల్ల రొకే జాతి వారనియు మతాలు భిన్నములైనను భారతదేశభక్తితో జాతీయ భావాలతో జీవించువారికే ఇక్కడ పౌరసత్వముండు ననియు మతము మార్చుకొన్నంతలో జాతి మారదనియు, ఈ దేశము తిండి దిని ఇతర దేశముల పాట పాడువారు మాతృద్రోహులనియు అట్టివారికి వినాశము తప్పదనియు గాటుగా హెచ్చరించుట జరిగినది. మరియు ఏ మట్టిలో పుట్టి ఏ భూమిలో నివసించుచు ఎక్కడి కూడు తినుచున్నాడో ఆ భారతభూమికి నిజమైన వారసుడై భక్తితో జీవించవలెకాని నా జాతి వేరనుట ఎవరికి తగదనియు, అమెరికాలో పుట్టినవాడు నేను అమెరికననునన్నట్లే హిందూస్థానములో పుట్టినవాడు హిందూస్థాని ననవలెననియు, వేషభాషా కులమత ప్రాంతీయ భేదములన్ని విడిచి మనమందరము భారత జననీ పుత్రుల మొకే జాతీయులమని ఐకమత్యముతో జీవించి దేశజాత్యభ్యుదయమునకు కృషిచేయవలెననియు ప్రశస్తమైన ప్రబోధము చేయబడినది.

## తాత్త్విక వైరాగ్య బోధ :

లక్ష్మి యేటిలో మునిగిపోయిన పిదప వికలమనస్కుడై రాముడు విచారించిన దానిలో తత్త్వచింత, వైరాగ్యభావన నిబిడమై యుపదేశకమై యున్నవి.

1. విప్రలబ్ధ : 54 వ గేయము, పుట 135

''ఎవరు నేను ఎచట నుంటి ఎచట నుండి ఇటకు వస్తి
ఇచట నుండి యెటకు బోదు ఇది తెలిసినవాడె నాస్తి
మరణము మరణము మరణము మహినెల్లరి కిదె శరణము
చివరి జయము చీకటిదే చీకటి వెల్గులకు రణము''[1]

ఈ వాక్యములు తత్త్వగర్భితములు. తానెవరు ? పుట్టకముందు ఎక్కడ ఏమై యుండెను ? ఇక్కడి నుండి తిరిగి పోవుట యెక్కడికి ? అను విచారము తాత్త్వికమైనది. ఈ రహస్యము తెలిసినవారు లేరు. మనకు కనబడునది క్షణిక జీవనము. తదుపరి మరణము. అది యెవ్వరికిని తప్పించరానిది.

"ఇంతేనా జీవితము ఇదియేనా జీవనము
మంచుగడ్డయై కరగుచు మాయమ్మగు నొక దినము
అంతులేని జలధిలోన నరుగు నెటకు ఈ నావ
అవలి యొడ్డు జూచిరాగ అసలే లేదా త్రోవ
ఒక్కనాడు తెగనరుకగ ఉద్యానము పెంచనేల
చూరుకగ్గి బెట్టుటకై సుందరభవనమ్ములేల ?
పాత్రలోన జీవనమును వడబోయుట బోర్లేయుట
బాగుబాగు ఇదియేనా ప్రభువుదనియు బొమ్మలాట"[2]

అని యిత్యాదిగా వెలిబుచ్చిన భావముల వలన జీవితము క్షణికమైనదనియు, దీనికి భ్రమపడి మురిసి మోసపోవలదనియు తత్త్వము గ్రహించి జీవితము సార్థకము చేసికోవలెననియు నుపదేశము గ్రాహ్యమగుచున్నది.

## ఇతర నీతులు :

కావ్యమున నింతవరకు తెలిపిన ప్రబోధమే కాక ఇతరములైన నీతులు కొన్ని బోధింపబడియున్నవి. రాముడు లక్ష్మిని అంతస్తునకు దగిన సంస్కారవతిగా తీర్చిదిద్దుటకు చదువు నేర్చుకొమ్మని ప్రోత్సహించుట వలన స్త్రీ విద్యాప్రబోధము లభించుచున్నది. గుణవంతురాలగు స్త్రీ విద్య నేర్చిన తావియబ్బిన బంగారమునకు విలువ పెరిగినట్లగుననియు "చదువులు నేర్చిన మొగాలు సౌరభాలు గల పూలు" అనియు బోధింపబడినది.

1. విప్రలబ్ధ : 49వ గేయము, పుట 116
2. ,, : 49వ గేయము, పుట 118

ఆడవాండ్లకేల చదువు అనుకొనియెదవా రాణి !
ఆడది మానవజాతికి ఆదిగురువు అదె వాణి"[1]

అని యనుటలో ఆడవారికి చదువెందుకనువారికి చక్కని సమాధానము లభించి వారు పురుషులతో సమానముగా చదువు నేర్వవలెనన్న యుపదేశము గ్రాహ్యమగుచున్నది. మరియు ఈ సందర్భమున విద్యయొక్క విలువ విశిష్టముగా తెలుపబడినది.

''అభ్యుదయ నిరోధకమీ యధిక సంతు వలదనుచును
విడివిడి యడుగుందూరము నడుసున నొక్కొక కణ్ణను
బలము గల్గి జీవించే కొలదిమంది యైన నేమి
బలహీన శతాల మించి ఫలవంతమ్మగు నిటులన- నాటువేయవోయ్"[2]

అని వచించుట చేత ఈనాడు అత్యవసరముగా ప్రచారములోనున్న కుటుంబ సంక్షేమ ప్రయోజనము ప్రబోధితమగుచున్నది.

కాపు దంపతులు తిరుపతి వెంకన్నను దర్శించి ప్రార్థించుటవల్లను నదిలో కొట్టుకొని పోవుచుండ ఆ దేవుని స్మరించుటవల్లను, ఆమె పునరుజ్జీవితయై వచ్చినప్పుడు దేవునికి కృతజ్ఞత లర్పించుటవల్లను భగవంతుడు కరుణాళువగు వరదుడనియు ఆపన్న శరణ్యుడనియు భక్త రక్షకుడనియు విదితమై దైవభక్తి వ్యంగ్యముగా ప్రబోధింపబడినది.

తిరుపతిదేవుని దర్శనానికి వెళ్ళినప్పుడు రాముడు లక్ష్మితో

"అవిటోళ్ల చెవిటోళ్ల అంధుల్లు కుంటోళ్లు
చేసికోవే లక్ష్మి తోచినా ధర్మాలు
మనసు బట్టగలేక పాపాలు చేస్తారు
ఎన్నంటి కుడుపవే ఎవరోరి కర్మాలు"[3]

అని ప్రోత్సహించుటవలన పూర్వ జన్మమునందలి పుణ్యపాపాలవల్ల సుఖదుఃఖాలు ప్రాప్తించుననియు కావున కష్టాలలో నున్న వారికి దీనులకు దాన ధర్మాలు చేయుట పుణ్యమనియు నీతి గ్రాహ్యమగుచున్నది.

1. విప్రలబ్ధ : 21 వ గేయము, పుట 43
2. " : 9 వ గేయము, పుట 18
3. ,, : 19 వ గేయము, పుట 40

సామ్యవాదము గురించిన ప్రబోధము రాముడు పొలము దున్నుచు పాడిన గేయములో నొకింత కలదు.

"వంతల మిట్టల బాపి-అంతా సమ మొనరించి
అందరకును సమజీవన మందుబాటులో నుండగ
దున్నవోయి దున్ను"1

అను వాక్యముల వలన నిది ద్యోతకమగుచున్నది.

ఈ విధముగా విప్రలబ్ధ ప్రధానముగా మతసామరస్యమును మానవతను ప్రబోధించుచు ఆనుషంగికముగా దేశభక్తిని జాతీయతను, ప్రణయ జీవిత నీతిని, కర్షక జీవనమును గ్రామాభ్యుదయమును, తాత్త్వికతను దైవభక్తిని మున్నగు వానిని ఉపదేశించుచు ఉత్తమ మార్గ దర్శనము చేయుచున్నది.

## ఉప సంహృతి :

సామూహికముగా వరదాచార్యులవారి కృతులు విషయ వైవిధ్యము కలిగి విశిష్ట కవిత వెలిగి విలసిల్లుచున్నవి. వస్తు శిల్పములో, భావ దీప్తిలో రస పోషణాదులలో, రచనా ప్రాగల్భ్యములో సదుపదేశములో, పరమ వైశిష్ట్యమును సంతరించుకొన్నవి. వారి కృతులలో ఉత్తమ మానవాదర్శములు, ఉత్కృష్టనీతులుపదేశింపబడినవి. మత సామరస్య మానవతా వాదము, మమతా వేదము, దేశభక్తి, జాతీయత, విశ్వమానవ సౌభ్రాత్రము, దైవభక్తి, వేదాంతము ప్రశస్తముగా ప్రబోధింపబడినవి. వారి పోతన చరిత్రము కృతులన్నిటిలో హిమాద్రి శిఖర సమున్నతమై శశ్వత్కమనీయ కవితామృతులతో మహోజ్జ్వలముగా ప్రకాశించు చున్నది.

ఆచార్యులవారి సాహిత్య సాగరమును యథాశక్తి మథించి సుకవితాసుధను సంగ్రహించితిని. నాకు బుద్ధిగమ్యము గానిది ఇంకెంత కలదో! అమూల్యములైన వారి కృతిరత్నములకు విలువగట్ట యత్నించితిని. ఎతవరకు కృతకృత్యుడనైతినో సహృదయ విద్వజ్జనము, సాహితీలోకమే ప్రమాణము.

సుకవీంద్రులజరు లమరులు
ప్రకటితకావ్యము లమృతభాండము లాస్వా
దక సుకృతులు సుమనస్సులు
సుకవులకు రసజ్ఞులకును సుమనఃప్రణతుల్

1. విప్రలబ్ధ : 6 వ గేయము, పుట 11

# అనుబంధము - 1

శ్రీ వానమామలై వరదాచార్యులవారితో ప్రత్యక్ష సంభాషణము
(ఆచార్యులవారి సాహితీ జీవిత విశేషములు)

చెన్నూరు, 22-12-1974

**1.** ప్ర: తమరికి కవితా రచనాభిలాష ఎట్లా కలిగింది?

సమాధానము : నా పదమూడవ యేట వాగీశ్వరీ మహా మంత్రము ఉపాసించి సిద్ధి పొందినప్పటి నుండి విద్యాసాహిత్యాల మీద విశేషంగా అభిరుచి కలిగి కావ్యాలు, నాటకాలు, శాస్త్రగ్రంథాలు చదువుతూ వ్యుత్పత్తి పెంచుకొంటున్న రోజుల్లో మా అన్నలు ముఖ్యంగా జగ్గన్నగారు (జగన్నాథాచార్యులవారు) కవిత వ్రాస్తున్నది చూసి నాకును కవిత వ్రాయవలెననే కుతూహలం కలిగింది. నాలో నిహితమై ఉన్న కవితాశక్తి బయట పడింది. ఒకింత ఛందస్సు వారివద్ద తెలిసికొని గీతపద్యం వ్రాసి ఆయన మెప్పు పొందినాను. పిమ్మట "దాగురు మూతలు" అనే పేరున నూరు గీత పద్యములు వ్రాయగా పెద్దన్నగారు చూసి ఎంతో సంతోషించి ఆశీర్వదించినారు. అప్పటి నుండి మహోత్సాహముతో కవితలు వ్రాయ సాగితిని.

**2.** ప్రశ్న : రచనలో తమ ప్రథమానుభూతి యెట్టిది?

సమాధానము : మొదట వ్రాసిన పద్యాలకు అన్నల ఆశీర్వాదం మిత్రుల ప్రోత్సాహం లభించినప్పుడు ఒక సామ్రాజ్యం దొరికినంత ఆనందమైంది. మంచి కవితలు వ్రాసి మనిషుల మన్నన పొందగలననే దృఢ విశ్వాసం నాలో పాదుకొన్నది.

**3.** ప్రశ్న : తమ సాహిత్య జీవితముపై వారసత్వము పరిసరాలు వేసిన ముద్ర ఎటువంటిది?

సమాధానము : మా నాయనగారు అన్నలు గొప్పపండితులు కవులు ఐ ఉండుట వలన మా యింటిలో నిరంతరం జరిగే శాస్త్ర సాహిత్యగోష్ఠులు కావ్య

గానములు వింటూ ఉండే వాడిని. ఆ రోజులలో మడికొండకు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, కొప్పరపు కవులు, మల్లాది రామకృష్ణ చయనులు మొదలగు విద్వత్కవరేణ్యు లెందరోవచ్చి కావించుచుండిన గోష్ఠులు, ప్రసంగాలు, కావ్యగానములు విని ప్రభావితుడ నయ్యేవాడిని. అంతేకాక వరంగలులో జరిగే సాహిత్య సంగీత నాటకాది కార్యక్రమము లెన్నో చూచి ఉత్తేజితుడనైతిని. ఆ కాలములో హైదరాబాదులో వరంగలులో మడికొండలో మాత్రమే గ్రంథాలయము లుండెను. మడికొండలోని ప్రతాపరుద్రాంధ్ర గ్రంథాలయములో మా పెద్దన్నగారు కవితల పోటీలు పెట్టి బహుమతులిచ్చి ప్రోత్సహించేవారు. నేను ఆ పోటీలలో పాల్గొని బహుమతులు పొందేవాడిని. రెండవ అన్న లక్ష్మణాచార్యులవారు నా కవితా రచనలను చాలా ప్రోత్సహించేవారు. మరియు నా బాల్య గురువులైన కాళోజి రంగారావుగారి యిల్లొక విద్యాసాహిత్య కేంద్రముగా ఉండి నాకు చక్కని శిక్షణ, ప్రోత్సాహము అక్కడ లభించినవి. రంగారావుగారు నాకు రామభక్తిని పాదుకొల్పినారు. ఈ విధంగా నాకు బాల్యం నుండియే ఇంట బయట మంచి వాతావరణము సమకూడి పైతృకముగా వచ్చిన శాస్త్రసాహిత్యాదుల వారసత్వానికి పరిసరాలు దోహదముచేసి నా హృదయ ఫలకముపై ప్రగాఢ ముద్ర వేసినవి.

**4.** ప్రశ్న : తాము నేర్చిన కళలు శాస్త్రములేవి?

సమాధానము : నేను నేర్చినది ప్రధానముగా కవితా కళ. దానికి ఆనుషంగికముగా సంగీతకళ నభ్యసించినాను. హార్మోనియం, తబలా, కంజీరా, చెక్కలు, తంబూరా వాద్యములను స్వయంకృషితో నేర్చుకొన్నాను. తొలుత నాయనగారు నేర్పిన సంగీతమును నా మామ కొదుమగుళ్ల జగన్నాథాచార్యులవారి శిక్షణలో బాగా అభ్యాసము చేసినాను. నాటకాభినయములో హరికథా పురాణ కాలక్షేపములలో ప్రావీణ్యం గడించినాను. చిత్రలేఖనములోను కొంత నైపుణ్యం గడించినాను. ఇక శాస్త్రవిషయాలలో సంస్కృతాంధ్ర కావ్యనాటకాది గ్రంథముల వ్యాకరణ ఛందోలంకారముల అధ్యయనముతో సాహిత్య వైదుష్యం సంపాదించి ప్రధానంగా వేదాంతశాస్త్రం అభ్యసించినాను. వేదాంతమంటే నాకు ప్రాణం. వేదాంత తత్త్వవిలసితము కాని కావ్యముకాని జీవితముకాని నిస్సారమని నా దృఢాభిప్రాయము. వేదాంత విజ్ఞానానికి ప్రస్థానత్రయము సేవించినాను. మరియు విశిష్టాద్వైత సిద్ధాంత విలసితమైన ఉభయ వేదాంతము, జ్యోతిషము, యోగశాస్త్రము,

ధర్మశాస్త్రము, చరిత్ర, రాజనీతి శాస్త్రము మొదలగు విద్యలను సముచితముగా అభ్యసించినాను. ఇవన్నీ నా కావ్యరచనలో సాహిత్యరంగములో బాగా ఉపకరించి నాయి. నా జీవితాన్ని ధన్యం చేసినాయి.

5. ప్రశ్న : తమ రచనలమీద ముఖ్యంగా పోతన చరిత్ర రచనముమీద ప్రభావము వేసిన పురాతనాధునాతన కవులెవరు ? తమ అభిమాన కవులెవరు?

సమాధానము : పూర్వాంధ్ర మహాకవులలో నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, రామరాజ భూషణుడు, చేమకూర వేంకటకవి, ఆధునికులలో రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, కృష్ణశాస్త్రి, జాషువా నన్ను ప్రభావితుని చేసినవారిలో ముఖ్యులు; సంస్కృత మహాకవులలో వాల్మీకి వ్యాసుల ప్రభావమున్నను కాళిదాసు, భవభూతి ఎక్కువగా ఆకర్షించి నారు. ఇతర భారతీయకవులలో తులసీదాసు, సూరదాసు, హాలి, గాలిబు, ఎగ్బాల్, బ్రజ్‌నారాయణ చక్‌బస్త్, మైథిలీశరణ్ గుప్త, జయశంకర్ ప్రసాద్, రవీంద్రుడు, నమ్మాళ్వార్ (తిరువాయి మొజి పాశురాలు), ఆండాళ్ (తిరుప్పావై) మరియు ఆంగ్ల మహాకవులగు షేక్స్పియర్, వర్డ్సువర్తు ప్రభావము కలిగించినారు.

ఇక నాకు అభిమానకవుల నిప్రత్యేకముగా చెప్పుటకు వీలులేదు. పైన తెలిపి నట్లు ప్రభావముద్రవేసిన మహాకవులేకాక సరస సత్కవులందరును నాకభిమానులే ప్రేమపాత్రులే.

6. ప్రశ్న : సంప్రదాయకవితపై తమరికి గల అభిరుచికి కారణమేమి?

సమాధానము : సంప్రదాయ కవిత నవ్యకవిత రెండును నాకిష్టములే. కావుననే నా కావ్యములందు సాంప్రదాయికతను నవ్యతనుకూడ వెలయించితిని. కాగా నాకు సంప్రదాయకవితపై కొంత అభిరుచి యెక్కువనుట వాస్తవమే ఐనా కవితలో సత్సంప్రదాయమునే పాటించేవాన్నికాని పాతదంతా మంచిదని పట్టుకొనే వాన్ని కాదు. చాదస్తం అంటని సంప్రదాయం నాది జీవితంలోనైనా సాహిత్యంలో నైనా అంతే. తరతరాలుగా కవిలోకానుభవంలో నిగ్గుదేలుచు సాగి ఎంతో మేలిమి సంతరించుకొన్నందున సంప్రదాయకవిత అంటే నాకు ఇష్టం. సాధారణంగా సంప్రదాయకవితలో సాహిత్య సంగీత సమ్మేళనం ఉంటుంది. లయాన్వితగతి సౌందర్యం నిండుగా ఉంటుంది. రసభావ పరిపూర్ణమై ఆనందాన్ని వ్యంగ్యోప

దేశాన్ని మెండుగా ఇస్తుంది. చతుర్విధ పురుషార్థసాధకమై విశ్వశ్రేయస్కరమై సత్యం శివం సుందరమ్మై యుంటుంది కావుననే నాకు సంప్రదాయ కవితపై విశేషాభిరుచి.

7. ప్రశ్న : ఆధునిక కవితారీతులపై వచన కవితపై తమ అభిప్రాయ మేమిటి ?

సమాధానము : ఈ విషయంలో పోతనచరిత్రము విజ్ఞప్తిలోను ఇతరత్రను నా అభిప్రాయాలు ప్రకటించియున్నాను. దేశ కాల పాత్రల ననుసరించి మార్పులు జరగడము సహజము. అట్లే సంప్రదాయ కవితలోను నూతన ప్రయోగాలు జరిగి ఆధునిక కవితారీతు లేర్పడినవి. ఈ నవ్యతలోను మేలిమినే హర్షిస్తాను కాని ప్రతి నవ్యప్రయోగము నాకు సమ్మతము కాదు. సంప్రదాయము పునాదిగా లేచిన భవ్యమైన నవ్య కవితా సౌధముల నాశ్రయించుట బుద్ధిమంతుల లక్షణము. కాని నేలవిడిచి సాముచేసే రీతిగా సంప్రదాయాన్ని బొత్తిగా కాదని పుట్టుక వచ్చిన కవితారీతులు నాకు నచ్చవు. నేనెప్పుడు స్వర్ణమునకు వలె కవితకు క్రొత్తపాతలు లేవని భావించేవాన్ని. రసభావభరితమై ఆనందము సద్ధర్మోపదేశము అందించే విశ్వశ్రేయమైన సత్కవిత పూర్వ పద్ధతిలో ఉన్నా నవ్య పద్ధతిలో ఉన్నా నాకు అభ్యంతరము లేదు.

ఇక వచన కవిత గురించి అడిగినారు. సత్కవిత పద్య రూపములో ఉన్నా గద్య రూపములో ఉన్నా ఉపాదేయమే అని నా అభిప్రాయము. ఉత్కృష్టమైన కవితాకళ శోభిల్లవలె కాని అది ఏ రూపములో అందించబడినదన్నది ప్రధానము కాదు. ఐతే ఒక్క విషయమున్నది. శబ్దార్థాలు రసభావాలు రెంటిలో సమానమే ఐనా పద్య కవితలో ఉన్న గతి సౌందర్యము వచన కవితలో లేదు. దానికి గల ఆకర్షణ దీని కుండబోదు. కమ్మని పాయసాన్ని కమనీయ పాత్రలో అందించేది పద్య కవిత. ఈ సౌందర్యము ఈ సౌఖ్యము వచన కవితకు లేదు. పద్య కవితలో దాని శిల్పానికి పరిశ్రమ కావాలి. ఛందో విలసితమైన కవితకు విశేష ప్రయోజనాలున్నవి. వచన కవితకు ఆ పరిశ్రమ లేదు. పద్యము వలన కలిగే ప్రయోజనమూ అందులో కానరాదు.

8. ప్రశ్న : పోతనచరిత్రకు గల ప్రేరణలు ఉద్దేశాలు ఏవి ?

సమాధానము : ఈ విషయం గూడా పోతన చరిత్ర విజ్ఞప్తిలో వివరించి నాను. జాషువా రచించిన 'ఫిరదౌసి' కావ్యము చదివినప్పుడు ఫిరదౌసి దీనుడై దుర్మదాంధుడైన గజనీ మహమ్మద్ చక్రవర్తి ఘోరపీడలకు గురియైన విషయము నా హృదయాన్ని క్షోభపెట్టగా రాజులను ధిక్కరించి స్వతంత్ర జీవనము సాగించిన కర్షక మహాకవి భక్త శిరోమణి బమ్మెర పోతన చరిత్ర కావ్యముగా వ్రాయాలని అనుకున్నాను. కేవలం అతని జీవిత చరిత్ర చిత్రించుట కాక అతని ఉదాత్త గుణశీలములు, ఉత్కృష్ట కవితాదర్శాలు లోకానికి చాటవలెనన్నదే నా ముఖ్య ధ్యేయము.

9. ప్రశ్న : తమకు గల కవిత్వాదర్శాలేవి ?

సమాధానము : ఈ విషయము కూడా మహాకావ్య విజ్ఞప్తిలోను కావ్య కథలో పాత్రలద్వారాను అక్కడక్కడ విపులముగా తెలియజేసినాను. కనుక విడిగా చెప్పవలసిన యవసరము లేదు. మొత్తముమీద ఆలంకారికుల సిద్ధాంత రాద్ధాంత ములలోని భేదాల పట్టింపు నాకులేదు. వారు చెప్పిన సిద్ధాంతము లన్నిటిలోని మంచి యంశాలన్నీ నాకు కావలసినవే. వాటన్నిటి సామరస్య ధోరణులతో సాగే సత్కవితయే నాకు సమ్మతము. అట్లే పురాతనాధునాతన కవితా రీతులలోని మంచిని సొగసును గ్రహించుట భావ్యమని నా తలంపు. ఆనందము సదుపదేశము రెండు నిండుగా అందించి విశ్వకళ్యాణ మొనగూర్చే సత్కావ్యరచన చేయా లన్నదే నా ధ్యేయము :

10. ప్రశ్న : నేటి కవితోద్యమాల గూర్చి తామేమనుకుంటున్నారు ?

సమాధానము : కవితలను వర్గీకరించి వాని స్వరూప స్వభావములను వివరించడం మంచిదే. కాని యీ విషయంలో కవులు కర్గాలుగా చీలిపోయి ఉద్యమాలుగా తీవ్రరూపం దాల్చడం, వాటిలో రాజకీయాలు చొప్పించడం, అన్య కవితావర్గాల వారిపై ద్వేషాలు పెంచుకొని ధ్వజమెత్తడం, ఇవి నాకు సహించవు. ఇప్పుడు కొందరు తీవ్రవాద కవులున్నారు. దిగంబర కవులున్నారు. వారి వర్గవైషమ్యాలు, హింసాపద్ధతులు, అశ్లీల ధోరణులు నిందారీతులు నాకు నచ్చవు. వారి

లక్ష్యము మంచిదే. కాని సాధన మంచిసి కాదు. బట్ట ఉతుకవలెను మంచినీటితోనే. మురికి నీటితో చక్కబడవు.

**11.** ప్రశ్న : వ్యావహారిక భాష గూర్చి తమ యభిప్రాయ మేమి ?

సమాధానము : ప్రాంతీయతత్త్వాలు ప్రబలి అనేకంగా మాండలికాలు యాసలు పెరిగిపోయిన ఈ కాలమున వ్యావహారిక భాషకంటె సార్వదేశికమై భద్రమైయున్న గ్రాంథికము మేలేమో అనిపించుతుంది. ఐతే వ్యావహారికాన్ని విడనాడరాదు. శిష్టవ్యావహారికానికి వ్యాకరణము సిద్ధము కావాలి. అప్పుడు దాని వాడుక సర్వజనామోదము సుబోధము కాగలుగుతుంది. పద్యకావ్యాలలో మాత్రము వ్యావహారికమునకు చేరువగా ఉండే సరళగ్రాంథికము ప్రయోగించి ఇతర గేయ వచన కృతులలో వ్యావహారికభాష వాడుకచేయుట యుక్తమని నాఅభిప్రాయము.

**12** ప్రశ్న : తమ కృతుల గురించి తమకెటువంటి విశ్వాసమున్నది?

సమాధానము : నేను వాగీశ్వరీ సమారాధనం ద్వారా విశ్వశ్రేయస్సును కాంక్షించి యథాశక్తి కష్టపడి కావ్యాలు వ్రాసినాను. అందులో కృతకృత్యుడనైతి నని భావిస్తున్నాను. ఇందుకు సహృదయ పాఠక లోకమే ప్రమాణము. నేను మహా కావ్య రచనకు పూనుకొన్నప్పుడు తొలుత చేతకాదేమో, లోకము నవ్వునేమో ఎందుకంటే నేను ఎక్కువగా చదువుకొన్నవాన్ని కాదు. విద్వాంసున్ని కాదు- అని చింతించినాను. కాని కావ్యరచన తర్వాత పండితాభిప్రాయములు, ప్రశంసలు సన్మానాలు జరిగిన తర్వాత కృషి సార్థకమైనదను విశ్వాసము తృప్తి కలిగినాయి. ఇటీవల వచ్చిన మహాకావ్యాలను చూస్తే నేను సాంప్రదాయిక రచన ఇతరులకంటె ఎక్కువగానే చేసినట్లు భావిస్తాను. పోతన చరిత్రము చిరస్థాయిగా ఉండునని దృఢవిశ్వాసము. ముఖ్యముగా పోతన చరిత్రము, వైశాలిని విప్రలబ్ధ కృతులలో నా పరిశ్రమ ఎక్కువగా చరితార్థమైనదని నేను భావిస్తున్నాను,

**13** ప్రశ్న : సత్కవి వ్యక్తిత్వము ఎట్లుండవలెను?

సమాధానము : సత్కవి గుణవంతుడై యుండవలెను. 'కవిశ్శుచిః' అన్నట్లు లోకానికి సదుపదేశము చేసే కవి తప్పక శుద్ధుడై బుద్ధుడై యుండవలెను. సమాజానికి ఉత్తమాదర్శముగా జీవించవలెను. ప్రశస్తమైన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యా సములతో నిరంతరదీక్షతో ఉత్సాహముతో కావ్యరచన చేస్తుండవలెను. దైన్యము

నకు లోనుగాని వినయము అహంకారానికి అందని ఆత్మాభిమానము కలిగి సమ చిత్తుడై సహృదయ వరేణ్యుడై యుండవలెను. కవి ఒక మతానికో వర్గానికో కట్టు బడి గిరి గీచుకొనియుండక సార్వజనిక సార్వకాలిక సార్వదేశిక శ్రేయస్సును దృష్టియందిడుకొని సత్కావ్యములు రచించవలెను. అట్టివాడే సుకవివర్యుడు కాగలడు.

**14** ప్రశ్న : తమ జీవితములో అత్యంతానందకర ఘట్టాలేమిటో సెల విస్తారా?

సమాధానము : రామతారక వాగీశ్వరీ మహామంత్రముల ఉపాసన, సిద్ధి, ఘోర క్షయవ్యాధినుండి బ్రతికి బయటపడుట, పోతనచరిత్ర మహాకావ్య రచన ముద్రణ తదావిష్కరణ, షష్టిపూర్తి సన్మానసభ - ఇవి సాహితీజీవన ఘట్టాలు. ఇక జాతీయముగా భారత స్వాతంత్ర్యసిద్ధి, హైదరాబాదు రాష్ట్ర విముక్తి, ఆంధ్రప్రదేశావతరణము - ఇవి అత్యంతానందకర ఘట్టాలు.

——

# అనుబంధము - 2

## శ్రీ వరదాచార్యులవారి వ్యక్తిత్వము గురించి
## కవి పండితాభిప్రాయములు

"స్వభావముచే సదాచారసంపదచే వీరు ఇరువురును (పోతన వరదాచార్యులు) ఋషితుల్యులు - శ్రీమద్భాగవతాంధ్రీకరణము పోతనచేత బడుట యెట్టిదో పోతనచరిత్ర ప్రబంధీకరణ మాచార్యులవారిచేత బడుట యట్టిది. వారి చరిత్ర పోతన చరిత్రకు ప్రతిబింబము. అందుచేతనే వారీ చరిత్రము ననుభవ సిద్ధము నట్లింత మధుర సుందరముగా వెలయింపజాలినారు"

పోతన చరిత్రము : 'తొలి పలుకు'. పుట XVII

— ఆచార్య దివాకర్ల వెంకటావధాని

"పోతన్న జీవితానికీ, వరదన్న జీవితానికీ మధ్య ఎంతో సామ్యం ఉంది. నిర్ధనత్వంలో సామ్యం ఉంది. అమృత హృదయంలో సామ్యం ఉంది. కవితా వైభవంలో సామ్యం ఉంది. ఉదాత్త కల్పనల్లో సామ్యం ఉంది. పదలాలిత్యంలో సామ్యం ఉంది. వేయేల ఒక్క కృషీవలత్వంలో తప్ప అన్ని విషయాల్లోనూ సామ్యం ఉందంటే అతిశయోక్తి కాదు.........పోతన జీవితాన్ని వరదన్న వ్రాస్తే వరదన్న జీవితాన్నెవరైనా వ్రాయబూనితే ఎంత బాగుండేది".

పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 80,81

— పి. వి. నరసింహారావు

"మంద్ర గంభీర స్వరముతో వీరు పద్యపఠనము చేయుచున్నప్పుడు, ఆందలి కవితాసారామృతము వినువారి సర్వేంద్రియములకు సంతృప్తిని, అపరిమితానందమును కలిగించుటయే కాక వీరి రచనాపాటవము విద్వాంసుల నుఝ్ఝాత లూగించి ఇక్కాలము నందింతటి విద్వత్కవిశేఖరుడితరత్ర నున్నాడా

యను నాశ్చర్యమును, ఆనందమును, తన్మయత్వమును కలిగించి యప్రయత్న ముగా ప్రశంసావాక్యముల గురిపించు నటులొనర్చును.''

పోతన చరిత్రము : పండితాభిప్రాయములు'
— 'శిరోమణి' కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

''తెలుగు కవులలో వారిది (వరదాచార్యుల వారిది) విశిష్టమైన వ్యక్తిత్వము. ప్రాచీన అధునాతన సాహితీపరులకు సర్వవిధాల మధ్యవర్తిగా నుండదగిన కవిశిరోమణులు శ్రీ ఆచార్యులవారు .... తెలుగు సాహిత్యములో సర్వవిధాల పోతనచెంత నిలువదగిన కవీశ్వరులు ఆచార్యులవారు. స్వయముగా వారు ఈ కావ్యమును (పోతనచరిత్రమును) వినిపించగా వినిన పాఠకుల జన్మము నిస్సందేహముగా చరితార్థమను సంగతి శ్రోతలకు తెలిసిన సత్యమే.''

పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 85
— దేవులపల్లి రామానుజరావు

''వరదన్నకూ పోతన్నకూ గల పోలికే పోతన్న చరిత్రకూ తెలుగు భాగవతానికీ కలదు. ఎన్ని ఆటంకాలు ఇబ్బందులు ఉన్నా కవులు, వారి కృతులు బ్రతుకుతాయి. కృతులు అమరకావ్యాలై నిలుస్తాయి. కవులను కూడా అమరులను చేస్తాయి. పోతన్నవలెనే వరదన్న ఆమాట రుజువుచేసినాడు. భాగవతం వలెనే పోతన చరిత్రమూ ఆమాట నిలబెట్టుకుంటుంది.'

పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 86
— 'ప్రజాకవి' కాళోజి

''మట్టిలోనుంచి వెలువడిన మణి వరదన్న''

పోతన చరిత్రము : 'పండితాభిప్రాయములు' పుట 86.
— దాశరథి

''వరదన్న మహాకవి, కళాతపస్వి. వారి పోతన కావ్యం తెలుగుభాషా సాహిత్యాలున్నంత కాలం మనగల మహాకావ్యం. వారి కీర్తి ఆచంద్రతారార్కం''

అభినవ పోతన (షష్టిపూర్తి సన్మాన సంచిక), 'సందేశాలు' పుట VII
— ఆచార్య డా॥ బి. రామరాజు

"శ్రీమాన్ వరదాచార్యులుగారు ఈ కాలానికి మరొక పోతన. తెలంగాణాలో, ఈ కాలములో ముప్వురు రత్నములు కవులలో పుట్టినారు. ఏ రత్నము వెలుగు దానిదే. శ్రీమన్ వరదాచార్యులుగారొక రత్నము. ఎక్కువ సంప్రదాయపు కాంతులు విరజిమ్మెడి రత్నము"

అభినవ పోతన (షష్టిపూర్తి సన్మాన సంచిక) : 'సందేశాలు' పుట VI

— విశ్వనాథ సత్యనారాయణ

"శ్రీమాన్ వరదాచార్యులవారు రసవత్కవితా రచనా రంజిత సకల త్రిలింగ దేశ సహృదయ శేఖరులు; వీణాహంకార హారి కలకంఠ కంఠ మాధురీకృత కావ్యగోష్ఠి వినోదిత జనగణ స్తుతి భాస్వరులు; వినయ భూషణులు; మధుర భాషణులు; సకల కళాసంభృతులు; సర్వ సుహృత్ సమాదృతులు. అజాత శత్రులయ్యు ననవరతాగ్రజ ప్రీతిపాత్రులు; ఉభయ కవిమిత్రులయ్యు నుపస్థిత విశిష్టాద్వైత చరిత్రులు; ఆరాధిత శ్రీనాథులయ్యు దూరోజ్ఝిత రజోగుణోత్సేధులు; భక్తి హనుమంతులు; శక్తి గరుత్మంతులు; కవితోక్త్యు దన్వంతులు"

ఆం. ప్ర. సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదానము

'శ్రీ వానమామలై వరదాచార్యులుగారి ప్రశంస' తేది : 31-1-71.

— ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని

"వానమామలై వరదాచార్యులుగారు సమస్తాంధ్ర మహాకవుల ప్రతిభా వ్యుత్పత్తుల వడపోతగా పోతన్న చరితం ప్రబంధంగా రచించిన పూతచరితులు. సుధా తరంగితములైన సుసంస్కృత పద నిర్ఝరులను కపురపు పలుకులవంటి కలకండ చిలుకలవంటి జాను తెనుగు నుడులను, చిత్తదీపకములైన చిత్ర చిత్రశబ్దా లంకారములను గుత్తకుగొన్న ప్రౌఢకవీంద్రుడు."

విప్రలబ్ధ : 'పాటల పేటిక' పుట 11

— ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డి

"పాతరకం పద్యాలు చెప్పేవారు ఇవాళ చాలామంది ఉన్నారు. ఐతే ప్రాచీన కవుల అందాలు పట్టుబడ్డవాళ్ళు బహు కొద్దిమంది. పూర్వ మహాకవులతో తులతూగేవాళ్ళు నూటికొకరు కనబడ్డా, తలదన్నే వాళ్ళు కోటికొకరు మృగ్యం. సనాతన సాహితీపరుల 'వెన్నుదన్ని' పుట్టిన సత్కవులను వేళ్ళమీద లెక్క పెట్ట

వచ్చు. రచించినదల్లా రసవంతమే అని చెప్పగలిగిన కవులలో వానమామలై వరదాచార్యులవారు ప్రముఖులు. నేటి అగ్రశ్రేణి రచయితలలో ఆయన ప్రథమ శ్రేణిలో ఉంటారు."

ఆంధ్రప్రభ (వారపత్రిక) 17-1- 1968

— ఆరుద్ర

"కలకండలు అచ్చులు పోసినట్లు చక్కని పద్యాలతో ప్రాచీన కవులను తలదన్నే ప్రతిభా వ్యుత్పత్తులతో రసవత్కావ్యమును చెప్పగల సత్కవి శ్రీ వానమామలై వరదాచార్యులుగారు. కోటి రత్నాలవీణ తెలంగాణకు కోటికొక్కడైన రత్నము."

ఆంధ్రజ్యోతి (వారపత్రిక), తేది : 8-3-1968

— పురాణం

———

# అనుబంధము - 3

శ్రీ వరదాచార్యులవారి కృతులగురించి కవిపండితాభిప్రాయములు

## 1. మణిమాల:

"........ఆ మహాప్రవాహంలో (నన్నయార్యకవితాకాంతి ప్రవాహంలో) ఉద్భవించిన సుందరశాఖా స్రవంతి వరదాచార్య కవికంఠము.... భారతవీరులు యుగయుగాలవారు ఈ కవిగీతాలలో పవిత్రశ్రుతులయ్యారు. జానపదుల ఉత్తమ దైనందిన జీవనము వీరి రాగాలలో స్వరకల్పనలయ్యాయి"

మణిమాల: 'పండితాభిప్రాయములు'

—— అడవి బాపిరాజు.

"శుక్రవారము సాయంత్రము హైదరాబాదు కృష్ణదేవరాయల గ్రంథాలయములో వానమామలై వరదాచార్యులుగారు కవితను గురించి ఉపన్యసించిరి. బిరుదు వెంకట శేషయ్యగారు అధ్యక్షత వహించిరి. ఉపన్యాసకులు కవితను గురించి అపూర్వాభిప్రాయములను వెల్లడించిరి. తరువాత తాము వ్రాసిన కొన్ని పద్యాలను శ్రావ్యముగా చదివి వినిపించిరి. వారి పద్యాలను సభ్యులందరు విని చాల ఆనందించిరి. పద్యాలలో మంచి శైలి, మంచి భావములు అందమైన క్రొత్త వర్ణనలు ఉండినవి."

అముద్రితగ్రంథము "మణిమాల"పై 'గోలకొండ' అభిప్రాయము.

వర్ధి-28.

## 2. జయధ్వజము:

"ఇది శ్రీశ్రీ యుగమంటారు కొందరు. విశ్వనాథయుగమంటున్నారు మరి కొందరు. ఈ రెండూ భ్రాంతులే. నిజానికిది జాతీయయుగమంటున్నాను నేను. ఈ యుగానికెత్తిన గరుడస్తంభం శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు.... .... పరమభాగవతోత్తముడైన పోతనగారి పుణ్యగాథను వ్రాసిన పరమభాగవతుడు శ్రీవరదాచార్యులుగారే కలాన్ని కాహళగా మ్రోగించి భారతదేశం మీదికి పాకిస్తాన్

1966 లో దండయాత్ర చేసినప్పుడు గీతగేయ రక్తాశోక కదంబాలతో మాతృ మూర్తిని అర్చించి 'జయధ్వజాన్ని' ఎగురవేశారు. జాతీయులకు 'ఉత్తిష్ఠత-జాగ్రత-ప్రాప్యవరాన్నిబోధత' అన్న సందేశ శంఖాన్ని పూరించారు."

అభినవ పోతన: (షష్టిపూర్తి సన్మానసంచిక)
'జాతీయ యుగానికెత్తిన జయధ్వజం' (వ్యాసము)
—డా॥ ముదిగొండ శివప్రసాద్.

"నాయకుల స్తుతి, మహావీరుల సంస్మరణ, వందన సమర్పణ శీర్షికలతో ఈ కృతి మన దేశచరిత్రను ఒక్క మాటుగా కళ్లకు కట్టినట్లు ప్రదర్శిస్తుంది .... చీనావాడిని పాకిస్తానునూ - ముఖ్యంగా భుట్టోను కవిగారు నిర్మొహమాటంగా దులిపి వదిలారు. ఆ ఘట్టాలలో పద్యరత్నాలు ఉద్రేకాన్ని రేకెత్తించి తీరుతాయి. ..........మన శత్రువులను ద్వేషించటానికీ, తద్వారా జాతీయతను ప్రబోధించ టానికే ఇటువంటి కావ్యాలు గొప్పగా ఉపకరిస్తాయి.''

ఆంధ్ర వారపత్రిక:
—శివకుమారి

## 3. పోతన చరిత్రము :

''పోతనచరిత్ర కావ్యము శ్రీమాన్ వరదాచార్యులవారి ప్రతిభా పయోనిధికి పార్వణ చంద్రోదయము. కవితాలతామతల్లికి కమనీయ వసంతాగమము. కథాకథన కౌశలమునకును పాత్రపోషణ పాటవమునకును, వస్తువర్ణనా వైభవమునకును, పదప్రయోగ పాండితీ ప్రౌఢిమకును, రసప్రసార రామణీయమునకును నిలయమై యది యొక్కచో శబ్దశాసనుని స్మరణకు దార్చును. ఒక్కచో నుభయ కవిమిత్రుని నూహకు(బోహణించును ఒక్కచో కవిసార్వభౌముని కన్నులకు గట్టించును. ఒక్కచో సాహిత్య రసపోషణునితో సరససల్లాపములు సవరించును. ఒక్కచో నా సూర్యపర ప్రసాది పదప్రయోగ ప్రాగల్భ్యమును బుడికి పుచ్చుకానును. ఏక్కడ పట్టిన నక్కడ కావ్యనాయకుని సాక్షాత్కరింపజేయును. పూర్వాంధ్రకవి కమలగర్భుల కవితాకల్పనా కామనీయకమునెల్ల కొల్లగొట్టిన కావ్య తల్లజము పోతన చరిత్రము''.

ఆం. ప్ర. సాహిత్య అకాడమి,
'విశిష్ట సత్కృత్య ప్రదాన ప్రశంస' తేది : 31-1-1971
- ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని

"ఇందలి భోగినీలాస్య వర్ణన మతిమాత్రమే కాదు. అత్యద్భుతము; అపూర్వము.... ఆంధ్ర సాహిత్యోపాసకులు సహృదయులు పోతనచరిత్రమును శిరసా వహించగలరనుటలో అతిశయోక్తిలేదు. పోతన చరిత్రము భాగవతమువలెనే తెలుగునాట ఇంటింట వెలయగలదని ఆశించవచ్చును."

ఆంధ్రప్రభ (దినపత్రిక) 24-4-68
— ప్రయాగ

"భక్త జీవితచరిత్రమును ద్వాదశాశ్వాసాల మహాప్రబంధముగా ప్రాచీన రీతులలో అందచందాలు మలచి సొగసులను ఒలకబోస్తూ చెప్పిన కవి భక్త వరదన్న. జీవితాన్ని దీపంచేసి వెలిగిస్తే ఇటువంటి కావ్యం ఒకటి పుడుతుంది.... తెలుగు గ్రామీణజీవితాన్ని పుక్కిటబట్టిన ఈ మహాప్రబంధము "పోతన జీవితము'' ప్రతియింట పఠింపదగినది. గ్రంథాలయములన్నిటిని అలంకరింపదగిన యోగ్యత కలిగిన గ్రంథము మరొకటి దీనికి మిన్నవుండదు."

ఆంధ్రజ్యోతి (వారపత్రిక) 8-3-68
— పురాణం

''ఆధునికాంధ్ర సారస్వతమున పేరెన్నికగన్న కావ్యముల వరుసలో పోతన చరిత్రము తొలుత చెప్పవలసినది.... ఇది నిజముగా ప్రజాకవిత్వము."

—ఆంధ్రజనత (వారపత్రిక)

''ఈ దివ్యప్రబంధము నెన్నిమారులు చదివినను తనివి తీరదు. నేను రెండు మూడు పర్యాయములీ గ్రంథమును అమూలాగ్రముగా చదివినమీదట శ్రీ పోతనామాత్యుడే తిరిగి వరదాచార్యులుగా పుట్టి తన చరిత్రను వ్రాసికొని యుండవచ్చునని తోచినది.... ఇట్టి మహత్తర ప్రబంధము పోషకులులేని ఆధునికయుగములో వెలువడుటవలన ఆంధ్రభారతికి దివ్యాభరణముగా నలరారుటయేకాక ప్రతి ఆంధ్రుని యింటిలో పూజనీయమైన భాగవతగ్రంథమునకు ప్రక్కగా నుండదగిన రెండవ భాగవతము.''

కృష్ణాపత్రిక (వార), మార్చి, 30-68.
— అ॥ వేంకటశాస్త్రి

"ప్రాచీనకవుల పంథాలో భారత భాగవత శ్రేణికి చెందినది ఈ పోతన చరిత్రం. అధ్యయనం చేయదగిన ఉద్గ్రంథం. ఆంధ్రభాషామతల్లికి అమూల్యాభరణం".

స్రవంతి (మాసపత్రిక) జూలై, ఆగస్టు '67.
—అరవింద

"The book under review is a highly laudable work on the life of the great poet Pothana. To attempt almost a mahakavya on the life of a poet itself shows the high appreciation and respect the author has for Pothana. It is a great thing to conceive of a mighty subject but it is greater still to execute the work in all its glory"

"Triveni"
— Bhava Raju

## 4. విప్రలబ్ధ :

"బహురమ్యమైన సహజమైన ప్రకృతి వర్ణనలతోను, జానపద నాయికా నాయకుల కుచితమైన భాషతోను, నిసర్గ సుందరములైన అలంకారాలతోను నిండి చదువరుల హృదయాలకు హత్తుకొంటూ వెలువడిన కావ్యరత్నము విప్రలబ్ధ"

స్రవంతి (మాస పత్రిక) డిసెంబర్ 1970
—వేమూరి

ప్రకృతి సిద్ధమైన పల్లె జీవితాన్ని, ముగ్ధ ప్రణయాన్ని మానవతావాదాన్ని ఈయన నిపుణతతో చిత్రీకరించారు. పండిత పామర జనానందకరంగా వీరి కావ్యరచన సాగింది వీరి విప్రలబ్ధ దాశరథి చెప్పినట్లు రసలుబ్ధుల రసాయనమే. ప్రతివారు చదువదగ్గ చక్కని కావ్యం విప్రలబ్ధ".

విశ్వరచన, మే 1971
—రాణీ కమలాదేవి.

# ఉపయుక్త గ్రంథ సూచి


1. కావ్యాలంకారము : భామహుడు
2. కావ్యాదర్శము : దండి
3. ధ్వన్యాలోకము : ఆనందవర్ధనుడు
4. కావ్యాలంకార సూత్రవృత్తి : వామనుడు
5. ప్రతాపరుద్రీయము : విద్యానాథుడు
6. సాహిత్య దర్పణము : విశ్వనాథుడు
7. దశరూపకము : ధనంజయుడు
8. కావ్యానుశాసనము : హేమచంద్ర సూరి
9. కావ్యాలంకారము : రుద్రటుడు
10. కావ్య మీమాంస : రాజశేఖరుడు
11. నాట్యశాస్త్రము : భరతుడు
12. ధ్వన్యాలోక లోచనము : అభినవ గుప్తుడు
13. అభినవ భారతి : అభినవ గుప్తుడు
14. కావ్య ప్రకాశము : మమ్మటుడు
15. కావ్యాలంకార సారసంగ్రహము : ఉద్భట భట్టు
16 రస గంగాధరము : జగన్నాథుడు
17. రస గంగాధరము–పరిపస్య : వ్యాఖ్యాత : ధరణికోట వేంకట సుబ్బయ్య
18. భగవద్భక్తి రసాయనము : మధుసూదన సరస్వతి
19. ఔచిత్య విచారచర్చ : క్షేమేంద్రుడు
20. రసార్ణవాలంకారము : ప్రకాశ వర్షుడు
21. కావ్యాలంకార చూడామణి : విన్నకోట పెద్దన
22. కావ్యాలంకారసంగ్రహము : భట్టుమూర్తి (సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి వివరణ)

23. సాహిత్యశిల్ప సమీక్ష : ఆచార్య పింగళి లక్ష్మీకాంతం
24. ఋగ్వేదము
25. అగ్నిపురాణము
26. పాణినీయ శిక్షా
27. తత్సమచంద్రిక : సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి
28. ఆంధ్ర శబ్ద చింతామణి : నన్నయ
29. బాలవ్యాకరణము : చిన్నయ సూరి
30. ప్రౌఢ వ్యాకరణము : బహుజనపల్లి సీతారామాచార్యులు
31. ఆంధ్ర భాషానుశాసనము : మల్లాది సూర్యనారాయణశాస్త్రి
32. ఛందోదర్పణము : అనంతుడు
33. అప్పకవీయము : అప్పకవి
34. అమరకోశము : (గురు బాలప్రబోధిక) :
35. తైత్తిరీయోపనిషత్తు
36. కఠోపనిషత్తు
37. ఈశావాస్యోపనిషత్తు
38. భగవద్గీత
39. పాతంజల యోగశాస్త్రము
40. మనుస్మృతి
41. బృహజ్జాతకము : వరాహ మిహిరుడు
42. కాలామృతము : వ్యాఖ్యాత : వేంకటాఖ్యుడు
43. నృత్త రత్నావళి : జాయ సేనాని
44. నృత్యరేఖ : నటరాజ రామకృష్ణ
45. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు-ప్రయోగములు : ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి
46. తెలుగు నాటక వికాసము : డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు
47. శ్రీమదాంధ్ర మహాభాగవతానుశీలనము : డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి

48. ఆంధ్ర మహాభారత ఛందశ్శిల్పము : డా॥ పాటిబండమాధవశర్మ
49. తిక్కన కావ్యశిల్పము : డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి
50. ప్రథమాంధ్ర మహాపురాణము : డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
51. తెలుగు హరికథా సర్వస్వం : ఆచార్య డా॥ తూమాటి దొణప్ప
52. ప్రబంధ వాఙ్మయ వికాసము : డా॥ పల్లా దుర్గయ్య
53. తెలుగు విజ్ఞానసర్వస్వము : 3, 4 సంపుటములు
54. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము
55. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర : నిడుదవోలు వెంకటరావు
56. నవ్యాలోకము ? డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
57. తెలుగు మెరుగులు : వేటూరి ప్రభాకరశాస్త్రి
58. మహతి : 'యువభారతి' వారి ప్రచురణ
59. ఆంధ్ర నాటకరంగ చరిత్ర : మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి
60. ఆంధ్రకవుల చరిత్ర : కందుకూరి వీరేశలింగం పంతులు
61. ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము : ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం
62. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము : ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని
63. రామాయణము : వాల్మీకి
64. రఘువంశము : కాళిదాసు
65. మేఘసందేశము : ,,
66. మాళవికాగ్నిమిత్రము : ,,
67. ఉత్తరరామచరితము : భవభూతి
68. రామాయణ చంపువు : భోజుడు
69. సుభాషిత త్రిశతి : భర్తృహరి
70. సుభాషిత రత్నాకరము : సంకలన కర్త : కృష్ణశాస్త్రి భాటవడేకర్
71. శ్రీమదాంధ్ర మహాభారతము : నన్నయ
72. శ్రీమదాంధ్ర మహాభారతము : తిక్కన
73. నిర్వచనోత్తర రామాయణము : ,,

74. కుమార సంభవము : నన్నెచోడుడు
75. నృసింహ పురాణము : ఎఱ్ఱన
76. శృంగార శాకుంతలము : పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు
77. శృంగార నైషధము : శ్రీనాథుడు
78 శ్రీమదాంధ్ర మహాభాగవతము : బమ్మెర పోతన
79. భోగినీ దండకము : బమ్మెర పోతన
80. మను చరిత్రము : అల్లసాని పెద్దన
81. రాజశేఖర చరిత్రము : మాదయగారి మల్లన
82. కేయూరబాహు చరిత్రము : మంచన
83. పండితారాధ్య చరిత్రము : పాల్కురికి సోమనాథుడు
84. రాఘవ పాండవీయము : పింగళి సూరన
85. విజయ విలాసము : చేమకూర వేంకటకవి
86. ఆముక్త మాల్యద : శ్రీ కృష్ణ దేవరాయలు
87. వసు చరిత్రము : రామరాజ భూషణుడు
88. శ్రవణానందము : తిరుపతి వేంకటకవులు
89 శ్రీమద్రామాయణ కల్పవృక్షము : విశ్వనాథ సత్యనారాయణ
90. శివ భారతము : గడియారము వేంకట శేషశాస్త్రి
91. నవోదయము : అందె వేంకటరాజము
92. మణిమంజూష : అందె వేంకటరాజము
93. మహాప్రస్థానము : శ్రీశ్రీ
94. తెలంగాణలో జాతీయోద్యమాలు : దేవులపల్లి రామానుజరావు
95. వీర తెలంగాణ-నా అనుభవాలు, జ్ఞాపకాలు : రావి నారాయణరెడ్డి
96. నవ్యాంధ్ర సాహిత్య వీథులు : కురుగంటి సీతారామయ్య
97. అభినవ పోతన : 'భారతీ సాహిత్య సమితి, కోరుట్ల' ప్రచురణ
98. వానమామలై వరదాచార్యులవారి ముద్రితాముద్రిత కృతులు
99. సేవాగ్రామ ప్రార్థన గీతములు

100. భోగినీ లాస్యం : వ్యాఖ్యాత : వానమామలై వరదాచార్యులు
101. భారతి, ఆంధ్రపత్రిక, జయంతి, కృష్ణాపత్రిక, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, స్రవంతి పత్రికలలోని గ్రంథసమీక్షలు, ఇతర సాహిత్య విషయములు.
102. వివిధ కావ్యపీఠికలు
103. అఖిల భారత తెలుగు సాంస్కృతిక వారోత్సవాల ప్రత్యేక సంచిక
104. An Introduction to the study of literature : W. H Hudson
105. Indian Philosophy : S. Radhakrishnan : అనువాదము : బులుసు వెంకటేశ్వరులు
106. The Hindu View of Life : S. Radhakrishnan
107. రహమన్ కే దోహే
108. కబీర్ కే దోహే

———

# ముఖ్యమైన సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 98 | 6 | మనోభావ | మనోజ్ఞభావ |
| 99 | 22 | సుబాహును.... స్తుబాహువు | సుబాహువులు.... సుబాహువు |
| 133 | 7 | నాటికతో కర్షకుని సాంస్కారిక | నాటికలో కర్షకుని సాంసారిక |
| 134 | 11 | గంధశిలలవలె | గండశిలలవలె |
| 214 | 21 | 22 వరకు | 25 వరకు |
| 221 | 25 | సంపన్నమై | సంపన్నమైన మహాకావ్యమై |
| 233 | 18 | | వేటూరి ప్రభాకరశాస్త్రిగారిట్లు నుడివిరి |
| 237 | 12 | 2 పద్య ప్రబంధములు | 2 గద్య ప్రబంధములు |
| 255 | 3 | కవులి లాయాకావ్యములు | కవు లాయాకావ్యముల |
| 282 | 13 | ఖండమహాకావ్యముల | ఖండకావ్య మహాకావ్యముల |
| 300 | | అధోజ్ఞాపికలోని 1 పద్యము | 299 పుటలోని అధోజ్ఞాపికలోనిది |
| 328 | 21 | సంధించెను | సంబోధించెను |
| 340 | 8 | అవి గణములై | అవి గుణములై |
| 343 | 3 | ఏకాంతము | ఏకాంత జీవనము |
| ,, | 21 | వైరాగ్యముచేత | వైరాగ్య ప్రబోధముచేత |
| 344 | 5 | పడ్డట్లడవి | పడ్డట్లడలి |
| 359 | 14 | చేత్యష్టౌ | చేత్యష్టౌ |
| 398 | 1 | విరజిల్లిన | విరాజిల్లిన |
| 405 | 4 | ఈ యతిథిమర్యాద, ఈ దాతృత్వ మర్యాద | ఈ యతిథిమర్యాద |
| ,, | 5 | సహజముగా నచ్చినవి | సహజముగా నబ్బినవి |
| 466 | 10 | గంగామల్లి | గంగామతల్లి |
| 483 | 19 | గాతము | గానము |
| 501 | 19 | చణ యించుక | జాణ యించుక |

